శ్రీ శివాయ గురవేనమః

# శ్రీమన్నారాయణీయము

(ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు)

ఆత్మీయులందరికి నమస్కారం.

ఈ కష్ట కరోనా కాలంలో, సమస్త ప్రపంచానికి మేలు కలగాలనే సదుద్దేశ్యంతో, ఈ రోజు (12-04-2020) స్వామి దయతో ఒక అద్భుతమైన కార్యక్రమ పునర్నిర్మాణం చేస్తున్నాను. దీనికి ప్రధాన కారకులు **శ్రీ గుడిపాటి శ్రీ రామకృష్ణశర్మ గారు.** వారు నా నమక చమకాల అర్థ తాత్పర్య విశేషాల పుస్తకాన్ని రెండు సార్లు ముద్రించారు. వారు శ్రీమన్నారాయణీయపు అర్థ తాత్పర్య విశేషాలు వ్రాయమని ప్రచురిస్తానని కొన్ని నెలలక్రితం నాకు సందేశం పెట్టారు. వారికి కృతజ్ఞతలు చెబుతూ , నేను కేంద్ర సాహిత్య ఆకాడమీ వారి తెనాలి రామకృష్ణుడు పుస్తక రచనా కార్యక్రమంలో ఉన్నానని, అది పూర్తయిన వెంటనే మొదలు పెడతానని ఆనాడు జవాబు వ్రాసాను.

ఈరోజుతో భగవంతుని దయవలన తెనాలి రామకృష్ణుడు పుస్తక రచన పూర్తయింది. ఇంకా ముద్రణకు సంబంధించిన తుది మెరుగులు మాత్రమే ఉన్నాయి. కనుక ఈ రోజు శ్రీమన్నారాయణీయము (అర్థ తాత్పర్య విశేషాలు) పుస్తక రచనా కార్యక్రమం మొదలుపెడుతున్నాను.కృష్ణ స్వామి ఈ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాలని హృదయపూర్వక నమస్సులతో విన్నవించు కొంటున్నాను.

2006వ సంవత్సరంలో శ్రీ రామకృష్ణమఠం, చెన్నై వారు నేను అనుసృజన చేసిన శ్రీ మన్నారాయణీయమును మొదటిసారి ప్రచురించారు. ఇప్పటికి అది చాలాసార్లు పునర్ముద్రణ పొందింది. శ్రీ రామకృష్ణమఠ్ లో ప్రస్తుతం లభిస్తున్నది కూడా. అయితే మరలా ఇప్పుడు శ్రీమన్నారాయణీయమెందుకను ప్రశ్నకు జవాబిది.

శ్రీమన్నారాయణీయమును స్తోత్రంగా చదివే పాఠకుల్లో చాలామంది నాకు ఫోన్ చేసి శ్లోకాలలోని పద విభాగం, ప్రతి పదార్థం అడుగుతున్నారు. శ్రీ రామకృష్ణమఠం వారికి నేను అనుసృజించిన శ్రీమన్నారాయణీయములో కేవలం శ్లోకం మరియు తాత్పర్యముంది. ప్రతి పదార్థం, విశేషాలు లేవు. నాకు తెలిసి ఇప్పటివరకు శ్రీమన్నారాయణీయముకు తెలుగులో ప్రతి పదార్థం, విశేషాలు ఎవరూ వ్రాయలేదు. కేవలం తాత్పర్యాలు మాత్రమే వ్రాసారు. అందుకే శ్రీ గుడిపాటి శ్రీ రామకృష్ణశర్మగారు నమక చమకాల వలెనే ప్రతి పదార్థం, విశేషాలు శ్రీమన్నారాయణీయముకు వ్రాయమని, చాలామందికి ఉపకరిస్తుందని చెప్పారు.

అందుకే ఈ రచనా సాహసాన్ని, స్వామి అనుగ్రహంతో మొదలు పెడుతున్నాను.

ముందుగా గ్రంథం గురించి, కవి గురించి సంక్షిప్త పరిచయం చేస్తున్నాను. ఇది రామకృష్ణ మఠ్ వారి నా శ్రీమన్నారాయణీయము నుంచి యథాతథంగా పేర్కొంటున్నాను.

**ఉపోద్ఘాతం**

స్వామి వివేకానంద శ్రీకృష్ణుని గురించి ప్రస్తావిస్తూ, “నాకు తెలిసినంత వరకు ఆయన ప్రజ్ఞలో, ఔదార్యంలో, కౌశలంలో సమానంగా, అద్భుతంగా పెంపొంది, సర్వతోముఖ సమగ్రత ప్రదర్శించాడు. గౌరవార్థ మహాపురుషుడుగానేమి, యోధుడుగా నేమి,సచివునిగానేమి, మరోదిశలోనేమి ఆయన జీవితం ప్రతి క్షణమూ క్రియాశీలత్వంతో సజీవంగా తొణికిసలాడింది” అంటూ అద్భుతంగా విశ్లేషించారు. ( లేవండి, మేల్కొనండి!, సంపుటం 7, పుట 125)

కేరళ రాష్ట్రంలోని గురువాయురు దేవాలయంలో విగ్రహరూపంలో కొలువై ఉన్న ఆ శ్రీకృష్ణుడు శ్రీ మేపత్తూరు నారాయణ భట్టాత్రి అనే మహాకవిచే ఈ మహిమాన్వితమైన శ్రీమన్నారాయణీయము అనే గ్రంథరాజాన్ని రచింపజేశాడు. 1036 శ్లోకాలతో శ్రీమద్భాగవతానికి సారసంగ్రహంగా ఈ నారాయణీయము

నేటికీ గురువాయూరు దేవాలయంలో పారాయణ చేయబడుతున్నది. భక్తిప్రపత్తులతో ఈ నారాయణీయాన్ని పఠించే వారికి ఎటువంటి రుగ్మతయైనా నయమయి తీరుతుందనడానికి ప్రబల నిదర్శనాలు అనేకం ఉన్నాయి.

## నారాయణీయము

నారాయణునికి సంబంధించిన కథ నారాయణీయం. ఈ గ్రంథంలో నూరు అధ్యాయాలున్నాయి. నారాయణ భట్టు వాటిని దశకాలని పేర్కొన్నాడు. పది శ్లోకాలు కలది దశకం. కాని నారాయణీయ దశకాలలో కొన్నింట్లో 9, మరి కొన్నింట్లో 10 నుంచి 15 శ్లోకాల వరకు చోటుచేసుకొన్నాయి. ప్రతి దశకంలోనూ చివర కవి 'నా రుగ్మతలను తొలగించు', 'నాకు భక్తిని అనుగ్రహించు', 'నాకు మోక్షం ప్రసాదించు' అంటూ ప్రార్థనా పూర్వకంగా విన్నవించుకోవడం చూడ వచ్చు. ఈ విన్నపాలకు సంబంధించిన పెద్దలు చెప్పిన వివరాలు ఇలా ఉన్నాయి.

క్రీ.శ. 1560లో జన్మించిన నారాయణ భట్టాత్రి తన 16వ ఏటనే సమస్త విద్యలనూ అలవోకగా అభ్యసించాడు. శ్రీ పిషరడి అనే విఖ్యాత పండితుణ్ణి తన గురువుగా స్వీక రించాడు. గురువుగారి వాతరోగాన్ని తను స్వీకరించి, గురుదక్షిణగా తన పరిపూర్ణ ఆరోగ్యాన్ని ఆయనకు సమర్పించాడు. కోరి తెచ్చుకొన్న వాతరోగం ప్రకోపించిన స్థితిలో, ఆ బాధను తొలగించుకొనే నిమిత్తం భాగవత రచన ప్రారంభించి దానికి నారాయణీయము అని పేరు పెట్టాడు.

గురువాయూర్ దేవాలయంలో నూరు రోజులపాటు భట్టాత్రి తన రచనను సాగించాడు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఈ గ్రంథ రచన పూర్తిచేసి శ్రీకృష్ణ దర్శనం పొందే నాటికి ఆయన వయస్సు కేవలం 27 ఏళ్ళు మాత్రమే. 'తేజస్సు వయస్సు లెక్కించదు' అని కాళిదాసు ఊరకే వ్యాఖ్యానించలేదు.

## గురువాయూరు శ్రీకృష్ణుడు

గురువాయూరు దేవాలయంలో ప్రతిష్ఠితమైన శ్రీకృష్ణ విగ్రహం స్వయంభువు. మానవ కల్పితం కాదని అక్కడి స్థల పురాణం తెలుపుతున్నది. పాతాల శిలలో మలచబడిన ఈ విగ్రహాన్ని మహావిష్ణువు బ్రహ్మకు ఇచ్చాడట. బ్రహ్మ ఈ విగ్రహాన్ని

సుతపుడు–పృశ్ని దంపతులకు ఇచ్చాడట. తరువాత ఆ దంపతులు అదితి కశ్యపులుగా, దేవకీవసుదేవులుగా జన్మించారు.

తండ్రియైన వసుదేవుని నుండి ఆ విగ్రహాన్ని పొందిన శ్రీకృష్ణుడు దానిని ద్వారకలో ప్రతిష్ఠించి కొలిచేవాడు. తన అవతారం చాలించబోయే ముందు శ్రీకృష్ణుడు తన విగ్రహాన్ని తన భక్తులు, స్నేహితుడు అయిన ఉద్ధవునకు అప్పగించి కలియుగంలో మానవులను ఉద్ధరించేటందుకు ఎక్కడయినా దానిని ప్రతిష్ఠించమని చెప్పాడు. దేవ గురువు అయిన బృహస్పతిని ప్రతిష్ఠకు సరియైన ప్రదేశాన్ని కనుగొనడంలో సాయం చేయమని ఉద్ధవుడు అర్థించాడు.

పరమేశ్వరుడు వారికి కలలో కనిపించి పశ్చిమ సముద్ర తీరంలో పరశురామ క్షేత్రంగా పేరు గాంచిన కేరళలోని అంబాపురమనే ఊరికి సమీపంలో ఒక స్థలం చూపించాడు. బృహస్పతి వాయుదేవుని తోడ్పాటుతో ఆ స్థలంలో విగ్రహ ప్రతిష్టాపన చేశాడని 'గురు', 'వాయువు' లిద్దరిచే నిర్మితమైన దేవాలయం గల ఊరు కనుక గురువాయూరు అయిందని ఐతిహ్యం. ఈ గురువాయూరు కృష్ణుణ్ణి "అప్పన్' అని ఆ ప్రాంతం వారు అప్యాయంగా సంబోధిస్తారు.

సర్పయాగం చేయడం వలన జనమేజయునకు దాపురించిన కుష్ఠు వ్యాధి గురువాయూరు శ్రీకృష్ణుని కారుణ్యంతో నయమయిందని నారద పురాణం వచిస్తోంది. కనుక కలియుగ ప్రారంభంలోనే దాదాపు 5077 సంవత్సరాలకు పూర్వమే గురువాయూరు కృష్ణుడు అక్కడ కొలువు తీరాడని చెప్పవచ్చు.

మేప్పత్తూర్ నారాయణ భట్టాత్రి రచించిన నారాయణీయము కావ్యంగా, స్తుతిగా ప్రసిద్ధి గాంచినది. నారాయణ భట్టతిరి గొప్ప వ్యాకరణ పండితుడు .ప్రక్రియా సర్వస్వమనే ఈయన వ్యాకరణ గ్రంథం విశేష వ్యాప్తి పొందినది. 'అపాణినీయ ప్రమాణ, ధాతు కావ్య' అనేవి నారాయణ భట్టాత్రి ఇతర వ్యాకరణ గ్రంథాలు. పూర్వమీమాంసకు సంబంధించిన ఈయన మరొక వ్యాకరణ గ్రంథం 'మన–మేయోదయ.... ఇవే కాక నారాయణ భట్టాత్రి అనేక చంపూ కావ్యాలు కూడా రచించాడు. ఎన్ని రచనలు చేసినప్పటికీ నేటికీ ఆ మహాకవి నారాయణీయము వలననే చిరస్మరణీయుడనడం అతిశయోక్తి కాబోదు.

కవి పేరు గ్రంథం పేరులో కలసిపోవడం విశేషం. నరులు (జీవులు) ఆయనముగా (నివాసము, చోటు) గలవాడు నారాయణుడు. నారాయణుని మహాత్మ్యాలు తెలిపేది నారాయణీయము. నారాయణుడనే కవి వ్రాసింది కనుక నారాయణీయము (100వ సర్గం – 11వ శ్లోకం).

**కావ్యంగా నారాయణీయము**

నారాయణీయములో అన్ని కావ్య లక్షణాలు చోటుచేసుకొన్నాయి. జాగ్రత్తగా అధ్యయనం చేస్తే అన్నింటికి ఉదాహరణలు ఈ కావ్యంలో చూడవచ్చు. ఈ కావ్య ప్రయోజనం ముక్తి. ఇతివృత్తం పరమ పవిత్రమైన భాగవత పురాణం. రసం భక్తి, ఆలంబన విభావం భగవంతుడైన శ్రీ మన్నారాయణుడు (శ్రీకృష్ణుడు). ఆయన లీలలు ఉద్దీపన విభావాలు.

భగవదాకార చిత్తవృత్తి స్థాయీభావం. అదే నారాయణ రతి. అనుభావాలు ఆయన సర్గలు పఠిస్తున్నప్పుడు కలిగే తత్కాలంలో జనించే నేత్రాది వికారాలు. వ్యభిచారులు నిర్వేద శంకా హర్షాదులు, ఇక నారాయణీయములో రసోత్పత్తికి కొదువ ఏముంది? 'విభావాను భావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః" అని కదా ఆలంకారికుల వచనం. అవన్నీ నారాయణీయము లో పుష్కలంగా ఉన్నాయి.

పద్దెనిమిదివేల భాగవత శ్లోకాలు 1036 శ్లోకాలలో అందమైన కావ్యంగా నారాయణీయమ్‌లో రూపుదిద్దుకొన్నాయి. నృసింహావతార వర్ణన (25వ సర్గ), రాసలీల (69వ సర) కాళీయ ఉదంతం మొదలైన వృత్తాంతాలు నారాయణీయములో కవి అద్భుతమైన ఆలంకారిక రచనా సంవిధానానికి అద్దంపడుతున్నాయి. రసానుగుణమైన ఛందస్సులు ఉపయోగించి కావ్యానికి ఉదాత్తతను సంతరింప జేసిన ఘనత భట్టాత్రిది. 37వ సర్గ నుంచి 76వ సర్గ వరకు ఉన్న శ్రీకృష్ణ చరిత్రను మూలంతో పోల్చి పఠిస్తున్నప్పుడు భాగవతానికి సమాన స్థాయిలోనే ఉన్నట్లుగా పాఠకుడు భావించి పరవశించడం నిర్వివాదాంశం.

## స్తోత్ర గ్రంథంగా నారాయణీయము

సంస్కృత స్తోత్ర గ్రంథాలలో అనేక కోణాలతో పరిశీలించి చూసినప్పుడు నారాయణీయము అత్యున్నతమైనది, అద్వితీయమైనదిగా భాసిస్తున్నది. దాదాపు ప్రతి శ్లోకం నారాయణుని సంబోధిస్తూ ఆయన కథను తెలియజేస్తూ రచన సాగడం నారాయణీయ ప్రత్యేకత. శారీరక రుగ్మత నివారణకు ప్రార్ధన చేసే ఈ స్తోత్ర గ్రంథంలో కవికి గల ప్రగాఢ భక్తి వైఖరి మీద కొంత ఆలోచన ఎవరికైనా రావడం సహజం.

గీతలో భగవంతుడు ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అనే నాలుగు కోవలకు చెందిన భక్తులు తనను సేవిస్తారని వచించాడు. భట్టాత్రి మొదటి కోవకు చెందిన భక్తునిగా గ్రంథ ప్రారంభంలో కానవస్తుంది.కాని పోనుపోనూ ఉత్తమ భక్తుడైన జ్ఞానిగా అతడు పరిణమించిన తీరును నారాయణీయము మ నకు స్పష్టపరుస్తున్నది. (40వ సర్గ – 10వ శ్లో (92వ సర్గ – 7వ శ్లో)

ఈ స్తోత్ర గ్రంథం మూలంగా నారాయణ భట్టాత్రి భగవదనుగ్రహం పొందినట్లు గ్రంథం చెప్పక చెబుతున్నది (100వ సర్గ). "మథురలో శ్రీకృష్ణుడు నడిచి వస్తున్న సమయంలో ఎవరికి వారు తమ శక్తిమేరకు పూలు, హారాలు మొదలైనవి సమర్పించుకొంటున్నారు. కృష్ణా! నేను ఆ సమయంలో అక్కడ లేను కాబోలు. బహుశా ఉన్నా ఏ పత్రమో, పుష్పమో నీకు భక్తితో సమర్పించలేదు కాబోలు. నేడు నేను అనుభవిస్తున్న తాపాలన్నింటికీ ఆనాటి పాపమే కారణం" (74వ సర్గ – 6వశ్లో) అద్భుతమైన స్తోత్రం గ్రంథం నారాయణీయము అనడానికి ఇంకా వేరే ఉదాహరణలు అవసరమా?

భాగవతంలో కపిలుడు తన తల్లి దేవహూతికి బోధించిన సాంఖ్య యోగాన్ని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి బోధించిన వేదాంతాన్నీ భట్టాత్రి కవిత్వంగా రంగరించి నారాయణీయము లో అద్భుత ప్రతిభాపాటవాలతో అందించాడు. (15వ సర్గ మొదలైనవి).

నారాయణీయం 100 దశకాలుగా విభజించబడింది, వీటిలో చాలావరకు

పది శ్లోకాలు ఉంటాయి – అయితే కొన్ని 11, 12 లేదా 13 శ్లోకాలతో నడుస్తాయి; 04 వ దశకం లో 15 శ్లోకాలు, 65 వదశకంలో 09 శ్లోకాలు ఉన్నాయి. మొత్తం మీద నారాయణీయం 1034 శ్లోకాలను కలిగి ఉంది. కొన్ని సంపుటాలలో 45 వ దశకం చివరిలో రెండు అదనపు శ్లోకాలు ఉన్నాయి.( 1. శాఖాగ్రే... 2. కిం కిం ) ఈ రెండు శ్లోకాలు కలిపితే మొత్తం 1036 శ్లోకాలు .అయితే పెద్దలెవరూ ఈ అదనపు శ్లోకాలకు వ్యాఖ్యానం చేయలేదు. నేను కూడా వారి బాటను అనుసరించాను.

నారాయణీయములో ఎన్నో విశేషాలు ఉన్నాయి. ఎన్నో వేల జన్మల పుణ్యఫలం ఉంటేనేగాని జీవికి నారాయణుడు గుర్తుకు రాడు. అలా స్ఫురణ కలిగిన వారిలో కోటిలో ఒక్కరికైనా ఆ నారాయణుని త్రికరణశుద్ధిగా ఆరాధించే భాగ్యం రాదు. అటువంటి భాగ్యశాలురలో ఏ కొందరికో ఆ దేవుని అనుగ్రహం పరిపూర్ణంగా లభిస్తుంది. ఆ భగవంతుడు యావన్మందినీ ఆ భాగ్యశాలురుగా రూపొందించాలని హృదయపూర్వక ఆకాంక్షలు ప్రార్థన.

పుస్తకాన్ని అందంగా ముద్రిస్తున్న **శ్రీ గుడిపాటి శ్రీ రామకృష్ణశర్మగారికి మరోమారు హృదయపూర్వక కృతజ్ఞతలు చెబుతూ, వారిని వారి కుటుంబ సభ్యులను ఆ పరాత్పరుడు ఆయురారోగ్యాభివృద్ధులతో చల్లగా రక్షించాలని ప్రార్థిస్తున్నాను.**

శ్రీ కృష్ణార్పణమస్తు

# ఉపయుక్త గ్రంథాలు

ఈ నారాయణీయ ప్రతిపదార్థ వ్యాఖ్యాన అర్చనలో నేను పరిశీలించిన గ్రంథములు ఇవి.


**అద్వైత వేదాంత పరిభాష** – ప్రవచన కర్త బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు (అంతర్జాల ప్రతి)

**ఆంధ్రభారతి** (అంతర్జాల నిఘంటువు)

**ఆంధ్రవేదాంత పరిభాష** – కూర్పరి బివి నారాయణ స్వామి నాయుడు – 1962

**ఛందః పదకోశము** – సంగ్రాహకుడు కోవెల సంపత్కుమారాచార్య – తెలుగు అకాడమీ – 1977

**నారాయణీయము** –(తెలుగు తాత్పర్యము) – కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు – తితిదే ప్రచురణ 2003

**నారాయణీయము** (సంస్కృత వ్యాఖ్యానము, భక్తప్రియ)–దేశమంగళ వర్య – త్రివేంద్రం సంస్కృత ప్రెస్ 1912

**పారమార్థికపదకోశం** – పొత్తూరి వేంకటేశ్వరరావు – 2010

**పురాణనామచంద్రిక** – యెనమండ్రం వెంకటరామయ్య – 1879

**వేదాంతాది పారిభాషిక పదకోశము** – ఆచార్య తురగా సోమసుందరం – 1992

**శ్రీ మన్నారాయణీయము** (తమిళ అనువాదము) – యన్. సోమసుందర దీక్షితార్ 1954

**శ్రీ మన్నారాయణీయము** (తెలుగు తాత్పర్యము) అనుసృజన –డా. తాడేపల్లి పతంజలి, శ్రీ రామకృష్ణమఠ్

**శ్రీ మన్నారాయణీయము** (తెలుగు తాత్పర్యము) గీతాప్రెస్

**సంకేతపదకోశము** – రవ్వా శ్రీహరి– 2002

**సంస్కృత–ఆంధ్ర నిఘంటువు** (వ్యుత్పత్తి, నిర్వచన సహితంగా) – ముదిగంటి గోపాలరెడ్డి 2019

**సంస్కృత – తెలుగు నిఘంటువు** –వావిళ్ల 1943

**సర్వశబ్దసంబోధిని** (సంస్కృతనిఘంటుః – ఆంధ్రటీకాసహితః) –పరవస్తు శ్రీనివాసాచార్య– 1875

ఈ నారాయణీయ ప్రతిపదార్థ వ్యాఖ్యాన రచనలో పైన తెల్పిన రచయితల రచనలలోని విశేషాంశాలను సందర్భానుసారంగా పొందుపరిచాను. అందరికి పేరు పేరునా ధన్యవాదాలు.

**– డా. తాడేపల్లి పతంజలి**



## శ్రీ మన్నారాయణీయము – ఛందోవిశేషాలు

(దశకము, వృత్తము పేరు, గణములు, దశకములోని మొత్తం శ్లోకాలు)

1. స్రగ్ధర – మరభన యయయ –10

2. శార్దూలము – మసజస తతగ– 10

3. శిఖరిణి – య , మ , న , స , భ , వ(లగ)–10

4. రథోద్ధతము – ర , న , ర , వ(లగ)–15

5. శార్దూలము – మసజస తతగ 10

6. వసంత తిలక (మదన) వృత్తము. (త , భ , జ , జ , గా(గగ) ) –10

7. శార్దూల విక్రీడితం మసజస తతగ –10

8. 1. శాలిని ( మతతగా–గగ)

   2. మదనము. త , భ , జ , జ , గా(గగ)

   3. మదనము త , భ , జ , జ , గా(గగ)

   4. మదనము . త , భ , జ , జ , గా(గగ)

   5. ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

   6. వారాంగి –01, 2 పాదములలో **జ , త , జ , గా(గగ)** గణములు 03, 04 పాదములలో **త , త , జ , గా(గగ)**.

   7. ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

   8. వారాంగి –

9. ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

10. ఉపజాతి – **త , త , జ , గా(గగ). జ , త , జ , గా(గగ)**

11. ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

12. ఉపజాతి

13. ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

9. పృధ్వి వృత్తము. జ , స , జ , స , య , వ(లగ) –10

10. వసంత తిలకము. త , భ , జ , జ , గా(గగ) – 10

11. ఉపేంద్ర వజ్రము. జ , త , జ , గా(గగ) –2

3. ఉపజాతి

4. ఉపజాతి

5. ఉపజాతి

6,7. వారాంగి

8,9. ఉపేంద్రవజ్రము

10. వారాంగి

12. వసంతతిలకము త , భ , జ , జ , గా(గగ) –10

13. శిఖరిణి . (య , మ , న , స , భ , వ(లగ))– 10

14. 1,2. వియోగిని ( ససజగ– సభరవ)

3–10. వియోగిని

15. మాలిని( న , న , మ , య , య )–10

16. వసంతతిలక ఛందస్సు( తభజజగా(గగ)–10

17. వసంతతిలక ఛందస్సు( తభజజగా(గగ)–11

18. ప్రహర్షిణి–10

19. వంశస్థము ( జతజర) –10

20. ఉపజాతి – 10

21. మదనము (త , భ , జ , జ , గా)–12

22. వంశస్థము(జ , త , జ , ర)–11

23. వసంతతిలకము–11

24. శిఖరిణి –యమనసభవ –10

25. శార్దూలము– మసజసతతగ –10

26. శాలిని– మ , త , త , గగ –10

27. ప్రహర్షిణి– మనజరగ–11

28. వసంత మాలిక –10

29. వసంతతిలకము తభజజగా –10

30. వసంత తిలకము తభ జజగా–10

31. మందాక్రాంతము మభనతతగా–10

32. ఉపజాతి–10

33. వసంతతిలకం తభజజగా–10

34. స్రగ్ధర –మరభనయయయ–10

35. స్రగ్ధర మరభన యయయ–10

36. శార్దూలము మసజస తతగ–11

37. శార్దూలము–మసజసతతగ–10

38. వసంతతిలకం తభజజగా–10

39. ధృతి ఛందస్సు జ , స , జ , స , య , వ(లగ) –10

40. ద్రుతవిలంబితము న , భ , భ , ర –10

41. వారాంగి జత జగ – తతజగ–10

42. వంశస్థము జతజర–11

43. వసంతతిలకము తభజజగా–10

44. గీతి(ఆర్యాభేదము.)

45. మాలిని న , న , మ , య , య –10

46. వియోగిని సస జగ, సభరవ–10

47. రథోద్ధతము ర , న , ర , వ(లగ) –10

48. వంశస్థము జతజర–10

49. ఉపేంద్రవజ్రము జ , త , జ , గాగగ–10

50. హరిణి న , స , మ , ర , స , వ(లగ)–10

51. రుచిరము జభసజగ–10

52. తిలకము త , భ , జ , జ , గా(గగ)–10

53. వారాంగి జతజగా –జతజగా – తతజగా –తతజగా–10

54. శాలిని మ , త , త , గా(గగ) –10

55. తోటకము ససస స–10

56. ద్రుతవిలంబితము నభభర–10

57. గీతి–01 రథోద్ధతము రనరవ–10

58. మాలిని– ననమయయ –10

59. రథోద్ధతము రనరవ–10

60. వియోగిని స , స , జ , గ 1, 3 పాదాలు స , భ , ర , వ(లగ)

2,4 పాదాలు –11

61. వంశస్థము జతజర–10

62. శిఖరిణి య , మ , న , స , భ , వ –10

63. 1, 6–10: శ్లోకములు ద్రుత విలంబితము న , భ , భ , ర ,

2–5 శ్లోకములు మాలిని న , న , మ , య , య –10

64. ఉపజాతి –10

65. వసంతతిలకము త , భ , జ , జ , గా(గగ) –9

66. గీతి–10

67. ఉపేంద్ర వజ్రము జతజగా–10

68. సమ్మతావృత్తము నరరలగ –10

69. కుసుమ మంజరి వృత్తం –11

70. పృథ్వి1–5 శ్లో జ , స , జ , స , య , వ(లగ) స్వాగతం

6–10 రనభగా –10

71. ఇంద్రవజ్రము, తతజగా –10

72. వసంతతిలకము త , భ , జ , జ , గా –12

73. వసంతతిలకం10

74. శార్దూల విక్రీడీతము మసజస తతగ –10

75. స్రగ్ధర మ , ర , భ , న , య , య , య –10

76. మందాక్రాంతము మ , భ , న , త , త , గా(గగ)) –11

77.
1. ప్రహర్షిణి మ , న , జ , ర , గ
2. ద్రుతవిలంబితము న , భ , భ , ర
3. మదనము తభజజగా(గగ)
4. వంశస్థము జతజర
5. మదనము తభజజగా(గగ)
6. శిఖరిణి యమనసభవ

7,8. వసంత తిలకము తభజజగా(గగ)

9. వసంత తిలకము లేక మదనము తభజజగా(గగ)

10,11. మరభన యయయ స్రగ్ధర

12. హరిణి న , స , మ , ర , స , వ(లగ)

78. ద్రుత విలంబితము నభభర –10

79. ద్రుత విలంబితము నభభర –12

80. 1. వసంతతిలకము త , భ , జ , జ , గా(గగ))

2,3. శిఖరిణి య , మ , న , స , భ , వ(లగ)

4. పృథ్వి జ , స , జ , స , య , వ(లగ)

5 ఆర్యా

6. హరిణి న , స , మ , ర , స , వ(లగ)

7–11. మదనము త , భ , జ , జ , గా(గగ)

81. మందాక్రాంతము మ , భ , న , త , త , గా(గగ)) –10

82. స్రగ్ధర మ , ర , భ , న , య , య , య –10

83. 1–8. వసంతతిలకము త , భ , జ , జ , గా(గగ))

9. హరిణి న , స , మ , ర , స , వ(లగ))

10. స్రగ్ధర మరభన యయయ

84. పుష్పితాగ్ర 11

85. పృథ్వి జ , స , జ , స , య , వ(లగ)–11

86. స్రగ్ధర మరభన యయ య –11

87. వంశస్థము జతజర –10

88. స్రగ్ధర మరభన యయయ –12

89. శిఖరిణి – యమనసభవ –10

90. 1. మాలిని – ననమయయ

2. వసంతతిలకము తభజజగ

3,4. మదనము తభజజగ

5,6,8,9,10,11. వసంతతిలకము తభజజగ

7. వంశస్థము జతజర

91. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

92. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

93. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

94. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

95. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

96. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

97. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

98. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –11

99. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –10

100. స్రగ్ధర – మ , ర , భ , న , య , య , య –11

**శార్దూల విక్రీడితం**

నారాయణీయం 25వదశకంలోని శార్దూల విక్రీడితం నరసింహ ప్రభువు అవతారం యొక్క అద్భుతమైన వైభవాన్ని ప్రకటిస్తుంది. అలాగే 74 వ దశకంలోని మధురలో కృష్ణుడి ప్రవేశం శార్దూల వృత్తంతో మెరిసింది.

**స్రగ్ధర**

మహాభారత యుద్ధానికి మరియు యుద్ధానికి దారితీసిన సంఘటనలను వర్ణించటానికి అద్భుతంగా 86వదశకంలో "స్రగ్ధర" వృత్తాన్ని కవి ప్రయోగించాడు. 91 వదశకంనుండి 100 వదశకం వరకు స్రగ్ధర భక్తి (భక్తిమార్గ) మార్గాన్ని వివరిస్తుంది. 34 మరియు 35 దశకాలలో స్రగ్ధర శ్రీ రామ అవతారం వైభవాన్ని తెలియచేసింది.

**"తోటక" మరియు ద్రుతవిలంబిత వృత్తాలు**

కాళియ సర్పపు పడగ మీద కృష్ణుడి నృత్యాలను వివరించడానికి వరుసగా "తోటక" మరియు ద్రుతవిలంబిత ఛందస్సులను కవి అద్భుతంగా వాడుకొన్నాడు. 78 వదశకం మరియు 79 వదశకాలలో , రుక్మిణి తన ప్రభువుతో ఐక్యత కోసం ఆరాటపడే సందర్భంలో మరియు ఆమె వివాహం గురించి వివరించే సందర్భంలో ద్రుతవిలంబిత ఛందస్సును వాడుకొన్నాడు.

**కుసుమమంజరి" ఛందస్సు**

కుసుమమంజరి ఛందస్సు, రాసక్రీడను వర్ణించటానికి 69వదశకంలో ఉపయోగించబడింది. ఈ దశకంలోని పదకొండు శ్లోకాలలో పదాలు మరియు చర్యల మధ్య, ధ్వని మరియు భావాన్ని మిళితం చేయడం ద్వారా అద్భుతమైన ప్రతిధ్వనిని పదచిత్రాలతో కవి వినిపించాడు.

**ఈ పుస్తకంలో వరుసగా ...**

**ద్వాదశ స్కంధము**

దశకమ్ 98 – నిష్కలబ్రహ్మోపాసనము

దశకమ్ 99 – వేదమన్త్రమూలాత్మకమైన విష్ణుస్తుతి

దశకమ్ 100 – భగవంతుని కేశాదిపాదవర్ణన



నారాయణభట్టాత్రి రచించిన

# శ్రీమన్నారాయణీయము

## ప్రథమ స్కంధం

## దశకమ్ 1 – భగవత్త్వత్వము

**1–1 శ్లో.**

**సాంద్రానందావబోధాత్మకమనుపమితం కాలదేశావధిభ్యాం**
**నిర్ముక్తం నిత్యముక్తం నిగమశతసహస్రేణ నిర్భాస్యమానం।**
**అస్పష్టం దృష్టమాత్రే పునరురు పురుషార్థాత్మకం బ్రహ్మతత్త్వం**
**తత్తావద్భాతి సాక్షాత్ గురుపవనపురే హంత భాగ్యం జనానామ్ ॥**

**ప్రతిపదార్థం:** గురుపవనపురే = గురువాయూరు పురములో, సాంద్ర = దట్టమైనది, ఆనంద = అనందమును, అవబోధ – ఆత్మకమ్ =మేలుకొలుపుటను(ఎరుకను లేదా చిత్) కలిగి ఉన్న స్వరూపము, అనుపమితం =దేనితోను పోల్చబడనిది, కాలదేశ –అవధిభ్యాం నిర్ముక్తం = దేశకాలవస్తు పరిమితులకు అతీతమైనది(ఆ బంధముల నుండి విముక్తమయినది), నిత్యముక్తం =నిత్యముక్తమైనది. (సంతోష సుఖ దుఃఖాలనుండి), నిగమశతసహస్రేణ = వందలు వేలుయైన ఉపనిషత్తులచే (అనంతావై వేదాః), నిర్భాస్యమానం =ప్రకాశించునది, దృష్టమాత్రే = భౌతిక దృష్టికి, అస్పష్టం = అందని అందమైనది(మనోవాక్కులకు అందనిది) (నాయమాత్మా ప్రవచనేన లభ్యః), పునః = మరల, ఉరు పురుషార్థ –ఆత్మకం = పురుషార్థాలలో గొప్పదయిన మోక్ష పురుషార్థమైనది అయిన (మోక్షమనగా భగవదనుభవము), బ్రహ్మతత్త్వం = బ్రహ్మతత్త్వము, తత్ = సత్యం, జ్ఞానం మొదలైన లక్షణాలు కలిగి, తత్త్వమసి మొదలైన మహావాక్యాలు దేనిని గురించి తెలియజేస్తున్నాయో అది, తావత్ = ఆ లక్షణ పరిమాణం కలది, జనానామ్ భాగ్యం = జనులయొక్క భాగ్యముగా, సాక్షాత్ = ఎదుట, ప్రత్యక్షముగా, భాతి =

ప్రకాశించుచున్నది, హంత =ఆహా !(సంతోషార్థకములో వాడిన పదం).

**తాత్పర్యము:** గురువాయూరు పురములో దట్టమైన అనందమును మేలుకొలుపు టలో ఘనమైనది,(సచ్చిదానంద ఘనుడు) దేనితో పోల్చబడనిది, దేశకాలములకు అతీతమైనది, బంధవిముక్తమైనది, నిత్యముక్తమైనది. వందలు వేలుయైన ఉపనిషత్తులచే ప్రకాశించునది, భౌతిక దృష్టికి అందని అందమైనది, గొప్పదయిన మోక్ష పురుషార్థమైనది అయిన బ్రహ్మతత్త్వము, సత్యం, జ్ఞానం మొదలైన లక్షణాలు కలిగి, తత్త్వమసి మొదలైన మహావాక్యాలు దేనిని గురించి తెలియజేస్తున్నాయో అది, జనులయొక్క పుణ్యరూపమై శ్రీ కృష్ణమూర్తిగా ఎదుట ప్రకాశించుచున్నది . ఎంతో సంతోషము.

**విశేషాలు:** పరమాత్మ అంటే ఏమిటో ఈ శ్లోకం చెబుతుంది. స్రగ్ధర అనగా స్రజం మాలాం ధరతి మాలను ధరించువాడు. మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఒక దండ ఉంటుంది. దానినే వనమాల లేదా తోమాల అంటాం. మొట్ట మొదట స్రగ్ధర వృత్తం వాడుట ద్వారా స్వామివారిని స్మరించుకోవటంతో పాటు వనమాలలా శాశ్వతంగా తన కావ్యం నిలవాలనే కవి ఆశయం కూడా ధ్వనిస్తోంది.

సాంద్రమంటే సహ అంద్రేణ నిబిడః దట్టమైనది బిగువైనది. దానిని మనలో మేలుకొలుపునది కృష్ణమూర్తి దర్శనమని కవి వాక్కు.

భగవంతుని స్వరూప లక్షణము ఇక్కడ నిరూపించబడింది. ఆనందం, అవబోధము స్వామి స్వరూపమని కవి నిరూపణ.

సచ్చిదానందం అంటే సత్యం, జ్ఞానం, ఆనందం కలసి పరమాత్మ స్వరూపం. భూత, భవిష్యత్, వర్తమానాల వల్ల మార్పు చెందనిదీ, ఎప్పుడూ ఒకే విధంగా ఉండేదీ సత్/ సత్తు. సచ్చిదానందంలో రెండవదైన చిత్/ చిత్తు అంటే ఎరుక. నిరుపాధికం, నిరతిశయం, నిరుపమానం అయి ఎప్పటికీ ఉండే సుఖానుభూతి ఆనందం. దీపానికి ఎరుపు తెలుపుల మిశ్రమ వర్ణం, వేడి, కాంతి ఎలా స్వాభావికంగా కలసి ఉంటాయో అలా సత్తు, చిత్తు, ఆనందం మిళితమై ఉంటాయి.

అవి అభిన్నం.ఈ సచ్చిదానందాన్ని కవి ఈ శ్లోకంలో సాన్ద్రానంద పదంలో తెలిపాడు.

భాగవతంలోని ప్రథమాధ్యాయంలో ఉన్న నిగమకల్పతరోర్గళితం ఫలం.. అనుశ్లోక ప్రథమపాదం నిగమశతసహస్రేణ నిర్భాస్యమానం అను ఈశ్లోక పద సముచ్చయములో ధ్వనించుచున్నది.

దేశకాలాపరిచ్ఛిన్నా... అను లలితా సహస్ర నామము కాలదేశావధిభ్యాం నిర్ముక్తం అను కవి సమాసముతో తుల్యమైనది.

ఇంద్రియాలకు కనిపించని స్వామి ఇంద్రియాలకు గురువాయూరు కృష్ణునిగా కనిపిస్తున్నాడని కవి భక్తి భావన.

**1-2 శ్లో.**

**ఏవం దుర్లభ్యవస్తున్యపి సులభతయా హస్తలబ్ధే యదన్యత్**
**తన్వా వాచా ధియా వా భజతి బత జనః క్షుద్రతైవ స్ఫుటేయమ్ ।**
**ఏతే తావద్వయం తు స్థిరతరమనసా విశ్వపీడాపహత్యై**
**నిశ్శేషాత్మానమేనం గురుపవనపురాధీశమేవాశ్రయామః ॥**

**ప్రతిపదార్థం :** ఏవం = ఈ విధముగా, యత్ దుర్లభ్య = ఏ దుర్లభమైన (మనో వాక్కులకు అందనిది, తేలికగా పొందలేనిది) (దుస్ శబ్దానికి లభ్య శబ్దముతో సమాసం), వస్తుని+అపి = వస్తువు కూడా ( బ్రహ్మ తత్వమైన కృష్ణుడు కూడా), సులభతయా = సులభముగా, హస్తలబ్ధే (సతి) = కరతలామలకంగా లభిస్తున్నప్పటికి, జనః = జనుడు, అన్యత్ = ఇతర దేవతలను, భజతి = పూజిస్తున్నారు, బత = అయ్యో !, ఇయం క్షుద్రతా ఏవ =ఇది నీచమైనది, ఏతే వయం తు తావత్ = కాని మేము, విశ్వపీడ+అపహత్యై = ప్రపంచ పీడలను నివారించుటకు, స్థిరతరమనసా =స్థిరమైన మనస్సుతో, తన్వా వాచా ధియా =త్రికరణ శుద్ధిగా( మనసా, వాచా, కర్మణా), నిశ్శేష+ఆత్మానమ్ = సర్వవ్యాపకుడైన (పరిపూర్ణుడైన), ఏనం స్ఫుటం =ఈ విధముగా ప్రకాశించు, గురుపవనపుర+అధీశమ్ +ఏవ= ఈ

గురువాయూరు పురాధీశుని మాత్రమే (కృష్ణుని), ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాం.

**తాత్పర్యం:** ఈ విధముగా దుర్లభమైన వస్తువు కూడా (బ్రహ్మ తత్వమైన కృష్ణుడు కూడా) సులభముగా కరతలామలకంగా లభిస్తున్నా జనులు ఇతర దేవతలను పూజిస్తున్నారు. అయ్యో! ఇది నీచమైనది. కాని మేము ''ప్రపంచపీడలను నివారించుటకు'' స్థిరమైన మనస్సుతో, త్రికరణ శుద్ధిగా సర్వవ్యాపకుడైన ఈ ప్రకాశించు ఈ గురువాయూరు పురాధీశుని (కృష్ణుని) మాత్రమే ఆశ్రయించు చున్నాం.

**విశేషాలు:** అఱచేతి ఉసిరికవలె ఇతరులు చెప్పనక్కఱ లేకయే స్పష్టముగా తెలియునట్టి విధమును కరతలామలక న్యాయమంటారు. కృష్ణుడు అలా సులభముగా లభించే వాడని కవి భావన.

**బత:** బత సంబోధనే, ఆశ్చర్యే, నిందాయామ్ ఖేదము, సంబోధనము, ఆశ్చర్యము, నిందల యందు వాడబడును.

ప్రపంచ క్షేమం కోరేవాడి క్షేమాన్ని భగవంతుడు చూసుకొంటాడని పెద్దలు చెబుతారు. అందువల్ల ప్రపంచ పీడలను నివారించుటకు అని కవి మనం అనుసరించ వలసిన కర్తవ్యాన్ని చెప్పాడు.ఇక్కడ ఇంకో విశేషం.

పరమాత్మ జీవులలో **విశ్వుడు** , **తైజసుడు**, ప్రాజ్ఞుడు అనే నామాలతో ఉన్నాడని చెబుతారు. జీవుని బాధలు (తాపత్రయాలను) కూడా తొలగించమని విశ్వ శబ్ద ప్రయోగంలో ఇంకో అర్థం స్ఫురిస్తున్నది.

నిశ్శేష+ఆత్మానమ్ = సర్వవ్యాపకుడైన (మిగులు అనేది లేకుండా పరిపూర్ణుడైన) పూర్ణమిదం... శ్లోకాన్ని జ్ఞప్తికి తెచ్చుచున్న పదబంధమిది. ఎవరిని, ఎందుకు, ఎలా ఆశ్రయిస్తున్నామో తెలిపిన శ్లోకమిది. పరమాత్మని సగుణ, నిర్గుణ ఆకారాలతో ప్రార్థిస్తాము. పంచదార చిలకలోని పంచదార నిర్గుణం. పంచదార చిలక సగుణం. ఏది ఉపాసించినా అందులోని తత్వమొకటే. ఈ శ్లోకములో దుస్ శబ్దానికి లభ్య శబ్దముతో సమాసం)

**1-3 శ్లో.**

**సత్త్వం యత్తత్పరాభ్యామపరికలనతో నిర్మలం తేన తావత్**
**భూతైర్భూతేంద్రియైస్తే వపురితి బహుశః శ్రూయతే వ్యాసవాక్యమ్।**
**తత్స్వచ్ఛత్వాద్యదచ్ఛాదితపరసుఖచిద్గర్భనిర్భాసరూపం**
**తస్మిన్ ధన్యా రమంతే శ్రుతిమతిమధురే సుగ్రహే విగ్రహే తే॥**

**ప్రతిపదార్థం:** పరాభ్యామ్ అపరికలనతః = ఇతర రెండు గుణములతో (రజస్తమో గుణాలతో) కలియక, నిర్మలం =స్వచ్ఛమైన, తత్ సత్త్వం యత్ = ఆ స్వచ్ఛ గుణం, తేన తావత్ భూ తైః = స్వయముగా భూతములతో రూపొందింపబడిన, భూత+ఇంద్రియైః = పంచ భూతములతో, పది ఇంద్రియములతో, తే వపుః = నీశరీరము ఏర్పడినదని, ఇతి వ్యాసవాక్యమ్ = వ్యాస వాక్యము, బహుశః శ్రూయతే = అనేక చోట్ల వినబడుచున్నది, స్వచ్ఛత్వాత్ = స్వచ్ఛత్వము వలన, అచ్ఛాదిత = దాగిన, పరసుఖచిద్గర్భ నిర్భాస రూపం= అడ్డంకులు లేని పరసుఖానికి ఆధారమైన, యత్ తత్ = ఏ నీ స్వరూపమున్నదో దానిని, శ్రుతిమతిమధురే = వివరణ వినడానికి మధురమైన(ఏది ఆస్వాదించినా ఇంకా ఆస్వాదించాలనిపించేది మధురము), సుగ్రహే= సులభతరమైన, తస్మిన్ తే విగ్రహే= నీ విగ్రహమునందు(విశేషముగా గ్రహించునది విగ్రహము), ధన్యాః = ధన్యులైన భక్తులు, రమన్తే = ఆనందాన్ని పొందుచున్నారు.

**తాత్పర్యం:** రజస్తమో గుణాలతో కలియక స్వచ్ఛముగా పంచ భూతములతో, పది ఇంద్రియములతో నీశరీరము ఏర్పడినదను వ్యాస వాక్యము ప్రసిద్ధము. స్వచ్ఛత్వము వలన అడ్డంకులు లేని పరసుఖానికి ఆధారమైన నీ స్వరూపమును, వివరణ వినడానికి మధురమైన సులభతరమైన నీ విగ్రహమును దర్శించి ధన్యులైన (భాగ్యవంతులైన) భక్తులు ఆనందాన్ని పొందుచున్నారు.

**విశేషాలు:**

**పంచభూతములు –**

1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము.

**జ్ఞానేంద్రియములు–**
1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వ, 5. నాసిక.
**కర్మేంద్రియములు–**
1. వాక్కు, 2. హస్తములు, 3. పాదములు, 4. పాయువు, 5. ఉపస్థ. మొత్తం పది.
**వ్యాస వాక్యము :**

**జగృహే పౌరుషం రూపం భగవాన్మహదాదిభిః ।**
**సంభూతం షోడశకలమాదౌ లోకసిసృక్షయా ॥**

( భాగవత సర్గ–01. అధ్యాయము 03–01 )

భగవంతుడు పూర్వము సృష్టిని చేయగోరి మహత్తత్త్వము, అహంకారము మరియు పంచతన్మాత్రలతో గూడి సునిష్పన్నమైన పురుష రూపమును గ్రహించెను. ఆ రూపమునందు అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, అంతః కరణము, అయిదు భూతములు అనే పదునారు కళలు గలవు.

**1–4 శ్లో.**
**నిష్కంపే నిత్యపూర్ణే నిరవధిపరమానందపీయూషరూపే**
**నిర్లీనానేకముక్తావళిసుభగతమే నిర్మలబ్రహ్మసింధౌ ।**
**కల్లోలోల్లాసతుల్యం ఖలు విమలతరం సత్త్వమాహుస్తదాత్మా**
**కస్మాన్నో నిష్కళస్త్వం సకల ఇతి వచస్త్వత్కలాస్వేవ భూమన్ ॥**

**ప్రతిపదార్థం:** నిష్కంపే = నిష్కల రూపములో సముద్రము వలె చలింపనివాడా! నిత్యపూర్ణే = సముద్రము వలె నిత్యపూర్ణుడైనవాడా!(పూర్ణమదః..), నిరవధిపరమ + ఆనందపీయూషరూపే = పరిమితిలేని పరమానందమను అమృతముతో నిండిన సముద్ర స్వరూపుడా!, నిర్లీన + అనేకముక్తావళి = అనేకమయిన లీనమయిన ముత్యాల వరుస కలిగినవాడా!(బ్రహ్మజ్ఞానముతో కలిసి ముక్తులయిన వారితో కలిసి మిక్కిలి మనోహరమయినవాడా!), సుభగతమే నిర్మలబ్రహ్మసింధౌ = సర్వమంగళస్వరూపమయినస్వచ్ఛమయినసత్వగుణమనుసముద్రంవంటివాడా!, విమలతరం సత్వం= స్వచ్ఛతరమయిన సత్వ రూపముతో, కల్లోల+ఉల్లాసతుల్యం =కల్లోలమయిన అలలతో తుల్యమయినవాడా (అల –సకలరూపమని భావం),

ఆహుః = ఇలా పెద్దలు చెప్పుచుందురు, తత్+ఆత్మా త్వం = నువ్వు అలాంటివాడివని చెప్పబడుతుండగా, కస్మాత్+నో నిష్కళః= నువ్వు నిష్కళుడవు ఎందుకు కావు?, భూమన్= ఓ గొప్పవాడా ! (మహత్త్వం,సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా), సకల ఇతి వచః = సకలము యొక్క నామాలు(సకలదేవతల యొక్క నామాలు), కలాసు వత్ ఏవ= నీలో ని భాగాలు( నీలోని భాగాలే),

**తాత్పర్యం:** నిష్కల రూపములో సముద్రము వలె చలింపనివాడా ! సముద్రము వలె నిత్యపూర్ణుడైనవాడా!( పూర్ణమదః..)

పరిమితిలేని పరమానందమను అమృతముతో నిండిన సముద్ర స్వరూపుడా! అనేకమయిన లీనమయిన ముత్యాల వరుస కలిగినవాడా! (బ్రహ్మజ్ఞానముతో కలిసి ముక్తులయిన వారితో కలిసి మిక్కిలి మనోహరమయినవాడా !)సర్వమంగళ స్వరూపమయిన స్వచ్ఛమయిన సత్వగుణమను సముద్రంవంటివాడా!

స్వచ్ఛతరమయిన సత్వ రూపముతో కల్లోలమయిన అలలతో తుల్య మయినవాడా! (అల – సకలరూపమని భావం) ఇలా పెద్దలు చెప్పుచుందురు. శుద్ధ సత్వ స్వరూపుడవయిన నువ్వు నిష్కలుడవిగా ప్రకాశిస్తావు. ఓ గొప్పవాడా! అధికుడా! సకలము యొక్క నామాలు (సకలదేవతల యొక్క నామాలు) నీలోని భాగాలు (నీలోని భాగాలే)

**విశేషాలు:** భగవంతుడు నామరూపాదులు ధరిస్తే సకలుడు నామరూపాదులు లేకపోతే నిష్కలుడు. ఈ రెండింటిని కవి చెప్పాడు.

సముద్రం నిష్కల స్వరూపం. అలలు అవతారాలుగా మనకు కనబడుతున్న స్వామివారి యొక్క సకల స్వరూపాలని ఈ శ్లోకంలో మనోహరంగా చెప్పారు.

**1–5 శ్లో.**

**నిర్వ్యాపారో ఽపి నిష్కారణమజ! భజసే యత్క్రియామీక్షణాఖ్యాం**
**తేనైవోదేతి లీనా ప్రకృతిరసతి కల్పాఽపి కల్పాదికాలే ।**
**తస్యాస్సంశుద్ధమంశం కమపి తమతిరోధాయకం సత్త్వరూపం**
**సత్వం ధృత్వా దధాసి స్వమహిమ విభవాకుంఠ! వైకుంఠ! రూపం ॥**

**ప్రతిపదార్థం:** అజ= (న జాయతే) పుట్టనివాడు. స్థూలజగత్తుకు కారణమైన సత్త్వరజస్తమోగుణరూపమైన ప్రధానము, నిర్వ్యాపారః అపి= నువ్వు ఏ క్రియ లేని వాడివైనప్పటికి, నిష్కారణమ్= (నాస్తి కారణం యస్య) కారణము లేని, యత్ క్రియామ్ +ఈక్షణ+ఆఖ్యాం= మాయా శక్తిని ప్రేరేపించే దర్శన క్రియను, భజసే =అంగీకరిస్తావు, తేన+ఏవ= అందువలననే, కల్పా+అపి= కల్పాంతమందు, లీనా ప్రకృతిః అసతి= నీ మాయ లీనమగుచున్నది, కల్ప+ఆదికాలే = కల్పాదియందు, ఉదేతి = వ్యక్తమగుచున్నది, తస్యాః= ఆమాయయొక్క, సంశుద్ధమ్ +అంశం= పరిశుద్ధమయిన అంశం కలిగినది, తమ్ +అతిరోధాయకం సత్త్వరూపం= ఆ చైతన్యప్రకాశమయిన సత్వగుణం, కమపి = ఏదైనా, దధాసి = ధరిస్తావు, స త్వం ధృత్వా = ఆమాయా రూపాన్ని ధరించుట, స్వమహిమ= నీ స్వమహిమావిలాసం చేతనే కాని మరోకారణం లేదు, అ కుంఠ విభవ= విరమించని కార్యము ధనము, మోక్షము, ఐశ్వర్యము సిద్ధింప చేయు, వైకుంఠ రూపం= మాయలో వుండు విష్ణు రూపమును ధరించినవాడా!.

**తాత్పర్యం:** ఐశ్వర్యము సిద్ధింప చేయువైకుంఠ రూపములో మాయలో వుండు విష్ణు రూపమును ధరించినవాడా!పుట్టనివాడా! నువ్వు ఏ క్రియ(కర్మ) లేని వాడి వైనప్పటికి కారణము లేని మాయా శక్తిని ప్రేరేపించే దర్శన క్రియనుఅంగీకరిస్తావు. (అయస్కాంతము దగ్గర ఉన్న ఇనుముకు చలనము కలిగినట్లుగా స్వామి సన్నిధానములో ఉన్న ప్రకృతిలో ప్రేరణ జరుగును) అందువలననే కల్పాంతమందు నీ మాయ లీనమగుచున్నది. కల్పాదియందు వ్యక్తమగుచున్నది .ఆమాయయొక్క పరిశుద్ధమయిన అంశం కలిగిన, ఆ చైతన్యప్రకాశమయిన సత్వగుణమును ధరిస్తావు. ఆమాయా రూపాన్ని ధరించుట నీ స్వమహిమావిలాసం చేతనే కాని మరోకారణం లేదు.

**విశేషాలు:**

**కల్పం:** వేయి మహాయుగాలు ఒక కల్పం. వర్తమాన కాలంలో సంధ్యా వందనంలో చెప్పే 'శ్వేత వరాహ కల్పం...' లో ఇప్పటికి ఆరు మన్వంతరాలు గడిచాయి. ఇప్పుడు (అంటే విక్రమార్క/ శాలివాహన/ క్రీస్తు శకాలు జరుగుతున్న కాలం) ఏడవదైన

వైవస్వత మన్వంతరం నడుస్తున్నది. మహా యుగం అంటే కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు అనే నాలుగు యుగాల కాలం. ఈ మహాయుగంలో చివరిదైన కలియుగం కొనసాగుతున్నది.

**1-6 శ్లో.**

**తత్తే ప్రత్యగ్ర ధారాధర లలిత కలాయావలీ కేలికారం**
**లావణ్యస్యైకసారం సుకృతిజనదృశాం పూర్ణపుణ్యావతారమ్ ।**
**లక్ష్మీనిశ్శంకలీలానిలయనమమృతస్యందసందోహమంతః**
**సించత్సంచింతకానాం వపురనుకలయే మారుతాగారనాథ! ॥**

**ప్రతిపదార్థం:** మారుతాగారనాథ =ఓ గురువాయూర్ స్వామీ!, తే = నీయొక్క, ప్రత్యగ్ర = (ప్రతిగతం అగ్రం శ్రేష్ఠం ప్రథమ దర్శనం యస్య) మొట్ట మొదటగా చూడబడినది. కొత్తది, ధారాధర= (ధారాయాః జలధారాయాః ధరః) జలధారలు కల్గిన. మేఘ కాంతులను అతిశయించునది, లలిత = (లలతే ఈషతే) అందమైనది కోరబడినది, కలాయావలీ కేలికారం =ఇరుగుడు పుష్పంలా శ్యామలమైనది, లావణ్యస్య= (లవణస్య భావః )ఉప్పు కలది సౌందర్యముయొక్క, ఏకసారం= సార భూతమైనది, సుకృతిజన=(సుకృతం అనేన సుకృతం అస్తి అస్య ) పుణ్యవంతులచే, దృశాం= చూడబడే, పూర్ణపుణ్యావతారమ్= పూర్ణపుణ్యావతారమైనది, లక్ష్మీ= (లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్) ప్రయత్నించువారిని చూచు విష్ణుపత్ని, నిశ్శంకలీలానిలయం = (నిర్గతా శంకా) సందేహము లేని లీలలకు నిలయము (లక్ష్మీస్వరూపుడని భావం. శ్రీనివాసుడు), అమృతస్యంద సందోహమంతః సించత్సంచింతకానాం = చక్కటి ఉపాసకుల హృదయాలలో అమృతాన్ని నింపేది అయిన నీ, వపుః= (వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము.)దివ్య శరీరమును, అనుకలయే =నిరంతరం తలుస్తుంటాం.

**తాత్పర్యం:** ఓ గురువాయూర్ స్వామీ! నీయొక్క కొత్త మేఘ కాంతులను అతిశయించిన,కోరబడిన, ఇరుగుడు పుష్పంలా (కలువపూవులా) శ్యామలమైన, సౌందర్యముయొక్క సారభూతమైన పుణ్యవంతులచే చూడబడేది, పూర్ణ

పుణ్యావతారమైన, లక్ష్మీదేవి సందేహము లేని లీలలకు నిలయమయిన, ఉపాసకుల హృదయాలలో అమృతాన్ని నింపేది అయిన నీ దివ్య శరీరమును (రూపమును) తలుస్తుంటాం.

**1-7 శ్లో.**

**కష్టా తే సృష్టి చేష్టా బహుతరభవఖేదావహా జీవభాజామ్**
**ఇత్యేవం పూర్వమాలోచితమజిత! మయా నైవమద్యాభిజానే ।**
**నో చేజ్జీవాః కథం వా మధురతరమిదం త్వద్వపుశ్చిద్రసార్ద్రం**
**నేత్రైఃశ్రోత్రైశ్చ పీత్వా పరమరససుధాంభోధిపూరే రమేరన్ ॥**

**ప్రతిపదార్థం:** అజిత= (న జితః) జయింపబడనివాడా, తే సృష్టి చేష్టా = నీ సృష్టి చేష్ట (సృజ్యతే రచ్యతే రచించబడునది సృష్టి.), కష్టా = కష్టభరితమైనదని, బహుతర= (బంహతే వర్ధతే) వృద్ధి నొందిన . ఎక్కువ, భవ = (భవతి జాయతే తస్య భావ) పుట్టుక సంసారములకు సంబంధించిన, ఖేద+ఆవహా = (ఖిద్యతే అనేన) దుఃఖములను, ఆవహా= (ఆవహతి ఉత్పాదయతి మార్గం దర్శయతి అసౌ) పుట్టించునదని, జీవభాజామ్ = జీవులను విడగొట్టునదని, ఇతి+ఏవం = ఈవిధముగా, పూర్వమ్= పూర్వము, ఆలోచితమ్= ఆలోచింపబడినది, మయా న +ఏవమ్ +అద్య+అభిజానే= ఇప్పుడు ఆవిధంగా ఆలోచించటం లేదు, నో చేత్ జీవాః = నీసృష్టే లేకుంటే, జీవాః= జీవులు, కథం వా= ఎట్లు, మధురతరమ్ +ఇదం = ఈ నీ మధురతరమైన, చిద్రస+ఆర్ద్రం= జ్ఞానానంద రస స్వరూపమును, త్వత్+వపుః= నీశరీరమును, నేత్రైః = (నయతి నీయతే వా అనేన) పదార్థములవైపు వెళ్లునది పదార్థముల స్వరూపమును తెలుపునదయిన కన్నులచే, శ్రోత్రైః +చ= (శ్రూయతే అనేన దీనితో విందురు.) చెవులచే, పీత్వా = తాగి, పరమరససుధ + అంభోధిపూరే = పరమర సామృత సముద్రంలో, రమేరన్= తేలియాడగలరు?

**తాత్పర్యము:** జయింపబడనివాడా! (మాయకు వశము కానివాడా !) శ్రీ కృష్ణా ! నీ సృష్టి చేష్ట కష్టభరితమైనదని సంసారములకు సంబంధించినదుఃఖములను పుట్టించునదని జీవులను విడగొట్టునదని,అనగా మరణములను కలిగించునదని ఈవిధముగా పూర్వము ఆలోచించే వాడిని. కాని ఇప్పుడు ఆవిధంగా ఆలోచించటం

లేదు. నీసృష్టే లేకుంటే ఈ జీవులు ఎట్లు నీ మధురతరమైన జ్ఞానానంద రస స్వరూపమయిన నీశరీరమును కన్నులచే చెవులచే తాగి పరమరసామృత సముద్రంలో తేలియాడగలరు? (కృష్ణ రూప మాధుర్యమును అనుభవించుటయే జీవన పరమార్ధమని భావం)

**విశేషాలు:** చెవులద్వారా రసాన్ని తాగటమంటే ఆస్వాదించటం. దీనికి సమర్ధనగా ప్రసిద్ధమయిన శ్లోకాన్ని ఉదాహరిస్తాను.

**యః కర్ణాంజలి సంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా**
**ద్వాల్మీకే ర్వదనారవింద గలితం రామాయణాఖ్యం మధు**
**జన్మ వ్యాధి జరా విపత్తి మరణై రత్యంత సోపద్రవం**
**సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్వి ష్ణోః పదం శాశ్వతమ్**

(వాల్మీకి నోటి వెంట వచ్చిన రామాయణమనే తేనెని చెవులు అనే దోసిళ్ళతో ప్రతిరోజూ ఎవరైతే తాగుతారో, వారు జన్మ, వ్యాధి, ముసలితనం, ఆపదలు, మరణం లాంటి బాధలతో ఉన్న ఈ సాంసారిక జగత్తుని వదిలి శాశ్వతంగా విష్ణుస్థానాన్ని చేరుకుంటారు.)

**1–8 శ్లో.**
**నమ్రాణాం సన్నిధత్తే సతతమపి పురస్తైరనభ్యర్థితాన–**
**ప్యర్థాన్ కామానజస్రం వితరతి పరమానందసాంద్రాం గతిం చ ।**
**ఇత్థం నిశ్శేషలభ్యో నిరవధికఫలః పారిజాతో హరే! త్వం**
**క్షుద్రం తం శక్రవాటీద్రుమమభిలషతి వ్యర్థమర్థివ్రజోఽయమ్ ॥**

**ప్రతిపదార్థం:** హరే = ఓ శ్రీహరీ!, నమ్రాణాం = (నమనం శీలం అస్య) నమనశీలము గల. వినయశీలులయొక్క, పురః = ఎదుట, సన్నిధత్తే = లభిస్తావు, సతతమ్+అపి = ఎల్లప్పుడు కూడా, అనభ్యర్థితాన్ = అడగనివారికి కూడా, అర్థాన్ కామాన్ = అర్థ కామాలను, పరమానందసాంద్రాం గతిం చ = పరమానంద మోక్ష విశేష మార్గాలను, అజస్రం = (న జస్ర) విరామము లేక. నిరంతరము ఎల్లప్పుడు, వితరతి = ఇస్తావు, ఇత్థం = ఈ విధంగా, నిశ్శేషలభ్యః = అశేషముగా లభింపచేస్తూ,

నిరవధికఫలః = నిరవధిక ఫలాలను అనుగ్రహిస్తూ, పారిజాతః = కల్ప వృక్షమువలె, త్వం = నువ్వుండగా, క్షుద్రం = తెలియని పామరులు, తం శక్రవాటీద్రుమమ్= ఆ ఇంద్రుని నందనోద్యాన కల్పవృక్షాన్ని, అభిలషతి = కోరుచుందురు, వ్యర్థమ్ +అర్థివ్రజః +అయమ్ = ఇంతకన్నా అడిగే వారికి వ్యర్థమైన పని ఇంకొకటి లేదు.

**తాత్పర్యం:** ఓ శ్రీ హరీ! నిన్ను శరణు కోరిన వినయశీలుల ఎదుట నువు కల్ప వృక్షంలా లభిస్తావు. ఎల్లప్పుడు అడగనివారికి కూడా అర్థ కామాలను, పరమానంద మోక్ష విశేష మార్గాలను ఎల్లప్పుడు ఇస్తావు. ఈ విధంగా అశేషముగా లభింపచేస్తూ నిరవధిక ఫలాలను అనుగ్రహిస్తూ కల్పవృక్షమువలె నువ్వుండగా తెలియని పామరులు ఆ ఇంద్రుని నందనోద్యాన కల్పవృక్షాన్నికోరుకుంటారు. ఇంతకన్నా అడిగే వారికి వ్యర్థమైన పని ఇంకొకటి లేదు.

**విశేషాలు:** అహంకారం వదలటమే నమస్కారం. తల ఎత్తితే ఏ చెట్టు పండు అయినా కనబడి, దొరుకుతుంది. కల్పవృక్షము కూడా ఇంతే. అది మెడ ఎత్తి చేయి చాచి అందుకొన్నవారికే ఫలమును ఇస్తుంది.

కాని తలదించితే (నమస్కరించితే) శ్రీ హరి అను చెట్టునుండి కోరుకొన్న ఫలం లభిస్తుంది.

**1-9 శ్లో.**

**కారుణ్యాత్కామమన్యం దదతి ఖలు పరే స్వాత్మదస్త్వం విశేషాత్**
**ఐశ్వర్యాదీశతేఽన్యే జగతి పరజనే స్వాత్మనోఽపీశ్వరస్త్వమ్ ।**
**త్వయ్యుచ్చైరారమంతి ప్రతిపదమధురే చేతనాః స్ఫీతభాగ్యాః**
**త్వం చాత్మారామ ఏవేత్యతులగుణగణాధార! శౌరే! నమస్తే ॥**

**ప్రతిపదార్థం:** శౌరే= (శూరస్య గోత్రాపత్యమ్) శూరుని గోత్రములో పుట్టినవాడా ! శ్రీకృష్ణుడా, కారుణ్యాత్= (కరుణస్య భావః, కరుణ ఏవ కారుణ్యమ్) దయాభావము వలన, అన్యం = (అసదృశః) భిన్నము, ఇతరము. ఇతర దేవతలు, కామం= (కామ్యతే అసౌ) కోరికను, దదతి ఖలు= తీరుస్తుంటారు కదా!, పరే విశేషాత్= వారిని మించి, త్వం= నువ్వు, స్వాత్మదః= నీ ఆత్మనే ఇస్తావు, అన్యే = ఇతర దేవతలు,

ఐశ్వర్యాత్ = తమతమ విశేష ఐశ్వర్యాల వల్ల, జగతి ఈశతే = ప్రపంచాన్ని పాలిస్తుంటారు, పరజనే= ఇతర జనులు, స్వాత్మనః +అపి +ఈశ్వరః +త్వమ్= నువ్వు ఆ దేవతలతో సహ అందరిని ఆంతరంగికంగా పాలిస్తుంటావు, త్వయి= నీయందు, ఉచ్చైః =ఎలుగెత్తి, ప్రతిపదమధురే చేతనాః = ప్రతి పద మధురమైన నీ పేరును, రూపాన్ని ధ్యానిస్తూ, స్ఫీతః= ( వర్ధితః స్థూలః విస్తృతః) వృద్ధి నొందినది విస్తృతమైనది, భాగ్యాః= భాగ్యాలతో, త్వం చ = నువ్వే, ఆత్మారామః ఏవ = ఆత్మారాముడవని, ఆరమంతి = ఆనందం పొందుతుంటారు, అతులగుణ గణాధార = సాటిలేని గుణ సమూహములకు ఆధారమైన వాడా! శ్రీ కృష్ణా, నమస్తే = నీకు నమస్కారం.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడా! దయతో ఇతర దేవతలు కోరికను తీరుస్తుంటారు కదా! వారిని మించిన దయతో భక్తులకు నువ్వు నీ ఆత్మనే ఇస్తావు. ఇతర దేవతలు తమతమ విశేష ఐశ్వర్యాల వల్ల ఈ ప్రపంచాన్ని పాలిస్తుంటారు. నువ్వు ఆ దేవతలతో సహ అందరిని ఆంతరంగికంగా పాలిస్తుంటావు.నీయందు ఎలుగెత్తి ప్రతి పద మధురమైన నీ పేరును, రూపాన్ని ధ్యానిస్తూ విస్తృతమైనభాగ్యాలతో నువ్వే ఆత్మారాముడవని భక్తులు ఆనందం పొందుతుంటారు. సాటిలేని గుణ సమూహములకు ఆధారమైన వాడా! శ్రీ కృష్ణా! నీకు నమస్కారం.

**1-10 శ్లో.**

**ఐశ్వర్యం శంకరాదీశ్వరవినియమనం, విశ్వతేజో హరాణాం**
**తేజస్సంహారి వీర్యం, విమలమపి యశో నిస్పృహైశ్చోపగీతం ।**
**అంగాసంగా సదా శ్రీరఖిలవిదసి, న క్వాపి తే సంగవార్తా**
**వాతాగారవాసిన్! మురహర! భగవచ్ఛబ్దముఖ్యాశ్రయోఽసి ॥**

**ప్రతిపదార్థం:** తద్వాతాగారవాసిన్! = గురువాయూర్ దేవాలయము నివాసముగా కలిగినవాడా!, మురహర= మురాసురుని చంపినవాడా!, ఐశ్వర్యం=నీ ఐశ్వర్యము (ప్రభుత్వము, సంపద , అణిమా మొదలగు అష్టసిద్ధులు), శంకర + ఆది + ఈశ్వర వినియమనం = ఈశ్వరులైన శంకరుడు మొదలైన వారిని నియమించునది, వీర్యం = (వీర్యతే విక్రమ్యతే అనేన) దీనితో పరాక్రమింతురు. నీ పరాక్రమము, విశ్వతేజో

హరాణాం= అశేష తేజోమూర్తులయిన శంకరాదుల, తేజః +సంహారి = తేజస్సును హరించ గల సామర్థ్యము కలిగినది, యశః= (అశ్నుతే వ్యాప్నోతి సర్వత్ర) అంతట వ్యాపించు నీ కీర్తి, విమలమ్ +అపి= స్వచ్ఛమై, పాప నాశకమై, నిస్పృ హైః +చ += ముక్తులచే, ఉపగీతం=గానము చేయబడునది, సదా = ఎప్పుడు, శ్రీః = లక్ష్మి, అంగాసంగా = నీ వక్ష స్థలమును ఆశ్రయించి ఉన్నది, అఖిలవిత్ + అసి = నువ్వు అఖిల వేత్తవు, న క్వాపి తే సంగవార్తా = కాని నీకు సంగము అను మాట ఎప్పుడు లేదు, తత్ = అందువలన, భగవత్ + శబ్దముఖ్య + ఆశ్రయః అసి= భగవంతుడు అనుశబ్దమునకు నువ్వు ముఖ్యమైన ఆశ్రయము కలవాడివి.

**తాత్పర్యము:** గురువాయూర్ దేవాలయము నివాసముగా కలిగినవాడా! మురాసురుని చంపినవాడా! నీ ఐశ్వర్యము ఈశ్వరులైన శంకరుడు మొదలైన వారిని నియమించునది. నీ పరాక్రమము అశేష తేజోమూర్తులయిన శంకరాదుల తేజస్సును హరించ గల సామర్థ్యము కలిగినది. అంతట వ్యాపించు నీ కీర్తి స్వచ్ఛమై, పాప నాశకమై ముక్తులచే గానము చేయబడునది. ఎప్పుడు లక్ష్మి నీ వక్ష స్థలమును ఆశ్రయించి ఉన్నది. కాని నీకు సంగము అను మాట ఎప్పుడు లేదు. నువ్వు అఖిల వేత్తవు.భగవంతుడు అనుశబ్దమునకు నువ్వు ముఖ్యమైన ఆశ్రయము కలవాడివి. (ఇతర దేవతల విషయములో అది వాడుక అని కవి భావం)

**విశేషాలు:**

**భగవంతుడు:** 1. భగ శబ్దానికి ఐశ్వర్యం,(ఈశ్వరస్య భావం) ధర్మం,(కట్టుబాటు) యశస్సు (పొగడదగిన గుణాలు కలవాడు) శ్రీ కాంతీ వైరాగ్యం, (దేనితో సంబంధం లేనివాడు) జ్ఞానం(అపరిమిత జ్ఞానం) మొదలైన ఆరుగుణములు కలిగినవాడు భగవంతుడు/ భగవానుడు.ఇందులో ధర్మానికి బదులు వీరత్వాన్ని కవి పై శ్లోకంలో చెప్పాడు. 2. సమగ్ర ఐశ్వర్యం కలిగినవాడు. 3. సమస్త భూతముల జ్ఞానం కలిగిన వాడు. 4. ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తెలిసినవాడు.

విమలమపి యశో నిస్పృహైశ్చోపగీతం (వైరాగ్యవంతులచే గానము చేయబడునది) అనునది అద్భుతమైన మాట.

ఒకసారి రమణమహర్షి దగ్గరికి ఒక ధనవంతుడు వచ్చి "అయ్యా! కొత్త వాహనం కొన్నాను. తమరు ఎక్కాలి" అన్నాడు."ఇప్పటికి ఎక్కిన ఈ వాహనం చాలులే "అన్నారట రమణులు. అటువంటి వైరాగ్యవంతులచేత కూడా గానము చేయబడువాడని చక్కని పదబంధం.

భగవద్గీతలో శ్రీ కృష్ణుడు అర్జునునితో మాట్లాడుతూ "నాకు ఎవరి మీద ప్రేమ లేదు. ద్వేషం లేదు" అంటాడు. ఇది నిస్సంగము.

**ప్రథమస్కంధము**

**1వ దశకము సమాప్తము.**



# నారాయణీయము

## దశకమ్ 2 – భగవంతుని సౌందర్యము

**2–1 శ్లో.**

**సూర్యస్పర్ధి కిరీట మూర్ధ్వతిలకప్రోద్భాసిఫాలాంతరం**
**కారుణ్యాకులనేత్రమార్ద్ర హసితోల్లాసం సునాసాపుటం ।**
**గండోద్యన్మకరాభకుండలయుగం కంఠోజ్జ్వలత్కౌస్తుభం**
**త్వద్రూపం వనమాల్యహారపటల శ్రీవత్సదీప్రం భజే ॥**

**ప్రతిపదార్థం:** సూర్య= సూర్యకాంతిని (సువతి ప్రేరయతి ప్రాణినః స్వస్వ కర్మసు ప్రాణులను తమ తమ కర్మలయందు ప్రేరేపించువాడు. సూర్యుడు), స్పర్ధి = పోటీ పడు (స్పర్ధా అస్తి అస్య పోటీ పడు), కిరీటమ్ = కిరీటము కలవాడు (కిరతి కీర్యతే అనేన దీప్తిం దీప్తిర్వా కాంతిని వెదజల్లునది. కిరీటము), ఊర్ధ్వ = పైకి (ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్) పైకి, తిలక = తిలకముతో (తిలవత్ తిలపుష్పవత్ కాయతి నువ్వుపువ్వువలె ప్రకాశించునది. తిలకము), ప్ర + ఉద్భాసి ఫాలాంతరం = ప్రకాశించు నుదుటి భాగము కలవాడు, కారుణ్య= దయతో, ఆకుల = నిండిన (ఆకులం ఆసమంతాత్ పూర్ణమ్ నిండియున్నది కనుక ఆకులము), నేత్రమ్ = కన్నులు కలవాడు, ఆర్ద్ర= తడిసిన (అర్దతి సించతి తస్య భావః తడిసినది), హసిత= వికసించిన (హసితః వికసితః కృత హాసః) వికసించినది, ఉల్లాసం = ప్రకాశించు ముఖము కలవాడు (చిరునవ్వు కలవాడని భావం) (ఉల్లసతి ప్రకాశతే ప్రకాశము), సునాసాపుటం = (నాసతే శబ్దాయతే శబ్దమును చేయునది. ముక్కు) చక్కని ముక్కుకలవాడు, గండ = చెక్కిళ్ళపై (గండః వదనైకదేశఃచెంప), ఉద్యత్ = ఉదయించుచున్న, మకర = మొసలి గుర్తుతో ఉన్న (మకం విషం కిరతి విషమును వెదజల్లునది. మొసలి), ఆభ = వెలుగు, కుండలయుగం = కుండలములు కలవాడు (మకరకుండలముల కాంతితో ప్రకాశించు చెక్కిళ్ళు కలవాడు), కంఠ + ఉజ్జ్వలత్ + కౌస్తుభం = కంఠమునందు ఉజ్వలమైన కౌస్తుభమణి కలవాడు (ఇలా ఉన్న), వనమాల్య= వనమాలను, హారపటల = రత్నహారములు, శ్రీవత్సదీప్రం= శ్రీ

వత్స చిహ్నము కలిగినవాడు(దీప్తం శీలం అస్య ప్రకాశించు స్వభావం కలవి), త్వత్ + రూపం = ఇలా ఉన్న నీ రూపము, భజే= సేవిస్తాను.

**తాత్పర్యం:** సూర్యకాంతితో పోటీ పడు కిరీటము కలవాడు,(అనగా సూర్య కాంతితో వెలిగే కిరీటము కలవాడు) నిలువు తిలకముతో ప్రకాశించు నుదుటి భాగము కలవాడు, దయతో నిండిన కన్నులు కలవాడు, దయతో తడిసిన వికసించిన ప్రకాశించు చిరునవ్వుకలవాడు, చక్కని ముక్కుకలవాడు, మకరకుండలముల (మొసలి ఆకారములో ఉన్న కుండలములు) కాంతితో ప్రకాశించు చెక్కిళ్ళు కలవాడు, కంఠమునందు ఉజ్వలమైన కౌస్తుభమణి కలవాడు, వనమాలను, రత్నహారములు, శ్రీ వత్స చిహ్నము కలిగినవాడు శ్రీ కృష్ణుడు. ఓ శ్రీ కృష్ణా! ఇలా ఉన్న నీ అందమయిన రూపమును సేవిస్తాను.

**విశేషాలు:**

**శ్రీ వత్స:** విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చను శ్రీ వత్సము అంటారు. శ్రీ+వత్స, శ్రీ యుక్తం వత్సం వక్షః యస్య లక్ష్మి వక్షస్సునందు కలవాడు కనుక విష్ణువును శ్రీ వత్సుడు అంటారు.

**2-2 శ్లో.**
**కేయూరాంగదకంకణోత్తమమహారత్నాంగులీయాంకిత**
**శ్రీమద్బాహుచతుష్కసంగతగదాశంఖారిపంకేరుహామ్ ।**
**కాంచిత్కాంచనకాంచిలాంఛితలసత్పీతాంబరాలంబినీం**
**ఆలంబే విమలాంబుజద్యుతిపదాం మూర్తిం తవార్తిచ్ఛిదం ॥**

**ప్రతిపదార్థం:** కేయూర = భుజకీర్తులు (కే బాహుశిరసి భూషణతాం యాతి బాహువునందు శోభను పొందునది. దండ కడియము), అంగద = అంగదములు (అంగం దాయతి శోభయతి అంగమునకు శోభను చేకూర్చు ఆభరణములు), కంకణ = కంకణములు (కం శుభం కణతి శబ్దం కరోతి ఆభరణము), ఉత్తమ= శ్రేష్ఠమైన (ఉత్తమః శ్రేష్ఠః ఉన్నతః ముఖ్యః సర్వోత్తమమైనది ముఖ్యమైనది), మహారత్న = అమూల్యమైన రత్నములతో పొదిగిన (రమయతి హర్షయతి,

ఆనందయతి హర్షింప చేయునది, ఆనందింప చేయునది. రత్నము), అంగులీయ + అంకిత = ఉంగరములు కలిగియున్న (అంగుళౌ భవమ్ అంగుళియందు వుండునది. ఉంగరము), గదా = దుడ్డువలె నుండు ఒకరకపు ఆయుధము.( గద్యతే పీడ్యతే అనేన దీనితో పీడింపబడుదురు), శంఖ = శంఖము (శామ్యతి అశుభం అస్మాత్ దీని నుండి అశుభము నివారింపబడును. శంఖము), అరి = అరములు గలది, చక్రము, పంకేరుహాం= పద్మము (పంకే రోహతి పంకంలో మొలచునది), శ్రీమత్ = శోభాకరమైన (శ్రీః అస్తి అస్య శోభ కలది), చతుష్క= నాలుగు, బాహు = చేతులు (బాధతే శత్రూన్ శత్రువులను బాధించునది), సంగత= కూర్పబడిన (కలిగియున్న), కాంచిత్ కాంచనకాంచిలాంచిత= బంగారు ఒడ్డాణముతో అలంకరింపబడిన, లసత్= ప్రకాశమానమైన, పీత+అంబర+ఆలంబినీం=పచ్చని వస్త్రమునకు ఆశ్రయము ఇచ్చిన, విమల+అంబుజద్యుతిపదాం= స్వచ్ఛమైన పద్మకాంతులు కలిగి యున్న, తవ = నీయొక్క, ఆర్తిచ్ఛిదం= ఆర్తిని(పీడను) పోగొట్టెడి, మూర్తిం = స్వరూపమును, ఆలంబే= ఆశ్రయించుచున్నాను.

**తాత్పర్యం:** కృష్ణా! భుజకీర్తులు, అంగమునకు శోభను చేకూర్చు ఆభరణములు, (అంగదములు) మోచేతి మీదుగా ధరించే దండ కడియాలు, ముంజేతి కంకణములు, శ్రేష్ఠమైన అమూల్యమైన నవ రత్నములతో పొదిగిన ఉంగరములతో గద, శంఖము చక్రము, పద్మములతో నీ నాలుగు చేతులు ప్రకాశిస్తున్నాయి. బంగారు ఒడ్డాణముతో అలంకరింపబడిన పీతాంబరమును, స్వచ్ఛమైన పద్మ కాంతులు కలిగి యున్న పాదములతో మా యొక్క ఆర్తిని పోగొట్టెడి నీ దివ్య స్వరూపమును ఆశ్రయించుచున్నాను.

**విశేషాలు:** మహారత్నములు నిఘంటువులలో రెండు రకాలుగా చెప్పబడ్డాయి

**పంచ-మహారత్నములు**

1. వజ్రము, 2. మౌక్తికము, 3. మాణిక్యము, 4. నీలము, 5. మరకతము. [రత్నదీపిక 1-5]

**నవ-మహారత్నములు**

1. వజ్రము, 2. ముత్యము, 3. ప్రవాళము, 4. గోమేధికము, 5. ఇంద్రనీలము, 6. వైడూర్యము, 7. పుష్యరాగము, 8. పాచి (మరకతము), 9. మాణిక్యము.

(ఇ.) 1. లక్ష్మి, 2. కౌస్తుభము, 3. పారిజాతకము, 4. సుర, 5. ధన్వంతరి, 6. చంద్రుడు, 7. కామధేనువు, 8. ఐరావతము, 9. రంభాది దేవతలు, 10. ఉచ్చైశ్శ్రవము, 11. విష్ణు ధనుస్సు (శార్ఙ్గము), 12. శంఖము (పాంచజన్యము), 13. అమృతము, 14. విషము [ఇవి సముద్రమథనమున బయల్పడినవి].

**2-3 శ్లో.**

**యత్ త్రైలోక్యమహీయసోఽపి మహితం సమ్మోహనం మోహనాత్**
**కాంతం కాంతినిధానతోఽపి మధురం మాధుర్యధుర్యాదపి ।**
**సౌందర్యోత్తరతోఽపి సుందరతరం త్వద్రూపమాశ్చర్యతోఽ**
**ప్యాశ్చర్యం భువనే న కస్య కుతుకం పుష్ణాతి విష్ణో! విభో! ॥**

**ప్రతిపదార్థం:** విష్ణో! = ఓ విష్ణుమూర్తి! (వేవేష్టి సర్వం జగత్) జగత్తంతా వ్యాపించినవాడా!, విభో= ప్రభూ (విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు),త్వత్ +రూపం =నీ రూపం,యత్ త్రైలోక్య= ఈ మూడు లోకములలో (త్రిలోకే ఏవ త్రైలోక్యమ్ త్రిలోకమే త్రైలోకము), మహీయసః +అపి= గొప్పవాని కంటె (అతిశయేన మహాన్), మహితం = గొప్పది, మోహనాత్= మోహనమైన వస్తువులకన్నా, సమ్మోహనం= సమ్మోహన మైనది(సం అధికం మోహయతి తస్య భావః కర్మ వా),కాంతినిధానతః =కాంతి నిధుల కన్నా (కామ్యతే అసౌ కోరదగినది. శోభ,దీప్తి,కాంతి.),కాంతం =మనోహరమైనది.(కామ్యతే ఇతి),మాధుర్యధుర్యాత్ + అపి= బహు మధురములైన వానికన్నా (మధురస్య భావః మాధుర్యము), మధురం = మధురమైనది, సౌందర్య+ఉత్తరతః +అపి= అధిక చక్కదనములైన వాని కన్న (సుందరస్య భావః సౌందర్యము), సుందరతరం = చక్కనిది, భువనే= ఈ లోకమందు (ప్రకరణ గతముగా మూడులోకములలో అని అర్థం) (భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము), ఆశ్చర్యతః+అపి

+ఆశ్చర్యం= ఆశ్చర్యకరములైన వానికన్న ఆశ్చర్యకరమైనది. ('ఆః' ఇతి విస్మయస్య చర్యా ప్రకటనం అద్భుతమ్ విస్మయము ఆశ్చర్యము అసాధారణము), న కస్య కుతుకం = నీరూపం ఎవరికి కుతూహలాన్ని (అనుభవింపని కోరికయందలి ఆశను కుతుకము అంటారు), పుష్ణాతి= కలిగించదు? ( కలిగిస్తుందని భావం.)

**తాత్పర్యం:** ఓ విష్ణుమూర్తీ! ప్రభూ! నీ రూపం ఈ మూడు లోకములలో గొప్పవానికంటె గొప్పది. మోహనమైన వస్తువులకన్నా సమ్మోహన మైనది. కాంతి నిధుల కన్నా మనోహరమైనది. బహు మధురములైన వానికన్నా మధురమైనది. (శ్రవణమనో నయనామృతమయినది) అధిక చక్కదనములైన వాని కన్న చక్కనిది. ఆశ్చర్యకరములైన వానికన్న ఆశ్చర్యకరమైనది. ఇటువంటి నీరూపం ఎవరికి కుతూహలాన్ని కలిగించదు? ( అందరికి కుతూహలాన్ని కలిగిస్తుందని భావం)

**2-4 శ్లో.**

**తత్ తాదృఙ్మధురాత్మకం, తవ వపుః సంప్రాప్య సంపన్మయీ**
**సా దేవీ పరమోత్సుకా చిరతరం నాస్తే స్వభక్తేష్వపి ।**
**తేనాస్యా బత కష్టమచ్యుత! విభో! త్వద్రూపమానోజ్ఞక-**
**ప్రేమస్థైర్యమయాదచాపలబలాచ్చాపల్యవార్తోదభూత్ ॥**

**ప్రతిపదార్థం:** అచ్యుత= ఓ విష్ణుమూర్తీ! (స్వరూప సామర్థ్యాత్ న చ్యుతః చ్యవతే వా స్వరూప సామర్థ్యం వలన చ్యుతుడు కానివాడు), తత్ తాదృక్ = అటువంటి (పై శ్లోకములో చెప్పిన), మధుర+ఆత్మకం= మాధుర్యముతో కూడుకొన్న (మధు మాధుర్యం రాతి దదాతి మాధుర్యము నిచ్చునది), తవ వపుః = నీయొక్క శరీరమును (చక్కని రూపమును), సంప్రాప్య= ఆశ్రయించి, సంపత్ + మయీ = సంపదతో కూడిన (సమ్యక్ పాద్యతే అర్జ్యతే వర్ధతే తస్య భావః, గుణోత్కర్షః సంపత్తిః), సా దేవీ = ఆ లక్ష్మీదేవి, పరమ+ఉత్సుకా = ఎక్కువ ఉత్సాహం కలిగినదై, చిరతరం = ఎక్కువసేపు, స్వభక్తేషు+అపి = తన భక్తులయందు కూడా, న+ఆస్తే = ఎక్కువ సేపు నిలబడదు, తేన = అందువల్ల, అస్యాః = ఈమెకు, బత= అయ్యో!, విభో= ఓ ప్రభూ!, కష్టమ్= కష్టము కలిగినది, త్వత్ రూపమానోజ్ఞక = నీ రూప మనోజ్ఞతలయందు, ప్రేమస్థైర్యమయాత్= ప్రేమ బలం ఏర్పడుటచే, చాపలబలాత్+చ = ఆ చాపల్య

బలం వలన, చాపల్యవార్తోదభూత్ = లక్ష్మికి చంచల అను అప కీర్తి వచ్చింది.

**తాత్పర్యం:** ఓ విష్ణుమూర్తీ! అటువంటి విధంగా (పై శ్లోకములో చెప్పిన) మాధుర్యముతో కూడుకొన్న నీయొక్క శరీరమును (చక్కని రూపమును) ఆశ్రయించి, సంపదతో కూడిన ఆ లక్ష్మీదేవి ఎక్కువ ఉత్సాహం కలిగినదై ఎక్కువసేపు తన భక్తుల సమీపములో నిలబడదు. అయ్యో! అందువల్ల లక్ష్మికి కష్టము కలిగినది. నీ రూప మనోజ్ఞతలయందు ప్రేమ స్థిరత్వము ఏర్పడుటచే ఆ చాపల్యత వలన లక్ష్మికి చంచల అను అప కీర్తి వచ్చింది. (గుణమే దోష కారకమయినదని భావం)

**విశేషాలు:** దీపం లేకుండా కాంతి ఉండదు. స్వామి లేకుండా లక్ష్మి ఉండదు. హరిని పట్టుకొన్నవాడి దగ్గర సిరి ఉంటుంది ''హరీ'' అని గజేంద్రుడు పిలిస్తే హరితో పాటు సిరి కూడా వస్తుండని కవి భావం.

**2-5 శ్లో.**

**లక్ష్మీస్తావక రామణీయకహృతైవేయం పరేష్వస్థిరే-**
**త్యస్మిన్నన్యదపి ప్రమాణమధునా వక్ష్యామి లక్ష్మీపతే! ।**
**యే త్వద్ధ్యానగుణానుకీర్తనరసాసక్తా హి భక్తా జనాః**
**తేష్వేషా వసతి స్థిరైవ దయితప్రస్తావదత్తాదరా ॥**

**ప్రతిపదార్థం:** లక్ష్మీః = లక్ష్మీదేవి, తావక = నీయొక్క, రామణీయక= సుందర రూపానికి, హృతా+ఏవ+ఇయం = వశురాలై, పరేషు = ఇతరులయందు, అస్థిరా= అస్థిరురాలు అయినది( అనగా స్థిరముగా లక్ష్మి ఉండదని భావం), లక్ష్మీపతే!= ఓ విష్ణు మూర్తీ!, ఇతి +అస్మిన్ += ఈ విషయములో, అన్యత్ + ప్రమాణమ్ అపి = మరొక ప్రమాణం కూడా(ప్రమీయతే యథార్థజ్ఞానం లభ్యతే అనేన దీనితో యథార్థజ్ఞానము పొందబడును), అధునా= ఇప్పుడు, వక్ష్యామి = చెప్పబోవు చున్నాను, త్వత్ +ధ్యాన= నీ ధ్యానము, గుణ+అనుకీర్తనరసాసక్తాః = గుణ కీర్తన రసమునందు ఆసక్తులయిన, యే భక్తా జనాః హి= ఏ భక్త జనులుఉంటారో, తేషు+ఏషా = వారియందు ఈమె, దయితప్రస్తావదత్త+ఆదరా= భర్త ప్రస్తావనలను

విని ఆదరముతో (దయిత=దయతే రక్షణాదికం కరోతి రక్షించువాడు. భర్త.), స్థిరా+ఇవ= స్థిరురాలిగా, వసతి= ఉన్నది.

**తాత్పర్యము:** లక్ష్మీదేవి నీయొక్క సుందర రూపానికి వశురాలై ఇతరులయందు అస్థిరురాలు అయినది. (అనగా స్థిరముగా లక్ష్మి ఉండదని భావం) ఓ విష్ణు మూర్తీ! ఈ విషయములో మరొక ప్రమాణం కూడా ఇప్పుడు చెప్పబోవుచున్నాను. నీ ధ్యానము గుణ కీర్తన రసమునందు ఆసక్తులయిన ఏ భక్త జనులు ఉంటారో, వారియందు ఈమె భర్త ప్రస్తావనలను విని ఆదరముతో అక్కడ స్థిరురాలిగా ఉన్నది. (అనగా విష్ణు సంకీర్తన జరిగిన చోట లక్ష్మీదేవి నివాసము ఉంటుందని భావం) అందుకే ఆమెకు చంచల అని పేరు వచ్చింది.

**2-6 శ్లో.**

**ఏవంభూతమనోజ్ఞతా నవసుధానిష్యందసందోహనం**
**త్వద్రూపం పరచిద్రసాయనమయం చేతోహరం శృణ్వతామ్ ।**
**సద్యః ప్రేరయతే మతిం మదయతే రోమాంచ యత్యంగకం**
**వ్యాసించత్యపి శీతబాష్పవిసరైరానందమూర్ఛోద్భవైః ॥**

**ప్రతిపదార్థం:** ఏవంభూత = ఈ విధమైన, మనోజ్ఞతా = అందమైన, నవసుధానిష్యంద సందోహనం= కొత్తదైన అమృతం స్రవించునట్టి, త్వత్ +రూపం = నీ రూపము (రూపయతి తస్య భావః కర్మ వా రూపము), పరచిత్ రసాయనమయం = పరబ్రహ్మ రసాయనమై(రసాయనము = రసా రసరక్తాదయః ఈయంతే ప్రాప్యంతే అనేన శరీర ధాతువులను చక్కబరచునది. ఔషధము.), శృణ్వతామ్=నీ చేష్టలను, కథలను వినువారి, చేతోహరం = మనస్సులను హరించుచున్నది, మతిం = బుద్ధిని(మన్యతే అనయా దీనితో తలతురు. బుద్ధి.), సద్యః ప్రేరయతే = వెంటనే ప్రేరేపించుచున్నది, మదయతే = మనస్సుకు మత్తు మందు ఇచ్చినట్లు మైమరపు కలిగిస్తున్నది, అంగకం రోమాంచ యతి = నీరూపం శరీరాంగాలను ఆనందంతో రోమాంచితం చేస్తున్నది, ఆనందమూర్ఛ +ఉద్భవైః= ఆనందం వలన కలిగిన మై మరుపుతో, శీతబాష్పవిసరైః అపి= శీతల బిందువులు కలిగిన కన్నీళ్లతో, వ్యాసించతి= నీ భక్తుల శరీరాలను నీ అందమయిన రూపం తడుపుతున్నది.

**తాత్పర్యం:** ఈ విధమైన అందమైన కొత్తదైన అమృతం స్రవించునట్టి నీ రూపము పరబ్రహ్మానందమయముగా నీ చేష్టలను, కథలను వినువారి మనస్సులను హరించుచున్నది. బుద్ధిని భక్తి వైపు వెంటనే ప్రేరేపించుచున్నది.మనస్సుకు మత్తు మందు ఇచ్చినట్లు మైమరపు కలిగిస్తున్నది. నీరూపం శరీరాంగాలను ఆనందంతో రోమాంచితం చేస్తున్నది. ఆనందం వలన కలిగిన మై మరుపుతో శీతల బిందువులు కలిగిన కన్నీళ్లతో నీ భక్తుల శరీరాలను నీ అందమయిన రూపం తడుపుతున్నది.

**2-7-శ్లో.**

**ఏవంభూతతయా హి భక్త్యభిహితో యోగస్స యోగద్వయాత్**
**కర్మజ్ఞానమయాద్ భృశోత్తమతరో యోగీశ్వరైర్గీయతే! ।**
**సౌందర్యైకరసాత్మకే త్వయి ఖలు ప్రేమ ప్రకర్షాత్మికా**
**భక్తిర్నిశ్శ్రమమేవ విశ్వపురుషైర్లభ్యా రమావల్లభ! ॥**

**ప్రతిపదార్థం:** రమావల్లభ= లక్ష్మీ వల్లభా! (రమయతి ఆనందము నిచ్చునది. లక్ష్మి. వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపువాడు. వల్లభుడు, ప్రియుడు.), ఏవం భూతతయా హి= ఇట్లు స్వభావ కారణంగా, స యోగః భక్తి+అభిహితః = ఆ యోగము భక్తి యోగమని చెప్పబడినది. (అభిహితః కథితః చెప్పబడినది),కర్మజ్ఞానమయాద్ యోగద్వయాత్ =జ్ఞానయోగము,కర్మయోగము రెండింటి కంటెను, భృశ+ఉత్తమతరః =ప్రహ్లాద నారదులు ఆంగీకరించిన భక్తియోగము అత్యుత్తమమైనదని, యోగీశ్వరైః= యోగీశ్వరులచేత, గీయతే= చెప్పబడినది, త్వయి= నీ రూపములోని, సౌందర్య +ఏకరస+ఆత్మకే ఖలు= సౌందర్య రసాత్మకుడవు కనుక, ప్రేమ ప్రకర్షాత్మికా భక్తిః = ప్రేమాతిశయమయిన ఆ భక్తి, నిశ్రమమ్ +ఏవ = శ్రమ పడకుండా సులభంగా, విశ్వపురుషైః = అందరికి, లభ్యా = లభిస్తున్నది.

**తాత్పర్యము:** లక్ష్మీ వల్లభా! ఇట్లు స్వభావ కారణంగా ఆ మార్గము భక్తి యోగమని తెలియబడుచున్నది. జ్ఞానయోగము, కర్మయోగము రెండింటికంటెను ప్రహ్లాద నారదులు ఆంగీకరించిన భక్తియోగము అత్యుత్తమమైనదని యోగీశ్వరులచేత

చెప్పబడినది. నువ్వు సౌందర్యరసాత్మకుడవు కనుక ప్రేమాతిశయమయిన ఆ భక్తి శ్రమ పడకుండా సులభంగా అందరికి లభిస్తున్నది.

**విశేషాలు:**

**యోగం**: యోగక్షేమాలలో యోగానికి అర్థం 'అలబ్ధస్య లాభః' అని చెప్పారు భాష్యకారులు. మధ్యలో కొత్తగా వచ్చి చేరినదేదో అది యోగం. ఉపాయమని మరియొక అర్థం. సాధనమని ఇంకొక అర్థం. కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం అనేవన్నీ ఇలాంటివే. అవి సాధకుడు ఆశించిన ఆయా ఫలితాలను అతనికి అందజేసే సాధనాలే. పతంజలి యోగశబ్దానికి మరొక అర్థం సెలవిచ్చారు. 'యోగః చిత్తవృత్తి నిరోధః' యోగమంటే మనసులో కలిగే ఆలోచనల నన్నింటినీ నిరోధించడం. అనగా త్రోసిపుచ్చడం. పోతే వేదాంతులు చెప్పే అర్థం వేరు. ఈశ్వర సాయుజ్యమే యోగమని పేర్కొంటారు వారు. అది కూడా సాధించవలసిందంటారు ద్వైతులు. సిద్ధమైన దాన్నే గుర్తించటమంటారు అద్వైతులు. 'జ్ఞానయోగ వ్యవస్థితిః' అని గీతలో ఒక వాక్యమున్నది. అక్కడ యోగమంటే అపరోక్షానుభవమని అర్థం చెప్పారు భగవత్పాదులు. జ్ఞానం పరోక్షమైతే యోగమపరోక్షం. అంటే శాస్త్రజన్య మైన జ్ఞానాన్ని స్వానుభవానికి తెచ్చుకోవటమే యోగమనే మాటకు అర్థం. ఇది చాలా విశిష్టమైన అర్థంగా కనిపిస్తుంది.

**భక్తి:** భక్తి అంటే భగవంతుని భజించటమని అర్థం. భజించటం అంటే అంటి పట్టుకోవటం. విభజించటానికి ఇది వ్యతిరేకం. భగవంతుని నుండి దూరమై పోవటం. విభజన. దగ్గర పడటం భజన. ఈ భజన చేసేవాడు భక్తుడు. అతడు సగుణ భక్తుడు కావచ్చు. నిర్గుణ భక్తుడు కావచ్చు. సగుణమైతే భగవంతుని తనకు అన్యంగా భావిస్తాడు. నిర్గుణమైతే తన స్వరూపంగా భావిస్తాడు. స్వరూపంగా భావించే భక్తిని ఇలా వర్ణించారు భగవత్పాదులు. 'యః పశ్యతి యత్ శృణోతి, స్పృశతి, వా తత్ సర్వం వాసుదేవ ఏవ.' ఏదేది చూస్తామో వింటామో ముట్టుకుంటామో అదంతా సచ్చిద్రూపమైన ఆత్మతత్త్వమేనని 'ఏవం గ్రహావిష్టః.' ఒక దయ్యంలాగా ఆవేశించినవాడు భక్తుడట. ఇదే అనన్యభక్తి.

**2-8 శ్లో.**

**నిష్కామం నియతస్వధర్మచరణం యత్కర్మయోగాభిధం**
**తద్దూరేత్యఫలం యదౌపనిషదజ్ఞానోపలభ్యం పునః ।**
**తత్త్వవ్యక్తతయా సుదుర్గమతరం చిత్తస్య తస్మాద్విభో!**
**త్వత్ ప్రేమాత్మకభక్తిరేవ సతతం స్వాదీయసీ శ్రేయసీ ॥**

**ప్రతిపదార్థం:** విభో!= విశ్వ మందు వ్యాపించిన గురువాయూరు దేవా!, నిష్కామం = కోరికలు లేకుండా, నియత = నియమాలతో (నియతః నియమనమ్, నిశ్చితమైనది. నిత్యకర్మ.), స్వధర్మచరణం= స్వధర్మాన్ని ఆచరించుట అను లక్షణము కల (ధ్రియతే పుణ్యాత్మభిః దీనిని పుణ్యాత్ములు ధరింతురు. శుభకర్మ ధర్మము), యత్+కర్మయోగ+అభిధం= ఏ కర్మయోగమను పేరుతో ఉన్నదో, త త్ దూరేత్యఫలం =అది చాలా ఆలస్యంగ ఫలవంతమగుచున్నది(ఎప్పుడో కాని ఫలింపదు), పునః= మరలా, యత్ +ఔపనిషదజ్ఞాన+ఉపలభ్యం =ఏ ఉపనిషత్తుల ద్వారా లభించు బ్రహ్మ జ్ఞానమున్నదో(ఉపనిషీదతి ప్రాప్నోతి బ్రహ్మాత్మభావః అనయా పరావిద్యా దీనితో బ్రహ్మాత్మభావమును పొందుదురు. బ్రహ్మప్రతిపాదక విద్య, వేదాంతవిద్య ఉపనిషత్తు.), తత్త్వవ్యక్తతయా= అది తత్వవ్యక్త గుణము వలన (తత్త్వ=తనోతి సర్వం ఇదమ్ ప్రపంచమునందంతట వ్యాపించినవాడు. పరబ్రహ్మ. (తత్ తు అవ్యక్తతయా), చిత్తస్య = మనస్సుకు ఆ శుద్ధ సత్వ రూపాన్ని తెలుసుకోవటం, సుదుర్గమతరం=కష్టతరమయిన విషయం, తస్మాత్ = అందువలన, త్వత్ = నీయందు, ప్రేమ+ఆత్మకభక్తిః+ఏవ= ప్రేమాత్మకమయిన భక్తి మార్గమే, సతతం= ఎప్పుడూ, స్వాదీయసీ శ్రేయసీ= మధురమైనది, శ్రేయస్సులను కలిగించేది అవుతుంది.

**తాత్పర్యం:** విశ్వ వ్యాపీ! కోరికలు లేకుండా నియమాలతో స్వధర్మాన్ని ఆచరించుట అను లక్షణము కల ఏ కర్మయోగము ఉన్నదో అది చాలా ఆలస్యంగ ఫలవంతమగుచున్నది(ఎప్పుడో కాని ఫలింపదు). ఏ ఉపనిషత్తుల ద్వారా లభించు బ్రహ్మ జ్ఞానమున్నదో అది తత్వవ్యక్త గుణము వలన మనస్సుకు ఆ శుద్ధ సత్వ రూపాన్ని తెలుసుకోవటం కష్టతరమయిన విషయం.(జ్ఞానయోగము కూడా

కష్టమని భావన) అందువలన నీయందు ప్రేమాత్మకమయిన భక్తి మార్గమే ఎప్పుడూ అన్నిటికంటె మధురమైనది, శ్రేయస్సులను కలిగించేది అవుతుంది.

**2-9 శ్లో.**

**అత్యాయాసకరాణి కర్మపటలాన్యాచర్య నిర్యన్మలా**
**బోధే భక్తిపథేఽథవాఽప్యుచితతామాయాంతి కిం తావతా! ।**
**క్లిష్ట్వా తర్కపథే పరం తవ వపుర్బ్రహ్మాఖ్యమన్యే పునః**
**చిత్తార్ద్రత్వమృతే విచింత్య బహుభిః సిధ్యంతి జన్మాంతరైః ॥**

**ప్రతిపదార్థం:** అతి+ఆయాసకరాణి = ఎంతో శ్రమించి(ఆయస్యతి ప్రయత్నం కరోతి తస్య భావః ప్రయత్నము ఆయాసము దుఃఖము), కర్మపటలాని+ఆచర్య = కర్మ సమూహములను ఆచరించి, నిర్యత్+ మలాః బోధే= రాగము, ద్వేషము మొదలయిన మలములను విడిచిన వారిలో కొందరు మాత్రమే, భక్తిపథే + అథవా + అపి + ఉచితతామ్ + ఆయాంతి = భక్తి జ్ఞాన మార్గాలకు యోగ్యులవుతారు, కిం తావతా!=ఇంతెందుకు?, పునః= మరలా, అన్యే = ఇతరులు, చిత్తార్ద్రత్వమ్ ఋతే= మనస్సులలో ఆర్ద్రతను విడిచి(ద్రవీభావము, విరాగము విడిచి), క్లిష్ట్వా తర్కపథే = తర్కములు చేసి చేసి (తర్కయతి వాదం కరోతి అసౌ వాదము వేదార్థమును తెలియుటకు ఉపయోగించు శాస్త్రము), పరం= శ్రేష్ఠమయిన, బ్రహ్మాఖ్యమ్ = బ్రహ్మమను పేరు కలిగిన, తవ వపుః = నీరూపము, బహుభిః= అనేకరకాలుగా, విచింత్య = వేదాంతార్థ నిశ్చయం తో ఆలోచించి, కొలిచి, జన్మాంతరైః= ఎన్నో జన్మలకు, సిధ్యంతి= సిద్ధులవుతారు.

**తాత్పర్యం:** ఎంతో శ్రమించి కర్మ సమూహములను ఆచరించి,రాగము, ద్వేషము మొదలయిన మలములను విడిచిన వారిలో కొందరు మాత్రమేభక్తి జ్ఞాన మార్గాలకు యోగ్యులవుతారు. ఇంకొందరు మనస్సులలో ఆర్ద్రతను విడిచి(ద్రవీభావము, విరాగము విడిచి)తర్కములు చేసి చేసి శ్రేష్ఠమయిన బ్రహ్మమను పేరు కలిగిన నీరూపము అనేకరకాలుగా వేదాంతార్థ నిశ్చయం తో ఆలోచించి, కొలిచి ఎన్నో జన్మలకు సిద్ధులవుతారు.

**విశేషాలు:** చిత్తశుద్ధి పొంది పూర్తిగా విరక్తులయితే జ్ఞానులు. కొంచెము విరక్తి పొందితే భక్తులు. ఎక్కువ విరక్తి , రక్తి లేకపోతే భక్తి అని తాత్పర్యం.

మలములు అయిదుగాను, ఏడు గాను నిఘంటువులలో ప్రసిద్ధాలు.

1. ఆణవము (పరబ్రహ్మమును గూర్చి అప్పుడప్పుడు కలిగెడి జ్ఞానమును మఱుగుపఱచునది), 2. కార్మికము (గురువు బోధించిన పరమార్థమున బుద్ధి చొరనీయనిది), 3. మాయికము (పరతత్త్వ జ్ఞానవాసన నెప్పుడును కలుగనీయనిది), 4. మాయేయము (సాపకార్యములందు మాత్రమే బుద్ధిని జొన్పునది), 5. తిరోధానము (పరబ్రహ్మ మనిత్యమను బుద్ధిని కల్గించి జనన మరణాది దుఃఖములను కలుగజేయునది).

1. మోహము, 2. మదము, 3. రాగము, 4. విషాదము, 5. తాపము, 6. శోషము, 7. వైచిత్ర్యము.

**2-10 శ్లో.**

**త్వద్భక్తిస్తు కథారసామృతఝరీనిర్మజ్జనేన స్వయం**
**సిద్ధ్యంతీ విమలప్రబోధపదవీమక్లేశతస్తన్వతీ ।**
**సద్యః సిద్ధికరీ జయత్యయి విభో! సైవాస్తు మే త్వత్పద-**
**ప్రేమప్రౌఢిరసార్ద్రతా ద్రుతతరం వాతాలయాధీశ్వర! ॥**

**ప్రతిపదార్థం:** అయి విభో! = ఓ సర్వ వ్యాపకుడా!, వాతాలయ+అధీశ్వర= ఓ గురువాయూరు దేవా!, త్వత్ +భక్తిః +తు= నీ పై కుదిరిన భక్తి యోగమో (పై శ్లోకమున) చెప్పినట్లు కాదు.(విశేష ఫలదాయకమని భావం), కథారస + అమృతఝరీనిర్మజ్జనేన = భక్తిరసము నిండిన నీ కథలు అమృతప్రవాహములై, స్వయంసిద్ధ్యంతీ = తనంతట సిద్ధించి, అక్లేశతః = క్లేశము లేకుండా, విమలప్రబోధపదవీమ్ తన్వతీ= నిర్మల జ్ఞాన పదవిని అందిస్తూ, సద్యః సిద్ధికరీ జయతి= వెంటనే మోక్షము కలిగిస్తుంది, త్వత్పద= నీ చరణారవింద, స ప్రేమప్రౌఢిరస+ఆర్ద్రత= భక్తి రసాత్మక చిత్త ద్రవీ భావం, ద్రుతతరం +ఏవ మే =

వెంటనే నాకు, అస్తు = లభింపచేయవలసినదిగా ప్రార్థన. అయి విభో! = ఓ సర్వ వ్యాపకుడా!

**తాత్పర్యము:** నీ పై కుదిరిన భక్తి యోగము– భక్తిరసము నిండిన నీ కథలనే అమృతప్రవాహములలో మునుకలు వేయిస్తుంది.

తనంతట తానే సిద్ధించి క్లేశము లేకుండా నిర్మల జ్ఞాన పదవిని అందిస్తూ వెంటనే మోక్షము కలిగిస్తుంది.

నీ చరణారవిందములను కొలుచుటచే లభించు భక్తి రసముతో కూడిన చిత్త ద్రవీ భావం( కరిగిన మనస్సును) వెంటనే నాకు లభింపచేయవలసినదిగా ప్రార్థన(నా సేవలో లోపమును గణింపవద్దని విన్నపం)

**2వ దశకము సమాప్తము.**



# దశకమ్ 3 – ఉత్తమభక్తగుణములు

**3–1 శ్లో.**

**పఠంతో నామాని ప్రమదభరసింధౌ నిపతితాః**
**స్మరంతో రూపం తే వరద! కథయంతో గుణకథాః ।**
**చరంతో యే భక్తాస్త్వయి ఖలు రమంతే పరమమూన్**
**అహం ధన్యాన్ మన్యే సమధిగతసర్వాభిలషితాన్ ॥**

**ప్రతిపదార్థం:** వరద! = అనుగ్రహం కలిగినవాడా!. వరాలను ఇచ్చేవాడా!, ప్రమద భరసింధౌ= ఆనందసాగరములో(ప్రకృష్టః మదః హర్షో వా యస్య సంతోషము.), నిపతితాః= మునిగి, తే నామాని= ఎప్పుడు నీ నామములను(నామయతి నామ్యతే అనేన వా చెప్పుట), పఠంతః= జపిస్తూ, తే రూపం = నీ రూపమునే(రూపయతే కీర్త్యతే అసౌ కీర్తించబడునది.), స్మరంతః= స్మరిస్తూ, తే గుణకథాః= నీ గుణ కథలను, కథయంతః= తమలో తాము చెప్పుకొంటూ, రమంతే = అనందం పొందుతూ, యే భక్తాః= ఏ భక్తులు, చరన్తః= చరిస్తుంటారో, త్వయి = నీయందు, సమధిగతసర్వాభిలషితాన్= పొందబడిన అన్ని కోరికలు గల వారు, పరమ్ + అమూన్= ఇటువంటి శ్రేష్ఠులైన భక్తులను, అహం = నేను, ధన్యాన్ = ధన్యులుగా, మన్యే = తలుస్తాను, ఖలు= కదా.

**తాత్పర్యం:** ఓ వరాలను ఇచ్చేవాడా ! దేవా! ఆనందసాగరములో మునిగి, ఎప్పుడు నీ నామములను జపిస్తూ నీ రూపమునే స్మరిస్తూ, నీ గుణ కథలను తమలో తాము చెప్పుకొంటూ అనందం పొందుతూ ఏ భక్తులు చరిస్తుంటారో నీయందు పొందబడిన అన్ని కోరికలు గల వారవుతారో ( నీకే హృదయాన్ని అర్పించి అన్ని కోరికలను ఎవరు నెరవేర్చుకొంటారో) అటువంటి శ్రేష్ఠులైన భక్తులను నేను ధన్యులుగా తలుస్తాను.

**3–2 శ్లో.**

**గదక్లిష్టం కష్టం తవ చరణసేవారసభరేఽ**
**ప్యనాసక్తం చిత్తం భవతి బత విష్ణో! కురు దయామ్ ।**

**భవత్పాదాంభోజస్మరణరసికో నామనివహాన్**
**అహం గాయం గాయం కుహచన వివత్స్యామి విజనే ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో = ఓ విష్ణుదేవా!, గదక్లిష్టం కష్టం = శారీరకములైన వాత పిత్త శ్లేష్మాదులచే బాధ పడుతూ (గద్యతే పీడ్యతే అనేన దీనితో పీడింపబడుదురు. రోగము విషము), తవ = నీయొక్క, చరణసేవారసభరే+అపి= పాద సేవచే కలుగు ఆనందాన్నిపొందటానికి కూడా, చిత్తం = మనస్సు, అనాసక్తం = అయిష్టత, భవతి = చూపుచున్నది, బత = అయ్యో, దయామ్ కురు= దయను చూపించు, భవత్ + పాద+అంభోజస్మరణరసికః= నీ పాద పద్మములను స్మరించు రసికుడనై, నామనివహాన్ = నీ అనేక నామాలను కీర్తిస్తూ, అహం గాయం గాయం = నేను నీ పాటలు పాడుకొంటూ (గాయతి తస్య భావః కర్మ వా పాట, గీతము), కుహచన = ఎక్కడో ఏ ప్రదేశములో, విజనే= ఏకాంతములో (విగతః జనః యస్మాత్ జనుడు వెళ్లిపోయిన ప్రదేశము. ఏకాంతము, నిర్జన ప్రదేశము.), వివత్స్యామి= హాయిగా ఉంటాను.

**తాత్పర్యము:** ఓ విష్ణుదేవా! శారీరకములైన వాత పిత్త శ్లేష్మాదులచే బాధ పడుతూ– నీ పాద సేవచే కలుగు ఆనందాన్నిపొందటానికి కూడా నా మనస్సు అయిష్టత చూపుచున్నది. అయ్యో! నాయందు దయను చూపించు.ఆరోగ్యము కలిగించు. నాకు ఎటువంటి రోగము లేకపోతే –నీ పాద పద్మములను స్మరించు రసికుడనై నీ అనేక నామాలను కీర్తిస్తూ నేను నీ పాటలు పాడుకొంటూ ఎక్కడో ఏ ప్రదేశములో ఏకాంతములో హాయిగా ఉంటాను.

**3–3 శ్లో.**
**కృపా తే జాతా చేత్ కిమివ నహి లభ్యం తనుభృతాం**
**మదీయక్లేశౌఘప్రశమనదశా నామ కియతీ ।**
**న కే కే లోకేఽస్మిన్ననిశమయి శోకాభిరహితా**
**భవద్భక్తా ముక్తాః సుఖగతిమసక్తా విదధతే ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ గురువాయూరు దేవ! (సంబోధనమ్ సంబోధించుట),

తనుభృతాం= శరీర ధారులకు (తనుం దేహం బిభర్తి శరీరమును ధరించువాడు. జీవుడు), తే = నీయొక్క, కృపా = దయ, జాతా చేత్ = లభించినచో, కిమివ నహి లభ్యం= లభించనిది ఏమున్నది?, మదీయ= నా యొక్క, క్లేశ+ఓఘప్రశమనదశా నామ= బాధా సమూహాలను తొలగించుట అను విషయం(ఓఘము=ఉచ్యతి సమవైతి సమూహము.), కియతీ = ఎంత? (చాలా స్వల్పాతిస్వల్పమని భావం), అస్మిన్ లోకే= ఈ లోకమందు, అనిశమ్= ఎప్పుడు, శోక+అభిరహితాః = శోకము నుండి తరించి (శోచతి తస్య భావః శోకము.), ముక్తాః = జీవన్ముక్తులై (త్యక్తః, ప్రాప్తమోక్షణ వదలబడినది మోక్షమును పొందినవాడు, అసక్తాః= అనాసక్తులై (న సక్తః, ఆసక్తిరహితః ఆసక్తి లేనివాడు, అనాసక్తుడు.), సుఖగతిమ్ = సుఖ స్వరూప మోక్ష మార్గ విహారము, విదధతే= అనుభవించుచున్నారు, కేకే న= ఇలా ఎంతమంది భక్తులులేరు? ( ఎంతోమంది ఉన్నారని భావం).

**తాత్పర్యము**: ఓ గురువాయూరు దేవ! శరీర ధారులకు నీయొక్క దయ లభించినచో లభించని భాగ్యము ఏమున్నది? నా యొక్క బాధా సమూహాలను తొలగించుట అను విషయం ఎంత? (చాలా స్వల్పాతిస్వల్పమని భావం) నీ దయతో ఈ లోకమందు ఎప్పుడు శోకము నుండి తరించి జీవన్ముక్తులై అనాసక్తులై సుఖ స్వరూప మోక్ష మార్గ విహారము అనుభవించుచు భక్తులుఎంతోమంది ఉన్నారు. (నాకు కూడా అటువంటి దయను ప్రసాదింపుమని విన్నపం)

**3-4 శ్లో.**

**మునిప్రౌఢా రూఢా జగతి ఖలు గూఢాత్మగతయో**
**భవత్పాదాంభోజస్మరణవిరుజో నారదముఖాః ।**
**చరంతీశ! స్వైరం సతతపరినిర్భాతపరచిత్**
**సదానందాద్వైత ప్రసరపరిమగ్నాః కిమపరమ్ ॥**

**ప్రతిపదార్థం**: ఈశ! = ఓ గురువాయూరు దేవా!, మునిప్రౌఢా = మునిశ్రేష్ఠులుగా, రూఢాః= రూఢి కి ఎక్కిన, గూఢాత్మగతయః = గూఢమైన ఆత్మ గతి కలిగిన, నారదముఖాః= నారదుడు మొదలైన వారు, భవత్+పద+అంభోజ = నీ పాదారవిందములను, స్మరణ= స్మరించుటచే, విరుజః= విగతః రుజః =పోయిన

భవ వ్యాధి కలవారై రుజతి పీడితో భవతి అనయా, తస్య భావః కర్మ వా సతత= ఎప్పుడూ, పరినిర్భాత=బాగా ప్రకాశించు, పరచిత్= బ్రహ్మ విద్యా జ్ఞానముతో (పరాచ చిత్ చ), సదానంద+అద్వైత ప్రసరపరిమగ్నాః= బ్రహ్మానంద రస సముద్రములో తేలి, జగతి= ప్రపంచములో, స్వైరం= స్వతంత్రముగా (స్వస్య ఈరం స్వేర స్వాతంత్ర్యేణ ఈర్తే), చరంతి = విహరిస్తుంటారు, ఖలు = కదా, అపరమ్ కిమ్ = ఇంతకంటె కావలసిన భాగ్యము ఏమున్నది?

**తాత్పర్యము**: ఓ గురువాయూరు దేవా ! మునిశ్రేష్ఠులుగా ప్రసిద్ధికి ఎక్కిన , గూఢమైన ఆత్మ గతి కలిగిన నారదుడు మొదలైన మునులు నీ పాదారవిందములను స్మరించుటచే పోయిన భవ వ్యాధి కలవారై (అనగా లోక విషయ బంధములలో పడక) ఎప్పుడూ బాగా ప్రకాశించు బ్రహ్మ విద్యా జ్ఞానముతో బ్రహ్మానంద రస సముద్రములో తేలి ప్రపంచములో స్వతంత్రముగా విహరిస్తుంటారు కదా! ఇంతకంటె కావలసిన భాగ్యము ఏమున్నది?

**విశేషాలు:**

**సదానంద**

**సదానందము** సర్వేశ్వర నీ– పదారవిందముపై భక్తి (అన్నమయ్య)

**3–5 శ్లో.**
**భవద్భక్తిః స్ఫీతా భవతు మమ సైవ ప్రశమయేత్**
**అశేషక్లేశౌఘం న ఖలు హృది సందేహకణికా ।**
**న చేద్వ్యాసస్యోక్తిస్తవ చ వచనం నైగమవచో**
**భవేన్మిథ్యా రథ్యాపురుషవచనప్రాయమఖిలమ్ ॥**

**ప్రతిపదార్థము**: భవత్ +భక్తిః= నీయందు నిండైన భక్తి (భజ్యతే సేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ.), మమ = నాకు, స్ఫీతా భవతు= స్థిరముగా వృద్ధి పొందు గాక ! (స్ఫీతః వర్ధితః స్థూలః విస్తృతః వృద్ధి నొందినది విస్తృతమైనది లావైనది.), సా+ఏవ= అదియే, అశేషక్లేశ +ఓఘం = అనేక కష్ట సమూహములను, ప్రశమయేత్= తొలగిస్తుంది. (ఈ విషయములో), హృది = హృదయములో,

సందేహకణికా = కొంచెము సందేహము కూడా, నఖలు= లేదు కదా!, న చేత్ = అట్లు కాదేని, వ్యాసస్య+ఉక్తిః = విష్ణు స్వరూపుడైన వ్యాసుని మాటలు, తవ చ వచనం= నీ మాటలు, నైగమవచః= వేద వాక్యాలు (నిగమస్య వేదస్య ఇదమ్ వేదమునకు సంబంధించినది నైగమము), అఖిలమ్= సర్వస్వము, మిథ్యా భవేత్ = అసత్యముఅవుతాయి.( మేథతి జానాతి అన్యథా తస్య భావః అసత్యము, మిథ్యా.), రథ్యాపురుషః = బజారులో తిరుగుచూ ఉబుసుపోకకు మాటలాడు వాని (రథయోగ్యా సరణిః మార్గః రథమునకు యోగ్యమైన మార్గము. ప్రశస్తమైన మార్గము), వచనప్రాయమ్= మాటలవలె గాలికి పోతాయి.

**తాత్పర్యము**: నీయందు నిండైన భక్తి నాకు స్థిరముగా ఉండు గాక! అదియే అనేక కష్ట సమూహములను(జాడ్యాలను) తొలగిస్తుంది. ఈ విషయములో నాకు హృదయములో కొంచెము సందేహము కూడా లేదు కదా! అట్లు కాదేని విష్ణు స్వరూపుడైన వ్యాసుని మాటలు, నీ మాటలు, వేద వాక్యాలు సర్వస్వము మిథ్య అవుతాయి. బజారులో తిరుగుచూ ఉబుసుపోకకు మాటలాడు వాని మాటలవలె గాలికి పోతాయి.

**విశేషాలు**: భక్తి తొమ్మిది విధాలని భాగవతం తెలియజేస్తున్నది. అవి : 1. శ్రవణం (హరికథలు, పురాణాదులను వినడం), 2. కీర్తనం, 3. స్మరణం (దైవ నామాన్ని స్మరిస్తుండటం), 4. పాదసేవనం (సద్గురు సేవ), 5. అర్చనం, 6. వందనం, 7. దాస్యం, 8. సఖ్యం, 9. ఆత్మనివేదనం. (శ్రవణం, కీర్తనం, విష్ణోః, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యమాత్మనివేదనం.)

**భక్తి భూమికలు :** 1. మహాత్ముల సేవ, 2. వారి దయాపాత్రత, 3. వారి ధర్మములయందు శ్రద్ధ, 4. హరిగుణశ్రవణము, 5. ప్రేమాంకురోత్పత్తి, 6. స్వరూప ప్రాప్తి, 7. ప్రేమవృద్ధి, 8. పరమానంద స్ఫురణము, 9. భాగవత ధర్మమునందు నిష్ఠ, 10. తనయందాగుణముల ప్రాకట్యము, 11. ప్రేమయొక్క పరాకాష్ఠ. [భక్తిరసాయనము]

**3–6 శ్లో.**

**భవద్భక్తిస్తావత్ ప్రముఖమధురా త్వద్గుణరసాత్**

**కిమప్యారూఢా చేదఖిలపరితాపప్రశమనీ ।**

**పునశ్చాంతే స్వాంతే విమలపరిబోధోదయమిల**

**న్మహానందాద్వైతం దిశతి కిమతః ప్రార్థ్యమపరమ్ ॥**

**ప్రతిపదార్థము**: భవత్ +భక్తిః = నీపై భక్తి, తావత్ = నిశ్చయముగా (తత్ పరిమాణం అస్య ఆ పరిమాణం కలది నిశ్చయము అవధి కొలత ప్రశంస), ప్రముఖ= ప్రముఖమైనది, మధురా= మధురమైనది, కిమపి = ఇంకను, ఆరూఢా చేత్ = ఉప్పొంగిన కొలది( భక్తి పెరిగిన కొలది), త్వత్ +గుణరసాత్= నీ అనంత కల్యాణ గుణ రసాన్ని ఆస్వాదించిన కొద్దీ, అఖిలపరితాప= అన్నివిధములైన తాపములు(బాధలు), ప్రశమనీ= నశిస్తాయి, పునః చ = మరలా, అంతే= చివరకు, స్వాంతే = తన మనస్సులో(స్వస్య అంతః అంతఃకరణమ్ తన మనస్సు), విమలపరిబోధ+ఉదయ మిలత్ =పరిశుద్ధమయిన అంతటాఉన్న నీ బ్రహ్మాకారము స్ఫురించి (బుధ్యతే జ్ఞాయతే జ్ఞానము), మహానంద +అద్వైతం = మహానంద అద్వైత స్థితి వైపు(మహాన్ ఆనందః అత్ర గొప్ప ఆనందము.) (ద్విధా ఇతం భేదం గతం ద్వితం తస్య భావః ద్వైతం, తన్నాస్తి యత్ర అద్వైతము), దిశతి= నడిపిస్తుంది, అతః= ఇంతకంటె, అపరమ్= వేరే, ప్రార్థ్యమ్ = కోరుకొనదగినది, కిమ్ = ఏమున్నది?

**తాత్పర్యము**: కృష్ణా! నీపై భక్తి ప్రముఖమైనది ,మధురమైనది . ఆ భక్తి పెరిగిన కొలది నీ అనంత కల్యాణ గుణ రసాన్ని ఆస్వాదిస్తూ అన్నివిధములైన తాపములను నశింప చేస్తుంది. చివరకు మనస్సులో పరిశుద్ధమయిన బ్రహ్మాకారమును స్ఫురింపచేసి , మహానంద అద్వైత స్థితి వైపు భక్తి నడిపిస్తుంది. ఇంతకంటె వేరే కోరుకొనదగినది ఏమున్నది? (ఆతరువాత కోరుకోవలసినది కూడా ఏమి ఉండదని భావం)

**విశేషాలు:**

**అద్వైతము :** ద్వయం కానిది. ద్వైతం కానిది. అంటే రెండన్నదంటూ లేనిది. ఆత్మచైతన్యం. దానికంటే అదనంగా జీవుడు లేడు-జగత్తు లేదు. ఈశ్వరుడులేడు.

**ఆనంద :** నందమన్నా ఆనందమన్నా సుఖమని అర్థం. ఇది విషయ జన్యం కాదు. విషయి రూపమైన ఆత్మజన్యం. తైత్తిరీయంలో ఆనందాన్ని గూర్చిన మీమాంస ఎక్కువగా వస్తుంది. మనుష్యుడి స్థాయినుంచి పరబ్రహ్మ స్థాయివరకు ఎన్నో ఆనంద భూమికలు వర్ణించారు. అన్నింటికీ కడపటిది బ్రహ్మానందమే. పంచ కోశాలలో ఆనందమయకోశ మొకటున్నది. దానిలో కలిగే ఆనందం కాదిది. 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అనే మాటను బట్టి బ్రహ్మానందమే అసలైన ఆనందం అని పరిష్కారం. ఇదే మహానందం.

**3-7 శ్లో.**

**విధూయ క్లేశాన్ మే కురు చరణయుగ్మం ధృతరసం**
**భవత్ క్షేత్రప్రాప్తౌ కరమపి చ తే పూజనవిధౌ ।**
**భవన్మూర్త్యాలోకే నయనమథ తే పాదతులసీ-**
**పరిఘ్రాణే ఘ్రాణం శ్రవణమపి తే చారుచరితే ॥**

**ప్రతిపదార్థము**: మే = నాకు, క్లేశాన్= కష్టాలను (క్లిష్ణాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము యోగ శాస్త్రంలో చెప్పబడిన అవిద్యాది పంచక్లేశములు), విధూయ = తొలగించు, ధృతరసం= నీ భక్తి రసమును ధరించి, భవత్ క్షేత్రప్రాప్తౌ = నీ క్షేత్రములందు( దేవాలయములందు) ప్రాప్తించు భాగ్యమును(క్షియంతి నివసంతి అత్ర ఆత్మ ఇక్కడ నివసించును కనుక క్షేత్రము), చరణయుగ్మం= నా పాద ద్వయముకు (చరతి అనేన దీనిచే నడుచుదురు. కాలు), కురు =కల్పించుము, తే పూజనవిధౌ= నీ పూజ చేయు విధిని (పూజయతి తస్య భావః కర్మ వా పూజించుట పూజ.), కరమపి చ= నా చేతులకు కల్పించుము (కరోతి అనేన కార్యాణి దీనితో పనులు చేయుదురు. చెయ్యి), అథ= ఇంకను, భవత్ +మూర్తి+ఆలోకే = నీ అందమయిన రూపమును చూసే అదృష్టాన్ని, నయనమ్ = నా కన్నులకు

కల్పించుము (నీయతే దృష్టి విషయః అనేన దీనితో చూచుదురు. కన్ను.), తే పాదతులసీ= నీ పాదాలను కడిగిన తులసిని(తులాం స్వసమానత్వం అస్యతి తన సమానత్వము అంగీకరించనిది. బహుగుణములు కల తులసి చెట్టు.), పరిఘ్రాణే = ఆఘ్రాణించు భాగ్యమును, ఘ్రాణం= నా నాసికకు కల్పించుము. (జిఘ్ర్యతే అనయా దీనితో వాసన (చూతురు) చూడబడును. ముక్కు.), అపి= ఇంకను, తే చారుచరితే= నీ అందమైన కథలను వినే అదృష్టాన్ని, శ్రవణమ్= చెవులకు కల్పించుము(శృణోతి అనేన దీనితో విందురు. చెవి.).

**తాత్పర్యము**: గురువాయూర్ దేవా! నాకు కష్టాలను తొలగించు. నీ భక్తి రసమును ధరించి నీ క్షేత్రములను (దేవాలయములను) సందర్శించు భాగ్యమును నా పాద ద్వయముకు కల్పించుము. నీ పూజ చేయు విధిని నా చేతులకు కల్పించుము. నీ అందమయిన రూపమును చూసే అదృష్టాన్ని నా కన్నులకు కల్పించుము. నీ పాదాలను కడిగిన తులసిని ఆఘ్రాణించు భాగ్యమును నా నాసికకు కల్పించుము. నీ అందమైన కథలను వినే అదృష్టాన్ని చెవులకు కల్పించుము.

**విశేషాలు:**

**క్లేశములు:** 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభిమానము. “అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశాః పంచ క్లేశాః” [పాతంజలయోగసూత్రములు 2-3]

**తులసి:** విష్ణువు ఇష్టపడే పవిత్రమైన పత్రి. ఇందులో ఉండే అనేక ఓషధీ లక్షణాలు వెనుకటి తరాలు తులసి మొక్కను ప్రతి పెరటిలోనూ పెంచేలా చేశాయి.

**3-8 శ్లో.**
**ప్రభూతాధివ్యాధిప్రసభచలితే మామకహృది**
**త్వదీయం తద్రూపం పరమరసచిద్రూపముదియాత్ ।**
**ఉదంచద్రోమాంచో గలితబహుహర్షాశ్రునివహో**
**యథా విస్మర్యాసం దురుపశమపీడాపరిభవాన్ ॥**

**ప్రతిపదార్థం**: ప్రభూత= అతిశయేన భవతి ప్రచురమ్ చాలా ఎక్కువ, ఆధి = (ఆధీయతే దైన్యం అనేన) దైన్యమును, మనోవైకల్యమును కల్గించునది, వ్యాధి= (వివిధాః ఆధయః అస్మాత్) దీనితో వివిధములైన బాధలు రోగములు వచ్చును. వ్యాధి, రోగము.), ప్రసభ చలితే = బెదరి చెదరి పోవుచున్న (ప్రగతా సభా సభాధికారః యస్మాత్ బలాత్కారము), పరమరసచిద్రూపమ్= పరమ సుఖదాయకమైన, త్వదీయం తత్ రూపం = ఆ నీ రూపము, మామకహృది= నా హృదయమందు, ఉదియాత్= ఉదయించుగాక!, రోమాంచో ఉదంచత్ = అందువలనశరీరముపులకరించిరోమాంచితుడనై,గలితబహుహర్షఅశ్రునివహః= కన్నులలో ఆనంద బాష్పములు స్రవిస్తుండగా, దురుపశమపీడాపరిభవాన్= ఈ అసాధ్యమైన వ్యాధి వలన కలిగిన బాధను(ఉపశమము అనగా వ్యాధి నివారణము, దురుపశమమనగా నివారించుటకు వీలులేనిది), యథా= ఎట్లు(యత్ప్రకారకః యేన ప్రకారేణ ఏ విధంగా?), విస్మర్యాసం= మరచిపోయెదను గాక!.

**తాత్పర్యం**: చాలా ఎక్కువగా మనోవైకల్యమును కల్గిస్తున్న మానసిక శారీరక అనారోగ్యాలకు బెదరి చెదరి పోవుచున్న నా హృదయములో పరమ సుఖదాయకమైన నీ రూపము ఉదయించుగాక! అందువలన శరీరము పులకరించి రోమాంచితుడనై కన్నులలో ఆనంద బాష్పములు స్రవిస్తుండగా ఈ అసాధ్యమైన వ్యాధి వలన కలిగిన బాధను మరచిపోయెదను గాక!

**3-9 శ్లో.**

**మరుద్గేహాధీశ! త్వయి ఖలు పరాంచోఽపి సుఖినో**
**భవత్ స్నేహీ సోఽహం సుబహు పరితప్యే చ కిమిదమ్ ।**
**అకీర్తిస్తే మాఽభూద్వరద! గదభారం ప్రశమయన్**
**భవద్భక్తోత్తంసం ఝటితి కురు మాం కంసదమన! ॥**

**ప్రతిపదార్థం**: మరుత్+గేహ+అధీశ! = ఓ గురువాయు పుర నాయకా! కృష్ణా!, త్వయి = నీయందు, పరాంచః+అపి = విముఖులైన వారు,వ్యతిరేకించేవారు, సుఖినఃభవత్ ఖలు = సుఖంగా ఉన్నారు కదా!, భవత్ స్నేహీ= నీయందు ప్రీతిగా స్నేహంగా ఉన్న స్నిహ్యతి తస్య భావః కర్మ వా స్నేహము, సః +అహం= అటువంటి

నేను, సుబహు= బాగా, పరితప్యే చ = బాధపడుచున్నాను, కిమిదమ్= ఇదేమిటి?, వరద! = ఓ వరాల నిచ్చే దేవా!, తే = నీకు, అకీర్తిః= అపకీర్తి (కీర్యతే ప్రశస్యతే కీర్తి ప్రశంస పుణ్యము.దీనికి వ్యతిరేకమైనది అకీర్తి), మా+అభూత్= వద్దు, కంసదమన! = ఓ కంసుని సంహరించినవాడా!, గదభారం ప్రశమయన్= నా వ్యాధి బాధలను తొలగించి, భవత్ + భక్త +ఉత్తంసం= నీ భక్తశ్రేష్ఠునిగా, ఝటితి = త్వరగా తొందరగా, మాం కురు= నన్నుకావింపుము( స్వీకరించుము).

**తాత్పర్యము**: ఓ గురువాయు పుర నాయకా! కృష్ణా నీయందు విముఖులైన వారు, వ్యతిరేకించేవారు సుఖంగా ఉన్నారు కదా! నీయందు ప్రీతిగా స్నేహంగా ఉన్న నేను బాగా బాధపడుచున్నాను. ఇదేమిటి? ఓ వరాల నిచ్చే దేవా! నీకు భక్తుని వ్యాధిని పోగొట్టలేదనే అపకీర్తి వద్దు. ఓ కంసుని సంహరించినవాడా! నా వ్యాధి బాధలను తొలగించి, ధర్మసాధనమయిన ఆరోగ్యవంతమయిన శరీరాన్ని ఇచ్చి నీ భక్త శ్రేష్ఠునిగా వెంటనే నన్ను స్వీకరించుము.

**3–10 శ్లో.**

**కిముక్తైర్భూయోభిస్తవ హి కరుణా యావదుదియాత్**
**అహం తావద్దేవ! ప్రహితవివిధార్తప్రలపితః ।**
**పురః క్లుప్తే పాదే వరద! తవ నేష్యామి దివసాన్**
**యథాశక్తి వ్యక్తం నతినుతినిషేవా విరచయన్ ॥**

**ప్రతిపదార్థం**: దేవ= ఓ దైవమా, వరద= వరాలను ఇచ్చే దేవ!, భూయోభిః = మరలమరలా, ఉక్తైః = చెప్పుట, కిమ్= ఎందుకు?, తవ హి కరుణా= నాపై నీ కరుణ, యావత్ +ఉదియాత్ = ఎంతవరకు పుడుతుందో, తావత్= అంతవరకు, వివిధ = అనేకమైన, ఆర్త=దుఃఖ (ఆర్తః పీడితః దుఃఖితః దుఃఖితుడు.), ప్రలపితః = ప్రలాపములను (ప్రలపితః జల్పితః అసంబద్ధం జల్పితమ్ ఏడవబడినది.), ప్రహిత= విడిచిపెట్టి (ప్రహితః ప్రేషితః క్షిప్తః నియుక్తః విడిచిపెట్టబడినది), అహం = నేను, క్లుప్తే = (క్లుప్తః కల్పితః రచితః నియతః) రచింపబడినది, తవ పాదే పురః = నీ పాదముల ముందు, యథాశక్తి = నా చేతనయినంతవరకు (శక్తేః అనురూప్యమ్, శక్తి మనతిక్రమ్య శక్తిననుసరించి), నతినుతినిషేవా= నమస్కారము, పొగడ్త

మొదలయిన నీ సేవలను (నతి = నమతి తస్య భావః, నమనమ్ వంగుట నమస్కారము.) (నుతి =నౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తుతి.), వ్యక్తం= వ్యక్తముచేస్తూ , విరచయన్= రచిస్తూ (ప్రశంసిస్తూ), దివసాన్= రోజులను, నేష్యామి= గడిపెదను.

**తాత్పర్యము**: ఓ కృష్ణ దైవమా! వరాలను ఇచ్చే దేవా! మరలమరలా చెప్పుట ఎందుకు? (వేయి మాటలెందుకు?) నాపై నీ కరుణ వచ్చేవరకు నేను దుఃఖమయ ప్రలాపములను విడిచిపెట్టి- అందంగా రచింపబడిన నీ పాదముల ముందు నమస్కారము, పొగడ్త మొదలయిన సేవలను చేస్తూ నా చేతనయినంతవరకు నీ ఘనతను రచిస్తూ (ప్రశంసిస్తూ) రోజులను గడిపెదను. ఆ అవకాశమును అనుగ్రహించు.

**3వ దశకము సమాప్తము.**



# ద్వితీయ స్కంధము

## దశకమ్ 4 – యోగాభ్యాసము , యోగసిద్ధి

**4-1 శ్లో.**

**కల్యతాం మమకురుష్వ తావతీం**
**కల్యతే భవదుపాసనం యయా ।**
**స్పష్టమష్టవిధయోగచర్యయా**
**పుష్టయాశు తవ తుష్టి మాప్నుయాం ॥**

**ప్రతిపదార్థం**: భవత్ +ఉపాసనం=నిన్ను ఆరాధించుటకు తగిన (ఉపాస్యంతే పూజ్యంతే దేవతాదయః అనయా దేవతలను పూజించుట.),అష్టవిధయోగచర్యయా = అష్టాంగ యోగ సాధన చేయుటకు అనుకూలమైన, పుష్టయాశు = శీఘ్రముగా బల సంవర్ధకముగా పోషించు (కృత పోషణం పుషితమ్ పోషింపబడినది), కల్యతాం = ఆరోగ్యము, మమ= నాకు, కురుష్వ = దయతో ఇవ్వవలసినది, యయా= దేనిచేత (ఆరోగ్యభాగ్యం చేత), స్పష్టమ్= ఖచ్చితంగా, తవ తుష్టిమ్ =నీ తృప్తిని అనగా నీ దయను (తుష్యతి తస్య భావః సంతోషము తృప్తి.), ఆప్నుయాం= నేను సాధిస్తాను.

**తాత్పర్యము**: నిన్ను ఆరాధించుటకు తగిన అష్టాంగ యోగ సాధన చేయుటకు అనుకూలమైన శరీరమును పుష్టిగా పోషించు ఆరోగ్యము నాకు దయతో ఇవ్వవలసినది.ఆరోగ్యభాగ్యం చేత ఖచ్చితంగా నీదయను నేను సాధిస్తాను.

**విశేషాలు:**

**ఉపాసన**: ఉప దగ్గరగా, ఆసన కూర్చోవటం ఏ దేవతను మనసా స్మరిస్తామో దాని మూర్తికి మనసు దగ్గర పడితే దాని కుపాసన అని పేరు. ఇది సగుణం, నిర్గుణమని రెండు విధాలు. మొదటిది ధ్యానమార్గమైతే రెండవది జ్ఞానమార్గం. వాయువు, అగ్ని మొదలైన వాటిలో పరమాత్మను చూడటం, వేదంలోనో, పురాణాది గ్రంథాలలోనో ప్రస్తావనకు వచ్చే కొందరు దేవతలను వారి వారి గుణాలను, లక్షణాలను

మనస్సులో ఉంచుకుని ఆరాధించడం కూడా సగుణో పాసన. గుణాలకు అతీతుడైన బ్రహ్మను/ పరమాత్మను ఉపాసించడం నిర్గుణోపాసన. ఉపాసన చేసేవారు ఉపాసకులు.

**అష్టాంగ యోగం:** ఎనిమిది అంగములతో, భూమికలతో కూడిన సమాధి యోగం. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులు. ఈ ఎనిమిదింటికీ అష్టాంగములని పేరు. ఇందులో మొదటి ఐదు బహిరంగ యోగం. మిగతా మూడు అంతరంగ యోగమని పతంజలి చెప్పినమాట.

ఈ దశకములో ని ప్రతి శ్లోకము రథోద్ధతము (పరాంతికము) వృత్తములో ఉంది. ర , న , ర , వ(లగ) గణములుండును.

**4-2 శ్లో.**
**బ్రహ్మచర్యదృఢతాదిభిర్యమైః**
**ఆప్లవాదినియమైశ్చపావితాః ।**
**కుర్మహే దృఢమమీ సుఖాసనం**
**పంకజాద్యమపి వా భవత్పరాః ॥**

**ప్రతిపదార్థం**: బ్రహ్మచర్య= బ్రహ్మచర్యము (బ్రహ్మణే వేదజ్ఞానాయ చర్యతేవేద జ్ఞానము కొరకు నియమాలను పాటించుట), దృఢత+ఆదిభిః= దృఢత్వము మొదలైన యమములతో (యమము= యచ్ఛ నియచ్ఛతి ఇంద్రియాణి తస్య భావః కర్మ వా ఇంద్రియనిగ్రహము.), ఆప్లవ+అదినియమైః = స్నానము, సంధ్యా వందనము మొదలైన నియమాలతో(ఆప్లవ=ఆసమంతాత్ ప్లుష్ణాతి అసౌ అంతటా తడుపునది), పావితాః= పరిశుద్ధులమై, భవత్పరాః = నీయందు భక్తిని కలిగి, అమీ= ఈ, పంకజ+ఆద్యమ్ +అపి= పద్మ, స్వస్తిక మొదలైన ఆసనములందు, సుఖ+ఆసనం = ఏది సుఖకరమయినదో దానియందు, దృఢమ్= దృఢముగా ఈ శరీరాన్ని, కుర్మహే= ఉంచుతాము.

**తాత్పర్యము**: బ్రహ్మచర్యము దృఢత్వము మొదలైన ఇంద్రియ నిగ్రహ నియమము లతో స్నానము, సంధ్యా వందనము మొదలైన సత్ప్రవర్తనలతో పరిశుద్ధులమై

నీయందు భక్తిని కలిగి పద్మ, స్వస్తిక మొదలైన ఆసనములందు ఏది సుఖకరమయినదో దానియందు దృఢముగా ఈ శరీరాన్ని ఉంచుతాము. (ఆసనాలు వేస్తామని భావం)

**విశేషాలు**:

1. గాయత్రీ బ్రహ్మచర్యం. ఉపనయనం తరువాత ఉప్పులూ కారాలూ లేని తిండి తినడం లాంటి నియమాలను పాటించడం.
2. వైదిక బ్రహ్మచర్యం. వేదాధ్యయనం పూర్తయ్యే వరకు బ్రహ్మచర్యాన్ని పాటించడం.
3. ప్రాజాపత్య బ్రహ్మ చర్యం. ఒక సంవత్సరం మాత్రం నియమాన్ని పాటించడం గానీ, పరస్త్రీ చింతన లేకుండా నియమిత కాలంలో మాత్రమే భార్యతో సంగమించడమనే వ్రతాన్ని పాటించడం గానీ ప్రాజాపత్య బ్రహ్మ చర్యం.
4. బృహత్ బ్రహ్మ చర్యం. గురుకులంలో ఎప్పటికీ ఉండిపోతూ, జీవితాంతం బ్రహ్మచర్యాన్ని పాటించే బ్రహ్మచర్యం. (ఆం. వే. ప.)

**4-3 శ్లో.**

**తారమంతరనుచింత్య సంతతం**
**ప్రాణవాయుమభియమ్య నిర్మలాః ।**
**ఇంద్రియాణి విషయాదథాపహృ**
**త్యాస్మహే భవదుపాసనోన్ముఖాః ॥**

**ప్రతిపదార్థం**: భవత్ + ఉపాసన = నీ పైన ఉపాసన కొరకు, ఉన్ముఖాః=ఉన్ముఖులమై ( ఉత్ ఊర్ధ్వం ముఖం అస్య పైకి ముఖం లేపినవాడు కార్యమునకు పూనుకొన్న వాడు.), తారమ్ = ఓంకారమును (తార్యతే ఉత్తార్యతే భవసాగరాత్ అనేన భవసాగరము నుండి దాటించునది. ప్రణవము, ఓంకారము.), అంతః= హృదయమందు, సంతతం = ఎల్లప్పుడు, అనుచింత్య = తైలధారవలె ధ్యానిస్తూ, ప్రాణవాయుమ్ = ప్రాణ వాయువును, అభియమ్య = బంధించి, నిర్మలాః= పాపములను కాల్చి నిర్మలుడనగుచు, అథ= అటు పిమ్మట, ఇంద్రియాణి =

ఇంద్రియములను, విషయాత్ = వాటి వాటికి సంబంధించిన విషయముల నుంచి, అపహృత్యాస్మహే = మరలించెదము (విషయములనుండి ఇంద్రియములను మరలించుట ప్రత్యాహారము).

**తాత్పర్యము**: నీ పైన ఉపాసన కొరకు సూక్ష్మమయిన మనస్సు నిలుకడకు ఓంకారమును హృదయమందు ఎల్లప్పుడు తైల ధారవలె ధ్యానిస్తూ ప్రాణ వాయువును బంధించి పాపములను కాల్చి నిర్మలుడనగుచు – ప్రత్యాహారము చేసెదము. (ఇంద్రియములను వాటి వాటికి సంబంధించిన విషయముల నుంచి మరలించుట).

**విశేషాలు**: ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్ ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్ (03 సర్గ –28 అధ్యా–11 వశ్లోకం) అను సంస్కృత భాగవత శ్లోకానికి ఈ నారాయణీయ శ్లోకానికి సంబంధం ఉంది. ప్రాణాయామము చేయుట ద్వారా వాత శ్లేష్మాది దోషాలు తొలగిపోతాయి. ధారణ ద్వారా పాపాలు నశిస్తాయి. ధారణ అంటే వాయువుతో సహ మనస్సును స్థిరముగా ఉంచుట. ప్రత్యాహారము ద్వారా విషయ సంబంధమైన దోషాలు తొలగిపోతాయి. ధ్యానము ద్వారా రాగాది దోషాలు దగ్ధమవుతాయి. నిరంతరముగా స్థిరపడిన వృత్తిని ధ్యానము, వృత్తినిరోధానికి సమాధి అని పేరని శ్రీ ధరాచార్యులు ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానించారు.

**ఇంద్రియాలు**: ఇంద్రుడైన జీవుడికి సంబంధించినదేదో అది ఇంద్రియం. అంటే జీవుడీ ప్రపంచాన్ని గ్రహించటంలో తోడ్పడే పరికరం లేదా సాధనం. జ్ఞాన సాధనం. దీనికే ప్రమాణమని నామాంతరం. ఇది రెండు జాతులు. ఒకటి ప్రత్యక్షం. మరొకటి అనుమానం. ప్రత్యక్షం చక్షురాది ఇంద్రియాలు. అనుమానం మనస్సనే అంత రింద్రియం. ప్రత్యక్షంలో మరలా జ్ఞానేంద్రియా లున్నాయి. కర్మేంద్రియాలున్నాయి. చక్షురాదులు జ్ఞానేంద్రియాలు. వాగాదులు కర్మేంద్రియాలు.

**4–4 శ్లో.**
**అస్ఫుటే వపుషి తే ప్రయత్నతో**
**ధారయేమ ధిషణాం ముహుర్ముహుః ।**

**తేన భక్తిరసమంతరార్ద్రతా**
**ముద్వహేమ భవదంఘ్రిచింతకాః ॥**

**ప్రతిపదార్థము**: తే= నీయొక్క, అస్ఫుటే= ధ్యానమందు స్పష్టముగా కనబడక లీలగా కనబడు నీ రూపమందు (న స్ఫుటః న సుబోధః స్పష్టం కానిది సుబోధము గానిది.), ప్రయత్నతః = ప్రయత్న పూర్వకముగా(ప్రకృష్టో యత్నః విశిష్ట ప్రయత్నము), ధిషణాం= బుద్ధిని (ధృష్ణోతి అనయా దీనితో తెలుసుకొనును. బుద్ధి.), ముహుః + ముహుః =మాటి మాటికి, ధారయేమ =ధారణచేసెదము, భవత్ +అంఘ్రిచింతకాః= నీ పాదములను ధ్యానిస్తూ, తేన = ఆ ధ్యానముతో కలిగిన, భక్తిరసమ్= భక్తి రస పానముచే, అంతః ఆర్ద్రతా= అంతరంగములో ఆర్ద్రభావమును (ఆర్ద్ర= అర్దతి సించతి తస్య భావః తడిసినది.), ఉద్వహేమ= పొందుతాము.

**తాత్పర్యము**: ధ్యానమందు స్పష్టముగా కనబడక లీలగా కనబడు నీ రూపమందు ప్రయత్న పూర్వకముగా మాటి మాటికి ధారణ చేసెదము. నీ పాదములను ధ్యానిస్తూ ఆ ధ్యానముతో కలిగిన భక్తి రస పానముచే అంతరంగములో ఆర్ద్రభావమును పొందుతాము.

**4-5 శ్లో.**
**విస్ఫుటావయవ భేదసుందరం**
**త్వద్వపుస్సుచిరశీలనావశాత్ ।**
**అశ్రమం మనసి చింతయామహే**
**ధ్యానయోగనిరతాస్త్వదాశ్రయాః ॥**

**ప్రతిపదార్థం**: విస్ఫుట= బాగా ప్రకాశించిన (స్ఫుట= స్ఫుటతి వికసతి ప్రకాశతే వా వికసించినది), అవయవ భేదసుందరం=వివిధములయిన అవయవ భేదాలతో ఉన్న(అవయౌతి మిశ్రయతి శరీరే శరీరముతో కలిసి యుండునది అవయవము), త్వత్ +వపుః = నీ శారీరక సౌందర్యమును (వప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునదికనుక వపువు. శరీరము.), సుచిరశీలనావశాత్= చాలాకాలము

ధారణాభ్యాసముతో (సుచిర=అత్యంతం చిరమ్ చాలా కాలము చాలకాలపుది.), ధ్యానయోగనిరతాః = ధ్యాన యోగమునందు ఆసక్తి కలిగిన వారమై (ధ్యాయతి తస్య భావఃధ్యానము చేయుట ఆలోచించుట మననం చేయుట.), అశ్రమం= ధ్యాన శ్రమలేకుండుటకు, మనసి = మనస్సునందు, త్వత్ +ఆశ్రయాః= నీ పాదములను ఆశ్రయించిన వారమై, చింతయామహే = ధ్యానము చేసెదము.

**తాత్పర్యము**: బాగా ప్రకాశించిన వివిధములయిన అవయవ భేదాలతో ఉన్న నీ శారీరక సౌందర్యమును నిరంతర ధారణాభ్యాసముతో తలుస్తూ, ధ్యాన యోగము నందు ఆసక్తి కలిగిన వారమై, ధ్యాన శ్రమలేకుండుటకు మనస్సునందు నీ పాదము లను ఆశ్రయించిన వారమై – ధ్యానము చేసెదము

**విశేషాలు**: "మానవా మౌలితో వర్ణ్యా దేవ శ్చరణతః పునః" అని సంప్రదాయము. అందువలననే కృష్ణుని పాదముల నుండి కవి వర్ణిస్తున్నాడు.

**4–6 శ్లో.**

**ధ్యాయతాం సకలమూర్తిమీదృశీం**
**ఉన్మిషన్మధురతాహృతాత్మనాం ।**
**సాంద్రమోదరసరూపమాంతరం**
**బ్రహ్మరూపమయి! తేఽవభాసతే ॥**

**ప్రతిపదార్థం**: అయి! = ఓ శ్రీ కృష్ణా! ఈదృశీం = ఈ విధముగా తే = నీయొక్క సకలమూర్తిమ్ = సంపూర్ణ మూర్తిని ధ్యాయతాం = ధ్యానాభ్యాసము చేయుట వలన ఉన్మిషత్ = వికసించి ఉన్న మధురతా = మాధుర్యమునందు హృత = తీసుకపోబడిన అనగా మనసుకలిగిన (అపహృతః, నీతః, ఊఢఃఅపహరింపబడినది తీసుక పోబడినది మోయబడినది) ఆత్మనాం= మహాయోగులకు సాంద్ర= పరిపూర్ణ మోదరసరూపమ్ = ఆనంద రస స్వరూపము ఆంతరం= అంతరింద్రియమునకు అనగా మనస్సుకు గ్రాహ్యమయిన ఒకానొక అందం బ్రహ్మరూపమ్ = బ్రహ్మ రూపముగా అవభాసతే = ప్రకాశించును.

**తాత్పర్యము**: ఓ శ్రీ కృష్ణా! ఈ విధముగా నీయొక్క సంపూర్ణ మూర్తిని ధ్యానాభ్యాసము చేయుట వలన – వికసించి ఉన్న మాధుర్యమునందు మనసుకలిగిన మహా యోగులకు– నీ పరిపూర్ణ ఆనంద రస స్వరూపము – మనస్సుకు మాత్రమే గ్రాహ్యమయిన ఒకానొక అందంగా – బ్రహ్మరూపముగా ప్రకాశించును.

**విశేషాలు**:

**బ్రహ్మరూపము**: జ్ఞాతృ (తెలుసుకొన్నవాడు) జ్ఞాన (తెలుసుకొనుట) జ్ఞేయ (తెలుసుకొనదగినది) అను త్రిపుటి భేదమైనది లేదా అభేదమైనది బ్రహ్మ రూపము.

**4–7 శ్లో.**
**తత్సమాస్వదనరూపిణీం స్థితిం**
**త్వత్సమాధిమయి విశ్వనాయక! ।**
**ఆశ్రితాః పునరతః పరిచ్యుతా**
**వారభేమహి చ ధారణాదికమ్ ॥**

**ప్రతిపదార్థం**: అయి విశ్వనాయక = ఓ విశ్వనాయకుడా! శ్రీ కృష్ణా!, తత్ = ఆ, సమాస్వదనరూపిణీం = బ్రహ్మ రసమును రుచిచూచు సంపూర్ణ అనుభవ రూపమైన, త్వత్ సమాధిమ్ స్థితిం = నీ నిర్వికల్ప సమాధి స్థితిని (నిర్గతః వికల్పః నానావిధ కల్పనా యస్మాత్ వికల్పము లేనిది. వితర్కము లేనిది), ఆశ్రితాః = ఆశ్రయించియూ, అతః = అప్పుడప్పుడు ఆ స్థితినుండి, పరిచ్యుతౌ = జారిపోయినప్పుడు, చ = కూడా, ధారణ+ఆదికమ్ = ధారణ మొదలగు సాధనలను, పునః = మరలా, ఆరభేమహి = ఆరంభించుచునే ఉంటాము.

**తాత్పర్యము**: ఓ విశ్వనాయకుడా! శ్రీ కృష్ణా! ఆ బ్రహ్మ రసమును ఆస్వాదించు సంపూర్ణ అనుభవ రూపమైన నీ నిర్వికల్ప సమాధి స్థితిని ఆశ్రయించియూ అప్పుడప్పుడు ఆ స్థితినుండి జారిపోయినప్పుడు కూడా ధారణ మొదలగు సాధనలను మరలా ఆరంభించుచునే ఉంటాము.

**విశేషాలు**:

**నిర్వికల్ప సమాధి:** తెలియువాడు తెలియదగినది –అను భేదము పోయి కేవల జ్ఞాన రూపములో ఉండు సమాధి. నీటిలో కరిగిన ఉప్పు ఉప్పుగా కనబడకుండా నీరుగా కనిపించినట్లుగా రెండవ వస్తువు లేక ప్రకాశించుట నిర్వికల్ప సమాధి.

**నిర్వికల్ప సమాధి విఘ్నాలు:** లయ – విక్షేప – కషాయ – రసాస్వాదనలు అనునవి నిర్వికల్ప సమాధికి సంబంధించిన నాలుగు విఘ్నములు.

లయము అనగా నిద్ర. విక్షేపము అనగా ఇతర వస్తువు యొక్క అశ్రయము కషాయమనగా విషయవాసనలవలన కలుగు చేష్టారాహిత్యం, రసాస్వాదమనగా భ్రాంతితో కూడిన ఆనందమును ఆస్వాదించుట. ఈ దోషములవలన సమాధి నుండి జారిపోయినపుడు మరల మరల ధారణ (భగవంతునితప్ప మఱియొకటి తెలియకుండుట) చేయాలని ఈ శ్లోకంలో కవి సందేశం.

**4–8 శ్లో.**
**ఇత్థమభ్యసననిర్భరోల్లసత్**
**త్వత్పరాత్మసుఖకల్పితోత్సవాః ।**
**ముక్తభక్తకులమౌలితాం గతాః**
**సంచరేమ శుకనారదాదివత్ ॥**

**ప్రతిపదార్థం**: ఇత్థమ్ = ఇట్లు (అనేన ప్రకారేణ ఈ విధంగా), అభ్యసన =నిరంతర అభ్యాసముచే, నిర్భర = గాఢమయిన (నిశ్శేషేణ భరః భారః ఎక్కువ భారమున్నది. బరువు ఉన్నది. పోషణ), ఉల్లసత్ = సంతోషించుచున్న, త్వత్ = నీ, పరాత్మసుఖ= బ్రహ్మానుభవముచే ఏర్పడిన, సుఖ= సుఖముచే, కల్పిత ఉత్సవాః।= కల్పింపబడిన వేడుకతో (ఏర్పడిన ఆనందంతో), ముక్త భక్త కుల = ముక్తులలో భక్త సమూహములలో, మౌలితాం గతాః=నాయకులమయి, శుకనారదాదివత్= శుక నారదుల వలె, సంచరేమ = సంచరించెదము.

**తాత్పర్యము**: ఇట్లు నిరంతర అభ్యాసముచే గాఢమయిన సంతోషదాయకమైన నీ బ్రహ్మానుభవముచే ఏర్పడిన సుఖముచే ఏర్పడిన ఆనందంతో ముక్తులలో భక్త సమూహములలో నాయకులమయి శుక నారదుల వలె జీవన్ముక్తావస్థలో సంచరించెదము.

**4-9 శ్లో.**

**త్వత్సమాధి విజయే తు యః పునః**
**మంక్షు మోక్షరసికః క్రమేణ వా ।**
**యోగవశ్యమనిలం షడాశ్రయై**
**రున్నయత్యజ సుషుమ్నయా శనైః ॥**

**ప్రతిపదార్థం**: అజ = పుట్టుక లేనివాడా! కృష్ణా!, త్వత్ సమాధి విజయే తు = నీ సమాధి జయము సాధించిన, యః = ఎవడైతే ఉన్నాడో వాడు, పునః=మరలా, మంక్షు = వెంటనే, మోక్షరసికః = మోక్ష రసికుడు అవుతాడు, వా= అట్లుగాక, క్రమేణ = క్రమ ముక్తిని పొంద గోరితే, యోగవశ్యమ్ = యోగవశమైన, అనిలం =ప్రాణ వాయువును (అనితి జీవతి అనేన దీనితో జీవించుదురు. వాయువు), షడాశ్రయైః= ఆరు ఆశ్రయాల ద్వారా(అనగా షట్చక్రాల ద్వారా)( ఆశ్రీయతే అసౌ ఆశ్రయము ఆధారము), సుషుమ్నయా= సుషుమ్నా నాడి మార్గమున (సుష్ఠు ఇతి అవ్యక్తం శబ్దం మ్నాయతి ఇచట ప్రాణవాయువు షుషు అను శబ్దం చేయును. ఇడా-పింగళ మధ్యలో నుండు నాడి.), శనైః= మెల్ల మెల్లగా (మందం మందమ్ మెల్లమెల్లగా.), ఉన్నయతి= ఊర్ధ్వ ముఖముగా నడిపిస్తాడు.

**తాత్పర్యము**: పుట్టుక లేనివాడా! కృష్ణా! నీ సమాధి జయము సాధించిన ఎవడైతే ఉన్నాడో వాడు వెంటనే సద్యో ముక్తి పొందుతాడు. అట్లుగాక క్రమ ముక్తిని పొంద గోరితే యోగవశమైన ప్రాణ వాయువును షట్చక్రాల ద్వారా సుషుమ్నా నాడి మార్గమున మెల్ల మెల్లగా ఊర్ధ్వ ముఖముగా నడిపిస్తాడు.

**విశేషాలు:**

**షట్చక్రాలు:**

**మూలాధారచక్రం** : మలరంధ్రానికి సుమారురెండంగుళాల పై భాగంలో ఉంటుంది. ఎరుపు

**స్వాధిష్ఠాన చక్రం** : ఇది జననేంద్రియం వెనుక భాగాన, వెన్నెముకలో ఉంటుంది. సింధూరవర్ణం

**మణిపూరక చక్రం** : బొడ్డునకు మూలంలో వెన్నెముక లో ఉంటుంది. బంగారపు వర్ణం

**అనాహత చక్రం** : ఇది హృదయం వెనుక వెన్నెముకలో ఉంటుంది. నీలం రంగు

**విశుద్ధచక్రం** : ఇది కంఠము యొక్క ముడియందుంటుంది. నలుపురంగు.

**ఆజ్ఞాచక్రం** : ఇది రెండు కనుబొమ్మల మధ్యలో భ్రుకుటి స్థానంలో ఉంటుంది. తెలుపురంగు.(ఏడవది సహస్రారం. ఇది బ్రహ్మ రంధ్రం)

ఎడతెగకుండా తిరుగుతూ పోయేది. సంసార చక్రం. శరీరంలోని షడ్చక్రాలు కూడా. శరీరంలో మూలాధారం నుంచి సహస్రారం వరకు సప్తచక్రాలున్నాయి సప్తగిరి క్షేత్రం కూడా దీనికి సంకేతమే నంటారు తెలిసిన వారు.. ఆరుకొండలు దాటి ఏడవకొండ చేరితే అది సహస్రారం. అలాగే నొక్కులతో కనిపిస్తుందది. అందులో ఉన్న వేంకటేశ్వరుడు సాక్షాదీశ్వరుడే. ఇలాంటి భావనతో స్వామి దర్శనం చేయగలిగితే జీవేశ్వరైక్యం సిద్ధించకపోదు.

**4-10 శ్లో.**

**లింగదేహమపి సంత్యజన్నథో**
**లీయతే త్వయి పరే నిరాగ్రహః ।**
**ఊర్ధ్వలోకకుతుకీ తు మూర్ధతః**
**సార్ధమేవ కరణైర్నిరీయతే ॥**

**ప్రతిపదార్థం**: అథ = అటుపిమ్మట నిరాగ్రహః= క్రమముక్తిని పొందు సంకల్పం లేనివాడు అనగా వెంటనే ముక్తి కోరువాడు, లింగదేహమ్ +అపి= లింగ దేహమును, సంత్యజన్= విడిచి, పరే= బ్రహ్మాత్మకుడవైన, త్వయి = నీయందు, లీయతే= లీనుడగును, ఊర్ధ్వలోకకుతుకీ తు= బ్రహ్మాది లోకములందలి సుఖాను భవముపై కుతూహలము కలిగితే, మూర్ధతః= మూర్ధము (తలపై ఉన్న బ్రహ్మ రంధ్రం) ఛేదించుకొని, సార్ధమ్+ఏవ కరణైః = పంచ ప్రాణములు, మనస్సు, బుద్ధి, దశేంద్రియములతో కూడిన లింగశరీరముతో కలిసి నిరీయతే= వెడలిపోవును.

**తాత్పర్యము**: వెంటనే ముక్తి కోరువాడు లింగ దేహమును విడిచి బ్రహ్మాత్మకుడవైన నీయందు లీనుడగును. బ్రహ్మాది లోకములందలి సుఖాను భవముపై కుతూహలము కలిగితే తలపై ఉన్న బ్రహ్మ రంధ్రం చేదించుకొని లింగశరీరముతో కలిసి వెడలిపోవును

**లింగశరీరము:** లింగమనగా గుర్తు. చిహ్నం Sign. Token. శివతత్త్వాన్ని సూచించే సంకేతం కనుక శివలింగమని పేరు వచ్చింది లోకంలో. 'లీనం గమయతీతి లింగం.' గుప్తమైన రహస్యాన్ని బయటపెట్టేది కనుక లింగమని పేరు సార్థకమయింది. మనస్సు ప్రాణం ఇలాంటివే. పరిపూర్ణమైన జ్ఞానక్రియా శక్తులకు ఇవి అపరిపూర్ణమైన సంకేతాలు. కనుకనే లింగ శరీరమన్నారు వీటిని వేదాంతులు. వీటికి తోడు పంచప్రాణాలు పంచతన్మాత్రలు(శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు తన్మాత్రలు.) పంచేంద్రియాలు కలిస్తే మొత్తం 17. సప్తదశకం లింగం అని శాస్త్రజ్ఞుల మాట. 17 సూక్ష్మమైన అంశాలతో కూడిన శరీరం కనుక లింగ శరీరమని సూక్ష్మశరీరమని దీనికి పేరు.

బ్రహ్మరంధ్రంలో ఉన్న సుషుమ్నానాడికి సూర్యకిరణాలకి నిత్య సంబంధము ఉన్నది. అందువలన జీవుడు బ్రహ్మరంధ్రము నుండి బయటికి వచ్చు సూర్య కిరణాలతో బయటికి పోతాడని కవి భావం.

**4-11 శ్లో.**
**అగ్నివాసరవలర్క్షపక్షగైః**
**ఉత్తరాయణజుషా చ దైవతైః ।**

**ప్రాపితో రవిపదం భవత్పరో**
**మోదవాన్ ధ్రువపదాంతమీయతే ॥**

**ప్రతిపదార్థము**: భవత్పరః = నీ యందు కుతూహలం గల నీ భక్తుడు, అగ్ని= అగ్ని(అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), వాసర= దినము (పవలు) (వాసయతి ప్రాణినః ప్రాణులను నివసింపచేయునది. రోజు.), వలర్క్షపక్షగైః= శుక్ల పక్షము అనువానిచే, చ= మరియూ, ఉత్తరాయణ జుషా చ = ఉత్తరాయణమునకు సంతోషించు అభిమాని (సూర్యస్య ఉత్తరే ఉత్తరస్యాం దిశి అయనం గమనమ్ సూర్యుడు మకరరాశిలో ప్రవేశించు దినము, ఉత్తరాయణ పుణ్యకాలము.), దైవతైః= దేవతలచే (దేవానాం సమూహః దేవతల సమూహము.), రవిపదం = సూర్యలోకమునకు (రూయతే స్తూయతే అసౌ స్తుతింపబడువాడు. సూర్యుడు), ప్రాపితః= కొనిపోబడినవాడై, మోదవాన్ = అనేక విధములైన ఆనందములను పొంది, ధ్రువపదాంతమ్= ధ్రువ మండలమునకు, ఈయతే = వెళ్ళును.

**తాత్పర్యము**: నీ యందు కుతూహలం గల నీ భక్తుడు అగ్ని, వార దినము (పవలు) శుక్ల పక్షము అనువాని దేవతలచే ఉత్తరాయణాభిమాని దేవతద్వారా సూర్యలోకము నకు (జ్యోతిశ్చక్రమునకు) కొనిపోబడినవాడై అనేక విధములైన ఆనందములను పొంది ధ్రువ మండలమునకు వెళ్ళును.

**విశేషాలు**: అగ్నిదేవత స్వేచ్ఛగా శరీరమును విడిచి సూర్యరశ్మి ద్వారములో బయటికి పోవు జీవుని అగ్నిలోకమార్గమున తీసుకొనిపోయి వాసరాభిమాని అయిన దేవత చేతికి అందించును. ఆ దేవత ఉత్తరాయణ షణ్మాసాభిమానిదేవత చేతిలో జీవుని పెడుతుంది. ఆ దేవత సంవత్సరాభిమాని దేవత చేతికి జీవుని అందిస్తుంది. అది దేవలోక మార్గమున జీవుని తీసుకొని పోయి వాయుదేవత హస్తములో ఉంచుతుంది. వాయుదేవత తన మార్గం వెంట జీవుని తీసికొనిపోయి ఆదిత్యదేవతావశము చేస్తుంది. ఆదిత్యదేవత తన ద్వారమున నేను జీవుని తీసుకొని చంద్రదేవతా హస్తములో ఉంచుతుంది. ఆ చంద్ర దేవత సర్వలోకమార్గములో

జీవుని విద్యుల్లోకానికి పంపిస్తుంది. అచటినుండి జీవుడు ధ్రువ లోకానికి వెళతాడని పురాణాలు చెబుతున్నాయి.

**4-12 శ్లో.**
**ఆస్థితోఽథ మహరాలయేయదా**
**శేషవక్త్రదహనోష్మణార్ద్యతే ।**
**ఈయతే భవదుపాశ్రయస్తదా**
**వేధసః పదమతః పురైవ వా ॥**

**ప్రతిపదార్థము**: అథ = అటుపిమ్మట ( అనగా పైన చెప్పిన శ్లోకము చివరలో ఉన్న ధ్రువ మండలము దాటి ), మహరాలయే =భృగువు మొదలైన మహర్షులు నివసించు మహర్లోకమునందు (మహాన్ శ్చాసౌ లోకః మహర్లోకము.), ఆస్థితః = నివసించి, యదా=ఎప్పుడు(యస్మిన్ కాలే ఏ కాలంలో?, ఎపుడు?), శేషవక్త్రదహన= ఆదిశేషుని ముఖములోని అగ్ని వేడికి మూడు లోకాలు దహింపబడుటను చూసి(శేష=శిష్యతే ఉపయుక్తాదన్యః శేషేణ మిగిలిపోవునది. ప్రసాదము పతంజలి.), ఊష్మణా = అ వేడిమికి ఉడికిపోయి (ఓషతి దహతి వేడి), ఆర్ద్యతే =బాధించబడి, తదా= అప్పుడు(తస్మిన్ కాలే ఆ కాలమున ఆ సమయంలో అపుడు.), భవత్ ఉపాశ్రయః = నిన్ను శరణు కోరి, వేధసః పదమ్= బ్రహ్మ లోకమైన సత్యలోకాన్ని(విదధాతి జగత్ జగత్తును నిర్మించువాడు. బ్రహ్మ.), ఈయతే= పొందుతాడు.( ప్రవేశిస్తాడు.), వా= లేక, అతః =ఈ పద్ధతిలోనే కాకుండా-, పురా+ఏవ= ఆదిశేషుని ముఖములోని అగ్ని వేడికి మూడు లోకాలు దహింపబడుటకు ముందే సత్యలోకములో ప్రవేశిస్తాడు.

**తాత్పర్యము**: అటుపిమ్మట (ధ్రువ మండలము దాటిన తరువాత) భృగువు మొదలైన మహర్షులు నివసించు మహర్లోకమునందు నివసించి ఆదిశేషుని ముఖములోని అగ్ని వేడికి మూడు లోకాలు దహింపబడుటను చూసి అ వేడిమికి ఉడికిపోయి బాధించబడి నిన్ను శరణు కోరి అప్పుడు బ్రహ్మ లోకమైన సత్యలోకాన్ని పొందుతాడు.( ప్రవేశిస్తాడు.) ఈ పద్ధతిలోనే కాకుండా – ఆదిశేషుని ముఖములోని

అగ్ని వేడికి మూడు లోకాలు దహింపబడుటకు ముందే సత్యలోకములో ప్రవేశిస్తాడు.

**4-13 శ్లో.**
**తత్ర వా తవ పదేఽథవా వసన్**
**ప్రాకృత ప్రళయ ఏతి ముక్తతాం ।**
**స్వేచ్ఛయా ఖలు పురా విముచ్యతే**
**సంవిభిద్య జగదండమోజసా ॥**

**ప్రతిపదార్థము**: తత్ర వా = బ్రహ్మలోకము చేరిన జీవుడు అక్కడ కాని (తత్ర= తస్మిన్ కాలే తస్మిన్ దేశే వా ఆ సమయములో ఆ దేశంలో.), అథవా = అలాకానిచో, తవ పదే= నీదయిన విష్ణులోకములో, వసన్= నివసిస్తూ, ప్రాకృత ప్రళయే = ప్రాకృత ప్రళయములో (ప్రాకృతః ప్రకృతి సంబంధి ప్రళయః, ప్రకృతే ప్రళయఃప్రకృతి ప్రళయము మహా ప్రళయము), ముక్తతాం= ముక్తిని (శరీరేంద్రియాభ్యాం ఆత్మనః ముక్తత్వమ్ శరీరేంద్రియముల నుండి ఆత్మ ముక్తి నొందుట. ముక్తి, మోక్షము.), ఏతి= పొందును, ఖలు= కదా (ప్రశ్న-నిశ్చయ-నిషేధ-వాక్యపూరణేషు ప్రశ్నించుట, నిశ్చయము, నిషేధము, వాక్యపూరణము మొదలగువానిలో ప్రయోగించబడును), స్వేచ్ఛయా= తన ఇష్ట ప్రకారము, పురా= మహా ప్రలయమునకు ముందుగానే, ఓజసా= తన యోగ శక్తిచే (ఉబ్జతి కోమలో భవతీ దీప్తి ప్రకాశము సామర్థ్యము ప్రాణబలము శరీరములో నుండు అష్టమధాతువు), జగదండమ్=బ్రహ్మాండమును, సంవిభిద్య= భేదించి, విముచ్యతే = ముక్తిని పొందుతాడు.

**తాత్పర్యము**: బ్రహ్మలోకము చేరిన జీవుడు అక్కడ కాని లేదా నీదయిన విష్ణులోకములోకాని నివసిస్తూ ప్రాకృత ప్రళయములో ముక్తిని పొందును కదా! లేదా తన ఇష్ట ప్రకారము అనగా మహా ప్రలయమునకు ముందుగానే తన యోగ శక్తిచే బ్రహ్మాండమును భేదించి ముక్తిని పొందుతాడు.

**4-14 శ్లో.**

**తస్య చ క్షితిపయోమహోఽనిల**

**ద్యో మహత్ప్రకృతిసప్తకావృతీ ।**

**తత్తదాత్మకతయా విశన్ సుఖీ**

**యాతి తే పదమనావృతం విభో! ॥**

**ప్రతిపదార్థము**: విభో! = ఓ కృష్ణ స్వామీ!, తస్య చ = ఆ బ్రహ్మాండమునకు, క్షితి= భూమి, (క్షియంతి నివసంతి అస్యామ్ దీని పైన నివసింతురు. భూమి నివాసము), పయః= నీరు (పీయతే అసౌ త్రాగబడునది. జలము), మహః= తేజస్సు, (మహ్యతే పూజ్యతే పూజ్యతే వా అనేన పూజింపబడును, ప్రశసింపబడును), అనిల= వాయువు (అనితి జీవతి అనేన దీనితో జీవించుదురు. వాయువుద్యో= ఆకాశము (ద్యోతతే అసౌ ప్రకాశించునది. ఆకాశము), మహత్ప్రకృతిః = మహత్తత్త్వము, ప్రకృతి (మాయ) అను(మహచ్చ తత్ తత్త్వం చమహత్తత్త్వము. బుద్ధి.), సప్తక+ఆవృతీ= ఏడు ఆవరణములు ఉన్నాయి.( ఆవృణోతి అనేన కప్పుట కప్పునది. మూత, తత్ +తత్ +ఆత్మకతయా= ఈ ఆవరణములందు జీవుడు ఆవరణ స్వరూపుడై, విశన్= సూక్ష్మ శరీరముతో ప్రవేశించి, సుఖీ =సుఖాన్ని అనుభవిస్తూ, అనావృతం = నిరావరణమైన, తే పదమ్= నీ బ్రహ్మ పదాన్ని, యాతి = పొందుతాడు.

**తాత్పర్యము**: ఓ కృష్ణ స్వామీ! ఆ బ్రహ్మాండమునకు భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, మహత్తత్త్వము, ప్రకృతి( మాయ) అను ఏడు ఆవరణములు ఉన్నాయి. ఈ ఆవరణములందు జీవుడు ఆవరణ స్వరూపుడై సూక్ష్మ శరీరముతో ప్రవేశించి సుఖాన్ని అనుభవిస్తూ నిరావరణమైన నీ బ్రహ్మ పదాన్ని పొందుతాడు.

**4-15 శ్లో.**

**అర్చిరాదిగతిమీదృశీం వ్రజన్**

**విచ్యుతిం న భజతే జగత్పతే! ।**

**సచ్చిదాత్మక! భవద్గుణోదయా**

**నుచ్చరంతమనిలేశ! పాహి మామ్ ॥**

**ప్రతిపదార్థము**: జగత్పతే! =ఓ జగత్తుకు ప్రభువయిన గురువాయూరు దేవ! (పాతి రక్షతి రక్షించువాడు. భర్త అధిపతి), ఈదృశీం= ఇట్లు, అర్చిః ఆది గతిమ్ = అర్చిరాదిగమనమున పొందిన ముక్తస్థితిని (అర్చి=అర్చతి దేవాదికం అనయా అగ్నిజ్వాల అగ్నిహోత్రము కిరణము ప్రకాశము.), వ్రజన్= పొందిన సాధకుడు ఎప్పటికి, విచ్యుతిం = చ్యుతిని , తిరిగి జన్మను ( చ్యోతతి క్షరతి కారుట జారుట.), న భజతే= ఎప్పటికి పొందదు, సత్+చిత్ +ఆత్మక= ఓ సచ్చిదాత్మక స్వరూపా! (అస్తిత్వం, చిత్ = జ్ఞానం, ఆనందః అస్తి అస్య అస్తిత్వం, జ్ఞానము, ఆనందం కలవాడు. పరమాత్మ.), అనిలేశ=అనిలాధీశా! ( అనితి జీవతి అనేన దీనితో జీవించుదురు.వాయువు),భవత్గుణఉదయాన్=నీగుణోదయములను(గుణ్యంతే ప్రశస్యంతే ఇతి గుణాః పొగడబడునది. సద్గుణము), ఉచ్చరంతమ్ =చేతనయినంతవరకు పొగిడే, మామ్ పాహి=నన్నువ్యాధి బారి నుండి రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవ! ఇట్లు అర్చిరాదిగమనమున పొందిన ముక్తస్థితిని సాధించిన సాధకుడు ఎప్పటికి చ్యుతిని, తిరిగి జన్మను ఎప్పటికి పొందదు. ఓ సచ్చిదాత్మక స్వరూపా! అనిలాధీశా! నీ గుణోదయములను చేతనయినంతవరకు పొగిడే నన్నువ్యాధి బారి నుండి రక్షించు

**విశేషాలు:**

**అర్చిరాది మార్గం:** సాధారణ నైఘంటి కార్థంలో అర్చిరాది మార్గం అంటే సగుణ బ్రహ్మను ఉపాసించేవారు బ్రహ్మలోకం చేరే మార్గం. ఈ మార్గం సూర్య, చంద్ర లోకాల మీదుగా విద్యుల్లోకం వరకు విస్తరించి ఉంటుంది. దీనిని దేవయాన మార్గమని కూడా అంటారు. వ్యక్తులు నరక, ధూమాది, అర్చిరాది, ముక్తి మార్గాలలో ఏదో ఒకటి అనుసరించడం పరిపాటి.

జీవహింస, జారత్వం, చోరత్వం మొదలైన చెడు నడవడికలు ఉంటే అది నరకమార్గం.

దానధర్మాలు చేయడం, మంచినీటి వసతి కల్పించి ప్రజాసేవ చేయడం, ఆలయాలను నిర్మించడం, ఏదో ఫలాన్ని ఆశించి కామ్య కర్మలు చేయడం ధూమాది

మార్గం. దీనికి దక్షిణాయన మార్గమనీ, కృష్ణగతి అని కూడా పేర్లు ఉన్నాయి.

ఏ విధమైన కోరికలు లేకుండా నిత్య నైమిత్తికాది కర్మలు చేయడం, ప్రణవోపాసనో లేక మరేదైనా ధ్యానమో చేస్తూ అష్టాంగ యోగాన్ని అభ్యసించడం. ద్వారానూ ముక్తిని సాధించవచ్చు. కోర్కె లేవైనా ఉంటే ఏ చక్రవర్తిగానో జన్మించవచ్చు. దీనికి అర్చిరాది మార్గమని, ఉత్తరాయణ మార్గమనీ, దేవయాన మార్గమనీ కూడా పేర్లు ఉన్నాయి.

జ్ఞానమార్గంలో, సాధన చతుష్టయాన్ని అనుసరించడం ముక్తిని సాధిస్తుంది. దీనిని విదేహ కైవల్య మార్గమనీ, మోక్షమార్గమనీ కూడా అంటారు. (నారాయణావధూత స్వామి రచించిన 'ఆధ్యాత్మ సుబోధిని' ఆధారంగా).

**4వ దశకము సమాప్తము.**



# దశకమ్ 5 – విరాట్పురుషోత్పత్తి

**5–1 శ్లో.**

**వ్యక్తావ్యక్తమిదం న కించిదభవత్ ప్రాక్ ప్రాకృతప్రక్షయే**
**మాయాయాం గుణసామ్యరుద్ధవికృతౌ త్వయ్యాగతాయాం లయం ।**
**నో మృత్యుశ్చ తదామృతం చ సమభూన్నాహ్నో న రా త్రేః స్థితిః**
**తత్రైకస్త్వమశిష్యథాః కిల పరానందప్రకాశాత్మనా ॥**

**ప్రతిపదార్థము**:ప్రాక్ప్రాకృతప్రక్షయే=ప్రాకృత ప్రళయమునకు ముందు(ప్రాకృతః ప్రకృతి సంబంధి ప్రళయః, ప్రకృతే ప్రళయః ప్రకృతి ప్రళయము మహా ప్రళయము.), ఇదం= ఈ, వ్యక్త= స్థూల ప్రకృతి (విశేషేణ అంచతి వ్యాప్నోతి వ్యాపించునది స్పష్టమైనది సాంఖ్యమతములో స్థూల ప్రకృతి) అవ్యక్తమ్ =సూక్ష్మ ప్రకృతి (న వ్యక్తః ఇంద్రియ గోచరః వ్యక్తము గానిది, ఇంద్రియములకు గోచరము గానిది.), న కించిత్ అభవత్= కొంచెము కూడా లేదు, త్వయి మాయాయాం = నీ మాయా శక్తి యందు,గుణసామ్యరుద్ధవికృతౌ ఆగతాయాం లయం=సత్వరజస్తమో గుణ సామ్య స్థితిలో వికారము అణగిపోతుంది, మృత్యుః +చ = ఆ సమయంలో మృత్యువు ( సంసారము ) లేదు (మ్రియతే ప్రాణైః వియుజ్యతే ప్రాణములు వదలుట. మృత్యువు.), తదా = అప్పుడు, అమృతం చ = అమృతము( మోక్షము ), న= లేదు, న అహ్నః=పగలు లేదు, న రా త్రేః= రాత్రి లేని, స్థితిః సమభూత =స్థితి ఉన్నది, తత్ర +ఏకః +త్వమ్ = అప్పుడు అచ్చట నువ్వొక్కడవే, పరానందప్రకాశ +ఆత్మనా= బ్రహ్మ స్వరూపంతో, అశిష్యథాః = మిగిలి ఉన్నావు, కిల= కదా.

**తాత్పర్యము**: ప్రాకృత ప్రళయమునకు ముందు ఈ స్థూల ప్రకృతి ,సూక్ష్మ ప్రకృతి కొంచెము కూడా లేదు. నీ మాయా శక్తి యందు సత్వరజస్తమో గుణ సామ్య స్థితిలో వికారము అణగిపోతుంది. ఆ సమయంలో మృత్యువు (సంసారము) లేదు. అప్పుడు అమృతము(మోక్షము) లేదు. పగలు రాత్రి లేని స్థితి ఉన్నది. అప్పుడు అచ్చట నువ్వొక్కడవే బ్రహ్మ స్వరూపంతో మిగిలి ఉన్నావు కదా!

**విశేషాలు**: ఈ దశకములోని వృత్తములన్నియు శార్దూల వృత్తములు (మసజసతతగ)

ఋగ్వేదములోని రాత్రి సూక్తప్రభావము ఈ శ్లోకముపై ఉన్నది.

సత్వాది గుణములు సమయిన పాళ్ళలో ఉన్నప్పుడు కారణమైన సూక్ష్మ ప్రకృతి బ్రహ్మములో లీనమవుతుంది. అందువలన కార్యమైన స్థూల ప్రకృతి కూడా స్తంభించి పోతుంది. దీనినే ప్రాకృత ప్రళయము అంటారు

**5-2 శ్లో.**

**కాలః కర్మ గుణాశ్చ జీవనివహా విశ్వం చ కార్యం విభో!**
**చిల్లీలారతిమేయుషి త్వయి తదా నిర్లీనతామాయయుః ।**
**తేషాం నైవ వదంత్య సత్త్వమయి భోః! శక్త్యాత్మనా తిష్ఠతాం**
**నో చేత్ కిం గగనప్రసూనసదృశాం భూయో భవేత్ సంభవః ॥**

**ప్రతిపదార్థం**: అయి భోః! విభో!= ఓ గురువాయూరు ప్రభూ!, తదా =అప్పుడు (ప్రాచీన ప్రళయకాలమున), చిత్ – లీలారతిమ్ –ఏయుషి =నువ్వు స్వరూప జ్ఞాన విలసనంలో ఉండగా(అనగా యోగ నిద్రలో ఉండగా), కాలః = కాలము, (కలయతి ఆయుః కలయతి సర్వాణి భూతాని ఆయువును లెక్కించునది. ప్రాణులన్నిటికిని కారణమైనది.), కర్మ = కర్మము, గుణాః చ= త్రిగుణములు (సత్త్వ–రజ–తమోగుణములు), జీవనివహాః = ప్రాణమున్న జీవులు, విశ్వం చ కార్యం= మాయ వలన కలుగు ప్రపంచము, త్వయి = నీయందు, నిర్లీనతామ్ ఆయయుః=సంపూర్ణముగా లీనమగును, తేషాం అ సత్త్వమ్ వదంతి న ఏవ =లీనమయినంత మాత్రమున అవి శూన్యమని లేవని అనకూడదు కదా!, శక్తి ఆత్మనా తిష్ఠతాం=శక్తి రూపములో నీయందు అవి ఉన్నవి. (శక్నోతి సమర్థో భవతి తస్య భావః కర్మ వా శక్తి, సామర్థ్యము), నో చేత్ = లేనిచో (నిషేధః, యది న భవతినిషేధము కానట్లైతే.) గగన– ప్రసూన– సదృశాం = అవి గగన కుసుమాలే అయితే, భూయః భవేత్ సంభవః కిం = మరలా సృష్టిలో పుట్టుట ఎలా సంభవించును?

**తాత్పర్యము**: ఓ గురువాయూరు ప్రభూ! ఆ ప్రాచీన ప్రళయకాలమున నువ్వు యోగ నిద్రలో( స్వరూప జ్ఞాన విలాసములో మురియుచుండుట) ఉండగా కాలము, జీవుల యొక్క కర్మము , త్రిగుణములు, ప్రాణమున్న జీవులు మాయ వలన కలుగు ప్రపంచము, సంపూర్ణముగా నీలో లీనమగును.

నీలో లీనమయినంత మాత్రమున అవి శూన్యమని లేవని అనకూడదు కదా! శక్తి రూపములో నీయందు అవి ఉన్నవి. లేనిచో అవి గగన కుసుమాలే అయితే మరలా సృష్టిలో పుట్టుట ఎలా సంభవించును?

**విశేషాలు:**

**కర్మ**: ప్రతి జీవీ చేసే పనిని కర్మ అంటారు.. ఇలా చేసే పనులు సంచితమనీ, ప్రారబ్ధమనీ, ఆగామి అనీ మూడు విధాలు అని వైదిక ధర్మాన్ని అనుసరించే పలువురి విశ్వాసం. సంచితం అంటే కూడబెట్టుకొన్నది. ప్రారబ్ధం అంటే కూడబెట్టుకొన్న దానిని అనుభవంలోకి తెచ్చుకోవడం. ఆగామి అంటే ఈ జన్మలో చేసే పనులతో కూడబెట్టుకొనబోయేది (అంటే, సంపాదించుకొంటున్నది). ఆగామికే మరో పదం క్రియమాణం.

కర్మలు లౌకికం అనీ, అలౌకికం (వేదోక్తం) అనీ రెండు విధాలు. జీవిక కోసం చేసే పనులు లౌకికం. ఈశ్వరారాధన మొదలైనవి అలౌకిక కర్మలు.

నిత్య, నైమిత్తిక, కామ్య, నిషేధ కర్మలనే మరో వర్గీకరణ కూడా ఉంది. నిత్యకర్మలు అంటే రోజూ చేసేవి. అమావాస్యనాడు ఫలానా యాగం చేయాలి. పౌర్ణమినాడు ఫలానా పనిచేయాలని చెప్పినందున చేసేవి నైమిత్తిక కర్మలు. ఫలానా కర్మ చేస్తే ఫలానా ఫలితం వస్తుందని చేసేది కామ్యకర్మ. ఉదాహరణ జ్యోతిష్టోమం చేస్తే స్వర్గం ప్రాప్తిస్తుందనీ పుత్రకామేష్టి చేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందని చేసేవి, చేయించేవి. అసత్యం పలకవద్దని, పరస్త్రీని ఆశించవద్దనీ చెప్పేది నిషేధకర్మలు.

**మిథ్య:** మిథ్య అనగా లేనిది ఉన్నట్లు కనిపించడం. రజ్జువులో సర్పం వలె, నిద్రలో కల వలె, ఎండమావులలో నీటి వలె కలిగే భ్రమ.

**5–3 శ్లో.**

**ఏవం చ ద్విపరార్ధకాలవిగతావీక్షాం సిసృక్షాత్మికాం**
**బిభ్రాణే త్వయి చుక్షుభే త్రిభువనీభావాయ మాయా స్వయమ్ ।**
**మాయాతః ఖలు కాలశక్తిరఖిలాదృష్టం స్వభావోఽపి చ**
**ప్రాదుర్భూయ గుణాన్ వికాస్య విదధుస్తస్యాః సహాయక్రియాం ॥**

**ప్రతిపదార్థము**: ఏవం చ = ఇట్లు, ద్వి–పరార్ధ– కాల– విగతౌ = బ్రహ్మ యొక్క ద్విపరార్థ కాలము జరిగిన పిదప, ఈక్షాం సిసృక్ష ఆత్మికాం=సృష్టి చేయాలని మాయాప్రేరణ రూపమైన ఈక్షణ క్రియ(ఈక్షా ఈక్షణం దర్శనమ్ చూచుట,), బిభ్రాణే త్వయి = నీ చేత చేయబడింది, త్రిభువనీ –భావాయ = మూడు లోకముల ఏర్పాటు కొరకు, మాయా స్వయమ్= ఆచూపులో మాయ స్వయముగా(మీయతే అపరోక్షవత్ ప్రదర్శ్యతే అనయా దీనితో లేనిది చూపబడును. మాయ), చుక్షుభే = క్షోభిస్తుంది, మాయాతః = క్షోభించిన మాయ నుండి, అఖిల– అదృష్టం= వెనుకటి కల్పములో జీవుల పుణ్య పాప రూపమైన అదృష్టమయిన, కాల – శక్తిః= ఈ శ్వరుని యొక్క కాల శక్తి, అపిచ = మరియు, గుణాన్ – వికాస్య = సత్వ రజస్తమో గుణములను వికసింప చేయు, స్వభావః = స్వభావము, ప్రాదుర్భూయ = ఆవిర్భవించును, తస్యాః– సహాయక్రియాం = ఆ కాల స్వభావములు మూడు లోకముల ఆవిర్భావములో మాయకు సహాయ పడుటకు, విదధుః ఖలు= విధించబడినవి కదా!

**తాత్పర్యము**: ఇట్లు బ్రహ్మ యొక్క ద్విపరార్థ కాలము జరిగిన పిదప సృష్టి చేయాలని మాయాప్రేరణ రూపమైన ఈక్షణ క్రియ నీ చేత చేయబడింది. మూడు లోకముల ఏర్పాటు కొరకు ఆచూపులో మాయ స్వయముగా క్షోభిస్తుంది.(అనగా నీలో లీనమైన మాయ నీకు వేరుగా వ్యక్తదశను పొందునని భావం) క్షోభించిన మాయ నుండి వెనుకటి కల్పములో జీవుల పుణ్య పాప రూపమైన అదృష్టమయిన ఈ శ్వరుని యొక్క కాల శక్తి మరియు సత్వ రజస్తమో గుణములను వికసింప చేయు స్వభావము కూడా ఆవిర్భవించును. ఆ కాల స్వభావములు మూడు లోకముల ఆవిర్భావములో మాయకు సహాయ పడతాయి.

**విశేషాలు**:

**పరార్ధము**: ఆ స్వయంభువు యొక్క కాలసంఖ్య లెక్కించి చెప్పటానికి అనేక సంవత్సరాల కాలంచేత కూడ సాధ్యం కాదు. సంగ్రహంగా కాలసంఖ్య రెండు పరార్ధాలతో ఏర్పాటు చేయబడింది.

అదియే పరకాలము. ప్రళయకాలము. దాని తరువాత మరల సృష్టిజరుగుతుంది. ఆ బ్రహ్మయొక్క స్వీయ మానంతో అది శతాబ్ద కాలంగా చెప్పబడింది. ఆ పరకాలంలో సగభాగాన్ని పరార్ధము అని వ్యవహరిస్తారు. (కూర్మపురాణములో కాలసంఖ్యాకథనము అను పంచమాధ్యాయము)

**మాయ:** మీయతే అనయా ఇతి మాయా. దేనిచేత కొలవబడుతుందో అది మాయ. పరమాత్మ శక్తి. Cosmic power. దేశకాల వస్తువులన్నింటినీ కొలిచి ఇవి ఇంతేనని చూపుతుంది. కనుక అది మాయ అయితే ఇవి మేయమవుతున్నాయి. Measured. ఇది అలా కొలవలేనిది ఒక్కటే. అది పరమాత్మ తత్త్వం. కనుక అమేయు డయ్యాడు ఆయన'మా' అంటే లేదు, కాదు అనీ, 'యా' అంటే 'ఏది' అనీ అర్థం చెప్పుకుని ఏది లేదో, ఏది కాదో అది అని ఇంకొక వివరణ ఉంది. శంకరాచార్యుల వారు 'మాయ'ను అచింత్యం అన్నారు. అసత్తూ కాదు, సత్తూ కాదు అని భావం.

**5-4 శ్లో.**
**మాయా సన్నిహితోఽప్రవిష్టవపుషా సాక్షీతి గీతో భవాన్**
**భేదైస్తాం ప్రతిబింబితో వివిశివాన్ జీవోఽపి నైనాపరః ।**
**కాలాదిప్రతిబోధితాఽథ భవతా సంచోదితా చ స్వయం**
**మాయా సా ఖలు బుద్ధితత్త్వమసృజద్యోఽసౌ మహానుచ్యతే ॥**

**ప్రతిపదార్థం**: భవాన్= నువ్వు (భాతి దీప్తో భవతి ప్రకాశించువాడు మీరు.), మాయా –సన్నిహితః= మాయకు సన్నిహితుడవైనప్పటికి, అప్రవిష్ట–వపుషా= మాయా సంబంధములేని స్వరూపముతో, సాక్షీ –ఇతి గీతః = సాక్షి అను పేరుతో కీర్తింపబడుచు, తామ్ భేదైః– = మాయా కల్పిత ఉపాధులను వేరువేరుగా సృష్టించి,

ప్రతిబింబితః = ప్రతిబింబ రూపములో, వివిశవాన్= వానియందు ప్రతిఫలించావు, జీవః – అపి =జీవుడు కూడా, అపరః న ఏవ =ఈశ్వరునికంటె వేరు కాదు, అథ = అటుపిమ్మట, కాల– ఆది– ప్రతిబోధితా= కాలము, కర్మము, స్వభావముచే మేల్కొలుపబడిన మాయ, భవతా సంచోదితా చ= నీచేత ప్రేరేపింపబడినదై, సా మాయా స్వయం = ఆ మాయ స్వయముగా, యః = ఏది, మహాన్ +ఉచ్యతే= మహత్త త్త్వము అని పిలువబడుతుందో, అసౌ= ఆ, బుద్ధి– తత్త్వమ్= బుద్ధి తత్వమును, అసృజత్ ఖలు = సృష్టించింది కదా!

**తాత్పర్యము**: నువ్వు మాయకు సన్నిహితుడవైనప్పటికి మాయా సంబంధములేని స్వరూపముతో సాక్షి అను పేరుతో కీర్తింపబడుచు మాయా కల్పిత ఉపాధులను (జీవులను) వేరువేరుగా సృష్టించి ప్రతిబింబ రూపములో వానియందు ప్రతిఫలించావు . జీవుడు కూడా ఈశ్వరునికంటె వేరు కాదు . అటుపిమ్మట కాలము, కర్మము, స్వభావముచే మేల్కొలుపబడిన మాయ నీచేత ప్రేరేపింపబడినదై బుద్ధి తత్వమును సృష్టించింది . అదే మహత్త త్త్వము.

**విశేషాలు:**

**సాక్షి:** అంటి ముట్టక ఒక విషయం గమనిస్తున్నవాడు. పరమాత్మ. అతని చేత గమనింపబడుతున్న అనాత్మ ప్రపంచమంతా సాక్ష్యం.

**మహత్త త్త్వము:** ఇది అవ్యక్తమైన ప్రధానం నుంచి వచ్చిన రెండవ భూమిక. అద్వైతుల భాషలో ఇది అవ్యాకృత సూక్ష్మప్రపంచం. దానికి అధిపతి అయిన జీవుడు హిరణ్యగర్భుడు. అంటే సమష్టి బుద్ధి.

**5–5 శ్లో.**

**తత్రాసౌ త్రిగుణాత్మకోఽపి చ మహాన్ సత్త్వప్రధాన స్స్వయం**
**జీవేఽస్మిన్ ఖలు నిర్వికల్పమహమిత్యుద్బోధనిష్పాదకః ।**
**చక్రేఽస్మిన్ సవికల్పబోధకమహంతత్త్వం మహాన్ ఖల్వసౌ**
**సంపుష్టం త్రిగుణైస్తమోఽతిబహులం విష్ణో! భవత్ప్రేరణాత్ ॥**

**ప్రతిపదార్థము**: విష్ణో!= ఓ విష్ణుమూర్తి!, తత్ర= ఆ మాయా కార్యములలో ఒకటైన, అసౌమహత్ –తత్త్వం = ఈ మహత్తత్వము, త్రిగుణాత్మకః అపి చ = త్రిగుణాత్మక మయినప్పటికి, మహాన్ = ఎక్కువగా, సత్త్వప్రధానః స్వయం= సత్వగుణ ప్రధానమైనది, అస్మిన్ జీవే– = ఈ జీవునియందు, భవత్ ప్రేరణాత్ = నీ ప్రేరణ వలన, నిర్వికల్పమ్ ఇతి ఉద్బోధ = నిర్వికల్పముగా నేను నేను అను తత్వాన్ని ఉద్బోధించి, అహమ్ –నిష్పాదకః = అహంతత్వాన్ని పుట్టిస్తుంది, అసౌ=ఇది (అహం తత్వము), అస్మిన్ =ఈ జీవునియందు, సవికల్పబోధక= నేను బాలుడను, నేను ముసలివాడను అను వికల్పముతో కూడిన జ్ఞానమును (విరుద్ధః కల్ప విరుద్ధంగా జరుగుట), చక్రే= కలిగించును, త్రిగుణైః సంపృష్టం = మూడు గుణములతో కలిసి ఉన్నప్పటికి, తమః– అతిబహులం ఖలు = అహం తత్వము తమోగుణము అధికముగా కలిగినది కదా!

**తాత్పర్యము**: ఓ విష్ణుమూర్తి! ఆ మాయా కార్యములలో ఒకటైన ఈ మహత్తత్వము త్రిగుణాత్మకమయినప్పటికి ఎక్కువగా సత్వగుణ ప్రధానమైనది. ఈ జీవునియందు నీ ప్రేరణ వలన నిర్వికల్పముగా నేను నేను అను తత్వాన్ని ఉద్బోధించి అది (మహత్తత్వము) అహంతత్వాన్ని పుట్టిస్తుంది.

ఇది (అహం తత్వము) ఈ జీవునియందు నేను బాలుడను, నేను ముసలివాడను అను వికల్పముతో కూడిన జ్ఞానమును కలిగించును. మూడు గుణములతో కలిసి ఉన్నప్పటికి అహం తత్వము తమోగుణము అధికముగా కలిగినది కదా!

**విశేషాలు**:

**వికల్పము:** ఒక వస్తువు అనేక విధాలుగా భాసిస్తే అవి దాని వికల్పాలు లేదా వికారాలు.

**నిర్వికల్పం:** జ్ఞాత – జ్ఞేయం. ద్రష్ట–దృశ్యం, ప్రమాత – ప్రమేయం అనే విభాగాలేమీ లేకుండాప్రత్యగభిన్న పరబ్రహ్మం విషయంగా కలిగి అఖండా కారమై, విశేష్య, విశేషణతా సంబంధ రహితమును, అద్వితీయమును అయి ప్రకాశించే జ్ఞానం.

**5-6 శ్లో.**

**సోఽహం చ త్రిగుణక్రమాత్ త్రివిధతామాసాద్య వైకారికో**
**భూయస్తైజసతామసావితి భవన్నాద్యేన సత్త్వాత్మనా ।**
**దేవానింద్రియమానినోఽకృత దిశావాతార్క పాశ్యశ్వినో**
**వహ్నీంద్రాచ్యుతమిత్రకాన్ విధువిధి శ్రీరుద్రశారీరకాన్ ॥**

**ప్రతిపదార్థం**: సః అహం చ= మహత్తు నుండి పుట్టిన ఆ అహంకారము, త్రిగుణ-క్రమాత్ = సత్వ రజస్తమో గుణములచే, త్రివిధతామ్ - ఆసాద్య =మూడు విధముల రూపములను పొంది (వరుసగా), వైకారికః= వైకారికము, భూయః = మరలా, తైజస-తామసౌ=తైజస తామసములుగా, ఇతి భవన్ =అయినవి, ఆద్యేన= మొదటిదయిన, సత్వ —ఆత్మనా= సత్వ గుణ ప్రధానమైన వైకారికాహంకారముచే, ఇంద్రియమానినః = ఇంద్రియాభిమాని, దేవాన్ = దేవతలను, దిశా- వాత- అర్క పాశి- అశ్వినః = దిక్కు, వాయువు, సూర్యుడు , వరుణుడు, అశ్వినులు అనువారిగా, అకృత = చేసెను, వహ్ని — ఇన్ద్ర — అచ్యుత- మిత్రకాన్= అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మిత్రుడు, ప్రజాపతులను, విధు-విధి —శ్రీరుద్ర- శారీరకాన్= చంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు, క్షేత్రజ్ఞులను, అకృత = చేసెను.

**తాత్పర్యము**: మహత్తు నుండి పుట్టిన ఆ అహంకారము సత్వ రజస్తమో గుణములచే వరుసగా వైకారికము తైజస తామసములుగా అను మూడు విధముల రూపములను పొందినది. మొదటిదయిన సత్వ గుణ ప్రధానమైన వైకారికాహంకారముచే ఇంద్రియాభిమాని దేవతలను దిక్కు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినులు అనువారిగా చేసెను. (వీరు జ్ఞానేంద్రియములకు అధిదేవతలు)

అదే విధముగా అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మిత్రుడు, ప్రజాపతులను కర్మేంద్రియముల (వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు) అధిష్ఠాన దేవతలచే ప్రేరితుడై మాటలాడుట, తీసికొనుట, నడచుట, విడచుట. ఆనందము అనుభవించుట అను అయిదు పనులను జీవుడు చేయును. చంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు, క్షేత్రజ్ఞులను అంతః కరణ చతుష్టయమునకు అధిదేవతలద్వారా జీవుడు సంకల్ప నిశ్చయ, శరీరాభిమాన, ధారణలను పొందును.

**5–7 శ్లో.**

**భూమన్! మానస బుద్ధ్యహంకృతి మిలచ్చిత్తాఖ్య వృత్త్యన్వితం**
**తచ్చాంతః కరణంవిభో! తవ బలాత్ సత్త్వాంశ ఏవాసృజత్ ।**
**జాతస్తైజసతో దశేంద్రియ గణ స్తత్తామసాంశాత్ పునః**
**తన్మాత్రం నభసో మరుత్పురపతే! శబ్దోఽజని త్వద్బలాత్ ॥**

**ప్రతిపదార్థం**: భూమన్! = గొప్పవాడా! (బహోర్భావః ఎక్కువ.), మరుత్పురపతే!= గురువాయూరు ప్రభూ!, విభో! = ప్రభూ!, మానస బుద్ధి –అహంకృతి మిలత్ =మనో బుద్ధి అహంకారములతో కలిసిన, చిత్తాఖ్య – వృత్తి –అన్వితం=చిత్తమనెడి వృత్తితో కలిసి (చిత్యతే జ్ఞాయతే అనేన దీనితో తెలుసుకుందురు. మనస్సు), తత్ చ అంతః కరణం = సత్వప్రధానమయిన అంతః కరణమును, తవ బలాత్= నీ బలముచే (ప్రేరణచే), సత్త్వాంశః ఏవ= సత్త్వాంశము అయిన సాత్విక అహంకారము, అసృజత్ = సృష్టించెను, తైజసతః = తైజసమయిన రాజసాహంకారమువలన, దశ– ఇంద్రియ గణః =జ్ఞానేంద్రియ కర్మేంద్రియ గణము, జాతః= పుట్టించెను, పునః= మరలా, త్వత్ –బలాత్= నీ బలముచే (ప్రేరణచే), తత్ – తామస –అంశాత్ =ఆ తామసాహంకారము వలన, నభసః తన్మాత్రం = ఆకాశ తన్మాత్రమయిన (నహ్యతే మేఘైః మేఘములచే నింపబడినది. ఆకాశము. న న భాతి ప్రకాశించనిది కానిది, ప్రకాశించునది. ఆకాశము. నహ్యతి ఘర్మం బధ్నాతి వేడిని చేయునది. ఆకాశము.), శబ్దః= శబ్దం – (శబ్ద్యతే ఉచ్చార్యతేఉచ్చరించబడునది. శబ్దము ధ్వని ఆకాశగుణము), అజని = పుట్టింది.

**తాత్పర్యము**: గొప్పవాడా! గురువాయూరు ప్రభూ! ప్రభూ! నీ ప్రేరణచే సత్త్వాంశము అయిన సాత్విక అహంకారము – మనో బుద్ధి అహంకారములతో కలిసిన చిత్తమనెడి వృత్తితో కలిసి – సత్వప్రధానమయిన అంతః కరణమును, సృష్టించెను. తైజసమయిన రాజసాహంకారమువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ గణము పుట్టించెను. మరలా నీ ప్రేరణచే ఆ తామసాహంకారము వలన ఆకాశ తన్మాత్రమయిన శబ్దం పుట్టింది.

**విశేషాలు**:

**భూమా** : అన్నిటికన్నా ఉత్కృష్టమైన పదార్థం. చాలా పెద్దదని అర్థం. Summum Bonum. Supreme Reality. అద్వితీయమైన తత్త్వం. పరిపూర్ణమైన చైతన్యమని అర్థం.

**అంతఃకరణములు** – లోపలి యింద్రియము. ఇవి వేదాంతుల మతమున మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని నాలుగు విధములు. వీనికి క్రమముగా సంశయము, నిశ్చయము, గర్వము, స్మరణము – విషయములు. ఇవి సాంఖ్యుల మతమున బుద్ధి, అహంకారము, మనస్సు లని మూడు విధములు.

**5–8 శ్లో.**
**శబ్దాద్వ్యోమ తతః ససర్జిథ విభో! స్పర్శం తతో మారుతం**
**తస్మాద్రూపమతో మహోఽథ చ రసం తోయం చ గంధం మహీమ్ ।**
**ఏవం మాధవ! పూర్వపూర్వకలనాదాద్యాద్యధర్మాన్వితం**
**భూతగ్రామమిమం త్వమేవ భగవన్ ప్రాకాశయస్తామసాత్ ॥**

**ప్రతిపదార్థము**: భగవన్ = స్వామీ!, మాధవ= మాధవుడా!, విభో! = ప్రభూ!, తతః= అటుపిమ్మట, శబ్దాత్ –వ్యోమ = శబ్దము నుండి ఆకాశాన్ని, ససర్జిథ = పుట్టించావు, తతః= దానినుండి, మారుతం స్పర్శం= వాయుగుణమైన స్పర్శను, తస్మాత్= దానినుండి, మహః= అగ్నిని, అతః =అటుపిమ్మట, రూపమ్= తేజోగుణమైన రూపమును, అథ చ రసం=తేజస్సు నుండి నీటి గుణమైన రసాన్ని, తోయం చ= దానినుండి నీరును, మహీమ్ గంధం= నీటినుండి పృథివీ గుణమైన గంధాన్ని(సృష్టించావు), ఏవం = ఇలా, పూర్వ–పూర్వ–కలనాత్= పూర్వ పూర్వ వస్తు సమ్మేలనముతో, ఆద్య–ఆద్య ధర్మ—అన్వితం=పూర్వ పూర్వ ధర్మములు కలవై ఉన్నాయి, ఇమం భూత– గ్రామమ్ = ఇలా ఉన్న ఈ భూత సమూహాన్ని, త్వమేవ= నువ్వే, తామసాత్ = తామసాహంకారము నుండి, ప్రాకాశయః=ప్రకాశింపచేసావు.

**తాత్పర్యము**: స్వామీ! మాధవుడా! శబ్దము నుండి ఆకాశాన్ని పుట్టించావు. దానినుండి వాయుగుణమైన స్పర్శను దానినుండి అగ్నిని అటుపిమ్మట

తేజోగుణమైన రూపమును తేజస్సు నుండి నీటి గుణమైన రసాన్ని దానినుండి నీరును నీటినుండి పృథివీ గుణమైన గంధాన్ని సృష్టించావు. ఇలా పూర్వ పూర్వ వస్తు సమ్మేలనముతో అవి పూర్వ పూర్వ ధర్మములతో ఉన్నాయి. ఇలా ఉన్న ఈ భూత సమూహాన్ని నువ్వే తామసాహంకారము నుండి ప్రకాశింపచేసావు.

**విశేషాలు**: పూర్వ పూర్వ వస్తు సమ్మేలనముతో పూర్వ పూర్వ ధర్మములు

ఆకాశములో శబ్ద గుణము , వాయువు శబ్ద స్పర్శ గుణము, తేజస్సు శబ్ద స్పర్శ రూప గుణకము, జలము శబ్ద స్పర్శ రూపరస గుణము , భూమి శబ్ద స్పర్శ రూపరస గంధ గుణములతో ఉంటాయని భావం.

ఇటువంటిదే పంచీకరణము అయిదుగా తయారుచేయటం. పంచభూతాలను ఒక్కొక్కటి రెండు భాగాలు చేసి అందులో ఒక భాగం మరలా నాలుగు చేసి మిగతా నాలుగింటిలో ఒక్కొక్క అంశాన్ని కలుపుతూ పోవటం. అలా కలిపితే దాని అర్ధభాగం మిగతా నాలుగూ కలిసి ప్రతిఒక్క భూతమూ పంచభూతాత్మకమే అవుతుంది. ఇదే సృష్టి ప్రణాళిక. దీనివల్లనే అపంచీకృతమైన సూక్ష్మభూతాలు పంచీకృతమై స్థూల ప్రపంచంగా మారటం జరుగుతున్నది.

**భగవానుడు:** భగ శబ్దానికి యోని అనే గాక ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన చాలా అర్థాలు ఉన్నాయి. అవి కలిగినవాడు భగవంతుడు / భగవానుడు. సమగ్ర ఐశ్వర్యం కలిగినవాడు. సమస్త భూతముల జ్ఞానం కలిగిన వాడు. ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తెలిసినవాడు

**5-9 శ్లో.**

**ఏతే భూతగణాస్తథేంద్రియగణా దేవాశ్చ జాతాః పృథక్**
**నో శేకుర్భువనాండనిర్మితివిధౌ దేవైరమీభిస్తదా ।**
**త్వం నానావిధసూక్తిభిర్నుతగుణస్తత్త్వాన్యమూన్యావిశన్**
**చేష్టాశక్తిముదీర్య తాని ఘటయన్ హైరణ్యమండం వ్యధాః ॥**

**ప్రతిపదార్థము**: ఏతే భూతగణాః =ఈ భూత గణములు, తథా= అట్లే, ఇంద్రియగణాః =ఇంద్రియ గణములు, దేవాః చ = వాటికి అధిష్ఠాన దేవతలు, జాతాః=ఇవన్నీ

పుట్టినప్పటికి, పృథక్ = విడివిడిగా ఉన్నందున (ప్రథయతి వేరైనది లేకుండా), భువన –అండ –నిర్మితి– విధౌ = బ్రహ్మాండాన్ని నిర్మించే క్రియలో, న శేకుః = అసమర్థాలయ్యాయి, తదా=అప్పుడు, అమీభిః – దేవైః– = వీటి అధిష్ఠాన దేవతలు, త్వం = నిన్ను, నానా– విధ– సూక్తిభిః = అనేక విధాలయిన శ్రుతి సూక్తులచే, నుతగుణః = పొగడగా, త్వం= నువ్వు, అమూని తత్త్వాని = వారి విజ్ఞప్తిపై తత్వములందు, ఆవిశన్= ప్రవేశించి, చేష్టా –శక్తిమ్ ఉదీర్య= వానికి కదలిక శక్తిని కలిగించి, తాని ఘటయన్ = వాటిని ఒకదానితో ఒకటి కలుపుచూ, హైరణ్యమ్ –అం డం= బంగారంలా మెరిసే బ్రహ్మాండమును, వ్యధాః= నిర్మించావు.

**తాత్పర్యము**: ఈ భూత గణములు , ఇంద్రియ గణములు వాటికి అధిష్ఠాన దేవతలు పుట్టినప్పటికి విడివిడిగా ఉన్నందున బ్రహ్మాండాన్ని నిర్మింపలేనివయ్యాయి. అప్పుడు వీటి అధిష్ఠాన దేవతలు నిన్ను అనేక విధాలయిన శ్రుతి సూక్తులచే పొగడగా నువ్వు వారి విజ్ఞప్తిపై తత్వములందు ప్రవేశించి వానికి కదలిక శక్తిని కలిగించి వాటిని ఒకదానితో ఒకటి కలుపుచూ బంగారంలా మెరిసే బ్రహ్మాండమును నిర్మించావు.

**విశేషాలు**

**బ్రహ్మాండ** : భూగోళ ఖగోళాదికము, అందలి లోకములు. చరాచరాఖిలము బ్రహ్మతత్త్వం నుంచి మొట్టమొదట బయటపడ్డ భూతం బ్రహ్మాండం. అండాకారంగా పెద్దదిగా వ్యాపించి కనిపిస్తుంది గనుక దీనికి బ్రహ్మాండమని పేరు. దీనిలో చేరినదే అండాండం. అంటే సూర్యచంద్రాది గోళాలు. అందులో సంచరించేవి పిండాండం. అంటే జరాయుజాది శరీరాలు.

**5–10 శ్లో.**

**అండం తత్ఖలు పూర్వసృష్టసలిలేఽతిష్ఠత్ సహస్రం సమాః**
**నిర్భిందన్నకృథాశ్చతుర్దశజగద్రూపం విరాడాహ్వయమ్ ।**
**సాహస్రైః కరపాదమూర్ధనివహైర్నిశ్శేషజీవాత్మకో**
**నిర్భాతోఽసి మరుత్పురాధిప! స మాం త్రాయస్వ సర్వామయాత్ ॥**

**ప్రతిపదార్థము**: తత్ అండం = ఆ అచేతనమయిన బ్రహ్మాండము, పూర్వ – సృష్ట – సలిలే = మొదటి సృష్టి అయిన ఆవరణ జలములో, సహస్రం సమాః= వేయి ఏండ్లు అలాగే (సమానం హసతి సమానంగా నవ్వునది. వేయి సంఖ్య. అనేకము.), అతిష్ఠత్ ఖలు = ఉన్నది కదా!, నిర్భిందన్ =ఆ తదుపరి నీవే అందులో ప్రవేశించి పలురకాలుగా విభజించి, చతుర్దశ– జగత్– రూపం =పదునాలుగు భువనాలు కలిగిన(చతుర్దశానాం పూర్ణః పదునాలుగు ), విరాట్ ఆహ్వాయమ్ = నీ విరాట్ రూపమును (విరాట్ =విశేషేణ రాజన్ విశేషంగా ప్రకాశించువాడు. రాజు ఆహ్వాయ = ఆహూయతే అనేన దీనితో పిలిచెదరు. పేరు.), అకృథాః =నిర్మించావు, సాహస్రైః కర= వేయి చేతులు, పాద= వేయి పాదాలు, మూర్ధ= వేయి తలల, నివహైః = సమూహములతో, నిశ్శేషజీవ– ఆత్మకః= సర్వ జీవాత్మకుడవై, నిర్భాతః –అసి = ప్రకాశిస్తున్నావు, మరుత్పురాధిప=ఓ గురువాయూరు దేవా !, సః = అటువంటి విరాడ్రూపముగల నువ్వు, మాం = నన్ను, సర్వ –ఆమయాత్= అన్ని రోగముల నుండి(ఆమం రోగం యాతి అనేన దీనితో రోగులగుదురు. రోగము మనోవ్యాధి.), త్రాయస్వ = రక్షింపుము.

**తాత్పర్యము**: ఆ అచేతనమయిన బ్రహ్మాండము మొదటి సృష్టి అయిన ఆవరణ జలములో వేయి ఏండ్లు అలాగే ఉన్నది కదా! ఆ తదుపరి నీవే అందులో ప్రవేశించి పలురకాలుగా విభజించి పదునాలుగు భువనాలు కలిగిన నీ విరాట్ రూపమును నిర్మించావు. వేయి చేతులు వేయి పాదాలు వేయి తలల సమూహములతో సర్వ జీవాత్మకుడవైనువ్వు ప్రకాశిస్తున్నావు. ఓ గురువాయూరు దేవా! అటువంటి విరాడ్రూపముగల నువ్వు నన్ను అన్ని రోగముల నుండి రక్షింపుము

**విశేషాలు:**

**పదునాలుగు లోకాలు**

1. భూలోకం, 2. భువర్లోకం, 3. సువర్లోకం, 4. మహ ర్లోకం, 5. జన లోకం, 6. తపో లోకం, 7. సత్య లోకం, 8. అతలం, 9. వితలం, 10. సుతలం, 11. తలాతలం, 12. మహా తలం, 13. రసాతలం, 14. పాతాళం. ఇవి పదునాలుగు లోకాలని ప్రసిద్ధి.

**5వ దశకము సమాప్తము.**

# దశకమ్ 6 – విరాట్స్వరూపవర్ణనము

**6-1 శ్లో.**

**ఏవం చతుర్దశజగన్మయతాం గతస్య**
**పాతాళమీశ! తవ పాదతలం వదంతి ।**
**పాదోర్ధ్వదేశమపి దేవ రసాతలం తే**
**గుల్ఫద్వయం ఖలు మహాతలమద్భుతాత్మన్ ॥**

**ప్రతిపదార్థం**: ఈశ! = ఈశ్వరా! (ఈశితుం శీలం అస్యశాసింపదగిన శీలం కలవాడు, శాసించు వాడు, పరమేశ్వరుడు), అద్భుత–ఆత్మన్= అద్భుతమైన ఆత్మ కలవాడా!, ఏవం = ఇట్లు, చతుర్దశ జగత్ –మయతాం గతస్య=పదునాలుగు లోకములు నీవే అయినప్పుడు, పాతాళమ్= పాతాళము, తవ పాదతలం =నీ పాదమని, వదంతి= చెబుతారు, దేవ= ఓ దైవమా!, రసాతలం = రసాతలాన్ని (రసాయాః తలం నిమ్నభాగస్థ లోకవిశేషః భూమి క్రిందున వున్న లోక విశేషము. రసాతలము.), పాద–ఊర్ధ్వ–దేశమ్ –అపి =నీ పాదాలపై గల ప్రదేశంగా (మీగాలు), మహాతలమ్ = మహాతలాన్ని(మహత్ తలమ్ పాతాళ విశేషము. మహాతలము.), తేగుల్ఫద్వయం ఖలు =నీ యొక్క చీలమండలుగా (గుడతి రక్షతి పాదమ్ పాదమును రక్షించునది. గుల్యతే రక్ష్యతే అభిఘాతాత్ దెబ్బల నుండి రక్షించునది. కాలు మడమ.), (వదంతి) ఖలు = చెబుతారు కదా.

**తాత్పర్యము**: ఈశ్వరా! అద్భుతమైన ఆత్మ కలవాడా! ఇట్లు పదునాలుగు లోకములు నీవే అయినప్పుడు పాతాళము నీ పాదమని చెబుతారు. ఓ దైవమా ! రసాతలాన్ని నీ పాదాలపై గల ప్రదేశంగా (మీగాలు) మహాతలాన్ని నీ యొక్క చీలమండలుగా చెబుతారు.

**విశేషాలు:** ఈ దశకములోని ఛందస్సు వసంత తిలక (మదన) వృత్తము. (**త , భ , జ , జ , గా**(గగ) )

**6-2 శ్లో.**

**జంఘే తలాతలమథో సుతలం చ జానూ**
**కించోరుభాగయుగలం వితలాతలే ద్వే ।**
**క్షోణీతలం జఘనమంబరమంగ! నాభిః**
**వక్షశ్చ శక్రనిలయస్తవ చక్రపాణే! ॥**

**ప్రతిపదార్థం**: చక్రపాణే! = చక్రము చేతియందు కలవాడా, తవ జంఘే= నీ కాలి వెనుకటిభాగము, తలాతలమ్ =తలాతలము, అథః= మరియు, జానూ చ సుతలం = మోకాలు సుతలము, కించ= మరియు, ఊరు-భాగ- యుగళం=తొడల జంట (ఊర్ణూయతే ఆచ్ఛాద్యతే కప్పబడినది. తొడ.), ద్వే వితల- అతలే = వితల అతల అను రెండు లోకములు (వితల=విశేషేణ తలం నీచమ్ ఒక పాతాళము అతలము.= అస్య భూఖండస్య తలమ్ పాతాళలోకాలలో మొదటిది.), క్షోణీతలం=భూమి (క్షిణోతి ప్రళయకాలే ప్రళయకాలంలో క్షీణించునది. భూమి.), జఘనమ్ = జఘనము (హన్యతే అసౌ తొడ గొట్టబడునది. జఘనము మొల), అంబరమ్ = ఆకాశము (అంబః శబ్దః తం రాతి ధత్తే శబ్దము కల్గియున్నది లేదా శబ్దము గుణముగా కల్గియున్నది. ఆకాశము.), అంగనాభిః=నాభి (నహ్యంతే ధమన్యః అత్రధమనులు ఇక్కడ కూడి యుండును. బొడ్డు.), వక్షః – చ = నీ వక్ష స్థలము (వక్షస్+అసున్+సుట్, ఉచ్యతే అనేన దీనితో మాట్లాడుదురు. హృదయము. రొమ్ము), శక్ర – నిలయః= ఇంద్రలోకము (స్వర్గ లోకము) (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు), (వదంతి = చెబుతారు).

**తాత్పర్యము**: చక్రము చేతియందు కలవాడా! నీ కాలి వెనుకటిభాగము తలాతలము. మరియు మోకాలు సుతలము .తొడల జంట వితల అతల లోకములు. జఘనము భూమి .నాభి ఆకాశము . నీ వక్ష స్థలము ఇంద్రలోకముగా (స్వర్గ లోకము) (వదంతి = చెబుతారు)

**6-3 శ్లో.**

**గ్రీవా మహస్తవ ముఖం చ జనస్తపస్తు**
**ఫాలం శిరస్తవ సమస్తమయస్య సత్యమ్ ।**
**ఏవం జగన్మయతనో! జగదాశ్రితైర-**
**ప్యన్యైర్నిబద్ధవపుషే భగవన్ నమస్తే ॥**

**ప్రతిపదార్థం**: జగన్మయతనో!= ఈ సమస్త జగాన్ని నీ శరీరంగా కలిగినవాడా!, భగవన్ = భగవంతుడా! తవ= నీయొక్క, గ్రీవా= కంఠం (గిరతి నిగలతి మ్రింగునది. కంఠము మెడ.), మహః= మహర్లోకం (మహ్యతే పూజ్యతే అస్మిన్ఇందులో పూజింపబడును.), ముఖం చ జనః =ముఖము జనోలోకం(ఖనతి అన్నాదికమనేన దీనితో అన్నాదులు నమలుదురు. ముఖము), ఫాలం తపః —తు = నుదురు తపోలోకము, తవ శిరః = నీ శిరస్సు(శ్రియతే ఆశ్రియతే శరీరేణ శరీరమును ఆశ్రయించునది. శిరస్సు.), సత్యమ్=సత్యలోకము (సతే హితమ్ సత్యమైనది, వాస్తవికము.), ఏవం = ఈ విధముగా, అన్యైః-జగత్-ఆశ్రితైః- అపి = లోకములనాశ్రయించి యుండు ఇతర విశేషములు నీ ఇతర అవయవములుగా, నిబద్ధవపుషే = రచింపబడిన శరీరముగా కలవాడా! (నితరాం బద్ధః బంధింపబడ్డవాడు.నిబద్ధ), నమః —తే = నీకు నమస్కారం.

**తాత్పర్యం**: ఈ సమస్త జగాన్ని శరీరంగా కలిగినవాడా! భగవంతుడా! నీయొక్క కంఠం మహర్లోకం. ముఖము జనోలోకం. నుదురు తపోలోకము, నీ శిరస్సు సత్యలోకము . ఈ విధముగా లోకములనాశ్రయించి యుండు ఇతర విశేషములు నీ ఇతర అవయవములుగా రచింపబడిన శరీరముగా కలవాడా! నీకు నమస్కారం.

**6-4 శ్లో.**

**త్వద్బ్రహ్మరంధ్రపదమీశ్వర! విశ్వకంద!**
**ఛందాంసి కేశవ ఘనాస్తవ కేశపాశాః ।**
**ఉల్లాసి చిల్లియుగలం ద్రుహిణస్య గేహమ్**
**పక్ష్మాణి రాత్రి దివసౌ సవితా చ నేత్రే! ॥**

**ప్రతిపదార్థం**: ఈశ్వర! = ఓ గురువాయూరు ఈశ్వరా!, విశ్వకంద! = విశ్వ మూలమా!, త్వత్– బ్రహ్మరంధ్రపదమ్ = నీ బ్రహ్మ రంధ్రము (బ్రహ్మణే బ్రహ్మప్రాప్తయే రంధ్రమ్ బ్రహ్మను పొందుటకు రంధ్రము. బహ్మరంధ్రము.), ఛందాంసి= ఛందస్సులు. (ఛందతి హృష్యతి యేన దీప్యతే వా దీనితో ప్రసన్నులగుదురు. ఛందస్సు వేదము.), కేశవ = కేశవా ! (కేశం కేశినం వాతి హినస్తి కేశిని చంపినవాడు. కేశవుడు.), తవ= నీయొక్క, కేశపాశాః=జుట్టుముడి, పాపిట (కేశానాం పాశి అలంకారః కేశములకు సౌందర్యము కల్పించునది. పాపిట.), ఘనాః = మేఘాలు. (ఘనతి దీప్యతే ప్రకాశించునది. మేఘము), ఉల్లాసి – చిల్లి – యుగలం = తీరైన కనుబొమలు, ద్రుహిణస్య గేహమ్=బ్రహ్మ పదం. (ద్రుహిణుడు=ద్రుహ్యతి దుష్టేభ్యః దుష్టులను హింసించువాడు. బ్రహ్మ.), పక్ష్మాణి= నీ కనురెప్పలు (పక్షతే పరిగృహ్యతే ఆతపాదికం అనేన ఆతపాదులను నివారించునది. కనురెప్ప.), రాత్రి– దివసౌ= రాత్రి మరియు పగలు(రమయతి భూతాని, ఉపరమయతి ఇతరాణి భూతములను సంతోషపెట్టునది ఇతర ప్రాణులను నిద్రపుచ్చునది. రాత్రి.), నేత్రే చ సవితా = కన్ను సూర్యుడు(సవిత=సూతే లోకాదీని లోకాదులను పుట్టించువాడు. పరమాత్మ సూర్యుడు.).

**తాత్పర్యము**: ఓ గురువాయూరు ఈశ్వరా! విశ్వ మూలమా! నీ బ్రహ్మ రంధ్రము ఛందస్సులు. కేశవా! నీయొక్క జుట్టుముడి మేఘాలు. తీరైన కనుబొమలు బ్రహ్మ పదం. నీ కనురెప్పలు రాత్రి పగలు. కన్ను సూర్యుడు.

**6–5 శ్లో.**
**నిశ్శేషవిశ్వరచనా చ కటాక్షమోక్షః**
**కర్ణౌ దిశోఽశ్వియుగళం తవ నాసికే ద్వే ।**
**లోభ త్రపే చ భగవన్నధరోత్తరోష్ఠౌ**
**తారాగణాశ్చ దశనాః శమనశ్చ దంష్ట్రా ॥**

**ప్రతిపదార్థము**: భగవన్ = భగవానుడా!, తవ కటాక్షమోక్షః = నీ కటాక్ష విలాసము, నిశ్శేష– విశ్వరచనా చ =అశేష ప్రపంచ రచనా విలాసము, కర్ణౌ దిశః = నీ చెవులు దిక్కులు, తవ నాసికే = నీ ముక్కు పుటములు, ద్వే అశ్వియుగళం = అశ్వినీదేవతలు,

అధర –ఉత్తర– ఓష్ఠౌ= క్రింది , పై పెదవులు, లోభ త్రపే చ= లోభము, సిగ్గు, దశనాః= నీ పలువరుస, తారా– గణాః –చ =నక్షత్రములు, దంష్ట్రా= నీ కోర, శమనః చ = యముడు.

**తాత్పర్యము**: భగవానుడా! నీ కటాక్ష విలాసము అశేష ప్రపంచ రచనా విలాసము. నీ చెవులు దిక్కులు. నీ ముక్కు పుటములు అశ్వినీదేవతలు క్రింది, పై పెదవులు లోభము, సిగ్గు. నీ పలువరుస నక్షత్రములు. నీ కోర యముడు.

**6–6 శ్లో.**
**మాయావిలాసహసితం శ్వసితం సమీరో**
**జిహ్వా జలం వచనమీశ! శకుంతపంక్తిః ।**
**సిద్ధాదయస్స్వరగణా ముఖరంధ్రమగ్నిః**
**దేవా భుజా స్తనయుగం తవ ధర్మదేవః ॥**

**ప్రతిపదార్థము**: ఈశ! = ఓ గురువాయూరు దేవ!, విలాస – హసితం= విలాసముతో కూడిన చిరునవ్వు, మాయా = నీ మాయ, శ్వసితం= నీ నిట్టూర్పు, సమీరః= వాయువు, జిహ్వా = నీ నాలుక (హూయతే ఖాద్యతే అనయా దీనితో తిందురు. నాలుక), జలం= జలము, వచనమ్=నీ పలుకులు, శకుంతపంక్తిః=పక్షుల పంక్తి, స్వరగణాః= నీ స్వర గణము, సిద్ధ –ఆదయః = సిద్ధులు మొదలయినవారు, ముఖ– రంధ్రమ్ = నీ ముఖ రంధ్రము, అగ్నిః= అగ్ని, భుజాః= నీ భుజములు, దేవాః= దేవతలు, తవ స్తనయుగం= నీస్తన యుగము (స్తనయతి కథయతి వక్షః శోభామ్ వక్షఃస్థల అందమును చెప్పునది. చన్ను.), ధర్మదేవః= ధర్మ దేవుడు.

**తాత్పర్యము**: ఓ గురువాయూరు దేవ! విలాసముతో కూడిన చిరునవ్వు నీ మాయ. నీ నిట్టూర్పు వాయువు. నీ నాలుక జలము. నీ పలుకులు పక్షుల పంక్తి. నీ స్వర గణము సిద్ధులు మొదలయినవారు నీ ముఖ రంధ్రము అగ్ని. నీ భుజములు దేవతలు నీస్తన యుగము ధర్మ దేవుడు.

**6-7 శ్లో.**

**పృష్ఠం త్వధర్మ ఇహదేవ! మనస్సుధాంశుః**
**అవ్యక్తమేవ హృదయాంబుజ మంబుజాక్ష! ।**
**కుక్షిస్సముద్రనివహా వసనం తు సంధ్యే**
**శేఫః ప్రజాపతిరసౌ వృషణౌ చ మిత్రః ॥**

**ప్రతిపదార్థము**: అంబుజాక్ష!= పద్మముల వంటి కన్నులు కలవాడా!, దేవ!= గురువాయూరు దేవా!, పృష్ఠం తు= నీ వెన్ను, అధర్మ = అధర్మము, ఇహ=ఇక్కడ, మనః= మనస్సు, సుధాంశుః= చంద్రుడు, హృదయ –అంబుజమ్=హృదయ పద్మము, అవ్యక్తమ్ –ఏవ= అవ్యక్తము(న వ్యక్తః ఇంద్రియ గోచరః వ్యక్తము గానిది, ఇంద్రియములకు గోచరము గానిది.), కుక్షిః = కడుపు(కుతి నిష్కర్షతి భుక్తాన్నాత్ రసం యః కుక్షి. తిన్న అన్నమును రసముగా మార్చునది.), సముద్రనివహాః =సముద్ర సమూహములు, వసనం తు సంధ్యే= వస్త్రము సంధ్య, శేఫః ప్రజాపతిః = లింగము ప్రజాపతి. (శేతే స్త్రీయోనౌ యోనిలో పడుకొనునది. పురుషుని లింగము), అసౌ వృషణౌ చ మిత్రః=మిత్రదేవుడు నీ వృషణాలు(వర్షతి వీర్యమ్ వీర్యమును వర్షించునది. వృషణము).

**తాత్పర్యము**: పద్మముల వంటి కన్నులు కలవాడా! గురువాయూరు దేవా! నీ వెన్ను అధర్మము. మనస్సు చంద్రుడు. హృదయ పద్మము అవ్యక్తము. కడుపు సముద్ర సమూహములు. వస్త్రము సంధ్య. లింగము ప్రజాపతి. మిత్రదేవుడు నీ వృషణాలు.

**6-8 శ్లో.**

**శ్రోణిస్థలం మృగగణాః పదయోర్నఖాస్తే**
**హస్త్యుష్ట్రసైంధవముఖా గమనం తు కాలః! ।**
**విప్రాదివర్ణభవనం వదనాబ్జబాహు-**
**చారూరుయుగ్మచరణం కరుణాంబుధే! తే ॥**

**ప్రతిపదార్థము**: కరుణా – అంబుధే!= ఓ దయా సముద్రుడా!, తే శ్రోణీః—స్థలం= నీ పిరుదులు (శ్రోణతి సంవృతో భవతి గట్టిగా వుండునది.), మృగగణాః =జంతుగణము, తే పదయోః నఖాః = నీ కాలిగోళ్లు, హస్తి ఉష్ట్ర —సైంధవ – ముఖాః= ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు మొదలయినవి, గమనం తు= నీ నడక, కాలః= కాలము, వదన – అబ్జ – బాహు –చారు – ఊరు యుగ్మ – చరణం =నీ ముఖపద్మము, బాహువులు,తొడల జంట, అడుగులు వరుసగా, విప్ర+ఆది–వర్ణ– భవనం= బ్రాహ్మణాదుల వర్ణములకు స్థానములు.

**తాత్పర్యము**: ఓ దయా సముద్రుడా! నీ పిరుదులు జంతుగణము. నీ కాలిగోళ్లు ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు మొదలయినవి. నీ నడక కాలము . నీ ముఖపద్మము, బాహువులు,తొడల జంట, అడుగులు వరుసగా బ్రాహ్మణాదుల వర్ణములకు స్థానములు.

**6–9 శ్లో.**

**సంసారచక్రమయి! చక్రధర! క్రియాస్తే**
**వీర్యం మహాసురగణోఽస్థికులాని శైలాః ।**
**నాడ్యస్సరిత్సముదయస్తరవశ్చ రోమ**
**జీయాదిదం వపురనిర్వచనీయమీశ! ॥**

**ప్రతిపదార్థము**: అయి! చక్రధర! = ఓ చక్రధరుడా!, ఈశ = ఈశుడా!, సంసారచక్రమ్ =ఈ జనన మరణ సంసార చక్రము, తే క్రియాః = నీ క్రియలు, వీర్యం = నీ పరాక్రమమే, మహా —అసుర– గణః= మహారాక్షస గణము, అస్థి–కులాని= నీ ఎముకల సమూహము (అస్యతే మాంస ధమన్యాది మధ్యే శరీరములో మాంస–ధమనుల మధ్యనుండునది. ఎముక.), శైలాః= పర్వతాలు, నాడ్యః= నాడులు (నడతి నాడయతి వా కదలునది. కొట్టుకొనునది, నాడి), సరిత్= నదులు, రోమసముదయః = నీ రోమములు, త రవః – చ =చెట్లు, అనిర్వచనీయమ్ =అ నిర్వచనీయమైన, ఇదం వపుః = ఈ నీ విశ్వ రూపమైన శరీరము, జీయాత్ = జయింపబడుగాక!.

**తాత్పర్యము**: ఓ చక్రధరుడా! ఈశుడా! ఈ జనన మరణ సంసార చక్రము నీ క్రియలు. నీ పరాక్రమము మహారాక్షస గణము. నీ ఎముకల సమూహము పర్వతాలు. నాడులు నదులు . నీ రోమములు చెట్లు. అ నిర్వచనీయమైన ఈ నీ విశ్వ రూపమైన శరీరము జయింపబడుగాక !

**6-10 శ్లో.**

**ఈదృగ్జగన్మయవపుస్తవ కర్మభాజాం**
**కర్మావసానసమయే స్మరణీయమాహుః ।**
**తస్యాంతరాత్మవపుషే విమలాత్మనే తే**
**వాతాలయాధిప! నమోఽస్తు నిరుంధి రోగాన్ ॥**

**ప్రతిపదార్థము**: వాతాలయాధిప!= ఓ గురువాయూరు దేవా!, ఈదృక్ = ఇట్టి, తవ = నీ, జగన్మయ- వపుః = విశ్వరూపము, కర్మభాజాం= కర్మ నిష్ఠులకు, కర్మ-అవసానసమయే =కర్మ సమాప్తిలో, స్మరణీయమ్ — ఆహుః= స్మరణీయమని చెప్పుచుందురు, తస్య —అంతర —ఆత్మ-వపుషే=ఈ విధముగా అంతర్యామిగా, విమలాత్మనే = శుద్ధ మయ మూర్తిగా ఉన్న, తే=నీకు, నమః -అస్తు = నమస్కారము, రోగాన్= నా రోగములను, నిరుంధి = హరింపుము.

**తాత్పర్యము**: ఓ గురువాయూరు దేవా! ఇట్టి నీ విశ్వరూపము కర్మ నిష్ఠులకు కర్మ సమాప్తిలో స్మరణీయమని చెప్పుచుందురు. ఈ విధముగా అంతర్యామిగా శుద్ధ మయ మూర్తిగా ఉన్న నీకు నమస్కారము. నా రోగములను హరింపుము.

**6వ దశకము సమాప్తము.**

# దశకమ్ 7 – సృష్టి క్రమము

**7-1 శ్లో.**
**ఏవం దేవ! చతుర్దశాత్మకజగద్రూపేణ జాతః పునః**
**తస్యోర్ధ్వం ఖలు సత్యలోకనిలయే జాతోఽసి ధాతా స్వయమ్ ।**
**యం శంసంతి హిరణ్యగర్భమఖిల త్రైలోక్యజీవాత్మకం**
**యోఽభూత్ స్ఫీతరజో వికారవికసన్నానాసిసృక్షారసః ॥**

**ప్రతిపదార్థము**: దేవ!= దేవా!, ఏవం= నువ్వు ఇట్లు, చతుర్దశ –ఆత్మక– జగత్ – రూపేణ= పదునాలుగు లోకముల రూపమును, జాతః = పొంది, పునః= మరలా, తస్య –ఊర్ధ్వం =వానికి పైన ఉన్న, సత్య–లోక – నిలయే=సత్యలోకములో, స్వయమ్ ధాతా =స్వయముగా బ్రహ్మ రూపములో, జాతః అసి ఖలు = పుట్టినవాడివయ్యావు కదా!, యం = ఇలా ఎవరైతే పుట్టారో అటువంటి నిన్ను, హిరణ్యగర్భమ్ = హిరణ్యగర్భునిగా, శంసంతి =అందురు, యః = ఎవడైతే ఈ హిరణ్యగర్భుడు ఉన్నాడో అతడు, అఖిల– త్రైలోక్య–జీవాత్మకం= మూడు లోకముల విరాట్ విగ్రహమునకు జీవరూపునిగా, అభూత్ = అయ్యాడు, స్ఫీతః –రజః – వికార – వికసన్= అతడు ప్రవృద్ధములైన రజోగుణ వికారములను ప్రకాశింపచేసి, నానా సిసృక్షా–రసః =అనేక శరీరములను, వాటికి అవసరములైన భోగ్య వస్తువులను సృష్టించాలనే వేడుక కలవాడు.

**తాత్పర్యము:** దేవా! నువ్వు ఇట్లు పదునాలుగు లోకముల రూపమును పొంది వానికి పైన ఉన్న సత్యలోకములో స్వయముగా బ్రహ్మ రూపములో పుట్టావు కదా! ఇలా పుట్టిన నిన్ను హిరణ్యగర్భునిగ చెబుతారు. ఈ హిరణ్యగర్భుడు మూడు లోకముల విరాట్ విగ్రహమునకు జీవరూపునిగా అయ్యాడు. అతడు ప్రవృద్ధములైన రజోగుణ వికారములను ప్రకాశింపచేసి అనేక శరీరములను, వాటికి అవసరములైన భోగ్య వస్తువులను సృష్టించాలనే వేడుక కలవాడు.

**విశేషాలు:**

**హిరణ్యగర్భుడు:** హిరణ్యమంటే బంగారమని వాచ్యార్థం. బంగారమంటే ఇక్కడ

భౌతికమైన లోహమని కాదు. లాక్షణికంగా చెబితే బంగారం జ్ఞానప్రకాశమే. అది గర్భంలో గుప్తం చేసుకున్న వ్యక్తి ఎవడో అతడు హిరణ్యగర్భుడు. కార్యబ్రహ్మమని అర్థం. అంటే పరమాత్మే సగుణ రూపంగా హిరణ్యగర్భుడయ్యాడు. గుణాలు ఆవరించినా అందులో హిరణ్యం అంటే బంగారులాగా ప్రకాశించే చైతన్యం తొంగి చూస్తూనే ఉంది. కనుకనే హిరణ్యగర్భుడనే పేరు వచ్చింది.

**7-2 శ్లో.**

**సోఽయం విశ్వవిసర్గదత్తహృదయః సంపశ్యమానస్స్వయం**
**బోధం ఖల్వనవాప్య విశ్వవిషయం చింతాకులస్తస్థివాన్ ।**
**తావత్త్వం జగతాం పతే! తప తపేత్యేవం హి వైహాయసీం**
**వాణీమేనమశిశ్రవః శ్రుతిసుఖాం కుర్వంస్తపః ప్రేరణామ్ ॥**

**ప్రతిపదార్థము:** జగతాం పతే!= జగత్తులకు అధిపతీ!, సః -అయం= ఆ బ్రహ్మ, విశ్వ- విసర్గ- దత్త- హృదయః=చరాచర సృష్టిని చేయాలనే కోరిక కలిగిన హృదయంతో, సంపశ్యమానః = కుతూహలంతో అటు ఇటు చూసి, స్వయం= స్వయముగా, బోధం— అనవాప్య= ఏమి తెలియక తికమక పడుతూ, విశ్వవిషయం =జగత్తు యొక్క సృష్టి విషయంలో, చింతా– ఆకులః– తస్థివాన్ ఖలు = విచారంతో ఉన్నాడు కదా!, తావత్ = ఆ సమయంలో, త్వం = నువ్వు అతనిని, తప తప = తపస్సు చేయి తపస్సు చేయి, ఇతి ఏవం హి=అను విధముగా, వైహాయసీం వాణీం= నీ ఆకాశవాణిని(విహాయసీ భవః ఆకాశంలో వుండునది), ఏనమ్– తపః ప్రేరణామ్ = అతని తపస్సుకు ప్రేరణగా, శ్రుతి–సుఖాం= చెవులకు ఇంపుగా (శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్థం తెలియును. వేదము చెవి), అశిశ్రవః కుర్వన్ = వినిపించితివి.

**తాత్పర్యము:** జగత్తులకు అధిపతీ! ఆ బ్రహ్మ చరాచర సృష్టిని చేయాలనే కోరిక కలిగిన హృదయంతో కుతూహలంతో అటు ఇటు చూసి ఏమి తెలియక తికమక పడుతూ జగత్తు యొక్క సృష్టి విషయంలో విచారంతో ఉన్నాడు .ఆ సమయంలో నువ్వు అతనిని తపస్సు చేయి తపస్సు చేయి అను విధముగా నీ ఆకాశవాణిని అతని తపస్సుకు ప్రేరణగా చెవులకు ఇంపుగా వినిపించితివి.

**7-3 శ్లో.**

**కోఽసౌ మామవదత్ పుమానితి జలాపూర్ణే జగన్మండలే**
**దిక్షూద్వీక్ష్య కిమప్యనీక్షితవతా వాక్యార్థముత్పశ్యతా ।**
**దివ్యం వర్షసహస్రమాత్తతపసా తేన త్వమారాధితః**
**తస్మై దర్శితవానసి స్వనిలయం వైకుంఠమేకాద్భుతమ్ ॥**

**ప్రతిపదార్థము:** జల-ఆపూర్ణే జగన్మండలే= ఈ ప్రపంచమంతా నీటితో నిండిన ఈ సమయంలో, కః —అసౌ పుమాన్ =ఎవడు, మామ్ = నాకు, అవదత్ = ఈ మాట చెప్పాడు?, ఇతి=అని, తేన= అతనిచే, వాక్య-అర్థమ్= దీని అర్థము ఏమిటని, దిక్షు — ఉత్పశ్యతా ఉద్వీక్ష్య=నాలుగు దిక్కులా పైకి కిందికి చూసి, కిమ్ —అపి= ఏమి కూడా, అనీక్షితవతా= చూడక, దివ్యం వర్షసహస్రమ్ =వేయి దివ్య సంవత్సరములు (వర్ష= వృష్యతే సిచ్యతే ప్రియతే ప్రార్థ్యతేతడుపబడునది. వర్షముసంవత్సరము.), ఆత్త-తపసా= తపస్సు చేసి, త్వమ్ -ఆరాధితః =నిన్ను ఆరాధింపగా, తస్మై= అతనికి, ఏక-అద్భుతమ్= పరమాద్భుతమైన, స్వ-నిలయం= నీ నిలయమైన, వైకుంఠమ్= వైకుంఠమును (వికుంఠస్య విష్ణోః ఇంద్రస్య వా ఇదం వా విష్ణువు ఉండు చోటు. స్వర్గము.), దర్శితవాన్ -అసి = చూపించావు.

**తాత్పర్యము:** ఈ ప్రపంచమంతా నీటితో నిండిన ఈ సమయంలో ఎవడు నాకు ఈ మాట చెప్పాడు? అని- దీని అర్థము ఏమిటని బ్రహ్మ నాలుగు దిక్కులా పైకి కిందికి చూసి ఏమి కూడా చూడక వేయి దివ్య సంవత్సరములు తపస్సు చేసి నిన్ను ఆరాధింపగా అతనికి పరమాద్భుతమైన నీ నిలయమైన వైకుంఠమును చూపించావు.

**విశేషాలు:** మానవ లౌకిక ప్రమాణమున ఒక సంవత్సరము దేవతలకు రేయింబగలు. మానవుల ఉత్తరాయనము దేవతలకు పగలు - దక్షిణాయనము రాత్రి. మానవ లౌకిక వత్సరములు ముప్పది దేవమాన మాసము. మానవ వత్సరములు నూరైనచో దేవతలకు మూడు మాసములు (మరి పది దినములు) అగును. మానవ లౌకిక వత్సరములు మూడువందలఅరువది యైనచో ఒక దేవవత్సరము. అనగా ఒక దివ్య వత్సరము. (మత్స్య మహాపురాణము)

**7-4 శ్లో.**

**మాయా యత్ర కదాపి నో వికురుతే భాతే జగద్భ్యోబహిః**
**శోక క్రోధ విమోహ సాధ్వసముఖా భావాస్తు దూరం గతాః ।**
**సాంద్రానందఝరీ చ యత్ర పరమజ్యోతిః ప్రకాశాత్మకే**
**తత్తే ధామ విభావితం విజయతే వైకుంఠరూపం విభో! ॥**

**ప్రతిపదార్థము:** యత్ర =ఎక్కడయితే వైకుంఠమున్నదో అక్కడ, కదాపి= ఎప్పుడు కూడా ఎటువంటి, మాయా= మాయ, వికురుతే న= తన ప్రభావాన్ని చూపలేదు, జగద్భ్యః = జగములన్నింటికి, బహిః = బయట (అతీతంగా), భాతే= ప్రకాశిస్తుంది, శోక -క్రోధ —విమోహ- సాధ్వసముఖాః=శోక, క్రోధ, మోహ, మరణ, భావాః — తు= భావములు అన్ననో, దూరం గతాః =ఆ వైకుంఠములో దూరముగా ఉంటాయి. (అక్కడ ఉండవని భావం), సాంద్ర-ఆనందఝరీ చ =దట్టమయిన ఆనంద ప్రవాహము ఉంటుంది, యత్ర = ఎక్కడ(ఆ వైకుంఠములో), పరమజ్యోతిః ప్రకాశాత్మకే=సూర్యాది జ్యోతిస్సులకు వెలుగును ఇచ్చు స్వయం జ్యోతి స్వరూపము. ( [ద్యోతతే ద్యుత్యవే అనేన] ప్రకాశించునది ప్రకాశింపచేయునది. సూర్యుడు అగ్ని కనుబొమ్మ.), విభో!= ప్రభూ !, తత్- తే వైకుంఠరూపం ధామమ్= ఆ నీ వైకుంఠ రూపమయిన నీ నిలయము, విభావితం=అన్నింటి గొప్పదై (విభావితః విశేషేణ చింతితః, ప్రాపితః, ఉత్పాదితః, నిష్పన్నః ఆలోచించబడ్డది, పొందబడ్డది, చేయబడ్డది, పూర్తియైనది.), విజయతే= ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము:** వైకుంఠములో ఎప్పుడు కూడా ఎటువంటి మాయ తన ప్రభావాన్ని చూపలేదు. జగములన్నింటికి బయట అతీతంగా ప్రకాశిస్తుంది. శోక, క్రోధ, మోహ, మరణ భావములు ఆ వైకుంఠములో ఉండవు. దట్టమయిన ఆనంద ప్రవాహము ఉంటుంది. ఆ వైకుంఠము సూర్యాది జ్యోతిస్సులకు వెలుగును ఇచ్చు స్వయం జ్యోతి స్వరూపము. ప్రభూ! ఆ నీ వైకుంఠ రూపమయిన నీ నిలయము అన్నింటి గొప్పదై ప్రకాశించుచున్నది.

**7–5 శ్లో.**

**యస్మిన్ నామ చతుర్భుజా హరిమణి శ్యామావదాతత్విషో**
**నానాభూషణరత్న దీపితదిశో రాజద్విమానాలయాః ।**
**భక్తిప్రాప్తతథావిధోన్నతపదా దీవ్యంతి దివ్యా జనాః**
**తత్ తే ధామ నిరస్తసర్వశమలం వైకుంఠరూపం జయేత్ ॥**

**ప్రతిపదార్థము:** యస్మిన్ –నామ=దేనియందు(ఏ వైకుంఠమందు), చతుర్భుజాః= చతుర్భుజులు, హరి–మణి శ్యామా అవదాతత్విషః =ఇంద్ర నీల మణి కాంతి విగ్రహులు, అవదాతత్విషః = స్వచ్ఛమయిన శోభ కలవారు (అవదాయతి ప్రకాశతే అసౌ స్వచ్ఛమయినది దీప్తౌ త్వేషతి, త్వేషతే ప్రకాశించుట.), నానాభూషణరత్న దీపిత దిశః = సువర్ణ భూషణ మణి కాంతులచే దిక్కులను ప్రకాశింపచేయువారు, రాజత్ –విమాన–ఆలయాః=చక్కటి విమాన ఆలయాలు కలవారు, భక్తి –ప్రాప్త–తథా– విధ–ఉన్నతపదాః=భక్తి చే ప్రాప్తించిన ఆ విధమైన ఉన్నతపదము( సారూప్యము =సమాన రూపత్వము.) కలవారు, దివ్యాః జనాః = దివ్యజనులు, దీవ్యంతి = వైకుంఠంలో ప్రకాశిస్తున్నారు, తత్ తే ధామ = అటువంటి నీ పరంధామము, నిరస్త–సర్వ–శమలం=సర్వవిధములైన తాపములను అణచునది అయిన, వైకుంఠ–రూపం= నీ వైకుంఠరూపము జయేత్= రాణించుగాక!

**తాత్పర్యము:** ఏ వైకుంఠమందు చతుర్భుజులు ఇంద్ర నీల మణి కాంతి విగ్రహులై , స్వచ్ఛమయిన శోభ కలవారై, సువర్ణ భూషణ మణి కాంతులచే దిక్కులను ప్రకాశింపచేయువారై , చక్కటి విమాన ఆలయాలు కలవారై, భక్తి చే ప్రాప్తించిన ఆ విధమైన ఉన్నతపదము( సారూప్యము) కలవారై ఏ దివ్యజనులు ప్రకాశిస్తున్నారో ,అటువంటి నీ పరంధామము సర్వవిధములైన తాపములను అణచునదయి, నీ వైకుంఠరూపము రాణించుగాక !

**7–6 శ్లో.**

**నానాదివ్య వధూజనైరభివృతా విద్యుల్లతాతుల్యయా**
**విశ్వోన్మాదన హృద్య గాత్రలతయా విద్యోతితాశాంతరా ।**

**త్వత్పాదాంబుజ సౌరభైకకుతుకాల్లక్ష్మీ స్స్వయం లక్ష్యతే**
**యస్మిన్ విస్మయనీయ దివ్యవిభవం తత్ తే పదం దేహిమే ॥**

**ప్రతిపదార్థము:** నానా–దివ్య –వధూజనైః = అనేక దివ్య సుందరీ జనుల సమోహముతో, అభివృతా=సేవించబడి(ప్రార్థితః సంభక్తః వరించబడినది, సేవించబడినది), విశ్వ–ఉన్మాదన= ప్రపంచానికి ఉన్మాదము కలిగించు (ఉన్మాదయతి చిత్తవిభ్రమం కరోతి అసౌ చిత్తవిభ్రమమును కల్గించునది), విద్యుత్ –లతా –తుల్యయా=మెరపు తీగ వలె మెరియు,హృద్య–గాత్ర–లతయా=అందమైన శరీరపు తీగచే, విద్యోతిత–ఆశాంతరా।=దిశలను మెరిపిస్తూ, త్వత్ –పాద –అంబుజ = నీ పాద పద్మముల, సౌరభైక = వాసనలను గ్రోలు, కుతుకాత్= కుతూహలముతో, లక్ష్మీః = లక్ష్మి (లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్ ప్రయత్నించువారిని చూచునది. విష్ణుపత్ని), స్వయం= తనకు తానే (ఆత్మనా తనకు తానే), లక్ష్యతే=చూడబడుచున్నది, యస్మిన్ =ఏ వైకుంఠమునందు, విస్మయనీయ= ఆశ్చర్యము కలిగించు, దివ్య– విభవం= దివ్యవైభవము ఉండునో, తత్ –తే పదం= అటువంటి నీ దివ్య ధామమును, మే దేహి=నాకు అనుగ్రహింపుము.

**తాత్పర్యము:** అనేక దివ్య సుందరీ జనుల సమోహముతో కలిసి ప్రపంచానికి ఉన్మాదము కలిగించు మెరపు తీగ వలె మెరియు అందమైన శరీరపు తీగచే దిశలను మెరిపిస్తూ నీ పాద పద్మముల వాసనలను గ్రోలు కుతూహలముతో లక్ష్మి – తనకు తానే వైకుంఠములో చూడబడుచున్నది.(స్వయముగా సాక్షాత్కరించుచున్నదని భావం) ఏ వైకుంఠమునందు ఆశ్చర్యము కలిగించు దివ్యవైభవము ఉండునో అటువంటి నీ దివ్య ధామమును నాకు అనుగ్రహింపుము.

**7–7 శ్లో.**
**తత్రైవం ప్రతిదర్శితే నిజపదే రత్నాసనాధ్యాసితం**
**భాస్వత్కోటి లసత్కిరీట కటకాద్యాకల్పదీప్రాకృతి ।**
**శ్రీవత్సాంకిత మాత్తకౌస్తుభమణిచ్ఛాయారుణం కారణం**
**విశ్వేషాం తవ రూపమైక్షత విధిస్తత్తే విభో! భాతు మే ॥**

**ప్రతిపదార్థము:** విభో= విశ్వమందు వ్యాపించినవాడా!, ఏవం = ఇట్లు, ప్రతిదర్శితే = అనుగ్రహముతో నీతో ప్రకాశించు, తత్ర నిజపదే =ఆ ఆత్మ లోకములో, రత్న–ఆసన–అధ్యాసితం = మణి సింహాసనముపై కూర్చొని ఉన్న, భాస్వత్ = ప్రకాశించు, కోటి లసత్–కిరీట= కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు కిరీటము, కటక–ఆది–ఆకల్ప– దీప్ర– ఆకృతి=కటకము(న కటతి వర్షతి జలం అస్మిన్ దండ కడియము) మొదలైన వాటిచే అలంకృతుని (ఆకల్ప్యతే అనేన అలంకరించునది), శ్రీవత్స–అంకితమ్ =శ్రీ వత్సము గుర్తుగా కలిగినవానిని (శ్రీ యుక్తం వత్సం వక్షః యస్య విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చ), ఆత్త= స్వీకరించబడిన, కౌస్తుభ– మణి–ఛాయా–= కౌస్తుభ మణి కాంతిచే (కుం భూమిం స్తుభ్నాతి కుస్తుభః సముద్రః తత్ర భవః సముద్రము నుండి పుట్టినది. కౌస్తుభమణి.), అరుణం కారణం = మిగతా శరీర భాగములందు అరుణత్వమును పొందిన వానిని (అనగా అరుణ మూర్తి అయిన వానిని ఋచ్ఛతి ప్రాప్నోతి వర్ణమ్ ఎరుపు), విశ్వేషాం = విశ్వ కారణుని, విధిః =బ్రహ్మ, తవ రూపమ్ =నీరూపాన్ని, ఐక్షత = దర్శించాడు, తత్ –తే= ఆ రూపాన్ని, మే భాతు= నాకు కూడా ప్రత్యక్షము చేయి.

**తాత్పర్యము:** విశ్వమందు వ్యాపించినవాడా! ఇట్లు ఆ ఆత్మ లోకములో మణి సింహాసనముపై కూర్చొని కోటి సూర్యుల కాంతితో ప్రకాశించు కిరీటము కటకముమొదలైన వాటిచే అలంకరింపబడి శ్రీ వత్సము గుర్తుగా కలిగిన అరుణ మూర్తి అయిన విశ్వ కారణుని నీరూపాన్ని బ్రహ్మ దర్శించాడు .ఆ రూపాన్ని నాకు కూడా ప్రత్యక్షము చేయి.

**7–8 శ్లో.**

**కాలాంభోదకలాయకోమలరుచాం చక్రేణ చక్రం దిశాం**
**ఆవృణ్వాన ముదార మందహసితస్యంద ప్రసన్నాననం ।**
**రాజత్కంబు గదారి పంకజధర శ్రీమద్భుజామండలం**
**స్రష్టుస్తుష్టికరం వపుస్తవ విభో! మద్రోగముద్వాసయేత్ ॥**

**ప్రతిపదార్థము:** విభో! = సర్వవ్యాపకుడా!, కాల+అంభోద=తొలకరి మేఘము లా, కలాయ–కోమల– రుచీ– చక్రేణ = కోమలము నీలమును అయిన శరీర కాంతి

మండలముచే, దిశాం చక్రం –ఆవృణ్వానమ్ = దిక్కుల మండలమును ఆవరించుచు, ఉదార –మంద–హసిత=అచ్ఛమయిన చిరునవ్వులు, స్యంద= ప్రసరించుటచే, ప్రసన్న–ఆననం= ప్రసన్నమయిన ముఖముతో, రాజత్ = ప్రకాశించు, కంబు– గద–అరి –పంకజధర శ్రీమద్ –భుజామండలం=శంఖ, చక్ర, గద, పద్మాలు ధరించిన ప్రకాశించు నాలుగు చేతులతో స్రష్టుః=బ్రహ్మకు, తుష్టికరం=దర్శనము ఇచ్చితృప్తిని ఇచ్చిన, తవ వపుః = నీ శరీరము(రూపము), మత్ = నాయొక్క, రోగమ్– = రోగమును (రుజతి రుజ్యతే వా అనేనపీడించునది, దీనితో పీడింపబడుదురు. వ్యాధి.), ఉద్వాసయేత్= హరింపగలదు.

**తాత్పర్యము:** సర్వవ్యాపకుడా! తొలకరి మేఘములా కోమలము నీలమును అయిన శరీర కాంతి మండలముచే దిక్కుల మండలమును ఆవరించుచు అచ్ఛమయిన చిరునవ్వులు ప్రసరించుటచే ప్రసన్నమయిన ముఖముతో ప్రకాశించు శంఖ, చక్ర, గద, పద్మాలు ధరించిన నాలుగు చేతులతో బ్రహ్మకు దర్శనము ఇచ్చితృప్తిని ఇచ్చిన నీ రూపము నాయొక్క రోగమును హరింపగలదు.

**విశేషాలు:**

**స్మృతే మనసి గోవిందే దూరతో యాంతి పాతకాః**
**ఉదయాచలమారూఢే దిననాథే తమో యథా** అని ప్రసిద్ధ వచనం.

సూర్యుడు ఉదయ పర్వతమును ఎక్కిన వెంటనే చీకటి ఎలా దూరముగా పరుగెత్తుతుందో– అలా– గోవిందుని మనస్సులో తలచుకొన్న వెంటనే పాపాలు అన్నీ దూరముగా పారిపోతాయి.అలా తన రోగము పారిపోతుందని భట్టతిరి వాక్యం.

**7–9 శ్లో.**

**దృష్ట్వా సంభృతసంభ్రమః కమలభూస్త్వత్పాదపాథోరుహే**
**హర్షావేశ వశంవదో నిపతితః ప్రీత్యా కృతార్థీభవన్ ।**
**జానాస్యేవ మనీషితం మమ విభో! జ్ఞానం తదాపాదయ**
**ద్వైతాద్వైత భవత్స్వరూప పరమిత్యాచష్ట తం త్వాం భజే ॥**

**ప్రతిపదార్థము:** విభో!= సర్వ వ్యాపకుడా!, దృష్ట్వా = నిన్ను చూసి, సంభృత–సంభ్రమః= సంతోషముతో వివశుడై, కమలభూః = కమల యోని అయిన బ్రహ్మ, త్వత్–పాద–పాథోరుహే–= నీ పాద పద్మములపై (పాథ= పీయతే త్రాగబడునది. నీరు.), హర్ష–ఆవేశ– వశంవదః = సంతోష, ఆవేశ వశంవదుడై ('వశం తవ అహం వశః అధీనః' ఇతి వదతి, వశం వదతి 'నీ వశంలో వున్నవాడను' అని అనువాదు.), నిపతితః=పడి, ప్రీత్యా = ప్రీతితో, కృతార్థీభవన్= ధన్యుడగుచు (ఇలా అన్నాడు), మమ= నాయొక్క, మనీషితం= కోరిక, జానాసి–ఏవ =ఎరిగియే ఉన్నావు.(ఆయన బుద్ధి సాక్షి కనుక), తత్ = ఆ ద్వైత–అద్వైత–= ద్వైతము, అద్వైతము అయిన (సకలము, నిష్కలము), భవత్–స్వరూప– పరమ్ జ్ఞానం =నీ నిక్కమైన జ్ఞానము, ఆపాదయ=నాకు అనుగ్రహముగా ప్రసరింపచేయుము, ఇతి+ఆచష్ట=అని వేడుకొనెను, తం= అటువంటి, త్వాం = నిన్ను (నేను), భజే=సేవిస్తాను.

**తాత్పర్యము:** సర్వ వ్యాపకుడా! నిన్ను చూసి సంతోషముతో వివశుడై బ్రహ్మ నీ పాద పద్మములపై సంతోష, ఆవేశ వశం వదుడై పడి ప్రీతితో ధన్యుడగుచు ఇలా అన్నాడు. నాయొక్క కోరిక ఎరిగియే ఉన్నావు. తత్ ద్వైతము, అద్వైతము అయిన భవత్–స్వరూప– నీ నిక్కమైన జ్ఞానము నాకు అనుగ్రహముగా ప్రసరింపచేయుము = అని వేడుకొనెను . అటువంటి నిన్ను (నేను) సేవిస్తాను.

**7–10 శ్లో.**

**ఆతామ్రే చరణే వినమ్రమథ తం హస్తేన హస్తే స్పృశన్**
**బోధస్తే భవితా న సర్గవిధిభిర్బంధోఽపి సంజాయతే ।**
**ఇత్యాభాష్య గిరం ప్రతోష్య నితరాం తచ్చిత్తగూఢస్స్వయం**
**సృష్టౌ తం సముదైరయః స భగవన్నుల్లాసయోల్లాఘతామ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, ఆతామ్రే చరణే =ఎరుపైన తన పాదములందు, వినమ్రమ్ =వ్రాలిన, తం =ఆ బ్రహ్మ యొక్క, హస్తేన హస్తే స్పృశన్= చేతిని తన చేత తాకుచు, తే = నీకు, బోధః = జ్ఞానము (బుద్ధ్యతే జ్ఞాయతే జ్ఞానము), భవితా=కలుగును, సర్గ– విధిభిః న బంధః –అపి సంజాయతే=సృష్టికార్యము నీకు

బంధము కాదు, ఇతి+ గిరం ఆభాష్య= అని పలికి, నితరాం=అతిశయముతో, ప్రతోష్య = అతనిని సంతోషపెట్టి, తత్–చిత్త గూఢః స్వయం= ఆ బ్రహ్మ చిత్తములో గూఢముగా అంతర్యామి రూపములో ఉండి, తం= అతనిని, సృష్టౌ =సృష్టి కార్యమున, సముదైరయః=చక్కగా ప్రేరేపించిన ఏ భగవంతుడు కలడో, స భగవన్ = అట్టి భగవంతుడైన నువ్వు, ఉల్లాఘతామ్= నాకు ఆరోగ్యమును, ఉల్లాసయ = చక్కగా కలిగించుము.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఎరుపైన తన పాదములందు వ్రాలిన ఆ బ్రహ్మ యొక్క చేతిని తన చేత తాకుచు "నీకు జ్ఞానము కలుగును. సృష్టికార్యము నీకు బంధము కాదు". అని పలికి అతనిని సంతోషపెట్టి ఆ బ్రహ్మ చిత్తములో గూఢముగా అంతర్యామి రూపములో ఉండి అతనిని సృష్టి కార్యమున చక్కగా ప్రేరేపించిన ఏ భగవంతుడు కలడో అట్టి భగవంతుడైన నువ్వు నాకు ఆరోగ్యమును చక్కగా కలిగించుము.

**విశేషాలు:** సముదైరి యః సభగవాన్.... అని దీనిని విభజించవచ్చునని డా. సూరం శ్రీనివాసులుగారి అభిప్రాయం.

సమ్+ఉత్(ద)+ఐరి...ఈర్‌కమ్పనేధాతువుమీదలజ్‌ప్రథమపురుషైకవచనరూపం

***ద్వితీయస్కంధము పరిపూర్ణము***

**7వ దశకము సమాప్తము.**

# తృతీయ స్కంధము

## దశకమ్ 8 – ప్రళయవర్ణనము

**8-1 శ్లో.**
**ఏవం తావత్ ప్రాకృతప్రక్షయాంతే**
**బ్రాహ్మే కల్పే హ్యాదిమే లబ్ధజన్మా ।**
**బ్రహ్మా భూయస్త్వత్త ఏవాప్య వేదాన్**
**సృష్టిం చక్రే పూర్వకల్పోపమానమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏవం = ఇట్లు, ప్రాకృతప్రక్షయః= మహాప్రళయము యొక్క, అంతే= చివర, ఆదిమే = మొదటిదగు, బ్రాహ్మే కల్పే లబ్ధజన్మా = బ్రహ్మ కల్పమందు జన్మించిన, బ్రహ్మా= బ్రహ్మ, భూయః= తిరిగి, త్వత్తః ఏవ= నీ వలననే, అపి = కూడా, వేదాన్= ఋగ్వేదము మొదలైన వేదములను పొంది (విద్యతే అనాది కాలాత్ అనాదికాలం నుండి వుండునది. వేదము.), పూర్వకల్ప–ఉపమానమ్=పూర్వ కల్పమును పోలిన, తావత్= అంతయు, సృష్టిం చక్రే హి= సృష్టిని చేసెను కదా!

**తాత్పర్యము:** ఇట్లు మహాప్రళయము యొక్క చివర మొదటిదగు బ్రహ్మ కల్పమందు జన్మించిన బ్రహ్మ తిరిగి నీ వలననే ఋగ్వేదము మొదలైన వేదములను పొంది పూర్వ కల్పమును పోలిన సృష్టిని చేసెను.

**విశేషాలు:** ఋతువులందు ఆ యా ఋతువుల గుర్తులు ఒకే రూపమున ఉన్నట్లు ప్రతి కల్పములో సృష్టి కూడా పూర్వ కల్పములో ఉన్నట్లు ఉంటుందని పెద్దల మాట. దీనినే కవి మనకు ఈ శ్లోకంలో గుర్తు చేసాడు.

ఈ శ్లోకం శాలిని ఛందస్సులో ( మతతగా–గగ ) ఉన్నది.

**8-2 శ్లో.**
**సోఽయం చతుర్యుగ సహస్ర మితాన్యహాని**
**తావన్మితాశ్చ రజనీర్బహుశో నినాయ ।**

**నిద్రాత్యసౌ త్వయి నిలీయ సమం స్వసృష్టైః**
**నైమిత్తిక ప్రలయమాహురతోఽస్యరాత్రిమ్ ॥**

**ప్రతిపదార్థము:** సః= ఈ, చతుః యుగ సహస్ర మితాని = చతుర్యుగ సహస్ర పరిమితములైన, అహాని= పవళ్ళు అనగా కల్పములను, తావత్– మితాః చ= అదే పరిమితములైన, రజనీః =రాత్రులను(రజ్యంతే లోకాః అత్ర లోకములు దీనియందు ఆనందింతురు. రాత్రి.), బహుశః= అనేక మారులు, నినాయ= గడపును, అతః= అటుపిమ్మట, అసౌ= తాను, స్వసృష్టైః= సృష్టించిన సృష్టితోపాటు, సమం= సమముగా, త్వయి= నీయందు(నారాయణునియందు), నిలీయ= లీనుడై, నిద్రాతి= నిద్రపోవును, అస్యరాత్రిమ్= ఈ బ్రహ్మకు సంబంధించిన రాత్రి, యం= ఏదైతే ఉన్నదో, దానిని నైమిత్తిక ప్రళయమ్ = నైమిత్తిక ప్రళయమని (నైమిత్తికో లయః ప్రళయః బ్రహ్మదినము గడచిన తరువాత వచ్చు ప్రళయము.) ఆహుః= చెప్పుదురు.

**తాత్పర్యము:** ఈ చతుర్యుగ సహస్ర పరిమితములైన పవళ్ళు అనగా కల్పములను అదే పరిమితములైన రాత్రులను బ్రహ్మ గడపును. అటుపిమ్మట తాను సృష్టించిన సృష్టితోపాటు నీయందు లీనుడై నిద్రపోవును. ఈ బ్రహ్మకు సంబంధించిన రాత్రి ఏదైతే ఉన్నదో దానిని నైమిత్తిక ప్రళయమని చెప్పుదురు.

**విశేషాలు:** ఈ శ్లోకం మదనము . **త , భ , జ , జ , గా(గగ)**

బ్రహ్మ యొక్క పగటి ప్రమాణము, రాత్రి ప్రమాణములు సమానములు. వేయి చతుర్యుగముల కాలము (అనగా 1000 x 4 యుగాలు) – బ్రహ్మకి ఒక దినమున పగలు అగును. మరియొక వేయి చతుర్యుగముల కాలము రాత్రి అవుతుంది.

**8–3 శ్లో.**
**అస్మాదృశాం పునరహర్ముఖకృత్యతుల్యాం**
**సృష్టిం కరోత్యనుదినం స భవత్ప్రసాదాత్ ।**
**ప్రాగ్బ్రహ్మకల్పజనుషాం చ పరాయుషాం తు**
**సుప్తప్రబోధనసమాఽస్తి తదాపి సృష్టిః ॥**

**ప్రతిపదార్థము:** అస్మాదృశాం= మనము చేయు, అహర్ముఖకృత్యతుల్యాం= స్నానసంధ్య మొదలయిన నిత్య కృత్యముల వలె, సః = ఆబ్రహ్మ, భవత్ – ప్రసాదాత్= నీ అనుగ్రహము వలన, అనుదినం= దినదినము, పునః= మరలా, సృష్టిం కరోతి= సృష్టి చేయును, ప్రాక్ – బ్రహ్మకల్పజనుషాం చ =పూర్వకల్పమందు పుట్టి, పర– ఆయుషాం తు= అనేక కల్పాయుష్కులై ఉండు మార్కండేయుడు మొదలయిన చిరంజీవులకు, తదాపి సృష్టిః= అప్పుడు సృష్టి అయినప్పటికి, సుప్త – ప్రబోధనసమా = అది నిద్ర పోయి మేల్కొనినట్లు (సుప్తః నిద్రితః శయితఃపడుకొన్నవాడు.) (ప్రబోధయతి తస్య భావః కర్మ వా మేల్కొలుపు), అస్తి = ఉంటుంది (సృష్టిగా తోచదు).

**తాత్పర్యము:** మనము చేయు స్నానసంధ్య మొదలయిన నిత్య కృత్యముల వలె ఆబ్రహ్మ నీ అనుగ్రహము వలన దినదినము సృష్టి చేయును. పూర్వకల్పమందు పుట్టి అనేక కల్పాయుష్కులై ఉండు మార్కండేయుడు మొదలయిన చిరంజీవులకు సృష్టి అయినప్పటికి అది నిద్ర పోయి మేల్కొనినట్లు ఉంటుంది (సృష్టిగా తోచదని భావం.)

**విశేషాలు:** ఈ శ్లోకం మదనము అను . **త , భ , జ , జ , గా**(**గగ**)

**8–4 శ్లో.**

**పంచాశదబ్దమధునా స్వవయోఽర్ధరూపం**
**ఏకం పరార్ధమతివృత్య హి వర్తతేఽసౌ ।**
**తత్రాంత్యరాత్రి జనితాన్ కథయామి భూమన్!**
**పశ్చాద్దినావతరణే చ భవద్విలాసాన్ ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= కాల దేశముల హద్దులేనివాడా!, అధునా= ఇప్పుడు, అసౌ=ఈ బ్రహ్మకు, పంచాశత్ –అబ్దమ్= ఏబది యేండ్ల వయస్సు, స్వ= తనయొక్క, వయః–అర్ధరూపం=ద్విపరార్థముల వయస్సులోని మొదటి అర్థ రూపమైన, ఏకం పరార్ధమ్ = ఒక పరార్థము (పరం చ అసౌ అర్ధం చ, బ్రహ్మణః ఆయోః ద్వితీయార్ధమ్ బ్రహ్మ ఆయువు యొక్క రెండవ సగము), అతివృత్య వర్తతే

హి= గడచింది (హిశబ్దము ప్రసిద్ధి), తత్ర-అంత్యరాత్రి జనితాన్ = ప్రథమ పరార్థము యొక్క చివరి రాత్రి సమయంలో, పశ్చాత్ = తరువాత, దిన-అవతరణే చ = పగలులో కల్పారంభంలో జరిగినట్టి, భవత్ -విలాసాన్= నీ విలాసములను, కథయామి= చెప్పుచున్నాను. (స్తోత్రము చేయుచున్నాను).

**తాత్పర్యము:** కాల దేశములకు అపరిచ్ఛిన్నుడా! గురువాయూరు దేవా! ఇప్పుడు ఈ బ్రహ్మకు ఏబది యేండ్ల వయస్సు. తనయొక్క ద్విపరార్థముల వయస్సులోని ఒక పరార్థము గడచింది ప్రథమ పరార్థము యొక్క చివరి రాత్రి సమయంలో తరువాత పగలులో కల్పారంభంలో జరిగినట్టి నీ విలాసములను చెప్పుచున్నాను. (స్తోత్రము చేయుచున్నాను)

**విశేషాలు:** ఈ శ్లోకం మదనము . **త , భ , జ , జ , గా**(గగ)

**8-5 శ్లో.**
**దినావసానేఽథ సరోజయోనిః**
**సుషుప్తికామస్త్వయి సన్నిలిల్యే! ।**
**జగంతి చ త్వజ్జఠరం సమీయు**
**స్తదేదమేకార్ణవమాస విశ్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** అథ = అటుపిమ్మట, దిన-అవసానే= పగటి చివర ( గత కల్పము చివరరోజు), సరోజయోనిః= బ్రహ్మ, సుషుప్తికామః =సుషుప్తిని కోరుకొన్నవాడై (మేల్కొన్న తరువాత కలలు సైతం జ్ఞాపకం రాని గాఢనిద్ర సుషుప్తి. సుష్ఠు స్వపితి తస్య భావః కర్మ వా నిద్రావస్థ.), త్వయి=శ్రీ మన్నారాయణుడవయిన నీయందు, సన్నిలిల్యే= నిద్రపోయాడు, జగంతి చ = ఆయనతో పాటు లోకములు కూడా, త్వత్ జఠరం = నీ గర్భ గోళములో(జాయతే ప్రాణి అస్మిన్ ఇందులో ప్రాణి వుండును. కడుపు), సమీయుః= ప్రవేశించాయి, తదా = అపుడు, ఇదమ్- విశ్వమ్ =ఈ ప్రపంచము, ఏకార్ణవమ్-ఆస = ఏకార్ణవముగ ప్రకాశించింది.(నీటి మాత్రముగా మిగిలిందని భావం. అర్ణాంసి పయాంసి సంతి అస్మిన్ ఇందులో జలములుండును కనుక అర్ణవము. సముద్రము).

**తాత్పర్యము:** అటుపిమ్మట పగటి చివర బ్రహ్మ సుషుప్తి కాముడై – శ్రీ మన్నారాయణుడవయిన నీయందు నిద్రపోయాడు. ఆయనతో పాటు లోకములు కూడా నీ గర్భ గోళములో(పొట్టలో) ప్రవేశించాయి. అపుడు ఈ ప్రపంచము ఏకార్ణవముగ ప్రకాశించింది.( నీటి మాత్రముగా మిగిలిందని భావం)

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

**8-6 శ్లో.**

**తవైవ వేషే ఫణి రాజిశేషే**
**జలైకశేషే భువనే స్మ శేషే ।**
**ఆనందసాంద్రానుభవస్వరూపః**
**స్వయోగనిద్రా పరిముద్రితాత్మా ॥**

**ప్రతిపదార్థం:** తవ= నువ్వు, వేషే= నీ వేషాంతరమయిన, ఫణిరాజిశేషే = నాగశ్రేష్ఠుడయిన శేషునియందు(ఫణతి విస్తృతో భవతి విస్తృతమగునది. పాము పడగ శిష్యతే ఉపయుక్తాదన్యః శేషేణ మిగిలిపోవునది. ప్రసాదము పతంజలి. ఆదిశేషుడు), జల–ఏకశేషే భువనే స్మ = ప్రపంచము నీటి మాత్రముగా ఉండగా(ఏకః శేషః యత్ర (ద్వయోః ఏకం పదం శిష్యతేఽత్ర ఒకటే మిగులుట ఏకశేషము), ఆనందసాంద్రానుభవస్వరూపః ఏవ = పరిపూర్ణ ఆనందానుభవ స్వరూపుడవైన(సచ్చిదానంద స్వరూపుడవైన) నువ్వు, స్వయోగనిద్రా పరిముద్రిత ఆత్మా= తన స్వరూపమును కూర్చెడి రూపము కలిగిన యోగనిద్రా ముద్రితునిగా(ప్రళయకాలపు విష్ణువుకు యోగనిద్ర అని మరొక పేరు), శేషే(స్మ)= పడుకొన్నావు.

**తాత్పర్యము:** నువ్వు నీ వేషాంతరమయిన నాగశ్రేష్ఠుడయిన శేషునియందు ప్రపంచము నీటి మాత్రముగా ఉండగా సచ్చిదానంద స్వరూపుడవై యోగ నిద్రా ముద్రితునిగా పడుకొన్నావు.

**విశేషాలు:**

1. ఈ శ్లోకం వారాంగి .

ఒకటవ పాదమునందు **జ , త , జ , గా(గగ)** గణములుండును.
రెండవ పాదమునందు **జ , త , జ , గా(గగ)** గణములుండును.
మూడవ పాదమునందు **త , త , జ , గా(గగ)** గణములుండును.
నాలుగవ పాదమునందు **త , త , జ , గా(గగ)** గణములుండును.

**8–7 శ్లో.**
**కాలాఖ్యశక్తిం ప్రళయావసానే**
**ప్రభోధయేత్యాదిశతా కిలాదౌ ।**
**త్వయా ప్రసుప్తం పరిసుప్తశక్తి**
**వ్రజేన తత్రాఖిలజీవధామ్నా ॥**

**ప్రతిపదార్థము:** ఆదౌ = ప్రళయారంభములో, పరిసుప్త = నిద్రపోతున్న, శక్తి వ్రజేన = మూల ప్రకృతి, మహత్తత్వము, అహంకారము మొదలయిన, అఖిలజీవధామ్నా = అఖిల జీవ సమూహములకు విశ్రాంతి స్థానమయిన, కాలాఖ్యశక్తిం = కాలమను పేరు గల శక్తిని(కలయతి ఆయుః కలయతి సర్వాణి భూతాని ఆయువును లెక్కించునది కాలము, ప్రళయ అవసానే = ప్రళయము చివర, ప్రభోధయ ఇతి = నన్ను నిద్రలేపుమని, ఆదిశత = ఆజ్ఞాపించి, త్వయా = నీచేత(నువ్వు ఆమెతో కలిసి), ప్రసుప్తం కిల = నిద్ర పోయావు కదా.

**తాత్పర్యము:** ప్రళయారంభములో నిద్రపోతున్న మూల ప్రకృతి, మహత్తత్వము, అహంకారము మొదలయిన అఖిల జీవ సమూహములకు విశ్రాంతి స్థానమయిన కాలమను పేరు గల శక్తిని ప్రళయము చివర నన్ను నిద్రలేపుమని ఆజ్ఞాపించి నువ్వు ఆమెతో కలిసి నిద్ర పోయావు.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ) మొదటి పాదంలో ఛందస్సు సరిపోవుట లేదు. జగణానికి బదులు తగణం వస్తున్నది.

ఒక నాయకునికి అనేకమంది భార్యలు. మిగతా వారందరూ నిద్రపోగా– తనకు ఇష్టమైన ఒక విశిష్ట నాయికతో కొంచెం సేపు గడిపిన తరువాత మంచి మెలకువ కలిగిన అమెతో తెల్లవారగానే తనను నిద్ర లేపుమని చెప్పి ఆమెను గాఢముగ

గౌగలించుకొని ఆమెతో నిద్ర పోయాడు. ఇదే పద్ధతిలో నారాయణుడు ఇక్కడ నాయకుడు. మూల ప్రకృతి, మహత్తత్వము మొదలయిన వారు నాయికలు. వారు నిద్రపోయిన తరువాత కాలాఖ్యశక్తి అను నాయికతో తనను నిద్ర లేపుమని చెప్పి ఆమెతో సహ నారాయణుడు నిద్ర పోయాడు అని ఈ శ్లోక వ్యాఖ్యానంగా పెద్దలు చెప్పారు. (తయైవ సహ గాఢమాలింగ్య ససుఖం నిద్రాం గచ్ఛతి తద్వత్ ఇతి భావః)

**8-8 శ్లో.**

**చతుర్యుగాణాం చ సహస్రమేవం**
**త్వయి ప్రసుప్తే పునరద్వితీయే ।**
**కాలాఖ్యశక్తిః ప్రథమప్రబుద్ధా**
**ప్రాబోధయత్త్వాం కిల విశ్వనాథః! ॥**

**ప్రతిపదార్థం:** విశ్వనాథః = విశ్వమునకు ప్రభువైన గురువాయూరు ప్రభూ!, అద్వితీయే= రెండవది అనునది లేకుండా, త్వయి = నీయందు(నువ్వు), ఏవం= ఇట్లు, చతుః -యుగాణాం సహస్రమ్ చ= నాలుగు యుగ సహస్రములు (ప్రళయావసానము వరకు), ప్రసుప్తే సతి = నిదురించగా, పునః = మరలా, కాల- ఆఖ్యశక్తిః= కాలమను పేరుగల శక్తి, ప్రథమప్రబుద్ధా = మొదటగా మేల్కొని, త్వాం = నిన్ను, ప్రాబోధయత్ చ కిల = మేలుకొలిపినదట (అట అనుఅ ర్థము వచ్చు కిల అను అవ్యయము పురాణ ప్రసిద్ధిని తెలుపుటకు కవిచే ప్రయోగింపబడినది).

**విశేషాలు:**

2. ఈ శ్లోకం వారాంగి .

ఒకటవ పాదమునందు **జ , త , జ , గా**(**గగ**) గణములుండును.

రెండవ పాదమునందు **జ , త , జ , గా**(**గగ**) గణములుండును.

మూడవ పాదమునందు **త , త , జ , గా**(**గగ**) గణములుండును.

నాలుగవ పాదమునందు **త , త , జ , గా**(**గగ**) గణములుండును.

**8-9 శ్లో.**

**విబుధ్య చ త్వం జలగర్భశాయిన్!**
**విలోక్య లోకానఖిలాన్ ప్రలీనాన్ ।**
**తేష్వేవ సూక్ష్మాత్మతయానిజాంతః**
**స్థితేషు విశ్వేషు దదాథ దృష్టిమ్ ॥**

**ప్రతిపదార్థము:** జలగర్భశాయిన్!= జలగర్భమునందు శయనించి ఉండువాడా!, త్వం= నువ్వు, విబుధ్య చ = మేల్కొని, అఖిలాన్ లోకాన్ = నీలోపల సమస్త లోకములు (లోకతే ప్రకాశతే ప్రకాశించునది. లోకము. పృథివ్యాది లోకములు భూ-భువః-స్వర్ లోకాదులు, చతుర్దశ భువనాలు. ), ప్రలీనాన్= విలీనమగుట ను, విలోక్య= చూసి, సూక్ష్మ = సూక్ష్మముగా, ఆత్మతయా = కారణ రూపముగా –, నిజాంతః స్థితేషు= నీలో ఉన్న, తేషు+ఏవ= వాటియందు, విశ్వేషు = లోకములందు, దృష్టిమ్ = దృష్టిని, దదాథ= ఇచ్చావు( చూసావని భావం).

**తాత్పర్యము:** జలగర్భమునందు శయనించి ఉండువాడా! నువ్వు మేల్కొని నీలోపల సమస్త లోకములు విలీనమగుట ను చూసావు.సూక్ష్మముగా కారణ రూపముగా నీలో ఉన్న లోకములందు దృష్టిని ప్రసరించావు.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపేంద్రవజ్రము. జ , త , జ , గా(గగ) మూడవపాదము మొదటి గణము చింత్యము.

**8-10 శ్లో.**

**తతస్త్వదీయాదయి! నాభిరంధ్రా**
**దుదంచితం కించన దివ్యపద్మమ్ ।**
**నిలీన నిశ్శేషపదార్థమాలా**
**సంక్షేపరూపం ముకుళాయమానమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ భగవంతుడా!, తతః = నువ్వు చూసిన తరువాత, త్వదీయాత్ నాభిరంధ్రాత్= నీ నాభిరంధ్రము నుండి, కించన= ఇంచుకంత (కించిత్ ఏవ న పూర్ణమ్ కొంచెమే అపూర్ణము.), దివ్య =దివ్యమయిన, నిలీన

=లీనమయిన, నిశ్శేష= (నిర్గతః శేషాత్ శేషము లేనిది. సంపూర్ణమయిన) అశేషమయిన, పదార్థ = జీవించుటకు ఉపభోగ్యములయిన పదార్థముల యొక్క, మాలా= సమూహముయొక్క, సంక్షేపరూపం = సంగ్రహరూపముగా ఉన్న (సంపూర్ణ ప్రపంచ బీజరూపమని భావం), ముకుళాయమానమ్= మొగ్గగా ఉన్న, పద్మమ్= పద్మము ఒకటి, ఉదంచితం= మొలచింది.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! నువ్వు చూసిన తరువాత నీ నాభిరంధ్రము నుండి ఇంచుకంత దివ్యమయిన –అశేషమయిన జీవించుటకు ఉపభోగ్యములయిన పదార్థముల యొక్క సమూహముయొక్క సంగ్రహరూపముగా ఉన్న–మొగ్గగా ఉన్న పద్మము ఒకటి మొలచింది.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపజాతి.

**8–11 శ్లో.**

**తదేతదంభోరుహకుడ్మలం తే**
**కళేవరాత్తోయపథే ప్రరూఢమ్! ।**
**బహిర్నిరీతం పరితః స్ఫుర ద్భిః**
**స్వధామభిర్ధ్వాంతమలం న్యకృంతత్ ॥**

**ప్రతిపదార్థము:** తత్ ఏతత్ అంభోరుహకుడ్మలం = ఈ తామరమొగ్గ (కుడ్మలం = అవికసితం పుష్పమ్ వికసించని పువ్వు.), తే = నీయొక్క (శ్రీ నారాయణుని యొక్క), కళేవరాత్= శరీరము నుండి, తోయపథే = జలప్రదేశమందు, ప్రరూఢమ్= మొలిచి, బహిః = బయటకు, నిరీతం= వెడలెను, పరితః = ఎల్లెడలా, స్ఫుర ద్భిః= ప్రకాశించు, స్వధామభిః = తన కాంతులచే (ధీయతే ద్రవ్యజాతమస్మిన్ వస్తువులు పెట్టు చోటు. ఇల్లు ఆశ్రయము జ్యోతి, ధ్వాంత మలం= తమోరూపమైన మలమును అనగా చీకట్లను(ధ్వాంత =ధ్వనంతి శబ్దం కుర్వంతి మార్గజ్ఞాపనాయ అత్ర మార్గము తెలుసుకొనుటకు దీనిలో శబ్దము చేయుదురు. అంధకారము), న్యకృంతత్= హరించెను.

**తాత్పర్యము:** ఈ తామరమొగ్గ నీయొక్క (శ్రీ నారాయణుని యొక్క) శరీరము నుండి జలప్రదేశమందు మొలిచి బయటకు వెడలెను. ఎల్లెడలా ప్రకాశించు తన కాంతులచే చీకట్లను హరించెను.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

**8–12 శ్లో.**
**సంపుల్లపత్రే నితరాం విచిత్రే**
**తస్మిన్ భవద్వీర్యధృతే సరోజే ।**
**స పద్మజన్మా విధిరావిరాసీత్**
**స్వయం ప్రబుద్ధాఖిలవేదరాశిః ॥**

**ప్రతిపదార్థము:** సంపుల్లపత్రే= రేకులు విరిసిన, నితరాం= బాగా, విచిత్రే = వింతగా ఉన్న, భవత్ = నీ యొక్క, వీర్య= యోగబలమును, ధృతే= ధరించిన, తస్మిన్ సరోజే = ఆ సరోజమునందు(సరసి జాయతే సరస్సులో పుట్టునది. కమలము), విధిరావిః= బ్రహ్మణ రూపమును గ్రహించి, స్వయం = ఉపదేశ నిరపేక్షముగా, ప్రబుద్ధ – అఖిలవేదరాశిః = సర్వ వేదార్థము తనకు తానే స్ఫురించు సర్వజ్ఞ మూర్తిగ, ఆసీత్ = ప్రవేశించితివి, స పద్మజన్మా = అందువలన పద్మ గర్భుడను పేరు కూడా పొందితివి.

**తాత్పర్యము:** రేకులు విరిసిన నీ యొక్క యోగబలమును ధరించిన ఆ సరోజమునందు– బ్రహ్మణ రూపమును గ్రహించి ఉపదేశ నిరపేక్షముగా సర్వ వేదార్థము తనకు తానే స్ఫురించు సర్వజ్ఞ మూర్తి గ ప్రవేశించితివి. అందువలన పద్మ గర్భుడను పేరు కూడా పొందితివి.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపజాతి.

**8–13 శ్లో.**
**అస్మిన్ప రాత్మన్ నను పాద్మకల్పే**
**త్వమిత్థముత్థాపిత పద్మయోనిః ।**

**అనంతభూమా మమ రోగరాశిం**
**నిరుంధి వాతాలయవాస! విష్ణో! ॥**

**ప్రతిపదార్థము:** వాతాలయవాస!= గురువాయూరు నివాసా!, విష్ణో!= ఓ విష్ణుదేవా!, ప రాత్మన్= ఓ పరమాత్మా !, అస్మిన్ నను పాద్మకల్పే= ఈ విధమైన పద్మ కల్పమందు, ఇత్థమ్ = ఇట్లు, ఉత్థాపిత = సృష్టించిన ( లేపబడిన ), పద్మయోనిః = పద్మయోని కలవాడవు, అనంతభూమా=అనంతమైన మహిమ కలవాడవు, త్వమ్ = నువ్వు, మమ రోగరాశిం = నాయొక్క రోగ రాశిని, నిరుంధి = తొలగింపుము.

**తాత్పర్యము:** గురువాయూరు నివాసా! ఓ విష్ణుదేవా! ఓ పరమాత్మా! ఈ విధమైన పద్మ కల్పమందు బ్రహ్మను సృష్టించావు. అపరిచ్ఛిన్న మహిమ కలవాడవు. నువ్వు నాయొక్క రోగ రాశిని తొలగింపుము.

**విశేషాలు:** ఈ శ్లోకం ఉపేంద్రవజ్రము . జ , త , జ , గా(గగ)

బ్రహ్మ ఆయుర్దాయం వంద సంవత్సరాలలో మొదటి సగానికి పేరు పద్మకల్పం. బ్రహ్మ జీవితంలో ఒక రోజు అంటే వెయ్యి యుగాలు. 432 కోట్ల సంవత్సరాలు. బ్రహ్మ యాభై ఒకటవ సంవత్సరం నడుస్తున్నది. ఇది శ్వేత వరాహకల్పం.

**తృతీయ స్కంధము**

**8వ దశకము సమాప్తము.**

# దశకమ్ 9 – లోకసృష్టి

**9–1 శ్లో.**
**స్థితస్స కమలోద్భవస్తవ హి నాభిపంకేరుహే**
**కుతస్స్విదిదమంబుధావుదితమిత్యనాలోకయన్ ।**
**తదీక్షణకుతూహలాత్ ప్రతిదిశం వివృత్తాననః**
**చతుర్వదనతామగాద్ వికసదష్టదృష్ట్యంబుజామ్ ॥**

**ప్రతిపదార్థం:** సః కమలోద్భవః = ఆ బ్రహ్మ, తవ నాభిపంకేరుహే= నీ నాభి కమలములో, స్థితః =ఉండి, ఇదమ్ = ఈ పువ్వు, అంబుధౌ= సముద్రములో, కుతస్స్విత్ = ఎట్లు(కుతస్= కస్మాత్ స్థానాత్, కిం కారణాత్ఎక్కడి నుండి? ఎందుకు? స్విత్ సందేహార్థక పదం), ఉదితమ్ హి = పుట్టి పూచినదో కదా, ఇతి = అని, అనాలోకయన్= చుట్టూ చూసి తెలుసుకోలేక, తత్ –ఈక్షణ= ఆ పద్మము యొక్క ఉత్పత్తి స్థానమును చూచు, కుతూహలాత్ = కుతూహలముతో, ప్రతిదిశం = నాలుగు దిక్కులయందు (దిశతి చూపునది. దిక్కు), వివృత్త= అటు ఇటు తిప్పిన (విరుద్ధం వృత్తః కృతవర్తనమ్ ), ఆననః= మోము కలవాడగుటచే ( అనితి అనేన శ్వాస పీల్చునది. ముఖము.), వికసత్= వికసించిన (ఏర్పడిన), అష్ట= ఎనిమిది, దృష్టి–అంబుజామ్= పద్మదళాల వంటికన్నులతో, చతుః వదనతామ్ = నాలుగు మోములు, అగాత్= పొందెను (చతుర్ముఖుడని పేరు వచ్చిందని భావం).

**తాత్పర్యము:** ఆ బ్రహ్మ నీ నాభి కమలములో ఉండి ఈ పువ్వు సముద్రములో ఎట్లు పుట్టి పూచినది? అని చుట్టూ చూసి తెలుసుకోలేక ఆ పద్మము యొక్క ఉత్పత్తి స్థానమును చూచు కుతూహలముతో నాలుగు దిక్కులయందు అటు ఇటు తిప్పిన మోము కలవాడగుటచే ఎనిమిది కన్నులతో నాలుగు మోములు పొందెను. (చతుర్ముఖుడని పేరు వచ్చిందని భావం).

**విశేషాలు:** ఇది పృధ్వి వృత్తము. ప్రతి పాదములోను జ , స , జ , స , య , వ(లగ) గణములుండును. ఈ దశకములోని వృత్తాలు అన్నీ పృధ్వి వృత్తములోనే ఉన్నాయి.

**9-2 శ్లో.**

**మహార్ణవవిఘూర్ణితం కమలమేవ తత్ కేవలం**
**విలోక్య తదుపాశ్రయం తవ తనుం తు నాలోకయన్ ।**
**క ఏష కమలోదరే మహతి నిస్సహాయో హ్యహం**
**కుతస్స్విదిదమంబుజం సమజనీతి చింతామగాత్ ॥**

**ప్రతిపదార్థం:** మహా –ఆర్ణవ= ఆ గొప్ప సముద్రములో, విఘూర్ణితం= కంపించుచున్న, కేవలం= కేవలము (ప్రధానము), తత్ = ఆ కమలమ్–ఏవ= కమలమునే, విలోక్య = చూసి, తత్ –ఉపాశ్రయం = దాని అధిష్ఠానమై ఉన్న(ఆశ్రయమై ఉన్న), తవ తనుం తు= నీ రూపమును, న–ఆలోకయన్= చూడక,

మహతి= గొప్పదైన, కమల–ఉదరే = కమల గర్భములో, నిస్సహాయః = నిస్సహాయుడనై ఉన్న (ఏమియు చేయలేని స్థితిలో ఉన్నవాడు), ఏష అహం హి= ఈ నేను, కః హి = ఎవ్వడనో కదా?, ఇదమ్ = ఈ, అంబుజం= పద్మము, కుతస్స్విత్= ఎక్కడినుండి(ఎట్లు), సమజని= పుట్టినది( పూచినది), ఇతి= ఈ విధమైన, చింతామ్= ఆలోచనను (చింతా చింతనమ్ ఆలోచనము. చింత.), అగాత్= పొందాడు.

**తాత్పర్యం:** ఆ గొప్ప సముద్రములో కంపించుచున్న ఆ కమలమును చూసి దాని అధిష్ఠానమై ఉన్న నీ రూపమును చూడక "కమలములో ఉన్న ఈ నేను ఎవ్వడనో కదా? ఈ పద్మము ఎట్లు పూచినది" అని బ్రహ్మ ఆలోచనను పొందాడు.

**విశేషాలు:**

**మహతి:** మహతి దర్పణే మహ న్ముఖం తదేవ కనీనికాయ మణు అని ఒక న్యాయము. పెద్దముఖము పెద్దఅద్దమందు పెద్దదిగ కనబడును. అదే కంటి పాపయందు అణుప్రమాణమునకనబడును. ఉదా–ఒకటియేవ్యంజకభేదమువలన ఉత్కృష్టముగను, నికృష్టముగను చూడఁబడును.

**9-3 శ్లో.**
**అముష్య హి సరోరుహః కిమపి కారణం సంభవేత్**
**ఇతి స్మ కృతనిశ్చయః స ఖలు నాళరంధ్రాధ్వనా ।**
**స్వయోగబలవిద్యయా సమవరూఢవాన్ ప్రౌఢధీః**
**త్వదీయమతిమోహనం న తు కళేబరం దృష్టవాన్ ॥**

**ప్రతిపదార్థము:** అముష్య సరోరుహః = ఈ పద్మమునకు, కిమ్- అపి= ఏదైనా, కారణం= కారణము(ఆధారము) (కారణము=యేన వినా యత్ న భవతి తత్ ఇది లేనిచో కార్యము జరుగదు. కార్యోత్పత్తికి కారణమైనది.), సంభవేత్ హి= ఉండి తీరునని, ఇతి స్మ= ఈ విధముగా, కృతనిశ్చయః = బుద్ధి శాలిగా నిశ్చయించి, ప్రౌఢధీః= ఊహాపోహనిపుణ ధీరుడయిన, సః= ఆ బ్రహ్మ, స్వయోగబలవిద్యయా= తపస్సు చేత పొందిన ఆత్మ జ్ఞాన విద్యతో సూక్ష్మ శరీరమును పొంది, నాళరంధ్ర- అధ్వనా= నాళరంధ్రాలద్వారా( తూడు వెంట), సమవరూఢవాన్ ఖలు = అవరోహణము చేసాడు కదా(అడుగునకు పోయాడు), (కింతు= కాని), త్వదీయమ్ = నీయొక్క, అతిమోహనం= లోకోత్తర సౌందర్యము కల ( జగన్మోహనాకారమైన), కళేబరం తు = నీ మూర్తిని, దృష్టవాన్ న=చూడలేకపోయాడు.

**తాత్పర్యము:** ఈ పద్మమునకు ఏదైనా ఆధారము ఉండి తీరునని ఈ విధముగా నిశ్చయించిన ఆ బ్రహ్మ తపస్సు చేత పొందిన ఆత్మ జ్ఞాన విద్యతో సూక్ష్మ శరీరమును పొంది నాళరంధ్రాలద్వారా పద్మపుతూడు యొక్క అడుగునకు పోయాడు. కాని లోకోత్తర సౌందర్యము కల నీ మూర్తిని చూడలేకపోయాడు.

**9-4 శ్లో.**
**తతః సకల నాలికావివరమార్గగో మార్గయన్**
**ప్రయస్య శతవత్సరం కిమపి నైవ సందృష్టవాన్ ।**
**నివృత్య కమలోదరే సుఖనిషణ్ణ ఏకాగ్రధీః**
**సమాధిబలమాదధే భవదనుగ్రహైకాగ్రహీ ॥**

**ప్రతిపదార్థము:** తతః=అటుపిమ్మట, సకల నాలికావివర= అన్ని రకాల నాళ రంధ్రముల (విగతః వరః ఆవరణం యస్య విశేషంగా అడ్డము లేనిది. రంధ్రము, కన్నము.), మార్గగః= దారులందు వెళ్ళి (మార్గయతి అన్విషంతి లక్ష్యం అనేన దీనితో లక్ష్యమును వెదుకుదురు. మార్గము, బాట.), మార్గయన్= అన్వేషణము చేసాడు, శతవత్సరం =ఈ విధంగా నూరు దివ్య సంవత్సరాలు, ప్రయస్య= ప్రయాసపడి, కిమ్–అపి = ఏ వస్తువును, సందృష్టవాన్ న = చూడలేకపోయాడు, నివృత్య = ఈశ్వరానుగ్రహముతోతెలుసుకొంటానని అన్వేషణా ప్రయత్నాన్ని విరమించి, కమల–ఉదరే = కమలపు దుద్దుపై, సుఖనిషణ్ణః = సుఖాసనములో కూర్చున్నాడు. (నిషణ్ణః ఉపవిష్టః కూర్చున్నవాడు.), ఏకాగ్రధీః= ధారణతో మనస్సును ఏకాగ్రం చేసుకొని, భవత్ –అనుగ్రహ– ఏక –ఆగ్రహీ ఏవ = నీ అనుగ్రహమును మాత్రమే కోరినవాడై, సమాధిబలమ్ –ఆదధే = చిత్తపు ఏకాగ్రత బలమును, సమాధి నిష్ఠను (అచాంచల్యము)( సం సమ్యక్ ఆధీయతే మనః అస్మిన్మనస్సు ఇందులో చక్కగా వుంచబడును. ఏకాగ్రత అష్టాంగ యోగంలో చివరి స్థితి, సమాధి.), ఆదధే= పొందాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట అన్ని రకాల నాళరంధ్రముల దారులందు వెళ్ళి బ్రహ్మ నీ కొరకు అన్వేషణము చేసాడు. ఈ విధంగా నూరు దివ్య సంవత్సరాలు ప్రయాసపడి ఏ వస్తువును చూడలేకపోయాడు. ఈశ్వరానుగ్రహముతో తెలుసుకొంటానని అన్వేషణా ప్రయత్నాన్ని విరమించి కమలపు దుద్దుపై సుఖాసనములో కూర్చున్నాడు. ధారణతో మనస్సును ఏకాగ్రం చేసుకొని నీ అనుగ్రహమును మాత్రమే కోరినవాడై సమాధి నిష్ఠను (అచాంచల్యము) పొందాడు.

**విశేషాలు:** కమలనాళానికి అనేక రంధ్రాలు. ఒక రంధ్రములో బ్రహ్మ వెతికి స్వామిని చూడలేక మరొక రంధ్రములోకి దూరాడు. ఇలా కమలనాళంలో ఉన్న అన్ని రంధ్రాలను బ్రహ్మ వెతికాడు అని చెప్పటానికి కవి “వివర మార్గ గో మార్గయన్” అని చెప్పాడు.

**9-5 శ్లో.**

**శతేన పరివత్సరైర్ధృఢసమాధిబంధోల్లసత్-**
**ప్రబోధ విశదీకృతః స ఖలు పద్మినీ సంభవః।**
**అదృష్టచరమద్భుతం తవ హి రూపమంతర్దృశా**
**వ్యచష్ట పరితుష్టధీర్భుజగభోగ భాగాశ్రయమ్ ॥**

**ప్రతిపదార్థము:** శతేన పరివత్సరైః = నూరేండ్లు, పద్మినీ సంభవః= పద్మ సంభవుడయిన ఆ బ్రహ్మ, దృఢ= నిశ్చలపు సమాధి= చిత్త ఏకాగ్రము యొక్క, బంధ = ఏకీ భావ లక్షణముతో, ఉల్లసత్=శోభతో, ప్రబోధ విశదీకృతః= జ్ఞానము ఉదయింపగా (అజ్ఞాన మాలిన్యము పోగా), స అంతః దృశా= దివ్య దృష్టితో, వ్యచష్ట ఖలు = చూసాడు కదా, అదృష్టచరమ్ = ఇంతకు పుర్వము ఎంతో ప్రయాసపడినప్పటికి మహాత్ములు చూడలేని, అద్భుతం = అత్యాశ్చర్యకరమైన, పరితుష్టధీః భుజగ= అనంతుడను పేరు గల ఆదిశేషుని యొక్క, భోగ భాగాశ్రయమ్= శరీర కల్పిత తల్ప దేశము ఆశ్రయముగా కలిగిన, తవ రూపమ్ = నీ విష్ణు స్వరూపమును చూసి, పరితుష్టధీః=సంతోషాతిశయముతో పరవశించాడు.

**తాత్పర్యము:** నూరేండ్లు పద్మ సంభవుడయిన ఆ బ్రహ్మ నిశ్చలపు సమాధిలో గడిపిన తరువాత జ్ఞానము ఉదయింపగా దివ్య దృష్టితో– పుర్వము ఎంతో ప్రయాస పడినప్పటికి మహాత్ములు చూడలేని అత్యాశ్చర్యకరమైన శేషతల్పముపై పడుకొని యున్న నీ విష్ణు స్వరూపమును చూసి సంతోషాతిశయముతో పరవశించాడు.

**9-6 శ్లో.**

**కిరీటమకుటోల్లసత్కటకహారకేయూరయుక్**
**మణిస్ఫురితమేఖలం సుపరివీతపీతాంబరం ।**
**కలాయకుసుమప్రభం గళతలోల్లసత్కౌస్తుభం**
**వపుస్తదయి! భావయే కమలజన్మనే దర్శితమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి! = ఓ గురువాయూరు దేవా!, కిరీటమకుట= కిరీట మణి కాంతులతో, ఉల్లసత్= ప్రకాశిస్తున్న, కటక= కంకణములు, హార= ముత్యాల

హారములు, కేయూరయుక్= భుజమునందు అలంకృతములైన కేయూరములతో కలిసి, మణి= నానా రత్నసమూహములతో, స్ఫురిత= ఉజ్జ్వలమైన, మేఖలం= మొలనూలితో (మీయతే ప్రక్షిప్యతే శరీర మధ్యభాగే శరీర మధ్య భాగంలో ధరించునది. మొలత్రాడు వడ్డాణము), సుపరివీతమ్ = అతిమోహనముగా నేయబడిన, పీత–అంబరం=పచ్చని పట్టు పీతాంబరముతో, కలాయకుసుమప్రభం = ఇరుగుడు పువ్వు యొక్క నల్లని కాంతితో, గళతల–ఉల్లసత్–కౌస్తుభం=గొంతుకు సమీపమున గల వక్షస్థలమున ప్రకాశించే కౌస్తుభ మణితో ఉన్న, (యత్) వపుః= ఏ నీ రూపమును, కమలజన్మనే = పద్మ సంభవుడైన బ్రహ్మ దర్శించాడో, తత్ = ఆ రూపమును, భావయే = ఇప్పుడు నేను ధ్యానించుచున్నాను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! కిరీట మణి కాంతులతో ప్రకాశిస్తున్న కంకణములు, ముత్యాల హారములు భుజమునందు అలంకృతములైన కేయూరములతో కలిసి, నానా రత్నసమూహములతో, ఉజ్జ్వలమైన మొలనూలితో అతిమోహనముగా నేయబడిన పచ్చని పట్టు పీతాంబరముతో, ఇరుగుడు పువ్వు యొక్క నల్లని కాంతితో , గొంతునందు ప్రకాశించే కౌస్తుభ మణితో ఉన్నఏ నీ రూపమును పద్మ సంభవుడైన బ్రహ్మ దర్శించాడో ఆ రూపమును ఇప్పుడు నేను ధ్యానించుచున్నాను.

**9–7 శ్లో.**

**శ్రుతి ప్రకరదర్శిత ప్రచురవైభవ! శ్రీపతే!**
**హరే! జయజయ ప్రభో! పదముపైషి దిష్ట్యా దృశోః ।**
**కురుష్వ ధియమాశు మే భువననిర్మితౌ కర్మఠాం**
**ఇతి ద్రుహిణవర్ణితస్వగుణ బంహిమా పాహి మామ్ ॥**

**ప్రతిపదార్థము:** శ్రీపతే!= ఓ లక్ష్మీపతీ!, హరే! = ఓ శ్రీ హరీ!, శ్రుతి ప్రకర = ఉపనిషత్ వాక్య సమూహములతో, దర్శిత= దర్శింపబడిన, ప్రచురవైభవ= అతిశయమైన వైభవము కలవాడా!, ప్రభో!= ఓ ప్రభూ!, జయజయ= నీకు జయము జయము, దిష్ట్యా=అదృష్టము వలన, దృశోః= నువ్వు నా కన్నులకు, పదమ్ =కనబడు వెలుగు కిరణములను, ఉపైషి =ప్రాప్తించుచున్నావు, ధియమ్ మే భువననిర్మితౌ =

జగన్నిర్మాణమునకు, కర్మఠాం= సమర్థమైన (ఫలపర్యంతము కార్యమును జేయు తెగువ గలవాడు కర్మఠుడు.), ధియమ్= తెలివిని, ఆశు కురుష్వ= వెంటనే చేయుము(అనుగ్రహించుము) (ఆశు శీఘ్రమ్ శీఘ్రము, తొందరగా), ఇతి = ఈ విధముగా, ద్రుహిణ= బ్రహ్మ చేత (ద్రుహ్యతి దుష్టేభ్యః దుష్టులను హింసించువాడు. బ్రహ్మ.), వర్ణిత= వర్ణింపబడిన, స్వగుణ= ఐశ్వర్య గుణముల యొక్క, బంహిమా= ఆధిక్యము కలిగినట్టి నువ్వు, మామ్= నన్ను కూడా, పాహి= రక్షించుము.

**తాత్పర్యము:** ఓ లక్ష్మీపతీ! ఓ శ్రీ హరీ! ఉపనిషత్ వాక్య సమూహములతో దర్శింపబడిన అతిశయమైన వైభవము కలవాడా! ఓ ప్రభూ! నీకు జయము జయము. నా అదృష్టము వలన నువ్వు నా కన్నులకు కనబడుటను ప్రాప్తించుచున్నావు. జగన్నిర్మాణమునకు సమర్థమైన తెలివిని వెంటనే చేయుము(అనుగ్రహించుము) అని ఈ విధముగా బ్రహ్మ చేత వర్ణింపబడిన ఐశ్వర్య గుణముల యొక్క ఆధిక్యము కలిగినట్టి నువ్వు నన్ను కూడా రక్షించుము.

**9-8 శ్లో.**

**"లభస్వ భువనత్రయీరచనదక్షతామక్షతాం**
**గృహాణ మదనుగ్రహం కురు తపశ్చ భూయో విధే! ।**
**భవత్వఖిలసాధనీ మయి చ భక్తిరత్యుత్కటే"**
**త్యుదీర్య గిరమాదధా ముదితచేతసం వేధసం ॥**

**ప్రతిపదార్థము:** అయి విధే! = ఓ బ్రహ్మా!, అక్షతాం= నాశనము లేని, భువనత్రయీరచనదక్షతామ్= మూడు లోకముల నిర్మాణ సామర్థ్యము, లభస్వ=నీవు పొందగలవు, మత్ అనుగ్రహం= నా అనుగ్రహమును, గృహాణ= అందుకొమ్ము. ( నీ భువన నిర్మాణ విధిలో ఏది నేను అనుగ్రహించానో దానిని స్వీకరింపుమని భావం) భూయః = మరలా, తపః –చ= తపస్సు కూడా, కురు= చేయుము, అతి–ఉత్కటా భక్తిః= నా పై నీకు గల ప్రకృష్ట ప్రేమ లక్షణము గల భక్తి (ఉత్కటా =ఉత్ శీఘ్రం కటతి గచ్ఛతి ఎక్కువ త్వరగా పోవునది), అఖిలసాధనీమ్ చ భవతు = సర్వార్థ సాధనమగుగాక, ఇతి గిరమ్ ఉదీర్య= అని నువ్వు (విష్ణువు) బ్రహ్మకు చెప్పావు, వేధసం= బ్రహ్మ (విదధాతి జగత్ బ్రహ్మ), ముదితచేతసం=

సంతోషపడిన మనస్సుతో, ఆదధాః = నీ మాటలను స్వీకరించాడు.

**తాత్పర్యము:** ''ఓ బ్రహ్మా! నాశనము లేని మూడు లోకముల నిర్మాణ సామర్థ్యము నీవు పొందగలవు. నా అనుగ్రహమును అందుకొమ్ము మరలా తపస్సు కూడా చేయుము. నా పైనీకు గల ప్రకృష్టప్రేమ లక్షణము గల భక్తి సర్వార్థ సాధనమగుగాక'' అని నువ్వు (విష్ణువు) బ్రహ్మకు చెప్పావు. బ్రహ్మ సంతోషపడిన మనస్సుతో నీ మాటలను స్వీకరించాడు.

**విశేషాలు:**

**బ్రహ్మ :** బృహత్తు – పెద్దది. బృంహణం – అన్నిటినీ ఇముడ్చుకొనేది. బర్హణం తనలో కలుపుకొనేది ఏదో అది. పరమాత్మ నిర్గుణమైన శుద్ధ చైతన్యం. మాయాశక్తి ఇందులో ఓతప్రోతమై నిష్క్రియమై ఉంటుంది. అదే సక్రియమైతే బయటికి వచ్చి నిర్గుణమైన బ్రహ్మం సగుణంగా మారుతుంది. అప్పుడది బ్రహ్మకాదు బ్రహ్మ.

**భక్తి / భక్త :** భక్తి అంటే భగవంతుని భజించటమని అర్థం. భజించటం అంటే అంటి పట్టుకోవటం. విభజించటానికి ఇది వ్యతిరేకం. భగవంతుని నుండి దూరమై పోవటం. విభజన. దగ్గర పడటం భజన. ఈ భజన చేసేవాడు భక్తుడు. అతడు సగుణ భక్తుడు కావచ్చు. నిర్గుణ భక్తుడు కావచ్చు. సగుణమైతే భగవంతుని తనకు అన్యంగా భావిస్తాడు. నిర్గుణమైతే తన స్వరూపంగా భావిస్తాడు. స్వరూపంగా భావించే భక్తిని ఇలా వర్ణించారు భగవత్పాదులు. 'యః పశ్యతి యత్ శృణోతి, స్పృశతి, వా తత్ సర్వం వాసుదేవ ఏవ.' ఏదేది చూస్తామో వింటామో ముట్టుకుంటామో అదంతా సచ్చిద్రూపమైన ఆత్మతత్త్వమేనని 'ఏవం గ్రహావిష్టః.' ఒక దయ్యంలాగా ఆవేశించినవాడు భక్తుడట. ఇదే అనన్యభక్తి.

**9–9 శ్లో.**

**శతం కృతతపాస్తతః స ఖలు దివ్యసంవత్సరాన్**
**అవాప్య చ తపోబలం మతిబలం చ పూర్వాధికమ్ ।**
**ఉదీక్ష్య కిల కంపితం పయసి పంకజం వాయునా**
**భవద్బలవిజృంభితః పవనపాథసీ పీతవాన్ ॥**

**ప్రతిపదార్థము:** తతః= అటుపిమ్మట, సః = బ్రహ్మ, శతం దివ్యసంవత్సరాన్= నూరు దివ్య సంవత్సరాలు, కృతతపాః= తపస్సు చేసి, పూర్వ–అధికమ్ ఖలు= పూర్వము కంటె అధికంగా, తపోబలం= తపో బలమును, మతిబలం చ = మతిబలమును, అవాప్య= పొంది, పయసి= ఆ సముద్రములో (పయస్= పీయతే అసౌ త్రాగబడునది. జలము ), వాయునా= గాలితో, కంపితం= కంపించుచున్న, పంకజం=తాను కూర్చున్న పద్మమును, ఉదీక్ష్య = చూసి, భవత్ –బల= నువ్వు ఇచ్చిన బలముచే( మహిమచే ),విజృంభితః=వర్థితుడై,పవనపాథసీ=వాయువును, నీటిని (పవన=పునాతి పవిత్రము చేయునది. గాలి.) (పాథస్= పీయతే అసౌ త్రాగబడునది, నీరు ), పీతవాన్ కిల = ఒకేసారి త్రాగాడు కదా!

**తాత్పర్యము:** అటుపిమ్మట బ్రహ్మ నూరు దివ్య సంవత్సరాలు తపస్సు చేసి పూర్వము కంటె అధికంగా తపో బలమును మతిబలమును పొంది ఆ సముద్రములో గాలితో కంపించుచున్న తాను కూర్చున్న పద్మమును చూసి నువ్వు ఇచ్చిన బలముచే (మహిమచే) వర్థితుడై వాయువును, నీటిని ఒకేసారి త్రాగాడు కదా !

**విశేషాలు:**

**భవద్బలం:** "స వై బలం బలినా చా పరేషామ్"(సంస్కృత భాగవతం 07 వ సర్గ– 08 వ అద్యా–08 వశ్లోకం ) అని ప్రహ్లాదుని మాట.( ఓ రాజా ! నాకు నీకు మాత్రమే కాదు. ఇతర బలవంతులందరికిని శ్రీహరియే బలము )దీనినే భట్టాత్రి ఇక్కడ చెప్పాడు.

**9–10 శ్లో.**
**తవైవ కృపయా పునః సరసిజేన తేనైవ సః**
**ప్రకల్ప్య భువనత్రయీం ప్రవవృతే ప్రజానిర్మితౌ ।**
**తథావిధకృపాభరో గురుమరుత్పురాధీశ్వరా!**
**త్వమాశు పరిపాహి మాం గురుదయోక్షితైరీక్షితైః ॥**

**ప్రతిపదార్థము:** తవ= నీయొక్క, కృపయా ఏవ= దయతో, పునః = మరలా, సరసిజేన= తానున్న పద్మమును, తేన–ఏవ= అతనితో విభాగింపబడి, సః=

అతడు(బ్రహ్మ), భువనత్రయీం =స్వర్గ మర్త్యపాతాళ లోకములను, ప్రకల్ప్య = రచించెను, ప్రజానిర్మితౌ = శుభాశుభదృష్ట తారతమ్యముతో ఆయాలోకములందు నివసించుటకు యోగ్యత కలిగిన జీవుల నిర్మితి కొరకు (శరీర నిర్మాణము కొరకు), ప్రవవృతే = ప్రవృత్తి కలిగినవాడయ్యాడు, తథావిధః =సర్వజన విషయముగా, కృపాభరః= నీకు ఎట్టి కరుణాతిశయము కలదో, అట్టి దయను, త్వమ్= నువ్వు, గురు= గురువుల (గురు= గిరతి అజ్ఞానమ్ అజ్ఞానమును తొలగించువాడు.), దయ= ఘనీ భూతమైన దయవంటి, ఉక్షితైః = ఆర్ద్రీకృతము చేయబడిన(ఉక్షితః సించితః తడిపినవాడు.), ఈక్షితైః= కటాక్షముల చేత(ఈక్షితః దృష్టః ఆలోచితి వా చూడబడినది ఆలోచింపబడినది), ఆశు= వెంటనే, మాం = నన్ను, పరిపాహి = రక్షించుము.

**తాత్పర్యము:** గురువాయూరు దేవాలయము నందు గల నారాయణా! నీయొక్క దయతో బ్రహ్మ తానున్న పద్మమును విభాగము చేసి స్వర్గ మర్త్యపాతాళ లోకములను రచించెను. శుభాశుభదృష్ట తారతమ్యముతో ఆయాలోకములందు నివసించుటకు యోగ్యత కలిగిన జీవుల నిర్మితి కొరకు (శరీర నిర్మాణము కొరకు) ప్రవృత్తి కలిగినవాడయ్యాడు. సర్వజన విషయముగా నీకు ఎట్టి కరుణాతిశయము కలదో అట్టి దయను నాపై చూపించు. గురువుల దయవంటి చల్లని కటాక్షముల చేత వెంటనే నన్ను రక్షించు.

**తృతీయ స్కంధము**

**9వ దశకము సమాప్తము.**

# దశకమ్ 10 – సృష్టివైవిధ్యము

**10-1 శ్లో.**

**వైకుంఠ! వర్ధితబలోఽథ భవత్ప్రసాదాత్**
**అంభోజయోనిరసృజత్ కిల జీవదేహాన్ ।**
**స్థాస్నూని భూరుహమయాని తథా తిరశ్చాం**
**జాతిర్మనుష్యనివహానపి దేవభేదాన్ ॥**

**ప్రతిపదార్థము:** వైకుంఠః= ఓ వైకుంఠ ప్రభూ! (వికుంఠాయాం మాయాయాం భవః మాయలో వుండువాడు వైకుంఠుడు విష్ణువు, వర్ధితబలః = విద్య కర్మల చేత ప్రాప్తించిన ఐశ్వర్యమును ( జ్ఞానయోగ తపోరూప కర్మ యోగ బలము) పొంది, అథ= అటుపిమ్మట, అంభోజయోనిః= బ్రహ్మ, భవత్ ప్రసాదాత్= నీ అనుగ్రహము వలన, స్థాస్నూని= స్థావరములయిన (స్థాతుం చిరకాలం స్థాతుం శీలం అస్య చాలాకాలం వుండు స్వభావం కలది. చిరస్థాయి.), భూరుహమయాని =చెట్లుమొదలగువాటిని, తథా= అట్లే, తిరశ్చాం జాతిః = ఆవులు మొదలగు పశువులను ,కాకులు గద్దలు మొదలగు పక్షి జాతులను (తిర్యక్ జాతిః = అడ్డంగా వున్నది వక్రంగా వున్నది. పశుపక్షులు), దేవభేదాన్= వివిధ దేవతలను (ద్యుస్థానః దివి తిష్ఠతీతి వాస్వర్గములో, స్వర్గలోకములో వుండువాడు ద్యులోకంలో వుండువాడు. దేవత), మనుష్యనివహాన్-అపి = మనుష్య సమూహములను కూడా(మనోః అపత్యమ్ మనువు సంతానము. మనుష్య జాతి.), జీవదేహాన్= ఇలా వివిధ భేదాలు కలిగిన దేహములను, అసృజత్ కిల= సృష్టించాడు కదా!

**తాత్పర్యము:** ఓ వైకుంఠ ప్రభూ! అటుపిమ్మట జ్ఞానయోగ తపోరూప కర్మ యోగ బలము పొంది బ్రహ్మ నీ అనుగ్రహము వలన స్థావరములయిన చెట్లు మొదలగు వాటిని, అట్లే ఆవులు మొదలగు పశువులను, కాకులు గద్దలు మొదలగు పక్షి జాతులను, వివిధ దేవతలను, మనుష్య సమూహములను– ఇలా వివిధ భేదాలు కలిగిన దేహములను సృష్టించాడు కదా!.

**విశేషాలు:** ఈ శ్లోకములోని వృత్తము వసంత తిలకము. **త , భ , జ , జ , గా**(గగ) గణములుండును.

ఈ దశకములోని ప్రతి శ్లోకము వసంత తిలకమే.

**10–2 శ్లో.**

**మిథ్యాగ్రహాస్మి మతిరాగవికోపభీతిః**
**అజ్ఞానవృత్తిమితి పంచవిధాం స సృష్ట్వా।**
**ఉద్దామతామసపదార్థవిధానదూనః**
**తేనే త్వదీయచరణస్మరణం విశుద్ధ్యై ॥**

**ప్రతిపదార్థము:** మిథ్యాగ్రహః =ప్రపంచము ఆత్మకంటె వేరు అను మిథ్యాగ్రహమును (మేథతి జానాతి అన్యథా తస్య భావఃఅసత్యము, మిథ్యా.), అస్మితామతిః= ఈ శరీరాలు నేను నావి అనుకొను అస్మితామతి, (అస్మి ఇత్యస్య భావఃనేను అన్న భావము స్వాభిమానము.), రాగః=ధనము మొదలయిన వాటియందు భోగ వాంచ కలిగిన రాగము, వికోపః= ధనము మొదలయినవి అపహరించిన వానిపై కోపము, భీతిః= భోగ్య పదార్థాలు అయిపోతాయేమోనని భయం. (బిభేతి తస్య భావః భయము.), ఇతి= ఈ విధముగా, పంచవిధాం= అయిదు రకాలైన, అజ్ఞానవృత్తిమ్= ఆత్మకు సంబంధించిన అజ్ఞాన కార్యములను, సః= ఆ బ్రహ్మ, సృష్ట్వా= సృష్టించి (అటుపిమ్మట), ఉద్దామ= స్వతంత్రముగా పుట్టిన (ఉద్గతః దామ్నః బంధనాత్ బంధవిముక్తి), తామసపదార్థ= కేవల తమోగుణ కార్య, విధాన=సృష్టి చేత, దూన= క్షీణ మానసుడై( హృదయ వేదన పొంది)( దూనః ఖిన్నః సంతప్తః దుఃఖితః అలసిపోయినవాడు దుఃఖపడ్డవాడు తపన చెందువాడు.), సః= ఆ బ్రహ్మ, విశుద్ధ్యై = పరిశుద్ధి పొందుటకు ( అజ్ఞాన నివృత్తి కొరకు), త్వదీయచరణస్మరణం= నీ పాద స్మరణమును, తేనే= చేసెను.

**తాత్పర్యము:** ప్రపంచము ఆత్మ కంటె వేరు అను మిథ్యాగ్రహమును, ఈ శరీరాలు నేను నావి అనుకొను అస్మితామతి, ధనము మొదలయిన వాటియందు భోగ వాంచ కలిగిన రాగము, ధనము మొదలయినవి అపహరించిన వానిపై కోపము భోగ్య

పదార్థాలు అయిపోతాయేమోనని భయం. ఈ విధముగా అయిదు రకాలైన ఆత్మకు సంబంధించిన అజ్ఞాన కార్యములను ఆ బ్రహ్మ సృష్టించి –అటుపిమ్మట అయిదు రకాలయిన తమోగుణ కార్య సృష్టి చేత హృదయ వేదన పొంది ఆ బ్రహ్మ పరిశుద్ధి పొందుటకు నీ పాద స్మరణమును చేసెను.

**10–3 శ్లో.**

**తావత్ ససర్జ మనసా సనకం సనందం**
**భూయస్సనాతనమునిం చ సనత్కుమారమ్ ।**
**తే సృష్టికర్మణి తు తేన నియుజ్యమానాః**
**త్వత్పాదభక్తిరసికా జగృహుర్న వాణీమ్ ॥**

**ప్రతిపదార్థం:** తావత్ = త్వదీయ చరణ స్మరణము చేత శుద్ధ మనస్కుడైన కాలంలో ఆ బ్రహ్మ, సనకం = సనకుని, సనందం=సనందుని, భూయః= మరలా, సనాతనమునిం= సనాతన ముని, ని చ= మరియు, సనత్కుమారమ్= సనత్కుమారుని, మనసా= మనస్సున, ససర్జ= సృష్టించాడు, తే తు= ఆ సనకాదులన్నో, తేన= బ్రహ్మ చేత, సృష్టికర్మణి= సృష్టి కార్యమునందు, నియుజ్యమానాః= నియోగింపబడినప్పటికి, త్వత్–పాదభక్తిరసికాః = నీ పాద భక్తి రసికులు కనుక, వాణీం= ఆ బ్రహ్మ మాటను, న జగృహుః= అంగీకరింపరైరి.

**తాత్పర్యము:** త్వదీయ చరణ స్మరణము చేత శుద్ధ మనస్కుడైన కాలంలో ఆ బ్రహ్మ సనకుని సనందుని సనాతన మునిని మరియు సనత్కుమారుని మనస్సున సృష్టించాడు. ఆ సనకాదులన్నో బ్రహ్మ చేత సృష్టి కార్యమునందు నియోగింపబడి నప్పటికి నీ పాద భక్తి రసికులు కనుక ఆ బ్రహ్మ మాటను అంగీకరింపరైరి.

**విశేషాలు:**

**పాదభక్తిరసికులు:** విష్ణువు యొక్క పాద పద్మములందు ప్రేమ లక్షణమైన భక్తిని కోరుకొను వారు(రసికులు) కనుక శారీరక బంధ ప్రదమైన సృష్టి కర్మను సనకాదులు అంగీకరించలేదు.

**10-4 శ్లో.**

**తావత్ ప్రకోపముదితం ప్రతిరుంధతోఽస్య**
**భ్రూమధ్యతోఽజని మృడో భవదేకదేశః ।**
**"నామాని మే కురు పదాని చ హా విరించే"**
**త్యాదౌ రురోద కిల తేన స రుద్ర నామా ॥**

**ప్రతిపదార్థం:** తావత్ = తన పుత్రులైన సనకాదులు తన మాటవినలేదని ఆ బ్రహ్మ తనకు, ఉదితం=పుట్టిన, ప్రకోపమ్= గొప్పదైన కోపమును, ప్రతిరుంధతః= ఆపుకొన్న (ప్రతిరుద్ధః అవరుద్ధః బాధితః వేష్టితః ఆపబడ్డది అవరోధింపబడినది చుట్టుముట్టబడినది.), అస్య= ఈ బ్రహ్మ, భ్రూమధ్యతః= కనుబొమల మధ్యనుండి, భవత్ –ఏకదేశః= నీ అంశమయిన, మృడః= మృడుడు (మృడతి సుఖయతి సుఖ పెట్టువాడు. శివుడు.), అజని= పుట్టెను, హా విరించ= ఓ బ్రహ్మ దేవుడా (విపూర్ణతయా రిణక్తి రిక్తంకరోతి బ్రహ్మాండం,తస్మాత్ నిష్క్రమ్య బ్రహ్మాండమునుండి నిష్క్రమించి దానిని పూర్తిగా ఖాళీ చేసినవాడు. బ్రహ్మ.), మే= నాకు, "నామాని= పేరేది?, పదాని చ"= స్థానమేది?, ఇతి–ఆదౌ= అని పుట్టిన మొదట్లోనే, రురోద కిల= రోదనము చేసాడు కదా, తేన= ఆ రోదనము వలన, సః రుద్రః= అతనికి రుద్రుడని (రోదితి, రోదయతి ఏడ్చువాడు, ఏడిపించువాడు.), నామా= పేరు కలిగెను.

**తాత్పర్యము:** తన పుత్రులైన సనకాదులు తన మాటవినలేదని ఆ బ్రహ్మ తనకు పుట్టిన కోపమును ఆపుకొన్నాడు. బ్రహ్మ కనుబొమల మధ్యనుండి నీ అంశమయిన మృడుడు పుట్టెను. ఓ బ్రహ్మ దేవుడా నాకు పేరేది? స్థానమేది? అని పుట్టిన మొదట్లోనే రోదనము చేసాడు కనుక అతనికి రుద్రుడని పేరు కలిగెను.

**విశేషాలు:**

**రుద్రుడు:** అనగా శివుడు. 'రోదనాత్ రుద్రః' అని దీనికి వ్యుత్పత్తి చెప్పారు. రోదనమంటే ఒక ఘోష. శరీరంలో మనకెప్పుడూ అది అనాహతంగా ఉండనే ఉంటుంది. గుండెచప్పుడు ఈ రోదనమే. ప్రాణశక్తికే రుద్ర అని లాక్షణికంగా చెప్పుకునే మాట. ప్రాణం కూడా శబ్దం చేస్తూనే ఉంటుంది. వసురుద్ర ఆదిత్యులని

పెద్దలు చెప్పే దేవతలెవరో కారు. ఆధ్యాత్మికమైన భాషలో చెబితే వసువు శరీరం. రుద్ర ప్రాణం. ఆదిత్య సూర్యునిలాగా వెలిగిపోయే మన మనస్సే. రౌద్ర అంటే రుద్రుడికి సంబంధించినది. భయంకరమైనదని ఒక అర్థం. అలాంటి దశకూ భావానికి కూడా అదే పేరు.

**10–5 శ్లో.**
**ఏకాదశాహ్వయతయా చ విభిన్నరూపం**
**రుద్రం విధాయ దయితా వనితాశ్చ దత్త్వా।**
**తావంత్యదత్త చ పదాని భవత్ప్రణున్నః**
**ప్రాహ ప్రజావిరచనాయ చ సాదరం తమ్॥**

**ప్రతిపదార్థము:** ఏకాదశ–ఆహ్వయతయా= నీ ప్రేరణ వలన బ్రహ్మ పదునొకండు పేర్లు (ఆహూయతే అనేన దీనితో పిలిచెదరు. పేరు), చ = మరియు, విభిన్నరూపం= వేరైన రూపములు, రుద్రం= రుద్రునికి, విధాయ= ఇచ్చి, దయితా వనితాః –చ= పదునొకండు మంది భార్యలను కూడా (దయతే రక్ష్యతే పత్యా భర్తచే రక్షింపబడునది. భార్య.2. భర్తురభీష్టా భర్తకు ప్రియమైనది. భార్య.), దత్త్వా= ఇచ్చి, తావంతి = పదునొకండు, పదాని=ఇండ్లను కూడా, అదత్త= ఇచ్చెను, భవత్ –ప్రణున్నః= తన హృదయమందున్న నీచే ప్రేరేపింపబడిన ఆ బ్రహ్మ, తమ్= ఆరుద్రుని, ప్రజావిరచనాయ = భార్యలయందు సంతానము కనుమని, సాదరం = సాదరముగా, ప్రాహ= చెప్పెను,

**తాత్పర్యం:** నీ ప్రేరణ వలన బ్రహ్మ పదునొకండు పేర్లు మరియు వేరైన రూపములు పదునొకండు మంది భార్యలను పదునొకండు స్థానములను (ఇండ్లను) కూడా రుద్రునికి ఇచ్చాడు. తన హృదయమందున్న నీచే ప్రేరేపింపబడిన ఆ బ్రహ్మ ఆరుద్రుని భార్యలయందు సంతానము కనుమని సాదరముగా చెప్పెను.

**విశేషాలు:** పదకొండు మంది (ఏకాదశ) రుద్రులు ఎవరనే విషయంలో కొద్ది తేడాలతో నాలుగైదు పట్టికలు ఉన్నాయి. అందులో రెండు ప్రధానమైనవి.

**మొదటి పట్టిక:** 1.వీరభద్రుడు, 2. శర్వుడు, 3. గిరీశుడు, 4. అజైకపాదుడు, 5.

అహిర్బుధ్న్యుడు, 6. పినాకి, 7. స్థాణువు, 8. పశుపతి, 9. భవుడు, 10. ఉగ్రుడు, 11. త్విట్‌పతి / త్విషాంపతి. (బసవేశ్వర గీతామృతం).

**రెండవ పట్టిక:** 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శర్వుడు, 4. మృగవ్యాధుడు, 5. రంతిజుడు, 6. భిక్షకుడు, 7. అహిర్బుధ్న్యుడు, 8. పినాకి, 9. పాదుకేశ్వరుడు, 10. కాపాలి కేయుడు, 11. భౌముడు.

**మూడవ పట్టిక :** 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శబరుడు, 4.మృగవ్యాధుడు, 5. రంతిజుడు, 6. భిక్షకుడు, 6. అహిర్బుధ్న్యుడు, 7. పినాకి, 8. పాదు కేశ్వరుడు, 9. కాపాలికేయుడు, 10. భౌముడు. 11. అజుడు.

మరణ సమయంలో ఐదు జ్ఞానేంద్రియాలూ, ఐదు కర్మేంద్రియాలూ, మనస్సూ అనే మొత్తం పదకొండు ఇంద్రియాలూ ఏడిపిస్తాయి గనుక వాటిని రుద్రులు అన్నారని కూడా వివరిస్తున్నది

**నాలుగవ పట్టిక:** 1.అజుడు, 2. ఏకపాదుడు, 3. అహిర్బుధ్న్యుడు, 4. త్వష్ట, 5. రుద్రుడు, 6. హరుడు, 7. శంభుడు, 8. త్ర్యంబకుడు, 9. అపరాజితుడు, 10. ఈశానుడు, 11. త్రిభువనుడు.

**ఐదవ పట్టిక** : 1. అజైకపాత్, 2. అహిర్బుధ్న్యుడు, 3. విరూపాక్షుడు, 4. సురేశ్వరుడు, 5. జయంతుడు, 6. బహురూపుడు, 7. త్రయంబకుడు, 8. అపరాజితుడు, 9. వైవస్వతుడు, 10. సవిత్రుడు, 11. హరుడు.

భాగవతంలో ఏకాదశ రుద్రుల స్థానములు, పేర్లు, భార్యలపేర్లు ఇలా ఉన్నాయి.

(వరుసగా మొదటి పదం రుద్రుని స్థానము, రెండవది రుద్రుని పేరు, మూడవది అతని భార్య పేరు)

1. చంద్రుడు మన్యువు ధీర 2. సూర్యుడు మనువు వృత్తి 3. అగ్ని మహాకాలుడు అశన 4. వాయువు మహత్తు ఉమ 5. జలము శివుడు నియుతి 6. ఆకాశము ఋతధ్వజుడు సర్పి 7. పృథ్వి ఉరురేతసుడు ఇల 8. ప్రాణము కాలుడు అంబిక

9. తపస్సు భవుడు ఇరావతి 10. హృదయము వామదేవుడు సుధ 11. ఇంద్రియములు. ధృతవ్రత దీక్ష.

**10-6 శ్లో.**

**రుద్రాభిసృష్టభయదాకృతిరుద్ర సంఘ**
**సంపూర్యమాణ భువనత్రయ భీతచేతాః ।**
**"మా మా ప్రజాః సృజ తపశ్చర మంగళాయే"**
**త్యాచష్ట తం కమలభూర్భవదీరితాత్మా ॥**

**ప్రతిపదార్థము:** రుద్ర-అభిసృష్టః = రుద్రునిచే తన స్త్రీల యందు కలిగిన సృష్టి, భయద-ఆకృతి= భయమునిచ్చు, రుద్ర సంఘ = రుద్ర సంఘముచే, భువన త్రయమ్ = మూడు లోకములు, సంపూర్యమాణమ్ = నిండిపోగా, భీతచేతాః= భయపడిన మనస్సు కలవాడై, భవత్ —ఈరిత-ఆత్మా = నీచే ప్రేరేరింపబడిన మనస్సు కలవాడై, కమలభూః = బ్రహ్మ, తం= ఆ రుద్రుని, ఆచష్ట= ఇలా ఆజ్ఞాపించాడు, "ప్రజాః = ఇటువంటి భయంకర సంతానమును, మా మా సృజ = సృష్టించకు, మంగళాయ= సర్వ లోకశ్రేయస్సు కొరకు, తపః-చర= తపస్సు చేయి.

**తాత్పర్యము:** రుద్రునిచే తన స్త్రీల యందు కలిగిన సృష్టి భయంకరమయిన రుద్ర సంఘముచే మూడు లోకములు నిండిపోగా భయపడిన మనస్సు కలవాడై నీచే ప్రేరేరింపబడిన మనస్సు కలవాడై ఆ రుద్రుని "భయంకర సంతానమును సృష్టించకు. సర్వ లోకశ్రేయస్సు కొరకు తపస్సు చేయి." అని ఆజ్ఞాపించాడు.

**విశేషాలు:**

**రుద్ర సంఘము:** వృషభ వాహనము, భస్మాంగరాగము, ఖట్వాంగము, పరశువు, హరిణము, కపాలము. చర్మాంబరము, సర్పరాజ భూషణము, అగ్నినయనము- శివునికి సంబంధించిన ఇవన్నీ కలిపితే శివుని సంతానమైన రుద్ర సంఘము. ఇవి భయంకరములని బ్రహ్మ మాట.

**10-7 శ్లో.**

**తస్యాథ సర్గరసికస్య మరీచిరత్రిః**
**తత్రాంగిరాః క్రతుమునిః పులహః పులస్త్యః ।**
**అంగాదజాయత భృగుశ్చ వశిష్ఠ దక్షౌ**
**శ్రీనారదశ్చ భగవన్ భవదంఘ్రిదాసః ॥**

**ప్రతిపదార్థము:** భగవన్= ఓ గురువాయూరు దేవ!, అథ= అటుపిమ్మట (శివుడు తపోవనములో ప్రవేశించిన తరువాత), తత్ర= అచ్చట, తస్య సర్గరసికస్య= సృష్టి కార్యమునందు రసికుడై ఏవిధంగా సృష్టి చేయాలని భావిస్తున్న బ్రహ్మకు, మరీచిః= మనస్సునుండి మరీచి . (మ్రియతే పాపరాశిః యస్మిన్ ఇతని యందు పాపరాశి నశించును. బ్రహ్మమానస జ్యేష్ఠపుత్రుడు.), అత్రిః= కంటినుండి అత్రి , (అత్తి ఏకగండూషేనైవ సర్వం గంగాజలమ్ ఒకే ఒక గుక్కతో గంగను మ్రింగినవాడు. అత్రిమహర్షి), అంగిరాః= ముఖమునుండి అంగిరుడు (అంగతి బ్రహ్మముఖాత్ నిస్సరతి బ్రహ్మముఖము నుండి పుట్టినవాడు. అంగిర ఋషి.), క్రతుమునిః= చేతినుండి క్రతువు (యః క్రియతే యయా కరోతి చేయబడునది. యజ్ఞము), పులహః = నాభినుండి పులహుడు, పులస్త్యః = చెవినుండి పులస్త్యుడు (పులస్తి ఏవ పులస్త్యః సప్తర్షులలో ఒకడు. పులస్త్య మహర్షి.), భృగుః చ = చర్మము నుండి భృగువు(భృజ్యతే తపసా శరీరమ్ తపస్సుచే శరీరమును తపింప చేసినవాడు. భృగువు, ఒక మహర్షి.), వశిష్ఠః= ప్రాణము నుండి వశిష్ఠుడు (అతిశయేన వశీ ఇంద్రియములు వశంలో వుంచుకొనువాడు. వశిష్ఠ మహర్షి.), దక్షౌ= బొటనవ్రేలినుండి దక్షుడు(దక్షతే సమర్థో భవతి సమర్థుడు నిపుణుడు దక్ష ప్రజాపతి.), భవత్- అంఘ్రిదాసః=నీ పాదదాసుడు, శ్రీనారదః చ = నారదుడు ఒడినుండి(నారం అజ్ఞానం ద్యతి నాశయతిఅజ్ఞానమును నాశనము చేయువాడు. నారదుడు, ముని.), అంగాత్ =ఇలా వివిధ అవయవముల నుండి, అజాయత= పుట్టారు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవ! శివుడు తపోవనములో ప్రవేశించిన తరువాత సృష్టి కార్యమునందు రసికుడై ఏవిధంగా సృష్టి చేయాలని భావిస్తున్న

బ్రహ్మకు మనస్సునుండి మరీచి కంటినుండి అత్రి, ముఖమునుండి అంగిరుడు చేతినుండి క్రతువు నాభినుండి పులహుడు, చెవినుండి పులస్త్యుడు చర్మము నుండి భృగువు ప్రాణము నుండి వశిష్ఠుడు బొటనవ్రేలినుండి దక్షుడు నీ పాదదాసుడు నారదుడు ఒడినుండి పుట్టారు.

**10-8 శ్లో.**

**ధర్మాదికానభిసృజన్నథ కర్దమం చ**

**వాణీం విధాయ విధిరంగజసంకులోఽభూత్ ।**

**త్వద్బోధితైస్సనకదక్షముఖైస్తనూజైః**

**ఉద్బోధితశ్చ విరరామ తమో విముంచన్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, ధర్మ-ఆదికాన్-అభిసృజన్-= బ్రహ్మ తన కుడి రొమ్మునుండి ధర్ముడు మొదలైన వారిని సృష్టించాడు.(ధర్మ= ధ్రియతే పుణ్యాత్మభిః దీనిని పుణ్యాత్ములు ధరింతురు.), కర్దమం చ= ఛాయనుండి కర్దముని సృష్టించాడు. (కుత్సితం శబ్దయతి అసహ్యంగా శబ్దము చేయునది. బ్రహ్మ నీడతో పుట్టిన కర్దమప్రజాపతి), వాణీం = సరస్వతిని(వణతి వదతిశబ్దం చేయునది, చెప్పునది. సరస్వతి), విధాయ = సృష్టించి, విధిః= బ్రహ్మ(విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ,), అంగజసంకులః —అభూత్= అమె ఎడల కామ పరవశుడయ్యాడు, త్వత్ —బోధితైః= సర్వ జన బుద్ధి సాక్షివైన నీచేత తెలియ చెప్పబడిన, సనకదక్షముఖైః= సనకాదులు దక్షాదులు మొదలయిన, తనూజైః = పుత్రులచే, ఉద్బోధితః చ= ప్రతిబోధితుడై (ఉత్ బుధ్యతే తస్య భావః= కొంచెము జ్ఞానము వెదజల్లుట ఉపదేశము), తమః = అజ్ఞానమును, విముంచన్= విడిచి విరరామ=విరమించాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట బ్రహ్మ తన కుడి రొమ్మునుండి ధర్ముడు మొదలైన వారిని సృష్టించాడు. ఛాయనుండి కర్దముని సృష్టించాడు. సరస్వతిని సృష్టించి బ్రహ్మ అమె ఎడల కామ పరవశుడయ్యాడు. సర్వ జన బుద్ధి సాక్షివైన నీచేత తెలియ చెప్పబడిన సనకాదులు దక్షాదులు మొదలయిన పుత్రులచే ప్రతిబోధితుడై అజ్ఞానమును విడిచి విరమించాడు.

**10-9 శ్లో.**

**వేదాన్ పురాణనివహానపి సర్వవిద్యాః**
**కుర్వన్ నిజాననగణాచ్చతురాననోఽసౌ ।**
**పుత్రేషు తేషు వినిధాయ స సర్గవృద్ధిమ్**
**అప్రాప్నువంస్తవ పదాంబుజమాశ్రితోఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** అసౌ= ఈ, చతురాననః-= బ్రహ్మ, నిజ-ఆననగణాత్ =తన నాలుగు ముఖములనుండి, వేదాన్=వేదములను, పురాణనివహాన్ —అపి= పురాణ సమూహములను కూడా (పురా అపి నవం భవతి పాతదైనప్పటికి కొత్త విషయములను చెప్పునది. పురాణము), సర్వవిద్యాః= సర్వ విద్యలను, కుర్వన్ = ఏర్పరిచి, తేషు = వాటిని, పుత్రేషు= మరీచుడు మొదలయిన తనయులకు ('పుత్' అను నరకము నుండి రక్షించువాడు. పుత్రుడు), వినిధాయ= సంక్రమింప చేసినప్పటికి, సః= ఆబ్రహ్మ, సర్గవృద్ధిమ్ = సృష్టి పెరుగుట, అప్రాప్నువన్= పొందలేక, తవ = నీయొక్క, పద-అంబుజమ్= పాద పద్మములను, ఆశ్రితః-అభూత్=ఆశ్రయించెను.

**తాత్పర్యము:** ఈ బ్రహ్మ తన నాలుగు ముఖములనుండి వేదములను పురాణ సమూహములను కూడా సర్వ విద్యలను ఏర్పరిచివాటిని మరీచుడు మొదలయిన కుమారులకు సంక్రమింపచేసినప్పటికి ఆబ్రహ్మ సృష్టి పెంచలేక నీయొక్క పాద పద్మములను ఆశ్రయించెను.

**విశేషాలు:** ఒక పద్ధతిలో చతుర్దశ విద్యలు. ఇవి : వేదాలు నాలుగు, (4)వేదాంగాలు ఆరు, పురాణం, న్యాయశాస్త్రం, మీమాంసాశాస్త్రం, ధర్మశాస్త్రం మొత్తం పద్నాలుగు.

వేద పురాణ సమూహములు సర్వ విద్యలలో కలిసి పోయినప్పుడు మరలా వాటిని ప్రత్యేకంగా కవి చెప్పిన కారణం ఇది

**యశ్చతుర్వేద విద్ విప్రః పురాణం వేత్తి నార్థతః**
**తం దృష్ట్వా భయమాప్నోతి వేదో మాం ప్రతరిష్యతి ।**

నాలుగు వేదాలు చదువుకొన్నప్పటికి పురాణాన్ని అర్థ సహితంగా తెలుసుకోకపోతే అలాంటివాడిని చూసి– వేదము "ఇతగాడు తప్పు అర్థాలు చెప్పి తనను మోసం చేస్తాడ''ని భయపడుతుంది. అందుకే సర్వ విద్యలలోను చెప్పినప్పటికి ప్రాధాన్యత దృష్ట్యా వేద పురాణాలను కవి మరలా ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

**10–10 శ్లో.**

**జానన్నుపాయమథ దేహమజో విభజ్య**
**స్త్రీపుంసభావమభజన్మను తద్వధూభ్యామ్ ।**
**తాభ్యాం చ మానుషకులాని వివర్ధయంస్త్వం**
**గోవింద! మారుత పురాధిప! రుంధి రోగాన్ ॥**

**ప్రతిపదార్థం:** గోవింద!= ఓ గోవిందా!, మారుతపురేశ! = గురువాయూరు పురాధిపా, అథ =అటుపిమ్మట, ఉపాయమ్= ఉపాయమును, జానన్ = తెలుసుకొని, అజః= బ్రహ్మ (న జాయతే పుట్టనివాడు. బ్రహ్మ స్థూలజగత్తుకు కారణమైన సత్త్వరజస్తమోగుణరూపమైన ప్రధానము.), దేహమ్ = తన శరీరమును, విభజ్య= రెండుగా విడగొట్టి, మనుః= మనువుగా (మన్యతేతలచుకొన్నవాడు. స్వాయంభువాది మనువులు.), తత్ వధూభ్యామ్= ఆయన భార్య శత రూపగా (వధూ= ఉహ్యతే పితృగృహాత్ పతిగృహమ్ తండ్రి గృహము నుండి పతి గృహమునకు పోవునది. భార్య.), స్త్రీపుంసభావమ్= స్త్రీ పురుషులిద్దరుగా, అభజత్ = చేసాడు. ( తన శరీరపు సగము మనువుగా ., మరొక సగమును శతరూపగా బ్రహ్మ చేసాడని భావం ) తాభ్యాం చ= మను శతరూపలు బ్రహ్మ ఆదేశంతో మైథున ధర్మంతో, మానుషకులాని= మనుష్య కులమును, వివర్ధయన్= పెంచిరి, త్వం= నువ్వు, రోగాన్= నా రోగములను, నిరుంధి= పోగొట్టుము.

**తాత్పర్యము:** ఓ గోవిందా! గురువాయూరు పురాధిపా! అటుపిమ్మట నీ మీద భక్తితో ఉపాయమును తెలుసుకొని బ్రహ్మ తన శరీరమును రెండుగా విడగొట్టి మనువుగా ఆయన భార్య శత రూపగా స్త్రీ పురుషులిద్దరుగా చేసాడు. మను శతరూపలు బ్రహ్మ ఆదేశంతో మైథున ధర్మంతో మనుష్య కులమును పెంచిరి. నువ్వు నా రోగములను పోగొట్టుము

**విశేషాలు:**

**ఉపాయము:** ఉప ఈయతే గమ్యతే ప్రాప్యతే అనేన వాంఛితమ్ – ఉపాయనము సాధనము ఆరంభము ప్రయత్నము సామ–దాన–భేద–దండములు అనునవి నాలుగు ఉపాయములు.

**స్త్రీ:** స్త్యాయతి గర్భం యస్యామ్ గర్భము దీనియందు పెరుగును కనుక స్త్రీ.

స్తృణాతి దుర్వినీతా సతి ఆత్మనః పరస్య చ గుణగుణం ప్రచ్ఛాదయతి తన గుణములను కప్పిపుచ్చునది కనుక స్త్రీ.

స్తృణాతి ఆవృణోతి కల్యాణపరంపరాభిః స్వకులం చ పతికులం చ పితృ కులమును పతి కులమును ప్రకటించునది కనుక స్త్రీ.

**తృతీయ స్కంధము**

**10వ దశకము సమాప్తము.**



# దశకమ్ 11

## సనకాదుల వైకుణ్ఠదర్శనము మరియు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననము

**11–1 శ్లో.**

**క్రమేణ సర్గే పరివర్ధమానే**
**కదాపి దివ్యాః సనకాదయస్తే।**
**భవద్విలోకాయ వికుంఠలోకం**
**ప్రపేదిరే మారుతమందిరేశ! ॥**

**ప్రతిపదార్థము:** మారుతమందిర–ఈశ = ఓ గురువాయూరు దేవా!, సర్గే క్రమేణ= సృష్టి క్రమము, పరివర్ధమానే = ఇలా వర్ధిల్లుతుండగా (నడుస్తుండగా), కదాపి= ఒకనాడు (కస్మిన్నపి కాలే ఏదో ఒకకాలంలో), దివ్యాః = సాత్వికులయిన (దీవ్యతే అనేన– దీనితో ప్రకాశించునది. అందమైనది), సనక–ఆదయః– = సనకాది మహా మునులు(సన్యతే పూజ్యతే పూజింపబడువాడు. సనకుడు), భవత్ –విలోకాయ= నిను చూచుటకు, తే వికుంఠలోకం= నీ వైకుంఠ లోకమునకు, ప్రపేదిరే = వచ్చారు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! సృష్టి క్రమము ఇలా నడుస్తుండగా ఒకనాడు సాత్వికులయిన సనకాది మహా మునులు నిన్ను చూచుటకు నీ వైకుంఠ లోకమునకు వచ్చారు

**విశేషాలు:** ఇది ఉపేంద్ర వజ్రము. **జ , త , జ , గా**(గగ) గణములుండును. అవతారములు అసంఖ్యాకములు.భూమి యందున్న మట్టి కణములను లెక్కపెట్టవచ్చేమో కాని స్వామి అవతారములు లెక్కపెట్టలేము. అవతరించుట ఎందుకంటే మనలను తరింపచేయుటకు.

**11–2 శ్లో.**

**మనోజ్ఞ నైఃశ్రేయస కాననాద్యై**
**రనేకవాపీమణిమందిరైశ్చ।**

**అనోపమం తం భవతో నికేతం**
**మునీశ్వరాః ప్రాపురతీతకక్ష్యాః ॥**

**ప్రతిపదార్థము:** మనోజ్ఞైః = సర్వ ఋతు శోభలతో అతి మనోహరంగా(మనసా జానాతి గృహ్ణాతి మనసుతో గ్రహించునది. అందమైనది), నైఃశ్రేయసమ్= మోక్షము ఒక ఆకారము ధరించినట్లున్న, కానన= ఉద్యానవనములతో (కం జలం అననం జీవనం అస్య జలమే జీవనంగా గలది. వనము.), అనేక= అనేకములైన, వాపీ= నడబావులు (వుప్యతే పద్మాదికమస్యామ్ పద్మాదులు ఇందులో వుంచబడును. డబావి), మణిమందిరైః –చ= రత్నమయ భవనాలతో, అనోపమం= దేనితో పోలిక లేని విధంగా ఉన్న , తం= అన్ని లోకములకు అభివంద్యమైన, భవతః నికేతం = నీ యొక్క నిలయములోని ( వైకుంఠ నిలయము), అతీత కక్ష్యాః=ఆరు పెద్ద గదులను దాటి (కక్షే భవాఇంటిలో పెద్దగది), ప్రాపుః= ఏడవ కక్ష్యలో ఉన్న నీ మందిరమును చేరిరి.

**తాత్పర్యము:** సర్వ ఋతు శోభలతో అతి మనోహరంగా మోక్షము ఒక ఆకారము ధరించినట్లున్న ఉద్యానవనములతో అనేక= అనేకములైన నడబావులు, రత్నమయ భవనాలతో దేనితో పోలిక లేని విధంగా ఉన్న అన్ని లోకములకు నమస్కరింపదగిన నీ యొక్క నిలయములోని ( వైకుంఠ నిలయము) ఆరు పెద్ద గదులను దాటి ఏడవ కక్ష్యలో ఉన్న నీ మందిరమును చేరిరి.

**విశేషాలు:** ఈ శ్లోక వృత్తము ఉపేంద్రవజ్రము

**11–3 శ్లో.**

**భవద్దిదృక్షూన్ భవనం వివిక్షూన్**
**ద్వాః స్థౌ జయస్తాన్ విజయోఽప్యరుంధామ్ ।**
**తేషాం చ చిత్తే పదమాప కోపః**
**సర్వం భవత్ప్రేరణయైవ భూమన్ ॥**

**ప్రతిపదార్థము:** భూమన్ = ఓ గొప్పవాడా! (మహత్త్వం,సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా)!, భవత్ = సమాధి గమ్యుడైన నిన్ను, దిదృక్షూన్=

కన్నులతో చూచుటకు యత్నించి, భవనం = నీయొక్క మణి మందిరమును, వివిక్షూన్ = ప్రవేశించుచున్న, తాన్= సనకాదులను, జయః విజయః= జయ విజయులను, ద్వాః స్థౌ= నీ ద్వారపాలకులు, అరుంధామ్= లోపలికి పోనీక అడ్డగించిరి, తేషాం = ఆ సనకాదులయొక్క, చిత్తే= మనస్సులో, కోపః = కోపము యొక్క, పదమ్= స్థానము(పద్యతే స్థానము.), ఆప= ఏర్పడినది, సర్వం = ఇదంతయూ, భవత్ – ప్రేరణయా ఏవ= ప్రేరణతో ఏర్పడినదే.

**తాత్పర్యము:** ఓ గొప్పవాడా ! (మహత్త్వం,సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా)! సమాధి గమ్యుడైన నిన్ను కన్నులతో చూచుటకు యత్నించి నీయొక్క మణి మందిరమును ప్రవేశించుచున్న సనకాదులను జయవిజయులను ద్వార పాలకులు లోపలికి పోనీక అడ్డగించిరి. ఆ సనకాదులయొక్క మనస్సులో కోపము ఏర్పడినది. ఇదంతయూ(ద్వారము వద్ద ఆపుట, కోపము ఏర్పడుట) నీ ప్రేరణతో ఏర్పడినదే.

**విశేషాలు:**

**ఉపజాతి**

1. ఒకటవ పాదమునందు **జ , త , జ , గా**(గగ) గణములుండును.
2. రెండవ పాదమునందు **త , త , జ , గా**(గగ) గణములుండును.
3. మూడవ పాదమునందు **జ , త , జ , గా**(గగ) గణములుండును.
4. నాలుగవ పాదమునందు **త , త , జ , గా**(గగ) గణములుండును.

**11–4 శ్లో.**

**వైకుంఠలోకానుచితప్రచేష్టౌ**
**కష్టౌ యువాం దైత్యగతిం భజేతమ్ ।**
**ఇతి ప్రశప్తౌ భవదాశ్రయౌ తౌ**
**హరిస్మృతిర్నోఽస్త్వితి నేమతుస్తాన్ ॥**

**ప్రతిపదార్థము:** వైకుంఠలోకాన్ = రజో తమో వికారములకు అవకాశం లేని

వైకుంఠ లోకములో, అనుచిత = ఉచితము కాని, ప్రచేష్టా= చర్యను చేసిన (చేష్టాయాం చేష్టతేప్రవర్తించుట ప్రయత్నించుట), కష్టౌ = అతిక్రూరులైన(కష్యతే ఇతి, కష్యతే హింస్యతే అనేన పీడించునది. పీడ వ్యధ.), యువాం = మీరిద్దరు, దైత్యగతిం= రాక్ష స జన్మను (దితేః అపత్యమ్ దితి సంతానము), భజేతమ్= పొందుడు, ఇతి= అని, ప్రశప్తౌ = శపింపబడిన, భవత్ –ఆశ్రయౌ= మీ ఇరువురు సేవకులయిన, తౌ = జయ విజయులు, నః = మాకు, హరిస్మృతిః అస్తు ఇతి = రాబోయే జన్మలో విష్ణు స్మరణము ఉండవలెనని (స్మరతి అనుభూతవిషయం తస్య భావఃస్మరణము), తాన్ = ఆ సనకాదులకు, నేమతుః = ప్రార్థన చేసి పాదములను ముట్టి నమస్కరించిరి.

**తాత్పర్యము:** రజో తమో వికారములకు అవకాశం లేని వైకుంఠ లోకములో ఉచితము కాని అడ్డగింపు చర్యను చేసిన అతిక్రూరులైన "మీరిద్దరు రాక్ష స జన్మను పొందుడు" అని శపింపబడిన మీ ఇరువురు సేవకులయిన జయ విజయులు –"మాకు రాబోయే జన్మలో విష్ణు స్మరణము ఉండవ"లెనని ఆ సనకాదులకు ప్రార్థ న చేసి పాదములను ముట్టి నమస్కరించిరి.

**విశేషాలు:** ఇంద్రవజ్ర లక్షణాలు సరిపోవటంలేదు

**11–5 శ్లో.**

**తదేతదాజ్ఞాయ భవానవాప్తః**
**సహైవ లక్ష్మ్యా బహిరంబుజాక్ష ।**
**ఖగేశ్వరాంసార్పిత చారుబాహుః**
**ఆనందయంస్తానభిరామ మూర్త్యా ॥**

**ప్రతిపదార్థము:** అంబుజ–అక్ష= పద్మములవంటి కన్నులు కలవాడా!, భవాన్ = నువ్వు, తత్ –ఏతత్ = ద్వారపాలకుల ప్రవర్తన, ఆజ్ఞాయ = తెలుసుకొని, లక్ష్మ్యా ఏవ= లక్ష్మితో సహ కలిసి, బహిః =మణి భవనము యొక్క ముంగిలికి, అవాప్తః= వచ్చి, ఖగ–ఈశ్వర–= గరుడుని(ఖగ= ఖే ఆకాశే గచ్ఛతి ఆకాశములో వెళ్లువాడు. పక్షి), అంస= మూపుకు(అమతి అమ్యతే వా భారాదినా భారమును వహించునది. స్కంధము భుజము), అర్పిత = ఆనించిన, చారుబాహుః = అందమైన చేయి

కలవాడవై, అభిరామ =అతి మనోహరమైన (అభిరమతే మనో అత్ర సుందరమైనది), మూర్త్యా=నీ మూర్తితో, తాన్= ఆ మహర్షులను, ఆనందయన్ = ఆనందపరిచితివి.

**తాత్పర్యము:** పద్మములవంటి కన్నులు కలవాడా! నువ్వు ద్వారపాలకుల ప్రవర్తన తెలుసుకొని లక్ష్మితో కలిసి మణి భవనము యొక్క ముంగిలికి వచ్చి గరుడుని మూపుకు ఆనించిన అందమైన చేయి కలవాడవై అతి మనోహరమైన నీ మూర్తితో ఆ మహర్షులను ఆనందపరిచితివి.

**విశేషాలు**

**ఉపజాతి**

ఒకటవ పాదమునందు **జ , త , జ , గా**(గగ) గణములుండును.

రెండవ పాదమునందు **త , త , జ , గా**(గగ) గణములుండును.

మూడవ పాదమునందు **జ , త , జ , గా**(గగ) గణములుండును.

నాలుగవ పాదమునందు **త , త , జ , గా**(గగ) గణములుండును.

**11-6 శ్లో.**
**ప్రసాద్య గీర్భిః స్తువతో మునీంద్రాన్**
**అనన్యనాథావథ పార్షదౌ తౌ ।**
**సంరంభయోగేన భవైస్త్రిభిర్మామ్**
**ఉపేతమిత్యాత్తకృపం న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, స్తువతః= నీదర్శనము తరువాత శిరస్సులు వంచి నమస్కరించి ఆనందంతో నిన్ను స్తుతిస్తున్న, ముని+ఇంద్రాన్= ముని శ్రేష్ఠులను, గీర్భిః= మధురమైన నీ మాటలచే, ప్రసాద్య= అనుగ్రహించి, అనన్యనాథౌ= ఆత్మైక శరణులయిన (నువ్వు తప్ప ఇంకొక దిక్కులేని)(న అన్యః వేరే కానిది.అనన్య), తౌ=సంకటములో ఉన్న ఆ, పార్షదౌ=జయవిజయులతో (పరిషది భవః తత్ర స్థితో వా సభలో వుండువాడు. సభ్యుడు.), ఆత్తకృపం=అంగీకరింపబడిన దయతో (జాలిపడి), త్రిభిః = హిరణ్య కశిపు రావణ శిశుపాలాది రూపములతో,

భవైః= మూడు జన్మలెత్తి నా మీద పగతో (భవతి జాయతే తస్య భావః పుట్టుక), సంరంభయోగేన = ఆయాయా జన్మలలో నా నిరంతర సమాధి పొంది మీరు, మామ్= నన్ను, ఉపేతమ్= పొందెదరు(ఉప సమీపం ఇతః ఆగతః ఉపస్థితః ప్రాప్తః దగ్గరకు వచ్చినవాడు పొందబడినది), ఇతి న్యగాదీః= అని పలికితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీదర్శనము తరువాత శిరస్సులు వంచి నమస్కరించి ఆనందంతో నిన్ను స్తుతిస్తున్న మునిశ్రేష్ఠులను మధురమైన నీ మాటలచే అనుగ్రహించి ఆత్మైక శరణులయిన (నువ్వు తప్ప ఇంకొక దిక్కులేని) సంకటములో ఉన్న జయవిజయులతో జాలిపడి హిరణ్య కశిపు రావణ శిశుపాలాది రూపములతో మూడు జన్మలెత్తి నా మీద పగతో ఆయాయా జన్మలలో నా నిరంతర సమాధి పొంది మీరు నన్ను పొందెదరు అని పలికితివి.

**విశేషాలు**

**వారాంగి**

ఒకటవ పాదమునందు **జ , త , జ , గా** (గగ) గణములుండును.

రెండవ పాదమునందు **జ , త , జ , గా** (గగ) గణములుండును.

మూడవ పాదమునందు **త , త , జ , గా** (గగ) గణములుండును.

నాలుగవ పాదమునందు **త , త , జ , గా** (గగ) గణములుండును.

**11-7 శ్లో.**

**త్వదీయభృత్యావథ కాశ్యపాత్ తౌ సురారివీరావుదితౌ దితౌ ద్వౌ ।**

**సంధ్యా సముత్పాదనకష్టచేష్టౌ యమౌ చ లోకస్య యమావివాన్యౌ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, తౌ ద్వౌ= ఆ ఇరువురు, త్వదీయభృత్యౌ = నీ ద్వార పాలకులయిన జయవిజయులు(భ్రియతే భర్తుం యోగ్యో వా, భర్తవ్యః భరించదగినవాడు, జీతము పొందువాడు. సేవకుడు.), కాశ్యపాత్ = కాశ్యపుడను మునికి(కశ్యపస్య గోత్రాపత్యం పుమాన్ కశ్యపుని గోత్రములో పుట్టినవాడు. ఒక ముని, కాశ్యపుడు.), దితౌ= అతని భార్య అయిన దితి యందు (ద్యతి ఖండయతి

శుభమ్ శుభములను ఖండించునది. దితి, రాక్షసమాత.), సుర– అరివీరౌ = హిరణ్యకశిపు హిరణ్యాక్ష నామధేయాలతో రాక్షస శ్రేష్ఠులుగా, ఉదితౌ= పుట్టిరి, సంధ్యాసముత్పాదన = సంధ్యా కాల సంగమముచే పుట్టుట వలన (సమ్యక్ ధ్యాయంతేవిప్రాఃఅస్యామ్ దీనియందువిప్రులుధ్యానింతురు.సంధ్యాకాలముప్రొద్దు పొడుచుటకు ముందు అయిదుగడియలవరకును ప్రొద్దుగ్రుంకిన వెనుక మూడుగడియల వఱకును గల కాలము), కష్టచేష్టౌ = క్రూర కర్ములు (కష్యతే హింస్యతే అనేన పీడించునది. పీడ వ్యథ), చ= మరియు, యమౌ = ఒకేసారి పుట్టుట వలన కవలలు అయి, లోకస్య = లోకమునకు, యమౌ –ఇవ –అన్యౌ= ఇంకొక యములవలె అయిరి.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆ ఇరువురు నీ ద్వార పాలకులయిన జయవిజయులు కాశ్యపుడను మునికి అతని భార్య అయిన దితి యందు హిరణ్యకశిపు హిరణ్యాక్ష నామధేయాలతో రాక్షస శ్రేష్ఠులుగా పుట్టిరి . సంధ్యా కాల సంగమముచే పుట్టుట వలన క్రూర కర్ములు మరియు ఒకేసారి పుట్టుట వలన కవలలు అయిరి. లోకమునకు ఇంకొక యములవలె మారిరి.

**విశేషాలు: ఛందస్సు వారాంగి**

**11–8 శ్లో.**

**హిరణ్యపూర్వః కశిపుః కిలైకః పరో హిరణ్యాక్ష ఇతి ప్రతీతః ।**
**ఉభౌ భవన్నాథమశేషలోకం రుషా న్యరుంధాం నిజవాసనాంధౌ ॥**

**ప్రతిపదార్థము:** ఏకః= వారిలో ఒకడు, హిరణ్యపూర్వః= హిరణ్య మను పదము పూర్వముగా కలిగిన, కశిపుః= కశిపుడు (హిరణ్య కశిపుడని భావం) (తన్నామ దైత్యః ఒక రాక్షసుడు. హిరణ్యకశిపుడు.), కిలా= కదా, పరః= తరువాతి వాడు, హిరణ్యాక్ష= హిరణ్యాక్షుడు (హిరణ్యవత్ ధీతే అక్షిణే యస్య బంగారు వంటి పచ్చని కన్నులు కలవాడు. హిరణ్యాక్షుడు), ఇతి = అని, ప్రతీతః= ప్రసిద్ధికి ఎక్కిన వాడు. (ప్రతీతః ఖ్యాతః ఆదృతః జ్ఞాతః ప్రసన్నః ప్రసిద్ధమైనది ఆదరింపబడినది తెలుసుకొనబడినది సంతోషపడువాడు), ఉభౌ= ఆ ఇద్దరు, భవన్ –నాథమ్ – = నువ్వు నాథునివిగా (దిక్కుగా) కలిగిన, అశేషలోకం= సర్వలోక నివాసులైన

ప్రజలను, నిజవాసన-అంధౌ= తమ రాక్ష స జన్మ వాసనచే గుడ్డి వారయి(కన్ను గానక), రుషా= రోషముతో(రుష్యతి తస్య భావః కర్మ వా కోపము.), న్యరుంధాం= పీడించసాగారు.

**తాత్పర్యము:** వారిలో ఒకడు హిరణ్య కశిపుడు. తరువాతి వాడు హిరణ్యాక్షుడు అని ప్రసిద్ధికి ఎక్కిన వాడుఆ ఇద్దరు నువ్వు నాథునివిగా (దిక్కుగా) కలిగిన సర్వలోక నివాసులైన ప్రజలను తమ రాక్ష స జన్మ వాసనచే కన్ను మిన్ను గానక పీడించసాగారు.

**విశేషాలు: ఉపేంద్రవజ్రము**

**11-9 శ్లో.**
**తయోర్హిరణ్యాక్షమహాసురేంద్రో రణాయ ధావన్ననవాప్తవైరీ ।**
**భవత్ప్రియాం క్ష్మాం సలిలే నిమజ్జ్య చచార గర్వాత్ వినదన్ గదావాన్ ॥**

**ప్రతిపదార్థము:** తయోః = వారిలో, హిరణ్యాక్ష = హిరణ్యాక్షుడను, మహా-అసుర-ఇంద్రః= రాక్షస శ్రేష్ఠుడు, రణాయ = యుద్ధము కొరకు, ధావన్ = మూడు లోకములలోను తిరిగి, అనవాప్తవైరీ= తనకు సరిపోయిన శత్రువు కనిపింపక, భవత్ ప్రియాం = నీ ప్రియురాలు, క్ష్మాం= భూమిని (క్షమతే ప్రాణినః భారం చ ప్రాణులను, భారమును సహించునది. భూమి), సలిలే= ప్రళయ సముద్రములో (సలతి గచ్ఛతి ప్రవహతి ప్రవహించునది), నిమజ్జ్య= ముంచి, గదావాన్= భుజముపై గదను ఉంచుకొని, గర్వాత్ = గర్వముతో, వినదన్= పెద్దగా అరుచుచూ, చచార= నీటిలో తిరుగుచుండెను.

**తాత్పర్యము:** వారిలో హిరణ్యాక్షుడను రాక్షస శ్రేష్ఠుడు యుద్ధము కొరకు మూడు లోకములలోను తిరిగి తనకు సరిపోయిన శత్రువు కనిపింపక నీ ప్రియురాలు భూమిని ప్రళయ సముద్రములో ముంచి తనను కర్ణాభరణముగా చేసుకొని నీటిలో మునిగి భుజముపై గదను ఉంచుకొని గర్వముతో పెద్దగా అరుచుచూ నీటిలో తిరుగుచుండెను.

విశేషాలు: ఇది ఉపేంద్రవజ్రము

**11–10 శ్లో.**

**తతో జలేశాత్ సదృశం భవంతం నిశమ్య బభ్రామ గవేషయంస్త్వామ్ ।**
**భక్తైకదృశ్యః స కృపానిధే! త్వం నిరుంధి రోగాన్ మరుదాలయేశ! ॥**

**ప్రతిపదార్థము:** కృపానిధే! = ఓ దయానిధీ!, మరుత్–ఆలయేశ!= వాయు పురాధీశా!, తతః= అటుపిమ్మట, జల–ఈశాత్= వరుణ ముఖముగా, భవంతం= నీకు, సదృశం = సరి పోయిన శత్రువు శ్రీ నారాయణుడు ఒకడే అని (సమాన ఇవ దృశ్యతే సమానంగా కనిపించునది), నిశమ్య = విని, త్వామ్= నిన్ను, గవేషయన్= వెతుకుచూ (గవేషణా మార్గణమ్ వెదకుట), బభ్రామ= హిరణ్యాక్షుడు తిరుగాడెను, స త్వం భక్త –ఏక దృశ్యః = అటువంటి నువ్వు భక్తులకు మాత్రమే కనబడువాడివి కదా!, రోగాన్ = నా రోగములను, నిరుంధి= పోగొట్టుము.

**తాత్పర్యము:** ఓ దయానిధీ! వాయు పురాధీశా! అటుపిమ్మట వరుణుని ద్వారా "నీకు సరి పోయిన శత్రువు శ్రీ నారాయణుడు ఒకడే "అని హిరణ్యాక్షుడు విని నిన్ను వెతుకుచూ తిరుగాడెను. నువ్వు భక్తులకు మాత్రమే కనబడువాడివి కదా! నా రోగములను పోగొట్టుము.

**విశేషాలు:** నువ్వు భక్తులకు మాత్రమే కనబడువాడివి కదా! అని కవి చెప్పాడు. మరి హిరణ్యాక్షుడు భక్తుడు కాదు కదా! అతనికి స్వామి వారి దర్శనము ఎలా లభించిందని ప్రశ్న. తస్మాత్ కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్. ఏవిధమైన ఉపాయము చేతనైనను మనస్సును కృష్ణునియందే .. ఉంచాలి. స్వామి దర్శనమవుతుందని భాగవతపు జవాబు.

వారాంగి చివరిపాదము సరిపోవటంలేదు

**తృతీయ స్కంధము**

**11వ దశకము సమాప్తము.**

## దశకమ్ 12 – వరాహావతారము

**12-1 శ్లో.**
**స్వాయంభువో మనురథో జనసర్గశీలో**
**దృష్ట్వా మహీమసమయే సలిలే నిమగ్నామ్ ।**
**స్రష్టారమాప శరణం భవదంఘ్రిసేవా–**
**తుష్టాశయం మునిజనైః సహ సత్యలోకే ॥**

**ప్రతిపదార్థము:** స్వాయంభువ మనుః = స్వాయంభువమనువు(స్వయంభువస్య అపత్యమ్ స్వయంభువుని సంతానము. స్వాయంభువ మనువు, మొదటి మనువు), అథ= అటుపిమ్మట, జనసర్గశీలః= ప్రజలను సృష్టి చేయవలెనను స్వభావముతో, అసమయే = అకాలములో (ప్రళయకాలములో) (అవకృష్టః సమయః దుష్టకాలః దుష్టకాలము), మహీమ్ = భూమి(మహ్యతే పూజ్యతే పూజింపబడునది. భూమి), సలిలే = నీటిలో (సముద్రములో)(సలతి గచ్ఛతి ప్రవహతి ప్రవహించునది జలము), నిమగ్నామ్= మునుగగా, దృష్ట్వా= చూచి, మునిజనైః సహ = మునులతో కలిసి, సత్యలోకే= సత్యలోకమునకు వెళ్లి, భవత్ –అంఘ్రిసేవా=నీ పాద సేవచే, తుష్టాశయం = సంతృప్తి పడిన మనసుకలిగిన, స్రష్టారమ్= తన జనకుడైన బ్రహ్మ దేవుని, శరణం ఆప= శరణము పొందెను.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! అటుపిమ్మట స్వాయంభువ మనువు ప్రజలను సృష్టి చేయవలెనను స్వభావముతో ఉన్నాడు. కాని ప్రళయకాలములో భూమి సముద్రములో మునుగగా చూచి మునులతో కలిసి సత్యలోకమునకు వెళ్లి తన జనకుడైన నీ పాద సేవచే సంతృప్తి పడిన మనసుకలిగిన బ్రహ్మ దేవుని శరణము పొందెను.

**విశేషాలు:** వసంతతిలకము **త , భ , జ , జ , గా(గగ) ఛందస్సు ఈ దశకమునందు అంతటా ఉన్నది.**

**స్వాయంభువ మనువు:** ఇతఁడు బ్రహ్మమానసపుత్రుడు. ఇతని భార్య శతరూప.

కొడుకులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు. కొమార్తెలు ప్రసూతి, ఆకూతి, దేవహూతి.

**1వ భావము:** హిరణ్యాక్షుడట్లు భూమిని జలమున ముంచివేయుచుండగా, జీవులను సృష్టించుటకు బ్రహ్మచే నియోగించబడిన 'స్వాయంభువ మనువు' , ప్రళయసమయముకాని సమయమున భూమి జలమున మునుగుట చూచి, మునిగణములతో సత్యలోకమునకు వెళ్ళి, నీ పాదపద్మ సేవ యందు నిమగ్నుడైన బ్రహ్మను శరణు కోరెను.

**12-2 శ్లో.**
**కష్టం ప్రజాస్సృజతి మయ్యవనిర్నిమగ్నా**
**స్థానం సరోజభవ! కల్పయ తత్ప్రజానామ్ ।**
**ఇత్యేవమేష కథితో మనునా స్వయంభూః**
**అంభోరుహాక్ష! తవపాదయుగం వ్యచింతీత్ ॥**

**ప్రతిపదార్థము:** అంభోరుహ-అక్ష! = పద్మముల వంటి కన్నులు కలవాడా! గురువాయూరు దేవా!, కష్టం = అయ్యో!, సరోజభవ= ఓ పద్మ సంభవా! బ్రహ్మా! , మయి= నాయందు (నేను), ప్రజాః సృజతి సన్= ప్రజలను సృష్టించుచున్న సమయంలో, అవనిః = భూమి(అవతి ప్రజాః అవతి రక్షణాదికం కరోతి అవ్యతే భూపైః ప్రాణులను రక్షించునది. భూమి, రాజుల ద్వారా రక్షింపబడునది.), మగ్నా = ప్రళయ సముద్రములో మునిగిపోయినది. (మగ్నః నిమగ్నః, స్నాతఃనిమగ్నుడైనవాడు మునిగినవాడు), తత్= అందువలన, ప్రజానామ్= ప్రజలకు, నాకు, స్థానం= స్థానమును (తిష్ఠంతి అత్రఇక్కడ వుందురు. నివాసము, స్థానము), కల్పయ= కల్పింపుము, ఇతి-ఏవమ్ = ఈ విధముగా, మనునా= మనువు చేత, కథితః= విజ్ఞాపన చేయబడిన (కథితః వర్ణితః పరమేశ్వరః వర్ణింపబడ్డది), ఏషః స్వయంభూః = ఆ బ్రహ్మదేవుడు(స్వయం భూతః జాతః తనకు తాను పుట్టినవాడు), తవపాదయుగం= నీ పాదముల జంటను, వ్యచింతీత్= ధ్యానించెను.

**తాత్పర్యము:** పద్మముల వంటి కన్నులు కలవాడా! గురువాయూరు దేవా! మనువు

బ్రహ్మతో ఇలా విజ్ఞప్తి చేసాడు. "ఓ పద్మ సంభవా! బ్రహ్మా! నేనుప్రజలను సృష్టించుచున్న సమయంలో భూమి ప్రళయ సముద్రములో మునిగిపోయినది. ఆశ్రయము లేక పోవుట వలన నేను సృష్టి చేయలేను. అందువలన ప్రజలకు, స్థానమును కల్పింపుము." ఈ విధముగా మనువు చేత విజ్ఞాపన చేయబడిన ఆ బ్రహ్మదేవుడు నీ పాదముల జంటను ధ్యానించెను.

**12–3 శ్లో.**

**హా ! హా! విభో! జలమహం న్యపిబం పురస్తాత్**
**అద్యాపి మజ్జతి మహీ కిమహం కరోమి! ।**
**ఇత్థం త్వదంఘ్రియుగళం శరణం యతోఽస్య**
**నాసాపుటాత్ సమభవః శిశుకోలరూపీ ॥**

**ప్రతిపదార్థము:** విభో! = ఓ ప్రభూ!, హా ! హా! = కష్టము కలిగినది, అహం= నేను, పురస్తాత్=సృష్టి చేయుటకు ముందే (పురాకాలే –ముందుగా ఎదుట జరిగిపోయిన కాలం కాలవాచి), జలమ్= భూమి కొరకు నీటిని ( సముద్రమును), న్యపిబం= తాగాను, అద్య–అపి = అయినను, మహీ = భూమి, మజ్జతి= మునిగిపోవుచున్నది, అహం కిమ్ కరోమి!= నేను ఏమి చేయుదును?, ఇత్థం= ఇట్లు వేడుకొంటూ, త్వత్ –అంఘ్రియుగళం= నీ పాదములే, శరణం= శరణమని, యతః =ఎవరైతే ప్రాప్తిని పొందాడో, అస్య=ఆ బ్రహ్మ యొక్క, నాసాపుటాత్= నాసికా రంధ్రము నుండి, శిశుకోలరూపీ= చిన్న వరాహ రూపములో (శ్యతి గర్భమ్ గర్భమును చీల్చునది. శిశువు.) (కోల= కోలతి బాధాం న మత్వా శత్రుం ప్రతి ధావతి బాధను తెలియకుండానే శత్రువుపై పరుగెత్తునది. పంది), సమభవః= నువ్వు అవతరించావు.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! కష్టము కలిగినది. నేను సృష్టి చేయుటకు ముందే నీటిని తాగాను. అయినా భూమి మునిగిపోవుచున్నది. నేను ఏమి చేయుదును? ఇట్లు వేడుకొంటూ నీ పాదములే శరణమని కోరిన బ్రహ్మ యొక్క నాసికా రంధ్రము నుండి చిన్న వరాహ రూపములో నువ్వు అవతరించావు.

**3వ భావము:** "ఓ! ప్రభూ! ప్రళయకాలమున నేను జలము నంతటిని త్రాగి వేసితిని –కాని ఇప్పుడు భూమి నీట మునిగిపోవుచున్నది. నే నేమి చేయుదును" అని పలికి బ్రహ్మ నీ పాదపద్మములను స్మరించెను. అట్లు పలికిన బ్రహ్మ నాసికాపుటము నుండి నీవు వరాహరూపమున శిశువుగా ఉద్భవించితివి.(బ్రహ్మ నుండి వచ్చింది. బ్రహ్మ వలన కాదు)

**12–4 శ్లో.**

**అంగుష్ఠమాత్రవపురుత్పతితః పురస్తాత్**
**భూయోఽథ కుంభిసదృశః సమజృంభథాస్త్వమ్ ।**
**అభ్రే తథావిధముదీక్ష్య భవంతముచ్చైః**
**విస్మేరతాం విధిరగాత్ సహసూనుభిస్స్వైః ॥**

**ప్రతిపదార్థం:** త్వమ్ = నువ్వు, పురస్తాత్ = పూర్వము, అంగుష్ఠమాత్రవపుః = బొటనవేలి పరిమాణము కలిగిన శరీరముతో (అంగౌ పాణౌ ప్రాధాన్యేన తిష్ఠతి చేతియందు ముఖ్యమైనది. బొటన వ్రేలు), ఉత్పతితః= ఎగిరెడి స్వభావము కలవాడివై, అథ= అటుపిమ్మట, భూయః= మరల, కుంభిసదృశః = మదపుటేను గంత పరిమాణంలో(కుంభస్థలములు–శిరస్సులు– గలది), సమజృంభథాః= విజృంభించి (వర్ధిల్లి), తథావిధమ్= అట్లే క్షణ కాలములో, అభ్రే= మేఘ మార్గములో, ఉచ్చైః = ఉన్నతముగా ఉన్న, భవంతమ్= నిన్ను, ఉదీక్ష్య= చూసి, విధిః= బ్రహ్మ (విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ), స్స్వైః= తనకు సంబంధించిన, సూనుభిః సహ= కుమారులయిన మరీచాదు లతో(సూయతే ప్రసూయతే కనబడ్డవాడు పుట్టినవాడు. కొడుకు), విస్మేరతాం = ఆశ్చర్యము, అగాత్ = పొందెను.

**తాత్పర్యము:** నువ్వు బొటనవేలి పరిమాణము కలిగిన శరీరముతో ఎగిరెడి స్వభావము కలవాడివై అటుపిమ్మట మదపుటేనుగంత పరిమాణంలో విజృంభించి అట్లే క్షణ కాలములో మేఘ మార్గములో(అకాశములో) ఉన్నతముగా ఎదిగిన నిన్ను చూసి బ్రహ్మ కుమారులయిన మరీచాదులతో ఆశ్చర్యము పొందెను.

**విశేషాలు:** కాస్మిక్ ఈవెంట్ స్ ను ( విజ్ఞాన సంబంధమైన విశ్వసృష్టి రహస్యాలను) అవతారాల రూపంలో కవులు చెప్పారు.

**12-5 శ్లో.**

**కోఽసావచింత్య మహిమా కిటిరుత్థితో మే**
**నాసా పుటాత్ కిము భవేదజితస్య మాయా ।**
**ఇత్థం విచింతయతి ధాతరి శైలమాత్రః**
**సద్యో భవన్ కిల జగర్జిథ ఘోరఘోరమ్ ॥**

**ప్రతిపదార్థము:** అచింత్య మహిమా = ఊహించలేని మహిమ కలిగిన (చింతయితుం ఇయత్తయా పరిచ్ఛేత్తుం అశక్యమ్ అచింతనీయ పరిమాణము గలది. చింతించుటకు వీలు గానిది. పరబ్రహ్మ.), కిటిః = శిశు వరాహము, మే = నాయొక్క, నాసా పుటాత్ = నాసికనుండి (నాసతే శబ్దాయతే శబ్దమును చేయునది. ముక్కు.), ఉత్థితః = పుట్టినది?, కః-అసౌ = ఇతడు ఎవడు?, అజితస్య = విష్ణువు యొక్క (న జితః జయింపబడనివాడు, విష్ణువు), మాయా = మాయ, కిము భవేత్ = ఇది కాదు కదా!, ఇత్థం = ఈవిధముగా, ధాతరి = బ్రహ్మ, విచింతయతి = ఆలోచిస్తున్న సమయంలో, శైలమాత్రః = నువ్వు పర్వత పరిమాణములో (శిలాః సంతి శిలలు కలది. పర్వతము), సద్యః భవన్ = వెంటనే పుట్టి, ఘోరఘోరమ్ = ఘోరాతి ఘోరముగా (భయంకరముగా) (ఘోరయతి భయానక రస నిమిత్తే భవతి ఘోరమైనది), జగర్జిథ కిల = గర్జించితివి కదా!

**తాత్పర్యము:** ఊహించలేని మహిమ కలిగిన శిశు వరాహము నాయొక్క నాసికనుండి ఎలా పుట్టింది? ఇతడు ఎవడు? విష్ణువు యొక్క మాయ ఇది కాదు కదా! ఈవిధముగా బ్రహ్మ ఆలోచిస్తున్న సమయంలో నువ్వు పర్వత పరిమాణములో వెంటనే పుట్టి భయంకరముగా గర్జించితివి కదా !

**12-6 శ్లో.**

**తం తే నినాదముపకర్ణ్య జనస్తపఃస్థాః**
**సత్యస్థితాశ్చ మునయో నునువుర్భవంతమ్ ।**

**తత్ స్తోత్ర హర్షులమనాః పరిణద్య భూయః**
**తోయాశయం విపుల మూర్తిరవాతరస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** తే = నీయొక్క, తం = ఆ, నినాదమ్= నినాదమును (గర్జనను) నాదము=నదతి తస్య భావః కర్మ వా శబ్దము), ఉపకర్ణ్య = విని, జన(స్థాః)= జనో లోకము, తపఃస్థాః= తపోలోకములందున్న, సత్యస్థితాః (స్థాః)= సత్య లోకములందున్న, మునయః చ= మునులు కూడా, భవంతమ్= నిన్ను, నునువుః = స్తుతించారు, తత్ స్తోత్ర = ఆస్తోత్రముచే, హర్షులమనాః = ప్రసన్న మనస్కుడవై, త్వం= నువ్వు, భూయః = మరలా, విపుల మూర్తిః=పూర్వము వలె అతి విస్తృత శరీరము కలవాడవై, పరిణద్య= గర్జించి, తోయ–ఆశయం= ప్రళయ సముద్రములో, అవాతరః = మునిగితివి.

**తాత్పర్యము:** నీయొక్క ఆ గర్జనను విని జనో లోకము తపోలోకము సత్య లోకములందున్న మునులు కూడా నిన్ను స్తుతించారు. ఆస్తోత్రముచే ప్రసన్న మనస్కుడవై నువ్వు మరలా పూర్వము వలె అతి విస్తృత శరీరము కలవాడవై భయంకరముగా గర్జించి ప్రళయ సముద్రములో మునిగితివి.

**12–7 శ్లో.**
**ఊర్ధ్వ ప్రసారిపరి ధూమ్రవిధూతరోమా**
**ప్రోత్ క్షి ప్తవాలధిరవాఙ్ముఖ ఘోరఘోణః ।**
**తూర్ణప్రదీర్ణజలదః పరిఘూర్ణదక్ష్ణా**
**స్తోతౄన్మునీన్ శిశిరయన్నవతేరిథ త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఊర్ధ్వమ్= పైకి (ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్ పైకి తరువాత), ప్రసారి= ప్రసరించే శీలము కలిగిన(ప్రకర్షేణ సరతి విస్తృతో భవతి తస్య భావః కర్మ వా విస్తారము చాచు నోరు విప్పుట), పరిధూమ్ర= కృష్ణ లోహితములైన (నలుపు మించగలసిన యెఱుపు గలది) (ధూమం తద్వర్ణం రాతి ఆధత్తే ధూమ్రవర్ణము పొగవంటి రంగు), విధూత = కంపించు (విధూతః కంపితః కంపించబడినది కంపించినది), రోమాః= తోక వెంట్రుకలు నిక్కించి (లూయతే ఛిద్యతే కత్తిరించబడునది. వెంట్రుక), ప్ర –ఉత్క్షిప్త

= పైకి ఎత్తబడిన, వాలధిః = తోకను, అవాఙ్ముఖ = కిందికి వంచి (అవాక్ నీచైః ముఖం యస్య క్రిందికి చూచువాడు), ఘోర = భయంకరమైన, ఘోణః=నాసిక రంధ్రములను కిందికి నిగిడించి, జలదః = మేఘములను, తూర్ణ = అతిలఘు (త్వరతే తస్య భావః శీఘ్రము, తొందర), ప్రదీర్ణ= ముక్కలుగా చేసి, అక్ష్ణాః పరిఘూర్ణతా = కన్నులతో అంతటా కంపింప చేసి (అశ్నుతే ఇతి వ్యాపించునది.), స్తోతౄన్= స్తోత్రము చేయు మునులను, శిశిరయన్= ఆనంద పరుచుచూ, త్వమ్= నువ్వు, అవతేరిథ= ఆ సముద్రములో దిగావు.

**తాత్పర్యము:** పైకి ప్రసరించే శీలము కలిగిన, నలుపు మించిన ఎఱుపు కలిగిన రంగుతో కంపించు తోక వెంట్రుకలను నిక్కించి, పైకి ఎత్తబడిన తోకను కిందికి వంచి, భయంకరమైన నాసికా రంధ్రములను కిందికి నిగిడించి, మేఘము లను అతిచిన్న ముక్కలుగా చేసి(అనగా మేఘములను చీల్చు) చురుకైన కన్నులతో అంతటా కంపింప చేసి స్తోత్రము చేయు మునులను ఆనంద పరుచుచూ నువ్వు వరాహావతారములో ఆ సముద్రములో దిగావు.

**12-8 శ్లో.**

**అంతర్జలం తదను సంకులనక్రచక్రం**
**భ్రామ్యత్తిమింగిలకులం కలుషోర్మిమాలమ్ ।**
**ఆవిశ్యభీషణరవేణ రసాతలస్థాన్**
**ఆకంపయన్ వసుమతీమగవేషయస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** తత్– అను = జలప్రవేశము పిమ్మట (అను ఒక ఉపసర్గ–. తో, వెనుక, తక్కువ, సమానము, సమీపము మొదలగునవి దీని అర్థాలు), త్వమ్= నువ్వు, సంకుల = సంకుల పడుచున్న (సంకులః ఆకీర్ణః అవ్యవస్థితః సమ్మర్దమైన), నక్రచక్రం= మొసళ్ళ సమూహముతో (న క్రామతి దూరస్థలమ్ భూమిపై దూరమునకు వెళ్లలేనిది. మొసలి.), భ్రామ్యత్– తిమింగిలకులం = అటు ఇటూ భయముతో తిరుగుచుండు తిమింగిలములతో (తిమిం మాత్స్యం గిరతి చిన్న మత్స్యములను తినునది. పెద్ద చేప తిమింగలము), కలుష–ఊర్మిమాలమ్= కలతవడిన కెరటములతో ఉన్న(ఋచ్ఛతి గచ్ఛతి తరంగము), అంతః –జలం= ఆ

నీటి మధ్యలోకి, ఆవిశ్య = ప్రవేశించి, భీషణరవేణ = ఘోరమైన గర్జనతో, రసాతలస్థాన్= పాతాళములోని జనులు (రసాయాః తలం నిమ్నభాగస్థ లోకవిశేషః భూమి క్రిందున వున్న లోక విశేషము. రసాతలము), ఆకంపయన్ = అల్లాడుచుండగా, వసుమతీమ్= నిజ ప్రియురాలైన భూదేవిని(వసూని ధనరత్నాని సంతి అస్యాః ధన రత్నములు కలది. పృథివి, భూమి), అగవేషయః= వెతుకుచున్నావు.

**తాత్పర్యము:** జలప్రవేశము పిమ్మట నువ్వు సంకుల పడుచున్న మొసళ్ళ సమూహముతో అటు ఇటూ భయముతో తిరుగుచుండు తిమింగిలములతో కలతవడిన కెరటములతో ఉన్న ఆ నీటి మధ్యలోకి ప్రవేశించి ఘోరమైన గర్జనతో పాతాళములోని జనులు అల్లాడుచుండగా నిజ ప్రియురాలైన భూదేవిని వెతుకుచున్నావు.

**12-9 శ్లో.**
**దృష్ట్వాథ దైత్యహతకేన రసాతలాంతే**
**సంవేశితాం ఝటితి కూటకిటిర్విభో! త్వమ్! ।**
**ఆపాతుకానవిగణయ్య సురారిఖేటాన్**
**దంష్ట్రాంకురేణ వసుధామదధాః సలీలమ్ ॥**

**ప్రతిపదార్థము:** విభో! = ప్రభూ!, అథ= అటుపిమ్మట, దైత్యహతకేన= నీచ రాక్షసుడైన హిరణ్యాక్షునిచే, రసాతల-అంతే= పాతాళమునందు, సంవేశితాం = ఉంచబడిన, వసుధామ్ = భూమిని (వసూని రత్నాని దధాతి రత్నములను ధరించునది. భూమి), కూటకిటిః = మాయా వరాహ రూపములో(కూట్యతే న ప్రదీయతే తత్ రహస్యపు పని ఛలము మిథ్య), త్వమ్= నువ్వు, ఆపాతుకాన్= పైబడు(ఆసమంతాత్ అకస్మాత్ వా పతనం ఆక్రమణమ్ ఆక్రమణము చేయుట హఠాత్తుగా మీద పడుట), సుర-అరిఖేటాన్= నీచ రాక్షసులను, అవిగణయ్య= లెక్కచేయక, దంష్ట్ర –అంకురేణ = కోర కొనతో (దశ్యతే అనేన దీనితో కుట్టబడును. పన్ను), ఝటితి= త్వరగా తొందరగా, సలీలమ్= అవలీలగా, అదధాః= ఉద్ధరించితివి.

**తాత్పర్యము:** ప్రభూ! అటుపిమ్మట అసురాధముడగు హిరణ్యాక్షునిచే పాతాళము నందు ఉంచబడిన భూమిని మాయా వరాహ రూపములో నువ్వు పైబడు నీచ రాక్షసులను లెక్కచేయక ఎదిరించి నీ కోర కొనపై భూమిని నిల్పి తొందరగా అవలీలగా ఉద్ధరించితివి

**12-10 శ్లో.**

**అభ్యుద్ధరన్నథ ధరాం దశనాగ్రలగ్న-**
**ముస్తాంకురాంకిత ఇవాధికపీవరాత్మా ।**
**ఉద్ధూతఘోరసలిలాజ్జలధేరుదంచన్**
**క్రీడావరాహవపురీశ్వర! పాహి రోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, ధరాం = భూమిని, అభి-ఉద్ధరన్=పైకి ఎత్తి కోరలపై ధరించగా అది, దశన= నీ కోర, అగ్రలగ్న=చివర ఉంచబడిన, తుంగ ముస్త= (ముస్తయతి ఏకత్ర సంహతీ భవంతిఒక చోట కూడునది. ముస్తె, తుంగముస్తె.), అంకుర= మొలక, అంకిత ఇవ-= గుర్తు పెట్టబడినది దానివలె, అధికపీవర ఆత్మా = అతి పీన కాయుడైన నీ యందు కనబడుతున్నది. (పీవర= ప్యాయతే స్థూలో భవతి బలిసినవాడు), ఘోరసలిలాత్ = భయంకరమైన సలిలము, ఉద్ధూతమ్= (ఉద్ధూతః ఉత్ క్షిప్తః కంపితః ఉన్నతః) ఆకాశం పైకి విసరబడినట్లుగా నువ్వు, జలధేః = సముద్రములో, ఉదంచన్ =ఈదావు, క్రీడావరాహవపుః -ఈశ్వర!= క్రీడ కొరకు వరాహ రూపము ధరించిన ప్రభూ!, రోగాత్= రోగము నుండి, పాహి= రక్షించుము.

**తాత్పర్యము:** క్రీడ కొరకు వరాహ రూపము ధరించిన ప్రభూ! అటుపిమ్మట భూమిని సముద్రం నుండి పైకి ఎత్తి కోరలపై ధరించగా కోర చివర ఉంచబడిన తుంగముస్త (వేరు సెనగ కాయ) మొలక గుర్తు వలె అతి పీన కాయుడైన నీ యందు కనబడుతున్నది. భయంకరమైన సలిలము ఆకాశం పైకి విసరబడినట్లుగా నువ్వు సముద్రములో ఈదావు. రోగము నుండి రక్షించుము.

**విశేషాలు**

**ముస్తై:** సెలయేటియిసుక లంకలవరాహంబులు మొత్తంబులై త్రవ్వి ముస్తెలెత్త." అని మనుచరిత్ర ద్వితీయాశ్వాసము. (07 వపద్యం) సెలయేళ్ళలోని ఇసుక దిబ్బలందు అడవిపందులు గుంపులై నేలంతా ముట్టెతో పెకలించి ముస్తెలను (తుంగగడ్డలు) కోరతో పైకి ఎత్తాయి.

**తృతీయ స్కంధము**

**12వ దశకము సమాప్తము.**



# దశకమ్ 13 – హిరణ్యాక్షవధ

**13-1 శ్లో.**

**హిరణ్యాక్షం తావత్ వరద భవదన్వేషణపరం**
**చరంతం సాంవర్తే పయసి నిజజంఘాపరిమితే ।**
**భవద్భక్తో గత్వా కపటపటుధీర్నారదమునిః।**
**శనైరూచే నందన్ దనుజమపి నిందంస్తవ బలమ్ ॥**

**ప్రతిపదార్థము:** వరద = వరములను ఇచ్చువాడా!, తావత్ = నీవు భూమిని ఉద్ధరించు సమయంలో, నిజజంఘాపరిమితే= తన కాలి పిక్కల లోతు గల (జంఘన్యతే కుటిలం గచ్ఛతి వంకరగా నడచునది. పిక్క నుండి మోకాలు వరకు గల శరీర భాగము), సాంవర్తే = ప్రళయ (సమ్యక్ వర్త్యతే పరావర్త్యతే అత్ర ఇక్కడ అంతా తారుమారు అగును. ప్రళయము, పయసి = సముద్రములో, భవత్ అన్వేషణపరం= నీఅన్వేషణ పరుడై, చరంతం=హిరణ్యాక్షుడు తిరుగుచున్న సమయంలో, భవత్ –భక్తః = నీ భక్తుడు, కపటపటుధీః = జగదనుగ్రహము కొరకు అంగీకరించిన కాపట్యము కలిగిన నిపుణుడైన (పటు= పాటయతి చతురో భవతి చాతుర్యం కలవాడు. చతురుడు), నారదముని= నారద ముని, దనుజమ్= దనుజు డైన (దనోః జాయతేదనువుకి పుట్టినవాడు. దానవుదు), హిరణ్యాక్షం అపి= హిరణ్యాక్షుని దగ్గరకు, గత్వా= వెళ్ళి, నందన్=అతనిని ప్రశంసించుచూ, తవ బలమ్= నీశక్తిని, నిందన్= నిందించుచూ, శనైః= సానునయముగ, ఊచే= ఇట్లు పలికెను.

**తాత్పర్యము:** వరములను ఇచ్చువాడా! నీవు భూమిని ఉద్ధరించు సమయంలో తన కాలి పిక్కల లోతు గల సముద్రములో నీఅన్వేషణ పరుడై హిరణ్యాక్షుడు తిరుగుచున్న సమయంలో నీ భక్తుడయిన లోక క్షేమం కోసం కాపట్యము నటించుటలో నిపుణుడైన నారద ముని హిరణ్యాక్షుని దగ్గరకు వెళ్ళి అతనిని ప్రశంసించుచూ నీశక్తిని నిందిస్తూ సానునయముగ ఇట్లు పలికెను.

**విశేషాలు:** ఈ శ్లోకం శిఖరిణి వృత్తానికి సంబంధించినది. (**య , మ , న , స , భ , వ(లగ)**)

**ఈ దశకములోని ప్రతి శ్లోకం** శిఖరిణియే.

**13-2 శ్లో.**

**స మాయావీ విష్ణుర్హరతి భవదీయాం వసుమతీం**
**ప్రభో! కష్టం కష్టం కిమిదమితి తేనాభిగదితః ।**
**నదన్ క్వాఽసౌ క్వాసావితి స మునినా దర్శితపథో**
**భవంతం సంప్రాపత్ ధరణిధరముద్యంతముదకాత్ ॥**

**ప్రతిపదార్థము:** సః = ఆ, మాయావీ= నీ భయము చేత వరాహ రూపములో తనని దాచుకొన్న ఆ మాయావి యగు, విష్ణుః= విష్ణువు(వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), భవదీయాం= నీయొక్క, వసుమతీం= బ్రహ్మ నుండి అపహరించి పాతాళములో నువ్వు దాచిన భూమిని, హరతి= హరించాడట కదా, ప్రభో!=ప్రభూ!,కష్టంకష్టం =అయ్యో!అయ్యో!,కిమిదమ్ –ఇతి=ఇదేమిటయ్యా!, తేన-అభిగదితః= అని నారదునిచే చెప్పబడినవాడై (ప్రోత్సహింపబడిన), క్వ-అసౌ క్వ-అసౌ –ఇతి = వాడు(హరి) ఎక్కడ వాడు ఎక్కడ అని, సః= ఆ హిరణ్యాక్షుడు, నదన్= గర్జించుచూ, మునినా= నారద మునిచే, దర్శితపథః= చూపబడిన దారి కలవాడై, ధరణిధరమ్ = భూమిని ధరించి, ఉదకాత్ ఉద్యంతం= నీటి నుండి బయటికి వచ్చు, భవంతం = నిన్ను, సంప్రాపత్=కలుసుకొన్నాడు.

**తాత్పర్యము:** "నీ భయము చేత వరాహ రూపములో తనని దాచుకొన్న ఆ మాయావి యగు విష్ణువు నువ్వు అపహరించిన భూమిని హరించాడట కదా! ప్రభూ! అయ్యో! అయ్యో! ఇదేమిటయ్యా!" అని నారదుడు చెప్పాడు. వెంటనే వాడు(హరి) ఎక్కడ వాడు ఎక్కడ ఆ హిరణ్యాక్షుడు గర్జించాడు. నారద ముని దారి చూపించాడు. భూమిని ధరించి నీటి నుండి బయటికి వచ్చు నిన్ను హిరణ్యాక్షుడు కలుసుకొన్నాడు.

**13-3 శ్లో.**

**అహో! ఆరణ్యోఽయం మృగ ఇతి హసంతం బహుతరైః**
**దురుక్తైర్విధ్యంతం దితిసుతమవజ్ఞాయ భగవన్! ।**
**మహీం దృష్ట్వా దంష్ట్రాశిరసి చకితాం స్వేన మహసా**
**పయోధావాధాయ ప్రసభముదయుంక్థా మృధవిధౌ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్!= ఓ భగవంతుడా!, అహో!= కష్టమ్, అయం= ఇది, ఆరణ్యః= అడవిలో నివసించు (అరణ్యే భవః అరణ్యంలో ఉండునది, పుట్టినది), మృగః= మృగము (మార్ష్టి గచ్ఛతి విచరణశీలః తిరుగు స్వభావం కలది. వరాహము), ఇతి= అని, హసంతం = పరిహసించి, బహుతరైః= అనేకవిధాలుగా, దురుక్తైః = దుర్వాక్యములచే, విధ్యంతం=కొట్టుచూ(ఎత్తి పొడిచి), దితిసుతమ్ = దితి పుత్రుడైన హిరణ్యాక్షుడు, అవజ్ఞాయ =నిన్ను అధిక్షేపించగా (అవి విని), దంష్ట్రాశిరసి చకితాం = నీ కోర కొనలో బెదిరిపోవుచున్న, మహీందృష్ట్వా= భూమిని చూసి, స్వేన= అనన్య సాధారణమయిన, మహసా= యోగైశ్వర్యముచే (మహ్యతే పూజ్యతే పూజ్యతే వా అనేన (ప్రశంసా) పూజింపబడును, ప్రశసింపబడును. జ్ఞానము దీనితో పూజింతురు. జ్ఞానము), పయోధౌ= అగాధమయిన సముద్ర జలముపై(పయాంసి ధీయంతే అస్మిన్ ఇందులో నీరుండును. సముద్రము), ఆధాయ= మునిగిపోకుండా ఉంచి, ప్రసభమ్= బలాత్కారముచే (ప్రగతా సభా సభాధికారః యస్మాత్ బలాత్కారము), మృధవిధౌ= యుద్ధ కర్మ యందు(మృధ్యతే హింస్యతే అత్ర ఇక్కడ హింసింపబడును. యుద్ధము), ఉదయుంక్థా= సన్నద్ధుడవైతివి.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! గురువాయూరు దేవా! ఇది అడవిలో నివసించు మృగము (వరాహము) అని పరిహసించి అనేకవిధాలుగా దుర్వాక్యములచే ఎత్తి పొడిచి దితి పుత్రుడైన హిరణ్యాక్షుడు వరాహావతారములో ఉన్న నిన్ను అధిక్షేపించగా అవి విని నీ కోర కొనలో బెదిరిపోవుచున్న భూమిని చూసి అనన్య సాధారణమయిన నీ యోగైశ్వర్యముచే అగాధమయిన సముద్ర జలముపై మునిగిపోకుండా ఉంచి బలాత్కారముచే యుద్ధ కర్మ యందు సన్నద్ధుడవైతివి.

**13-4 శ్లో.**

**గదాపాణౌ దైత్యే త్వమపి హి గృహీతోన్నతగదో**
**నియుద్దేన క్రీడన్ ఘటఘటరవోద్ఘుష్టవియతా ।**
**రణాలోకౌత్సుక్యాన్మిళతి సురసంఘే ద్రుతమముం**
**నిరుంధ్యాస్సంధ్యాతః ప్రథమమితి ధాత్రా జగదిషే ॥**

**ప్రతిపదార్థము:** దైత్యే = ఆదైత్యుడు (హిరణ్యాక్షుడు), గదాపాణౌ= గదను చేతిలో ధరించి నీ పై యుద్ధానికి రాగా, త్వమ్ –అపి= నువ్వు కూడా, గృహీత–ఉన్నతగదః= తలుచుకొన్న మాత్రాన చేతిలోకి వచ్చిన ఉన్నతమైన కౌమోదకి గదను స్వీకరించి, నియుద్దేన= ద్వంద్వ యుద్ధమునకు, క్రీడన్ = కలియబడ్డావు, వియతా= ఆకాశము(సర్వవ్యాపకము వలన ఎప్పుడు విరమించనిది. ఆకాశము), ఘటఘటరవ = పట పట ధ్వనులతో, ఉద్ఘుష్ట= పెద్దగా ప్రతిధ్వనించింది, రణ–ఆలోక–ఔత్సుక్యాత్ = శ్రీ వరాహ మూర్తి యొక్క పరాక్రమ దర్శన కౌతుకాతిశయముతో, సురసంఘే మిళతి = దేవతల సమూహము గుంపు కూడిరి, అముం= ఈ రాక్షసుని, సంధ్యాతః ప్రథమమ్ = సంధ్యా సమయానికి ముందే, ద్రుతమ్= శీఘ్రముగా, నిరుంధ్యాః = చంపుము, ఇతి ధాత్రా=అని బ్రహ్మదేవునిచే, జగదిషే హి = నువ్వు కోరబడితివి కదా.

**తాత్పర్యము:** ఆదైత్యుడు హిరణ్యాక్షుడు గదను చేతిలో ధరించి నీ పై యుద్ధానికి రాగా నువ్వు కూడా తలుచుకొన్న మాత్రాన చేతిలోకి వచ్చిన ఉన్నతమైన కౌమోదకి గదను స్వీకరించి అతనితో ద్వంద్వ యుద్ధమునకు కలియబడ్డావు. . ఆకాశము మీ గదల పట పట ధ్వనులతో పెద్దగా ప్రతిధ్వనించింది. శ్రీ వరాహ మూర్తి యొక్క పరాక్రమ దర్శన కౌతుకాతిశయముతో దేవతల సమూహము గుంపు కూడారు. ఈ రాక్షసుని సంధ్యా సమయానికి ముందే శీఘ్రముగా చంపుము అని బ్రహ్మదేవునిచే నువ్వు కోరబడితివి.

**13-5 శ్లో.**

**గదోన్మర్దే తస్మింస్తవ ఖలు గదాయాం దితిభువో**
**గదాఘాతాద్భూమౌ ఝటితి పతితాయామహహ భోః ।**

**మృదుస్మేరాస్యస్త్వం దనుజకులనిర్మూలనచణం**
**మహాచక్రం స్మృత్వా కరభువి దధానో రురుచిషే ॥**

**ప్రతిపదార్థము:** తస్మిన్ గద–ఉన్మర్దే = ఆ గదాయుద్ధ రాపిడిలో, తవ గదాయాం= నీ చేతిలో ఉన్న గద, దితిభువః=హిరణ్యాక్షుని యొక్క, గద–ఆఘాతాత్= గద దెబ్బకు, ఝటితి = వెంటనే, భూమౌ= భూమియందు, పతితాయామ్= పడెను, అహహ= అయ్యయ్యో!, భోః= ఓ శ్రీ కృష్ణా!, మృదుస్మేర–ఆస్యః = మందస్మితముచేత వికసించిన ముఖ పద్మము కలిగిన, త్వం = నువ్వు, దనుజకులనిర్మూలనచణం= రాక్షస కుల నిర్మూలనమునందు నేర్పు కలిగిన, మహాచక్రం = సుదర్శన చక్రమును(చకతి హంతి పరబలమ్మత్రు సేనను సంహరించునది), స్మృత్వా= స్మరించి, కరభువి= దానిని దక్షిణ కరములో, దధానః = ధరించి, రురుచిషే ఖలు =నీ రూపమును దివ్య తేజస్సుచే ఇనుమడింప చేసావు కదా!

**తాత్పర్యము:** ఆ గదాయుద్ధమునందు నీ చేతిలో ఉన్న గద హిరణ్యాక్షుని యొక్క గద దెబ్బకు వెంటనే భూమియందు పడెను. అయ్యయ్యో! ఓ శ్రీ కృష్ణా! అప్పుడు మందస్మితముచేత వికసించిన ముఖ పద్మము కలిగిన నువ్వు రాక్షస కుల నిర్మూలనమునందు నేర్పు కలిగిన సుదర్శన చక్రమును స్మరించి దానిని దక్షిణ కరములో ధరించి నీ రూపమును దివ్య తేజస్సుచే ఇనుమడింప చేసావు.

**విశేషము:** విష్ణువు చేతిలోని గద జారిపడుటకు కారణమును పెద్దలు ఇలా చెప్పారు. తనను పగచేత సాధిస్తానన్న తన దాసునికి, తనపై సమాధి నిరంతరాయముగా కలుగచేయాలనే సంకల్పము చేత విష్ణువు తన చేతిలోని గద జారి పోయేటట్లు చేసాడు.

**13-6 శ్లో.**
**తతశ్శూలం కాల ప్రతిమరుషి దైత్యే విసృజతి**
**త్వయి చ్ఛిందత్యేతత్ కరకలితచక్రప్రహరణాత్ ।**
**సమారుష్టో ముష్ట్యా స ఖలు వితుదంస్త్వాం సమతనోత్**
**గలన్మాయే మాయాస్త్వయి కిల జగన్మోహనకరీః ॥**

**ప్రతిపదార్థము:** తతః =అటుపిమ్మట, కాలప్రతిమరుషి= జగత్సంహార కారియైన కాలాగ్ని రుద్ర సదృశ కోపముతో, దైత్యే =రాక్షసుడు, శూలం = శూలమును (శూలతి లోకాన్ లోకములను చంపునది), విసృజతి= నీ పై వేయగా, ఏతత్= ఈ శూలమును, త్వయి= నువ్వు, కరకలిత= చేతి యందున్న, చక్రప్రహరణాత్= సుదర్శన చక్ర ప్రహరణముచే(ప్రహరణ=అతిశయేన ప్రహరంతి తస్య భావః కర్మ వా కొట్టుట), ఛిందతి=రెండుగా చీల్చావు, స సమారుష్టః= అతడు పూర్వము కంటె రెట్టించిన కోపముతో, ముష్ట్యా = గుద్దులతో (ముషతి బధ్నాతి బంధింపబడునది. పిడికిలి), త్వాం= నిన్ను, వితుదన్= కొట్టాడు, గలత్ –మాయే= మాయకు అతీతుడవయిన, త్వయి= నీయందు, జగత్ – మోహనకరీః=ఇతర జన సమ్మోహ కారియైన (మోహన = మోహయతిమోహింప చేయువాడు), మాయాః = మాయలను, సమతనోత్ కిల = ప్రయోగించాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట జగత్సంహార కారియైన కాలాగ్ని రుద్ర సదృశ కోపముతో రాక్షసుడు శూలమును నీ పై వేయగా ఈ శూలమును నువ్వు చేతి యందున్న సుదర్శన చక్ర ప్రహరణముచే రెండుగా చీల్చావు. అతడు పూర్వము కంటె రెట్టించిన కోపముతో గుద్దులతో నిన్ను కొట్టాడు. మాయకు అతీతుడవయిన నీయందు ఇతర జన సమ్మోహ కారియైన మాయలను ప్రయోగించాడు.

**13–7 శ్లో.**

**భవచ్చక్రజ్యోతిష్కణలవనిపాతేన విధుతే**
**తతో మాయా చక్రే విততఘనరోషాంధమనసమ్ ।**
**గరిష్ఠాభిర్ముష్టిప్రహృతిభిరభిఘ్నంతమసురం**
**స్వపాదాంగుష్ఠేన శ్రవణ పద మూలే నిరవధీః ॥**

**ప్రతిపదార్థము:** భవత్ = నీయొక్క ( విష్ణువు యొక్క), చక్ర = సుదర్శన చక్రపు, జ్యోతిషః– కణలవ = కాంతి లేశము యొక్క, నిపాతేన=ప్రసరణముచే, మాయా చక్రే= హిరణ్యాక్షునియొక్క మాయాసమూహము, విధుతే= చెల్లా చెదరయింది, తతః =అటుపిమ్మట, వితత=వ్యాపించిన(విశేషేణ తతః విస్తృతః విస్తరించబడినది), ఘన= దట్టమైన (ఘనతి దీప్యతే దట్టమైనది), రోష= రోషముచే, అంధమనసమ్=

గుడ్డి తనము కలిగిన మనస్సుతో, గరిష్ఠాభిః = గురుతరమైన (అతిశయేన గురుః చాలా పెద్దది), ముష్టిప్రహృతిభిః= ముష్టి ఘాతములచే, అభిఘ్నంతమ్=నిన్ను కొట్టు, అసురం= రాక్షసుని, స్వపాద–అంగుష్ఠేన = నీకాలి బొటన వేలితో(అంగౌ పాణౌ ప్రాధాన్యేన తిష్ఠతి చేతియందు ముఖ్యమైనది. బొటన వ్రేలు), శ్రవణ పద మూలే = చెవి మూలమున కొట్టి (గూబ గుయ్యి మనేటట్లు), నిరవధీః= కొట్టి కూల్చితివి.

**తాత్పర్యము:** నీయొక్క సుదర్శన చక్రపు కొద్ది పాటి కాంతి ప్రసరణముచే హిరణ్యాక్షునియొక్క మాయాసమూహము చెల్లా చెదరయింది. అటుపిమ్మట రోషముచే గుడ్డి తనము కలిగిన మనస్సుతో గొప్పవైన ముష్టి ఘాతములచే నిన్ను కొట్టు రాక్షసుని నీకాలి బొటన వేలితో చెవి మూలమున కొట్టి కొట్టి కూల్చితివి.

**విశేషాలు:**

**అంధమనసమ్:** సుదర్శన కాంతిని చూసినప్పటికి – శాపప్రభా వముచే రా క్షసుడు ఆ మహిమను గుర్తించలేదని మనకు తెలియ చేయటానికి "అంధమనసమ్" అని కవి ప్రయోగము."కరాగ్రేన స్వేన శ్రవణ పదమూలే " అని నాలుగవ పాదములోని పాఠాంతరము.

**13–8 శ్లో.**

**మహాకాయస్సోఽయం తవ చరణపాతప్రమథితో**
**గలద్రక్తో వక్త్రాదపతదృషిభిః శ్లాఘితహతిః ।**
**తదా త్వాముద్దామప్రమదభరవిద్యోతి హృదయా**
**మునీంద్రాస్సాంద్రాభిస్స్తుతిభిరనువన్నధ్వరతనుమ్ ॥**

**ప్రతిపదార్థము:** మహాకాయః = మహా కాయుడైన, సః– అయం = ఆ ఈ హిరణ్యాక్షుడు, తవ చరణపాతప్రమథితః = నువ్వు తన్నిన తన్నుకి, వక్త్రాత్ గలత్ రక్తః = ముఖం నుండి రక్తము కక్కుకొంటూ, అపతత్ = కింద పడిపోయెను, హతిః=అతని మరణము, ఋషిభిః = ఋషుల చేత, శ్లాఘితః =నీ పొగడ్తలకు పాత్రమైనది, తదా= అప్పుడు, ఉద్దామప్రమదభర= లోపల ఉంచుకొనుటకు

అశక్యమైన సంతోష అతిశయముతో, విద్యోతి= శోభన శీలమైన, హృదయాః= హృదయములు కలిగిన, మునీంద్రాః=జన తపో సత్య లోక నివాసులైన మునులు, సాంద్రాభిః స్తుతిభిః = దిక్కులు మారు మోగు దట్టమైన వైదిక స్తుతులచే, అధ్వరతనుమ్= యజ్ఞవరాహావతారుని, త్వామ్ = నిన్ను, అనువన్= పొగిడారు.

**తాత్పర్యము:** మహా కాయుడైన ఆ హిరణ్యాక్షుడు నువ్వు తన్నిన తన్నుకి ముఖం నుండి రక్తము కక్కుకొంటూ కింద పడిపోయెను. అతని మరణము ఋషుల చేత నీ పొగడ్తలకు పాత్రమైనది. అప్పుడు లోపల ఉంచుకొనుటకు అశక్యమైన సంతోష అతిశయముతో శోభన శీలమైన హృదయములు కలిగిన జన తపో సత్య లోక నివాసులైన మునులు దిక్కులు మారు మోగు దట్టమైన వైదిక స్తుతులచే యజ్ఞవరాహావతారుడవైన నిన్ను పొగిడారు.

**విశేషాలు:** కరసరోజ ప్రమథితో .. అని పాఠాంతరము.

**13-9 శ్లో.**

**త్వచి చ్ఛందో రోమస్వపి కుశగణశ్చక్షుషి ఘృతం**
**చతుర్హోతారోఽంఘ్రౌ స్రుగపి వదనే చోదర ఇడా ।**
**గ్రహా జిహ్వాయాం తే పరపురుష! కర్ణే చ చమసా**
**విభో! సోమో వీర్యం వరద! గళదేశేఽప్యుపసదః ॥**

**ప్రతిపదార్థము:** వరద!= ఓ వరదుడా!, విభో! = ప్రభూ!, పరపురుష! = పురుషోత్తమా!, తే త్వచి– ఛందః = నీ చర్మమందు గాయత్రి మొదలయిన ఛందస్సు (త్వచతి సంవృణోతి మేదశోణితాదికమ్ మేదశోణితములను కప్పునది. చర్మము), రోమసు – అపి కుశగణః–చ = నీరోమములందు దర్భలు (లూయతే ఛిద్యతేకత్తిరించబడునది. వెంట్రుక), చక్షుషి = కన్నులందు, ఘృతం= నేయి, (ఘారయతి స్రవతి అసౌ స్రవించునది. నెయ్యి), అంఘ్రౌ= పాదములందు, చతుః హోతారః– అధ్వర్యుడు, బ్రహ్మ, హోత, ఉద్గాత అను నలుగురు హోతలు(హోత= జుహోతి అగ్నిని వేల్చువాడు. పురోహితుడు), వదనే = ముఖమునందు, స్రుక్ – అపి= స్రుక్కు (హోమమునందు నేయి వేయు సాధనము), ఉదర= నీ కడుపునందు, ఇడా చ = ఇడ పురోడాశ ద్రవ్య నిక్షేపము చేయు పాత్ర విశేషము(పురోడాశాన్ని

ఉంచే పాత్ర ను ఇడ అంటారు. పురోడాశము అంటే హోమంలో వాడే పిండి వంట హవిస్సుగా వాడే అన్నం ముద్ద), జిహ్వాయాం= నాలుక యందు, గ్రహా= గ్రహమను సోమ సంగ్రహణ పాత్ర, తే కర్ణే చ= చెవులయందు, చమసా= భక్షణ సాధన ద్రవ్యముల నుంచు పాత్ర విశేషమైన చమస (చమ్యతే భక్ష్యతే పీయతే సోమరసః అస్మాత్ దీనినుండి సోమరసమును త్రాగుదురు, తిందురు. ఒక యజ్ఞపాత్ర), వీర్యం= నీ వీర్యమందు, సోమః= సోమవల్లీరసము, గళదేశే అపి =నీ కంఠమందు, ఉపసదః= ప్రవర్గ్య తరువాత చేయు ఇష్టులు (ఉన్నవి)( ప్రవర్గే యజ్ఞాగ్నౌ హవిరాది క్షేపణ యోగ్యః యజ్ఞాగ్నిః సోమయాగాత్పూర్వం క్రియమాణం అనుష్ఠానమ్ సోమయాగమున కంటే పూర్వము చేయబడు యజ్ఞమును ప్రవర్గ్య అంటారు).

**తాత్పర్యము:** ఓ వరదుడా! ప్రభూ! పురుషోత్తమా! నీ చర్మమందు గాయత్రి మొదలయిన ఛందస్సు, నీరోమములందు దర్భలు, కన్నులందు నేయి, పాదములందు అధ్వర్యుడు, బ్రహ్మ, హోత, ఉద్గాత అను నలుగురు హోతలు, ముఖమునందు స్రుక్కు , నీ కడుపునందు ఇడ పురోడాశ ద్రవ్య నిక్షేపము చేయు పాత్ర విశేషము, నాలుక యందు గ్రహమను సోమ సంగ్రహణ పాత్ర, చెవులయందు భక్షణ సాధన ద్రవ్యముల నుంచు పాత్ర విశేషమైన చమస, నీ వీర్యమందు సోమవల్లీరసము ,నీ కంఠమందు ప్రవర్గ్య తరువాత చేయు ఇష్టులు (ఉన్నవి)

**13-10 శ్లో.**

**మునీంద్రైరిత్యాదిస్తవనముఖరైర్మోదితమనాః**
**మహీయస్యా మూర్త్యా విమలతరకీర్త్యా చ విలసన్ ।**
**స్వధిష్ణ్యం సంప్రాప్తః సుఖరసవిహారీ మధురిపో**
**నిరుంధ్యా రోగం మే సకలమపి వాతాలయపతే! ॥**

**ప్రతిపదార్థము:** మధురిపో = మధుసూదనా! (మధోః అసురస్య నాశకః మధువను రాక్షసుని శత్రువు), ముని-ఇంద్రైః= మునిశ్రేష్ఠులచే, ఇతి-అది= మొదలగు, స్తవనముఖరైః = స్తోత్రపాఠకులచే, మోదిత = సంతోషింపబడిన, మనాః= మనస్సు కలవాడవయి, మహీయస్యా= అతిశయించు పూజనీయమైన (అతిశయేన మహాన్ చాలా గొప్పది), మూర్త్యా =స్వవిగ్రహముతో జగత్పవిత్రమైన రూపముతో,

విమలతరకీర్త్యా= స్వచ్ఛమైన కీర్తితో కూడా, విలసన్= శోభిల్లుచూ, సుఖరసవిహారీ = ఆనందరస సముద్రమునందు ఓలలాడి, స్వధిష్ణ్యం= వైకుంఠమును (ధృష్ణోతి ప్రగల్భో భవతి, ప్రజ్జ్వలితో భవతి తస్య భావం కర్మ వా ప్రాగల్భ్యము కలది శక్తి కలది. ఒక అగ్ని శక్తి ఇల్లు), సంప్రాప్తః = చేరితివి, మే = నాయొక్క, సకలమ్–అపి = సమస్తమైన, నిరుంధ్యా రోగం= రోగములను పోగొట్టి ఆనందము కలిగించు.

**తాత్పర్యము:** మధుసూదనా! ఓ గురువాయూరు దేవా! మునిశ్రేష్ఠులు మొదలగు స్తోత్రపాఠకులచే సంతోషింపబడిన మనస్సు కలవాడవయి ,పూజనీయమైన స్వవిగ్రహముతో జగత్పవిత్రమైన రూపముతో స్వచ్ఛమైన కీర్తితో కూడా శోభిల్లుచూ ఆనందరస సముద్రమునందు ఓలలాడి వైకుంఠమును చేరితివి. నాయొక్క సమస్తమైన రోగములను పోగొట్టి ఆనందము కలిగించు.

**విశేషము:** యజ్ఞ వరాహావతారము శ్రద్ధగా విన్నవారికి యజ్ఞములు చేసిన ఫలితము వస్తుంది. భూమిని యజ్ఞ వరాహ మూర్తి ధరించాడు. ఇందులో ప్రతీక ఏమిటంటే భూమి యజ్ఞం వలననే నిలబడుతుంది. అనగా యజ్ఞములు చేయాలని మనకు హితోపదేశం.

**తృతీయ స్కంధము**

**13వ దశకము సమాప్తము.**

# దశకమ్ 14 – కపిలావతారము

**14-1 శ్లో.**

**సమనుస్మృత తావ కాంఘ్రి యుగ్మః**
**స మనుః పంకజసంభవాంగజన్మా ।**
**నిజమంతర మంత రాయ హీనం**
**చరితం తే కథయన్ సుఖం నినాయ ॥**

**ప్రతిపదార్థము:** పంకజసంభవ–అంగజన్మా= పంకజ సంభవుడైన బ్రహ్మ యొక్క కుమారుడైన, సః= ఆ ప్రసిద్ధుడైన, మనుః= స్వాయం భువ మనువు, సమనుస్మృతః = యమ నియమాదులను అనుసరించి, తావక–అంఘ్రియుగ్మః = నీ పాదపద్మ యుగళమును చింతించుచూ, నిజమంతరమ్ = చతుర్యుగములకు సంబంధించిన, అంతరాయహీనం = శారీర మానసాది భౌతిక క్లేశములు లేక, తే చరితం= నీ చరిత్రలు, కథయన్ =చెప్పికొనుచూ, సుఖం – సుఖముగా, నినాయ= మనువు తన అంతరము నడిపించెను.

**తాత్పర్యము:** బ్రహ్మ యొక్క కుమారుడైన స్వాయం భువ మనువు యమ నియమాదులను అనుసరించి నీ పాదపద్మములను చింతించుచూ చతుర్యుగము లకు సంబంధించిన శారీర మానసాది భౌతిక క్లేశములు లేక నీ చరిత్రలు చెప్పికొనుచూ సుఖముగా మనువు తన అంతరము నడిపించెను.

**విశేషాలు:**

**అంతరము:** మన్వంతరము అనగా మనుకాల మధ్య చరిత్రము. డెబ్బదియొక్క దివ్యయుగములు మనువు యొక్క కాలము 43, 20, 000 మానవ సంవత్సరములు

పద్నాలుగు మన్వంతరాలు ఉన్నాయి. అవి. 1. స్వాయం భువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుస, 7. వైవస్వత, 8. సూర్య సావర్ణి, 9. ఇంద్ర సావర్ణి, 10. బ్రహ్మ సావర్ణి, 11. రుద్ర సావర్ణి, 12. రౌచ్యక సావర్ణి, 13. అగ్ని సావర్ణి (పాఠాంతరం ధర్మ సావర్ణి), 14. భౌచ్యక సావర్ణి.

వసంతమాలికా అనేది ఒక అర్ధసమ వృత్తము. దీనిని సామాన్యముగా మాలభారిణి అంటారు. దీని లక్షణములు – బేసి పాదములు – IIUII – UI UI UU సరి పాదములు – IIU UII – UI UI UU

**14–2 శ్లో.**

**సమయే ఖలు తత్ర కర్దమాఖ్యో**
**ద్రుహిణచ్ఛాయ భవస్తదీయవాచా ।**
**ధృతసర్గరసో నిసర్గరమ్యం**
**భగవంస్త్వామయుతం స మాస్సిషేవే ॥**

**ప్రతిపదార్థము:** భగవన్= ఓ భగవానుడా!, తత్ర సమయే = ఆ సమయమునందు, ద్రుహిణః ఛాయ= బ్రహ్మ యొక్క ఛాయ నుండి పుట్టిన (ద్రుహ్యాతి దుష్టేభ్యః దుష్టులను హింసించువాడు. బ్రహ్మ), కర్దమ–ఆఖ్యః= కర్దముడను ముని, తదీయవాచా= ప్రజలను సృష్టించుము అను బ్రహ్మ మాటచే, ధృతసర్గరసః= సృష్టి చేయు వేడుకతో, నిసర్గరమ్యం = స్వభావరంజకుడవైన (నితరాం సృష్టః జన్మతః స్వభావః స్వభావము), త్వామ్= నిన్ను, అయుతం సమాః = పది వేల సంవత్సరములు, సిషేవే ఖలు = తపస్సు చేసెను కదా.

**తాత్పర్యము:** ఓ భగవానుడా! ఆ సమయమునందు బ్రహ్మ యొక్క ఛాయ నుండి పుట్టిన కర్దముడను ముని ప్రజలను సృష్టించుము అను బ్రహ్మ మాట చే సృష్టి చేయు వేడుకతో హృదయ రంజకుడవైన నిన్ను పది వేల సంవత్సరములు తపస్సు చేసెను కదా.

**విశేషాలు:** వియోగిని పుర్తిగా సరిపోవుట లేదు ( ససజగ – సభరవ )

**14–3 శ్లో.**

**గరుడోపరి కాలమేఘక్రమం**
**విలసత్కేళిసరోజపాణిపద్మమ్ ।**
**హసితోల్లసితాననం విభో! త్వం**
**వపురావిష్కురుషే స్మ కర్దమాయ ॥**

**ప్రతిపదార్థము:** విభో! = ఓ ప్రభూ!, గరుడ–ఉపరి = గరుడ వాహనము ఎక్కి (గరుడ్భ్యాం పక్షాభ్యాం ఉడ్డయతేరెక్కలతో ఎగురునది. గరుడ పక్షి గరుత్మంతుడు), కాలమేఘక్రమం = నల్లని (తొలకరి) మేఘపు ఛాయతో, విలసత్= కులుకు శరీరముతో, కేళిసరోజపాణిపద్మమ్= చేయి అను పద్మమునందు పద్మమును ధరించి, హసిత–ఉల్లసిత–ఆననం = చిరునవ్వులు చిల్కు మధురమయిన మోముతో(హసితః వికసితః కృత హాసః వికసించిన), త్వం= నువ్వు, కర్దమాయ= కర్దమునికి, వపుః = శారీరక ఆకృతి ధరించి, ఆవిష్కురుషే స్మ=ప్రత్యక్షమయ్యావు.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! గరుడ వాహనము ఎక్కి తొలకరి మేఘపు ఛాయతో కులుకు శరీరముతో విలాసపు పద్మమును ధరించి చిరునవ్వులు చిల్కు మధురమయిన మోముతో నువ్వు కర్దమునికి ప్రత్యక్షమయ్యావు.

**14–4 శ్లో.**
**స్తువతే పులకావృతాయ తస్మై**
**మనుపుత్రీం దయితాం నవాపి పుత్రీః ।**
**కపిలం చ సుతం స్వమేవ పశ్చాత్**
**స్వగతిం చాప్యనుగృహ్య నిర్గతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** పులక–ఆవృతాయ= నీ దర్శనముతో శరీరము పులకరించి, స్తువతే= నిన్ను కీర్తించు, తస్మై = కర్దమునికి, మనుపుత్రీం = మనుపుత్రియైన దేవహూతిని, దయితాం = భార్యగా, నవ– పుత్రీః అపి= తొమ్మండుగురు కూతుర్లను ఇచ్చి, స్వమ్–ఏవ= తన అంశ భూతముగా–తానే, కపిలం సుతం చ= కపిలుడను పేరుతో కుమారుడను అయ్యెదనని, పశ్చాత్ = చివరకు, స్వగతిం చ అపి = మోక్షమును కూడా, అనుగృహ్య = అనుగ్రహించి, నిర్గతః – అభూః = వైకుంఠమునకు వెళ్ళితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! నీ దర్శనముతో శరీరము పులకరించి నిన్ను కీర్తించు కర్దమునికి మను పుత్రియైన దేవహూతి భార్య అవుతుందని, తొమ్మండుగురు కూతురులు కలుగుతారని, నీ అంశ భూతముగా–నీవే కపిలుడను పేరుతో

కుమారునిగా వారికి పుడతానని చివరకు మోక్షమును కూడా అనుగ్రహించి వైకుంఠమునకు వెళ్ళితివి.

**14–5 శ్లో.**
**స మనుశ్శతరూపయా మహిష్యా**
**గుణవత్యా సుతయా చ దేవహూత్యా ।**
**భవదీరితనారదోపదిష్టః**
**సమగాత్ కర్దమమాగతి ప్రతీక్షమ్ ॥**

**ప్రతిపదార్థము:** భవత్ – ఈరిత= నీచే ప్రేరేపింపబడిన, నారద =నారదునిచే, ఉపదిష్టః= ఉపదిష్టుడై (ఉపదిష్టః ఉపదేశప్రాప్తః ప్రాప్తోపదేశో వా ఉపదేశముతో పొందబడినది ఉపదేశింపబడినవాడు), స మనుః = ఆ మనువు, మహిష్యా = భార్యయైన (మహిషస్య రాజ్ఞః కృతాభిషేకా పత్నీ రాజుతో సహపట్టాభిషేకం చేయబడిన రాజమహిషి), శతరూపయా = శతరూపతో, గుణవత్యా సుతయా చ = గుణవంతురాలయిన కుమార్తె, దేవహూత్యా= దేవ హూతితో (స్వాయంభూ మనోః కన్యా స్వయంభూ మనువు కూతురు. దేవహూతి), ఆగతి ప్రతీక్షమ్= వారి రాకకు ఎదురుచూచుచున్న, కర్దమమ్= కర్దముని దగ్గరకు, సమగాత్= వెళ్ళెను.

**తాత్పర్యము:** నీచే ప్రేరేపింపబడిన నారదునిచే ఉపదేశమును పొందిన ఆ మనువు – భార్యయైన శతరూపతో గుణవంతురాలయిన కుమార్తె దేవహూతితో కలిసి– వారి రాకకు ఎదురుచూచుచున్న కర్దముని దగ్గరకు వెళ్ళెను.

**విశేషాలు:**

**శతరూప:** స్వాయంభువుని భార్య. ఈమె బ్రహ్మచే మొట్టమొదట సృజియింపఁబడిన స్త్రీ.

**దేవహూతి:** కర్దమ ప్రజాపతి భార్య. కపిలుని తల్లి. ఈమె తన పుత్రునివలన భక్తియోగమునుఎఱిఁగి తత్వజ్ఞానము పడసెను.

**14-6 శ్లో.**

**మనునోపహృతాం చ దేవహూతిం**
**తరుణీరత్నమవాప్య కర్దమోసౌ ।**
**భవదర్చననిర్వృతోఽపి తస్యాం**
**దృఢశుశ్రూషణయా దధౌ ప్రసాదమ్ ॥**

**ప్రతిపదార్థము:** మనునా= మనువు చేత, ఉపహృతాం = ఇయ్యబడిన (ఉపహరతి సమీపం ఆనయతి, ఉపహ్రియతే దీయతే ఇచ్చుట బహూకరించుట కానుక ఇచ్చుట), తరుణీరత్నమ్= కన్యారత్నము అయిన, దేవహూతిం= దేవ హుతిని, అవాప్య= పొంది, అసౌ= ఈ, కర్దమః =కర్దముడు, భవత్ –అర్చన= నీయొక్క పూజయందు, నిర్వృతః –అపి= ధర్మ నిరతుడైనప్పటికి, తస్యాం= ఆ దేవహూతి చేయు, దృఢశుశ్రూషణయా= దృఢమైన సేవ చేత (శుశ్రూషణ=సేవితుం ఇచ్ఛా సేవించవలెనని కోరిక), ప్రసాదమ్ దధౌ = ఆమెపై దయను చూపించాడు.

**తాత్పర్యము:** మనువు చేత ఇయ్యబడిన కన్యారత్నము అయిన దేవ హుతిని పొంది ఈ కర్దముడు నీయొక్క పూజయందు ధర్మ నిరతుడైనప్పటికి ఆ దేవహూతి చేయు దృఢమైన సేవ చేత ఆమెపై దయను చూపించాడు.

**14-7 శ్లో.**

**స పునస్త్వదుపాసనప్రభావాత్**
**దయితాకామకృతే కృతే విమానే ।**
**వనితాకులసంకులే నవాత్మా**
**వ్యహరద్దేవపథేషు దేవహూత్యా ॥**

**ప్రతిపదార్థము:** సః= ఆ కర్దముడు, పునః= మరలా, త్వత్– ఉపాసనప్రభావాత్ = నీ ఉపాసన ప్రభావము వలన (ఉపాస్యంతే పూజ్యంతే దేవతాదయః అనయా ఉపాసనము ఉపాసించుట పూజ దేవతలను పూజించుట), దయితా= తన భార్య అయిన దేవహూతి, కామకృతే= కోరికను నెరవేర్చుటకు, వనితాకులసంకులే= పరిచారక విద్యాధర స్త్రీ సహస్ర పరివృతమైన(వనితా = వన్యతే సేవ్యతే

సేవింపబడునది. స్త్రీ.), విమానే= విమానములందు (విగతం మానం ఉపమా యస్య సాటి లేనిది. దేవతల రథము, విమానము), నవ–ఆత్మా = కొత్తదైన మోహన వేషముచే ఉజ్జ్వలమైన పదహారేండ్ల అందం కలిగిన శరీరముతో, దేవపథేషు= నందన పుష్పభద్ర చైత్ర రథము మొదలయిన దేవతల ఉద్యాన వనములందు (దేవపథ= దేవ పథ ఇవ దేవపథః సద్గుణోపేతః తరునా కరచ్ఛాయా కలితః సమతలః సజలః నిష్కంటకః నిరుపద్రవశ్చ దేవపథః తత్తుల్యః పంథాః దేవతల మార్గము వలె వుండు మార్గము), దేవహూత్యా= దేవహూతితో కలిసి, వ్యహరత్ = క్రీడించాడు.

**తాత్పర్యము:** ఆ కర్దముడు మరలా నీ ఉపాసన ప్రభావము వలన తన భార్య అయిన దేవహూతి కోరికను నెరవేర్చుటకు పరిచారక విద్యాధర స్త్రీ సహస్రములతో కూడుకొన్న విమానములందు కొత్తదైన మోహన వేషముచే ఉజ్జ్వలమైన పదహారేండ్ల అందం కలిగిన శరీరముతో నందన పుష్పభద్ర చైత్ర రథము మొదలయిన దేవతల ఉద్యాన వనములందు దేవహూతితో కలిసి క్రీడించాడు.

**14–8 శ్లో.**

**శతవర్షమథ వ్యతీత్య సోఽయం**
**నవకన్యాస్సమవాప్య ధన్యరూపాః ।**
**వనయానసముద్యతోఽపి కాంతా**
**హితకృత్ త్వజ్జననోత్సుకో న్యవాత్సీత్ ॥**

**ప్రతిపదార్థం:** అథ =అటుపిమ్మట, సః–అయం= ఆ కర్దముడు, శతవర్షమ్= నూరేండ్లు (వర్షమ్= వృష్యతే సిచ్యతే ధ్రియతే ప్రార్థ్యతే సంవత్సరము), వ్యతీత్య = దేవహూతితో విహరించి, ధన్యరూపాః= రూపము చేత ధన్యులయిన, నవకన్యాః = తొమ్మిదిమంది కుమార్తెలను, సమవాప్య = పొంది, వనయాన= తపస్సు కొరకు అడవులకు, సముద్యతః–అపి= వెళ్ళాలని అనుకొన్నప్పటికి, కాంతాహితకృత్ = దేవహూతికి పుత్ర హితము చేయవలెనను కోరికతో (కాంతా=కామ్యతే పురుషైః పురుషులచే కోరబడునది. స్త్రీ.), త్వత్ –జనన–ఉత్సుకః= నీ పుట్టుక చూడవలెనను

కోరికతో(జననం జన్మ జన్మ, పుట్టుక.), న్యవాత్సీత్= తన వన ప్రయాణాన్ని మానుకొన్నాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆ కర్దముడు నూరేండ్లు దేవహూతితో విహరించి అందమయిన తొమ్మిదిమంది కుమార్తెలను పొంది తపస్సు కొరకు అడవులకు వెళ్ళాలని అనుకొన్నప్పటికి దేవహూతికి పుత్ర హితము చేయవలెనను కోరికతో నీ పుట్టుక చూడవలెనను కోరికతో తన వన ప్రయాణాన్ని మానుకొన్నాడు.

**14-9 శ్లో.**
**నిజభర్తృగిరా భవన్నిషేవా**
**నిరతాయామథ దేవ! దేవహూత్యామ్ ।**
**కపిలస్త్వమజాయథా జనానాం**
**ప్రథయిష్యన్ పరమాత్మతత్త్వవిద్యామ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ! = ఓ గురువాయూరు దేవా!, అథ = అటుపిమ్మట, నిజభర్తృగిరాత్ = భర్త చెప్పిన మాటవలన (భర్తృ= బిభర్తి పుష్ణాతి, పాలయతి, ధారయతి వా పాలించువాడు, పోషించువాడు, రక్షించువాడు. రక్షకుడు. రాజు భర్త నేత ఇంద్రుడు), భవత్ నిషేవా= నీ సేవ లో (వ్రతాలు, ఉపవాసాలు మొదలయినవి) ( నితరాం సేవతే తస్య భావః సేవించుట పూజించుట), నిరతాయామ్= ఆసక్తి కలిగిన, దేవహూత్యామ్= దేవహూతి యందు, జనానాం= జనులకు, పరమాత్మతత్త్వవిద్యామ్= 24 తత్త్వ విషయాలున్న విద్యను, ప్రథయిష్యన్ = బోధించుటకు, త్వమ్= నీవు, కపిలః =కపిలుడను పేరుతో (కామ్యతే అసౌ సాంఖ్యదర్శన ప్రవక్త, కపిలుడు), అజాయథాః= పుట్టితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! అటుపిమ్మట భర్త చెప్పిన మాటవలన నీ సేవ లో (వ్రతాలు, ఉపవాసాలు మొదలయినవి) ఆసక్తి కలిగిన దేవహూతి యందు జనులకు 24 తత్త్వ విషయాలున్న విద్యను బోధించుటకు నీవు కపిలుడను పేరుతో పుట్టితివి.

**14-10 శ్లో.**

**వనమేయుషి కర్దమే ప్రసన్నే**

**మతసర్వస్వముపాదిశజ్జనన్యై ।**

**కపిలాత్మక! వాయుమందిరేశ!**

**త్వరితం త్వం పరిపాహి మాం గదౌఘాత్ ॥**

**ప్రతిపదార్థము:** వాయుమందిర–ఈశ! = ఓ గురువాయూరు దేవా!, ప్రసన్నే= తన కుమార్తెలను మరీచాదులకు ఇచ్చి వివాహం చేసిన తరువాత ప్రసన్నుడయిన (ప్రసన్నః స్వచ్ఛః పవిత్రః సంతుష్టో వా స్వచ్ఛము పవిత్రము సంతోషము), కర్దమే= కర్దముడు, వనమ్= అడవికి, ఏయుషి= వెళ్లిన తరువాత, జనన్యై=నీ జననికి (జనయతిపుట్టించునది, కనునది. తల్లి), మతసర్వస్వమ్=ఆత్మ తత్త్వోపదేశమును, ఉపాదిశన్= ఉపదేశించావు, కపిల–ఆత్మక!= ఓ కపిలావతారా!, త్వం= నువ్వు, త్వరితం= త్వరితముగా, మాం = నన్ను, గద –ఔఘాత్= రోగ ప్రవాహమునుండి (గద్యతే పీడ్యతే అనేన దీనితో పీడింపబడుదురు. రోగము విషము), పరిపాహి= రక్షించుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! తన కుమార్తెలను మరీచాదులకు ఇచ్చి వివాహం చేసిన తరువాత ప్రసన్నుడయిన కర్దముడు అడవికి వెళ్లిన తరువాత నీ జననికి ఆత్మ తత్త్వోపదేశమును ఉపదేశించావు. ఓ కపిలావతారా! నువ్వు త్వరితముగా నన్ను రోగ ప్రవాహమునుండి రక్షించుము.

**తృతీయ స్కంధము**

**14వ దశకము సమాప్తము.**

# దశకమ్ 15 – కపిలోపదేశము

**15-1 శ్లో.**

**మతిరిహ గుణసక్తా బంధకృత్ తేష్వసక్తా**
**త్వమృతకృదుపరుంధే భక్తియోగస్తు సక్తిమ్ ।**
**మహదనుగమలభ్యా భక్తిరేవాత్రసాధ్యా**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** ఇహ= ఈ మూడు లోకాల్లోను (ఇహ=అస్మిన్ కాలే, అస్యాం దిశి వాఇక్కడ ఈ సమయంలో ఈ దిశలో ఈ లోకంలో), గుణసక్తాః మతిః = పూలదండలు, చందన వనిత మొదలయిన భోగాలలో ఎవడైతే ఆసక్తి చూపిస్తాడో వాడు బంధకృత్ = శరీర బంధితుడవుతాడు, తేషు= పూలదండలు, చందన, వనిత మొదలయిన భోగాలలో ఎవడైతే, అసక్తాః తు = ఆసక్తి చూపించక దృఢముగా ఉంటే,అమృతకృత్=మోక్షాన్నిపొందుతాడు(నాస్తిమరణంయస్మాత్అమృతము), భక్తియోగః తు= భక్తి యోగము(మోక్షసాధనములలో ఒకటిఅయిన భక్తి మార్గము), సక్తిమ్= ఆసక్తిని (సజతి సంబద్ధో భవతి తస్య భావః కర్మ వా ఆసక్తి దగ్గరగుట), ఉపరుంధే = వదిలిస్తుంది, మహత్= గొప్పవారికి (మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి పూజింపబడువాడు. జ్యేష్ఠుడు గొప్పది విస్తృతమైనది సాంఖ్యములో మహత్తత్త్వము), అనుగమ= సేవ చేయుట వలన, లభ్యా= లభించు, భక్తిః ఏవ = భక్తి యే(భక్తి= భజ్యతే సేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ), –అత్ర = ఈ లోకములో,సాధ్యా=మోక్షాన్నిసాధించుటకు ముముక్షువులకు సాధనమవుతుంది, ఇతి కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** ఈ మూడు లోకాల్లోను పూలదండలు, చందన వనిత మొదలయిన భోగాలలో ఎవడైతే ఆసక్తి చూపిస్తాడో వాడు శరీర బంధితుడవుతాడు. పూలదండలు, చందన, వనిత మొదలయిన భోగాలలో ఎవడైతే ఆసక్తి చూపించక దృఢముగా ఉంటే మోక్షాన్ని పొందుతాడు భక్తి యోగము ఆసక్తిని వదిలిస్తుంది. గొప్పవారికి సేవ చేయుట వలన లభించు భక్తి యే– ఈ లోకములో మోక్షాన్ని

సాధించుటకు ముముక్షువులకు సాధనమవుతుంది. కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వు నీ జనని దేవహూతికి ఈ విధముగా ఉపదేశించితివి.

**విశేషాలు:** ఈ దశకములోని ఛందస్సు మాలిని( **న , న , మ , య , య** )

**భక్తి:** 1. అర్చన, పూజ మొదలైనవి చేయడం ద్వారా వ్యక్తమయ్యే భావన. ఇది త్రివిధాలని కొందరు, అష్టవిధాలని మరికొందరు అంటారు. సేవా భావం అనే అర్థం కూడా ఉంది. బాహ్య భక్తి, అనన్య భక్తి, ఏకాంత భక్తి అని భక్తి త్రివిధాలు. 2. ''భజతమంతః కరణస్య భగవదాకారం'', ''స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే'' అని నిర్వచనాలు ఉన్నాయి. 3. భక్తి అష్టవిధాలు. ఇవీ : భాగవత వాత్సల్యం, భగవంతుని పూజించే చిత్తవృత్తి, అర్చన, భగవిద్విషయాల పట్ల ఆసక్తి, భాగవత కథాశ్రవణేచ్ఛ, స్వర నేత్ర అంగవికారం, దైవస్మరణ, అమాంస భక్షణం.

**15-2 శ్లో.**
**ప్రకృతిమహదహంకారాశ్చ మాత్రాశ్చ భూతా-**
**న్యపి హృదపి దశాక్షీ పూరుషః పంచవింశః ।**
**ఇతి విదితవిభాగో ముచ్యతేఽసౌ ప్రకృత్యా**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** ప్రకృతిః = మూల ప్రకృతి( ప్రక్రియతే కార్యాదికమనయా, ప్రకరోతి స్థావరజంగమాని దీనితో తమ తమ పనులు చేయుదురు స్థావర జంగమములను పుట్టించునది. సాంఖ్యశాస్త్రములో మూల ప్రకృతి ), మహత్ = మహత్తు అహంకారాః - చ = అహంకారములు(అహం ఇతి క్రియతే అనేన - అభిమానము అహంకారము), మాత్రాః చ = శబ్ద స్పర్శరూపరస గంధములు. (మీయంతే అనయా విషయాః దీనితో పంచమహాభూతములు తెలుసుకొనబడును), భూతాని - అపి= పంచభూతాలు (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము), హృత్ - అపి= (హరతి అసౌ హరించునది) మనస్సు, దశ - అక్షీ = పది ఇంద్రియాలు(అక్షతి, అక్ష్యతే వా అనేన చూచునది, వ్యాపించునది. దేనితో విషయం గ్రహింపబడునో అది. ఇంద్రియము.) జ్ఞానేంద్రియములు (5), కర్మేంద్రియములు

(5), పూరుషః= పురుషుడు(పురి శేతే, పురతి అగ్రగచ్ఛతిపురుషుడు ఆత్మ), ఇతి పంచవింశః=అను ఇరువది అయిదు తత్వముల, విదితవిభాగః= విభాగమెరిగినవాడు, అసౌ=జీవుడు, ప్రకృత్యా= మాయతో ( ఆ కార్య శరీరము మొదలయిన బంధములతో), ముచ్యతే = బద్ధుడు కాడు ( అనగా మాయను జయిస్తాడు అని భావం), ఇతి కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వుదేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** మూల ప్రకృతి, మహత్తత్వము అహంకారములు, మాత్రలు పంచ భూతాలు మనస్సు పది ఇంద్రియాలు పురుషుడు అను ఈ ఇరువది అయిదు తత్వముల విభాగమెరిగిన జీవుడు మాయను జయిస్తాడు అని ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వు నీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**విశేషాలు:**

**మహత్తత్వము:** సాంఖ్యుల పంచవింశతి తత్వాలలో ఒకటి. అవ్యక్తమైన ప్రధానం నుంచి వచ్చిన రెండవ భూమిక. Premordial Matter. అద్వైతుల భాషలో ఇది అవ్యాకృత సూక్ష్మప్రపంచం. దానికి అధిపతి అయిన జీవుడు హిరణ్యగర్భుడు. అంటే సమష్టి బుద్ధి. Cosmic mind

**అహంకార :** అహమంటే నేను అని శబ్దార్థం. అలా భావించటమే అహంకారం. నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించగలిగితే ఇది ఆత్మస్వరూపమే. అలాకాక సోపాధికమైతే ఇదే అనాత్మలాగా మారిపోతుంది. కర్తృరూపమైనది అహంకారమైతే సాక్షిరూపమైన చైతన్యమాత్మ. అహంకారానికే కర్తాత్మ అని పేరుపెట్టారు వేదాంతులు. ఇది చిదాభాసుడే గాని కేవల చిద్రూపం కాదు. అంటే జీవుడని అర్థం. ఇలాంటి జీవుడే అసలైన ఆత్మ అని భ్రమించారు పూర్వమీమాంసకులు.

**పురుష :** మానవుడని మామూలుగా చెప్పుకునే అర్థం. కాని వేదాంతుల భాషలో దీనికి జీవుడని అర్థం. ఈశ్వర చైతన్యమే జీవరూపంగా వచ్చి ఈ శరీరంలో

ప్రవేశించింది. పురంలో ప్రవేశించింది కనుక పురుషుడయింది. పురుష శబ్దానికి మూడర్థాలు చెప్పారు భాష్యకారులు. 'పురిశయనాత్' పురంలో శయనించాడు గనుక పురుషుడయ్యాడు. 'పూరణాత్.' శయనించి అక్కడికి ఆగక శరీరాన్ని విశ్వశరీరాన్ని రెండింటినీ పూరించాడు. గనుక పురుషుడయ్యాడు. అలా పూరించి సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. గనుక 'పూర్ణత్వాత్' పురుషుడయ్యాడు. ఈ విధంగా మూడు భూమికలలో పురుష శబ్దాన్ని నిర్వచించారు. గీతలో క్షర పురుషుడని, అక్షర పురుషుడని, పురుషోత్తముడని ముగ్గురు పురుషులు దర్శనమిస్తారు. ఇందులో క్షర పురుషుడు ఈ కనిపించే సమస్త భూతాలు. అక్షర పురుషుడు కూటస్థమైన మాయాశక్తి. పురుషోత్తముడు ఈ రెండింటినీ అతిక్రమించి ఉన్న ఈశ్వరచైతన్యం అని భాష్యకారుల వ్యాఖ్యానం.

**15-3 శ్లో.**

**ప్రకృతిగతగుణౌఘైర్నాజ్యతే పూరుషోఽయం**
**యది తు సజతి తస్యాం తద్గుణాస్తం భజేరన్ ।**
**మదనుభజనతత్త్వాలోచనైః సాఽప్యపేయాత్**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** ప్రకృతిగత =ప్రకృతి యొక్క, గుణ ఓఘైః = గుణ సమూహము చే, అయంపూరుషః = ఈ పురుషుడు, నాజ్యతే = న ఉపరాజ్యతే అంటు కొనదు, యది తు =ఒకవేళ, సజతి = అంటుకొన్నప్పటికీ (అనగా అహంకార మమకారాలు కలిగి ఉంటే), తస్యాం =అతనియందు, తద్గుణాః =ఆ గుణములు, తమ్ =అతనిని, భజేరన్= కష్టముల పాలు చేయును, మత్ అనుభజనాత్ =నా యొక్క శరణము చే, తత్త్వ లోచనైః = బ్రహ్మజ్ఞానము చే, సా అ పి= ఆ మాయను కూడా, అ పేయాత్= దాట వచ్చును, ఇతి కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** ప్రకృతియొక్క గుణ సమూహమును ఈ పురుషుడు అంటు కొనదు (శరీరమందు ఉన్నప్పటికి జీవుడు శరీర ధర్మములైన కర్తృత్వ భోక్తృత్వ జనన మరణాదులు అంటుకొనడని అర్థం) ఒకవేళ అంటుకొన్నప్పటికీ అనగా అహంకార

మమకారాలు కలిగి ఉంటే అతనియందు ఆ గుణములు అతనిని కష్టముల పాలు చేయును. (అనగా పుట్టుక చావు కలిగిన ఈ సంసార ప్రవాహంలో అతనిని ముంచివేయునని భావము) నా యొక్క శరణము చే బ్రహ్మజ్ఞానము చే ఆ మాయను దా ట వచ్చును ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వు నీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**15-4 శ్లో.**
**విమలమతిరుపాత్తైరాసనాద్యైర్మదంగం**
**గరుడసమధిరూఢం దివ్య భూషాయుధాంకమ్ ।**
**రుచితులిత తమాలం శీలయేతానువేలం**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థం:** విమలమతిః = యమ నియమాదులతో స్వచ్ఛమైన బుద్ధితో, ఉపాత్త= పొందిన, ఆసన ఆద్యైః= స్థిరమైన ఆసనములతో (ప్రాణాయామాదులతో) ఆసీదంతి అస్మిన్ కూర్చొనుట ఆసనము, మత్ అంగం = ప్రభువైన నా రూపమును, గరుడసమధిరూఢం= గరుడ వాహనము ఎక్కిన వానిగా, దివ్య భూష ఆయుధ అంకమ్= దివ్యమైన అలంకరణ ములు ఆయుధములు కలిగిన గుర్తులు కల వానిగా తమాలం = చీకటి చెట్టు(తమ్యతే కాంక్ష్యతే కోరబడునది. తమాల వృక్షము), రుచితులిత = కాంతి తో సమానమయిన కాంతి కలవానిగా, అనువేలం = ఎల్లప్పుడు (వేలాం వేలామ్ పదేపదే మాటిమాటికి), శీలయే = అభ్యాస పూర్వకముగ నన్ను ధ్యానింపుము, ఇతి కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** యమ నియమాదులతో స్వచ్ఛమైన బుద్ధితో పొందిన స్థిరమైన ఆసనములతో (ప్రాణాయామాదులతోప్రభువైన నా రూపమును గరుడ వాహనము ఎక్కిన వానిగా దివ్యమైన అలంకరణ ములు ఆయుధములు కలిగిన గుర్తులు కల వానిగా చీకటి చెట్టురుచి కాంతి తో సమానమయిన కాంతి కలవానిగా ఎల్లప్పుడు

అభ్యాస పూర్వకముగ నన్ను ధ్యానింపుము. ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వునీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**15-5 శ్లో.**

**మమ గుణగణలీలాకర్ణనైః కీర్తనాద్యైః**
**మయి సురసరిదోఘప్రఖ్యచిత్తానువృత్తిః ।**
**భవతి పరమభక్తిః సా హి మృత్యోర్విజేత్రీ**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** మమ= నా ఐశ్వర్యము యొక్క, గుణగణలీల = భక్త వాత్సల్యాది సుఖములను ఇచ్చు గుణములను, లీలలను, ఆకర్ణనైః = వినుచు, కీర్తన ఆద్యైః= నవవిధ సాధన భక్తులను కీర్తనలు మొదలైన వాని ద్వారా పాడుతూ, మయి =నాయందు, సురసరిత్ ఓఘ సమూహ ప్రఖ్య = గంగా ప్రవాహతుల్యమైన, చిత్త అనువృత్తిః=మనోవృత్తి (అనురూపో వృత్తిః వర్తనమ్ అనుకూలంగా ప్రవర్తించుట), భవతి =కలిగివున్నచో, పరమభక్తిః= అదేపరమ భక్తి లేదా సాధ్య భక్తి, సా హి= అదే, మృత్యోః = సంసార రూపమైన మృత్యువును, విజేత్రీ = సమూలముగా ఉన్మూలించు శక్తి కలది అని, ఇతి కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** నా ఐశ్వర్యము యొక్క భక్త వాత్సల్యాది సుఖములను ఇచ్చు గుణములను, లీలలను వినుచు నవవిధ సాధన భక్తులను కీర్తనలు మొదలైన వాని ద్వారా పాడుతూ నాయందు గంగా ప్రవాహతుల్యమైన మనోవృత్తి కలిగివున్నచో అదేపరమ భక్తి లేదా సాధ్య భక్తి. అదే సంసార రూపమైన మృత్యువును సమూలముగా ఉన్మూలించు శక్తి కలది అని ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వునీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**విశేషాలు:**

**నవవిధ-భక్తులు :** 1. శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4. పాదసేవ, 5. అర్చన, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మనివేదనము.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్, అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్" [భాగవతము 7-5-23]

1. శంఖచక్రాది ధారణము, 2. హరిస్మరణము, 3. హరినామకీర్తనము, 4. హరిపాదాంబుసేవనము, 5. హరిపాదవందనము, 6. హరినివేదిత భోజనము, 7. ఏకాదశ్యుపవాసము, 8. తులసిపూజ, 9. వైష్ణవార్చన [ఇవి వైష్ణవుల భక్తి ప్రకారములు] [వృద్ధహారీతస్మృతి 8-81]

**15-6 శ్లో.**

**అహహ బహుళహింసా సంచితార్థైః కుటుంబం**
**ప్రతిదినమనుపుష్ణన్ స్త్రీజితో బాలలాలీ ।**
**విశతి హి గృహసక్తో యాతనాం మయ్యభక్తః**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** అహహ= అయ్యో!, బహుళ = అనేక హింసా పర హింసలు చేసి(బహూనర్థాన్ లాతి ప్రచురమ్. అధికము), సంచిత =కూడబెట్టిన, అర్థైః= సంపదలతో, కుటుంబం= కుటుంబమును( పుత్ర భార్యాదులను), ప్రతిదినమ్= ప్రతిరోజు, అనుపుష్ణన్= పోషించుచు, స్త్రీజితః =స్త్రీ వశుడై, బాలలాలీ= సంతానపు ఆలనాపాలనా చూస్తూ, గృహసక్తః=గృహమునందు ఆసక్తి కలిగిన, మయి = నా యొక్క, అభక్తః = అభక్తుడు ( భక్తుడు కానివాడు ), యాతనాం= కష్టముల యందు( రౌరవాది నరకములందు )(యాతయతి పీడయతి తస్య భావః కర్మ వా పీడించుట, పీడ), విశతి హి = ప్రవేశించును కదా, ఇతి= అని, కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** అనేక హింసా పర హింసలు చేసి కూడబెట్టిన సంపదలతో కుటుంబమును ప్రతిరోజు పోషించుచు స్త్రీపట్ల కామము కలిగి సంతానపు ఆలనాపాలనా చూస్తూ గృహమునందు ఆసక్తి కలిగిన నా యొక్క అభక్తుడు (భక్తుడు కానివాడు) కష్టముల యందు( రౌరవాది నరకములందు ) ప్రవేశించునని

ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వునీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**15-7 శ్లో.**

**యువతి జఠరఖిన్నో జాతబోధోఽప్యకాండే**
**ప్రసవగళిత బోధః పీడయోల్లంఘ్య బాల్యమ్ ।**
**పునరపి బత ముహ్యత్యేవ తారుణ్యకాలే**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** బత = అయ్యో!, యువతి= స్త్రీ (ప్రాప్త యౌవనా స్త్రీయౌవనము వచ్చిన స్త్రీ. ), జఠర = గర్భములో (జాయతే ప్రాణి అస్మిన్ ఇందులో ప్రాణి వుండును. కడుపు), ఖిన్నః= బాధపడి (ఖిన్నః జాతభేదఃదుఃఖపడువాడు), అకాండే= దుఃఖ ప్రతీకార కరణ అసంభవ కాలములో (కాండం అవకాశం వినా అకస్మాత్తుగా), జాతబోధః – అపి = ఏడవ మాసములో దైవలబ్ధముగా పూర్వ జన్మ స్మృతి కలిగినప్పటికి, ప్రసవ = ప్రసూతి వాయువులచే , యోని యంత్ర పీడనచే నెట్టబడి (ప్రసూతే తస్య భావః కర్మ వా ప్రసవము. కనుట), గళిత = నశించిన, బోధః = పూర్వ జన్మ బోధచే పుట్టి, పీడయ = దుఃఖ పీడతో, బాల్యమ్= బాల్యమును, ఉల్లంఘ్య= అతిక్రమించి, పునః అపి = మరలా, తారుణ్యకాలే = భగవద్భజన సామర్థ్యము కలిగిన యౌవన కాలములో, ముహ్యతి–ఏవ = కామ కర్మలో మోహపడును, ఇతి = అని, కపిలతనుః = ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి, త్వం = నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః = ఉపదేశించితివి.

**తాత్పర్యము:** తల్లి గర్భములో బాధపడి దుఃఖ ప్రతీకారము చేయుటకు అసంభవమైన కాలములో ఏడవ మాసములో దైవలబ్ధముగా పూర్వ జన్మ స్మృతి కలిగినప్పటికి ప్రసూతి వాయువులచే, యోని యంత్ర పీడనచే బయటికి గళిత పారిపోయిన పూర్వ జన్మ బోధచే పుట్టినప్పటికి దుఃఖ పీడతో బాల్యమును గడిపి మరలా భగవద్భజన సామర్థ్యము కలిగిన యౌవన కాలములో కామ కర్మలో మోహపడును అని ఈ విధముగా కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వునీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**15-8 శ్లో.**

**పితృసురగణయాజీ ధార్మికో యో గృహస్థః**
**స చ నిపతతి కాలే దక్షిణాధ్వోపగామీ ।**
**మయి నిహితమకామం కర్మ తూదక్పథార్థం**
**కపిలతనురితి త్వం దేవహూత్యై న్యగాదీః ॥**

**ప్రతిపదార్థము:** పితృసురగణ= భగవంతుని ధర్మమునందు విముఖులై పితృ దేవతలను, ఇతర దేవతలను, యాజీ= యాగము చేయువాడు, ధార్మికః = ధర్మప్రతిపాదకమైన ధర్మశాస్త్రమును అభ్యసించువాడు, తెలిసినవాడు, యః= ఏ, గృహస్థః= గృహస్థుడు ఉన్నాడో (గృహే తిష్ఠతి ఇంటిలో వుండువాడు. గృహస్థుడు), సః చ= అతడు, కాలే = పుణ్య క్షయము కాగా, నిపతతి = మరలా జన్మకు మరలుతాడు, దక్షిణ-అధ్వ-ఉపగామీ= అతడు దక్షిణ యానములో ధూమాది మార్గ గమన శీలుడవుతాడు, మయి = నాయందు (విష్ణువు యందు), నిహితమ్= సమర్పించబడిన, అకామం= కామ్య నిషిద్ధ వ్యతిరిక్తమైన, కర్మ తు= నిత్య నైమిత్తికప్రాయ చిత్తోపాసన రూపమయిన కర్మ సమర్పణ చేసిన వారే (తు అను అక్షరము ఏవార్థకముగా ప్రయుక్తము), ఉదక్ పథార్థం= అర్చిరాది మార్గ ప్రాప్తులవుతారు, ఇతి= అని, త్వం= నువ్వు, దేవహూత్యై = నీ జనని దేవహూతికి, న్యగాదీః= ఉపదేశించితివి.

**తాత్పర్యము:** భగవంతుని ధర్మమునందు విముఖులై ఇతర దేవతలను కొలిచే ఏ ధార్మికుడు గృహస్థు ఉన్నాడో అతడు దక్షిణ దిక్కుగా ధూమ్ర మార్గంలో వెళ్లి సుఖాలు అనుభవిస్తాడు. నాయందు ధర్మకర్మసమర్పణము చేసిన పుణ్యుడు ఉత్తరాయణంలో అనగా అర్చిరాది మార్గంలో ప్రయాణించి ముక్తి చెందుతారని కపిల వాసుదేవ అవతారమెత్తి నువ్వు నీ జనని దేవహూతికి ఉపదేశించితివి.

**విశేషాలు**

**ధూమాది మార్గము:** కర్మఠులు(కార్యమును చివరవరకు సాధించేవారు.) పితృ లోకమునకు పోవు మార్గము. పుణ్యక్షయానంతరము వీరికి పునర్జన్మము కలదు.

వీరికి తాముచేయు అగ్నిహోత్ర ధూమముద్వారా ఈలోకము సిద్ధించును కనుక ఇది ధూమాది మార్గము అనబడును.

**అర్చిరాదిమార్గ :** ధూమమార్గానికి వ్యతిరిక్తమైనది. కర్మిష్ఠులు మరణానంతరం ధూమమార్గంలో పితృలోకానికి వెళితే ఉపాసకులు అర్చిరాది మార్గంలో దేవలోకాలకు వెళుతారట. అర్చిస్సు అంటే అగ్నిజ్వాల. అది దారి చూపుతుంటే పయనిస్తారు గనుక దానికా పేరు వచ్చింది. దేవయానమని భావం.

**15–9 శ్లో.**
**ఇతి సువిదితవేద్యాం దేవ హే! దేవహూతిం**
**కృతనుతిమనుగృహ్య త్వం గతో యోగిసంఘైః ।**
**విమలమతిరథాసౌ భక్తియోగేన ముక్తా**
**త్వ మపి జనహితార్థం వర్తసే ప్రాగుదీచ్యామ్ ॥**

**ప్రతిపదార్థం:** హే దేవ= ఓ దేవా!, ఇతి = ఇట్లు, సువిదితవేద్యాం= బ్రహ్మ వస్తు ప్రాప్తి సాధనము తెలుసుకొన్న (విద్+యత్, వేత్తుం యోగ్యమ్ తెలుసుకొనదగినది), కృతనుతిమ్= చేయబడిన నుతి కలిగిన, దేవహూతిం= దేవహూతిని, అనుగృహ్య= అనుగ్రహించి, త్వం= నువ్వు (కపిలావతారము), యోగిసంఘైః= యోగి సంఘము లతో (యోజయతి సమానం పశ్యతి సుఖం చ దుఃఖం చ సుఖదుఃఖములను సమానంగా చూచువాడు. యోగి), గతః= వెళ్ళితివి, అథ = అటుపిమ్మట, అసౌ విమలమతిః = పరిశుద్ధ మనస్సు కలిగిన దేవహూతి, భక్తియోగేన = భక్తి యోగముతో, ముక్తా= ముక్తి పొందినది.( పరిత్యక్తా, జాతమోక్షా చ విడిచి పెట్టబడినది మోక్షము లభించినది), త్వమ్ —అపి= నువ్వు కూడా, జనహిత–అర్థం= మూడు లోకముల రక్షణ కొరకు, ప్రాక్–ఉదీచ్యామ్ = ఈ శాన్యదిక్కులో (ఉదీచ్యాం= ఉత్తరస్యాం దిశి భవః, ఉదీచ్యాం ఉత్తరకాలే), వర్తసే = ఉన్నావు.

**తాత్పర్యము:** దేవా! ఈ విధంగా నువ్వు దేవహూతికి బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించావు. ఆమెను అనుగ్రహించి యోగి సంఘము తో నువ్వు వెళ్లిపోయావు .అటు పిమ్మట పరిశుద్ధ మనస్సుతో నీ తల్లి దేవహూతి భక్తి యోగాభ్యాసము చేసి ముక్తి పొందింది.

నువ్వు కూడా మూడు లోకముల రక్షణ కొరకు ఈశాన్య దిక్కులో నివసిస్తున్నావు.

**15–10 శ్లో.**

**పరమ! కిము బహూక్త్యా త్వత్పదాంభోజభక్తిం**
**సకలభయవినేత్రీం సర్వకామోపనేత్రీమ్ ।**
**వదసి ఖలు దృఢం త్వం తద్విధూయామయాన్మే**
**గురుపవనపురేశ త్వయ్యుపాధత్స్వ భక్తిమ్ ॥**

**ప్రతిపదార్థం:** పరమ!= శ్రేష్ఠుడా! (పరం పరత్వం శ్రేష్ఠత్వం మాతి శ్రేష్ఠత్వమును పొందునది. ఉత్కృష్టము ప్రధానమైనది ప్రణవము), గురుపవనపురేశ = గురువాయూరు దేవా!, బహు–ఉక్త్యా= అనేక మాటలు, కిము= ఎందుకు?, త్వత్–పద– అంభోజభక్తిం= నీ పాదపద్మాలను ఎప్పుడూ సేవిస్తే, సకలభయ= సకల సంసార దుఃఖములు, వినేత్రీం = పోగొడతావు ( వినయనముపశమం కర్త్రీ) (విశేషేణ నయతి విశేషంగా తీసుకొని వెళ్లేవాడు. గురువు, రాజు, తండ్రి.), సర్వకామ = అభీష్టార్థములను, ఉపనేత్రీమ్= కలిగిస్తావు అని, త్వం = నువ్వు, దృఢం= దృఢముగా, వదసి ఖలు= చాలాసార్లు చెప్పి ఉన్నావు కదా!, తత్= అందువలన, మే= నాకు, ఆమయాత్= రోగములను (ఆమం రోగం యాతి అనేన దీనితో రోగులగుదురు. రోగము మనోవ్యాధి), వి ధూయ = తొలగించి, త్వయి= నీయందు, భక్తిమ్= భక్తిని, ఉపాధత్స్వ= కలిగించు.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! ఇంకా వేయి మాటలు ఎందుకు?! నీ పాదపద్మాలను ఎప్పుడూ సేవిస్తే అన్ని భయాలు తొలగిపోతాయి. అన్ని కోరికలు నెరవేరుతాయి అని నువ్వు చాలా సార్లు చెప్పి ఉన్నావ్. ఆ విధంగానే నా యొక్క సర్వ రోగాలను పోగొట్టి నీ యందు భక్తిని కలిగించేటట్లు చేయవలసినదిగా ప్రార్థన.

*తృతీయ స్కంధము పరిపూర్ణము*

**15వ దశకము సమాప్తము.**

# చతుర్థ స్కంధము

## దశకమ్ 16 – నరనారాయణావతారం, దక్షయాగము

**16–1 శ్లో.**

**దక్షో విరించితనయోఽథ మనోస్తనూజాం**
**లబ్ధ్వా ప్రసూతిమిహ షోడశ చాఽప కన్యాః ।**
**ధర్మే త్రయోదశ దదౌ పితృషు స్వధాం చ**
**స్వాహాం హవిర్భుజి సతీం గిరిశే త్వదంశే ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటు పిమ్మట, విరించితనయః= బ్రహ్మ కుమారుడైన, దక్షః = దక్షుడు (దక్షతే సమర్థో భవతి సమర్థుడు నిపుణుడు దక్ష ప్రజాపతి), మనోః= స్వాయంభువ మనువు, తనూజాం= కుమార్తె అయిన, ఇహ ప్రసూతిమ్ = ప్రసూతి అను పేరుగలదానిని, లబ్ధ్వా= పొంది( అనగా భార్యగా పొందెను), షోడశ కన్యాః చ =16 మంది కుమార్తెలను (కన్యతే దీప్యతే కామ్యతే రూపము వలన ప్రకాశించునది. కన్య పెండ్లి గాని స్త్రీ కోరబడునది. కన్య ), ఆప = ఆమె ద్వారా పొందాడు, ధర్మే= ధర్ముడనే మహర్షికి, త్రయోదశ = మైత్రి మొదలయిన పదముగ్గురు కుమార్తెలను దదౌ= ఇచ్చెను.(వివాహము చేసాడు), పితృషు= పితృదేవతలకు, స్వధాం చ= స్వధ అను కుమార్తెను, స్వాహాం= స్వాహా అను కుమార్తెను, హవిః – భుజి= అగ్ని దేవునకు, (హోమ ద్రవ్యమును భుజించువాడు), త్వత్ –అంశే= నీ అంశ అయిన, గిరిశే= శివునకు (గిరౌ శేతే పర్వతమున వుండువాడు. శివుడు), సతీం= సతీదేవిని భార్యలుగా ఇచ్చాడు.

**తాత్పర్యము:** అటు పిమ్మట బ్రహ్మ కుమారుడైన దక్షుడు స్వాయంభువ మనువు తన కుమార్తె అయిన ప్రసూతి ని పెళ్ళిచేసుకున్నాడు. 16 మంది కుమార్తెలను ఆమె ద్వారా పొందాడు. వారిలో పదముగ్గురు కుమార్తెలను ధర్ముడనే మహర్షికి ,స్వధ అను కుమార్తెను పితరులకు, స్వాహా అను కుమార్తెను అగ్ని దేవునకు, సతి అను కుమార్తెను నీ అంశ అయిన శివునకు భార్యలుగా ఇచ్చాడు.

**విశేషాలు:** వసంతతిలక ఛందస్సు( తభజజగా(గగ) ఈ దశకము మొత్తములో ఉన్నది.

**16-2 శ్లో.**

**మూర్తిర్హి ధర్మగృహిణీ సుషువే భవంతం**
**నారాయణం నరసఖం మహితానుభావమ్ ।**
**యజ్జన్మని ప్రముదితాః కృతతూర్యఘోషాః**
**పుష్పోత్కరాన్ ప్రవవృషుర్నునువుః సురౌఘాః ॥**

**ప్రతిపదార్థము:** ధర్మగృహిణీ = ధర్ముని యొక్క ధర్మపత్ని అయిన (అగ్నిసాక్షిగ పెండ్లాడిన భార్య, సహధర్మచారిణి), మూర్తిః ='మూర్తి' అను ఆమె, నరసఖం = నరుని స్నేహితుడవయిన, మహిత–అనుభావమ్= మహానుభావుడైన (మహాన్ అనుభావః ఆశయః యస్య– గొప్ప ఆశయము కలవాడు. మహానుభావుడు), నారాయణం = నారాయణుడవైన, భవంతం= నిన్ను ( నరునితో), సుషువే= కన్నది, యత్ –జన్మని= ఏ జన్మమందు అనగా నారాయణుడు అయిన నీవు జన్మించినప్పుడు, సుర –ఓఘాః= దేవతా సమూహం అంతా(సుష్ఠు రాతి దదాతి అభీష్టమ్ కోరికను నెరవేర్చువాడు. దేవత), ప్రముదితాః= చాలా సంతోషించి, కృతతూర్యఘోషాః= దుందుభులు మోగించారు, పుష్ప ఉత్కరాన్ = పుష్ప వర్షాలు, ప్రవవృషుః= కురిపించారు, నునువుః = మిమ్ములను స్తుతించారు.

**తాత్పర్యము:** ధర్ముని యొక్క ధర్మపత్ని అయిన 'మూర్తి' అను ఆమె మహానుభావుడైన నరుని స్నేహితుడవయిన నారాయణుని నిన్ను కన్నది. నర నారాయణులైన మీరు జన్మించినప్పుడు దేవతా సమూహం అంతా చాలా సంతోషించి దుందుభులు మోగించారు. పుష్ప వర్షాలు కురిపించారు. మిమ్ము స్తుతించారు.

**16-3 శ్లో.**

**దైత్యం సహస్రకవచం కవచైః పరీతం**
**సాహస్రవత్సరతపస్సమరాభిలవ్యైః।**
**పర్యాయనిర్మితతపస్సమరౌ భవంతౌ**
**శిష్టైకకంకటమముం న్యహతాం సలీలమ్ ॥**

**ప్రతిపదార్థం:** సాహస్రవత్సర తపః=వేయి సంవత్సరాల తపస్సుతో(సహస్రాణాం సమూహఃవెయ్యి, కొన్ని వేలు), సమర–అభిలవైః= అలాగే వేయి సంవత్సరాల యుద్ధంతో కాని జయించలేని (సమ్యక్ ఋచ్ఛంతి గచ్ఛంతి యోద్ధుం యోద్ధారః అత్ర యోద్ధలు యుద్ధము చేయుటకు ఇక్కడికి వెళ్లుదురు. యుద్ధము), కవచైః పరీతం= సహజ సహస్ర కవచములచే చు ట్టు కొనబడిన శరీరుని (కవచ=కం దేహం వంచతి విపక్ష అస్త్రాణి వంచయిత్వా రక్షతి కవచము. శత్రువుల శస్త్రముల నుండి దేహమును రక్షించునది.)(పరీత=పరి ఇతః గతః, సమాప్తః పర్యాప్తః అధికృతో వా చు ట్టు కొనబడినది), సహస్రకవచం= వేయి కవచము లతో కూడుకున్న, దైత్యం= సహస్రకవచుడు అను రాక్షసుని సంహరించుట కొరకు, పర్యాయనిర్మిత = పరస్పర పరిహారముతో కూడిన (పరి అయనం గమనం అనుక్రమః క్రమము సమానార్థకపదము), తపస్సమరౌ = తపస్సు, సమరములతో కూడిన, భవంతౌ= మీ ఇద్దరు, అముం= ఈ సహస్ర కవచుని, శిష్ట–ఏకకంకటమ్ = ఒక కవచము మిగిలిన వానిగా చేసి(కం దేహం కటతి ఆవృణోతి దేహమును కప్పునది. కవచము), సలీలమ్ = అవలీలగా, న్యహతాం= సంహరించారు.

**తాత్పర్యము:** వేయి సంవత్సరాల తపస్సుతో మరియు వేయి సంవత్సరాల యుద్ధంతో కాని జయించలేని వేయి కవచములతో కూడుకున్న సహస్రకవచుడు అను రాక్షసుని సంహరించుట కొరకు మీరు యుద్ధం చేసారు. నరనారాయణులైన మీ ఇద్దరిలో ఒకరు తపస్సు చేస్తుండగా వేరొకరు యుద్ధము చేసారు. చివరకు ఆ సహస్ర కవచ రాక్షసుని ఒక కవచము మిగిలిన వానిగా చేసి అవలీలగా సంహరించారు.

**16-4 శ్లో.**

**అన్వాచరన్నుపదిశన్నపి మోక్షధర్మం**
**త్వం భ్రాతృమాన్ బదరికాశ్రమ మధ్యవాత్సీః ।**
**శక్రోఽథ తే శమతపోబలనిస్సహాత్మా**
**దివ్యాంగనా పరివృతం ప్రజిఘాయ మారమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, మోక్షధర్మమ్= నివృత్తి లక్షణ ధర్మాన్ని,

అను–ఆచరన్= లోక సంగ్రహణార్థము స్వయముగా అనుష్ఠించుచూ, ఉపదిశన్–అపి = దానిని కోరుకొను నారదాదులకు ఉపదేశించుచూ, త్వం = నారాయణుడవయిన నువ్వు, భ్రాతృమాన్= సోదరుడయిన నరునితో (భరతి హరతి భాగమ్ ప్రకాశించువాడు సహోదరుడు, భాగమును భరించువాడు), బదరిక–ఆశ్రమ మధ్యవార్త్సీః= బదరికాశ్రమములో తిరుగుతుండగా, తే శమ= నీయొక్క ఇంద్రియ నిగ్రహము (శామ్యతి తస్య భావః– శాంతి ఉపశమనము ఇంద్రియనిగ్రహము), తపోబల= తపో బలముతో, నిస్సహాత్మా=ఈర్ష్యాయుక్తమైన ఆత్మ కలిగిన, శక్రః= ఇంద్రుడు (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు, దివ్యా–అంగనా పరివృతం= దివ్య స్త్రీల తో కూడుకున్న (దివ్యా అంగనా స్వర్గస్త్రీ. అప్సర అందమైన స్త్రీ), మారమ్= మన్మథుని (మారయతి మ్రియంతే ప్రాణినః అనేన చంపువాడు. ఇతని వలన ప్రాణులు చనిపోవును. మన్మథుడు), ప్రజిఘాయ= మీ తపోనాశనము కొరకు పంపించెను.

**తాత్పర్యము:** బదరికాశ్రమ మధ్య ప్రాంతములో నరనారాయణులయిన మీ సోదరులు సంచరిస్తూ బ్రహ్మ జ్ఞానాన్ని ఆచరిస్తూ, ఉపదేశిస్తూ ఉన్నారు. అటుపిమ్మట మీయొక్క ఇంద్రియ తపో బలమునకు ఈర్ష్య కలిగిన ఇంద్రుడు దివ్య స్త్రీల తో కూడుకున్న మన్మథుని మీ తపస్సు నాశనం చేయటానికి పంపాడు

**16–5 శ్లో.**

**కామో వసంతమలయానిలబంధుశాలీ**
**కాంతాకటాక్షవిశిఖైర్వికసద్విలాసైః ।**
**విధ్యన్ముహుర్ముహురకంపముదీక్ష్య చ త్వాం**
**భీతస్త్వయాథ జగదే మృదుహాసభాజా ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, వసంత= వసంతుడు (వసంతి అత్ర మదనోత్సవాః మదనోత్సవములు కలది. వసంతర్తువు), మలయ–అనిల= మలయా నిలము(మలయస్య అనిలః మలయానిలము. మలయ పర్వతపు గాలి), బంధుశాలీ=తనకుసహాయకులుగాకలిగిన(బధ్నాతిమనః స్నేహాదినా స్నేహాదులచే

మనస్సును బంధించువాడు. బంధువు), కామః = మన్మథుడు (కామ్యతే అసౌ కామము, కోరిక మన్మథుడు), కాంతా= అప్సర స్త్రీల యొక్క, వికసత్ – విలాసైః= వికసించిన విలాసవంతమైన భ్రూ చలనాదులతో కూడిన, కటాక్షవిశిఖైః = మనోహరమైన చూపులనే బాణాలను, ముహుః –ముహుః = మాటిమాటికి, విధ్యన్= మీపై ప్రయోగించాడు, అకంపమ్= అయినప్పటికీ ఏమాత్రము సమాధి స్థితి నుండి చలింపని, త్వాం= మిమ్ములను, ఉదీక్ష్య చ = చూసి, భీతః= భయపడిన ఇంద్రునితో, మృదుహాసభాజాః= మందహాసం చేస్తూ, త్వయా= నీచేత (ఈ విధంగా), జగదే= చెప్పబడింది.

**తాత్పర్యము:** మన్మథుడు వసంతుడు మరియు మలయా నిలము తనకు సహాయకులుగా రాగా,అప్సర స్త్రీల యొక్క వికసించిన విలాసవంతమైన మనోహరమైన చూపులనే బాణాలను మాటిమాటికి మీపై ప్రయోగించాడు. అయినప్పటికీ ఏమాత్రము చలింపని మిమ్ములను చూసి మన్మథుడు వణికి పోయాడు .అప్పుడు ఆ మన్మథుని చూసి మందహాసం చేస్తూ నారాయణుడవైన నీవు ఇలా చెప్పావు.

**16–6 శ్లో.**

**భీత్యాలమంగజ వసంత సురాంగనా వో**
**మన్మానసం త్విహ జుషధ్వమితి బ్రువాణః ।**
**త్వం విస్మయేన పరితః స్తువతా మథైషాం**
**ప్రాదర్శయః స్వపరిచారకకాతరాక్షీః ॥**

**ప్రతిపదార్థము:** అంగజ వసంత సుర–అంగనాః= ఓ మన్మ థా! ఓ మాధవ! ఓ దేవతా స్త్రీ లారా!, వః భీత్యా అలమ్ =మీరందరూ భయపడకండి, ఇహ=ఇక్కడకు వచ్చి, మత్ మానసం తు = నా మనసుని (మన ఏవ మానసమ్ మనస్సు), జుషధ్వమ్= అలరించండి, ఇతి =అని, బ్రువాణః=చెప్పి, త్వం =నువ్వు, పరితః = కొంచెంగా వారి సమీపమునకు వెళ్ళి, ఏషాం స్తువతామ్ = వారి పొగడ్తలను దయతో విని, స్వపరిచారక కాతర–అక్షీః= నీ సేవ చేయుచున్న విలాసినుల ను యోగబలముతో సృష్టించి, ప్రాదర్శయః =వారికి చూపించావు.

**తాత్పర్యము:** ఓ మన్మ థా! ఓ మాధవ! ఓ దేవతా స్త్రీ లారా! మీరందరూ వచ్చి నా మనసుని అలరించండి. అని వారి పొగడ్తలను దయతో విని వారందరికీ నీ సేవ చేయుచున్న విలాసినుల ను సృష్టించి చూపించావు.

**విశేషాలు:**

**మత్ మానసం తు జుషధ్వమ్**

ఈ వాక్యానికి మూడు అర్థాలను సంస్కృత వ్యాఖ్యాతలు చెప్పారు.

1. నా మనసుని అలరించండి లేదా 2. సత్కారాన్ని స్వీకరించండి.

3. స్వర్గంలో కానీ లభించనటువంటి నేను ఇచ్చే స్త్రీ రత్నాలను స్వీకరించండి

**16-7 శ్లో.**

**సమ్మోహనాయ మిలితా మదనాదయస్తే**
**త్వద్దాసికాపరిమళైః కిల మోహమాపుః ।**
**దత్తాం త్వయా చ జగృహుస్త్రపయైవ సర్వ-**
**స్వర్వాసిగర్వశమనీం పునరుర్వశీం తామ్ ॥**

**ప్రతిపదార్థము:** తే సమ్మోహనాయ= నిన్ను సమ్మోహన పరచు టకు(సం అధికం మోహయతి తస్య భావః కర్మ వా మోహింప చేయుట ముగ్ధుని చేయుట), మిలితాః= అక్కడకు వచ్చి కలుసుకున్న, మదన- ఆదయః= మదనుడు మొదలైనవారు (మదయతిమత్తెక్కించువాడు. కామదేవుడు), త్వత్ దాసికాః= నీ చేత సృష్టించబడిన విలాసినులయిన దాసీ జనముల యొక్క శరీరములపై రాసుకున్న(దాస్యతే దీయతే అన్నాదికం అస్యై అన్నాదులు ఈమెకు ఇవ్వబడును. దాసి), పరిమళైః = సువాసనలకు, మోహమ్= మోహము, ఆపుః కిల= పొందిరి కదా, సర్వః- స్వర్వాసిగర్వశమనీం= స్వర్గ లోకములో ఉంటున్న సమస్తమైన వారి గర్వము తగ్గిపోయేటట్లుగా, పునః ఊర్వశీం = నువ్వు కొత్తగా సృష్టించిన, తామ్= ఆ ఊర్వశి, త్వయా =నీ చేత, దత్తాం = వారికి ఇవ్వబడగా, త్రపయా ఏవ = సిగ్గుతో, జగృహుః= ఆమెను మిగతా విలాసినులతో పాటు తీసుకొని పోయిరి.

**తాత్పర్యము:** నిన్ను సమ్మోహన పరచుటకు అక్కడకు వచ్చి కలుసుకున్న మదనుడు మొదలైనవారునీ చేత సృష్టించబడిన విలాసినుల యొక్క యొక్క దాసి జనముల యొక్క శరీరములపై రాసుకున్న పరిమళముల వాసనకు మోహము పొందిరి కదా! సమస్తమైన వారి గర్వము తగ్గిపోయేటట్లుగా నువ్వు కొత్తగా సృష్టించిన ఒక ఊర్వశి నీ చేత దేవతలకు ఇవ్వబడగా సిగ్గుతో ఆమెను మిగతా విలాసినులతో పాటు తీసుకొని పోయిరి.

**16-8 శ్లో.**

**దృష్ట్వోర్వశీం తవ కథాం చ నిశమ్య శక్రః**
**పర్యాకులోఽజని భవన్మహిమావమర్శాత్ ।**
**ఏవం ప్రశాంతరమణీయతరాఽవతారాత్**
**త్వత్తోఽధికో వరద! కృష్ణతనుస్త్వమేవ ॥**

**ప్రతిపదార్థము:** ఊర్వశీం = మీ చేత సృష్టించబడిన ఊర్వశిని(ఊరుం అశ్నుతే- నారాయణుని తొడయందు పుట్టినది), దృష్ట్వా = చూసి, తవ కథాం చ= నీ యొక్క వృత్తాంతాన్ని, నిశమ్య= విని, భవత్ –మహిమ –అవమర్శాత్= నీ గొప్పతనాన్ని తెలుసుకొన్న, శక్రః= ఇంద్రుడు, పర్యాకులః అజని = సిగ్గు పడ్డాడు.( పర్యాకులః= అత్యంతం ఆకులః ఉద్విగ్నః మలినం చ- తొట్రుపాటు కలవాడు అవ్యవస్థుడు మలినమైనవాడు), వరద!= ఓ వరములిచ్చే వాడా! గురువాయూరు దేవా!, ఏవం= ఇటువంటి, త్వత్తః అధికః= నీ ఈ నారాయణావతారముకంటె అధికమైన, ప్రశాంత= ప్రశాంతమైనది (అతిశయేన శాంతః మిక్కిలి శాంతి కలిగినది. శాంతమైనది), రమణీయతర – అవతారాత్= రమణీయమైన అవతారము (రమణీయ=రంతుం యోగ్యా రమించుటకు యోగ్యమైనది), త్వమ్ కృష్ణతనుః ఏవ =నీ కృష్ణ అవతారము మాత్రమే.( కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు).

**తాత్పర్యము:** మీ చేత సృష్టించబడిన ఊర్వశిని చూసి నీ యొక్క వృత్తాంతాన్ని విని నీ గొప్పతనాన్ని తెలుసుకోలేక పోయినందుకు ఇంద్రుడు సిగ్గు పడ్డాడు. ఓ వరములిచ్చే వాడా! గురువాయూరుదేవా! ఇటువంటి నీ ఈ నారాయణావతారము

కంటె అధికమైన ప్రశాంతమైనది రమణీయమైన ది నీ కృష్ణ అవతారము మాత్రమే.

**16-9 శ్లో.**

**దక్షస్తు ధాతురతిలాలనయా రజోంఽధో**
**నాత్యాదృతస్త్వయి చ కష్టమశాంతిరాసీత్ ।**
**యేన వ్యరుంధ స భవత్తనుమేవ శర్వం**
**యజ్ఞే చ వైరపిశునే స్వసుతాం వ్యమానీత్ ॥**

**ప్రతిపదార్థము:** దక్షః తు= దక్షుడు, ధాతుః= బ్రహ్మ చేయు, అతిలాలనయా= గారాముకు (అతిచనువుకు), రజః-అంధః= రజోగుణము చేత గుడ్డివాడయి(కన్ను మిన్ను గానక వివేక శూన్యుడయ్యాడని భావం) (లాలయతి స్నిహ్యతి తస్య భావః కర్మ వా లాలనము, స్నేహము), త్వయి చ= నీయందు కూడా, న—అతి-ఆదృతః= నిరాదరుడై (ఉపేక్షితుడై) (ఆదృతః సమ్మానితః పూజితః-ఆదరింపబడువాడు సమ్మానింపబడువాడు ఉత్సాహవంతుడు), కష్టమ్ - అశాంతిః - ఆసీత్= అశాంతి,ఓర్పు లేకపోవుట మొదలగు గుణములకు నిలయుడయ్యాడు, యేన = అశాంతిత్వముచే, సః= ఆ దక్షుడు, భవత్ తనుమ్ ఏవ= నీ మూర్తియే యైన (తనోతి తన్యతే వా విస్తరించునది పెరుగునది. శరీరము), శర్వం= శివుని పట్ల, వ్యరుంధ= ద్వేషము కలవాడయ్యాడు, యజ్ఞే చ= దక్ష యజ్ఞములో, వైరపిశునే= తనకు శివునికి మధ్య ఉన్న వైర పిశునములో (పిశున= పింశతి పిశ్యతే చెవిలో ఊదువాడు. దుష్టుడు క్రూరుడు అధముడు పిండి చేయబడునది), స్వసుతాం= తన కూతురు సతీదేవిని (శివుని భార్య), వ్యమానీత్= అవమానించాడు.

**తాత్పర్యము:** దక్షుడు బ్రహ్మ చేయు గారాముకు రజోగుణము చేత గుడ్డివాడయి నీయందు కూడా ఉపేక్షితుడై అశాంతి,ఓర్పు లేకపోవుట మొదలగు గుణములకు నిలయుడయ్యాడు. అశాంతితో ఆ దక్షుడు నీ మూర్తియే యైన శివుని పై ద్వేషము కలవాడయ్యాడు. దక్ష యజ్ఞములో తనకు శివునికి మధ్య ఉన్న వైర పిశునములో తన కూతురు సతీదేవిని అవమానించాడు.

**16-10 శ్లో.**

**కృద్ధేశమర్దితమఖః స తు కృత్తశీర్షో**
**దేవప్రసాదితహరాదథ లబ్ధజీవః ।**
**త్వత్పూరితక్రతువరః పునరాప శాంతిం**
**స త్వం ప్రశాంతికర! పాహి మరుత్పురేశ ॥**

**ప్రతిపదార్థము:** మరుత్పరేశ = ఓ గురు వాయూరు దేవా!, కృద్ధ= కోపించిన, ఈశ = శివునితో(ఈశ = ఐశ్వర్యే), మఖః= యజ్ఞము (మఖంతి గచ్ఛంతి దేవాః అత్రదేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము, యాగము పూజ్యుడు), మర్దితః= ధ్వంసం చేయబడినది (మర్దితః చూర్ణితః గ్రథితో వా–మర్దించబడినది చూర్ణించబడినది), స తు= స్వయముగా ఆ దక్షుడు, కృత్తశీర్షః= తల తుంచబడినవాడయ్యాడు.( కృత్తం ఛిన్నమ్ ఛేదించబడినది), అథ =అటుపిమ్మట, దేవప్రసాదిత= దేవతల ప్రార్థనపై, హరాత్ = తల హరించబడినప్పటికి (హరునివల్ల), లబ్ధజీవః= మేక తలను అతికించి మరలా బతికించావు, త్వత్ పూరిత = నీచేత పూర్తి చేయబడిన యజ్ఞముచే, క్రతువరః= దక్షుడు ( క్రతువునకువరుడు), పునః శాంతిం= మరలా శాంతిని, ఆప= పొందాడు, ప్రశాంతికర!= ప్రశాంతిని కలిగించే వాడా ! (అతిశయేన శాంతః – మిక్కిలి శాంతి కలిగినది. శాంతమైనది), స త్వం =అటువంటి శక్తి శాలివైన నువ్వు, పాహి = రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురు వాయూరు దేవా! కోపించిన శివునితో యజ్ఞము ధ్వంసం చేయబడినది .స్వయముగా ఆ దక్షుడు తల తుంచబడినవాడయ్యాడు.అటుపిమ్మట దేవతల ప్రార్థనపై తల హరించబడినప్పటికి మేక తలను అతికించి మరలా బతికించావు. నీచేత పూర్తి చేయబడిన యజ్ఞముచే దక్షుడు మరలా శాంతిని పొందాడు.ప్రశాంతిని కలిగించే వాడా! అటువంటి శక్తి శాలివైన నువ్వు నన్ను రక్షించు.

**చతుర్థ స్కంధము**

**16వ దశకము సమాప్తము**

# దశకమ్ 17 – ధ్రువచరితము

**17–1 శ్లో.**

**ఉత్తానపాదనృపతేర్మనునందనస్య**
**జాయా బభూవ సురుచిర్నితరామభీష్టా ।**
**అన్యా సునీతిరితి భర్తురనాదృతా సా**
**త్వామేవ నిత్యమగతిశ్శరణం గతాఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** మను నృపతేః = స్వాయం భువుడను మనువు యొక్క, నందనస్య= కుమారుడైన (నందయతి సంతోషపెట్టువాడు. కుమారుడు), ఉత్తానపాద= ఉత్తాన పాదుడను పేరుగలవానికి ( ప్రియ వ్రతుని తమ్ముడు), జాయా= ఇద్దరు భార్యలు (జాయతే జన్యతే వా అపత్యమ్ ఈమెయందు సంతానము పుట్టును. భార్య), బభూవ = ఉన్నారు, సురుచిః= వారిలో సురుచి భార్యయందు ( రుచి=రోచతే శోభతే ప్రకాశము, కాంతి, కోరిక, అభిలాష), నితరామ్= ఎక్కువగా (నితరాం అతిశయం సర్వదా మిక్కిలి ఎల్లప్పుడు), అభీష్టా= ఇష్టము, సునీతిః ఇతి = సునీతి అను(సుష్ఠు నీతిః యస్యాఃమంచి నీతి కలది. ధ్రువుని తల్లి), అన్యా =ఇంకొక (రెండవ భార్య), భర్తుః= భర్త చేత, అనాదృతా= ఆదరింపబడలేదు. (ఇష్టురాలు కాలేదు), సా అగతిః =(అందువల్ల) అశరణురాలైన ఆమె, త్వామ్ ఏవ= నువ్వే, నిత్యమ్= నిత్యము(నియతం ధ్రువం నిరంతరము ఎల్లప్పుడు త్రికాలములో వుండునది), శరణం గతా —అభూత్= శరణమని సేవించింది.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! స్వాయం భువుడను మనువు యొక్క కుమారుడైన ఉత్తాన పాదుడను పేరుగలవానికి ఇద్దరు భార్యలు ఉన్నారు. వారిలో సురుచి అను భార్యయందు అతనికి ఎక్కువగా ఇష్టము.సునీతి అను రెండవ భార్య భర్త చేత ఆదరింపబడలేదు. అందువల్ల సునీతి నిత్యము నువ్వే శరణమని సేవించింది. (నిజ దౌర్భాగ్య హేతు దురిత శమనము కొరకు ఈశ్వరుడైన నారాయణుని సేవించిందని భావం)

**17-2 శ్లో.**

**అంకే పితుస్సురుచిపుత్రకముత్తమం తం**
**దృష్ట్వాధ్రువః కిల సునీతిసుతోఽధిరోక్ష్యన్ ।**
**ఆచిక్షిపే కిల శిశుః సుతరాం సురుచ్యా**
**దుస్సంత్యజా ఖలు భవద్విముఖైరసూయా ॥**

**ప్రతిపదార్థము:** పితుః అంకే = తన తండ్రిగారి తొడపై, సురుచిపుత్రకమ్ = సురుచి కుమారుడైన, తమ్-ఉత్తమం = ఆ ఉత్తముని, దృష్ట్వా= చూసి, సునీతిసుతః ధ్రువః= సునీతి కుమారుడగు ధ్రువుడు, అధిరోక్ష్యన్ కిల= తానుకూడా తండ్రిఒడిలో కూర్చుండవలెనని ఉబలాటపడెను కదా!, సుతరాం= ఏ మాత్రం ఆ పనికి ఒప్పుకోని, సురుచ్యా = సురుచి చేత, శిశుః = ఆ శిశువు(ధ్రువుడు), ఆచిక్షిపే= గట్టిగా చెడు మాటల తో వారింపబడెను, భవత్ — విముఖైః= నీ పట్ల విముఖులైన భక్తులు, అసూయా= అసూయను (అసూయతి నిందతి తస్య భావః - అసూయ నిందించుట), దుస్సంత్యజాః ఖలు= విడుచుటకు అశక్తులు కదా (తొలగించు కోలేరు కదా).

**తాత్పర్యము:** ఒకరోజు సింహాసనం ఎక్కి ఉన్న తన తండ్రిగారి తొడపై సురుచి కుమారుడైన ఉత్తముని చూసి సునీతి కుమారుడైన కూడా ధ్రువుడు తాను కూడా తొడ పై ఎక్క బోయెను. అప్పుడు సురుచి ఆ శిశువుని గట్టిగా చెడు వాక్యముల తో వారించెను. నీ పట్ల విముఖులైన భక్తులు అసూయను తొలగించు కోలేరు కదా.

**విశేషాలు:** ఇందువల్ల సురుచి యొక్క ఈశ్వర విముఖత పుత్ర నాశనమునకు సునీత యొక్క ఈశ్వర శరణము తన కుమారుని ధ్రువ పదమునకు కారణమయ్యాయని వ్యంగ్యంగా కవిచెప్పారు.

**17-3 శ్లో.**

**త్వన్మోహితే పితరిపశ్యతి దారవశ్యే**
**దూరం దురుక్తినిహతః స గతో నిజాంబామ్ ।**

**సాఽపి స్వకర్మగతిసంతరణాయ పుంసాం**
**త్వత్పాదమేవ శరణం శిశవే శశంస ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ –మోహితే= నీయొక్క మాయలోపడి, దారవశ్యే = భార్య వశము లో ఉన్న (అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము దార), పితరి= తన తండ్రిని, పశ్యతి = చూసి, దూరం = కష్టంగా పొందబడు (దుర్+ఇణ్+రక్, దుఃఖేన హీయతే – ప్రాప్యతే కష్టంగా పొందబడునది. దూరము అగోచరము), దురుక్తినిహతః= సవతి తల్లి యొక్క చెడు మాటలచే హింసింపబడిన (దుష్టం ఉక్తం వచనమ్ చెడ్డమాట శాపము). (నితరాం హతః హింసితః–హింసింపబడినవాడు), సః= ధ్రువుడు, నిజ–అంబామ్= తన తల్లి అయిన సునీతి దగ్గరకు, గతః= వెళ్లెను, సా–అ పి= ఆమె కూడా, స్వకర్మగతి= దుష్కర్మ ఫలితమైన దౌర్భాగ్యమును, సంతరణాయ= అనాయాసముగా దాటుటకు, పుంసాం= జీవులకు, త్వత్ –పాదమ్–ఏవ= నీ (శ్రీహరి) పాదమే, శరణం = శరణమని, శిశవే = తన శిశువైన ధ్రువునకు, శశంస= అనునయించి పలికెను.

**తాత్పర్యము:** నీయొక్క మాయలోపడి భార్య వశము లో తనను నిరాదరించిన తన తండ్రిని చూసి సవతి తల్లి యొక్క పలుకులు ములుకుల వలె గుచ్చుకొనగా బాధపడి తన తల్లి అయిన సునీతి దగ్గరకు ధ్రువుడు వెళ్లెను. ఆమె కూడా దుష్కర్మ ఫలితమైన దౌర్భాగ్యములను (లేదా సర్వకర్మలు) తప్పించుకొనుటకు జీవులకు శ్రీహరి పాద మే శరణమని అనునయించి పలికెను.

**17–4 శ్లో.**
**ఆకర్ణ్య సోఽపి భవదర్చననిశ్చితాత్మా**
**మానీ నిరేత్య నగరాత్ కిల పంచవర్షః ।**
**సందృష్టనారదనివేదితమంత్రమార్గః**
**త్వామారరాధ తపసా మధుకాననాంతే ॥**

**ప్రతిపదార్థము:** పంచవర్షః అపి = ఐదు సంవత్సరాల వయస్సు కలిగినప్పటికి, సః= ఆ ధ్రువుడు, ఆకర్ణ్య = తల్లి సునీత చెప్పిన మాటను విని, భవత్ అర్చన = నిన్ను

ఆరాధించుట యందు, నిశ్చిత–ఆత్మా= నిశ్చయమైన మనసు కలిగి, మానీ = అభిమానము కలిగిన వాడై, నగరాత్ నిరేత్య కిల = నగరము నుండి బయటకు వచ్చెను కదా, నారద సందృష్టః = దారిలో నారదుని చే చూడబడిన వాడై, మంత్రమార్గః నివేదితః= అతని ద్వారా నీ మంత్రోపదేశం పొంది (మననేన త్రాయతే మననము చేస్తే రక్షించునది. వేదమంత్రము), మధుకాననాంతే= మధువనమను ప్రసిద్ధ దేశములో, త్వామ్= నిన్ను గురించి, తపసా ఆరరాధ = తపస్సు చేయుట మొదలు పెట్టెను.

**తాత్పర్యము:** ఐదు సంవత్సరాల వయస్సు కలిగిన ఆ అభిమానవంతుడైన ధ్రువుడు తల్లి సునీత చెప్పిన మాటను విని నిన్ను ఆరాధించుట యందు నిశ్చయమైన మనసు కలిగిన వాడై నగరము నుండి బయటకు వచ్చెను. దారిలో నారదుని చూసి అతని ద్వారా నీ మంత్రోపదేశం పొంది మధువనమను ప్రసిద్ధ దేశములో నీ గురించి తపస్సు చేయుట మొదలు పెట్టెను.

**17–5 శ్లో.**
**తాతే విషణ్ణహృదయే నగరీం గతేన**
**శ్రీనారదేన పరిసాంత్వితచిత్తవృత్తౌ ।**
**బాలస్త్వదర్పితమనాః క్రమవర్ధితేన**
**నిన్యే కఠోరతపసా కిల పంచమాసాన్ ॥**

**ప్రతిపదార్థము:** తాతే = ఉత్తాన పాదుడు (తాత= తనోతి విస్తారయతి గోత్రాదికమ్ వంశమును విస్తరించువాడు. తండ్రి), నగరీం గతేన= కుమారుడైన ధ్రువుడు నగరాన్ని విడిచిపెట్టిన విషయాన్ని విని, విషణ్ణహృదయే= బాధ పడుచూ, శ్రీనారదేన = తండ్రిగారి దర్శనము కొరకు నగరానికి వచ్చిన నారదుని చేత, పరిసాంత్విత = ధ్రువునికి జరుగబోవు మేలు మొదలయినవి విని సాంత్వన పొందిన(సాంత్వయతి అసౌ ఓదార్చునది ఓదార్పు), చిత్తవృత్తౌ= మనస్సు కలవాడయ్యాడు, (ఏవం స్థితే సతి= ఇలా ఉండగా), బాలః = బాలుడైన ధ్రువుడు(బలతి ప్రాణితి వృద్ధి మాప్నోతి వృద్ధి పొందువాడు. శిశువు), త్వత్ = ఈశ్వరుడవైన నీయందు, అర్పితమనాః= అర్పించిన మనస్సు కలవాడయి,

క్రమవర్ధితేన= ఫల పర్ణ జల మాత్రములు మొదట స్వీకరించి క్రమముగా వాయుభక్షణముతో నిరాహారుడై తపస్సును వర్ధిల్ల చేసి, పంచమాసాన్= అయిదు నెలలు, కఠోరతపసా= కఠోర తపస్సు, నిన్యే కిల = చేసాడు కదా!

**తాత్పర్యము:** ఉత్తాన పాదుడు కుమారుడైన ధ్రువుడు నగరాన్ని విడిచిపెట్టిన విషయాన్ని విని బాధ పడుచూ తండ్రిగారి దర్శనము కొరకు నగరానికి వచ్చిన నారదుని చేత ధ్రువునికి రాబోవు కాలములో జరుగబోవు మేలు మొదలయినవి విని ఓదార్పు పొందిన మనస్సు కలవాడయ్యాడు. ధ్రువుడు ఈశ్వరుడవైన నీయందు అర్పించిన మనస్సు కలవాడయి ఫల పర్ణ జల మాత్రములు మొదట స్వీకరించి క్రమముగా వాటిని వదిలి వాయుభక్షణముతో నిరాహారుడై తపస్సును వర్ధిల్ల చేసి అయిదు నెలలు కఠోర తపస్సు చేసాడు కదా!

**17-6 శ్లో.**
**తావత్ తపోబలనిరుచ్ఛ్వసితే దిగంతే**
**దేవార్థితస్త్వముదయత్కరుణార్ద్రచేతాః ।**
**త్వద్రూపచిద్రసనిలీనమతేః పురస్తాత్**
**ఆవిర్బభూవిథ విభో! గరుడాధిరూఢః ॥**

**ప్రతిపదార్థము:** విభో! = ఓ గురువాయూరు ప్రభూ!, తావత్ తపోబల= ఆ ధ్రువుని తపో బలముచే, దిక్ –అంతే =దిక్కులలో, నిః–ఉచ్ఛ్వసితే = ఉచ్ఛ్వాస నిశ్వాసములు కట్టు పడగా ( ఉచ్ఛ్వాసః ఉచ్చైః శ్వాసగ్రహణమ్ ఉచ్ఛ్వాసము), దేవ–అర్థితః= దేవతల చేత ప్రార్థింపబడి, త్వమ్– ఉదయత్– కరుణ–ఆర్ద్రచేతాః= నీలో ఉదయించిన దయార్ద్ర భావముతో, గరుడ–అధిరూఢః= గరుడ వాహనము ఎక్కి (గరుద్భ్యాం పక్షాభ్యాం ఉడ్డయతేరెక్కలతో ఎగురునది. గరుడ పక్షి గరుత్మంతుడు), త్వత్ –రూప చిత్–రస= నీ రూపమైన సచ్చిదానందమందు, నిలీన= లీనమైన, మతేః=మనస్సు కలిగిన ధ్రువుని, పురస్తాత్= ఎదుట, ఆవిర్బభూవిథ = ఆవిర్భవించావు. (సాక్షాత్కరించావు).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు ప్రభూ! ఆ ధ్రువుని తపో బలముచే దిక్కులలో

ఉచ్ఛ్వాస నిశ్వాసములు కట్టు పడగా దేవతల చేత ప్రార్థింపబడి ఉదయించిన దయతో గరుడ వాహనము ఎక్కి నీ రూపమైన సచ్చిదానందమందు లీనమైన మనస్సు కలిగిన ధ్రువుని ఎదుట సాక్షాత్కరించావు

**విశేషాలు:** చిద్రూపము– (సచ్చిదానందము) వివరణ మొదటి దశకములోని మొదటి శ్లోక విశేషాలలో ఉన్నది.

**17–7 శ్లో.**

**త్వద్దర్శనప్రమదభారతరంగితం తం**
**దృగ్భ్యాం నిమగ్నమివ రూపరసాయనే తే ।**
**తుష్టూషమాణమవగమ్య కపోలదేశే**
**సంస్పృష్టవానసి దరేణ తథాఽఽదరేణ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ = నీయొక్క, దర్శనప్రమదభారతరంగితం= దర్శనముచే కలిగిన సంతోషతరంగాలలో తేలియాడుతున్న (దృశ్యతే అనేన – దీనితో చూచుదురు. దర్శనము), తే రూపరసాయనే = నీ రూప రసాయనములో (సౌందర్య మను అమృతములో)(రసా రసరక్తాదయః ఈయంతే ప్రాప్యంతే అనేన శరీర ధాతువులను చక్కబరచునది రసాయనము), దృగ్భ్యాం= చూపులచే, నిమగ్నమ్ – ఇవ= మునిగిన కన్ను దోయి కలిగిన వాడివలె ఉన్న, తుష్టూషమాణమ్= స్తోత్రము చేయగోరినప్పటికి ఆనందంలో మాట రాక అసమర్థుడైన, తం=ఆ ధ్రువుని, అవగమ్య=దగ్గరకు వెళ్లి, దరేణ= పాంచ జన్య శంఖముతో (దీర్యతే హృదయం అనేన–దీనితో హృదయం చీల్చబడును. శంఖము), కపోలదేశే= అతని పాలబుగ్గలపై(కంపతే అసౌ కదలునది. చెక్కిలి, చెంప), ఆదరేణ= అదరముతో, సంస్పృష్టవానసి = తాకినవాడవయ్యావు.

**తాత్పర్యము:** నీయొక్క దర్శనముచే కలిగిన సంతోషతరంగాలలో తేలియాడుతూ నీ సౌందర్య మను అమృతములో మునిగిన కన్ను దోయి కలిగి (అనగా అదే పనిగా చూస్తూ ) స్తోత్రము చేయగోరినప్పటికి ఆనందంలో మాట రాక అసమర్థుడైన ఆ

ధ్రువుని దగ్గరకు వెళ్లి శబ్ద బ్రహ్మ రూపమైన పాంచ జన్య శంఖముతో అతని పాలబుగ్గలపై అదరముతో తాకావు.

**విశేషాలు:**

**పాంచజన్యము:** సాందీపుని పుత్రుని ప్రభాసతీర్థములోనికి తీసికొనిపోయిన రాక్షసుడు పంచజనుడు. వీఁడు తన గురుపుత్రుని కొనిపోయెను అని కృష్ణుడు వీనిని చంపి వీని మెడ యెముకను పుచ్చుకొనెను. అదియే పాంచజన్యము అనఁబడిన కృష్ణుని శంఖము.

అయితే ఇక్కడ ఒక మాట.

సాందీపుని పుత్రుని ప్రభాసతీర్థములోనికి తీసికొనిపోయిన రాక్షసుడు పంచజనుడు. వీడు తన గురుపుత్రుని తీసుకుపోయాడని కృష్ణుడు వీనిని చంపి వీని మెడ ఎముకను తీసుకొన్నాడు. . అదే పాంచజన్యము అనే పేరుతో పిలిచే కృష్ణుని శంఖము. విష్ణువు ఎత్తిన అవతారాల నుండి ఆయా అవతారాలకు సంబంధించిన వస్తువులు ఏవీ – అవతారాల చివర విష్ణువు దగ్గరకు చేరినట్లు నేను చదువుకోలేదు. కాని కృష్ణావతారానికి సంబంధించిన పాంచ జన్యం మాత్రం విష్ణువు ధరించాడు.

**17-8 శ్లో.**
**తావద్విబోధవిమలం ప్రణువంతమేనం**
**ఆభాషథాస్త్వమవగమ్య తదీయభావమ్ ।**
**రాజ్యం చిరం సమనుభూయ భజస్వ భూయః**
**సర్వోత్తరం ధ్రువపదం వినివృత్తిహీనమ్ ॥**

**ప్రతిపదార్థము:** తావత్ = శబ్ద బ్రహ్మ రూపమైన పాంచ జన్య శంఖముతో అతని పాలబుగ్గలపై అదరముతో తాకగా, విబోధ= జ్ఞాన విజ్ఞానములతో (పరిశుద్ధ జ్ఞానము, సారస్వత సంపద) (విబోధ=విశిష్టః బోధః జ్ఞానం జాగరణమ్ విశిష్టమైన జ్ఞానము, ప్రత్యక్ష జ్ఞానము), విమలం= పోయిన అజ్ఞానముతో స్వచ్ఛత పొంది (విగతః మలః యస్మాత్ నిర్మలమైనది, స్వచ్ఛమైనది), ప్రణువంతమ్= నిన్ను పొగడు, ఏనం= అతనిని, తదీయభావమ్ = ధ్రువ సంబంధమైన అభిప్రాయాన్ని

(హృదయాన్ని), త్వం= నువ్వు, అవగమ్య= గ్రహించి, ఆభాషథాః= ఈ విధముగా పలికితివి, ధ్రువ = ఓ ధ్రువా! (ధ్రువతి స్థిరీభవతి స్థిరంగా వుండునది. ధ్రువుడు), చిరం = చాలా కాలము (చిరకాలః–చాలా కాలము), రాజ్యం=రాజ్యమును, సమనుభూయ= అనుభవించి( పాల న చేసి), భూయః= మరలా, సర్వ–ఉత్తరం= సప్తర్షి లోకము కంటె పైన ఉన్న (ఉత్తరః ఉచ్చతరః–ఉన్నతమైనది. శ్రేష్ఠమైనది ఉన్నతమైనది), వినివృత్తిహీనమ్= పునరావృత్తి రహితమైన(జన్మలులేని) (విశిష్టా నివృత్తిః విశ్రాంతిః సమాప్తిఃవిశ్రాంతి సమాప్తి), పదం = ధ్రువ పదమును (ప్రళయంలోను చలింపని లోకము)( పద్యతే స్థానము), భజస్వ= సేవింపుము.

**తాత్పర్యము:** శబ్ద బ్రహ్మ రూపమైన పాంచ జన్య శంఖముతో అతని పాలబుగ్గలపై అదరముతో తాకగా జ్ఞాన విజ్ఞానములతో (పరిశుద్ధ జ్ఞానము, సారస్వత సంపద) స్వచ్ఛత పొంది నిన్ను పొగడు ధ్రువ సంబంధమైన అభిప్రాయాన్ని(హృదయాన్ని) నువ్వు గ్రహించి ఈ విధముగా పలికితివి. ఓ ధ్రువా! చాలా కాలము రాజ్యమును పాలన చేసి మరలా సప్తర్షి లోకము కంటె పైన ఉన్న జన్మలులేని ప్రళయంలోను చలింపని లోకమును సేవింపుము.

**17–9 శ్లో.**

**ఇత్యూచుషి త్వయి గతే నృపనందనోఽసౌ**
**ఆనందితాఖిలజనో నగరీముపేతః ।**
**రేమే చిరం భవదనుగ్రహపూర్ణకామః**
**తాతే గతే చ వనమాదృతరాజ్యభారః ॥**

**ప్రతిపదార్థం:** ఇతి–ఊచుషి = పై విధంగా చెప్పి, త్వయి గతే= నువ్వు అంతర్ధానమయిన పిదప, అసౌ= ఈ, నృపనందనః = రాజకుమారుడైన ధ్రువుడు (నౄన్ నరాన్ పాతి రక్షతి నరులను రక్షించువాడు. రాజు), ఆనందిత–అఖిలజనః= అందరు ప్రజలు ఆనందించుచుండగా, నగరీమ్=తన నగరానికి (అల్పం నగరీ చిన్న పట్టణము పట్టణము), ఉపేతః= చేరుకొన్నాడు, తాతే వనమ్ గతే చ = తండ్రి ఉత్తాన పాదుడు వానప్రస్థాశ్రమానికి అడవికి వెళ్ళగా, రాజ్యభారః= రాజ్య భారమును, ఆదృత=స్వీకరించి (ఆదృతః సమ్మానితః పూజితః ఆదరింపబడువాడు

సమ్మానింపబడువాడు ఉత్సాహవంతుడు), భవత్ అనుగ్రహపూర్ణకామః= నీ అనుగ్రహంతో పూర్ణ కాముడై (అనుగ్రహః దుఃఖదూరకరణేచ్ఛా దయ చూపుట అనుగ్రహించుట), చిరం = చాలాకాలము, రేమే= రాజ్యపాలన చేసెను.

**తాత్పర్యము:** పై విధంగా చెప్పి నువ్వు అంతర్ధానమయిన పిదప ఈ రాజకుమారుడైన ధ్రువుడు అందరు ప్రజలు ఆనందించుచుండగా తన నగరానికి చేరుకొన్నాడు. తండ్రి ఉత్తాన పాదుడు వానప్రస్థాశ్రమానికి అడవికి వెళ్ళగా రాజ్య భారమును స్వీకరించి నీ అనుగ్రహంతో పూర్ణ కాముడై చాలాకాలము రాజ్యపాలన చేసెను.

**విశేషాలు:**

**పూర్ణకాముడు:** పొందవలసిన కోరికలు లేనివాడు. ఇది భగవత్తత్వం. భగవానుడు పూర్ణుడు పూర్ణకాముడు పరిపూర్ణుడు.

**17–10 శ్లో.**

**యక్షేణ దేవ! నిహతే పునరుత్తమేఽస్మిన్**
**యక్షైః సయుద్ధనిరతో విరతో మనూక్త్యా ।**
**శాంత్యా ప్రసన్నహృదయాత్ ధనదాదుపేతాత్**
**త్వద్భక్తిమేవ సుదృఢామవృణోన్మహాత్మా ॥**

**ప్రతిపదార్థము:** దేవ!= ఓ గురువాయూరు దేవా!, పునః= మరలా, ఉత్తమే= ధ్రువుని సోదరుడైన ఉత్తముడు (ఉత్తమః శ్రేష్ఠః ఉన్నతః ముఖ్యః–సర్వోత్తమమైనది శ్రేష్ఠమైనది ముఖ్యమైనది), అస్మిన్ యక్షేణ= ఒకానొక యక్షునిచేత (యక్ష్యతే పూజ్యతే అసౌ పూజింపబడువాడు. యక్షుడు), నిహతే= మరణించగా(నితరాం హతః హింసితః–హింసింపబడినవాడు చంపబడినవాడు), సః= ఆ ధ్రువుడు కోపముతో, యక్షైః యుద్ధనిరతః= యక్షులతో యుద్ధమునందు ఆసక్తి కలిగినవాడయ్యాడు. (వారితో యుద్ధం చేసాడని భావం) మను= పితామహుడైన మనువు యొక్క, ఉక్త్యా= మాటచే, విరతః= ధ్రువుడు యుద్ధమును విరమించాడు. (విరతః విశ్రాంతః సమాప్తః దూరీకృతః–ఆనందమునకు దూరమైనవాడు. విరాగి), శాంత్యా = ధ్రువుని యొక్క శాంతిని (యుద్ధ నివృత్తిని),

ప్రసన్నహృదయాత్= ప్రసన్న హృదయమును తెలుసుకొని, ధనదాత్ = కుబేరుడు, ఉపేతాత్= వచ్చి వరము కోరుకొమ్మనగా, మహాత్మా= మహత్ముడయిన ఆ ధ్రువుడు, సుదృఢామ్ = అచంచలమైన, త్వత్ భక్తిమ్ ఏవ = నీ భక్తినే, అవృణోత్= కోరుకొనెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ధ్రువుని సోదరుడైన ఉత్తముడు ఒకానొక యక్షునిచేత మరణించగా ఆ ధ్రువుడు కోపముతో యక్షులతో యుద్ధం ప్రకటించాడు. పితామహుడైన మనువు యొక్క మాటచే ధ్రువుడు యుద్ధమును విరమించాడు. ధ్రువుని యొక్క శాంతిని ( యుద్ధ నివృత్తిని) ప్రసన్న హృదయమును తెలుసుకొని కుబేరుడు వచ్చి వరము కోరుకొమ్మనగా మహత్ముడయిన ఆ ధ్రువుడు అచంచలమైన నీ భక్తినే కోరుకొన్నాడు.

**17-11 శ్లో.**

**అంతే భవత్పురుషనీతవిమానయాతో,**
**మాత్రా సమం ధ్రువపదే ముదితోఽయమాస్తే ।**
**ఏవం స్వభృత్యజనపాలనలోలధీస్త్వం,**
**వాతాలయాధిప! నిరుంధి మమామయౌఘాన్ ॥**

**ప్రతిపదార్థము:** వాతాలయాధిప! = ఓ గురువాయూరు దేవా!, అంతే = ఇరువది ఆరు వేల సంవత్సరాలు రాజ్య పాలన చేసిన తరువాత, పురుష = నీ అనుచరులు సునంద నందులు, నీత = తీసుకొని వచ్చిన(నీతః అపనీతః వ్యతీతః లబ్ధః- తీసుకొనబడినది పొందబడినది గడపబడినది), విమాన= విమానములో, యాతః= వెళ్ళాడు, మాత్రా సమం=తల్లియైన సునీతితో, ధ్రువపదే= ధ్రువ పదమునందు, ముదితః = సంతోషించినవాడై, అ యమ్ = ఆ ధ్రువుడు, ఆస్తే= నక్షత్ర రూపములో ఇప్పటికీ ఉన్నాడు, ఏవం = ఈ విధముగా, త్వం= నువ్వు, స్వభృత్యజనపాలనలోలధీః = తన భక్తులను సేవకులను రక్షించుటయందు ఆసక్తి కలిగినవాడివి కనుక (భ్రియతే భర్తుం యోగ్యో వా, భర్తవ్యః-భరించదగినవాడు, జీతము పొందువాడు. సేవకుడు.), మమ= సేవకుడినైన నా యొక్క, ఆమయ – ఔఘాన్= రోగ సమూహములను, నిరుంధి= తొలగించుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ఇరువది ఆరు వేల సంవత్సరాలు రాజ్య పాలన చేసిన తరువాత నీ అనుచరులు సునంద నందులు తీసుకొని వచ్చిన విమానములో ధ్రువుడు వెళ్ళాడు. తల్లియైన సునీతితో ధ్రువ పదమునందు సంతోషించినవాడై ఆ ధ్రువుడు నక్షత్ర రూపములో ఇప్పటికీ ఉన్నాడు. ఈ విధముగా నువ్వు తన భక్తులను సేవకులను రక్షించుటయందు ఆసక్తి కలిగినవాడివి కనుక సేవకుడినైన నా యొక్క రోగ సమూహములను తొలగించుము

**చతుర్ధ స్కంధము**

**17వ దశకము సమాప్తము.**



# దశకమ్ 18 – పృథుచరితము

**18-1 శ్లో.**

**జాతస్య ధ్రువకుల ఏవ తుంగకీర్తేః**
**అంగస్య వ్యజని సుతస్స వేననామా ।**
**తద్దోషవ్యథితమతిః స రాజవర్యః**
**త్వత్పాదే నిహితమనా వనం గతోఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** ధ్రువకుల = ధ్రువ కులమందు, జాతస్య = జన్మించిన(జాయతే ప్రకటీభవతి తస్య భావః కర్మ వా పుట్టుట పుట్టుక పుట్టినవాడు), తుంగకీర్తేః= ఉత్తుంగ కీర్తి అయిన ( బాగా కీర్తి కలిగిన )( తుంగ=తుజ్యతే హింస్యతే వాయ్వాదినా ఉన్నతమైనది ప్రధానమైనది.)(కీర్తి= కీర్యతే ప్రశస్యతే కీర్తి ప్రశంస పుణ్యము), అంగస్య = అంగుడను రాజునకు( ఉల్మకుని జ్యేష్ఠపుత్రుడు. భార్య సునీథ. కొడుకు వేనుడు), సః వేనః నామా=ఆ వేనుడను పేరు కలిగిన, సుతః = కుమారుడు, వి- అజని= జన్మించాడు, త త్ – దోష= ఆ వేనుడు చేయు అధార్మిక దుష్ట కార్యాలకు(దూష్యతే దూషించునది. దోషము తప్పు), వ్యథిత మతిః = బాధపడిన(వ్యథిత =పీడితః విక్షుణ్ణః పీడించబడినవాడు ఆందోళన చెందినవాడు), సః రాజవర్యః=ఆ అంగుడను రాజ శ్రేష్ఠుడు, త్వత్ –పాదే ఏవ =నీ పాదములయందు మాత్రమే, నిహితమనాః= ఉంచబడిన మనస్సు కలవాడై ( నిన్ను సేవించుటకు), వనం గతః –అ భూత్= వాన ప్రస్థాశ్రమము స్వీకరించి అడవికి వెళ్లాడు.

**తాత్పర్యము:** ధ్రువ కులమందు జన్మించిన బాగా కీర్తి కలిగిన అంగుడను రాజునకు వేనుడను పేరు కలిగిన కుమారుడు జన్మించాడు. ఆ వేనుడు చేయు అధార్మిక దుష్ట కార్యాలకు బాధపడిన ఆ అంగుడను రాజ శ్రేష్ఠుడు నీ పాదములయందు ఉంచబడిన మనస్సు కలవాడై – నిన్ను సేవించుటకు– వాన ప్రస్థాశ్రమము స్వీకరించి అడవికి వెళ్లాడు.

**విశేషాలు:** ఈదశకములో ప్రహర్షిణి ఛందస్సు ఉన్నది..

ఈ పద్య ఛందస్సుకే **మయూరపిచ్ఛ** అనే ఇతర నామము కూడా కలదు.

**మ , న , జ , ర , గ** గణములుండును.

**వేనుడు:** స్వాయంభువుని వంశస్థుడు అగు అంగుని కొడుకు. పృథుచక్రవర్తి తండ్రి. ఇతని మాత మృత్యువు పెద్దకూతురు అగు సునీథ. ఇతడు మాతామహుడు అగు మృత్యువువలె కడు క్రూరుడు అయి ప్రవర్తించుచు ఉండగా ఆక్రూరత్వము ఓర్వచాలక బ్రాహ్మణులు తమ శాపములచేత వీనిని ప్రాణహీనునిగ చేసి పిమ్మటతమ దివ్య జ్ఞానమువలన అందులకు కారణమును ఎఱిఁగి అతనికి సంతతిని కలిగించువారై అతని తొడలను ఒండొంటితో రాయగా అందుండి బాహుకుడు అను ఒక నిషాదుఁడు నల్లని వికారరూపముతో వెడలివచ్చెను. అపుడు వానిని పరిగ్రహింపను ఒల్లక పురమునుండి వెడలకొట్టిరి. అట్లు వెడలకొట్టబడిన వాని వంశస్థులు నిషాదులు అనబడుచు అడవులయందును కొండలయందును తిరుగుచు ఉండుదురు. ఇట్లు నిషాదరూపమున వేనుని దేహమునందలి పాపము వెలువడి రాగానే వాని బాహువులను ఒండొంటి చేర్చి ఒరసిరి. అప్పుడు అందు పృథుచక్రవర్తి పుట్టెను.

**18-2 శ్లో.**
**పాపోఽపి క్షితితలపాలనాయ వేనః**
**పౌరాద్యైరుపనిహితః కఠోరవీర్యః ।**
**సర్వేభ్యో నిజబలమేవ సంప్రశంసన్**
**భూచక్రే తవ యజనాన్యయం న్యరౌత్సీత్ ॥**

**ప్రతిపదార్థము:** పాపః -అపి = పాపి అయినప్పటికి, తితలపాలనాయ= భూమిని పాలించుట కొరకు, పౌర- ఆద్యైః = పౌరులు మొదలగువారిచే(పురే నగరే భవః- నగరములో వుండువాడు), వేనః = వేనుడు, ఉపనిహితః = సింహాసనమునందు దగ్గరగా ఉంచబడ్డాడు( రాజయ్యాడని భావం), కఠోరవీర్యః= క్రూరమైన పరాక్రమము కలిగిన వాడు (కృచ్ఛ్రేన జీవతి యేన-దీనివలన కష్టంగా జీవింతురు. కాఠిన్యము), నిజబలమ్ -ఏవ= తన బలమును తానే (బలతి బలయుక్తో భవతి

అనేన–దీనితో యుక్తుడగును. బలము సామర్థ్యము), సంప్రశంసన్ = మెచ్చుకొంటూ, భూచక్రే = భూమండలముపై, తవ= నీయొక్క, సర్వేభ్యః= అన్నిరకముల, యజనాని= యజ్ఞములను (ఇజ్యతే యాగము, యజ్ఞము), అయం= ఇతడు, న్యరౌత్సీత్= నిషేధించాడు. ( చేయకుండా అడ్డుపడ్డాడు).

**తాత్పర్యము:** పాపి అయినప్పటికి భూమిని పాలించుట కొరకు పౌరులు మొదలగువారిచే వేనుడు సింహాసనమునందు ఉంచబడ్డాడు. క్రూరమైన పరాక్రమము కలిగిన వాడు తన బలమును తానే మెచ్చుకొంటూ భూమండలముపై నీయొక్క అన్నిరకముల యజ్ఞములను నిషేధించాడు. ( చేయకుండా అడ్డుపడ్డాడు)

**18–3 శ్లో.**
**సంప్రాప్తే హితకథనాయ తాపసౌఘే**
**మత్తోఽన్యో భువనపతిర్న కశ్చనేతి ।**
**త్వన్నిందావచనపరో మునీశ్వరైస్తైః**
**శాపాగ్నౌ శలభదశామనాయి వేనః ॥**

**ప్రతిపదార్థము:** తాపస–ఔఘే= మునీశ్వరుల సమూహము(తపస్సుచేయువాఁడు, తపసి), హితకథనాయ= అతనికి మంచి చెప్పుటకు (హినోతి ప్రేరయతి ధారయతి పుష్టిమ్ పుష్ణాతి పోషించునది. హితము), సంప్రాప్తే = రాగా, మత్తః=మదించిన అతడు నాకంటె, అన్యః = వేరొక, భువనపతిః = రాజు (భవంతి అస్మిన్ భూతానిఇందులో ప్రాణులుండును. భూమి), న కశ్చన –ఇతి= లేనే లేడని, త్వత్ –నిందావచనపరః = నిన్ను నిందా వచనములతో తిట్టగా, తైః మునీశ్వరైః= ఆ మునీశ్వరులు ఇచ్చిన, శాప అగ్నౌ = శాపమనెడి అగ్ని యందు(శపతి అస్య భావః కర్మ వా శాపము )(అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), వేనః= వేనుడు, శలభదశామ్=మిడుత దశను (శలతి ఇతస్తతో గచ్ఛతిఇటునటు వెళ్లునది. మిడత), అనాయి= పొందెను( అనగా నశించెనని భావం).

**తాత్పర్యం:** మునీశ్వరుల సమూహము తనకు మంచి చెప్పుటకు రాగా మదించిన అతడు నాకంటె వేరొక రాజు లేనే లేడని నిన్ను నిందా వచనములతో తిట్టగా ఆ

మునీశ్వరులు ఇచ్చిన శాపమనెడి అగ్ని యందు వేనుడు మిడుత దశను పొందెను (అనగా నశించెనని భావం).

**విశేషము:** కవి వేనుని శలభముతో పోల్చుట పాత్రోచితము.

శలభ న్యాయము సంస్కృతంలో ప్రసిద్ధమైనది. మిడుత దీపము ఆర్పివేయునట్లు అని దీని అర్థం. నీచుడు శ్రేష్ఠపురుషుని గొప్పతనమును జూచి యించు కంతయు నోర్వడు. తనఒడలు కాలిపోవుచున్నను, మిడుత దీప్రమైన దీపశిఖ నార్పివేయుటకు ప్రయత్నించును. వేనుడు ఇంతే కదా !

**18-4 శ్లో.**

**తన్నాశాత్ ఖలజనభీరుకైర్మునీంద్రైః**
**తన్మాత్రా చిరపరిరక్షితే తదంగే ।**
**త్యక్తాఘే పరిమథితాదథోరుదండాత్**
**దోర్దండే పరిమథితే త్వమావిరాసీః ॥**

**ప్రతిపదార్థము:** తత్ -నాశాత్ = ఆ వేనుని నాశనము వలన, ఖలజన = దుష్ట జనులు ఈ భూమిని ఆ క్రమిస్తారేమోనని (ఖల= స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు )మూర్ఖుడు, భీరుకైః = భయపడిన ( భీరురేవ భీరుకః- భయపడువాడు. పిరికివాడు భయపెట్టువాడు), ముని-ఇంద్రైః= మునిపుంగవులు, తత్ —మాత్రా= తన తల్లియైన సునీథ చే, చిరపరిరక్షితే = చాలాకాలము రక్షింపబడిన, తత్ —అంగే= వేనుని శరీరములో, ఊరుదండాత్ పరిమథితాత్ = తొడను మథింపగా(ఊర్ణూయతే ఆచ్ఛాద్యతే కప్పబడినది. తొడ), అఘే త్యక్తః= పాపము పోయిన కలేబరములో నిషాదుడు పుట్టాడు.(అఘయతి పాపం కరోతి పాపము దుఃఖము వ్యసనము), అథ= అటుపిమ్మట, దోః- దండే = ఆ నిషాదుని బాహువును, పరిమథితే = పరిమథింపగా(మథ్యతే హింస్యతే విలోడ్యతే వా తస్య భావః కర్మ చ-చిలుకుట హింస), త్వమ్ ఆవిరాసీః= పృథువుగా నువ్వు అవతరించితివి.

**తాత్పర్యము:** ఆ వేనుని నాశనము వలన దుష్ట జనులు ఈ భూమిని ఆ

క్రమిస్తారేమోనని భయపడిన మునిపుంగవులు తన తల్లియైన సునీథ చే రక్షింపబడిన వేనుని శరీరములో తొడను మథింపగా, పాపము పోయిన కలేబరములో నిషాదుడు పుట్టాడు. అటుపిమ్మట ఆ నిషాదుని బాహువును మథింపగా పృథువుగా నువ్వు అవతరించితివి.

**18-5 శ్లో.**
**విఖ్యాతః పృథురితి తాపసోపదిష్టైః**
**సూతాద్యైః పరిణుత భావిభూరివీర్యః ।**
**వేనార్త్యా కబలితసంపదం ధరిత్రీం**
**ఆక్రాంతాం నిజధనుషా సమామకార్షీః ॥**

**ప్రతిపదార్థము:** పృథుః ఇతి = పృథువు అని, విఖ్యాతః = పేరుపొందిన, తాపస-ఉపదిష్టైః= అయం సాక్షాద్విష్ణోః – ఇతడు సాక్షాత్తుగ విష్ణువని తాపసుల ప్రబోధముచే, సూత-ఆద్యైః= సూత మాగధ వంది మాగధులచే, భావిభూరివీర్యః= నీ భావి పరాక్రమ చరిత్ర, పరిణుత= పొగడబడగా, వేన-ఆర్త్యా = వేనుని పీడచే, కబలితసంపదం =ఓషధీ సంపదను కోల్పోయిన, ఆక్రాంతాం= దుష్టులచే ఆక్రమింపబడిన, ధరిత్రీం= భూమిని, నిజధనుషా = నిజ ధనుస్సుచే, సమామకార్షీః= మెట్టపల్లములు సరిచేసి చదును చేసావు.

**తాత్పర్యము:** పృథువు అని పేరుపొంది అయం సాక్షాద్విష్ణోః – ఇతడు సాక్షాత్తుగ విష్ణువని తాపసుల ప్రబోధముచే సూత మాగధ వంది మాగధులచే నీ భావి పరాక్రమ చరిత్ర పొగడబడగా వేనుని పీడచే ఓషధీ సంపదను కోల్పోయిన దుష్టులచే ఆ క్రమింపబడిన భూమిని నిజ ధనుస్సుచే మెట్టపల్లములు సరిచేసి చదును చేసావు.

**విశేషాలు:** భూమిపై ఉన్న గిరి కూటములను చూర్ణము చేసి పుర గ్రామాది విభాగముతో భూమిని పృథువు సమతలము చేసాడని ఇక్కడ విశేషం.

**18-6 శ్లో.**
**భూయస్తాం నిజకులముఖ్య వత్సయుక్తైః**
**దేవాద్యైః సముచితచారుభాజనేషు ।**

**అన్నాదీన్యభిలషితాని యాని తాని**
**స్వచ్ఛందం సురభి తనూమదూదుహస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** భూయః = పిమ్మట నిజకులముఖ్యమ్= మనువు మొదలయిన కులవృద్ధులు వత్సయుక్తైః= దూడలుగ కుడుచుకొనగా తాం=భూమిని సురభి తనూమ్ = ఆవుగా చేసి దేవ–ఆద్యైః = దేవతలు మొదలయిన వారు సముచితచారుభాజనేషు= తమ తమ అర్హతలకు తగినట్లుగా ఉన్న పాత్రలలో యాని= ఏఏ అభిలషితాని= కోరబడిన అన్న–ఆదీని= అన్నము మొదలయినవి ఉన్నాయో తాని=వాటిని త్వమ్= నీ శాసనము వలన స్వచ్ఛందం= స్వచ్ఛందముగా అదూదుహః = పిదికారు.

**తాత్పర్యము:** మనువు మొదలయిన కులవృద్ధులు దూడలుగ కుడుచుకొనగా– భూమిని ఆవుగా చేసి –దేవతలు మొదలయిన వారు తమ తమ అర్హతలకు తగినట్లుగా ఉన్న పాత్రలలో అన్నము మొదలయినవాటిని నీ శాసనముతో పిదికారు.

**విశేషాలు:** ఇంద్రుడు దూడ అయిన సందర్భంలో భూమిఅనే ఆవు నుండి దేవతలు బంగారు పాత్రలో సోమాన్ని పితికారు.ప్రహ్లాదుడు దూడ అయిన సందర్భంలో భూమిఅనే ఆవు నుండి రాక్షసులు అయోమయ పాత్రలో మద్యాన్ని పితికారు. ఇలా గంధర్వులు తేనెను, పితృదేవతలు కవ్యాన్ని (పితృదేవతలకిచ్చు అన్నము.)– పిదికారని సారాంశం.

**18–7 శ్లో.**
**ఆత్మానం యజతి మఖైస్త్వయి త్రిధామన్**
**ఆరబ్ధే శతతమ వాజిమేధ యాగే ।**
**స్పర్ధాలుః శతమఖ ఏత్య నీచవేషో**
**హృత్వాఽశ్వం తవ తనయాత్ పరాజితోఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** త్రిధామన్= ఓ త్రిధాముడా! (త్రీణి ధామాని యస్య–పృథివి మొదలగు మూడు స్థానములు గలవాడు. విష్ణువు), త్వయి= పృథు చక్రవర్తి

రూపంలో, ఆత్మానం= సర్వ దేవ మయుడవైన నిన్ను నువ్వే, మఖైః = అశ్వమేధ యాగములచే(మఖ= మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర–దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము, యాగము), యజతి= పూజించుకొనుచూ, ఆరబ్దే శతతమ = నూరవ, వాజిమేధ యాగే= అశ్వమేధ యాగము (అశ్వః మేధ్యతే సంగమ్యతే స్పృశ్యతే అనంతరముత్సృజ్యతేఇక్కడ గుఱ్ఱము స్పృశింపబడును. అశ్వమేధ యాగము), ఆరబ్ధే= ప్రారంభింపబడగా, శతమఖః= ఇంద్రుడు (శతం మఖాః యజ్ఞాః యస్య– వంద యజ్ఞములు కలవాడు. ఇంద్రుడు), స్పర్ధాళుః = స్పర్ధాళువై ( పోటీపడి, అసూయ చెంది), నీచవేషః= నీచ వేషము ధరించి, ఏత్య= వచ్చి, అశ్వం= యాగాశ్వమును(అశ్నుతే వ్యాప్నోతి సర్వత్ర–అంతట వ్యాపించునది), హృత్వా= అపహరించి, తవ తనయాత్ = నీ కుమారునిచే, పరాజితః–అభూత్= యుద్ధములో ఓడిపోయాడు.

**తాత్పర్యము:** ఓ త్రిధాముడా! పృథు చక్రవర్తి రూపంలో సర్వ దేవ మయుడవైన నిన్ను నువ్వే అశ్వమేధ యాగములచే పూజించుకొనుచూ 99 యజ్ఞాలు పూర్తి చేసి నూరవ అశ్వమేధ యాగము ప్రారంభించావు. అప్పుడు ఇంద్రుడు అసూయ పడి నీచ వేషము ధరించి వచ్చి యాగాశ్వమును అపహరించి నీ కుమారునిచే యుద్ధములో ఓడిపోయాడు.

**విశేషాలు:** అశ్వమేధయాగములు నూరు కావించినవాఁడు ఇంద్రపదవినొందునని శాస్త్రము. అందువల్ల తనకు పృథువు పోటీ వచ్చునని ఇంద్రునికి భయం. వంద యజ్ఞములు కలవాడు అను అర్థము వచ్చు శత మఖ పదము శ్లోకములో ప్రయోగింపబడుట అభినందనీయము.

అశ్వమును పశువుగా నేర్పటిచి చేయు క్రతువు అశ్వ మేధము. ఆ గుఱ్ఱమును దిగంతపర్యంతము పంపి యడ్డువచ్చినవారిని జయించిన సార్వభౌముడు చేయవలసిన యాగమిది.

**18–8 శ్లో.**

**దేవేంద్రం ముహురితి వాజినం హరంతం**

**వహ్నౌ తం మునివరమండలే జుహూషౌ।**

**రుంధానే కమలభవే క్రతోస్సమాప్తౌ**
**సాక్షాత్ త్వం మధురిపుమైక్షథాః స్వయం స్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** ఇతి= ఈ విధముగా నీచ వేషాలు ధరిస్తూ( నగ్న రక్తపట జటా భస్మాదులు ధరించిన నీచ వేషాలు), ముహుః = మాటి మాటికి, వాజినం = యాగాశ్వమును (వాజః వేగః అస్తి అస్య-వేగం గలది. గుఱ్ఱము), హరంతం= హరించిన, తం దేవ-ఇంద్రం = ఆ ఇంద్రుని, మునివరమండలే= ఋషి సమూహము, వహ్నౌ= అగ్నియందు(యజ్ఞ వేదికకు దక్షిణ దిశన ఉంచే దక్షిణాగ్నిలో)(వహతి ప్రాపయతి హవ్యం దేవేభ్యః-దేవతలకు హవిస్సును అందింపచేయునది. అగ్ని), జుహూషౌ= వేల్వ వలెనని లేదా ఆహుతి చేయవలెనని అనుకొనగా (జుహూ= జుహోతి అనయా దీనితో ఆహుతి నిచ్చుదురు. కట్టెతో చేయబడిన అర్ధచంద్రాకారపు యజ్ఞపాత్ర), కమలభవే= బ్రహ్మ దేవుడు, రుంధానే =అడ్డుపడ్డాడు, క్రతోః సమాప్తౌ= ఆ తరువాత యజ్ఞము సంపూర్తి కాగా అవతరించిన, త్వం = నిన్ను, మధురిపుమ్= విష్ణువును, స్వయం స్వమ్= తననే తానుగా (పృథువు), సాక్షాత్ ఐక్షథాః= కన్నుల ముందు దర్శించెను.( సాక్షాత్= సహ అక్షతి కనబడునది కండ్లముందున్నది).

**తాత్పర్యము:** ఈ విధముగా నీచ వేషాలు ధరిస్తూ మాటి మాటికి యాగాశ్వమును హరించిన ఆ ఇంద్రుని ఋషి సమూహము అగ్నియందు(దక్షిణాగ్నిలో) ఆహుతి చేయవలెనని అనుకొనగా బ్రహ్మ దేవుడు నివారించాడు. ("99 యజ్ఞములు చాలు శతక్రతువు సంతోషిస్తాడు. ఇక యజ్ఞాలు వద్దు" అని బ్రహ్మ చెప్పి మునులను వారించాడు.) ఆ తరువాత యజ్ఞము సంపూర్తి కాగా అవతరించిన నిన్ను విష్ణువును తననే తానుగా పృథువు దర్శించెను. (పృథువు – విష్ణువు ఇద్దరూ ఒకటే అని భావం)

**18-9 శ్లో.**
**తద్దత్తం వరముపలభ్య భక్తిమేకాం**
**గంగాంతే విహితపదః కదాపి దేవ ।**

**సత్రస్థం మునినివహం హితాని శంసన్**
**ఐక్షిష్ఠాః సనకముఖాన్ మునీన్ పురస్తాత్ ॥**

**ప్రతిపదార్థం:** దేవ= ఓ దేవా!, తత్ = ఆ విష్ణువు వల్ల, దత్తం= పొందిన (దత్తః ప్రదత్తః విసృష్టః–ఇవ్వబడినది), ఏకాం = నాశనము లేని, స్థిరమైన, భక్తిమ్ = భక్తిని, వరమ్= వరముగా, ఉపలభ్య= గ్రహించి, గంగ–అంతే = గంగయమునల మధ్య( గంగా యమునా సంగమములో )( గంగా= గమయతి ప్రాపయతి ఉత్తమాం గతిం ఉత్తమాం లోకాన్ వాఉత్తమగతిని, ఉత్తమ లోకమును చేర్చునది), విహితపదః = నివసించితివి. (విధినా బోధితః–చేయబడ్డది శాస్త్రోక్తంగా చెప్పబడ్డది), కదాపి= ఒకప్పుడు, సత్రస్థం = సత్ర యాగమునకు వచ్చిన, మునినివహం = దేవర్షి, రాజర్షి, బ్రహ్మర్షులకు, హితాని = హితములను (ప్రేరయతి ధారయతి పుష్టిమ్ పుష్ణాతి పోషించునది. హితము), శంసన్= ఉపదేశిస్తూ, సనకముఖాన్ = సనకస నందన సనాతన సనత్కుమారాదులను, మునీన్ = మునులను, పురస్తాత్= ఎదుట, ఐక్షిష్ఠాః= దర్శించితివి.

**తాత్పర్యము:** ఓ దేవా! ఆ విష్ణువు వల్ల పొందిన నాశనము లేని, స్థిరమైన భక్తిని వరముగా గ్రహించి గంగా యమునా సంగమములో నివసించితివి. ఒకప్పుడు అక్కడ సత్ర యాగమునకు వచ్చిన దేవర్షి, రాజర్షి, బ్రహ్మర్షులకు హితములను ఉపదేశిస్తూ సనకస నందన సనాతన సనత్కుమారాదులను మునులను ఎదుట దర్శించితివి.

**విశేషాలు:**

**హితములు:** ప్రవృత్తి , నివృత్తి లక్షణములతో కూడిన ధర్మములు

**ప్రవృత్తి:** ముందుకు పోవటం. ప్రాపంచికమైన మార్గం. కర్మ మార్గం. ధర్మ పురుషార్థం. దీనికి వ్యతిరిక్తమైనది నివృత్తి. మోక్షమార్గం.

ఒకటి కర్మాచరణ ద్వారా సంసారానికి దారిచూపితే మరొకటి జ్ఞానాభ్యాసం ద్వారా సాయుజ్యానికి మార్గం చూపుతుంది. వేద వాఙ్మయం రెండు శాఖలు. మొదటిది

ప్రవృత్తి ధర్మం బోధిస్తుంది. దీనికే ధర్మమని కూడా మరొకపేరు. రెండవది నివృత్తి ధర్మం బోధిస్తుంది. దీనికే మోక్షమని పేరు.

మొదటిది వర్గమైతే రెండవది, అపవర్గమని పేర్కొంటారు.

**18-10 శ్లో.**
**విజ్ఞానం సనకముఖోదితం దధానః**
**స్వాత్మానం స్వయమగమో వనాంతసేవీ ।**
**తత్తాదృక్ పృథువపురీశ! సత్వరం మే**
**రోగౌఘం ప్రశమయ వాతగేహవాసిన్ ॥**

**ప్రతిపదార్థము:** వాతగేహవాసిన్= ఓ గురువాయూరు దేవా!, సనకముఖ= సనకుడు మొదలయిన వారిచే, ఉదితం= చెప్పబడిన(ఉదితః కథితః - చెప్పబడినది), విజ్ఞానం=బ్రహ్మ జ్ఞానమును(విశిష్టం జ్ఞానమ్ విశిష్ట జ్ఞానము), దధానః= ప్రపంచాన్ని అనుగ్రహించుట కొరకు అంగీ కరించిన స్వస్వరూపముతో చక్కగా ధరించి (అనగా నేర్చుకొని), వనాంతసేవీ= వనములో సేవ చేస్తూ (వనములో నివసిస్తూ), స్వ- ఆత్మానం =ఆత్మానుసంధానం చేస్తూ, స్వయమ్ గమః= నిన్ను నువ్వు పొందావు. (నీ స్వరూపమైన విష్ణు తత్వాన్ని పొందావు), తత్ తాదృక్= అటువంటి, పృథువపుః= పృథు శరీరము ధరించిన (ప్రథతే విఖ్యాతో భవతి చాలా పెద్దది గొప్పది), ఈశ! =ప్రభూ!, మే= నాకు, సత్వరం = వేగముగా, రోగ-ఔఘం= రోగ సమూహమును, ప్రశమయ= శమింపచేయుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! సనకుడు మొదలయిన వారిచే చెప్పబడిన బ్రహ్మ జ్ఞానమును ప్రపంచాన్ని అనుగ్రహించుట కొరకు అంగీ కరించిన స్వస్వరూపముతో చక్కగా ధరించి వనములో నివసిస్తూ ఆత్మానుసంధానం చేస్తూ నిన్ను నువ్వు పొందావు. అటువంటి పృథు శరీరము ధరించిన ప్రభూ! నాకు వేగముగా రోగ సమూహమును శమింపచేయుము.

**చతుర్థ స్కంధము**
**18వ దశకము సమాప్తము.**

# దశకమ్ 19 – ప్రాచీన బర్హిష చరిత్ర (వంశస్థము జతజర)

**19–1 శ్లో.**
**పృథోస్తు నప్తా పృథుధర్మకర్మఠః**
**ప్రాచీనబర్హిర్యువతౌ శతద్రుతౌ।**
**ప్రచేతసో నామ సుచేతసః సుతా**
**నజీజనత్ త్వత్కరుణాంకురానివ॥**

**ప్రతిపదార్థము:** పృథోః –తు = పృథు చక్రవర్తి, నప్తా = మునిమనుమడు( మనుమని పుత్రుడు) ప్రాచీన బర్హి), పృథు= అతడు పృథు చక్రవర్తి వలె, ధర్మకర్మఠః= ధర్మ కర్మ శూరుడు. ( కర్మఠుడు = ఫలపర్యంతము కార్యమును జేయు తెగువ గలవాడు), ప్రాచీనబర్హిః= ఆ ముని మనుమడైన ప్రాచీన బర్హికి (ప్రాచీన+బర్హిస్, ఇంద్రః–ఇంద్రుడు), యువతౌ= భార్య అయిన, శతద్రుతౌ = శతద్రుతి యందు, త్వత్ కరుణ–అంకురాన్ –ఇవ= నీదయ యొక్క మొలకల వలె ఉన్న, సుచేతసః = పరిశుద్ధమైన మనస్సు కలిగిన, ప్రచేతసః నామ= ప్రచేతసులను పేర్లు కలిగిన (ప్రచేతతి చేతనాయుక్తాన్ కరోతి ప్రాణినః–ప్రాణులను చైతన్యవంతులుగా చేయువాడు. వరుణుడు భగవంతుడు. గొప్పమనస్సు గలవాడు), సుతాన్= కుమారులు, అజీజనత్ = కలిగిరి.

**తాత్పర్యము:** పృథు చక్రవర్తి మునిమనుమడు ప్రాచీనబర్హి. అతడు పృథు చక్రవర్తి వలె ధర్మ కర్మ శూరుడు. ఆ ముని మనుమడైన ప్రాచీన బర్హికి భార్య అయిన శతద్రుతి యందు నీదయ యొక్క మొలకల వలె ఉన్న పరిశుద్ధమైన మనస్సు కలిగిన ప్రచేతసులను పేర్లు కలిగిన కుమారులు కలిగిరి.

**విశేషాలు:**

**ప్రాచీన బర్హి:** పృథువు కుమారుడు విజితాశ్వుడు. అతని కొడుకు హవిర్ధానుడు. హవిర్ధానుని కొడుకు ప్రాచీన బర్హి. ఇతని తల్లి ధిషణ. ఇతడు తానుచేసిన అనేక యజ్ఞములవలన భూమినంతయు యజ్ఞవాటముగా చేసి ప్రాచీనాగ్రములయిన

బర్హిస్సులచే(కుశలచే)కప్పినందున ఇతనికి ఈపేరు కలిగెను. ఇతనికి శతధృతి యందు పదుగురు కొడుకులు కలిగిరి. వారు ప్రచేతసులు అనబడిరి.

**ఛందస్సు:** ఈ దశకములోని ఛందస్సు వంశస్థ (జతజర) వృత్తానికి దగ్గరగా ఉన్నది. కొన్ని పాదాలలో సరిపోవుటలేదు.

**19–2 శ్లో.**

**పితుస్సిసృక్షానిరతస్య శాసనాత్ భవత్తపస్యాభిరతా దశాఽపితే ।**
**పయోనిధిం పశ్చిమమేత్య తత్తటే సరోవరం సందదృశుర్మనోహరమ్ ॥**

**ప్రతిపదార్థము:** సిసృక్షానిరతస్య= సృష్టి చేయవలెనను కోరిక కలిగిన, పితుః= తండ్రి ప్రాచీన బర్హి యొక్క, శాసనాత్= ప్రజలను సృష్టించండని ఆజ్ఞ ఇవ్వగా (శాస్తి తస్య భావః కర్మ వా శాసించుట శాసనము), తే దశా–అ పి = ఆ ప్రచేతసులు పది మంది, భవత్ తపస్య –అభిరతాః= నీ తపస్సు చేయుటకు కోర్కె కలవారై, పశ్చిమమ్ పయోనిధిం ఏత్య = పశ్చిమ సముద్ర తీరమునకు వచ్చి (పశ్చాత్ భవః–తరువాతది మిగిలినది వెనుకది పశ్చిమదిశ), తత్ తటే= ఆ తటములో (తటతి ఉచ్ప్రితో భవతి పెరుగునది పైకి లేచి వున్నది. ఒడ్డు), మనోహరమ్= అందమైన, సరోవరం= సరోవరమును (సరోభిః జలైః ప్రియతే జలములచే ఎన్నుకొనబడినది. సరోవరము), సందదృశుః= ఎదురుగా చూసారు.

**తాత్పర్యము:** సృష్టి చేయవలెనను కోరిక కలిగిన తండ్రి ప్రాచీన బర్హి ప్రజలను సృష్టించండని కుమారులకు ఆజ్ఞ ఇవ్వగా ఆ ప్రచేతసులు పది మంది నీ తపస్సు చేయుటకు కోర్కె కలవారై పశ్చిమ సముద్ర తీరమునకు వచ్చి ఆ తటములో అందమైన సరోవరమును చూసారు.

**విశేషాలు:**

**ప్రచేతసులు:** ప్రాచీనబర్హికిని సముద్రుని కూతురు అగు శతధృతికిని పుట్టినవారు. వీరు పదుగురు అన్నదమ్ములు తుల్యగుణ నామములు కలవారు. మహాతపోధనులు. వీరి భార్య మారిష.

**19-3 శ్లో.**

**తదాభవత్తీర్థమిదం సమాగతో భవో భవత్సేవకదర్శనాదృతః ।**
**ప్రకాశమాసాద్య పురః ప్రచేతసాముపాదిశద్భక్తతమస్తవ స్తవమ్ ॥**

**ప్రతిపదార్థము:** తదా= అప్పుడు (తస్మిన్ కాలే ఆ కాలమున ఆ సమయంలో అపుడు), ఇదం = ఈ భవత్ తీర్థమ్ నీతీర్థము ( విష్ణుతీర్థము) దగ్గరకు, సమాగతః= తన వారితో కలిసి వచ్చినవాడైన (సం సహ ఆగతః సమ్మిలితః-కలిసి వచ్చినవాడు), భవత్ సేవకదర్శన-ఆదృతః= నీ సేవకులయిన ప్రచేతసుల దర్శనమునకు ఆసక్తి కలిగిన వాడయిన(ఆదృతః సమ్మానితః పూజితఃఆదరింపబడువాడు సమ్మానింప బడువాడు ఉత్సాహవంతుడు), భక్తతమః= నీ పరమ భక్తుడు, భవః = శివుడు(భవతి జాయతే తస్య భావ-పుట్టుక మహాదేవుడు సంసారము), ప్రచేతసామ్= ఆ ప్రచేతసుల, పురః= ముందు, ప్రకాశమ్ -ఆసాద్య = సాక్షాత్కరించి (ప్రకృష్టం కాశతే అసౌ బాగా ప్రకాశించునది. వెలుతురు), తవ స్తవమ్= నీ స్తుతి ఒకటి (స్తౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తవము. దీనితో స్తోత్రము చేయుదురు), ఉపాదిశత్= వారికి ఉపదేశించెను.

**తాత్పర్యము:** నీ విష్ణుతీర్థము దగ్గరకు నీ సేవకులయిన ప్రచేతసుల దర్శనమునకు ఆసక్తి కలిగిన వాడయిన నీ పరమ భక్తుడు శివుడు ఆ ప్రచేతసుల ముందు సాక్షాత్కరించి నీ స్తుతి ఒకటి వారికి ఉపదేశించెను.

**19-4 శ్లో.**

**స్తవం జపంతస్తమమీ జలాంతరే**
**భవంతమాసేవిషతాయుతాం సమాః ।**
**భవత్సుఖాస్వాదర సాదమీష్వియాన్**
**బభూవ కాలో ధ్రువవన్న శీఘ్రతా ॥**

**ప్రతిపదార్థము:** అమీ జల-అంతరే= ఈ నీటి లోపల ఉండి, తమ్= ఆ ప్రాచేతసులు, ఆసేవిషత= నిన్ను ధ్యానము చేస్తూ, అయుతాం సమాః = పదివేల సంవత్సరాలు (న యుతమ్ కూడుకొననిది పదివేలు), భవంతమ్ స్తవం= మీయొక్క స్తవమును,

జపంతః= జపించారు, భవత్ సుఖ ఆస్వాద రసాత్= నీ యొక్క స్వరూపమును చూచుట వలన కలిగిన రసమును ఆస్వాదించుటలో ఆనందమును పొందిన, అమీషు= వారికి, ఇయాన్ కాలః బభూవ = చాలా కాలంగడిచింది, ధ్రువవత్ = ధ్రువుని వలె, శీఘ్రతా న= తొందరగా గడవలేదు.

**తాత్పర్యము:** ఈ నీటి లోపల ఉండి ఆ ప్రాచేతసులు మీయొక్క స్తవమును పదివేల సంవత్సరాలు జపించారు. నీ యొక్క స్వరూపమును చూచుట వలన కలిగిన రసమును ఆస్వాదించుటలో ఆనందమును పొందిన వారికి చాలా కాలము గడిచింది. ధ్రువుని వలె తొందరగా గడవలేదు.

**విశేషాలు :**

**ధ్రువవన్న శీఘ్రతా:** నీ యొక్క సుఖ ఆస్వా దము తో కూడిన రస ఆనందము పొందిన వారికి కాలము ధ్రువ మై అనగా స్థిరముగా ఉండి నశింపక ఉండునని దీనికి కొంతమంది వేరే అర్థము చెప్పారు.

**19-5 శ్లో.**
**తపోభిరేషామతిమాత్రవర్ధిభిః స యజ్ఞహింసానిరతోऽపి పావితః ।**
**పితాऽపి తేషాం గృహయాతనారద ప్రదర్శితాత్మా భవదాత్మతాం యయౌ॥**

**ప్రతిపదార్థము:** తపోభిః ఏషామ్ = ఆ ప్రచేతసుల యొక్క, అతిమాత్రవర్ధిభిః= ప్రవృద్ధమైన తపస్సులచే, సః యజ్ఞహింసానిరతః - అపి = యజ్ఞ ధ్వంసముల యందు ఆసక్తి కలిగిన ఆ పాపాత్ముడైన వేనుడుకూడా, పావితః= దురిత నివృత్తి వలన నరకము నుండి ఉద్ధరింపబడ్డాడు, తేషాం పితా-అపి= వారి యొక్క తండ్రియైన ప్రాచీనబర్హి కూడా, గృహయాత= ఇంటికి వచ్చిన, నారద = నారదునిచే ఉపదేశింపబడి ప్రదర్శిత-ఆత్మా= ఉపదిష్ట ఆత్మయైన శ్రీ హరి యొక్క భవత్, ఆత్మతాం= నీ సాయుజ్యమును, యయౌ= పొందాడు.

**తాత్పర్యము:** ఆ ప్రచేతసుల యొక్క ప్రవృద్ధమైన తపస్సులచే యజ్ఞ ధ్వంసముల యందు ఆసక్తి కలిగిన పృథువు యొక్క తండ్రి అయిన ఆ పాపాత్ముడైన వేనుడు కూడా పవిత్రుడు అయ్యాడు. తండ్రి అయిన ప్రాచీనబర్హి తన ఇంటికి వచ్చిన

నారదుని వల్ల ఆత్మసాక్షాత్కారాన్ని పొంది నీ సాయుజ్య సిద్ధిని(విష్ణువులో ఏకమగుట) పొందాడు.

**విశేషములు:** ఆత్మ అనగా శ్రీ హరి. శ్రీ హరిదర్శనము అనగా ఆత్మ దర్శనము . ఇందుకు ప్రమాణ వాక్యము ఇది. "ఆప్తత్వాత్ చ ప్రమాతృత్వాత్ ఆత్మా హి పరమో హరిః'' అని సంస్కృత వ్యాఖ్యానము.

**19-6 శ్లో.**
**కృపాబలేనైవ పురః ప్రచేతసాం ప్రకాశమాగాః పతగేంద్రవాహనః ।**
**విరాజిచక్రాదివరాయుధాంశుభిః భుజాభిరష్టాభిరుదంచితద్యుతిః ॥**

**ప్రతిపదార్థము:** విరాజి= ప్రకాశిస్తున్న, చక్ర ఆది = చక్రము మొదలైన, వర – ఆయుధ– అంశుభిః = దివ్యమైన ఆయుధముల కాంతులతో, అష్టాభిః భుజాభిః = ఎనిమిది చేతులతో, ఉదంచిత= విజృంభించినది పైకి వైవబడినది, ద్యుతిః= పది దిక్కులు కాంతితో నిండగా, కృపాబలేన –ఏవ= నీ దయా బలము చే, ప్రచేతసాం పురః= ప్రచేతసుల ఎదుట, పతగ – ఇంద్రవాహనః= గరుడ వాహనముతో, ప్రకాశమ్ అగాః =స్థిరముగా నిలిచితివి.

**తాత్పర్యము:** అటు పిమ్మట నీ దయా బలము చే ప్రచేతసుల దగ్గరకు చక్రము మొదలైన దివ్యమైన ఆయుధములతో ప్రకాశిస్తున్న ఎనిమిది చేతులతో పది దిక్కులు కాంతితో నిండగా గరుడ వాహనం ఎక్కి నువ్వు వారి వద్దకు వచ్చావు.

**19-7 శ్లో.**
**ప్రచేతసాం తావదయాచతామపి త్వమేవ కారుణ్య భరాద్వరానదాః ।**
**భవద్విచింతాఽపి శివాయ దేహినాం భవత్వసౌ రుద్రనుతిశ్చ కామదా ॥**

**ప్రతిపదార్థము:** తావత్ ప్రచేతసాం= ఆ ప్రచేతసులు, అయాచతామ్ –అపి= నిన్ను ఏ వరము కోరనప్పటికి, త్వమ్ ఏవ= నువ్వే, కారుణ్య భరాత్= దయతో నిండిన మనస్సు కలవాడివయి వారికి (కరుణస్య భావః,కరుణ ఏవ కారుణ్యమ్ కారుణ్యము, దయాభావము), వరాన్ అదాః= వరములు ఇచ్చావు, భవత్ విచింతా–అపి=

మిమ్ములను తలచుకున్న, దేహినాం శివాయ భవతు= జీవులకు శుభములు కలుగుతాయి, అసౌ =శివుడు ప్రచేతసుల కు చెప్పిన, రుద్రనుతిః చ= శివునిచే పాడబడిన నా స్తుతి, కామదా= అన్ని కోర్కెలను తీరుస్తుంది(కామాన్ దదాతి కోరికలను పూరించునది).

**తాత్పర్యం:** గురు వాయూరు దేవా! ప్రచేతసులు నిన్ను ఏ వరము కోరలేదు. అయినప్పటికీ నువ్వు దయతో నిండిన మనస్సు కలవాడివయి వారికి వరములు ఇచ్చావు. "మిమ్ములను తలచుకున్న వారికి శుభములు కలుగుతాయి. శివుడు ప్రచేతసుల కు చెప్పిన రుద్ర గీతిని చదివినవారికి సకల శుభాలు కలుగుతాయి." అని వారితో చెప్పావు.

**19-8 శ్లో.**
**అవాప్య కాంతాం తనయాం మహీరుహాం**
**తయా రమధ్వం దశలక్షవత్సరీమ్ ।**
**సుతోఽస్తు దక్షో నను తత్క్షణాచ్చ మాం**
**ప్రయాస్యథేతి న్యగదో ముదైవతాన్ ॥**

**ప్రతిపదార్థము:** మహీరుహాం తనయాం = చెట్లకు పుట్టిన(మహ్యాం రోహతి భూమి యందు పుట్టునది. చెట్టు), కాంతాం = మారిష అను కాంతామణిని, అవాప్య= పొంది, తయా=ఆమెతో, దశలక్షవత్సరీమ్=10లక్షల సంవత్సరాలు (వసంత్యస్మిన్ నక్షత్రదేవగణాః - నక్షత్ర దేవగణములు ఇందులో నివసించును. ఒక సంవత్సరము), రమధ్వం= భోగములు అనుభవిస్తారు, దక్షః = దక్షుడు అను పేరుగల, సుతః అస్తు= కుమారుడు మీకు కలుగుగాక! (సుతః ఉత్పన్నః- పుట్టినవాడుసంతానము),నను=నిశ్చయముగా(ననుదతిప్రేరయతి ప్రేరేపించునది ప్రశ్నించుట నిశ్చయము) , తత్క్షణాత్ -చ= పది లక్షల సంవత్సరాల తరువాత, మాం= నాతో, ప్రయాస్యథ=ముక్తిని పొందగలరు, ఇతి= అని, తాన్= వారు, ముదా-ఏవ = సంతోషించే టట్లుగా, న్యగద= చెప్పావు.

**తాత్పర్యము:** చెట్లకు పుట్టిన కాంతామణి మారిష మీకు భార్య అవుతుంది. ఆమెతో 10 లక్షల సంవత్సరాలు సుఖాలను పొందుతారు. దక్షుడు అను పేరుగల కుమారుని పొందిన తరువాత మీరు నన్ను చేరుకుని ముక్తి పొందగలరు అని వారు సంతోషించే టట్లుగా నువ్వు ఆశీర్వదించావు.

**విశేషాలు**

**మారిష:** ఈమె ప్రచేతసుల భార్య. కండుడు అను ఒక మహర్షికి ప్రమ్లోచ అను అప్సరస యందు పుట్టిన కన్య. తొల్లి కండుడు అను ఒక ఋషి తపము చేయుచు ఉండగా దేవేంద్రుఁడు దానికి విఘ్నము కావించుటకయి ప్రమ్లోచ అను అప్సరసను పంపెను. దానిని చూచి ఆఋషి చిత్తచాంచల్యము చెంది అనేకసంవత్సరములు దానితోకూడి ఉండి పిదప ఒకనాడు తెలివిపొంది దానిని కోపదృష్టితో చూచుచు విడనాడెను.

అపుడు అది కడుభీతిచెంది ఆ మహర్షిచే తనకు కలిగిన గర్భముచెడి స్వేదరూపముగ శరీరమునుండి బయటవెడలగా ఆస్వేదమును ప్రమ్లోచ వృక్షపల్లవముల చేత తుడిచెను. ఆవృక్షపల్లవములను అంటిన స్వేదబిందువులను ఎల్లను వాయువు ఒక్కటిగ కూర్చి ఒక స్త్రీరూపపిండమునుగా చేసెను. దానిని చంద్రుడు తన కిరణముల చల్లదనముచేత పెంచెను. అట్లు జనియించి పెరిగిన ఈకన్యకను వాయువును, చంద్రుడును తండ్రులు అయిరి అనియు చెప్పుదురు.

ఈమె పూర్వజన్మమున పడుచుతనమున ఉండునపుడే భర్త గతించిపోయి సంతానము లేనందున విష్ణువునుగూర్చి తపస్సు చేయ, అతఁడు ప్రత్యక్షము అయి మీది జన్మమున నీకు పదుగురు భర్తలు అగుదురు అనియు, ప్రతాప తేజో ధైర్య స్థైర్యములు కల ఒక కొమరుడు కలుగును అనియు వరము ఇచ్చెను. కనుక సోదరులు అయిన ప్రచేతసులు పదుగురికిని భార్య అయి వారి వలన పూర్వజన్మమున బ్రహ్మపుత్రుడు అయి ఉండిన దక్షప్రజాపతిని కొడుకుగా కనెను.

**19-9 శ్లో.**

**తతశ్చ తే భూతలరోధినస్తరూన్ క్రుధా దహంతో ద్రుహిణేన వారితాః ।**
**ద్రుమైశ్చ దత్తాం తనయామవాప్య తాం త్వదుక్తకాలాం సుఖినోఽభిరేమిరే ॥**

**ప్రతిపదార్థము:** తతః= భగవంతుడు వరములిచ్చి అంతర్ధానమయిన పిమ్మట, తే చ = ప్రచేతసులు కూడా భూతలరోధినః = భూమిని ఆవరించి ప్రజలకు దారి లేకుండా చేస్తున్నాయని(భూః ఏవ తలం భువః తలం వా భూతలము. భూమి. రుద్ధ=రుణద్ధి యేన-దీనితో ఆపబడును), తరూన్ = చెట్లపై ( తరు= తరంతి ఛాయాపుష్పఫలార్థినః అనేన– దీని నీడ, పుష్ప, ఫలాదులు కోరినవారు తరింతురు. వృక్షము.), క్రుధా= కోపము తెచ్చుకొని, దహంతః= వాటిని తగలబెడుతుండగా, ద్రుహిణేన= బ్రహ్మతో, వారితాః= వారింపబడ్డారు, ద్రుమైః-చ= ఆ చెట్లు కూడా (ద్రుః శాఖాః సంతి అస్య-కొమ్మలు కలది. వృక్షము), తనయామ్= తమ కుమార్తె అయిన మారిషను, దత్తాం = వారికి ఇచ్చి వివాహం చేశాయి, తాం = ఆమెను- మారిషను, అవాప్య= పొంది, త్వత్ – ఉక్తకాలాం= నువ్వు నిర్ణయించిన నంత కాలం అనగా పదిలక్షల సంవత్సరములు, సుఖినః –అభిరేమిరే= ప్రచేతసులు సుఖంగా గడిపారు.

**తాత్పర్యము:** ఆ తరువాత భూమిని ఆవరించి ప్రజలకు దారి లేకుండా చేస్తున్నాయని చెట్లపై ప్రచేతసులు కోపము తెచ్చుకొని వాటిని తగలబెడుతుండగా బ్రహ్మ వారిని ఆ పని నుంచి విరమింప చేశాడు. తరువాత చెట్లు తమ కుమార్తె అయిన మారిషను వారికి ఇచ్చి వివాహం చేశాయి .ఆ ప్రా చేత సులు ఆమెతో నువ్వు నిర్ణయించిన నంత కాలం అనగా పదిలక్షల సంవత్సరములు సుఖంగా గడిపారు.

**19-10 శ్లో.**

**అవాప్య దక్షం చ సుతం కృతాధ్వరాః ప్రచేతసో నారదలబ్ధయా ధియా ।**
**అవాపురానందపదం తథావిధస్త్వమీశ వాతాలయనాథ! పాహిమామ్ ॥**

**ప్రతిపదార్థము:** వాతాలయనాథ!= గురువాయూరు దేవా!, ఈశ= ప్రభూ!, దక్షం చ సుతం = దక్షుడు అను కుమారుని, అవాప్య= పొంది, కృత-అధ్వరాః = అనేక

యజ్ఞములు చేసి (అధ్వానం సత్పథం రాతి సన్మార్గమును చూపునది. యజ్ఞము ధార్మిక సంస్కారము), ప్రచేతసః= ప్రాచేతసులు, నారదలబ్ధయా= నారదుని యొక్క అనుగ్రహంతో లభించిన, ధియా= జ్ఞానముతో (ధ్యాయంతి చింతయంతి అనయా దీనితో చింతన చేయుదురు. బుద్ధి జ్ఞానము), ఆనందపదం =ఆనంద రూపమైన స్థానమును, అవాపుః = పొందిరి, తథావిధః = ఆవిధముగా వారికి ఆనందము కలిగించినట్లు గానే(తథా విధా ప్రకారః యస్య–అటువంటిది), త్వమ్= నువ్వు, మామ్= నా రోగములు అన్నింటిని పోగొట్టి ఆనందం కలిగించి నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! దక్షుడు అను కుమారుని పొంది అనేక యజ్ఞములు చేసి ప్రాచేతసులు నారదుని యొక్క అనుగ్రహంతో లభించిన జ్ఞానముతో ఆనంద రూపమైన నీ నివాసమును చేరుకున్నారు (అనగా ముక్తిని పొందారు అని భావము.) వారికి ఆనందము కలిగించినట్లు గానే నా రోగములు అన్నింటిని పోగొట్టి ఆనందము కలిగించి నన్ను రక్షించు.

**చతుర్థ స్కంధము పూర్తి**

**19వ దశకము సమాప్తము.**

## పంచమ స్కంధము

# దశకమ్ 20 – ఋషభయోగీశ్వరచరితము

**20-1 శ్లో.**
**ప్రియవ్రతస్య ప్రియపుత్రభూతా**
**దాగ్నీధ్రరాజా దుదితో హి నాభిః ।**
**త్వాం దృష్టవానిష్టదమిష్టిమధ్యే**
**తవైవ తుష్ట్యై కృతయజ్ఞకర్మా ॥**

**ప్రతిపదార్థము:** ప్రియవ్రతస్య=స్వాయం భువ మనువు పెద్ద కుమారుడయిన ప్రియ వ్రతునికి బర్హిష్మతి అను భార్యయందు 10 మంది కుమారులు కలిగారు. వారిలో, ప్రియపుత్రభూతాత్= ప్రియ పుత్రుడైన (పెద్దవాడయిన), ఆగ్నీధ్రరాజాత్= అగ్నీధ్రుడను రాజుకు, నాభిః ఉదితః హి = పూర్వచిత్తి అను అప్సరస ద్వారా నాభి అను కుమారుడు జన్మించాడు.( నాభి=నహ్యతే అనేన చక్ర శకటాదికమ్ బండి చక్రమును దీనితో బంధింతురు. ప్రధాన రాజు), తవ ఏవ తుష్ట్యై = నాభి నీకు సంతోషము కలిగించుట కొరకు, కృత యజ్ఞకర్మా= యజ్ఞకర్మను చేసి, ఇష్టి మధ్యే= యజ్ఞమధ్యములో(ఇజ్యతే అసౌ– యజ్ఞము దర్శ పౌర్ణమాస యజ్ఞభేదము), ఇష్టదమ్= ఇష్టములను ప్రసాదించు, త్వాం = నిన్ను, దృష్టవాన్= దర్శించెను.

**తాత్పర్యము:** స్వాయం భువ మనువు పెద్ద కుమారుడయిన ప్రియవ్రతునికి బర్హిష్మతి అను భార్యయందు 10 మంది కుమారులు కలిగారు. వారిలో ప్రియ పుత్రుడైన పెద్దవాడయిన అగ్నీధ్రుడను రాజుకు పూర్వ చిత్తి అను అప్సరస ద్వారా నాభి అను కుమారుడు జన్మించాడు. నాభి నీకు సంతోషము కలిగించుట కొరకు యజ్ఞకర్మను చేసి యజ్ఞమధ్యములో ఇష్టములను ప్రసాదించు నిన్ను దర్శించెను.

**విశేషాలు:**

**ఈదశకములో ఛందస్సు ఉపజాతి**

**ప్రియవ్రతుడు:** స్వాయంభువ మనువునకు శతరూపయందు పుట్టినపెద్దకొడుకు.

ఉత్తానపాదుని అన్న. ఇతడు కర్దమప్రజాపతి కూతురు అయిన సుకన్య అను దానిని పెండ్లాడెను. ఆమెయందు ఇతనికి సమ్రాట్టు, కుక్షి అని ఇరువురు కూతురులును ఆగ్నీధ్రుడు, అగ్నిబాహువు, వపుష్మంతుడు, ద్యుతిమంతుడు, మేధ, మేధాతిథి, భవ్యుడు, సవనుడు, పుత్రుడు, జ్యోతిష్మంతుడు అని పదుగురు కొడుకులును పుట్టిరి. వారిలో మేధ, పుత్రుడు, అగ్నిబాహువు ఈముఖ్వురును యోగపరాయణులు అయిరి. తక్కిన ఏడుగురు కొమారులకును ప్రియవ్రతుడు భూమిని ఏడుద్వీపములుగ భాగించి ఇచ్చెను. అందు ఆగ్నీధ్రునికి జంబూద్వీపమును, మేధాతిథికి ప్లక్షద్వీపమును, వపుష్మంతునకు శాల్మలద్వీపమును, జ్యోతిష్మంతునికి కుశద్వీపమును, ద్యుతిమంతునకు క్రౌంచద్వీపమును, భవ్యునికి శాకద్వీపమును, సవనునికి పుష్కరద్వీపమును వచ్చెను.

**నాభి:** ఆగ్నీధ్రుని తొమ్మండ్రు కొడుకులలో ఒక్కడు. ఈతని పాలికి జంబూద్వీపము వచ్చెను. భార్య మేరుదేవి. కొడుకు ఋషభుడు.

**20-2 శ్లో.**

**అభిష్టుతస్తత్ర మునీశ్వరైస్త్వం**
**రాజ్ఞః స్వతుల్యం సుతమర్థ్యమానః ।**
**స్వయం జనిష్యేఽహమితి బ్రువాణ**
**స్తిరోదధా బర్హిషి విశ్వమూర్తే! ॥**

**ప్రతిపదార్థము:** విశ్వమూర్తే = ఓ విశ్వరూపా!, తత్ర = అచ్చట నీవు సాక్షాత్కరించగా, ముని-ఈశ్వరైః = మునీశ్వరులచే, త్వం = నువ్వు, అభిష్టుతః = స్తుతులచే పొగడ బడితివి, రాజ్ఞః =రాజుచే, స్వతుల్యం = నీతో సమానుడైన (విష్ణువుతో సమానుడైన), సుతమ్= కుమారుడు, అర్థ్యమానః= కోరబడ్డాడు, స్వయం= స్వయముగా, అహమ్= నేను, జనిష్యే= నీకు(నాభికి) కుమారునిగా జన్మిస్తాను, ఇతి బ్రువాణః= అని చెప్పి, బర్హిషి = యజ్ఞము యొక్క అగ్నిలో(బర్హి= బృంహతి వర్ధతే ఆజ్యాదినా ఘృతాదులతో వృద్ధి నొందునది. అగ్ని, తిరోదధాః= మాయమైతివి.

**తాత్పర్యము:** ఓ విశ్వ రూపా! అచ్చట యజ్ఞమధ్యములో నీవు సాక్షాత్కరించి

మునీశ్వరులచే నువ్వు స్తుతులచే పొగడబడితివి. రాజయిన నాభిచే నీతో సమానుడైన (విష్ణువుతో సమానుడైన) కుమారుడు వరముగా కోరబడ్డాడు. స్వయముగా నేను నీకు( నాభికి) కుమారునిగా జన్మిస్తాను అని చెప్పి యజ్ఞము యొక్క అగ్నిలోనువ్వు మాయమైతివి.

**20–3 శ్లో.**
**నాభిప్రియాయామథ మేరుదేవ్యాం**
**త్వమంశతోఽభూః ఋషభాభిధానః ।**
**అలోకసామాన్యగుణ ప్రభావ**
**ప్రభావితాశేషజనప్రమోదః ॥**

**ప్రతిపదార్థం:** అథ = అటుపిమ్మట, నాభిప్రియాయామ్= నాభి యొక్క ప్రియురాలైన (భార్య అయిన) ( ప్రీణాతి సంతోషపెట్టునది. భార్య ప్రియురాలు), మేరుదేవ్యాం= మేరువు కుమార్తె అయిన మేరుదేవి యందు, త్వమ్ –అంశతః = నీ యొక్క అంశతో, అలోకసామాన్య= అమానుషమైన (అసామాన్యమైన )( అలోక= న లోకః దర్శనం యస్య–కనబడనిది), గుణ ప్రభావ= గుణ ప్రభావ విశేషాలతో, అశేషజనప్రమోదః ప్రభావితః= అందరి జనులకు అహ్లాదము కలిగించు రీతిగా (అశేష=నాస్తి శేషః యస్య–మిగలనిది, సంపూర్ణము.)(భావిత= భావితః సువాసితః, ప్రాప్తః, శోధితః, ఆదృతః–సుగంధము కలది పొందబడినది శుద్ధి చేయబడినది ఆదరింపబడ్డది), ఋషభ అభిధానః= ఋషభుడను పేరుతో (ఋషతి గచ్ఛతి శ్రేష్ఠశ్చ–వెళ్లునది శ్రేష్ఠమైనది. )(అభిదానః =అభిధీయతే అనేన–పేరు), అభూః= జన్మించితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నాభి యొక్క భార్య అయిన మేరు దేవి యందు నీ యొక్క అంశతో అసామాన్యమైన గుణ ప్రభావ విశేషాలతో అందరి జనులకు అహ్లాదము కలిగించు రీతిగా ఋషభుడను పేరుతో నువ్వు జన్మించితివి.

**20–4 శ్లో.**
**త్వయి త్రిలోకీభృతి రాజ్యభారం**
**నిధాయ నాభిః సహ మేరుదేవ్యా ।**

**తపోవనం ప్రాప్య భవన్నిషేవీ**
**గతః కిలానందపదం పదం తే ॥**

**ప్రతిపదార్థము:** త్రిలోకీభృతి= త్రిలోక ప్రభువగు (త్రయాణాం లోకానాం సమాహారః–మూడు లోకముల సమాహారము), త్వయి= నీయందు, రాజ్యభారం= రాజ్యభారమును(రాజ్ఞః భావః కర్మ వా రాజు యొక్క భావము, రాజు చేయు కర్మ. రాజ్యము), నిధాయ= ఉంచి, మేరుదేవ్యా= మేరు దేవితో, సహ= కలిసి, నాభిః= నాభి, తపోవనం= తపోవనమును (కు) (తపసః వనమ్ తపోవనము), ప్రాప్య= పొంది –(వెళ్ళి) (ప్రాప్తుం యోగ్య–పొందదగినది), భవత్ – నిషేవీ= నిన్ను సేవించువాడయి(నిషేవిత =చక్కగా కొలువబడినది), ఆనందపదం= నిరతిశయ సుఖ స్థానమైన, తే= నీయొక్క, పదం = వైకుంఠ ధామముకు, గతః కిల= వెళ్ళాడు కదా!

**తాత్పర్యము:** త్రిలోక ప్రభువగు నీయందు రాజ్యభారమును ఉంచి మేరు దేవితో కలిసి –నాభి– తపోవనముకు వెళ్ళి నిన్ను సేవించుచు నిరతిశయ సుఖ స్థానమైన నీయొక్క వైకుంఠ ధామముకు వెళ్ళాడు కదా!

**20–5 శ్లో.**
**ఇంద్రస్త్వదుత్కర్షకృతాదమర్షాత్**
**వవర్ష నాస్మిన్నజనాభవర్షే ।**
**యదా తదా త్వం నిజయోగశక్త్యా**
**స్వవర్షమేనద్వ్యదధాః సువర్షమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఇంద్రః = ఇంద్రుడు, త్వత్ = నీయొక్క, ఉత్కర్షకృతాత్ = ఉత్కర్ష వల్ల వచ్చిన (ఉత్ ఉచ్చైః కర్షః కర్షణం ఉన్నతిర్వా పైకి లాగుట ఉన్నతి ఔన్నత్యము ఉదయము సమృద్ధి), అమర్షాత్ =కోపము వల్ల (అమర్ష= న మర్షణం న క్షమా ఓర్పు లేనిది), అస్మిన్–అజనాభవర్షే= ఈ అజనాభ వర్షములో, న వవర్ష= వర్షము కురిపించలేదు, యదా= ఎప్పుడయితే అలా జరిగిందో, తదా = అప్పుడు, త్వం= నువ్వు, నిజయోగశక్త్యా= నిజ యోగ శక్తితో, ఏనత్ =దీనిని( ఏతత్ శబ్ద ద్వితీయా

విభక్తి), స్వవర్షమ్=తన అజనాభ వర్షములో(వర్షమ్= వృష్యతే సిచ్యతే ధ్రియతే ప్రార్థ్యతే తడుపబడునది. వర్షము ప్రార్థింపబడునది. జంబూ ద్వీపంలో ఒక భాగము మేఘము సంవత్సరము), సువర్షమ్ = మంచి వర్షాన్ని, వ్యదధాః = కురిపించితివి.

**తాత్పర్యము:** ఇంద్రుడు నీయొక్క ఔన్నత్యమును గుణములచే కీర్తివంతుడగుటను చూసి ఈర్ష్య పడి అజనాభ వర్షములో వర్షము కురిపించలేదు. అప్పుడు నువ్వు నిజ యోగ శక్తితో అజనాభ వర్షములో(భూభాగములో) మంచి వర్షాన్ని కురిపించితివి

**విశేషాలు**

**అజనాభం:** భారతదేశానికి 'భారత' నామం రావడానికి పూర్వం ఉన్న పేరు అజనాభం. (భాగవతం).

**20-6 శ్లో.**
**జితేంద్రదత్తాం కమనీం జయంతీ**
**మథోద్వహన్నాత్మరతాశయోఽపి ।**
**అజీజనత్ తత్ర శతం తనూజాన్**
**యేషాం క్షితీశో భరతోఽగ్రజన్మా ॥**

**ప్రతిపదార్థం:** అథ= అటుపిమ్మట, జిత = నీ యోగ శక్తిచే ఇంద్రునిపై జయము సాధించిన నీకు(జితం జయం అస్య అస్తి జయము కలవాడు జయము), ఇంద్రదత్తాం=ఇంద్రునిచే వివాహము కొరకు ఇవ్వబడిన (ఇంద్ర=ఇందతి పరమైశ్వర్యవాన్ భవతి పరమైశ్వర్యవంతుడు. భగవంతుడు దేవతలకు రాజు, ఇంద్రుడు), కమనీం= రమణీయురాలయిన (కామ్యతే కమనీయం వా కోరబడునది అందముగా నున్నది), జయంతీమ్ = జయంతి అను కన్యకను(జయతి శత్రూన్ శత్రువులను జయించునది. ఇంద్రుని కూతురు), ఆత్మరత –ఆశయః– అపి= ఆత్మోపాసన పరుడివయినప్పటికి ( శ్రీ హరి ఉపాసన యందు ఉత్సుకత కలిగినప్పటికి) (ఆశయ=ఆశేతే తస్య భావః–అభిప్రాయము), ఉద్వహన్ = పెండ్లాడితివి, తత్ర= ఆమెయందు, యేషాం = ఏ కుమారులయొక్క(నూరుగురు కుమారులలోను), భరతః= భరతుడను(భరతి పుష్ణాతి అసౌ పోషించువాడు.

భరతుడు), క్షితి–ఈశః = రాజు, అగ్రజన్మా= పెద్దవాడుగా కలడో, శతం తనూజాన్ = నూరుగురు కుమారులను, అజీజనత్= కన్నావు.

**తాత్పర్యము:** ఓ ఋషభా! అటుపిమ్మట యోగ శక్తిచే జయము సాధించిన నీకు ఇంద్రునిచే జయంతి అను కన్యక వివాహము కొరకు ఇవ్వబడినది. రమణీయురాలయిన ఆమెను శ్రీ హరి ఉపాసన యందు ఉత్సుకత కలిగినప్పటికి పెండ్లాడితివి. ఆమెయందు నీకు కలిగిన నూరుగురు కుమారులలోను భరతుడు పెద్దవాడు.

**20–7 శ్లో.**

**నవాభవన్ యోగివరా నవాన్యే**
**త్వపాలయన్ భారతవర్షఖండాన్ ।**
**సైకాత్వశీతిస్తవ శేషపుత్రా**
**స్తపోబలాత్ భూసుర భూయమీయుః ॥**

**ప్రతిపదార్థం:** నవ= ఆనూరుగురు కుమారులలో భరతుడు కాక మిగిలినవారిలో తొమ్మిది మంది, యోగివరాః = యోగివరులుగా(యోజయతి సమానం పశ్యతి సుఖం చ దుఃఖం చ–సుఖదుఃఖములను సమానంగా చూచువాడు. యోగి), అభవన్ = మారిరి, నవ–అన్యే తు = మిగిలిన వారిలో తొమ్మిది మంది, భారతవర్షఖండాన్= భారత వర్షములోని కుశావర్త, ఇలా వర్త, బ్రహ్మావర్త, మలయ కేతు, భద్రసేన, విదర్భ, కీకటాది ఖండములను, అపాలయన్= పాలించిరి, స–ఏకాతు అశీతిః= ఎనభై ఒక్కమంది (అశీతి=దశానాం అవయవం దశతిః, అష్టగుణితా దశతిఃఎనభై), శేషపుత్రాః = మిగిలిన పుత్రులు (శిష్యతే ఉపయుక్తాదన్యః శేషేణ–మిగిలిపోవునది), తపోబలాత్= తపోబలము వలన, భూసుర భూయమ్ = బ్రాహ్మణత్వమును, ఈయుః = పొందిరి.

**తాత్పర్యము:** ఆనూరుగురు కుమారులలో భరతుడు కాక మిగిలినవారిలో తొమ్మిది మంది యోగివరులుగా మారిరి. మిగిలిన వారిలో తొమ్మిది మంది భారత వర్షములోని కుశావర్త, ఇలా వర్త, బ్రహ్మావర్త, మలయ కేతు, భద్రసేన, విదర్భ,

కీకటాది ఖండములను పాలించిరి. ఎనభై ఒక్కమంది మిగిలిన పుత్రులు తపోబలము వలన బ్రాహ్మణత్వమును పొందిరి.

**20–8 శ్లో.**

**ఉక్త్వా సుతేభ్యోఽథ మునీంద్రమధ్యే**
**విరక్తిభక్త్యన్వితముక్తిమార్గమ్ ।**
**స్వయంగతః పారమహంస్యవృత్తి**
**మధా జడోన్మత్తపిశాచచర్యామ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, ముని–ఇంద్రమధ్యే= మునిశ్రేష్ఠుల మధ్య, సుతేభ్యః = భరతుడు మొదలయిన కుమారులకు, విరక్తిభక్తి – అన్విత ముక్తిమార్గమ్=విరక్తి భక్తితో కూడిన ముక్తి మార్గమును(విగతం రంజనం ఆసక్తిః తస్య భావః కర్మ వా విరక్తి, ఉదాసీనత.)(అను సహ ఇతః గతః అనుసరించునది), ఉక్త్వా= చెప్పి, స్వయం= స్వయముగా నువ్వు (ఋషభదేవునిగా), పారమహంస్యవృత్తిమ్ గతః = పరమహంస వృత్తిని స్వీకరించి (పరమః శ్రేష్ఠః హంసః సోఽహం ఆత్మా యస్య–శ్రేష్ఠమైన ఆత్మ గలవాడు. పరమహంస, ఒక విధమైన సన్న్యాసి), జడ = జడుని ప్రవర్తనను(జలతి ఘనీభవతి గడ్డ కట్టునది బుద్ధిహీనుడు, మూర్ఖుడు), ఉన్మత్త= వెఱ్ఱెత్తిన ప్రవర్తనను (ఉన్మత్తః విక్షిప్త – ఉన్మాదము కలవాడు), పిశాచచర్యామ్= రాక్షసుని ప్రవర్తనను (పిశితం మాంసం అశ్నాతి మాంసమును తినునది(వాడు). రాక్షసుడు), అధాః=స్వీకరించితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట మునిశ్రేష్ఠుల మధ్య భరతుడు మొదలయిన కుమారులకు విరక్తి భక్తితో కూడిన ముక్తి మార్గమును చెప్పి స్వయముగా నువ్వు పరమహంస వృత్తిని స్వీకరించి జడుని, ఉన్మత్తుని మరియు పిశాచప్రవర్తనలను స్వీకరించితివి.

**విశేషాలు**

**సన్న్యాసం :** సన్న్యాసమనగా త్యాగం అని అర్థం. వదలుకోవటం. అంతేకాదు బాగా ఉంచడమని కూడా అర్థమే. Well place. అనాత్మభావాన్ని వదలుకుంటూ మనస్సును ఆత్మస్వరూపంలో నిలిపి ఉంచటమని భావం. అప్పటికి రెండర్థాలు

సరిపోతాయి. ఇది జిజ్ఞాసువుకైతే ఆశ్రమ సన్న్యాసం. జ్ఞానికైతే పరమహంస పారివ్రాజ్యం.(సన్యాసం) దీనికే పరమార్థ సన్న్యాసమని పేరు. ఇది కేవలం మానసికం. బాహ్యమైన వేష భాషలతో నిమిత్తం లేదు. కాషాయ కమండల్వాదులు కూడా అక్కరలేదు. అది వైకల్పికం.

**20-9 శ్లో.**
**పరాత్మ భూతోఽపి పరోపదేశం**
**కుర్వన్ భవాన్ సర్వనిరస్యమానః ।**
**వికారహీనో విచచార కృత్స్నం**
**మహీమహీనాత్మరసాభిలీనః ॥**

**ప్రతిపదార్థం:** పర-ఆత్మ భూతః అపి= ఋషభరూపములో నువ్వు బ్రహ్మాత్మ స్వరూపుడవైనప్పటికి, భవాన్= నువ్వు, పర-ఉపదేశం = బ్రహ్మోపదేశము, కుర్వన్ = చేయుచూ, సర్వనిరస్యమానః= అందరిచేత నిరసింపబడుచూ అవధూతవై, వికారహీనః= శరీర అభిమాన నివృత్తితో, అహీనాత్మరస= పరమానంద అనుభవములో, అభిలీనః= ఐక్యమును పొంది అనగా జీవన్ముక్తుడివై (బ్రతికి యుండియే సంసారమును వదిలినవాడు. జీవన్ముక్తుడు ఆత్మజ్ఞానము కలిగిన వాడు), మహీమ్ =భూమిలో (మహ్యతే పూజ్యతే పూజింపబడునది. భూమి), కృత్స్నం= అంతటా(కృతం సంపూర్ణతయా సర్వమ్ సంపూర్ణము), విచచార= విహరించితివి.

**తాత్పర్యము:** ఋషభరూపములో నువ్వు బ్రహ్మాత్మ స్వరూపుడవైనప్పటికి నువ్వు బ్రహ్మోపదేశము చేయుచూ అందరిచేత నిరసింపబడుచూ అవధూతవై శరీర అభిమాన నివృత్తితో పరమానంద అనుభవములో ఐక్యమును పొంది అనగా జీవన్ముక్తుడివై భూమిలో అంతటా విహరించితివి.

**విశేషాలు**

**బ్రహ్మాత్మభావ :** జీవాత్మ బ్రహ్మంగా మారిపోవటం. కేవల మాత్మ అయితే దేహమాత్ర పరిచ్ఛిన్నమైన చైతన్యమని భ్రమపడవచ్చు. కేవల బ్రహ్మమైతే పరోక్షమైనా కావచ్చు.

బ్రహ్మాత్మమంటే రెండు దోషాలూ తొలగిపోయి అపరిచ్ఛిన్న అపరోక్షమైన అద్వైతానుభవం సిద్ధిస్తుంది. దాన్ని సూచింటానికే రెండూ కలిపి బ్రహ్మాత్మ అని చెబుతున్నది శాస్త్రం. బ్రహ్మమే ఆత్మ. ఆత్మే బ్రహ్మం అని అర్థం. బ్రహ్మమే ఆత్మ అన్నప్పుడు పరోక్షం అపరోక్షమవుతుంది. ఆత్మే బ్రహ్మ మన్నప్పుడు పరిచ్ఛిన్నం అపరిచ్ఛిన్నమవుతుంది. ఇలాంటిదే అద్వైతుల బ్రహ్మానుభవం.

**బ్రహ్మానుభవం:** ముందు చెప్పినట్టు జీవాత్మను బ్రహ్మదృష్టితో చూచి మరలా బ్రహ్మాన్ని తన ఆత్మరూపంగా అనుభవానికి తెచ్చుకోవటమే అసలైన బ్రహ్మానుభవం.

**20-10 శ్లో.**
**శయువ్రతం గోమృగకాకచర్యాం**
**చిరం చరన్నాప్యపరం స్వరూపం ।**
**దవాహృతాంగః కుటకాచలే త్వం**
**తాపాన్మ మాపాకురు వాతనాథః ॥**

**ప్రతిపదార్థం:** వాతనాథః= ఓ గురువాయూరు దేవా!, శయువ్రతం = అజగర వ్రతమును (శయు=శేతే అసౌ పడుకొనునది, పెనుపాము), గో= ఆవు (గో=గచ్ఛతి అసౌ వెళ్లునది. ఆవు), మృగ= మృగము (మార్ష్టి గచ్ఛతి విచరణశీలః-తిరుగు స్వభావం కలది. జింక పశువు మృగము), కాక= కాకి (కుత్సితం అకతి గచ్ఛతి ఆచరతి కుత్సితాచారము కలది. కాకి), చర్యాం= చర్యలను(చర్యతే ఇతి ఆచరింపబడునది. ఆచరణ), చిరం చరన్ = చాలాకాలము అభ్యసించి, త్వం = నువ్వు, పరం స్వరూపం ఆప్య= బ్రహ్మ స్వరూపమును పొంది, కుటకాచలే =కుటకాచలములో (కూర్గ పర్వతములలో), దవా హృత -అంగః = దావాగ్నికి శరీరాన్ని అర్పించితివి. (దవస్య వనస్య అగ్నిః, దవ ఏవ అగ్ని దావానలము), మమ= నాకు, తాపాత్= తాపము నుండి ( తాపములను), అపాకురు = పోగొట్టుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! అజగరవ్రతమును ఆవు, మృగ, కాక చర్యలను చాలాకాలము అభ్యసించి ఋషభ రూపములో నువ్వు బ్రహ్మ

స్వరూపమును పొంది కుటకాచలములో దావాగ్నికి శరీరాన్ని అర్పించితివి. అటువంటి నువ్వు నా తాపములను పోగొట్టుము.

**విశేషాలు**

**అజగర వ్రతము:** కదలకుండా పడిఉండే కొండచిలువకజగరమని పేరు. అది నోరు తెఱచుకొని ఏది దగ్గరకు వస్తే దాన్ని తిని కడుపు నింపుకొంటుంది. అలా అప్రయత్నంగా లభించిన దానితో జీవనం గడుపుకొనే జ్ఞానికూడా అజగర వృత్తే – యదృచ్ఛాలాభ సంతుష్టుడని అర్థం.

కొండచిలువ (అజగరము) కదలక మెదలక ఇంద్రియ వ్యాపారములను విషయముల నుండి మరల్చి కేవల బ్రహ్మానంద రసానుభూతిలో ఉండు స్థితి అజగర వ్రతమని ఇంకొక సమన్వయం.

**గోమృగకాకచర్య:** శుద్ధి, అశుద్ధి, విధి, నిషేధాలు లేకుండా పైన పేర్కొన్న వాటిలా తిరుగుట

**చర్యాపాద చతుష్టయం :** ఆధ్యాత్మిక సాధనలో నాలుగు స్పష్టమైన మార్గాలు ఉన్నాయి. అవి: 1. చర్యాపాదం (దేవాలయాలను దర్శించడం, తీర్థయాత్రలు చేయడం మొదలైనవి), 2. క్రియా పాదం (ఎవరో ఒక దేవతను నమ్ముకొని ఆరాధించడం), 3. యోగ పాదం (ప్రాణాయామం, హఠయోగం మొదలైనవి చేయడం), 4. జ్ఞాన పాదం (అంతా బ్రహ్మమయమేననీ, తానూ బ్రహ్మమే నని ఎరుక కలిగిన సాధన).

***పంచమ స్కంధము***

**20వ దశకము సమాప్తము.**

# దశకమ్ 21 – నవ వర్షములు, సప్తద్వీపములు

**21–1 శ్లో.**
**మధ్యోద్భవే భువ ఇలావృతనామ్ని వర్షే**
**గౌరీప్రధానవనితాజనమాత్రభాజి ।**
**శర్వేణ మంత్రనుతిభిః సముపాస్యమానం**
**సంకర్షణాత్మక మధీశ్వర! సంశ్రయే త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** అధి–ఈశ్వర= ఓ చక్రవర్తీ ! గురువాయూరు దేవా ! (అధికః ఈశ్వరః–చక్రవర్తి), భువః మధ్య–ఉద్భవే = భూ మధ్యమైన జంబూద్వీపములో పుట్టిన(ఉన్న), గౌరీ= గౌరీ మొదలయిన(గౌరః గౌరవర్ణః అస్తి అస్యాః–తెలుపు రంగు గలది. పార్వతి), ప్రధానవనితాజన= ప్రముఖ స్త్రీ జనము, మాత్రభాజి= మాత్రమే నివసించు, ఇలావృతనామ్ని= ఇలా వృతమను పేరుగల(ఇలా పృథివీ వృతా యేన–భూమిని చుట్టి ఉన్నది. జంబూద్వీపములో వున్న 9 దేశములలో ఒకటి), వర్షే = పుణ్యఖండమందు, శర్వేణ= పరమశివునిచే (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), మంత్రనుతిభిః = చేయబడిన మంత్ర స్తుతులచే (మననేన త్రాయతే మననము చేస్తే రక్షించునది. వేదమంత్రము మొ॥ మంత్రములు), సముపాస్యమానం= కొలువబడుచున్న, సంకర్షణ –ఆత్మకమ్ = సంకర్షణ స్వరూపుడై ఉన్న, త్వామ్= నిన్ను, సంశ్రయే= ఆశ్రయించెదను.

**తాత్పర్యము:** అధి–ఈశ్వర= ఓ చక్రవర్తీ ! గురువాయూరు దేవా ! భూ మధ్యమైన జంబూద్వీపములో ఉన్న గౌరీ మొదలయిన ప్రముఖ స్త్రీ జనము మాత్రభాజి= మాత్రమే నివసించు ఇలా వృతమను పేరుగల పుణ్యఖండమందు పరమశివునిచే చేయబడిన మంత్ర స్తుతులచే కొలువబడుచున్న సంకర్షణ స్వరూపుడై ఉన్న నిన్ను ఆశ్రయించెదను.

**విశేషాలు**

**సంకర్షణుడు:** సంకృష్యతే గర్భాత్ గర్భాంతరం నీయతే పిండమును ఒక గర్భము నుండి మరొక గర్భంలో వుంచుట (బలరాముడు. (భాగవ. 10.7.17).

ఈ దశకములోని ఛందస్సు మదనము (**త , భ , జ , జ , గా**)

**21–2 శ్లో.**

**భద్రాశ్వనామక ఇలావృతపూర్వవర్షే**
**భద్రశ్రవోభిః ఋషిభిః పరిణూయమానమ్ ।**
**కల్పాంతగూఢనిగమోద్ధరణప్రవీణం**
**ధ్యాయామి దేవ! హయశీర్షతనుం భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ! = దేవా! (దీవ్యతి ప్రకాశించువాడు. దేవత ఆత్మ పరమేశ్వరుడు), ఇలావృత వర్షే= ఇలావృత వర్షమునకు, పూర్వ= తూర్పున (పూర్వతి అగ్రే భవతి (దిగ్వాచీ) తూర్పు), భద్రాశ్వనామకః= భద్రాశ్వ వర్షము(భూఖండం కలదు), భద్రశ్రవోభిః = పుణ్యప్రదమైన అధ్యాత్మ విద్యాశ్రవణము చేసిన వారయిన లేదా భద్రశ్రవులను (భద్ర=భందతే శుభం కరోతి శుభమును చేయువాడు), ఋషిభిః= ఋషులచేత (ఋచ్ఛతి జానాతి జ్ఞాపయతి మంత్రార్థమ్ మంత్రార్థమును తెలుసుకున్న, మంత్రార్థమును తెలిపిన ఋషి. మంత్రార్థ ద్రష్ట), పరిణూయమానమ్= పొగడబడుచూ, కల్పాంత= కల్పాంతమందు (కల్పస్య బ్రహ్మదినస్య అంతః–బ్రహ్మదినసమాప్తి ప్రళయము), గూఢ= నిగూఢములై ఉన్న(గూఢః సంవృతః గుప్తో వాకప్పబడినది దాచబడినది), నిగమ–ఉద్ధరణప్రవీణం= వేదములను ఉద్ధరించు నేర్పు కలిగి(గమయంతి జ్ఞాపయంతి వేదార్థమ్ వేదార్థమును తెలియచేయు శాస్త్రములు. వేదములు) (ఉద్ధరణ = ఉత్ ధ్రియతే అసౌ తస్య భావో వాపైకి లేపుట), హయశీర్షతనుం= హయగ్రీవ రూపములో ఆ భద్రాశ్వ వర్షములో నివసించిన (హయస్య గ్రీవా ఇవ దీర్ఘా గ్రీవా యస్య–గుఱ్ఱము వంటి పొడవైన మెడ గలవాడు. హయగ్రీవుడు), భవంతమ్= నిన్ను , ధ్యాయామి= ధ్యానించెదను.

**తాత్పర్యము:** దేవా! ఇలావృత వర్షమునకు తూర్పున భద్రాశ్వమను భూఖండం కలదు. పుణ్యప్రదమైన అధ్యాత్మ విద్యాశ్రవణము చేసిన వారయిన ఋషులచేత (భద్రశ్రవులను ఋషుల చేత) పొగడబడుచూ కల్పాంతమందు నిగూఢములై ఉన్న

వేదములను ఉద్ధరించు నేర్పు కలిగి హయగ్రీవ రూపములో ఆ భద్రాశ్వ వర్షములో నివసించిన నిన్ను ధ్యానించెదను.

**విశేషాలు**

**హయగ్రీవుడు:** గుఱ్ఱపు మొగమును మనుష్య దేహమును ధరించి అవతరించిన విష్ణుమూర్తి. కల్కిమూర్తియు హయగ్రీవుడే అని అందురు. తొల్లి విష్ణువు యోగనిద్రచేయు కాలమున మధుకైటభులు పుట్టి వేదములను అపహరించికొని పోయి పాతాళమున అణచి వేయగా శ్రీమన్నారాయణుడు బ్రహ్మప్రార్థనచే నిద్రవిడిచి హయగ్రీవ రూపధారి అయి వేదములను తెచ్చి మరల బ్రహ్మకు ఇచ్చెను.

**21-3 శ్లో.**
**ధ్యాయామి దక్షిణగతే హరివర్షవర్షే**
**ప్రహ్లాదముఖ్యపురుషైః పరిషేవ్యమాణమ్ ।**
**ఉత్తుంగశాంతధవళాకృతిమేకశుద్ధ-**
**జ్ఞానప్రదం నరహరిం భగవన్ భవంతం ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ భగవానుడా! గురువాయూరుదేవా!, దక్షిణగతే= దక్షిణ దిశలోని(దక్షతే ఉత్సహతే కార్యేషు సమర్థో భవతి కార్యములను సమర్థవంతంగా చేయునది.కుడిదిక్కు), హరివర్షవర్షే= హరివర్షమను భూఖండమందు (హరినామకం వర్షమ్ హరి అను పేరు గల దేశము), ప్రహ్లాదముఖ్యపురుషైః= ప్రహ్లాదుడు మొదలగు మహా పురుషులచే (అతిశయేన హ్లాదతే, విష్ణుభక్తత్వాత్ విష్ణుభక్తితో, సంతోషముతో వుండువాడు. ప్రహ్లాదుడు), పరిషేవ్యమాణమ్= సేవింపబడుచున్న, ఉత్తుంగ= ఉన్నతమైన(ఉత్కృష్టం తుంగమ్ ఎత్తైన ఉన్నతమైన), శాంతధవళ-ఆకృతిమ్ = తెల్లని శాంత విగ్రహములో(జాత శమః-ఓర్పు కల్గినవాడు ప్రసన్నుడు సౌమ్యుడు శాంతరసము.) (ఆకృతి=ఆక్రియతే వ్యజ్యతే రూప జాత్యాదికం అనయాఆకారము రూప, జాతులను తెలుపునది), ఏకశుద్ధజ్ఞానప్రదం = పరిశుద్ధ జ్ఞానాన్ని ప్రసాదించు, నరహరిం= నరసింహ మూర్తివైన (నరశ్చ అసౌ సింహశ్చనరసింహుడు. నరః సింహ ఇవ

శౌర్యాదీనాన్ పురుషులలో సింహము వంటివాడు. శౌర్యాది గుణములు గల ఉత్తముడు), భవంతం= నిన్ను, ధ్యాయామి= ధ్యానించెదను.

**తాత్పర్యము:** ఓ భగవానుడా! గురువాయూరుదేవా! దక్షిణ దిశలోని హరివర్షమను భూఖండమందు ప్రహ్లాదుడు మొదలగు మహా పురుషులచే సేవింపబడుచున్న ఉన్నతమైన తెల్లని శాంత విగ్రహములో పరిశుద్ధ జ్ఞానాన్ని ప్రసాదించు నరసింహ మూర్తివైన నిన్ను ధ్యానించెదను.

**21-4 శ్లో.**
**వర్షే ప్రతీచి లలితాత్మని కేతుమాలే**
**లీలావిశేషలలితస్మితశోభనాంగమ్ ।**
**లక్ష్మ్యా ప్రజాపతిసుతైశ్చ నిషేవ్యమాణం**
**తస్యాః ప్రియాయ ధృతకామతనుం భజే త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** వర్షే ప్రతీచి = ఇలావర్షమునకు పడమట(ప్రతి ప్రతిదినాంతే అంచతి గచ్ఛతి సూర్యః అస్యామ్ ప్రతి దినాంతములో సూర్యుడు ఇటువైపు పయనించును. పశ్చిమ దిశ), లలిత-ఆత్మని = చక్కని (లలిత=లలతే ఈషతే అందమైనది శృంగార చేష్ట కోరబడినది), కేతుమాలే= కేతుమాలము అను పేరుగల భూఖండమందు, లీలావిశేష= లీలా విలాసములతో (లీలా=లియం ఆమోదం లాతి క్రీడ, ఆమోదము), లలితస్మిత= లలిత మందహాసములతో, శోభన-అంగమ్= మధురమైన ఆ కారము కలిగి (శోభన= శోభతే శోభించునది. అందమైనది),లక్ష్మ్యా =లక్ష్మితో (లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్ ప్రయత్నించువారిని చూచునది. విష్ణుపత్ని), ప్రజాపతిసుతైః చ= బ్రహ్మ మానస పుత్రులైన సనకసనందనాదుల చేత(ప్రజానాం పతిః - ప్రజలకు రాజు. బ్రహ్మ), నిషేవ్య మాణం=సేవింపబడుచూ,తస్యాః ప్రియాయ= లక్ష్మీదేవి ప్రీతి కొరకు, ధృతకామతనుం=మన్మథ రూపమును ధరించిన, త్వామ్= నిన్ను, భజే= సేవింతును.

**తాత్పర్యము:** ఇలావర్షమునకు పడమట చక్కని కేతుమాలము అను పేరుగల

భూఖండమందులీలా విలాసములతో లలిత మందహాసములతో మధురమైన ఆ కారము కలిగి లక్ష్మితో బ్రహ్మ మానస పుత్రులైన సనకసనందనాదుల చేత సేవింపబడుచూ లక్ష్మీదేవి ప్రీతి కొరకు మన్మథ రూపమును ధరించిన నిన్ను సేవింతును.

**21–5 శ్లో.**
**రమ్యే హ్యుదీచి ఖలు రమ్యకనామ్ని వర్షే**
**తద్వర్షనాథ మనువర్యసపర్యమాణమ్ ।**
**భక్తైకవత్సలమమత్సరహృత్సు భాంతం**
**మత్స్యాకృతిం భువననాథ! భజే భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** భువననాథ!= ఓ లోక నాథా!, రమ్యే ఉదీచి= అందమైన ఇలా వృతానికి ఉత్తర భాగంలో ఉన్న (రమ్యతే అత్ర–ఇచట ఆనందింతురు, రమ్యమైనది.)(ఉత్ ఉత్తరం అంచతి, ఉత్క్రాంతం దృష్టిపథం అంచతి పశ్యతి సూర్యం వా ఉత్తర దిశ), రమ్యకనామ్ని వర్షే= రమ్యకమను పేరు గల ఖండములో, తత్ –వర్షనాథః= ఆ ప్రదేశానికి అధిపతి అయిన, మనువర్య= వైవస్వత మనువు యొక్క, సపర్యమాణమ్ ఖలు= సేవలు అందుకుంటూ, భక్త–ఏక –వత్సలమ్ = భక్త వత్సలుడవై, అమత్సర = మత్సరములేని (పరిశుద్ధమైన)(న మత్సరః ద్వేషభావః యస్య–ద్వేషభావము లేనివాడు), హృత్సు= హృదయములు కలవారి యందు (హరతి అసౌ హరించునది), భాంతం= ప్రకాశిస్తూ, మత్స్య–ఆకృతిం = భక్తులను మత్స్య రూపములో అనుగ్రహిస్తున్న(మాద్యతి మదించునది. చేప), భవంతమ్= నిన్ను, భజే హి = సేవి స్తున్నాను.

**తాత్పర్యము:** ఓ లోక నాథా! అందమైన ఇలా వృతానికి ఉత్తర భాగంలో ఉన్న రమ్యకమను పేరు గల ఖండములో ఆ ప్రదేశానికి అధిపతి అయిన వైవస్వత మనువు యొక్క సేవలు అందుకుంటూ భక్త వత్సలుడవై పరిశుద్ధమైన హృదయములు కలవారి యందు ప్రకాశిస్తూ భక్తులను మత్స్య రూపములో అనుగ్రహిస్తున్న నిన్ను నేను సేవి స్తున్నాను.

**21-6 శ్లో.**

**వర్షం హిరణ్మయసమాహ్వయమౌత్తరాహం**

**ఆసీనమద్రిధృతికర్మఠకామఠాంగమ్ ।**

**సంసేవతే పితృగణప్రవరోఽర్యమా యం**

**తం త్వాం భజామి భగవన్! పరచిన్మయాత్మన్ ॥**

**ప్రతిపదార్థము:** పరచిత్ –మయ–ఆత్మన్= విశుద్ధ విజ్ఞాన స్వరూపా!, భగవన్= ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన విశిష్ట గుణములు కలిగినవాడా!, ఔత్తరాహం= ఉత్తర దిక్కులో ఉన్న (ఉత్తరః ఉచ్చతరఃఉన్నతమైనది. ఉత్తరదిశ), హిరణ్మయసమాహ్వయ వర్షం= హిరణ్మయమను అను పేరు గల ప్రదేశంలో (హిరణ్యాత్మకమ్ ఒక వర్షము.), అద్రి ధృతి= మందర పర్వతాన్ని అలవోకగా ధరించి (ధార్యతే ధ్రియతే వా ధరించబడునది), కర్మఠ= ఫలపర్యంతము కార్యమును జేయు తెగువ గల, కామఠ–అంగమ్ = కూర్మావతారంలో, ఆసీనమ్= కొలువై, పితృగణ ప్రవరః= పితృ గణాలలో గొప్పవాడైన(పితౄణాం గణః సమూహఃపితరుల సమూహము.), అర్యమా= అర్యముడు (అర్య ఇవ స్వామి ఇవ మీయతే జ్ఞాయతే స్వామి మాదిరిగా పూజింపబడువాడు. పితృదేవత.), యం తం = ఎవరయితే ఉ న్నారో అతనిచే, సంసేవతే= కొలువబడుతున్న, త్వాం = నిన్ను, భజామి = సేవింతును.

**తాత్పర్యము:** ఉత్తర భాగంలో హిరణ్మయమను అను పేరు గల ప్రదేశంలో మందర పర్వతాన్ని అలవోకగా ధరించిన తాబేలు రూపం ధరించి కొలువై ఉన్నావు.పితృ గణాలలో గొప్పవాడైన అర్యముడు అను వాడు నిన్ను ఎప్పుడూ అక్కడ కొలుస్తుంటాడు. విశుద్ధ విజ్ఞాన స్వరూపుడవ యిన నిన్ను నేను కూడా ఆ రూపంలోనే సేవిస్తాను.

**21-7 శ్లో.**

**కించోత్తరేషు కురుషు ప్రియయా ధరణ్యా**

**సంసేవితో మహితమంత్రనుతిప్రభేదైః ।**

**దంష్ట్రాగ్రఘృష్టఘనపృష్ఠగరిష్ఠవర్ష్మా**
**త్వం పాహి విజ్ఞనుత! యజ్ఞవరాహమూర్తే! ॥**

**ప్రతిపదార్థము:** విజ్ఞనుత! = విజ్ఞులచే కొనియాడబడు దేవా! (విశేషేణ జానాతిబాగా తెలిసినవాడు. విద్వాంసుడు, ప్రవీణుడు.), యజ్ఞవరాహమూర్తే!= యజ్ఞ వరాహ మూర్తీ! (యజ్ఞరూపో వరాహః యజ్ఞరూప వరాహుడు), కించ = మరియు, ఉత్తరేషు కురుషు = ఉత్తర కురు భూములలో, ప్రియయా ధరణ్యా= నీ ప్రియురాలైన భూదేవితో, సంసేవితః= సేవించ బడుతూ, మహితమంత్రనుతిప్రభేదైః= మహిమ తో కూడుకున్న మంత్రాల స్తుతులతో కొనియాడబడుతూ, దంష్ట్ర–అగ్ర= నీ కోర చివరి భాగపు, ఘృష్ట= రాపిడి కలిగిన (ఘృష్యతే అసౌ రాపిడి), ఘన= దట్టమైన (ఘనతి దీప్యతే ప్రకాశించునది. మేఘము దట్టమైనది), పృష్ఠ= పృష్ఠభాగ ముతో (పుష్యతే సిచ్యతే తడుపబడునది. పృష్ఠభాగము స్తోత్రము), గరిష్ఠ= చాలా పెద్దదయిన (అతిశయేన గురుః–చాలా పెద్దది), వర్ష్మ= శరీరము కలిగిన (వర్షతి వృష్యతేవ స్వేదమ్ వర్ష సేచనముతో పుట్టునది), త్వం = నువ్వు, పాహి =నన్ను రక్షించు.

**తాత్పర్యము:** విజ్ఞులచే కొనియాడబడు దేవా! ఉత్తర కురు భూములలో నీ ప్రియురాలైన భూదేవి తో సేవించ బడుతూ మహిమ తో కూడుకున్న మంత్రాలతో కొనియాడబడుతూ, నీ కోర తో పృష్ఠభాగమును గీరు కొనుచున్న ఉన్నత మైన దేహము కల యజ్ఞ వరాహ మూర్తీ ! నన్ను రక్షించు.

**విశేషము:** దంష్ట్రాగ్రఘృష్టఘనపృష్ఠగరిష్ఠవర్ష్మా అను పదములోని ఘన పదానికి మేఘము అను అర్థము గ్రహించి ‘‘నీకోరలతో మేఘముల అంచులను తాకుచూ మహాకాయముతో నిలిచి ఉన్నా’’వని ఇంకొక సమన్వయం చెప్పుకోవచ్చు.

**21–8 శ్లో.**
**యామ్యాం దిశం భజతి కింపురుషాఖ్యవర్షే**
**సంసేవితో హనుమతా దృఢభక్తిభాజా ।**
**సీతాభిరామ పరమాద్భుత రూపశాలీ**
**రామాత్మకః పరిలసన్ పరిపాహి విష్ణో! ॥**

**ప్రతిపదార్థం:** యామ్యాం దిశం = యమ సంబంధమైన దక్షిణ దిశలో ఉన్న, భజతి కింపురుష–ఆఖ్యవర్షే= కిం పురుషమను పేరుగల సీమలో (హిమాచల, హేమకూట ముల మధ్య గల దేశం), దృఢభక్తిభాజ= పరమ భక్త సేవకుడయిన, హనుమతా= హనుమంతునిచే(హనూ అస్తి అస్య–దవుడలు కలవాడు. హనుమంతుడు.), సంసేవితః= సేవింపబడుచూ, సీత = సీతాదేవితో (సినోతి బధ్నాతి స్నేహమ్ స్నేహమును బంధించునది. నాగటి చాలు శ్రీరాముని భార్య), అభిరామ = సుందర మూర్తివై (అభిరమతే మనో అత్ర–సుందరమైనది మనోహరమైనది ప్రియమైనది), పరమ–అద్భుత రూపశాలీ= పరమ అద్భుతమైన రూపముతో (రూపేణ శాలతే శోభతేఅందంతో ప్రకాశించువాడు. రూపవంతుడు, అందగాడు), రామ–ఆత్మకః= రామస్వరూపునిగా, పరిలసన్ = ప్రకాశిస్తున్న, విష్ణో!= ఓ విష్ణు మూర్తీ !, పరిపాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఓ విష్ణు దేవా! దక్షిణ దిశలో ఉన్న కిం పురుష సీమలో దృఢమైన భక్తి కలిగిన హనుమంతుని చే సేవింప బడుచు సీతాదేవితో సుందర మూర్తివై పరమ అద్భుతమైన రూపముతో ప్రకాశిస్తున్న ఓ విష్ణూ !నన్ను రక్షించు.

**21–9 శ్లో.**
**శ్రీ నారదేన సహ భారతఖండముఖ్యైః**
**త్వం సాంఖ్యయోగనుతిభిః సముపాస్యమానః ।**
**ఆకల్పకాలమిహ సాధుజనాభిరక్షీ**
**నారాయణో నరసఖః పరిపాహిభూమన్! ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= ఓ గొప్పవాడా ! (మహత్త్వం,సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా), శ్రీ నారదేన సహ= శ్రీ నారదునితో కలిసి, భారతఖండముఖ్యైః= భారత ఖండములోని ముఖ్యులైన వేద పండితులు, త్వం = నిన్ను, సాంఖ్యయోగనుతిభిః = సాంఖ్య యోగ తత్వ ప్రతిపాదితములైన స్తోత్రములతో (సంఖ్యాయతే అత్ర సంఖ్యా సమ్యక్ జ్ఞానం సా అత్ర అస్తి సమ్యక్ జ్ఞానం కల్గించునది. సాంఖ్య దర్శనము.ప్రకృతి పురుష వివేక జ్ఞానము), సముపాస్యమానః=పొగుడుచుండగా, ఇహ= ఇక్కడ, ఆకల్పకాలమ్ = కల్పారంభ

కాలమునుండి (ఆకల్పం కల్పపర్యంతం కల్పారంభాద్వా కల్పపర్యంతము కల్పారంభమునుండి), సాధుజన-అభిరక్షీ= సాధు జన రక్షకునిగా, నరసఖః= నరసఖునిగా వెలసిన( నర=నృణాతి ప్రాపయతి ఆనందాదికమ్ ఆనందము నిచ్చువాడు .మనుష్యుడు.అర్జునుడు), నారాయణ= ఓ నారాయణా ! (నారా జలం అయనం స్థానం యస్య-జలము నివాస స్థానంగా కలవాడు. విష్ణువు.), పరిపాహి = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** ఓ ప్రభు! శ్రీ నారదునితో కలిసి భారత ఖండములో ముఖ్యులైన వేద పండితులు సాంఖ్య యోగ తత్వ ప్రతిపాదితములైన స్తోత్రములతో పొగుడుతుండగా కల్పాంతం వరకు సాధు జన రక్షకునిగా నరసఖునిగా వెలసిన ఓ నారాయణా! నన్ను రక్షించు.

**21-10 శ్లో.**

**ప్లాక్షేఽర్కరూపమయి! శాల్మల ఇందురూపం**
**ద్వీపే భజంతి కుశనామని వహ్నిరూపమ్ ।**
**క్రౌంచేంబురూపమథ వాయుమయం చ శాకే**
**త్వాం బ్రహ్మరూపమయి పుష్కరనామ్నిలోకాః ॥**

**ప్రతిపదార్థము:** అయి = ఓ దేవా!, ప్లాక్షే = ప్లక్ష ద్వీపములో (జువ్వి పండ్లు ఎక్కువగా కల ద్వీపము), అర్కరూపమ్ = సూర్యుని గా, (అర్కయతి తపతి తాపయతి తపించువాడు. సూర్యుడు), శాల్మల= శాల్మలి ద్వీపములో(శాలతే శోభతే ఉన్నత్యా ఉన్నతిచే శోభించినది. జువ్వి చెట్టు), ఇందురూపం= చంద్రునిగా (ఉనత్తి చంద్రికయా భువం క్లిన్నాం కరోతి వెన్నెలతో భూమిని తడుపువాడు. చంద్రుడు), కుశనామని= కుశము అను పేరుగల(కుం పాపం శ్యతి నాశయతిపాపమును నశింప చేయునది. దర్భ. ), ద్వీపే= ద్వీపములో(ద్వయోః పార్శ్వయోః గతా ఆపః యత్ర రెండు వైపుల నీరు కలిగినది. ద్వీపము), వహ్నిరూపమ్= అగ్ని రూపునిగా(వహతి ప్రాపయతి హవ్యం దేవేభ్యః దేవతలకు హవిస్సును అందింపచేయునది. అగ్ని, క్రౌంచే-అంబురూపమ్= క్రౌంచ ద్వీపంలో జల రూపునిగా( క్రుంచతి వక్రీభవతి వక్రముగా పోవునది. క్రౌంచపక్షి)( అంబు=

అమంతి గచ్ఛంతి చేష్టంతే ప్రాణినః యేన దీనివలన ప్రాణులు జీవింతురు. జలము.), అథ= అటుపిమ్మట, శాకే వాయుమయం చ= శాక ద్వీపములో వాయు రూపునిగా (శక్యతే భోక్తుమ్ తినదగినది. కూర కరక్కాయ.)(వాయు= వాతి గచ్ఛతి జానాతి స్పృశతి వా వెళ్లునది. గాలి), పుష్కరనామ్నిలోకాః= పుష్కర ద్వీపములో (పుష్కం జలం రాతి దదాతి జలము నిచ్చునది. మేఘము నది), బ్రహ్మరూపమ్ = బ్రహ్మ రూపునిగా, త్వాం= నిన్ను, భజంతి= సేవిస్తారు.

**తాత్పర్యము:** ఓ దేవా! ప్లక్ష ద్వీపములో సూర్యుని గా, శాల్మలి ద్వీపములో చంద్రునిగా, కుశము అను పేరుగల ద్వీపములో అగ్ని రూపునిగా, క్రౌంచ ద్వీపంలో జల రూపునిగా, శాక ద్వీపములో వాయు రూపునిగా ,పుష్కర ద్వీపములో బ్రహ్మ రూపునిగా ప్రజలు నిన్ను సేవిస్తారు.

**21-11 శ్లో.**

**సర్వైర్ధ్రువాదిభిరుడు ప్రకరైర్గ్రహైశ్చ**
**పుచ్ఛాదికేష్వవయవేష్వభికల్ప్యమానైః ।**
**త్వం శింశుమారవపుషా మహతాముపాస్యః**
**సంధ్యాసు రుంధి నరకం మమ సింధుశాయిన్! ॥**

**ప్రతిపదార్థము:** సింధుశాయిన్!= పాల సముద్రములో పవళించిన దేవ! (సింధుః సముద్రం శయనం యస్య సముద్రము శయనంగా గలవాడు. విష్ణువు.), ధ్రువ- ఆదిభిః = ధ్రువుడు మొదలైన జ్యోతిర్మండలముచే(ధ్రువతి స్థిరీభవతి స్థిరంగా వుండునది. ధ్రువుడు), ఉడు ప్రకరైః = అశ్విని మొదలైన సర్వ నక్షత్రాలను,( ఓడతి సూర్యాత్ ప్రకాశం సంగృహ్ణాతి సూర్యుని నుండి ప్రకాశము గ్రహించునది. నక్షత్రము ), గ్రహైః-చ= గ్రహాలను(గృహ్ణాతి ప్రకాశం సూర్యాత్ సూర్యుని నుండి ప్రకాశము గ్రహించు పృథివ్యాధి గ్రహాలు.), పుచ్ఛ = తోక (పుచ్ఛతి సంతోషయతి సంతోషింపచేయునది. తోక.), ఆదికేషు= మొదలయిన, సర్వైః = అన్ని, అవయవేషు = అవయవములలో (అవయౌతి మిశ్రయతి శరీరే శరీరముతో కలిసి యుండునది), అభికల్ప్యమానైః=నిరూపింపబడిన, శింశుమారవపుషా= శింశుమారమను( మొసలి) గొప్పదైన స్వరూపము కలిగి, మహతామ్=

మహానుభావులకు, సంధ్యాసు = మూడు సంధ్యలలో ఉపాస్యః= కొలువదగి ఉన్న త్వం= నువ్వు మమ =నాకు నరకం= నరకమును రుం ధి= పోగొట్టుము.

**తాత్పర్యము:** పాల సముద్రములో పవళించిన దేవ! ధ్రువుడు మొదలైన సర్వ మండలాలను, అశ్విని మొదలైన సర్వ నక్షత్రాలను, సూర్యుడు మొదలైన గ్రహాలను,- శింశుమారమను నీ గొప్పదైన జ్యోతిశ్చక్ర స్వరూపములో తోక మొదలు గా ఉన్న అవయవములలో భావన చేస్తూ- మూడు సంధ్యలలో మహానుభావులు నిన్ను సేవిస్తూ తరిస్తున్నారు. ఓ దేవా! నాకు నరక బాధలు తొలగించు.

**విశేషాలు:**

**శింశుమారము:** ఇది ఒక జ్యోతిశ్చక్రము. ఈచక్రమున ధ్రువుడు ఇంద్రవరుణకశ్యప ప్రముఖులతో కూడి నిత్యము ప్రదక్షిణముగ తిరుగుచు ఉండును. మఱియు దీని పుచ్ఛమున ప్రజాపతియు అగ్నీంద్ర ధర్ములును, పుచ్ఛమూలమున ధాతృ విధాతలును, కటిప్రదేశమున ఋషిసప్తకమును, ఉత్తర హనువున అగస్త్యుడును, అపరహనువున యముడును, ముఖమున అంగారకుడును, గుహ్యమున శనైశ్చరుడును, మేఢ్రమున బృహస్పతియును, పక్షమున ఆదిత్యుడును, నాభిని శుక్రుడును, చిత్తమున చంద్రుడును, స్తనమున అశ్వినులును, ప్రాణాపానముల బుధుడును, సర్వాంగములను శని కేతు గ్రహములును, రోమమున తారలును ఉండును. ఇది సర్వదేవతామయము అయిన పుండరీకాక్షుని దివ్యదేహముగా ఎఱుగవలయును.

**21-12 శ్లో.**

**పాతాలమూలభువి శేషతనుం భవంతం**
**లోలైకకుండలవిరాజి సహస్ర శీర్షమ్ ।**
**నీలాంబరం ధృతహలం భుజగాంగనాభిః**
**జుష్ట భజే హర గదాన్ గురుగేహనాథ! ॥**

**ప్రతిపదార్ధము:** గురుగేహనాథ!= ఓ గురువాయూరు దేవా!, పాతాలమూలభువి =

పాతాళ మూలముగా కలిగిన భూమియందు (పాతాళము = పతతి అస్మిన్ అధర్మం చరణాత్ అధర్మాచరణము వలన పాపులు ఇందులో పడుదురు. పాతాళలోకము), భవంతం= నువ్వు, లోల= ఊగుచున్న (లోడతి విలోడయతి చంచలో భవతి చంచలమైనది), ఏకకుండల= ఒక కుండలము(కుండ్యతే రక్ష్యతే కుండం తదాకారం లాతి గృహ్ణాతి రక్షింపబడునది. ఒక విశిష్ట ఆకారములో వుండునది. కుండలములు), సహస్ర శీర్షమ్= వేయి పడగలయందు, విరాజి= ప్రకాశిస్తుండగా, నీల–అంబరం= నీలాంబరము ధరించి (నీలం చ తత్ అంబరమ్ నల్లని వస్త్రము), ధృతహలం= చేతిలో నాగలి ఆయుధమును ధరించి (హలతి భూమిమ్ భూమిని దున్నునది. నాగలి), భుజగ–అంగనాభిః జుష్టం = నాగ స్త్రీలు సేవిస్తుండగా(భుజం కుటిలీ భవన్ గచ్ఛతి వంకరగా పోవునది. సర్పము), శేషతనుం= ఆదిశేషుని రూపంలో ఉన్న నిన్ను, భజే = సేవిస్తాను, గదాన్ = నా రోగములను, హర= పోగొట్టుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! పాతాళ మూలముగా కలిగిన భూమియందు నువ్వు ఊగుచున్న ఒక కుండలము వేయి పడగలయందు ప్రకాశిస్తుండగా నీలాంబరము ధరించి చేతిలో నాగలి ఆయుధమును ధరించి నాగకాంతలు సేవిస్తుండగా నువ్వు ఆదిశేషుని రూపంలో ప్రకాశిస్తున్నావు. అటువంటి నువ్వు నా రోగములను పోగొట్టి రక్షించ వలసినది.

***పంచమ స్కంధము పూర్తి***

**21వ దశకము సమాప్తము**

# షష్ఠ స్కంధము

## దశకమ్ 22 – అజామిలోపాఖ్యానమ్

**22-1 శ్లో.**

**అజామిలోనామ మహీసురః పురా**
**చరన్ విభో! ధర్మపథాన్ గృహాశ్రమీ ।**
**గురోర్గిరా కాననమేత్య దృష్టవాన్**
**సుధృష్టశీలాం కులటాం మదాకులామ్ ॥**

**ప్రతిపదార్థము:** విభో! = ఓ గురువాయూరు దేవా !, పురా= పూర్వము, అజామిలః నామ= అజామిళుడను పేరుగల (ఉత్తమ కులమందు పుట్టనిదానిని కూడినవాడు కనుక అజామిళుడు), మహీసురః= ఒక బ్రాహ్మణుడు, గృహ–ఆశ్రమీ= తన ఆశ్రమానికి తగిన (గృహ్ణాతి ధాన్యాదికం మనుష్యాంశ్చ ధనాదులను, మనుష్యులను గ్రహించునది. గృహము, ఇల్లు.)(ఆశ్రమే తిష్ఠతి ఆశ్రమధర్మం చరతి ఆశ్రమ ధర్మాన్ని ఆచరించువాడు), ధర్మపథాన్= ప్రాపంచిక విషయాలకు అనుకూలమగు ప్రవృత్తి, మోక్షమునకు అనుకూలమైన నివృత్తి మార్గములను (ధర్మ=ధ్రియతే పుణ్యాత్మభిః – దీనిని పుణ్యాత్ములు ధరింతురు), చరన్= అనుష్ఠిస్తూ, గురోః గిరా= తండ్రి ఆజ్ఞచే (గురు= గృణాతి ఉపదిశతి వేదవిద్యాం ఆచారం చ – వేదవిద్యను ఆచారమును ఉపదేశించువాడు. తండ్రి మొదలగువారు), కాననమ్ = ఫల పుష్పాదులను తెచ్చుటకు అడవికి(కం జలం అననం జీవనం అస్య–జలమే జీవనంగా గలది. వనము), ఏత్య = వచ్చి, సుధృష్టశీలాం= అసత్యమైన విలాసాదులచే పరమతి వంచన సామర్థ్యము కలిగిన ప్రౌఢయైన(ధృష్టా= ధర్షయతే శక్తిబంధనం కరోతి పరుల సామర్థ్యమును బంధించునది, సడలించునది), మద–ఆకులామ్= మద్యము తాగుటచే మదముగొని యున్న(మద=మాదయతి మాద్యతి అనేన దీనితో ఆనందింతురు, మత్తును పొందుదురు), కులటాం= ఒక జారిణిని (కులాని అటంతి శీలం భినత్తి శీలమును పాడు చేయునది. వ్యభిచారిణి), దృష్టవాన్= చూసాడు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! పూర్వము అజామిళుడను పేరుగల ఒక బ్రాహ్మణుడు తన ఆశ్రమానికి తగిన ప్రవృత్తి నివృత్తి మార్గములను అనుష్ఠిస్తూ తండ్రి ఆజ్ఞచే ఫల పుష్పాదులను తెచ్చుటకు అడవికి వచ్చి అసత్యమైన విలాసాదులచే పరమతి వంచన సామర్థ్యము కలిగిన ,ప్రౌఢయైన, మద్యము తాగుటచే మదముగొని యున్న ఒక జారిణిని చూసాడు.

**విశేషాలు:** ఈ దశకములోని ఛందస్సు వంశస్థము(**జ , త , జ , ర**)

**22-2 శ్లో.**

**స్వతః ప్రశాంతోఽపి తదాహృతాశయః**
**స్వధర్మముత్సృజ్య తయా సమారమాన్ ।**
**అధర్మకారీ దశమీభవన్ పున**
**ర్దధౌ భవన్నామయుతే సుతే రతిమ్ ॥**

**ప్రతిపదార్థము:** స్వతః= స్వభావతః, తనకుతానే, ప్రశాంతః-అపి = ప్రశాంతు డయినప్పటికి(అతిశయేన శాంతః-మిక్కిలి శాంతి కలిగినది. శాంతమైనది), తత్-ఆహృత-ఆశయః=ఆ కులట చేత అపహరించబడిన స్వధర్మము కలవాడై, (ఆశయ=ఆశేతే తస్య భావః-అభిప్రాయము),స్వధర్మమ్ =తన సహ ధర్మచారిణిని, ఉత్సృజ్య = విడిచి, తయా= ఆమెతో, సమారమాన్= క్రీడించుచూ, అధర్మకారీ= అధర్మము చేయుచూ, దశమీభవన్ = ముసలివాడై, పునః= మరలా, భవత్ - నామయుతే=నీపేరుగల నారాయణుడను పేరుతో ఉన్న,సుతే=కుమారునియందు, రతిమ్= అతిస్నేహమును (మోహమును), దధౌ= పొందెను.

**తాత్పర్యము:** స్వభావరీత్యా ప్రశాంతుడయినప్పటికి ఆ కులట మోహములో స్వధర్మమును, సహ ధర్మ చారిణిని విడిచి ఆమెతో క్రీడించుచూ అధర్మము చేయుచూ ముసలివాడై నీపేరుగల నారాయణుడను పేరుతో ఉన్న కుమారునియందు అతిస్నేహమును ( మోహమును) పొందెను.

**22-3 శ్లో.**

**స మృత్యుకాలే యమరాజకింకరాన్**
**భయంకరాన్ త్రీనభిలక్షయన్ భియా ।**
**పురా మనాక్ త్వత్స్మృతివాసనాబలా**
**జ్జుహావ నారాయణనామకం సుతమ్ ॥**

**ప్రతిపదార్థము:** సః= ఆ అజామిళుడు, మృత్యుకాలే = మరణ సమయంలో (మ్రియతే అస్మాత్ వీని వలన మరణించును. యముడు), భయంకరాన్ = భయంకరులైన, త్రీన్ =ముగ్గురు, యమరాజకింకరాన్ = యమ కింకరులను (యమశ్చాసౌ రాజా చ-యమధర్మరాజు.)( కింకరః=ఆదిష్టమేవ కరోతి నాధికమ్ చెప్పిన పని మాత్రం చేయువాడు.సేవకుడు), అభిలక్షయన్= చూసి, భియా= భయముతో, పురా = పూర్వము, మనాక్= కొంచెముగా ఉన్న (మన్యతే అల్పత్వమ్ తక్కువగా చూడబడినది), త్వత్ స్మృతివాసనాబలాత్ = నీ ఉపాసనా బలమున (స్మరతి అనుభూతవిషయం తస్య భావః-స్మరణము), నారాయణనామకం = నారాయణుడని పేరు ఉన్న, సుతమ్=కుమారుని, జుహావ= పిలిచెను.

**తాత్పర్యము:** ఆ అజామిళుడు మరణ సమయంలో భయంకరులైన ముగ్గురు యమ కింకరులను చూసి భయముతో పూర్వము కొంచెముగా ఉన్న నీ ఉపాసనా బలమున( పూర్వ జన్మ సంస్కారము వలన) నారాయణుడని పేరు ఉన్న కుమారుని పిలిచెను.

**22-4 శ్లో.**

**దురాశయస్యాపి తదాస్యనిర్గత**
**త్వదీయనామాక్షరమాత్రవైభవాత్ ।**
**పురోఽభిపేతుర్భవదీయపార్షదా**
**శ్చతుర్భుజాః పీతపటామనోహరాః ॥**

**ప్రతిపదార్థము:** దురాశయస్య-అపి= కుటుంబమునందు ఆసక్తి కలిగిన మనస్సు కలిగినవాడయినప్పటికి, తత్ —ఆస్య= మరణదశలో నోటినుండి (అస్యతే గ్రాసః

అత్ర–గ్రాసము ఇందులో వేయబడును. నోరు), నిర్గత= వెడలిన, త్వదీయ నామ–అక్షరమాత్రవైభవాత్= నీ నామాక్షర మాత్ర వైభవముచే (భక్తిశ్రద్ధ ఆవృత్తి వర్ణ వ్యక్తత మొదలయిన భావ వైభవముచే), చతుర్భుజాః = నాలుగు భుజములు కలిగిన(చత్వారో భుజాః అస్య–నాల్గు భుజములు కలవాడు), పీతపటాః = పచ్చని వస్త్రములు ధరించిన (పీతః వర్ణః అస్తి అస్య పసుపు)(పట= పట్యతే వేష్ట్యతే నేయబడునది. వస్త్రము),మనోహరాః=మనోహరులైన,భవదీయపార్షదాః= నీ దూతలు(విష్ణుదూతలు) (పరిషది భవః తత్ర స్థితో వా సభలో వుండువాడు. సభ్యుడు), పురః= అజామిళుని ఎదుట, అభిపేతుః= ఆవిర్భవించారు.

**తాత్పర్యము:** కుటుంబమునందు ఆసక్తి కలిగిన మనస్సు కలిగినవాడయినప్పటికి మరణదశలో అజామిళుని నోటినుండి వెడలిన నీ నామాక్షర మాత్ర వైభవముచే నాలుగు భుజములు కలిగిన పచ్చని వస్త్రములు ధరించిన మనోహరులైన నీ దూతలు( విష్ణుదూతలు) అజామిళుని ఎదుట ఆవిర్భవించారు.

**22–5 శ్లో.**
**అముం చ సంపాశ్య వికర్షతో భటాన్**
**విముంచతేత్యారురుధుర్బలాదమీ ।**
**నివారితాస్తే చ భవజ్జనైస్తదా**
**తదీయపాపం నిఖిలం న్యవేదయన్ ॥**

**ప్రతిపదార్థము:** అముం చ= ఈ అజామిళుని, సంపాశ్య= కంఠమునకు పాశము వేసి, భటాన్= యమ భటులు (భజ్యతే మ్రియతేయోద్ధ, యోధుడు, భటుడు), వికర్షతః = లాగుచుండగా, తదా = అప్పుడు, అమీ= ఈ, భవత్ – జనైః = నీ విష్ణుదూతలు, బలాత్ = బలము వలన, విముంచత –ఇతి= వదలుడని మాటలతో, ఆరురుధుః = అడ్డగించిరి, తే=వారు, నివారితాః చ= యమదూతలను నివారించిరి కూడా, తదీయపాపం = ఆ అజామిళుని పాపముల, నిఖిలం=సమస్తమును (నివృత్తం ఖిలం శేషః యస్మాత్ మిగులు లేనిది. సమస్తము), న్యవేదయన్= యమభటులు విష్ణుదూతలకు నివేదించిరి.

**తాత్పర్యము:** ఈ అజామిళుని కంఠమునకు పాశము వేసి యమభటులు లాగుచుండగా అప్పుడు నీ విష్ణుదూతలు వదలుడని యమదూతలను అడ్డగించిరి. ఆ అజామిళుని పాపముల సమస్తమును యమభటులు విష్ణుదూతలకు నివేదించిరి.

**22–6 శ్లో.**
**భవంతుపాపాని కథం తు నిష్కృతే**
**కృతేఽపి భో! దండనమస్తి పండితాః ।**
**న నిష్కృతిః కిం విదితా భవాద్దృశా**
**మితి ప్రభో! త్వత్పురుషా బభాషిరే ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో! = ఓ ప్రభూ!, భోః పండితాః=ఓ పండితులార! (యమదూతలారా!) (పండా తత్త్వగా బుద్ధిః జాతా అస్య–శాస్త్రజ్ఞానము, తత్త్వజ్ఞానము కలిగినవాడు. పండితుడు), పాపాని= మీరు చెప్పినట్లుగా ఇతడు పాపాలు, భవంతు = చేసినవాడగుగాక (పాపాలు చేసాడు), తు= కాని, నిష్కృతే కృతే –అపి = ప్రాయశ్చిత్తము చేసుకొన్నప్పటికి కూడా, దండనమ్ = శిక్ష, కథం= ఎట్లు, అస్తి= ఉండును, భవాద్దృశామ్ =యమ ధర్మ రాజు భటులైన మీ వంటి వారికి కూడా, నిష్కృతిః= నిష్కృతి (నిర్ముక్తిః పాపాన్ముక్తిః పాపము నుండి వదలబడుట), కిం న విదితా = తెలియదా ఏమి!, త్వత్ –పురుషాః= విష్ణుదూతలు, ఇతి= ఈ విధముగా యమదూతలతో, బభాషిరే= చెప్పారు.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! విష్ణుదూతలు ఈ విధముగా యమదూతలతో చెప్పారు. “ఓ యమదూతలారా! మీరు చెప్పినట్లుగా ఇతడు పాపాలు చేసాడు. కాని ప్రాయశ్చిత్తము చేసుకొన్నప్పుడు దండనము ఎట్లు ఉండును? యమ ధర్మ రాజు భటులైన మీ వంటి వారికి కూడా నిష్కృతి తెలియదా ఏమి !?”

**22–7–శ్లో.**
**శ్రుతి స్మృతిభ్యాం విహితా వ్రతాదయః**
**పునంతి పాపం న లునంతి వాసనామ్ ।**

**అనంతసేవా తు నికృంతతి ద్వయీ**
**మితి ప్రభో! త్వత్పురుషా బభాషిరే ॥**

**ప్రతిపదార్ధము:** ప్రభో! = ఓ ప్రభూ!, శ్రుతి స్మృతిభ్యాం = శ్రుతి స్మృతులలో (శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్ధః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్ధం తెలియును. వేదము) (స్మరతి అనుభూతవిషయం తస్య భావః–స్మరణము), విహితాః= విధింపబడిన, వ్రత–ఆదయః = చాంద్రాయణాది వ్రతములు, తీర్ధ స్నానాలు(వారయతి పాపాచరణాత్ పాపాచరణము నుండి వారించునది. వ్రతము), పాపం పునంతి= పాప శోధనము చేయగలవు, వాసనామ్ = పాప వాసనలను (వాసయతి కర్మణా యోజయతి, జీవానాం మనాంసి జీవులయొక్క మనస్సును పూర్వకర్మలతో కలుపునది. వాసనా), లునంతి న= హరింపలేవు.(అనగా పాప సజాతీయమైన కర్మను మరలా చేయకుండా ఆపలేవు. అనగా పాపములను చేయించునని భావం), అనంత= శ్రీ హరి యొక్క (నాస్తి అంతః = పరిచ్ఛేదః దేశతః కాలతః వస్తుతశ్చ యస్య దేశ, కాల, వస్తు పరిమాణం లేనివాడు. పరబ్రహ్మ), సేవా తు = సేవ, ద్వయీ = పాపమును, పాప వాసనను రెండింటిని, నికృంతతి= నిర్మూలింపగలవు, ఇతి= ఈ విధముగా, త్వత్ –పురుషాః= విష్ణుదూతలు యమదూతలతో, బభాషిరే= చెప్పారు.

**తాత్పర్యము:** ఓ ప్రభూ శ్రుతి స్మృతులలో విధింపబడిన చాంద్రాయణాది వ్రతములు, తీర్ధ స్నానాలు పాప శోధనము చేయగలవు. పాప వాసనలను హరింపలేవు. శ్రీ హరి యొక్క సేవ పాపమును, పాప వాసనను రెండింటిని నిర్మూలింపగలవని విష్ణుదూతలు ఈ విధముగా యమదూతలతో చెప్పారు.

**22–8 శ్లో.**
**అనేన భో! జన్మ సహస్రకోటిభిః**
**కృతేషు పాపేష్వపి నిష్కృతిః కృతా ।**
**యదగ్రహీన్నామ భయాకులో హరేః**
**ఇతిప్రభో! త్వత్పురుషా బభాషిరే ॥**

**ప్రతిపదార్ధము:** భోః = ఓ యమ భటులార !, భయ–ఆకులః= భయ

భ్రాంతుడయినప్పటికి(బిభేతి అస్మాత్ దీని వలన భయపడుదురు. భయము.) (అత్యంతం క్షుబ్ధః అసంగతశ్చ-క్షోభ చెందినవాడు), యత్= ఏ, హరేః = నారాయణుని యొక్క, నామ అగ్రహీత్ = నామమును స్వీకరించాడు ( పలికాడు) (అందువలన), అనేన = ఇతని చేత, జన్మ సహస్రకోటిభిః= అనేక కోటి జన్మలలో (జాయతే తత్ ఉత్పత్తి, పుట్టుక), కృతేషు= చేసుకొన్న, పాపేషు-అపి = పాపములన్నిటికి కూడ, నిష్కృతిః = ప్రాయశ్చిత్తము, కృతా= చేయబడినది, ఇతి= ఈ విధముగా, త్వత్ -పురుషాః= విష్ణుదూతలు, యమదూతలతో బభాషిరే= చెప్పారు.

**తాత్పర్యము:** ఓ యమ భటులార! భయ భ్రాంతుడయినప్పటికి నారాయణుని యొక్క నామమును పలికాడు. అందువలన ఇతని అనేక కోటి జన్మల పాపములన్నిటికి కూడ ప్రాయశ్చిత్తము చేయబడినది. అని ఈ విధముగా విష్ణుదూతలు యమదూతలతో చెప్పారు.

**22-9 శ్లో.**

**నృణామబుద్ధ్యాపి ముకుందకీర్తనం**
**దహత్యఘౌఘాన్ మహిమాఽస్య తా దృశః ।**
**యథాగ్నిరేధాంసి యథౌషధం గదా**
**నితి ప్రభో! త్వత్పురుషా బభాషిరే ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో = ఓ ప్రభూ!, ముకుందకీర్తనం= ముకుందుని కీర్తనము, అబుద్ధ్యా-అపి = తెలియక చేసినప్పటికి (అబుద్ధి= న బుద్ధిః-అజ్ఞానము మూర్ఖత్వము), నృణామ్ = మానవుల యొక్క (నృ= నయతి కాలం-కాలము గడుపువాడు. మనిషి), అఘ-ఔఘాన్ = సర్వ పాప సమూహములను, దహతి= దహించును, యథా= ఎట్లు, అగ్నిః = అగ్ని, ఏధాంసి=ఇంధనాన్ని (కట్టెలను) (ఇధ్యతే అగ్ని అనేన-అగ్నిని ప్రజ్వలింప చేయునది. కట్టెలు), యథా= ఎట్లు, ఔషధం = ఔషధము(ఔషధౌ భవః-ఔషధములో నుండునది. రోగనాశక గుణము), గదాన్ = వ్యాధులను (హరించునో), అస్య మహిమా = ఆ ప్రభావము

(గోవింద నామ కీర్తనము), తాదృశః= అట్టిది (స ఇవ దృశ్యతే, తస్య ఇవ దర్శనం యస్య–దానివలె కనబడునది. అటువంటిది, ఇతి= అని ఈ విధముగా, త్వత్–పురుషాః= విష్ణుదూతలు యమదూతలతో, బభాషిరే= చెప్పారు.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! ముకుందుని కీర్తనము తెలియక చేసినప్పటికి మానవుల యొక్క సర్వ పాప సమూహములను దహించును. ఏ విధముగా కట్టెలను అగ్ని, ఔషధము వ్యాధులను ఎట్లు హరించునో ఆవిధముగా గోవింద నామ కీర్తన సర్వ పాప సమూహములను దహించునని ఈ విధముగా విష్ణుదూతలు యమదూతలతో చెప్పారు

**విశేషాలు:**

**ఏధాంసి:** ఈ శ్లోకంలోని ఏధాంసి పద ప్రయోగం భగవద్గీతను జ్ఞప్తికి తెస్తున్నది. యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున। జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 4–37 ॥(**అర్జునా ! ఎలాగైతే అగ్ని కట్టెలను భస్మము చేస్తుందో అలాగే జ్ఞానాగ్ని కూడా భౌతిక కర్మల నుండి పుట్టే ప్రతిక్రియలన్నిటిని భస్మము చేస్తుంది.**)

**22–10 శ్లో.**
**ఇతీరితైర్యామ్యభటైరపాసృతే**
**భవద్భటానాం చ గణే తిరోహితే ।**
**భవత్స్మృతిం కంచన కాలమాచరన్**
**భవత్పదం ప్రాపి భవద్భటైరసౌ ॥**

**ప్రతిపదార్థము:** ఇతి –ఈరితైః = ఈ విధంగా విష్ణుదూతలచే చెప్పబడిన (ఈరితః ప్రేషితః ప్రేరితో వా పంపబడ్డవాడు ప్రేరేపింపబడ్డవాడు), యామ్యభటైః= యమ భటులు, అపాసృతే = తొలగిపోగా, భవత్–భటానాం చ గణే = నీ యొక్క (విష్ణువు యొక్క) దూతల సమూహము, తిరోహితే= అంతర్ధానము కాగా, అసౌ= ఈ అజామిళుడు, కంచన కాలమ్= కొద్దికాలము గంగాద్వారములోని ఒక

దేవాలయములో, భవత్స్మృతిం = నీ నామ ధ్యానము, ఆచరన్ = ఆచరించి, భవత్ –భటైః= నీ దూతలయిన విష్ణుదూతలతో సారూప్యము పొంది, భవత్ పదం = నీ స్థానమైన వైకుంఠమును, ప్రాపి= పొందెను.

**తాత్పర్యము:** ఈ విధంగా (పై శ్లోకాలతో అన్వయం) విష్ణుదూతలచే చెప్పబడిన యమ భటులు అడ్డుతొలగిపోగా నీ దూతల సమూహము అంతర్ధానమైరి.ఈ అజామిళుడు కొద్దికాలము గంగాద్వారములోని ఒక దేవాలయములో నీ నామ ధ్యానము ఆచరించి నీ దూతలయిన విష్ణుదూతలతో సారూప్యము (సమాన రూపము) పొంది నీ స్థానమైన వైకుంఠమును పొందెను.

**22–11 శ్లో.**
**స్వకింకరావేదనశంకితో యమ**
**స్త్వదంఘ్రిభక్తేషు న గమ్యతామితి ।**
**స్వకీయభృత్యానశిశిక్షదుచ్చకైః**
**స దేవ! వాతాలయనాథ! పాహిమామ్ ॥**

**ప్రతిపదార్ధము:** వాతాలయనాథ = గురువాయూరు దేవా!, స్వకింకర = తన సేవకులయొక్క ఆవేదన= ఆవేదనచే, శంకితః = సందేహపడిన, యమః = యముడు, త్వత్ అంఘ్రి భక్తేషు= నీ(విష్ణు) చరణ భక్తుల జోలికి, న గమ్యతామ్ = ఎప్పుడు, వెళ్ళకుడు –ఇతి= అని, ఉచ్చకైః= అతి నిర్బంధముగా, స్వకీయభృత్యాన్= తన సేవకులకు, అశిశిక్షత్= ఆజ్ఞ ఇచ్చెను, స దేవ! =అటువంటి, భక్త వాత్సల్యము కలిగిన దేవా !, మామ్= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! జరిగిన వృత్తాంతాన్ని యమకింకరులు తమ స్వామియైన యమునికి చెప్పారు. విష్ణు నామ స్మరణ చేసిన వారిని బంధించిన తన భటులు చేసిన అపరాధము తనకు కూడా చుట్టుకొనునని భయపడి సందేహపడిన యముడు విష్ణు భక్తుల జోలికి ఎప్పుడు వెళ్ళకుడు అని గట్టిగా తన సేవకులకు ఆజ్ఞ ఇచ్చెను. అటువంటి భక్త వాత్సల్యము కలిగిన దేవా! నన్ను రక్షించు.

***22వదశకము పూర్తి.***

# దశకమ్ 23 – దక్షచరిత్ర, చిత్రకేతూపాఖ్యానమ్

**23-1 శ్లో.**

**ప్రాచేతసస్తు భగవన్నపరో హి దక్షః**
**త్వత్సేవనం వ్యధితసర్గవివృద్ధికామః ।**
**ఆవిర్బభూవిథ తదా లసదష్టబాహుః**
**తస్మై వరం దదిథ తాం చ వధూమసిక్నీమ్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్=ఓ భగవంతుడా! గురువాయూరు దేవా!, ప్రాచేతసః తు = ప్రచేతస కుమారుడైన, అపరః దక్షః హి= ఇంకొక దక్షుడు ఉన్నాడు కదా!, సర్గ వివృద్ధికామః= మనస్సు చేతనే సృష్టి చేయాలనుకొని అది అభివృద్ధి పొందాలని కోరి(విశిష్టా వృద్ధిః, విశేషేణ వర్ధతే తస్య భావః కర్మ వా వృద్ధి నొందుట వికాసము సమృద్ధి), త్వత్ సేవనం= నిన్ను సేవించాలని, వ్యధితః= అతడు కోరుకొన్నాడు, తదా= అప్పుడు, లసత్= ప్రకాశించు, అష్టబాహుః= ఎనిమిది బాహువులతో అతనికి, ఆవిర్బభూవిథ = సాక్షాత్కరించావు, తస్మై= అతనికి, వరం = వరమును, తాం అసిక్నీమ్ చ= పంచజనుని కుమార్తె అయిన అసిక్ని అను కన్యను (అసిక్ని= అసిక్నినా అసితకేశా అవృద్ధా అంతఃపుర పరిచారికాఅంతఃపుర పరిచారిక. శరీరాయాసముచే జీవనము చేయుచు అంతఃపురమునందు మెలఁగెడి ప్రాయపు ఆడుది, నెఱియని వెండ్రుకలు గలది), వధూమ్= భార్యగా (ఉహ్యతే పితృగృహాత్ పతిగృహమ్ తండ్రి గృహము నుండి పతి గృహమునకు పోవునది. భార్య), దదిథ= అనుగ్రహించావు.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! గురువాయూరు దేవా! ప్రాచీన బర్హికి పదిమంది కుమారులు. వారిలో ఒక కుమారుడు దక్షుడు. బ్రహ్మ మానస పుత్రుడైన దక్షుడు కాకుండా ప్రచేతస కుమారుడైన ఇంకొక దక్షుడు ఉన్నాడు. అతడు నిన్ను సేవించి సృష్టిని అభివృద్ధి చేయాలి అనుకున్నాడు .అతని తపస్సుకు మెచ్చి అప్పుడు ప్రకాశించు 8 రూపములతో అతని ఎదుట ప్రత్యక్షమై అతడు కోరిన వరములు ప్రసాదించావు. అసిక్ని అను భార్యని కూడా అనుగ్రహించావు.

**విశేషాలు:** ఈ దశకములోని ఛందస్సు వసంతతిలకము

**23-2 శ్లో.**
**తస్యాత్మజాస్త్వయుతమీశ! పునస్సహస్రం**
**శ్రీనారదస్య వచసా తవ మార్గమాపుః ।**
**నైకత్ర వాసమృషయే స ముమోచ శాపం**
**భక్తోత్తమస్త్వృషిరనుగ్రహమేవ మేనే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ! = ప్రభూ!, తస్య= ఆదక్షునికి, అయుతమ్ ఆత్మజాః తు = మొదట హర్యశ్వులను పదివేల మంది కుమారులు –(న యుతమ్ కూడుకొననిది పదివేలు), పునః = మరలా, సహస్రం= శబలాశ్వులను వెయ్యి మంది కుమారులు కలిగారు, శ్రీనారదస్య వచసా= శ్రీ నారదుని యొక్క ఉపదేశము మేరకు, తవ మార్గమ్ = నీ నివృత్తి మార్గాన్ని(మోక్షాన్ని), ఆపుః= పొం దారు, సః= తన కుమారులకు ఈ విధముగా ఉపదేశము చేసినందుకు దక్షుడు, ఋషయే= నారదునికి, న –ఏకత్ర వాసమ్= ఒక చోట ఉండని (సదాసంచారిత్వ ), శాపం = శాపమును, ముమోచ= ఇచ్చాడు, భక్త–ఉత్తమః= భక్తులలో ఉత్తముడైన, ఋషిః తు= నారదుడు, అనుగ్రహమ్ – ఏవ= ఆ శాపాన్ని అనుగ్రహంగా (అనుగ్రహః దుఃఖదూరకరణేచ్ఛా దయ చూపుట అనుగ్రహించుట), మేనే= తలచాడు.

**తాత్పర్యము:** ప్రభూ! గురువాయూరు దేవా! ఆదక్షునికి మొదట పదివేల మంది కుమారులు మరల వెయ్యి మంది కుమారులు కలిగారు. శ్రీ నారదుని యొక్క ఉపదేశము మేరకు వారు నీ నివృత్తి మార్గాన్ని పొం దారు. తన కుమారులకు ఈ విధముగా ఉపదేశము చేసినందుకు దక్షుడు ఒక చోట ఉండని విధముగా శాపమును నారదునికి పెట్టాడు. భక్తులలో ఉత్తముడైన నారదుడు ఆ శాపాన్ని అనుగ్రహం గా తలచాడు.

**23-3 శ్లో.**
**షష్ట్యా తతో దుహితృభిస్సృజతః కులౌఘాన్**
**దౌహిత్రసూనురథ తస్య స విశ్వరూపః ।**

**త్వత్ స్తోత్రవర్మితమజాపయదింద్రమాజౌ**
**దేవ! త్వదీయమహిమాఖలు సర్వజైత్రః ॥**

**ప్రతిపదార్థము:** తతః = అటు పిమ్మట దక్షుడు, షష్ట్యా దుహితృభిః= తన అరవై మంది కుమార్తెల ద్వారా(దితి, అదితి మొదలయినవారు) (షడ్గుణితా దశతిః– అరవై.), కుల–ఔఘాన్= స్థిర చర భేద సమూహములు కలిగిన, సృజతః= సృష్టిని వృద్ధి చేయసాగాడు, అథ= అటు పిమ్మట, తస్య = ఆ దక్షుని, దౌహిత్ర సూనుః= దౌహిత్రుడయిన (దితి కుమారుడు) త్వష్ట అనువానికి పుట్టిన(దుహితుః అపత్యం పుమాన్ కూతురి కొడుకు. మనుమడు), సః విశ్వరూపః= ఆ విశ్వరూపుడు, త్వత్ –స్తోత్ర= నీ స్తోత్రమను (నారాయణాత్మకమయిన), వర్మితమ్= కవచమును ధరించిన(వర్మన్= వృణోతి ఆచ్ఛాదయతి శరీరమ్ శరీరమును కప్పునది. కవచము), ఇంద్రమ్= ఇంద్రునికి, ఆజౌ= దేవ రాక్షస యుద్ధంలో (ఆజూర్యతే పరస్పరం హింస్యతే అస్మిన్ ఇందులో హింస జరుగును. యుద్ధము యుద్ధభూమి), అజాపయత్= జపము ద్వారా జయించుటకు అంగరక్షగా ఇచ్చెను, దేవ!= దైవమా!, త్వదీయమహిమా= నీ మహిమ, సర్వజైత్రః ఖలు = అనేక విజయాలను కలిగిస్తుంది కదా!

**తాత్పర్యము:** అటు పిమ్మట దక్షుడు తన అరవై మంది కుమార్తెల ద్వారా సృష్టిని వృద్ధి చేయసాగాడు .అటు పిమ్మట ఒక కుమార్తెకు కలిగిన త్వష్ట అను కుమారుని కుమారుడైన విశ్వరూపుడు (దక్షుని మనుమడు) నిన్ను పొగిడి ఎవ్వరూ ఛేదించలేని నారాయణ కవచాన్ని ఇంద్రునికి అంగరక్షగా ఇచ్చాడు .అందువల్ల ఇంద్రునికి దేవ రాక్షస యుద్ధంలో విజయం లభించింది. ఓ దేవా! నీ మహిమ అనేక విజయాలను కలిగిస్తుంది కదా!

**విశేషాలు:**

**త్వష్ట:**బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు. ఇతని కొమారుఁడు అగు విశ్వరూపుని చంపి ఇంద్రుఁడు బ్రహ్మహత్య సంపాదించుకొనెను.

**విశ్వరూపుడు:** త్వష్టకు రచనయందు పుట్టిన కొడుకు. ఒకప్పుడు దేవగురువు అగు బృహస్పతి ఇంద్రసభకు రాగా ఇంద్రుడు మదోద్రేకముచే అతనిని గౌరవించి ఉపచరింపక పోయెను. అంతట బృహస్పతి మిగుల కోపించి తన అధ్యాత్మమాయచే ఇంద్రునికి కానఁబడక పోయెను. అప్పుడు గురువు లేమిచే దేవతలు తమయైశ్వర్యము అంతయు దైత్యులచే కోలుపోయి బ్రహ్మతో తమ అవస్థ చెప్పుకొనగా అతఁడు విశ్వరూపుని గురువుగా వేడుకొండు అని ఉపదేశించెను. వారును అట్లు చేసిరి. అంత విశ్వరూపుడు ఇంద్రునకు నారాయణకవచమును ఉపదేశము చేయఁగా దాని మహత్వము వలన మరల ఇంద్రుఁడు తన పూర్వికపు ఐశ్వర్యస్థితిని పొందెను. అట్లు పొందిన వాడు అయ్యును ఇంద్రుడు మాతృపక్షమును అవలంబించి అసురులకు అనుకూలుడుగా ఉండిన విశ్వరూపుని చూచి ఓర్వజాలక అతనిని పరిమార్చెను.

ఈ విశ్వరూపునకు తలలు మూడు. అందు ఒకటి సోమపానము చేయుటకును, మఱియొకటి సురాపానము చేయుటకును, ఇంకొకటి అన్నము భుజించుటకును ఉపయోగించుచు ఉండెను. ఆమూడు తలలును ఇంద్రునిచేత నఱకబడి ఒకటి కపింజలమును, ఒకటి కలవింకమును, ఒకటి తిత్తిరియును అయి ఇంద్రుని ఆక్రమించెను. అంత ఇంద్రుడు తనకు పొసగిన పక్షిరూపమగు ఆబ్రహ్మహత్యపాతకమును నాలుగు భాగములుగ భాగించి భూజలవృక్ష స్త్రీలయందు నిలిపి తాను విముక్తుడు అయ్యెను.

**23-4 శ్లో.**
**ప్రాక్ శూరసేనవిషయే కిల చిత్రకేతుః**
**పుత్రాగ్రహీ నృపతిరంగిరసః ప్రభావాత్ ।**
**లబ్ధ్వైకపుత్రమథ తత్ర హతే సపత్నీ-**
**సంఘైరముహ్యదవశస్తవ మాయయాఽసౌ ॥**

**ప్రతిపదార్థము:** ప్రాక్ = పూర్వము, శూరసేనవిషయే = శూర సేనము అను పేరుగల దేశంలో, చిత్రకేతుః కిల= చిత్రకేతుడు అను మహారాజు ఉండేవాడు కదా!, పుత్ర-ఆగ్రహీ= పుత్ర సంతానముపై కోరిక కలిగిన, నృపతిః = చిత్రకేతుడు అను ఆరాజు,

అంగిరసః ప్రభావాత్= అంగిరసుడను మహర్షి ప్రభావము వలన, ఏకపుత్రమ్= ఒక కుమారుని, లబ్ధ్వా= పొంది, అథ =అటుపిమ్మట, తత్ర = ఆకుమారుడు అచ్చట, తవ మాయయా= నీమాయచే, సపత్నీసంఘైః = సవతి తల్లుల సమూహము చేత(సమానః పతిః యస్యాః–సమానమైన భర్త గలది. మరొక భార్యతో సమానమైన భర్త గలది), హతే= చంపబడగా, అ సౌ అవశః = ఈ చిత్రకేతుడను రాజు దుఃఖముతో వశము తప్పినవాడై, అముహ్యత్ = స్పృహ కోల్పోయాడు (దుఃఖించాడు).

**తాత్పర్యము:** పూర్వము శూర సేనము అను పేరుగల దేశంలో చిత్రకేతుడు అను మహారాజు ఉండేవాడు కదా! అతడు అంగీరస మహర్షి ఆశీస్సుల చేత ఒక కుమారుని పొందాడు. మీ మాయ ప్రభావం వల్ల ఆ కుమారుని సవతి తల్లులు చంపారు. ఈ చిత్రకేతుడను రాజు దుఃఖముతో వశము తప్పినవాడై దుఃఖించాడు.

**విశేషాలు:**

**చిత్రకేతుడు:** శూరసేనదేశపు రాజు. ఇతడు సంతానములేక ఉండి చిరకాలమునకు ఒక పుత్రుని పడసెను. ఆపుత్రుడు (తన మాఱుదల్లులు విషముపెట్టి చంపగా) బాల్యముననే చచ్చినందున చిత్రకేతుఁడు పుత్రశోకమును సహింపలేక కడు దుఃఖితుడై విలపించుచు ఉండెను. అప్పుడు నారదుడును అంగిరసుడును వచ్చి అతనికి జ్ఞానోపదేశము చేసిపోయిరి. అంతట అతడు తెలివిని పొంది జ్ఞానవంతుడై దేహమును వదలి దేవత్వమును వహించి విద్యాధరాధిపతి అయి ఒకప్పుడు కైలాసమునకు పోయి అచ్చట పార్వతితో కూడుకొని ఉండు శివునిచూచి జగత్కర్తలు అయినవారు కూడ ఇట్లు మిథునరూపముగ ఉందురా అని పార్వతీదేవి వినునట్లు పలికెను.(నారాయణీయములో కొద్దిగా మార్పు) అందులకు ఆమె కోపించి అతనిని రాక్షసుడు అగునట్లు శపించెను. అంత అతడు వృత్రాసురుడుగ పుట్టి ఇంద్రుని చేత చంపబడి మోక్షమును పొందెను.

**23–5 శ్లో.**

**తం నారదస్తు సమమంగిరసా దయాళుః**
**సంప్రాప్య తావదుపదర్శ్య సుతస్య జీవమ్ ।**

**కస్యాస్మి పుత్ర ఇతి తస్య గిరా విమోహం**
**త్యక్త్వా త్వదర్చనవిధౌ నృపతిం న్యయుంక్త ॥**

**ప్రతిపదార్థము:** తం దయాళుః నారదః తు= అప్పుడు దయాశాలి అయిన నారద మహర్షి (దయా శీలం అస్య–దయాస్వభావం కలవాడు), అంగిరసా సమమ్= అంగీరసుని తో సహా, సంప్రాప్య = వచ్చి, సుతస్య= మృతుడయిన కుమారుని, జీవమ్=జీవమును (జీవతి అనేన–దీనితో జీవింతురు. జీవన వృత్తి ప్రాణి), తావత్ = అంతలో, ఉపదర్శ్య= యోగబలముతో దర్శింపచేసెను. (కుమారుని బ్రతికించెను అని భావం), కస్య పుత్ర అస్మి= నేను ఎవరి కుమారుడను?, ఇతితస్య గిరా= అను అతని మాటలచే, విమోహం= చిత్రకే తునికి అజ్ఞానము(విగతః మోహః యస్య యేన వా మోహము లేకుండుట మోహము పోయినవాడు), త్యక్త్వా =తొలగిపోగా, త్వత్ –అర్చనవిధౌ = నీ అర్చన విధిలో, నృపతిం= రాజయిన చిత్రకేతుని, న్యయుంక్త= నారదుడు నియమింప చేసెను.

**తాత్పర్యము:** అప్పుడు దయాశాలి అయిన నారద మహర్షి అంగీరసుని తో సహా అక్కడకు వచ్చి చనిపోయిన రాజకుమారుని ఆత్మను రాజు ముందుకు రప్పించాడు .అప్పుడు ఆత్మ నేనెవరి పుత్రుణ్ణి అని అడిగింది .ఆ మాటలతో చిత్రకే తునికి అజ్ఞానము తొలగిపోయి (తండ్రి కొడుకుల సంబంధము ఔపాధికము మాత్రమే. . పరమార్థము కాదు అను జ్ఞానము కలిగినదని భావం) నారదుని యొక్క ఉపదేశంతో నీ అర్చనలో మునిగిపోయాడు.

**23–6 శ్లో.**
**స్తోత్రం చ మంత్రమపి నారదతోఽథ లబ్ధ్వా**
**తోషాయ శేషవపుషో నను తే తపస్యన్ ।**
**విద్యాధరాధిపతితాం స హి సప్తరాత్రే**
**లబ్ధ్వాఽప్యకుంఠమతిరన్వభజద్భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, తే స్తోత్రం చ = నిన్ను స్తుతించే విధానాన్ని, మంత్రమ్–అపి= మంత్రాన్ని కూడా, నారదతః= నారదుని వలన, లబ్ధ్వా= పొంది,

శేషవపుషః = శేష రూపములో ఉన్న నీకు, తోషాయ= సంతోషం కలిగేటట్లు(అనుగ్రహము కలిగేటట్లు), తపస్యన్= తపస్సు చేయసాగాడు, నను = నిశ్చయము (నను దతి ప్రేరయతి ప్రేరేపించునది ప్రశ్నించుట నిశ్చయము), సః= ఆ చిత్రకేతమహారాజు, సప్తరాత్రే= ఏడు రాత్రుల చివర( రాతి దదాతి సుఖం భయం వా సుఖమును, భయమును ఇచ్చునది. రాత్రి), విద్యాధర–అధిపతితాం= విద్యాధర ఆధిపత్యాన్ని(విద్యాం మంత్రాదికం ధరతి మంత్రములను ధరించినవాడు. విద్యాధరుడు లబ్ధ్వా అపి = పొందినప్పటికి, భవంతమ్= నీ అనంత స్వరూపాన్ని, అకుంఠమతిః= దీక్షతో, అన్వభజత్= ధ్యానించ సాగాడు.

**తాత్పర్యము:** నారదుని వలన నిన్ను స్తుతించే విధానాన్ని మంత్రాన్ని పొంది చిత్రకేతుమహారాజు శేష రూపములో ఉన్న నీకు సంతోషం కలిగేటట్లు తపస్సు చేయసాగాడు. అందువల్ల అతడు ఏడు రాత్రులు విద్యాధర ఆధిపత్యాన్ని పొందాడు .ఆ పదవి పొందినప్పటికీ తృప్తి పడక అనంత రూపుడైన నిన్ను దీక్షతో ధ్యానించ సాగాడు.

**23–7 శ్లో.**

**తస్మై మృణాళధవళేన సహస్రశీర్ష్ణా**
**రూపేణ బద్ధనుతిసిద్ధగణావృతేన ।**
**ప్రాచుర్భవన్నచిరతో నుతిభిః ప్రసన్నో**
**దత్త్వాఽఽత్మతత్వమనుగృహ్య తిరోదధాథ ॥**

**ప్రతిపదార్థము:** తస్మై= అతని తపస్సుకి మెచ్చి, మృణాళధవళేన= తామర పువ్వుల వలె ఉన్న తెల్లగా ఉన్న, సహస్రశీర్ష్ణా =1000 తలలతో (పడగలతో), బద్ధనుతిసిద్ధగణ – ఆవృతేన= తనను పొగుడుటయందు బద్ధమై ఉన్న సిద్ధగణములతో(సిద్ధిః అస్తి అస్య–సిద్ధి కలవాడు), అచిరతః= వెంటనే (న చిరమ్ చిరకాలము కానిది. కొద్ది సమయముండునది), ప్రాచుర్భవన్= నువ్వు సాక్షాత్కరించావు, నుతిభిః ప్రసన్నః= అతని స్తోత్రములకు ప్రసన్నుడై, ఆత్మతత్వమ్ దత్త్వా= ఆత్మ జ్ఞానమును ఇచ్చి(ఆత్మనః తత్త్వం నిత్యశుద్ధబుద్ధాముక్త

సత్యస్వభావాదికస్య రూపమ్ ఆత్మయొక్క నిజస్వరూపము), అనుగృహ్య = అనుగ్రహించి, తిరోదధాథ= అంతర్థానమయ్యావు.

**తాత్పర్యము:** అతని (చిత్రకేతు)తపస్సుకి మెచ్చి తామర పువ్వుల వలె ఉన్న 1000 తలలతో (పడగలతో) పొగుడుతున్న సిద్ధ గణములు చుట్టూ ఉండగా అనంతుని రూపంలో ఆ మహారాజు ఎదుట నువ్వు సాక్షాత్కరించావు. అతనికి ఆత్మ జ్ఞానం అనుగ్రహించి అంతర్థానమయ్యావు.

**23-8 శ్లో.**
**త్వద్భక్తమౌళిరథ సోఽపి చ లక్ష లక్షం**
**వర్షాణి హర్షులమనా భువనేషు కామమ్ ।**
**సంగాపయన్ గుణగణం తవ సుందరీభిః**
**సంగాతిరేకరహితో లలితం చచార ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, త్వత్ సః భక్తమౌళిః అపి= నీకు సంబంధించిన భక్త శిరోమణి అయిన ఆ చిత్రకేతు మహారాజు కూడా (మౌలి=మూలస్య అదూరభవః-మూలమునకు దగ్గర వుండునది. కిరీటము), లక్ష లక్షంవర్షాణి= అనేక లక్షల సంవత్సరాలు, హర్షులమనాః= ఆనందము నిండినవాడై, భువనేషు= అన్ని భువనములయందు, సుందరీభిః చ = తన విద్యాధర స్త్రీలతో కలిసి, తవ గుణగణం= నీ గుణగణాలను, కామమ్ సంగాపయన్= కోరికతో గానము చేస్తూ చేయిస్తూ, సంగ-అతిరేక రహితః= ఇంద్రియ సంగము యొక్క ఆధిక్యము విడిచినవాడై (అతిరేకః=అతిశయితం రిచ్యతే ఆధిక్యము గొప్పదనము), లలితం= చక్కగా, చచార= విహరింప సాగాడు.

**తాత్పర్యము:** ఆ తరువాత భక్త శిరోమణి అయిన ఆ చిత్రకేతు మహారాజు అనేక లక్షల సంవత్సరాలు ఆనందము నిండినవాడై తన విద్యాధర స్త్రీల చే నీ గుణగణాలను గానం చేస్తూ చేయిస్తూ సంగమును విడిచిన వాడై చక్కగా విహరింప సాగాడు.

**23-9 శ్లో.**

**అత్యంతసంగవిలయాయ భవత్ప్రణున్నో**
**నూనం స రౌప్యగిరిమాప్య మహత్సమాజే।**
**నిశ్శంకమంకకృతవల్లభమంగజారిం**
**తం శంకరం పరిహసన్నుమయాఽభిశేపే ॥**

**ప్రతిపదార్థము:** అత్యంతసంగవిలయాయ= చిత్రకేతు మహారాజుకు భోగముల పట్ల పూర్తిగా ఆసక్తిని తొలగించే ఉద్దేశ్యంతో, భవత్= నీ, ప్రణున్నః= ప్రేరణతో, నూనం =నిశ్చయముగా (ఊహ నిశ్చయము ఉత్ప్రేక్ష), సః= అతడు, రౌప్యగిరిమ్= కైలాస పర్వతమును(రూప్యం ఏవ రౌప్యమ్ వెండి), ఆప్య = పొంది(వెళ్ళి), మహత్ సమాజే= అక్కడ అనేకమంది సాధు జనులు ఉన్న సభలో(మహత్=మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి పూజింపబడువాడు), నిశ్శంకమ్ = ఏ సంకోచమూ లేకుండా, అంకకృతవల్లభమ్= తన ప్రియురాలైన పార్వతిని తొడపై కూర్చోపెట్టుకొని ఉన్న(వల్లభ=వల్లయతి సంచాలయతి అనురాగమ్- అనురాగమును చూపువాడు. వల్లభుడు, ప్రియుడు), తం అంగజ-అరిం శంకరం= ఆ మన్మథ శత్రువైన శివుని (శంకరం =శం సుఖం కల్యాణం కరోతి కల్యాణము కూర్చువాడు. శివుడు), పరిహసన్= పరిహాసంగా నవ్వి, ఉమయా= పార్వతీదేవితో (ఉ = హే పార్వతి, మా = తపః మాస్తు. "ఓ పార్వతి తపస్సువలదు" అని తల్లిచే నిషేధింపఁబడుటచే ఉమా అని పేరువచ్చినది), అభిశేపే= శాపము పొందాడు.

**తాత్పర్యము:** చిత్రకేతు మహారాజుకు భోగముల పట్ల పూర్తిగా ఆసక్తిని తొలగించే ఉద్దేశ్యంతో నీ ప్రేరణతో అతడు కైలాస పర్వతానికి వెళ్ళాడు. అక్కడ అనేకమంది ఉన్న సభలో ఏ సంకోచమూ లేకుండా తన ప్రియురాలైన పార్వతిని తొడపై కూర్చోపెట్టుకొని ఉన్న ఆ మన్మథ శత్రువైన శంకరుని చూచి చిత్రకేతుడు పరిహాసంగా నవ్వాడు. అందువల్ల పార్వతీదేవి కోపించి అతనిని శపించింది.

**విశేషాలు:** తన ప్రియురాలైన పార్వతిని తొడపై కూర్చోపెట్టుకొని ఉన్న ఆ మన్మథ శత్రువైన శంకరుని అని చెప్పిన కవి మాట ప్రశంసనీయము. మన్మథ శత్రువు శివుడు. మన్మథ చాయ లేనివాడు.

**23-10 శ్లో.**
**నిస్సంభ్రమస్త్వయమయాచితశాపమోక్షో**
**వృత్రాసురత్వముపగమ్య సురేంద్రయోధీ ।**
**భక్త్యాత్మతత్త్వకథనైస్సమరే విచిత్రం**
**శత్రోరపి భ్రమమపాస్య గతః పదం తే ॥**

**ప్రతిపదార్థము:** నిస్సంభ్రమః తు = శాపము పొందినప్పటికీ చలించక(సం అధికం భ్రమతి బిభేతి, చపలో భవతి తస్య భావః కర్మ వా చాపల్యము దానికి వ్యతిరేకమునిస్సంభ్రమము), అయమ్= చిత్రకేతు మహారాజు, అయాచిత శాపమోక్షః = శాప విమోచనం కొరకు పార్వతీ దేవిని వేడుకోక, వృత్రాసురత్వమ్ —ఉపగమ్య= వృత్రాసురుని గా జన్మించి (వృత్రశ్చాసౌ అసురశ్చ-వృత్రాసురుడు), సురేంద్రయోధీ=ఇంద్రునితో జరిగే యుద్ధములో, భక్త్యా =భక్తితో, ఆత్మతత్త్వకథనైః= ఆత్మ తత్త్వ కథనములతో, శత్రోః అపి= శత్రువైన ఇంద్రునకు (శాదయతీతి పీడించువాడు నాశనము చేయువాడు. శత్రువు), భ్రమమ్ = భ్రమను (భ్రమతి, భ్రామ్యతి వా, తస్య కర్మ భావో వా భ్రమించుట, మిథ్యాజ్ఞానము, అపాస్య = పోగొట్టి, సమరే= యుద్ధములో (సమ్యక్ ఋచ్ఛంతి గచ్ఛంతి యోద్ధుం యోద్ధారః అత్ర-యోద్ధలు యుద్ధము చేయుటకు ఇక్కడికి వెళ్లుదురు. యుద్ధము), తే= నీ, పదం = స్థానమైన వైకుంఠమును, గతః= చేరుకొన్నాడు, విచిత్రం = ఇది చాలా ఆశ్చర్యకరము.

**తాత్పర్యము:** శాపము పొందినప్పటికీ చిత్రకేతు మహారాజు చలించలేదు. శాప విమోచనం కొరకు పార్వతీ దేవిని వేడుకో లేదు. చివరకు వృత్రాసురుని గా జన్మించి ఇంద్రునితో యుద్ధం చేశాడు. అప్పుడు కూడా ఈ చిత్ర కేతువు తన శత్రువైన ఇంద్రునికి భ్రమను పోగొట్టి భక్తి తత్వాన్ని ఆత్మ తత్వాన్ని అతనికి ఉపదేశించి (అతని వజ్రాయుధముతో నిహతుడై )చివరకు నీ స్థానాన్ని చేరుకున్నాడు

**23-11 శ్లో.**
**త్వత్సేవనేన దితిరింద్రవధోద్యతాఽపి**
**తాన్ ప్రత్యుతేంద్రసుహృదో మరుతోఽభిలేభే ।**

**దుష్టాశయేఽపి శుభదైవ భవన్నిషేవా**
**తత్తాదృశస్త్వమవ మాం పవనాలయేశ! ॥**

**ప్రతిపదార్థము:** దితిః = రాక్షసుల తల్లి అయిన దితి(ద్యతి ఖండయతి శుభమ్ శుభములను ఖండించునది. దితి, రాక్షసమాత), త్వత్ –సేవనేన = నిన్ను సేవించి, ఇంద్రవధ–ఉద్యతా= ఇంద్రుని చంపే పుత్రులను కోరుకొని(గర్భవతి అయింది), అపి తు ప్రత్యుత= కాని విపరీతము జరిగింది. (ప్రత్యుత పునరపి అథవా మళ్లీ లేదా అట్లు కానిచో), తాన్ =ఆ, ఇంద్రసుహృదః= ఇంద్రునికి మిత్రులు కాగల(సుష్ఠు హృదయం యస్యః–మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), మరుతః = మరుత్తులు, అభిలేభే= ఆమెకు జన్మించారు, దుష్ట ఆశయే అపి= దుష్టులకు కూడా, భవత్ నిషేవా= మీసేవ, శుభదా–ఏవ= శుభములను అనుగ్రహిస్తుంది, తత్ —తాదృశః = నీ సేవ ఇంకొక దానితో పోలిక లేనిది (గొప్పదని భావం), పవనాలయ –ఈశ! = గురువాయూరు దేవా !, మామ్–అవ = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** రాక్షసుల తల్లి అయిన దితి ఇంద్రుని చంపే పుత్రులను కోరుకొని కాశ్యపుని ప్రసన్నం చేసుకొని నిన్ను సేవించి గర్భవతి అయింది . కాని విపరీతము జరిగింది. ఇంద్రునికి మిత్రులు కాగల మరుత్తులు ఆమెకు జన్మించారు. మీసేవ దుష్టమైన ఆలోచనలతో చేసినప్పటికీ శుభమైన ఫలితాలు అనుగ్రహిస్తుంది కదా ! నీ సేవ ఇంకొక దానితో పోలిక లేనిది. అటువంటి గొప్పవాడివి అయిన గురువాయుర్ దేవా! నన్ను రక్షించు.

**విశేషాలు:**

**మరుత్తులు:** వాయువులు. దితి ఇంద్రుని చంపునట్టి కొడుకు కావలయును అని కశ్యపుని ప్రార్థింపగా అతడు అనుగ్రహించి గర్భమును కలుగచేసి 'నూఱేండ్లు ఈగర్భమును నియమముతో కాపాడుకొంటివేని అట్టి బిడ్డఁడు నీకు పుట్టును' అని చెప్పెను. ఆమె అట్లే అతి నియమముతో ఉండి నూఱేండ్లు నిండుటకు కొంతకాలము కొఱంత ఉండగా ఏమఱి అనిష్ఠను ఇసుమంత తప్పెను. అంత సమయము చూచుచు ఉండిన దేవేంద్రుడు ఆమె గర్భమునందు ప్రవేశించి ఆశిశువును తన

వజ్రాయుధముతో ఏడు తునియలుగా నఱకెను. అప్పుడు ఆశిశువు తుండెములై రోదన చేయుతఱి దితి 'మారుద మారుద' అని చెప్పెను. కనుక వీరు మరుత్తులు అనఁబడిరి. అంత ఇంద్రుఁడు దితిగర్భమున ఉండి వెలువడివచ్చి 'తల్లీ నీవు అశుచివై ఉండినందున ఇంతపని చేయ చాలితిని' అని ఆమెను మంచిమాటలచే సమాధానపఱిచి ఆమె కోరినట్లు ఆ ఏడుపిండములకు దీర్ఘాయువును ఒసఁగి సప్తలోకములయందును వాయురూపముగా తిరుగునట్లు అనుగ్రహించి వెడలిపోయెను. అది కారణముగ మరుత్తులును, దేవతలును కూడి ఉందురు.

**షష్ఠ స్కంధము పరిపూర్ణం**

**23వ దశకము సమాప్తము.**



# దశకమ్ 24 – ప్రహ్లాదచరిత్ర

**24-1 శ్లో.**
**హిరణ్యాక్షే పోత్రిప్రవర వపుషాదేవ! భవతా**
**హతే శోకక్రోధగ్లపితధృతిరేతస్య సహజః ।**
**హిరణ్య ప్రారంభః కశిపురమరారాతిసదసి**
**ప్రతిజ్ఞామాతేనే తవ కిల వధార్థం మురరిపో! ॥**

**ప్రతిపదార్థము:** మురరిపో!= మధుసంహారీ! విష్ణుమూర్తీ! (మురస్య రిపుః విష్ణుఃమురాసురుని శత్రువు. విష్ణువు), హిరణ్య–అక్షే= హిరణ్యాక్షుని సంహరించి (హిరణ్యవత్ ధీతే అక్షిణే యస్య–బంగారు వంటి పచ్చని కన్నులు కలవాడు. హిరణ్యాక్షుడు), పోత్రి ప్రవర = విశిష్టమైన వరాహ (పోత్రం అస్తి అస్య–పందిముఖము (ముట్టె) గలది. పంది), వపుషా= శరీర రూపమున ప్రకాశించే, దేవ! = దైవమా!, సహజః= తన సోదరుడు హిరణ్యాక్షుడు ఆ విధంగా(సహ జాయతే తోడబుట్టినవాడు), భవతా హతే = నీచే వధించబడగా, శోకక్రోధ= శోకముచే , క్రోధముచే, గ్లపిత= కోల్పోయిన, ధృతిః = ధైర్యము (మనోనిగ్రహము) కలిగిన, ఏ తస్య హిరణ్య ప్రారంభః కశిపుః = ఈ హిరణ్య నామమును ప్రారంభమున కలవాడు అగు హిరణ్యకశిపుడు, (హిరణ్య+కశిపు, తన్నామ దైత్యః . హిరణ్య కశిపుడు), అమర–అరాతిసదసి= దేవతలకు శత్రువులగు రాక్షసుల సభలో, తవ వధార్థం= నిన్నువధింతునని, ప్రతిజ్ఞామ్ –ఆతేనే కిల = ప్రతిజ్ఞచేసెను కదా! (ప్రతిజ్ఞాయతే అసౌ ప్రతిజ్ఞ మాట యిచ్చుట).

**తాత్పర్యము:** ఓ మధుసంహారీ! విష్ణుమూర్తీ! హిరణ్యాక్షుని సంహరించిన విశిష్టమైన వరాహరూపమున ప్రకాశించే దైవమా! హిరణ్యాక్షుడు ఆ విధంగా నీచే వధించబడగా శోకముచే , క్రోధముచే కోల్పోయిన ధైర్యము (మనోనిగ్రహము) కలిగిన హిరణ్య నామమును ప్రారంభమున కలవాడు అగు హిరణ్యకశిపుడు దేవతలకు శత్రువులగు రాక్షసుల సభలో నిన్నువధింతునని ప్రతిజ్ఞచేసెను కదా !

**24–2 శ్లో.**

**విధాతారం ఘోరం స ఖలు తపసిత్వా న చిరతః**
**పురస్సాక్షాత్కుర్వన్ సురనరమృగాద్యైరనిధనమ్ ।**
**వరం లబ్ధ్వా దృప్తో జగదిహ భవన్నాయకమిదం**
**పరిక్షుందన్నింద్రాదహరత దివం త్వామగణయన్ ॥**

**ప్రతిపదార్థము:** సః = ఆ హిరణ్యకశిపుడు, విధాతారం = బ్రహ్మదేవునికై (విదధాతి బ్రహ్మాండమ్ బ్రహ్మాండమును రచించువాడు. బ్రహ్మ), ఘోరం = కఠోరముగ (ఘోరయతి భయానక రస నిమిత్తే భవతిఘోరమైనది), తపసిత్వా= తపస్సు చేసి, న చిరతః= శీఘ్రమే, పురః సాక్షాత్ కుర్వన్= బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి వరము కోరుకొనుమనగా, సురనరమృగ= దేవతలు, మానవులు , మృగములు, ఆద్యైః = మొదలగు వారిచే, అనిధనమ్= మరణము సంభవించకుండునట్లు (నితరాం దధాతి ప్రాణినః–ప్రాణులను ధరించునది. మృత్యువు–వ్యతిరేకము అనిధనము), వరం= వరమును, లబ్ధ్వా = పొంది, దృప్తః = వరగర్వముతో, త్వామ్ అగణయన్= నిన్ను ఎంతమాత్రము లక్ష్యపెట్టక, భవన్నాయకమ్= నువ్వు నాయకునిగా కలిగిన, ఇహ ఇదం జగత్= ఈ జగత్తునంతను (గచ్ఛతి నడచునది. ప్రపంచము), పరిక్షుందన్ = బాధిస్తూ, ఇంద్రాత్= ఇంద్రుని వలన, దివం= స్వర్గలోకమును (దీవ్యంతి మోదంతే అస్మిన్ ఇక్కడ సంతోష పడుదురు. స్వర్గము), ఆహరత ఖలు= అపహరించాడు.

**తాత్పర్యము:** ఆ హిరణ్యకశిపుడు బ్రహ్మదేవునికై కఠోరముగ తపస్సు చేసి శీఘ్రమే బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి వరము కోరుకొనుమనగా దేవతలు, మానవులు, మృగములు మొదలగు వారిచే మరణము సంభవించకుండునట్లు వరమును పొంది వరగర్వముతో, నిన్ను ఎంతమాత్రము లక్ష్యపెట్టకనువ్వు నాయకునిగా కలిగిన ఈ జగత్తునంతను బాధిస్తూ ఇంద్రుని నుండి స్వర్గలోకమును అపహరించాడు.

**24-3 శ్లో.**
**నిహంతుం త్వాం భూయస్తవ పదమవాప్తస్య చ రిపోః**
**బహిర్దృష్టేరంతర్దధిథ హృదయే సూక్ష్మ వపుషా ।**
**నదన్నుచ్చైస్తత్రాప్యఖిలభువనాంతే చ మృగయన్।**
**భియా యాతం మత్వా స ఖలు జితకాశీ నివవృతే ॥**

**ప్రతిపదార్థము:** భూయః= మరలా, త్వాం = నిన్ను, నిహంతుం = వధించవలెనని, తవ పదమ్=వైకుంఠమునకు వెళ్ళి, రిపోః= శత్రువయిన హిరణ్యకశిపుని యొక్క, బహిః దృష్టేః= మాంస చక్షువునకు, అవాప్తస్య చ= పొందలేక( కనబడక), హృదయే= హృదయములో, సూక్ష్మ వపుషా= సూక్ష్మమయిన శరీరముతో (వరిముల్లు పోలికగా), అంతః -దధిథ= అంతర్ధానమయి దాక్కున్నావు, ఉచ్చైః నదన్ =అప్పుడు పెద్దగా సింహనాదాలు చేస్తూ, తత్ర= వైకుంఠలోకమందు, అపి = మరియు, అఖిలభువన-అంతే చ= చతుర్దశ లోకములందు కూడా, మృగయన్= గాలించి, భియా = నువ్వు తనకు జడిసి, యాతం = పారిపోయినట్లుగా, మత్వా = తలిచి, సః= ఆ హిరణ్య కశిపుడు, జితకాశీ =తానే గెలిచితినని చాటుతూ, నివవృతే ఖలు= వెనుకకు మరలాడుకదా!

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! నిన్ను వధించవలెనని వైకుంఠమునకు వెళ్ళి తన మాంస చక్షువుతో (కంటితో)నిన్ను చూడలేక పోయాడు. అతని హృదయములో సూక్ష్మమయిన శరీరముతో (వరిముల్లు పోలికగా) అంతర్ధానమయి దాక్కున్నావు. అప్పుడు హిరణ్య కశిపుడు పెద్దగా సింహనాదాలు చేస్తూ వైకుంఠలోకమందు చతుర్దశ లోకములందు కూడా గాలించి నువ్వు తనకు జడిసి పారిపోయినట్లుగా తలిచి తానే గెలిచితినని చాటుతూ వెనుకకు మరలాడు.

**24-4 శ్లో.**
**తతోఽస్య ప్రహ్లాదః సమజని సుతో గర్భవసతౌ**
**మునేర్వీణాపాణేరధిగతభవద్భక్తిమహిమా ।**
**స వై జాత్యాదైత్యః శిశురపి సమేత్య త్వయి రతిం**
**గతస్త్వద్భక్తానాం వరద! పరమోదాహరణతామ్ ॥**

**ప్రతిపదార్థము:** వరద! = ఓ వరదుడా!, తతః= అటుపిమ్మట, అస్య = ఆ హిరణ్యకశిపునికి, ప్రహ్లాదః = 'ప్రహ్లాదుడు' అను పుత్రుడు (అతిశయేన హ్లాదతే, విష్ణుభక్తత్వాత్ విష్ణుభక్తితో, సంతోషముతో వుండువాడు. ప్రహ్లాదుడు), సమజని= జన్మించాడు, సుతః= ఆ ప్రహ్లాదుడు, గర్భవసతౌ= తల్లి గర్భములో ఉండగానే, వీణాపాణేః= వీణాపాణియగు(వేతి వ్యాప్నోతి శబ్దః అస్యాః-దీని యొక్క శబ్దము వ్యాపించును. వీణ), మునేః = నారదమునీంద్రుని నుండి, అధిగత= తెలుసుకొన్న(అధి అధికం గతం జ్ఞాతం ప్రాప్తం వా తెలుసుకొనబడ్డది పొందబడ్డది స్వీకరించబడ్డది), భవత్ భక్తిమహిమా= నీ భక్తి మహిమల ప్రభావము పొంది, జాత్యా= జన్మచే, దైత్యః శిశుః అపి = రాక్షస శిశువయినప్పటికి, సః = ఆ ప్రహ్లాదుడు, వై = పాదపూరణ అక్షరం (స్వీకృతి-నిశ్చయ-నిస్సందేహేషు-స్వీకారము నిశ్చయము నిస్సందేహము), త్వయి= నీ యందు, రతింగతః = ప్రేమ (భక్తి) పొందిన, త్వత్ భక్తానాం= నీ భక్తులను, సమేత్య = కూడి, పరమ ఉదాహరణతామ్= ఉదాహరణమై మొదట లెక్కించదగినవాడు.

**తాత్పర్యము:** ఓ వరదుడా! అటుపిమ్మట ఆ హిరణ్యకశిపునికి 'ప్రహ్లాదుడు' అను పుత్రుడు జన్మించాడు. ఆ ప్రహ్లాదుడు తల్లి గర్భములో ఉండగానే వీణాపాణియగు నారదమునీంద్రుని నుండి తెలుసుకొన్న నీ భక్తి మహిమల ప్రభావము పొంది జన్మచే రాక్షస శిశువయినప్పటికి ఆ ప్రహ్లాదుడు నీ యందు ప్రేమ ( భక్తి ) పొందిన నీ భక్తులకు పరమ ఉదాహరణమై మొదట లెక్కించదగినవాడు.

**24-5 శ్లో.**

**సురారీణాం హాస్యం తవచరణదాస్యం నిజసుతే**
**స దృష్ట్వా దుష్టాత్మా గురుభిరశిశిక్షచ్చిరమముమ్ ।**
**గురుప్రోక్తం చాసావిదమిదమభద్రాయ దృఢమి-**
**త్యపాకుర్వన్ సర్వం తవచరణభక్త్యైవ వవృధే ॥**

**ప్రతిపదార్థము:** తవ చరణదాస్యం= నీ పాదసేవయందు భక్తి కల (చరతి అనేన-దీనిచే నడుచుదురు. కాలు), నిజసుతే= తన కుమారుని చూసి, హాస్యం= రాక్షసులు హేళన చేయుట (హసతి తస్య భావః కర్మ వా నవ్వు), సః= హిరణ్యకశిపుడు, దృష్ట్వా

= చూచి భరించలేక, దుష్ట–ఆత్మా= దుష్టుడైన ఆ రాక్షసుడు, అముమ్= ఆ ప్రహ్లాదునికి, చిరమ్ = చాలా కాలము, గురుభిః = గురువుల వద్ద, అశిశిక్షత్ = శిక్షణ ఇప్పించెను, గురుప్రోక్తం చ= గురువులు బోధించు, అసౌ= ఈ విషయం (వార్తా దండనీయములు మొదలైన లౌకిక విషయాలు), ఇదమ్ ఇదమ్ అభద్రాయ = ఇది ఇది భద్రము కాదని (గురువులు చెప్పిన విషయములను), సర్వం= అన్నిటిని, అపాకుర్వన్= తిరస్కరించి, దృఢమ్ ఇతి=దృఢనిశ్చయము చేసుకొని, తవచరణభక్త్యా ఏవ = నీ పాదములందు భక్తి మాత్రమే, వవృధే= శరీరముతో పాటు ప్రహ్లాదునిలో పెరుగుచుండెను.

**తాత్పర్యము:** నీ పాదసేవయందు భక్తి కల తన కుమారుని చూసి రాక్షసులు హేళన చేయుచుండుటను ఆ హిరణ్యకశిపుడు చూచి భరించలేక దుష్టుడైన ఆ రాక్షసుడు ఆ ప్రహ్లాదునికి చాలా కాలము గురువుల వద్ద శిక్షణ ఇప్పించెను. గురువులు బోధించు లౌకిక విషయాలు ఇది ఇది భద్రము కాదని ఒక్కొక్కటిగా అన్నిటిని తిరస్కరించి దృఢనిశ్చయము చేసుకొన్న ప్రహ్లాదునిలో నీ పాదములందు భక్తి మాత్రమే శరీరముతో పాటు పెరుగుచుండెను.

**24–6 శ్లో.**

**అధీతేషు శ్రేష్ఠం కిమితి పరిపృష్టేఽథ తనయే**
**భవద్భక్తిం వర్యామభిగదతి పర్యాకులధృతిః ।**
**గురుభ్యో రోషిత్వా సహజమతిరస్యేత్యభివిదన్**
**వధోపాయానస్మిన్ వ్యతనుత భవత్పాదశరణే ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, అధీతేషు= చదివిన చదువులలో(అధి ఇతః కృతాధ్యయః–చదువుకున్నవాడు చదువుట), శ్రేష్ఠం= సారము (అతిశయేన ప్రశస్త్యః–మిక్కిలి ప్రశంసించదగినవాడు), కిమ్ –ఇతి = ఏది అని, తనయే పరిపృష్టే= కుమారుడైన ప్రహ్లాదుని ప్రశ్నించెను, భవత్ భక్తిం= నీ భక్తియే, వర్యామ్= శ్రేష్ఠమని, అభిగదతి= ప్రహ్లాదుడు పలికాడు, పర్యాకుల ధృతిః=పర్యాకులమైన ధైర్యముతో (కోపముతో హృదయము కలవరపడగా) (అత్యంతం ఆకులః ఉద్విగ్నః మలినం తొట్రుపాటు కలవాడు అవ్యవస్థుడు మలినమైనవాడు), గురుభ్యః =

గురువులను, రోషిత్వా = దోషము చూపి, అస్య = తరువాత ఇది ఇతనియొక్క, సహజమతిః = సహజముగా పుట్టిన బుద్ధి, ఇతి= అని, అభివిదన్= తెలుసుకొని (గ్రహించి), భవత్ పాదశరణే= నీ పాదములే శరణమని నమ్మిన, అస్మిన్= అతని, వధ–ఉపాయాన్ = చంపు ఉపాయములను, వ్యతనుత= అన్వేషించాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట చదివిన చదువులలో సారము ఏది అని కుమారుడైన ప్రహ్లాదుని ప్రశ్నించెను. నీ భక్తియే శ్రేష్ఠమని ప్రహ్లాదుడు పలికాడు. కోపముతో హృదయము కలవరపడగా గురువులపట్ల దోషము చూపి తరువాత ఇది ఇతనియొక్క సహజముగా పుట్టిన బుద్ధి అని తెలుసుకొని నీ పాదములే శరణమని నమ్మిన ప్రహ్లాదుని చంపు ఉపాయములను అన్వేషించాడు.

**24–7 శ్లో.**
**స శూలైరావిద్ధః సుబహుమథితో దిగ్గజగణైః**
**మహాసర్పైర్దష్టోఽప్యనశనగరాహారవిధుతః ।**
**గిరీంద్రావక్షిప్తోఽప్యహహ! పరమాత్మన్నయి విభో!**
**త్వయి న్యస్తాత్మత్వాత్ కిమపి న నిపీడామభజత ॥**

**ప్రతిపదార్థం:** అయి విభో!= ఓ గురువాయూరు ప్రభూ, పరమాత్మన్= పరమాత్మా!, సః= ఆ ప్రహ్లాదుడు, శూలైః ఆవిద్ధః = పలుమార్లు శూలములతో పొడిపించబడ్డాడు. (శూలతి లోకాన్ లోకములను చంపునది. నొప్పి రోగము ఒక అస్త్రము.( ఆవిద్ధః ఆచ్ఛిన్నః పీడితో వా పీడింపబడ్డవాడు), సుబహు దిగ్గజగణైః= అనేక ఏనుగుల సమూహముచే, మథితః= తొక్కించ బడ్డాడు.( పీడితః విలోడితః–పీడింపబడ్డవాడు చిలుకబడినది), మహాసర్పైః = మహాసర్పములతో(సర్పతి గచ్ఛతి వెళ్లునది. సర్పము), దష్టః = కరిపిం చబడ్డాడు, అపి= మరియు, అనశనః= పస్తులున్నాడు. (న అశనమ్ భోజనము చేయకపోవుట. ఉపవాసము), గర ఆహార = విషాహారముతో (గర= గిరతి నిగళతి జీవనమ్ ప్రాణమును (మ్రింగునది) తీయునది. విషము), విధుతః=బాధ పొందాడు (విధుతః కంపితః త్యక్తః–కంపించబడ్డాడు వదలబడినది), గిరి–ఇన్ద్ర = పెద్ద కొండల పైనుండి, అవక్షిప్తః= కిందికి త్రోసివేయబడ్డాడు, అపి= అయినప్పటికి, అహహ= ఆహా (తన్మయత్వములో

కవి మాట), త్వయి న్యస్త –ఆత్మత్వాత్ = నీయందు ఉంచబడిన ఆత్మకల నీ భక్తుడగు ప్రహ్లాదుడు, కిమ్ అపి న నిపీడామ్ = కొంచెము కూడా బాధను, అభజత= పొందలేదు.

**తాత్పర్యము:** పరమాత్మా! ఆహిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పలుమార్లు శూలములతో పొడిపించాడు. అనేక ఏనుగుల సమూహముచే తొక్కించాడు. మహాసర్పములతో కరిపించాడు. పస్తులుంచాడు. విషాహారము తినిపించాడు. కొండలపైనుండి కిందికి త్రోసివేయించాడు.. అయినప్పటికి – ఆహా! నీయందు ఉంచబడిన ఆత్మకల( ఆత్మతత్వమును పూర్తిగా గ్రహించిన,) నీ భక్తుడగు ప్రహ్లాదుడు మాత్రము కొంచెము కూడా బాధ పడలేదు.

**విశేషాలు:** పరమాత్మ అని సంబోధిస్తూ త్వయి న్యస్త – ఆత్మత్వాత్ (నీయందు ఉంచబడిన ఆత్మకల నీ భక్తుడగు ప్రహ్లాదుడు) అనుటలో కవిత్వపు సొగసు ఉంది.

**24–8 శ్లో.**
**తతశ్శంకావిష్టః స పునరతిదుష్టోఽస్య జనకో**
**గురూక్త్యా తద్గేహే కిల వరుణపాశైస్తమరుణత్ ।**
**గురోశ్చాసాన్నిధ్యే స పునరనుగాన్ దైత్యతనయాన్**
**భవద్భక్తేస్తత్త్వం పరమమపి విజ్ఞానమశిషత్ ॥**

**ప్రతిపదార్థం:** తతః = అటుపిమ్మట, శంకా –ఆవిష్టః= తన ప్రయత్నములు ఫలించక పోవుట కు కారణం ఏమిటని సందేహించి (శంకతే తస్య భావః కర్మ వా సంశయము సందేహము), సః అతిదుష్టః= ఆ అతి దుష్టుడు, అస్య జనకః = ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుడప్పుడు (జనయతి పుట్టించువాడు. తండ్రి), పునః= మరలా, గురు–ఉక్త్యా= తనగురువుల మాటవిని, తత్ గేహే= ఆ గురువుల గృహమునందే, వరుణపాశైః = వరుణపాశములతో(పశ్యతే బధ్యతే అనేన–దీనితో బంధింతురు. త్రాడు పాశము), తమ్–అరుణత్ కిల = ఆ ప్రహ్లాదుని బంధించెను కదా, గురోః– చ = గురువులు, అసాన్నిధ్యే= గృహములో లేని సమయంలో, సః = ఆ ప్రహ్లాదుడు, పునః = మరలా, అనుగాన్= స్నేహితులైన (అను పశ్చాత్

గచ్ఛతి అనుచరుడు సేవకుడు), దైత్యతనయాన్= రాక్షస కుమారులకు, భవత్ – భక్తేః తత్వం = నీ భక్తి జ్ఞానములను (స్వరూప, కారణ, ఫలరూపమైన భక్తి జ్ఞానములను), పరమమ్ –అపి = శ్రేష్ఠమయిన, విజ్ఞానమ్ = బ్రహ్మ జ్ఞానమును, అశిషత్= ఉపదేశించాడు.

**తాత్పర్యం:** అటుపిమ్మట తన ప్రయత్నములు ఫలించక పోవుట కు కారణం ఏమిటని సందేహించి దుష్టుడు క్రూరస్వభావి ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుడప్పుడు తనగురువుల మాటవిని, ప్రహ్లాదుని వరుణపాశములతో ఆ గురువుల గృహమునందే బంధించెను. గురువులు గృహము లో లేని సమయంలో ప్రహ్లాదుడు తన స్నేహితులయిన రాక్షస కుమారులకు నీ భక్తి జ్ఞానములను బ్రహ్మ జ్ఞానమును గురించి చెప్పేవాడు.

**24–9 శ్లో.**

**పితా శృణ్వన్ బాలప్రకరమఖిలం త్వత్ స్తుతిపరం**
**రుషాంధః ప్రాహైనం కులహతక! కస్తేబలమితి ।**
**బలం మే వైకుంఠస్తవ చ జగతాం చాపి స బలం**
**స ఏవ త్రైలోక్యం సకలమితి ధీరోఽయమగదీత్ ॥**

**ప్రతిపదార్థము:** అఖిలం బాలప్రకరమ్= ఆ రాక్షస బాలురందరూ(ప్రకిరతి తస్య భావః–ప్రోగు చేయబడ్డది. సమూహము), త్వత్ స్తుతిపరం= నీ స్తుతి చేయుచున్నారని, శృణ్వన్= వినిన, పితా= తండ్రి అయిన హిరణ్యకశిపుడు (తండ్రులు అయిదుగురు. – కన్నవాడు, వడుగుచేసినవాడు, చదువుచెప్పినవాడు, అన్నముపెట్టినవాడు, వెఱపుదీర్చి కాపాడినవాడు), రుషా–అంధః= కోపముతో గుడ్డివాడయి (రుష్యతి తస్య భావః కర్మ వా కోపము), ఏనం= ప్రహ్లాదునితో, కులహతక!= వంశనాశకుడా!, కః–తే బలమ్ –ఇతి= నీకు బలమెవరు? అని, ప్ర– ఆహ= అడిగాడు, వైకుంఠః = విష్ణువు (వికుంఠస్య విష్ణోః ఇంద్రస్య వా ఇదం వా విష్ణువు), మే= నాకును, తవ చ= నీకును, బలమ్ = బలము(బలతి బలయుక్తో భవతి అనేన దీనితో యుక్తుడగును. బలము), జగతాం చ –అపి = లోక వాసులందరికి కూడా, సః బలం= అతడే బలం, సకలమ్ త్రైలోక్యం = మూడు

లోకములు, సః ఏవ ఇతి = ఆ విష్ణువే అని, ఆయమ్ ధీరః= ఆ నిర్భయుడు, విద్వాంసుడు అయిన ప్రహ్లాదుడు, అగదీత్= జవాబు ఇచ్చెను.

**తాత్పర్యము:** ఆ రాక్షస బాలురందరూ నీ స్తుతి చేయుచున్నారని వినిన హిరణ్యకశిపుడు కోపముతో గుడ్డివాడయి ప్రహ్లాదుని పిలిచి ఇలా అన్నాడు "వంశనాశకుడా! నీకు బలమెవరు?". నీకును – నాకును – ఈ సకల జగత్తునకును బలము ఆ వైకుంఠుడే! విష్ణువే మూడు లోకములకు – సకలమూ అతడే!" అని ప్రహ్లాదుడు జవాబు ఇచ్చెను

**24-10 శ్లో.**
**అరే! క్వాఽసౌ క్వాఽసౌ సకలజగదాత్మా హరిరితి**
**ప్రభింతే స్మ స్తంభం చలితకరవాలో దితిసుతః ।**
**అతః పశ్చాద్విష్ణో! న హి వదితుమీశోఽస్మి సహసా**
**కృపాత్మన్! విశ్వాత్మన్! పవనపురవాసిన్! మృడయ మామ్ ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో!=విష్ణుదేవా (వేవేష్టిసర్వంజగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), ఈశః= ప్రభూ!, అరే! = ఓరీ ! (నీచసంబోధనం వయసా కనీయాంసం సంబోధయతి అనేన నీచుని సంబోధించుట శత్రువును సంబోధించుట పెద్దవాడు చిన్నవానిని సంబోధించుట), సకలమ్జగత్ ఆత్మా = నీవు సకల జగములకు ఆత్మరూపుడని చెబుతున్నావే, హరిః = ఆ శ్రీహరి, క్వ–అసౌ క్వ–అసౌ ఇతి = ఎక్కడ? ఎక్కడున్నాడు?అని కోపముతో గర్జిస్తూ, దితిసుతః= దితి పుత్రుడైన హిరణ్యకశిపుడు, చలితకరవాలః= ఖడ్గమును చలింపచేస్తూ (చలితః కంపితః గతః–కంపించినది) (కరం వాలయతి రక్షతి చేతిని రక్షించునది. ఖడ్గము), స్తంభం= స్తంభమును (స్తభ్నాతి గృహాచ్ఛాదనమ్ గృహాచ్ఛాదనమును ఆపునది. స్తంభము), ప్రభింతే స్మ= పగులగొట్టెను, అతః పశ్చాత్ = ఆ తరువాత( స్తంభమును పగులగొట్టిన తరువాత ఏమి జరిగిందో), సహసా=వెంటనే, వదితుమ్ న అస్మి హి= నేను చెప్పలేక పోవుచుంటిని, కృపాత్మన్!= దయాసముద్రుడా!, విశ్వాత్మన్!= విశ్వాత్మా! (విశ్వం ఆత్మా యస్య–ప్రపంచమే ఆత్మగా కలవాడు. పరమాత్ముడు),

పవనపురవాసిన్!= గురువాయూరు దేవా!, మామ్= నన్ను, మృడయ= సుఖ పెట్టు (రక్షించు).

**తాత్పర్యము:** "అరే! నీవు సకల జగములకు ఆత్మరూపుడని చెబుతున్నావే ఆ శ్రీహరి ఎక్కడ? ఎక్కడున్నాడు?" అని గర్జిస్తూ– ఆ దితి పుత్రుడైన హిరణ్యకశిపుడు ఖడ్గమును ధరించి అక్కడ ఉన్న ఒక స్తంభమును పగులగొట్టెను. ఆ తరువాత ఏమి జరిగిందో ప్రభూ! నేను వెంటనే చెప్పలేక పోవుచుంటిని. దయాసముద్రుడవైన విశ్వాత్మా! గురువాయూరు దేవా! నా బాధలనుండి నన్ను రక్షిం చు.

**సప్తమ స్కంధము**

**24వ దశకము సమాప్తము.**



# దశకమ్ 25 – నరసింహావతారము

**25–1 శ్లో.**

**స్తంభే ఘట్టయతో హిరణ్యకశిపోః కర్ణౌ సమాచూర్ణయన్**
**అఘూర్ణజ్జగదండకుండకుహరో ఘోరస్తవాభూద్రవః ।**
**శ్రుత్వా యం కిల దైత్యరాజహృదయే పూర్వం కదాఽప్యశ్రుతం**
**కంపః కశ్చన సంపపాత చలితోఽప్యంభోజభూర్విష్టరాత్ ॥**

**ప్రతిపదార్థం:** స్తంభే ఘట్టయతః= తన ఖడ్గముతోఆ స్తంభమును పగులగొట్టగా, హిరణ్యకశిపోః = హిరణ్యకశిపుని యొక్క, కర్ణౌ సమాచూర్ణయన్= చెవులను బద్దలుకొడుతూ, తవ= నీయొక్క, ఘోరఃరవః= భయంకరమైన సింహానాదము, జగత్–అండకుండకుహరః= బ్రహ్మాండము యొక్క కటాహము(the globe of the universe) లోపల ఉన్న చరాచరమును, అఘూర్ణత్= దద్దరిల్ల చేస్తూ, అభూత్ కిల= వెలువడెను కదా!, పూర్వం= అంతకు పూర్వము, కదా–అపి–అ శ్రుతం= ఎప్పుడూ వినియుండని, యం శ్రుత్వా= ఏ ధ్వని అయితే ఉన్నదో ఆ ధ్వనిని విని, దైత్యరాజహృదయే= హిరణ్యకశిపుని హృదయములో, కశ్చన =స్పష్టముగా తెలియని, కంపః= కంపము (కంపః శరీరావయవానాం కంపనమ్ శరీరావయములు కంపించుట), సంపపాత= కలిగెను, అంభోజభూః అపి= బ్రహ్మదేవుడు కూడా, విష్టరాత్= తన సత్యలోకములోని తన ఆసనము నుండి (విష్టర=విశేషేణ స్తృణోతి ఆచ్ఛాదయతి ఏనమ్ దీనితో కప్పుదురు. ఆసనము), చలితః= ఈ అకాల ప్రళయమేమిటని చలించాడు.

**తాత్పర్యము:** తన ఖడ్గముతోఆ స్తంభమును పగులగొట్టగా హిరణ్యకశిపుని యొక్క చెవులను బద్దలుకొడుతూ నీయొక్క భయంకరమైన సింహానాదము బ్రహ్మాండము యొక్క కటాహము లోపల ఉన్న చరాచరమును దద్దరిల్ల చేస్తూ వెలువడెను. అంతకు పూర్వము ఎప్పుడూ వినియుండని ఆ ధ్వనిని విని హిరణ్యకశిపుని హృదయములో అనిర్దేశ రూపమైన కంపము కలిగెను. బ్రహ్మదేవుడు కూడా తన సత్యలోకము నుండి ఈ అకాల ప్రళయమేమిటని చలించాడు.

**25-2 శ్లో.**

**దైత్యే దిక్షు విసృష్టచక్షుషి మహాసంరంభిణి స్తంభతః**
**సంభూతం న మృగాత్మకం న మనుజాకారం వపుస్తేవిభో! ।**
**కిం కిం భీషణమేతదద్భుతమితి వ్యుద్భ్రాంతచిత్తేఽసురే**
**విస్ఫూర్జద్ధవళోగ్రరోమవికసద్వర్ష్మా సమాజృంభథాః॥**

**ప్రతిపదార్థము:** విభో= ప్రభూ!, దైత్యే = హిరణ్యకశిపుడను ఆ రాక్షసుడు, మహాసంరంభిణి = గొప్ప సంరంభము తో (సంరంభః క్షోభః క్రోధ అస్తి అస్య- కోపం గలవాడు), దిక్షు = దిక్కులందు, విసృష్ట చక్షుషి= సర్వత్ర సంచరించు కన్నులతో చూపు నిలిపి చూడగా (విసృష్ట= ప్రేరితః, త్యక్తః క్షిప్తః, దత్తః- ప్రేరేపించబడినది, వదిలిపెట్టబడినది, వుంచబడినది, ఇవ్వబడినది), స్తంభతః= స్తంభమునందుండి, న మృగ-ఆత్మకం = అటు మృగము కాక, న మనుజ- ఆకారం= ఇటు మనుష్యుడు కాక, తే = నీయొక్క, వపుః = నరసింహాకారమైన రూపము (వపుస్=వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర- దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), సంభూతం= అవతరించినది, కింకిం ఏతత్- భీషణమ్- అద్భుతమ్ ఇతి= ఈ భయంకరమైన, అద్భుతమైన రూపధ్వని ఏమిటని, వి- ఉద్భ్రాంతచిత్తే =బాగా తిరుగుడు పడిన మనస్సుతో, అసురే= హిరణ్య కశిపుడు ఆలోచించే లోపుగానే(న సుష్ఠు రతోః న స్థితః- స్థిరంగా ఒకచోట నుండనివాడు చంచలచిత్తుడు రాక్షసుడు, విస్ఫూర్జత్ = బాగా ప్రకాశము పొందిన, ధవళ = తెల్లనైన(ధవం కంపం లాతి వణుకు పుట్టించునది. తెలుపు అందమైనది), ఉగ్రరోమవికసత్-వర్ష్మా= తెల్లనైన జూలును నిక్కింపచేస్తూ నువ్వు నరసింహ రూపములో, సమాజృంభథాః= విజృంభించావు.

**తాత్పర్యము:** ప్రభూ! రాక్షసుడు గొప్ప సంరంభముతో దిక్కులందు సర్వత్ర సంచరించు కన్నులతో చూపు నిలిపి చూడగా స్తంభమునందుండి అటు మృగము కాక ఇటు మనుష్యుడు కాక నీయొక్క నరసింహాకారమైన రూపము అవతరించినది. ఈ భయంకరమైన, అద్భుతమైన రూపధ్వని ఏమిటని బాగా తిరుగుడు పడిన

మనస్సుతో హిరణ్య కశిపుడు ఆలోచించే లోపుగానే బాగా ప్రకాశము పొందిన తెల్లనైన జూలును నిక్కింపచేస్తూ నువ్వు నరసింహ రూపములో విజృంభించావు.

**25–3 శ్లో.**
**తప్తస్వర్ణసవర్ణఘూర్ణదతిరూక్షాక్షం సటాకేసర–**
**ప్రోత్కంపప్రనికుంబితాంబరమహో జీయాత్ తవేదం వపుః ।**
**వ్యాత్తవ్యాప్తమహాదరీసఖముఖం ఖడ్గోగ్రవల్గన్మహా–**
**జిహ్వానిర్గమదృశ్యమానసుమహాదంష్ట్రాయుగోడ్డామరమ్ ॥**

**ప్రతిపదార్థం:** తప్త= వేడి చేయబడ్డ (పుటము పెట్టిన) (సంతప్త సంతాపతో వా సంతప్తుడు వేడి చేయబడ్డది), స్వర్ణ = బంగారము వలె ఎర్రగా(సుష్ఠు ప్రశస్తః అర్ణః వర్ణః యస్య–మంచి రంగు కలది. బంగారము), సవర్ణ = సమాన వర్ణం కల (సమానః వర్ణః యస్య), ఘూర్ణత్ = తిరగబడుతున్న, అతిరూక్ష = ఎండి పోయినట్లున్న (అతిశయితః రూక్షః–ఎండి పోయినది), అక్షం=తీక్షణమైన కన్నులు కలిగి(అక్ష్ణోతి, అక్షతి, అక్ష్యతే వా అనేన–చూచునది, వ్యాపించునది. దేనితో విషయం గ్రహింపబడునో అది. ఇంద్రియము), ప్రోత్కంప= ప్రచలితమైన, సటాకేసర=స్కంధరోమములచే (జూలుచే)( సటంతి కేశాః యత్ర–వెంట్రుకలు అతుక్కొనునది. సటము, జూలు జడ), ప్రనికుంబిత= అవరించబడిన, అంబరమ్ = ఆకాశము కలిగి (అంబః శబ్దః తం రాతి ధత్తే శబ్దము కల్గియున్నది (శబ్దము గుణముగా కల్గియున్నది). ఆకాశము, వ్యాత్తమ్= విస్తరింపబడిన (విశేషేణ ఆదత్తః వివృతః విస్తృతః–వివరింపబడినది, విస్తరింపబడినది), వ్యాప్త= వ్యాప్తమైన (విశేషేణ ఆప్నోతి సర్వత్ర–సర్వత్ర వ్యాపించునది), మహాదరీ= గొప్ప గుహతో, సఖ= సదృశమైన, ముఖం= ముఖము కలిగి, ఖడ్గ ఉగ్ర= ఖడ్గము వలె ఉగ్రమై, వల్గత్= చలించు, మహా–జిహ్వా= గొప్ప నాలుకతో (హూయతే ఖాద్యతే అనయాదీనితో తిందురు. నాలుక), నిర్గమ =బయటికి వచ్చునట్లుగా, దృశ్యమాన=కనబడుచున్న, సుమహా=బాగా గొప్పవైన, దంష్ట్రాయుగ = రెండు కోరలతో (దశ్యతే అనయా దీనితో నమలబడును. దవుడ, పన్ను), ఉడ్డామరమ్= అతిభీషణముగా (ఉత్కటం డామరమ్ ప్రచండమైనది రుచికరమైనది శ్రేష్ఠమైనది),

తవ ఇదం వపుః।= నీ ఈ నరసింహా కారము, జీయాత్= సర్వోత్కృష్టముగా ప్రకాశిస్తున్నది, అహో = ఆశ్చర్యము.

**తాత్పర్యము:** పుటము పెట్టిన బంగారములా ఎఱ్రగా తిరగబడుతున్న కనుగుడ్లతో ఎండి పోయినట్లున్న తీక్షణమైన కన్నులు కలిగి చలిస్తున్న జూలుచే అవరించబడిన ఆకాశము కలిగి ,విస్తరింపబడిన గొప్ప గుహ వంటి ముఖము కలిగి ఉగ్రమై చలించు గొప్ప నాలుకతో, బయటికి వచ్చినట్లు కనబడుచున్న పొడవైన రెండు కోరలతో అతిభీషణముగా ఉన్న నీ ఈ నరసింహా కారము సర్వోత్కృష్టముగా ప్రకాశిస్తున్నది. ఆశ్చర్యము.

**25-4 శ్లో.**

**ఉత్సర్పద్వలిభంగభీషణహనుం హ్రస్వస్థవీయస్తర-**
**గ్రీవం పీవరదోశ్శతోద్గతనఖక్రూరాంశుదూరోల్బణమ్ ।**
**వ్యోమోల్లంఘి ఘనాఘనోపమఘనప్రధ్వాననిర్ధావిత-**
**స్పర్ధాలుప్రకరం నమామి భవతస్తన్నారసింహం వపుః ॥**

**ప్రతిపదార్థం:** ఉత్సర్పత్ = నరసింహాకారంలో నువ్వు అట్టహాసం చేయగా పైకి ఎగసిన, వలిభంగ = ముడతలు తేరిన, భీషణహనుం = భయంకరమైన గండభాగంతో(హను = హంతి అనేన-దీనితో చంపుదురు. దవుడ), హ్రస్వ= హ్రస్వమై ఉన్న(హ్రసతి అస్తి లఘుత్వేన-చాలా చిన్నగా వుండునది. హ్రస్వము), స్థవీయః = బాగా లావైన (అతిశయేన స్థూలః), తర=తరింపచేయు (తరః తరణమ్ దాటుట తరించుట), గ్రీవం= కంఠంతో(గిరతి నిగలతి మ్రింగునది. కంఠము మెడ), పీవర= బలిసిన(ప్యాయతే స్థూలో భవతి బలిసినవాడు), క్రూరనఖ=తీక్షణములైన వంకర తిరిగిన గోళ్లయొక్క (క్రూర= క్రుంతతి ఛినత్తి నరకువాడు నిర్దయుడు), ఉద్గత= పైకి పోయినది (ఉద్గత ఉచ్చైః గతః ప్రాప్తోదయః-ఉదయించినది పైకి పోయినది పుట్టినది బహిర్గతమైనది.) కాంతి సమూహముతో, దూర- ఉల్బణమ్= బాగా దూరముగా విస్తరిస్తున్న భయంకరమయిన, శత దోః= నూరు హస్తములతో, వ్యోమ ఉల్లంఘి= ఆకాశమును అంటిన, ఘనాఘన= పెను మబ్బుల గర్జనకు, ఉపమ= పోలిక కలిగిన, ఘన

ప్రధ్వాన = గొప్ప ధ్వనులతో (ధ్వాన=ధ్వనం శబ్దం కరోతి తస్య భావః కర్మ వా శబ్దము చేయుట శబ్దము), స్పర్ధాలు ప్రకరం= స్పర్థ కలిగిన రాక్షసమండలిని, నిర్ధావిత= పారిపోయేటట్లు చేసిన (నిర్= మిక్కిలి ధావిత=ధావితః గతః మార్జితో వా వెళ్లినది శుభ్రపరచినది), భవతః = నీయొక్క, తత్– నారసింహం= ఆ నారసింహ, వపుః = స్వరూపమునకు, నమామి= నమస్కరించెదను.

**తాత్పర్యం:** నరసింహాకారంలో నువ్వు అట్టహాసం చేయగా పైకి ఎగసిన ముడతలు తేరిన భయంకరమైన గండభాగంతో, హ్రస్వమై ఉన్న బాగా లావైన తరింపచేయు కంఠంతో, బలిసిన తీక్షణములైన వంకర తిరిగిన గోళ్లయొక్క పైకి పోయిన ఎర్రని కాంతి సమూహముతో, బాగా దూరముగా విస్తరిస్తున్న అనగా పొడవైన భయంకరమయిన నూరు చేతులతో, ఆకాశమును అంటిన పెను మబ్బుల గర్జనకు పోలిక కలిగిన గొప్పదైన పెను బొబ్బలచేత హడలిపోయి రాక్షసమండలిని పారిపోయేటట్లు చేసిన నీయొక్క ఆ నారసింహ స్వరూపమునకు నమస్కరించెదను.

**25–5 శ్లో.**
**నూనం విష్ణురయం నిహన్మ్యమమితి భ్రామ్యద్గదాభీషణం–**
**దైత్యేంద్రం సముపాద్రవంతమధృథా దోర్భ్యాం పృథుభ్యామముమ్ ।**
**వీరో నిర్గలితోఽథ ఖడ్గఫలకౌ గృహ్ణన్ విచిత్రశ్రమాన్**
**వ్యావృణ్వన్ పునరాపపాత భువనగ్రాసోద్యతం త్వామహో ॥**

**ప్రతిపదార్థం:** అయం= ఇతడు, నూనం = నిశ్చయముగా, విష్ణుః=విష్ణువు, అముమ్= నా సోదరుని చంపిన వీనిని,నిహన్మి = చంపెదను, ఇతి = అని, గదాభీషణం= భీషణమైన గదను ధరించి, భ్రామ్యత్=తిరుగుచూ, సముపాద్రవంతమ్= మీదకు వచ్చి పడుచున్న, దైత్య–ఇంద్రం= ఆ రాక్షస శ్రేష్ఠుడైన హిరణ్య కశిపుని, అధృథాః= నరసింహాకారంలో వానిని గ్రహించి, అముమ్= వీని, పృథుభ్యామ్= గొప్పవైన (ప్రథతే విఖ్యాతో భవతి పేరు మోసినవాడు. పృథువు రాజు తెల్ల జీలకర్ర చాలా పెద్దది గొప్పది), దోర్భ్యాం = రెండు బాహువులను పెదవిరచి కట్టగా వాడు పట్టు విడిపించుకొని, అథ = అటుపిమ్మట, వీరః= ఆ వీరమ్మన్యుడు (వీరుడనని తలచువాడు), నిర్గలితః= వెలికి జారిన, ఖడ్గఫలకౌ= కత్తియు, డాలును,

గృహ్ణన్ = ధరించి, విచిత్రశ్రమాన్= వింత వింత నడకలను (వ్యాయామ మార్గములు దక్షిణ సవ్య సంచరణ భేదములు మొదలయినవి) వ్యావృణ్వన్= ప్రకాశింపచేసి (విజృంభించి), పునః= మరలా, భువనగ్రాస–ఉద్యతం = బ్రహ్మాండమును మింగి వేయు సామర్థ్యము కలిగిన (గ్రాస= గ్రస్యతే అసౌ మ్రింగబడునది. బుక్క ముద్ద), త్వామ్ =నిన్ను ( నీపై), ఆపపాత= పడెను, అహో= ఆశ్చర్యము.

**తాత్పర్యము:** ఇతడు నిశ్చయముగా విష్ణువు. నా సోదరుని చంపిన వీనిని చంపెదను అని భీషణమైన గదను ధరించి తిరుగుచూ నీ మీదకు వచ్చి పడుచున్న ఆ రాక్షస శ్రేష్ఠుడైన హిరణ్య కశిపుని నరసింహాకారంలో వానిని గ్రహించి వీని గొప్పవైన రెండు బాహువులను పెదవిరచి కట్టగా వాడు పట్టు విడిపించుకొని ఆ వీరమ్మన్యుడైన(వీరుడనని తలచువాడు) కత్తియు, డాలును ధరించి వింత వింత నడకలను నీతో యుద్ధంలో ప్రకాశింపచేసి మరలా బ్రహ్మాండమును మింగి వేయు సామర్థ్యము కలిగిన నీపై పడెను. ఆశ్చర్యము.

**25-6 శ్లో.**

**భ్రామ్యంతం దితిజాధమం పునరపి ప్రోద్గృహ్య దోర్భ్యాం జవాత్**
**ద్వారేఽథోరుయుగే నిపాత్య నఖరాన్ వ్యుత్ఖాయ వక్షోభువి ।**
**నిర్భిందన్నధిగర్భనిర్భరగలద్రక్తాంబుబద్ధోత్సవం**
**పాయం పాయముదైరయో బహు జగత్సంహారిసింహారవాన్ ॥**

**ప్రతిపదార్థము:** భ్రామ్యంతం = అటు ఇటూ తిరుగుచూ, దితిజ–అధమం= ఆ రాక్షసాధముని, పునః అపి = మరలా, దోర్భ్యాం= నీ బాహువులచే, జవాత్= చటుకున ( వేగమే) (జవతే వేగేన గచ్ఛతి తస్య భావః–వేగము), ప్ర– ఉద్గృహ్య =గ్రహించి(బంధించి), అథ = అటుపిమ్మట, ద్వారే= ఆ సభద్వారము యొక్క ముందు గడప మీద (వారయతి ఆగమనమ్ రాకను నిరోధించునది. ద్వారము), ఉరుయుగే =నీ తొడలపై, నిపాత్య= వానిని పెట్టుకొని, వక్షో భువి= వానిరొమ్ములో, నఖరాన్=నీ వాడియయిన నఖాగ్రాలను(నఖం రాతి రంధ్రము చేయునది. గీరునది. గోరు), వి–ఉత్ఖాయ =దింపి (ఉత్ఖాతః ఉద్ధృతః ఉన్మూలితో వా పీకివేయబడినది

తీసివేయబడినది పెకిలించబడినది), నిర్భిందన్ = పాయలు పాయలుగా చీల్చి, అధిగర్భ= రొమ్ము లోపలినుండి, నిర్భర గలత్ = సిరల నుండి బయటకు చిమ్ముతున్న, రక్త –అంబు = రక్త ప్రవాహములను, బద్ధ –ఉత్సవం= ఉత్సాహముతో, పాయం పాయమ్= త్రావిత్రావి, ఉదైరయః= బయటకు వెలిగక్కావు, బహు జగత్సంహారి = బ్రహ్మాండ భాండ భేదనములైన, సింహారవాన్= సింహరవములను చేసావు (హినస్తిచంపునది. సింహము).

**తాత్పర్యము:** అటు ఇటూ తిరుగుచూ ఆ రాక్షసాధముని నీ బాహువులచే వేగమే బంధించి ఆ సభద్వారము యొక్క ముందు గడప మీద నీ తొడలపై వానిని పెట్టుకొని వానిరొమ్ములో నీ వాడియయిన నఖాగ్రాలు దింపి పాయలు పాయలుగా చీల్చి రొమ్ము లోపలినుండి సిరల నుండి బయటకు చిమ్ముతున్న రక్త ప్రవాహములను ఉత్సాహముతో పాయం త్రావిత్రావి బయటకు వెలిగక్కావు. అనేక బ్రహ్మాండ భాండ భేదనములైన సింహరవములను చేసావు.

**25–7 శ్లో.**

**త్యక్త్వా తం హతమాశు రక్తలహరీసిక్తోన్నమద్వర్ష్మణి**
**ప్రత్యుత్పత్య సమస్తదైత్యపటలీం చాఖాద్యమానేత్వయి ।**
**భ్రామ్యద్భూమి వికంపితాంబుధికులం వ్యాలోలశైలోత్కరం**
**ప్రోత్సర్పత్ఖచరం చరా చరమహో! దుః స్థామవస్తాందధౌ ॥**

**ప్రతిపదార్థము:** రక్తలహరీసిక్త = రక్త ప్రవాహాలతో తడిసిన(లేన ఇంద్రేణ వాయునా హ్రియతే ఊర్ధ్వగమనాయ–వాయువు ద్వారా పైకి లేపబడునది. తరంగము), ఉన్నమత్= పైకి లేపిన ఉన్నత(ఉన్నమనం ఊర్ధ్వం నమనమ్ పైకి లేపుట), వర్ష్మణి =శరీరము కలిగిన, హతమ్ తం= చనిపోయిన ఆ హిరణ్యకశిపుని, త్యక్త్వా= విడిచి, ఆశు= వెంటనే, ప్రత్యుత్పత్య = ఒక్కసారిగా దూకి, సమస్తదైత్యపటలీం చ= అతని పరివారములైన సమస్త రాక్షస సమూహములను కూడా, త్వయి= నీయందు (నువ్వు), ఆఖాద్యమానే = తినుచుండగా (ఖాదితుం యోగ్యమ్ తినదగినది. భోజనము), భూమిః = భూగోళము, భ్రామ్యత్ = కంపించింది, అంబుధికులం = సముద్రములు, వికంపితః= పొంగాయి, శైల–ఉత్కరం= పర్వత సమూహాలు,

వ్యాలోలః= బంతులవలె తిరిగి ప్రతిధ్వనించాయి. (అధికం లోడతి కంపతే అసౌ కంపించువాడు అవ్యవస్థితము ఊగునది), ఖచరం = దేవతల సమూహము (ఖే ఆకాశే చరతి ఆకాశములో విహరించునది. దేవతలు), ప్ర–ఉత్సర్పత్ = హడలిపోయారు, చరాచరమ్ = కదిలే కదలని వాటితో నిండిన అశేష లోకాలు, దుః స్థామ్ –అవస్థాం = ఒకచోట కుదురుగా ఉండలేని ఆకుల పాటును, దధౌ= ధరించినవి.(పొందినవి), అహో=ఆశ్చర్యము.

**తాత్పర్యము:** రక్త ప్రవాహాలతో తడిసిన ఉన్నతశరీరము కలిగిన ఆ హిరణ్యకశిపుని విడిచి వెంటనే ఒక్కసారిగా దూకి అతని పరివారములైన సమస్త రాక్షస సమూహములను కూడా నువ్వు తినుచుండగా భూగోళము కంపించింది. సముద్రములు పొంగాయి. పర్వత సమూహాలు బంతులవలె తిరిగి ప్రతిధ్వనించాయి దేవతల సమూహము హడలిపోయారు. కదిలే కదలని వాటితో నిండిన అశేష లోకాలు ఒకచోట కుదురుగా ఉండలేని ఆకుల పాటును పొందినవి. ఆశ్చర్యము .

**25–8 శ్లో.**

**తావన్మాంసవపాకరాళవపుషం ఘోరాంత్రమాలాధరం**
**త్వాం మధ్యే సభమిద్ధరోషముషితం దుర్వారగుర్వారవమ్ ।**
**అభ్యేతుం న శశాక కోఽపి భువనే దూరేస్థితా భీరవః**
**సర్వే శర్వవిరించవాసవముఖాః ప్రత్యేకమస్తోషత ॥**

**ప్రతిపదార్థము:** తావత్= ఆసమయంలో, మాంస= మాంసము(మన్యతే జాయతే తెలుసుకొనబడును ఆదరింపబడును. మాంసము), వపా= వస (వుప్యతే అత్రమేధస్సు), కరాళవపుషం = భయంకరమైనవెన్నెముకల శరీరము(కరాయ క్షేపాయ అలతి పర్యాప్నోతి విక్షేపమును కల్గించు సామర్థము కలది భయంకరమైనది), ఘోర –ఆంత్రమాలాధరం= భయంకరమైన పేగుల మాల (అమతి గచ్ఛతి అనేన–రక్తము ప్రవహించు నాడి. నరము.)తో కూడి, త్వాం మధ్యే సభమ్= సభా మధ్యములో, ఇద్ధ= ప్రజ్వలించు(ఇంధే దీప్యతే అసౌ, ప్రజ్వలితః–ఆతపము, ఎండ ప్రజ్వలింపబడ్డది), రోషమ్= రోషముతో, ఉషితం = ఉండునది (ఉషితః స్థితః నివసితః–ఉండునది నివసించునది), దుర్వార

గుర్వారవమ్= వినుటకు భరించలేని ధ్వనులతో కూడి ఉన్న, అభి–ఏతుం = నీ దగ్గరకు సమీపించుటకు, భువనే= భువనములో, కః అపి= ఏ ఒక్కరు కూడా, నశశాక =సమర్థులు కాలేదు, శర్వవిరించవాసవముఖాః= శివుడు , బ్రహ్మ , ఇంద్రుడు మొదలైన దేవతలు కూడా, భీరవః= భయస్థులై, దూరేస్థితాః= దూరముగా నిలబడ్డారు, సర్వే =అందరు, ప్రత్యేకమ్= ప్రత్యేకముగా, స్తోషత= నిన్ను పొగుడుట మొదలుపెట్టారు.

**తాత్పర్యము:** ఆసమయంలో మాంసము, వస , ఎముకల మాల భయంకరమైన పేగుల తో కూడి సభా మధ్యములో రోషముతో వినుటకు భరించలేని ధ్వనులతో కూడి ఉన్న నీ దగ్గరకు సమీపించుటకు భువనములో ఏ ఒక్కరు కూడా సమర్థులు కాలేదు. శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు కూడా భయస్థులై దూరముగా నిలబడ్డారు. అందరు ప్రత్యేకముగా నిన్నుతృప్తి పరుచుటకు పొగుడుట మొదలుపెట్టారు.

**విశేషాలు:** మాంస భక్షయితా అముత్ర యస్య మాంస ఇహాద్మ్యహమ్– 'దేని మాంసము ఇక్కడ తింటున్నానో, అది నన్ను తినును.'

**25–9 శ్లో.**

**భూయోఽప్యక్షత రోషధామ్ని భవతి బ్రహ్మాజ్ఞయా బాలకే**
**ప్రహ్లాదే పదయోర్నమత్యపభయే కారుణ్యభారాకులః ।**
**శాంతస్త్వం కరమస్య మూర్ధ్ని సమధాః స్తోత్రైరథోద్గాయతః**
**తస్యాకామధియోఽపి తేనిథ వరం లోకాయ చానుగ్రహమ్ ॥**

**ప్రతిపదార్థము:** భూయః అపి=బ్రహ్మాదులు స్తుతి చేసినప్పటికి మరలా, అక్షత= తక్కువ కాని (న క్షతః క్షీణము గానిది), రోష ధామ్ని భవతి = కోపభాజివై నువ్వుండగా, బ్రహ్మ–ఆజ్ఞయా= బ్రహ్మ ఆజ్ఞాపింపగ (అనునయించి పంపగా), బాలకే ప్రహ్లాదే = బాలకుడైన ప్రహ్లాదుడు (బాల ఏవ బాలకః–బాలుడు), పదయోః నమతి= నీ చరణములపై పడి నమస్కరింపగా, అపభయే= అతని భయము పోగొట్టుటకు (అపగతం భయం యస్మాత్ భయము లేని), కారుణ్య భార–

ఆకులః= సంపూర్ణ వాత్సల్య మూర్తి (కరుణస్య భావః, కరుణ ఏవ కారుణ్యమ్ కారుణ్యము, దయాభావము), శాంతః= శాంతుడవైన, త్వం= నువ్వు, తస్య మూర్ధ్ని= అతని తలపై, కరమ్ సమధాః = చేతిని ఉంచి, అథ= అటుపిమ్మట, స్తోత్రైః= అతడు స్తోత్రములతో, ఉద్గాయతః= నిన్ను కీర్తించుచుండగా, అకామధియః అపి = ప్రహ్లాదుడు ఏ వరము అడుగకున్నను, తస్య = అతనికి, లోకాయ చ అనుగ్రహమ్= లోకానుగ్రహ రూపమైన రాక్షసాధిపత్యమను, వరం =వరమును, తేనిథ= ఇచ్చితివి(అనుగ్రహించితివి).

**తాత్పర్యము:** బ్రహ్మాదులు స్తుతి చేసినప్పటికి మరలా కోపముతో నువ్వుండగా బ్రహ్మ ఆజ్ఞాపింపగ బాలకుడైన ప్రహ్లాదుడు నీ చరణములపై పడి నమస్కరించాడు. అతని భయము పోగొట్టుటకు సంపూర్ణ వాత్సల్య మూర్తి ,శాంతుడవైన నువ్వు అతని తలపై చేతిని ఉంచావు. అతడు స్తోత్రములతో నిన్ను కీర్తించుచుండగా, ప్రహ్లాదుడు ఏ వరము అడుగకున్నను అతనికి లోకానుగ్రహ రూపమైన రాక్షసాధిపత్యమను వరమును ఇచ్చితివి( అనుగ్రహించితివి)

**25-10 శ్లో.**

**ఏవం నాటితరౌద్రచేష్టిత ! విభో! శ్రీతాపనీయాభిద**
**శ్రుత్యంతస్ఫుట గీతసర్వమహిమన్నత్యంత శుద్ధాకృతే! ।**
**తత్తాదృఙ్నిఖిలోత్తరం పునరహో కస్త్వాం పరో లంఘయేత్**
**ప్రహ్లాదప్రియ! హే మరుత్పురపతే! సర్వామయాత్ పాహి మామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏవం= ఈ విధంగా, నాటిత రౌద్రచేష్టిత! = రౌద్ర నృత్యమునందు ఆసక్తి పొందిన (రుద్రస్య ఇదమ్ రుద్రునికి సంబంధించినది. కోపము, రౌద్రరసము, భయంకరమైనది), విభో!= ఓ ప్రభూ!, శ్రీతాపనీయ-అభిదశ్రుతి-అత్యంత= శ్రీ తాపనీయ నరసింహ ఉపనిషత్తు లో చాలా, స్ఫుట= చక్కగా(స్ఫుటతి వికసతి ప్రకాశతే వా వికసించినది భేదించబడినది), గీత= గానము చేయబడిన, సర్వమహిమన్= మహిమ కలవాడా!, అతి-అంత శుద్ధ-ఆకృతే!= సచ్చిదానంద స్వరూపా! (అస్తిత్వం, జ్ఞానము, ఆనందం కలవాడు), తత్ తాదృక్=పోలికలేని, నిఖిల-ఉత్తరం= సర్వోత్కృష్టమైన, పునః= మరలా, త్వాం = నిన్ను, పరః కః =

ఇతరులెవరు, లంఘయేత్ = అతిక్రమింపగలడు? (నీకు అప్రియము చేయగలవాడు ఎవడు లేడని భావం), అహో= ఆశ్చర్యము, ప్రహ్లాదప్రియ!= ప్రహ్లాదప్రియా!, హే మరుత్పురపతే!= ఓ గురువాయూరు పురపతీ!, సర్వ-ఆమయాత్ = సకల వ్యాధులనుండి, మామ్ పాహి= నన్ను రక్షింపుము.

**తాత్పర్యము:** ఈ విధంగా రౌద్ర నృత్యమునందు ఆసక్తి పొందిన ఓ ప్రభూ! శ్రీ తాపనీయ నరసింహ ఉపనిషత్తు లో చాలా చక్కగా గానము చేయబడిన మహిమ కలవాడా! సచ్చిదానంద స్వరూపా! పోలికలేని సర్వోత్కృష్టమైన నిన్ను ఇతరులెవరు అతిక్రమింపగలడు? అహో= ఆశ్చర్యము ప్రహ్లాదప్రియా! ఓ గురువాయూరు పురపతీ! సకల వ్యాధులనుండి నన్ను రక్షింపుము

**10వ భావము:** పరమ శుద్ధ స్వరూపా! నరసింహమూర్తీ! ప్రహ్లాద రక్షణార్ధము నీవు నీ రౌద్రరూపమును ప్రదర్శించితివి. అనంత శక్తిస్వరూపా! నీ మహత్యము – 'శ్రీ తాపనీయోపనిషత్తు' నందు కీర్తించబడినది. లోకేశ్వరా! సకలలోకములలోను నిన్ను మించినవారు లేరు. ప్రహ్లాదప్రియా! గురవాయూరు పురపతీ! సకల వ్యాధులనుండి నన్ను రక్షింపుము.

**సప్తమ స్కంధము పూర్తి**

**25వ దశకము సమాప్తము.**

# అష్టమ స్కంధము

## దశకమ్ 26 – గజేన్ద్రమోక్షము

**26–1 శ్లో.**

**ఇంద్రద్యుమ్నః పాండ్యఖండాధిరాజ**
**స్త్వద్భక్తాత్మా చందనాద్రౌ కదాచిత్ ।**
**త్వత్సేవాయాం మగ్నధీరాలులోకే**
**నైవాగస్త్యం ప్రాప్తమాతిథ్యకామమ్ ॥**

**ప్రతిపదార్థము:** పాండ్యఖండ = భారత ఖండము యొక్క దక్షిణ భాగమైన పాండ్యమండలమునకు (పాండుదేశః అభిజనః రాజా వా పాండు దేశము), అధిరాజః= అధిపతి యైన (అధికో రాజా రాజులకు రాజు, రారాజు సార్వభౌమ చక్రవర్తి), త్వత్– భక్త –ఆత్మా = నీ భక్తుడు (భజతే అసౌభజించువాడు. భక్తుడు), ఇంద్రద్యుమ్నః =ఇంద్రద్యుమ్నుడు, కదాచిత్= ఒకానొకప్పుడు, చందన–అద్రౌ= మలయపర్వతంలో(చందయతి ఆహ్లాదయతి ఆనందపరచునది. చందనము గంధము.)(అద్రి= వ్యాపించి అన్నిటిని గ్రసించునది), త్వత్ –సేవాయాం = నీ సేవయందు( నీ ధ్యానములో), మగ్నధీః = నిశ్చలముగా ఉండగా, ఆతిథ్యకామమ్ = ఆతిథ్యమును కోరుచూ (అతిథిగా) (అతిథే ఇదమ్ఆతిథ్యము. అతిథికి చేయు సత్కారములు), ప్రాప్తమ్ అగస్త్యం = వచ్చిన అగస్త్యుని (అగం వింధ్యం పర్వతం స్త్యాయతి అగస్త్యముని), న ఆలులోకే –ఏవ= చూడలేదుకదా.

**తాత్పర్యము:** భారత ఖండము యొక్క దక్షిణ భాగమైన పాండ్యమండలమునకు అధిపతి యైన నీ భక్తుడు ఇంద్రద్యుమ్నుడు ఒకసారి మలయపర్వతంలో నీ ధ్యానములో నిశ్చలముగా ఉండగా అతిథిగా వచ్చిన అగస్త్యుని చూడలేదు.

**విశేషాలు:**

**ఇంద్రద్యుమ్నుడు:** ఋషభుని పౌత్రుడును భరతుని పుత్రుడును అగు సుమతి కొడుకు. ఇతడు ఒకనాడు కడునిష్ఠతో ఉండువేళ అగస్త్యుడు అచ్చటికిరాగా అతనికి

లేచి ప్రత్యుత్థానము ఒనరింపనందున అతడు ఇతనిని మత్తగజేంద్రుడు అగునట్లు శపియించె. అట్లు గజమై సంచరించుచుండి ఒక దినము పిపాసాతురుడై ఒక కొలనిలోనికి నీరు త్రావ దిగగా అందు ఒక మకరిచే ముంగాళ్లు రెండుపట్టువడి నీటిలోనికి ఈడ్వబడెను. అంత ఆగజము పూర్వజన్మజ్ఞానముచే విష్ణు పరాయత్తచిత్తమై అతనిని నుతిచేయ అతడు తన చక్రముచే ఆ మకరిని చంపి గజేంద్రుని కాపాడెను. గజేంద్రుడును తన పూర్వరూపమును పొందెను.

అగస్త్యుని శాపము ఒకరకముగా వరమే. గురువులో(అగస్త్యుడు) నారాయణుని చూడలేకపోయాడు కనుక ఆ దోషం పోగొట్టుకొవటానికి తరువాత జన్మలో గజము అయ్యాడు.

**విశేషాలు:** భాగవతంలో ముందు కథ చెప్పి, తరువాత వారి పూర్వ జన్మలు చెప్పుట జరిగింది. నారాయణీయంలో ముందు పూర్వ జన్మలు చెప్పి తరువాత కథ చెబుతాడు. ఇది భేదం.

**26-2 శ్లో.**

**కుంభోద్భూతిస్సంభృతక్రోధభారః**
**స్తబ్ధాత్మ త్వం హస్తిభూయం భజేతి ।**
**శప్త్వాఽథైనం ప్రత్యగాత్ సోఽపి లేభే**
**హస్తీంద్రత్వం త్వత్స్మృతి వ్యక్తిధన్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** క్రోధభారః= క్రోధ భారమును (క్రుధ్యతి తస్య భావః-కోపము), సంభృత=పొందిన (సమ్యక్భృతఃలబ్ధఃపోషితః-పొందబడినది పోషింపబడినది), కుంభ-ఉద్భూతిః= అగస్త్యుడు, స్తబ్ధ-ఆత్మ = ఓ స్తబ్ధాత్మ !, త్వం= నువ్వు, హస్తిభూయం= హస్తిత్వాన్ని (ఏనుగుగా)(హస్తః శుండా దండః అస్తి అస్య-తొండము కలది. ఏనుగు), భజ-ఇతి=జన్మింపుమని, ఏనం= రాజుని, శప్త్వా= శపించి, ప్రత్యగాత్ = వెళ్ళిపోయెను, అథ = అటుపిమ్మట, సః = అతడు, హస్తి-ఇంద్రత్వం= ఉన్నతమైన ఆకారముతో కూడిన గజజన్మను, త్వత్- స్మృతి= నీకు సంబంధించిన పూర్వ జన్మకు సంబంధించిన భక్తి యొక్క, వ్యక్తి ధన్యమ్ అపి =

ప్రకాశత్వముతో కూడిన ధన్యతను, లేభే =పొందాడు. (పూర్వ జన్మలోని హరిభక్తి, హరిస్మరణను ఏనుగు పుట్టుకలో కూడా పొందాడని భావం).

**తాత్పర్యము:** క్రోధముతో అగస్త్యుడు – "నువ్వు ఏనుగుగా జన్మింపు"మని రాజుని శపించి వెళ్ళిపోయెను. అటుపిమ్మట ఇంద్రద్యుమ్నుడు గజజన్మను పూర్వ జన్మలోని హరిభక్తి, హరిస్మరణను కూడా పొందాడు.

**విశేషాలు**

**అగస్త్యుడు:** ఇతడొక మహర్షి. మిత్రావరుణులు సముద్రపుగట్టున సంచరించుచుండి ఊర్వశిని చూచి కామింప వారికి వీర్యములు స్ఖలితములై కుండలో ఉంచగా అందు అగస్త్యవసిష్ఠులు పుట్టిరి. అగస్త్యుని యాశ్రమము వింధ్యపర్వతసమీపమున ఉన్నది. అగస్త్యుడు పులస్త్యునికి హవిర్భుక్కు అను భార్యయందు పుట్టినట్లు కొన్ని చోట్ల అగపడుచున్నది.

**26–3 శ్లో.**
**దుగ్ధాంభోధేర్మధ్యభాజి త్రికూటే**
**క్రీడన్ శైలే యూథపోయం వశాభిః ।**
**సర్వాన్ జంతూనత్యవర్తిష్ట శక్త్యా**
**త్వద్భక్తానాం కుత్ర నోత్కర్షలాభః ॥**

**ప్రతిపదార్థము:** దుగ్ధ–అంభోధేః = పాల సముద్రములో(దుహ్యతే అసౌ పితుకబడునవి. పాలు) (అంభాంసి ధీయంతే అత్ర–నీటిని ధరించునది. సముద్రము), మధ్య భాజి = మధ్య ప్రకాశించు, త్రికూటే శైలే = త్రికూట పర్వతమందు, అయం వశాభిః= తనకు వశవర్తులైన, యూథపః= ముఖ్యమైన (ఆడు)ఏనుగులతో కలిసి (ఏనుగు మూకలో ముఖ్యమైన ఏనుగును యూథపము), శక్త్యా = తన శక్తితో, సర్వాన్ జంతూన్= అన్ని రకాల జంతువులను, అతి –అవర్తిష్ట = అతిశయిస్తూ (అనగా అన్ని జంతువులపై అధికారము చూపించెనని భావం), క్రీడన్ = విహరించసాగెను, త్వత్ –భక్తానాం= నీ భక్తులగువారికి, కుత్ర = ఎచ్చట,

ఉత్కర్షలాభ:న = ఉన్నత స్థితి ఉండదు? !( ఉత్ ఉచ్చైః కర్షః కర్షణం ఉన్నతిర్వా పైకి లాగుట ఉన్నతి ఔన్నత్యము).

**తాత్పర్యము:** పాల సముద్రములో మధ్య ప్రకాశించు త్రికూట పర్వతమందు తనకు వశవర్తులైన ముఖ్యమైన (ఆడు) ఏనుగులతో కలిసి తన శక్తితో అన్ని రకాల జంతువులపై అధికారము చూపిస్తూ విహరించసాగెను. నీ భక్తులగువారికి ఎచ్చట ఉన్నత స్థితి ఉండదు?! (విష్ణు భక్తులకు అన్నిచోట్ల విశిష్ట స్థానం లభిస్తుందని భావం)

**విశేషములు:**

**త్రికూటం:** భ్రూమధ్య స్థానం త్రికూటమని విశేషార్థం. మూడు శిఖరాలున్న కొండను త్రికూటాచలమన్నారు. ఇలాంటివి దేశంలో అక్కడక్కడ ఉన్నాయి. తెలుగునాట త్రికూటాచలం అంటే కోటప్ప కొండ. ఇది మేధాదక్షిణామూర్తి క్షేత్రం. మూడు శిఖరాలు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు ప్రతి రూపాలని భావన.

**26-4 శ్లో.**
**స్వేన స్థేమ్నా దివ్యదేశత్వ శక్త్యా**
**సోఽయం ఖేదానప్రజానన్ కదాచిత్ ।**
**శైలప్రాంతే ఘర్మతాంత: సరస్యాం**
**యూథైస్సార్థం త్వత్ప్రణున్నోఽభిరేమే ॥**

**ప్రతిపదార్థం:** స్వేన = అనన్య సాధారణమైన, స్థేమ్నా=తన సహజ శరీర బలముతో, దివ్యదేశత్వ శక్త్యా= దివ్యమైన ఆ త్రికూట పర్వత ప్రాంతము యొక్క శక్తితో, సః అయం=ఆ ఇతడు (గజరాజయిన ఇంద్రద్యుమ్నుడు), ఖేదాన్ అప్రజానన్= జీవితంలో రాబోయే పీడలను తెలుసుకోలేక, కదాచిత్= ఒకనాడు, ఘర్మ తాంత: = వేసవి కాలములోని తాపము తీర్చుకొనుటకు(ఘర్మ= ఘరతి క్షరతి అంగాత్ అంగముల నుండి కారునది. చెమట), శైలప్రాంతే = త్రికూట ప్రాంతములో ఉన్న ఋతుమతి అను పుణ్య ఉద్యాన వనములో ఉన్న, సరస్యాం =సరస్సు యందు, యూథైః = తన అంగనలయిన ఆడు ఏనుగులతో (యౌతి

మిశ్రీభవతి కలిసి వుండునది. సమూహము, గుంపు), సార్థం = కలిసి, త్వత్ ప్రణున్నః= నీ ప్రేరణచే, అభిరేమే= క్రీడించసాగెను.(జల క్రీడలాడెను).

**తాత్పర్యము:** అనన్య సాధారణమైన తన సహజ బలముతో దివ్యమైన ఆ త్రికూట పర్వత ప్రాంతము యొక్క శక్తితో గజరాజయిన ఇంద్రద్యుమ్నుడు జీవితంలో రాబోయే పీడలను తెలుసుకోలేక ఒకనాడు వేసవి కాలములోని తాపము తీర్చుకొనుటకు త్రికూట ప్రాంతములో ఉన్న ఋతుమతి అను పుణ్య ఉద్యాన వనములో ఉన్న సరస్సు యందు తన అంగనలయిన ఆడు ఏనుగులతో కలిసి నీ ప్రేరణచే జల క్రీడలాడెను

**26-5 శ్లో.**
**హూహూస్తావత్ దేవలస్యాపి శాపాత్**
**గ్రాహీభూతస్తజ్జలే వర్తమాన:।**
**జగ్రాహైనం హస్తినం పాదదేశే**
**శాంత్యర్థం హి శ్రాంతిదోఽసి స్వకానామ్ ॥**

**ప్రతిపదార్థము:** తావత్ = ఆ కాలములో, హూహూః అపి= 'హూహూ' అను పేరు గల ఒక గంధర్వుడు, దేవలస్య = దేవలుడను ముని యొక్క, శాపాత్= శాపము వలన, గ్రాహీభూతః = మొసలి రూపంలో(గృహ్యతే గృహ్ణాతి వా ఇతర జలజంతువులను పట్టుకొనునది. మొసలి), తత్ -జలే వర్తమాన:= అ సరస్సు నీటిలో ఉంటూ (వర్తతే వర్తమాన కాలము. నడచునది, వుండునది), ఏనం హస్తినం= ఆగజరాజును, పాదదేశే = పాదమును ఒడిసి పట్టి, జగ్రాహ= ఆకర్షించి పీడించుట మొదలు పెట్టెను, శాంతి-అర్థం= శాంతిని అనుగ్రహించుటకు( విషయ విరక్తిని కలిగించటానికి) ( శామ్యతి తస్య భావః కర్మ వా శాంతి చిత్తోపశమనము ఇంద్రియ నిగ్రహము), స్వకానామ్= నీ వారికి ( నీ భక్తులయిన గజరాజు మొదలయినవారికి)(స్వకం=స్వం ఏవ స్వక - తనది, తనవాడు), శ్రాంతిదః అసి = ముందుగా నానాశ్రమలు (పీడలు) కలిగిస్తావు.

**తాత్పర్యము:** ఆ కాలములో 'హూహూ' అను పేరు గల ఒక గంధర్వుడు దేవలుడను

ముని యొక్క శాపము వలన మొసలి రూపంలో అ సరస్సు నీటిలో ఉన్నాడు. అతడు ఆగజరాజు పాదమును ఒడిసి పట్టి ఆకర్షించి పీడించుట మొదలు పెట్టెను. శాంతిని అనుగ్రహించుటకు నీ వారికి – ముందుగా నానాశ్రమలు (పీడలు) కలిగిస్తావు.

**విశేషాలు**

**హూహూ:** ఒకానొక గంధర్వుడు. ఇతడు దేవల ఋషి శాపముచే మకరి అయి పుట్టి అగస్త్యశాపమున గజరూపి అయిన ఇంద్రద్యుమ్నుని పట్టుకొని బాధించి విష్ణుచక్రముచే తల నఱకబడి శాపవిముక్తుడు అయ్యాడు.

**26–6 శ్లో.**
**త్వత్సేవాయా వైభవాద్దుర్నిరోధం**
**యుధ్యంతం తం వత్సరాణాం సహస్రమ్ ।**
**ప్రాప్తేకాలే త్వత్పదైకాగ్ర్యసిద్ధ్యై**
**నక్రాక్రాంతం హస్తివర్యం వ్యథాస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ –సేవాయాః వైభవాత్ = నిన్ను సేవించిన పుణ్య వైభవము వలన గజరాజు (సేవతే తస్య భావః కర్మ వా సేవ), తం= ఆమొసలితో, సహస్రమ్ వత్సరాణాం=వేయిసంవత్సరములు,దుర్నిరోధం యుధ్యంతం=నిరంతరాయంగా పోరాడెను, ప్రాప్తేకాలే = ప్రారబ్ధము అవసానమయినప్పుడు (ప్రాప్తః కాలః యేన– అనుకూల సమయములో), త్వత్ పద ఏకాగ్ర్యసిద్ధ్యై= నీ చరణ స్మృతిచే పరమ నిష్ఠాయోగము అందించుట కొరకు(మోక్షము కొరకు), త్వమ్= నువ్వు, హస్తివర్యం = ఆ గజరాజ శ్రేష్ఠునికి, నక్ర–ఆక్రాంతం వ్యథాః=మొసలి చేత పీడింపబడే బాధను కలిగించావు.(నక్ర= న క్రామతి దూరస్థలమ్ భూమిపై దూరమునకు వెళ్లలేనిది. మొసలి.)(వ్యథా= వ్యథతే తస్య భావః కర్మ వా వ్యథ బాధ దుఃఖము భయము క్షోభ).

**తాత్పర్యము:** నిన్ను సేవించిన పుణ్య వైభవము వలన గజరాజు ఆమొసలితో వేయి సంవత్సరములునిరంతరాయంగాపోరాడాడు..ప్రారబ్ధముఅవసానమయినప్పుడు మోక్షము కొరకు నువ్వు ఆ గజరాజ శ్రేష్ఠునికి మొసలి చేత పీడింపబడే బాధను కలిగించావు.

**26–7 శ్లో.**

**ఆర్తివ్యక్తప్రాక్తనజ్ఞానభక్తిః**
**శుండోత్ క్షిప్తైః పుండరీకైస్సమర్చన్।**
**పూర్వాభ్యస్తం నిర్విశేషాత్మనిష్ఠం**
**స్తోత్రశ్రేష్ఠం సోఽన్వగాదీత్ పరాత్మన్॥**

**ప్రతిపదార్థము:** పరాత్మన్=ఓ పరాత్పరా! ( పరాత్ శ్రేష్ఠాదపి పరః శ్రేష్ఠ–శ్రేష్ఠానికంటె శ్రేష్ఠమైనవాడు), ఆర్తి= పీడ అధికమైన కొలది( ఆర్తస్య భావః–దుఃఖము పీడ), వ్యక్త=తనలో వ్యక్తమయిన(విశేషేణ అంచతి వ్యాప్నోతి వ్యాపించునది స్పష్టమైనది సాంఖ్యమతములో స్థూల ప్రకృతి), ప్రాక్తన= పూర్వ జన్మ సంస్కార రూపమైన (ప్రాక్ కాలే భవః–పూర్వ కాలంలో జరిగినది. పూర్వకాలపుది), జ్ఞానభక్తిః = జ్ఞానము మరియు భక్తిచే (జానాతి తస్య భావః–తెలుసుకొనుట. జ్ఞానము), శుండోత్ ఉత్ క్షిప్తైః = తొండము ఎత్తి అందినంతవరకు(శుండ=శునతి పిబంతి అనేన–దీనితో త్రాగును. తొండము), ఉత్క్షిప్తః ఉచ్చైః క్షిప్తఃపైకి వేయబడినది విసరబడినది), పుండరీకైః = తామరపూవులను కోసి (పుండ్యతే ఖండ్యతే కోయబడునది. పుండరీకము, కమలము), సమర్చన్= నీకు పూజ చేస్తూ, పూర్వ–అభ్యస్తం= పూర్వ జన్మలో నేర్చుకొన్న(పూర్వే పూర్వకాలే భవః పూర్వములో వున్నది), నిర్విశేష–ఆత్మనిష్ఠం= నిర్గుణ బ్రహ్మ విషయములైన, స్తోత్రశ్రేష్ఠం= ముఖ్యములైన నీ స్తోత్రములను, సః = ఆ గజరాజు, అను–అగాదీత్= పదే పదే ఆక్రందనతో పాడెను.

**తాత్పర్యము:** ఓ పరాత్పరా ! పీడ అధికమైన కొలది తనలో వ్యక్తమయిన పూర్వ జన్మ సంస్కార రూపమైన జ్ఞానభక్తిచే తొండము ఎత్తి అందినంతవరకు తామరపూవులను కోసి నీకు పూజ చేస్తూ పూర్వ జన్మలో నేర్చుకొన్న నిర్గుణ బ్రహ్మ విషయములైన ముఖ్యములైన నీ స్తోత్రములను ఆ గజరాజు పదే పదే ఆక్రందనతో పాడెను.

**విశేషాలు**

**ఆత్మా :** ఆత్మా అంటే నేను అనే భావం. స్ఫురణ consciousness. అదే స్వరూపమీ అనాత్మ ప్రపంచానికంతటికీ. కనుక ఆత్మ అంటే స్వరూపం. self or substance

సత్తు ఉండటం. చిత్తు ఉన్నట్టు స్ఫురించటం. ఇవి రెండే దీని లక్షణాలు. ఇవి ఆత్మకే కాక దానికి గోచరించే అనాత్మకు కూడా కన్పిస్తున్నాయి. కాబట్టి ఆత్మానాత్మలుగా భాసించే రెండూ నిజాని కాత్మేనని అద్వైత సిద్ధాంతం. దీనికే ఏకాత్మ, సర్వాత్మ అని పేరు.

'ఆ సమంతాత్ తనోతీతి ఆత్మా.' సర్వవ్యాపకమని నిర్వచనం. 'యదాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయనిహ యచ్చాస్య సంతతోభావః తదాత్మేతి ప్రకీర్త్యతే.' ఏది వ్యాపిస్తుందో, వ్యాపించి ఏది గ్రహిస్తుందో, గ్రహించి ఏది కబళించి తనలో కలుపుకుంటుందో, కలుపుకొని ఏది అవిచ్ఛిన్నంగా నిలిచిపోతుందో అది ఆత్మ అని ఆత్మశబ్దానికి పెద్దలు మరొక నిర్వచనం చెప్పారు. అది నేననే జ్ఞానమే. నావరకే అయితే అది స్వరూపం. సర్వత్రా వ్యాపిస్తే విభూతి. self and its expansion. ఇది అద్వైతుల సిద్ధాంతం.

**26-8 శ్లో.**

**శ్రుత్వాస్తోత్రం నిర్గుణస్థం సమస్తం**
**బ్రహ్మేశాద్యైర్నాహమిత్యప్రయాతే ।**
**సర్వాత్మా త్వం భూరికారుణ్యవేగాత్**
**తార్ క్ష్యరూఢః ప్రేక్షితోఽభూః పురస్తాత్ ॥**

**ప్రతిపదార్థం:** నిర్గుణస్థం= నిర్గుణపరమైన, సమస్తం= సమస్తమైన (సమ్యక్ అస్తః సంక్షిప్తః-సంక్షేపము సకలము), స్తోత్రం= స్తోత్రములను, శ్రుత్వా = విని, న అహమ్ —ఇతి= నా పేరు ఈ నిర్గుణ స్తుతులలో లేదు. నా రూపము ఈ స్తుతులలో లేదు అని, బ్రహ్మ —ఈశ– ఆద్యైః = బ్రహ్మ, ఈశుడు మొదలైన దేవతలు ఒక్కరు కూడా, అప్రయాతే= పలుకలేదు. గజేంద్రునికి అడ్డుపడలేదు, సర్వ–ఆత్మా= సర్వ దేవతల స్వరూపమైన, త్వం= నువ్వు, భూరికారుణ్యవేగాత్= అధిక దయ వలన వేగంతో, తార్క్ష్య –ఆరూఢః = గరుత్మంతుని ఎక్కి(తార్క్ష్యస్య అపత్యమ్ కశ్యపుని కుమారుడు. గరుడుడు), పురస్తాత్= గజేంద్రుని ఎదుట, ప్రేక్షితః అభూః= ఆవిర్భవించావు (సాక్షాత్కరించావు).

**తాత్పర్యము:** నిర్గుణపరమైన సమస్తమైన స్తోత్రములను విని "నా పేరు ఈ నిర్గుణ స్తుతులలో లేదు. నా రూపము ఈ స్తుతులలో లేదు" అని బ్రహ్మ, ఈశుడు మొదలైన దేవతలు ఒక్కరు కూడా పలుకలేదు. గజేంద్రునికి అడ్డుపడలేదు. సర్వ దేవతల స్వరూపమైన నువ్వు అధిక దయ వలన వేగంతో గరుత్మంతుని ఎక్కి గజేంద్రుని ఎదుట సాక్షాత్కరించావు.

**విశేషాలు**

**నిర్గుణ:** గుణములు లేనిది. గుణమంటే ప్రకృతి గుణాలు. సత్వ రజ స్తమస్సులు. నామరూప క్రియలు కూడా గుణాలే. ఉపాధులని అర్థం. చైతన్యాన్ని ఇవి కప్పిపుచ్చి పరిమితం చేసి చూపుతుంటాయి. వీటివల్లనే ఈశ్వర చైతన్యం జీవచైతన్యంగా మారి సగుణమైంది. ఇది కేవలం ఆభాసే. వస్తుతః చైతన్యం నిరాకారం గనుక ఆత్మ స్వరూపం గనుక సర్వవ్యాపకం. అది నిర్గుణమే. Unqualified. పరమాత్మ మాయాశక్తిని వశీకరించుకుని సగుణంగా కూడా అవతరించగలడు. అప్పుడు జీవుడిలాగ సోపాధికుడు కాడు. నిరుపాధికుడే.

**26–9 శ్లో.**
**హస్తీంద్రం తం హస్తపద్మేన ధృత్వా**
**చక్రేణ త్వం నక్రవర్యం వ్యదారీః ।**
**గంధర్వేఽస్మిన్ ముక్తశాపే స హస్తీ**
**త్వత్సారూప్యం ప్రాప్య దేదీప్యతే స్మ ॥**

**ప్రతిపదార్థము:** తం హస్తీ–ఇంద్రం = ఆ గజరాజుని, హస్తపద్మేన= నీ కరకమలముతో, ధృత్వా = ధరించి, త్వం = నువ్వు, చక్రేణ= చక్రముతో, నక్రవర్యం= ఆ మొసలిని (చకతి హంతి పరబలమ్ శత్రు సేనను సంహరించునది), వ్యదారీః= రంపపుకోతకు గురిచేసావు, ముక్తశాపేన= శాప విముక్తిని (ముక్త= త్యక్తః, ప్రాప్తమోక్షణ–వదలబడినది), అస్మిన్ గంధర్వే= ఆ హూహూ గంధర్వుడు (దేదీప్యతే స్మ= చక్కగా ప్రకాశించాడు), సః హస్తీ = ఆ ఏనుగు, త్వత్= నీ సారూప్యమును (సమానరూపమునుగలిగి యుండడము), ప్రాప్య = పొంది, దేదీప్యతే స్మ= చక్కగా ప్రకాశించాడు.

**తాత్పర్యము:** ఆ గజరాజుని నీ కరకమలముతో ఆసరా ఇచ్చి ఆ తటాకమునుండి బయటకు తీసుకు వచ్చావు. నువ్వు చక్రముతో ఆ మొసలిని రంపపుకోతకు గురిచేసావు. శాప విముక్తిని ఆ హుహూ గంధర్వుడు పొందాడు. ఆ ఏనుగు నీ సారూప్యమును పొంది చక్కగా ప్రకాశించాడు.

**విశేషాలు**

**చతుర్విధ ముక్తులు :** 1. సాలోక్యము (విష్ణులోకమందుండుట), 2. సామీప్యము (విష్ణువు దగ్గఱనుండుట), 3. సారూప్యము (విష్ణురూపుడై యుండుట), 4. సాయుజ్యము (విష్ణువులో జేరియుండుట).

**26-10 శ్లో.**
**ఏతద్వృత్తం త్వాం చ మాం చ ప్రగేయో**
**గాయేత్ సోఽయం భూయసే శ్రేయసే స్యాత్ ।**
**ఇత్యుక్త్వైనం తేన సార్ధం గతస్త్వం**
**ధిష్ణ్యం విష్ణో! పాహి వాతాలయేశ! ॥**

**ప్రతిపదార్థము:** త్వాం చ = నా భక్తుడైన నిన్నును (గజేంద్రుని), మాం= నన్నును తలుచుకొని, ఏతత్ వృత్తం = ఈ గజేంద్ర మోక్షణ రూపమైన హరి చరితమును, చ= కూడా, ప్రగే = ప్రాతః కాలములో(ప్రకర్షేణ గీయతే అత్ర-ఈ కాలమందు స్తుతి చేయుదురు. ప్రాతఃకాలము), యః = ఎవడు, గాయేత్= గానము చేయునో, సః అయం = అతడు, భూయసే శ్రేయసే స్యాత్= సర్వ శుభములు పొందగలరు, ఇతి-ఉక్త్వా ఏనం = అని గజేంద్రునికి చెప్పి, తేన సార్ధం=అతనితో సహ, త్వం ధిష్ణ్యం గతః = నువ్వు వైకుంఠమునకు వెళ్ళావు. (ధిష్ణ్య=ధృష్ణోతి ప్రగల్భో భవతి, ప్రజ్వలితో భవతి తస్య భావం కర్మ వా ప్రాగల్భ్యము కలది శక్తి కలది), విష్ణో!= ఓ విష్ణూ!, వాతాలయేశ!= గురువాయూరు దేవా!, పాహి= నన్ను రక్షించు.

**తాత్పర్యము:** నా భక్తుడైన నిన్నును ( గజేంద్రుని ) నన్నును తలుచుకొని ఈ గజేంద్ర మోక్షణ రూపమైన హరి చరితమును ప్రాతః కాలములో ఎవడు గానము చేయునో అతడు సర్వ శుభములు పొందగలరు అని గజేంద్రునికి చెప్పి అతనితో సహ నువ్వు

వైకుంఠమునకు వెళ్ళావు. ఓ విష్ణూ ! గురువాయూరు దేవా ! నన్ను రక్షించు.

**విశేషాలు:** మిగతా ఘట్టాలలో ఎక్కడా నారాయణుడు ఫల శ్రుతి చెప్పలేదు. కేవలం ఈ గజేంద్ర మోక్షంలోనే చెప్పాడు.

**అష్టమ స్కంధము పూర్తి**

**26వ దశకము సమాప్తము**



# దశకమ్ 27 – క్షీరాబ్ధిమథనం కూర్మావతారము

**27-1 శ్లో.**

**దుర్వాసాః సురవనితాప్త దివ్యమాల్యం**
**శక్రాయ స్వయముపదాయ తత్ర భూయః ।**
**నాగేంద్ర ప్రతిమృదితే శశాప శక్రం**
**కా క్షాంతిస్త్వదితర దేవతాంశ జానామ్ ॥**

**ప్రతిపదార్థము:** దుర్వాసాః= దూర్వాస మహర్షి (దుష్టం వాసః వసనం యస్యః– మలిన వస్త్రములు కలవాడు బట్టలు వేయనివాడు. దూర్వాసముని), సురవనిత= దేవ వనితలు(సుష్ఠు రాతి దదాతి అభీష్టమ్ కోరికను నెరవేర్చువాడు. దేవత), ఆప్త= తనకు ఇచ్చిన (ఆప్తః ప్రాప్తః విశ్వసనీయఃలభించినది ఆప్తుడు విశ్వసనీయుడు. 'ఆప్తవాక్యం ప్రమాణం'), దివ్యమాల్యం= కల్ప వృక్ష పూల మాలను, శక్రాయ= ఇంద్రునికి (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు), స్వయమ్= స్వయముగా, ఉపదాయ= ఇచ్చి, తత్ర= అక్కడ, భూయః= అప్పుడు మరలా, నాగ – ఇంద్ర= ఐరావతముచే ఆ పూల మాల(న గచ్ఛతి అగః, న అగః–స్థిరంగా వుండనిది, ఏనుగు), ప్రతిమృదితే=నలిపివేయబడగా, శక్రం=ఇంద్రుని (ఐశ్వర్యము కోల్పొమ్మని), శశాప = దుర్వాసుడు శపించెను, త్వత్ = నీ అంశ లేకుండా, ఇతర దేవతా –అంశ జానామ్ = ఇతర దేవతల అంశలతో జన్మించిన వారికి (దుర్వాసుడు మొదలైన వారికి), కా క్షాంతిః= ఓర్పు ఎక్కడ? (ఓర్పు లేదని భావం) (క్షమాయాః భావః కర్మ వా క్షమ ఓర్పు).

**తాత్పర్యము:** దూర్వాస మహర్షి దేవ వనితలు తనకు ఇచ్చిన కల్ప వృక్షపు పూల మాలను ఇంద్రునికి స్వయముగా ఇచ్చెను. ఇంద్రుని వాహనమైన ఐరావతము ఆ పూలమాలను కాళ్ళ కింద వేసి నలిపివేసింది. కోపించిన దుర్వాసుడు ఇంద్రుని ఐశ్వర్యము కోల్పొమ్మని శపించెను. నీ అంశ లేకుండా ఇతర దేవతల అంశలతో జన్మించిన వారికి ( దుర్వాసుడు మొదలైన వారికి) ఓర్పు ఎక్కడ? ( ఓర్పు లేదని భావం)

**విశేషాలు**

**దూర్వాస మహర్షి:** అత్రికిని అనసూయకును రుద్రాంశమున పుట్టిన కొడుకు. ఇతని సహోదరులు సోముఁడు, దత్తాత్రేయుడు. ఇతడు మహాకోపిష్ఠుఁడు. ఇతని శాపకథలు అనేకములు కలవు.

**27-2 శ్లో.**
**శాపేన ప్రథితజరేఽథ నిర్జరేంద్రే**
**దేవేష్వప్య సురజితేషు నిష్ప్రభేషు ।**
**శర్వాద్యాః కమలజమేత్య సర్వదేవా**
**నిర్వాణ ప్రభవ సమం భవంతమాపుః ॥**

**ప్రతిపదార్థము:** నిర్వాణ ప్రభవ ! = మోక్ష ప్రాప్తి స్థాన భూత !( నిర్వాణ =నితరాం వాతి గచ్ఛతి ఆత్యంతికం మోక్షం తస్య భావః-ఆత్యంతిక మోక్షము పొందుట. మోక్షము), అథ = అటుపిమ్మట, శాపేన = దూర్వాసుని శాపముతో(శపతి అస్య భావః కర్మ వా శాపము శపథం చేయుట), నిర్జర -ఇంద్రే = వార్ధక్యము లేని ఇంద్రుడు( నిర్జర= నిర్గతా జరా యస్మాత్, నాస్తి జరా యస్య-ముసలి తనం లేనివాడు. దేవత), ప్రథిత జరే= ముసలివాడయ్యెను. (ప్రథితః ఖ్యాతః ప్రసిద్ధ-ఖ్యాతము ప్రసిద్ధి), దేవేషు-అపి= దేవతలు కూడా, అసురజితేషు =రాక్షసులకు ఓడిపోయి, నిష్ప్రభేషు= ఐశ్వర్యము (ప్రభ) కోల్పోయిరి, శర్వ-అద్యాః= శివుడు మొదలు అందరు దేవతలు, కమలజమ్ = బ్రహ్మను, ఏత్య = కలిసి, సర్వదేవాః సమం = అందరు దేవతలతో కలిసి (అందరు కలిసి), భవంతమ్ =నిన్ను, ఆపుః=పొందిరి (దర్శించారు)

**తాత్పర్యము:** మోక్ష ప్రాప్తి స్థాన భూత! అటుపిమ్మట దూర్వాసుని శాపముతో వార్ధక్యము లేని ఇంద్రుడు ముసలివాడయ్యెను. దేవతలు కూడా రాక్షసులకు ఓడిపోయి ఐశ్వర్యము (ప్రభ) కోల్పోయిరి. అప్పుడు ఈ దురవస్థ పోవటానికి శివుడు మొదలు అందరు దేవతలు బ్రహ్మను కలిసి ఆ పై వారందరు దేవతలు నిన్ను దర్శించారు.

**విశేషాలు**

**నిర్వాణ:** ఆరిపోవటమని శబ్దార్థం. బౌద్ధుల శూన్యవాదమిదే. జీవచైతన్యం తాత్కాలికంగా పనిచేసి చివరకు దీపంలాగా ఆరిపోయి శూన్యమవుతున్నదని అంటారు వారు. కానీ అద్వైతులిది ఒప్పుకోరు. నిర్వాణమంటే సర్వనాశనం కాదు. బ్రహ్మనిర్వాణమే నిర్వాణం. అంటే జీవచైతన్యం ఈశ్వర చైతన్యంగా నిలిచిపోతుందని అదే జీవిత గమ్యమని వీరి సిద్ధాంతం. 'లభంతే బ్రహ్మ నిర్వాణం' అని గీతా వచనం.

**27–3 శ్లో.**
**బ్రహ్మాద్యైః స్తుత మహిమా చిరం తదానీం**
**ప్రాదుష్యన్ వరద! పురః పరేణ ధామ్నా।**
**హేదేవా! దితిజ కులైర్విధాయ సంధిం**
**పీయూషం పరిమథతేతి పర్యశాస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** వరద! = ఓ వరదుడా!, బ్రహ్మ– ఆద్యైః = బ్రహ్మాది దేవతలు, చిరం= చాలాకాలము, త మహిమా= నీ మహిమను స్తుతించగా, తదానీం =అప్పుడు, పరేణ ధామ్నా= వర్ణనాతీతమయిన వెలుగుతో, పురః= వారి ఎదుట, ప్రాదుష్యన్= సాక్షాత్కరించావు. (ప్రాదుసోః భావః ఆవిర్భావః–ఆవిర్భావము), హేదేవా!= ఓ దేవా!, దితిజకులైః= రాక్షసులతో, సంధిం విధాయ= సంధిచేసుకొని (మీరిద్దరు), పీయూషం పరిమథత = సముద్రాన్ని మథించి అమృతాన్ని పొందండి(పీయతే దేవైఃదేవతలచే త్రాగబడునది. అమృతము), ఇతి త్వమ్= నువ్వు, పర్యశాః = ఆజ్ఞ చేసావు.

**తాత్పర్యము:** ఓ వరదుడా! బ్రహ్మాది దేవతలు చాలాకాలము నీ మహిమను స్తుతించగా అప్పుడు వర్ణనాతీతమయిన వెలుగుతో వారి ఎదుట సాక్షాత్కరించావు. ఓ దేవా! రాక్షసులతో సంధిచేసుకొని (మీరిద్దరు) సముద్రాన్ని మథించి అమృతాన్ని పొందండి అని నువ్వు ఆజ్ఞ చేసావు.

**27-4 శ్లో.**

**సంధానం కృతవతి దానవైస్సురౌఘే**
**మంథానం నయతి మదేన మందరాద్రిమ్ ।**
**భ్రష్టేఽస్మిన్ బదరమివోద్వహన్ ఖగేంద్రే**
**సద్యస్త్వం వినిహితవాన్ పయః పయోధౌ ॥**

**ప్రతిపదార్థం:** సంధానం కృతవతి=నువ్వు చెప్పినట్లుగా సంధానము చేసుకొని (సంధీయతే యత్ కలుపుట కలుపబడునది), దానవైః సుర-ఔఘే= దేవతలు, రాక్షసుల సమూహము కలిసి (ఓఘు=ఉచ్యతి సమవైతి సమూహము), మదేన = మదముతో, మందర-అద్రిమ్= మందర పర్వతమును (మందతే ప్రకాశతే, మంద్యతే స్తూయతే అసౌ ప్రకాశించునది స్తుతింపబడునది. మందర పర్వతము), మంథానం= మథనము కొరకు(మథ్యతే అనేన దీనితో చిలుకుదురు. కవ్వము), నయతి = తీసుకొని వచ్చుచుండగా, అస్మిన్ భ్రష్టే =దారిలో అది జారి పోగా, బదరమ్ ఇవ= అరచేతిలో రేగుపండులా ( బదతి స్థిరీభవతి, ఛిన్నేఽపి పునః ప్రరోహతి నరికినప్పటికి మళ్లీ మొలచునది. రేగి చెట్టు), ఉద్వహన్= ఆ మందర పర్వతమును పైకి ఎత్తి, ఖగ-ఇంద్రే= గరుత్మంతునిపై పెట్టుకొని, సద్యః =వెంటనే, త్వం= నువ్వు, పయః పయోధౌ= ఆ పర్వతాన్ని క్షీర సాగరంలో(పీయతే అసౌ త్రాగబడునది. జలము పాలు), వినిహితవాన్= ఉంచావు.

**తాత్పర్యము:** నువ్వు చెప్పినట్లుగా సంధానము చేసుకొని దేవతలు , రాక్షసుల సమూహము కలిసి మదముతో మందర పర్వతమును మథనము కొరకు తీసుకొని వచ్చుచుండగా దారిలో అది జారి పోగా అరచేతిలో రేగుపండులా ఆ మందర పర్వతమును పైకి ఎత్తి గరుత్మంతునిపై పెట్టుకొని వెంటనే నువ్వు ఆ పర్వతాన్ని క్షీర సాగరంలో ఉంచావు.

**27-5 శ్లో.**

**ఆధాయ ద్రుతమథ వాసుకిం వరత్రాం**
**పాథోధౌ వినిహితసర్వబీజజాలే ।**

**ప్రారబ్ధే మథనవిధౌ సురాసురైస్తైః**
**వ్యాజాత్ త్వం భుజగముఖేఽకరోస్సురారీన్ ॥**

**ప్రతిపదార్థం:** అథ =అటుపిమ్మట, వాసుకిం= వాసుకిని (వసుకస్య అపత్యమ్ వసుకి కుమారుడు. వాసుకి), వరత్రాం= కవ్వపుతాడుగా(వ్రియతే అనయా దీనితో చుట్టబడును. త్రాడు), ద్రుతమ్= వెంటనే(ద్రవంతి శీఘ్రం గచ్ఛంతి నృత్యంతి తస్య భావః–తొందరగా పోవుట), ఆధాయ= గ్రహించి, వినిహితసర్వబీజజాలే= సర్వ ఔషధ బీజ నివాసమయిన, పాథోధౌ = క్షీర సాగరములో (పాథోధి=పాథాంసి జలాని ధీయంతే అస్మిన్ ఇందులో జలములు వుంచబడును. సముద్రము), తైః సుర–అసురైః =ఆ దేవతలు, రాక్షసుల చేత, మథనవిధౌ = మథన కార్యక్రమమును,

ప్రారబ్ధే = ప్రారంభించుచుండగా, త్వం= నువ్వు, వ్యాజాత్ = మిషతో (వ్యాజతి యథార్థవ్యవహారాత్ అపగచ్ఛతి అనేన–సత్యము నుండి తొలగించునది. వ్యాజము), సుర–అరీన్= రాక్షసులను, భుజగముఖే= పాము తల వైపుకు, అకరోః = మార్పించావు.

**తాత్పర్యము:** అటుపిమ్మట వాసుకిని కవ్వపుతాడుగా వెంటనే గ్రహించి సర్వ ఔషధ బీజ నివాసమయిన క్షీర సాగరములో ఆ దేవతలు, రాక్షసుల చేత మథన కార్యక్రమమును ప్రారంభించుచుండగా నువ్వు మిషతో రాక్షసులను పాము తల వైపుకు మార్పించావు.

**విశేషాలు:** వాసుకిని పర్వతానికి కవ్వముత్రాడుచేసి తఱచునపుడు ఇంద్రుడు దేవతలతో తోక అమంగళమని చెప్పగా, వారు తలవైపు పట్టుకొనిరి. అంత కొంత సేపటికి వాసుకి అలిగి విషజ్వాలలను కురిపించాడు. అప్పుడు విష్ణువు ఉపాయముతో మేము నీచమైన తోక ఏల పట్టవలె నని రాక్షసులచేతనే అనిపించి, రాక్షసులను తోకనుండి తలకు మార్చాడు. వాసుకి విషాగ్ని వలన కొందరు రాక్షసులు చనిపోయారు.

**27-6 శ్లో.**

**క్షుబ్ధాద్రౌ క్షుభితజలోదరే తదానీం**
**దుగ్ధాబ్ధౌ గురుతరభారతో నిమగ్నే।**
**దేవేషు వ్యథితతమేషు తత్ప్రియైషీ**
**ప్రాణైషీః కమఠతనుం కఠోరపృష్ఠామ్॥**

**ప్రతిపదార్థము:** క్షుబ్ధ అద్రౌ = పర్వతము కవ్వముగా సముద్రమును తరచుచుండగా (క్షుబ్ధః పీడితః కంపితః ఆకులః - పీడింపబడిన వణకు పుట్టిన), క్షుభితజల ఉదరే = నీరు క్షుభితమగుచుండగా(క్షుభితః ఆలోడితః వ్యాకులః - కలియబెట్టబడిన), దుగ్ధ -అబ్ధౌ = పాల సముద్రమందు, గురుతరభారతః = ఎక్కువ బరువు వలన ఆ మందర పర్వతము, నిమగ్నే = కిందికి దిగబడిపోయెను, దేవేషు = దేవతలు, వ్యథితతమేషు = బాధతో క్రుంగిపోయిరి, తదానీం = అప్పుడు, తత్ ప్రియైషీ = దేవతల ప్రియము కోరువాడవైన నువ్వు, కఠోరపృష్ఠామ్ = కఠోరమగు పెనుడిప్పతో (కృచ్ఛ్రే భవతి కఠినము)(పుష్యతే సిచ్యతే తడుపబడునది. పృష్ఠభాగము), కమఠతనుం = కూర్మావతారమును (కే జలే మఠతి వసతి జలములో నివసించునది. తాబేలు), ప్రాణైషీః = ధరించితివి.

**తాత్పర్యము:** పర్వతము కవ్వముగా సముద్రమును తరచుచుండగా నీరు క్షుభితమగుచుండగా పాల సముద్రమందు ఎక్కువ బరువు వలన ఆ మందర పర్వతము కిందికి దిగబడిపోయెను. దేవతలు క్రుంగిపోయిరి. అప్పుడు దేవతల ప్రియము కోరువాడవైన నువ్వు కఠోరమగు పెనుడిప్పతో కూర్మావతారమును ధరించితివి.

**27-7 శ్లో.**

**వజ్రాతిస్థిరతరకర్పరేణ విష్ణో!**
**విస్తారాత్ పరిగతలక్షయోజనేన।**
**అంభోధేః కుహరగతేన వర్ష్మణా త్వం**
**నిర్మగ్నం క్షితిధరనాథమున్నినేథ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో= ఓ విష్ణుదేవా!, వజ్ర = వజ్రము కంటె (వర్జయతి ప్రాణైః శత్రూన్ శత్రువులను ప్రాణహీనులను చేయునది వజ్రము), అతిస్థిరతర= బాగా కఠినమైన (అనయోః అతిశయేన స్థిరః-రెండింటిలో ఎక్కువ స్థిరమైనది), లక్షయోజనేన = లక్ష యోజనములను (యోజనము= యోజయతి తస్య భావః కర్మ వా ఎనిమిది కిలోమీటర్లు), పరిగత= విస్తరింపబడిన (పరితః సర్వతః గతః జ్ఞాతః చేష్టితః వేష్టితః గతో వా విస్తరింపబడినది), విస్తారాత్= వైశాల్యము కల, కర్పరేణ= పెనుడిప్పతో (కర్వతి దుర్బలో భవతి భిన్న ఘటస్య భాగః పెంకు), అంభోధేః కుహరగతేన = పాల సముద్రము లోపలికి చొచ్చుకొని పోయిన, వర్ష్మణా= మూర్తితో, త్వం= నువ్వు, నిర్మగ్నం = మునిగిపోయిన, క్షితిధరనాథమ్ = ఆమందరపర్వతమును, ఉన్నినేథ= పైకి ఎత్తావు.

**తాత్పర్యము:** ఓ విష్ణుదేవా! వజ్రము కంటె బాగా కఠినమైన లక్ష యోజనములతో విస్తరింపబడిన వైశాల్యము కల పెనుడిప్పతో పాల సముద్రము లోపలికి బాగా చొచ్చుకొని పోయిన మూర్తితో నువ్వు మునిగిపోయిన ఆ మందరపర్వతమును పైకి ఎత్తావు.

**27-8 శ్లో.**
**ఉన్మగ్నే ఝటితి తదా ధరాధరేంద్రే**
**నిర్మేథుర్దృఢమిహ సమ్మదేన సర్వే ।**
**ఆవిశ్య ద్వితయగణేఽపి సర్పరాజే**
**వైవశ్యం పరిశమయన్నవీవృధస్తాన్ ॥**

**ప్రతిపదార్థము:** ఝటితి = తటాలున (శీఘ్రమ్ త్వరగా తొందరగా), తదా =అప్పుడు, ధరాధర-ఇంద్రే = ఆ మందరపర్వతమును, ఉన్మగ్నే= నువ్వు ఎత్తగా, ఇహ= ఇక్కడ, సర్వే= అందరు, (దేవతలు రాక్షసులు), సమ్మదేన = చాలా సంతోషముతో, దృఢమ్ నిర్మేథుః = బాగా దృఢముగా పాల సముద్రాన్ని మథించారు, ద్వితయగణే = దేవతలు రాక్షసులయందు (ద్వౌ అవయవౌ యస్య-రెండు అవయవములు కలది. రెండవ సంఖ్య), సర్పరాజే అపి= సర్పరాజయిన వాసుకి యందు, ఆవిశ్య= నువ్వు సూక్ష్మ రూపములో ప్రవేశించి, వైవశ్యం= వారి బాధను, పరిశమయన్ = పోగొట్టి,

తాన్= వారిని, వీవృధః = బల వీర్య సంపన్నులుగా తయారు చేసావు.

**తాత్పర్యము:** తటాలున అప్పుడు ఆ మందరపర్వతమును నువ్వు ఎత్తగా అందరు చాలా సంతోషముతో బాగా దృఢముగా పాల సముద్రాన్ని మథించారు. ఆ దేవతలు రాక్షసులయందు సర్పరాజయిన వాసుకి యందు నువ్వు సూక్ష్మ రూపములో ప్రవేశించి వారి బాధను పోగొట్టి వారిని బల వీర్య సంపన్నులుగా తయారు చేసావు.

**27-9 శ్లో.**

**ఉద్దామ భ్రమణ జవోన్నమద్గిరీంద్ర**
**న్యస్తైకస్థిరతర హస్తపంకజం త్వామ్ ।**
**అభ్రాంతే విధిగిరిశాదయః ప్రమోదా**
**దుద్భ్రాంతా నునువురుపాత్త పుష్పవర్షాః ॥**

**ప్రతిపదార్థము:** ఏకస్థిరతరహస్తపంకజం= కరపద్మములో ఒకేచోట స్థిరముగా, న్యస్త = ఉంచి(న్యస్తః నితరాం అస్తః క్షిప్తః ఉంచబడిన), ఉన్నమత్ =పైకి ఎత్తబడిన, గిరి- ఇంద్ర = మందరపర్వతమును, ఉద్దామ= సాతిశయముగా, భ్రమణజవః= విపరీతమైన వేగముతో తిప్పుచూ, త్వామ్ = మీదికి వచ్చిన నిన్ను చూసి, అభ్ర – అంతే= మేఘ మార్గములో ఉన్న, విధిగిరిశ –ఆదయః = బ్రహ్మ శివుడు మొదలుగా గల దేవతలు, ప్రమోదాత్–ఉద్భ్రాంతాః = సంతోష పరవశులై, ఉపాత్తపుష్పవర్షాః= పూల వాన కురిపిస్తూ(ఉప ఆదత్తః గృహీతః–పొందబడినది తీసుకొనబడినది), నునువుః= నిన్ను కీర్తించిరి.

**తాత్పర్యము:** కరపద్మములో ఉంచి పైకి ఎత్తబడిన మందరపర్వతమును విపరీతమైన వేగముతో తిప్పుచూ సముద్రము కింద నుండి మీదికి వచ్చిన నిన్ను చూసి మేఘ మార్గములో ఉన్న బ్రహ్మ శివుడు మొదలుగా గల దేవతలు సంతోష పరవశులై పూల వాన కురిపిస్తూ నిన్ను కీర్తించిరి.

**27-10 శ్లో.**

**దైత్యౌఘే భుజగముఖానిలేన తప్తే**
**తేనైవ త్రిదశకులేఽపి కించిదార్తే ।**

**కారుణ్యాత్ తవ కిల దేవ వారివాహాః**
**ప్రావర్షన్నమరగణాన్న దైత్యసంఘాన్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ దేవా!, దైత్య–ఔఘే= రాక్షసుల సమూహము, భుజగముఖ–అనిలేన =వాసుకి ముఖము నుండి వెడలు పూత్కారములతో, తప్తే= మాడిపోవగా, తేన–ఏవ = అటులనే, త్రిదశకులే–అపి= దేవతల సమూహము కూడా (తృతీయా యౌవనాఖ్యా దశా యస్య–మూడవ దశలో, యౌవనావస్థలో వున్నవాడు), కించిత్ –ఆర్తే = కొంచెము ఆర్తి పొందగా, కారుణ్యాత్ = దయతో, తవ = నీయొక్క (నువ్వు కురిపించిన), వారివాహాః= మేఘములు (వారీణి వహతి జలమును ధరించునది. మేఘము), అమరగణాన్ = దేవతల గణములపై, ప్రావర్షన్ కిల= కురిసినవికదా (కాని), దైత్యసంఘాన్ న= రాక్షసుల సంఘముపై కురవలేదు.

**తాత్పర్యము:** ఓ దేవా! రాక్షసుల సమూహము వాసుకి ముఖము నుండి వెడలు పూత్కారములతో మాడిపోవగా అటులనే దేవతల సమూహము కూడా కొంచెము ఆర్తి పొందగా దయతో నువ్వు కురిపించిన మేఘములు దేవతల గణములపై కురిసినవి కాని రాక్షసుల సంఘముపై కురవలేదు. (అది అనుగ్రహ వర్షమని వ్యంగ్యము)

**27–11 శ్లో.**
**ఉద్భ్రామ్యద్బహుతిమి నక్ర చక్రవాలే**
**తత్రాబ్ధౌ చిరమథితేఽపి నిర్వికారే ।**
**ఏకస్త్వం కరయుగకృష్ట సర్పరాజః**
**సంరాజన్ పవనపురేశ। పాహి రోగాత్ ॥**

**ప్రతిపదార్థం:** బహు=అనేక(బంహతే వర్ధతే వృద్ధి నొందునది. ఎక్కువ), తిమి=పెద్ద చేపలు (తిమ్యతి తామ్యతి ఆకాంక్షతి క్లేశమును పొందునది. చేప నూఱుయోజనముల పొడవుగల చేప), నక్రచక్రవాలే = మొసలి సమూహమును (న క్రామతి దూరస్థలమ్ భూమిపై దూరమునకు వెళ్లలేనిది. మొసలి), ఉద్భ్రామ్యత్=

బాధాకరంగా కలత పెడుతూ, తత్ర –అబ్ధౌ = ఆ సముద్రములో, చిరమథితే–అపి = చాలాకాలము మథించినప్పటికి, నిర్వికారే= ఆశించిన ఫలితం రాక విశ్రాంతిదశ కలిగింది, త్వం ఏకః = నువ్వొక్కడివే, కరయుగ= నీ రెండు చేతులతో, సర్పరాజః కృష్టః=ఆ వాసుకి సర్పాన్ని పట్టుకొని లాలిస్తూ శ్రమను పోగొట్టి(కృష్టః కర్షితః– లాగబడినది), సంరాజన్ = ప్రకాశించిన, పవనపురేశ ।= ఓ గురువాయూరు దేవా!, రోగాత్ = నా వ్యాధి నుండి, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** అనేక పెద్ద చేపలను మొసలి సమూహములను బాధాకరంగా కలత పెడుతూ ఆ సముద్రములో చాలాకాలము మథించినప్పటికి ఆశించిన ఫలితం రాక విశ్రాంతిదశ కలిగింది. అప్పుడు నువ్వొక్కడివే నీ రెండు చేతులతో ఆ వాసుకి సర్పాన్ని పట్టుకొని లాలిస్తూ శ్రమను పోగొట్టి ప్రకాశించావు. ఓ గురువాయూరు దేవా! నా వ్యాధి నుండి రక్షించు.

***సప్తమ స్కంధము పరిపూర్ణం***

**27వ దశకము సమాప్తము.**



# దశకమ్ 28 – లక్ష్మీస్వయంవరం , అమృతోత్పత్తి

**28–1 శ్లో.**

**గరలం తరలానలం పురస్తా**
**జ్జలధేరుద్విజగాల కాలకూటమ్ ।**
**అమరస్తుతివాద మోద నిఘ్నో**
**గిరిశస్తన్నిపపౌ భవత్ప్రియార్థమ్ ॥**

**ప్రతిపదార్థము:** తరల అనలం= అగ్నిజ్వాలలను చిమ్ముచూ (తరల=తరతి స్వప్రకాశేన సంచలతి ఇవ–తన ప్రకాశంచే కదులునట్లుగా ఉండునది) (న అలః యస్య అనలః. ఎంత దహించినను తృప్తిలేనిది), గరలమ్= కాలకూట విషం(గిరతి జీవనమ్ ప్రాణమును తీయునది. విషము), పురస్తాత్ = మొట్టమొదటగా, జలధేః = పాల సముద్రము నుండి, ఉద్విజగాల= బయటకు వెడలెను, అమరస్తుతివాదమోద= దేవతల స్తుతులకు ఉబ్బి(న మ్రియతే మరణించనివాడు. దేవత), నిఘ్నః = తత్ అధీనుడై (నిహన్యతే నిగృహ్యతే అసౌ– పట్టుకొనబడినవాడు అధీనంలో వున్నవాడు), భవత్ ప్రియ– అర్థమ్ = నీ ప్రీతి కొరకు, త త్ కాలకూటమ్= ఆ కాలకూట విషమును (కాలం శివం అపి కూటయతి దహతి శివుని కూడ దహించునది. కాలకూట విషము), గిరిశః = శివుడు (గిరౌ శేతే – పర్వతమున వుండువాడు శివుడు), నిపపౌ = తాగాడు.

**తాత్పర్యము:** అగ్నిజ్వాలలను చిమ్ముచూ కాలకూట విషము మొట్టమొదటగా పాల సముద్రము నుండి బయటకు వెడలెను. దేవతల స్తుతులకు ఉబ్బి తత్ అధీనుడై (వాటికి వశమై) నీ ప్రీతి కొరకు ఆ కాలకూట విషమును శివుడు తాగాడు.

**28–2 శ్లో.**

**విమథత్సు సురా అసురేషు జాతా**
**సురభిః తామ్ ఋషిషు న్యధాస్త్రిధామన్ ।**
**హయరత్నమభూదథేభరత్నం**
**ద్యుతరుశ్చాప్సరసః సురేషుతాని ॥**

**ప్రతిపదార్థము:** సుర అసురేషు= దేవతలు, రాక్షసులు, విమథత్సు= మథింపగా, సురభిః= కామధేనువు (సుష్ఠు రభతే అనేన-దీనితో ఆనందింతురు), జాతా= పుట్టెను, తామ్ = దానిని(కామధేనువును), ఋషిషు = ఋషులకు (ఋచ్ఛతి జానాతి జ్ఞాపయతి మంత్రార్థమ్ మంత్రార్థమును తెలుసుకున్న, మంత్రార్థమును తెలిపిన ఋషి), న్యధాః = ఇచ్చావు, త్రిధామన్= మూడు లోకములు ప్రభువుగా కలవాడా !, అథ= అటుపై, హయరత్నమ్= అశ్వరత్నమయిన ఉచ్చైశ్శ్రవము (హయతి గచ్ఛతివెళ్లునది. గుఱ్ఱము), ఇభరత్నం= గజరత్నమగు ఐరావతము (ఏతి గచ్ఛతివెళ్లునది ఏనుగు), ద్యుతరుః చ = కల్ప వృక్షము(ద్యోతతే అసౌ ప్రకాశించునది), అప్సరసః = స్త్రీ రత్నములయిన అప్సరసలు (అద్భ్యః సముద్రజలాత్ సరంతి ఉద్యంతి సముద్రనీటినుండి పుట్టినవి. అప్సరసలు), అభూత్ = పుట్టారు, తాని = వానిని, సురేషు= దేవతలకు, న్యధాః = ఇచ్చావు.

**తాత్పర్యము:** మూడు లోకములు ప్రభువుగా కలవాడా! దేవతలు, రాక్షసులు మథింపగా కామధేనువు పుట్టెను. దానిని(కామధేనువును) ఋషులకు ఇచ్చావు. అటుపై అశ్వరత్నమయిన ఉచ్చైశ్శ్రవము గజరత్నమగు ఐరావతము కల్ప వృక్షము స్త్రీ రత్నములయిన అప్సరసలు పుట్టారు. వానిని దేవతలకు ఇచ్చావు.

**28-3 శ్లో.**

**జగదీశ భవత్పరా తదానీం**
**కమనీయా కమలా బభూవ దేవి ।**
**అమలామవలోక్య యాం విలోలః**
**సకలోఽపి స్పృహయాంబభూవ లోకః ॥**

**ప్రతిపదార్థం:** జగదీశ = ఓ జగదీశ్వరా!, తదానీం= అప్పుడు, భవత్ పరా= నీయందే మనస్సు కలిగిన(పరా ఉత్కృష్టా గొప్పది శ్రేష్ఠమైనది ప్రధానమైనది), కమనీయా=అందగత్తె అయిన (కామ్యతే కమనీయం వాకోరబడునది అందముగా నున్నది), కమలా దేవీ = లక్ష్మీదేవి, బభూవ = పుట్టినది, యాం అమలామ్= ఎవరయితే స్వచ్ఛంగా నిర్మలంగా ఉన్నదో అటువంటి ఆమె అందమును (నాస్తి మలం యస్యాః-లక్ష్మి), అవలోక్య = చూసి, విలోలః = ఆకర్షింపబడి (విశేషేణ

లోలః చంచలః–చాంచల్యము కలవాడు ఊగుట), సకలః లోకః అపి= సకలలోకము, స్పృహయాం = అమె కావలెనని(స్పృహయతి తస్య భావః కర్మ వా కోరబడునది. కోరిక), బభూవ = ఉండిరి ( కోరుకొనిరి).

**తాత్పర్యము:** ఓ జగదీశ్వరా! అప్పుడు నీయందే మనస్సు కలిగిన అందగత్తె అయిన లక్ష్మీదేవి పుట్టినది. ఆమె అందమును చూసి ఆకర్షింపబడి సకలలోకము అమె కావలెనని కోరుకొనిరి.

**28–4 శ్లో.**
**త్వయి దత్తహృదే తదైవ దేవ్యై**
**త్రిదశేంద్రో మణిపీఠికాం వ్యతారీత్ ।**
**సకలోపహృతాభిషేచనీయైః**
**ఋషయస్తాం శ్రుతిగీర్భిరభ్యషించన్ ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= నీయందు, దత్తహృదే= సమర్పించబడిన మనస్సు కలిగిన(దత్తః ప్రదత్తః విసృష్టః–ఇవ్వబడినది), తదైవ =అట్లు ఉన్న, దేవ్యై = శ్రీదేవికి, త్రిదశ–ఇంద్రః = దేవేంద్రుడు, మణిపీఠికాం= మణిపీఠము, వ్యతారీత్= అర్పించెను, సకల= సకల నదులనుండి, ఉపహృత = తీసుకొనివచ్చిన, అభిషేచనీయైః= అభిషేక సాధనములచే, ఋషయః= ఋషులు, తాం =ఆ లక్ష్మిని, శ్రుతిగీర్భిః= మంత్రవాక్కులతో, అభ్యషించన్= అభిషేకించిరి.

**తాత్పర్యము:** నీయందు మనస్సు కలిగిన శ్రీదేవికి దేవేంద్రుడు మణిపీఠము అర్పించెను. సకల నదులనుండి తీసుకొనివచ్చిన అభిషేక సాధనములచే ఋషులు ఆ లక్ష్మిని మంత్రవాక్కులతో అభిషేకించిరి.

**28–5 శ్లో.**
**అభిషేక జలానుపాతి ముగ్ధ**
**త్వదపాంగైరవ భూషితాంగవల్లీమ్ ।**
**మణికుండల పీత చేల హార**
**ప్రముఖైస్తామమరదయోఽన్వ భూషన్ ॥**

**ప్రతిపదార్థము:** అభిషేక జల అనుపాతి = అభిషేకమైన వెంటనే (అభిషేక =మంత్రపూర్వకం షేకఃస్నానమ్ మంత్రపూర్వకంగా స్నానము), త్వత్ ముగ్ధ అపాంగైః = నీ ముగ్ధ మోహన కటాక్షములచే(ముగ్ధ= మోహయతి మోహింప చేయునది), అవభూషితాః= అలంకరింపబడిన, అంగవల్లీమ్= శరీరమనెడి లత కలిగిన, తామ్= ఆమెను (లక్ష్మీదేవిని), అమర–ఆదయః = దేవతా మూర్తులు, మణికుండల=మణి కుండల, పీతచేలహారప్రముఖైః= పీతాంబర హార కంకణ ములు మొదలగు ప్రముఖ భూషణములచే, అన్వభూషన్= అలంకరించారు.

**తాత్పర్యము:** అభిషేకమైన వెంటనే నీ ముగ్ధ మోహన కటాక్షములచే అలంకరింపబడిన శరీరమనెడి లత కలిగిన లక్ష్మీదేవిని దేవతా మూర్తులు మణి కుండల పీతాంబర హార కంకణ ములు మొదలగు ప్రముఖ భూషణములచే అలంకరించారు.

**28–6 శ్లో.**

**వరణ స్రజమాత్త భృంగ నాదాం**
**దధతీ సా కుచకుంభ మందయానా ।**
**పదశింజితమంజునూపురా త్వాం**
**కలితవ్రీల విలాసమాససాద ॥**

**ప్రతిపదార్థము:** భృంగనాదాం = తుమ్మెదల నాదాన్ని (బిభర్తి పుష్పానురాగమ్ పుష్పములయందు అనురాగము కలది. తుమ్మెద), ఆత్త= స్వీకరించిన (ఆదత్తః గృహీతః ప్రాప్తో వా పొందబడినది గ్రహించబడినది స్వీకరించబడినది), వరణస్రజమ్ =స్వయం వర పుష్ప మాలను (వ్రియతే తస్య భావః కర్మ వా వరించుట) ( సృజ్యతే సీవ్యతే గ్రుచ్చబడునది అల్లబడునది. పూలమాల), దధతీ= ధరించి, కుచకుంభమందయానా= స్తనములనెడి కుండల బరువువలన మెల్లగా నడచు స్వభావం కలిగిన, పద= పదములందు, శింజిత = మోగు, మంజునూపురా=అందమైన మంజీర నాదము కలది అయిన (మంజతి మనోహరం ధ్వనిం కరోతి మనోహరమైనది.)(నూయతే ప్రశస్యతే ప్రశంసింపబడునది. కాళ్ల గొలుసు, నూపురము), సా= ఆ లక్ష్మీదేవి, కలిత వ్రీలవిలాసమ్ = సిగ్గు యొక్క

విలాసముతో కలిసి (హ్రీద్యతి తస్య భావః-సిగ్గు), త్వాం = నిన్ను, ససాద = సమీపించింది.

**తాత్పర్యము:** తుమ్మెదల నాదాన్ని స్వీకరించిన స్వయం వర పుష్ప మాలను ధరించి స్తనములనెడి కుండల బరువువలన మెల్లగా నడచు స్వభావం కలిగిన, పదములందు మోగు అందమైన మంజీర నాదము కలది అయిన ఆ లక్ష్మీదేవి సిగ్గు యొక్క విలాసముతో కలిసి నిన్ను సమీపించింది.

**28-7 శ్లో.**
**గిరిశద్రుహిణాది సర్వదేవాన్**
**గుణభాజోఽప్యవిముక్త దోషలేశాన్।**
**అవమృశ్య సదైవ సర్వరమ్యే**
**నిహితా త్వయ్యా నయాఽపి దివ్యమాలా ॥**

**ప్రతిపదార్థము:** గిరిశః = శివుడు, ద్రుహిణ-ఆది= బ్రహ్మ మొదలయిన (ద్రుహ్యాతి దుష్టేభ్యః-దుష్టులను హింసించువాడు. బ్రహ్మ), సర్వదేవాన్= సర్వదేవతలను, గుణభాజః –అపి= గుణవంతులైనను, అవిముక్తదోషలేశాన్= కామ క్రోధాది దోషములస్పర్శ లేనివారు కారని, అవమృశ్య= విమర్శించి (అనగా వారిని వరించక), సదా-ఏవ= ఎప్పుడూ, సర్వరమ్యే = దోష రహితుడవయి సర్వగుణములచే అందగాడివయిన, త్వయి= నీ మెడలో, అనయా –అపి= ఆమెతో (లక్ష్మీదేవి), దివ్యమాలా= దివ్యమాల (దీవ్యతే అనేన-దీనితో ప్రకాశించునది. అందమైనది), నిహితా= ఉంచబడినది. (నిహితః స్థాపితః గూఢః-పెట్టబడ్డది దాచబడినది).

**తాత్పర్యము:** శివుడు బ్రహ్మ మొదలయిన సర్వదేవతలను గుణవంతులైనను కామ క్రోధాది దోషములస్పర్శ లేనివారు కారని వారిని వరించక ఎప్పుడూ దోష రహితుడవయి సర్వగుణములచే అందగాడివయిన నీ మెడలో లక్ష్మీదేవి దివ్యమాల ఉంచి వరించింది.

**28-8 శ్లో.**

**ఉరసాతరసా మమానిథైనాం**
**భువనానాం జననీమనన్య భావామ్ ।**
**త్వదురో విలసత్తదీక్షణ శ్రీ**
**పరివృష్ట్యా పరిపుష్టమాస విశ్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** తరసా= లక్ష్మీదేవి అలంకరించిన వెంటనే (ఝుటితి వేగేనతొందరగా. శీఘ్రంగా), భువనానాం జననీమ్= లోక జననిని, అనన్య భావామ్= నీయందు తప్పించి వేరొకరియందు ఎటువంటి భావము లేని, ఏనాం = ఆమెను, ఉరసా మమానిథ= నీ యొక్క ఉరమునందు గ్రహించి గౌరవించావు, త్వత్ ఉరః= నీ వక్ష స్థలములో(ఋచ్ఛతి ప్రాప్నోతి యేన-వక్షఃస్థలము), విలసత్ = ప్రకాశిస్తున్న, తత్- ఈక్షణశ్రీః = ఆ లక్ష్మీదేవి యొక్క కరుణా కటాక్ష శోభ అను(ఈక్షణం దర్శనమ్ దర్శనము, చూచుట), పరివృష్ట్యా= వర్షముచే, విశ్వమ్= ప్రపంచము (విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), పరిపుష్టమాస= సకల సంపదలచే సమృద్ధమయింది.

**తాత్పర్యము:** లక్ష్మీదేవి అలంకరించిన వెంటనే లోక జననిని, నీయందు తప్పించి వేరొకరియందు ఎటువంటి భావము లేని ఆమెను నీ యొక్క ఉరమునందు గ్రహించి గౌరవించావు. నీ వక్ష స్థలములో ప్రకాశిస్తున్న ఆ లక్ష్మీదేవి యొక్క కరుణా కటాక్ష శోభ అను వర్షముచే ప్రపంచము సకల సంపదలచే సమృద్ధమయింది.

**28-9 శ్లో.**

**అతి మోహన విభ్రమా తదానీం**
**మదయంతీ ఖలువారుణీ నిరాగాత్ ।**
**తమసః పదవీమదాస్త్వమేనా**
**మతిసమ్మాననయా మహాసురేభ్యః ॥**

**ప్రతిపదార్థము:** తదానీం= అప్పుడు, అతిమోహనవిభ్రమా= అంతటా మోహనమైన విలాసముతో, మదయంతీ = లోకమునంతా మై మరిపించు, నిరాగాత్ =రాగము

లేని, వారుణీ = వారుణీ దేవత (వరుణస్య ఇయమ్ వరుణునికి సంబంధించినది. సుర), ఖలు= (పుట్టినది) కదా !, తమసః= అజ్ఞానమునకు, పదవీమ్= స్థానమైన, ఏనామ్ = ఆ మద్య దేవతను, అతిసమ్మాననయా= బాగా గౌరవించి, మహా– అసురేభ్యః= గొప్ప రాక్షసులకు, త్వమ్ = నువ్వు, అదాః = ఇచ్చితివి.

**తాత్పర్యము:** అప్పుడు అంతటా మోహనమైన విలాసముతో లోకమునంతా మై మరిపించు వారుణీ దేవత పుట్టినది. అజ్ఞానమునకు స్థానమైన ఆ మద్య దేవతను బాగా గౌరవించి గొప్ప రాక్షసులకు నువ్వు ఇచ్చితివి.

**28–10 శ్లో.**

**తరుణాంబుద సుందరస్తదా త్వం**
**నను ధన్వంతరిరుత్థితోఽంబురాశేః ।**
**అమృతం కలశే వహన్ కరాభ్యాం**
**అఖిలార్తిం హర మారుతాలయేశ ॥**

**ప్రతిపదార్థము:** మారుత –ఆలయేశ= ఓ గురువాయూరు దేవా!, తదా= ఆ తరువాత (వారుణి పుట్టుక తరువాత), త్వం= నువ్వు, తరుణ–అంబుదసుందరః = తొలకరి మేఘంలా అందగాడివై, ధన్వంతరిః =ధన్వంతరి రూపంలో (ధన్వన్ శల్యాది చికిత్సాశాస్త్రం తస్య అంతం ఇయత్తి గచ్ఛతి శల్య చికిత్స మొదలగు శాస్త్రాంతములను తెలుసుకున్నవాడు. ధన్వంతరి, ఒక వైద్యుడు), కరాభ్యాం= చేతులలో, అమృతం కలశే = అమృతము నిండిన బంగారు కుండను(నాస్తి మరణం యస్మాత్ అమృతము), వహన్ = ధరించి, అంబురాశేః= క్షీరసముద్రము నుండి, ఉత్థితః నను =(పైకి లేచావు) కదా!, అఖిల– ఆర్తిం= నా సకల బాధలను, హర = హరించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ఆ తరువాత నువ్వు తొలకరి మేఘంలా అందగాడివై ధన్వంతరి రూపంలో చేతులలో అమృతము నిండిన బంగారు కుండను ధరించి క్షీరసముద్రము నుండి పైకి లేచావు కదా! నా సకల బాధలను హరించు .

**విశేషాలు**

**ధన్వంతరి:** దీర్ఘతపుని కొడుకు. అమృత మథనకాలమునందు పాలసముద్రమున పుట్టిన ధన్వంతరియే ఆయుర్వేదమును కల్పించుట కొఱకు కాశిరాజువంశమున పుట్టెను అందురు.

**అష్టమ స్కంధము పూర్తి**

**28వ దశకము సమాప్తము.**



# దశకమ్ 29 – మోహిన్యవతారము

**29–1 శ్లో.**

**ఉద్గచ్ఛతస్తవ కరాదమృతం హరత్సు**
**దైత్యేషు తానశరణాననునీయ దేవాన్ ।**
**సద్యస్తిరోదధిథ దేవ! భవత్ప్రభావాత్**
**ఉద్యత్స్వయూథ్య కలహా దితిజా బభూవుః ॥**

**ప్రతిపదార్థం:** ఉద్గచ్ఛతః =అమృత కుంభముతో ఆవిర్భవించిన (పైకి వచ్చుచున్న), తవ కరాత్ = నీ చేతి నుండి, అమృతం= అమృతమును, దైత్యేషు = రాక్షసులు, హరత్సు= హరింపగా, తాన్ = ఆ, అశరణాన్= అనన్య శరణులను, అనగా అసహాయులైన (నాస్తి శరణం రక్షణం యస్య–శరణము (రక్ష) లేనివాడు), దేవాన్= దేవతలను, అనునీయ = ఊరడించి, సద్యః = వెంటనే, తిరోదధిథ= మాయమైతివి, దేవ= ఓ గురువాయూరు దేవా!, భవత్ ప్రభావాత్= నీ ప్రభావము వలన (అనగా నీ మాయా శక్తిచే), ఉద్యత్– స్వ– యూథ్య కలహా= ప్రారంభించిన అన్యోన్య కలహము కలవారై, దితిజాః= రాక్షసులు, బభూవుః= ఉండిరి.

**తాత్పర్యము:** అమృత కుంభముతో ఆవిర్భవించిన నీ చేతి నుండి అమృతమును రాక్షసులు హరింపగా , ఆ అసహాయులైన దేవతలను ఊరడించి వెంటనే నువ్వు మాయమైతివి. ఓ గురువాయూరు దేవా! నీ ప్రభావము వలన (అనగా నీ మాయా శక్తిచే) రాక్షసులకు అన్యోన్య కలహము కలిగింది.

**29–2 శ్లో.**

**శ్యామాం రుచాఽపి వయసాఽపి తనుం తదానీం**
**ప్రాప్తోఽసి తుంగకుచమండలభంగురాం త్వమ్ ।**
**పీయూషకుంభకలహం పరిముచ్య సర్వే**
**తృష్ణాకులాః ప్రతియయుస్త్వదురోజకుంభే ॥**

**ప్రతిపదార్థము:** తదానీం = అప్పుడు, రుచా– అపి = కేవలము శరీర కాంతిచేతనే

(రుచా= రోచతే ప్రకాశతే అసౌ ప్రకాశించునది. దీప్తి, ప్రకాశము), శ్యామాం = శ్యామవు కాక ( చామన చాయ రంగు కలిగినదానివి కాక) (శ్యామో వర్ణో అస్తి అస్యాః), వయసా అపి= వయస్సు చేత కూడా శ్యామకు తగిన ('శ్యామా యౌవనమధ్యస్థా'), తనుం= శరీరమును(తనోతి తన్యతే వా విస్తరించునది పెరుగునది. శరీరము), త్వమ్= నువ్వు, ప్రాప్తః అసి= పొందావు, తుంగ= ఎత్తయిన ( తుజ్యతే హింస్యతే వాయ్వాదినా గాలి మొదలగువాటిచే కదల్చబడునది. ఉన్నతమైనది ),కుచమండలభంగురాం=వృత్తాకారంలో ఉన్నకుచ కుంభములతో విలసిల్లుతున్న నిన్ను చూసి( మండల= మండయతి భూషయతి, వృత్తాకారం భవతి వృత్తాకారంలో నుండునది), సర్వే= అప్పుడు అందరు, పీయూషకుంభ కలహం = అమృత కుంభ కారణమైన కలహమును, పరిముచ్య= విడిచి, త్వత్ – ఉరోజకుంభే= నీ కుచ కుంభము పై (అమృతము కంటె మధురమయిన) (ఉరసి జాయతే వక్షఃస్థలమున పుట్టునది. స్తనము.) (కుంభ= కుం భూమిం కుత్సితం వా ఉంభతి జలేన పూరయతి జలమును ధరించునది. భూమిపై కొద్దిగా జలమును నింపునది. ఘటము), తృష్ణా –ఆకులాః= దప్పిక గొని (తృష్యతి ఆకాంక్షతి తస్య భావః–కోరిక దప్పిక ఒక రోగము), ప్రతియయుః= వ్యాకులత చెంది కోరికతో దగ్గరగా వచ్చారు.

**తాత్పర్యము:** అప్పుడు కేవలము శరీర కాంతిచేతనే శ్యామవు కాక (చామన చాయ రంగు కలిగినదానివి కాక) వయస్సు చేత కూడా శ్యామకు తగిన శరీరమును పొందావు. (యౌవన మధ్యస్థురాలను శ్యామ అంటారు. అలా మోహిని శ్యామ అయిందని భావం) ఎత్తయిన కుచ కుంభములతో విలసిల్లుతున్న నిన్ను చూసి అప్పుడు అందరు అమృత కుంభ కారణమైన కలహమును విడిచి నీ కుచ కుంభము పై దప్పిక గొని వ్యాకులత చెంది దగ్గరగా వచ్చారు.

**29–3 శ్లో.**

**కా త్వం మృగాక్షి విభజస్వ సుధామిమామి–**
**త్యా రూఢరాగవివశానభియాచతోఽమూన్ ।**
**విశ్వస్యతే మయి కథం కులటాఽస్మి దైత్యాః**
**ఇత్యాలపన్నపి సువిశ్వసితానతానీః ॥**

**ప్రతిపదార్థం:** మృగాక్షి= ఓ లేడి వంటి కన్నులు కలదానా! (మృగస్య అక్షి ఇవ అక్షి యస్యాః–మృగము నేత్రముల వంటి నేత్రములు కలది), త్వం కా = నువ్వు ఎవరవు?, ఇమామ్ – సుధామ్ విభజస్వ= ఈ అమృతమును మాకు సమముగా పంచుము (సుష్ఠు ధీయతే పీయతే అర్ప్యతే చక్కగా త్రాగబడునది అమృతము), ఇతి– అభియాచతః =అని కోరిన, అమూన్ ఆరూఢరాగవివశాన్= ఆ మోహ వివశులతో, దైత్యాః= ఓ రాక్షసులా రా!, కులటా అస్మి = నేను కులటను. (కులాని అటంతి శీలం భినత్తి శీలమును పాడు చేయునది. వ్యభిచారిణి), మయి = నాయందు, విశ్వస్యతే = మీకు నమ్మకము ఉండుట, కథం = ఎట్లు? (ఉండకూడదని భావం), ఇతి ఆలపన్ అపి= అని ఈ రకంగా చెప్పినప్పటికి, సువిశ్వసితాన్ = సప్రేమ స్మిత కటాక్షముల చేత వారికి నీ పై దృఢ విశ్వాసము కలవారిగా, అతానీః= చేసావు.

**తాత్పర్యము:** ఓ లేడి వంటి కన్నులు కలదానా ! నువ్వు ఎవరవు?– ఈ అమృతమును మాకు సమముగా పంచుము అని కోరిన ఆ మోహవివశులతో ఓ రాక్షసులారా! నేను కులటను. నాయందు మీకు నమ్మకము ఉండుట ఎట్లు? (ఉండకూడదని భావం) అని ఈ రకంగా చెప్పినప్పటికి సప్రేమ స్మిత కటాక్షముల చేత వారికి నీ పై దృఢ విశ్వాసము కలవారిగా చేసావు.

**29–4 శ్లో.**
**మోదాత్సుధా కలశమేషు దదత్సు సా త్వం**
**దుశ్చేష్టితం మమ సహధ్వమితి బ్రువాణా ।**
**పంక్తిప్రభేదవినివేశితదేవదైత్యా**
**లీలావిలాసగతిభిః సమదాస్సుధాం తామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏషు మోదాత్ = ఆరాక్షసులు సంబరపడి, సుధా కలశమ్ = అమృత కుంభమును, దదత్సు= నీ చేతికి ఇవ్వగా, సా త్వం= ఆ నువ్వు (మోహినిరూపంలో ఉన్న నువ్వు), మమ = నేను ఏదయినా, దుః చేష్టితం= పొరబాటు చేస్తే, సహధ్వమ్= సహించవలసినది, ఇతి = అని, బ్రువాణాః=చెప్తూచూ, దేవదైత్యా= దేవ రాక్షసులను, పంక్తిప్రభేద= రెండు పంక్తులుగా(పచ్యతే వ్యక్తీక్రియతే

శ్రేణీ విశేషేణ – వరుస, పంక్తి), వినివేశిత = కూర్చుండబెట్టి, లీలావిలాసగతిభిః= లీలా విలాస మార్గములతో, తామ్ సుధాం = జరామరణ హారిణి అయిన ఆ అమృతమును, సమదాః= వడ్డించుట ఆరంభించితివి.

**తాత్పర్యము:** ఆరాక్షసులు సంబరపడి అమృత కుంభమును నీ చేతికి ఇవ్వగా మోహినిరూపంలో ఉన్న నువ్వు "నేను ఏదయినా పొరబాటు చేస్తే సహించవలసినది'' అని చెప్పుచూ దేవ రాక్షసులను రెండు పంక్తులుగా కూర్చుండ బెట్టి లీలా విలాస మార్గములతో జరామరణ హారిణి అయిన ఆ అమృతమును వడ్డించుట ఆరంభించితివి.

**29–5 శ్లో.**
**అస్మాస్వియం ప్రణయినీత్యసురేషు తేషు**
**జోషం స్థితేష్వథ సమాప్య సుధాం సురేషు ।**
**త్వం భక్తలోకవశగో నిజరూపమేత్య**
**స్వర్భానుమర్ధపరిపీతసుధం వ్యలావీః ॥**

**ప్రతిపదార్థం:** అస్మాసు అసురేషు = రాక్షసులమైన మనయందు, ఇయం = ఈమె, ప్రణయినీ = ప్రేమ ఎక్కువ. (ప్రేమగల ఆడుది), ఇతి =అని(మోసం చేయదని), తేషు= వారు ( రాక్షసులు), జోషం స్థితేషు = మౌనంగా కిక్కురు మనకుండ సుఖంగా కూర్చుండగా, అథ =అటుపిమ్మట, సుధాం = అమృతమును, సురేషు= దేవతలయందు, సమాప్య= పూర్తి చేసి, భక్తలోకవశగః = భక్త లోక వశమయి వర్తించువాడవయిన (భక్త లోక సులభుడవయిన), త్వం= నువ్వు, నిజరూపమ్ = నిజరూపమును, ఏత్య= పొంది, అర్ధపరిపీతసుధం = అమృతము సగము త్రావిన, స్వర్భానుమ్ = రాహువు శిరస్సును (స్వః సూర్యస్య భాం ప్రకాశం నుది అపాకరోతి సూర్యకాంతిని తొలగించువాడు. రాహువు), వ్యలావీః= నీ చక్రాయుధముచే ఖండించావు.

**తాత్పర్యము:** రాక్షసులమైన మనయందు ఈ మోహినికి ప్రేమ ఎక్కువ. మోసం చేయదని వారు తూష్ణీ భావంతో మౌనంగా కిక్కురు మనకుండ కూర్చుండగా

అటుపిమ్మట అమృతమును దేవతలయందు పూర్తి చేసి భక్త లోక సులభుడవయిన నువ్వు నిజరూపమును పొంది అమృతము సగము త్రావిన రాహువు శిరస్సును నీ చక్రాయుధముచే ఖండించావు.

**29-6 శ్లో.**

**త్వత్తస్సుధాహరణయోగ్యఫలం పరేషు**
**దత్త్వా గతే త్వయి సురైః ఖలు తే వ్యగృహ్ణన్ ।**
**ఘోరేఽథ మూర్ఛతి రణే బలిదైత్యమాయా-**
**వ్యామోహితే సురగణే త్వమిహావిరాసీః ॥**

**ప్రతిపదార్థం:** త్వత్తః = నీ నుండి, సుధ హరణ యోగ్య ఫలం= అమృత హరణ యోగ ఫలితము (అనగా అమృతమును తాగు అదృష్టము), ప రేషు= దేవతలకు, దత్త్వా గ తే= దక్కగా అది చూసిన రాక్షసులు అవమానంతో, సురైః= దేవతలతో, వ్యగృహ్ణన్ =యుద్ధము ప్రారంభించిరి, అథ= అటుపిమ్మట జరిగిన, ఘోరే= ఘోరమైన, రణే=ఆ యుద్ధములో, బలిదైత్య=బలి అను రాక్షసుని యొక్క(బల్యతే దీయతే రాజ్యే రాజగ్రాహ్యే భాగః-రాజ్యమునందు ఇవ్వబడునది. రాజు తీసుకొను పన్ను బలి చక్రవర్తి), మాయా=మాయచే, సురగణే=దేవతాగణములు, వ్యామోహితే=మూర్ఛ పోగా, త్వమ్ ఇహ =నువ్వు ఇచ్చట, ఆవిరాసీః= తిరిగి ప్రత్యక్షమయ్యావు.

**తాత్పర్యము:** గురువాయూర్ దేవా! నీ నుండి అమృత హరణ యోగ ఫలితము (అనగా అమృతమును తాగు అదృష్టము) దేవతలకు దక్కగా అది చూసిన రాక్షసులు అవమానంతో దేవతలతో యుద్ధము ప్రారంభించిరి. అటుపిమ్మట జరిగిన ఘోరమైన ఆ యుద్ధములో బలి అను రాక్షసుని యొక్క మాయచే దేవతాగణములు మూర్ఛ పోగా నువ్వు అచ్చట తిరిగి ప్రత్యక్షమయ్యావు.

**29-7 శ్లో.**

**త్వం కాలనేమిమథ మాలిముఖాఞ్జఘన్థ**
**శక్రో జఘాన బలిజంభబలాన్ సపాకాన్ ।**

**శుష్కార్ద్రదుష్కరవధే నముచౌ చ లూనే**
**ఫేనేన నారదగిరా న్యరుణో రణం తమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, త్వం= నువ్వు, కాలనేమిమ్= కాలనేమిని (కాలస్య మృత్యోః నేమిః చక్ర ఇవ–మృత్యువునకు చక్రము వంటివాడు. హిరణ్యకశిపుని కొడుకు. కాలనేమి), మాలిముఖాన్ = మాలి మొదలగు రాక్షసులను (మాల్యవంతుని తమ్ముడు. సుకేశుని కొడుకు), జ ఘన్థ= సంహరించావు, శక్రః = ఇంద్రుడు, బలిజంభబలాన్= బలి జంభుడు మొదలైన రాక్షసులను, సపాకాన్= వారి సంతానము తో కలిపి, జఘాన= సంహరించాడు, శుష్క ఆర్ద్ర = పొడి మరియు తడి కలిగిన ఏ ఆయుధము చేత, దుష్కరవధే = దుష్కరముగా మరణము పొందని, నముచౌ చ = నముచిని (న ముంచతి పరపదార్థాన్ దుష్టాచారం వా ఇతరుల వస్తువులను వదలిపెట్టనివాడు. దొంగ దుష్టాచారము కలవాడు. ఒక రాక్షసుడు.) (విప్రచిత్తి కొడుకు. భార్య స్వర్భానుని కూతురు అగు ప్రభ. ఇతనిని ఇంద్రుడు చంపెను), ఫేనేన= ఉభయాత్మకమైన సముద్రపు నురుగుతో, లూనే= శిరస్సు తెగునట్లు చేసావు, నారదగిరా= తరువాత నారదుని మాటతో, తమ్ రణం = ఆ యుద్ధమును(రణ్యతే శబ్ద్యతే అత్ర–ఇక్కడ శబ్దము చేయుదురు. రణము, యుద్ధము), న్యరుణః= విరమింప చేశావు.

**తాత్పర్యము:** దేవా! నువ్వు అప్పుడు కాలనేమి , మాలి మొదలగు రాక్షసులను సంహరించావు. ఇంద్రుడు బలి జంభుడు మొదలైన రాక్షసులను వారి సంతానము తో కలిపి సంహరించాడు. పొడి మరియు తడి కలిగిన ఏ ఆయుధము చేత మరణము పొందని నముచిని నురుగుతో చనిపోవునట్లు చేశావు. తరువాత నారదుని మాటతో ఆ యుద్ధమును విరమింప చేశావు.

**29–8 శ్లో.**
**యోషా వపుర్దనుజమోహనమాహితం తే**
**శ్రుత్వా విలోకన కుతూహలవాన్ మహేశః ।**
**భూతైస్సమం గిరిజయా చ గతః పదంతే**
**స్తుత్వాఽబ్రవీదభిమతం త్వమథో తిరోధాః ॥**

**ప్రతిపదార్థము:** తే= నువ్వు, దనుజమోహనమ్= రాక్షసులను మోహ పెట్టుటకు, యోషావపుః = మోహినీ రూపమును, ఆహితం = ధరించితివని (ఆహితః న్యస్తః– పెట్టబడినది ఉంచబడినది స్థాపింపబడినది), శ్రుత్వా= విని, విలోకనకుతూహలవాన్ = నిన్ను చూసే కుతూహలంతో, మహా –ఈశః= పరమశివుడు, భూతైః సమం= తన భూత గణములతో, గిరిజయా చ= పార్వతి తో సహా(గిరౌ జాయతే పర్వతములో పుట్టునది. పర్వతరాజు కుమార్తె. పార్వతి), తే పదం గతః = నీ యొక్క స్థానమైన వైకుంఠమునకు చేరుకున్నాడు, స్తుత్వా= అక్కడ నిన్ను గురించి స్తోత్రము చేసి, అభిమతం= తన ఇష్టము(మోహినీరూపములో నిన్ను చూడవలెనను)(అభిమతః సమ్మతః ఆదృతః–అభిప్రాయము ఉద్దేశము, అబ్రవీత్ =తెలియచేసాడు,త్వమ్అథ=అటుపిమ్మట,తిరోధాః=నువ్వుఅంతర్ధానమయ్యావు.

**తాత్పర్యము:** రాక్షసులను మోహ పెట్టుటకు నువ్వు మోహినీ రూపమును ధరించితివని విని నిన్ను చూసే కుతూహలంతో పరమశివుడు తన భూత గణములతో పార్వతి తో సహా నీ యొక్క స్థానమైన వైకుంఠమునకు చేరుకున్నాడు. అక్కడ నిన్ను గురించి స్తోత్రము చేసి తన ఇష్టము తెలియచేసాడు. అప్పుడు నువ్వు అంతర్ధానమయ్యావు.

**29–9 శ్లో.**

**ఆరామసీమని చ కందుకఘాతలీలా–**
**లోలాయమాననయనాం కమనీం మనోజ్ఞామ్ ।**
**త్వామేష వీక్ష్య విగలద్వసనాం మనోభూ–**
**వేగాదనంగరిపురంగ సమాలిలింగ ॥**

**ప్రతిపదార్థం:** అంగ= ఓ దేవా! ఆరామసీమని చ = ఆపైన ఒక ఉద్యానవనంలో(ఆరమంతే క్రీడంతి అత్ర –క్రీడించుటకు నిర్మించినది. ఉపవనము, కృత్రిమ వనము, ఉద్యానవనము), కందుకఘాతలీలా= బంతి ఆట ఆడుతూ (క్రీడాకాలే ఇతస్తతః భ్రమతి ఆడుకొనునప్పుడు అటునిటు భ్రమించునది. బంతి), లోలాయమాననయనాం= కళ్ళను అందముగా చలింప చేస్తూ, కమనీం =అందముగా నున్న(కామ్యతే కమనీయం వా కోరబడునది అందముగా నున్నది),

మనోజ్ఞామ్= సుందరమైన వేషంలో ఉన్న (మనసా జానాతి గృహ్ణాతి మనసుతో గ్రహించునది. అందమైనది), విగలత్ వసనాం = గాలి తాకిడితో వస్త్రము ఒకింత తొలగి ఉన్న నిన్ను చూసి, మనోభూవేగాత్= మన్మథుని జయించినవాడయి నప్పటికీ మోహినీ అవతారంలో ఉన్న నిన్ను చూసి మన్మథుని వేగమునకు తట్టుకోలేక, అనంగరిపుః = మన్మథుని శత్రువయిన ఆ శివుడు, సమాలిలింగ= ఆలింగనము చేసుకొనెను.

**తాత్పర్యము:** దేవా! ఆపైన ఒక ఉద్యానవనంలో బంతి ఆట ఆడుతూ, కనుగుడ్లను అందముగా తిప్పుతూ, సుందరమైన వేషంలో ఉన్న వస్త్రము ఒకింత తొలగి ఉన్న నిన్ను చూసి , మన్మథుని జయించినవాడయి నప్పటికీ మోహినీ అవతారంలో ఉన్న నిన్ను చూసి మన్మథుని వేగమునకు తట్టుకోలేక ఆ శివుడు ఆలింగనము చేసుకొనెను.

**29-10 శ్లో.**
**భూయోఽపి విద్రుతవతీముపధావ్య దేవో**
**వీర్య ప్రమోక్ష వికసత్పరమార్థబోధః ।**
**త్వన్మానితస్తవ మహత్త్వమువాచ దేవ్యై**
**తత్తాదృశస్త్వమవ వాతనికేతనాథ! ॥**

**ప్రతిపదార్థము:** వాతనికేతనాథ!= గురువాయూరు దేవా!, భూయః- అపి= అటు పిమ్మట మరలా, విద్రుతవతీమ్ = శివుని కౌగిలి నుంచి విడిపోయి నువ్వు పారిపోతుండగా (విద్రుతః పలాయితః - పారిపోయినది), దేవః= శివుడు, ఉపధావ్య = వెంబడించి పరిగెత్తాడు, వీర్య= రేతస్సు (వీరస్య భావః, శుక్ర ధాతుః- శుక్రము, వీర్యము), ప్రమోక్ష= స్ఖలనము కాగా (క్షిపణే ముక్తౌ మోక్షతి, మోక్షయతి, మోక్షయతే విసురుట వదులుట), వికసత్ పరమార్థబోధః= వికసించిన పరమార్థ (ఆనందము)జ్ఞానముతో, త్వత్ మానితః= నీ చేత సన్మానము పొంది ఆ శివుడు, తవ = నీ యొక్క, మహత్త్వమ్-= గొప్పతనమును(మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి పూజింపబడువాడు. జ్యేష్ఠుడు గొప్పది), దేవ్యై = తనదేవి అయిన గౌరికి, ఉవాచ = శివుడు చెప్పెను, తత్ తాదృశః = అటువంటి గొప్ప వాడివి అయిన, త్వమ్ = నువ్వు, అవ = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** అటు పిమ్మట శివుని కౌగిలి నుంచి విడిపోయి నువ్వు పరుగెత్తుతుండగా నీ వెంట ఆ శివుడు పరిగెత్తాడు.వీర్యము స్ఖలనము కాగా పరమార్ధ జ్ఞానము శివునికి లభించినది. నీ చేత సన్మానము పొంది నీ యొక్క గొప్పతనమును తనదేవి అయిన గౌరికి శివుడు చెప్పెను. అటువంటి గొప్ప వాడివి అయిన గురువాయూరు దేవా! నన్ను రక్షించు.

**అష్టమ స్కంధము**

**29వ దశకము సమాప్తము.**



# దశకమ్ 30 – వామనావతారము

**30–1 శ్లో.**

**శక్రేణ సంయతి హతోఽపి బలిర్మహాత్మా**
**శుక్రేణ జీవితతనుః క్రతువర్ధితోష్మా ।**
**విక్రాంతిమాన్ భయనిలీనసురాం త్రిలోకీం**
**చక్రే వశే స తవ చక్రముఖాదభీతః ॥**

**ప్రతిపదార్థం:** సంయతి = దేవదానవయుద్ధమున, శక్రేణ హతః అపి = ఇంద్రుని చేతిలో చనిపోయినప్పటికి, మహాత్మా బలిః = గొప్పవాడయిన 'బలిచక్రవర్తి', శుక్రేణ= శుక్రాచార్యునిచే(శుచ్యతి ఆర్ద్రో భవతి ద్రవంగా వుండునది. వీర్యము శుక్రాచార్యుడు), జీవితతనుః = తిరిగి బతికాడు. (మృత సంజీవని విద్యచే), క్రతువర్ధిత– =ఆ తరువాత విశ్వజిత్తు మొదలయినఅనేక యజ్ఞాలవలన పెరిగిన, ఊష్మా = వేడిమిచే (శక్తిచే), సః విక్రాంతిమాన్= ఆ పరాక్రమవంతుడు (విశిష్టా క్రాంతిః గతిః పరాక్రమః–విశేషగమనము పరాక్రమము), భయనిలీన సురాం= తన పరాక్రమమునకు భయపడి దేవతలు దాక్కొనగా, తవ చక్రముఖాత్ –అభీతః= నీ సుదర్శనచక్రమునకుకూడా భయపడనంత బలాఢ్యుడై (ప్రహ్లాద వంశజుడు కావటం వల్ల), త్రిలోకీం= త్రిలోకములను, చక్రే వశే =జయించెను (వశపరచుకొనెను).

**తాత్పర్యము:** 'బలిచక్రవర్తి' దేవదానవయుద్ధమున ఇంద్రుని చేతిలో చనిపోయినప్పటికి – శుక్రాచార్యునిచే తిరిగి బతికాడు. ఆ తరువాత అనేక యజ్ఞాలు చేసి మరింత శక్తిమంతుడయి నీ సుదర్శనచక్రమునకుకూడా భయపడనంత బలాఢ్యుడై – బలి త్రిలోకములను వశపరచుకొనెను. బలి పరాక్రమమునకు భయపడి దేవతలు దాక్కొన్నారు. .

**30–2 శ్లో.**

**పుత్రార్తి దర్శన వశాదదితిర్విషణ్ణా**
**తం కాశ్యపం నిజపతిం శరణం ప్రపన్నా ।**

**త్వత్పూజనం తదుదితం హి పయోవ్రతాఖ్యం**
**సా ద్వాదశాహమచరత్ త్వయి భక్తిపూర్ణా ॥**

**ప్రతిపదార్థము:** పుత్ర–ఆర్తి దర్శనవశాత్= దేవతల దుస్థితిని చూచి (ఇంద్రుని స్వర్గాపహరణ పీడ మొదలయినవి), అదితిః= వారి తల్లియగు 'అదితి', విషణ్ణా = మిక్కిలి బాధ పడి (దుఃఖము నొంది), నిజపతిం =తన భర్తయగు, తం కాశ్యపం= 'కశ్యప మహామునిని', ప్రపన్నా=శరణు కోరింది (ప్రపన్నః శరణాగతః సుసజ్జితః ప్రాప్తః–శరణు కోరినవాడు), పయోవ్రత–ఆఖ్యం = 'పయోవ్రతమను పేరు గల వ్రతమ్మును భక్తితో చేసి(పయోమాత్ర పానరూపం వ్రతమ్ నీరును మాత్రమే త్రాగు వ్రతము), త్వత్ –పూజనం = నిన్ను పూజించమని, తత్ –ఉదితం హి= ఆ కశ్యపునిచే చెప్పబడింది కదా, సా =ఆ 'అదితి', త్వయి భక్తిపూర్ణా= నీపై సంపూర్ణభక్తితో, ద్వాదశ అహమ్= పండ్రెండు రోజులు వ్రతమును, అచరత్= ఆచరించింది.

**తాత్పర్యము:** దేవతల దుస్థితిని చూచి వారి తల్లియగు 'అదితి' మిక్కిలి బాధ పడి వారిక్షేమముగోరి ఆమె తన భర్తయగు 'కశ్యప మహామునిని' శరణు కోరింది. కశ్యపమహర్షి ఆమెను 'పయోవ్రతమును' భక్తితో చేసి నిన్ను పూజించమని చెప్పాడు.. 'అదితి' నీ పై సంపూర్ణభక్తితో పండ్రెండు రోజులు ఆ వ్రతమును ఆచరించింది.

**30–3 శ్లో.**
**తస్యావధౌ త్వయి నిలీనమతేరముష్యాః।**
**శ్యామశ్చతుర్భుజవపుః స్వయమావిరాసీః ।**
**నమ్రాం చ తామిహ భవత్తనయో భవేయం**
**గోప్యం మదీక్షణమితి ప్రలపన్నయాసీః ॥**

**ప్రతిపదార్థము:** తస్య–అవధౌ= ఆపయోవ్రతము పూర్తి కాగా, త్వయి =నీయందు, అముష్యాః =ఆమె యొక్క, నిలీనమతేః= మనస్సు లగ్నము కాగా, శ్యామ= శ్యామ వర్ణముతో, చతుర్భుజః= నాలుగు చేతులుగల, వపుః= రూపముతో, స్వయమ్ –

ఆవిరాసీః = స్వయంగా ఆమెకు ప్రత్యక్షమయితివి, నమ్రాం చ తామ్ = వినమ్రముగా నమస్కరించుచున్న ఆమెతో (నమనం శీలం అస్య–నమనశీలము గల), ఇహ భవత్ తనయః భవేయం = ఆమెకు (అదితికి) నీవే పుత్రునిగా జన్మింతునని చెప్పి,మత్ –ఈక్షణమ్= నేను (నీవు) కనబడిన విషయము, గోప్యం ఇతి=ఎవరికీ చెప్పవద్దని, ప్రలపన్ = చెప్పి, అయాసీః =అంతర్ధానమయ్యావు.

**తాత్పర్యము:** వ్రతము పూర్తి కాగా ఆ మె మనస్సు నీయందు లగ్నము కాగా నీవు – శ్యామ వర్ణముతో, నాలుగు చేతులతో స్వయంగా ఆమెకు ప్రత్యక్షమయితివి. వినమ్రముగా నమస్కరించుచున్న ఆమెతో ఆమెకు (అదితికి) నీవే పుత్రునిగా జన్మింతునని చెప్పి తెలిపి . నీవు కనబడిన విషయము ఎవరికీ చెప్పవద్దని చెప్పి , అంతర్ధానమయ్యావు.

**30–4 శ్లో.**
**త్వం కాశ్యపే తపసి సన్నిదధత్ తదానీం**
**ప్రాప్తోఽసి గర్భమదితేః ప్రణుతో విధాత్రా ।**
**ప్రాసూత చ ప్రకట వైష్ణవదివ్య రూపం**
**సా ద్వాదశీ శ్రవణ పుణ్యదినే భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వం = నువ్వు, కాశ్యపే = కాశ్యపుడు (కశ్యపస్య గోత్రాపత్యం పుమాన్ కశ్యపుని గోత్రములో పుట్టినవాడు. ఒక ముని, కాశ్యపుడు), తపసి = తపస్సులో ఉండగా, సన్నిదధత్ = అతని వీర్యములో ప్రవేశించావు, తదానీం= అప్పుడు, విధాత్రా= బ్రహ్మచేత, ప్రణుతః= స్తుతించబడి, అదితేః గర్భం= 'అదితి' గర్భమున, ప్రాప్తః అసి= ప్రవేశించినవాడివయ్యావు, ప్రకటవైష్ణవదివ్యరూపం =వైష్ణవ గుర్తులు కలిగిన(శంఖ చక్ర, గద మొదలయిన గుర్తులు కలిగిన) దివ్యరూపముతో, సా శ్రవణ ద్వాదశి = ఆ శ్రవణ నక్షత్రముతో కూడిన ద్వాదశి పుణ్యదినములో, భవంతమ్ = నువ్వు, ప్రాసూత చ= 'అదితి' గర్భమున జన్మించావు.

**తాత్పర్యము:** కశ్యపుడు తపస్సులో ఉండగా , బ్రహ్మ నిన్ను స్తుతించగా 'అదితి' గర్భమున ప్రవేశించావు.. అప్పుడు వైష్ణవ గుర్తులు కలిగిన దివ్యరూపముతో, నీవు

శ్రవణ ద్వాదశి (శ్రవణ నక్షత్రముతో కూడిన భాద్రపద ద్వాదశి) పుణ్యదినములో – 'అదితి' గర్భమున జన్మించావు.

**30–5 శ్లో.**
**పుణ్యాశ్రమం తమభివర్షతి పుష్పవర్షైః**
**హర్షాకులే సురకులే కృతతూర్యఘోషే ।**
**బద్ధ్వాంజలిం జయజయేతి నుతః పితృభ్యాం**
**త్వం తత్ క్షణే పటుతమం వటురూపమాధాః ॥**

**ప్రతిపదార్థము:** తమ్ పుణ్య–ఆశ్రమం= ఆ పుణ్యప్రదేశమయిన కశ్యపుని ఆశ్రమములో నీవు జన్మించినప్పుడు, దేవతలు(ఆశ్రాయంతి తపసా ఆత్మానమత్ర ధర్మచారిణః ఋషులు, మునులు ధర్మాచరణకొరకు తపస్సు చేయు స్థానము. ఆశ్రమము), పుష్పవర్షైః=పుష్పవృష్టిని, అభి వర్షతి= కురిపించారు, హర్ష–ఆకులే = ఆనందముతో(హృష్యతి తస్య భావః–సుఖము సంతోషము రోమాంచము), సురకులే= దేవతలు, కృత తూర్యఘోషే= దుంధుభులు మ్రోగించారు. (తూర్యతే తాడ్యతే కొట్టబడునది. వాద్య విశేషము), బద్ధ్వా– అంజలిం= చేతులు జోడించి, పితృభ్యాం= నీ తల్లితండ్రులు అదితి కశ్యపులు నీకు, జయజయ–ఇతి= జయము జయము అని, నుతః= పొగిడారు, తత్ క్షణే= తక్షణమే, త్వం= నీవు, మిక్కిలి పటుతమం =పటుత్వము ఉన్న, వటురూపమ్ = వటువు (బ్రహ్మచారి) రూపాన్ని (వటతి అల్పం వస్త్రమ్ చిన్న వస్త్రమును ధరించువాడు. చిన్న పిల్లవాడు, బ్రహ్మచారి), ఆధాః= ధరించావు.

**తాత్పర్యము:** ప్రభూ! ఆ పుణ్యప్రదేశమయిన కశ్యపుని ఆశ్రమములో నీవు జన్మించినప్పుడు, దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. ఆనందముతో దుంధుభులు మ్రోగించారు. చేతులు జోడించి నీ తల్లితండ్రులు అదితి కశ్యపులు నిన్ను పొగిడారు. తక్షణమే – పుడుతూనే –నీవు మిక్కిలి పటుత్వము ఉన్న వటువు (బ్రహ్మచారి) రూపాన్ని ధరించావు.

**30–6 శ్లో.**

**తావత్ప్రజాపతిముఖైరుపనీయ మౌంజీ –**
**దండాజినాక్షవలయాదిభిరర్చ్యమానః ।**
**దేదీప్యమానవపురీశ కృతాగ్నికార్యః**
**త్వం ప్రాస్థిథా బలిగృహం ప్రకృతాశ్వమేధమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఈశ= ప్రభూ!, తావత్= అప్పుడు, ప్రజాపతి ముఖైః= కశ్యప ప్రజాపతి మొదలగువారు, ఉపనీయ= నీకు ఉపనయనము చేసి (ఉప సమీపం నీయతే అనేన–గురువు వద్దకు దీనితో తీసుకువెళ్లుదురు. బ్రహ్మచారిని గురువు వద్దకు తీసుకొని వెళ్లుట), మౌంజీ= మౌంజిని (ముంజస్య ఇయం (మౌంజీ మేఖలా బ్రాహ్మణస్య–ముంజతో చేయబడినది. కటి సూత్రము, యజ్ఞోపవీతము), దండ = దండమును (దండయతి రక్షతి అసౌ రక్షించునది. దండము, లాఠీ), అజిన= కృష్ణాజినము (అజతి క్షిపతి రజ ఆది అజతి ధూళ్యాది ఆవృణోతి శరీరము మీద ధూళి పడకుండా ఉంచునది. చర్మము), అక్ష వలయ —ఆదిభిః= జపమాల మొదలయిన వాటి చేత, అర్చ్యమానః= నువ్వు పూజింపబడ్డావు. ( నీకు ఇచ్చారు), దేదీప్యమానవపుః= నీవు వాటిని ధరించిన శరీరముతో – ప్రకాశిస్తూ, కృత–అగ్నికార్యః= అగ్నికార్యమును(హోమం చేయడం) పూర్తి చేసావు, త్వం= ఆ తరువాత నీవు,ప్రకృత–అశ్వమేధమ్—ప్రారంభించబడిన అశ్వమేధయాగముగల, బలిగృహం= 'బలిచక్రవర్తి' యజ్ఞశాలకు, ప్రాస్థిథాః= బయలుదేరావు.

**తాత్పర్యం:** అప్పుడు కశ్యప ప్రజాపతి మొదలగువారు నీకు ఉపనయనము చేసారు. మౌంజి, దండ కమండలములు, కృష్ణాజినము (జింకచర్మ ఆసనము) మరియు జపమాల నీకు ఇచ్చారు. నీవు వాటిని ధరించి – ప్రకాశిస్తూ – అగ్నికార్యమును పూర్తి చేసావు. ఆ తరువాత నీవు అశ్వమేధయాగము చేస్తున్న 'బలిచక్రవర్తి' గృహమునకు బయలుదేరావు.

**విశేషాలు:** ఈ శ్లోకాన్ని చదివినా, విన్నా అనేక యజ్ఞములు చేసిన ఫలితం లభిస్తుంది. ఉపనయనము జరిగేటప్పుడు ద్రవ్యాలు అధిదేవతలకు మనం ఇస్తాం. కాని వామనుని ఉపనయనం జరిగేటప్పుడు ఆ అధిదేవతలు వామనునికి ద్రవ్యాలు ఇచ్చారు.

**30–7 శ్లో.**

**గాత్రేణ భావిమహిమోచితగౌరవం ప్రాక్**
**వ్యావృణ్వతేవ ధరణీం చలయన్నయాసీః ।**
**ఛత్రం పరోష్మతిరణార్థమివాదధానో**
**దండం చ దానవజనేష్వివ సన్నిధాతుమ్ ॥**

**ప్రతిపదార్థము:** గాత్రేణ=శరీరముతో(గచ్ఛతి అనేన–దీనితో వెళ్లుదురు. శరీరము), భావిమహిమ =భవిష్యత్తులో నువ్వు చేయ బోవు నీ విశ్వరూపమునకు, ఉచిత = తగిన, గౌరవం= గౌరవమును (గురోః భావః–గురుభావము గొప్పతనము గౌరవము), ప్రాక్ = ముందుగానే, వ్యావృణ్వతా–ఇవ =వ్యాఖ్యానిస్తున్నట్లుగా, ధరణీం చలయన్ = భూమి చలిస్తూ కంపించసాగింది, అయాసీః= కదులుతున్న, ఛత్రం= నీ తలపై ఉన్న గొడుగు (ఛాదయంతి అనేన ఆతపాదికమ్ దీనితో ఎండ మొదలగునవి కప్పివేయబడును. గొడుగు), పర–ఊష్మ – తిరణార్థం= శత్రుపరాక్రమ తాపమును (వేడిని) వారించునట్లు ఉండగా, ఆదధానః= నీ చేతిలో ధరించిన దండము, దానవజనేషు=రాక్షసులను, సన్నిధాతుమ్ ఇవ= దండించుటకు అనునట్లు ఉన్నది.

**తాత్పర్యము:** 'వామనావతారములో 'బ్రహ్మచారిగా ప్రకాశిస్తున్న మహిమ కలిగిన నీ శరీర గౌరవముచే – నీ చే కాగలకార్యమును సూచించుచున్నట్లుగా విశ్వరూపమును వ్యాఖ్యానిస్తున్నట్లుగా భూమి కంపించసాగింది.. నీ తలపై ధరించిన గొడుగు – శత్రుపరాక్రమ తాపమును (వేడిని) వారించునట్లు ఉండగా , నీ చేతిలో ఉన్న దండము రాక్షసులను దండించుటకు అనునట్లు ఉన్నది.

**30–8 శ్లో.**

**తాం నర్మదోత్తరతటే హయమేధశాలాం**
**ఆసేదుషి త్వయి రుచా తవ రుద్ధనేత్రైః ।**
**భాస్వాన్ కిమేష దహనో ను సనత్కుమారో**
**యోగీ ను కోఽయమితి శుక్రముఖైః శశంకే ॥**

**ప్రతిపదార్థము:** తాం నర్మదా –ఉత్తరతటే= ఆ నర్మదానదికి ఉత్తరతీరములో ఉన్న (నర్మ ఆనందం దదాతి ఆనందము నిచ్చునది. నర్మదా నది), హయమేధశాలాం= 'బలిచక్రవర్తి' అశ్వమేధ యాగశాలను, త్వయి= వామనునిగా నీవు, ఆసేదుషి= సమీపించుచుండగా, తవ రుచా= నీ శరీర కాంతికి(రోచతే ప్రకాశతే అసౌ ప్రకాశించునది. దీప్తి, ప్రకాశము), రుద్ధనేత్రైః= చూసే వారి కన్నులు మిరిమిట్లుగొలుపగా. (రుద్ధః అవరుద్ధః, ఆవృతః–ఆపబడ్డది, కప్పబడ్డది), ఏషః = ప్రకాశించు ఈ బ్రహ్మచారి, భాస్వాన్ కిమ్ = సూర్యుడో! (భాః అస్తి అస్య–ప్రకాశము గలది. సూర్యుడు), దహనః ను = అగ్నియో!( దహతి అసౌ కాల్చునది. అగ్ని), సనత్కుమారః యోగీ ను = సనత్కుమార యోగియా? (సనతః బ్రహ్మణః కుమారః– బ్రహ్మ కుమారుడు, ఒక ముని ఎల్లపుడు ఆనందంతో వుండువాడు), కః అయమ్ –ఇతి= ఇతడెవడు అని, శుక్రముఖైః =శుక్రుడు మొదలయిన వారు, శశంకే= సందేహింపసాగిరి.

**తాత్పర్యము:** ఆ నర్మదానదికి ఉత్తరతీరములో ఉన్న 'బలిచక్రవర్తి' అశ్వమేధ యాగశాలను నీవు సమీపించుచుండగా నీ శరీర కాంతికి చూసే వారి కన్నులు మిరిమిట్లుగొలిపాయి. . ఈ బ్రహ్మచారి 'సూర్యుడో! అగ్నియో! లేక సనత్కుమార యోగియో!' అని శుక్రుడు మొదలయిన వారు సందేహింపసాగిరి.

**30–9 శ్లో.**

**ఆనీతమాశు భృగు భిర్మహసాభిభూతైః**
**త్వాం రమ్యరూపమసురః పులకావృతాంగః ।**
**భక్త్యా సమేత్య సుకృతీ పరిషిచ్య పాదౌ**
**తత్తోయమన్వధృత మూర్ధని తీర్థతీర్థమ్ ॥**

**ప్రతిపదార్థము:** మహసా–అభిభూతైః = నీ పూజింపబడు తేజస్సుకు ప్రభావితులై – శుక్రుడు మొదలగువారు ఆశ్చర్య పడి, ఆశు= వెంటనే నిన్ను, ఆనీతమ్= బలిచక్రవర్తి వద్దకు తీసుకొని వెళ్లారు, త్వాం రమ్యరూపమ్= నీ అందమయిన రూపాన్ని చూచిన (రమ్యతే అత్ర–ఇచట ఆనందింతురు, రమ్యమైనది), ఆ సుకృతి = అద్భుత

కార్యక్రమములు చేసిన (సుకృతం అనేన సుకృతం అస్తి అస్య–ఇతనిచే మంచి చేయబడినది మంచి కలవాడు పుణ్యవంతుడు శుభయుక్తుడు), అసురః= ఆ రాక్షస చక్రవర్తి 'బలి', పులక–ఆవృతాంగః = పులకిత గాత్రుడై, భక్త్యా సమేత్య= భక్తితో నిన్ను సమీపించి, పరిషిచ్య పాదౌ= నీ పాదములను కడిగి, తీర్థతీర్థమ్= సర్వశోధకమయిన (అన్నిటిని శుద్ధి చేయునది), తత్ తోయమ్= సకలతీర్థములను మించిన ఆ పాద తీర్థాన్ని, మూర్ధని= తన శిరస్సున, అన్వధృత =ధరించాడు.

**తాత్పర్యము:** నీ అందమయిన రూపాన్ని చూసి – శుక్రుడు మొదలగువారు ఆశ్చర్య పడి, నిన్ను బలిచక్రవర్తి వద్దకు తీసుకొని వెళ్లారు. నిన్ను చూచిన ఆ సుకృతి అయిన 'బలి' పులకిత గాత్రుడై భక్తితో నిన్ను సమీపించి నీ పాదములను కడిగి, సకలతీర్థములను మించిన ఆ పాద తీర్థాన్ని తన శిరస్సున ధరించాడు.

**30–10 శ్లో.**
**ప్రహ్లాదవంశజతయా క్రతుభిర్ద్విజేషు**
**విశ్వాసతో ను తదిదం దితిజోఽపి లేభే ।**
**యత్తే పదాంబు గిరిశస్య శిరోఽభిలాల్యం**
**స త్వం విభో। గురుపురాలయ పాలయేథాః ॥**

**ప్రతిపదార్థము:** విభో। గురుపురాలయ = ప్రభూ! ఓ గురువాయూరు దేవా!, ప్రహ్లాదవంశజతయా = ప్రహ్లాద వంశమున జన్మించినవాడు అగుటవలన, క్రతుభిః = అనేక క్రతువులను చేసినవాడగుట వలన (యః క్రియతే ధర్మార్థిభిః (క్రతు శబ్దః సోమయాగేషు రూఢః) ధర్మము కోరువారిచే చేయబడునది. యజ్ఞము), ద్విజేషు= విప్రులయెడ (ద్విః జాయతేరెండుసార్లు పుట్టువాడు. బ్రాహ్మణ–క్షత్రియ–వైశ్యులు), విశ్వాసతః ను = భక్తివిశ్వాసములు కలిగియుండుటవలన, దితిజః —అపి= 'బలి' రాక్షసుడయినప్పటికి, యత్ తే పద–అంబు= ఏ నీ పాదోదకము, గిరిశస్య= పరమశివునియొక్క, శిరః —అభిలాల్యం =తలను పావనము చేసిందో, తత్–ఇదం= ఆ నీ పాదోదకాన్ని, లేభే= తనశిరస్సున ధరించే లాభం పొందాడు, స త్వం= అటువంటి గొప్పవాడివయిన నువ్వు నన్ను, పాలయేథాః= రక్షింపుము.

**తాత్పర్యము:** ప్రహ్లాద వంశమున జన్మించినవాడు అగుటవలన అనేక క్రతువులను చేసినవాడగుట వలన విప్రులయెడ భక్తివిశ్వాసములు కలిగియుండుటవలన 'బలి' రాక్షసుడయినప్పటికి పరమశివుని తలను పావనము చేసిన నీ పాదోదకాన్ని తనశిరస్సున ధరించే భాగ్యం పొందాడు. అటువంటి గొప్పవాడివయిన ఓ! గురువాయూరు దేవా! నన్ను రక్షింపుము.

**అష్టమ స్కంధము**

**30వ దశకము పూర్తి**



# దశకమ్ 31 – బలిదర్పహరణము

**31–1 శ్లో.**

**ప్రీత్యా దైత్యస్తవతనుమహః ప్రేక్షణాత్ సర్వథాఽపి**
**త్వామారాధ్యన్నజిత రచయన్నంజలిం సంజగాద ।**
**మత్తః కిం తే సమభిలషితం విప్రసూనో। వద త్వం**
**విత్తం భక్తం భవనమవనీం వాఽపి సర్వం ప్రదాస్యే ॥**

**ప్రతిపదార్థము:** అజిత= జయింపబడనివాడా! (న జితః – జయింపబడనివాడు, జయింపబడని శత్రువు. విష్ణువు), దైత్యః=బలిచక్రవర్తి, తవ= నీయొక్క, తనుమ్ అహః ప్రేక్షణాత్ = తేజోరూపమును చూచి, ప్రీత్యా= సంతోషించి, సర్వథా అపి= అన్నివిధములుగ కూడా, త్వామ్= వామన మూర్తి వైన, ఆరాధ్యన్ =అర్చించి, అంజలిం రచయన్= చేతులు జోడించి (అంజ్యతే వ్యజ్యతే భక్తి రనేనేతి భక్తిని తెలుపునది. అంజలి, చేతులు జోడించుట), సంజగాద= ఇట్లు చెప్పెను, విప్రసూనో= ఓ! బ్రాహ్మణ బాలకా! (విప్ వాక్ సా అస్తి అస్య – మంచి వాక్కులు కలవాడు. బ్రాహ్మణుడు), మత్తః= నానుండి, కిం తే సమభిలషితం= నానుండి ఏమి కోరుకొనుచుంటివి?, త్వం వద =నువ్వు చెప్పు, విత్తం= ధనమా? (విందంతి ప్రాప్నువంతి ఏనమ్ దీనిని పొందుదురు. ధనము), భక్తం = మృష్టాన్నమా(ఆరు రుచులతో కూడిన ఆహారమా! భజ్యతే సేవ్యతే తినదగినది. అన్నము), భవనమ్ = భవనములా! (భవంతి నివసంతి అస్మిన్ ఇల్లు), అవనీం = భూమియా!, వా= లేక, సర్వం అపి = నా సర్వస్వమునుకూడా, ప్రదాస్యే= తప్పక ఇచ్చెదను.

**తాత్పర్యము:** అజితా! తేజస్సుతో కూడిన నీరూపమును చూచి ‘బలిచక్రవర్తి’ సంతోషించి నిన్ను అన్నివిధములుగా అర్చించెను. చేతులు జోడించి నీతో అతను ఇట్లుపలికెను. “ ఓ! బ్రాహ్మణ బాలకా! నానుండి ఏమి కోరుకొనుచుంటివి? – నువ్వు చెప్పు. ధనమా? ఆరు రుచులతో కూడిన ఆహారమా! భవనములా! భూమియా! లేక నా సర్వస్వమును కోరుకొనుచుంటివా నీవు ఏమి కోరిననూ తప్పక ఇచ్చెదను”.

**31-2 శ్లో.**

**తామక్షీణాం బలిగిరముపాకర్ణ్య కారుణ్యపూర్ణోఽ**

**ఉప్యస్యోత్సేకం శమయితుమనా దైత్యవంశం ప్రశంసన్ ।**

**భూమిం పాదత్రయపరిమితాం ప్రార్థయామాసిథ త్వం**

**సర్వం దేహీతి తు నిగదితే కస్య హాస్యం న వా స్యాత్ ॥**

**ప్రతిపదార్థము:** అక్షీణాం= జగదీశ్వరత్వమును వ్యాఖ్యానించుచున్న, తామ్- బలిగిరమ్= ఆ 'బలి' వాక్కులు విని, ఉపాకర్ణ్య= విని, కారుణ్యపూర్ణః-అపి= కరుణను కలిగినవాడివయినప్పటికి, అస్య-ఉత్సేకం= నీవు అతని గర్వమును(ఉత్సేకః అహంకారః-అహంకారము), శమయితుమనా= అణచి వేయుటకే నిశ్చయించుకొని, దైత్యవంశం ప్రశంసన్= బలివంశమును మిక్కిలి ప్రశంసించి, పాదత్రయపరిమితాం= మూడడుగుల పరిమితమైన, భూమిం = భూమిని ఇమ్మని, ప్రార్థయామాసిథ = ఆ 'బలి చక్రవర్తిని' ప్రార్థించితివి, త్వం= నువ్వు, సర్వం దేహి ఇతి తు= సర్వస్వమును ఇమ్మని, నిగదితే= అడిగినచో, కస్య = ఎవరికి, హాస్యం న వా స్యాత్= హాస్యాస్పదము కాకుండా ఉంటుంది? (హసతి తస్య భావః కర్మ వా నవ్వు నవ్వుట హాస్య రసము).

**తాత్పర్యము:** అట్లు గొప్పగా పలికిన ఆ 'బలి' వాక్కులు విని కరుణను కలిగినవాడివయినప్పటికి, నీవు అతని గర్వమును అణచివేయుటకే నిశ్చయించుకొని బలివంశమును మిక్కిలి ప్రశంసించి – 'మూడడుగుల భూమిని ఇమ్మని ' ఆ 'బలి చక్రవర్తిని' ప్రార్థించితివి. అలాగాక సర్వస్వమును ఇమ్మని అడిగినచో అది ఎవరికి హాస్యాస్పదము కాకుండా ఉంటుంది? (సర్వస్వము విష్ణు స్వరూపము కనుక).

**31-3 శ్లో.**

**విశ్వేశం మాం త్రిపదమిహ కిం యాచసే బాలిశస్త్వం**

**సర్వాం భూమిం వృణు కిమమునేత్యాలపత్ త్వాం స దృప్యన్ ।**

**యస్మాద్దర్పాత్ త్రిపదపరిపూర్త్యక్షమః క్షేపవాదాన్**

**బంధం చాసావగమదతదర్హోఽపి గాఢోపశాంత్యై ॥**

**ప్రతిపదార్థము:** విశ్వ–ఈశం = విశ్వమునకు ప్రభువునైన, మాం= నన్ను, ఇహ= ఇక్కడ, త్రిపదమ్= మూడడుగుల నేలను, కిం యాచసే= ఇమ్మని ఎందుకు అడిగావు?, త్వం=నువ్వు, బాలిశః= తెలివి తక్కువవాడివి. (బాలి వృద్ధి శతి వృద్ధిని ఖండించువాడు. మూర్ఖుడు), సర్వాం భూమిం= మొత్తం భూమిని(భవంతి అస్మిన్ భూతాని దీనియందు ప్రాణులు వుందురు. భూమి), వృణు = కోరుకొనుము, కిమ్ అమునా=ఇది ఏమిటి?, ఇతి= అని, సః దృప్యన్= అతడు గర్వముతో (హర్ష మోహనయోః దృప్యతి ఆనందించుట గర్వించుట), త్వాం ఆలపత్ = నీతో పలికాడు, యస్మాత్ దర్పాత్= ఈ దర్పము వలననే, త్రిపదపరిపూర్తి —అక్షమః= మూడడుగుల నేలను పూర్తిగా ఈయలేక, అతదర్హః —అపి= బంధమునకు అర్హుడు కానప్పటికి, గాఢ–ఉపశాంత్యై= విషయ విరక్తిని పొంది మనస్సును శాంతి పరుచుకొనుటకు, క్షేపవాదాన్= ఈసడింపులను, బంధం చ = బంధమును (బధ్యతే అనేన–దీనితో ఆపుదురు. సంయమము సంకెళ్లు), అసౌ అగమత్=ఆ బలి ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యము:** "విశ్వమునకు ప్రభువునైన నన్ను మూడడుగుల నేలను దానమీయమని అడిగావు..నువ్వు తెలివి తక్కువవాడివి. మొత్తం భూమిని కోరుకొనుము – నీకు దానమిచ్చెదను" అని గర్వముగా పలికెను. ఈ దర్పము వలననే అర్హుడయినప్పటికి మూడడుగుల నేలను ఈయలేక బలి ఈసడింపులకు గురయ్యాడు. విషయ విరక్తిని పొంది మనస్సును శాంతి పరుచుకొని బంధనానికి అనర్హుడయ్యు తుదకు బంధింపబడ్డాడు.

**31–4 శ్లో.**

**పాదత్రయ్యా యది న ముదితో విష్టపైర్నాపి తుష్యేత్**
**ఇత్యుక్తేఽస్మిన్ వరద। భవతే దాతుకామేఽథ తోయమ్।**
**దైత్యాచార్యస్తవ ఖలు పరీక్షార్థినః ప్రేరణాత్ తం**
**మా మా దేయం హరిరయమితి వ్యక్తమేవాబభాషే॥**

**ప్రతిపదార్థము:** వరద= ఓ వరదాతా !, పాదత్రయ్యా= మూడడుగులతో, యది న ముదితః= తృప్తిపొందనివాడు, విష్టపైః అపి= ముల్లోకములు ఇచ్చినా(విష్మతి

భూతాని అస్మిన్ ప్రాణులు దీనిలో ప్రవేశింతురు. భువనము), న తుష్యేత్= తృప్తిపొందదు, ఇతి–ఉక్తే అస్మిన్= అని నీవు చెప్పగా, అథ = అటుపిమ్మట, భవతే దాతుకామే తోయమ్ = నీవడిగిన మూడడుగుల నేలను దానము చేయు కోరిక కలవాడై నీకు ధార పోయుటకు సిద్ధపడగా, పరీక్షార్థినః=బలిని పరీక్షించుట కొరకు, తవ ప్రేరణాత్ = నీ ప్రేరణ వలన, దైత్య–ఆచార్యః= దైత్యుల గురువయిన 'శుక్రాచార్యుడు' (ఆచారం గ్రాహయతి శిష్యాన్ ఆచారే స్థాపయతి శిష్యులకు సదాచారము (బోధించువాడు) గ్రహింపచేయువాడు ఆచార్యుడు), తం= అతనికి (వామనునికి), మా మా దేయం = దానముఇవ్వవలదు, అయమ్= ఇతడు, హరిః ఇతి = హరి అని, వ్యక్తమ్ –ఏవ= స్పష్టముగా, ఆబభాషే= పలికెను.

**తాత్పర్యము:** "మూడడుగులతో తృప్తిపొందనివాడు ముల్లోకములు ఇచ్చినా తృప్తిపొందదు. అని నీవు చెప్పగా అటుపిమ్మట ఆ బలి నీవడిగిన మూడడుగుల నేలను దానము చేయు కోరిక కలవాడై భూమిని ధార పోయుటకు సిద్ధపడెను. నీవు ఆ అప్పుడు నీచేతనే ప్రేరేపింపబడి– దైత్యుల గురువయిన 'శుక్రాచార్యుడు' బలిచక్రవర్తితో – ఈ దానము ఈయవలదు "వచ్చిన వాడు సాక్షాత్తూ 'హరియే!', అని చెప్పి నివారించెను.

**31–5 శ్లో.**

**యాచత్యేవం యది స భగవాన్ పూర్ణకామోఽస్మి సోఽహం**
**దాస్యామ్యేవ స్థిరమితి వదన్ కావ్యశప్తోఽపి దైత్యః ।**
**వింధ్యావల్యా నిజదయితయా దత్తపాద్యాయ తుభ్యం**
**చిత్రం చిత్రం సకలమపి సః ప్రార్పయత్ తోయపూర్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** యది స భగవాన్ యాచతి –ఏవం= ఈ విధంగా నన్ను యాచించునది వాస్తవముగా ఆ భగవానుడే అయినచో, పూర్ణకామః–అస్మి= నెరవేరిన కోరిక కలిగిన వాడినయ్యాను, సః అహం= అతనికి నేను, స్థిరమ్ ఏవ దాస్యామి = తప్పక దానము ఇస్తాను, ఇతి = అని, వదన్= చెప్పుచూ, కావ్యశప్తః – అపి= తన గురువు శుక్రాచార్యునిచే శాపమునకు( ఐశ్వర్య భ్రష్టుడివి అగుదువుఅని శాపము) గురి అయినప్పటికి (కవేః కర్మ భావో వా కవియొక్క కర్మ. కావ్యము కవి

పుత్రుడు శుక్రాచార్యుడు), దైత్యః= రాక్షసుడు అయిన బలి, నిజదయితయా= తన భార్య, వింధ్యావల్యా = వింధ్యావళిచే, దత్తపాద్యాయ= ఇవ్వబడిన పాద్యము కలిగి (పాదాయ ఉదకమ్ కాళ్ల కొరకు నీరు. పాద్యము), తోయపూర్వమ్= నీటి ధారాపూర్వకముగా, సకలమ్ అపి= సకలమును కూడా (సర్వ సామ్రాజ్యమును), సః = ఆ బలి, తుభ్యం = నీకు, ప్ర–అర్పయత్= ధారపోసెను, చిత్రంచిత్రం= ఆశ్చర్యము... ఆశ్చర్యము.

**తాత్పర్యము:** "నన్ను యాచించునది వాస్తవముగా ఆ భగవానుడే అయినచో ఇంతకంటె నాకు భాగ్యమేముంది?. నేను తప్పక దానము ఇస్తాను", అని పలికి తన గురువు శాపమునకు గురి అయినప్పటికి , తన భార్య, వింధ్యావళి పాద్యము పోయగా నీ పాదములను కడిగాడు., ఆశ్చర్యము... ఆశ్చర్యము– తన సకలమును, ప్రభూ! నీటి ధారాపూర్వకముగా నీకు ధారపోసెను.

**31–6 శ్లో.**
**నిస్సందేహం దితికులపతౌ త్వయ్యశేషార్పణం తత్**
**వ్యాతన్వానే ముముచుః ఋషయః సామరాః పుష్పవర్షమ్ ।**
**దివ్యం రూపం తవ చ తదిదం పశ్యతాం విశ్వభాజామ్**
**ఉచ్చైరుచ్చైరవృధదవధీకృత్య విశ్వాండభాండమ్ ॥**

**ప్రతిపదార్థము:** నిస్సందేహం= సందేహము లేక, దితికులపతౌ= ఆ దైత్యచక్రవర్తి, త్వయి –అశేష–అర్పణం= తన సమస్తమును నీకు అర్పణచేయగా, తత్ వ్యాతన్వానే = ఆ దాన క్రియను చూసి, ఋషయః = ఋషులు, స–అమరాః =దేవతలతో, పుష్పవర్షమ్ = పూలవాన(పుష్పతి వికసతి వికసించునది. పుష్పము), ముముచుః= కురిపించిరి, తవ చ = నీకు సంబంధించిన, తత్ ఇదం =ఆ ఈ, దివ్యం రూపం = దివ్యమైన వామన రూపము, విశ్వభాజామ్ పశ్యతాం = విశ్వ ప్రజా సమూహము చూస్తుండగానే, ఉచ్చైః ఉచ్చైః = ఉన్నతముగా, విశ్వాండభాండమ్= బ్రహ్మాండమును, అవధీకృత్య =అవధిగా చేసుకొని, అవృధత్= పెరిగింది.

**తాత్పర్యము:** సందేహము లేక ఆ దైత్యచక్రవర్తి తన సమస్తమును నీకు అర్పణచేయగా

దేవతలు, ఋషులు పూలవాన కురిపించిరి. నీ దివ్యరూపము – విశ్వ ప్రజా సమూహము చూస్తుండగానే ఉన్నతముగా పెరుగుచు బ్రహ్మాండమును అవధిగా చేసుకొని విశ్వమంతట ఆవరించి పెరిగింది.

**విశేషాలు**

**బ్రహ్మాండం :** ఆకాశం. బ్రహ్మతత్త్వం నుంచి మొట్టమొదట బయటపడ్డ భూతం. అండాకారంగా పెద్దదిగా వ్యాపించి కనిపిస్తుంది గనుక దీనికి బ్రహ్మాండమని పేరు. దీనిలో చేరినదే అండాండం. అంటే సూర్యచంద్రాది గోళాలు. అందులో సంచరించేవి పిండాండం. అంటే జరాయుజాది శరీరాలు.

**31–7 శ్లో.**
**త్వత్పాదాగ్రం నిజపదగతం పుండరీకోద్భవోఽసౌ**
**కుండీతోయైరసిచదపునాద్యజ్జలం విశ్వలోకాన్ ।**
**హర్షోత్కర్షాత్ సుబహు ననృతే ఖేచరైరుత్సవేఽస్మిన్**
**భేరీం నిఘ్నన్ భువనమచరజ్జాంబవాన్ భక్తిశాలీ ॥**

**ప్రతిపదార్థం:** త్వత్ పాద–అగ్రం= నీ పాదాగ్రము, నిజపదగతం= తనలోకము (సత్య లోకము) దాకా రాగా చూసిన, అసౌ పుండరీక–ఉద్భవః = ఆ కమలము నుండి పుట్టిన బ్రహ్మదేవుడు, కుండీ తోయైః అసిచత్ = తన కమండలములోని నీటిని వంచి నీ పాదములు కడిగాడు, యత్ –జలం= నీ పాదములను కడిగిన ఏ నీరు అయితే ఉన్నదో ఆ నీరు, విశ్వలోకాన్= సర్వ లోకములను, అపునాత్= పవిత్రముచేసింది, హర్ష–ఉత్కర్షాత్=ఆనందాతిశయముతో, సుబహు ననృతే= అనేకమంది నృత్యము చేసారు, ఖేచరైః = దేవతలు, విద్యాధరులు, గంధర్వులు, అస్మిన్ ఉత్సవే= ఈ ఉత్సవ సందర్భంలో, భక్తిశాలీ = నీ భక్తుడగు, జాంబవాన్ = జాంబవంతుడు, భేరీం= భేరీ (దుందుభి), నిఘ్నన్ = మ్రోగించుచు, భువనమ్ = బ్రహ్మాండమంతా, అచరత్= తిరిగివచ్చాడు.

**తాత్పర్యం:** నీ పాదాగ్రము తనలోకము దాకా రాగా చూసిన బ్రహ్మదేవుడు తన కమండలములోని నీటిని వంచి పాదములు కడిగాడు. నీ పాదములను కడిగిన ఆ

నీరు విశ్వాన్ని పవిత్రముచేసింది. ఆనందముతో దేవతలు, విద్యాధరులు, గంధర్వులు నృత్యము చేసిన ఈ ఉత్సవ సందర్భంలో నీ భక్తుడగు జాంబవంతుడు – భేరీ మ్రోగించుచు బ్రహ్మాండమంతా తిరిగివచ్చాడు.

**31–8 శ్లో.**

**తావద్దైత్యాస్త్వను మతిమృతే భర్తురారబ్ధయుద్ధాః**
**దేవోపేతైర్భవదనుచరైస్సంగతా భంగమాపన్ ।**
**కాలాత్మాఽయం వసతి పురతో యద్వశాత్ ప్రాగ్ జితాఃస్మః**
**కిం వో యుద్ధైరితి బలిగిరా తేఽథ పాతాళమాపుః ॥**

**ప్రతిపదార్థం:** తావత్ =అప్పుడు, దైత్యాః తు = రాక్షసులు, భర్తుః అనుమతిమ్ ఋతే= తమనాయకుడగు 'బలి' ఆజ్ఞ లేకపోయినప్పటికి, దేవ ఉపేతైః = నీ అనుచరులగు దేవతలతో(ఉప సమీపం ఇతః ఆగతః ఉపస్థితః ప్రాప్తః – దగ్గరకు వచ్చినవాడు), భవత్ అనుచరైః = వైకుంఠ పరివారముతో, ఆరబ్ధయుద్ధాః సంగతాః =యుద్ధం ఆరంభించారు. (కాని), భంగమ్–ఆపన్= పరాజయము పొందారు (భజ్యతే భంగము పరాజయము), యత్ వశాత్= ఎవరి కరుణ వలన, ప్రాక్ = పూర్వము, జితాః స్మః= విజయము సాధించామో, అయం కాలాత్మా= ఆ కాలస్వరూపుడైన పరమాత్మ, పురతః = మన ఎదురుగా, వసతి= ఉన్నాడు.(ఇప్పుడు వామనమూర్తి రూపంలో ప్రతికూలంగా ఉన్నాడని భావం), కిం వః యుద్ధైః = మనకు యుద్ధము ఎందుకు?, బలిగిరా= అను బలి వాక్కులను విని, అథ= అటుపిమ్మట, తే= ఆ రాక్షసులు, పాతాళమ్= పాతాళలోకముకు(అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళాలనేవి ఏడు అథోలోకాలు. అందులో చివరిది పాతాళం), ఆపుః= చేరారు.

**తాత్పర్యము:** రాక్షసులు తమనాయకుడగు 'బలి' ఆజ్ఞ లేకపోయినప్పటికి , నీ అనుచరులగు దేవతలతో, వైకుంఠ పరివారముతో యుద్ధమునకు సిద్ధమయి పరాజయము పొందారు. "కాలస్వరూపుడైన పరమాత్మ మనకు అనుకూలుడై ఉండుటవలన, ఇదివరకు మనము దేవతలపై విజయము పొందాము. కాని

ఇప్పుడు ఆ పరమాత్మ మనకు ప్రతికూలము. యుద్ధము ఎందుకు?'' అను బలి వాక్కులను విని, అటుపిమ్మట ఆ రాక్షసులు పాతాళలోకమును చేరారు.

**31-9 శ్లో.**

**పాశైర్బద్ధం పతగపతినా దైత్యముచ్చైరవాదీః**
**తార్తీయీకం దిశ మమ పదం కిం న విశ్వేశ్వరోఽసి ।**
**పాదం మూర్ధ్ని ప్రణయ భగవన్నిత్యకంపం వదంతం**
**ప్రహ్లాదస్తం స్వయముపగతో మానయన్నస్తవీత్త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = భగవంతుడా !గురువాయూరు దేవా!, పతగపతినా పాశైః= గరుడుని పాశములతో (పతన్ సన్ గచ్ఛతి ఎగురుతూ వెళ్లునది. పక్షి), బద్ధం = బంధింపబడిన, దైత్యమ్ = ఆ దైత్యచక్రవర్తితో, కిం న విశ్వ –ఈశ్వరః – అసి= నీవు విశ్వమునకు నేనే ప్రభువును అన్నావు కదా!కాదా!, మమ= నాయొక్క (వామనుని), తార్తీయీకం =మూడవ (తృతీయ ఏవ తార్తీయీకః – మూడవది మూడవ భాగము), పదం దిశ= అడుగు నకు చోటు చూపించు, ఉచ్చైః = అని నీవు బిగ్గరగా, అవాదీః = 'బలిని' అడుగగా, మూర్ధ్ని = నాశిరమున(ముహ్యతి అస్మిన్ ఆహతే ఇతి మూర్ధా దీనిని కొట్టినచో సొమ్మసిల్లును. మూర్ధము, శిరస్సు), పాదం= నీ పాదమును, ప్రణయ= పెట్టుము, ఇతి =అని, అకంపం= ఏమాత్రము చలించక ధృఢముగా, వదంతం= పలికిన, తం= అతని(బలి) దగ్గరకు, ప్రహ్లాదః = ప్రహ్లాదుడు, స్వయమ్ –ఉపగతః= స్వయముగా వచ్చి, మానయన్= తన మనుమడయిన బలిచక్రవర్తిని మెచ్చుకొని, త్వామ్= నిన్ను(వామనుని), అస్తవీత= పొగిడాడు.

**తాత్పర్యము:** భగవంతుడా! గరుడుని పాశములతో బంధింపబడిన ఆ దైత్యచక్రవర్తితో "నీవు విశ్వమునకు నేనే ప్రభువును అన్నావు కదా! నా "మూడవ అడుగు నకు చోటు చూపించు " అని నీవు బిగ్గరగా 'బలిని' అడుగగా అతడు ఏమాత్రము చలించక ధృఢముగా "నాశిరమున పెట్టుము'' అని పలికాడు. అప్పుడు ప్రహ్లాదుడు స్వయముగా వచ్చి తన మనుమడయిన బలిచక్రవర్తిని మెచ్చుకొని నిన్ను పొగిడాడు.

**31-10 శ్లో.**

**దర్పోచ్ఛిత్త్యై విహితమఖిలం దైత్య! సిద్ధోఽసి పుణ్యైః**
**లోకస్తేఽస్తు త్రిదివవిజయీ వాసవత్వం చ పశ్చాత్ ।**
**మత్సాయుజ్యం భజ చ పునరిత్యన్వగృహ్ణో బలిం తమ్।**
**విప్రైస్సంతానితమఖవరః పాహి వాతాలయేశ ॥**

**ప్రతిపదార్థము:** దైత్య= ఓ బలీ!, దర్ప-ఉచ్ఛిత్త్యై = నీ గర్వమును అణచివేయుటకే, అఖిలం విహితమ్= ఇదంతా జరిగింది, పుణ్యైః సిద్ధః = నీవు చేసిన మంచి పనులచే సిద్ధిని, అసి = పొందావు, త్రిదివవిజయీ = స్వర్గలోకాన్ని మించిన(త్రయః బ్రహ్మాదయః దీవ్యంతి ప్రకాశంతే అత్ర-బ్రహ్మాదులు ముగ్గురు ఇక్కడ ప్రకాశింతురు. స్వర్గము ఆకాశము),లోకః =పుణ్యలోకము,వాసవత్వం చ =ఇంద్రత్వము(వసురేవ వాసవః-ఐశ్వర్యవంతుడు. ఇంద్రుడు), తే-అస్తు= నీకు కలుగుగాక!, పశ్చాత్= తరువాత, మత్ -సాయుజ్యం చ = నా సాయుజ్యమును కూడా (సయుజః సహయోగస్య భావః సహ యునక్తి కలిసి యుండుట, వైష్ణవ మతంలో విష్ణువులో ఏకమగుట), భజ = పొందుతావు, ఇతి తమ్ బలిం= అని పలికి ఆ బలిని, అన్వగృహ్ణః= అనుగ్రహించావు, పునః= మరలా, విప్రైః= బ్రాహ్మణులచేత (ఋత్విజుల చేత), మఖవరః='బలి' నిర్వహిస్తున్న రాజసూయ యజ్ఞాన్ని, సంతానితః =పూర్తి చేయించావు, వాతాలయ- ఈశ।=. ఓ! గురువాయూరు దేవా!, పాహి= నన్ను రక్షించు.

**తాత్పర్యము:** "ఓ బలీ! నీ గర్వమును అణచివేయుటకే ఇదంతా జరిగింది. నీవు చేసిన మంచి పనులచే సిద్ధిని పొందావు. స్వర్గలోకాన్ని మించిన పుణ్యలోకములో నివసిస్తూ ఇంద్రపదవిని పొంది తరువాత నా సాయుజ్యమును పొందుతావు" అని పలికి 'బలిని' అనుగ్రహించావు. 'బలి' నిర్వహిస్తున్న యజ్ఞాన్ని బ్రాహ్మణులచేత పూర్తి చేయించావు. ఓ! గురువాయూరు దేవా! నన్ను రక్షించు.

**అష్టమ స్కంధము**

**31వ దశకము సమాప్తము.**

# దశకమ్ 32 – మత్స్యావతారము

**32-1 శ్లో.**

**పురా హయగ్రీవమహాసురేణ షష్ఠాంతరాంతోద్యదకాండకల్పే ।**
**నిద్రోన్ముఖబ్రహ్మముఖాద్ హృతేషు వేదేష్వధిత్సః కిల మత్స్యరూపమ్ ॥**

**ప్రతిపదార్థము:** పురా = పూర్వము, షష్ఠ–అంతరాంత– = బ్రహ్మ యొక్క ఆరవ కల్పమయిన 'చాక్షుషుని' మన్వంతరములో పగటి చివర, ఉద్యత్= పుట్టిన, అకాండకల్పే= నైమిత్తిక ప్రళయములో అనగా బ్రహ్మదినము గడచిన తరువాత వచ్చు ప్రళయములో(కాండం అవకాశం వినా అవకాశము లేకుండగా), నిద్ర – ఉన్ముఖ =నిద్ర పోతున్న, బ్రహ్మముఖాత్ =బ్రహ్మముఖము నుండి, హయగ్రీవమహా– అసురేణ హృతేషు= హయగ్రీవుడను మహా రాక్షసునిచే అపహరింపబడిన (హయస్య గ్రీవా ఇవ దీర్ఘా గ్రీవా యస్యగుఱ్ఱము వంటి పొడవైన మెడ గలవాడు. హయగ్రీవుడు), వేదేషు= వేదములను తిరిగి సంపాదించుటకు, మత్స్యరూపమ్= నీవు "మత్స్యరూపమును", అధిత్సః కిల= ధరించుటకు నిశ్చయించుకొంటివి కదా.

**తాత్పర్యము:** పూర్వము బ్రహ్మ యొక్క ఆరవ కల్పమయిన 'చాక్షుషుని' మన్వంతరములో పగటి చివర అవాంతర కల్పాంతరమున బ్రహ్మదేవుడు శయనించగా అతని ముఖమందున్న వేదములను ' హయగ్రీవుడు' అను రాక్షసుడు అపహరించగా ఆ వేదములను తిరిగి సంపాదించుటకు, నీవు "మత్స్యరూపమును" ధరించుటకు నిశ్చయించుకొంటివి కదా!

**32-2 శ్లో.**

**సత్యవ్రతస్య ద్రమిళాధిభర్తుర్నదీజలే తర్పయతస్తదానీమ్ ।**
**కరాంజలౌ సంజ్వలితాకృతిస్త్వ మదృశ్యథాః కశ్చన బాలమీనః ॥**

**ప్రతిపదార్థము:** తదానీమ్ = అప్పుడు, ద్రమిళ–అధిభర్తుః= ద్రమిళదేశపు మహారాజగు, సత్యవ్రతస్య= 'సత్యవ్రతుడు', నదీజలే = నదిలోని జలమును, తర్పయతః = తర్పణము చేయుచుండగా (తర్పయంతి పితౄన్ అనేన – దీనితో

పితృదేవతలను తృప్తిపరచుదురు. పితృతర్పణము) (ఇది ఒక శ్రాద్ధాంగము. జలమువిడిచి పితృదేవతలను తృప్తిపొందించుట), కర–అంజలౌ= ఆ మహారాజు దోసిలిలో, సంజ్వలిత–ఆకృతిః = విమల కాంతి సమూహము వెద జల్లుచూ, త్వమ్= నువ్వు, కశ్చన బాలమీనః= చిన్న చేపపిల్ల రూపములో(మీయతే హింస్యతేహింసింపబడునది. చేప మత్స్యావతారము), అదృశ్యథాః= దర్శన మిచ్చావు.

**తాత్పర్యము:** ద్రమిళదేశపు మహారాజగు 'సత్యవ్రతుడు', నదిలోని జలమును తర్పణము చేయుచుండగా అప్పుడు నీవు చిన్న చేపపిల్ల రూపమున విమల కాంతి సమూహము వెద జల్లుచూ ఆ మహారాజు దోసిలిలో దర్శనమిచ్చావు

**32–3 శ్లో.**

**క్షిప్తం జలే త్వాం చకితం విలోక్య నిన్యేంబుపాత్రేణ మునిః స్వగేహమ్ ।**
**స్వల్పైరహోభిః కలశీం చ కూపం వాపీం సరశ్చానశిషే విభో! త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** జలే= తనచేతిలోని చేపపిల్లను చూచి ఆ 'సత్యవ్రతుడు' వెంటనే ఆ నదీజలములో, క్షిప్తం= విడిచి (క్షిప్తః ప్రక్షిప్తః ప్రేషితః–పారవేయబడినది పంపబడినది), చకితం= భయపడునట్లు కనబడుచున్న(చకితః భ్రాంతః భీతః–భ్రాంతి నొందినవాడు భయపడినవాడు), త్వాం = నిన్ను, విలోక్య=చూసి, అంబుపాత్రేణ నిన్యే = తన కమండలములోనికి తీసుకొని, మునిః=ముని, స్వగేహమ్= తన ఇంటికి వెళ్ళెను, స్వల్పైః అహోభిః = కొన్ని రోజులకే, కలశీం= కమండలము, కూపం చ= బావి, (కు ఈషత్ ఆపః యత్ర – కొంచెము నీరు కలది. బావి), వాపీం= కొలనుకు, (వుప్యతే పద్మాదికమస్యామ్ పద్మాదులు ఇందులో వుంచబడును), సరః చ= సరస్సుకు మార్చిననూ పట్టనంతగా (సరంత ఆపః యత్ర – నీళ్లు ఇచ్చటికి చేరును. సరస్సు), విభో!= ఓ ప్రభూ, త్వమ్= నువ్వు, ఆనశిషే= వ్యాప్తి చెందావు.

**తాత్పర్యము:** తనచేతిలోని చేపపిల్లను చూచి ఆ 'సత్యవ్రతుడు' వెంటనే ఆ నదీజలములో విడిచి భయపడుచున్న నిన్ను తన కమండలములోనికి తీసుకొని

తన ఇంటికి వెళ్ళెను. కొన్ని రోజులకే కమండలము బావి, కొలనుకు, – సరస్సుకు మార్చిననూ పట్టనంతగా నీ మహిమ చూపావు.

**32–4 శ్లో.**

**యోగప్రభావాత్ భవదాజ్ఞయైవ నీతస్తతస్త్వం మునినా పయోధిమ్ ।**
**పృష్టోఽమునా కల్పదిదృక్షుమేనం సప్తాహమాస్వేతి వదన్నయాసీః ॥**

**ప్రతిపదార్థము:** తతః = నీరూపము ఆ విధముగా పెరుగుచుండగా, యోగప్రభావాత్= తన తపశ్శక్తితో, భవత్ —ఆజ్ఞయా –ఏవ = నీ ఆదేశముతో, త్వం = నిన్ను, మునినా= రాజర్షి అయిన ఆ సత్యవ్రతుడు, పయోధిమ్ నీతః= సముద్రము వద్దకు తీసుకొనిపోయెను.(పయాంసి ధీయంతే అస్మిన్ ఇందులో నీరుండును. సముద్రము), అమునా = సత్యవ్రతునిచే, పృష్టః= చెప్పబడి (ప్రార్థించబడి), కల్పదిదృక్షుమ్= కల్పాంతమును (ప్రళయసముద్రమును) చూడవలెననెడి కోరికగల, ఏనం =అతనిని, సప్త —ఆహమ్ —ఆస్వ —ఇతి= ఏడుదినములు వేచియుండమని, వదన్ అయాసీః= చెబుతూ అదృశ్యమయ్యావు.

**తాత్పర్యము:** నీరూపము ఆ విధముగా పెరుగుచుండగా, నీ ఆదేశముతో ఆ 'సత్యవ్రత మహారాజు' తన యోగప్రభావముతో నిన్ను సముద్రము వద్దకు తీసుకొనిపోయెను.(సముద్రములో వదిలాడు) నీవు సముద్రమున ప్రవేశించు చుండగా, ఆ సత్యవ్రతుడు తనకు కల్పాంతమును (ప్రళయమును) చూడవలెననెడి కోరికగల అతనికి ఏడుదినములు వేచియుండమని చెప్పావు, ఆ సముద్రగర్భమున అంతర్ధానమయితివి.

**32–5 శ్లో.**

**ప్రాప్తే త్వదుక్తేఽహని వారిధారాపరిప్లుతే భూమితలే మునీంద్రః ।**
**సప్తర్షిభిః సార్థమపారవారిణ్యుద్ ఘూర్ణమానః శరణం యయౌ త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ –ఉక్తే = నీవు చెప్పిన, అహని= రోజు (న ఉపాహరంతి అస్మిన్ కర్మాణి దీనిలో తమతమ పనులు చేసుకొందురు. దినము), ప్రాప్తే= రాగా, భూమితలే= భూమి, వారిధారాపరిప్లుతే= నీటిధారలతో నిండిపోగా, ముని–ఇంద్రః

సప్త–ఋషిభిః సార్థమ్ = మునీంద్రులయిన సప్తర్షులతో కలిసి, అపారవారిణి= ప్రళయాబ్ధిలో, ఉద్ఘూర్ణమానః = సంభ్రాంతుడై, త్వామ్= నిన్ను, శరణం యయౌ= సత్యవ్రతుడు శరణం కోరాడు.

**తాత్పర్యము:** ప్రభూ! నీవు చెప్పినరోజు రాగా భూమి నీటిధారలతో నిండిపోయింది.. 'సత్యవ్రతుడు ' సప్తర్షులతో కలిసి నిన్ను శరణుకోరాడు.

**32–6 శ్లో.**
**ధరాం త్వదాదేశకరీమవాప్తాం నౌరూపిణీమారురుహుస్తదా తే ।**
**తత్కంపకంప్రేషు చ తేషు భూయస్త్వమంబుధేరావిరభూర్మహీయాన్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ ఆదేశకరీమ్= నీ ఆదేశమునను సరించి, ధరాం= భూమి, నౌరూపిణీమ్= నౌకరూపమును(నయతి పారమ్ నదిని దాటించునది. నౌక), అవాప్తాం= పొందగా, తదా= అప్పుడు, ఆరురుహుః = సప్తర్షులు, సత్యవ్రతుడు ఆ నౌకను ఎక్కారు, తత్ –కంప = ప్రళయకాలములో వీస్తున్న గాలులకు ఆ నౌక కంపించగా (కంపః శరీరావయవానాం కంపనమ్ శరీరావయములు కంపించుట), తేషు చ= సత్యవ్రత సప్తర్షులుకూడా, కంప్రేషు =ఊగిపోయారు. (కంపనం శీలం అస్య – కంపించునది), భూయః తు= మరలా, తే= నువ్వు, అయమ్అంబుధేః= ఆమహాసముద్రమున, ఆవిర్భూః = పుట్టావు.

**తాత్పర్యము:** అప్పుడు నీ ఆదేశమునను సరించి భూమి నౌకరూపమును ధరించి రాగా సప్తర్షులు, సత్యవ్రతుడు ఆ నౌకను ఎక్కారు. ప్రళయకాలములో వీస్తున్న గాలులకు ఆ నౌక కంపించగా ఆ సమయమున మరలా నీవు ఆమహాసముద్రమున గొప్పగా మత్స్యావతారునిగా పుట్టావు.

**32–7 శ్లో.**
**ఝషాకృతిం యోజనలక్షదీర్ఘాం దధానముచ్చైస్తరతేజసం త్వామ్ ।**
**నిరీక్ష్య తుష్టా మునయస్త్వదుక్త్యా త్వత్తుంగశృంగే తరణిం బబంధుః ॥**

**ప్రతిపదార్థము:** యోజనలక్షదీర్ఘాం= లక్షయోజనముల పొడవు ఉన్న(యోజయతి

తస్య భావః కర్మ వా కలుపుట ఎనిమిది కిలోమీటర్లు), ఝష –ఆకృతిం = మత్స్యావతారమును (ఝష్యతే బధ్యతే భక్షణాయ – తినుటకు చంపబడునది. చేప), దధానమ్= ధరించిన, ఉచ్చైః తర తేజసం = మిక్కిలి ప్రకాశముగా ఉన్న, త్వామ్= నిన్ను, నిరీక్ష్య= చూసి, మునయః= ఋషులు, తుష్టాః = సంతుష్టులై, త్వత్ –ఉక్త్యా = నీ మాటతో, త్వత్ తుంగశృంగే = నీ ఉన్నతమైన శృంగమునకు (కొమ్ముకు), తరణిం = తాము ఉన్న నౌకను (తరతి పాపం అంధకారం అనేనదీనితో అంధకారమును, పాపమును దాటుదురు. సూర్యుడు కిరణములు నౌక), బబంధుః= కట్టారు.

**తాత్పర్యము:** లక్షయోజనముల పొడవు ఉన్న – మిక్కిలి ప్రకాశముగా ఉన్న నీ "మత్స్యావతారమును" చూచిన ఋషులు సంతుష్టులై నీ మాటతో వారు తాము ఉన్న నౌకను నీ ఉన్నతమైన 'శృంగమునకు'(కొమ్ముకు) కట్టారు.

**32–8 శ్లో.**
**ఆకృష్టనౌకో మునిమండలాయ ప్రదర్శయన్ విశ్వజగద్విభాగాన్ ।**
**సంస్తూయమానో నృవరేణ తేన జ్ఞానం పరం చోపదిశన్నచారీః ॥**

**ప్రతిపదార్థము:** ఆకృష్ట నౌకః= ఆ కట్టిన నౌకను నీవు లాగుకొని పోతూ, నిమండలాయ= సత్యవ్రత సప్తర్షులకు, విశ్వజగత్ విభాగాన్= విశ్వములో అనేక విభాగములను, ప్రదర్శయన్= ప్రదర్శించి, నృవరేణ= ఆ సత్యవ్రతునిచే (నయతి కాలంకాలము గడుపువాడు. మనిషి. మనుష్యులలో గొప్పవాడు రాజు), సంస్తూయమానః = చక్కగా పొగడబడి, తేన = అతనికి, జ్ఞానం పరం చ =శాస్త్ర , బ్రహ్మ జ్ఞానములను, ఉపదిశన్ = ఉపదేశించి, అచారీః= విహరించావు.

**తాత్పర్యము:** ఆ కట్టిన నౌకను నీవు లాగుకొని పోతూ , మునులకు విశ్వములో అనేక విభాగములను ప్రదర్శించి ఆ సత్యవ్రతునిచే పొగడబడి అతనికి పరతత్వజ్ఞానమును బోధించి విహరించావు..

**32-9 శ్లో.**

**కల్పావధౌ సప్త మునీన్ పురోవత్ ప్రస్థాప్య సత్యవ్రతభూమిపం తమ్ ।**
**వైవస్వతాఖ్యం మనుమాదధానః క్రోధాద్దయగ్రీవమభిద్రుతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** కల్ప –అవధౌ= కల్పాంతములో (ప్రళయకాలము ముగిసిపోగా), సప్త మునీన్= ఏడుగురు మునులను, పురోవత్ = పూర్వ కల్పము వలె, ప్రస్థాప్య= వారి వారి స్థానములకు చేర్చి అధికారములు ఇచ్చి, సత్యవ్రతభూమిపం= ఆ'సత్యవ్రత మహారాజుని, వైవస్వత–ఆఖ్యం = వైవస్వతుడను పేరు గల, మనుమ్ = మనువుగ (మన్యతే తలచుకొన్నవాడు), ఆదధానః= చేసావు, క్రోధాత్ = మిక్కిలి కోపముతో, అభిద్రుతః = (అభిద్రుతః పలాయితః ఆక్రాంతో వా – పారిపోయిన వాడయిన), హయగ్రీవమ్= వేదములను అపహరించిన ఆ 'హయగ్రీవుని'పైకి, అభూః= దండెత్తావు.

**తాత్పర్యము:** కల్పాంతములో (ప్రళయకాలము ముగిసిపోగా), ఏడుగురు మునులను పూర్వ కల్పము వలె వారి వారి స్థానములకు చేర్చి అధికారములు ఇచ్చి 'సత్యవ్రతునిని' వైవస్వత మనువును చేసావు.. తరువాత వేదములను అపహరించిన ఆ 'హయగ్రీవుని'పైకి మిక్కిలి కోపముతో దండెత్తావు.

**విశేషాలు**

**సప్తర్షులు:** మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు.

కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు అనువారు ఏడ్వురును సప్తర్షులు అని కొందఱు వాడెదరు.

**32-10 శ్లో.**

**స్వతుంగశృంగక్షతవక్షసం తం నిపాత్య దైత్యం నిగమాన్ గృహీత్వా ।**
**విరించయే ప్రీతహృదే దదానః ప్రభంజనాగారపతే। ప్రపాయాః ॥**

**ప్రతిపదార్థము:** ప్రభంజన–ఆగారపతే= గురువాయూరు దేవా! (ప్రభంజతి

వృక్షాదీన్ వృక్షాదులను పెకిలించునది. వాయువు) (ఆసమంతాత్ ఋచ్ఛతి గచ్ఛతి ప్రాప్నోతి వస్తుజాతం అసౌ వస్తుజాతమును పొందునది, ఆగారము), స్వతుంగశృంగ = మత్స్యావతారములో నీ బలమైన ఉన్నతమగు కొమ్ముతో (స్వ=సు అవతి రక్షించునది. బలము), క్షత వక్షసం = ఆ హయగ్రీవ రాక్షసుని వక్షస్థలమును కొట్టి (క్షతః తాడితః విత్థః – గాయపడినవాడు), తం దైత్యం నిపాత్య = ఆ రాక్షసుని సంహరించి, నిగమాన్ గృహీత్వా= వాడు అపహరించిన వేదాలను గ్రహించి, ప్రీతహృదే = సంతోషించిన హృదయము కలిగిన, విరించయే= బ్రహ్మకు, దదానః = ఆ వేదాలను ఇచ్చావు, ప్రపాయాః = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** గురవాయూరు దేవా! నీ ఉన్నతమగు కొమ్ముతో ఆ హయగ్రీవ రాక్షసుని వక్షస్థలమును చీల్చి వధించావు. ఆ రాక్షసునినుండి వేదాలను గ్రహించి బ్రహ్మకు ఇచ్చి ఆనందింపజేసావు.. నన్ను రక్షించు.

**అష్టమ స్కంధము పూర్తి**

**32వ దశకము సమాప్తము.**

# నవమ స్కంధము

## దశకమ్ 33 – అంబరీషచరితము

**33-1 శ్లో.**

**వైవస్వతాఖ్యమనుపుత్ర నభాగజాత–**
**నాభాగనామక నరేంద్రసుతోఽమ్బరీషః ।**
**సప్తార్ణవావృతమహీదయితోఽపి రేమే**
**త్వత్సంగిషు త్వయి చ మగ్నమనాస్సదైవ ॥**

**ప్రతిపదార్థం:** వైవస్వత–ఆఖ్య మనుః = వైవస్వత మనువు యొక్క, పుత్రః= కుమారుడు, నభాగః = నభాగుడు, నాభాగనామకః జాతః = ఆ నభాగుని కుమారుడు నాభాగుడు, నర –ఇంద్రసుతః = ఆ రాజశ్రేష్ఠుడయిన నాభాగుని కుమారుడు, అమ్బరీషః='అంబరీషుడు'. (అంబతే పచ్యతే అత్ర కర్మవిపాకదాయకః), సప్త–ఆర్ణవ–ఆవృత = సప్తసముద్రములు ఆవరణగాగల (1. లవణసముద్రము, 2. ఇక్షుసముద్రము, 3. సురాసముద్రము, 4. సర్పిస్సముద్రము, 5. దధిసముద్రము, 6. క్షీరసముద్రము, 7. జలసముద్రము), మహీ = భూమండలమును పాలించు, దయితః అపి= సార్వభౌముడయినప్పటికి (దయతే రక్షణాదికం కరోతి రక్షించువాడు. భర్త), త్వత్ –సంగిషు= నీ భక్తులయందు, త్వయి చ= నీయందు కూడా, సదా= ఎప్పుడూ, మగ్నమనాః ఏవ= నిమగ్నుడై, రేమే= ఆనందంతో ఉండేవాడు.

**తాత్పర్యం:** వైవస్వత మనువు యొక్క కుమారుడు నభాగుడు. ఆ నభాగుని కుమారుడు నాభాగుడు. ఈ నాభాగుని కుమారుడు 'అంబరీషుడు'. అంబరీషుడు సప్తసముద్రములు ఆవరణగాగల భూమండలమును పాలించు సార్వభౌముడే అయినప్పటికి నీయందు నీభక్తుల సేవయందు ఎప్పుడూ నిమగ్నుడై ఆనందంతో ఉండేవాడు.

**33-2 శ్లో.**
**త్వత్ప్రీతయే సకలమేవ వితన్వతోఽస్య**
**భక్త్యైవ దేవ న చిరాదభృథాః ప్రసాదమ్ ।**
**యేనాస్య యాచనమృతేఽప్యభిరక్షణార్థం**
**చక్రం భవాన్ ప్రవితతార సహస్రధారమ్ ॥**

**ప్రతిపదార్థం:** దేవ = ఓ గురువాయూరు దేవా!, సకలమ్= లౌకిక వైదిక కర్మ కలాపమంతయూ, త్వత్ -ప్రీతయే ఏవ=నీ ప్రీతి కొరకే, వితన్వతః= చేసేవాడు, అస్య భక్త్యా –ఏవ= తన భక్తికి, న చిరాత్= నువ్వు అల్ప కాలములో, ప్రసాదమ్ అభృథాః = అనుగ్రహము దయ చేసావు. (ప్రసీదతి ప్రసన్నో భవతి తస్య భావః కర్మ వా అనుగ్రహము), యేన= అనుగ్రహముతో, అస్య అభిరక్షణ-అర్థం=అతని రక్షణ కొరకు ( శత్రు నివారణ కొరకు), యాచనమ్ –ఋతే-అపి = అతడు అడుగ కున్నను(యాచతే తస్య భావః-యాచనము యాచించువాడు), భవాన్= నువ్వు, సహస్రధారమ్= వేయిఅంచులుగల, చక్రం = చక్రాయుధమును, ప్రవితతార=ఇచ్చావు.

**తాత్పర్యం:** అంబరీషుడు తను చేయు సకలకర్మలను (లౌకిక వైదిక కర్మ కలాపమంతయూ) నీ ప్రీతి కొరకే చేయుచూ భక్తితో కొద్ది కాలములోనే నీ అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. ఆ అంబరీషునకు, అతడు అడుగ కున్నను రక్షణార్థము, వేయిఅంచులుగల చక్రాయుధమును ఇచ్చావు.

**33-3 శ్లో.**
**స ద్వాదశీవ్రతమథో భవదర్చనార్థం**
**వర్షం దధౌ మధువనే యమునోపకంఠే ।**
**పత్న్యా సమం సుమనసా మహతీం వితన్వన్**
**పూజాం ద్విజేషు విసృజన్ పశుషష్టికోటిమ్ ॥**

**ప్రతిపదార్థం:** అథః = అటుపిమ్మట, సః = అంబరీషుడు, యమునా-ఉపకంఠే= యమునానదీ తీరమునగల (ఉపగతః కంఠమ్ గొంతువరకు చుట్టుప్రక్కల),

మధువనే= మధువనమునందు (మధునా దైత్యేన కృతం వనమ్ మధువను దైత్యునిచే నిర్మింపబడిన వనము. చెఱుకుతోట), సుమనసా = భక్తితో, భవత్ అర్చన–అర్థం= నీ అర్చన కొరకు, వర్షం = ఒక సంవత్సర కాలము, ద్వాదశీ–వ్రతమ్ = ద్వాదశీవ్రతమును (ద్వాదశానాం పూరణీ తిథిః – పన్నెండును పూరించునది. ద్వాదశీ తిథి), దధ = భక్తితో ఆచరించెను, పత్న్యా సమం = భార్యతో కలిసి, హతీం = అన్ని రకాల కానుకలు మరియు మహాభిషేక యుక్తమైన, పూజాం= పూజను, వితన్వన్ =చేసి, ద్విజేషు = బ్రాహ్మణులకు, పశు షష్టికోటిమ్= అరువది కోట్ల గోవులను, విసృజన్= దానము చేసెను.

**తాత్పర్యం:** అటుపిమ్మట అంబరీషుడు యమునానదీ తీరమునగల మధువనమునందు భక్తితో నీ అర్చన కొరకు ఒక సంవత్సర కాలము ద్వాదశీ వ్రతమును భక్తితో ఆచరించెను .భార్యతో కలిసి అన్ని రకాల కానుకలు మరియు మహాభిషేక యుక్తమైన పూజను చేసి బ్రాహ్మణులకు అరువది కోట్ల గోవులను దానము చేసెను.

**33–4 శ్లో.**

**తత్రాఽథ పారణదినే భవదర్చనాంతే**
**దుర్వాససాస్య మునినా భవనం ప్రపేదే ।**
**భోక్తుం వృతశ్చ స నృపేణ పరార్తిశీలో**
**మందం జగామ యమునాం నియమాన్ విధాస్యన్ ॥**

**ప్రతిపదార్థం:** అథ = అటు పిమ్మట, భవత్ అర్చన – అంతే =నీ పేరున చేయుచున్న ద్వాదశీ వ్రతము పూర్తి అగు సమయమున, పారణదినే= తీర్థప్రసాదములను స్వీకరించు ద్వాదశ ఘడియలు వచ్చిన రోజున (పారయతి వ్రతాంతం గమయతి పారణాంత భోజనమ్ వ్రతాంత భోజనము), అస్య దుర్వాసస మునినా=దూర్వాస మహాముని (దుష్టం వాసః వసనం యస్యః – మలిన వస్త్రములు కలవాడు బట్టలు వేయనివాడు) దుర్వాసముని, భవనం = అంబరీషుని రాజ భవనమునకు, ప్రపేదే= వచ్చెను, స నృపేణ = ఆ అంబరీషుడు, భోక్తుం వృతః చ= ఆ మునీశ్వరుని తనతో కలిసి తినవలసినదని కోరెను, పర–ఆర్తిశీలః= పరపీడా నిరతుడైన ఆ దూర్వాసుడు,

నియమాన్= స్నానాది కార్యక్రమములను, విధాస్యన్= చేయుటకు, యమునాం = యమునా నదికి, మందం= నెమ్మదిగా, జగామ = వెళ్ళెను. (పారణ కాలాన్ని అతిక్రమించుటకు నెమ్మదిగా వెళ్ళెనని భావం)

**తాత్పర్యం:** 'ద్వాదశీవ్రతము' ముగిసి, తీర్థప్రసాదములను స్వీకరించు ( పారణ) ద్వాదశ ఘడియలు రాగా ఆసమయములో 'దూర్వాస మహాముని' అంబరీషుని రాజ భవనమునకు వచ్చెను. ఆ అంబరీషుడు ఆ మునీశ్వరుని తనతో కలిసి తినవలసినదని కోరెను. పరపీడా నిరతుడైన ఆ దూర్వాసుడు స్నానాది కార్యక్రమములను చేయుటకు యమునా నదికి నెమ్మదిగా వెళ్ళెను.

**33–5 శ్లో.**
**రాజ్ఞాఽథ పారణ ముహూర్తసమాప్తిఖేదాద్**
**వారైవ పారణమకారి భవత్పరేణ ।**
**ప్రాప్తో మునిస్తదథ దివ్యదృశా విజానన్**
**క్షిపన్ కృధోద్ధృతజటో వితతాన కృత్యామ్ ॥**

**ప్రతిపదార్థం:** అథ = అటుపిమ్మట, పరేణ= నీ భక్తశిరోమణి అయిన, రాజ్ఞా = రాజయిన అంబరీషునికి, పారణ ముహూర్త సమాప్తిఖేదాత్ = ఉపవాసము ముగించి ప్రసాదము స్వీకరించు పారణ ముహూర్తము సమాప్తి అగునను విచారముతో, వారా= నీటిని స్వీకరించి (వారయతి తృష్ణామ్ దప్పిని వారించునది. జలము), పారణమ్ =పారణమును, అకారి భవత్ = పూర్తి చేసెను, అథ= అటుపిమ్మట, తత్ = ఆ అంబరీషుని పారణ కార్యక్రమమును, దివ్య దృశా = దివ్య దృష్టితో, విజానన్= తెలుసుకొని, మునిః = దుర్వాస మహాముని, ప్రాప్తః =అంబరీషుని కడకు వచ్చి, కృధా= క్రోధముతో( రాజు తను రాకుండా పారణ చేసాడని కోపము), క్షిపన్ = తీవ్రంగా ఆక్షేపిస్తూ, ఉద్ధృత జటః= తన జట నుండి ఒక పాయను తీసి, కృత్యామ్= 'కృత్యను' (ఒక హింసా పూరిత శక్తిని) (క్రియతే ఇతి క్రియ–కార్యము. ఒక క్షుద్ర దేవత), వితతాన=సృష్టించెను.

**తాత్పర్యం:** అటుపిమ్మట నీ భక్తశిరోమణి అయిన రాజయిన అంబరీషుడు

ఉపవాసము ముగించి ప్రసాదము స్వీకరించు పారణ ముహూర్తము సమాప్తి అగునను విచారముతో నీటిని స్వీకరించి పారణమును చేసెను . అటుపిమ్మట ఆ అంబరీషుని పారణ కార్యక్రమమును దివ్య దృష్టితో తెలుసుకొని దుర్వాస మహాముని అంబరీషుని కడకు వచ్చి క్రోధముతో( రాజు తను రాకుండా పారణ చేసాడని కోపము) తీవ్రంగా ఆక్షేపిస్తూ తన జట నుండి ఒక పాయను తీసి 'కృత్యను' (ఒక హింసా పూరిత శక్తిని) సృష్టించెను.

**33-6 శ్లో.**

**కృత్యాం చ తామసిధరాం భువనం దహంతీం**
**అగ్రేఽభివీక్ష్య నృపతిర్న పదాచ్చకంపే ।**
**త్వద్భక్తబాధమభివీక్ష్య సుదర్శనం తే**
**కృత్యానలం శలభ యన్మునిమన్వధావీత్ ॥**

**ప్రతిపదార్థం:** తామ్ కృత్యాం చ='దూర్వాసునిచే' సృష్టించబడిన ఆ 'కృత్య', అసిధరాం= ఖడ్గము ధరించి(కత్తి అంచు వలె పదునైన నాలుకలు అల్లారుస్తూ)( అస్యతే నిరస్యతే శత్రుః అనేన – శత్రువును ఓడించునది. ఖడ్గము), భువనం దహంతీం = లోకములను కాలుస్తున్నప్పటికి, అగ్రే= ఎదురుగా ఉన్న, నృపతిః= అంబరీషుడుఅను రాజు, అభివీక్ష్య= దానిని చూసి కూడా, పదాత్ = ఉన్న చోటు నుంచి ఒక్క అడుగు కూడా, న చకంపే= కదలలేదు, త్వత్ భక్తబాధమ్ =నీ భక్తుని బాధను, అభివీక్ష్య = చూసి, తే సుదర్శనం= నీ సుదర్శన చక్రము, కృత్యా = కృత్య ను, అనలం శలభయన్ = నిప్పులో పడిన మిడుతలా చేసి(శలతి ఇతస్తతో గచ్ఛతి ఇటునటు వెళ్లునది. మిడత), మునిమ్=దూర్వాసమహాముని, అన్వధావీత్= వెంటపడెను.

**తాత్పర్యం:** 'దూర్వాసునిచే' సృష్టించబడిన ఆ 'కృత్య' – ఖడ్గము ధరించి(కత్తి అంచు వలె పదునైన నాలుకలు అల్లారుస్తూ) లోకములను కాలుస్తున్నప్పటికి 'అంబరీషుడు' ఉన్న చోటు నుంచి ఒక్క అడుగు కూడా కదలలేదు. అప్పుడు నీవు భక్తుని బాధను చూసి ప్రసాదించిన నీ సుదర్శన చక్రము – నీ భక్తుని కష్టమును చూచి– కృత్య ను నిప్పులో పడిన మిడుతలా చేసి 'దూర్వాసముని' వెంటపడెను.

**33–7 శ్లో.**

**ధావన్నశేషభువనేషు భియా స పశ్యన్**

**విశ్వత్రచక్రమపి తే గతవాన్ విరించమ్ ।**

**కః కాలచక్రమతిలంఘయతీత్యపాస్తః**

**శర్వం యయౌ స చ భవంతమవందతైవ ॥**

**ప్రతిపదార్థం:** సః= ఆ దూర్వాసుడు, భియా =సుదర్శన చక్ర భయముతో, అశేషభువనేషు= సకల లోకములలో, ధావన్ = పరుగెత్తుచూ, విశ్వత్ర= అంతటా, తే= నీయొక్క, చక్రమ్ అపి = సుదర్శన చక్రమును, పశ్యన్= చూస్తూ, విరించమ్ = బ్రహ్మ దేవుని దగ్గరకు, గతవాన్ = వెళ్ళెను, కః కాల చక్రమ్ = ఎవడు కాలచక్రమును (చక్రాకారమున తిరుగు కాలము), అతిలంఘయతి= అతిక్రమింపగలడు, ఇతి= అని, అపాస్తః = అతడు దూర్వాసుని తిరస్కరించెను (అపదూరే అస్తం క్షిప్తమ్ దూరం చేయబడ్డది వెళ్ళిపోయినవాడు తిరస్కరింపబడ్డవాడు), శర్వం = శివుని దగ్గరకు(శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), యయౌ= దూర్వాసుడు వెళ్ళెను, సః చ = అతడును(శివుడును), భవంతమ్ = నీకు, అవందత ఏవ= నమస్కారము పెట్టెను.

**తాత్పర్యం:** ఆ దూర్వాసుడు సుదర్శన చక్ర భయముతో సకల లోకములలో పరుగెత్తుచూ అంతటా నీయొక్క సుదర్శన చక్రమును చూస్తూ బ్రహ్మ దేవుని దగ్గరకు వెళ్ళెను . ఎవడు కాలచక్రమును అతిక్రమింపగలడు అని అతడు దూర్వాసుని తిరస్కరించెను. శివుని దగ్గరకు దూర్వాసుడు వెళ్ళెను. అతడును (శివుడును) నీకు నమస్కారము పెట్టెను.( ఈ సుదర్శన చక్రమును ధరించు శ్రీ హరిని శరణము పొందుమను దూర్వాసునికి బోధించెడి అభిప్రాయముతో శ్రీ హరికి శివుడు నమస్కారము పెట్టెనని భావం)

**33–8 శ్లో.**

**భూయో భవన్నిలయమేత్య మునిం నమంతం**

**ప్రోచే భవానహమృషే నను భక్తదాసః ।**

**జ్ఞానం తపశ్చ వినయాన్వితమేవ మాన్యం**
**యాహ్యంబరీషపదమేవ భజేతి భూమన్ ॥**

**ప్రతిపదార్థం:** భూమన్= బహోర్భావః – అధికమయినవాడా!, భూయః= మరలా, భవత్ నిలయమ్= నీ స్థానమయిన వైకుంఠము, ఏత్య= చేరి, నమంతం= నమస్కరించి శరణు కోరిన, మునిం= మునితో, భవాన్ = నువ్వు, ఋషే = ఓ దూర్వాసుడా, అహమ్ = నేను, భక్తదాసః నను = భక్తులకు దాసుడను కదా. (దాస్యతే దీయతే అన్నాదికం అస్మై ఇతనికి అన్నాదులు ఇవ్వబడును. సేవకుడు), జ్ఞానం= జ్ఞానము (జానాతి తస్య భావఃతెలుసుకొనుట. జ్ఞానము), తపః చ= తపస్సు కూడా, వినయ అన్వితమ్ –ఏవ= వినయముతో కూడుకొన్నప్పుడు, మాన్యం హి= గౌరవ పాత్రములవుతాయి కదా. (మాన్యతే పూజ్యతే అసౌ పూజ్యుడు, మాన్యుడు), యా అంబరీష పదమ్ ఏవ= ఏ నా భకుడైతే ఉన్నాడో ఆ అంబరీషుని పాదములను, భజ = సేవింపుము, ఇతి = అని, ప్రోచే= చెప్పావు.

**తాత్పర్యం:** అధికమయినవాడా! నీ స్థానమయిన వైకుంఠము చేరి నమస్కరించి శరణు కోరిన మునితో “ఓ దూర్వాసుడా! నేను భక్తులకు దాసుడను. జ్ఞానము తపస్సు కూడా వినయముతో కూడుకొన్నప్పుడు గౌరవ పాత్రములవుతాయి.. (నిశ్శ్రేయసమును కలిగించును. దుర్వినీతునకు ఈ జ్ఞాన తపములు సుఖమును కలిగింపవని భావం) ఆ అంబరీషుని పాదములను సేవింపుము'' అని చెప్పావు

**33–9 శ్లో.**
**తావత్ సమేత్య మునినా స గృహీతపాదో**
**రాజాఽపసృత్య భవదస్త్రమసావనౌషీత్ ।**
**చక్రే గతే మునిరదాదఖిలాశిషోఽస్మై**
**త్వద్భక్తిమాగసి కృతేఽపి కృపాం చ శంసన్ ॥**

**ప్రతిపదార్థం:** తావత్ = ఆ తరువాత నీ మాట తలదాల్చి, సమేత్య = అంబరీషుని వద్దకు తిరిగివచ్చిన, సః మునినా= ఆ దుర్వాస మహా ముని, గృహీతపాదః =తన పాదములు పట్టుకొనబోగా, అసౌ రాజా= ఆ అంబరీషుడు, అపసృత్య = నివారించి,

భవత్ అస్త్రమ్ = నీ సుదర్శన చక్రమును (అస్యతే క్షిప్యతే అసౌ విసరబడునది. బాణము మొదలగునవి), అనౌషీత్= స్తుతించెను, చక్రే గతే= అంబరీషుని ప్రార్థనపై సుదర్శనచక్రము దూర్వాసుని వదలి వెడలిపోగా, మునిః= దూర్వాసుడు, అస్మై= అతనికి, అగసి= కృత్య ఉత్పాదన అపరాధము, కృతే అపి = చేసినప్పటికి, కృపాం = అపకారము చేయక చూపించిన దయను, త్వత్ భక్తిమ్ చ శంసన్= నీ పై అంబరీషుని కి గల భక్తిని పొగిడి, అఖిల ఆశిషః= అన్ని రకముల ఆశీర్వచనములను, అదాత్ =అతనికి ఇచ్చెను.

**తాత్పర్యం:** ఆ తరువాత నీ మాట తలదాల్చి అంబరీషుని వద్దకు తిరిగివచ్చిన ఆ దుర్వాస మహా ముని తన పాదములు పట్టుకొనబోగా ఆ అంబరీషుడు నివారించి నీ సుదర్శన చక్రమును స్తుతించెను. అంబరీషుని ప్రార్థనపై సుదర్శనచక్రము దూర్వాసుని వదలి వెడలిపోగా దూర్వాసుడు అతనికి కృత్య ఉత్పాదన అపరాధము చేసినప్పటికి అపకారము చేయక చూపించిన దయను నీ పై అంబరీషుని కి గల భక్తిని పొగిడి అన్ని రకముల ఆశీర్వచనములను అతనికి ఇచ్చెను

**33-10 శ్లో.**

**రాజా ప్రతీక్ష్య మునిమేకసమామనాశ్వాన్**
**సంభోజ్య సాధు తమృషిం విసృజన్ ప్రసన్నమ్ ।**
**భుక్త్వా స్వయం త్వయి తతోఽపి దృఢం రతోఽభూత్**
**సాయుజ్యమాప చ స మాం పవనేశ పాయాః ॥**

**ప్రతిపదార్థం:** రాజా = అంబరీషుడు, ఏకసమామ్= ఒక సంవత్సర కాలము(సమయతి వికలయతి భావాన్ భావములను మార్చునది సంవత్సరము), అనాశ్వాన్ = నిరాహారుడై, నీరు మాత్రమే తాగి – (న అశ్నాతి భోజనము చేయనివాడు), మునిమ్ ప్రతీక్ష్య = చక్రము వెంట పడగా పరుగెత్తిన ఆ దూర్వాస మునీశ్వరుని రాకకై ఎదురు చూస్తూ, భుక్త్వా= ఆ ఎదురు చూసిన దూర్వాసుడు వచ్చిన పిదప చక్కగా అతనికి విందు చేసి, స్వయం= తాను కూడా, సాధు సంభోజ్య= ఆ ముని తినగా మిగిలిన ఆహార శేషమును చక్కగా భుజించి, తమ్ ఋషిం= ఆ ఋషిని, ప్రసన్నమ్ విసృజన్= చక్కగా సాగనంపి(ప్రసన్నః స్వచ్ఛః పవిత్రః సంతుష్టో

వా స్వచ్ఛము పవిత్రము సంతోషము), తతః= అటు పిమ్మట, త్వయి= నీయందు, దృఢం రతః అపి అభూత్ = మునుపటికంటె ధృడభక్తి కలిగి (రతః అనురక్తః – అనురాగము), సః= ఆ అంబరీషుడు, సాయుజ్యమ్ చ= నీ సాయుజ్యమును, ఆప = పొందెను, పవన –ఈశ= ఓ గురువాయూరు దేవా!, మాం= నన్ను, పాయాః= రక్షించుము.

**తాత్పర్యం:** ఆ దూర్వాసమునిని తరిమి సుదర్శనచక్రము తిరిగి అంబరీషుని వద్దకు చేరుటకు ఒక సంవత్సర కాలము పట్టింది. . అంబరీషుడు ఆ సంవత్సర కాలము నిరాహారుడై, నీరు మాత్రమే తాగి – ఆ దూర్వాస మునీశ్వరుని రాకకై ఎదురు చూస్తూ ,ఆ ఎదురు చూసిన దూర్వాసుడు వచ్చిన పిదప, చక్కగా అతనికి విందు చేసి తాను కూడా ఆ ముని తినగా మిగిలిన ఆహార శేషమును భుజించి ,ఆ ఋషిని చక్కగా సాగనంపి, అటు పిమ్మట నీయందు మునుపటికంటె ధృడభక్తి కలిగి, ఆ అంబరీషుడు నీ సాయుజ్యమును పొందెను. ఓ గురువాయూరు దేవా! నన్ను రక్షించుము.

**నవమ స్కంధము**

**33వ దశకము సమాప్తము.**

# దశకమ్ 34 – శ్రీరామావతారము –01

**34–1 శ్లో.**

**గీర్వాణైరర్థ్యమానో దశముఖనిధనం కోసలేష్వృశ్యశృంగే**
**పుత్రీయామిష్టిమిష్ట్వా దదుషి దశరథక్ష్మాభృతే పాయసాగ్ర్యమ్ ।**
**తద్భుక్త్వా తత్పురంధ్రీష్వపి తిసృషు సమం జాతగర్భాసు జాతో**
**రామస్త్వం లక్ష్మణేన స్వయమథ భరతేనాపి శత్రుఘ్ననామ్నా ॥**

**ప్రతిపదార్థము:** గీర్వాణైః= దేవతలు (గీః వాఙ్మయం ఏవ వాణః అస్య – వాఙ్మయమే అస్త్రముగా కలవారు దేవతలు), దశముఖ– నిధనం= రావణుని చంపుమని (దశకంఠాః యస్య – పది కంఠములు కలవాడు. రావణుడు), అర్థ్యమానః = ప్రార్థింపగా, కోసలేషు= కోసలమునందు(కుంసయతి ప్రకాశతే తం లాతి బిభర్తి ప్రకాశించునది. ప్రకాశమును ధరించునది. అయోధ్యానగరము), ఋశ్యశృంగే = ఋష్య శృంగుడు(ఋషస్య హరిణస్య శృంగమివ శృంగం యస్య– లేడికొమ్ములవంటి కొమ్ములు కలవాడు. విభాండక మహర్షి కుమారుడు, ఋష్యశృంగుడు), పుత్రీయామ్ ఇష్టిమ్ = పుత్రకామేష్టి (పుత్రస్య ఇచ్ఛా ఆత్మనః పుత్రం కామయతే పుత్ర సంతానము కోరునది(వాడు).) (ఇజ్యతే అసౌ యజ్ఞము), ఇష్ట్వా= నిర్వహించాడు, దశరథ క్ష్మాభృతే = దశరథ మహారాజునకు(దశసు దిక్షు రథో గతో యస్య – పది దిక్కులకు పయనించు రథములు కలవాడు. దశరథుడు, సూర్యవంశపు రాజు), దదుషి = పాయసమును ఈయగా, తత్ పాయస – అగ్ర్యమ్= ఆ దివ్యమైన పాయసమును(పయసి దుగ్ధే సంస్కృతః – పాలలో సంస్కరించబడినది. పాయసము పరమాన్నము.)(అగ్రే భవమ్ ప్రధానము, ముఖ్యము), తిసృషు తత్ పురంధ్రీషు అపి = అతని భార్యలు ముగ్గురు(పురం గేహం రూపాది గుణసంపన్నం వపుర్వా దధాతి రూపగుణాది సంపదలచే శరీరమును ధరించునది. స్త్రీ), భుక్త్వా = భుజించి, సమం జాతగర్భాసు= ఒకేసారి గర్భవతులు కాగా, అథ = అటుపిమ్మట, త్వం = నువ్వు, రామః లక్ష్మణేన భరతేన శత్రుఘ్ననామ్నా = రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల రూపములో (రమ్యతే అనేనేతి వా ఆనందించువాడు. దీనితో ఆనందం పొందుదురు.) (లక్షణం అస్తి అస్య మంచి ఆకారము గలవాడు. లక్ష్మణుడు.)

(భరతి పుష్ణాతి అసౌ పోషించువాడు. భరతుడు.)(శత్రూన్ హంతి శత్రువులను చంపువాడు. దశరథుని కుమారుడు, శత్రుఘ్నుడు), స్వయమ్ అపి = స్వయముగా నువ్వే, జాతః = అవతరించావు.

**తాత్పర్యము:** దేవతలు రావణుని చంపుమని ప్రార్థింపగా, కోసలమునందు ఋష్య శృంగుడు పుత్రకామేష్టి నిర్వహించాడు. దశరథునకు పాయసమును ఈయగా, అతని భార్యలు ముగ్గురు దానిని భుజించి ఒకేసారి గర్భవతులు కాగా, వారియందు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల రూపములో నువ్వే అవతరించావు.

**విశేషాలు**

**ఋశ్యశృంగుడు(ఋష్యశృంగుడు):** ఒకానొక ముని. తలపై ఋశ్యమృగము(ఒక జాతి మగ జింక) కొమ్ము వంటి కొమ్ము గల మహర్షి. దశరథుని పుత్రికయైన శాంత భర్త. విభాండకముని పుత్రుడు.

ఇతఁడు తండ్రికి అతిభక్తితో శుశ్రూష చేయుచు లోకవ్యవహారమును ఒక్కటిని ఎఱుంగక బ్రహ్మచర్యాశ్రమమున అడవియందు ఉండునపుడు, అంగదేశపు రాజు అగు రోమపాదుడు తన దేశము అనావృష్టిచే అవస్థచెంది ఉండుట మాన్పకోరి, 'ఋశ్యశృంగుఁడు ఉండుదేశమున అనావృష్టి ఉండదు' అని పెద్దలవలన ఎఱింగి అతని కొందఱు విలాసినీ జనులగుండ తోడి తెప్పించి, అనావృష్టి మానగానే, అతనికి తన కూతును ఇచ్చి వివాహము చేసెను. ఇతఁడు దశరథునిచే పుత్రకామేష్టి అను యాగము చేయించెను.

**34-2 శ్లో.**
**కోదండీ కౌశికస్య క్రతువరమవితుం లక్ష్మణేనానుయాతో**
**యాతో భూస్తాత వాచా మునికథితమనుద్వంద్వశాంతాధ్వ ఖేదః ।**
**నృణాం త్రాణాయ బాణైర్మునివచనబలాత్ తాటకాం పాటయిత్వా**
**లబ్ధ్వాఽస్మాదస్త్రజాలం మునివనమగమో దేవ సిద్ధాశ్రమాఖ్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ= ఓ గురువాయూరు దేవా!, కౌశికస్య = విశ్వామిత్రుని (కుశిక వంశే భవః - కుశిక వంశంలో పుట్టినవాడు. విశ్వామిత్రుడు), క్రతువరమ్=

శ్రేష్ఠమయిన యాగ, అవితుం=రక్షణకు, కోదండీ= కోదండము ధరించి (కౌతి శబ్దం కరోతి దండః అస్య – శబ్దము చేయు దండము కలది. ధనుస్సు), లక్ష్మణేన = లక్ష్మణుడు, అనుయాతః= నీ వెంట రాగా, తాత వాచా= తండ్రి ఆజ్ఞ చే (తనోతి విస్తారయతి గోత్రాదికమ్ వంశమును విస్తరించువాడు. తండ్రి), యాతః అభూః = వెళ్లి, మునికథిత = విశ్వామిత్రుడు ఉపదేశించిన, మనుద్వంద్వ = బల అతిబల – అను రెండు మంత్రాలమహిమచే, శాంత –అధ్వ ఖేదః = ప్రయాణశ్రమను ఆకలిదప్పికలను జయించావు, మునివచనబలాత్= మునివాక్యబలముతో, నృణాం త్రాణాయ= మానవసంరక్షణకు, బాణైః= బాణములతో, వనమ్ అగమః =అడవికి వెళ్ళి, తాటకాం పాటయిత్వా = తాటకను చంపి, అస్త్రజాలం = అస్త్ర సమూహమును, అస్మాత్ లబ్ధ్వా= విశ్వామిత్రుడు నుండి స్వీకరించి, సిద్ధాశ్రమ–ఆఖ్యమ్= సిద్ధాశ్రమము అను పేరుగల (ఆ ముని ఆశ్రమమునకు వచ్చావు).

**తాత్పర్యము:** విశ్వామిత్రుని యాగరక్షణకు కోదండము ధరించి. లక్ష్మణుడు నీ వెంట రాగా తండ్రి ఆజ్ఞ చే వెళ్లి విశ్వామిత్రుడు ఉపదేశించిన బల అతిబల – అను మంత్రాలమహిమచే ప్రయాణశ్రమను ఆకలిదప్పికలను జయించావు. మునివాక్యబలముతో మానవసంరక్షణకు బాణ సహితుడవై వెళ్ళి తాటకను చంపి, విశ్వామిత్రుడు ఇచ్చిన అస్త్ర సమూహమును స్వీకరించి ఆయన సిద్ధాశ్రమమునకు వచ్చితివి.

**విశేషాలు**

**తాటక:** ఒక రాక్షసస్త్రీ. మారీచ సుబాహువుల తల్లి. కడుక్రూరురాలు. రాముడు విశ్వామిత్రుని యాగమును కాచుటకు పోవునపుడు మధ్యేమార్గమున ఈరాక్షసిని చంపెను. సుకేతుడు అను యక్షుని కూతురు. దీనికి వేయియేనుఁగుల బలముగలదు. దీని మగడు సుందుడు అను యక్షుడు. ఇది భర్తృ మరణానంతరము ఒకనాడు అగస్త్యాశ్రమమునకు పోయి అతనిని బెదరింపపోవ అతడు దీనిని దీని సుతులు అగు మారీచ సుబాహువులను రాక్షసులు అగునటుల శపించెను.

**34–3 శ్లో.**

**మారీచం ద్రావయిత్వా మఖశిరసి శరైరన్యరక్షాంసి నిఘ్నన్**
**కల్యాం కుర్వన్నహల్యాం పథి పదరజసా ప్రాప్య వైదేహగేహమ్ ।**
**భిందానశ్చాంద్రచూడం ధనురవనిసుతామిందిరామేవ లబ్ధ్వా**
**రాజ్యం ప్రాతిష్ఠథాస్త్వం త్రిభిరపి చ సమం భ్రాతృవీరైస్సదారైః ॥**

**ప్రతిపదార్థము:** మారీచం= యజ్ఞంలోమారీచుని (మరీచేః అపత్యం పుమాన్ మరీచుని కుమారుడు. మారీచుడు, రాక్షసుడు), ద్రావయిత్వా= తరిమి, మఖ శిరసి= యజ్ఞ ప్రారంభంలో, శరైః= బాణములచే, అన్య– రక్షాంసి= సుబాహుని ఇతరరాక్షసులను, నిఘ్నన్ = సంహరించి, పథి = మార్గ మధ్యంలో, పదరజసా= మీ పాదధూళిచే, అహల్యాం = అహల్యను (అహని లీయతే దినములో లీనమగునది. రాత్రి.)( న హలాయ యోగ్యమ్ దున్నుటకు యోగ్యము కానిది. బంజరు భూమి), కల్యాం కుర్వన్ =శుద్ధితో ధన్యురాలినిచేసి, వైదేహ గేహమ్ = జనకుని ఇంటికి, ప్రాప్య = వెళ్లి, చాంద్రచూడం ధనుః = శివుని విల్లును, భిందానః = విఱచి, ఇందిరామ్ ఏవ = మహాలక్ష్మియేయైన, అవనిసుతామ్= జానకిని, లబ్ధ్వా= పొంది, స దారైః= భార్యలతో కూడిన, త్రిభిః అపి చ చ సమం భ్రాతృవీరైః= నీ ముగ్గురు మహా వీరులైన తమ్ముళ్లతో, త్వం= నువ్వు, రాజ్యం = మీ రాజధానికి, ప్రాతిష్ఠథాః= ప్రయాణ మయ్యావు.

**తాత్పర్యము:** 3. యజ్ఞంలోమారీచుని తరిమి, బాణములచే సుబాహుని ఇతరరాక్షసులను సంహరించి, అహల్యను మీ పాదధూళిచే ధన్యురాలినిచేసి, జనకుని ఇంటికి వెళ్లి శివుని విల్లు విఱచి, మహాలక్ష్మియైన జానకిని పెండ్లాడి, పెండ్లికూతుర్లతో కూడిన తమ్ములతో మీ రాజధానికి ప్రయాణమయ్యావు..

**విశేషాలు**

**అహల్య:** ఈమె ముద్గలుని కూతురు గౌతమమహర్షి భార్య. దేవేంద్రునితో జారత్వము చేసినందున భర్త ఈమెను శిలయగునట్లు శపించెను. తరువాత బహుకాలమునకు శ్రీరాముఁడు సీతను పెండ్లాడుటకై మిథిలాపట్టణమునకు

పోవుచుండి గౌతమాశ్రమము ప్రవేశించి ఆపాషాణమును మెట్టగానే ఆశాపము తీఱెను.

**34-4 శ్లో.**

**ఆరుంధానే రుషాంధే భృగుకులతిలకే సంక్రమయ్య స్వతేజో**
**యాతే యాతోఽస్యయోధ్యాం సుఖమిహ నివసన్ కాంతయా కాంతమూర్తే ।**
**శత్రుఘ్నైకదాఽథో గతవతి భరతే మాతులస్యాధివాసం**
**తాతారబ్ధోఽభిషేకస్తవ కిల విహతః కేకయాధీశపుత్ర్యా ॥**

**ప్రతిపదార్థము:** కాంతమూర్తే= ఓ ప్రకాశించు గురువాయూరు దేవా! (కామ్యతే ఇతి కోరబడునది. మనోహరమైనది), భృగుకులతిలకే = భృగువంశములో గొప్పవాడయిన పరశురాముడు (భృజ్యతే తపసా శరీరమ్ తపస్సుచే శరీరమును తపింప చేసినవాడు. భృగువు, ఒక మహర్షి), రుషాంధే = రోషాంధకారంతో, ఆరుంధానే = నిన్ను ఎదిరింపగా, యాతే =చివరకు, స్వతేజః= అతని వైష్ణవతేజమును, సంక్రమయ్య= నీయందు సంక్రమింపజేసుకొన్నావు, అయోధ్యాం = అయోధ్యకు (న యోద్ధుం శక్యఃజయించుటకు వీలు కానిది), యాతః అసి = చేరుకొని, ఇహ= ఇచ్చట (అయోధ్యలో), కాంతయా = సీతతో, సుఖమ్ నివసన్ = సంతోషంగా ఉన్నావు, అథః= అటుపిమ్మట, ఏకదా= ఒకప్పుడు, శత్రుఘ్నేన = శత్రుఘ్నునితో, భరతే= భరతుడు, మాతులస్య అధివాసం= మేనమామ ఇంటికి (మా యా మాత్రా తులాం హరతి తల్లితో సమానత్వము పొందువాడు. మామ), గతవతి = వెళ్లగా, తాత= తండ్రి అయిన దశరథునిచే, ఆరబ్ధః తవ అభిషేకః = ఆరంభించిన నీ పట్టాభిషేకము, కేకయ-అధీశపుత్ర్యా= కేకయ రాజు కుమార్తె కైక వలన, విహతః కిల = ఆగిపోయింది కదా! (విశేషేణ హతః వినష్టః - చంపబడినది, నష్టపోయినది).

**తాత్పర్యము:** దారిలో పరశురాముడు రోషముతో నిన్ను ఎదిరింపగా అతని వైష్ణవతేజమును నీయందు సంక్రమింపజేసుకొన్నావు. అయోధ్యకు చేరుకొని సీతతో సంతోషంగా ఉన్నావు.ఆ తరువాత శత్రుఘ్నుడు భరతుడు మేనమామ ఇంటికి వెళ్లగా, దశరథుడు ఆరంభించిన నీ పట్టాభిషేకము కైక వలన ఆగిపోయింది.

**34-5 శ్లో.**

**తాతోక్త్యా యాతుకామో వనమనుజవధూసంయుత శ్చాపధారః**
**పౌరానారుధ్య మార్గే గుహనిలయగతస్త్వం జటాచీరధారీ ।**
**నావా సంతీర్య గంగామధిపదవిపునస్తం భరద్వాజమారాత్**
**నత్వా తద్వాక్యహేతోరతిసుఖమవసచ్చిత్రకూటే గిరీంద్రే ॥**

**ప్రతిపదార్థము:** తాత–ఉక్త్యా = తండ్రి దశరథుడు కైక కు ఇ చ్చిన మాటను చెల్లించుటకు (లోకంలో తండ్రి మాటను అందరు గౌరవించాలని ప్రబోధం), అనుజ= తమ్మునితో(అను పశ్చాత్ జాయతే తరువాత జన్మించువాడు. తమ్ముడు), వధూసంయుతః = ధర్మపత్నితో (ఉహ్యతే పితృగృహాత్ పతిగృహమ్ తండ్రి గృహము నుండి పతి గృహమునకు పోవునది. భార్య), చాపధారః= విల్లు ధరించి (చపస్య వంశభేదస్య వికారః – వెదురుతో చేయబడిన ధనుస్సు), త్వం = నువ్వు, జటాచీరధారీ = జటా చీరధారివై (జటతి పరస్పరం సంలగ్నోభవతి పరస్పరము కలిసి వుండునవి. వెంట్రుకలు)( చినోతి ఆవృణోతి వృక్షమ్ – వృక్షమును కప్పునది. వల్కలము.నారచీర), వనమ్ యాతుకామః = అరణ్యమునకు బయలుదేరావు, మార్గే= నీ మార్గములో వచ్చుచున్న, పౌరాన్= పౌరులను (పురే నగరే భవఃనగరములో వుండువాడు), ఆరుధ్య= రావద్దని ఆపి, గుహనిలయగతః = గుహుని దగ్గరకు వెళ్ళావు, నావా= అతడు సమకూర్చిన నావపై, గంగామ్ సంతీర్య = గంగను దాటి(గమయతి ప్రాపయతి ఉత్తమాం గతిం ఉత్తమాం లోకాన్ వా ఉత్తమగతిని, ఉత్తమ లోకమును చేర్చునది), అధిపదవి = మార్గ మధ్యంలో, పునః= మరలా, ఆరాత్ = దగ్గర్లో ఉన్న, తం భరద్వాజమ్ = ఆ భరద్వాజునికి (భరతి బిభర్తి వాజం అన్నమ్ అన్నమును భరించువాడు, సంపద కలవాడు. భరద్వాజ ఋషి), నత్వా= నమస్కరించి, తత్ వాక్యహేతోః= ఆయన చెప్పినట్లుగా, చిత్రకూటే గిరీంద్రే= చిత్రకూట పర్వతంపై (చిత్రాణి కూటాని శృంగాని యస్య – చిత్రమైన (కూట) శిఖరములు కలది. చిత్రకూట పర్వతము), అతిసుఖమ్ అవసః = సుఖముగా ఉన్నావు.

**తాత్పర్యము:** 5. తండ్రి దశరథుడు కైక కు ఇ చ్చిన మాటను చెల్లించుటకు

తమ్ముని తో ధర్మపత్నితో విల్లు ధరించి అరణ్యమునకు జటా చీరధారివై బయలుదేరావు. పౌరులను రావద్దని ఆపి, గుహుని దగ్గరకు వెళ్ళావు.అతడు సమకూర్చిన నావపై గంగను దాటి భరద్వాజునకు నమస్కరించి ఆయన చెప్పినట్లుగా చిత్రకూట పర్వతంపై సుఖముగా ఉన్నావు.

**34-6 శ్లో.**

**శ్రుత్వా పుత్రార్తిఖిన్నం ఖలు భరతముఖాత్ స్వర్గయాతం స్వతాతం**
**తప్తో దత్వాంబు తస్మై నిదధిథ భరతే పాదుకాం మేదినీం చ ।**
**అత్రిం నత్వాఽథ గత్వా వనమతివిపులం దండకం చండకాయం**
**హత్వా దైత్యం విరాధం సుగతిమకలయశ్చారు భోః శారభంగీమ్ ॥**

**ప్రతిపదార్థం:** భోః = ఓ గురువాయూరు దేవా!, పుత్ర ఆర్తిఖిన్నం= నీకై బాధపడి, స్వతాతం=తన తండ్రి, స్వర్గయాతం= స్వర్గస్థుడయ్యాడను వార్తను, భరత ముఖాత్ = భరతుని వలన, శ్రుత్వా = విని, తప్తః = బాధపడి, తస్మై= అతనికొరకు, అంబు= తర్పణాలు (అమంతి గచ్ఛంతి చేష్టంతే ప్రాణినః యేన - దీనివలన ప్రాణులు జీవింతురు. జలము), దత్వా= ఇచ్చి, భరతే = భరతునకు, పాదుకాం= పాదుకలను (పాదూరేవ పాదుకా పాదుక), మేదినీం చ= రాజ్యమును (మేదః మధుకైటభయోః మేదః కారణం అస్తి అస్యాః - దీనికి మధుకైటభుల కొవ్వు కారణమైనది. భూమి), నిదధిథ= ప్రసాదించి, అత్రిం నత్వా= అత్రిమునికి మ్రొక్కి, అథ = ఆ తరువాత, అతివిపులం దండకం వనమ్ గత్వా = సువిశాల దండకారణ్యములో ప్రవేశించి (దండకారణ్యం జనస్థానమ్ దండకారణ్యము), చండకాయం= భయంకర శరీరము గల, విరాధం దైత్యం= విరాధ రాక్షసుని (విరుద్ధం రాధ్నోతి ప్రవర్తతే విరుద్ధంగా ప్రవర్తించువాడు. విరాధుడను రాక్షసుడు), హత్వా = చంపి, శారభంగీమ్= శరభంగునకు, సుగతిమ్ = మోక్షమును, చారు అకలయః కిల= చక్కగా అనుగ్రహించావు కదా.

**తాత్పర్యము:** 6. నీకై బాధపడి తండ్రి స్వర్గస్థుడయ్యాడను వార్తను భరతుని వలన విని ఆయనకు తర్పణాలు ఇచ్చి, భరతునకు పాదుకలను రాజ్యమును ప్రసాదించి, అత్రిమునికి మ్రొక్కి ఆ తరువాత సువిశాల దండకారణ్యములో ప్రవేశించి భయంకర

శరీరము గల విరాధుని చంపి శరభంగునకు మోక్షము అను గ్రహించావు

**విశేషాలు**

**శర భంగుడు:** దండకారణ్యమున ఉండిన ఒక మహర్షి. ఇతనిని స్వర్గ లోకమునకు పిలుచుకొని పోవ ఇంద్రాదిదేవతలు తామే ఇతని యాశ్రమమునకు వచ్చిరి. రాముఁడు దండకారణ్యమునకు రాగానే అతని దర్శనము చేసికొని శరభంగ మహాముని స్వర్గస్థుడు ఆయెను. ఇతని యాశ్రమము జాహ్నవీనదికి సమీపమున ఉండెను.

**34–7 శ్లో.**
**నత్వాఽగస్త్యం సమస్తాశరనికరసపత్రాకృతిం తాపసేభ్యః**
**ప్రత్యశ్రౌషీః ప్రియైషీ తదను చ మునినా వైష్ణవే దివ్యచాపే ।**
**బ్రహ్మాస్త్రే చాపి దత్తే పథి పితృసుహృదం వీక్ష్య భూయో జటాయుం**
**మోదాద్గోదాతటాంతే పరిరమసి పురా పంచవట్యాం వధూట్యా ॥**

**ప్రతిపదార్థం:** అగస్త్యం= ఆ తరువాత అగస్త్యునకు(అగం వింధ్యం పర్వతం స్త్యాయతి అగస్త్యముని. నక్షత్రము), నత్వా = మ్రొక్కి, సమస్త ఆశర నికర సపత్రాకృతిం= సర్వరాక్షస సంహారము కొరకు (ఆశర=ఆసమంతాత్ శృణాతి హినస్తి హింస పెట్టువాడు. అసురుడు), తాపసేభ్యః= మునులకు, ప్రత్యశ్రౌషీః= ప్రతిజ్ఞ చేసి, తదను= ఆతరువాత, ప్రియైషీ = నీ మేలు కోరువాడయిన, మునినా= అగస్త్యుని నుండి, వైష్ణవే దివ్యచాపే= వైష్ణవాస్త్రమును, బ్రహ్మాస్త్రే చ అపి= బ్రహ్మాస్త్రమును కూడా (బ్రహ్మస్వరూపం అస్త్రమ్ బ్రహ్మాస్త్రము), దత్తే= స్వీకరించి, పథి = మార్గ మధ్యములో, పితృసుహృదం= నీ తండ్రికి మిత్రుడగు, జటాయుం = జటాయువును(జటం సంహతం ఆయుః యస్య – దీర్ఘాయువు కలవాడు. గృధ్రరాజు), వీక్ష్య = చూచి, భూయః= మరలా, మోదాత్ = సంతోషంగా, వధూట్యా= నీ భార్యతో, గోదా తటాంతే= గోదావరీ తీరమందు(గాం జలం స్వర్గం వా దదాతి స్నానేన – జలమును స్నానంతో స్వర్గము నిచ్చునది. గోదావరి), పంచవట్యాం చ= పంచవటిలో (పంచానాం వటానాం సమాహారః – అశ్వత్థ, బిల్వ, వట, ఆమలక, అశోక అనునవి పంచవటములు దండకారణ్యంలోని

పంచవటీ), పురా= పూర్వము, పరిరమసి= ఆనందంగా ఉన్నావు.

**తాత్పర్యము:** 7. ఆ తరువాత అగస్త్యునకు మ్రొక్కి సర్వరాక్షస సంహారము చేసెదనని మునులకు ప్రతిజ్ఞ చేసి అగస్త్యుని నుండి వైష్ణవాస్త్రమును, బ్రహ్మాస్త్రమును కూడా స్వీకరించి మార్గ మధ్యములో నీ తండ్రికి మిత్రుడగు జటాయువు చూచి, నీ భార్యతో గోదావరీ తీరమందు పంచవటిలో ఆనందంగా ఉన్నావు.

**విశేషాలు**

**పంచవటి:** రాముడు వనవాసముచేయునపుడు దండకారణ్యమునందు ఆశ్రమము కావించుకొని ఉన్నచోటు. (అయిదు మఱ్ఱిచెట్ల చేరిక అని శబ్దార్థము.) ఇది గోదావరిపుట్టు తావునకు సమీపమున ఉండును. ఈతావున నాసికాపురి ఉన్నది.

**34–8 శ్లో.**
**ప్రాప్తాయాః శూర్పణఖ్యా మదనచలధృతేరర్థనైర్నిస్సహాత్మా**
**తాం సౌమిత్రౌ విసృజ్య ప్రబలతమరుషా తేన నిర్లూననాసామ్ ।**
**దృష్ట్వైనామ్ రుష్టచిత్తం ఖరమభిపతితం దూషణం చ త్రిమూర్ధం**
**వ్యాహింసీరాశరానప్యయుత సమధికాంస్తత్‌క్షణాదక్షతోష్మా ॥**

**ప్రతిపదార్థం:** శూర్పణఖ్యా ప్రాప్తాయాః = అంతట శూర్పణఖ వచ్చి (శూర్ప ఇవ నఖాః అస్యాః – చేటల వంటి గోర్లు కలది. శూర్పనఖ, రావణుని చెల్లెలు), మదన చలధృతేః = నీ పట్ల మోహపడి (మదయతి మత్తెక్కించువాడు. కామదేవుడు), అర్థనైః =వేడుకొంది కాని నువ్వు నిరాకరించి, నిస్సహాత్మా=అసహ్యపడి, తాం = ఆమెను లక్ష్మణుని కడకు పంపితివి, సౌమిత్రౌ = లక్ష్మణుడును (సుమిత్రాయాః అపత్యమ్ సుమిత్ర కొడుకు), విసృజ్య= ఆమెను విడువగా, ప్రబలతమ రుషా = విపరీత కోపము పొందిన ఆ శూర్పణఖ, తేన= ఆ లక్ష్మణుని చేత, నిర్లూన నాసామ్=కోయబడిన ముక్కు చెవులు కలిగినదిగా మారింది, ఏనామ్ = అలా ఉన్న శూర్పణఖను, దృష్ట్వా= చూసి, రుష్టచిత్తం = రోషపడిన మనస్సులతో, అభిపతితం = ఎదిరించుటకు మీదికి వచ్చిన, ఖరమ్ – దూషణం = ఖరదూషణులను, త్రిమూర్ధం చ= త్రిశిరులతో, అయుతసమ అధికాన్= వారితో ఉన్న పది వేలమంది

కంటె అధికంగా ఉన్న, ఆశరాన్– అపి= రాక్షసులను, తత్క్షణాత్= తక్షణమే, అక్షత– ఊష్మా = అంతులేని పరాక్రమంతో నువ్వు, వ్యాహింసీః = నశింపచేసావు.

**తాత్పర్యము:** అంతట శూర్పణఖ నీ పట్ల మోహపడి నిన్ను వేడుకొంది కాని నువ్వు నిరాకరించి అసహ్యపడి ఆమెను లక్ష్మణుని కడకు పంపితివి. లక్ష్మణుడును ఆమెను విడువగా విపరీత కోపము పొందిన ఆ శూర్పణఖ ముక్కు చెవులను ఆ లక్ష్మణుడు కోసాడు. అలా ముక్కు చెవులు కోల్పోయిన శూర్పణఖను చూసి రోషపడి నీ తో యుద్ధానికి వచ్చిన ఖరదూషణ త్రిశిరులు పది వేలమంది కంటె అధికంగా ఉన్న రాక్షసులను తక్షణమే అంతులేని పరాక్రమంతో నశింపచేసావు.

**విశేషాలు**

**శూర్పణఖ:** రావణుని చెలియలు. దీని మగడు విద్యుజ్జిహ్వుడు కొడుకు జంబుకుమారుడు. రాముడు దండకారణ్యమున ఉండునపుడు ఒకనాడు ఈ శూర్పణఖ అతనిపర్ణశాలకు వచ్చి అతఁడు తన్ను పెండ్లాడవలయును అను తలపున సీతాదేవిని మ్రింగపోగా లక్ష్మణుడు దీని ముక్కుచెవులుకోసి తఱిమెను. అంతట ఇది జనస్థానమునందు ఉన్న తన పినతల్లి కొడుకులు అగు ఖరుడు మొదలగు రక్కసులతో తన అవమానపాటు చెప్పుకోగా ఆరక్కసులు రామునితో పెనుయుద్ధము సలిపిరి.. ఆవల శూర్పణఖ లంకకు పోయి రావణునికి తన భంగపాటు తెలిపి సీతమీద కామము కలుగ బోధించి ఆసీతను వాడు ఎత్తుకొని పోవునట్లు చేసెను

**34–9 శ్లో.**

**సోదర్యా ప్రోక్త వార్తావివశ దశముఖాదిష్టమారీచమాయా–**
**సారంగం సారసాక్ష్యా స్పృహితమనుగతః ప్రావధీర్బాణఘాతమ్ ।**
**తన్మాయాక్రందనిర్యాపిత భవదనుజాం రావణస్తామహార్షీత్**
**తేనార్తోఽపి త్వమంతః కిమపి ముదమధాస్తద్వధోపాయలాభాత్ ॥**

**ప్రతిపదార్థం:** సోదర్యా= చెల్లెలగు శూర్పణఖ, ప్రోక్త= చెప్పిన వార్తా = వార్తను విని, వివశ = ఒళ్లు మరచి వశము తప్పిన (విగతః వశః యస్య–వశంలో లేనివాడు

అధీనంలో లేనివాడు), దశముఖ = రావణునిచే, ఆదిష్టః=ఆదేశింపబడిన, మారీచః= మారీచుడు, మాయా–సారంగం= మాయలేడిగా మారాడు (సరతి గచ్ఛతి వెళ్లునది. చాతక పక్షి లేడి), సారస–అక్ష్యా= పద్మము వంటి కనులు కలిగిన జానకి ( సారసపక్షి కన్నులవంటి కన్నులు గలది అని ఇంకొక అర్థం), స్పృహితమ్= దానిపై (ఆ మాయ లేడిపై)మనసుపడగా(ఈప్సాయాం స్పృహయతి కోరుట), అనుగతః= ఆ బంగారు లేడి వెంటవెళ్ళి, బాణఘాతమ్ = బాణపు దెబ్బతో, ప్రావధీః= దానిని చంపితివి, తత్ = ఆ లేడిరూపమున నున్న మారీచుడు చేసిన, మాయా క్రంద= "హా లక్ష్మణా!" అను మాయతో కూడిన ఆక్రందనమును విని, భవత్ అనుజాం= నీ సోదరుడు లక్ష్మణుడు, నిర్యాపితః = సీత దగ్గర నుండి నీ కడకు పంపబడగా, రావణః = రావణుడు, తామ్= సీతను, అహార్షీత్= హరింపగా, త్వమ్ తేన –ఆర్తః అపి= నీవు బయటికి బాధపడినట్లు కనబడ్డావు కాని, అంతః = చివరకు, తత్ వధ ఉపాయలాభాత్= కాని రావణ వధకు ఉపాయము లభించెనని, కిమ్ అపి ముదమ్ అధాః= లోలోపల కొంచెం ఆనందించితివి.

**తాత్పర్యము:** 9. చెల్లెలగు శూర్పణఖ చెప్పిన వార్తను విని ఒళ్లు మరచి వశము తప్పిన రావణుడు మారీచుని మాయలేడిగా పంపగా, పద్మము వంటి కనులు కలిగిన జానకి దానిపై మనసుపడగా, ఆ బంగారు లేడి వెంట వెళ్ళి దానిని చంపితివి ఆ లేడిరూపమున నున్న మారీచుడు చేసిన ""హా లక్ష్మణా!" అన్న ఆక్రందనమును విని నీ సోదరుడు లక్ష్మణుడు సీతచే పంపబడగా , రావణుడు సీతను హరించాడు. నీవు బయటికి బాధపడినట్లు కనబడ్డావు కాని రావణ వధకు ఉపాయము లభించెనని లోలోపల కొంచెం ఆనందించితివి.

**34–10 శ్లో.**

**భూయస్తన్వీం విచిన్వన్నహృత దశముఖస్త్వద్వధూం మద్వధేనేఽ**
**త్యుక్త్వాయాతే జటాయౌ దివమథ సుహృదః ప్రాతనోః ప్రేతకార్యమ్ ।**
**గృహ్ణానం తం కబంధం జఘనిథ శబరీం ప్రేక్ష్య పంపాతటే త్వం**
**సంప్రాప్తో వాతసూనుం భృశముదితమనాః పాహి వాతాలయేశ ॥**

**ప్రతిపదార్థం:** భూయః = మరలా, తన్వీం = సీతను (తనుః అల్పా కృశాంగీ కృశించిన

అంగములు గలది. స్త్రీ), విచిన్వన్= వెదకుచుండగా, మత్ వధేన = నన్ను చంపి, త్వత్ వధూం= నీ భార్యను, దశముఖః = రావణుడు, అహృతః = అపహరించాడు, ఇతి = అని, ఉక్త్వా = చెప్పి, జటాయౌ = జటాయువు, దివమ్= స్వర్గమునకు, యాతే= వెళ్లగా, అథ=అటుపిమ్మట, సుహృదః= జటాయువునకు, ప్రేతకార్యమ్= పరలోక క్రియలు(ప్రేతస్య మృతస్య కర్మ, దహనాత్ సపిండీకరణపర్యంతం కర్మ – చనిపోయినవానికి కర్మ. దహనము మొదలు సపిండీకరణము వరకు చేయు కర్మ), ప్రాతనోః =చేసి, గృహ్ణానం తం కబంధం= నిన్ను పట్టుకొన్న ఆ కబంధుని(కం శిరః బధ్యతే అస్మాత్ శిరస్సు ఛేదింపబడిన శరీరావయవము. మొండెము), జఘనిథ= చంపి, శబరీం = శబరిని (శబరస్య స్త్రీ, భిల్లపత్నీ శబరుని భార్య. శబరి, రామభక్తురాలు), ప్రేక్ష్య = చూసి, పంపాతటే = పంపానది తీరంలో, త్వం= నువ్వు, వాతసూనుం= వాయుపుత్రుడైన హనుమంతుని (వాత=వాతి స్పృశతి గచ్ఛతి వెళ్లునది, స్పృశించునది. వాయువు), సంప్రాప్తః = కలిసి, భృశ ముదితమనాః= బాగా ఆనందమనుభవించితివి, వాతాలయ–ఈశ= ఓ గురువాయూరు దేవా!, పాహి= రక్షింపుము.

**తాత్పర్యము:** సీతను వెదకుచుండగా "నన్ను చంపి నీ భార్యను రావణుడు అపహరించాడు "అని నీతో చెప్పి జటాయువు స్వర్గమునకు వెళ్లగా అటుపిమ్మట జటాయువునకు పరలోక క్రియలు చేసి నిన్ను పట్టుకొన్న ఆ కబంధుని చంపి శబరిని చూసి పంపానది తీరంలో నువ్వు వాయుపుత్రుడైన హనుమంతుని కలిసి బాగా ఆనందమనుభవించితివి. ఓ గురువాయూరు దేవా! రక్షింపుము.

**విశేషాలు**

**జటాయువు:**అనూరుని రెండవ కొడుకు. ఇతని తల్లి శ్యేని. తాత కశ్యపుడు. అవ్వ వినత. అన్న సంపాతి. ఇతడు పంచవటియందు శ్రీరాముని ఆశ్రమమున ఉండి సీతను రావణాసురుడు ఎత్తుకొనిపోవు కాలమున వానిని అడ్డగించి వానిచేత చంపబడెను.

**కబంధుడు:** ఒక రాక్షసుడు. వీడు జంఘారహితుడు అయి యోజనదీర్ఘములు అగు బాహువులును ఉదరమునందు అణగిన ముఖమును కలిగి దండకారణ్యమున

ఉండెను. రామలక్ష్మణులు సీతను వెదుకుచు పోవు అవసరమయిన వారిని పట్టి మ్రింగపోగా వారు వీనిబాహువులు తెగనఱకిరి. అంతట వాడు ఒక గంధర్వుడు ఆయెను. తొల్లి దనువు అను గంధర్వుడు తపోబలముచే చిరజీవిత్వమును కామరూపిత్వమును పడసి క్రౌర్యపరుడు అయి ఉండగా వానికి స్థూలకేశుడు అను ఋషి శాపముచే ఇట్టి రాక్షసరూపము ప్రాప్తము అయ్యెను. అనంతరము మఱి ఒకప్పుడు వాడు ఇంద్రునితో సంగరము కోరి పోరునపుడు అతని వజ్రాయుధము పెట్టుచేత కంఠమును శిరమును కాళ్లును పొట్టలోపలికి అడగిపోయెను. వాడె కబంధుడు అన పరగెను. కాఁబట్టి రామలక్ష్మణులు తన బాహువులను తెగగొట్టగానే వీనికి శాప విమోచనము అయ్యెను.

**శబరి:** పంపాతీరమునందలి మతంగాశ్రమమున ఉండిన రామభక్తురాలు అయిన ఒక బోయత. మతంగుని శిష్యురాలు. ఈమె రాముని యనుగ్రహము పడసి మోక్షము చెందెను.

**నవమ స్కంధము**

**34వ దశకము సమాప్తము.**

# దశకమ్ 35 – శ్రీరామావతారమ్–02

**35–1 శ్లో.**

**నీతస్సుగ్రీవమైత్రీం తదను హనుమతా దుందుభేః కాయము చ్చైః**
**క్షిప్త్వాంగుష్ఠేన భూయో లులువిథ యుగపత్ పత్రిణా సప్తసాలాన్ ।**
**హత్వా సుగ్రీవఘాతోద్యతమతులబలం వాలినం వ్యాజవృత్త్యా**
**వర్షావేలామనైషీర్విరహతరలితస్త్వం మతంగాశ్రమాంతే ॥**

**ప్రతిపదార్థము:** తత్ –అను = ఆతరువాత, హనుమతా= హనుమంతునివలన (హనూ అస్తి అస్య – దవుడలు కలవాడు. హనుమంతుడు), సుగ్రీవమైత్రీం= సుగ్రీవునితో స్నేహము(శోభనా గ్రీవా యస్య – అందమైన మెడ గలవాడు. సుగ్రీవుడు), నీతః= పొందావు. (నీతః అపనీతః వ్యతీతః లబ్ధః – తీసుకొనబడినది పొందబడినది గడపబడినది ),దుందుభేః కాయమ్ =దుందుభి శరీరమును(దుందు ఇతి శబ్దేన ఉభతి పూరయతి దుందుం అను శబ్దమును చేయు ఒక రాక్షసుడు), అంగుష్ఠేన= కాలి బొటన వేలితో(అంగౌ పాణౌ ప్రాధాన్యేన తిష్ఠతి ముఖ్యమైనది. బొటన వ్రేలు), ఉ చ్చైః క్షిప్త్వా= దూరానికి విసిరేశావు, భూయః= మరలా, యుగపత్= ఒకే కాలములో( యుగం ఇవ పద్యతే, ఏకకాలీనం, సమకాలీనమ్), పత్రిణా= ఒక్క బాణముతో, సప్తసాలాన్ = ఏడు సాల వృక్షాలను(సలతి ఉచ్చైః గచ్ఛతిబాగా పైకి పెరుగునది. మద్ది చెట్టు ),లులువిథ=ఖండించావు,సుగ్రీవఘాత= సుగ్రీవుని చంపుటకు, ఉద్యతమ్= ప్రయత్నం చేసిన, అతులబలం= సాటిలేని బలంకలిగిన, వాలినం = వాలిని, వ్యాజవృత్త్యా= మిషతో, హత్వా = సంహరించి, వర్షా వేలామ్ = వర్ష ఋతువును, త్వం= నువ్వు, విరహతరలితః = సీతా విరహవేదనతో, మతంగ ఆశ్రమ అంతే= మతంగాశ్రమములో, అనైషీః= గడిపావు.

**తాత్పర్యము:** ఆతరువాత హనుమంతునివలన సుగ్రీవునితో స్నేహము పొందావు. కాలి బొటన వేలితో దుందుభి శరీరమును దూరానికి విసిరేశా వు. మరలా ఒకే కాలములో ఒక్క బాణము తో ఏడు సాల వృక్షాలను ఖండించావు. సుగ్రీవుని చంపుట కు ప్రయత్నం చేసిన సాటిలేని బలంకలిగిన వాలిని మిష తో సంహరించి, వర్ష ఋతువును సీతా విరహవేదనతో మతంగాశ్రమ ములో గడిపావు.

**విశేషాలు**

**దుందుభి:** మయుని రెండవ కొడుకు. మండోదరి సహోదరుడు. వాలిచే చంపబడెను. వీని చంపి కళేబరమును వాలి పాఱవైచినపుడు దానినుండి రక్తబిందువులు మతంగమహర్షి తపముచేయుచు ఉండిన ఋశ్యమూక పర్వతమున పడెను. అందుకు అతఁడు కోపగించికొని ఆకొండమీదికి వాలి వచ్చిన అతనికి తల వేయి వ్రక్కలు అగునట్లుగా శాపము ఇచ్చెను.

**35–2 శ్లో.**

**సుగ్రీవేణానుజోక్త్యా సభయమభియతా వ్యూహితాం వాహినీం తాం**
**ఋక్షాణాం వీక్ష్య దిక్షు ద్రుతమథ దయితామార్గణాయావనమ్రామ్ ।**
**సందేశం చాంగులీయం పవనసుతకరే ప్రాదిశో మోదశాలీ**
**మార్గే మార్గే మమార్గే కపిభిరపి తదా త్వత్ప్రియా సప్రయాసైః ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, అనుజ= లక్ష్మణుని, ఉక్త్యా= మాటతో, సభయమ్ =భయముతో, సుగ్రీవేణ= సుగ్రీవుడు, అభియతా= నిన్ను సమీపించాడు, వాహినీం= వానర సేనను (వాహాః వాహనాని అశ్వాదీని సంతి అస్యామ్ ఇందులో గుఱ్ఱము మొదలగు వాహనములుండునది. సేన), వ్యూహితాం= సిద్ధ పరిచాడు, ద్రుతమ్= వెంటనే, దిక్షు= దిక్కులందు, దయితామార్గణాయ = నీ ప్రియురాలిని వెదకుటకు సిద్ధమై ఉన్న, అవనమ్రామ్ =వినయముతో వంగియున్న, తాం ఋక్షాణాం= వానర సేనను(ఋషతి హినస్తి అసౌ హింసించునది. భల్లూకము, ఎలుగుబంటు), వీక్ష్య = చూచి, సందేశం చ అంగులీయం = వారిలో ఉంగరాన్ని నీ సందేశమును (సమ్యక్ దిశతి సూచయతి తస్య భావః కర్మ వా సూచించుట సమాచారము సందేశము.) (అంగులౌ భవమ్ వ్రేలుయందుండునది. ఉంగరము),పవనసుత కరే= హనుమంతుని చేతికి (పవన=పునాతి పవిత్రము చేయునది. గాలి), ప్రాదిశః= ఇచ్చి, మోదశాలీ = ఆనందంగా ఉన్నావు, తదా= అప్పుడు, కపిభిః అపి= వానరులు కూడా, సప్రయాసైః= అనేక కష్టాలకు గురి అయి, త్వత్ ప్రియా= నీ భార్య కొరకు, మార్గే మార్గే = అన్ని దారులలోను, మమార్గే =వెతికారు.

**తాత్పర్యము:** లక్ష్మణుని మాటతో భయముతో నీసన్నిధికి సుగ్రీవుడు వచ్చి వానర సేనను సిద్ధ పరిచాడు. నీ ప్రియురాలిని వెదకుటకు సిద్ధమై ఉన్న వానర సేనను చూచి వారిలో ఉంగరాన్ని నీ సందేశమును హనుమంతునికి ఇచ్చి పంపి ఆనందంగా ఉన్నావు. నువ్వు పంపిన వానరులు అనేక కష్టాలకు గురి అయి అన్ని దారులను వెతికారు.

**35-3 శ్లో.**

**త్వద్వార్తాకర్ణనోద్యద్గరుదురుజవసంపాతిసంపాతివాక్య-**
**ప్రోత్తీర్ణార్ణోధిరంతర్నగరి జనకజాం వీక్ష్య దత్త్వాంఽగులీయమ్ ।**
**ప్రక్షుద్యోద్యానమక్షక్షపణచణరణః సోఢబంధో దశాస్యం**
**దృష్ట్వా ప్లుష్ట్వాచ లంకాం ఝటితి స హనుమాన్ మౌళిరత్నం దదౌతే ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ వార్తా= నీకు సంబంధించిన రామాయణము, ఆకర్ణన్ = విన్నందువలన, ఉద్యత్ –గరుత్ = పుట్టిన రెక్కలు గల (శాపము తీరి పోగా రెక్కలు వచ్చి), ఉరుజవ = అధికమైన వేగముతో, సంపాతి= ఎగిరి ఎదుట వాలిన, సంపాతివాక్= సీతను చూస్తున్నాను అను సంపాతి మాటలను అనుసరించి (సమ్యక్ పతతి ఉడ్డయతి బాగుగా ఎగురునది. జటాయువు అన్న, సంపాతి), అర్ణోధిః = హనుమంతుడు సముద్రమును, ప్రోత్తీర్ణ= దాటి, అంతః నగరి= లంకా నగరములో, జనకజాం= జానకిని, వీక్ష్య= చూసి, అంగులీయమ్= రామాంగులీయకమును, దత్త్వా= ఇచ్చి , ఉద్యానమ్= అశోకవనమును, ప్రక్షుద్య= నాశనము చేసి (అత్యంతం క్షుణ్ణః మర్దితః – బాగా మర్దింపబడినది తొక్కబడినది), చణ–రణః= యుద్ధము చేయుటలో ప్రసిద్ధుడైన, అక్ష–క్షపణ= అక్షకుమారుని చంపి, (అక్షైః దీవ్యతిపాచికలు ఆడువాడు రావణుని కుమారుడు), సోఢ–బంధః = బ్రహ్మాస్త్ర బంధమును ఓర్చుకుని (సోఢః శాంతః కృతసహనః – సహింపబడినది), దశ –ఆస్యం= దశముఖుని, దృష్ట్వా= చూచి, లంకాం చ ప్లుష్ట్వా= లంకను కాల్చి, ఝటితి = వేగంగా తిరిగి వచ్చి, సః హనుమాన్= ఆ హనుమంతుడు, మౌళిరత్నం = సీతాదేవి చూడామణిని(చూడా శిరోభూషణం తస్య తత్ర స్థితో వా మణిః – శిరోరత్నము), తే= నీకు, దదౌ= ఇచ్చెను.

**తాత్పర్యము:** వానరులవలన నీకు సంబంధించిన రామాయణము విన్నందువలన శాపము తీరి పోగా రెక్కలు వచ్చి అధికమైన వేగముతో వానరుల ఎదుట వాలిన సంపాతి సీతను చూస్తున్నాను అని చెప్పాడు. సంపాతి మాటలను అనుసరించి హనుమంతుడు సముద్రమును దాటి, లంకా నగరములో జానకిని చూసి, రామాంగులీయక మును ఇచ్చి , అశోకవనమును నాశనము చేసి , యుద్ధము చేయుటలో ప్రసిద్ధుడైన అక్షకుమారుని చంపి, బ్రహ్మాస్త్ర బంధమును ఓర్చుకుని ,దశముఖుని చూచి, లంకను కాల్చి, వేగంగా తిరిగి వచ్చి ఆ హనుమంతుడు సీతాదేవి చూడామణిని నీకు ఇచ్చెను

**విశేషాలు**

**సంపాతి:** అనూరుని పెద్దకొడుకు. తల్లి శ్యేని. తమ్ముడు జటాయువు. కొడుకు సుపార్శ్వుడు. ఒకప్పుడు ఇతడును ఇతని తమ్ముడు అగు జటాయువును తమతమ శక్తికొలదిని ఎఱుఁగకోరి అంతరిక్షమునకు ఎగసి పైకిపోవుచు సూర్యమండలమును సమీపింపగా జటాయువు సూర్యుని వేడిమికి తాళచాలక క్రిందికి ఒఱగగా ఇతడు తన ఱెక్కలచేత అతనిని కప్పెను. అపుడు సూర్యకిరణముల వేడిమిచే ఇతని ఱెక్కలు కాలిపోయెను. అంతట మింట నిలువ నేరక ఇతఁడు సముద్రమునను, జటాయువు దండకారణ్యమునందలి జనస్థానమునను పడిరి. పిమ్మట ఇతడు హనుమదాదులకు సీత లంకలో ఉండు వృత్తాంతమును తెలిపి ఆసుకృతాతిశయముచే మరల ఱెక్కలు మొలవగా తన ఉనికిపట్టు అగు హిమవంతమునకు పోయి చేరెను.

**35-4 శ్లో.**

**త్వం సుగ్రీవాంగదాదిప్రబలకపిచమూచక్రవిక్రాంతభూమీ**
**చక్రోభిక్రమ్య పారే జలధి నిశిచరేంద్రానుజాశ్రీయమాణః ।**
**తత్ప్రోక్తాం శత్రువార్తాం రహసి నిశమయన్ ప్రార్థనాపార్థ్యరోష-**
**ప్రాస్తాగ్నేయాస్త్రతేజస్త్రసదుదధిగిరా లబ్ధవాన్ మధ్యమార్గమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వం = నువ్వు, సుగ్రీవ-అంగద-ఆది = సుగ్రీవాంగదాది వానర ప్రముఖులతో(అంగద=అంగదానము చేయువాడు. సుగ్రీవుని కొడుకు), ప్రబల కపి చమూ = బలమైన వానర సైన్యముతో(చమతి భక్షయతి హినస్తి

అరీన్ శత్రువులను చంపునది. సేన), చక్ర విక్రాంత భూమీ= భూమినంతా ఆక్రమించి (విశేషేణ క్రాంతః పరాక్రమయుక్తః – పరాక్రమంతో కూడుకున్నవాడు. శూరుడు శత్రువులను ఓడించువాడు, దాటినవాడు), చక్రః అభిక్రమ్య= సముద్రము దాటుటకు నిశ్చయించి(అభిక్రమ్యతే ప్రారభ్యతే తస్య భావః – పని కారంభించుట), పారే జలధి= సముద్రతీరములో నువ్వు(పరం తీరం ఏవ పారమ్ తీరము, ఒడ్డు.), నిశిచర –ఇంద్ర– అనుజ = విభీషణునకు, ఆశ్రీయమాణః= శరణము ఇచ్చి, (విభీషణుడు ఆశ్రయింపబడుచున్నవాడు కాగా), తత్ ప్రోక్తాం= అతడు చెప్పిన, శత్రు వార్తాం = శత్రు వార్తలను, రహసి= రహస్యముగా, నిశమయన్ = విని, ప్రార్థనా ఆపార్థ్య= నువ్వుచేసిన ప్రార్థన ఫలించక పోవుటచే, రోష= కోపముతో, ఆగ్నేయ అస్త్ర= ఆగ్నేయాస్త్రమును, ప్రాస్త= విడిచి, తేజః త్రసత్= ఆ అస్త్ర తేజస్సుకు భయపడిన, ఉదధి గిరా= ఆ సముద్రుని మాటలు అనుసరించి (ఉదకాని ధీయంతే అస్మిన్ నీరు ఇచ్చట ధరింపబడును. సముద్రము), మధ్యమార్గమ్ = సముద్రము దాటుఉపాయమును, లబ్దవాన్ = పొందినావు.

**తాత్పర్యము:** నువ్వు సుగ్రీవాంగదాది వానర ప్రముఖులతో బలమైన వానర సైన్యముతో భూమినంతా ఆక్రమించి, సముద్రము దాటుటకు నిశ్చయించి సముద్రతీరములో నువ్వు విభీషణునకు శరణము ఇచ్చి, శత్రు వార్తలను రహస్యముగా విని, నువ్వుచేసిన ప్రార్థన ఫలించక పోవుట చే నువ్వు సముద్రునిపై ఆగ్నేయ అస్త్రము వేయుటకు సిద్ధపడగా, ఆ అస్త్ర తేజస్సుకు భయపడిన ఆ సముద్రుని మాటలు అనుసరించి సముద్రము దాటుఉపాయమును పొందినావు

**35–5 శ్లో.**

**కీశైరాశాంతరోపాహృతగిరినికరైః సేతుమాధాప్య యాతో**
**యాతూన్యామర్ద్య దంష్ట్రానఖశిఖరిశిలాసాలశస్త్రైః స్వసైన్యైః ।**
**వ్యాకుర్వన్ సానుజస్త్వం సమరభువి పరం విక్రమం శక్రజేత్రా**
**వేగాన్నాగాస్త్రబద్ధః పతగపతిగరున్మారుతైర్మోచితోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** కీశైః= వానరులు(కీ శబ్దం ఇతి ఈష్టేకీ అని శబ్దము చేయునది. కోతి), ఆశా–అంతర =అనేక దిక్కుల నుండి(ఆసమంతాత్ సర్వత్ర అశ్నుతే అంతట

వ్యాపించునది. దిశ), ఉపాహృత= తీసుకొనివచ్చిన, గిరినికరైః= కొండలతో బండలతో, సేతుమ్ –అధాప్య = సేతువు కట్టి (సినోతి బధ్నాతి జలమ్ జలమును బంధించునది (వారిధి). కట్ట సేతువు), యాతః = లంకకు వెళ్లిన, స్వసైన్యైః = నీ సేనలు, దంష్ట్రా= కోరలు (దశ్యతే అనయా దీనితో నమలబడును. దవుడ, పన్ను), నఖ శిఖరి శిలా సాల శస్త్రైః = గోళ్ల చివరలు రాళ్లు వృక్షములు ఆయుధములుగా, వ్యాకుర్వన్ = గ్రహించి (ప్రకాశింపచేస్తూ), యాతూని ఆమర్ద్య = రాక్షసులను నశింపచేయగా, (యాతి సర్వేషా మంతమ్ అందరిని చంపువాడు. రాక్షసుడు) (ఆమృద్నాతి తస్య భావః – తొక్కుట ఒత్తి పెట్టుట పీడించుట), త్వం = నువ్వు, సానుజః = తమ్మునితో, సమరభువి= యుద్ధరంగములో, పరం విక్రమం= ఎదురు లేని పరాక్రమము చూపి, శక్రజేత్రా వేగాత్= ఇంద్రజిత్తు వేగముగా వేసిన (శక్రం జితవాన్ ఇంద్రుని జయించినవాడు. మేఘనాదుడు), నాగాస్త్ర బద్ధః = నాగాస్త్రమునకు చిక్కుకొని, పతగపతి= గరుత్మంతుని, గరుత్ మారుతైః= రెక్కల గాలిచల్లదనానికి, మోచితః అభూః= తేరుకొని విడువబడ్డావు.

**తాత్పర్యము:** వానరులు అనేక దిక్కుల నుండి తీసుకొనివచ్చిన కొండలతో బండలతో సేతువు కట్టి లంకకు వెళ్లి., నీ సేనలు కోరలు గోళ్ల చివరలు రాళ్లు వృక్షములు ఆయుధములుగా గ్రహించి రాక్షసులను నశింపచేయగా, నువ్వు తమ్మునితో యుద్ధరంగములో ఎదురు లేని పరాక్రమము చూపి, ఇంద్రజిత్తు వేసిన నాగాస్త్రమునకు చిక్కుకొని గరుత్మంతుని రెక్కల గాలిచల్లదనానికి తేరుకొని విడువబడ్డావు.

**35–6 శ్లో.**

**సౌమిత్రిస్త్వత్ర శక్తి ప్రహృతిగలదసుర్వాతజానీతశైల–**
**ఘ్రాణాత్ ప్రాణానుపేతో వ్యకృణుత కుసృతిశ్లాఘినం మేఘనాదమ్ ।**
**మాయాక్షోభేషు వైభీషణవచనహృతస్తంభనః కుంభకర్ణం**
**సంప్రాప్తం కంపితోర్వీతలమఖిలచమూభక్షిణం వ్యక్షిణోస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** సౌమిత్రిః తు = లక్ష్మణుడు మాత్రము, అత్ర = ఆ ఇంద్రజిత్తుతో జరిగిన యుద్ధంలో, శక్తి ప్రహృతి = ఇంద్రజిత్తు ప్రయోగించిన శక్త్యాయుధము

దెబ్బకు(ప్రహృతః హింసితః – హింసింపబడినవాడు), గలత్ అసుః = కూలిపోయాడు, వాతజ–ఆనీత = హనుమంతుడు తెచ్చిన(ఆనయనం సమీపం ఆనయనమ్ దగ్గరకు తీసుక వచ్చుట), శైల–ఘ్రాణాత్ = సంజీవని పర్వతం గాలి వాసనచూచి(శిలాః సంతి శిలలు కలది. పర్వతము), ప్రాణాన్ ఉపేతః= ప్రాణము పొంది, కుసృతిః లాఘినం = తన మాయలతో సంతోషపడుతున్న(కుత్సితా సృతిః సరణం ఆచారః – చెడు ఆచారము శఠత్వము మూర్ఖత్వము)(సామర్థ్యే లావతే సమర్థుడగుట, యోగ్యుడగుట), మేఘనాదమ్= ఇంద్రజిత్తును(మేఘస్య నాద ఇవ గర్జనః ఇవ నాదః యస్య – మేఘముల గర్జనము వంటి గర్జనం గలవాడు. రావణుని కుమారుడు), వ్యకృణుత = చంపి, మాయా క్షోభేషు= రావణుడు చేసిన మాయాబాధను, వైభీషణవచనహృతస్తంభనః= విభీషణుని మాటతో తొలగించుకొని, కంపిత ఉర్వీతలమ్ = భూమిని కంపింపచేస్తూ, అఖిల చమూ భక్షిణం= సేనలను తినుచున్న, సంప్రాప్తం = దగ్గరకు వచ్చిన, కుంభకర్ణం = కుంభ కర్ణుని (కుంభ ఇవ కర్ణౌ యస్య–కుండలవంటి కర్ణములు కలవాడు. కుంభకర్ణుడు, రావణుని తమ్ముడు), త్వమ్= నువ్వు, వ్యక్షిణః = చంపావు.

**తాత్పర్యము:** లక్ష్మణుడు మాత్రము ఆ ఇంద్రజిత్తుతో జరిగిన యుద్ధంలో ఇంద్రజిత్తు ప్రయోగించిన శక్త్యాయుధము దెబ్బకు కూలిపోయాడు. హనుమంతుడు తెచ్చిన సంజీవని పర్వతం గాలి వాసనచూచి ప్రాణము పొంది, తన మాయలతో సంతోషపడుతున్నఇంద్రజిత్తునుఎదిరించి,రావణుడుచేసినమాయాస్తంభనమును విభీషణుని మాటతో తొలగించుకొని, తమమీదికి వచ్చి భూమిని కంపింపచేస్తూ సేనలను తినుచున్న కుంభకర్ణుని నువ్వు చంపావు.

**విశేషాలు**

**కుంభకర్ణుడు:** రావణాసురుని తమ్ముడు. ఈరక్కసుడు మహాఘోరము అగు తపము ఒనరించి వరము అడుగబోవు వేళ దేవతల ప్రార్థనచే సరస్వతీదేవి వాని నాలుకయందు ప్రవేశించి 'నిద్ర కావలెను' అని పలికించెను. అది కారణముగ వాడు ఎల్లపుడు నిద్రపోవుచుండును. మఱియు వానికి నిద్రాభంగము అగువేళ చావు సంభవించును అని నియతి కలిగి ఉన్నందున రాముడు లంకలో

యుద్ధముచేయు నవసరమున రావణుఁడు నిద్రించుచు ఉన్న కుంభకర్ణుని లేపి యుద్ధమునకు పంపగా వాఁడు రామునిచేత చచ్చినట్లు చెప్పుదురు. రావణ కుంభకర్ణులు సనకసనందనుల శాపముచే రాక్షసావతారము ఎత్తిన విష్ణుద్వారపాలకులు.

**35–7 శ్లో.**

**గృహ్ణన్ జంభారిసంప్రేషితరథకవచౌ రావణేనాభియుధ్యన్**
**బ్రహ్మాస్త్రేణాస్య భిందన్ గళతతిమబలామగ్నిశుద్ధాం ప్రగృహ్ణన్ ।**
**దేవశ్రేణీవరోజ్జీవితసమరమృతై రక్షతైః ఋక్షసంఘైః**
**లంకాభర్త్రా చ సాకం నిజనగరమగాః సప్రియః పుష్పకేణ ॥**

**ప్రతిపదార్థము:** జంభారి= ఇంద్రుడు (జంభుడు అను అసురుని చంపుటచే ఇతనికి ఈనామము కలిగెను), సంప్రేషిత = పంపిన, రథ కవచౌ= రథకవచములను, గృహ్ణన్= స్వీకరించి, రావణేన = రావణునితో, అభియుధ్యన్= యుద్ధమునకు సిద్ధపడి, బ్రహ్మ–అస్త్రేణ= బ్రహ్మాస్త్రానుసంధానము చేసి, అస్య= రావణునియొక్క, గళతతిమ్= పది తలలను, భిందన్= తుంచి, అగ్నిశుద్ధాం= అగ్నిశుద్ధయైన, అబలామ్= సీతను, ప్రగృహ్ణన్= స్వీకరించి, దేవ శ్రేణీవర = గొప్ప దేవతలచే(సంజీవకరణి విశల్యకరణి సంధానకరణి మొదలగు మహౌషధులచే), ఉజ్జీవిత= తిరిగి ప్రాణం తీసుకొన్న, సమరమృతైః =యుద్ధములో మరణించిన, అక్షతైః = గాయములు లేని, ఋక్షసంఘైః = ఎలుగుగొడ్లు మరియు వానర సంఘములతో, లంకాభర్త్రా చ= నీచే లంకాధిపుడుగా జేయబడిన విభీషణునితో, సప్రియః= జానకితో, సాకం = కలిసి, పుష్పకేణ= పుష్పక విమానము ఎక్కి (పుష్పం ఇవ కాయతి ప్రకాశతే పుష్పము వలె ప్రకాశించునది. ఒక పుష్పము పూబొమ్మ కుబేరుని పుష్పక విమానము), నిజ నగరమ్ =నిజ రాజధానికి, అగాః= వెళ్ళితివి.

**తాత్పర్యము:** ఇంద్రుడు పంపిన రథకవచములను గొని రావణునితో యుద్ధమునకు సిద్ధపడి ఆదిత్య హృదయ పారాయణబలమున బ్రహ్మాస్త్రానుసంధానము సేసి రావణుని పది తలలను తుంచి అగ్నిశుద్ధయైన సీతను స్వీకరించి, సంజీవకరణి విశల్యకరణి సంధానకరణి మొదలగు మహౌషధుల అధిపతులయిన గొప్ప

దేవతలచే తిరిగి ప్రాణం తీసుకొన్న ఎలుగుగొడ్లు మరియు వానర సంఘములతో, నీచే లంకాధిపుడుగా జేయబడిన విభీషణునితో, జానకితో – వీరందరితో పుష్పక విమానము ఎక్కి నిజ రాజధానికి వెళ్ళావు.

**35–8 శ్లో.**

**ప్రీతో దివ్యాభిషేకైరయుతసమధికాన్ వత్సరాన్ పర్యరంసీః**
**మైథిల్యాం పాపవాచా శివశివ కిల తాం గర్భిణీమభ్యహాసీః ।**
**శత్రుఘ్నేనార్దయిత్వా లవణనిశిచరం ప్రార్ధయాశ్శూద్రపాశం**
**తావద్వాల్మీకిగేహే కృతవసతిరుపాసూత సీతాసుతౌ తే ॥**

**ప్రతిపదార్థము:** దివ్య అభిషేకైః=దివ్యమైన అభిషేకములతో పట్టాభిషిక్తుడవయి (మంత్రపూర్వకం షేకఃస్నానమ్ మంత్రపూర్వకంగా స్నానము), ప్రీతః= సంతోషించినవాడివయి, అయుత సమ అధికాన్ వత్సరాన్= పదివేలయేండ్లకు మించి, పర్యరంసీ = పాలించి, పాపవాచా= అపనిందకు లోనైన, తాం గర్భిణీమ్ =ఆ గర్భిణి అయిన (గర్భః అస్తి అస్యాః – గర్భము కలది. గర్భవతి), మైథిల్యాం = సీతను(మిథిలా జనపదస్య రాజస్య జనకస్య అపత్యం స్త్రీ మిథిల జనపదమునకు రాజైన జనకుని కూతురు, సీత), అభ్యహాసీః= విడిచిపెట్టావు, శివశివ కిల= అయ్యయ్యో !, శత్రుఘ్నేన = శత్రుఘ్నునిచే, లవణ నిశిచరం= లవణాసురుని, అర్దయిత్వా=చంపించి,శూద్రపాశం=శూద్రమునిఅయినశంబూకుని(శంబయతి సూచయతి శుభమ్ శుభమును సూచించునది. శంఖము శంబూకుడు), తే ప్రార్ధయః = నువ్వు సంహరించితివి, తావత్ = అటుపిమ్మట, వాల్మీకి గేహే = వాల్మీకి ఆశ్రమమందు(వల్మీకస్య గోత్రాపత్యం పుమాన్ వల్మీక గోత్రమునందు పుట్టినవాడు. వాల్మీకి ఋషి), కృతవసతిః = వసతి గ్రహించిన, సీతా = సీతాదేవి( సినోతి బధ్నాతి స్నేహమ్ స్నేహమును బంధించునది. నాగటి చాలు శ్రీరాముని భార్య), సుతౌ = ఇరువురి కుమారులను, ఉపాసూత= కన్నది.

**తాత్పర్యము:** అయోధ్యయందు పట్టాభిషిక్తుడై సంతోషించినవాడివయి పదివేల యేండ్లకు మించి రాజ్యమును పాలించి అపనిందకు లోనైన గర్భిణి అయిన జనకాత్మజను సీతను విడిచిపెట్టావు.. శివశివా! అపై శత్రుఘ్నునిచే లవణాసురుని

చంపించి, శూద్ర ముని అయిన శంబూకుని నువ్వు సంహరించితివి. అటుపిమ్మట వాల్మీకి ఆశ్రమమందున్న సీతాదేవి ఇరువురి కుమారులను కన్నది.

**35-9 శ్లో.**

**వాల్మీకేస్త్వత్సుతోద్గాపితమధురకృతే రాజ్ఞయా యజ్ఞవాటే**
**సీతాం త్వయ్యాప్తుకామే క్షితిమవిశదసౌ త్వం చ కాలార్థితోఽభూః ।**
**హేతోః సౌమిత్రిఘాతీ స్వయమథ సరయూమగ్ననిశ్శేషభృత్యైః**
**సాకం నాకం ప్రయాతో నిజపదమగమో దేవ! వైకుంఠమాద్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ= గురువాయూరు దేవా!, వాల్మీకేః ఆజ్ఞయా = వాల్మీకి ఆజ్ఞతో, త్వత్ సుత= నీ కుమారులైన కుశలవులు, యజ్ఞవాటే = యజ్ఞవాటమునందు (యజ్ఞాయ వటయతి యజ్ఞమునకు ఎన్నుకున్న భూభాగము), ఉద్గాపిత= గానం చేసిన, మధురకృతేః = నీ మధురాతి మధురమైన కృతిని (విన్నావు), అసౌ సీతాం = ఆ సీతను తిరిగి, త్వయి= నువ్వు స్వీకరింప కోరగా, ఆప్తుకామే= ఆమె (ఆప్తః ప్రాప్తః కామః కామనా విషయేన – కోరిక, మనోరథము సిద్ధించినది), క్షితిమ్ = భూమిలో, అవిశత్ = ప్రవేశించింది, త్వం చ = నువ్వు కూడా, కాల అర్థితః అభూః=– యమధర్మరాజు చేత స్వర్గారోహణము కొరకు ప్రార్థింపబడి, హేతోః= ఒక కారణముతో, సౌమిత్ర ఘాతీ =లక్ష్మణుని విడిచి వేసావు, అథ = అటుపిమ్మట, స్వయమ్ =స్వయముగా, సాకం = సమస్తమైన, నిశ్శేష భృత్యైః = దేవాంశజులయిన పౌరులతో, సరయూ మగ్నః= సరయూనదిలో మునిగి, నాకం= స్వర్గమునకు పౌరులు, ప్రయాతం= వెళ్ళగా, నిజ పదమ్ వైకుంఠమ్ = నువ్వు వైకుంఠమునకు, అగమః = ప్రయాణమైతివి, వైకుంఠమ్= ఆ వైకుంఠము (వికుంఠస్య విష్ణోః ఇంద్రస్య వా ఇదం వా విష్ణువు, ఉండు చోటు. స్వర్గము, ఆద్యమ్= సర్వలోకములకు మొదటిది అనగా బ్రహ్మాండోత్పత్తికంటే ముందరిది.

**తాత్పర్యము:** వాల్మీకి ఆజ్ఞ తో నీ కుమారులైన కుశలవులు గానం చేసిన నీ మధురాతి మధురమైన కృతిని యజ్ఞవాటమునందు కుశలవులు పాడగా విన్నావు. ఆ మీద సీతను తిరిగి నువ్వు స్వీకరింప కోరగా ఆమె భూమిలో ప్రవేశించింది. ఆ తరువాత నువ్వు యమధర్మరాజు చేత స్వర్గారోహణము కొరకు ప్రార్థింపబడి ఒక కారణముపై

లక్ష్మణుని త్యజించి, స్వయముగా నీవారితో దేవాంశ సంభవులై అవతరించిన పౌరులతోగూడ సరయూనదిలో మునిగి నీ వైకుంఠధామమునకు నువ్వు చేరు కొన్నావు. దయచేసితివి. ఆ వైకుంఠము అన్ని లోకములకు మొదటిది. అనగా బ్రహ్మాండోత్పత్తికంటే ముందరిది.

**విశేషాలు**

**కారణము:** యముడు తానును అవతార విరమణ విషయమైన రహస్య ప్రసంగము చేయుచున్న సమయములో , ఆ సమయములో తనను చూడవచ్చిన వానిని విడిచి పెడతానని యమునియెదుట రాముడు ప్రతిజ్ఞ చేసాడు. తాను చేసిన ప్రతిజ్ఞనుబట్టి, ఆ నడుమవచ్చిన లక్ష్మణుని రాముడు విడిచిపెట్టాడు.

**కుశలవులు:** శ్రీరాముని కుమారులు.. వీరిని గర్భమునందు ధరించి ఉండగా శ్రీరాముఁడు 'కొంచెమైనను ఎరబరికములేక చిరకాలము రావణాసురుని ఇంట ఉండిన సీతను ఆమెయందలి మోహము చేత విడనాడ చాలక తోడితెచ్చి ఇంట ఉంచుకొని ఏలుచున్నాడు' అని లోకులు చెప్పు మాటలు విని లోకాపవాదమునకు వెఱచి పూర్ణగర్భిణి అయిన సీతను అడవికి పంపివేసెను. అంతట ఆమె వాల్మీకి ఆశ్రమముచేరి అచట కవల పిల్లలను కనెను. అంతట ఆమహర్షి ఆబిడ్డలకు జాతకర్మాది వైదికక్రియలు నడపి ధనుర్విద్య మొదలుగాగల సమస్తవిద్యలను నేర్పించాడు. పిమ్మట కొంతకాలమునకు సీతయు కుశలవులును మరల రామునియొద్ద వచ్చి చేరిరి. ఆకుమారులలో కుశుడు కుశస్థలి అను పురమును నిర్మాణము చేసెను.

**35-10 శ్లో.**

**సోఽయం మర్త్యావతారస్తవ ఖలు నియతం మర్త్యశిక్షార్థమేవం**
**విశ్లేషార్తిర్నిరాగస్త్యజనమపి భవేత్ కామధర్మాతిసక్త్యా ।**
**నోచేత్స్వాత్మానుభూతేః క్వ ను తవ మనసో విక్రియా చక్రపాణే।**
**స త్వం సత్త్వైకమూర్తే। పవనపురపతే। వ్యాధును వ్యాధితాపాన్ ॥**

**ప్రతిపదార్థము:** కామధర్మ-అతిసక్త్యా= కామాదులందు అత్యంత ఆసక్తి(కామ్యతే

అసౌ కామము, కోరిక మన్మథుడు), విశ్లేష–ఆర్తిః= వియోగ వ్యథకు దారి తీస్తుందని, ( విగతః శ్లేషః – విశ్లేషము, వియోగము, అభావము, వేర్పాటు, హాని), నిరాగః త్యజనమ్ అపి భవేత్= ధర్మ విషయంలో అత్యంత ఆసక్తి వలన నిరపరాధులైన తన వారిని కూడా వదిలివేయ వలసి వస్తుందని, మర్త్యశిక్షార్థమ్ = లోకులకు(మ్రియతే అత్ర – ఇక్కడ నశించును. మర్త్యలోకము), ఏవం= ఇట్లు, నియతం= రూఢిగా చెప్పటానికే, సః అయం మర్త్యావతారః తవ ఖలు= నువ్వు ఈ మర్త్యావతారం (రామావతారం) ధరించావు కదా!, నోచేత్= కాకపోయినచో, స్వ–ఆత్మానుభూతేః= ఆత్మ చైతన్యంలో సదా ఉండే, తవ మనసః= నీ మనస్సులో, విక్రియా= మనో వికారాలు (విరుద్ధా క్రియావిరుద్ధమైన పని అనిష్టము, మార్పు చెందుట, ఉద్వేగము, ప్రతిక్రియ), క్వ ను = ఎక్కడివి?(ఉండవని భావం), చక్రపాణే= ఓ చక్ర పాణీ!, సత్త్వ–ఏకమూర్తే।= సత్త్వ గుణ సంపన్నుడా!, పవనపురపతే।= గురు వాయూరు దేవా!, స త్వం = అటువంటి నువ్వు, వ్యాధితాపాన్= వ్యాధి తాపములను, వ్యాధును= తొలగించు.

**తాత్పర్యము:** కామాదులందు అత్యంత ఆసక్తి వియోగ వ్యథకు దారి తీస్తుందని, ధర్మ విషయంలో అత్యంత ఆసక్తి వలన నిరపరాధులైన తన వారిని కూడా వదిలివేయ వలసి వస్తుందని లోకులకు చెప్పటానికే ఇట్లు రూఢిగా నువ్వు ఈ మర్త్యావతారం (రామావతారం) ధరించావు కదా! కాకపోయినచో ఆత్మ చైతన్యంలో సదా ఉండే నీ మనస్సులో మనో వికారాలు ఎక్కడివి? (ఉండవని భావం) ఓ చక్ర పాణీ ! సత్త్వ గుణ సంపన్నుడా! గురు వాయూరు దేవా! అటువంటి నువ్వు వ్యాధి తాపములను తొలగించు

**నవమ స్కంధము**

**35వ దశకము సమాప్తము**

# దశకమ్ 36 – పరశురామావతారము

**36-1 శ్లో.**

**అత్రేః పుత్రతయా పురా త్వమనసూయాయాం హి దత్తాభిధో**
**జాతశ్శిష్యనిబంధతంద్రితమనాః స్వస్థశ్చరన్ కాంతయా ।**
**దృష్టో భక్తతమేన హే హయమహీపాలేన తస్మై వరాన్**
**అష్టైశ్వర్యముఖాన్ ప్రదాయ దదిథ స్వేనైవ చాంతే వధమ్ ॥**

**ప్రతిపదార్థము:** పురా= పూర్వము, త్వమ్= నువ్వు, అత్రేః= నీవు అత్రిమహర్షికి(అత్తి ఏకగండూషేనైవ సర్వం గంగాజలమ్ ఒకే ఒక గుక్కతో గంగను మ్రింగినవాడు. అత్రిమహర్షి, సప్తర్షులలో ఒకడు), అనసూయాయాం= అనసూయాదేవికి (న అసూయా ద్వేషః – అసూయ లేనిది. అత్రి భార్య), పుత్రతయా = పుత్రునిగా, దత్త అభిధః= దత్తాత్రేయనామమున (దత్తః ప్రదత్తః విసృష్టః ఇవ్వబడిన వాడు), జాతః హి= జన్మించావు కదా!, శిష్య నిబంధ తంద్రిత మనాః= విఘ్నము కలిగించు శిష్యగణములను దూరముగా ఉంచదలిచి (శాస్యతే గురుణా, శిక్షణీయః – గురువుచే శాసింపదగినవాడు. శిష్యుడు అధ్యయనార్హుడు), కాంతయా= నీవు భార్యాసమేతుడవై, స్వస్థః చరన్= మధుమద వివశ భావముతో ఆత్మారామునిగా విహరించుచున్నట్లు, దృష్టః= కనిపించావు, భక్తతమేన = నీ భక్తుడైన, తస్మై హేహయమహీపాలేన= హేహయ మహారాజగు కార్తవీర్యార్జునునికి, అష్ట ఐశ్వర్య ముఖాన్= అష్టఐశ్వర్యములను, ప్రదాయ= ఇచ్చి, స్వేన –ఏవ చ = నీచేతనే, అంతే= చివరికి వానికి, వధమ్= మరణము కూడా కలుగునట్లు, వరాన్= వరములను, దదిథ = ఇచ్చావు.

**తాత్పర్యము:** నీవు అత్రిమహర్షికి అనసూయాదేవికి పుత్రునిగా జన్మించావు.. విఘ్నము కలిగించు శిష్యగణములను దూరముగా నుంచ నెంచి, నీవు భార్యాసమేతుడవై మధుమద వివశ భావముతో విహరించుచున్నట్లు కనిపించావు. నీ భక్తుడైన, 'హైహయ'(హేహయ) మహారాజగు– 'కార్తవీర్యార్జునునికి' అష్ట ఐశ్వర్యముల వరములను ఇచ్చి , చివరికి వానికి మరణము కూడా నీచేతనే కలుగునట్లు వరములను ఇచ్చావు.

**విశేషాలు**

**కార్తవీర్యార్జునుడు:** హైహయ వంశజాతుడు అగు ఒక రాజు. ఇతని పేరు అర్జునుడు అయినను కృతవీర్యుని కొడుకు కనుక ఇతనిని కార్తవీర్యార్జునుడు అందురు. వీని రాజధాని వింధ్యపర్వతమునకు దక్షిణమున పాఱునట్టి నర్మదానదీతీరమున ఉండు మాహిష్మతీపురము. ఇతఁడు యదువుయొక్క పెద్దకొడుకు అగు సహస్రజిత్తు వంశస్థుడు. ఒకప్పుడు ఇతని పరాక్రమమును రావణాసురుడు విని ఇతనితో యుద్ధానికి మాహిష్మతికి వచ్చెను. ఆదినమున ఇతడు వనవిహారార్థము పోయి ఉండగా పురజనుల వలన ఆవృత్తాంతము విని తన రాక తెలిసి అర్జునుడు దాగెను అని నవ్వుచు పోయి వింధ్యారణ్యమునందు విహరించుచు కొంతసేపటికి నర్మద ఒడ్డునకు వచ్చి అచ్చట శివపూజ కావించుచు ఉండెను. అప్పుడు స్త్రీలతోడ జలక్రీడలు ఆడుచున్న కార్తవీర్యార్జునుని వేయి చేతుల చేతను అడ్డగింపబడి ఎగదట్టిన నర్మదానదీప్రవాహమును తన పూజాద్రవ్యములు ఎల్ల కొట్టుకొని పోయెను. అందుకు కారణము మంత్రులచేత తెలిసికొని రావణుడు అతఁడు ఉండిన కడకు పోయి అతనితో పోరాడి పట్టుపడి చెఱను ఉంచబడెను. ఆ వృత్తాంతము వాని తాత అగు పులస్త్యుడు విని కార్తవీర్యార్జునుని ప్రార్థించి అతనిని విడుదల చేసెను.

మఱియు ఈకార్తవీర్యార్జునుడు పరశురాముని తండ్రి అగు జమదగ్ని యొక్క హోమధేనువును కొనిపోగా అదివిని పరశురాముడు వీనితో పోరాడి వీనిని చంపెను. ఆవల కొంతకాలమునకు కార్తవీర్యుని కొడుకులు జమదగ్నిని చంపిరి. అదికారణముగ పరశురాముడు దేశమును అంతయు క్షత్రియశూన్యము కావింతును అని ప్రతిజ్ఞ చేసి ఇరువదియొక్క మాఱు క్షత్రియులమీద దండెత్తి పోరాడి రాజులను ఎల్ల వెదకివెదకి చంపి ఆనెత్తురు అయిదు మడుగులుగ కావించి అందు పితృతర్పణములు చేసెను. కార్తవీర్యార్జునునకు అనేకులు పుత్రులు కలరు. అందు పరశురామునిచే చావక తప్పినవారు జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, శూరుడు (లేక) ఊర్జితుడు అనువారు ఏవురు.

**36–2 శ్లో.**

**సత్యం కర్తుమథార్జునస్య చ వరం తచ్ఛక్తి మాత్రానతం**
**బ్రహ్మద్వేషి తదఖిలం నృపకులం హంతుం చ భూమేర్భరమ్ ।**
**సంజాతో జమదగ్నితో భృగుకులే త్వం రేణుకాయాం హరే!**
**రామో నామ తదాత్మజేష్వవరజః పిత్రోరధాస్సమ్మదమ్ ॥**

**ప్రతిపదార్థము:** హరే = ఓ హరీ!, అథ=అటుపిమ్మట, అర్జునస్య చ వరం= 'కార్తవీర్యార్జునునికి' ఇచ్చిన వరము, సత్యం కర్తుమ్ = నిజముచేయుట కొరకు (సత్సు తాయతే సజ్జనులయందుండునది. సత్యము), తత్–శక్తి మాత్రా= 'కార్తవీర్యార్జునికి' మాత్రము, నతం = విధేయులయి, బ్రహ్మద్వేషి = 'బ్రహ్మ' ద్వేషులయిన, భూమేః భరమ్= భూమికి భారమయిన, తత్ అఖిలం నృపకులం= సమస్త రాజ్యపాలకులను, హంతుం చ =చంపుటకు, భృగుకులే = భృగు కులములో (భృజ్యతే తపసా శరీరమ్ తపస్సుచే శరీరమును తపింప చేసినవాడు. భృగువు, ఒక మహర్షి), త్వం= నువ్వు, జమదగ్నితః రేణుకాయాం =జమదగ్నిముని–రేణుకలకు, తత్ ఆత్మజేషు = వారి కుమారులలో, అవరజః = చివరివాడివిగా(అవరస్మిన్ పశ్చాత్ జాతఃతరువాత పుట్టినవాడు, తమ్ముడు), రామః నామ="రామ" నామమున 'పరశురామునిగా', జాతః = పుట్టితివి, పిత్రోః =తలిదండ్రులకు, సమ్మదమ్= ఆనందమును, అధాః= కలిగించితివి.

**తాత్పర్యము:** ఓ హరీ! అటుపిమ్మట 'కార్తవీర్యార్జునునికి' ఇచ్చిన వరము నిజముచేయుట కొరకు 'కార్తవీర్యార్జునికి' మాత్రము విధేయులయి 'బ్రహ్మ' ద్వేషులయిన భూమికి భారమయిన సమస్త రాజ్యపాలకులను చంపుటకు భృగు కులములో నువ్వు 'జమదగ్నిముని–రేణుకలకు' వారి కుమారులలో చివరివాడివిగా "రామ" నామమున 'పరశురామునిగా' పుట్టి తలిదండ్రులకు ఆనందమును కలిగించితివి.

**విశేషాలు**

**జమదగ్ని:** ఒక మహర్షి. ఇతని తండ్రి ఋచికుఁడు. తల్లి గాధిరాజు కూతురు అగు సత్యవతి కొడుకులు ఉరుమతి, ఉత్సాహుడు, విశ్వావసుడు, పరశురాముడు అని

నలుగురు. అందు పరశురాముడు ముఖ్యుడు.

జమదగ్ని తండ్రి అగు ఋచికుడు సత్యవతిని పెండ్లాడి కన్యాకుబ్జమునందు ఉండి సంతానమును కోరి తనకని ఒక చరువును (చరువు = హోమమునకు తగిన పక్వాన్నము) తన మామకని ఒక చరువును కల్పించి ఆరెంటిని తన భార్యముందర పెట్టి, రాజులకు గెలువరానివాడును రాజులనెల్ల నాశము చేయువాడును అగు కొడుకు దీనివలన జనించును, ఈచరువును మీ తల్లికి ఇమ్ము. తపస్సంపత్తియు శమంబును కల సుపుత్రుడు దీనివలన పుట్టును, ఈచరువు నీవు కైకొనుము'' అని తెలియ చెప్పి అతడు స్నానార్థము నదికి చనియెను.

అంతట తీర్థయాత్ర చేయ పోయి ఉండిన గాధి, తన భార్యతో కూడ అచ్చటికి వచ్చెను. సత్యవతి అట్లు వచ్చిన తల్లిదండ్రులను చూచి సంతసించి తన పెనిమిటి చేసిన రెండుచరువులను తల్లికి చూపి వాని ప్రభావమును చెప్పెను. అందులకు ఆమె సంతోషించి తన కూతుతోడ తానును స్నానముచేసి శుచియై, ఇది తనది ఇది కొమార్తది అను భేదము తెలియక, తన చరువు కూతునకు ఇచ్చి కూతు చరువు తాను ఉపయోగించెను. సత్యవతియును ఆభేదము మఱచి తల్లి ఇచ్చినదానినే పుచ్చుకొనెను. అంత ఋచికుడు వచ్చి భార్యను చూచి తన దివ్యజ్ఞానముచేత చరువులు మాఱుట తెలిసికొని నీవు క్షత్రియనాశకరము అగు గర్భమును తాల్చితివి అనగా ఆమె వెఱచి అతని పాదములమీద పడి మీరు ఇట్లు చెప్పవచ్చునా అని అడిగెను.

అంత అతడు 'ఇది నీవల్ల వచ్చిన తప్పుకాదు నీ తల్లివలన అయిన తప్పు. చరువ్యత్యాసముచేత నీకు క్రూరకర్ముడు అగు కొడుకును మీ తల్లికి బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును తపోధనుడును అగు కొడుకును పుట్టుదురు' అని చెప్పి అందులకు ఆమె దుఃఖింపఁగా 'ఈచరు మహిమము నీ కొడుకునందు పొందక మనుమనియందు ప్రవర్తిల్లెడుగాక' అని అనుగ్రహించెను.

అది కారణముగా పరశురాముఁడు భృగువంశజాతుఁడు అగు జమదగ్ని మహామునికి జనించియు క్రూరకర్ముడై చలము పట్టి రాజులను ఎల్ల నాశము చేసెను.

జమదగ్ని, తన భార్య అగు రేణుక అంగదేశపు రాజు అగు చిత్రసేనుడు అనువాని మోహించి వ్యభిచరించినందున, కోపించి తన చిన్నకొడుకు అగు పరశురామునిచేత ఆమెను చంపించి, మరల పరశురాముఁడు తన తల్లిని బ్రతికింపవలెను అని ప్రార్థింపగా ఆమెను బ్రతికించెను.

**36–3 శ్లో.**

**లబ్ధామ్నాయగణశ్చతుర్దశ వయా గంధర్వరాజే మనాక్**
**ఆసక్తాం కిల మాతరం ప్రతి పితుః క్రోధాకులస్యాజ్ఞయా ।**
**తాతాజ్ఞాతిగసోదరైః సమమిమాం ఛిత్త్వాఽథ శాంతాత్పితుః**
**తేషాం జీవనయోగమాపిథ వరం మాతా చ తేఽదాద్వరాన్ ॥**

**ప్రతిపదార్థము:** చతుర్దశ వయా= పదునాలుగు సంవత్సరముల వయస్సుననే, ఆమ్నాయగణః = అర్థజ్ఞానసమన్వితముగా వేదాధ్యయనము (ఆమ్నాయతే పరంపరయా అభ్యస్యతే పరంపరగా అభ్యసింపబడునది. వేద బ్రాహ్మణాది మూలశాస్త్రములు), లబ్ధః= పొందితివి. (చేసితివి), గంధర్వరాజే = గంధర్వరాజగు 'చిత్రరథుని'చూచి, మనాక్= కొంచెము, ఆసక్తాం = మనస్సు పడిన, మాతరం ప్రతి= నీతల్లి రేణుకను, క్రోధ ఆకులస్య = క్రోధాతురుడైన జమదగ్ని (చంపుమని నీ సోదరులను ఆజ్ఞాపించెను), తాత ఆజ్ఞాతిగః = తండ్రి ఆజ్ఞను తిరస్కరించిన, సోదరైః సమమ్ = సోదరులతో సహ, ఇమాం= తల్లిని, ఛిత్త్వా= చంపి, అథ= అటుపిమ్మట, శాంతాత్ పితుః = ప్రశాంతుడైన తండ్రివలన, తేషాం జీవనయోగమ్ అపిథ = వారందరిని బ్రతికింపజేసితివి, మాతా చ = నీ తల్లి యైన రేణుక, తే= నీకు, వరాన్ = వరములను, అదాత్= ఇచ్చెను.

**తాత్పర్యము:** నీవు – పదునాలుగు సంవత్సరముల వయస్సుననే అర్థజ్ఞాన సమన్వితముగా వేదాధ్యయనము పొందితివి. (చేసితివి) గంధర్వరాజగు 'చిత్రరథుని'చూచి నీ తల్లి రేణుక మనసు కొంచెము చలించగా , అది గ్రహించిన నీ తండ్రి జమదగ్ని, కోపంతో నీ తల్లిని చంపుమని మీ సోదరులను ఆజ్ఞాపించెను. తండ్రి ఆజ్ఞను తిరస్కరించిన సోదరులతో కూడా తల్లిని చంపి పిమ్మట శాంతించి – అనుగ్రహించిన నీ తండ్రి వరము కోరుకొమ్మనగా – నీ సోదరులను, తల్లిని తిరిగి

ప్రతికించుకొంటివి. నీ తల్లి యైన రేణుక నీకు వరములను ఇచ్చెను.

**36–4 శ్లో.**
**పిత్రా మాతృముదేస్తవాహృత వియద్ధేనోర్నిజాదాశ్రమాత్**
**ప్రస్థాయాథ భృగోర్గిరా హిమగిరావారాధ్య గౌరీపతిమ్ ।**
**లబ్ధ్వా తత్పరశుం తదుక్తదనుజచ్ఛేదీ మహాస్త్రాదికం**
**ప్రాప్తో మిత్రమథాకృతవ్రణమునిం ప్రాప్యాగమస్స్వాశ్రమమ్ ॥**

**ప్రతిపదార్థము:** మాతృముదేః= నీ తల్లి రేణుకను ఆనందింపజేయుటకు, పిత్రా= నీ తండ్రి జమదగ్ని, స్తవ = స్తుతించి, వియత్ ధేనోః = సురభిని (కామధేనువును), నిజాత్ ఆశ్రమాత్ = స్వర్గలోకమునుండి తన ఆశ్రమమునకు, ఆహృతః = తెచ్చెను, అథ = అటుపిమ్మట, భృగోః గిరా= నీ తండ్రి మాట ప్రకారం, హిమగిరౌ ప్రస్థాయ= నీవు హిమాలయములకు వెళ్ళి (హిమమయః గిరిః – మంచు వున్న పర్వతము. హిమాలయ పర్వతము), గౌరీపతిమ్= గౌరీపతి అయిన శివుని, ఆరాధ్య = ఆరాధించితివి, తత్ పరశుం= శివుని నుండి పరశువును ఆయుధముగా(పరం శత్రుం శునాతి హినస్తి శత్రువును చంపునది. గొడ్డలి), లబ్ధ్వా= పొంది, తత్ ఉక్త= ఆయన చెప్పిన, దనుజ ఛేదీ = రాక్షస సంహారకములయిన, మహా అస్త్రాదికం= మహాస్త్రములు మొదలయిన వాటిని, ప్రాప్తః= పొందితివి, అథ = అటుపిమ్మట, అకృత వ్రణ మునిం= సింహముఖమునుండి రక్షింపబడిన అకృతవ్రణుడను మునిని, మిత్రమ్ ప్రాప్య= మిత్రునిగా పొంది, స్వ ఆశ్రమమ్= నీ తండ్రి ఆశ్రమమునకు, అగమః= తిరిగి వచ్చితివి.

**తాత్పర్యము:** నీ తల్లిని ఆనందింపజేయుటకు నీ తండ్రి జమదగ్ని – స్తుతులతో మెప్పించి, కామధేనువును స్వర్గలోకమునుండి తన ఆశ్రమమునకు తెచ్చెను. అటుపిమ్మట నీ తండ్రి మాట ప్రకారం నీవు హిమాలయములకు వెళ్ళి గౌరీపతి అయిన శివుని ఆరాధించితివి. శివుని నుండి పరశువును ఆయుధముగా పొంది, ఆయన చెప్పిన రాక్షస సంహారకములయిన మహాస్త్రములు మొదలయిన వాటిని పొందితివి. సింహముఖమునుండి రక్షింపబడిన అకృతవ్రణుడను మునిని మిత్రునిగా పొంది నీ తండ్రి ఆశ్రమమునకు తిరిగి వచ్చితివి.

**36–5 శ్లో.**

**ఆఖేటోపగతోఽర్జునః సురగవీసంప్రాప్తసంపద్గణైః**
**త్వత్పిత్రా పరిపూజితః పురగతో దుర్మంత్రివాచా పునః ।**
**గాం క్రేతుం సచివం న్యయుంక్త కుధియా తేనాపి రుంధన్మని–**
**ప్రాణక్షేపసరోషగోహతచమూచక్రేణ వత్సో హృతః ॥**

**ప్రతిపదార్థము:** ఆఖేట–ఉపగతః = వేటకై అడవికి వెళ్ళిన(ఆఖేట్యంతే త్రాస్యంతే ప్రాణినః అత్ర – ఇందు ప్రాణులు చంపబడును. వేట), అర్జునః = కార్తవీర్యార్జునుడు, సురగవీ= కామధేనువు ఉన్న నీ యాశ్రమమునకు వచ్చి, సంప్రాప్తః = కామధేనువు వలన ప్రాప్తించిన, సంపత్ గణైః = షడ్రసోపేత భోజనాదుల సంపదతో, త్వత్ పిత్రా = నీ తండ్రిచే, పరిపూజితః= పూజింపబడి (పరిపూజనం సమ్యక్ పూజనం అర్చనమ్ బాగా పూజించుట అర్చించుట), పురగతః = నిజ రాజధానియగు మాహిష్మతీ నగరమునకు వెళ్ళి, పునః = మరలా, దుర్మంత్రివాచా= దుర్బుద్ధి కల మంత్రి మాటలతో, గాం= ఆ కామధేనువును, క్రేతుం = స్వీకరించుటకు ఇష్టపడి, సచివం = దానికొరకు మంత్రిని, న్యయుంక్త =నియమించెను, తేన అపి = అతడు కూడా, కుధియా= చెడు బుద్ధితో, రుంధన్= ఆవును బలాత్కారముగా తీసుకొని పోవుటకు ప్రయత్నించి అడ్డగించిన, ముని–ప్రాణ క్షేప= జమదగ్నిని వాడు సంహరించెను. (క్షేపణస్య భావః – పారవేయుట కదలుట అంగ సంచాలనము), స రోషః= అప్పుడు ఆ కామధేనువు కోపించి, గోః= ఆవు, చమూ చక్రేణ హతః= వాని సైన్యమును సంహరించెను, వత్సః = దుర్మంత్రి ఆసురభి యొక్క దూడను( వదతి అభీక్ష్ణం మాతరమ్ పదేపదే తల్లిని పిలుచువాడు. పిల్లవాడు, లేగదూడ), హృతః = అపహరించెను.

**తాత్పర్యము:** ఒకనాడు కార్తవీర్యార్జునుడు వేటకై అడవికి వెళ్ళి, నీ యాశ్రమమునకు వచ్చి కామధేనువు వలన ప్రాప్తించిన షడ్రసోపేత భోజనాదుల సంపదతో నీ తండ్రిచే పూజింపబడి దుర్బుద్ధి కల మంత్రి మాటలతో ఆ కామధేనువును స్వీకరించుటకు ఇష్టపడి దాని అపహరణ కొరకు మంత్రిని నియమించెను. అతడు కూడా చెడు బుద్ధితో ఆవును బలాత్కారముగా తీసుకొని పోవుటకు ప్రయత్నించెను. అడ్డగించిన

జమదగ్నిని సంహరించెను. అప్పుడు ఆ కామధేనువు కోపించి వాని సైన్యమును సంహరించెను . దుర్మంత్రి ఆసురభి యొక్క దూడను అపహరించెను.

**36-6 శ్లో.**

**శుక్రోజ్జీవితతాతవాక్యచలితక్రోధోఽథ సఖ్యా సమం**
**బిభ్రద్ధ్యాతమహోదరోపనిహితం చాపం కుఠారం శరాన్ ।**
**ఆరూఢస్సహవాహ యంతృకరథం మాహిష్మతీమావిశన్**
**వాగ్భిర్వత్సమదాశుషి క్షితిపతౌ సంప్రస్తుథాః సంగరమ్ ॥**

**ప్రతిపదార్థము:** శుక్ర –ఉజ్జీవిత= శుక్రాచార్యునిచే పునర్జీవితుడయిన(శుచ్యతి ఆర్ద్రో భవతి ద్రవంగా వుండునది. వీర్యము శుక్రాచార్యుడు), తాత= నీ తండ్రి, వాక్యచలితక్రోధః= మాటలతో క్రోధముతో చలించి, అథ = అటుపిమ్మట, సఖ్యా సమం బిభ్రత్ ధ్యాత = నీ మిత్రుడైన అకృతవ్రణుడు ధ్యానింపగా ప్రసన్నుడైన శివునిఅనుచరుడైన, మహోదర= మహోదరునిచే, ఉపనిహితం= గ్రహించబడిన, చాపం కుఠారం శరాన్= ధనుస్సు గొడ్డలి బాణములను, ఆరూఢః సహ వాహ యంతృక రథం= సారథితోగూడిన రథమును స్వీకరించి రథమును ఎక్కి (నియచ్ఛతి ఇంద్రియాణి అశ్వాన్ వా గుఱ్ఱములను వశపరచుకొనువాడు. సారథి), మాహిష్మతీమ్= మాహిష్మతీ నగరమును (మహిష్మతా రాజ్ఞా నిర్మితా నగరీ మహిష్మత రాజుచే నిర్మింపబడిన నగరము), ఆవిశన్= ప్రవేశించి (ముట్టడించి), వాగ్భిః వత్సమ్ అదాశుషి = అడిగిన మాత్రమున దూడను ఇవ్వని, క్షితిపతౌ= కార్త వీర్యార్జునునితో, సంగరమ్ = యుద్ధమును, సంప్రస్తుథాః= యుద్ధమును ప్రారంభించితివి.

**తాత్పర్యము:** శుక్రాచార్యునిచే పునర్జీవితుడయిన నీ తండ్రి మాటలతో క్రోధముతో చలించి, మిత్రుడైన అకృతవ్రణుడు ధ్యానింపగా ప్రసన్నుడైన శివునిఅనుచరుడైన మహోదరునిచే ధనుస్సు గొడ్డలి బాణములను గ్రహించి, సారథితోగూడిన రథమును స్వీకరించి రథమును ఎక్కి, మాహిష్మతీ నగరమును ముట్టడించి, అడిగిన మాత్రమున దూడను ఇవ్వని కార్త వీర్యార్జునునితో యుద్ధమును ప్రారంభించితివి.

**36–7 శ్లో.**

**పుత్రాణామయుతేన సప్తదశభిశ్చాక్షౌహిణీభిర్మహా–**
**సేనానీభిరనేకమిత్ర నివహైర్వ్యాజృంభితాయోధనః ।**
**సద్యస్త్వత్కకుఠారబాణవిదలన్నిశ్శేషసైన్యోత్కరో**
**భీతిప్రద్రుతనష్టశిష్టతనయాస్త్వామాపతద్ధేహయః ॥**

**ప్రతిపదార్థము:** అయుతేన పుత్రాణామ్ = పదివేలమంది కొడుకులతో, సప్తదశభిః చ అక్షౌహిణీభిః = పదిహేడు అక్షౌహిణుల సైన్యములతో(అక్షాణాం ఊహినః ఊహః సమూహః అస్తి అస్యాః ఇతి విశిష్టసంఖ్య గల సేన. 21870 రథములు, 21870 ఏనుగులు, 65610 గుఱ్ఱములు, 109350 పదాతిదళము గల సేనావిశేషము), మహా–సేనానీభిః= గొప్ప సేనాధి పతులతో, అనేకమిత్ర నివహైః= అనేక మిత్రసమూహములతోను, ఆయోధనః వ్యాజృంభితః= యుద్ధరంగమున నీతో తలపడి విజృంభించెను. (ఆయుధ్యంతే యోద్ధారో అత్ర – యోద్ధలు ఇచ్చట యుద్ధం చేయుదురు. యుద్ధస్థలము), సద్యః= క్షణములో (వెంటనే), త్వత్క కుఠార బాణ = నీ కుఠారధారకు, అస్త్రములతోను, నిశ్శేష సైన్య ఉత్కరః = ఆ కార్తవీర్యార్జుని సేననంతనూ(ఉత్కరణం ఏకత్రీకరణం విస్తృతీకరణం వా ప్రోగు.సమూహము), నిశ్శేషముగా విదలన్ =హతమార్చితివి, నష్ట శిష్ట తనయః = మరణించగా మిగిలిన పుత్రులు, భీతి ప్రద్రుతః = భయముతో పారిపోగా, త్వామ్=నిన్ను, హేహయః= కార్తవీర్యార్జునుడు, ఆపతత్= స్వయముగా ఎదుర్కొనెను.

**తాత్పర్యము:** పరశురామావతారములో నీతో ఆ హైహయ రాజు కార్తవీర్యార్జునుడు తన పదివేలమంది కొడుకులతో, పదిహేడు అక్షౌహిణుల సైన్యములతో, గొప్ప సేనాధి పతులతో, అనేక మిత్రసమూహములతోను – యుద్ధరంగమున తలపడి విజృంభించెను. క్షణములో నీ కుఠారధారకు, అస్త్రములతోను ఆ కార్తవీర్యార్జుని సేననంతనూ నిశ్శేషముగా హతమార్చితివి. మరణించగా మిగిలిన పుత్రులు భయముతో పారిపోగా నిన్ను కార్తవీర్యార్జునుడు స్వయముగా ఎదుర్కొనెను.

**36-8 శ్లో.**

**లీలావారితనర్మదాజలవలల్లంకేశగర్వాపహ-**
**శ్రీమద్బాహు సహస్రముక్త బహుశస్త్రాస్త్రం నిరుంధన్నముమ్ ।**
**చక్రే త్వయ్యథవైష్ణవేఽపి విఫలే బుద్ధ్వాహరిం త్వాం ముదా**
**ధ్యాయంతం ఛితసర్వదోషమవధీః సో-గాత్ పరం తే పదమ్ ॥**

**ప్రతిపదార్థము:** లీలా= విలాసమాత్రముగా, వారిత నర్మదాజల= నర్మదానదీ జలములను అడ్డగించి, వలత్ లంకేశ గర్వ-అపహ='రావణుని' గర్వము అణచిన, శ్రీమత్ –బాహు సహస్ర=గొప్పవైన వేయి చేతులతో, బహు శస్త్ర అస్త్రం = అనేక అస్త్రశస్త్రములు, ముక్త= విసరుచున్న, అముమ్ = ఆ కార్తవీర్యార్జునుని, నిరుంధన్ = అడ్డగించావు, అథ= అటుపిమ్మట, త్వయి= నీయందు, వైష్ణవే చక్రే అపి విఫలే = ప్రయోగించిన విష్ణుచక్రము సహితము విఫలము కాగా, త్వాం= నువ్వు, హరిం= హరియే అని, బుద్ధ్వా= తలచి, ముదా= సంతోషముగా, ధ్యాయంతం = నిన్ను ధ్యానించి, ఛిత సర్వ దోషమ్ = సర్వదోషములు ఖండించబడిన వాడయిన, సః= కార్తవీర్యార్జునుని, అవధీః= వేయిచేతులను ఖండించి సంహరించావు, తే పరం పదమ్= నీ గొప్పదయిన పరమపదమునకు (వైకుంఠమునకు), అగాత్ = అతడు చేరెను. (ముక్తిని పొందెనని భావం).

**తాత్పర్యము:** నర్మదానదీ జలములను అడ్డగించి – 'రావణుని' గర్వము అణచిన గొప్పవైన వేయి చేతులతో అనేక అస్త్రశస్త్రములు విసరుచున్న ఆ కార్తవీర్యార్జునుని అడ్డగించావు. అటుపిమ్మట నీయందు ప్రయోగించిన విష్ణుచక్రము సహితము విఫలము కాగా నువ్వు హరియే అని తలచి సంతోషముగా నిన్ను ధ్యానించి సర్వదోషములు ఖండించబడిన వాడయిన కార్తవీర్యార్జునుని వేయిచేతులను ఖండించి సంహరించావు. నీ గొప్పదయిన పరమపదమునకు (వైకుంఠమునకు) అతడు చేరెను. (ముక్తిని పొందెనని భావం)

**36-9 శ్లో.**

**భూయో మర్షితహైహయాత్మజగణైస్తాతే హతే రేణుకా**
**మాఘ్నానాం హృదయం నిరీక్ష్య బహుశో ఘోరాం ప్రతిజ్ఞాం వహన్ ।**

**ధ్యానానీతరథాయుధస్త్వమకృథా విప్రద్రుహః క్షత్రియాన్**
**దిక్చక్రేషు కుఠారయన్ విశిఖయన్ నిః క్షత్రియాం మేదినీమ్ ॥**

**ప్రతిపదార్థము:** భూయః= మరలా, అమర్షిత= ఆగ్రహముతో ఉన్న (న మర్షణం న క్షమా ఓర్పు లేనిది), హైహయ ఆత్మజగణైః = యుద్ధమున చావగా మిగిలిన కార్తవీర్యార్జునుని కుమారులతో, తాతే హతే= మీతండ్రియగు జమదగ్ని చనిపోగా, రేణుకామ్ = నీ తల్లి రేణుక (రేణునా కాయతి పుప్పొడిచే, దుమ్ముచే ప్రకాశించునది రేణుక, పరశురాముని తల్లి), బహుశః హృదయం ఆఘ్నానాం = యిరువదియొక్క మాఱులు గుండెలు బాదుకొని ఏడువగా, నిరీక్ష్య = చూసి, ఘోరాం ప్రతిజ్ఞాం = క్షత్రియులందరిని వధింతునని ఘోరమైన ప్రతిజ్ఞ, వహన్ = చేసి, ధ్యాన= ధ్యానమాత్రమున, ఆనీత= రప్పించుకొన్న, రథ ఆయుధః = రథ, ఆయుధములతో (ఆయుధ్యతే అనేన – ఆయుధము, అస్త్రము)(రమ్యతే అనేన అత్ర వా దీనితో ఆనందింతురు. రథము), త్వమ్= నువ్వు, అకృథా విప్ర ద్రుహః = విప్రద్రోహులగు (విప్ వాక్ సా అస్తి అస్య – మంచి వాక్కులు కలవాడు. బ్రాహ్మణుడు.)( జిఘాంసా అనిష్టచింతనే చ ద్రుహ్యతి చంపుట చెడును ఆలోచించుట ద్రోహము చేయుట), క్షత్రియాన్= క్షత్రియులందరిని, దిక్ చక్రేషు= సకల దిశలు గాలించి, కుఠారయన్= గొడ్డలితో, విశిఖయన్= బాణములతోను హతమార్చి, మేదినీమ్= భూమిని (మేదః మధుకైటభయోః మేదః కారణం అస్తి అస్యాః – దీనికి మధుకైటభుల కొవ్వు కారణమైనది. భూమి, పృథివి), నిః క్షత్రియాం= రాచపురుగు లేకుండ చేసితివి. (క్షత్రియ నాశము చేసావు) (క్షత్రియ= క్షత్రే రాష్ట్రే రాజ్యపాలనే సాధు తస్య అపత్యమ్ – చక్కని రాజ్యపాలనము చేయువాని (కుమారుడు) సంతానము).

**తాత్పర్యము:** ఆగ్రహముతో ఉన్న యుద్ధమున చావగా మిగిలిన కార్తవీర్యార్జునుని కుమారులతో మీతండ్రియగు జమదగ్ని చనిపోగా నీ తల్లి రేణుక యిరువదియొక్క మాఱులు గుండెలు బాదుకొని ఏడువగా చూసి క్షత్రియులందరిని వధింతునని ఘోరమైన ప్రతిజ్ఞ చేసి ధ్యానమాత్రమున రప్పించుకొన్న రథ, ఆయుధములతో నువ్వు విప్రద్రోహులగు క్షత్రియులందరిని సకల దిశలు గాలించి గొడ్డలితో బాణములతోను హతమార్చి భూమిలో రాచపురుగు లేకుండ చేసితివి. (క్షత్రియ నాశము చేసావు)

**విశేషాలు**

**రేణుక:** పరశురాముని తల్లి. జమదగ్ని భార్య. ఈమెకు ఒకప్పుడు పరపురుష వీక్షణమున మనసు చలింపగా జమదగ్ని అది తెలిసికొని పరశురామునిచే ఈమె శిరశ్ఛేదము చేయించి అనంతరము ఆపరశురాముడు వేడినంతట ఈమెను పునర్జీవితురాలుగా చేసెను. ఈమె పరాశక్త్యంశము.

**36-10 శ్లో.**

**తాతోజ్జీవన కృన్నృపాలకకులం త్రిః సప్తకృత్వో జయన్**
**సంతర్ప్యాథ సమంతపంచకమహారక్తహ్రదౌఘే పితౄన్ ।**
**యజ్ఞే క్ష్మామపి కాశ్యపాదిషు దిశన్ సాల్వేన యుధ్యన్ పున**
**కృష్ణోఽముం నిహనిష్యతీతి శమితో యుద్ధాత్ కుమారైర్భవాన్ ॥**

**ప్రతిపదార్థము:** తాత-ఉజ్జీవనకృత్= తండ్రి శిరస్సును కలిపి యజ్ఞములచేత తండ్రిని తిరిగి జీవింపజేసి, నృపాలక కులం= రాజ సమూహములపై, త్రిః సప్తకృత్వః = ఇరువది యొక్కమాఱులు దండెత్తి, జయన్ = జయించావు (సంహరించావు), అథ = అటుపిమ్మట, సమంత పంచక = శమంత పంచకమను పేర ఏర్పడిన, మహారక్త హ్రదౌఘే = వారి రక్తపు మడుగులలో, పితౄన్ సంతర్ప్య= పితృతర్పణము చేసి, యజ్ఞే= యజ్ఞమునందు యజ్ఞ దక్షిణగా, క్ష్మామ్ -అపి = నీవు గెలిచిన భూమండల మంతయు, కాశ్యప-ఆదిషు= కాశ్యపాది ఋత్విక్కులకు, దిశన్= దానం చేసితివి, సాల్వేన = అటుపై మఱల సాల్వునితో, యుధ్యన్ = యుద్ధము చేయదలుచుకొని, పునః= మరలా, అముం = భవిష్యత్కాలములో ఈ 'సాల్వుని', కృష్ణః= కృష్ణుడు, నిహనిష్యతి ఇతి =సంహరింపగలడని, కుమారైః = సనకాది బ్రహ్మ మానసపుత్రులు చెప్పగా, భవాన్= నువ్వు, యుద్ధాత్= యుద్ధమును విరమించి, శమితః= ప్రశాంతుడవైతివి.

**తాత్పర్యము:** పరశురామావతారములో నువ్వు తండ్రి శిరస్సును కలిపి . యజ్ఞములచేత తండ్రిని తిరిగి జీవింపజేసి రాజ సమూహములపై ఇరువది యొక్కమాఱులు దండెత్తి జయించావు. (సంహరించావు) అటుపిమ్మట శమంత

పంచకమను పేర ఏర్పడిన వారి రక్తపు మడుగులలో పితృతర్పణము చేసి యజ్ఞమునందు యజ్ఞ దక్షిణగా నీవు గెలిచిన భూమండల మంతయు కాశ్యపాది ఋత్విక్కులకు దానం చేసితివి. అటుపై మఱల సాల్వునితో యుద్ధము చేయదలుచుకొని భవిష్యత్కాలములో 'సాల్వుని' కృష్ణుడు సంహరింపగలడని సనకాది బ్రహ్మ మానసపుత్రులు చెప్పగా నువ్వు యుద్ధమును విరమించి ప్రశాంతుడవైతివి.

**విశేషాలు**

**స(శ)మంత పంచకము:** కురుక్షేత్రానికి పూర్వం ఉన్న పేరు. త్రేతాద్వాపర యుగసంధియందు పరశురాముడు మదాంధీభూతులు అయిన క్షత్రియులతో ఇరువదియొక్క మాఱు పోరాడి రాజులను ఎల్ల చంపి వారిరక్తముతో అయిదు మడుగులు కావించి ఆరుధిర జలముల పితృతర్పణము చేయగా ఆపితృగణముచే ప్రార్థితుడు అయి ఉపశమిత క్రోధుడు ఆయెను. దానఁజేసి తత్సమీపప్రదేశము శమంతపంచకము అనబరగెను. అందు పాండవులును కౌరవులును పదునెనిమిది అక్షౌహిణుల బలముతో పదునెనిమిది దినములు యుద్ధముచేసిరి. అది కారణముగ దీనికి కురుక్షేత్రము అను పేరును కలిగెను.

**36-11 శ్లో.**

**న్యస్యాస్త్రాణి మహేంద్ర భూభృతి తపస్తన్వన్ పునర్మజ్జితాం**
**గోకర్ణావధిసాగరేణ ధరణీం దృష్ట్వాఽర్థితస్తాపసైః ।**
**ధ్యాతేష్వాసధృతానలాస్త్రచకితం సింధుం స్రువక్షేపణా-**
**దుత్సార్యోద్ధృతకేరళో భృగుపతే! వాతేశ! సంరక్ష మామ్ ॥**

**ప్రతిపదార్థము:** అస్త్రాణి= నీవు అస్త్రములను, న్యస్య= విడిచి (అస్త్ర సన్యాసము చేసి), మహేంద్ర భూభృతి= మహేంద్రపర్వతమునందు(మహాన్ ఇంద్రః ఇంద్రస్యాపి నియంతృత్వాత్ పరమేశ్వరః – ఇంద్రుడు ఇంద్రుని కూడ నియంత్రించుట వలన పరమేశ్వరుడు ఒకానొక కొండ), తపః తన్వన్= తపస్సుజేసి, పునః = మరలా, గోకర్ణ అవధి= గోకర్ణమువరకు (గోరివ కర్ణః యస్య – గోవువలె చెవులు కలది. ఒక తీర్థము), సాగరేణ = సముద్రముచే, ధరణీం = భూమి, మజ్జితాం=

మునిగిపోవుటను, దృష్ట్వా= చూసి, తాపసైః అర్థితః= తాపసులచే ప్రార్థింపబడి, ధ్యాత ఇష్వాసః= ధ్యానశక్తితో ధనువును ధరించి (ఇషవః అస్యంతే అనేన –బాణములను వదలునది. ధనుస్సు), అనల–అస్త్ర ధృత = ఆగ్నేయాస్త్ర సంధానము చేయగా, చకితం = హడలిపోయిన, సింధుం= సముద్రునిపై, స్రువ క్షేపణాత్= 'స్రువమును'విసిరి (ఒక యజ్ఞోపకరణము, హోమసాధనమైన కొయ్యగరిటె), ఉత్సార్య = దూరముగా తరిమి, ఉద్ధృతకేరలః = కేరళరాష్ట్రమును ఉద్ధరించితివి(ఉత్ ఊర్ధ్వం హృతః ధృతో వా పైకి లేపబడినది ధరించబడినది), భృగుపతే। = ఓ పరశురామా!, వాతేశ।= గురువాయూరు దేవా, మామ్ సంరక్ష = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** నీవు అస్త్రములను –అస్త్ర సన్యాసము చేసి– మహేంద్రపర్వతమునందు తపస్సుజేసి గోకర్ణమువరకు సముద్రముచే భూమి మునిగిపోవుటను చూసి తాపసులచే ప్రార్థింపబడిధ్యానశక్తితో ధనువును ధరించి ఆగ్నేయాస్త్ర సంధానము చేయగా హడలిపోయిన సముద్రునిపై 'స్రువమును'విసిరి దూరముగా తరిమి కేరళరాష్ట్రము ను ఉద్ధరించితివి. ఓ పరశురామా! గురువాయూరు దేవా! నన్ను రక్షించు

***నవమస్కందం సంపూర్ణం***

**36వ దశకము సమాప్తము.**

# దశమస్కంధము

## దశకమ్ 37 – శ్రీకృష్ణావతారోపక్రమము

**37–1 శ్లో.**

**సాంద్రానందతనో! హరే! నను పురా దైవాసురే సంగరే**
**త్వత్కృత్తా అపి కర్మ శేషవశతో యే తే న యాతా గతిమ్ ।**
**తేషాం భూతల జన్మనాం దితిభువాం భారేణ దూరార్దితా**
**భూమిః ప్రాప విరించమాశ్రితపదం దేవైః పురైవాగతైః ॥**

**ప్రతిపదార్థము:** సాంద్ర–ఆనందతనో= ఓ పరమానందస్వరూపా!, హరే= హరీ!, పురా= పూర్వము జరిగిన, దైవ అసురే= దేవదానవ యుద్ధమున, త్వత్ కృత్తా అపి= నీ చేతిలో చనిపోయినప్పటికి(కృత్తం ఛిన్నమ్ ఛేదించబడినది), కర్మ శేష వశతః = కర్మశేషముచే (రెండు మూడు జన్మములలో ముక్తిని అనుగ్రహిస్తానని స్వామి చెప్పిన వాక్యముచే), యే =ఏ రాక్షసులయితే, గతిమ్ = మోక్షమును, న యాతా = పొందలేదో, తే= వారు, భూతల జన్మనాం = భూమిలో కంసాదుల రూపములో జన్మించిరి. (భూః ఏవ తలం భువః తలం వా భూతలము. భూమి), తేషాం దితిభువాం భారేణ =ఆ దితికి పుట్టిన రాక్షసుల యొక్క భారముచే, దూర–అర్దితా = అతిశయముగా పీడింపబడిన(దుఃఖేన హీయతే ప్రాప్యతే కష్టంగా పొందబడునది. దూరము అగోచరము), భూమిః= భూదేవి, పురా ఏవ= పూర్వమే( తను రావటానికే పూర్వమే), ఆగతైః= ప్రాప్తించిన, దేవైః=దేవతలతో సహ, ఆశ్రితపదం= సత్యలోకములో ఉన్న, విరించమ్= బ్రహ్మను, ప్రాప నను= పొందెను కదా. (శరణు పొందెను).

**తాత్పర్యము:** ఓ పరమానందస్వరూపా! హరీ! పూర్వము జరిగిన దేవదానవ యుద్ధమున నీ చేతిలో చనిపోయినప్పటికి కర్మశేషముచే ముక్తిని పొందని రాక్షసులు భూతలమున కంసాదుల రూపములో జన్మించిరి. ఆ దితికి పుట్టిన రాక్షసుల యొక్క భారముచే అతిశయముగా పీడింపబడిన భూదేవి తను రావటానికే పూర్వమే సత్య లోకానికి వచ్చిన దేవతలతో సహ బ్రహ్మను శరణు పొందెను.

**విశేషాలు**

**కర్మ:** కర్మ మూడు విధాలు. ప్రారబ్ధం ఆగామి సంచితం. వర్తమానంలో అనుభవించేది ప్రారబ్ధం. భవిష్యత్తులో అనుభవించబోయేది ఆగామి. అనుభవానికింకా రాక భూతకాలానికి సంబంధించి పోగయిన కర్మ సంచితం. ఇంతేగాక కర్మ అనేది మరోవిధంగా చూస్తే రెండు వర్గాలుగా మనం దాన్ని విభజించవచ్చు. శాస్త్రం విధించిన కర్మ ఒకటి. లౌకికంగా మనం ప్రతిదినమూ మన ఇష్టానుసారంగా చేస్తూ పోయే కర్మ ఒకటి. ఇది లౌకిక కర్మ అయితే అది శాస్త్రీయ కర్మ. లౌకిక కర్మ ప్రియమే గానీ మనకు హితం కాకపోవచ్చు. అదే శాస్త్రీయంగా ఆచరిస్తే ప్రియమూ, హితమూ రెండూ అవుతుంది. శాస్త్రీయ కర్మలు విధులు కావచ్చు, నిషేధాలు కావచ్చు. ఇందులో నిషేధాలను నిర్మోహమాటంగా వదిలేయాలి. విధులలో నిత్యనైమిత్తికాలను విధిగా ఆచరించాలి. కామ్యాలను కోరికలుంటే ఆచరించటం లేకుంటే మానేసినా ప్రమాదం లేదు. నిత్యనైమిత్తికాలను మానేస్తే ప్రత్యవాయమనే దోషం వచ్చిపడుతుంది.

**సాన్ద్రానన్ద:** నారాయణభట్టు మొదటి సర్గ మొదటి శ్లోకంలో "సాంద్రానందావ బోధాత్మకమ్" అను పదముతో ప్రారంభించాడు. పూర్ణావతారమైన కృష్ణావ తారమునకు నాందీ ప్రస్తావన ఈ దశకములో వచ్చుచున్నది కనుక అదే పదముతో ఈ దశకం ప్రారంభించాడు. సచ్చిదానందఘనమైన భగవత్ తత్వము సంబోధిం చెను.

**37-2 శ్లో.**
**హా హా దుర్జన భూరి భారమథితాం పాథోనిధౌ పాతుకామ్**
**ఏతాం పాలయ హంత మే వివశతాం సంపృచ్ఛ దేవానిమాన్ ।**
**ఇత్యాది ప్రచుర ప్రలాప వివశామాలోక్య ధాతా మహీం**
**దేవానాం వదనాని వీక్ష్య పరితో దధ్యౌ భవంతం హరే! ॥**

**ప్రతిపదార్థము:** హరే।= ఓ గురువాయూరు దేవా!, హా హా= అయ్యో!, దుర్జన= పాపాత్ములయిన దానవులు చేయుచున్న పాపముల, భూరి భార=అధిక భారముచే,

మథితాం= బాగ కష్టపడి( మథింపబడి), పాథోనిధౌ= సముద్రమున, పాతుకామ్= మునిగిపోవు(క్రుంగిపోవు), ఏతాం = ఈ నన్ను, పాలయ = పాలింపుము (రక్షింపుము), హంత = అయ్యో! (హర్షే అనుకంపాయాం చ పీడనే చ–సంతోషమునందు దయ, పీడయందు వచ్చు పదం), మే వివశతాం= నా ఈ దురవవస్థనుగూర్చి, ఇమాన్ దేవాన్ = దేవతలను, సంపృచ్ఛ= అడుగుము, ఇతి – ఆది= ఈ విధంగా, ప్రచుర ప్రలాప వివశామ్ =బాగా ఎక్కువగా అర్థ శూన్యమైన మాటలతో పెక్కు విధముల వాపోవుచు వశము తప్పి ఉన్న – (ప్రచుర= ప్రచోరతి బహు భవతిబాగా ఎక్కువ అగునది. ప్రభూతము బాగా ఎక్కువ)(ప్రలాప= అతిశయేన లపతి తస్య భావః కర్మ వా బాగా వాగుట), మహీం= భూదేవిని, ఆలోక్య= చూసి, దేవానాం వదనాని వీక్ష్య= దేవతల మోములను వీక్షించిన, ధాతా= బ్రహ్మ, పరితః= చుట్టు పక్కల ఉన్న వారితో కలిసి, భవంతం= నిన్ను, దధ్యౌ= ధ్యానించెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! "అయ్యో! పాపాత్ములయిన దానవులు చేయుచున్న పాపముల అధిక భారముచే మథింపబడి సముద్రమున మునిగిపోవు (క్రుంగిపోవు) ఈ నన్ను పాలింపుము (రక్షింపుము) అయ్యో! నా ఈ దురవవస్థను గూర్చి దేవతలను అడుగుము" అని పలుకుతూ పెక్కు విధముల వాపోవుచు వశము తప్పి ఉన్న భూదేవిని చూసి దేవతల మోములను వీక్షించిన బ్రహ్మ చుట్టు పక్కల ఉన్న వారితో కలిసి నిన్ను ధ్యానించెను

**37–3 శ్లో.**

**ఊచే చాంబుజభూరమూనయి సురాః। సత్యం ధరిత్ర్యావచః**
**నన్వస్యా భవతాం చ రక్షణవిధౌ దక్షో హి లక్ష్మీపతిః ।**
**సర్వే శర్వపురస్సరా వయమితో గత్వా పయోవారిధిం**
**నత్వా తం స్తుమహే జవాదితి యయుః సాకం తవాకేతనమ్ ॥**

**ప్రతిపదార్థము:** అంబుజభూః=పద్మమునుండి పుట్టిన ఆ బ్రహ్మ, అమూన్= దేవతలతో, ఊచే చ = ఇట్లు చెప్పెను, అయి సురాః = ఓ! దేవతలారా!, ధరిత్ర్యా వచః = భూమి చెప్పిన మాటలు, సత్యం నను = సత్యము, అస్యాః = భూమిని, భవతాం చ=

మిమ్ములను, రక్షణ-విధౌ = రక్షించుటయందు, లక్ష్మీపతిః= లక్ష్మీపతియగు విష్ణువు, దక్షః హి= దక్షుడు కదా!, సర్వే వయమ్ = మనమందరము, శర్వపురః సరాః = శివుని మున్నిడుకొని, ఇతః = ఇక్కడి నుండి, పయః వారిధిం= పాలకడలి వద్దకు, గత్వా = వెళ్ళి, తం నత్వా = ఆ విష్ణువుకు మొక్కి స్తుతించెదము, ఇతి= అని చతుర్ముఖుడనగా, సాకం= వారందఱు, తవ ఆకేతనమ్= నీ నివాసమగు పాలకడలిని, జవాత్= వేగముగా, యయుః= చేరిరి.

**తాత్పర్యము:** పద్మమునుండి పుట్టిన బ్రహ్మ దేవతలతో ఇట్లు చెప్పెను "ఓ! దేవతలారా! భూమి చెప్పిన మాటలు సత్యము భూమిని మిమ్ములను రక్షించుటయందు – లక్ష్మీపతియగు విష్ణువే దక్షుడు కదా! మనమందరము శివుని మున్నిడుకొని ఇక్కడి నుండి పాలకడలి వద్దకు వెళ్ళి ఆ విష్ణువుకు మొక్కి స్తుతించెదము" అని చతుర్ముఖుడనగా ఆలకించి, వారందఱు నీ నివాసమగు పాలకడలిని వేగముగా చేరిరి.

**37-4 శ్లో.**
**తే ముగ్ధానిలశాలి దుగ్ధజలధేస్తీరం గతాస్సంగతాః**
**యావత్ త్వత్పద చింతనైకమనసస్తావత్ స పాథోజభూః ।**
**త్వద్వాచం హృదయే నిశమ్య సకలానానందయన్నూచివాన్**
**ఆఖ్యాతః పరమాత్మనా స్వయమహం వాక్యం తదాకర్ణ్యతామ్ ॥**

**ప్రతిపదార్థము:** తే= దేవతలు మరియు బ్రహ్మ మహేశ్వరులు, ముగ్ధ అనిల శాలి= చల్లని పిల్ల వాయువులు వీచు, దుగ్ధ జలధేః తీరం గతాః = పాలకడలి తీరమును జేరి, యావత్ = ఎంతవరకు, త్వత్ పద చింతన ఏకమనసః= శ్రీ హరివైన నీ చరణ ధ్యానమందు ఏకాగ్రచిత్తులై, సంగతాః= ఉన్నారో, తావత్= అంతవరకు (అప్పుడు), స పాథోజభూః = ఆ బ్రహ్మ, త్వత్ వాచం= నీ మాటను, హృదయే నిశమ్య = హృదయాకాశమునందు విని(తెలుసుకొని), పరమాత్మనా = పరమాత్మ యైన విష్ణుదేవునిచే, స్వయమ్ = స్వయముగా, అహం = నేను (నాకు), ఆఖ్యాతః= ఒక వాక్యము చెప్పబడెను(ఆఖ్యాతః కథితః – చెప్పబడినది), తత్ వాక్యం = ఆ

వాక్యమును, ఆకర్ణ్యతామ్= వినుదురుగాక అని, సకలాన్ ఆనందయన్ = అందరికి సంతోషకరముగా, ఊచివాన్= ఇట్లు పలికెను.

**తాత్పర్యము:** దేవతలు మరియు బ్రహ్మ మహేశ్వరులు చల్లని పిల్ల వాయువులు వీచు పాలకడలి తీరమును జేరి శ్రీ హరివైన నీ చరణ ధ్యానమందు ఏకాగ్రచిత్తులై ఉన్న సమయములో ఆ బ్రహ్మ నీ మాటను హృదయాకాశమునందు విని పరమాత్మ యైన విష్ణుదేవునిచే స్వయముగా నాకు ఒక వాక్యం చెప్పబడెను. ఆ వాక్యమును వినుదురుగాక అని అందరికి సంతోషకరముగా ఇట్లు పలికెను

**విశేషాలు**

**హృత్ /హృదయ:** రెండింటికీ హృదయమనే heart అర్థం. శరీరంలో ఎడమవైపు పుండరీక ఆకారంగా ఉన్న భాగం. కానీ హృదయానికీ బుద్ధికీ తేడా లేకుండా రెండింటినీ ఏకంచేసి పేర్కొంటారు వేదాంతులు. దానికి కారణం రెండింటినీ కలుపుతూ ఒకే ఒక సిర కపాలం వరకూ ప్రసరిస్తూ ఉండటమే. తద్వారా రక్తం పైకి వెళ్ళిపోయి దాని బలంతో బుద్ధి పనిచేస్తుంది. కనుక రెండింటికి ఉన్న ఈ అవినాభావాన్ని దృష్టిలో ఉంచుకుని ఏకంగా వర్ణించటం జరిగింది. హృది అయం అని చమత్కారంగా మరొక అర్థాన్ని చెప్పాయి ఉపనిషత్తులు. హృది అంటే హృదయంలో అయం అంటే ఆ పరమాత్మ జీవరూపంగా వచ్చి కూచున్నాడు. అందుకే హృదయం అనే పేరు సార్థకమయిందని చెబుతారు ఉపనిషదృషులు.

**37-5 శ్లో.**
**జానే దీనదశామహం దివిషదాం భూమేశ్చ భీమైర్నృపైః**
**తత్ క్షేపాయ భవామి యాదవకులే సోఽహం సమగ్రాత్మనా ।**
**దేవా వృష్ణికులే భవంతు కలయా దేవాంగనాశ్చావనౌ**
**మత్సేవార్థమితి త్వదీయవచనం పాథోజభూరూచివాన్ ॥**

**ప్రతిపదార్థము:** భీమైః నృపైః = క్రూరులయిన జరాసంధాది పరిపాలకులతో, దివిషదాం= దేవతలకు (దివి సీదతి స్వర్గమునందు ఉండువాడు. దేవత), భూమేః

చ= భూదేవికి కలుగుతున్న, దీనదశామ్ = దీనదశను, అహం= నేను, జానే = ఎరుగుదును, తత్ క్షేపాయ = ఆ దుష్టులను నిగ్రహించుటకు (క్షేపణస్య భావః– పారవేయుట కదలుట అంగ సంచాలనము), సః యాదవకులే= యాదవ కులములో(యదూనాం గోపాలకానాం ఇదమ్ గోపాలురకు సంబంధించునది), సమగ్ర ఆత్మనా= నా సంపూర్ణాంశముతో, అహం= నేను (సచ్చిదానంద స్వరూపుడనయిన నేను), భవామి= ఉంటాను(అవతరిస్తాను), దేవాః= దేవతలు, దేవ–అంగనాః చ= వారి అంగనలును కూడా, కలయా= వారి అంశములతో, వృష్ణికులే = వృష్ణివంశములో (వర్షతి జలమ్ జలమును వర్షించునది. మేఘము వృష్ణివంశము), మత్ సేవా –అర్థమ్= నన్ను సేవించుటకొరకు, అవనౌ = భూమియందు, భవంతు = ఉందుదురుగాక (అవతరింతురుగాక), ఇతి త్వదీయవచనం= అని నువ్వు వినిపించిన నీ మాటను, పాథోజభూః= బ్రహ్మ దేవుడు (పాథసి జలే జాయతేనీటిలో పుట్టునది. కమలము), ఊచివాన్= దేవతలకు వినిపించెను.

**తాత్పర్యము:** క్రూరులయిన జరాసంధాది పరిపాలకులతో దేవతలకు భూదేవికి కలుగుతున్న దీనదశను నేను ఎరుగుదును. ఆ దుష్టులను నిగ్రహించుటకు యాదవ కులములో నా సంపూర్ణాంశముతో నేను అవతరిస్తాను. దేవతలు వారి అంగనలును వారి అంశములతో వృష్ణివంశములో నన్ను సేవించుటకొరకు భూమియందు అవతరింతురుగాక అని నువ్వు వినిపించిన నీ మాటను బ్రహ్మ దేవుడు దేవతలకు వినిపించెను

**37–6 శ్లో.**

**శ్రుత్వా కర్ణరసాయనం తవ వచః సర్వేషు నిర్వాపిత–**
**స్వాంతేష్వీశ! గతేషు తావక కృపాపీయూష తృప్తాత్మసు ।**
**విఖ్యాతే మధురాపురే కిల భవత్సాన్నిధ్యపుణ్యోత్తరే**
**ధన్యాం దేవకనందనాముదవహత్ రాజా స శూరాత్మజః ॥**

**ప్రతిపదార్థము:** ఈశ= ఓ గురువాయూరు దేవా!, కర్ణరసాయనం= చెవులకు ఇంపైన(అమృతప్రాయమైన), తవ వచః= నీ పలుకు, శ్రుత్వా= విని,

సర్వేషు=అందరు, నిర్వాపిత–స్వాంతేషు= అనందపడిన హృదయము కలవారయిరి, తావక= నీయొక్క, కృపా పీయూష= కరుణాపీయూష పానముచే (పీయూష =పీయతే దేవైః – దేవతలచే త్రాగబడునది. అమృతము), తృప్త ఆత్మసు= ఆత్మలలో తృప్తిని పొంది, గతేషు = వారు వెళ్ళగా, ఉత్తరే= భవిష్యత్తులో, భవత్ సాన్నిధ్యపుణ్య= నీ సాన్నిధ్య పుణ్యముచే, ధన్యాం= మిక్కిలి పుణ్యప్రదేశముగా, విఖ్యాతే = పేరు పొందనున్న, మధురాపురే = మధురానగరిలో, స శూర–ఆత్మజః రాజా = ఆ శూరసేనుని పుత్రుడయిన వసుదేవ రాజు, దేవకనందనామ్ = దేవకుని పుత్రిక 'దేవకిని' (దేవ ఏవ దేవకః – దేవత, దేవుడు శ్రీకృష్ణుని మాతామహుడు), ఉదవహత్ కిల = పెండ్లి చేసుకొనెను కదా.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! చెవులకు అమృతప్రాయమైన నీ పలుకు విని అందరు అనందపడిన హృదయము కలవారయిరి. నీయొక్క కరుణాపీయూష పానముచే తృప్తిని పొంది వారు వెళ్ళగా భవిష్యత్తులో నీ సాన్నిధ్య పుణ్యముచే మిక్కిలి పుణ్యప్రదేశముగా పేరు పొందనున్న మధురానగరిలో ఆ శూరసేనుని పుత్రుడయిన వసుదేవ రాజు దేవకుని పుత్రిక 'దేవకిని' పెండ్లి చేసుకొనెను .

**37–7 శ్లో.**

**ఉద్వాహావసితౌ తదీయసహజఃకంసోఽథ సమ్మానయన్**
**ఏతౌ సూతతయా గతః పథిరథే వ్యోమోత్థయా త్వద్గిరా ।**
**అస్యాస్త్వామతిదుష్టమష్టమసుతో హంతేతి హంతేరితః**
**సంత్రాసాత్ స తు హంతుమంతికగతాం తన్వీం కృపాణీమధాత్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, ఉద్వాహ–అవసితౌ= దేవకీ వసుదేవుల వివాహము తరువాత(ఉత్ సమ్యతే ఉహ్యతే అత్ర–వివాహము), తదీయ సహజః= ఆ మె (దేవకి) సోదరుడగు (సహ జాయతే తోడబుట్టినవాడు పుట్టుకతో వచ్చునది), కంసః=కంసుడు (కనతి కామయతే పరపదార్థాన్ ఇతర పదార్థములను కోరువాడు, బలాత్కారంగా తీసుకొనువాడు. ఉగ్రసేనుని కుమారుడు, కంసుడు), ఏతౌ సమ్మానయన్= నూతన దంపతులను సమ్మానించుచు, రథే= రథమును, సూతతయా= తానే స్వయముగా నడుపు బాధ్యతను స్వీకరించి, గతః పథి=వారి

గృహపు దారిలో వెళ్ళుచుండగా, త్వత్ గిరా= నీ మాట, వ్యోమ ఉత్థయా = ఆకాశమునుండి(వ్యవతి వ్యాప్నోతి సర్వం జగత్ ప్రపంచమంతా వ్యాపించునది. ఆకాశము), అస్యాః =ఈ మె (దేవకి), అష్టమసుతః = ఎనిమిదవ సంతానమగు పుత్రుడు, అతి దుష్టమ్ త్వామ్= అతిదుష్టుడవైన నిన్ను, హంతా = సంహరించును ఇతి, ఈరితః= అని ప్రేరేపింపబడగా (వినిపించగా) (ఈరితః ప్రేషితః ప్రేరితో వా పంపబడ్డవాడు ప్రేరేపింపబడ్డవాడు), హంత= అహో!, స తు = అకంసుడును, సంత్రాసాత్= బాగా భయపడి (సం అధికం త్రస్యతి తస్య భావః – భయము), అంతికగతాం= తన సమీపముననే యున్న(అంతః సామీప్యం అస్తి అస్య – దగ్గర ఉండువాడు సమీపం, దగ్గర), తన్వీం = దేవకిని, హంతుమ్ = చంపుటకు, కృపాణీమ్ = ఖడ్గమును (కృపాం నుదతి దూరీకరోతి దయను దూరము చేయునది. ఖడ్గము), అధాత్= చేతిలో పట్టుకొనెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట దేవకీ వసుదేవుల వివాహము తరువాత ఆమె (దేవకి) సోదరుడగు కంసుడు నూతన దంపతులను సమ్మానించుచు రథమును తానే స్వయముగా నడుపు బాధ్యతను స్వీకరించి వారి గృహపు దారిలో వెళ్ళుచుండగా నీ మాట ఆకాశమునుండి "ఈమె (దేవకి) ఎనిమిదవ సంతానమగు పుత్రుడు అతిదుష్టుడవైన నిన్ను సంహరించును'' అని వినిపించింది. అకంసుడును బాగా భయపడి తన సమీపముననే యున్న దేవకిని చంపుటకు ఖడ్గమును చేతిలో పట్టుకొనెను.

**37–8 శ్లో.**

**గృహ్ణానశ్చికురేషు తాం ఖలమతిః శౌరేశ్చిరం సాంత్వనైః**
**నో ముంచన్ పునరాత్మజార్పణగిరా ప్రీతోఽథ యాతో గృహాన్ ।**
**ఆద్యం త్వత్సహజం తథార్పితమపి స్నేహేన నాహన్నసా**
**దుష్టానామపి దేవ! పుష్టకరుణాదృష్టా హి ధీరేకదా ॥**

**ప్రతిపదార్థము:** దేవ= ఓ గురువాయూరు దేవా!, అథ =అటుపిమ్మట, ఖలమతిః= దుష్టుడయిన కంసుడు, తాం చికురేషు= దేవకి జుట్టును, గృహ్ణానః = పట్టుకొని, శౌరేః = వసుదేవుడు, చిరం= చాలాకాలము, సాంత్వనైః= బతిమాలినను

(అనునయ వాక్యములు చెప్పినను) (సాంత్వయతి అసౌ ఓదార్చునది ఓదార్పు), ముంచన్ న= విడువలేదు, పునః = మరలా, ఆత్మజ– అర్పణగిరా= పుట్టిన కుమారులను ఎప్పటికప్పుడు నీకు సమర్పింతును' అను వసుదేవుని మాటతో, ప్రీతః = తృప్తిచెంది, గృహాన్ యాతః = ఇంటికి వెళ్ళెను, త్వత్ = నీయొక్క, ఆద్యం = మొదటి, సహజం= తోబుట్టువును, తథా = అన్నమాట ప్రకారము, అర్పితమ్ అపి= వసుదేవుడు కంసునికి అర్పించిననూ, స్నేహేన= స్నేహము పాటించి(స్నిహ్యతి తస్య భావః కర్మ వా స్నేహము నూనె), న అహన్ = ఆ శిశువును చంపలేదు, ఏకదా= ఒక్కొక్కప్పుడు, అసౌ దుష్టానామ్ ధీః అపి= ఈ దుష్టుల బుద్ధి కూడ, పుష్ట కరుణాదృష్టా హి = కరుణాభరితమై నిండుగా కనబడును కదా!.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! అటుపిమ్మట దుష్టుడయిన కంసుడు దేవకి జుట్టు పట్టుకొని వసుదేవుడు ఎంత బతిమాలినను విడువలేదు. "పుట్టిన కుమారులను ఎప్పటికప్పుడు నీకు సమర్పింతును' అను వసుదేవుని మాటతో తృప్తిచెంది దేవకిని చంపకుండా ఇంటికి వెళ్ళెను. అన్నమాట ప్రకారము వసుదేవుడు కంసునికి శిశువును అర్పించిననూ స్నేహము పాటించి ఆ శిశువును కంసుడు చంపలేదు. ఒక్కొక్కప్పుడు ఈ దుష్టుల బుద్ధి కూడ కరుణాభరితమై నిండుగా కనబడును కదా!

**37–9 శ్లో.**

**తావత్ త్వన్మనసైవ నారదమునిః ప్రోచే స భోజేశ్వరం**
**యూయం నన్వసురాః సురాశ్చ యదవో జానాసి కిం న ప్రభో ।**
**మాయావీ స హరిర్ భవద్వధకృతే భావీ సుర ప్రార్థనాత్**
**ఇత్యాకర్ణ్య యదూనదూధునదసౌ శౌరేశ్చ సూనూనహన్ ॥**

**ప్రతిపదార్థము:** తావత్= కంసుడు గృహమునకు వెళ్ళిన తరువాత, త్వత్ మనసా ఏవ = నీ మనస్సును అనుసరించి(నీ ప్రేరణచే), నారదమునిః= నారద మహర్షి, స భోజేశ్వరం= భోజరాజు (కంసుని) వద్దకు వచ్చి, ప్రోచే= ఇలా చెప్పాడు, యూయం అసురాః నను = మీరు రాక్షసులు( కాలనేములు) కదా!, యదవః= యాదవులు, సురాః చ= దేవతలు కదా!, ప్రభో = ఓ కంస ప్రభూ!, కిం న జానాసి = నీకు

తెలియదా!, మాయావీ = మాయావి యైన(మాయలు కలవాడు), స హరిః = ఆ శ్రీ హరి, భవత్ వధకృతే = మిమ్మలిని చంపటానికి, సుర ప్రార్థనాత్= దేవతల ప్రార్థనపై, భావీ= జన్మించగలడు, ఇతి = ఆ నారదుని మాటలు, ఆకర్ణ్య = విని, యదూన్= యాదవులను, అదూధునత్= స్థానభ్రష్టులను చేసాడు. (యాదవుల నందరినీ తన రాజ్యమునుండి తరిమివేసాడు), అసౌ= అతడు, శౌరేః సూనూన్ చ= వసుదేవుని ముందు బిడ్డలందరిని, అహన్= చంపాడు.

**తాత్పర్యము:** కంసుడు గృహమునకు వెళ్ళిన తరువాత నీ ప్రేరణచే నారద మహర్షి కంసుని వద్దకు వచ్చి "మీరు రాక్షసులు (కాలనేములు) కదా! యాదవులు దేవతలు కదా ! ఓ కంస ప్రభూ ! నీకు తెలియదా ! మాయావి యైన ఆ శ్రీ హరి మిమ్మలిని చంపటానికి దేవతల ప్రార్థనపై జన్మించగలడు " అని చెప్పాడు. ఆ నారదుని మాటలు విని కంసుడు యాదవులను స్థానభ్రష్టులను చేసాడు. వసుదేవుని ముందు బిడ్డలందరిని చంపాడు.

**37-10 శ్లో.**

**ప్రాప్తే సప్తమగర్భతా మహిపతౌ త్వత్ప్రేరణాన్మాయయా**
**నీతే మాధవ! రోహిణీం త్వమపి భో! సచ్చిత్సుఖైకాత్మకః ।**
**దేవక్యా జఠరం వివేశిథ విభో! సంస్తూయమానస్సురైః**
**స త్వం కృష్ణ విధూయ రోగపటలీం భక్తిం పరాం దేహి మే ॥**

**ప్రతిపదార్థము:** మాధవ = లక్ష్మీపతీ! (మాయాః లక్ష్మ్యాః ధవః లక్ష్మి భర్త. మాధవుడు, విష్ణువు), అహిపతౌ = ఆదిశేషుడు (అహీనాం పతిః శేషః – సర్పరాజు, ఆదిశేషుడు), త్వత్ ప్రేరణాత్ = నీ ప్రేరణతో, సప్తమ గర్భతామ్ ప్రాప్తే= దేవకి ఏడవగర్భమున ప్రవేశించగా, మాయయా= యోగమాయమాయతో, రోహిణీం =రోహిణి గర్భమునకు ( రోహతి ప్రాదుర్భవతి పుట్టునది. బలరాముని తల్లి), నీతే=ఆదిశేషుని చేర్చెను, భోః విభో। = ఓస్వామీ, సత్ చిత్ సుఖ ఏక ఆత్మకః= సచ్చిదానంద స్వరూపుడవైన, త్వమ్ అపి = నువ్వు కూడా, దేవక్యా జఠరం= దేవకీ గర్భమున (దేవకస్య అపత్యం స్త్రీ దేవకుని కుమార్తె. దేవకీ, శ్రీకృష్ణుని తల్లి)( జాయతే ప్రాణి అస్మిన్ ఇందులో ప్రాణి వుండును. కడుపు), వివేశిథ= ప్రవేశించి, సురైః =

దేవతలచే, సంస్తూయమానః = మిగుల స్తుతింపబడితివి, స = అటువంటి వాడివయిన, కృష్ణ= ఓ కృష్ణా ! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః – భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), త్వం= నువ్వు, మే రోగ పటలీం = నా రోగములను, విధూయ= హరించి, పరాం భక్తిం= నీయందు పరమ భక్తిని, దేహి = అనుగ్రహించు.

**తాత్పర్యము:** లక్ష్మీపతీ! ఆదిశేషుడు నీ ప్రేరణతో దేవకి ఏడవగర్భమున ప్రవేశించగా యోగమాయమాయతో రోహిణి గర్భమునకు ఆదిశేషుని చేర్చెను. ఓస్వామీ! సచ్చిదానంద స్వరూపుడవైన నువ్వు కూడా దేవకీ గర్భమున ప్రవేశించి దేవతలచే మిగుల స్తుతింపబడితివి. అటువంటి వాడివయిన ఓ కృష్ణా ! నువ్వు నా రోగములను హరించి, నీయందు పరమ భక్తిని అనుగ్రహించు.

***దశమ స్కంధము***

**37వ దశకము పూర్తి**



# దశకమ్ 38 – శ్రీకృష్ణావతారము

**38-1 శ్లో.**

**ఆనందరూప! భగవన్నయి! తేఽవతారే**
**ప్రాప్తే ప్రదీప్తభవదంగనిరీయమాణైః ।**
**కాంతివ్రజైరివ ఘనాఘనమండలైర్ద్యామ్**
**ఆవృణ్వతీ విరురుచే కిల వర్షవేళా ॥**

**ప్రతిపదార్థము:** అయి ఆనంద –రూప= ఓ ఆనంద స్వరూపా!, భగవన్ = భగవంతుడా!, తే అవతారే= నీ అవతారము, ప్రాప్తే= ప్రాప్తించు సమయంలో, ప్రదీప్త = ప్రకాశించు, భవత్ అంగ = నీ శరీరము నుండి, నిరీయమాణైః = బయటికి వచ్చు, కాంతి వ్రజైః ఇవ= నల్లని కాంతి సమూహముల వలె (కామ్యతే అసౌ కోరదగినది. శోభ, దీప్తి, కాంతి), ఘనాఘన మండలైః = అధికంగా వర్షించు మేఘ సమూహము(అత్యంతం నిరంతరం వా హంతి అధికంగా వర్షించు మేఘము), ద్యామ్ = ఆకాశమును, ఆవృణ్వతీ= ఆవరించగా, వర్షవేళా= వర్షఋతువు(వృష్యతే సిచ్యతే ప్రియతే ప్రార్థ్యతే తడుపబడునది. వర్షము), విరురుచే కిల= బాగా ప్రకాశించింది కదా.

**తాత్పర్యము:** ఓ ఆనంద స్వరూపా! భగవంతుడా! నీ అవతారము ప్రాప్తించు సమయంలో నీ శరీరము నుండి బయటికి వచ్చు నల్లని కాంతి సమూహముల వలె అధికంగా వర్షించు మేఘ సమూహము ఆకాశమును ఆవరించి వర్షఋతువు బాగా ప్రకాశించింది.

**38-2 శ్లో.**

**ఆశాసు శీతలతరాసు పయోదతోయైః**
**ఆశాసితాప్తివివశేషు చ సజ్జనేషు ।**
**నైశాకరోదయవిధౌ నిశి మధ్యమాయాం**
**క్లేశాపహస్త్రిజగతాం త్వమిహావిరాసీః ॥**

**ప్రతిపదార్థము:** పయోద తోయైః= కురుస్తున్నమేఘ వర్షమునకు(పయః దదాతి నీరు నిచ్చునది. మేఘము), ఆశాసు = అన్నిదిక్కులు(ఆసమంతాత్ సర్వత్ర అశ్నుతే అంతట వ్యాపించునది. దిశ), శీతలతరాసు= చల్లబడెను, సజ్జనేషు= సజ్జనులు (సత్ ప్రశస్తః జనః – మంచివాడు, సజ్జనుడు), ఆశాసిత = అభీష్టార్థము యొక్క(ఆశాస్యతే అభిలష్యతే అసౌ వాంఛనీయమైనది, కోరదగినది వరముతో పొందదగినది), ఆప్తి= లాభమయ్యెనని, వివశేషు చ= ఆనంద పరవశులైరి, నిశి మధ్యమాయాం = అర్ధరాత్రి సమయములో, నైశాకర ఉదయ విధౌ = అష్టమి చంద్రుడు ఉదయించు వేళ(నిశాం కరోతి రాత్రినిచ్చువాడు. చంద్రుడు), త్వమ్= నువ్వు, ఇహ= ఈ భూమిపై, త్రి జగతాం= మూడు లోకముల, క్లేశ–అపహః = కష్టములను పోగొట్టుటకు(క్లిష్ణాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము), ఆవిరాసీః= అవతరించితివి.

**తాత్పర్యము:** కురుస్తున్న వర్షమునకు అన్నిదిక్కులు చల్లబడెను. సజ్జనులు తాము కోరుకొన్నది నెరవేరుతున్నదని ఆనంద పరవశులైరి. అర్ధరాత్రి సమయములో అష్టమి చంద్రుడు ఉదయించు వేళ నువ్వు ఈ భూమిపై మూడు లోకముల కష్టములను పోగొట్టుటకు అవతరించితివి.

**38–3 శ్లో.**

**బాల్యస్పృశాపి వపుషా దధుషా విభూతీః**
**ఉద్యత్కి రీటకటకాంగదహారభాసా ।**
**శంఖారి వారిజ గదా పరిభాసితేన**
**మేఘాసితేన పరిలేసిథ సూతిగేహే ॥**

**ప్రతిపదార్థము:** బాల్య స్పృశా అపి= నీవు శిశువు రూపములో ఉన్ననూ (బాలస్య భావః కర్మ వా బాల్యము, షోడశవర్ష పర్యంతము), విభూతీః= ఈశ్వరత్వ ద్యోతకములైన(విశిష్టా భూతిః ఐశ్వర్యమ్ ఐశ్వర్యము, భస్మము, అణిమాద్యష్ట ఐశ్వర్యములు), ఉద్యత్= ప్రకాశించు, కిరీట= కిరీటముతోను, (కిరతి కీర్యతే అనేన దీప్తిం దీప్తిర్వా కాంతిని వెదజల్లునది. ముకుటము కిరీటము), కటక= చేతులకు కంకణములతోను, (న కటతి వర్షతి జలం అస్మిన్ పర్వత మధ్యభాగము దండ

కడియము),అంగద=భుజకీర్తులతోను,(అంగందాయతిశోభయతి అంగమునకు శోభను చేకూర్చునది. కేయూరము, భుజకీర్తులు), హారభాసా= కంఠ హారములతోను, శంఖ= శంఖము, (శామ్యతి అశుభం అస్మాత్ దీని నుండి అశుభము నివారింపబడును. శంఖము), అరి = చక్రము (అరములు కలది అరి = చక్రము), వారిజ= పద్మము (వారిణి జాయతే నీటిలో పుట్టునది. కమలము మొదలగునవి), గదా = గదలను (గద్యతే పీడ్యతే అనేన–దీనితో పీడింపబడును. గద), దధుషా=ధరించి, మేఘాసితేన= తొలకరి మేఘమట్లు, పరిభాసితేన= మెరయు, వపుషా = శరీరముతో, సూతి గేహే= పురిటింటిలో(సూతే ప్రసూతే తస్య భావః కర్మ వాకనుట ప్రసవము ఉత్పత్తి), పరిలేసిథ= బాగా ప్రకాశించావు.

**తాత్పర్యము:** నీవు శిశువు రూపములో ఉన్ననూ ఈశ్వరత్వ ద్యోతకములై ప్రకాశించు కిరీటముతోను, చేతులకు కంకణములతోను, భుజకీర్తులతోను, కంఠ హారములతోను శంఖము, చక్రము పద్మము గదలను ధరించి తొలకరి మేఘమట్లు మెరయు శరీరముతో పురిటింటిలో బాగా ప్రకాశించావు.

**38–4 శ్లో.**
**వక్షఃస్థలీ సుఖ నిలీన విలాసి లక్ష్మీ–**
**మందాక్ష లక్షిత కటాక్ష విమోక్ష భేదైః ।**
**తన్మందిరస్య ఖలకంస కృతామలక్ష్మీం**
**ఉన్మార్జయన్నివ విరేజిథ వాసుదేవ ॥**

**ప్రతిపదార్థము:** వాసుదేవ= ఓ వాసుదేవా ! (వసతి సర్వత్ర ఆత్మరూపేణ వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చ – అంతట ఆత్మరూపంలో వుండువాడు. వాసుదేవుడు), వక్షః స్థలీ= నీ వక్షః స్థలమందు (వక్షఃస్థలం ఇవ – వక్షఃస్థలము. ఎదురురొమ్ము), సుఖ నిలీన= సుఖముగా నిలిచిన (నిశ్శేషేణ లీనం సంవృతం వా లీనమైనది కప్పబడినది.)(సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః – ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), విలాసి లక్ష్మీః– విలాసముగా చూపులను ప్రసరింపజేయు లక్ష్మీదేవియొక్క(లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్ ప్రయత్నించువారిని చూచునది. విష్ణుపత్ని), మంద అక్ష లక్షిత కటాక్ష విమోక్ష భేదైః= లజ్జా

కటాక్షవీక్షణములచే, తత్ మందిరస్య = ఆ చీకటియింట, ఖల కంస కృతామ్= కంసుని దుష్ట చేష్టలతో ఆవరించిన, అలక్ష్మీం= అలక్ష్మిని (నరకసంబంధమైన అభాగ్యము), ఉన్మార్జయన్ ఇవ = నిర్మూలించుచున్నట్లు (ఉన్మార్జనం స్వచ్ఛం కరణం ఉన్మార్జయంతి అనేన – దీనితో శుభ్రం చేయుదురు. పొరక, చీపురు), విరేజిథ = ప్రకాశించితివి.

**తాత్పర్యము:** ఓ వాసుదేవా! నీ వక్షః స్థలమందు సుఖముగా నిలిచిన విలాసముగా చూపులను ప్రసరింపజేయు లక్ష్మీదేవియొక్క లజ్జా కటాక్షవీక్షణములచే – ఆ చీకటియింట కంసుని దుష్ట చేష్టలతో ఆవరించిన అలక్ష్మిని నిర్మూలించుచున్నట్లు ప్రకాశించితివి.(చూపుల కాంతి అలక్ష్మి అను చీకటిని పోగొట్టినదని భావం)

**38–5 శ్లో.**
**శౌరిస్తు ధీర ముని మండల చేతసోఽపి**
**దూర స్థితం వపురుదీక్ష్య నిజేక్షణాభ్యామ్ ।**
**ఆనందబాష్ప పులకోద్గమ గద్గదార్ద్రః**
**తుష్టావ దృష్టి మకరందరసం భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** ధీర ముని మండల చేతసః అపి= సాధన చతుష్టయ సంపన్నులైన మునుల(ఇహలోక చింతనను వీడి, ఎల్లవేళల పరలోక చింతనలో ఉండు ఋషులు) మనస్సులకు, దూర స్థితం= అందరాని, వపుః= నీ అపురూపమైన రూపమును, శౌరిః తు = వసుదేవుడు, నిజ ఈక్షణాభ్యామ్ ఉదీక్ష్య= కనులార చూసి, ఆనందబాష్ప= ఆనందబాష్పములతో, ఉద్గమ= బయటపడిన (ఉత్ ఉచ్చైః ఊర్ధ్వం వా గమనమ్ బయటపడిన), పులక = శరీరపు పులకరింతలతో, గద్గద ఆర్ద్రః= డగ్గుత్తికపడిన మాటతో (గద ఇతి అవ్యక్తం గదతి తస్య కర్మ – అవ్యక్త శబ్దము కలవాడు), దృష్టి మకరంద రసం= కన్నులకు మకరందధారయైయున్న, భవంతమ్= నిన్ను, తుష్టావ= స్తుతించెను.

**తాత్పర్యము:** సాధన చతుష్టయ సంపన్నులైన మునుల (ఇహలోక చింతనను వీడి, ఎల్లవేళల పరలోక చింతనలో ఉండు ఋషులు) మనస్సులకు అందరాని నీ

అపురూపమైన రూపమును వసుదేవుడు కనులార చూసి ఆనందబాష్పములతో బయటపడిన శరీరపు పులకరింతలతో డగ్గుత్తికపడిన మాటతో దృష్టి కన్నులకు మకరందధారయైయున్న నిన్ను స్తుతించెను. (కన్నులు తుమ్మెదలు కాగా–మకరంద ధార శ్రీ కృష్ణుని శరీరము)

**38–6 శ్లో.**
**దేవ! ప్రసీద పరపూరుష! తాప వల్లీ–**
**నిర్లూనదాత్ర! సమనేత్ర! కలా విలాసిన్! ।**
**ఖేదానపాకురు కృపా గురుభిః కటాక్షైః**
**ఇత్యాది తేన ముదితేన చిరంనుతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** దేవ= దేవా!, పరపూరుష= పరమపురుషా! (పూరయతి అంతః సర్వమ్ సర్వమును వ్యాపించినవాడు), తాప వల్లీ–నిర్లూనదాత్ర= తాపములనెడి తీగలను ఖండించు కొడవలి స్వరూపమైన ఓ పరమాత్మా!( ద్యతి లునాతి అనేన – దీనితో కోయుదురు. కొడవలి), సమనేత్ర= ఓ సర్వనియంతా!, కలా విలాసిన్= స్వాంశమైన మాయతో జగత్ సృష్ట్యాది క్రీడావిలాసి వగు దైవమా! (లేదా తాపములనెడి తీగలను ఖండించు కొడవళ్ళతో సమానమైన నేత్ర కళల యొక్క కటాక్ష విలాసములు కలవాడా అని తాప వల్లీ నిర్లూనదాత్ర సమనేత్ర కలా విలాసిన్ అను మూడు సంబోధనలకు కలిపి ఒకే అర్థము కూడా చెప్పుకోవచ్చు), కృపా గురుభిః కటాక్షైః= నీ గురుకృపాకటాక్షములచే, ఖేదాన్= ఖేదములను (ఖిద్యతే అనేన – దీనితో బాధనొందుదురు. ఖేదము దుఃఖము), అపాకురు= పోగొట్టుము, ప్రసీద= కాపాడుము, ఇతి ఆది= అని ఇట్లు పెక్కు రీతులలో, ముదితేన తేన= ఆనందవివశుడైన వసుదేవునిచే, చిరంనుతః అభూః= చాలా కాలము స్తుతింపబడితివి.

**తాత్పర్యము:** దేవా! పరమపురుషా! తాపములనెడి తీగలను ఖండించు కొడవలి స్వరూపమైన ఓ పరమాత్మా! ఓ సర్వనియంతా! స్వాంశమైన మాయతో జగత్ సృష్ట్యాది క్రీడావిలాసి వగు దైవమా! (లేదా తాపములనెడి తీగలను ఖండించు కొడవళ్ళతో సమానమైన నేత్ర కళల యొక్క కటాక్ష విలాసములు కలవాడా) నీ

గురుకృపాకటాక్షములచే ఖేదములను పోగొట్టుము అని ఇట్లు పెక్కు రీతులలో ఆనందవివశుడైన వసుదేవునిచే చాలా కాలము నువ్వు స్తుతింపబడితివి.

**38–7 శ్లో.**
**మాత్రా చ నేత్రసలిలాస్తృతగాత్రవ ల్యా**
**స్తోత్రైరభిష్టుతగుణః కరుణాలయస్త్వమ్ ।**
**ప్రాచీన జన్మ యుగళం ప్రతిబోధ్య తాభ్యాం**
**మాతుర్గిరా దధిథ మానుష బాలవేషమ్ ॥**

**ప్రతిపదార్థము:** మాత్రా చ = నీ తల్లి దేవకి కూడా (మన్యతే మాన్యతే పూజ్యతే, మానయంతి పూజయంతి ఏనామ్ ఆదరింపబడునది, పూజింపబడునది, ఈమెను పూజింతురు. తల్లి ), నేత్రసలిల= ఆనందబాష్పములచే, ఆస్తృత గాత్రవల్యా = శరీరమను తీగ తడియగా, త్వమ్ గుణః = నీ గుణగణములను, స్తోత్రైః= స్తోత్రములతో, అభిష్టుత= స్తుతించెను, కరుణాలయః= కరుణానిధి వైన నీవు, తాభ్యాం =వారికి (దేవకీ వసుదేవులకు), ప్రాచీన జన్మ యుగళం = వారి రెండు పూర్వజన్మ వృత్తాంతములను(జాయతే తత్ ఉత్పత్తి, పుట్టుక), ప్రతిబోధ్య= తెలిపి, గిరా = తల్లిమాటను ఆదరించి (గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము వాణి), మానుష బాలవేషమ్ = మానవ శిశురూపమును (మనుషః అపత్యమ్ మనుష సంతానము. మానవుడు), దధిథ= ధరించితివి.

**తాత్పర్యము:** నీ తల్లి దేవకి కూడా ఆనందబాష్పములచే శరీరమను తీగ తడియగా నీ గుణగణములను స్తోత్రములతో స్తుతించెను. కరుణానిధి వైన నీవు వారికి(దేవకీ వసుదేవులకు) వారి రెండు పూర్వజన్మ వృత్తాంతములను తెలిపి తల్లిమాటను ఆదరించి మానవ శిశురూపమును ధరించితివి.

**విశేషాలు**

**రెండు పూర్వజన్మ వృత్తాంతములు:** పృశ్ని సుతపుడు అను దంపతులకు పృశ్నిగర్భుడను పేర అదితి కశ్యప దంపతులకు వామనుడు పేర పుట్టిన వృత్తాంతములు.

**38–8 శ్లో.**
**త్వత్ప్రేరితస్తదను నందతనూజయా తే**
**వ్యత్యాసమారచయితుం స హి శూరసూనుః ।**
**త్వాం హస్తయోరధిత చిత్త విధార్యమార్యైః**
**అంభోరుహస్థకలహంసకిశోరరమ్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** తదను= అప్పుడు, త్వత్ ప్రేరితః= నీ ప్రేరణచే, నంద తనూజయా తే వ్యత్యాసమ్= యశోద ప్రక్కలో ఉన్న పిల్లను తీసుకొనివచ్చి ఇక్కడ, నన్ను అచట ఉంచి రమ్మని చెప్పిన మాటను (విశిష్టః అత్యాసః, విపర్యయః – విపర్యయము వ్యత్యాసము), ఆరచయితుం= పాటించుటకు, స హి శూరసూనుః= ఆ వసుదేవుడు, ఆర్యైః= మునులు, చిత్త విధార్యమ్ = చిత్తమునందు ధరించు నిన్ను, అంభోరుహస్థ = కమలముపై ఉన్న, కలహంస కిశోర రమ్యమ్= కలహంస కిశోర విధముగా అందముగొలుపగా (కలేన మధురధ్వనినా విశిష్టః హంసః– మధురధ్వని చేయు రాజహంస), త్వాం హస్తయోః అధిత= నిన్ను తన హస్తములందు ధరించెను.

**తాత్పర్యము:** అప్పుడు నీ ప్రేరణచే, "యశోద ప్రక్కలో ఉన్న పిల్లను తీసుకొనివచ్చి ఇక్కడ , నన్ను అచట ఉంచి రమ్మ"ని నువ్వు చెప్పిన మాటను పాటించుటకు ఆ వసుదేవుడు మునులు చిత్తమునందు ధరించు నిన్ను– కమలముపై ఉన్న కలహంస కిశోర విధముగా అందముగొలుపగా తన హస్తములందు ధరించెను.

**38–9 శ్లో.**
**జాతా తదా పశుపసద్మని యోగనిద్రా**
**నిద్రా విముద్రితమథాకృత పౌరలోకమ్ ।**
**త్వత్ప్రేరణాత్ కిమివ చిత్రమచేతనైర్యత్**
**ద్వారైస్స్వయం వ్యఘటి సంఘటితైః సుగాఢమ్ ॥**

**ప్రతిపదార్థము:** తదా= అట్లు నీవు ప్రయాణమైన సమయమున, యోగనిద్రా= యోగనిద్రమాయ (విష్ణుమాయ), పశుప= నందుని, సద్మని = ఇంట(సీదంతి అస్మిన్ ఇందులో వుందురు. ఇల్లు), జాతా = పుట్టింది, అథ= అటుపిమ్మట, త్వత్ –

ప్రేరణాత్ = నీ ప్రేరణ వలన, పౌర లోకమ్= మధురాపురవాసులైన జనులను, నిద్రా విముద్రితమ్= గాఢనిద్రలో(నితరాం ద్రాతి అపగచ్ఛంతి ఇంద్రియాని అస్యాం విషయేభ్యః – దీనియందు ఇంద్రియములు విషయాలపై వెళ్లవు. నిద్ర), అకృత = ముంచివేసెను, అచేతనైః= అచేతనములైన, సుగాఢమ్= బాగా, సంఘటితైః= మూసుకొని ఉన్న, యత్ –ద్వారైః = ఏ ద్వారముల గడియలు ఉన్నాయో, స్వయం= అవి స్వయముగా తమంతట తామే, వ్యఘటి = తెరచుకొన్నాయి, కిమ్ –ఇవ చిత్రమ్= ఇంతకంటె ఆశ్చర్యము ఏమున్నది?

**తాత్పర్యము:** అట్లు నీవు ప్రయాణమైన సమయమున యోగనిద్ర నందుని ఇంట పుట్టింది. అటుపిమ్మట యోగమాయ నీ ప్రేరణ వలన మధురాపురవాసులైన జనులను గాఢనిద్రలో ముంచివేసెను. అచేతనములైన బాగా మూసుకొని ఉన్న ఏ ద్వారముల గడియలు ఉన్నాయో అవి స్వయముగా తమంతట తామే తెరచు కొన్నాయి. ఇంతకంటె ఆశ్చర్యము ఏమున్నది? (స్వామి ప్రేరణతోఅసాధ్యములు సుసాధ్యములవుతాయని భావం)

**విశేషాలు**

**యోగమాయ:** బాలింతగా ఉన్న దేవకి చేతుల నుంచి కంసుడు లాక్కొని నేల మీదకు విసరి కొట్టినప్పుడు కిందపడకుండా ఆకాశంలోకి ఎగిరి ''మణిహారాంబరాద్యలంకార మనో హారిణియు, గదా శంఖ చక్ర పద్మ శరచాపాసి శూలధారిణియునై యెనిమి కరంబులం గరం బొప్పుచు'' దర్శనం ఇచ్చిన విష్ణుమాయ. శిశువుగా కృష్ణుడు రోహిణిని చేరడానికి కారణమైన ఆ దేవి ''భద్రాత్మికయై బహునామ నివాసంబుల, బహునామముల'' భూమి మీద చరించినదని భాగవతం శ్రీకృష్ణావతార ఘట్టంలో పోతన వర్ణించాడు.

**38–10 శ్లో.**

**శేషేణ భూరిఫణవారితవారిణాఽథ**
**స్వైరం ప్రదర్శితపథో మణిదీపితేన ।**
**త్వాం ధారయన్ స ఖలు ధన్యతమః ప్రతస్థే**
**సోఽయం త్వమీశ మమనాశయ రోగవేగాన్ ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ గురువాయూరు దేవా!, అథ = అటుపిమ్మట వసుదేవుడు శిశురూపములో ఉన్న నిన్ను ఎత్తుకొని నందుని గృహమునకు బయలుదేరగా భూరి ఫణ= అధికమయిన (విశాలమయిన)పడగలతో, వారిణా= వాననీటినుండి(వారయతి తృష్ణామ్ దప్పిని వారించునది. జలము), శేషేణ= ఆదిశేషుడు, వారితః= నిన్ను రక్షించెను. (వారిణా =యమునా నది ప్రవాహమును వారిత =ఆపెను), స్వైరం = స్వతంత్రముగా– వేరే దీపాల సహాయము లేకుండా (స్వస్య ఈరం స్వైర స్వాతంత్ర్యేణ ఈర్తే స్వతంత్రంగా ప్రవర్తించువాడు) మణి దీపితేన= తన పడగలపై నున్న మణికాంతులతో, పథః ప్రదర్శితః= దారి చూపించాడు. (పథతి గచ్ఛతి అత్ర – ఇక్కడ వెళ్లుదురు. మార్గము, బాట), ధన్యతమః= ధన్యుడగు, సః= ఆ వసుదేవుడు, త్వాం ధారయన్= నిన్ను ఎత్తుకొని, ప్రతస్థే ఖలు = వ్రేపల్లెకు పయనమయ్యాడు కదా!, సః అయం= అట్టి గొప్ప మహిమలు గలిగిన, త్వమ్ = నువ్వు, మమ రోగవేగాన్ = నా రోగ వేగమును, నాశయ= నశింప చేయుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! అటుపిమ్మట వసుదేవుడు శిశురూపములో ఉన్న నిన్ను ఎత్తుకొని నందుని గృహమునకు బయలుదేరగా తన విశాలమయిన పడగలతో వాననీటినుండి ఆదిశేషుడు నిన్ను రక్షించెను. (యమునా నది ప్రవాహమును ఆపెను) స్వతంత్రముగా– వేరే దీపాల సహాయము లేకుండా తన పడగలపై నున్న మణికాంతులతో దారి చూపించాడు. ధన్యుడగు ఆ వసుదేవుడు నిన్ను ఎత్తుకొని వ్రేపల్లెకు పయనమయ్యాడు కదా! అట్టి గొప్ప మహిమలు గలిగిన నువ్వు నా రోగ వేగమును నశింప చేయుము.

***దశమ స్కంధము***

**38వ దశకము పూర్తి**

# దశకమ్ 39 – యోగమాయా ప్రాదుర్భావం

**39-1 శ్లో.**

**భవంతమయముద్వహన్ యదుకులోద్వహో నిస్సరన్**
**దదర్శ గగనోచ్చలజ్జలభరాం కలిందాత్మజామ్ ।**
**అహో సలిలసంచయః స పునరైంద్రజాలోదితో**
**జలౌఘ ఇవ తత్ క్షణాత్ ప్రపదమేయతామాయయౌ ॥**

**ప్రతిపదార్థం:** యదుకుల–ఉద్వహః = యదుకుల శ్రేష్ఠుడయిన(ఉద్వహాతి ఊర్ధ్వం నయతి పితౄన్, ఊర్ధ్వం ప్రాపయతి పితౄన్, ఉద్ ఊర్ధ్వం వహతి), అయమ్ =ఇతడు (వసుదేవుడు), భవంతమ్= శిశురూపములో ఉన్న నిన్ను, ఉద్వహన్= ఎత్తుకొని, నిస్సరన్ = ఆ కారాగారమును వీడి నడచుచూ, గగన–ఉచ్చలత్ = ఆకాశమంటు (గచ్ఛంత్యస్మిన్ దేవాః పక్షిణశ్చ – ఇందులో పక్షులు, దేవతలు వెళ్లుదురు. ఆకాశము), జల– భరాం= తరంగాలతో ఉన్న, కలింద – ఆత్మజామ్= కాళిందిని (కలిం దదాతి ద్యతి వా దుర్గంధమును పోగొట్టునది), దదర్శ= చూచెను, అహో= ఆహా!, తత్ క్షణాత్ = వసుదేవుని చూచిన తక్షణమే, సః సలిలసంచయః = ఆ ప్రవాహము, పునః = మరలా, ఐంద్రజాల–ఉదితః= ఇంద్రజాల మాయనుండి పుట్టిన(ఇంద్రేణ కౌశలాది ఐశ్వర్యేణ జాలం ద్రష్టుః నేత్రావరణమ్ తన కౌశలముతో చూచువారి కండ్లను కప్పి, లేనిదానిని చూపించుట. ఇంద్రజాలము), జలౌఘః ఇవ= నీటి ప్రవాహము వలె, ప్రప్రద= పాదాగ్రభాగము లేదా అరికాలు (ప్రగతం ప్రారబ్ధం పదమ్, పాదస్య అగ్రమ్), మేయతామ్= లోతు మాత్రముగా, ఆయయౌ= అయినది.

**తాత్పర్యం:** యదుకుల శ్రేష్ఠుడయిన వసుదేవుడు శిశురూపములో ఉన్న నిన్ను ఎత్తుకొని ఆ కారాగారమును వీడి నడచుచూ ఆకాశమంటు తరంగాలతో ఉన్న కాళిందిని చూచెను. ఆహా ! వసుదేవుని చూచిన తక్షణమే ఆ ప్రవాహము ఇంద్రజాల మాయనుండి పుట్టిన నీటి ప్రవాహము వలె అరికాలు లోతు మాత్రముగా అయినది.

**విశేషాలు**

**కాళిందీ:** యమునానది. (కళింద పర్వతమునందు పుట్టినది అని అర్థము.) ఒకప్పుడు బలరాముడు వ్రేపల్లెయందు ఉండువేళ దప్పిగొని కాళిందిని తన సమీపమునకు రమ్మనగా రానందున ఆయన కోపించి హలాయుధముచేత భేదించి నూఱు పాయలుగ ప్రవహించునట్లు చేసెను అని పురాణప్రసిద్ధి. ఈమె సూర్యుని కూతురు.

**39-2 శ్లో.**
**ప్రసుప్తపశుపాలికాం నిభృతమారుదద్బాలికాం**
**అపావృతకవాటికాం పశుపవాటికామావిశన్ ।**
**భవంతమయమర్పయన్ ప్రసవతల్పకే తత్పదాద్**
**వహన్ కపటకన్యకాం స్వపురమాగతో వేగతః ॥**

**ప్రతిపదార్థం:** పశుపాలికాం= గోపకాంతలు, ప్రసుప్త= నిదురించిరి, నిభృతమ్= (నితరాం బిభర్తి ధారయతి అసౌ) ఇది యశోద గృహమని తెలుపుచు, బాలికాం= ఆమెకు పుట్టిన శిశువు కొంచెము కొంచెముగా (బాలా ఏవ బాలికా బాలిక, పదునాఱేండ్లకు లోబడిన పిల్ల), ఆరుదద్= ఏడ్చుచుండెను, అపావృత కవాటికాం= తమంతట ఆ ఇంటి తలుపులు తెఱచుకోగా(అపగతః ఆవృతిః ఆచ్ఛాదనం యత్ర – కప్పబడనిది ఆవరణము లేనిది), పశుప వాటికామ్= నందగోపుని ఇంటిలో, ఆవిశన్ =ప్రవేశించి, అయమ్= వసుదేవుడు, ప్రసవ తల్పకే= యశోద పురిటి మంచముపై, భవంతమ్ = నిన్ను, అర్పయన్= ఉంచి, తత్ పదాత్= అక్కడ ఉన్న, కపట కన్యకాం= మాయా శిశువును (యోగమాయను), వహన్= ఎత్తుకొని, వేగతః= వేగముగా, స్వపురమ్= తన పురమునకు, ఆగతః = వచ్చెను.

**తాత్పర్యం:** గోపకాంతలు నిదురించిరి. ఇది యశోద గృహమని తెలుపుచు ఆమెకు పుట్టిన శిశువు కొంచెము కొంచెముగా ఏడ్చుచుండెను. తమంతట తామె ఆ ఇంటి తలుపులు తెఱచుకోగా నందగోపుని ఇంటిలో ప్రవేశించి వసుదేవుడు యశోద పురిటి మంచముపై నిన్ను ఉంచి అక్కడ ఉన్న మాయా శిశువును (యోగమాయను) ఎత్తుకొని వేగముగా తన పురమునకు వచ్చెను.

**39-3 శ్లో.**

**తతస్త్వదనుజారవ క్షపిత నిద్ర వేగ ద్రవద్**

**భటోత్కర నివేదిత ప్రసవ వార్తయైవార్తిమాన్ ।**

**విముక్త చికురోత్కరస్త్వరిత మాపతన్ భోజరా-**

**దతుష్ట ఇవ దృష్టవాన్ భగినికాకరే కన్యకామ్ ॥**

**ప్రతిపదార్థం:** తతః=అటుపిమ్మట, త్వత్ అనుజా రవ=నీసోదరి అయిన యోగమాయ యొక్క ఏడుపు విని (అను పశ్చాత్ జాతా తరువాత పుట్టినది. చెల్లెలు), క్షపిత నిద్ర = నిద్రభంగమై, వేగ ద్రవత్= వేవేగమే పరుగెత్తి, భట-ఉత్కర= కారాగార భటులు (ఉత్కరణం ఏకత్రీకరణం విస్తృతీకరణం వా ప్రోగు), నివేదిత = తెలిపిన, ప్రసవ వార్తయా ఏవ = దేవకి పురిటివార్తతో, ఆర్తిమాన్ = మరణ భయయుక్తుడై ఆర్తిజెంది, విముక్త చికుర —ఉత్కరః= తలముడి వీడగా (చి ఇతి అవ్యక్తం శబ్దం కురతి చి అను శబ్దము చేయునది. వెంట్రుకలు), త్వరితమ్- ఆపతన్= పఋగుపఋగున వచ్చిన, భోజ రాజ= భోజరాజు కంసుడు, భగినికా కరే= చెల్లెలి హస్తములో ఉన్న, కన్యకామ్= ఆడుశిశువును, దృష్టవాన్= చూచి, అతుష్ట ఇవ= సంతుష్టి పడని వాడివలె ఉన్నాడు.

**తాత్పర్యం:** అటుపిమ్మట నీసోదరి అయిన యోగమాయ యొక్క ఏడుపు విని నిద్రభంగమై వేగంగా పరుగెత్తి కారాగార భటులు దేవకి పురిటివార్త తెలుపగా మరణ భయయుక్తుడై ఆర్తిజెంది తలముడి వీడగా పఋగుపఋగున వచ్చిన భోజరాజు కంసుడు చెల్లెలి హస్తములో ఉన్న ఆడుశిశువును చూచి చూచి సంతుష్టి పడని వాడివలె ఉన్నాడు.

**39-4 శ్లో.**

**ధ్రువం కపటశాలినో మధుహరస్య మాయా భవేత్**

**అసావితి కిశోరికాం భగినికాకరాలింగితామ్ ।**

**ద్విపో నలినికాంతరాదివ మృణాళికామాక్షిపన్**

**అయం త్వదనుజామజాముపలపట్టకే పిష్టవాన్ ॥**

**ప్రతిపదార్థం:** అసౌ= ఈ బాలిక, కపటశాలినః = కపటి అయిన (కం వాయుం మస్తకం వా పాటయతి కపట), మధు హరస్య= మధుసూదనుని (మధునామ్నాం అసురం సూదయతి మధువను పేరు గల రాక్షసుని చంపినవాడు. విష్ణువు), మాయా= మాయయే, ధ్రువం భవేత్ ఇతి= తప్పక అయియుండునని తలచి, భగినికా కర= చెల్లెలి చేయిని, ఆలింగితామ్= అంటికొనియున్న, కిశోరికాం= ఆ శిశువును, ద్విపః = ఏనుగు (ద్వాభ్యాం ముఖశుండాభ్యాం పిబతి తొండముతో, నోటితో త్రాగునది. ఏనుగు), మృణాళికామ్ = తామరతీగనుండి, నలిని కాంతరాత్ఇవ = తూడును లాగినట్లు, ఆక్షిపన్ = లాగికొని, అయం త్వత్ అనుజామ్= నీ చెల్లెలగు, అజామ్=మాయను (న జాయంతే మాయ), ఉపల పట్టకే= రాతిపై వేసి – ఆచ్ఛాద్యతే పర్వతః అనేన రాళ్లు (రత్నాలు), పిష్టవాన్= నలిపి వైచెను.

**తాత్పర్యం:** ఈ బాలిక తప్పక కపటి అయిన మధుసూదనుని మాయయే అయియుండునని తలచి చెల్లెలి చేయిని అంటికొనియున్న ఆ శిశువును ఏనుగు తామరతీగనుండి తూడును లాగినట్లు లాగికొని నీ చెల్లెలగు మాయను రాతిపై వేసి కంసుడు నలిపి వైచెను.

**39–5 శ్లో.**
**తతో భవదుపాసకో ఝటితి మృత్యుపాశాదివ**
**ప్రముచ్య తరసైవ సా సమధిరూఢరూపాంతరా ।**
**అధస్తలమజగ్మషీ వికసదష్టబాహుస్ఫుర–**
**న్మహాయుధమహో గతాకిల విహాయసా దిద్యుతే ॥**

**ప్రతిపదార్థం:** తతః=అటుపిమ్మట కంసుడు అట్లు ఆ పసిపాపను కొట్టగానే, భవత్ ఉపాసకః = నీ ఉపాసకుడు (ఉపాస్తే సేవతే అసౌఉపాసించువాడు దేవతలను సేవించువాడు), ఝటితి= శీఘ్రముగా, మృత్యుపాశాత్ = మృత్యుపాశమునుండి, ప్రముచ్య ఇవ= విడివడినట్లుగా, తరసా ఏవ = వెంటనే(ఝటితి వేగేన – తొందరగా. శీఘ్రంగా), సా= ఆ యోగ మాయ, రూపాంతరా= కంసునిచేత విడివడి వేరొక రూపము, సమధిరూఢ= పొంది పైకి పోయి (అధి = ఉపరి ఆరూఢ – పైకి పోయిన),

అధః తలమ్ అజగ్ముషీ= కింద పడక, వికసత్ = వికసించిన, అష్ట బాహుః = ఎనిమిది చేతులతో, స్ఫురత్ = ప్రకాశించు, మహా –ఆయుధమ్ = ఎనిమిది దివ్యాయుధములను ధరించి(ఆయుధ్యతే అనేన – ఆయుధము, అస్త్రము), విహాయసా= ఆకాశ మార్గములో (విశేషేణ హయతి శబ్దం కరోతి మేఘాదిభిః – మేఘాదులచే విశేషంగా శబ్దం చేయునది. ఆకాశము), గతా =వెళుతూ, దిద్యుతే కిల= ప్రకాశించినది కదా!, అహో= అహో.

**తాత్పర్యం:** అటుపిమ్మట కంసుడు అట్లు ఆ పసిపాపను కొట్టగానే, నీ ఉపాసకుడు శీఘ్రముగా మృత్యుపాశమునుండి విడివడినట్లుగా వెంటనే ఆ యోగ మాయ కంసునిచేత విడివడి వేరొక రూపము పొంది కింద పడక వికసించిన ఎనిమిది చేతులతో ప్రకాశించు ఎనిమిది దివ్యాయుధములను ధరించి ఆకాశ మార్గములో వెళుతూ ప్రకాశించినది కదా! అహో!

**39–6 శ్లో.**

**నృశంసతర! కంస! తే కిము మయా వినిష్పిష్టయా**
**బభూవ భవదంతకః క్వచన చింత్యతాం తే హితమ్ ।**
**ఇతి త్వదనుజా విభో! ఖలముదీర్య తం జగ్ముషీ**
**మరుద్గణపణాయితా భువి చ మందిరాణ్యేయుషీ ॥**

**ప్రతిపదార్థం:** నృశంసతర= అతిదుష్టకర్మకారి! నీచుడా! (నృాన్ నరాన్ శంసతి హినస్తి నరులను చంపువాడు. రాక్షసుడు క్రూరుడు), కంస= కంసుడా!, మయా వినిష్పిష్టయా= నన్ను రాచినమాత్రమున, తే కిము బభూవ= నీకేమి ప్రయోజనము?, భవత్ అంతకః = నీ అంతకుడు, క్వచన = ఒకచోట ఉన్నాడు (పెరుగుచున్నాడు), తే= నీ, హితమ్= గతి (ప్రాణరక్షణ), చింత్యతాం= చింతనచేయుము(ఆలోచించు), ఇతి= అని, త్వత్ అనుజా= నీ సోదరి, తం ఖలమ్= ఆ కంసునితో (స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు మూర్ఖుడు), ఉదీర్య= పలికి, మరుత్ గణ పణాయితా= దేవతలు తనను స్తుతించుచుండగా (మ్రియతే ప్రాణినః అస్య అభావాత్ ఇది లేకపోయినచో ప్రాణులు మరణించును. వాయువు, గాలి దేవత) (పణాయితః వ్యవహృతః స్తుతో వా వ్యవహరించబడినది స్తుతింపబడినది),

జగ్ముషీ= అంతర్ధానమయింది, విభో= ఓ గురువాయూరు ప్రభూ!, భువి చ= భూమిపై, మందిరాణి= ఆయా గుడులందు (మంద్యతే స్తూయతే దేవతా అత్ర – ఇక్కడ దేవత స్తుతింపబడును. మందిరము), ఏయుషీ= జనులను అనుగ్రహించుటకు ఆయా రూపములలో వెలసి ఉన్నది.

**తాత్పర్యం:** ''అతిదుష్టకర్మకారి! నీచుడా! కంసుడా! నన్ను రాచినమాత్రమున నీకేమి ప్రయోజనము? నీ అంతకుడు ఒకచోట ఉన్నాడు. నీ ప్రాణరక్షణ చింతనచేయుము'' అని నీ సోదరి ఆ కంసునితో పలికి దేవతలు తనను స్తుతించుచుండగా అంతర్ధానమయింది. ఓ గురువాయూరు ప్రభూ ! భూమిపై ఆయా గుడులందు జనులను అనుగ్రహించుటకు ఆయా రూపములలో అ యోగమాయ వెలసి ఉన్నది.

**39–7 శ్లో.**

**ప్రగే పునరగాత్మజావచనమీరితా భూభుజా**
**ప్రలంబబకపూతనా ప్రముఖ దానవా మానినః ।**
**భవన్నిధనకామ్యయా జగతి బభ్రముర్నిర్భయాః**
**కుమారకవిమారకాః కిమివ దుష్కరం నిష్కృపైః ॥**

**ప్రతిపదార్థం:** పునః = మరలా మఱునాడు, ప్రగే= ఉదయమున (ప్రకర్షేణ గీయతే అత్ర – ఈ కాలమందు స్తుతి చేయుదురు. ప్రాతఃకాలము), భూభుజా= రాజయిన కంసుడు, అగ–ఆత్మజా = యోగమాయ, వచనమ్ = వచనమును(తనను వధించు శిశువు వేరొకచోట పెరుగుచుండెనని పలికిన పలుకులు), ఈరితా = చెప్పగా(ఈరితః ప్రేషితః ప్రేరితో వా ప్రేరేపింపు), మానినః= దురభిమానులైన, ప్రలంబ బక పూతనా ప్రముఖ దానవాః= ప్రలంబ బక పూతన ప్రముఖ దానవులు(ప్రలంబతే వ్రేలాడుట ఒక దైత్యుడు.)(బంకతే కుటిలో భవతి వంకరగా వుండునది. కొంగ ధూర్తుడు రాక్షసుడు.)(పూతం పవిత్రం కరోతి పవిత్రము చేయునది. కరక్కాయ పూతన రాక్షసి), భవత్ నిధనకామ్యయా= నిన్ను సంహరింపదలచి(నితరాం దధాతి ప్రాణినః – ప్రాణులను ధరించునది. మృత్యువు), జగతి = లోకమందు, నిర్భయాః = భయము విడిచి, కుమారక

విమారకాః= శిశు సంహారకులై, బభ్రముః = తిరిగిరి, నిష్కృపైః= దయలేని వారికి, దుష్కరం= చేయకూడనిది, కిమివ= ఏమి ఉన్నది?

**తాత్పర్యం:** మరలా మఱునాడు ఉదయమున కంసుడు యోగమాయ వచనమును(తనను వధించు శిశువు వేరొకచోట పెరుగుచుండెనని పలికిన పలుకులు) చెప్పగా దురభిమానులైన ప్రలంబ బక పూతన ప్రముఖ దానవులు నిన్ను సంహరింపదలచి లోకమందు భయము విడిచి శిశు సంహారకులై తిరిగిరి. దయలేని వారికి చేయకూడనిది ఏమి ఉన్నది?

**39–8 శ్లో.**

**తతః పశుపమందిరే త్వయి ముకుంద! నందప్రియా–**
**ప్రసూతిశయనే శయే రుదతి కించిదంచత్పదే ।**
**విబుధ్య వనితాజనై స్తనయసంభవే ఘోషితే**
**ముదా కిము వదామ్యహో! సకలమాకులం గోకులమ్ ॥**

**ప్రతిపదార్థం:** ముకుంద = ముకుందుడా! (ముకుం మోక్షం దదాతి మోక్షము నిచ్చువాడు. విష్ణువు), తతః = అటుపిమ్మట, పశుప మందిరే=నందుని గృహమున, త్వయి= నువ్వు, నంద ప్రియా –ప్రసూతి శయనే= నందుని భార్య'యశోద' శయ్యపై (ప్రీణాతి సంతోషపెట్టునది. భార్య ప్రియురాలు), శయే = పరుండి, కించిత్ అంచత్ పదే= చిరుపాదములను కదిలించుచూ, రుదతి = రోదించితివి, వనితాజనైః= ఆ శబ్దమునకు గోపకాంతలు, విబుధ్య= మేల్కొని, తనయ సంభవే ఘోషితే = మగపిల్లవాడు కలిగెనని యశోదకు తెలుపగా, సకలమ్ గోకులమ్= గోకులమెల్ల (గవాం కులం సమూహం యత్ర – గోసమూహము కల ప్రదేశము. గోకులము), ఆకులం= ఆనందసంకులమయ్యెను, అహో= అహో!, కిము ముదా వదామి= ఆ వైభవము ఏమి చెబుతాను?

**తాత్పర్యం:** ముకుందుడా! అటుపిమ్మట నందుని గృహమున నువ్వు నందుని భార్య యశోద శయ్యపై పరుండి చిరుపాదములను కదిలించుచూ రోదించితివి. ఆ శబ్దమునకు గోపకాంతలు మేల్కొని మగపిల్లవాడు కలిగెనని యశోదకు తెలుపగా గోకులమెల్ల ఆనందసంకులమయ్యెను .అహో! ఆ వైభవము ఏమి చెబుతాను?

**39-9 శ్లో.**

**అహో! ఖలు యశోదయా నవకలాయచేతోహరం**
**భవంతమలమంతికే ప్రథమమాపిబంత్యా దృశా ।**
**పునస్తనభరం నిజం సపది పాయయంత్యా ముదా**
**మనోహరతనుస్పృశా జగతి పుణ్యవంతో జితాః ॥**

**ప్రతిపదార్థం:** అహో= ఆహా!, యశోదయా= యశోద (యశోదయా= యశోద (యశః కీర్తిం దదాతి కీర్తినిచ్చునది. యశోద, శ్రీకృష్ణుని పెంపుడు తల్లి), నవ కలాయ= ఇరుగుడు పూవువలె నల్లనై(నీలికలువ పువ్వువలె), చేతోహరం= మనస్సును హరిస్తూ చక్కగా, అలమ్ అంతికే =తనకు బాగా దగ్గరగా ఉన్న, భవంతమ్ = నిన్ను, ప్రథమమ్= మొదటగా, దృశా= తన చూపులచే, పిబంత్యా= తాగి, పునః= మరలా, నిజం స్తనభరం= తన స్తన ద్వయంతో, సపది = వెంటనే, ముదా= సంతోషంతో, పాయయంత్యా =తన పాలను నీకు తాగించింది, మనోహర= నీ మనోహరమైన, తను స్పృశా= అందమైన శరీరాన్ని నిమిరి, జగతి = సర్వలోకములలో ఉన్న, పుణ్యవంతః= పుణ్యశీలులందరిని, జితాః ఖలు = యశోద జయించింది కదా!

**తాత్పర్యం:** ఆహా! యశోద కొత్త ఇరుగుడు పూవువలె నల్లనై (నీలికలువ పువ్వువలె) మనస్సును హరిస్తూ చక్కగా తనకు బాగా దగ్గరగా ఉన్న నిన్ను మొదటగా తన చూపులచే తాగి మరలా తన స్తన ద్వయంతో వెంటనే సంతోషంతో తన పాలను నీకు తాగించింది. నీ మనోహరమైన అందమైన శరీరాన్ని నిమిరి సర్వలోకములలో ఉన్న పుణ్యశీలులందరిని యశోద జయించింది కదా! (యశోదను మించిన అదృష్టవంతులు ఏ లోకములోను లేరని భావం).

**39-10 శ్లో.**

**భవత్కుశలకామ్యయా స ఖలు నందగోపస్తదా**
**ప్రమోదభరసంకులో ద్విజకులాయ కిం నాదదాత్ ।**
**తథైవ పశుపాలకాః కిము న మంగళం తేనిరే**
**జగత్త్రితయమంగళ! త్వమిహ పాహి మామామయాత్ ॥**

**ప్రతిపదార్థం:** భవత్= నీ యొక్క, కుశల కామ్యయా= అభ్యుదయమును కోరి (నీ క్షేమమును కోరి) (కుం పాపం తస్మాత్ శలతి పృథక్త్వం ప్రాప్నోతి పాపమును తొలగించి శుభమును చేకూర్చునది. కల్యాణము), స నందగోపః= ఆ నందగోపుడు, తదా =అప్పుడు, ప్రమోదభరసంకులః= ఆనందభరితుడయి (ప్రకృష్టో మోదః హర్షః – సంతోషము ఆనందము), ద్విజకులాయ= బ్రాహ్మణులకు, కిం న అదదాత్ ఖలు = ఈయనిది లేనే లేదు కదా ! (బ్రాహ్మణులకు అన్ని దానాలు చేసాడని భావం), త థా ఏవ = అట్లే, పశుపాలకాః= గోపాలకులకు, కిము న మంగళం తేనిరే = చేయని మంగళములును లేనే లేవు (అన్ని రకాల శుభాలను చేసాడని భావం)(మంగతి హితార్థం సర్పతి) హితమును చేకూర్చునది, జగత్ త్రితయ మంగళ।= ముల్లోకములకు శుభము కలిగించు కృష్ణా!, త్వమ్ = నువ్వు, ఇహ= ఈ లోకంలో, మామ్= నన్ను, ఆమయాత్= రోగమునుండి, పాహి= రక్షించు.

**తాత్పర్యం:** నీ యొక్క క్షేమమును కోరి ఆ నందగోపుడు అప్పుడు ఆనందభరితుడయి బ్రాహ్మణులకు ఈయనిది లేనే లేదు కదా ! (బ్రాహ్మణులకు అన్ని దానాలు చేసాడని భావం) అట్లే గోపాలకులకు చేయని మంగళములును లేనే లేవు (అన్ని రకాల శుభాలను చేసాడని భావం) ముల్లోకములకు శుభము కలిగించు కృష్ణా! నువ్వు ఈ లోకంలో నన్ను రోగమునుండి రక్షించు.

***దశమ స్కంధము***

**39వ దశకము సమాప్తము.**

## దశకమ్ 40 – పూతనామోక్షము

**40–1 శ్లో.**

**తదను నందమమందశుభాస్పదం**
**నృపపురీం కరదానకృతే గతమ్ ।**
**సమవలోక్య జగాద భవత్పితా**
**విదితకంససహాయజనోద్యమః ॥**

**ప్రతిపదార్థము:** తదను =కృష్ణునిగా నీవు జన్మించిన తదనంతరము, అమందశుభ – ఆస్పదం = లోకోత్తర గుణాకరుడైన (ఉత్తమగుణ సంపన్నుడైన)(అమంద= న మందః, న మూఢః – మందబుద్ధి కానివాడు చురుకైనవాడు), నందమ్= నందుడు, కర–దాన కృతే= కంసునికి పన్ను చెల్లించుటకు (కరోతి అనేన కార్యాణి దీనితో పనులు చేయుదురు. పన్ను), నృప–పురీం = మధురానగరమునకు, గతమ్= వెళ్ళెను, కంస సహాయజన = కంసుని అనుచరులు పూతన తృణావర్తాదులు, ఉద్యమః= పసి పిల్లల నందఱు సంహరించుటకు చేయుచున్న దురాగతములు(ఉద్యమ్యతే ఆయాస్యతే శరీరాదికం యస్మిన్ ఉద్యోగము), విదిత = ఎరిగినవాడై, భవత్ పితా= అప్పుడు నీ జనకుడు వసుదేవుడు, సమవలోక్య= తనను కలుసుకొనుటకు వచ్చిన నందుని చూచి, జగాద= ఇట్లనెను.

**తాత్పర్యము:** కృష్ణునిగా నీవు జన్మించిన తదనంతరము లోకోత్తర గుణాకరుడైన (ఉత్తమగుణ సంపన్నుడైన) నందుడు కంసునికి పన్ను చెల్లించుటకు మధురానగరమునకు వెళ్ళెను. కంసుని అనుచరులు పూతన తృణావర్తాదులు పసి పిల్లల నందఱు సంహరించుటకు చేయుచున్న దురాగతములు ఎరిగినవాడై అప్పుడు నీ జనకుడు వసుదేవుడు, తనను కలుసుకొనుటకు వచ్చిన నందుని చూచి ఇట్లనెను

**40–2 శ్లో.**

**అయి! సఖే! తవ బాలకజన్మ మాం**
**సుఖయతేఽద్య నిజాత్మజజన్మవత్ ।**

**ఇతి భవత్పితృతాం వ్రజనాయకే**
**సమధిరోప్య శశంస తమాదరాత్ ॥**

**ప్రతిపదార్థము:** అయిసఖే= ఓ మిత్రుడా!, తవ బాలక జన్మ =నీకు కుమారుడు కలుగుట, నిజ ఆత్మజ జన్మవత్= నాకే పుత్రుడు జన్మించినట్లుగా, అద్య= ఇప్పుడు, మాం సుఖయతే=నన్ను ఆనంద పెట్టినది, ఇతి= అని, వ్రజనాయకే= నందుడే (వ్రజస్య నాయకః–వ్రజ ప్రదేశమునకు(మథురా – వృందావన ప్రదేశము) నాయకుడు, భవత్ పితృతాం= నీకు తండ్రి యనునట్లు, సమధిరోప్య= అతనికి పితృత్వము ఆపాదించి(నిన్ను కనిన తండ్రిగా తా నర్థమగునట్లు), తమ్ ఆదరాత్= అతనిని సాదరముగా(ఆద్రియతే తస్య భావః – ఆదరణ ప్రతిష్ఠ సన్మానము), శశంస= కొనియాడెను.

**తాత్పర్యము:** ఓ మిత్రుడా! నందుడా! నీకు కుమారుడు కలుగుట నిజ ఆత్మజ జన్మవత్= నాకే పుత్రుడు జన్మించినట్లుగా ఇప్పుడు నన్ను ఆనంద పెట్టినది. అని నందుడే = నీకు తండ్రి యనునట్లు అతనికి పితృత్వము ఆపాదించి (నిన్ను కనిన తండ్రిగా తా నర్థమగునట్లు అతనిని సాదరముగా వసుదేవుడు కొనియాడెను (నాకుమారునివలె సావధానముగా కృష్ణుని రక్షింపుమని వసుదేవుడు నందునితో పలికిన మాటలలోని సారాంశం)

**40–3 శ్లో.**
**ఇహ చ సంత్యనిమిత్తశతాని తే**
**కటకసీమ్ని తతో లఘు గమ్యతామ్ ।**
**ఇతి చ తద్వచసా వ్రజనాయకో**
**భవదపాయభియా ద్రుతమాయయౌ ॥**

**ప్రతిపదార్థము:** ఇహ చ= ఇక్కడను (అస్మిన్ కాలే, అస్యాం దిశి వా–ఇక్కడ), తే కటక సీమ్ని= నీ స్థానమునను (మీ వ్రేపల్లెయందును) (కటక=న కటతి వర్షతి జలం అస్మిన్ పర్వత మధ్యభాగము), అనిమిత్త శతాని=అనేక దుర్నిమిత్తములు (దుశ్శకునములు) (నాస్తి నిమిత్తం యస్య – కారణం లేనిది ప్రమాణం లేనిది), సన్తి= కనబడుతున్నాయి, తతః = అందువలన, లఘు= త్వరగా (లంఘతే అనేన

లంఘతి గంతుం శక్నోతి దీనితో లంఘింతురు, తొందరగా పోవుదురు), గమ్యతామ్= ఇంటికి వెళ్ళుము, ఇతి చ= అని, తత్ వచసా= చెప్పిన ఆ వసుదేవుని మాటను అనుసరించి, వ్రజనాయకః = నందుడు, భవత్ అపాయ భియా= నీకు కీడు కలుగునేమోనను భయముతో (అప అయనం గమనమ్ ప్రక్కకు పోవుట దుఃఖము ఆపద), ద్రుతమ్= వెంటనే, ఆయయౌ= గోకులమునకు ప్రయాణమయ్యెను.

**తాత్పర్యము:** "ఇక్కడను, నీ స్థానమునను (మీ వ్రేపల్లెయందును) దుశ్శకునములు చాలా కనబడుతున్నాయి. అందువలన త్వరగా ఇంటికి వెళ్ళుము "అని చెప్పిన ఆవసుదేవుని మాటను అనుసరించి నందుడు నీకు కీడు కలుగునేమోనను భయముతో వెంటనే గోకులమునకు ప్రయాణమయ్యెను.

**40-4 శ్లో.**
**అవసరే ఖలు తత్ర చ కాచన**
**వ్రజపదే మధురాకృతిరంగనా ।**
**తరల షట్పదలాలితకుంతలా**
**కపట పోతక! తే నికటం గతా ॥**

**ప్రతిపదార్థము:** కపట పోతక= ఓ కపట బాలకమూర్తీ! (పోత ఏవ పోతక, పశుశావకః పశువుల దూడ మొదలగునవి. బాలుడను అర్థం లక్ష్యార్థం), అవసరే = అదే సమయమున (నందుడు నీకు కీడు కలుగునేమోనను భయముతో గోకులమునకు ప్రయాణమయిన సమయములో), తత్ర వ్రజపదే చ= ఆ గోకులమునకు, కాచన = ఒకానొక, మధుర ఆకృతిః అంగనా= అందకత్తెగా, తరల = చంచలమైనది. ఒకచోట ఉండనిది(తరతి చంచలో భవతి), షట్పద= తుమ్మెదలను (షట్ పాదాని యస్యఆరు పాదములు కలది. తుమ్మెద), లాలిత= లాలించు(లాలితః స్నిగ్ధః అభిలక్షితః - లాలించబడినది), కుంతలా= నల్లనైన కొప్పుతో పూతన అను ఒక రాక్షసి (తుమ్మెదల నలుపుదనమును మించు నల్లనైన కొప్పుతో)(కుంతల= కుంతం కుంతాగ్రాకారం లాతి గృహ్ణాతి బల్లెం ఆకారమును

పొందునది. శిరోకేశము, తలవెంట్రుక), తే నికటం = నీ దగ్గరకు(ని సమీపే కటతి వర్తతే దగ్గర వుండునది. దగ్గర), గతా ఖలు= వచ్చెను కదా!.

**తాత్పర్యము:** ఓ కపట బాలకమూర్తీ! బాల కృష్ణా! అదే సమయమున ఆ గోకులమునకు ఒకానొక అందకత్తెగా చంచలమై ఒకచోట ఉండని తుమ్మెదలను లాలించు నల్లనైన కొప్పుతో పూతన అను ఒక రాక్షసి (తుమ్మెదల నలుపుదనమును మించు నల్లనైన కొప్పుతో) నీ దగ్గరకు వచ్చెను కదా !

**విశేషము**

**తరల షట్పదలాలితకుంతలా:** చంచలమై ఒకచోట ఉండని తుమ్మెదలను ఒకచోటికి కుదురుగా స్థిరముగా కదల నీయకుండా చేర్చి ఆమె నల్లనైన కొప్పు లాలిస్తున్నదని చెప్పుట మనోహరమైన కవితా సౌందర్య పంక్తి.

**40-5 శ్లో.**
**సపది సా హృతబాలకచేతనా**
**నిశిచరాన్వయజా కిల పూతనా ।**
**వ్రజవధూష్విహ కేయమితి క్షణం**
**విమృశతీషు భవంతముపాదదే ॥**

**ప్రతిపదార్థము:** సపది= తత్క్షణము (సహ పద్యతే వెంబడి వుండునది), సా హృత బాలకచేతనా= బాల ఘాతిని (శిశుప్రాణములను హరించునది)(హృతః, అపహృతః, నీతః, ఊఢః= అపహరింపబడినది తీసుకపోబడినది మోయబడినది), నిశిచర= రాక్షస, అన్వయజా= వంశములో పుట్టిన (అను గచ్ఛతి వెనుక వెళ్లుట వంశము), పూతనా= పూతన అను రాక్షసి, వ్రజవధూషు= గోపస్త్రీజనులు, ఇహ కా ఇయమ్ = ఇక్కడ ఈమె ఎవరు!, ఇతి= అని, క్షణం విమృశతీషు= క్షణకాలము ఆలోచించుకొనుచుండగనే, భవంతమ్ =నిన్ను తన చేతులలోనికి తీసుకొని, ఉపాదదే కిల = ఎత్తుకొన్నది కదా!.

**తాత్పర్యము:** తత్క్షణమే ఆ శిశుప్రాణములను హరించునది, రాక్షస వంశములో పుట్టిన –పూతన అను రాక్షసి – గోపస్త్రీజనులు “ఇక్కడ ఈమె ఎవరు!” అని

క్షణకాలము ఆలోచించుకొనుచుండగనే నిన్ను తన చేతులలోనికి తీసుకొని ఎత్తుకొన్నది కదా !

**40-6 శ్లో.**

**లలితభావవిలాసహృతాత్మభి**
**ర్యువతిభిః ప్రతిరోద్ధుమపారితా ।**
**స్తనమసౌ భవనాంతనిషేదుషీ**
**ప్రదదుషీ భవతే కపటాత్మనే ॥**

**ప్రతిపదార్థము:** లలిత భావ = ఆ పూతన యొక్క లలితమైన భావ ప్రకటనలకు(భావయతి జ్ఞాపయతి హృదయగతాం దశామ్ హృదయంలో వున్న వాటిని తెలుపునది. భావము), విలాస= శిశువును లాలించుటలో చూపెడి విలాసమునకు (విశేషేణ లసతి తస్య భావః కర్మ వా విలాసము. స్త్రీల విలాస చేష్ట),హృత ఆత్మభిః= హృదయాకర్షితులై (మోసపోయి), యువతిభిః= ఆ గోపవనితలు, ప్రతిరోద్ధుమ్ అపారితా= దానిని వద్దని వారింపలేకపోయిరి, అసౌ= ఆ, కపట– ఆత్మనే= కపటమైన మనస్సు కలిగిన పూతన, భవన –అంత = నందుని గృహమున ప్రవేశించి, నిషేదుషీ = అచ్చటే కూర్చొని, భవతే = నీకు, స్తనమ్= తన స్తనమును (స్తనయతి కథయతి వక్షః శోభామ్ వక్షఃస్థల అందమును చెప్పునది. చన్ను), ప్రదదుషీ = ఇచ్చుట ప్రారంభించెను.

**తాత్పర్యము:** ఆ పూతన యొక్క లలితమైన భావ ప్రకటనలకు శిశువును లాలించుటలో చూపెడి విలాసమునకు హృదయాకర్షితులై (మోసపోయి) ఆ గోపవనితలు దానిని వద్దని వారింపలేకపోయిరి. ఆ కపటమైన మనస్సు కలిగిన పూతన నందుని గృహమున ప్రవేశించి అచ్చటే కూర్చొని నీకు పాలను ఇచ్చుట ప్రారంభించెను.

**40-7 శ్లో.**

**సమధిరుహ్య తదంకమశంకిత**
**స్త్వమథ బాలకలోపనరోషితః ।**

**మహదివామ్రఫలం కుచమండలం**
**ప్రతిచుచూషిథ దుర్విషదూషితమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, త్వమ్= నువ్వు, తత్ అంకమ్= దాని ఒడిలో, అశంకితః = ఏమియూ సంశయింపక, సమధిరుహ్య= కూర్చుండి, బాలక లోపన= అది పెక్కుమంది శిశువులను చంపియున్నదని, మహత్ రోషితః= కోపముగొని, దుర్విషదూషితమ్=విషపూరితములగు, కుచ మండలం = ఆమె కుచమండలమును గ్రహించి, ఆమ్ర ఫలం ఇవ= మామిడిపండునుండి రసమును గ్రోలినట్లుగా (అమ్యతే సేవ్యతే సేవించదగినది. ఆమ్రవృక్షము, మామిడిచెట్టు), ప్రతిచుచూషిథ =దాని స్తనము నుండి పాలును పీల్చుచూ త్రాగనారంభించితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నువ్వు దాని ఒడిలో ఏమియూ సంశయింపక కూర్చుండి అది పెక్కుమంది శిశువులను చంపియున్నదని కోపముగొని విషపూరితములగు ఆమె కుచమండలమును గ్రహించి మామిడిపండునుండి రసమును గ్రోలినట్లుగా దాని స్తనము నుండి పాలును పీల్చుచూ త్రాగనారంభించితివి.

**40–8 శ్లో.**
**అసుభిరేవ సమం ధయతి త్వయి**
**స్తనమసౌ స్తనితోపమ నిస్వనా ।**
**నిరపతద్భయదాయి నిజం వపుః**
**ప్రతిగతా ప్రవిసార్య భుజావుభౌ ॥**

**ప్రతిపదార్థము:** స్తనమ్= పాలతోబాటు, త్వయి= నువ్వు, సమం= సమముగా, అసుభిః ఏవ= పూతన ప్రాణములనుగూడ (అసతి గచ్ఛతి శరీరే శరీరములోకి వెళ్లునది. ప్రాణవాయువు), ధయతి= త్రాగావు, అసౌ = ఆ పూతన, స్తనిత ఉపమ = పిడుగు పడినట్లు (స్తనితః ధ్వనితః గర్జితమ్ మేఘ శబ్దము), నిస్వనా= పెద్దధ్వని చేయుచు, భయదాయి నిజం వపుః = తనభయంకర నిజస్వరూపమును, ప్రతిగతా= పొంది, (ప్రతిముఖం గతం గమనమ్ ఎదురు వెళ్లుట), ఉభౌ భుజౌ = రెండు చేతులు, ప్రవిసార్య = చాచుకొని, నిరపతత్= నేలపై పడిపోయెను.

**తాత్పర్యము:** పాలతోబాటు నువ్వు సమముగా పూతన ప్రాణములనుగూడ త్రాగావు. ఆ పూతన పిడుగు పడినట్లుగా పెద్దధ్వని చేయుచు తనభయముగొల్పు నిజస్వరూపమును పొంది, రెండు చేతులు చాచుకొని నేలపై పడిపోయెను.

**40-9 శ్లో.**

**భయదఘోషణభీషణవిగ్రహ**
**శ్రవణదర్శనమోహితవల్లవే ।**
**వ్రజపదే తద్ ఉరః స్థల ఖేలనం**
**నను భవంతమగృహ్ణత గోపికాః ॥**

**ప్రతిపదార్థము:** భయద= అతి భయంకరమైనపూతన, ఘోషణ= ధ్వనిని (ఘోషతి శబ్దాయతే తస్య కర్మ-మేఘగర్జనము), శ్రవణ= విని, (శృణోతి తస్య భావః కర్మ వా వినుట కీర్తి), భీషణ విగ్రహ= భీకరమైన పూతన రాక్షసస్వరూపమును (భీషయతేభయపెట్టునది, భయానకమైనది భయానకరసము), దర్శన = చూసి (దృశ్యతే అనేనదీనితో చూచుదురు. దర్శనము), వ్రజపదే = వ్రేపల్లెలోని, వల్లవే = అశేషజనము (గోకులవాసులు)(వల్లం ప్రీతి వాతి ప్రీతిని చూపువాడు. గోపాలకుడు), మోహితః= మూర్ఛపడిరి, గోపికాః = కొంతసేపటికి తెప్పరిల్లిన గోపాంగనలు (గోపీ ఏవ గోపికా గోపియే గోపిక. గోపస్య స్త్రీ గోపీ గోపాలుని భార్య. గోపీ), తత్-ఉరః స్థలఖేలనం= దాని రొమ్మున క్రీడించు, భవంతమ్= నిన్ను, అగృహ్ణత నను= ఎత్తుకొన్నారు కదా!

**తాత్పర్యము:** అతి భయంకరమైనపూతన ధ్వనిని విని, భీకరమైన పూతన రాక్షసస్వరూపమును చూసి వ్రేపల్లెలోని అశేషజనము (గోకులవాసులు) మూర్ఛపడిరి. కొంతసేపటికి తెప్పరిల్లిన గోపాంగనలు దాని రొమ్మున క్రీడించు నిన్ను ఎత్తుకొన్నారు కదా!

**40-10 శ్లో.**

**భువనమంగళ! నామభిరేవ తే**
**యువతిభిర్బహుధా కృతరక్షణః ।**

**త్వమయి వాతనికేతననాథ! మా**
**మగదయన్ కురు తావకసేవకమ్ ॥**

**ప్రతిపదార్థము:**

భువన మంగళ= ఓ లోకములకు మంగళమును కలిగించువాడా! (మంగతి హితార్థం సర్పతి హితమును చేకూర్చునది), తే నామభిః ఏవ = నీ నామములతోనే, యువతిభిః = నీ తల్లి యశోద మరియు ఇతర గోపస్త్రీలు, బహుధా = అనేక రకములుగా(బహు ప్రకారకమ్), త్వమ్ కృతరక్షణః= నీ సకలాంగములకు అంగరక్ష(శిశురక్షణార్థము కట్టెడు తేకు, శరీరరక్షణము) పెట్టారు, అయి వాతనికేతననాథ= ఓ గురువాయూరు దేవా!, మామ్ = నన్ను, అగదయన్= రోగములు లేనివానిగా చేసి, తావక సేవకమ్= నీ సేవకునిగా, కురు= చేయుము.

**తాత్పర్యము:** ఓ లోకములకు మంగళమును కలిగించువాడా! నీ నామములతోనే నీ తల్లి యశోద మరియు ఇతర గోపస్త్రీలు అనేక రకములుగా నీ సకలాంగములకు అంగరక్ష పెట్టారు. ఓ గురువాయూరు దేవా ! నన్ను రోగములు లేనివానిగా చేసి నీ సేవకునిగా చేయుము.

**దశమ స్కంధము 40వ దశకము పూర్తి**

# దశకమ్ 41
# పూతనాదహనం మరియు కృష్ణలాలనాహ్లాదము

**41-1 శ్లో.**

**వ్రజేశ్వరః శౌరివచో నిశమ్య**
**సమావ్రజన్నధ్వని భీతచేతాః ।**
**నిష్పిష్టనిశ్శేషతరుం నిరీక్ష్య**
**కంచిత్ పదార్థం శరణం గతస్త్వామ్ ॥**

**ప్రతిపదార్థం:** వ్రజ–ఈశ్వరః = గొల్లల నాయకుడగు నందుడు, శౌరివచః= మధురా నగరమున వసుదేవుని మాట (అనేక దురాగతాలు జరుగుతాయని 40 వసర్గలో 03 వశ్లోకంలో చెప్పిన మాట)(శూరస్య గోత్రాపత్యమ్ శూరుని గోత్రములో పుట్టినవాడు శౌరి), నిశమ్య = విని, సమావ్రజన్= తన గృహమునకు వచ్చి (రేపల్లెకువచ్చి), అధ్వని = మార్గమధ్యమున, నిష్పిష్ట నిశ్శేష తరుం= రెండు క్రోసులమేర చెట్లన్నింటిని చక్కఁగా నూరిన (కూల్చిన) పూతన శరీరమును( కోసు అనగా రెండుమైళ్ళ దూరం), నిరీక్ష్య= చూచి, భీతచేతాః= భయపడిన మనస్సు కలవాడై, కంచిత్ పదార్థం = ఒకానొక పదార్థమును(అనిర్వచనీయ భగవత్తత్త్వమైన)(పదబోధ్యః అర్థః–పదముతో తెలియు అర్థము. వస్తువు), త్వామ్= నిన్ను, శరణం గతః= శరణుకోరెను.

**తాత్పర్యం:** గొల్లల నాయకుడగు నందుడు మధురా నగరమున వసుదేవుని మాట విని తన గృహమునకు వచ్చి (రేపల్లెకువచ్చి) మార్గమధ్యమున రెండు క్రోసులమేర చెట్లన్నింటిని కూల్చిన పూతన శరీరమును చూచి భయపడిన మనస్సు కలవాడై అనిర్వచనీయ భగవత్తత్త్వమైన నిన్ను శరణుకోరెను.

**41-2 శ్లో.**

**నిశమ్య గోపీవచనాదుదంతం**
**సర్వేఽపి గోపా భయవిస్మయాంధాః ।**

**త్వత్పాతితం ఘోరపిశాచదేహం**
**దేహుర్విదూరేఽథ కుఠారకృత్తమ్ ॥**

**ప్రతిపదార్థం:** గోపీవచనాత్= గోపికలవలన, ఉదంతం= పూతనా వృత్తాంతము (ఉద్గతః అంతః నిర్ణయః యస్మాత్ దీనితో నిర్ణయం చేయుదురు. వృత్తాంతము సమాచారము), నిశమ్య = విని, సర్వే అపి గోపాః= అందరు గోపాలకులు, భయ=పూతన భయంకరరూప దర్శనముచే భయమును, విస్మయ అంధాః= నీచేత ఇదియెట్లు కూల్చబడినదని విస్మయమును పొంది (అంధత్వము అనగా ఇక్కడ గుడ్డి తనమని అర్థం కాదు. ఏ చేయటానికి పాలుపోని స్థితిని కొద్ది సేపు పొందారని ప్రకరణార్థం), అథ= అటుపిమ్మట, త్వత్ పాతితం = నీ చే కూల్చబడిన, ఘోర పిశాచ దేహం= ఆ ఘోరపిశాచి పూతన దేహమును (పిశితం మాంసం అశ్నాతి మాంసమును తినునది),విదూరే=పల్లెకు చాలా దూరము తీసుకొనిపోయి, కుఠార కృత్తమ్= గొడ్డళ్ళచే ముక్కలుగా ఖండించి, దేహుః= కాల్చి వేసిరి.

**తాత్పర్యం:** గోపికలవలన పూతనా వృత్తాంతము విని అందరు గోపాలకులు పూతన భయంకరరూప దర్శనముచే భయమును నీచేత ఇదియెట్లు కూల్చబడినదని విస్మయమును పొంది అటుపిమ్మట నీ చే కూల్చబడిన ఆ ఘోరపిశాచి పూతన దేహమును పల్లెకు చాలా దూరము తీసుకొనిపోయి గొడ్డళ్ళచే ముక్కలుగా ఖండించి కాల్చి వేసిరి.

**41-3 శ్లో.**
**త్వత్పీతపూతస్తనతచ్ఛరీరాత్**
**సముచ్చలన్నుచ్చతరో హి ధూమః ।**
**శంకామధాదాగరవః కిమేష**
**కిం?చాందనో గౌగ్గులవోఽథవేతి ॥**

**ప్రతిపదార్థం:** త్వత్ పీత= పూతన పాలను నీవు త్రాగుటచే (పీతం పానమ్ త్రాగబడినది), పూత స్తన = పునీతమైన స్తనములు కల(రజస్సు, తమస్సు మొదలగు గుణముల నిలయమయినప్పటికి శుద్ధసత్త్వ గుణముతో కుచయుగము

పునీతమైనదని అర్థం) (పూత=కృత శుద్ధిః పవిత్రితఃశుద్ధి చేయబడినది పవిత్రము చేయబడినది కడగబడినది), తత్ శరీరాత్= పూతన శవ శరీరము నుండి, సముచ్చలన్ = ఎగజిమ్ముచున్న, ఉచ్చతరః = ఎత్తైన, ధూమః= పొగ (ధునోతి ధూయతే వా అగ్నిసంభవః – కష్టపెట్టునది విసరబడినది అగ్నిలో పుట్టినది. పొగ), కిమ్ ఏషః అగరవః= ఇది అగరుధూపమా!, చాందనః కిం= మంచిగంధ పరిమళమా(చందనపు చెక్క కాలిన వాసనా!) (చందనేన సంపద్యతే క్రియతే చందనం నుంచి వచ్చునది), అథవా=లేక, గౌగ్గులవః=గుగ్గిలపు పొగయా, ఇతి= అని ఇట్లు, శంకామ్ అధాత్ హి= సందేహమును పొందెను కదా!

**తాత్పర్యం:** తన పాలను నీవు త్రాగుటచే పునీతమైన స్తనములు కల పూతన శవ శరీరము నుండి ఎగజిమ్ముచున్న ఎత్తైన పొగ "ఇది అగరుధూపమా! మంచిగంధ పరిమళమా లేక గుగ్గిలపు పొగయా"? అను సందేహమును పొందెను కదా!

**41-4 శ్లో.**
**మదంగసంగస్య ఫలం న దూరే**
**క్షణేన తావద్భవతామపి స్యాత్ ।**
**ఇత్యుల్లపన్ వల్లవతల్లజేభ్య**
**స్త్వం పూతనామాతనుథాః సుగంధిమ్ ॥**

**ప్రతిపదార్థం:** మత్ = బ్రహ్మానంద మయుడనైనన్ను, అంగసంగస్య= ఎత్తి కొని ముద్దులాడుటతో నా శరీరసంగము వలన కలుగు, ఫలం= ఫలితము(ముక్తి), న దూరే = ఎప్పుడో కలుగదు.(మరొక జన్మలో కాదు), క్షణేన = నా యందు మనస్సును ఉంచిన వారికి ఈ క్షణములోనే వెనువెంటనే కలుగును. (క్షణోతి నాశయతి సర్వం యథాకాలమ్ అన్నింటిని నశింపచేయునది. క్షణకాలము ముప్పై కళల పరిమిత కాలము), తావత్ = అట్టి, శరీర స్పర్శ = శరీర స్పర్శ వలన కలుగు ముక్తికి(స్పర్శయతి తస్య భావః కర్మ వా ముట్టుకొనుట తాకుట), భవతామ్ అపి = మీరును, స్యాత్= అర్హులగుదురు, ఇతి వల్లవతల్లజేభ్యః =అని గోపికలకు, గోపాలకులకు, ఉల్లపన్= తెలియజేయుటకు, త్వం= నువ్వు, పూతనామ్= పూతన శరీరమును, సుగంధిమ్= సుగంధభరితముగా, అతనుథాః= చేసితివి.

**తాత్పర్యం:** బ్రహ్మానంద మయుడనైననన్ను ఎత్తి కొని ముద్దులాడుటతో నా శరీరసంగము వలన కలుగు ఫలితము (ముక్తి) ఎప్పుడో కలుగదు. (మరొక జన్మలో కాదు) నా యందు మనస్సును ఉంచిన వారికి ఈ క్షణములోనే వెనువెంటనే కలుగును. అట్టి శరీర స్పర్శ వలన కలుగు ముక్తికి మీరును అర్హులగుదురు అని గోపికలకు, గోపాలకులకు తెలియజేయుటకు నువ్వు పూతన శరీరమును సుగంధభరితముగా చేసితివి.

**41-5 శ్లో.**
**చిత్రం పిశాచ్యా న హతః కుమార**
**శ్చిత్రం పురైవాకథి శౌరిణేదమ్ ।**
**ఇతి ప్రశంసన్ కిల గోపలోకో**
**భవన్ముఖాలోకరసే న్యమాంక్షీత్ ॥**

**ప్రతిపదార్థం:** పిశాచ్యా= పిశాచి చేత(పూతన చేత), కుమారః = నందకుమారుడు(కృష్ణుడు) (కుమారయతి క్రీడతి ఆడుకొనువాడు. పిల్లవాడు), న హతః= హతుడు కాకపోవుట, చిత్రం = ఆశ్చర్యము (చిత్రయతి విచిత్రమైనది అద్భుతమైనది), పురా ఏవ= ముందే, శౌరిణా = వసుదేవునిచే, ఇదమ్= ఇదంతా, అకథి= చెప్పబడినది కదా!, చిత్రం= ఇది ఇంకా ఆశ్చర్యము, ఇతి ప్రశంసన్= అని నిన్ను ప్రశంసించుచూ, గోపలోకః= ఆ గోకులవాసులు, భవత్ ముఖ ఆలోక రసే = నీ ముఖమును చూచుట వలన కలిగెడి ఆనందంలో (ముఖ =ఖనతి అన్నాదికమనేన – దీనితో అన్నాదులు నమలుదురు), న్యమాంక్షీత్ కిల= మునిగిపోయారు కదా.

**తాత్పర్యం:** పూతన చేత నందకుమారుడు(కృష్ణుడు) హతుడు కాకపోవుట ఆశ్చర్యము . ముందే వసుదేవునిచే ఇదంతా చెప్పబడినది కదా! ఇది ఇంకా ఆశ్చర్యము అని నిన్ను ప్రశంసించుచూ ఆ గోకులవాసులు నీ ముఖమును చూచుట వలన కలిగెడి ఆనందంలో మునిగిపోయారు.

**41-6 శ్లో.**
**దినే దినేఽథ ప్రతివృద్ధలక్ష్మీ**
**రక్షీణ మాంగళ్య శతో వ్రజోఽయమ్ ।**

**భవన్నివాసాదయి వాసుదేవ!**
**ప్రమోదసాంద్రః పరితో విరేజే ॥**

**ప్రతిపదార్థం:** అయి వాసుదేవ= ఓ వాసుదేవా! (వసతి సర్వత్ర ఆత్మరూపేణ వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చ– అంతటా ఆత్మరూపంలో వుండువాడు. వాసుదేవుడు), అథ= అటుపిమ్మట వ్రేపల్లెలో, దినే దినే= ప్రతిదినము (ద్యతి అంధకారమ్ చీకటిని నాశనము చేయునది. దినము, పగలు), ప్రతివృద్ధ లక్ష్మీః =సంపదలచే సమృద్ధమై (లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్ ప్రయత్నించువారిని చూచునది. విష్ణుపత్ని, శోభ, కాంతి, సంపద), అక్షీణ మాంగళ్య శతః=అఖండమైన అనేక శుభములు వెల్లివిరిసాయి (మంగళ ఏవ మాంగల్యమ్ మంగళము, శుభము), భవత్ నివాసాత్= నీ నిరంతర నివాసము వలన, అయమ్ వ్రజః =ఈ గోకులము, ప్రమోద సాంద్రః పరితః = అంతటా అధికమైన ఆనందముతో (ప్రకృష్టో మోదః హర్షః సంతోషము ఆనందము), విరేజే= విలసిల్లెను.

**తాత్పర్యం:** ఓ వాసుదేవా! అటుపిమ్మట వ్రేపల్లెలో ప్రతిదినము సంపదలచే సమృద్ధమై అఖండమైన అనేక శుభములు వెల్లివిరిసాయి. నీ నిరంతర నివాసము వలన ఈ గోకులము అంతటా అధికమైన ఆనందముతో విలసిల్లెను.

**41–7 శ్లో.**
**గృహేషు తే కోమలరూపహాస**
**మిథః కథాసంకులితాః కమన్యః ।**
**వృత్తేషు కృత్యేషు భవన్నిరీక్షా**
**సమాగతాః ప్రత్యహమత్యనందన్ ॥**

**ప్రతిపదార్థం:** గృహేషు= గోకులమున గోపకాంతలు తమ ఇండ్లలో (గృహ్ణాతి ధాన్యాదికం మనుష్యాంశ్చ –ధనాదులను, మనుష్యులను గ్రహించునది. గృహము, ఇల్లు), తే = నీ యొక్క, హాస కోమల రూప= చిరునవ్వులొలకించు నీ కోమల రూపమును తలచుకొంటూ ( హసతి తస్య భావః కర్మ వా నవ్వు), మిథః కథా సంకులితాః= ఒకరికొకరు నీ గురించి చెప్పుకొనుచుండిరి. (మేథతి కలియుట

పరస్పరము ఏకాంతము)(కథ్యతే ఇతి కథా చెప్పబడునది చెప్పుట), ప్రతి అహన్= ప్రతిరోజు(న ఉపాహరంతి అస్మిన్ కర్మాణి దీనిలో తమతమ పనులు చేసుకొందురు. దినము), కమన్యః = అందమయిన ఆ గోపికలు(కామయతే అసౌ అందమైనది), వృత్తేషు కృత్యేషు = తమ తమ రోజువారి పనులను తొందరగా ముగించుకొని, భవత్ నిరీక్షా సమాగతాః = నిన్ను చూడవలెనను ముచ్చటతో తొందరగా నీ వద్దకు వచ్చి, అతి అనందన్= ఆనందించుచుండిరి.

**తాత్పర్యం:** గోకులమున గోపకాంతలు తమ ఇండ్లలో నీయొక్క చిరునవ్వులొలకించు నీ కోమల రూపమును తలచుకొంటూ ఒకరికొకరు నీ గురించి చెప్పుకొనుచుండిరి. ప్రతిరోజు అందమయిన ఆ గోపికలు తమ తమ రోజువారి పనులను తొందరగా ముగించుకొని నిన్ను చూడవలెనను ముచ్చటతో తొందరగా నీ వద్దకు వచ్చి ఆనందించుచుండిరి.

**41-8 శ్లో.**

**అహో! కుమారో మయి దత్తదృష్టిః**
**స్మితం కృతం మాం ప్రతి వత్సకేన ।**
**ఏహ్యేహి మామిత్యుపసార్య పాణిం**
**త్వయీశ! కిం కిం న కృతం వధూభిః ॥**

**ప్రతిపదార్థం:** ఈశ= ఓ గురువాయూరు దేవా!, అహో = ఆహా!, కుమారః = ఆ బాలుడు(కృష్ణుడు), మయి= నా యందు, దత్తదృష్టిః = దృష్టిని పెట్టాడు. (నా వంకనే చూచుచున్నాడు) (దత్తః ప్రదత్తః విసృష్టః – ఇవ్వబడినది)( పశ్యతి అనేన – దీనితో చూచుదురు. కన్ను దృష్టి), మాం ప్రతి = నన్ను చూసి, స్మితం కృతం= నవ్వుచున్నాడు (ఈషద్ధసతి తస్య భావః కర్మ వాచిరునవ్వు, మందస్మితము), వత్సకేన = బాలునితో, మామ్ = నా వైపుకు, ఏహి ఏహి= రమ్ము రమ్ము, ఇతి= అని, పాణిం ఉపసార్య = చేతులు చాచి (పణంతే వ్యవహరంతి అనేన – దీనితో వ్యవహరింతురు. చెయ్యి), త్వయి= నీయందు, వధూభిః= గోపికలచే, కిం కిం = ఏమేమి, న కృతం = చేయబడలేదు? (పసివాడివైన నిన్ను లాలించుటకు ఆ గోపికలు ఎన్నెన్నో పనులను చేసారని భావం).

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! ఆహా! "ఆ బాలుడు నా వంకనే చూచుచున్నాడు. నన్ను చూసి నవ్వుచున్నాడు . బాలునితో నా వైపు కు రమ్ము రమ్ము " అని చేతులు చాచి నీయందు గోపికలచే ఏమేమి చేయబడలేదు? (పసివాడివైన నిన్ను లాలించుటకు ఆ గోపికలు ఎన్నెన్నో పనులను చేసారని భావం)

**41-9 శ్లో.**
**భవద్వపుఃస్పర్శనకౌతుకేన**
**కరాత్ కరం గోపవధూజనేన ।**
**నీతస్త్వమాతామ్రసరోజమాలా**
**వ్యాలంబిలోలంబతులామలాసీః ॥**

**ప్రతిపదార్థం:** భవత్ వపుః = నీ శరీర, స్పర్శన కౌతుకేన = స్పర్శ యెడల ఉన్న కుతూహముల‌చే (స్పర్శయతి తస్య భావః కర్మ వా ముట్టుకొనుట తాకుట) (కుతుక ఏవ కౌతుకమ్ కౌతుకము, ఉత్సాహము), గోప వధూ జనేన = ఆ గోపకాంతలు, కరాత్ కరం = నిన్ను ఒకచేతినుండి వేరొకచేతికి(కరోతి అనేన కార్యాణి దీనితో పనులు చేయుదురు. చెయ్యి), నీతః= అందుకొనగా, త్వమ్= నువ్వు, ఆతామ్ర= ఎఱ్ఱని (తమ్యతే ఆకాంక్షతే జనైః – జనులచే కోరబడునది. అరుణ వర్ణము), సరోజ మాలా=పద్మముల హారములో,లోలంబ వ్యాలంబి = తుమ్మెద – ఒకపద్మమునుండి మరియొక పద్మమునకు పొడవుగా కదులుచున్నదా! (రవన్ లంబతే గచ్ఛతి, రౌః సంలంబతే శబ్దము చేయుచు వెళ్లునది. తుమ్మెద) (విశేషేణ అధికం ఆలంబతే ఎక్కువ పొడవుగా వుండునది), తులామ్ = అనునట్లుగా, అలాసీః= మెరిసావు.

**తాత్పర్యం:** నీ శరీర స్పర్శ యెడల ఉన్న కుతూహములచే ఆ గోపకాంతలు నిన్ను ఒకచేతినుండి వేరొకచేతికి అందుకొనగా – అప్పుడు– నువ్వు ఎఱ్ఱని పద్మముల హారములో తుమ్మెద –ఒకపద్మమునుండి మరియొక పద్మమునకు కదులుచున్నదా! అనునట్లుగా మెరిసావు.

**41-10 శ్లో.**
**నిపాయయంతీ స్తనమంకగం త్వాం**
**విలోకయంతీ వదనం హసంతీ ।**

**దశాం యశోదా కతమాం న భేజే**
**స తాదృశః పాహిహరే గదాన్మామ్ ॥**

**ప్రతిపదార్థం :** హరే= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, స్తనమ్ నిపాయయంతీ= యశోద నీకు పాలను ఇచ్చుచూ, అంకగం= ఒడిలో ఉన్న, త్వాం= నీ, హసంతీ వదనం= చిరునవ్వుతో కూడిన నీ ముఖమును, విలోకయంతీ = పదేపదే చూచుచూ, కతమాం = ఇట్టిదని చెప్పలేని ఏ, దశాం = ఆశ్చర్యానందముల తన్మయత్వ దశను, యశోదా = యశోదాదేవి (యశః కీర్తిం దదాతి కీర్తినిచ్చునది. యశోద, శ్రీకృష్ణుని పెంపుడు తల్లి), న భేజే = పొందలేదు? (సాటి లేని ఆనందమును పొందెనని భావం), స తాదృశః = అట్టి గోపాలబాల మూర్తివయిన నువ్వు, మామ్= నన్ను, గదాత్= నా వ్యాధినుండి (గద్యతే పీడ్యతే అనేన – దీనితో పీడింపబడును. రోగము), పాహి= రక్షించుము.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! యశోద నీకు పాలను ఇచ్చుచూ ఒడిలో ఉన్న నీ చిరునవ్వుతో కూడిన నీ ముఖమును పదేపదే చూచుచూ ఇట్టిదని చెప్పలేని ఏ ఆశ్చర్యానందముల తన్మయత్వ దశను యశోదాదేవి పొందలేదు? (సాటి లేని ఆనందమును యశోదాదేవి పొందెనని భావం) అట్టి గోపాలబాల మూర్తివయిన నువ్వు నన్ను నా వ్యాధినుండి రక్షించుము.

**విశేషాలు:** అమరకోశం "పునాతి దేహం పూతన" అని అర్థం చెప్పింది. దేహమును పవిత్రముగా చేయుడానికి పూతన అని పేరు. మనకి సంబంధించిన ఒక వస్తువును చూపించి ఎవరిదీ అని ప్రశ్నిస్తే నాది అని చెపుతాము. అయితే ఇప్పుడు నేను అనబడే నువ్వు ఎవరు? దానికి జవాబు మనకే తెలియదు. అదే పెద్ద అజ్ఞానము. "నేను నేను" అంటున్నది ఏది? అంటే తెలియక ఆ "నేను"ని చీకటితో, అజ్ఞానముతో కప్పివేశాము. అదే పూతన. అవిద్య. "నేను"కు "నాది" తోడవుతుంది. నేను అనేది అబద్ధము. ఈ అబద్ధమునకు నాది అనే మరియొక అబద్ధం తోడవుతుంది. దీనికి అస్తిత్వం లేదు. "నా" అన్నప్పుడల్లా ఒక పాశం వేసుకుంటున్నాడు. ఎన్ని వేసుకుంటే అంత పశువు అవుతున్నాడు. పశువుకి అజ్ఞానం, అవిద్య ఉంటాయి. "నేను, నాది" అనే రెండు పూతన రెండు స్తనములు. ఇందులోంచి విషయములను ఇస్తుంది.

విషయమే విషము. దేహము ఎప్పుడూ సుఖమునే కోరుతుంది. కానీ దేహసంబంధమయిన సుఖములు విషముతో సమానమయినవి. అవి ఎప్పటికీ దేహి సూక్ష్మరూపమును తెలియనివ్వవు. అలా తెలియకుండా జీవుడు ఈ అబద్ధంలోనే చచ్చిపోతాడు. దీనిని ఏమయినా చేయగలమా? ఏ పని చేసినా దానిని భగవత్ ప్రసాదమని భావించాలి. భగవదర్పణ చేసి సుఖములను అనుభవిస్తే అవి మనపట్ల విషములు కావు అమృతములు అయిపోతాయి. భగవంతుని అర్పించడం వలన లోపల శుద్ధి జరుగుతోంది. శుద్ధి లేకుండా తింటే విషం అయిపోతుంది. పూతన కృష్ణునికి విషపూరిత స్తన్యమును ఇచ్చింది. విషము అమృతము అయిపోయింది. మీకు కూడా అన్నింటినీ ఈశ్వరుడికి చెప్పి తినడం అలవాటు అయితే అది అమృతం అవుతుంది. మనస్సును దేహమును కూడా శౌచపరచగలదు. ఈశ్వరుని వైపు తిప్పగలదు. ఈ రహస్యమును ఆవిష్కరించడమే పూతన సంహారమునందు ఉన్న పెద్ద ప్రయత్నము.(సౌజన్యం – శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్ )

***దశమ స్కంధము***

**41వ దశకము పూర్తి**

# దశకమ్ 42 – శకటాసురవధ

**42–1 శ్లో.**
**కదాపి జన్మర్ క్షదినే తవ ప్రభో ।**
**నిమంత్రితజ్ఞాతివధూ మహీసురా ।**
**మహానసస్త్వాం సవిధే నిధాయ సా**
**మహానసాదౌ వవృతే వ్రజేశ్వరీ ॥**

**ప్రతిపదార్థం:** ప్రభో = ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, కదాపి= ఒకప్పుడు. (కస్మిన్నపి కాలే), తవ జన్మ– ఋక్ష దినే= నీ జన్మనక్షత్రముగల ఒకానొక శుభ దినమున (ఋక్ష =ఋచ్ఛతి గచ్ఛతి ఆకాశే ఆకాశములో వెళ్లునది. నక్షత్రము), జ్ఞాతి = నీ తల్లి యశోద తన బంధువులను(జాయతే సమానే వంశే ఒకే వంశములో పుట్టినవాడు. పాలివాడు), వధూ = గోపికలను, మహీసురాః= బ్రాహ్మణులను, నిమంత్రితా = తన ఇంటికి ఆహ్వానించెను. (పేరంటమునకు పిలిచెను), త్వాం= నిన్ను, మహా అనసః సవిధే= వంట యిల్లు ప్రాంతమున (మహత్ భోజనం సంపద్యతే అత్ర – భోజనము వండు చోటు. వంటశాల, వంటయిల్లు), నిధాయ = ఉంచి(పరుండబెట్టి), సా వ్రజ –ఈశ్వరీ= నీ తల్లి యశోద, మహాన సాదౌ= వంట ఇంటి పనిలో, వవృతే = ఉండెను.(నిమగ్నమయ్యెను).

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! ఒకప్పుడు. నీ జన్మనక్షత్రముగల ఒకానొక శుభ దినమున నీ కొరకు నీ తల్లి యశోద తన బంధువులను గోపికలను బ్రాహ్మణులను తన ఇంటికి ఆహ్వానించెను. నిన్ను వంట యిల్లు ప్రాంతమున పరుండబెట్టి నీ తల్లి వంట ఇంటి పనిలో ఉండెను.

**42–2 శ్లో.**
**తతో భవత్త్రాణ నియుక్తబాలక**
**ప్రభీతిసంక్రందనసంకులారవైః ।**
**విమిశ్రమశ్రావి భవత్సమీపతః**
**పరిస్ఫుటద్దారుచటచ్చటారవః ॥**

**ప్రతిపదార్థం:** తతః= అటుపిమ్మట, భవత్ త్రాణ= బాలుడైన నీ రక్షణ కొరకు(నిన్ను కనిపెట్టుకొని ఉండుటకు) (త్రాయతే తస్య భావః కర్మ వా రక్షణ), నియుక్త= యశోదచే నియ మించబడిన (నియుక్తః కార్యే నియమితః - కార్యములో నియమింపబడినవాడు), బాలక= బాలురు చేసిన, ప్రభీతి= భయముతో కూడిన, సంక్రందన = ఆక్రందనల (సం అధికం క్రందనం రోదనమ్ బాగా ఏడ్చుట), సంకులా రవైః= ప్రవృద్ధమైన ఆరావములతో (అలజడికేకలతో) (సంకులః ఆకీర్ణః అవ్యవస్థితః అవ్యవస్థితమైనది), విమిశ్రమ్ = కలిసిన, భవత్-సమీపతః = నీదగ్గర నుండి, పరిస్ఫుటత్= పెళపెళమని ముక్కలై విరుగగొట్టబడిన, వి దారు = ఒక బండి యొక్క (దీర్యతే అసౌ చీల్చబడునది. చెట్టు), చటత్ చటారవః= చటచట ధ్వని, అశ్రావి= వినబడినది.

**తాత్పర్యం:** అటుపిమ్మట బాలుడైన నీ రక్షణ కొరకు యశోదచే నియమించబడిన బాలురు చేసిన భయముతో కూడిన అలజడికేకలతో పాటు పెళపెళమని ముక్కలై విరుగగొట్టబడిన ఒక బండి యొక్క చటచట ధ్వని వినబడినది.

**42-3 శ్లో.**
**తతస్తదాకర్ణనసంభ్రమశ్రమ**
**ప్రకంపివక్షోజభరా వ్రజాంగనాః ।**
**భవంతమంతర్దదృశుస్సమంతతో**
**వినిష్పతద్దారుణదారుమధ్యగమ్ ॥**

**ప్రతిపదార్థం:** తతః= అటు తరువాత, తత్ ఆకర్ణన = ఆ ధ్వని వినుటవలన(ఆకర్ణ్యతే తస్య భావః - వినుట), సంభ్రమ= భయముతో తత్తరపాటు పడుచూ (సం అధికం భ్రమతి బిభేతి, చపలో భవతి తస్య భావః కర్మ వా చాపల్యము భయం తత్తరపాటు తొందర), శ్రమ=తమ తమ గృహముల నుండి నంద గృహమునకు పరుగెత్తుట వలన శ్రమతో(శ్రామ్యతి తస్య భావః కర్మ వా ఖేదము కష్టము) ప్రకంపి వక్షోజ భరాః = అదిరి పడుచున్న వక్షస్థలములతో (అధికం కంపతే అసౌ బాగా కంపించునది), వ్రజ-అంగనాః= గోపికాంగనలు, సమంతతః= నలువంకల, వినిష్పతత్ = విరిగి పడియున్న, దారుణ దారు = దారుణముగా - ముక్కలు

ముక్కలుగా విరిగి పడియున్న శకటమును, దదృశుః= చూచిరి, అంతః = మరియు విరిగిన ఆ కొయ్యముక్కల మధ్య ఉన్న, భవంతమ్= నిన్ను (దదృశుః= చూచిరి).

**తాత్పర్యం:** అటు తరువాత ఆ ధ్వని వినుటవలన భయముతో తత్తరపాటు పడుచూ తమ తమ గృహముల నుండి నంద గృహమునకు పరుగెత్తుట వలన శ్రమతో అదిరి పడుచున్న వక్షస్థలములతో గోపికాంగనలు నలువంకల విరిగి పడియున్న దారుణముగా – ముక్కలు ముక్కలుగా విరిగి పడియున్న శకటమును చూచిరి. మరియు విరిగిన ఆ కొయ్యముక్కల మధ్య ఉన్న నిన్ను చూచిరి.

**42–4 శ్లో.**

**శిశోరహో। కిం కిమభూదితి ద్రుతం**
**ప్రధావ్య నందః పశుపాశ్చ భూసురాః ।**
**భవంతమాలోక్య యశోదయా ధృతం**
**సమాశ్వసన్నశ్రుజలార్ద్రలోచనాః ॥**

**ప్రతిపదార్థం:** అహో= అయ్యో!, శిశోః= పిల్లవానికి (శ్యతి గర్భమ్ గర్భమును చీల్చునది. శిశువు), కిం కిమ్ అభూత్= ఏమేమి ప్రమాదము జరిగినదో, ఇతి = అని, ద్రుతం= వేగముగా(ద్రవంతి శీఘ్రం గచ్ఛంతి నృత్యంతి తస్య భావః– తొందరగా పోవుట), ప్రధావ్య= పఱుగిడివచ్చిన (ప్రకృష్టం ధావతి బాగా పరుగెత్తునది), నందః= నందుడు, పశుపాః చ= గోపాలురు, భూసురాః = బ్రాహ్మణులు, యశోదయా= యశోద చేత, ధృతం = ఎత్తు కొనబడిన, భవంతమ్= నిన్ను, ఆలోక్య= చూచి, అశ్రుజల ఆర్ద్రలోచనాః= కన్నీరు చేత తడిసిన కన్నులతో (ఆనందాశ్రువులతో), సమాశ్వసన్ = ఆశ్వాసము(ఊరట) చెందిరి.

**తాత్పర్యం:** అయ్యో! పిల్లవానికి ఏమేమి ప్రమాదము జరిగినదో అని వేగముగా పఱుగిడివచ్చిన నందుడు , గోపాలురు బ్రాహ్మణులు యశోద చేత ఎత్తు కొనబడిన నిన్ను చూచి కన్నీరు చేత తడిసిన కన్నులతో ఆశ్వాసము చెందిరి.

**42-5 శ్లో.**

**కస్కోను కౌతస్కుత ఏష విస్మయో**
**విశంకటం యచ్ఛకటం విపాటితమ్ ।**
**న కారణం కించిదిహేతి తే స్థితాః**
**స్వనాసికాదత్తకరాస్త్వదీక్షకాః ॥**

**ప్రతిపదార్థం:** కః కః ను= ఎట్లువిరిగినది? ఎట్లువిరిగినది?, కుతః కుతః= ఈ బండి ఎక్కడ నుండి వచ్చింది? ఈ బండి ఎక్కడ నుండి వచ్చింది? (సంభ్రమము వలన ఒక్కో ప్రశ్న రెండు సార్లు), ఏష విస్మయః= ఇది చాలా అశ్చర్యకరము (విశేషేణ స్మాయతే తర్కయతి తస్య భావః కర్మ వా తర్కించుట, ఆశ్చర్యపడుట), యత్ =ఏదైతే, విశంకటం = పెద్దదయిన(విశంకటః విస్తృతః విశాలః – విశాలమైనది, విస్తృతమైనది), శకటం= ఈ బండి ఉన్నదో అది(శక్నోతి భారమ్ మోయు సామర్థ్యము కలది. బండి శకటాసురుడు), విపాటితమ్ = విరిగి పడుటకు, ఇహ = ఇక్కడ, కించిత్ కారణం న = కొంచెము కూడా కారణము కనుపించదు, ఇతి = అని, త్వత్ ఈక్షకాః= నిన్ను చూచుచు, స్వ నాసికా దత్త కరాః = ముక్కుపై వ్రేలువైచికొని(నాసతే శబ్దాయతే శబ్దము చేయునది. ముక్కు), తే స్థితాః = వారందరూ ఉన్నారు.

**తాత్పర్యం:** “ఎట్లువిరిగినది? ఎట్లువిరిగినది? ఈ బండి ఎక్కడ నుండి వచ్చింది? ఈ బండి ఎక్కడ నుండి వచ్చింది? ఇది చాలా అశ్చర్యకరము . పెద్దదయిన ఈ బండి విరిగి పడుటకు ఇక్కడ కొంచెము కూడా కారణము కనుపించదు” అని నిన్ను చూచుచు ముక్కుపై వ్రేలువైచికొని వారందరూ ( గోపాలురు ) ఉన్నారు.

**42-6 శ్లో.**

**కుమారకస్యాస్య పయోధరార్థినః**
**ప్రరోదనే లోలపదాంబుజాహతమ్ ।**
**మయామయా దృష్టమనో విపర్యగా**
**దితీశ! తే పాలకబాలకా జగుః ॥**

**ప్రతిపదార్థం :** ఈశ = గురువాయూరు కృష్ణదేవా!, పయోధర అర్థినః = పాలకొఱకు పోరుపెట్టుచు(పయం దుగ్ధం దధాతి పాలను ధరించునది పయోధరము. స్తనము), ప్రరోదనే= ఏడుస్తున్న, అస్య కుమారకస్య = ఈ పిల్లవాని యొక్క (కృష్ణుని యొక్క), లోల= కదులుచున్న, పద అంబుజ = పాద పద్మములు తాకి, అనః విపర్యగాత్= ఈ బండి బోల్తాపడి, ఆహతమ్= విరిగి పడింది (ఆహతః తాడితః), మయా =నాచేత, మయా = నాచేత, దృష్టమ్ = చూడబడింది, ఇతి = అని, తే పాలక బాలకాః = నిన్ను కనిపెట్టుకొని ఉన్న నీ గోపాల బాలురు, జగుః= చెప్పిరి.

**తాత్పర్యం:** గురువాయూరు కృష్ణ దేవా! పాలకొఱకు పోరుపెట్టుచు ఏడుస్తున్న ఈ పిల్లవాని యొక్క (కృష్ణుని యొక్క) కదులుచున్న పాద పద్మములు తాకి ఈ బండి బోల్తాపడి విరిగి పడింది. నాచేత నాచేత ఇది చూడబడింది అని నిన్ను కనిపెట్టుకొని ఉన్న నీ గోపాల బాలురు చెప్పిరి.

**42-7 శ్లో.**

**భియా తదా కించిదజానతామిదం**
**కుమారకానామతిదుర్ఘటం వచః ।**
**భవత్ప్రభావా విదురైరి తీరితం**
**మనాగివాశంక్యత దృష్టపూతనైః ॥**

**ప్రతిపదార్థం:** తదా= అప్పుడు, భియా=భయముతో, కించిత్ అజానతామ్= కొంచెము కూడా తెలియక, ఇదం కుమారకానామ్ = ఈ బాలుర, వచః = మాటలలో చెప్పు సంఘటన, అతి దుర్ఘటం = అత్యంతమైన అనుత్పన్నము (ఎవరి చేతను చేయరానిది), ఇతి= అని, భవత్ ప్రభావ అవిదురైః= నీ మహిమ తెలియని పెద్దలు కొందఱు, ఈరితం = చెప్పిరి, దృష్ట పూతనైః= పూతన సంఘటనను చూచినవారు మాత్రము, మనాక్ ఇవ= కొద్దిగా(మన్యతే అల్పత్వమ్ తక్కువగా చూడబడినది), ఆశంక్యత= ఆ గోపబాలకుల మాటలను నమ్మి సందేహ పడిరి.

**తాత్పర్యం:** అప్పుడు "భయముతో తెలియక ఈ బాలుర మాటలలో చెప్పు సంఘటన ఎవరి చేతను నమ్మదగినది కాదు" (బాలుడు బండిని విరుగగొట్టుట

అసాధ్యమని భావం) అని నీ మహిమ తెలియని పెద్దలు కొందఱు చెప్పిరి. కాని పూతన సంఘటనను చూచినవారు మాత్రము కొద్దిగా ఆ గోపబాలకుల మాటలను నమ్మి సందేహ పడిరి.

**42-8 శ్లో.**

**ప్రవాళ తామ్రం కిమిదం పదం క్షతం**

**సరోజరమ్యౌ ను కరౌ విరాజితౌ ।**

**ఇతి ప్రసర్పత్కరుణాతరంగితా**

**స్త్వదంగమాపస్పృశురంగనాజనాః ॥**

**ప్రతిపదార్థం:** ఇదం= ఈ, ప్రవాళ తామ్రం= చిగురుటాకులవంటి ఎఱ్ఱని(పగడము వలె ఉన్న) (తామ్రస్యేవ వర్ణః అస్తి అస్యరాగివలె ఎరుపు వర్ణం కలది), పదం = నీ పాదమునకు, క్షతం కిమ్ = దెబ్బ ఏమైనా తగిలిందా? (క్షణ్యతే వధ్యతే అనేన - దీనితో హింసింపబడును. గాయము), సరోజ రమ్యౌ ను= పద్మములవంటి, విరాజితౌ కరౌ= నీ ప్రకాశించు చేతులు నలిగినవా?, ఇతి = అనుచు, ప్రసర్పత్= వెల్లువెత్తిన (అతిశయేన సర్పతి గచ్ఛతి తస్య భావః వెళ్లుట విస్తరించుట), కరుణా తరంగితాః=దయతో కదిలిన హృదయములతో, అంగనాజనాః=ఆ గోపాంగనలు, త్వత్ అంగమ్= నీ శరీరమును, ఆపస్పృశుః= ప్రేమతో నిమరసాగిరి.

**తాత్పర్యం:** ఈ చిగురుటాకులవంటి ఎఱ్ఱని(పవడము వలె ఉన్న) నీ పాదమునకు దెబ్బ ఏమైనా తగిలిందా? పద్మములవంటి నీ ప్రకాశించు చేతులు నలిగినవా? అనుచు వెల్లువెత్తిన దయతో కదిలిన హృదయములతో ఆ గోపాంగనలు నీ శరీరమును ప్రేమతో నిమరసాగిరి.

**42-9 శ్లో.**

**అయే సుతం దేహి జగత్పతేః కృపా**

**తరంగపాతాత్ పరిపాతమద్య మే ।**

**ఇతి స్మ సంగృహ్య పితా త్వదంగకం**

**ముహుర్ముహుః శ్లిష్యతి జాతకంటకః ॥**

**ప్రతిపదార్థం:** అయే = ఓ యశోదా!, సుతం= పిల్లవానిని (సుతః ఉత్పన్నః– పుట్టినవాడు సంతానము), దేహి = నాకు ఇమ్ము!, జగత్పతేః = జగత్పతియగు విష్ణువు, కృపాతరంగ = దయా తరంగము, పాతాత్ = పడుట వలననే (స్వామి కరుణాలవ ప్రాప్తి వలన), అద్య =ఈరోజు, మే= నాకుమారుడు, పరిపాతమ్= రక్షింపబడెను, ఇతి స్మ= అని చెప్పుచూ, పితా = నీ తండ్రి నందుడు, సంగృహ్య= తన చేతులలోనికి – నిన్ను తీసుకొని, జాత కంటకః= పులకిత శరీరుడు కాగా, త్వత్ అంగకం = నీ శరీరమును (నిన్ను), ముహుః ముహుః = మాటిమాటికి, శ్లిష్యతి= కౌగలించుకొనెను.

**తాత్పర్యం:** “ఓ యశోదా!పిల్లవానిని నాకు ఇమ్ము! జగత్పతియగు విష్ణువు దయా తరంగము పడుట వలననే (కరుణాలవ ప్రాప్తి వలన) ఈరోజు నాకుమారుడు రక్షింపబడెను.” అని చెప్పుచూ నీ తండ్రి నందుడు తన చేతులలోనికి – నిన్ను తీసుకొని పులకిత శరీరుడు కాగా నిన్ను మాటిమాటికి కౌగలించుకొనెను.

**42–10 శ్లో.**
**అనోనిలీనః కిల హంతుమాగతః**
**సురారిరేవం భవతా విహింసితః ।**
**రజోఽపి నో దృష్టమముష్య తత్కథం**
**సశుద్ధసత్త్వే త్వయి లీనవాన్ ధ్రువమ్ ॥**

**ప్రతిపదార్థం:** అనః = శకటమందు, నిలీనః = నిగూఢముగ విలీనుడై (నిశ్శేషేణ లీనం సంవృతం వా లీనమైనది కప్పబడినది),హంతుమ్ ఆగతః =నిన్ను చంపుటకు వచ్చిన, సుర–అరిః= శకటాసురుడను రాక్షసుడు, ఏవం= ఇట్లు, భవతా= నీచేత, విహింసితః= చంపబడ్డాడు, అముష్య=ఈ శకటాసురునియొక్క, రజః అపి= రజో గుణ లేశము కూడా, న దృష్టమ్=చూడలేదు. (నీ చేతిలో చనిపోవుటచే కొద్ది పాటి రజోగుణ మయినా వీనియందు లేదని ఒక అర్థం.కొంచెమైనను దుమ్ము చూడలేదని మరొక అర్థం), తత్ కథం = అది ఎట్లు సాధ్యమయ్యెను?, సః= ఆ రాక్షసుడు, శుద్ధ సత్త్వే = శుద్ధ సత్త్వగుణ స్వరూపుడవయి, త్వయి = తత్త్వైకమూర్తి వయిన, లీనవాన్= నీలో గుణ రహితుడై లీనమయ్యెను, ధ్రువమ్ కిల = ఇది సత్యము కదా!

**తాత్పర్యం:** శకటమందు నిగూఢముగ విలీనుడై నిన్ను చంపుటకు వచ్చిన శకటాసురుడను రాక్షసుడు ఇట్లు నీచేత చంపబడ్డాడు . ఈ శకటాసురునియొక్క రజో గుణ లేశము కూడా చూడలేదు. (నీ చేతిలో చనిపోవుటచే కొద్ది పాటి రజోగుణ మయినా వీనియందు లేదని ఒక అర్థం.కొంచెమైనను దుమ్ము చూడలేదని మరొక అర్థం) అది ఎట్లు సాధ్యమయ్యెను? ఆ రాక్షసుడు శుద్ధ సత్త్వగుణ స్వరూపుడవయి తత్త్వైకమూర్తి వయిన నీలో గుణ రహితుడై లీనమయ్యెను. ఇది సత్యము కదా !

**విశేషాలు**

**గుణ :** ద్రవ్యం తాలూకు ధర్మం. Quality. Property of a substance. పృథివికి గంధమనేది గుణం. సత్వ రజ స్తమస్సులనే ప్రకృతి గుణాలు కూడా కావచ్చు. నామరూప క్రియలు కూడా ఆ మాటకు వస్తే గుణాలే. వీటితో కలిసినదైతే ఆత్మ సగుణం. కలవనిదైతే నిర్గుణం. ఇందులో నిర్గుణం స్వరూపమైతే సగుణం విభూతి. గుణమంటే అప్రధానమైనదని కూడా Secondary ఒక అర్థముంది. ప్రధానమైతే ముఖ్యమని అప్రధానమైతే గుణమని పేర్కొంటారు శాస్త్రంలో.

**సత్వ:** విశుద్ధము, నిర్మలము, జ్ఞానాసక్తి, సుఖాసక్తి కలిగించు గుణము

**రజస్ :** గుణత్రయంలో మొదటిది. సృష్టికి మూలమిది. ప్రకృతి గుణాలలో చేరుతుంది. రజస్సు వల్ల సృష్టి, సత్త్వం వల్ల స్థితి, తమస్సు వల్ల లయం. సంసారమంతా దీనితోనే నిండిపోయింది. ధూళి, మాలిన్యం అని కూడా ఒక అర్థం.

**తమస్ :** సత్వరజస్తమో గుణాలలో మూడవది. మొద్దులాగ పడి ఉండే లక్షణం. జడత్వం. మనస్సు సత్వమైతే ప్రాణం రజస్సయితే శరీరం తమోగుణాత్మకం. చీకటి అని కూడా అర్థమే. అజ్ఞానమని లాక్షణికమైన అర్థం. 'తమసోమా జ్యోతిర్గమయ.' అజ్ఞాన దశ నుంచి జ్ఞాన జ్యోతివైపు తీసుకెళ్ళమని ప్రార్థన.

**42-11 శ్లో.**

**ప్రపూజితైస్తత్ర తతో ద్విజాతి భి**
**ర్విశేషతో లంభితమంగళాశిషః ।**

**వ్రజం నిజైర్బాల్యరసైర్విమోహయన్**
**మరుత్పురాధీశ! రుజాం జహీహి మే ॥**

**ప్రతిపదార్థం:** తతః = శకటాసుర వధ సంఘటన తరువాత, తత్ర = అచ్చట వ్రేపల్లెలో నందుడు, ప్రపూజితైః ద్విజాతిభిః = బ్రాహ్మణులను పూజించి వారిచేత (ద్వే జాతీ జన్మని యస్య – రెండు జన్మలు కలవాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు), విశేషతః = విశేషమైన, మంగళ ఆశిషః = శుభ ఆశీర్వాదములను, లంభిత= పొంది స్వస్థుడయ్యాడు. (లబ్ధః, అర్జితః, ప్రయుక్తః – పొందబడ్డది, సంపాదింపబడినది, ప్రయోగింపబడినది), నిజైః బాల్యరసైః= నీవు నీ బాల్య లీలలతో, వ్రజం = వ్రేపల్లెలోని వారిని (వ్రజంతి జనాః అస్మిన్, జనపద విశేషః – వ్రజ జనపదము. మధురా–వృందావన ప్రదేశము), విమోహయన్ = సమ్మోహితులను చేసావు, మరుత్పురాధీశ = ఓ గురువాయూరు దేవా!, మే= నాయొక్క, రుజాం = రోగమును (రుజతి పీడితో భవతి అనయా రోగము, భంగము), జహీహి= తొలగించుము.

**తాత్పర్యం:** శకటాసుర వధ సంఘటన తరువాత అచ్చట వ్రేపల్లెలో నందుడు బ్రాహ్మణులను పూజించి వారిచేత విశేషమైన శుభ ఆశీర్వాదములను పొంది స్వస్థుడయ్యాడు. నీవు నీ బాల్య లీలలతో వ్రేపల్లెలోని వారిని సమ్మోహితులను చేసావు. ఓ గురువాయూరు దేవా ! నాయొక్క రోగమును తొలగించుము.

**విశేషాలు:** కృష్ణుడు ప్రదర్శించిన లీల చాలా చిన్నది. దీనిలో వున్న అంతరార్థమును మనం గ్రహించేటందుకు ప్రయత్నించాలి. మనకు ఈ శరీరమును భగవంతుడు ఇచ్చాడు. శరీరము మనం నిర్మించుకున్నది కాదు. అన్నింటిని "నావి నావి" అంటారు. "నావి" అని చూపించిన ఈ శరీరములో ఏ ఒక్కటీ తనది కాదు. ఏదీ తాను తేకపోయినా ఈశ్వరుడు దీనిని నిర్మాణం చేశాడు. ఈశ్వరునిచే ఇంత గొప్పగా నిర్మింపబడి ప్రసాదింపబడిన ఈ దేహము దేనికొరకు? ఇది శకటము. ఈ బండిని ఎక్కి మీరు తీరమును చేరగలరు. కానీ మనము ఈ బండినెక్కి తీరమును చేరడం లేదు. ఎందువలన? దీనిని దేనికోసం ఉపయోగించాలో దానికోసం ఉపయోగిస్తే తీరం చేరుతారు. కానీ మీరు లక్ష్యం వైపు వెళ్ళడం లేదు. ఈ మానవ శరీర శకటంలో కూర్చుని తాను పొందుతున్న శుభములు ఈశ్వరానుగ్రహములని

తలంపడు. తలంపక అన్నీ కూడా "నా ప్రజ్ఞ" అంటూ ఉంటాడు. కానీ "ఈ పనులను ఈశ్వరుడు చేయించాడు. అందువల చేయగలిగాను" అనడు. అలా జీవుడు ఈశ్వరానుగ్రహము తీసివేసి మాట్లాడుతాడు. ఈశ్వరానుగ్రహము వలన తాను ఆ పనులను చేయగలుగుతున్నాననే భావన మనసులో ఉండాలి. కానీ అటువంటి భావన ఉన్నప్పుడు మాత్రమే ఈ శకటమును ఎక్కి లక్ష్యమును చేరతారు. లేకపోతే యిది "శకటతి యితి శకటః" అవుతుంది. శం అనగా సుఖము, ఈశ్వరుడు. ఈ శకటమును నీవు ఎందుకు ఎక్కావు తెలుసుకుంటే దానిని ఈశ్వరానుగ్రహమని భావించడం ప్రారంభిస్తాడు. ఈశ్వరానుగ్రహం తప్పు పనులు చేయించదు. సాత్త్వికమైన ప్రవృత్తిలోనికి తిప్పేస్తుంది.

అనగా యిప్పుడు నీవు ఎక్కిన శకటమునకు ఎవరు సారథిగా ఉన్నాడు? ఈశ్వరుడు. స్థిత ప్రజ్ఞుడయిన సారథి శకటమును వేయికళ్లతో చూసి నడిపిస్తాడు. అపుడు శకటములో ప్రయాణిస్తున్న జీవునికి ఏ ప్రమాదము కలుగదు. సారథియే బుద్ధి. ఆ బుద్ధిని నీది అనకుండా దానిని కృష్ణ పాదముల దగ్గర పెట్టేయాలి. తెలిసికాని, తెలియక కాని పరమభక్తితో భాగవతంలో దశమ స్కంధార్గత శకటాసుర వృత్తాంతమును విన్నంత మాత్రం చేత శకటాసురుడు – జీవుడు ప్రయాణిస్తున్న యీ బండి రాక్షసుడు. ఎప్పుడు? "యిదే నేను – అన్నీ నేను చేస్తున్నాను" అనే భావన ఉన్నప్పుడు. కృష్ణుడు జగదాచార్యుడై వచ్చాడు. అజ్ఞానం బాగా ఉంటుంది కాబట్టి దానిని చీల్చానికి అర్ధరాత్రి పుట్టాడు. ఇపుడు ఆయనేమి చేశాడు? "మనం మనం" అనకురా, "నమః నమః" అను అని చెపుతాడు. అపుడు జీవుడు కర్మచేత, భక్తిచేత, జ్ఞానము వైపు నడుస్తాడు. ఈవిధంగా శకటా సుర సంహారం పైకి చిన్న లీల. అంతరమునందు స్వామి ఎంత పెద్ద రహస్యమును దాచారో చూడండి.కృష్ణ చేష్టితముల వెనక ఒక గొప్ప మర్మం దాగి ఉంటుంది. దానిని ఎవరు అర్థం చేసుకోగలరో వాళ్లకి జీవితంలో ఒక పరిష్కారం లభిస్తుంది(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్ )

***దశమ స్కంధము***

**42వ దశకము పూర్తి**

# దశకమ్ 43 – తృణావర్తవధ

**43-1 శ్లో.**

**త్వామేకదా గురుమరుత్పురనాథ! వోఢుం**
**గాఢాధిరూఢగరిమాణమపారయంతీ ।**
**మాతా నిధాయ శయనే 'కిమిదంబతే' తి**
**ధ్యాయంత్యచేష్టత గృహేషు నివిష్టశంకా ॥**

**ప్రతిపదార్థం:** గురుమరుత్పురనాథ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, ఏకదా= ఒకనాడు నీ తల్లి, త్వామ్= నిన్ను ఎత్తుకొని ఉండగా, గాఢ అధిరూఢ గరిమాణమ్= అతిశయముగా యెత్తు కొనరాని బరువుతో నీవు తోచగా( గాఢ దృఢః సేవితః – సేవింపబడ్డది దృఢమైనది) (అధి = ఉపరి ఆరూఢ – పైకి పోయినవాడు వృద్ధి చెందినవాడు), వోఢుం= నిన్ను మోయుటకు (వోఢు =వహతి మోయువాడు), అపారయంతీ = సహించలేని( శక్తి చాలని) (అపార= ఉత్తరో అవధి పారః తన్నాస్తి యస్య దాట లేనిది), మాతా = నీ తల్లి యశోద, శయనే నిధాయ= ఒక శయ్యపై పరుండజేసి (శేతే తస్య భావః కర్మ వా పడుకొనుట), కిమ్ ఇదం బత ఇతి= ఇది ఏమి విడ్డూరమని, నివిష్ట శంకా= సందేహాస్పదురాలయి (నివిష్టః కృతః ప్రవేశః స్థితః బద్ధః – ప్రవేశించినవాడు బంధింపబడినవాడు ఉన్నవాడు.)(శంకతే తస్య భావః కర్మ వా సంశయము సందేహము), ధ్యాయంతీ = నీ గురించే ఆలోచనచేయుచూ, గృహేషు అచేష్టత= ఇంటిపనులలో ఉండెను.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఒకనాడు నీ తల్లి నిన్ను ఎత్తుకొని ఉండగా అతిశయముగా యెత్తు కొనరాని బరువుతో నీవు తోచగా, నిన్ను ఎత్తుకొనుటకు శక్తి లేక యశోద ఒక శయ్యపై పరుండజేసి ఇది ఏమి విడ్డూరమని సందేహాస్పదురాలయి నీ గురించే ఆలోచనచేయుచూ ఇంటిపనులలో ఉండెను.

**43-2 శ్లో.**

**తావద్విదూరముపకర్ణితఘోరఘోష–**
**వ్యాజృంభిపాంసుపటలీపరిపూరితాశః ।**

**వాత్యా వపుస్స కిల దైత్యవరస్తృణావ –**
**ర్తాఖ్యో జహార జనమానసహారిణం త్వామ్ ॥**

**ప్రతిపదార్థం:** తావత్ = అంతలో, విదూరమ్ = దూరముగా (విశిష్టం దూరం, విశేషేణ దూరః – చాలా దూరము చాలా దూరమునుండి వచ్చునది), ఘోర ఘోష= పెద్ద శబ్దము(ఘోరయతి భయానక రస నిమిత్తే భవతి ఘోరమైనది), ఉపకర్ణితః = చెవిదగ్గరగా వినబడింది, పాంసుపటలీ= దట్టమైన ధూళితో (పసయతి నాశయతి ఆత్మానమ్ నశించునది. ధూళి, దుమ్ము), వ్యాజృంభి= వ్యాపిస్తూ, పరిపూరిత ఆశః= ఆ సుడిగాలి దిక్కులన్నింటిని నింపింది. (అశూవ్యాప్తౌ ఆసమంతాత్ సర్వత్ర అశ్నుతే అంతట వ్యాపించునది. దిశ..), స వాత్యా వపుః = ఆ సుడిగాలి రూపములో (వాతానాం సమూహః – వాతముల సమూహము. సుడిగాలి), తృణావర్త –ఆఖ్యః = తృణావర్తుడు పేరుగల (ఇతనికి చక్రసమీరదైత్యుడని ఇంకొక పేరు), దైత్యవరః= గొప్ప రాక్షసుడు, జనమానస హారిణం = జనుల మనస్సును హరించు, త్వామ్= నిన్ను, జహార కిల = అపహరించుకు పోయెను కదా!

**తాత్పర్యం:** అంతలో దూరముగా పెద్ద శబ్దము వినబడింది. దట్టమైన ధూళితో వ్యాపిస్తూ ఆ సుడిగాలి దిక్కులన్నింటిని నింపింది. ఆ సుడిగాలి రూపములో తృణావర్తుడు పేరుగల గొప్ప రాక్షసుడు జనుల మనస్సును హరించు నిన్ను అపహరించుకు పోయెను కదా ! .

**43–3 శ్లో.**
**ఉద్దామపాంసుతిమిరాహృతదృష్టిపాతే**
**ద్రష్టుం కిమప్యకుశలే పశుపాలలోకే ।**
**హా బాలకస్య కిమితి త్వదుపాంతమాప్తా**
**మాతా భవంతమవిలోక్య భృశం రురోద ॥**

**ప్రతిపదార్థం:** ఉద్దామ= ఉవ్వెత్తున లేచిన దట్టమైన, పాంసు తిమిర= ఆకాశ పర్యంతము క్రమ్మివేయగా ఏర్పడిన ఆ దట్టమైన ధూళి అనెడి చీకటిలో(తిమ్యతి క్లిద్యతే తేమతి ఆర్ద్రీభవత్యస్మిన్ దీనితో బాధ పడుదురు. చీకటి), ఆహృత =

అపహరింపబడిన, దృష్టి పాతే = దృష్టి పతనముతో (కళ్ళు కనబడక), కిమ్ –అపి ద్రష్టుం= ఏమియు చూచుటకు, అకుశలే = అకుశలులైన (అశక్తులైన), పశుపాల లోకే= గోపకులు (రురోద =దుఃఖించిరి), హా బాలకస్య=అయ్యో! నా చిట్టి తండ్రికి, కిమ్ –ఇతి = ఏమయినది? అని అందోళన పడుచూ, త్వత్ ఉపాంతమ్ ఆప్తా=ఇదివరలో నిన్ను పరుండబెట్టిన సమీప ప్రదేశమునకు వచ్చి(ఉపమితం అంతేన – అంతముతో సమానమైనది దగ్గరవున్నది), మాతా= నీ తల్లి యశోద, భవంతమ్ అవిలోక్య = నీవు కనబడక, భృశం= పెద్దగా (బోరుమని) (భృశ్యతి ప్రాచుర్యేణ వర్తతే ఎక్కువగా వున్నది. మిక్కిలి), రురోద= ఏడ్చెను, ఉవ్వెత్తుగ రేగిన ధూళిచే కనుగానక మూగిన గోపకులు యిదేమి దారుణమని ఘోరదుఃఖమున మునిగిరి. నాతండ్రీ! ఏమైతివని ఆ దరికివచ్చి నీవు కనబడక యశోద హోరుమని యేడ్చెను.

**తాత్పర్యం:** ఉవ్వెత్తున లేచిన దట్టమైన ఆకాశపర్యంతము క్రమ్మివేయగా ఏర్పడిన ఆ దట్టమైన ధూళి అనెడి చీకటిలో కళ్ళు కనబడక ఏమియు చూచుటకు అశక్తులైన గోపకులు దుఃఖించిరి. "నా చిట్టి తండ్రికి ఏమయినది?" అని అందోళన పడుచూ ఇదివరలో నిన్ను పరుండబెట్టిన సమీప ప్రదేశమునకు నీ తల్లి యశోద వచ్చి నీవు కనబడక బోరుమని ఏడ్చెను

**43-4 శ్లో.**
**తావత్ స దానవవరోఽపి చ దీనమూర్తిః**
**భావత్క భారపరిధారణలూనవేగః ।**
**సంకోచమాప తదను క్షతపాంసుఘోషే**
**ఘోషే వ్యతాయత భవజ్జననీనినాదః ॥**

**ప్రతిపదార్థం:** తావత్= ఆ తరువాత, స దానవవరః= సుడిగాలి రూపమున వచ్చి నిన్నెత్తి కొన్న ఆ రాక్షస ప్రముఖుడగు తృణావర్తుడు (దనోః అపత్యమ్ దనువు సంతానము. దానవులు రాక్షసులు), అపి చ= కూడా, దీనమూర్తిః = నీ బరువునకు తట్టుకొనలేక దీన మూర్తియై, భావత్క= నీ యొక్క (భవతః అయమ్ మీవాడు), భార పరిధారణ= బరువునకు తట్టుకొనలేక (భ్రియతే ధ్రియతే మోయబడునది)

(ధారణ=ధార్యతే తస్య భావః – ధరించుట), లూనవేగః = నష్ట గమన వేగముతో వేగము తగ్గి, సంకోచమ్ ఆప= నిశ్చేష్టు డై పోయాడు. (సం అధికం కుచతి ముడుచుకొనుట సంకోచించుట), తత్ అను= అనంతరము, క్షత పాంసు ఘోషే = ఆ గాలిదుమారముచేయు ధ్వని తగ్గి (ఘోషతి శబ్దాయతే తస్య కర్మ – మేఘగర్జనము), ఘోషే= ప్రజలు ఘోషమందు (ఘోషయంతే ప్రాణినః అత్ర – ప్రాణులు శబ్దము చేయు స్థలము. పల్లె, గ్రామము), భవత్ జననీ నినాదః= మీ తల్లి ఆక్రందనము(జనయతి పుట్టించునది, కనునది. తల్లి), వ్యతాయత= వ్యాపించి అందరకు వినిపించెను.

**తాత్పర్యం:** ఆ తరువాత సుడిగాలి రూపమున వచ్చి నిన్నెత్తి కొన్న ఆ రాక్షస ప్రముఖుడగు తృణావర్తుడు కూడా నీ బరువునకు తట్టుకొనలేక దీన మూర్తియై నీ యొక్క బరువునకు తట్టుకొనలేక నష్ట గమన వేగముతో వేగము తగ్గి నిశ్చేష్టుడై పోయాడు. అనంతరము ఆ గాలిదుమారముచేయు ధ్వని తగ్గి ప్రజలు ఘోషమందు మీ తల్లి ఆక్రందనము వ్యాపించి అందరకు వినిపించెను.

**43–5 శ్లో.**
**రోదోపకర్ణనవశాదుపగమ్య గేహం**
**క్రందత్సు నందముఖగోపకులేషు దీనః ।**
**త్వాం దానవస్త్వఖిలముక్తికరం ముముక్షుః**
**త్వయ్యప్రముంచతి పపాత వియత్ప్రదేశాత్ ॥**

**ప్రతిపదార్థం:** రోద= యశోద రోదనము(రోదితి తస్య భావః కర్మ వా), ఉపకర్ణన వశాత్ =వినుట వలన, నంద ముఖ గోపకులేషు= పనిమీద ఇల్లు విడిచి దూరమేగిన నందుడు, గోపాలురు, గేహం= ఇంటికి (గో గణేశః గంధర్వః తేన ఈహః ఈప్సితః యత్ర – గణేశుడు లేదా గంధర్వుడు ఇక్కడ వుండవలెనని కోరబడునది. ఇల్లు), ఉపగమ్య= వచ్చి, క్రందత్సు= ఆక్రందించుచుండగా, దీనః దానవః= శక్తి కోల్పోయి దీనుడైన దానవుడు, అఖిల ముక్తికరం= సర్వజనముక్తి దాతవైన, త్వాం= కంఠ బాహువులను గట్టిగా పట్టుకొన్న, ముముక్షుః తు = నిన్ను విడువదలచెను (మోక్తుం ఇచ్ఛుః – మోక్షమును గోరువాడు), త్వయి అప్రముంచతి= కాని నీవు వానిని విడిచి

పెట్టనందున, వియత్ ప్రదేశాత్ = నీతోగూడ ఆకాశమునుండి(వియచ్ఛతి న విరమతి సర్వవ్యాపత్వాత్ సర్వవ్యాపకము వలన ఎప్పుడు విరమించనిది. ఆకాశము), పపాత= నేలపైపడెను.

**తాత్పర్యం:** యశోద రోదనము వినుట వలన పనిమీద ఇల్లు విడిచి దూరమేగిన నందుడు, గోపాలురు ఇంటికి వచ్చి ఆక్రందించుచుండగా, శక్తి కోల్పోయి దీనుడైన తృణావర్తుడైన దానవుడు సర్వజనముక్తి దాతవైన కంఠ బాహువులను గట్టిగా పట్టుకొన్న నిన్ను విడువదలచెను. కాని నీవు వానిని విడిచి పెట్టనందున నీతోగూడ ఆకాశమునుండి ఆ రాక్షసుడు నేలపైపడెను.

**43-6 శ్లో.**
**రోదాకులాస్తదను గోపగణా బహిష్ఠ-**
**పాషాణపృష్టభువి దేహమతిస్థవిష్ఠమ్ ।**
**ప్రైక్షంత హంత నిపతంతమముష్యవక్ష-**
**స్యక్షీణమేవ చ భవంతమలం హసంతమ్ ॥**

**ప్రతిపదార్థం:** తత్-అను= తరువాత, రోద-ఆకులాః= శోకముతో ఆర్తులై (రోదించుచున్న), గోపగణాః= ఆ గోకుల జనులు, బహిష్ఠ= గ్రామము వెలుపలనున్న, పాషాణ పృష్ఠ భువి = ఒక పెద్ద పాషాణ స్థానముపై (బండరాతిపై) పడిన (పాషయతి స్థూలో భవతి లావుగా వుండునది. రాయి), అతిస్థవిష్ఠమ్ దేహమ్ = ఆ తృణావర్తుని పెద్ద శరీరాన్ని (స్థూలదేహమును), (ప్రైక్షంత= చూచిరి), హంత = ఆ శ్చర్యము, అముష్య వక్షసి= ఆ రాక్షసుని వక్షస్థలమున, అక్షీణమ్ ఏవ= ఏగాయములేక, నిపతంతమ్= పడుకొని, అలం హసంతమ్ = చిరుదరహాసము చిందిస్తున్న, భవంతమ్ చ = నిన్ను కూడా, ప్రైక్షంత= చూచిరి.

**తాత్పర్యం:** తరువాత శోకముతో ఆర్తులై రోదించుచున్న ఆ గోకుల జనులు గ్రామము వెలుపలనున్న ఒక పెద్ద పాషాణ స్థానముపై పడిన ఆ తృణావర్తుని పెద్ద శరీరాన్ని చూసారు. ఆ శ్చర్యము! ఆ రాక్షసుని వక్షస్థలమున ఏగాయములేక పడుకొని చిరుదరహాసము చిందిస్తున్న నిన్ను కూడా వారు చూచిరి.

**43–7 శ్లో.**

**గ్రావప్రపాతపరిపిష్టగరిష్ఠదేహ–**
**భ్రష్టాసుదుష్టదనుజోపరి ధృష్టహాసమ్ ।**
**ఆఘ్నానమంబుజకరేణ భవంతమేత్య**
**గోపా దధుర్గిరివరాదివ నీలరత్నమ్ ॥**

**ప్రతిపదార్థం:** గ్రావ ప్రపాత= బండరాతిపై పడుటచే (గ్రసతే ఇతి గ్రహ ఆవనతి శబ్దాయతే పగులగొట్టబడునది ముక్కలు చేయబడునది. రాయి)(అతిశయేన పతతి తస్య భావః కర్మ వా పడుట వెళ్లిపోవుట), పరిపిష్ట =చూర్ణీకృతమైన (పిండి పిండి యైన) (సమ్యక్ పిష్టః బాగా కలుపబడినది), గరిష్ఠ దేహ= ఉన్నతమైన దేహము కలిగి(అతిశయేన గురుః – చాలా పెద్దది), భ్రష్టాసు =మరణించిన, దుష్ట దనుజ= ఆ దుష్టరాక్షసుని, ఉపరి= వక్షస్థలముపై, ధృష్ట హాసమ్= నీవు నేర్పు కలిగిన చిరునవ్వులొలికిస్తూ(ధృష్ణోతి ప్రగల్భో భవతి ప్రగల్భుడు చతురుడు), అంబుజకరేణ= పద్మములవంటి నీ చిన్ని చేతులతో, ఆఘ్నానమ్= వాని వక్షస్థలమున తట్టుచూ, చప్పటులు కొట్టుచున్న, భవంతమ్= నిన్ను, ఏత్య= సమీపించిన, గోపాః= గోపాలకులు, గిరివరాత్= మహాపర్వతము నుండి, నీలరత్నమ్ ఇవ= ఇంద్ర నీలమణిని తీసుకొన్నట్లుగా(నీలతి ఆచ్ఛాదయతి అన్యవర్ణాన్ ఇతర రంగులను కప్పునది), దధుః= ఆ రాక్షసుని నుండి నిన్నుగ్రహించి ఎత్తుకొన్నారు.

**తాత్పర్యం:** బండరాతిపై పడుటచే పిండి పిండి యైన ఉన్నతమైన దేహము కలిగి మరణించిన ఆ దుష్టరాక్షసుని వక్షస్థలముపై – నీవు నేర్పు కలిగిన చిరునవ్వులొలికిస్తూ పద్మములవంటి నీ చిన్ని చేతులతో వాని వక్షస్థలమున తట్టుచూ , చప్పటులు కొట్టుచున్న నిన్ను సమీపించిన గోపాలకులు మహాపర్వతము నుండి ఇంద్ర నీలమణిని తీసుకొన్నట్లుగా ఆ రాక్షసుని నుండి నిన్నుగ్రహించి ఎత్తుకొన్నారు.

**43–8 శ్లో.**

**ఏకైకమాశు పరిగృహ్య నికామనందం**
**నందాదిగోప పరిరబ్ధ విచుంబితాంగమ్ ।**
**ఆదాతుకామపరిశంకితగోపనారీ**
**హస్తాంబుజప్రపతితం ప్రణుమో భవంతమ్ ॥**

**ప్రతిపదార్థం:** ఏక ఏకమ్= ఒక్కొక్కరు(ఒకరితరువాత ఇంకొకరు), నంద ఆది గోప= నందుడు మొదలగు గోపాలకులు, ఆశు = తొందరగా, పరిగృహ్య = నీ మృదులమైన కరచరణాదికములను స్పృశించి(పరిగృహ్య సర్వతో భావేన గృహీతా సంపూర్ణ మనసుతో గ్రహించబడినది), పరిరబ్ధ= కౌగిలించుకొనుచూ, విచుంబిత = ముద్దాడుచూ, నికామమ్ = అతిశయముగా (ఎక్కువగా) (నితరాం కమనీయం యథేప్సితం అతిశయమ్ అతిశయము), నందన్ = ఆనందించిరి, అంగమ్= నీ మేనిని, ఆదాతు కామ =ఎత్తుకొనుటకు, పరిశంకిత = నా చేతులలోనికి వస్తాడో రాడో అని శంకించుచున్న(శంకా జాతా అస్య – సందేహం కల్గిన), గోపనారీ = గోపాంగనల, హస్త అంబుజ = చేతులనెడి పద్మములందు, ప్రపతితం= నీయంతట నువ్వు ఎగిరి దూకుచూ వారి శంకను పోగొట్టిన(అతిశయేన పతితః పడిపోయినవాడు), భవంతమ్= నిన్ను, ప్రణుమః= నమస్కరించు కొనుచున్నాము.

**తాత్పర్యం:** ఒకరితరువాత ఇంకొకరుగా నందుడు మొదలగు గోపాలకులు తొందరగా నీ మృదులమైన కరచరణాదికములను స్పృశించి కౌగిలించుకొనుచూ ముద్దాడుచూ ఎక్కువగా ఆనందించిరి. నీ మేనిని ఎత్తుకొనుటకు శంకించుచున్న (నిన్ను ఎత్తుకొనుటకు మేము మేమని ఉబలాట పడుచున్న) గోపాంగనల చేతులనెడి పద్మములందు– వాళ్ళు ఎత్తుకొనక మునుపే నీయంతట నువ్వు ఎగిరి దూకుచున్న నిన్ను నమస్కరించుకొనుచున్నాము.

**43-9 శ్లో.**

**భూయో ఒపి కిన్ను కృణుమః ప్రణతార్తి హారీ**
**గోవింద ఏవ పరిపాలయతాత్ సుతం నః ।**
**ఇత్యాదిమాతరపితృప్రముఖైస్తదానీం**
**సంప్రార్థితస్త్వదవనాయ విభో! త్వమేవ ॥**

**ప్రతిపదార్థం:** విభో = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, భూయః అపి = మాటి మాటికి వచ్చు ఈ అపదలకు, కిమ్ ను కృణుమః= మేము ఏమి చేయవలెను?, ప్రణత ఆర్తి హరీ= నమస్కరించు భక్తుల బాధలను తొలగించు(ప్రణతః కృతప్రణామః నమ్రః – ప్రణామము చేయబడ్డవాడు. వినమ్రుడు కుశలుడు), గోవింద ఏవ= గోవిందుడే(గాం పృథివీం ధేనుం వాణీం వా విందతి భూమిని, ఆవును సంతోషింప చేయువాడు. శ్రీకృష్ణుడు వాక్కును సంతోషింప చేయువాడు), నః సుతం= మా పిల్లవానిని, పరిపాలయతాత్= రక్షించుగాక, ఇతి–ఆది= ఈ విధమైన మాటలతో ప్రార్థనలతో, మాతః పితృ ప్రముఖైః = నీ తల్లితండ్రులు – మిగిలిన గోపాలకులు, తదానీం= ఆ సమయమున, త్వత్ అవనాయ= నీ( కృష్ణ) రక్షణమునకై (అవతి రక్షతి తస్య భావః రక్షించునది, రక్ష), త్వమ్ ఏవ= (విష్ణుడవైన )నిన్నే, సంప్రార్థితః= ప్రార్థించిరి.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! “మాటి మాటికి వచ్చు ఈ అపదలకు మేము ఏమి చేయవలెను? నమస్కరించు భక్తుల బాధలను తొలగించు గోవిందుడే మా పిల్లవానిని రక్షించుగాక”! అని ఈ విధమైన మాటలతో ప్రార్థనలతో నీ తల్లితండ్రులు – మిగిలిన గోపాలకులు ఆ సమయమున నీరక్షణమునకై (విష్ణుడవైన )నిన్నే ప్రార్థించిరి.

**విశేషాలు**

**త్వం:** కవి ఈ శ్లోకంలో ప్రయోగించిన త్వం అను పదమునకు నువ్వు అని ఒక అర్థం కాగా ఇంకొక అర్థం ఇది దేహేంద్రియాలకు అతీతమైన, సాక్షీభూత చైతన్యమే త్వం పదార్థం. త్వంపద వాచ్యార్థుడు జీవుడు, లక్ష్యార్థుడు పరమాత్మ.

**43-10 శ్లో.**

**వాతాత్మకం దనుజమేవమయి ప్రధూన్వన్**
**వాతోద్భవాన్ మమ గదాన్ కిము నో ధునోషి ।**
**కిం వా కరోమి పునరప్యనిలాలయేశ!**
**నిశ్శేషరోగశమనం ముహురర్థయే త్వామ్ ॥**

**ప్రతిపదార్థం:** అయి అనిలాలయ= ఓ గురువాయూరు దేవా!, వాత –ఆత్మకం= గాలిరూపమున వచ్చిన వాతస్వరూపుడైన తృణావర్తుడను(వాతి స్పృశతి గచ్ఛతి వెళ్లునది, సృశించునది. వాయువు), దనుజమ్= రాక్షసుని, ఏవమ్= ఇట్లు, ప్రధూన్వన్= సంహరించావు, ఈశ =ప్రభూ, వాత–ఉద్భవాన్ = ఆ గాలివలె నన్ను బాధిస్తూ, నాలో ఉన్న వాతము వలన పుట్టిన, మమ గదాన్ = నా రోగములను (గద= గద్యతే పీడ్యతే అనేన – దీనితో పీడింపబడును. రోగము), కిము నో ధునోషి= నీవు ఎందుకు హరించుటలేదు?, కిం వా కరోమి= నే నేమి చేయుదును? (మత్ప్రారబ్ధ కర్మ దోషమయితే నేనేమి చేయగలను?), పునః అపి = ప్రారబ్ధ అవసానములో స్థూల సూక్ష్మ దేహ ద్వయ పాతముచే, నిశ్శేష రోగ శమనం= నిశ్శేష రోగ శాంతిని( బాహ్యములైన వాతాది రోగములు, ఆంతరముగా రాగాదుల శమనము చేసి మోక్షము కొరకు), త్వామ్ = నిన్ను, ముహుః = పలురీతుల, అర్థయే = ప్రార్థిస్తున్నాను.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! గాలిరూపమున వచ్చిన వాతస్వరూపుడైన తృణావర్తుడను రాక్షసుని ఇట్లు సంహరించావు. ప్రభూ! ఆ గాలివలె నన్ను బాధిస్తూ, నాలో ఉన్న నా రోగములను నీవు ఎందుకు హరించుటలేదు? నే నేమి చేయుదును? (మత్ప్రారబ్ధ కర్మ దోషమయితే నేనేమి చేయగలను?) ప్రారబ్ధ అవసానము లో స్థూల సూక్ష్మ దేహ ద్వయ పాతముచే నిశ్శేష రోగ శాంతిని చేసి (బాహ్యములైన వాతాది రోగములు, ఆంతరముగా రాగాదుల శమనము చేసి) మోక్షము కొరకు నిన్ను పలురీతుల ప్రార్థిస్తున్నాను.

**విశేషాలు**

**ప్రారబ్ధం :** ఇప్పటి దేహానికి కారణమైన కర్మ. ఇది స్వేచ్ఛాప్రారబ్ధమనీ, పరేచ్ఛా ప్రారబ్ధమనీ రెండు విధాలు. స్వేచ్ఛా ప్రారబ్ధంలో తన ఇచ్ఛ ప్రకారం, పరేచ్ఛా ప్రారబ్ధంలో ఇతరుల ఇష్టప్రకారం అనుభవాలు కలుగుతుంటాయి, కార్యకలాపాలు జరుగుతుంటాయి. పరేచ్ఛా ప్రారబ్ధం అనుభవిస్తున్నప్పుడు సాధకుడు సమాధిలో ఉన్నప్పటికీ ఇతరుల ఇష్ట ప్రకారమే స్నానపానాదులు సైతం జరుగుతుంటాయి.

"తృణము" అంటే గడ్డిపరక. దానికన్నా తేలిక అయినది ప్రపంచంలో ఉండదు. "ఆవర్తనము" అంటే త్రిప్పుట. త్రిప్పేది ఏది? తృష్ణ. తృష్ణకే తృణావర్తుడు అని పేరు. గృహస్థు పుణ్యం ఖర్చు అయిపోతుంటే మరల పుణ్యమును సంపాదించేసుకుంటూ ఉండాలి. అందువలన ప్రయత్నపూర్వకంగా మరల పుణ్యం చేసుకుంటూ ఉండాలి. అలా చేసుకుంటే దెబ్బతినడు. వచ్చే జన్మల యందు కూడా ఇది నిలబడుతుంది. ఒక్కొక్కరు చేసుకున్న పుణ్యం వలన అతడు పట్టినదల్లా బంగారం అవుతుంది. ఒక్కొక్కడు ఏది పట్టుకున్నా ఐశ్వర్యం అలా కలిసివస్తుంది.

కానీ తృష్ణయందు మీరు చిక్కుకోకూడదు. వచ్చిన దానియందు తృప్తిలేక ఇంకా సంపాదించాలని అనుకున్నారంటే ఇక ఆ సంపాదనకు హద్దు ఉండదు. గృహస్థాశ్రమంలో ఉన్నవాడు కొంతవరకు దాచుకోవడం తప్పు కాదు. కానీ అది అర్థంలేని దాపరికం అయిపోతే అది తృష్ణగా మారుతుంది. దీనివలన వాడు ఆ శరీరంలోకి ఎందుకు వచ్చాడో మరిచిపోతాడు. అలా తిరగడంలో డబ్బు సంపాదించి సంపాదించి ఒకనాడు మరణిస్తాడు. ఇలా సంపాదించడంలో వానికి గల పుణ్యం అంతా వ్యయమైపోయింది. అందువల్ల వీడు ఉత్తర జన్మలలో దరిద్రుడు అవుతాడు. మీరు వంద రూపాయలు సంపాదించుకున్నట్లయితే అందులో కనీసం పద్దెనిమిది రూపాయలు పుణ్యం నిమిత్తం ఖర్చు పెట్టి తీరాలి. మరి ఉత్తర జన్మకు పుణ్యం అవసరం కదా! అందుకని ఈ అయిదు రూపాయలు మీ పుణ్యం ఖాతాలో జమచేయబడతాయి. దీని వలన ఉత్తర జన్మలో అన్నవస్త్రములకు లోటులేకుండా సంతోషంగా బ్రతకగలుగుతారు. కాబట్టి ద్రవ్యమును సంపాదించడం ఎంత

అవసరమో అంత జాగ్రత్తగా ఖర్చు పెట్టడం తెలియాలి. అది తెలియకపోతే మనిషి పాడయిపోతాడు. డబ్బు సంపాదించు కానీ తృష్ణకు లొంగకు. తృష్ణకు విరుగుడు తృప్తి. తృప్తి వస్తే తృష్ణ ఆగిపోతుంది. తృప్తి లేకపోతే లోపల తృష్ణ రగులుతూ ఉంటుంది. ప్రయత్నపూర్వకంగా మీరు వెనక్కు తిరిగిచూసి ఒక వయస్సు వచ్చిన తరువాత కొన్నింటికి కట్టడి పెట్టకపోతే ఆ తృష్ణ కాలుస్తూనే ఉంటుంది. తృప్తితో తృష్ణను గెలవగలగాలి. తృణావర్తుడు సుడిగాలి రూపంలో వచ్చి మొత్తం నందవ్రజ ప్రజలందరి కళ్ళు మూసేశాడు. తృష్ణకు లొంగితే తృష్ణ గడ్డిపరకను చేసి తిప్పేస్తుంది. నందవ్రజ ప్రజలందరూ కృష్ణా కృష్ణా అని ఏడ్చారు. అపుడు కృష్ణుడు తృణావర్తుని చంపాడు. చంపి తానే వాళ్లకు దక్కాడు. వాళ్ళు దక్కించుకున్నారా, తాను దక్కాడా? తానే దక్కాడు. కాబట్టి అస్తమానూ భగవంతుని నామం చెప్పడం మొదలు పెట్టినట్లయితే అదే భగవంతుడిని మీ దగ్గరికి తీసుకువచ్చి, మీ బుద్ధిని మార్చి, మిమ్మల్ని సక్రమమయిన మార్గంలోకి తిప్పేస్తుంది. అలా తిప్పి ఏది గెలవలేక జీవితం పాడైపోతున్నదో దానిని గెలవగలిగిన మార్గమును ఈశ్వరుడు ఇచ్చేస్తాడు. తృప్తి కలవాడు చక్రవర్తి కంటే అధికుడు. మనం తరించడానికి భగవంతుని నామము, రూపము పట్టుకుంటే చాలు అని తృణావర్తోపాఖ్యానం ద్వారా తెలుసుకుంటున్నాం. ఇదీ కృష్ణ పరమాత్మ సౌజన్యం అంటే!

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

***దశమ స్కంధము***

**43వ దశకము పూర్తి**

# దశకమ్ 44 – నామకరణసంస్కారాదులు

**44-1 శ్లో.**

**గూఢంవసుదేవగిరా కర్తుం తే నిష్క్రియస్య సంస్కారాన్ ।**
**హృద్గతహోరాతత్త్వో గర్గమునిస్త్వద్గృహం విభో! గతవాన్ ॥**

**ప్రతిపదార్థం:** విభో= ప్రభూ!, వసుదేవ గిరా= వసుదేవుని ప్రార్థన చే(గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము), నిష్క్రియస్య= బంధములు లేని, కర్మఫలములకు అతీతమైన, సంస్కారములు అవసరము లేని, తే= నీకు, సంస్కారాన్= నామకరణాది సంస్కారములు, గూఢం= గూఢముగా (రహస్యముగా), కర్తుం = చేయుటకు, హోరా తత్వః = హోరాశాస్త్రమెల్ల (హోలతి హినస్తి హింసించునది జ్యోతిషంలో ఒక లగ్నము ఒక రాశి సగభాగము), హృద్గత = హృద్గతమైన (జ్యోతిష్యశాస్త్రములో నిష్ణాతుడని భావం), గర్గ మునిః= గర్గా చార్యులు, త్వత్ గృహం = మీ ఇంటికి, గతవాన్= వచ్చారు.

**తాత్పర్యం:**

ప్రభూ! వసుదేవుని ప్రార్థన చే బంధములు లేని, కర్మఫలములకు అతీతమైన, సంస్కారములు అవసరము లేని నీకు నామకరణాది సంస్కారములు రహస్యముగా చేయుటకు జ్యోతిష్యశాస్త్రములో నిష్ణాతుడయిన గర్గా చార్యులు మీ ఇంటికి వచ్చారు

**విశేషాలు**

**సంస్కారాలు :** గర్భధారణ మొదలు అంత్యేష్టి వరకు మొత్తం పదహారు సంస్కారాలు ఉన్నాయి. వాటిని షోడశ కర్మలని కూడా అంటారు. అవి : 1. గర్భ ధారణ, 2. పుంసవనం, ( నెలతప్పినట్లు తెలిసిన తరువాత పుట్టబోయే శిశువు మగ కావాలని చేసే ఒక క్రతువు) 3. సీమంతం, (గర్భిణి స్త్రీలకు చేయు ఒక శుభకర్మము. )4. జాతకర్మ, 5. నామకరణం, 6. అన్న ప్రాశం, 7. చౌలం,( పుట్టు వెంద్రుకలు తీయు సంస్కారము.) 8. ఉపనయనం, 9. ప్రాజాపత్యం,10. సౌమ్యం, 11. ఆగ్నేయం, 12. వైశ్వదేవం, 13. గోదానం, 14. సమావర్తం(పెళ్ళికి పూర్వాంగంగా జరిగే

స్నాతకం), 15. వివాహం, 16. అంత్యేష్టి.(మృత దేహాన్ని చితిపై ఉంచి మంత్రోక్తంగా దహనం చేయడం.)

**గర్గముని:** జ్యోతిష సంహితను వెలువరించిన ఋషి. బ్రహ్మ మానస పుత్రుడు. బ్రహ్మాండ పురాణంలోనూ, భాగవతంలోనూ ఇతడి ప్రస్తావన వస్తుంది. ఇతడి కుమారుడు శని. యాదవులకు పురోహితుడు. బలరామ కృష్ణులకు నామకరణం ఇతడి అధ్వర్యంలో జరిగింది.

**44–2 శ్లో.**

**నందోఽథ నందితాత్మా వృందిష్టం మానయన్నముం యమినామ్ ।**
**మందస్మితార్ద్రమూచే త్వత్సంస్కారాన్ విధాతుముత్సుక ధీః ॥**

**ప్రతిపదార్థం:** అథ =అటుపిమ్మట తనగృహమునకు వచ్చిన ఆ గర్గమునిని చూచి, నందః = నందుడు, నందిత ఆత్మా=బాగా సంతోషపడి, అముం యమినామ్ వృందిష్టం= ఆ ముని శ్రేష్ఠుని (అయం అతిశయేన వృందారకః సుందరః ముఖ్యో వా– సుందరమైనది, మనోహరమైనది, ముఖ్యమైనది), మానయన్ = గౌరవించి, మంద స్మిత ఆర్ద్రమ్= మందస్మిత మధురత్వము కలిగినవాడై, త్వత్= నీకు(కృష్ణునికి), సంస్కారాన్ = నామ సంస్కారములను, విధాతుమ్ = చేయింపుడని, ఉత్సుక ధీః = అవి జరిపించుటకు ఉత్సాహ బుద్ధితో ఉన్న గర్గునితో, ఊచే=చెప్పెను.

**తాత్పర్యం:** అటుపిమ్మట తనగృహమునకు వచ్చిన ఆ గర్గమునిని చూచి నందుడు బాగా సంతోషపడి ఆ ముని శ్రేష్ఠుని = గౌరవించి మందస్మిత మధురత్వము కలిగినవాడై నీకు (కృష్ణునికి) నామ సంస్కారములను చేయింపుడని– అవి జరిపించుటకు ఉత్సాహ బుద్ధితో ఉన్న గర్గునితో చెప్పెను

**44–3 శ్లో.**

**యదువంశాచార్యత్వాత్ సునిభృతమిదమార్య! కార్యమితి కథయన్ ।**
**గర్గో నిర్గతపులకశ్చక్రే తవ సాగ్రజస్య నామాని ॥**

**ప్రతిపదార్థం:** ఆర్య= ఆర్యుడా! నందుడా!, యదువంశ ఆచార్యత్వాత్= యదువంశ పురోహితుడైనందున (ఆచినోతి బుద్ధిం శిష్యాణామ్ శిష్యులకు జ్ఞానము పెంపొందింపచేయువాడు ఆచార్యుడు), ఇదమ్ కార్యమ్= ఈ నామకరణాదికము, సునిభృతమ్= అతి రహస్యముగా చేయవలసి ఉన్నది, ఇతి= అని, కథయన్ = చెప్పి,నిర్గతపులకః = నిన్ను తాకి తన శరీరము పులకించుచుండగా(నిశ్శేషేణ గతః – వెడలబడిన), గర్గః = గర్గుడు, తవ= నీకును, స– అగ్రజస్య= నీ సోదరునకును, నామాని= నామకరణములు, చక్రే= చేసెను.

**తాత్పర్యం:** ఆర్యుడా! నందుడా! యదువంశ పురోహితుడైనందున ఈ నామకరణాదికము అతి రహస్యముగా చేయవలసి ఉన్నది అని చెప్పి నిన్ను తాకి తన శరీరము పులకించుచుండగా గర్గుడు నీకును, నీ సోదరునకును నామకరణము చేసెను.

**44-4 శ్లో.**
**కథమస్య నామ కుర్వే సహస్రనామ్నో హ్యనంతనామ్నో వా ।**
**ఇతి నూనం గర్గమునిశ్చక్రే తవ నామనామ రహసివిభో! ॥**

**ప్రతిపదార్థం:** విభో= ప్రభూ!, సహస్ర నామ్నః= సహస్రనామవాచ్యుడు, వా= లేక, అనంత నామ్నః= అధికమగు అనంత నామములు కల, అస్య=ఈ బాలునకు, కథమ్=ఎట్లు , ఏమని, నామ= పేరు (నామయతి నామ్యతే అనేన వా స్వీకారము విస్మయము స్మరణము చెప్పుట), కుర్వే = పెట్టెదను?, ఇతి= అని, నూనం = నిశ్చయించి, గర్గమునిః= గర్గముని, తవ నామ = నీపేరును, నామ రహసి చక్రే = రహస్య ముగా పెట్టెను.

**తాత్పర్యం:** ప్రభూ! సహస్రనామవాచ్యుడు లేక అధికమగు అనంత నామములు కల ఈ బాలునకు ఏమని పేరు పెట్టెదను ? అని నిశ్చయించి గర్గముని నీపేరును రహస్య ముగా పెట్టెను.

**44-5 శ్లో.**

**కృషి ధాతుణకారాభ్యాం సత్తానందాత్మతాం కిలాభిలపత్ ।**
**జగదఘకర్షిత్వం వా కథయదృషిః కృష్ణ నామ తే వ్యతనోత్ ॥**

**ప్రతిపదార్థం:** కృషి ధాతు = సత్త అనగా ఉనికి అను అర్థము వచ్చు కృషి ధాతువునకు, ణ కారాభ్యాం= ఆనందము అను అర్థము వచ్చు 'ణ' ప్రత్యయము చేరుటవలన "కృష్ణ"అయ్యెను, సత్తా ఆనందా= సత్తయు ఆనందమను రెండింటి యొక్క (సతో భావః - అస్తిత్వము, ఉనికి)(ఆనందయతి నితరాం తోషయతి అసౌ ఆనందింప చేయునది. సంతోషము), ఆత్మతాం= ఒకే ఆశ్రయముచే, కృష్ణ నామ= కృష్ణ నామము, అభిలపత్=పరబ్రహ్మావాచకమై నీయందు అన్వర్థమైనది( తగిన అర్థం కలది), వా = లేదా, జగత్ = జగత్తు యొక్క, అఘ కర్షిత్వం = పాపములను ఆకర్షించువాడు అనగా తీసివేయువాడవు అని, కథయత్ = తెలియచేయుచూ, ఋషిః = గర్గ ముని, తే= నీకు, వ్యతనోత్= కృష్ణుడని పేరు ఇచ్చెను(పెట్టెను), కిల= ఇది పురాణ ప్రసిద్ధము కదా!

**తాత్పర్యం:** సత్త అనగా ఉనికి అను అర్థము వచ్చు కృషి ధాతువునకు ఆనందము అను అర్థము వచ్చు 'ణ' ప్రత్యయము చేరుటవలన "కృష్ణ"అయ్యెను. సత్తయు ఆనందమను రెండింటి యొక్క ఒకే ఆశ్రయముచే కృష్ణనామము పరబ్రహ్మావాచకమై నీయందు అన్వర్థమైనది(తగిన అర్థం కలది) లేదా జగత్తు యొక్క పాపములను ఆకర్షించువాడు అనగా తీసివేయువాడవు అని తెలియచేయుచూ గర్గ ముని నీకు కృష్ణుడని పేరు పెట్టెను. ఇది పురాణ ప్రసిద్ధము కదా !

**విశేషము: కృష్ణ**

**శ్రీకృష్ణుడు:** కృషి ర్భూవాచకశ్శబ్దో నశ్చ నిర్వాణవాచకః తయో రైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే

కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః - భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు.

**44-6 శ్లో.**

**అన్యాంశ్చ నామభేదాన్ వ్యాకుర్వన్నగ్రజే చ రామాదీన్ ।**
**అతిమానుషానుభావం న్యగదత్ త్వామప్రకాశయన్ పిత్రే ॥**

**ప్రతిపదార్థం:** అన్యాన్ చ నామ భేదాన్= ఇతర నామ భేదములను (వాసుదేవుడు మొదలగు నామములను), వ్యాకుర్వన్= నీకు ఇచ్చుచూ(పెట్టి), అగ్రజే చ= నీ సోదరునికి, రామ ఆదీన్=బలరాముడు మొదలగు పేర్లను పెట్టి, త్వామ్= నీ యొక్క, అతిమానుష అనుభావం= అతిమానుష ప్రభావమును – సాక్షాత్తుగా విష్ణుడవని (అతిక్రాంతః + మానుషమ్), అప్రకాశయన్ = తెలియకుండా ఉండుటకు, పిత్రే = మీ తండ్రికి(నందునికి), న్యగదత్= ఆ యా నామముల యొక్క అర్థములను సమన్వయించి గర్గుడు చెప్పెను.

**తాత్పర్యం:** ఇతర నామ భేదములను(వాసుదేవుడు మొదలయిన నామములను) నీకు పెట్టి నీ సోదరునికి బలరాముడు మొదలగు పేర్లను పెట్టి నీ యొక్క అతిమానుష ప్రభావమును – సాక్షాత్తుగా విష్ణుడవని తెలియకుండా ఉండుటకు మీ తండ్రికి నందునికి ఆ యా నామముల యొక్క అర్థములను లౌకికార్థములో సమన్వయించి గర్గుడు చెప్పెను.

**విశేషము:** వాసుదేవుడను నామమునకు సర్వదేవతలు ఈయనయందు వసింతురుఅనునది ఒక అర్థము. (వసతి సర్వత్ర ఆత్మరూపేణ వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చఅంతట ఆత్మరూపంలో వుండువాడు. వాసుదేవుడు) వసుదేవుని కుమారుడు వాసుదేవుడు(వసుదేవస్య అపత్యమ్ వసుదేవుని కుమారుడు. వాసుదేవుడు, శ్రీకృష్ణుడు) అని ఇంకొక అర్థము. ఇలా ఉభయవిధముగా సార్థకమగునట్లు గర్గుడు నామకరణము చేసెనని భావం .

**44-7 శ్లో.**

**స్నిహ్యతి యస్తవ పుత్రే ముహ్యతి స న మాయికైః పునశ్శోకైః ।**
**ద్రుహ్యతి య స్స తు నశ్యేదిత్యవదత్తే మహత్వమృషివర్యః ॥**

**ప్రతిపదార్థం:** యః = ఎవడు, తవ పుత్రే= నీ కుమారుని యెడల, స్నిహ్యతి=

స్నేహము చూపునో, సః = అతడు, మాయికైః శోకైః = మాయ కలిగించు శోకములను( జనన మరణాది దుఃఖములను), న ముహ్యతి = అనుభవింపడు, పునః = మరియు, యః= ఎవడు, ద్రుహ్యతి= నీ కుమారుడైన కృష్ణునికి ద్రోహము సేయునో(విముఖుడగునో), సఃతు= వాడు, నశ్యేత్ = నశించును (సంసారి అగును), ఇతి = అని గూఢార్థముగా, తే మహత్వమ్= నీ గొప్పతనమును, ఋషివర్యః= గర్గాచార్యుడు(ఋచ్ఛతి జానాతి జ్ఞాపయతి మంత్రార్థమ్ మంత్రార్థమును తెలుసుకున్న, మంత్రార్థమును తెలిపిన ఋషి. మంత్రార్థ ద్రష్ట), అవదత్= చెప్పెను.

**తాత్పర్యం:** ఎవడు నీ కుమారుని యెడల స్నేహము చూపునో అతడు మాయ కలిగించు శోకములను(జనన మరణాది దుఃఖములను) అనుభవింపడు. మరియు ఎవడు నీ కుమారుడైన కృష్ణునికి ద్రోహము సేయునో(విముఖుడగునో) వాడు నశించును( సంసారి అగును) అని గూఢార్థముగా నీ గొప్పతనమును గర్గాచార్యుడు చెప్పెను.

**44-8 శ్లో.**
**జేష్యతి బహుతర దైత్యాన్ నేష్యతి నిజబంధులోకమమలపదమ్ ।**
**శ్రోష్యతి సువిమలకీర్తీరస్యేతి భవద్విభూతిమృషిరూచే ॥**

**ప్రతిపదార్థం:** బహుతర= (ఈ బాలుడు) అనేకమంది, దైత్యాన్= దైత్యులను (దితేః అపత్యమ్ దితి సంతానము. రాక్షసులు), జేష్యతి= జయించును, నిజబంధు లోకమ్= తన బంధులోకమును(తనను నమ్మినవారిని)(బధ్నాతి మనః స్నేహాదినా స్నేహాదులచే మనస్సును బంధించువాడు. బంధువు), అమలపదమ్= విమలమైన స్థానమును(నిష్కల బ్రహ్మభావమును), నేష్యతి = చేర్చును, అస్య= ఇతని యొక్క సువిమలకీర్తీః=పాప హరమైన నిర్మల కీర్తిని లోకము, శ్రోష్యతి = వినగలదు, ఇతి = అని, భవత్ విభూతిమ్= నీయొక్క ఐశ్వర్యమును (నీ భవిష్యత్ జాతకమును)(విశిష్టా భూతిః ఐశ్వర్యమ్ ఐశ్వర్యము, అణిమాద్యష్టఐశ్వర్యములు), ఋషిః= గర్గ ముని, ఊచే= నీ తండ్రి నందునికి తెలిపెను.

**తాత్పర్యం:** ఈ బాలుడు అనేకమంది దైత్యులను జయించును. తనను నమ్మినవారిని

విమలమైన స్థానమునకు చేర్చును. ఇతని యొక్క పాప హరమైన నిర్మల కీర్తిని లోకము వినగలదు అని నీయొక్క ఐశ్వర్యమును (నీ భవిష్యత్ జాతకమును) గర్గ ముని నీ తండ్రి నందునికి తెలిపెను.

**44-9 శ్లో.**

**అమునైవ సర్వదుర్గం తరితాస్థ కృతాస్థమత్ర తిష్ఠధ్వమ్ ।**
**హరిరేవేత్యనభిలపన్నిత్యాది త్వామవర్ణయేత్ స మునిః ॥**

**ప్రతిపదార్థం:** అమునా ఏవ= (మీరందరు) ఈ కుమారునిచే, సర్వ దుర్గం= సకల కష్టములు(దుఃఖేన గమ్యతే కష్టంతో చేరుకొనదగినది), తరితాస్థ = పోగొట్టు కొనెదరు, కృత ఆస్థమ్=ధర్మములో ఆదరణను ఉంచి (ఆస్థా=ఆ తిష్ఠతి స్వధర్మే యయా స్వధర్మములో స్థిరంగా వుండుట ధర్మమునందు శ్రద్ధ కలిగియుండుట), అత్ర = ఈ పుత్రునియందు, తిష్ఠధ్వమ్= నమ్మకమును కలిగి యుండండి, ఇతి ఆది= ఈ విధముగా, హరిః ఏవ ఇతి= ఇతడు హరియే అని, అనభిలపన్= చెప్పకుండా, త్వామ్= నిన్ను ఉద్దేశించి శ్రీకృష్ణావతార అవతరణ విశేషమంతా, స మునిః= ఆ గర్గ ముని, అవర్ణయత్= నందునికి వర్ణించాడు.

**తాత్పర్యం:** మీరందరు ఈ కుమారునిచే సకల కష్టములు పోగొట్టుకొనెదరు. ఆదరణను ఉంచి ఈ పుత్రునియందు నమ్మకమును కలిగి యుండండి. ఈ విధముగా ఇతడు హరియే అని చెప్పకుండా నిన్ను ఉద్దేశించి శ్రీకృష్ణావతార విశేషమంతా ఆగర్గ ముని నందునికి వర్ణించాడు.

**44-10 శ్లో.**

**గర్గేఽథ నిర్గతేఽస్మిన్ నందితనందాదినంద్యమానస్త్వమ్ ।**
**మద్గదముద్గతకరుణో నిర్గమయ శ్రీమరుత్పురాధీశ ॥**

**ప్రతిపదార్థం:** శ్రీమరుత్పురాధీశ = ఓ శ్రీ గురువాయూరు దేవా!, అథ=అటుపిమ్మట, గర్గే = గర్గముని, నిర్గతే= వెళ్ళిపోగా, అస్మిన్= అతని మాటలచే, నందిత= ఆనందించిన, నంద అది = నందుడు మొదలగువారిచే, నంద్యమానః = ముద్దు చేయబడిన(అభినందితుడవై న), త్వమ్= నువ్వు, ఉద్గత కరుణః = ఉప్పొంగిన

కరుణతో(ఉద్గత ఉచ్చైః గతః ప్రాప్తోదయః - ఉదయించినది పైకి పోయినది పుట్టినది బహిర్గతమైనది), మత్ గదమ్= నా రోగమును, నిర్గమయ= తొలగించుము.

**తాత్పర్యం:** ఓ శ్రీ గురువాయూరు దేవా! అటుపిమ్మట గర్గముని వెళ్ళిపోగా అతని మాటలచే ఆనందించిన నందుడు మొదలగువారిచే ముద్దు చేయబడిన (అభినందితుడవై) నువ్వు ఉప్పొంగిన కరుణతో నా రోగములను తొలగించుము.

***దశమ స్కంధము***

**44వ దశకము పూర్తి**



# దశకమ్ 45 – శ్రీకృష్ణ బాలలీలలు

**45–1 శ్లో.**

**అయి! సబలమురారే! పాణిజానుప్రచారైః**
**కిమపి భవనభాగాన్ భూషయంతౌ భవంతౌ ।**
**చలితచరణకంజౌ మంజుమంజీరశింజా–**
**శ్రవణకుతుకభాజౌ చేరతుశ్చారువేగాత్ ॥**

**ప్రతిపదార్థం:** అయి సబలమురారే= బలరామ సహితుడవైన ఓ కృష్ణా!, పాణి = చేతులతో (ప్రణాయంతి స్తువంతి దేవాదీన్ అనేన – దీనితో దేవతలను స్తుతింతురు. చెయ్యి), జాను = మీ మోకాళ్ళతో (జాయతే ఊరు–జంఘామధ్యభాగే తొడ–పిక్కల మధ్య వుండు భాగము. మోకాలు), ప్రచారైః = పా కుచు, భవన భాగాన్ = నందరాజు యొక్క భవన భాగములను, భూషయంతౌ= అలంకరించుచుండిరి, చలిత= కదులు చున్న, చరణ కంజౌ =మీ పాద పద్మములయందు కట్టబడిన, మంజు= (మంజతి మనోహరం ధ్వనిం కరోతి) మనోహరమైన, మంజీర = (మంజతి మధురం శబ్దం కరోతి మధుర శబ్దమును చేయు) అందెలయొక్క, శింజా = అవ్యక్త శబ్దములను (శింక్తే అవ్యక్తశబ్దం కరోతి అవ్యక్తశబ్దం చేయునది. శింజ), శ్రవణ= వినెడి, కిమ్ అపి = ఏదో ఒక (ఇది అనుచు చెప్పరాని), కుతుక భాజౌ= కుతూహలములతో, చారు వేగాత్= అందమయిన వేగముతో చూడ ముచ్చటగా, భవంతౌ= భవంతులలో, చేరతుః = అటునిటు తిరుగసాగిరి.

**తాత్పర్యం:** బలరామ సహితుడవైన ఓ కృష్ణా! మీ చేతులతో మీ మోకాళ్ళతో పా కుచు నందరాజు యొక్క భవన భాగములను అలంకరించుచుండిరి. కదులు చున్న మీ పాద పద్మములయందు కట్టబడిన మనోహరమైన. అందెలయొక్క . అవ్యక్త శబ్దములను వినెడి – ఇది అనుచు చెప్పరాని – కుతూహలములతో వేగముతో చూడ ముచ్చటగా అటునిటు తిరుగసాగిరి(తమ కాళ్ళకు కట్టిన అందెల శబ్దములను విను కుతూహలములతో పాకుచున్నారని కవి భావన)

**విశేషాలు:** "మంజుమంజీరశింజా శ్రవణకుతుకభాజౌ" అను సమాసము చదువుచున్నప్పుడే అందెల రవళి వినబడుట కవి ప్రతిభ.

**45-2 శ్లో.**
**మృదు మృదు విహసంతావున్మిషద్దంతవంతౌ**
**వదనపతితకేశౌ దృశ్యపాదాబ్జదేశౌ ।**
**భుజగలితకరాంతవ్యాలగత్కంకణాంకౌ**
**మతిమహరతముచ్చైః పశ్యతాం విశ్వనృణామ్ ॥**

**ప్రతిపదార్థం:** మృదు మృదు = అల్లనల్లన, విహసంతౌ = చిరునవ్వులు చిందిస్తూ, ఉన్మిషత్ = తళుక్కున మెరయుచూ వికసించిన, దంతవంతౌ= దంతకాంతులతో (దామ్యతే అనేన - దీనితో నములుదురు. పన్ను), వదన పతిత = మోమునందు పడిన, కేశౌ = అందమయిన ముంగురులతో, దృశ్య = పాకు సమయములో కనబడుచున్న, పాద-అబ్జ దేశౌ= మీ పాదపద్మముల అందముతో, భుజ గలిత = భుజము నుండి జారి(భుజ్యతే అనేన పాలించబడునది, దీనితో తినబడునది. బాహువు, చెయ్యి)( గలితః నిసృతః పతితః - క్రింద పడినది), కర అంత వ్యాలగత్ = మీ చేతులకు అలంకరిస్తూ వేలాడుచున్న ముంజేతి కంకణములను, కంకణ అంకౌ= బాజుబందులతో (భుజమునకు చుట్టూ ఉన్న ఆభరణము), ఉచ్చైః పశ్యతాం= మిమ్ము జూచెడి, విశ్వనృణామ్= సమస్త మానవకోటి, మతిమ్ = మనస్సులను, అహరతమ్= హరించుచుంటిరి.

**తాత్పర్యం:** అల్లనల్లన చిరునవ్వులు చిందిస్తూ, తళుక్కున మెరయుచుండు దంతకాంతులతో, మోమునందు పడిన అందమయిన ముంగురులతో, పాకు సమయములో కనబడుచున్న మీ పాదపద్మముల అందముతో, భుజము నుండి జారి మీ చేతులకు అలంకరించిన ముంజేతి కంకణములను తాకిన బాజుబందులతో మిమ్ము జూచెడి సమస్త మానవకోటి మనస్సులను హరించుచుంటిరి.

**45-3 శ్లో.**
**అనుసరతి జనౌఘే కౌతుకవ్యాకులాక్షే**
**కిమపి కృతనినాదం వ్యాహసంతౌ ద్రవంతౌ ।**

**వలితవదనపద్మం పృష్ఠతో దత్తదృష్టీ**
**కిమివ న విదధాథే కౌతుకం వాసుదేవ! ॥**

**ప్రతిపదార్థం:** వాసుదేవ= ఓ వాసుదేవుడా!, జనౌఘే= గోపాల జనులు, కౌతుక వ్యాకుల = వేడుకగొని, ఆక్షే= కనులను అప్పగించి (అక్ష్ణోతి, అక్షతి, అక్ష్యతే వా అనేన – చూచునది, వ్యాపించునది. దేనితో విషయం గ్రహింపబడునో అది. ఇంద్రియము), అనుసరతి= మీ వెంటబడి, కిమపి కృతనినాదం= ఏదో ఒక రకమైన చప్పట్లు చరువగా, వ్యాహసంతౌ= నవ్వుతూ, ద్రవంతౌ= పరుగెత్తి, వలిత వదన పద్మం= ముఖ పద్మములను వెనుకకు తిప్పుచూ(వలితః గతిశీలః ఆవృత – నడచునది, ఆవరింపబడ్డది), పృష్ఠతః దత్తదృష్టీ= మీరు వెనుక వైపు చూసిన చూపు, కిమ్ ఇవ కౌతుకం= అతిశయమైన కుతూహలమును, విదధాథే న = పుట్టించదా? (పుట్టిస్తుందని భావం).

**తాత్పర్యం:** ఓ వాసుదేవుడా! గోపాల జనులు వేడుకగొని కనులను అప్పగించి మీ వెంటబడి ఏదో ఒక రకమైన చప్పట్లు చరువగా నవ్వుతూ పరుగెత్తి ముఖ పద్మములను వెనుకకు తిప్పుచూ మీరు వెనుక వైపు చూసిన చూపు అతిశయమైన కుతూహలమును పుట్టించింది.

**45–4 శ్లో.**
**ద్రుతగతిషు పతంతావుత్థితౌ లిప్తపంకౌ**
**దివి మునిభిరపంకైః సస్మితం వంద్యమానౌ ।**
**ద్రుతమథ జననీభ్యాం సానుకంపం గృహీతౌ**
**ముహురపి పరిరబ్ధౌ ద్రాగ్యువాం చుంబితౌ చ ॥**

**ప్రతిపదార్థం:** ద్రుతగతిషు= గబగబా నడుచుచు మీరు (ద్రవంతి శీఘ్రం గచ్ఛంతి నృత్యంతి తస్య భావః – తొందరగా పోవుట), పతంతౌ= నడుమనడుమ పడుచు, ఉత్థితౌ = లేచుచు, లిప్త పంకౌ= బురద మేనికి పూసికొనుచు (కృతలేపః, భక్షితః, విషదిగ్ధ – లేపనము చేయబడినది, పూయబడినది, నాకబడినది), అపంకైః = పాపపంకిలమే లేని (పచ్యతే వ్యాప్యతే క్లిద్యతే వా అనేన దీనితో కష్టపడుదురు. బురద పాపము), దివి మునిభిః = ఆకాశమునందున్న మునులు, సస్మితం= నవ్వుచూ,

వంద్యమానౌ= మీకు నమస్కరించుచుండగా, అథః = మీరు క్రింద పడుదురో అను భయముతో, జననీభ్యాం = యశోదా రోహిణులు, ద్రుతమ్= వెంటనే ఆత్రుతతో, స అనుకంపం= దయతో, గృహీతౌ= మిమ్ములను ఎత్తుకొని, ముహుః అపి=మరలా మరలా, పరిరబ్ధౌ= కౌగలించుకొని, ద్రాక్ = వెంటనే, తత్క్షణమే. (ద్రాతి శీఘ్రమ్ త్వరగా), యువాం = మీ ఇద్దరిని, చుంబితౌ చ= ముద్దు పెట్టుకొనేవారు.

**తాత్పర్యం:** గబగబా నడుచుచు మీరు నడుమనడుమ పడుచు లేచుచు, బురద మేనికి పూసికొనుచుండగా పాపపంకిలమే లేని ఆకాశమునందున్న మునులు నవ్వుచూ మీకు నమస్కరించుచుండగా మీరు క్రింద పడుదురో అను భయముతో మీ తల్లులు యశోదా రోహిణులు వెంటనే ఆత్రుతతో దయతో మిమ్ములను ఎత్తుకొని మరలా మరలా కౌగలించుకొని వెంటనే, తత్క్షణమే మీ ఇద్దరిని ముద్దు పెట్టుకొనేవారు.

**45-5 శ్లో.**

**స్నుతకుచభరమంకే ధారయంతీ భవంతం**
**తరలమతి యశోదా స్తన్యదా ధన్యధన్యా ।**
**కపటపశుప! మధ్యే ముగ్ధహాసాంకురం తే**
**దశనముకుళహృద్యం వీక్ష్య వక్త్రం జహర్ష ॥**

**ప్రతిపదార్థం:** స్నుత= పాలు చేపిన (క్షరితః - కారినది), కుచభరమ్= స్తనముల భారముతో, భవంతం = నిన్ను, అంకే ధారయంతీ = ఒడిలోనికి తీసుకొని, స్తన్యదా = స్తన్యమిచ్చుచున్న, తరలమతి= ప్రేమ పరిపూర్ణ అయిన, యశోదా= యశోదాదేవి, ధన్యధన్యా = ధన్యురాలు. ధన్యురాలు, కపట పశుప= గొల్లబాలుని వేషములో కనిపించు దేవా!, మధ్యే= పాలు తాగుచు నడుమ నడుమ, తే దశన ముకుళ= మీ వచ్చియు రాని పలు మొగ్గల వరుసచే (దశ్యతే అనేన) దీనితో కుట్టబడును. పన్ను, హృద్యం= మనోహరమైన (హృదయస్య ప్రియః - హృదయమునకు ప్రియమైనది), ముగ్ధ హాస అంకురం= మందస్మితముతో ఉన్న, వక్త్రం= మోమును (వక్తి అనేన - దీనితో మాట్లాడుదురు. ముఖము), వీక్ష్య= చూసి, జహర్ష = ఆమె ఎంతయో ఆనంద పడెను.

**తాత్పర్యం:** పాలు చేపిన స్తనముల భారముతో నిన్ను ఒడిలోనికి తీసుకొని స్తన్యమిచ్చుచున్న ప్రేమ పరిపూర్ణ అయిన యశోదాదేవి ధన్యురాలు. ధన్యురాలు. గొల్లబాలుని వేషములో కనిపించు దేవా! పాలు తాగుచు నడుమ నడుమ మీ వచ్చియు రాని పలు మొగ్గల వరుసచే మనోహరమైన మందస్మితముతో ఉన్న మోమును చూసి ఆమె ఎంతయో ఆనంద పడెను.

**45-6 శ్లో.**

**తదనుచరణచారీ దారకైస్సాకమారాత్**
**నిలయతతిషు ఖేలన్ బాలచాపల్యశాలీ ।**
**భవనశుకబిడాలాన్ వత్సకాంశ్చానుధావన్**
**కథమపి కృతహాసైర్గోపకైర్వారితోఽభూః ॥**

**ప్రతిపదార్థం:** తత్ అనుచరణచారీ= తరువాత అనుసరిస్తూ తప్పటడుగులు వేయుచు, సాకమ్ దారకైః= తోడిబాలురతో(దారయతి నాశయతి జనకస్య పితౄణమ్ తండ్రి ఋణమును తీర్చువాడు. కొడుకు), ఆరాత్ = దగ్గరగా, దూరముగా ఉన్న (ఆరాత్ దూరసమీపయోః - దూరము సమీపము), నిలయతతిషు = ఇరుగు పొరుగిండ్లలో, ఖేలన్ = ఆడుచు, బాల చాపల్య శాలీ= పసితనపు చంచల స్వభావముతో(చపలస్య భావః కర్మ వా చాపల్యము చపలత్వము), భవన శుక= ఆ ఇండ్లలో ఉన్న చిలుకలను(శోభతే శోభించునది. చిలుక), బిడాలాన్ = పిల్లులను, వత్సకాన్ చ = లేగదూడలను, అనుధావన్ =వెంబడించి పరుగెత్తుచు, కథమ్ అపి =ఎలాగో ఒక విధముగా, కృతహాసైః = చేయ బడిన నవ్వు కలిగిన, గోపకైః = గోపాలకులచే, వారితః అభూః =అలా పరిగెత్త వద్దని నడుమ నడుమ ఆపబడ్డారు.

**తాత్పర్యం:** తరువాత తప్పటడుగులు వేయుచు తోడిబాలురతో దగ్గరగా, దూరముగా ఉన్న ఇరుగు పొరుగిండ్లలో ఆడుచు పసితనపు చంచల స్వభావముతో ఆ ఇండ్లలో ఉన్న చిలుకలను పిల్లులను లేగదూడలను వెంబడించి పరుగెత్తుచు ఎలాగో ఒక విధముగా నవ్వు తెచ్చి పెట్టుకొన్న గోపాలకులచే అలా పరిగెత్త వద్దని నడుమ నడుమ ఆపబడ్డారు.

**45-7 శ్లో.**

**హలధరసహితస్త్వం యత్ర యత్రోపయాతో**
**వివశపతితనేత్రాస్తత్ర తత్రైవ గోప్యః ।**
**విగలితగృహకృత్యా విస్మృతాపత్యభృత్యాః**
**మురహర। ముహురత్యంతాకులా నిత్యమాసన్ ॥**

**ప్రతిపదార్థం:** మురహర= మురహరా!, త్వం = నీవు, హలధరసహితః= బలరామునితో కలిసి (హలం ధరతి ఆయుధత్వేన - హలమును ఆయుధంగా ధరించువాడు. బలరాముడు), యత్ర యత్ర ఉపయాతః= ఎక్కడ ఎక్కడకు వెళ్ళినచో, తత్ర తత్ర= అక్కడ అక్కడ, వివశ పతిత నేత్రాః = వివశలై కను లప్పగించి, గోప్యః = గోపికలు, విగలిత గృహ కృత్యాః= ఇంటిపనులు విడిచి(విశేషేణ గలితః స్ఖలితః - విశేషంగా జారినది, జారిపోయినది క్షీణించిపోయినది), విస్మృత - అపత్య భృత్యాః = తమ పిల్లలను, పనివారినీ మరిచి, (విస్మృతః విగతస్మరణః మరచిపోయిన) (న పతంతి పితరః అనేన నరకే వీని వలన పితరులు నరకమును పొందరు. పుత్రుడు, సంతానము), ముహుః = మాటి మాటికి, అత్యంత ఆకులా ఏవ = అత్యంతము తన్మయులై దృష్టినంతనూ నీపైనే నిలిపి (ఆకులం ఆసమంతాత్ పూర్ణమ్ నిండియున్నది), నిత్యమ్= నిత్యము, ఆసన్= ఉండిరి.

**తాత్పర్యం:** మురహరా! నీవు బలరామునితో కలిసి ఎక్కడ ఎక్కడకు వెళ్ళినచో అక్కడ అక్కడ వివశలై కను లప్పగించి గోపికలు ఇంటిపనులు విడిచి తమ పిల్లలను, పనివారినీ మరిచి, మాటి మాటికి బాగా తన్మయులై దృష్టినంతనూ నీపైనే నిలిపి నిత్యము ఉండిరి.

**45-8 శ్లో.**

**ప్రతినవనవనీతం గోపికాదత్తమిచ్ఛన్**
**కలపదముపగాయన్ కోమలం క్వాపి నృత్యన్ ।**
**సదయయువతిలోకైరర్పితం సర్పిరశ్నన్**
**క్వచన నవవిపక్వం దుగ్ధమప్యాపిబస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** ప్రతినవ నవనీతం= అప్పుడే తీసిన వెన్న ను (నవం నీయతే కొత్తగా తీయబడినది. వెన్న), గోపికా దత్తమ్= గోపకన్యలు అందింపగా స్వీకరించి, ఇచ్ఛన్ కలపదమ్= వారు కోరుకొను మధుర గీతములను, ఉపగాయన్ = పాడుచూ(కూనిరాగములు తీయుచు), కోమలం= కోమలముగా, క్వ అపి= కొన్నిసార్లు ఎక్కడైననూ, నృత్యన్= నటించుచు, సదయ = జాలిగొని, యువతి లోకైః= యువతులు, అర్పితం = నీకు అర్పించు (నీకు తినిపించు), సర్పిః = నేతిముద్దలను (సర్పతి ప్రవహతి ప్రవహించునది. నెయ్యి), అశ్నన్ = తినుచు, క్వచన = కొన్ని సమయములలో, నవ విపక్వం= కొత్తగా అప్పుడే కాచిన(విశేషేణ సంపూర్ణతయా పక్వమ్ సంపూర్ణంగా పండినది, ఉడికినది, వికసించినది), దుగ్ధమ్ అపి= గోక్షీరమును కూడా(దుహ్యతే అసౌ పితుకబడునవి. పాలు), త్వమ్= నువ్వు, అపిబః= తాగితివి.

**తాత్పర్యం:** అప్పుడే తీసిన వెన్న ను గోపకన్యలు అందింపగా స్వీకరించి వారు కోరుకొను మధుర గీతములను పాడుచూ(కూనిరాగములు తీయుచు) నటించుచు యువతులు నీకు తినిపించు నేతిముద్దలను తినుచు కొన్ని సమయములలో కొత్తగా అప్పుడే కాచిన గోక్షీరమును కూడా నువ్వు తాగితివి.

**45-9 శ్లో.**

**మమ ఖలు బలిగేహే యాచనం జాతమాస్తామ్**
**ఇహ పునరబలానామగ్రతో నైవ కుర్వే ।**
**ఇతి విహితమతిః కిం దేవ! సంత్యజ్య యాచ్ఞాం**
**దధిఘృతమహరస్త్వం చారుణా చోరణేన ॥**

**ప్రతిపదార్థం:** దేవ= ఓ గురువాయూరు దేవా!, మమ బలిగేహే= పూర్వము బలిచక్రవర్తి ఇంటికి వెళ్ళి(బల్యతే దీయతే రాజ్యే రాజగ్రాహ్యో భాగః – రాజ్యమునందు ఇవ్వబడునది. రాజు తీసుకొను పన్ను బలి చక్రవర్తి), యాచనం జాతమ్ ఆస్తామ్ ఖలు= నేను యాచించుట జరిగినది. (యాచతే తస్య భావః – యాచనము యాచించువాడు), ఇహ పునః = ఇక్కడ మరలా, అబలానామ్ అగ్రతః= అబలల ముందు(అల్పం పురుషాత్ శారీరకం బలం యస్యాః – పురుషుని కంటే తక్కువ

శారీరక (కండ) బలము కలది కొంచెము బలము కలది, స్త్రీ), న ఏవ కుర్వే = ఆ పని చేయనని, ఇతి విహితమతిః కిం= ఈ విధముగా నిశ్చయించి కాబోలు, యాచ్ఞాం సంత్యజ్య= యాచనకు స్వస్తి చెప్పి, దధిఘృతమ్= పెరుగునేతులను(ఘారయతి స్రవతి అసౌ స్రవించునది. నెయ్యి), చారుణా చోరణేన =అందమైన దొంగతనము ద్వార, త్వం అహరః =గ్రహించుటకు నువ్వు నిశ్చయించుకొన్నావు.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! పూర్వము బలిచక్రవర్తి ఇంటికి వెళ్ళి నేను యాచించుట జరిగినది. ఇక్కడ మరలా అబలల ముందు ఆ పని చేయనని నిశ్చయించి కాబోలు యాచనకు స్వస్తి చెప్పి పెరుగునేతులను అందమైన దొంగతనము ద్వార గ్రహించుటకు నువ్వు నిశ్చయించుకొన్నావు.

**45-10 శ్లో.**

**తవ దధిఘృతమోషే ఘోషయోషాజనానామ్**
**అభజత హృది రోషో నావకాశం న శోకః ।**
**హృదయమపి ముషిత్వా హర్షసింధౌ న్యధాస్త్వం**
**స మమ శమయ రోగాన్ వాతగేహాధినాథ! ॥**

**ప్రతిపదార్థం:** వాతగేహ అధినాథ= ఓ గురువాయూరు దేవా!, తవ= నువ్వు, దధి ఘృతమ్ = పాలు పెరుగులు, ఓషే= దొంగిలించినను, ఘోష యోషా జనానామ్ = వ్రజ ఘోషమందలి గోపికల (ఘోషయంతే ప్రాణినః అత్ర – ప్రాణులు శబ్దము చేయు స్థలము. పల్లె, గ్రామము), హృది= హృదయములందు, రోషః = రోషము, న అభజత = సేవింపబడలేదు, శోకః అవకాశం న= శోకమునకు అవకాశము లేదు, హృదయమ్ అపి ముషిత్వా= గోపికల హృదయములను దొంగిలించి, హర్ష సింధౌ = హర్ష సముద్రమునందు, త్వం= నువ్వు, న్యధాః= వారిని ముంచెత్తితివి, స = అటువంటి నువ్వు, మమ రోగాన్= నా రోగములను, శమయ = శమింపచేయుము.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! నువ్వు పాలు పెరుగులు దొంగిలించినను వ్రజ ఘోషమందలి గోపికల హృదయములందు రోషము లేదు. శోకమునకు అవకాశము లేదు . గోపికల హృదయములను దొంగిలించి హర్ష సముద్రమునందు

నువ్వు వారిని ముంచెత్తితివి. అటువంటి నువ్వు నా రోగములను శమింపచేయుము.

**విశేషాలు:** ఇంతకూ పూర్వం గురువులు చెప్పిన మాటలను చెవితో విని వదలడం కాకుండా వారు చెప్పిన మాటలను లోపల బాగా తిప్పాలి. ఈ తిప్పడమే మననము అనే కవ్వము. ఇది తిరుగుతుంటే పెరుగు చిలకబడుతుంది. గురువు వలన తాను విన్న విషయములను కూర్చుని మనసుపెట్టి చిలికి ధ్యానం చేస్తుంటే ఈ చప్పుడు ఈశ్వరుడికి వినపడుతుంది. ఆయన వెంటనే వచ్చేస్తాడు. పెరుగును చిలికితే లోపలనుండి వెన్న పైకి వస్తుంది. పైకి తేలుతుంది. వెన్నకి రెండు లక్షణములు ఉంటాయి. ఈ వెన్నను అగ్నిహోత్రం మీద పెడితే కరిగి నెయ్యి అవుతుంది. నీటిలోకాని, మజ్జిగలో కానీ వేస్తే తేలుతుంది. భగవత్సంబంధమయిన జ్ఞానమనే అగ్నిహోత్రం తగిలితే ఇప్పటి వరకు పాలలోనే వున్నా పైకి కనపడని నెయ్యి యిప్పుడు చిట్టచివరి దశలోపైకి వస్తుంది. పాలను నెయ్యిగా తీసుకురావాలంటే ఇదంతా జరగాలి. కానీ నేతిని తిరిగి పాలుగా మార్చలేము. ఒకసారి బ్రహ్మ జ్ఞానమును పొందేసిన తర్వాత ఇంక తాను వెనక్కి వెళ్ళడు. తాను ప్రారబ్ధం అయిపోయే వరకు శరీరంలో ఉంటాడు. శరీరం పడిపోతూ ఉండగా అమ్మయ్య శరీరమును వదిలి పెట్టేస్తున్నాను అని జీవుడు సంతోషిస్తాడు.

ఇటువంటి ఆత్మజ్ఞాన స్వరూపమయిన వెన్న నెయ్యి కాదు. దీనిని ఆధారం చేసుకుని ఆత్మదర్శనం అవ్వాలి. దానికి నిధి ధ్యాసనం లోనికి వెళ్ళాలి. లోపలి వెన్న ఎవ్వరికీ పనికిరాదు ఒక్క ఈశ్వరునికే పనికి వస్తుంది. అనగా అత్యంత ప్రశాంతమయిన ప్రదేశమునందు కూర్చుని పరమేశ్వరుని ధ్యానం చేయాలి. ఈ వెన్నను ఒక్క ఈశ్వరుడే తింటాడు. అన్యులు దీనిని తినలేరు. ఈశ్వరుడు ఇక్కడకు వచ్చి తినడమే గోపకాంతల ఇళ్ళల్లోకి వెళ్ళి కృష్ణుడు వెన్న తినడం. అప్పుడు ఆ భక్తి, ఆ వెన్న కృష్ణ స్పర్శ చేత జ్ఞానముగా మారుతుంది. అది నేయి. అది యజ్ఞమునందు పడుతుంది. అదే హవిస్సుగా మారుతుంది. ఈ శరీరము పడిపోయి పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యమును పొందుతాడు. ఇదీ కృష్ణుడు వెన్న తినడం అంటే! అంతేకానీ చేతకాక, పనిలేక, అవతారమును స్వీకరించి వాళ్ళింట్లోకి, వీళ్ళింట్లోకి వెళ్ళి వెన్నలు దొంగతనం చేసి తిన్నాడని దాని అర్థం కాదు. ఎందుకు వెన్న తిన్నాడో అంతరము నందు విచారణ చేయాలి. దీనిని నవనీత

చోరత్వము అంటారు. వెన్నను ప్రసాదంగా స్వీకరించడం వెనకాతల వున్న రహస్యం అది!

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

***45వ దశకము పూర్తి***



# దశకమ్ 46 – విశ్వరూపదర్శనము

**46–1 శ్లో.**
**అయి దేవ! పురా కిల త్వయి!**
**స్వయముత్తానశయే స్తనంధయే ।**
**పరిజృంభణతో వ్యపావృతే**
**వదనే విశ్వమచష్ట వల్లవీ ॥**

**ప్రతిపదార్థం:** అయి దేవ= ఓ వాసుదేవా!, పురా= పూర్వము చాలాకాలము క్రితము నీవు శిశువుగా ఉన్నప్పుడు (పురతి అగ్రే గచ్ఛతి పూర్వకాలము మునుపు), స్వయమ్ =సాక్షాత్తు ఈశ్వరుడవైన, త్వయి =నువ్వు, ఉత్తానశయే= వెల్లకిలపరుండి (ఉత్తానః ఊర్ధ్వముఖః సన్నేవ శేతే తల పైకి (పెట్టి) ఎత్తి పరుండువాడు), స్తనంధయే = పాలు త్రావుచున్నప్పుడు(స్తనం ధయతి పిబతి స్తనమును త్రాగువాడు), పరిజృంభణతః =ముఖ విజృంభణ దశలో ( నోరుతెరిచి ఆవులించగా), వ్యపావృతే= కప్పబడని (అపగతః ఆవృతిః ఆచ్ఛాదనం యత్ర – కప్పబడనిది ఆవరణము లేనిది), వదనే = ముఖమునందు, విశ్వమ్ = ఈ సమస్త విశ్వమును(విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), వల్లవీ= ఆ గోపనందుని పత్ని– యశోద(వల్లవజాతి స్త్రీ వల్లవజాతి స్త్రీ. గోపికా), అచష్ట కిల= దర్శించినది కదా!

**తాత్పర్యం:** ఓ వాసుదేవా! పూర్వము చాలాకాలము క్రితము నీవు శిశువుగా ఉన్నప్పుడు సాక్షాత్తు ఈశ్వరుడవైన నువ్వు వెల్లకిలపరుండి పాలు త్రావుచున్నప్పుడు నోరుతెరిచి ఆవులించగా కప్పబడని నీ ముఖమునందు ఈ సమస్త విశ్వమును ఆ యశోద దర్శించినది కదా !

**విశేషము**

**స్తనంధయన్యాయము:** పాలు కుడిపి పరుండబెట్టిన శిశువు నిద్రపోవుచూ, జ్ఞానశూన్యుడైనను మహానందమనుభవించువానివలె నిర్విచారుడై పరుండి నిద్రాసుఖ మనుభవించును. ఆనందస్వరూపుడవు పరబ్రహ్మయందు మనసును

లీనము చేసి కనులుమూసి బ్రహ్మానంద మనుభవించు జ్ఞాని పైకి స్థాణువువలె నున్నను లోలోన అఖండబ్రహ్మానందరసమున తదేకనిష్ఠతో ఇతరవిచారములు లేక మునుకలాడుచుండును.

**46–2 శ్లో.**
**పునరప్యథ బాలకైః సమం**
**త్వయి లీలానిరతే జగత్పతే! ।**
**ఫలసంచయవంచనక్రుధా**
**తవ మృద్భోజనమూచురర్భకాః ॥**

**ప్రతిపదార్థం:** జగత్పతే =ఓ జగన్నాథా!, అథ= అటుపిమ్మట, పునః అపి = మరియొకమారు( కొంచెము వయస్సు నీకు వచ్చిన తరువాత), త్వయి= నువ్వు, బాలకైః సమం= తోటిబాలురతో కలిసి (బాల ఏవ బాలకః బాలుడు, శిశువు), లీలానిరతే= ఆడుకొను సందర్భములో (నితరాం రతః కార్య నిరతుడు. పనిలో మునిగినవాడు), ఫలసంచయ= పండ్లను అందరూ కలిసి సేకరించిననూ, (ఫలతి ఫలించునది. పండు), వంచన= అందులో భాగమును నీ స్నేహితులకు నువ్వు ఇవ్వక పోయేసరికి (వంచయతే తస్య భావః కర్మ వా మోసము, వంచన), క్రుధా= నువ్వే మొత్తము పండ్లను కాజేసితివన్న కోపముతో (క్రోధే కృధ్యతి కోపగించుట), అర్భకాః= ఆ నీ స్నేహితులు (అర్భ ఏవ అర్భకఃచిన్నపిల్లవాడు), తవ మృద్ భోజనమ్= నీ తల్లి యశోదకు — మన్ను తిన్నావని – నీపై నేరమును(మృద్యతే అసౌ పిసుకబడునది. మట్టి), ఊచుః = చెప్పిరి.

**తాత్పర్యం:** ఓ జగన్నాథా! కొంచెము వయస్సు నీకు వచ్చిన తరువాత నువ్వు తోటిబాలురతో కలిసి ఆడుకొను సందర్భములో పండ్లను అందరూ కలిసి సేకరించారు. అందులో భాగమును నీ స్నేహితులకు నువ్వు ఇవ్వక పోయేసరికి నువ్వే మొత్తము పండ్లను కాజేసితివన్న కోపముతో ఆ నీ స్నేహితులు నీ తల్లి యశోదకు —నువ్వు మన్ను తిన్నావని – నీపై నేరమును చెప్పిరి.

**46-3 శ్లో.**
**అయి! తే ప్రళయావధౌ విభో!**
**క్షితితోయాదిసమస్తభక్షిణః ।**
**మృదుపాశనతో రుజా భవే**
**దితి భీతా జననీ చుకోప సా ॥**

**ప్రతిపదార్థం:** అయి విభో = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తే ప్రళయ అవధౌ= ప్రళయకాలమున (ప్రళయ ఏవ అవధిః)(ప్రలీయతే అస్మిన్ జగత్సర్వమ్ ప్రపంచమంతా దీనిలో లీనమగును. ప్రళయము వినాశము), క్షితిః= భూమి, (క్షియంతి నివసంతి అస్యామ్ దీని పైన నివసింతురు. భూమి నివాసము), తోయ = నీరు, (తవే పూర్యై యాతి బావులను చెరువులను పూరించును. నీరు), ఆది= మొదలైన, సమస్త భక్షిణః= సర్వ భూతప్రపంచమును భక్షించు నీ కథ తెలియక, మృద్ ఉపాశనతః = మన్ను తిన్నావని, రుజా భవేత్ ఇతి = నీకు జబ్బు చేయునని(రుజతి పీడితో భవతి అనయా రోగము, భంగము), భీతా = భయపడి, సా జననీ = నీ తల్లి యశోద (జనయతి పుట్టించునది, కనునది. తల్లి), చుకోప= నీపై కోపించెను.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! ప్రళయకాలమున భూమి, నీరు మొదలైన సర్వ భూతప్రపంచమును భక్షించు నీ కథ తెలియక మన్ను తిన్నావని నీకు జబ్బు చేయునని భయపడి నీ తల్లి యశోద నీపై కోపించెను.

**46-4 శ్లో.**
**అయి! దుర్వినయాత్మకా! త్వయా**
**కిము మృత్సాబత! వత్స! భక్షితా ।**
**ఇతి మాతృగిరం చిరం విభో!**
**వితథాం త్వం ప్రతిజజ్ఞిషే హసన్ ॥**

**ప్రతిపదార్థం:** అయి దుర్వినయ-ఆత్మకా=ఓ అల్లరి పనులు చేయు కృష్ణ!, వత్స= కుమారా!, త్వయా = నీ చేత(నువ్వు), మృత్సా భక్షితా= మన్ను తింటివట (మృత్సా

= ప్రశస్తా మృత్ ప్రశస్తమైన మట్టి. సారవంతమైన మట్టి), కిము = (కిం చ ఉ చ, సంభావనాయాం విమర్శే సంభావించుట విమర్శించుట శంకించుట) అవునా !, బత = అయ్యో! (సంబోధనే, ఆశ్చర్యే, నిందాయామ్ ఖేదము, సంబోధనము, ఆశ్చర్యము, నిందల యందు వాడబడును), ఇతి = అను, మాతృగిరం = అమ్మ మాటను విని, చిరం విభో= శాశ్వతుడవైన కృష్ణా! (చిరకాలః – చాలా కాలము ఆలస్యము), త్వం = నువ్వు, హసన్= నవ్వుచూ, వితథాం = ఆ బాలురు చెప్పిన మాటలు అబద్ధమని (విరుద్ధం తన్యతే కథ్యతే తత్ విరుద్ధంగా చెప్పుట. మిథ్యా అబద్ధము), ప్రతిజజ్ఞిషే = ప్రతిజ్ఞ చేసావు. (ప్రతిజ్ఞాయతే అసౌ ప్రతిజ్ఞ మాట యిచ్చుట).

**తాత్పర్యం:** ఓ అల్లరి పనులు చేయు కృష్ణ! కుమారా! నువ్వు మన్ను తింటివట అవునా! అయ్యో! అను అమ్మ మాటను విని శాశ్వతుడవైన కృష్ణా ! నువ్వు నవ్వుచూ ఆ బాలురు చెప్పిన మాటలు అబద్ధమని ప్రతిజ్ఞ చేసావు.

**46–5 శ్లో.**
**అయి ! తే సకలైర్వినిశ్చితే**
**విమతిశ్చేత్ వదనం విదార్యతామ్ ।**
**ఇతి మాతృవిభర్త్సితో ముఖం**
**వికసత్పద్మనిభం వ్యదారయః ॥**

**ప్రతిపదార్థం:** అయి= ఓరోరీ!, తే సకలైః = బలరామునితో సహ మిగతా పిల్లలందరు, వినిశ్చితే= నువ్వు మన్ను తిను విషయములో ఒక్కటే మాట నిశ్చయముగా, విమతిః = విరుద్ధముగా గట్టిగా చెప్పుచుంటిరి (విమతి=నానా మతిః, విరుద్ధా విగతా మతిః యస్య – చంచలమైన బుద్ధి కలవాడు విరుద్ధమైన బుద్ధి గలవాడు), చేత్ = వారి మాటలు అసత్యములే అయినచో, వదనం= నోరును (వదంతి అనేన – దీనితో మాట్లాడుదురు. ముఖము), విదార్యతామ్= తెరిచి నాకు చూపుము, ఇతి= అని, మాతృ విభర్త్సితః = అమ్మ చేత అధిక్షిప్తుడవయి (నిందింపబడి), వికసత్ పద్మ నిభం =వికసించిన పద్మము వంటి, ముఖం = నీ నోరును, వ్యదారయః = తెఱచి చూపించితివి.

**తాత్పర్యం:** ఓరోరీ! బలరామునితో మిగతా పిల్లలందరు నువ్వు మన్ను తిను విషయములో ఒక్కటే మాట నిశ్చయముగా గట్టిగా చెప్పుచుంటిరి .వారి మాటలు అసత్యములే అయినచో నోరు తెరిచి నాకు చూపుము అని అమ్మ చేత నిందింపబడి వికసించిన పద్మము వంటి నీ నోరును తెఱచి చూపించితివి.

**46-6 శ్లో.**

**అపి మృల్లవదర్శనోత్సుకాం**
**జననీం తాం బహు తర్పయన్నివ ।**
**పృథివీం నిఖిలాం న కేవలం**
**భువనాన్యప్యఖిలాన్యదీదృశః ॥**

**ప్రతిపదార్థం:** అపి = మరియు, మృత్ లవ దర్శన —ఉత్సుకాం= నీ నోటిలో కొంచెము మన్ను చూడవలెననుకొన్న ఉత్సాహము కల, తాం జననీం = నీ జననిని, బహు తర్పయన్ ఇవ= బాగా తృప్తి పరుచుటకు, కేవలం =కేవలము, సమస్త పృథివీం న = సమస్త భూమియే(మన్ను మాత్రమే) కాదు(ప్రథతే విస్తారం యాతి విస్తరించి యున్నది. భూమి), నిఖిలాం =అఖిలమైన, భువనాన్ అపి= పదునాల్గులోక ములు (1. భూలోకం, 2. భువర్లోకం, 3. సువర్లోకం, 4. మహ ర్లోకం, 5. జన లోకం, 6. తపో లోకం, 7. సత్య లోకం, 8. అతలం, 9. వితలం, 10. సుతలం, 11. తలాతలం, 12. మహా తలం, 13. రసాతలం, 14. పాతాళం. ఇవి పదునాలుగు లోకాలని ప్రసిద్ధి), అదీదృశః= ఆమెకు నీ నోటిలో చూపించితివి.

**తాత్పర్యం:** మరియు నీ నోటిలో కొంచెము మన్ను చూడవలెననుకొన్న ఉత్సాహము కల నీ జననిని బాగా తృప్తి పరుచుటకు సమస్త భూమియే (మన్ను మాత్రమే ) కాదు – అఖిలమైన పదునాల్గులోక ములు ఆమెకు నీ నోటిలో చూపించితివి

**46-7 శ్లో.**

**కుహచిత్ వనమంబుధిఃక్వచిత్**
**క్వచిదభ్రం కుహచిద్రసాతలమ్ ।**
**మనుజా దనుజాః క్వచిత్ సురా**
**దదృశే కిం న తదా త్వదాననే ॥**

**ప్రతిపదార్థం:** కుహచిత్= ఒకచోట, వనమ్= అరణ్యము (వన్యతే యాచ్యతే సేవించబడునది. యాచింపబడునది. అరణ్యము), క్వచిత్= ఒకచోట, అంబుధిః= సముద్రము, (అంబూని ధీయంతే అత్ర – నీరును ధరించునది. సముద్రము), క్వచిత్= ఒకవంక, అభ్రం= ఆకాశము, (ఆపః బిభర్తి నీటిని ధరించునది. మేఘము ఆకాశము), కుహచిత్ = ఇంకొకచోట, రసాతలమ్ = పాతాళము (రసాయాః తలం నిమ్నభాగస్థ లోకవిశేషః భూమి క్రిందున వున్న లోక విశేషము), మనుజాః= ఒకచోట మనుజులు (మనోః జాతః మనువుకు పుట్టినవాడు. మానవుడు), క్వచిత్ దనుజాః= ఒకచోట రాక్షసులు, సురాః = ఒకప్రక్క దేవతలు, తదా= అప్పుడు, త్వత్ ఆననే= నీ మోములో, కిం న దదృశే= ఇలా చూడనిదంటూ ఏమీ లేదు (కనబడనిదే లేదు).

**తాత్పర్యం:** ఒకచోట అరణ్యము ,ఒకచోట సముద్రము, ఒకవంక ఆకాశము, ఇంకొకచోట పాతాళము. ఒకచోట మనుజులు, ఒకచోట రాక్షసులు, ఒకప్రక్క దేవతలు అప్పుడు నీ మోములో ఇలా యశోద చూడనిదంటూ ఏమీ లేదు (కనబడనిదే లేదు)

**46–8 శ్లో.**
**కలసాంబుధిశాయినం పునః**
**పరవైకుంఠపదాధివాసినమ్ ।**
**స్వపురశ్చ నిజార్భకాత్మకం**
**కతిధా త్వాం న దదర్శ సా ముఖే ॥**

**ప్రతిపదార్థం:** కలశ –అంబుధిశాయినం= ఇటు పాలకడలిపై శయనించినవానిగా, పునః= మరలా, పర= శ్రేష్ఠమయిన (ప్రీణయతి అసౌ సంతోషపెట్టువాడు. బ్రహ్మ ఇతరము భిన్నము తరువాత శ్రేష్ఠము), వైకుంఠపద = వైకుంఠసౌధ(వికుంఠస్య విష్ణోః ఇంద్రస్య వా ఇదం వా విష్ణువు, ఇంద్రుడు వుండు చోటు. స్వర్గము), అధివాసినమ్= నివాసిగ, స్వ = తన, పురః చ = ఎదుట, నిజ–అర్భక –ఆత్మకం = తన కుమారునిగా, త్వాం= నిన్ను, కతిధా= ఎన్ని విధములుగా (కా సంఖ్యాపరిమాణం అస్య), సా= ఆమె, ముఖే= నీ ముఖమునందు, న దదర్శ= చూడలేదు? (ఎన్నో విధములుగా ప్రతి చోట ఆమె నిన్ను దర్శించిందని భావం).

**తాత్పర్యం:** ఇటు పాలకడలిపై శయనించినవానిగా, మరలా శ్రేష్ఠమయిన వైకుంఠసౌధ నివాసిగ, తన ఎదుట తన కుమారునిగా నిన్ను ఎన్ని విధములుగా ఆమె నీ ముఖమునందు చూడలేదు? (ఎన్నో విధములుగా –ప్రతి చోట ఆమె నిన్ను దర్శించిందని భావం)

**46–9 శ్లో.**

**వికసద్భువనే ముఖోదరే**

**నను భూయోఽపి తథావిధాననః ।**

**అనయాస్ఫుటమీక్షితో భవా**

**ననవస్థాం జగతాం బతాతనోత్ ॥**

**ప్రతిపదార్థం:** వికసత్ భువనే= సకల లోకములు ఉన్న, ముఖ ఉదరే = నీ ముఖమును చూపి, నను = నిశ్చయము (ననుదతి ప్రేరయతి ప్రేరేపించునది ప్రశ్నించుట నిశ్చయము), భూయః అపి= మరలా కూడా (అంతలోనే), తథా విధమ్=అదేవిధముగా, ఆననః =శిశువు వలె ఉన్న నీ మోమును, అనయా స్ఫుటమ్ ఈక్షితః= యశోద చక్కగా చూచునట్లు చేసితివి, బత = ఆహా!, జగతాం= విశ్వమందు, అనవస్థాం = ఎల్లెడలా వ్యాపించి ఉన్న తత్వమును(అనవసానతను) (న అవస్థా అవస్థితిః – స్థితి లేకపోవుట), భవాన్= నువ్వు, ఆతనోత్= విస్తరింపచేసితివి.

**తాత్పర్యం:** సకల లోకములు ఉన్న నీ ముఖమును చూపి మరలా అదేవిధముగా శిశువు వలె ఉన్న నీ మోమును యశోద చక్కగా చూచునట్లు చేసితివి. ఆహా! విశ్వమందు ఎల్లెడలా వ్యాపించి ఉన్న నీ తత్వమును నువ్వు విస్తరింపచేసితివి.

**విశేషము:** యశోద కుమారుని మోములో విశ్వమును కుమారుని చూసింది. తాను చూస్తున్న కృష్ణుని ముఖములో మరలా విశ్వమును చూసింది. అద్దాలమేడలో అద్దములో ప్రతి బింబము కనబడుతుంది. ఆ ప్రతి బింబములో మరలా అదే ప్రతిబింబము కనబడుతున్నట్లు – సమస్త విశ్వాన్ని కుమారుని మోమును ఆమె చూసిందని ఇక్కడ పెద్దలు వ్యాఖ్యానించారు.

**46-10 శ్లో.**

**ధృతతత్త్వధియం తదా క్షణం**
**జననీం తాం ప్రణయేన మోహయన్ ।**
**స్తనమంబ దిశేత్యుపాసజన్**
**భగవన్నద్భుతబాల! పాహిమామ్ ॥**

**ప్రతిపదార్థం:** ధియం= మనస్సులో (ధ్యాయంతి చింతయంతి అనయా దీనితో చింతన చేయుదురు. బుద్ధి జ్ఞానము), తత్త్వ = అపూర్వ విశ్వరూపసందర్శనముతో సర్వాత్మభావమును, ధృత = ధరించిన (అవగాహన కలిగిన), తాం జననీం = ఆ తల్లి యశోదకు, తదా= అప్పుడు, క్షణం = క్షణములో, ప్రణయేన = పుత్ర వాత్సల్యమను (ప్రణయః ప్రీతిః ప్రశ్రయః - ప్రణయము ప్రీతి నమ్మకము), మోహయన్ = మోహము కలిగించి (మాయను కప్పి) (ముహ్యాతి తస్య భావః - మోహము. మూర్ఛ, అజ్ఞానము, భ్రాంతి), అంబ= అమ్మా!, స్తనమ్ దిశ = పాలు ఇయ్యవే, ఇతి = అనుచు, ఉపాసజన్ = ఒడిలో చేరిన (కౌగిలించిన), భగవన్= ఓ గురువాయూరు భగవంతుడా!, అద్భుతబాల= అద్భుత బాలుడా! (అకస్మాత్ భాతి అకస్మాత్తుగా ప్రకాశించునది), మామ్= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యం:** మనస్సులో అపూర్వ విశ్వరూపసందర్శనముతో సర్వాత్మభావమును ధరించిన తల్లి యశోదకు అప్పుడు క్షణములో పుత్ర వాత్సల్యమను మోహము కలిగించి (మాయను కప్పి) "అమ్మా ! పాలు ఇయ్యవే!" అనుచు కౌగిలించిన ఓ గురువాయూరు భగవంతుడా ! అద్భుత బాలుడా ! నన్ను రక్షించు

**విశేషాలు:** యశోద కృష్ణుని కేవలము తన కొడుకుగా భావన పెంచుకుంది. ఈ ప్రేమయే భక్తి. తెలియకుండా ప్రేమించినా ఆమె ఈశ్వరునే ప్రేమించింది. ఇటువంటి భక్తికి పర్యవసానము జ్ఞానము. ఇదే విశ్వరూప సందర్శనము.

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

***దశమ స్కంధము***

**46వ దశకము పూర్తి**

# దశకమ్ 47 – ఉలూఖలబన్ధనము

**47–1 శ్లో.**
**ఏకదా దధివిమాథకారిణీం**
**మాతరం సముపసేదివాన్ భవాన్ ।**
**స్తన్యలోలుపతయా నివారయ**
**న్నంకమేత్య పపివాన్ పయోధరౌ ॥**

**ప్రతిపదార్థం:** ఏకదా= ఒకనాడు ( ఏకస్మిన్ కాలే ఒకప్పుడు), దధి విమాథ కారిణీం = యశోద పెరుగు తఱచుచున్న సందర్భంలో, మాతరం = అమ్మ, సముపసేదివాన్= సమీపానికి వెళ్ళి, భవాన్= నువ్వు, స్తన్య లోలుపతయా = పాలు త్రాగవలెననెడి కోరికతో (స్తనే భవమ్ స్తనములో (పుట్టినది) వుండునది. పాలు), నివారయన్ = ఆమె పెరుగు చిలుకు పనిని పట్టియాపి, అంకమ్ ఏత్య = ఆమె ఒడిలోకి చేరి, పయోధరౌ= స్తనములనుండి, పపివాన్= పాలు తాగుచుంటివి.

**తాత్పర్యం:** ఒకనాడు యశోద పెరుగు తఱచుచున్న సందర్భంలో అమ్మ సమీపానికి వెళ్ళి నువ్వు పాలు త్రాగవలెననెడి కోరికతో ఆమె పెరుగు చిలుకు పనిని పట్టియాపి ఆమె ఒడిలోకి చేరి స్తనములనుండి పాలు తాగుచుంటివి.

**47–2 శ్లో.**
**అర్ధపీతకుచకుడ్మలే త్వయి**
**స్నిగ్ధహాసమధురాననాంబుజే ।**
**దుగ్ధమీశ ! దహనేపరిస్రుతం**
**ధర్తుమాశు జననీ జగామ తే ॥**

**ప్రతిపదార్థం:** ఈశ = ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, త్వయి= నువ్వు, కుచకుడ్మలే = మొగ్గలు పోలిన యశోద స్తనముల నుండి(కుచతి సంకుచతి సంకోచము చెందునది.)(అవికసితం పుష్పమ్ వికసించని పువ్వు), అర్ధపీత= సగము పాలు తాగిన తరువాత, స్నిగ్ధ హాస =మంద హాస ( స్నిహ్యతి స్నేహకరోతి అసౌ స్నేహము

చేయువాడు కలిసి వుండునది దట్టమైన), మధుర= మధురమైన(మధు మాధుర్యం అస్తి అస్య–మధుర రసము కల్గినది), ఆనన అంబుజే = నీ ముఖ పద్మమును చూసి, దహనే = వంట ఇంటిలో పొయ్యిపై పెట్టిన కాగుచున్న(దహతి అసౌ కాల్చునది. అగ్ని), దుగ్ధమ్= పాలు, పరిస్రుతం= కారుతున్నట్లు (పొంగుచున్నట్లు) అనిపించి, ధర్తుమ్= ఆ పాలు దించి రావలెనని, ఆశు= వేగముగా, తే జననీ= నీ తల్లి యశోద నిన్ను వదిలి, జగామ= వెళ్ళెను.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! నువ్వు మొగ్గలు పోలిన యశోద స్తనముల నుండి సగము పాలు తాగిన తరువాత మందహాస మధురమైన నీ ముఖ పద్మమును చూసి – వంట ఇంటిలో పొయ్యిపై పెట్టిన కాగుచున్న పాలు పొంగుచున్నట్లు అనిపించి ఆ పాలు దించి రావలెనని వేగముగా నీ తల్లి యశోద నిన్ను వదిలి వెళ్ళెను

**47–3 శ్లో.**
**సామిపీతరసభంగసంగత**
**క్రోధభారపరిభూతచేతసా ।**
**మంథదండముపగృహ్య పాటితం**
**హంత దేవ! దధిభాజనం త్వయా ॥**

**ప్రతిపదార్థం:** దేవ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, సామి పీత= సగము త్రాగినందువలన(సాము+ఇన్, అర్థమ్ సగము, అర్ధము), రస = స్తన్యము యొక్క (రస్యతే ఆస్వాద్యతే ఆస్వాదింపబడునది. రసము), భంగ= విచ్ఛేదము చేత (భంజ్+ఘఞ్, భజ్యతే భంగము పరాజయము), సంగత= ప్రాప్తించిన (సంగతః మిలితః ఏకత్రితః – కలుపబడినది ఒక చోట కూర్చబడినది), క్రోధ భార = కోప భారము వలన, పరిభూత = ఆవేశితమైన(ప్రభావితమైన)( పరిభూతః తిరస్కృతః అనాదృతః – తిరస్కరించబడినది అవమానింపబడినది), చేతసా= మనస్సుతో, మంథ దండమ్= మజ్జిగచిలుకు కవ్వమును(మథ్యతే అనేన – దీనితో చిలుకుదురు. మంథన దండము, కవ్వము), ఉపగృహ్య= గ్రహించి, త్వయా= నీ చేత, దధి భాజనం= పెరుగు కడవ (భాజ్యతే అనేన – విభజించుట పాత్ర), పాటితం=

పగులగొట్టబడినది, హంత= అయ్యో !

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణదేవా! సగము పాలు త్రాగినందువలన స్తన్యము యొక్క విచ్ఛేదము చేత కోపముతో ప్రభావితమైన మనస్సుతో (కోపము నటించి) మజ్జిగచిలుకు కవ్వమును గ్రహించి నీ చేత పెరుగు కడవ పగులగొట్టబడినది. అయ్యో !

**47-4 శ్లో.**
**ఉచ్చలద్ధ్వనితముచ్చకైస్తదా**
**సంనిశమ్య జననీ సమాద్రుతా ।**
**త్వద్యశో విసరవద్దదర్శ సా**
**సద్య ఏవ దధి విస్తృతం క్షితౌ ॥**

**ప్రతిపదార్థం:** తదా =అప్పుడు, ఉచ్చకైః= ఆ ఘటమును పగులకొట్టగా అధికముగా (ఉచ్చైః ఉత్తుంగః ఉచ్చస్థానే భవః – ఎత్తైనది ఎత్తు, ఉన్నత స్థానములో వున్నది), ఉచ్చలత్= వ్యాపించిన (పైకెగిరిన), ధ్వనితమ్= ధ్వనిని, సంనిశమ్య = విన్న, జననీ= నీ తల్లి యశోద, సద్య ఏవ = వెంటనే, సమాద్రుతా= పరుగిడుతూ వచ్చి, క్షితౌ = భూమిలో, విస్తృతం = ఆవరించిన, త్వత్ యశః= నీకీర్తి, విసరః= వ్యాప్తి (విసరతి విస్తారము, సమూహము), వత్= వలె ఉన్న, దధి =ఆ ఒలికిన పెరుగును, సా= ఆమె, దదర్శ= చూసెను.

**తాత్పర్యం:** అప్పుడు ఆ ఘటమును పగులకొట్టగా అధికముగా వ్యాపించిన ధ్వనిని విన్న నీ తల్లి యశోద వెంటనే పరుగిడుతూ వచ్చి భూమిలో అంతటా ఆవరించిన నీకీర్తి సమూహము వలె ఉన్న ఆ ఒలికిన పెరుగును ఆమె చూసెను.

**47-5 శ్లో.**
**వేదమార్గపరిమార్గితం రుషా**
**త్వామవీక్ష్య పరిమార్గయంత్యసౌ ।**
**సందదర్శ సుకృతిన్యులూఖలే**
**దీయమాననవనీతమోతవే ॥**

**ప్రతిపదార్థం:** అసౌ= యశోదాదేవి, వేదమార్గ= మునుల చేత వేద మార్గములో (విద్యతే అనాది కాలాత్ అనాదికాలం నుండి వుండునది. వేదము), పరిమార్గితం= చూడవలసిన (అన్వేషితం యాచితం వా వెతకబడినది యాచింపబడినది), త్వామ్= నిన్ను, రుషా = రోషముతో ( భక్తితో కాక) (రుష్యతి తస్య భావః కర్మ వా కోపము), అవీక్ష్య =చూడలేక, పరిమార్గయంతీ= అన్వేషించెను, సుకృతినీ = ఆ పుణ్యాత్మురాలు యశోద(సుకృతం అనయా సుకృతం అస్తి) ఈమెచే మంచి చేయబడినది, ఉలూఖలే = ఒక రోలిపై కూర్చుని (ఊర్ధ్వ ఖం తత్ లాతి గృహ్ణాతి ముఖం ఆకాశమువైపు వున్నది. రోలు), ఓతవే=ఇంటిలో తిరుగు పిల్లికి (అవతి గృహం మూషికేభ్యః ఎలుకలనుండి ఇంటిని రక్షించునది. పిల్లి), నవనీతమ్ దీయమాన= వెన్న తినిపించుచున్న నిన్ను (నవం నీయతే కొత్తగా తీయబడినది. వెన్న), సందదర్శ = చూసెను(సమ్యక్ చాక్షుషతయా దదర్శ).

**తాత్పర్యం:** యశోదాదేవి మునుల చేత వేద మార్గములో చూడ వలసిన నిన్ను రోషముతో చూడలేక అన్వేషించెను . చివరకు ఆ పుణ్యాత్మురాలు యశోద ఒక రోలిపై కూర్చుని ఇంటిలో తిరుగు పిల్లికి వెన్న తినిపించుచున్న నిన్ను చూసెను.

**47-6 శ్లో.**

**త్వాం ప్రగృహ్య బత భీతి భావనా**
**భాసురాననసరోజమాశు సా ।**
**రోషరూషితముఖీ సఖీపురో**
**బంధనాయ రశనాముపాదదే ॥**

**ప్రతిపదార్థం:** భీతి భావనా = భయపడుతున్నట్లు (భావయతి చింతయతి తస్య భావః ఆలోచన), భాసుర = నటిస్తున్న, ప్రకాశిస్తున్న (భాసతే ప్రకాశతే, భాసితుం శీలం అస్య – ప్రకాశించునటువంటిది), ఆనన సరోజమ్ = ముఖ పద్మము కలిగిన (అనితి అనేన – శ్వాస పీల్చునది. ముఖము), త్వాం= నిన్ను, ప్రగృహ్య= బంధించి, ఆశు= వెంటనే, సఖీపురః = స్నేహితురాళ్ల ముందు (సహ సమానః ఖ్యాయతే సమానంగా చెప్పబడునది. స్నేహితురాలు), సా = ఆమె, రోష రూషిత ముఖీ= నిన్ను పట్టుకొనలేకపోయానని వారు నవ్వుదురని రోషపడిన మోముతో(రూషితః

ధూళ్యాదినా మలినీకృతః – దుమ్ము మొదలగువాటిచే మలినం చేయబడినది), బంధనాయ = నిన్ను కట్టివేయుటకు, రశనామ్= త్రాడు (అశ్నుతే వ్యాప్నోతి జనానాం కటిభాగమ్ జనుల కటిభాగమున ధరించబడునది. వడ్డాణము కళ్లెము, మొలత్రాడు), ఉపాదదే= చేతిలో పట్టుకొంది, బత=ఆశ్చర్యము ( ఖేదే, సంబోధనే, ఆశ్చర్యే, నిందాయామ్ ఖేదము, సంబోధనము, ఆశ్చర్యము, నిందల యందు వాడబడును).

**తాత్పర్యం:** భయపడుతున్నట్లు నటిస్తున్న ప్రకాశిస్తున్న ముఖ పద్మము కలిగిన నిన్ను బంధించి స్నేహితురాళ్ల ముందు నిన్ను పట్టుకొనలేకపోయానని వారు నవ్వుదురని రోషపడి నిన్ను కట్టివేయుటకు త్రాడు చేతిలో పట్టుకొంది.

**47–7 శ్లో.**

**బంధుమిచ్ఛతి యమేవ సజ్జన**
**స్తం భవంతమయి! బంధుమిచ్ఛతీ ।**
**సా నియుజ్య రశనాగుణాన్ బహూన్**
**ద్వ్యంగులోనమఖిలం కిలైక్షత ॥**

**ప్రతిపదార్థం:** అయి = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, యమ్ సజ్జనః= ఏ సజ్జనులు (మహాయోగులు) (సత్ ప్రశస్తః జనః మంచివాడు, సజ్జనుడు), బంధుమ్ ఇచ్ఛతి ఏవ = మోక్షమును అనుగ్రహించుబంధువని భావించుచుందురో, శరణము కోరుకొందురో (బధ్నాతి మనః స్నేహాదినా స్నేహాదులచే మనస్సును బంధించు వాడు. బంధువు), తం భవంతమ్= అటువంటి నిన్ను, బంధుమ్ = బంధింప (బధ్యతే అస్మిన్), ఇచ్ఛతీ = ఇష్టపడినదై, సా= ఆ యశోద, బహూన్=అనేకమయిన, రశనా గుణాన్ = ఇంటిలో ఉన్న త్రాళ్ళన్నియు తెచ్చి, నియుజ్య= నీ శరీరమునందు నిక్షేపించగా(నీ బొజ్జ చుట్టూ చుట్టగా), అఖిలం=మొత్తము పొడవునకు, ద్వి అంగుళ ఊనమ్ = రెండంగుళములు తక్కువగా(అడుగులో 12 వవంతు అంగుళము)( ఊనః హీనః – తక్కువ అసంపూర్ణము), ఐక్షత కిల = చూసెను కదా!

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఏ సజ్జనులు (మహాయోగులు) మోక్షమును అనుగ్రహించుబంధువని భావించుచుందురో, శరణము కోరుకొందురో అటువంటి నిన్ను బంధింప ఇష్టపడినదై ఆ యశోద ఇంటిలో ఉన్న త్రాళ్ళన్నియు తెచ్చి నీ బొజ్జ చుట్టూ చుట్టగా ఎంత చుట్టినా మొత్తము పొడవునకు రెండంగుళములు తక్కువగుటను చూసెను కదా!

**47-8 శ్లో.**

**విస్మితోత్స్మిత సఖీజనేక్షితాం**
**స్విన్నసన్నవపుషం నిరీక్ష్యతామ్ ।**
**నిత్యముక్తవపురప్యహో! హరే!**
**బంధమేవ కృపయాన్వమన్యథాః ॥**

**ప్రతిపదార్థం:** హరే= ఓ గురువాయూరు కృష్ణా!, విస్మిత= ఎంత చుట్టినా మొత్తము పొడవునకు రెండంగుళములు తక్కువగుటను చూసి ఆశ్చర్యపడి (జాత విస్మయః ఆశ్చర్యము కల్గిన), ఉత్స్మిత = చిరునవ్వుతో, సఖీజన= స్నేహితురాళ్ళయిన గోప వనితలు, ఈక్షితాం = నిన్ను చూచుచుండిరి, స్విన్నమ్= చెమటతో తడిసి (జాత స్వేదః - చెమట కల్గిన), సన్న = కష్టపడిన(సీదతి నిషీదతి అవసన్న దుఃఖితః), వపుషం = శరీరము కలిగిన, తామ్= మీఅమ్మ యశోదను, నిరీక్ష్య= చూసి, నిత్య ముక్త వపుః అపి = ఏబంధములు అంటని పర బ్రహ్మ శరీరమును కలిగినప్పటికి (నిత్యం ముక్తః నిత్యముక్తుడు), కృపయా=దయతో, బంధమ్ ఏవ= నీవు ఆమె బంధమునకు, అన్వమన్యథాః= అంగీకరించి లోబడితివి, అహో = ఆహా ! నీ దయ ఇట్టిదని చెప్పనలవి కాదు.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు కృష్ణా! ఎంత చుట్టినా మొత్తము పొడవునకు రెండంగుళములు తక్కువగుటను చూసి ఆశ్చర్యపడి చిరునవ్వుతో స్నేహితురాళ్ళయిన గోప వనితలు నిన్ను చూచుచుండిరి. చెమటతో తడిసి కష్టపడిన శరీరము కలిగిన మీఅమ్మ యశోదను చూసి ఏబంధములు అంటని పర బ్రహ్మ శరీరమును కలిగినప్పటికి దయతో నీవు ఆమె బంధమునకు అంగీకరించి లోబడితివి. ఆహా! నీ దయ ఇట్టిదని చెప్పనలవి కాదు.

**విశేషాలు**

**నిత్య ముక్తుడు:** ముక్తి అనగా మోక్షమని అర్థం. Freedom. సంసార బంధంలో నుంచి బయటపడటం. అలా పడ్డవాడు ముక్తుడు. ఇది శరీరముండగానే జరిగితే జీవన్ముక్తి. పోయిన తరువాతనైతే విదేహముక్తి. కృష్ణస్వామికి ఇవేమీ లేవు కనుక అయన ఎప్పుడూ నిత్య ముక్తుడు.

**47-9 శ్లో.**
**స్థీయతాం చిరములూఖలే ఖలే**
**త్యాగతా భవనమేవ సా యదా ।**
**ప్రాగులూఖలబిలాంతరే తదా**
**సర్పిరర్పితమదన్నవాస్థిథాః ॥**

**ప్రతిపదార్థం:** ఖల= అల్లరివాడా! (ఖల= స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు మూర్ఖుడు), చిరమ్= ఎంతసమయమయినా, ఉలూఖలే=ఈరోలుదగ్గరే, స్థీయతాం= బంధితునిగా ఉండు, ఇతి= అని పలికి, సా= ఆ యశోద, భవనమ్ ఏవ ఆగతా= గృహములోనికి వెళ్ళెను, యదా ప్రాక్ = పూర్వము ఎప్పుడో, ఉలూఖల బిల అంతరే = రోటి రంధ్రములో, అర్పితమ్ =దాచుకొన్న, సర్పిః = వెన్నను, అదన్= తీసుకొని తినుచు, తదా= అప్పుడు, అవాస్థిథాః= ఉన్నావు.

**తాత్పర్యం:** అల్లరివాడా! "ఎంతసమయమయినా ఈరోలుదగ్గరే బంధితునిగా ఉండు" అని పలికి కృష్ణుని రోటికి బంధించి ఆ యశోద గృహములోనికి వెళ్ళెను. అప్పుడు పూర్వము ఎప్పుడో రోటి రంధ్రములో దాచుకొన్న వెన్నను తీసుకొని కృష్ణుడు తిన్నాడు.

**47-10 శ్లో.**
**యద్యపాశసుగమో విభో భవాన్!**
**సంయతః కిము సపాశయానయా ।**
**ఏవమాది దివిజైరభిష్టుతో**
**వాతనాథ పరిపాహిమాం గదాత్ ॥**

**ప్రతిపదార్థం:** విభో=ప్రభూ!, వాతనాథ= గురువాయూరు కృష్ణా!, అపాశమ్ = అపగత విషయశ్రద్ధలు కలిగినవారికి (విషయపాశముక్తులయినవారికి), సుగమః యది = సుఖంగా నువ్వు లభించెడివాడివయినప్పటికి, భవాన్ = నువ్వు, సపాశయా= పాశ సహితుడవై (పశ్యతే బధ్యతే అనేన – దీనితో బంధింతురు. త్రాడు పాశము), అనయా= ఈ యశోదా మాతకు, కిము = ఎట్లు, సంయతః= కట్టుబడితివి (అవరుద్ధః వశీకృతః నిబద్ధః ఉద్యతః – ఆపబడినది వశపరచుకొనబడినది బంధింపబడినది), ఏవమ్ ఆది= ఈ విధముగా, దివిజైః =దేవతలచే (దివి స్వర్గే జాయతే స్వర్గమునందు పుట్టునది. దేవత), అభిష్టుతః= కీర్తించబడిన నువ్వు, మాం= నన్ను, గదాత్ = వ్యాధినుండి, పరిపాహి=రక్షించు.

**తాత్పర్యం:** ప్రభూ! "విషయపాశముక్తులయినవారికి సుఖంగా నువ్వు లభించెడి వాడివయినప్పటికి నువ్వు పాశ సహితుడవై ఈ యశోదా మాతకు ఎట్లు కట్టుబడితివి?" ఈ విధముగా దేవతలచే కీర్తించబడిన నువ్వు నన్ను వ్యాధినుండి రక్షించు.

**విశేషాలు**

**పాశములు**

**చతుర్విధ పాశములు :** 1. మలము, 2. కర్మ, 3. మాయ, 4. రోధశక్తి.

**పంచ–పాశములు :** 1. మలపాశము, 2. మాయాపాశము, 3. కర్మపాశము, 4. బిందుపాశము, 5. తిరోధానపాశము.

**సప్త–పాశములు :** 1. కాలపాశము, 2. కర్మపాశము, 3. ధర్మపాశము, 4. బ్రహ్మపాశము, 5. మోహపాశము, 6. ఆశాపాశము, 7. జన్మపాశము.

**అష్ట–పాశములు :** 1. దయ, 2. శంక, 3. భయము, 4. లజ్జ, 5. జుగుప్స, 6. కులము, 7. శీలము, 8. జాతి.

1. పశుపాశము, 2. భవపాశము, 3. బంధపాశము, 4. మోహపాశము, 5. ఆశాపాశము, 6. కర్మపాశము, 7. దుఃఖపాశము, 8. క్లేశపాశము

రెండు అంగుళముల తాడు తక్కువ అవడం అంటే ఏమిటి? భగవంతుని పూజ చేసేటప్పుడు మనం ఎందుకు పూజ చేస్తున్నామో మరిచిపోవాలి. నా స్వామికి యిది చేయకుండా నేను ఎలా ఉండగలను? అనే భావన పెరగాలి. అపుడు మీరు చేసిన పూజకు కోరిక ఉండదు. ఒక ప్రయోజనమును ఆశించి చేస్తున్నాను, నేను ఈ పూజను చేస్తున్నాను అను ఈ రెండు భావనలను మరిచిపోతారు. అదీ విచిత్రం. అపుడు పూజలో తాదాత్మ్య స్థితికి వెళ్ళిపోతారు. ఈ రెండు భావనలను మరచి పోవడమే తాడు రెండు అంగుళములు తక్కువ అవుతున్నదనే విషయమును మరిచిపోవడం. అలా ఎలా తక్కువవుతున్నదాని తెలియక పోవడం. ఇటువంటి తాదాత్మ్యానికి ఈశ్వరుడు పొంగిపోతాడు. కేవలము భక్తి చేత పరమాత్మ వశుడు అవుతాడు.

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

***దశమ స్కంధము***

**47వ దశకము పూర్తి**

# దశకమ్ 48 – నలకూబర–మణిగ్రీవ శాపమోక్షము

**48–1 శ్లో.**

**ముదా సురౌఘైస్త్వముదారసమ్మదై**
**రుదీర్య దామోదర ఇత్యభిష్టుతః ।**
**మృదూదరః స్వైరములూఖలే లగ**
**న్నదూరతో ద్వౌ కకుభావుదైక్షథాః ॥**

**ప్రతిపదార్థం:** ఉదార సమ్మదైః = అధికమయిన సంతోషములతో (ఉత్కృష్టం ఆసమంతాత్ వా రాతి దదాతి ఉదారగుణము దానమిచ్చువాడు. దాత సరళ స్వభావుడు), సురౌఘైః= దేవతా బృందములు(సుష్ఠు రాతి దదాతి అభీష్టమ్ కోరికను నెరవేర్చువాడు. దేవత), త్వమ్= నిన్ను, దామ–ఉదర= త్రాడు(దామము) ఉదరమందు కట్టబడుటచే దామోదరుడు, ఇతి= అని, ఉదీర్య = పలికి, ముదా= ఆనందభరితులై, అభిష్టుతః= కీర్తించగా, మృదు ఉదరః = నీ మృదువైన ఉదరము ఒత్తుకొనగా(మృద్యతే మర్దితుం శక్యతే నలుచుటకు వీలైనది కోమలమైనది), స్వైరమ్= స్వేచ్ఛగా (స్వస్య ఈరం స్వేర స్వాతంత్ర్యేణ ఈర్తే స్వతంత్రంగా ప్రవర్తించువాడు), ఉలూఖలే=రోటికి, లగన్= లగ్నుడవై (అనగా రోటిని ఈడ్చుకొనుచు), అదూరతః = కొంతదూరములో, ద్వౌ కకుభౌ= రెండు మద్దిచెట్లను (అర్జున వృక్షములను) (అర్జయతి ఆరోగ్యం అనేన – ఆరోగ్యము నిచ్చునది. అర్జున వృక్షము), ఉదైక్షథాః= చూచితివి.

**తాత్పర్యం:** అధికమయిన సంతోషములతో దేవతా బృందములు నిన్ను త్రాడు(దామము) ఉదరమందు కట్టబడుటచే దామోదరుడు అని కీర్తించగా నీ మృదువైన ఉదరము ఒత్తుకొనగా స్వేచ్ఛగా రోటిని ఈడ్చుకొనుచు కొంత దూరములో రెండు మద్దిచెట్లను (అర్జున వృక్షములను) చూచితివి.

**విశేషాలు**

**దామోదరుడు:** దామ+ఉదర, దమాది సాధనోదారా ఉత్కృష్టా మతిర్యా, తయా

గమ్యతే జ్ఞాయతే అసౌ శమ దమాది సాధనముల ద్వారా తెలుసుకొనబడువాడు. దామోదరుడు.

దామ+ఉదర, దామ రజ్జు చిహ్నం ఉదరే యస్య పొట్టపై తాటి గురుతు గలవాడు.

దామాని లోకాని ఉదరే యస్య అన్ని లోకములు కడుపులో కలవాడు. దామోదరుడు.

**48-2 శ్లో.**

**కుబేరసూనుర్నలకూబరాభిధః**
**పరో మణిగ్రీవ ఇతి ప్రథాం గతః ।**
**మహేశసేవాధిగతశ్రియోన్మదౌ**
**చిరం కిల త్వద్విముఖావఖేలతామ్ ॥**

**ప్రతిపదార్థం:** కుబేర సూనుః= కుబేరుని కుమారుడు (కుంబతి రక్షతి ధనమ్ ధనమును రక్షించువాడు.కుబేరుడు)(సూయతే ప్రసూయతే కనబడ్డవాడు పుట్టినవాడు. కొడుకు), నలకూబర అభిధః= నలకూబరుడు అను పేరు కలవాడు (నలకూబరః యుగంధరః అస్య - నలమే కాడిగా గలవాడు. కుబేరుని కుమారుడు.) (అభిధీయతే అనేన-పేరు), పరః = రెండవవాడు, మణిగ్రీవ =మణిగ్రీవుడు (కుబేరుని కొడుకులలో ఒకడు, నారదుని శిష్యుడైన గంధర్వకుమారుడు), ఇతి=అని, ప్రథాం గతః= ప్రసిద్ధిని పొందినవారు. (ప్రథతే ప్రసిద్ధో భవతి తస్య భావః - ఖ్యాతి ప్రసిద్ధి), మహేశ = పరమశివుని, సేవా = సేవచే, అధిగత= పొందిన (అధి అధికం గతం జ్ఞాతం ప్రాప్తం వా తెలుసుకొనబడ్డది పొందబడ్డది స్వీకరించబడ్డది), శ్రియ = సకల ఐశ్వర్యముల, ఉన్మదౌ= ధనమదమంది, చిరం= చాలాకాలము, త్వత్ విముఖౌ= నీయెడల నిర్లక్ష్యముతో(విరుద్ధం అననుకూలం ముఖం యస్య విరుద్ధంగా ముఖం గలవాడు ముఖము తిప్పినవాడు), అవఖేలతామ్ కిల= విహరించిరికదా!

**తాత్పర్యం:** కుబేరుని కుమారుడు నలకూబరుడు అను పేరు కలవాడు. రెండవవాడు మణిగ్రీవుడు అని ప్రసిద్ధిని పొందినవారు. పరమశివుని సేవచే పొందిన సకల

ఐశ్వర్యముల ధనమదమంది చాలాకాలము నీయెడల (విష్ణువు యెడల) నిర్లక్ష్యముతో విహరించిరి కదా !

**48-3 శ్లో.**

**సురాపగాయాం కిల తౌ మదోత్కటౌ**
**సురాపగాయద్బహుయౌవతావృతౌ ।**
**వివాససౌ కేళిపరౌ స నారదో**
**భవత్పదైకప్రవణో నిరైక్షత ॥**

**ప్రతిపదార్థం:** సుర —ఆపగాయాం= గంగలో (అపాం సమూహః ఆపః, తేన గచ్ఛతి తం వహతి వా జలసమూహముతో వెళ్లునది, ప్రవహించునది. నది), తౌ= వారిద్దరూ, మద ఉత్కటౌ= మదముచే మత్తులై (మద=మాదయతి మాద్యతి అనేన – దీనితో ఆనందింతురు, మత్తును పొందుదురు), సురాపేన = మద్యము తాగుచూ (సురా= సూయతే ఇక్షు–కదంబ ఫలాదిభ్యః చెరుకు–కదంబ ఫలముల నుండి తీయబడినది. మద్యము.)(సురాప=సురాం పిబతి మద్యమును త్రాగువాడు), గాయత= పాడుచూ, బహు= అనేకమంది, యౌవత ఆవృతౌ= యువతీసమూహములతో కూడుకొని (యువతీనాం సమూహః యువతుల సమూహము), వివాససౌ= వివస్త్రులై, కేళిపరౌ = జలక్రీడలాడుచుండగా, భవత్ పద ఏక ప్రవణః = ఎల్లవేళల నీపాదములనే నమ్మికొన్న(ప్రవతే అత్ర వంగినది), స నారదః = ఆ నారద మహర్షి, నిరైక్షత కిల = వారిద్దరిని చూచెను కదా!

**తాత్పర్యం:** గంగలో వారిద్దరూ మదముచే మత్తులై మద్యము తాగుచూ పాడుచూ అనేకమంది యువతీసమూహములతో కూడుకొని వివస్త్రులై జలక్రీడలాడుచుండగా ఎల్లవేళల నీపాదములనే నమ్మికొన్న ఆ నారద మహర్షి వారిద్దరిని చూచెను కదా!

**48-4 శ్లో.**

**భియా ప్రియా లోకముపాత్తవాససం**
**పురో నిరీక్ష్యాపి మదాంధచేతసౌ ।**
**ఇమౌ భవద్భృత్యపశాంతిసిద్ధయే**
**మునిర్జగౌ శాంతిమృతే కుతస్సుఖమ్ ॥**

**ప్రతిపదార్థం:** ప్రియాలోకమ్= నారదుడు వచ్చిన సమయములో నదిలో క్రీడలాడు ఆడువారు(ప్రీణాతి సంతోషపెట్టునది. భార్య ప్రియురాలు), భియా= శాప భయముతో, ఉపాత్తవాససం= గట్టెక్కి వస్త్రములు కట్టుకొనుటను (ఉప ఆదత్తః గృహీతః – పొందబడినది తీసుకొనబడినది), పురః = తమ కళ్ల ముందు, నిరీక్ష్య అపి = చూసినప్పటికి, ఇమౌ మద అంధ చేతసౌ= ఈ మదాంధులైన చిత్తము కలిగిన ఆ అన్నదమ్ములు ఆ విధంగా దిగంబరులయి ఉండుట చూచి, భవత్ భక్తి = నీయందు వారికి విష్ణుభక్తియు, ఉపశాన్తి= శాంతి (పాపకార్యముల నుండి మనస్సును నిగ్రహించు శాంతి)(శామ్యతి తస్య భావః కర్మ వా శాంతి చిత్తోపశమనము ఇంద్రియ నిగ్రహము), సిద్ధయే = కలుగుటకై, మునిః = నారద మహర్షి, జగౌ= వారిని శపించెను, శాంతిమ్ ఋతే = శాంతిలేనిచో, సుఖమ్= సుఖము (మోక్షము)(సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), కుతః= ఎట్లు లభించును?

**తాత్పర్యం:** నారదుడు వచ్చిన సమయములో నదిలో క్రీడలాడు ఆడువారు శాప భయముతో గట్టెక్కి వస్త్రములు కట్టుకొనుటను తమ ముందు చూసినప్పటికి ఈ మదముతో కళ్ళు కనబడని చిత్తము కలిగిన ఆ అన్నదమ్ములు ఆ విధంగా దిగంబరులయి ఉండుట చూచి నీయందు వారికి విష్ణుభక్తియు, శాంతి (పాపకార్యముల నుండి మనస్సును నిగ్రహించు శాంతి) కలుగుటకై నారద మహర్షి శపించెను. శాంతిలేనిచో సుఖము (మోక్షము) ఎట్లు లభించును?

**48–5 శ్లో.**

**యువామవాప్తౌ కకుభాత్మతాం చిరం**
**హరిం నిరీక్ష్యాథ పదం స్వమాప్నుతమ్ ।**
**ఇతీరితౌ తౌ భవదీక్షణస్పృహాం**
**గతౌ వ్రజాంతే కకుభౌ బభూవతుః ॥**

**ప్రతిపదార్థం:** యువామ్= మీరిద్దరూ, కకుభ ఆత్మతాం= మద్దిచెట్లు రూపమును, అవాప్తౌ = పొంది, చిరం= చాలా కాలము తరువాత, హరిం= శ్రీ హరిని, నిరీక్ష్య= దర్శించి, అథ =అటుపిమ్మట శాపవిముక్తి పొంది, స్వమ్ పదం= మీ

స్థానమునకు(కుబేరాంతికము), అప్లుతమ్= వత్తురుగాక!, ఇతిఈరితౌ= అను నారదుని శాపము చెప్పబడి, తౌ= ఆ యక్షులు, వ్రజ అంతే గతౌ = గోకుల సమీపమున, భవత్ ఈక్షణస్పృహం= నీ రాక కొరకు ఎదురుచూస్తూ(స్పృహయతి తస్య భావః కర్మ వా కోరబడునది. కోరిక), కకుభౌ బభూవతుః= ఈ రేపల్లెలో మద్దిచెట్లై ఉన్నారు.

**తాత్పర్యం:** ‘‘మీరిద్దరూ మద్దిచెట్లు రూపమును పొంది చాలా కాలము తరువాత శ్రీ హరిని దర్శించి అటుపిమ్మట శాపవిముక్తి పొంది మీ స్థానమునకు (కుబేరాంతికము) వత్తురుగాక!’’ అను నారదుని శాపముచే ఆ యక్షులు, నీ రాక కొరకు ఎదురుచూస్తూ గోకుల సమీపమున మద్దిచెట్లై ఉన్నారు.

**48-6 శ్లో.**

**అతంద్రమింద్రద్రుయుగం తథావిధం**
**సమేయుషా మంథరగామినా త్వయా।**
**తిరాయితోలూఖలరోధనిర్ధుతౌ**
**చిరాయ జీర్ణౌ పరిపాతితౌ తరూ ॥**

**ప్రతిపదార్థం:** అతంద్రమ్= నీవు అలసట లేనివాడివై (న తంద్రా యస్య – అలసట లేనివాడు. జాగరూకుడు), మంథర గామినా =మందగమనముతో, తథా విధం =అట్లు ఆరోలును లాక్కొంటూ, తోసుకొంటూ, ఇంద్ర ద్రు యుగం = ఆ మద్దిచెట్లును, త్వయా= నువ్వు, సమేయుషా =సమీపించితివి, తిరాయిత= చెట్ల నడుమ అడ్డము పడిన, ఉలూఖల= కదలని ఆరోలును బలముగా నువ్వు లాగగా, రోధనిర్ధుతౌ = బాగా ఊపబడిన మూలములు కలవై (రుణద్ధి యేన – దీనితో ఆపబడును.) (నిశ్శేషేణ ధూతః కంపితః ఖండితో వా బాగా ఊపబడినది కంపించబడినది), చిరాయ = చాలాకాలము అక్కడే ఉన్న, తరూ= చెట్లు, జీర్ణౌ= విరిగి, పరిపాతితౌ=పడిపోయినవి.

**తాత్పర్యం:** నీవు అలసట లేనివాడివై మందగమనముతో మెల్లగా రోలును అట్లు ఆరోలును లాక్కొంటూ, తోసుకొంటూ ఆ మద్దిచెట్లును నువ్వు సమీపించితివి. చెట్ల

నడుమ అడ్డము పడి కదలని ఆరోలును బలముగా నువ్వు లాగగా బాగా ఊపబడిన మూలములు కలవై చాలాకాలము అక్కడే ఉన్న మద్దిచెట్లు విరిగి పడిపోయినవి.

**48–7 శ్లో.**

**అభాజి శాఖిద్వితయం యదా త్వయా**
**తదైవ తద్గర్భతలాన్నిరేయుషా ।**
**మహాత్విషా యక్షయుగేన తత్ క్షణా**
**దభాజి గోవింద! భవానపి స్తవైః ॥**

**ప్రతిపదార్థం:** గోవింద= గోవిందుడా! , యదా= ఎప్పుడైతే, త్వయా = నీ చేత, శాఖిద్వితయం= ఆ రెండు మద్దిచెట్లు (శాఖా అస్తి అస్య – శాఖలు కలది. వృక్షము), అభాజి = విరువబడగా, తదా ఏవ= అప్పుడే, తత్ గర్భతలాత్ = చెట్ల తొఱ్ఱలలో నుండి, నిరేయుషా= బయటికి వచ్చిన, మహాత్విషా= మహాప్రకాశములతో (త్విషా= (త్వేషతే అసౌ ప్రకాశించునది ప్రకాశము), యక్షయుగేన= శాపవిమోచనులై బయటకు వచ్చిన ఇరువురు యక్షులు, తత్ క్షణాత్= తత్క్షణమే, భవాన్ అపి = నిన్ను, స్తవైః= స్తోత్రములతో, అభాజి= సేవించిరి(స్తుతించిరి).

**తాత్పర్యం:** గోవిందుడా! ఎప్పుడైతే నీ చేత ఆ రెండు మద్ది చెట్లు విరువబడగా అప్పుడే చెట్ల తొఱ్ఱలలో నుండి బయటికి వచ్చిన ప్రకాశించుచున్న శాపవిమోచనులై బయటకు వచ్చిన ఇరువురు యక్షులు తత్క్షణమే నిన్ను స్తోత్రములతో సేవించిరి. (స్తుతించిరి)

**48–8 శ్లో.**

**ఇహాన్యభక్తోఽపి సమేష్యతి క్రమాత్**
**భవంతమేతౌ ఖలు రుద్రసేవకౌ ।**
**మునిప్రసాదాత్ భవదంఘ్రిమాగతౌ**
**గతౌ వృణానౌ ఖలు భక్తిముత్తమామ్ ॥**

**ప్రతిపదార్థం:** ఇహ= ఈ లోకమున, అన్య– భక్తః అపి = ఇతర దేవతల భక్తులు కూడా, క్రమాత్ =అధికార క్రమముగా, భవంతమ్= శుద్ధ సత్వ మూర్తివైన నిన్ను,

సమేష్యతి ఖలు= చేరుదురు కదా, ఏతౌ= కుబేరుని పుత్రులు, రుద్రసేవకౌ= శివభక్తులు అయినప్పటికి (రోదితి, రోదయతి ఏడ్చువాడు, ఏడిపించువాడు), మునిప్రసాదాత్= నారదముని అనుగ్రహముతో, భవత్ అంఘ్రిమ్= నీ పాదములను, ఆగతౌ= శరణుకోరి ఆశ్రయించిరి, ఉత్తమామ్ భక్తిమ్ =ఉత్తమ ప్రేమ లక్షణమయిన భక్తిని (అనన్య ముక్తి వైభవమును) ( భజ్యతేసేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ), గతౌ= పొంది, వృణానౌ ఖలు =నిన్ను స్తుతించారుకదా.

**తాత్పర్యం:** ఈ లోకమున ఇతర దేవతల భక్తులు కూడా అధికార క్రమముగా శుద్ధ సత్వ మూర్తివైన నిన్ను చేరుదురు కదా . కుబేరుని పుత్రులు శివభక్తులు అయినప్పటికి నారదముని అనుగ్రహముతో నీ పాదములను శరణుకోరి ఆశ్రయించిరి. ఉత్తమ ప్రేమ లక్షణమయిన భక్తిని (అనన్య ముక్తి వైభవమును ) పొంది నిన్ను స్తుతించారు.

**విశేషాలు**

**భక్తి:** భక్తి అంటే భగవంతుని భజించటమని అర్థం. భజించటం అంటే అంటి పట్టుకోవటం. విభజించటానికి ఇది వ్యతిరేకం. భగవంతుని నుండి దూరమై పోవటం. విభజన. దగ్గర పడటం భజన. ఈ భజన చేసేవాడు భక్తుడు. అతడు సగుణ భక్తుడు కావచ్చు. నిర్గుణ భక్తుడు కావచ్చు. సగుణమైతే భగవంతుని తనకు అన్యంగా భావిస్తాడు. నిర్గుణమైతే తన స్వరూపంగా భావిస్తాడు. స్వరూపంగా భావించే భక్తిని ఇలా వర్ణించారు భగవత్పాదులు. 'యః పశ్యతి యత్ శృణోతి, స్పృశతి, వా తత్ సర్వం వాసుదేవ ఏవ.' ఏదేది చూస్తామో వింటామో ముట్టుకుంటామో అదంతా సచ్చిద్రూపమైన ఆత్మతత్త్వమేనని 'ఏవం గ్రహావిష్టః.' ఒక దయ్యంలాగా ఆవేశించినవాడు భక్తుడట. ఇదే అనన్యభక్తి.

**48-9 శ్లో.**
**తతస్తరూద్ధారణ దారుణారవ**
**ప్రకంపి సంపాతిని గోపమండలే ।**
**విలజ్జిత త్వజ్జననీ ముఖేక్షిణా**
**వ్యమోక్షి నందేన భవాన్ విమోక్షదః ॥**

**ప్రతిపదార్థం:** తతః =అటుపిమ్మట, తరు ఉద్దారణ= పెద్ద మద్ది చెట్లు విరిగి పడగా వచ్చిన (తరంతి ఛాయాపుష్పఫలార్థినః అనేన దీని నీడ, పుష్ప, ఫలాదులు కోరినవారు తరింతురు) వృక్షము, దారుణ ఆరవ= భీకర శబ్దమునకు (ఆసమంతాత్ రవ ఉచ్చరవః - పెద్దశబ్దము, అల్లరి), గోప మండలే = గోపాలకులందరు, ప్రకంపి సంపాతిని =కంపించి పోయిరి, ముఖ ఈక్షిణా = యశోదా! ఏమి చేసితివి? ఇలా జరిగినదేమిటి? ఇటువంటి అభిప్రాయాలు కలిగిన చూపులు తనవైపు ప్రసరింపబడినందులకు, త్వత్ జననీ = నీ తల్లి యశోద, విలజ్జిత= సిగ్గుపడగా, విమోక్షదః= సకల జీవులకు ముక్తిని కలిగించు, భవాన్ =నువ్వు, నందేన= నందుని చేత, వ్యమోక్షి= కట్లు విడిపించబడితివి.

**తాత్పర్యం:** అటుపిమ్మట పెద్ద మద్ది చెట్లు విరిగి పడగా వచ్చిన భీకర శబ్దమునకు గోపాలకులందరు కంపించి పోయిరి. "యశోదా! ఏమి చేసితివి? ఇలా జరిగినదేమిటి?" ఇటువంటి అభిప్రాయాలు కలిగిన చూపులు తనవైపు ప్రసరింపబడినందులకు నీ తల్లి యశోద సిగ్గుపడగా సకల జీవులకు బంధ విమోచనము (ముక్తిని) కలిగించు నువ్వు , నందుని చేత కట్లు విడిపించబడితివి.

**48-10 శ్లో.**
**మహీరుహోర్మధ్యగతో బతార్భకో**
**హరేః ప్రభావాదపరిక్షతోఽధునా ।**
**ఇతి బ్రువాణైర్గమితో గృహం భవాన్**
**మరుత్పురాధీశ్వర పాహిమాం గదాత్ ॥**

**ప్రతిపదార్థం:** మరుత్పురాధీశ్వర = ఓ గురువాయూరు దేవా!, బత = ఆశ్చర్యము, మహీరుహోః = వృక్షములు విరిగి పడుచున్నప్పుడు(మహ్యాం రోహతి భూమి యందు పుట్టునది. చెట్టు), మధ్య గతః= వాటి మధ్య ఉన్న, అర్భకః = ఈ పసివాడు, హరేః ప్రభావాత్ = విష్ణువు దయవలననే, అధునా = ఇప్పుడు, అపరిక్షతః=అవికలాంగునిగా క్షేమముగా ఉన్నాడు, ఇతి =అని, బ్రువాణైః = తమలో తాము చెప్పికొనుచు, భవాన్= నిన్ను, గృహం = మీ ఇంటికి, గమితః = చేర్చిరి, మాం= నన్ను, గదాత్= రోగమునుండి, పాహి = రక్షించుము.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా ! ఆశ్చర్యము వృక్షములు విరిగి పడుచున్నప్పుడు వాటి మధ్య ఉన్న ఈ పసివాడు విష్ణువు దయవలననే ఇప్పుడు క్షేమముగా ఉన్నాడు అని తమలో తాము చెప్పికొనుచు నిన్ను మీ ఇంటికి చేర్చిరి. నన్ను రోగమునుండి రక్షించుము.

**విశేషాలు:** ఈశ్వరుడు ఏ భక్తుల వెంట తిరుగుతూ ఉంటాడో ఆ భక్తులకు వంగి నమస్కరించగలగాలి. అపుడు మీరు ఎల్లప్పుడూ ఐశ్వర్యమును అనుభవిస్తూ ఆనందంగా ఉండగలరు అనే మహోత్కృష్టమైన సందేశమును ఈ లీల మనకు అందజేస్తోంది.

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

**దశమ స్కంధము**

**48వ దశకము పూర్తి**



# దశకమ్ 49 – వృన్దావనప్రవేశము

**49-1 శ్లో.**
**భవత్ప్రభావావిదురా హి గోపాస్తరుప్రపాతాదికమత్ర గోష్ఠే ।**
**అహేతుముత్పాతగణం విశంక్య ప్రయాతుమన్యత్ర మనో వితేనుః ॥**

**ప్రతిపదార్థం:** భవత్ = నీ యొక్క, ప్రభావ= ప్రభావం ఎటువంటి దో (ప్రకృష్టం భవతి తస్య భావః – బాగా (ప్రకాశించునది) వుండునది. కాంతి సామర్థ్యము రాజ ప్రభావము), అవిదురాః = తెలియని, గోపాః = గోపాలకులు, అత్ర గోష్ఠే = వ్రేపల్లెలో, తరు ప్రపాత = కారణమూ లేకుండా చెట్లు కూలిపోవుట, ఆదికమ్= మొదలగు విడ్డూరములు, అహేతుమ్ ఉత్పాత గణం= దైవికముగా సంభవించిన ఆపదలని (ఉత్పతతి శుభాశుభం సూచయతి శుభాశుభమును సూచించునది), విశంక్య= శంకించి, అన్యత్ర ప్రయాతుమ్ = పల్లె విడిచి వేరొకచోటికి పోవటానికి, మనః వితేనుః హి = మనస్సులో నిశ్చయించిరి కదా!

**తాత్పర్యం:** నీ యొక్క ప్రభావం ఎటువంటి దో తెలియని గోపాలకులు వ్రేపల్లెలో కారణమూ లేకుండా చెట్లు కూలిపోవుట మొదలగు విడ్డూరములు దైవికముగా సంభవించిన ఆపదలని శంకించి పల్లె విడిచి వేరొకచోటికి పోవటానికి మనస్సులో నిశ్చయించిరి.

**49-2 శ్లో.**
**తత్రోపనందాభిధగోపవర్యో జగౌ భవత్ప్రేరణయైవ నూనమ్ ।**
**ఇతః ప్రతీచ్యామ్ విపినం మనోజ్ఞం బృందావనం నామ విరాజతీతి ॥**

**ప్రతిపదార్థం:** తత్ర = అక్కడ ఉన్నవారిలో, ఉపనంద= ఉపనందుడు అను, అభిధ= పేరు కలిగిన(వసుదేవునికి మదిరయందు పుట్టిన కొడుకు. నందుని సహోదరుడు), గోపవర్యః = గోపాల శ్రేష్ఠుడు, నూనమ్= నిశ్చయముగా, భవత్ ప్రేరణయా ఏవ= నీ ప్రేరణచేతనే, ఇతః = ఇచ్చటికి, ప్రతీచ్యామ్ = పడమరగా(ప్రతి ప్రతిదినాంతే అంచతి గచ్ఛతి సూర్యః అస్యామ్ ప్రతి దినాంతములో సూర్యుడు ఇటువైపు పయనించును. పశ్చిమ దిశ), బృందావనం నామ= బృందావనము అను,

మనోజ్ఞం= చక్కని, విపినం= వనమొకటి, విరాజతి ఇతి= విరాజిల్లుచున్నదని, జగౌ= పలికెను.

**తాత్పర్యం:** అక్కడ ఉన్నవారిలో ఉపనందుడు అను పేరు కలిగిన గోపాల శ్రేష్ఠుడు నిశ్చయముగా నీ ప్రేరణచేతనే ఇచ్చటికి పడమరగా బృందావనము అను చక్కని వనమొకటి విరాజిల్లుచున్నదని పలికెను.

**విశేషాలు**

**బృందావనము:** యమునానదీ పశ్చిమతీరమున మధురయొద్ద ఉండు వనము. దీనికి ఎదుట (అనగా యమునయొక్క తూర్పుగట్టున) గోకులము ఉన్నది. అందు కృష్ణుడు గోపకన్యకలతో అనేకలీలలు సలిపెను.

**49–3 శ్లో.**
**బృహద్వనం తత్ఖలు నందముఖ్యాః విధాయ గౌష్ఠీనమథ క్షణేన ।**
**త్వదన్వితత్వజ్జననీనివిష్టగరిష్ఠయానానుగతా విచేలుః ॥**

**ప్రతిపదార్థం:** అథ= ఉపనందుని మాట విన్న తర్వాత, నందముఖ్యాః= నందుడు మొదలయిన పెద్దలు, బృహత్ వనం = బృందావనము (బృంహతే వర్ధతే చాలా పెద్దది), తత్ ఖలు= అతడు చెప్పినట్లే నివాసయోగ్యమయినదని, విధాయ= నిశ్చయించుకొని, క్షణేన= వెంటనే, గౌష్ఠీనమ్= ఇంతకు పూర్వము ఉన్న గోస్థానమయిన బృహద్వనమను పేరుగల వ్రేపల్లెను విడిచి పెట్టి, త్వత్ అన్విత= నీతో కలిసి (రామకృష్ణులతో కలిసి), త్వత్ జననీ= నీ తల్లిని యశోద, రోహిణి, నివిష్ట = కూర్చున్న (నివిష్టః కృతః ప్రవేశః స్థితః బద్ధః – ప్రవేశించిన , కూర్చున్న), గరిష్ఠ యాన =గొప్పదయిన బండిని, అనుగతా= అనుసరించుచూ, విచేలుః= గోపాలకులు ప్రయాణమయిరి.

**తాత్పర్యం:**ఉపనందుని మాట విన్న తర్వాత నందుడు మొదలయిన పెద్దలు బృందావనము అతడు చెప్పినట్లే అది నివాసయోగ్యమయినదని నిశ్చయించుకొని వెంటనే ఇంతకు పూర్వము ఉన్న గోస్థానమయిన బృహద్వనమను పేరుగల వ్రేపల్లెను విడిచి పెట్టి, నీతో కలిసి (రామకృష్ణులతో కలిసి) నీ తల్లిని యశోదను,

రోహిణిని గొప్పదయిన బండిలో ఎక్కించి దానిని అనుసరించుచూ గోపాలకులు ప్రయాణమయిరి.

**49-4 శ్లో.**

**అనోమనోజ్ఞధ్వనిధేనుపాలీఖురప్రణాదాంతరతో వధూభిః ।**

**భవద్వినోదాలపితాక్షరాణి ప్రపీయ నాజ్ఞాయత మార్గదైర్ఘ్యమ్ ॥**

**ప్రతిపదార్థం:** అనః= బండ్లు (అనితి శబ్దం కరోతి శబ్దము చేయునది. ఎడ్ల బండి), మనోజ్ఞ ధ్వని= ముందుకు పోవుచున్నప్పుడు వినవచ్చుచున్న శబ్దము, ధేను పాలీ ఖుర= ఆవులమంద కాలి గిట్టల తాకిడి వలన ఏర్పడిన (ధయతి సుతాన్ దూడలను నాకునది. ఆవు), ప్రణాద = ధ్వనులలో, అంతరతః = మధ్యలో, వధూభిః = గోపకాంతలు, భవత్ = నువ్వు, వినోద=వినోదముగా, ఆలపిత= అలపించు, అక్షరాణి= ముద్దుమాటల మాధుర్యాన్ని, ప్రపీయ=శ్రవణామృతముగా ఆస్వాదించుచు, మార్గ దైర్ఘ్యమ్= మార్గాయాసము, న ఆజ్ఞాయత= ఎఱుంగరైరి.

**తాత్పర్యం:** బండ్లు ముందుకు పోవుచున్నప్పుడు వినవచ్చుచున్న శబ్దము, ఆవులమంద కాలి గిట్టల తాకిడి వలన ఏర్పడిన ధ్వనులలో మధ్యలో గోపకాంతలు నువ్వు వినోదముగా అలపించు ముద్దుమాటల మాధుర్యాన్ని శ్రవణామృతముగా ఆస్వాదించుచు మార్గాయాసము ఎఱుంగరైరి.

**49-5 శ్లో.**

**నిరీక్ష్య బృందావనమీశ! నందత్ ప్రసూనకుందప్రముఖద్రుమౌఘమ్ ।**

**అమోదథాః శాద్వలసాంద్రలక్ష్మ్యా హరిన్మణీకుట్టిమపుష్టశోభమ్ ॥**

**ప్రతిపదార్థం:** ఈశ= దేవా!, నందత్ ప్రసూన=వికసించిన మల్లెలు, కుంద ప్రముఖ= మొల్లలు మొదలయిన(కుం భూమిం ద్యతి ఖండయతి భూమిని చీల్చుకొని పుట్టునది. అడవిమల్లె), ద్రుమ ఔఘమ్ = పలు పూలతీగలతో, వృక్షములతో ఉన్న, బృందావనమ్= బృందావనమును, నిరీక్ష్య = చూసి, శాద్వల = లేతపచ్చిక గల ప్రదేశములతో, సాంద్ర లక్ష్మ్యా = దట్టమయిన అందంతో ఉన్న, హరిత్ మణీ = ఇంద్రనీలమణులు పొదిగినట్లున్న, కుట్టిమ= శిలాదులచేత గట్టబడిన

నేలలను చూసి, పుష్ట శోభమ్= సంపూర్ణ శోభాయుక్తమయిన అందమయిన భూములను చూచి, అమోదథాః= నీవు ఎంతో సంతోష పడితివి.

**తాత్పర్యం:** దేవా! వికసించిన మల్లెలు మొల్లలు మొదలయిన పలు పూలతీగలతో, వృక్షములతో ఉన్న బృందావనమును చూసి దట్టముగా పరచుకొన్న లేతపచ్చిక గల ప్రదేశములతో అందంతో ఉన్న ఇంద్రనీలమణులు పొదిగినట్లున్న సంపూర్ణ శోభాయుక్తమయిన అందమయిన భూములను చూచి నీవు ఎంతో సంతోష పడితివి.

**49-6 శ్లో.**

**నవాకనిర్వ్యూఢ నివాసభేదేష్వశేషగోపేషు సుఖాసితేషు ।**
**వనశ్రియం గోపకిశోరపాలీవిమిశ్రితః పర్యగలోకథాస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** నవాక = అర్థ చంద్రాకృతిలో క్రొత్తగా, నిర్వ్యూఢ= కట్టబడిన(నిర్మింపబడిన) (నిశ్శ్రేషేణ వ్యూఢః సమాప్తమైనది), నివాస భేదేషు = అనేక రకములైన విశిష్టములైన ఇండ్లలో(నివసంతి అత్ర యత్ర సంప్రతి ఉష్యతే ఇపుడు నివసించు చోటు. ఇల్లు), అశేషగోపేషు= గోపాలురు అందరు, సుఖ ఆసితేషు= సుఖంగా కూర్చుని (నివాసముండి), త్వమ్= నువ్వు, గోప కిశోర పాలీ = గోపబాలురతో (పాలీ =పాల్యతే సమూహము), విమిశ్రితః = కలిసి, వన శ్రియం= ఆ బృందావన శోభను, పర్యక్ —అలోకథాః=సంపూర్ణముగా చూసితివి.

**తాత్పర్యం:** అర్థ చంద్రాకృతిలో క్రొత్తగా కట్టబడిన (నిర్మింపబడిన) అనేక రకములైన విశిష్టములైన ఇండ్లలో గోపాలురు అందరు సుఖంగా నివాసమున్నారు. నువ్వు గోపబాలురతో కలిసి ఆ బృందావన శోభను సంపూర్ణముగా చూసితివి.

**49-7 శ్లో.**

**అరాళమార్గాగతనిర్మలాపాం మరాలకూజాకృతనర్మలాపామ్ ।**
**నిరంతరస్మేరసరోజవక్త్రాం కళిందకన్యాం సమలోకయస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థం:** మరాల= రాజహంసలు(మార్జతి అలంకృతో భవతి, స్వచ్ఛో శ్వేతః

భవతి తెల్లగా వుండునది, స్వచ్ఛంగా వుండునది. రాజహంస), కూజ= చేయు శబ్దముల (అవ్యక్తే శబ్దే కూజతి కూయుట), ఆకృత= ఆకృతిలో (ఆక్రియతే వ్యజ్యతే రూప జాత్యాదికం అనయా ఆకారము రూప, జాతులను తెలుపునది), నర్మ లాపామ్=మధుర శబ్దములు చేయుచు (సరసములాడుచు)(నయతి ఆనందమ్ ఆనందము నిచ్చునది. పరిహాసము)(లపతి భాషతే తస్య కర్మ-మాట్లాడుట), నిరంతర =ఎప్పుడూ (నిర్గతం అంతరం వ్యవధానం యస్మాత్ వ్యవధానము లేనిది. నిరంతరము), స్మేర= వికసించి నిండుగా ఉన్న (స్మయతే ఈషత్ హసతి వికసతి తస్య భావః కర్మ వా చిరునవ్వు వికాసము), సరోజ వక్త్రాం= కమలములనెడి మోముతో (సరసి జాయతే సరస్సులో పుట్టునది. కమలము)(వక్తి అనేన-దీనితో మాట్లాడుదురు. ముఖము), అరాళ= పలు వంకరలు తిరిగిన (అరం ఆలాతి వంకరలు తిరిగిన), మార్గ= మార్గములలో, ఆగత = వచ్చిన(ప్రవహించు), నిర్మల ఆపాం =నిర్మలమయిన నీటితో కలిసిన, కళింద కన్యాం= కళింద (యమున) అను నదీ కన్యను, త్వమ్= నువ్వు, సమలోకయః= చూసితివి.

**తాత్పర్యం:** రాజహంసలు చేయు శబ్దములు కళింద (యమున) నది యొక్క సరస ధ్వనులు. వికసించిన కమలములు ఆమె మోము. అనేక వంకరలు తిరిగిన నది యొక్క మార్గములు అమె వంకరలు తిరిగిన కురులు. ఇలా నిండుగా ప్రవహించు నిర్మలమయిన నీటితో కలిసిన కళింద కన్యను నువ్వు చూసితివి.

**49-8 శ్లో.**

**మయూరకేకాశతలోభనీయం మయూఖమాలాశబలం మణీనామ్।**
**విరించలోకస్పృశముచ్చశృంగైర్గిరిం చ గోవర్ధనమైక్షథాస్త్వమ్॥**

**ప్రతిపదార్థం:** మయూర = నెమళ్ళ(మీనాతి హినస్తి సర్పాన్ సర్పములను చంపునది. మయూరము), కేకా శత= కేకారవముల కలకల నినాదములచే (కేకా= కే మూర్ధ్ని కాయతి మయూర ధ్వని, నెమలి కూత), లోభనీయం= ఆనందము గొలుపుచూ (లుభ్యతి తస్య భావః-లోభము, ఆశ), మణీనామ్= రత్న (అవ్యక్తం శబ్దం కరోతి అవ్యక్త శబ్దము చేయునది. మణి, రత్నము), మయూఖ మాలా= కాంతుల సమూహములతో (మాపయన్ గగనం ఓఖయతి ఆకాశమును

కొలుచునది. కిరణము ప్రకాశము), శబలం= విచిత్ర వర్ణములతో మెరుస్తూ(వర్ణ విశేషః), విరించ లోక = బ్రహ్మలోకమును(విపూర్ణతయా రిణక్తి రిక్తం కరోతి బ్రహ్మాండం, తస్మాత్ నిష్క్రమ్య–బ్రహ్మాండమునుండి నిష్క్రమించి దానిని పూర్తిగా ఖాళీ చేసినవాడు. బ్రహ్మ), స్పృశమ్= తాకుచున్నట్లున్న, ఉచ్చశృంగైః = ఉన్నత శిఖరములున్న, గోవర్ధనమ్ గిరిం చ= గోవర్ధనపర్వతమును( గాః వర్ధయతి తృణాదినా గడ్డిచే ఆవులను పెంచునది. గోవర్ధన పర్వతము), త్వమ్= నువ్వు, ఐక్షథాః= చూచితివి.

**తాత్పర్యం:** నెమళ్ళ కేకారవముల కలకల నినాదములచే ఆనందము గొలుపుచూ , తనలో ఉన్న రత్న కాంతుల సమూహములతో విచిత్ర వర్ణములతో మెరుస్తూ , బ్రహ్మలోకమును తాకుచున్నట్లున్న ఉన్నత శిఖరములున్న గోవర్ధనపర్వతమును నువ్వు చూచితివి.

**49–9 శ్లో.**
**సమం తతో గోపకుమారకైస్త్వం సమంతతో యత్ర వనాంతమాగాః ।**
**తతస్తతస్తాం కుటిలామపశ్యః కళిందజాం రాగవతీమివైకామ్ ॥**

**ప్రతిపదార్థం:** తతః= అటుపిమ్మట, గోపకుమారకైః= గోపబాలురతో, సమం = సమముగా (కలిసి), త్వం = నీవు, వనాంతమ్ సమంతతః = బృందావన ప్రాంతములలో, యత్ర =ఎక్కడ, ఆగాః = తిరిగిననూ, తతః తతః= అక్కడక్కడ, రాగవతీమ్ ఇవ= అనురాగ వతివలె, కుటిలామ్= వక్రమార్గములతో నిన్ను అనుసరిస్తూ ప్రవహిస్తున్న, ఏకామ్= ఒకానొక నాయిక వలె ఉన్న, తాం కళిందజాం= ఆ కళింద కన్యను (కాళిందీ నది), అపశ్యః= చూసితివి.

**తాత్పర్యం:** అటుపిమ్మట గోపబాలురతో కలిసి నీవుబృందావన ప్రాంతములలో ఎక్కడ తిరిగితే అక్కడక్కడ అనురాగ వతివలె వక్రమార్గములతో నిన్ను అనుసరిస్తూ ప్రవహిస్తున్న ఒకానొక నాయిక వలె ఉన్న ఆ కళింద కన్యను (కాళిందీ నది) చూసితివి (కృష్ణుడు తిరిగిన మార్గములలో కూడా కాళిందీ నది వంపు సొంపులు పోతూ అనుసరిస్తున్నదని భావం)

**49-10 శ్లో.**

**తథావిధేఽస్మిన్ విపినే పశవ్యే సముత్సుకో వత్సగణప్రచారే ।**
**చరన్ సరామోఽథ కుమారకైస్త్వం సమీరగేహాధిప పాహి రోగాత్ ॥**

**ప్రతిపదార్థం:** సమీరగేహ అధిప =ఓ గురువాయూరు దేవా!, అథ= అటుపిమ్మట, తథా విధే = ఆ విధముగా, పశవ్యే= పశువులకు హితముగాఉన్న (పశయతి యథేష్టం భ్రమతి స్వేచ్ఛగా తిరుగునది. వన్య పశువు), అస్మిన్ విపినే = ఆ బృందావనములో, వత్సగణ ప్రచారే= లేగలను మేపుతూ, సముత్సుకః = ఉత్సాహముతో, స రామః కుమారకైః=ఆ బలరాముడు మరియు ఇతర గోపబాలకులతో కలిసి, చరన్= సంచరించుచున్న, త్వం = నువ్వు, రోగాత్= రోగమునుండి, పాహి= రక్షింపుము.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! అటుపిమ్మట ఆ విధముగా పశువులకు హితముగాఉన్న ఆ బృందావనములో లేగలను మేపుతూ ఉత్సాహముతో ఆ బలరాముడు మరియు ఇతర గోపబాలకులతో కలిసి సంచరించుచున్న నువ్వు రోగమునుండి రక్షింపుము.

***దశమ స్కంధము***

**49వ దశకము పూర్తి**

# దశకమ్ 50 – వత్సాసుర–బకాసుర వధ

**50–1 శ్లో.**

**తరలమధుకృద్బృందే బృందావనేఽథ మనోహరే**
**పశుపశిశుభిః సాకం వత్సానుపాలనలోలుపః ।**
**హలధరసఖోదేవ! శ్రీమన్! విచేరిథ ధారయన్**
**గవలమురళీవేత్రం నేత్రాభిరామతనుద్యుతిః ॥**

**ప్రతిపదార్థం:** దేవ శ్రీమన్। = ఓ గురువాయూరు శ్రీకృష్ణ దేవా!, అథ = అటుపిమ్మట, తరలమధుకృత్ బృందే= పువ్వులపై వ్రాలుచూ తుమ్మెదలు చేయు ఝుంకారములతో,మనోహరే=అందంగా ఉన్న,బృందావనే=ఆబృందావనములో, గవల=శృంగమును (కొమ్ముబూరను) (గవం శబ్దం కరోతి లాతి శబ్దము చేయునది), మురళీ = మురళిని(మురం అంగుళివేష్టనం లాతి ప్రాప్నోతి వేళ్లతో కప్పబడునది. మురళి, వేణువు, పిల్లనగ్రోవి), వేత్రం = కోలను(అజ్యతే క్షిప్యతే విసరబడునది. బెత్తము), ధారయన్= ధరించి, పశుప శిశుభిః సాకం= గోపబాలురతో కలిసి, హలధర సఖః= బలరాముని స్నేహితుడవై, నేత్ర అభిరామ= కన్నుల పండువు చేయు, తనుద్యుతిః = శరీర కాంతితో, వత్స అనుపాలన లోలుపః= పశువులను కాచు పని చేయుచు, విచేరిథ= సంచారము చేయుచుంటివి.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు శ్రీకృష్ణ దేవా! పువ్వులపై వ్రాలుచూ తుమ్మెదలు చేయు ఝుంకారములతో అందంగా ఉన్న ఆ బృందావనములో కొమ్ముబూరను, మురళిని ,కోలను ధరించి గోపబాలురతో బలరామునితో కలిసి కన్నుల పండువు చేయు శరీర కాంతితో పశువులను కాచు పని చేయుచు సంచారము చేయుచుంటివి.

**50–2 శ్లో.**

**విహితజగతీరక్షం లక్ష్మీకరాంబుజలాలితం**
**దదతి చరణద్వంద్వం బృందావనే త్వయి పావనే ।**
**కిమివ న బభౌ సంపత్సంపూరితం తరువల్లరీ**
**సలిలధరణీగోత్రక్షేత్రాదికం కమలాపతే! ॥**

**ప్రతిపదార్థం:** కమలాపతే= ఓ లక్ష్మీ పతీ!, జగతీ రక్షం = జగత్తును రక్షించు పనిలో (గచ్ఛతి కార్యత్వాత్ వినశ్యతి కార్యమగుటవలన నశించునది. పృథివి), విహిత = నిమగ్నమైనవి (విధినా బోధితః-చేయబడ్డది శాస్త్రోక్తంగా చెప్పబడ్డది), లక్ష్మీ = లక్ష్మీదేవి, కర అంబుజ= పద్మములవంటి హస్తములతో, లాలితం= లాలింపబడునవి(సేవింపబడునవి)(లాలితఃస్నిగ్ధఃఅభిలక్షితః-లాలించబడినది), చరణ ద్వంద్వం= నీ పాదములను, బృందావనే దదతి = బృందావనములో అడుగుపెట్టి, త్వయి = నువ్వు, పావనే = పవిత్రము చేయుటచే, తరు వల్లరీ= వృక్షములు పుష్ప సమృద్ధితో, సలిల = సరోవర జలములు పద్మములతో, ధరణీ= భూములు పంటలతో, గోత్ర= కొండలు రత్నములతో (గాం పృథివీం త్రాయతే పృథివిని రక్షించునది. పర్వతము), క్షేత్ర ఆదికం =గనులు మొదలయినవి బంగారము మొదలయిన లోహములతో, సంపత్సంపూరితం=ఇదివరకు లేని సకల శోభలు నిండినవిగా మారి సర్వసమృద్ధిగా, కిమ్ ఇవ న బభౌ= ఏమి అనందాన్ని ఇవ్వకుండా ఉంటాయి? (అన్నిఅందాలను, సంపదలను ప్రసాదిస్తాయని భావం).

**తాత్పర్యం:** ఓ లక్ష్మీ పతీ! జగత్తును రక్షించు పనిలో నిమగ్నమైనవి మరియు లక్ష్మీదేవి పద్మములవంటి హస్తములతో సేవింపబడు నీ పాదములతో బృందావనములో అడుగుపెట్టి నువ్వు పవిత్రము చేయుటచే వృక్షములు పుష్ప సమృద్ధితో, సరోవర జలములు పద్మములతో భూములు పంటలతో, కొండలు రత్నములతో గనులు మొదలయినవి బంగారము మొదలయిన లోహములతో ఇదివరకు లేని సకల శోభలు పొంది అన్నిఅందాలను, సంపదలను ప్రసాదించాయి.

**50-3 శ్లో.**

**విలసదులపే కాంతారాంతే సమీరణశీతలే**
**విపులయమునాతీరే గోవర్ధనాచలమూర్ధసు ।**
**లలితమురలీనాదః సంచారయన్ ఖలు వాత్సకం**
**క్వచన దివసే దైత్యం వత్సాకృతిం త్వముదైక్షథాః ॥**

**ప్రతిపదార్థం:** విలసత్ ఉలపే= శోభమాన తృణ విశేష యుక్తమయిన

(ఉలప= వలతే సంవృణోతి బాగా ఆకులు కలిగిన తీగ), కాంతార అంతే= వన ప్రదేశములో, సమీరణ= గాలిచే (సమ్యక్ ఈరయతి వాయువు), శీతలే = సుఖకరమై ఉన్న, విపుల యమునాతీరే= విశాలమైన యమునానదీతీరములో, గోవర్ధన అచలమూర్ధసు= గోవర్ధన పర్వతముపై కూర్చుండి, లలిత మురళీ నాదః= మధురమగు నీ మురళీనాదము వినిపించుచూ, సంచారయన్ = తిరుగుచూ, త్వమ్= నువ్వు, వాత్సకం = లేగదూడలను కాచు రోజులలో (వత్సానాం సమూహః – లేగదూడల సమూహము), క్వచన దివసే= ఒక రోజున, వత్స ఆకృతిం= ఆవుదూడ రూపములో ఉన్న, దైత్యం= ఒక రాక్షసుని (దితేః అపత్యమ్ దితి సంతానము. రాక్షసులు), ఉదైక్షథాః ఖలు = చూచితివి కదా.

**తాత్పర్యం:** శోభమానమైన తృణ విశేష యుక్తమయిన పచ్చిక బయళ్లున్న వన ప్రదేశములో, గాలిచే చల్లగా సుఖకరమై ఉన్న విశాలమైన యమునానదీతీరములో గోవర్ధన పర్వతముపై కూర్చుండి మధురమగు నీ మురళీనాదము వినిపించుచూ తిరుగుచూ నువ్వు లేగదూడలను కాచు ఒక రోజున ఆవుదూడ రూపములో ఉన్న ఒక రాక్షసుని చూచితివి.

**50–4 శ్లో.**

**రభసవిలసత్పుచ్ఛం విచ్ఛాయతోఽస్య విలోకయన్**
**కిమపి వలితస్కంధం రంధ్రప్రతీక్షముదీక్షితమ్ ।**
**తమథ చరణే బిభ్రత్ విభ్రామయన్ ముహురుచ్చకైః**
**కుహచన మహావృక్షే చిక్షేపిథ క్షతజీవితమ్ ॥**

**ప్రతిపదార్థం:** అథ =అటుపిమ్మట, రభస విలసత్ పుచ్ఛం = వేగము వలన ఇటు అటూ సంచారము చేయుచున్న తోకను తిప్పుచూ (రభతే వేగేన గచ్ఛతి తస్య భావః కర్మ వా వేగము, సంతోషము, ఉత్సాహము.)(పుచ్ఛతి సంతోషయతి సంతోషింప చేయునది. తోక), విచ్ఛాయతః= విశిష్టమైన కాంతి కల(విశిష్టా ఛాయా కాంతిః యస్య–విశిష్టమైన కాంతి కలది), అస్య = వత్సాసురుని, కిమ్ అపి విలోకయన్ = దేనికొరకో వెతుకుచున్నట్లుగా, వలితస్కంధం = మెడను వెనకకు ముందుకు త్రిప్పుచు (వలితః గతిశీలః ఆవృత–నడచునది, ఆవరింపబడ్డది)(స్కంధ్యతే

ఆరుహ్యతే అసౌ ఎక్కబడునది. భుజము), రంధ్ర ప్రతీక్షమ్ ఉదీక్షితమ్=తనను చంపు అవకాశముకొఱకు ఎదురుచూచుచున్నట్లు పైకి చూచుచున్న ఆ ఆవు రూపములో ఉన్న(రంధయతి హినస్తి అనేన-రంధ్రము చేయుట దూషించుట రంధ్రము.)(ప్రతి ఈక్షతే తస్య భావః కర్మ వా ఎదురు చూచుట కోరిక)(ఉత్ ఊర్ధ్వం ఈక్షణం దర్శనమ్ పైకి చూచుట), తమ్ = ఆ రాక్షసుని, చరణే బిభ్రత్ = నాలుగు కాళ్లను పట్టుకొని, విభ్రామయన్ = గిరగిరా తిప్పి, ముహుః = మరలా గొప్ప వేగముతో, ఉచ్చకైః = ఎత్తైన (ఉచ్చైః ఉత్తుంగః ఉచ్చస్థానే భవః-ఎత్తైనది ఎత్తు, ఉన్నత స్థానములో వున్నది), కుహచన మహావృక్షే=ఒకానొక పెద్ద చెట్టు మీద, క్షత జీవితమ్= ఆ రాక్షసుని ప్రాణము పోవునట్లుగా(క్షతః తాడితః విద్ధః - గాయపడినవాడు), చిక్షేపిథ= విసిరివైచితివి.

**తాత్పర్యం:** అటుపిమ్మట వేగము వలన ఇటు అటూ సంచారము చేయుచున్న తోకను తిప్పుచూ, దేనికొరకో వెతుకుచున్నట్లుగా మెడను వెనకకు ముందుకు త్రిప్పుచు, నిన్ను చంపు అవకాశముకొఱకు ఎదురుచూచుచున్నట్లు ఆ ఆవు రూపములో ఉన్న ఆ రాక్షసుని నాలుగు కాళ్లను పట్టుకొని గిరగిరా తిప్పి గొప్ప వేగముతో ఒకానొక ఎత్తైన పెద్ద చెట్టు మీద ఆ రాక్షసుని ప్రాణము పోవునట్లుగా విసిరివైచితివి.

**50-5 శ్లో.**

**నిపతతి మహాదైత్యే జాత్యా దురాత్మని తత్ క్షణం**
**నిపతనజవక్షుణ్ణక్షోణీరుహక్షతకాననే ।**
**దివి పరిమిలత్ వృన్దావృందారకాః కుసుమోత్కరైః।**
**శిరసి భవతో హర్షాత్ వర్షంతి నామ తదా హరే ॥**

**ప్రతిపదార్థం:** హరే= ఓ గురువాయూరు దేవా!, జాత్యా= రాక్షస జాతిని అనుసరించి సహజముగా, దురాత్మని= దుష్టుడయిన, మహా దైత్యే=ఆ మహా రాక్షసుడు — వత్సాసురుడు, నిపతతి= వృక్షములపై బలముగా పడుటచే, తత్ క్షణం = వెంటనే, నిపతన జవ= అతడు పడిన బలమునకు (నీచైః పతనమ్ క్రింద బడుట), క్షుణ్ణ = విరిగిన (క్షుణ్ణః సంపిష్టః పొడిచేయబడిన-పిసకబడిన పరిశీలింపబడిన),

క్షోణీరుహ= చెట్ల కొమ్మలతో, కాననే = అడవిలో (కం జలం అననం జీవనం అస్య–జలమే జీవనంగా గలది. వనము), క్షత= కొంతమేర నాశనము జరిగెను, తదా =అప్పుడు, దివి= ఆకాశమునుండి, పరిమిలత్ వృన్దా =గుమి కూడిన (వన్యతే వణతే వా సమూహమగునది. సమూహము), వృందారకాః=దేవతలు (వృందః విశాలః ప్రముఖో వా ప్రముఖమైనది, విశాలమైనది, ఆదరణీయమైనది. వేలుపు), హర్షాత్ = సంతోషముతో, భవతః = నీ యొక్క, శిరసి = తలయందు, కుసుమ ఉత్కరైః= కల్ప వృక్ష కుసుమ సమూహములు (కుంసయతి ప్రకాశతే అసౌ ప్రకాశించునది. పుష్పము), వర్షంతి నామ = కురిపించిరి.

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! రాక్షస జాతిని అనుసరించి సహజముగా దుష్టుడయిన ఆ మహా రాక్షసుడు – వత్సాసురుడు వృక్షములపై బలముగా పడుటచే ,అతడు పడిన బలమునకు విరిగిన చెట్ల కొమ్మలతో అడవిలో కొంతమేర నాశనము జరిగెను. అప్పుడు ఆకాశమునుండి గుమి కూడిన దేవతలు సంతోషముతో నీ యొక్క తలయందు కల్ప వృక్ష కుసుమ సమూహములను కురిపించిరి.

**50-6 శ్లో.**
**సురభిలతమామూర్ధన్యూర్ధ్వం కుతః కుసుమావలీ**
**నిపతతి తవేత్యుక్తో బాలైః సహేలముదైరయః ।**
**ఝటితి దనుజక్షేపేణోర్ధ్వం గతస్తరుమండలాత్**
**కుసుమనికరః సోఽయం నూనం సమేతి శనైరితి ॥**

**ప్రతిపదార్థం:** ఊర్ధ్వం = అపుడు పై నుండి కురిసిన(ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్ పైకి తరువాత), సురభిలతమా= మంచివాసనతో కూడిన, కుసుమ–ఆవలీ = పుష్పములను చూసి, తవ మూర్ధని= నీ తలపై పూలు(ముహ్యతి అస్మిన్ ఆహతే ఇతి మూర్ధా దీనిని కొట్టినచో సొమ్మసిల్లును. మూర్ధము), కుతః = ఎందుకు, నిపతతి=పడినవి, ఇతి బాలైః ఉక్తః = అని బాలురు అడుగగా, సహేలమ్= సవిలాసముగా (హిలతి క్రీడతి తస్య భావః కర్మ వా ఆట), ఉదైరయః = వారికి చెప్పితివి, ఝటితి= వేగముగా, (శీఘ్రమ్ త్వరగా తొందరగా), దనుజ క్షేపేణ = వత్సాసుర శవమును విసరి వేయుట చేత అతని తాకుకు కదలి,

తరు మండలాత్= చెట్లకొమ్మల నుండి, కుసుమనికరః = పూలజల్లులు, ఊర్ధ్వం గతః = పైనుండి కిందకు పడినవి, నూనం = నిశ్చయము, సః అయం =అందువలన ఈపూలు, శనైః సమేతి = నిదానముగా క్రిందపడుచున్నవి, ఇతి= అని వారిని విష్ణుమాయలో ముంచితివి.

**తాత్పర్యం:** అపుడు పై నుండి కురిసిన సువాసన భరితమయిన పుష్పములను చూసి "నీ తలపై పూలు ఎందుకు పడినవి?" అని బాలురు అడుగగా సవిలాసముగా వారికి ఇలా చెప్పితివి. "వేగముగా, అకస్మాత్తుగా వత్సాసుర శవమును విసరి వేయుట చేత అతని తాకుకు కదలి తరు చెట్లకొమ్మల నుండి పూలజల్లులు పైనుండి కిందకు పడినవి. ఇది నిశ్చయము. అందువలన పూలు నిదానముగా క్రిందపడుచున్నవి "అని వారిని విష్ణుమాయలో ముంచితివి.

**50–7 శ్లో.**
**క్వచన దివసే భూయో భూయస్తరే పరుషాతపే**
**తపనతనయాపాథః పాతుం గతా భవదాదయః ।**
**చలితగరుతం ప్రేక్షామాసుర్బకం ఖలు విస్మృతం**
**క్షితిధరగరుచ్ఛేదే కైలాసశైలమివాపరమ్ ॥**

**ప్రతిపదార్థం:** క్వచన దివసే= ఒక రోజు, భూయో భూయస్తరే= మరలా మరలా ఈడ్చి ఈడ్చి, పరుష ఆతపే =వేడిగాలులు వీచుచుండగా దాహముతో(పిపర్తి అలంకరోతి పరుషము), తపన తనయాయాం= యమునానదిలో(తపనస్య సూర్యస్య తనయా సూర్యుని కూతురు. యమునా నది), భవత్ ఆదయః= మీరందరు, పాథః = నీరు(పీయతే అసౌ త్రాగబడునది, నీరు), పాతుం గతా= త్రాగుటకు వెళ్ళిరి, క్షితిధర గరుత్ ఛేద= కొండల రెక్కలు తెంచునపుడు(క్షితిం భూమిం ధరతి భూమిని ధరించునది. పర్వతము), విస్మృతం = ఇంద్రుడు మరచిన పర్వతములా, (విస్మృతః విగతస్మరణః – మరచిపోయినవాడు), అపరమ్= మరొక (నాస్తి పరః యస్మాత్ దానికంటే తరువాత లేనిది), కైలాస శైలమ్ ఇవ = కైలాస పర్వతము వలె ఉన్న, చలిత గరుతం= తన విశాలమగు రెక్కలను కదుపుచున్న (గృణాతి శబ్దం కరోతి అసౌ శబ్దము చేయునది. పక్షి రెక్క), బకం= ఒక కొంగను

(బంకతే కుటిలో భవతి వంకరగా వుండునది. కొంగ ధూర్తుడు రాక్షసుడు), ప్రేక్షామాసుః ఖలు= మీరు చూసితిరి.

**తాత్పర్యం:** ఒక రోజు మరలా మరలా ఈడ్చి ఈడ్చి వేడిగాలులు వీచుచుండగా దాహముతో యమునానదిలో మీరందరు నీరు త్రాగుటకు వెళ్ళిరి. అక్కడ కొండల రెక్కలు తెంచునపుడు ఇంద్రుడు మరచిన పర్వతములా, మరొక కైలాస పర్వతము వలె ఉన్న తన విశాలమగు రెక్కలను కదుపుచున్న ఒక కొంగను మీరు చూసితిరి.

**50–8 శ్లో.**
**పిబతి సలిలం గోపవ్రాతే భవంతమభిద్రుతః**
**స కిల నిగిలన్నగ్నిప్రఖ్యం పునర్ద్రుతముద్వమన్ ।**
**దలయితుమగాత్ త్రోట్యాః కోట్యా తదాశు భవాన్ విభో।**
**ఖలజనభిదాచుంచుశ్చంచూ ప్రగృహ్య దదారతమ్ ॥**

**ప్రతిపదార్థం:** విభో = ఓ గురువాయూరు దేవా!, తదా= అప్పుడు, గోపవ్రాతే= దప్పికగొన్న గోపబాలకులు, సలిలం= నీటిని (సలతి గచ్ఛతి ప్రవహతి ప్రవహించునది. జలము), పిబతి = తాగుచుండగా, సః = బకాసురుడు, భవంతమ్= నీమీదికి, అభిద్రుతః= తటాలున దూకి (అభిద్రుతః పలాయితః ఆక్రాంతో వా పారిపోయినవాడు ఆక్రమించబడినవాడు), అగ్నిప్రఖ్యం=అగ్ని సదృశమును, నిగిలన్= మ్రింగినట్లుగా నిన్ను మింగి, పునః = మరలా, ద్రుతమ్= వెంటనే, ఉద్వమన్ = వాడి గొంతుకలో నువ్వు మంట పుట్టింపగా ఓర్చుకోలేక నిన్ను కక్కి (ఉద్వమతి తస్య భావః ఉద్గీర్ణమ్ కక్కుట), త్రోట్యాః= ముక్కుయొక్క, కోట్యా = అంచుతో, ఆశు= వేగముగా, భవాన్= నిన్ను, దలయితుమ్ అగాత్ = పొడిచి చీల్చబోగా, ఖల జన భిదా చుంచుః = దుష్టశిక్షణలో ప్రసిద్ధుడవయిన నీవు, తమ్ = ఆ బకముయొక్క, చంచూ = రెండు ముక్కుపెడలను, ప్రగృహ్య = పట్టుకొని, దదార కిల = చీల్చి వేసితివి కదా!

**తాత్పర్యం:** ఓ గురువాయూరు దేవా! అప్పుడు దప్పికగొన్న గోపబాలకులు నీటిని తాగుచుండగా బకాసురుడు నీమీదికి తటాలున దూకి అగ్ని సదృశమును

మ్రింగినట్లుగా నిన్ను మింగి మరలా వెంటనే వాడి గొంతుకలో నువ్వు మంట పుట్టింపగా ఓర్చుకోలేక నిన్ను కక్కి ముక్కుయొక్క అంచుతో వేగముగా నిన్ను పొడిచి చీల్చబోగా దుష్టశిక్షణలో ప్రసిద్ధుడవయిన నీవు ఆ బకముయొక్క రెండు ముక్కుపెడలను పట్టుకొని చీల్చి వేసితివి కదా !

**50–9 శ్లో.**

**సపది సహజాం సంద్రష్టుం వా మృతాం ఖలు పూతనామ్**
**అనుజమఘమప్యగ్రే గత్వా ప్రతీక్షితుమేవ వా ।**
**శమననిలయం యాతే తస్మిన్ బకే సుమనోగణే**
**కిరతి సుమనోబృందం బృందావనాత్ గృహమైయథాః ॥**

**ప్రతిపదార్థం:** మృతాం= తనకంటె ముందుగా మరణించిన(మ్రియతే తస్య భావః – చావు, మరణము), సహజాం= తన సోదరి(సహ జాయతే పుట్టుకతో వచ్చునది), పూతనామ్ = పూతనను, సపది = వెంటనే(సహ పద్యతే తత్క్షణము), సంద్రష్టుం = చూడవలయుననియో, వా = లేక, అనుజమ్= తను చనిపోయిన తరువాత మరణించబోవు, అఘమ్ అపి = తన సోదరుడగు అఘాసురుని కొఱకు (అఘయతి పాపం చేయువాడు. దుష్టుడు), అగ్రే గత్వా= ముందుగా వెళ్లి, ప్రతీక్షితుమ్ ఏవ వా= వానిరాకకు ఎదురుచూడవలయుననియో అన్నట్లుగా, తస్మిన్ బకే= ఆ బకాసురుడు, శమననిలయం = యమలోకమునకు (శమన= శమయతి పాపినాం పుణ్యాపుణ్యం ఆలోచయతి, యమః – ప్రాణుల పుణ్యపాపములను ఆలోచించువాడు, తదనుకూలంగా దండించువాడు. యముడు), యాతే (సతి) = వెళ్ళగా, సుమనోగణే = దేవతలు (సుష్ఠు మనః యస్య – మంచి మనస్సు కలవాడు), సుమనోబృందం = పుష్పరాశులను (సుష్ఠు మనః యస్మాత్ దీనితో మనస్సు బాగుగా వుండును. పుష్పము), కిరతి (సతి)= కురిపించుచుండగా, బృందావనాత్ = బృందావనమునుండి, గృహమ్ ఏయథాః ఖలు =నీవు ఇంటికి వెళ్లావు కదా!

**తాత్పర్యం:** తనకంటె ముందుగా మరణించిన తన సోదరి పూతనను వెంటనే చూడవలయుననియో లేక తను చనిపోయిన తరువాత మరణించబోవు తన

సోదరుడగు అఘాసురుని కొఱకు ముందుగా వెళ్లి వానిరాకకు ఎదురు చూడవలయుననియో అన్నట్లుగా ఆ బకాసురుడు యమలోకమునకు వెళ్ళగా, దేవతలు పుష్పరాశులను కురిపించుచుండగా బృందావనమునుండి నీవు ఇంటికి వెళ్లావు.

**50–10 శ్లో.**

**లలిత మురలీ నాదం దూరాన్నిశమ్య వధూ జనైః**
**త్వరితముపగమ్యారాదారూఢమోదముదీక్షితః ।**
**జనితజననీ నందా నందః సమీరణ మందిర–**
**ప్రథిత వసతే! శౌరే! దూరీకురుష్వ మమామయాన్ ॥**

**ప్రతిపదార్థం:** లలిత = అతిసుందరమయిన (లలతే ఈషతే అందమైనది శృంగార చేష్ట కోరబడినది), మురలీ నాదం = నీ వేణునాదమును (మురం అంగులివేష్టనం లాతి ప్రాప్నోతి వేళ్లతో కప్పబడునది. మురళి,)(నదతి తస్య భావః కర్మ వా శబ్దము. ప్రాణవాయువు), నిశమ్య = విని, దూరాత్= దూరమునుండి, ఉదీక్షితః= నీ పైకెత్తబడిన వదనమును చూసి, వధూ జనైః= గోపికలు (వధూ=ఉహ్యతే పితృగృహాత్ పతిగృహమ్ తండ్రి గృహము నుండి పతి గృహమునకు పోవునది. భార్య), త్వరితమ్ = వేగముగా, ఉపగమ్య= నీగృహమును చేరి, ఆరాత్ = సమీపములో నీ అంగ ప్రత్యంగ దర్శనము వలన (ఆరాత్ దూరసమీపయోః – దూరము సమీపము), మోదమ్ ఆరూఢః = ఆనందమును పొందిరి. (ఆరూఢః కృతారోహణః ఎక్కినవాడు, పైన ఉన్నవాడు), జనిత జననీ నంద ఆనందః = నీ తల్లి యశోదకు, తండ్రి నందునికి నువ్వు ఆనందము కలిగించితివి, సమీరణ మందిర= గురువాయూరు పుర మందిరమున (సమ్యక్ ఈరయతి బాగా ప్రవహించునది. ప్రేరేపించువాడు. వాయువు), ప్రథిత వసతే= చక్కగా కొలువై ఉన్న (ప్రథితః ఖ్యాతః ప్రసిద్ధ–ఖ్యాతము ప్రసిద్ధి), శౌరే= ఓ గురువాయూరు దేవా!, మమ ఆమయాన్= నారోగములను, దూరీకురుష్వ= దూరము చేయుము.

**తాత్పర్యం:** అతిసుందరమయిన నీ వేణునాదమును విని దూరమునుండి నీ పైకెత్తబడిన వదనమును చూసి గోపికలు వేగముగా నీగృహమును చేరి

సమీపములో నీ అంగ ప్రత్యంగ దర్శనము వలన ఆనందమును పొందిరి. నీ తల్లి యశోదకు, తండ్రి నందునికి నువ్వు ఆనందము కలిగించితివి. గురువాయూరు పుర మందిరమున చక్కగా కొలువై ఉన్న ఓ గురువాయూరు దేవా ! నారోగములను దూరము చేయుము

**విశేషాలు**

**నాదము:** 1. శరీరంలోని ఆత్మ మనస్సును, మనస్సు వహ్నిని, వహ్ని వాయువును ప్రేరేపించినప్పుడు వాయువు బ్రహ్మ గ్రంధియగు మూలాధారం నుంచి ఊర్ధ్వ ముఖంగా నాభి, హృదయం, కంఠం, శిరస్సు, ముఖం చేరి కలిగించే ధ్వని 'నాదం'. 2. బ్రహ్మ స్వరూపమైనది నాదం. నాభికి పైన హృదయ స్థానం నుంచి బ్రహ్మ రంధ్రం వరకు ధ్వనించే ప్రాణ వాయువు. ఆకాశం, వాయువు, అగ్ని అనే మూడు భూతాల నుంచి పుట్టి నాభికి పైన ధ్వనిస్తూ, ముఖంలో అతి స్పష్టంగా వ్యక్తమయ్యే వాయువు.

**వత్సాసుర వధ:** కొత్తగా వచ్చిన దూడ ఒక రాక్షసుడు. కంసుని పనుపున కృష్ణుని చంపడానికి దూడ రూపంలో వచ్చాడు. వాని పేరు వత్సాసురుడు.

కృష్ణుడు ఏమీ తెలియనట్లుగా దాని దగ్గరకు వెళ్ళి, దాని తోక పట్టుకున్నాడు. తరువాత రెండు చేతులూ చాపి దాని నాలుగు కాళ్ళను పట్టుకుని గభాలున పైకెత్తి, తోకతో ఆ నాలుగు కాళ్ళను కట్టేశాడు. ఇపుడు ఆ దూడను చంపెయ్యాలి. దానిని గిరగిర తిప్పి అక్కడే వున్నా వెలగచెట్టుకు వేసి కొట్టాడు. అలా కొట్టేసరికి అక్కడ ఏకకాలంలో ఇద్దరు రాక్షసులు చచ్చారు. ఒకడి పేరు కపిత్థాసురుడు, వెలగచెట్టు రూపంలో వచ్చాడు. రెండవ వాడు వత్సాసురుడు, అతడే దూడ రూపంలో వచ్చాడు. ఈ లీల జరిగినప్పుడు దేవతలు పుష్ప వృష్టిని కురిపించారు. ఎంత రాక్షసుడు అయినప్పటికీ శ్రీకృష్ణుడంతటి వాడు ఆవుదూడను అలా చంపవచ్చునా – అది పాపము కాదా – అది గోహత్య అవలేదా అనే సందేహం మనకి కలుగుతుంది. ఆవుదూడ రుచికి ప్రసిద్ధి. ఆవుదూడకి ఏది పడితే అది పడదు. ఆవుదూడ వృద్ధిలోకి రావాలని దానిచే పాలుకూడా చాలా తక్కువగా తాగిస్తారు. తినకుండా ఉండడానికి దాని మూతికి ఒక బుట్ట కట్టేస్తారు. అది ప్రతిదానినీ తిందామనుకుంటుంది. అలాగే

వెలగ పండు వాసనకు ప్రసిద్ధి. వాసనను దాచలేము. ఆవుదూడ, వెలగపండు రుచికి, వాసనకు ప్రసిద్ధి చెంది ఉంటాయి. రుచి వాసనలు మనలను జన్మ జన్మాంతరములుగా తరుముతుంటాయి. ఉండకూడని రుచి, వాసనల యందు మనస్సు నిలబడి పోయినట్లయితే దానివలన చాలా ప్రమాదం ఉంది. అందువలనే ప్రయత్నపూర్వకంగా సుఖములను పరిత్యజించడం అలవాటు అవాలి. లేకపోతే ఈ మనస్సు వెళ్ళిపోయి ఏదో ఒకదాని యందు ఉండిపోతుంది. అంత్యకాలం వచ్చినపుడు మనస్సు దానికి బాగా ఇష్టమయిన రుచిని పట్టుకుని, యింద్రియములను గబగబా మూట కట్టి ఏదో ఒక ద్వారం నుంచి బయటకు వెళ్ళిపోతుంది. అదే వాసన. వెళ్ళి మరొక శరీరంలో ప్రవేశిస్తుంది. అలా ప్రవేశించినపుడు పాత శరీరము నుండి వాసనను తీసుకువస్తుంది. అందుకనే పుట్టుకతోనే వాసనలు వచ్చేస్తాయి. ఒక్కొక్కడు పుట్టుకతో దుర్మార్గ ఆలోచనలు చేస్తాడు. ఒక్కొక్కడు పుట్టుకతో భగవంతుని వైపు వెడతాడు. ఈ వాసన వెలగపండు. అసురీశక్తి. మనస్సు అనుభవించడం, గుర్తుపెట్టుకోవడం అనేదే రుచి. వెళ్ళిపోయే ముందు మనస్సు బతికి వున్నన్నాళ్ళు వ్యామోహం దేనిమీద పెరిగిపోయిందో దానినే పట్టుకుని కొత్త శరీరంలోకి వెళ్ళిపోతుంది. అందుకనే తరువాతి జన్మలో ఆ వాసన కోసమే జీవుడు తిరుగుతూ ఉంటాడు. అందుకనే ఒక్కొక్కడు చిన్నతనం నుంచే దుష్ట సాంగత్యం వైపు వెళ్ళిపోతాడు. వాడిని వెనక్కు తీసుకురాలేము. అటువంటి వాడిని ఈ లీల మాత్రమే బాగుచేయగలదు. వాడికి ఈ లీల వినిపించాలి. అమ్మను చూడగానే కాముకత్వం ఎలా చల్లారి పోతుందో అలా ఈశ్వరుని గురించి వినేసరికి వాసనా బలం క్షీణించి ఈశ్వరుని వైపు తిరిగిపోతుంది. మీరు మీ వాసనలను ముందు జయింపలేరు. అందుకని భక్తితో కృష్ణా కృష్ణా అని భగవంతుని ప్రార్థించాలి. భాగవతం దశమస్కంధము వినాలి. ఈ లీలవిని పొంగిపోవాలి. కృష్ణుడిని మనసులో పెట్టాలి. అపుడు ఈ రుచి లోపలి, ఈ వాసన పైకి వస్తుంది.

**బకాసుర వధ:** ఆ పక్షి కొంగగానే ఎందుకు రావాలి? వస్తే కృష్ణ పరమాత్మ లోపలికి వెళ్ళి బయటకు వచ్చి చంపాడు. అలా రాకుండా చంపకూడదా? బకుడు అనే రాక్షసుడు ఎక్కడో లేదు. మనలోనే ఉన్నాడు. అతని పేరు దంభము. దంభము అంటే పైకి ఒకలా కనపడుతూ లోపల మరొకలా ఉండుట. దంభమును

నిగ్రహించలేరు. ఇది పైకి ఒకలా ఉంటుంది. లోపల ఒకలా ఉంటుంది. ప్రతిక్షణం వెన్నంటి ఉంటుంది. మనస్సును ప్రయత్న పూర్వకంగా గెలవాలి. దంభము మహా పాపకార్యము. దంభము సత్యముగా ఉండడమును అంగీకరించదు. సత్యమంటే కృష్ణుడు. కృష్ణుడిని తినేస్తాను అంటుంది. లోపల ఎలా ఉన్నామో పైన కూడా అలా వుండే ప్రయత్నం మొదలు పెట్టాలి. అందుకు భగవంతుని స్మరణ చేయడం మొదలు పెట్టాలి. ఈ నామ స్మరణ మనస్సుని నిరంతర ప్రక్షాళన చేస్తూ ఉంటుంది.

దంభమును తప్పించుకోవడం కష్టం. అది సత్యమును మ్రింగుతుంది. అందుకని ముందుగా కృష్ణుడు మ్రింగబడాలి. ఆర్తి చెందేవాడు వుంటే అగ్నిహోత్రమై బయటకు రావాలి. దంభమును చీల్చాలి. అలా చీలిస్తే కృష్ణుడు తనంత తాను గోపాల బాలురకు దక్కాడు. ఈశ్వరుడు ఉన్నాడని నమ్మి ఆయనను ఆర్తితో ప్రార్థిస్తే ఆయనే మన దంభమును తీసి వేస్తాడు. ఆయనే మనలను రక్షించి పుణ్య పురుషుడుగా మారుస్తాడు.

దీపము మీద వెళ్ళి పడిపోయిన శలభములు ఎలా కాలిపోతాయో అలా ఈ పిల్లవాడిని ఎంతమంది రాక్షసులు నిర్జిద్దామని ప్రయత్నం చేసినా వారందరూ మడిసిపోయినారు. హృదయంలో భగవంతుని నిలబెట్టడం చేతనవాలి. అసురీ గుణములు లోపలికి ప్రవేశించడానికి ప్రయత్నం చేసినా నామం పట్టుకుని పరమాత్మను హృదయంలో నిలబెడితే అవి మడిసి పోయి రాలి పోయి, నీవెప్పుడూ పవిత్రమయి ఉండిపోతావు. గోపాల బాలురు కృష్ణుని గురించి ఆర్తి చెందినట్లు మనుష్య జన్మలోనికి వచ్చినందుకు నీవు భగవంతుడి గురించి ఆర్తిచెండడం నేర్చుకోవాలి. ఇది వేరొకరి ప్రబోధం చేత వచ్చేది కాదు. నీఅంత నీవుగా పరిశీలనం చేసుకోవాలి. భగవంతుని గూర్చి ఆర్తి, భక్తి అలవాటు చేసుకోవాలి. అవి మాత్రమే నిన్ను రక్షించగలవు. అన్యములు రక్షించలేవు. బకాసుర సంహార వృత్తాంతము నుండి ఈ విషయమును మనం గ్రహించాలి.

(సౌజన్యం శ్రీ పైడి నాగ సుబ్బయ్య గారు తెలుగు భాగవతము వెబ్ సైట్)

***దశమ స్కంధము***

**50వ దశకము పూర్తి**

# దశకమ్ 51 – అఘాసురవధ

**51–1 శ్లో.**

**కదాచన వ్రజశిశుభిః సమం భవాన్**
**వనాశనే విహితమతిః ప్రగేతరామ్ ।**
**సమావృతో బహుతరవత్సమండలైః**
**సతేమనైర్నిరగమదీశ! జేమనైః ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ గురువాయూరు దేవా! , కదాచన= ఒకప్పుడు, భవాన్= నీవు, వ్రజశిశుభిః= గోపాలురతో, సమం = కలిసి, వన–అశనే = వనభోజనమునకు (చల్దు లారగింపవలెనని), విహితమతిః=సంకల్పించినవాడివై, ప్రగేతరామ్= వేకువజాముననే (ప్రకర్షేణ గీయతే అత్ర – ఈ కాలమందు స్తుతి చేయుదురు. ప్రాతఃకాలము), బహుతర వత్సమండలైః = అనేక ఆవుల మందలతో, సమావృతః = కూడినవాడివై, సతేమనైః = వ్యంజనములతో (వింత వింత రుచులతో ఉన్న కూరగాయలు పచ్చళ్ళు), జేమనైః=ఓదనములతో (వండిన పదార్థములు తీసుకొని) (జేమ్యతే భక్ష్యతే తత్ భక్షింపబడునది. భోజనము), నిరగమత్ = వెళ్ళితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ఒకప్పుడు నీవు గోపాలురతో కలిసి వనభోజనమునకు(చల్దులారగింపవలెనని)సంకల్పించినవాడివైవేకువజాముననే అనేక ఆవుల మందలతో కూడినవాడివై వ్యంజనములతో (వింత వింత రుచులతో ఉన్న కూరగాయలు పచ్చళ్ళు) ఓదనములతో (వండిన పదార్థములు తీసుకొని) వెళ్ళితివి.

**విశేషాలు**

**వన భోజనము:** వేడుక కొఱకు మిత్ర బాంధవాదులతో గూడి యొక తోటకు పోయి అక్కడ చేయు భోజనము. (దీనినే తెలంగాణమున 'చెట్ల కిందికి పోవుట' అని అందురు.)

**51-2 శ్లో.**

**వినిర్యతస్తవ చరణాంబుజద్వయా**
**దుదంచితం త్రిభువనపావనం రజః ।**
**మహర్షయః పులకధరైః కళేబరైః**
**ఉదూహిరే ధృతభవదీక్షణోత్సవాః ॥**

**ప్రతిపదార్థము:** వినిర్యతః= ఇల్లు వెడలి కాళింది నది ఒడ్డున, త్రిభువన పావనం= మూడు లోకములను పావనముచేయు, తవ= నీయొక్క, చరణ అంబుజ ద్వయాత్ = నీ చరణకమలములు(చరతి అనేన-దీనిచే నడుచుదురు. కాలు), ఉదంచితం = పెట్టగా, మహా-ఋషయః= మునులు (ఋచ్ఛతి జానాతి జ్ఞాపయతి మంత్రార్థమ్ మంత్రార్థమును తెలుసుకున్న, మంత్రార్థమును తెలిపిన ఋషి), రజః = ఆ నీ పాదధూళిని, పులకధరైః = పులకించిన, కళేబరైః =శరీరములందు, ఉదూహిరే = పూసుకొని, ఈక్షణ ఉత్సవాః= నీ అందము చూచు ఉత్సవములందు, ధృత భవత్= వేడుకపడిరి.

**తాత్పర్యము:** ఇల్లు వెడలి, కాళింది నది ఒడ్డున మూడు లోకములను పావనముచేయు నీయొక్క నీ చరణకమలములు పెట్టగా మునులు ఆ నీ పాదధూళిని పులకించిన శరీరములందు పూసుకొని నీ అందము చూచు ఉత్సవములందు వేడుకపడిరి.

**51-3 శ్లో.**

**ప్రచారయత్య విరళశాద్వలే తలే**
**పశూన్ విభో! భవతి సమం కుమారకైః ।**
**అఘాసురో న్యరుణదఘాయ వర్తనీం।**
**భయానకస్సపది శయానకాకృతిః ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు దేవా!, అవిరళ శాద్వలే తలే= దట్టమైన లేతపచ్చిక ఎక్కువగా ఉన్న బయళ్ళలో, పశూన్ = ఆవులను, ప్రచారయతి= మేపుచు, కుమారకైః = గోపాలురతో, సమం = కలిసి, భవతి = నీవు

సంచరించుచుండగా, సపది = అకస్మాత్తుగా, భయానకః= భయంకర ఆకారముతో, శయానక ఆకృతిః= అజగర రూపమును(కొండ చిలువ) ధరించి(శేతుం శీలం అస్య – పడుకొను స్వభావం కలది. కొండచిలువ), అఘాయ= నీ అభయము పొందు గోపాలుర ఎడల అపరాధము చేయుటకు(అఘయతి పాపం కరోతి పాపము దుఃఖము), అఘాసురః = అఘాసురుడను రాక్షసుడు ( అఘ నామాసురః – అఘ అను పేరుగల రాక్షసుడు), వర్త్మనీ = మీ దారిని (వర్త్యంతే గచ్ఛంతి పాదాః అస్యామ్ పాదములు ఇందులో వెళ్లును. మార్గము), న్యరుణత్= అడ్డగించెను.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! లేతపచ్చిక ఎక్కువగా ఉన్న బయళ్ళలో ఆవులను మేపుచు గోపాలురతో కలిసి నీవు సంచరించుచుండగా అకస్మాత్తుగా– భయంకర ఆకారముతో అజగర రూపమును( కొండ చిలువ) ధరించి –నీ అభయము పొందు గోపాలుర ఎడల అపరాధము చేయుటకు అఘాసురుడను రాక్షసుడు మీ దారిని అడ్డగించెను.

**51–4 శ్లో.**

**మహాచలప్రతిమతనోర్గుహానిభ –**
**ప్రసారితప్రథితముఖస్య కాననే ।**
**ముఖోదరం విహరణకౌతుకాత్ గతాః**
**కుమారకాః కిమపి విదూరగే త్వయి ॥**

**ప్రతిపదార్థము:** కుమారకాః= వివేక రహితులయిన గోపాలురు, కిమపి = కొంచెము, త్వయి= నువ్వు, విదూరగే= దూరము కాగా(విదూరే గచ్ఛతి చాలా దూరము వెళ్లువాడు), కాననే= అడవిలో (కం జలం అననం జీవనం అస్య – జలమే జీవనంగా గలది. వనము, మహా–అచల ప్రతిమ తనోః= ఒక కొండవంటి శరీరముతో (న చలతి కదలనిది. పర్వతము), గుహా నిభ–ప్రసారిత = కొండగుహవలె విస్తరింపచేయబడిన (ప్రసారితః కృతవిస్తారః – విస్తరింపచేయ బడినది), ప్రథిత =విస్తృతమైన, ముఖస్య= ముఖము కలిగిన, ముఖ ఉదరం= కొండచిలువ నోటితొర్రలోనికి(ఉద్ దృణాతి అన్నం అనేన దీనితో అన్నమును

గ్రహింతురు. ఉదరము, పొట్ట), విహరణకౌతుకాత్= విహారము చేయు వేడుకతో, గతాః = వెళ్ళిరి.( ప్రవేశించిరి).

**తాత్పర్యము:** వివేక రహితులయిన గోపాలురు కొంచెము నువ్వు దూరము కాగా అడవిలో ఒక కొండ వంటి శరీరముతో కొండగుహవలె విస్తృతమైన ముఖము కలిగిన కొండచిలువ నోటితొ్రలోనికి విహారము చేయు వేడుకతో వెళ్ళిరి. (ప్రవేశించిరి).

**51–5 శ్లో.**
**ప్రమాదతః ప్రవిశతి పన్నగోదరం**
**క్వథత్తనౌ పశుపకులే సవాత్సకే ।**
**విదన్నిదం త్వమపి వివేశిథ ప్రభో!**
**సుహృజ్జనం విశరణమాశు రక్షితుమ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో= ఓ గురువాయూరు దేవా!, ప్రమాదతః= పొరపాటున, ఇదం పన్నగ ఉదరం = ఆ మహా సర్పము ఉదరము లోనికి(పన్నం అధోముఖం యథా తథా గచ్ఛతి ముఖం క్రిందకు పెట్టి వెళ్లునది. పాము), ప్రవిశతి = ప్రవేశించి, క్వథత్ తనౌ=ఆ కొండ చిలువ ఉదరములోని వేడిని భరించలేక దహించుకు పోతున్న శరీరములు కలిగిన (ఉడికిపోతున్న) (నిష్పాకే క్వథతి మరగపెట్టుట), సవాత్సకే= ఆవు దూడలతో కూడిన, పశుపకులే = గోపాలకుల పరిస్థితి, విదన్= తెలుసుకొని, విశరణమ్= అనాథలైన, సుహృత్ జనం= స్నేహ జనులను (సుష్ఠు హృదయం యస్యః – మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), ఆశు= వేగమే, రక్షితుమ్= రక్షించుటకు, త్వమపి = నువ్వు కూడా, వివేశిథ= ఆ సర్పము నోటిలోనికి ప్రవేశించితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! పొరపాటున ఆ మహా సర్పము ఉదరము లోనికి ప్రవేశించి ఆ కొండ చిలువ ఉదరములోని వేడిని భరించలేక దహించుకు పోతున్న శరీరములు కలిగిన (ఉడికిపోతున్నఆవు దూడలతో కూడిన గోపాలకుల పరిస్థితి తెలుసుకొని అనాథలైన స్నేహ జనులను వేగమే రక్షించుటకు నువ్వు కూడా ఆ సర్పము నోటిలోనికి ప్రవేశించితివి.)

**51-6 శ్లో.**

**గళోదరే విపులితవర్ష్మణా త్వయా**
**మహోరగే లుఠతి నిరుద్ధమారుతే ।**
**ద్రుతం భవాన్ విదలిత కంఠమండలో**
**విమోచయన్ పశుప పశూన్ వినిర్యయౌ ॥**

**ప్రతిపదార్థము:** విపులిత వర్ష్మణా= వర్ధిత శరీరముతో (విస్తరింపజేసిన శరీరముతో) (వర్షతి వృష్యతేవ స్వేదమ్ వర్ష సేచనముతో పుట్టునది.శరీరము), త్వయా = నువ్వు, మహా –ఉరగే = ఆ గొప్ప పాము అయిన అఘాసురుని యొక్క(ఉరసా గచ్ఛతి వక్షఃస్థలంతో నడచునది. పాము), గళ ఉదరే = నోటిలో, నిరుద్ధ మారుతే= ప్రాణ వాయువును నిలుపుదల చేయుటచే(నితరాం రుద్ధః అవరుద్ధః–నిరోధింపబడ్డవాడు.)( మరుత్ ఏవ మారుతః వాయువు), లుఠతి= ఇటు అటు ఊపిరాడక అది విల విల తన్ను కొనగా, ద్రుతం= తక్షణమే,భవాన్ = నువ్వు, కంఠమండలః= ఆ సర్పముయొక్క కంఠమును, విదలిత= చీల్చి, పశుప పశూన్ = గోపాలురను గోవులను, విమోచయన్ = పాము నోటిలో నుండి బయటికి వచ్చునట్లు చేసి, వినిర్యయౌ= నువ్వు కూడా వెలుపలకు వచ్చితివి.

**తాత్పర్యము:** ఆ పాము నోరు పట్టనంతగా శరీరమును పెంచి నువ్వు అఘాసురుని యొక్క నోటిలో ప్రాణ వాయువును నిలుపుదల చేయుటచే, ఇటు అటు ఊపిరాడక అది విల విల తన్ను కొనగా , తక్షణమే నువ్వు ఆ సర్పముయొక్క కంఠమును చీల్చి గోపాలురను గోవులను పాము నోటిలో నుండి బయటికి వచ్చునట్లు చేసి నువ్వు కూడా వెలుపలకు వచ్చితివి.

**51-7 శ్లో.**

**క్షణం దివి త్వదుపగమార్థమాస్థితం**
**మహాసురప్రభవమహో మహో మహత్ ।**
**వినిర్గతే త్వయి తు నిలీనమంజసా**
**సభః స్థలే ననృతురథో జగుస్సురాః ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ ఉపగమ అర్థమ్= నువ్వు ఆ పాము నోటినుండి బయటికి వచ్చులోపలనే (లేదా ఆ 'అఘాసురుని' నోటిలోనికి ప్రవేశించగనే)(ఉపగమః సమీపగమనమ్ దగ్గరకు వెళ్లుట), దివి= ఆకాశములో, క్షణం = క్షణములో (క్షణోతి నాశయతి సర్వం యథాకాలమ్ అన్నింటిని నశింపచేయునది. క్షణకాలము), ఆస్థితం= ఒక చోట ఉన్న (ఆస్థితః ఆతిష్ఠతి అసౌ ఒకచోట వుండువాడు), మహా అసురప్రభవమ్ = ఆ మహా రాక్షసుని శరీరమునందుండి పుట్టిన, మహత్ = విపులమయిన, మహః = అత్యుజ్జ్వలమయిన తేజము(మహ్యతే పూజ్యతే అస్మిన్ ఇందులో పూజింపబడును), వినిర్గతే= బయటికి వచ్చి, త్వయి తు=నీయందు, అంజసా= వెంటనే (అంజం గతిం విలంబం వా స్యతి నాశయతి విలంబమును పోగొట్టునది. శీఘ్రము, తొందర), నిలీనమ్= విలీనమయింది, అహో = ఆహా !, అథః= అటుపిమ్మట, నభః స్థలే = ఆకాశమునందు, సురాః= దేవతలు, జగుః= అఘాసురుని చంపిన నీ గొప్పతనమును గానము చేసిరి, ననృతుః= నృత్యములు చేసిరి.

**తాత్పర్యము:** నువ్వు ఆ పాము నోటినుండి బయటికి వచ్చులోపలనే( లేదా ఆ 'అఘాసురుని' నోటిలోనికి ప్రవేశించగనే) ఆ మహా రాక్షసుని శరీరమునందుండి విపులమయిన అత్యుజ్జ్వలమయిన తేజము బయటికి వచ్చి నీయందు వెంటనే విలీనమయింది.ఆకాశమునందు దేవతలు అఘాసురుని చంపిన నీ గొప్పతనమును గానము చేసిరి. నృత్యములు చేసిరి.

**విశేషాలు:** రాక్షసుని శరీరము నుండి బయటికి వచ్చిన తేజస్సు వాని సూక్ష్మ శరీరము (లింగదేహము) నశించుటవలన, ఆ తేజస్సు కృష్ణుని జ్యోతిర్మూర్తిలో ఐక్యము పొందెనని తాత్పర్యము.

**51-8 శ్లో.**
**సవిస్మయైః కమలభవాదిభిస్సురైః**
**అనుద్రుతస్తదనుగతః కుమారకైః ।**
**దినే పునస్తరుణదశాముపేయుషి**
**స్వకైర్భవానతనుత భోజనోత్సవమ్ ॥**

**ప్రతిపదార్థము:** పునః = మరలా, సవిస్మయైః= ఆశ్చర్యముతో (విశేషేణ స్మాయతే తర్కయతి తస్య భావః కర్మ వా తర్కించుట, ఆశ్చర్యపడుట), కమలభవ ఆదిభిః సురైః = బ్రహ్మదేవుడు మొదలగు దేవతలు, అనుద్రుతః = ఆకాశ మార్గములో నిన్ను చూసి, నీ చేష్టలను అనుసరించుచుండగా (అను పశ్చాత్ ద్రుతః ఆగతః–అనుసరించువాడు), స్వకైః కుమారకైః = ఆత్మీయులైన గోపాలకులతో కలిసి(స్వం ఏవ స్వక–తనది, తనవాడు), దినే= రోజులో (ద్యతి అంధకారమ్ చీకటిని నాశనము చేయునది. దినము, పగలు), తరుణ దశామ్ ఉపేయుషి= మధ్యాహ్న సమయమగువరకు(తరంతి కౌమారమ్ కౌమారమును దాటినవాడు. యుక్త వయస్కుడు ఆ కాలము), భవాన్ = నువ్వు, భోజన ఉత్సవమ్= వన భోజనోత్సవమును, అతనుత= చేసితివి.

**తాత్పర్యము:** ఆశ్చర్యముతో బ్రహ్మదేవుడు మొదలగు దేవతలు ఆకాశ మార్గములో నిన్ను చూసి, నీ చేష్టలను అనుసరించుచుండగా ఆత్మీయులైన గోపాలకులతో కలిసి మధ్యాహ్న సమయమగువరకు నువ్వు వనభోజనోత్సవమును చేసితివి.

**51–9 శ్లో.**

**విషాణికామపి మురళీం నితంబకే**
**నివేశయన్ కబలధరః కరాంబుజే ।**
**ప్రహాసయన్ కలవచనైః కుమారకాన్**
**బుభోజిథ త్రిదశగణైర్ముదానుతః ॥**

**ప్రతిపదార్థము:** విషాణికామ్= కొమ్ముబూరను, అపి= మరియు, మురళీం= మురళిని, నితంబకే = నడుములోని పచ్చని వస్త్రములో (నితంబతి పీడయతి చిత్తమ్ చిత్తము పీడించునది. నడుము), నివేశయన్ = అమర్చుకొని, కర అంబుజే = పద్మములవంటి హస్తములో, కబలధరః= ముద్దను పట్టుకొని, కుమారకాన్ = గోపాలకులను, కలవచనైః = హాస్యపు మాటలతో, ప్రహాసయన్= నవ్విస్తూ, త్రిదశగణైః= దేవతాగణములు, ముదా = సంతోషముతో, నుతః= స్తుతించుచుండగా, బుభోజిథ= భుజించితివి.

**తాత్పర్యము:** కొమ్ముబూరను మురళిని నడుములోని పచ్చని వస్త్రములో

అమర్చుకొని, పద్మములవంటి హస్తములో ముద్దను పట్టుకొని, గోపాలకులను హాస్యపు మాటలతో నవ్విస్తూ, దేవతాగణములు సంతోషముతో స్తుతించుచుండగా భుజించితివి.

**51–10 శ్లో.**
**సుఖాశనం త్విహ తవ గోపమండలే**
**మఖాశనాత్ప్రియమివ దేవమండలే ।**
**ఇతి స్తుతస్త్రిదశవరైర్జగత్పతే!**
**మరుత్పురీనిలయ గదాత్ ప్రపాహి మామ్ ॥**

**ప్రతిపదార్థము:** జగత్పతే = ఓ జగత్పతీ!, మరుత్పురీనిలయ= గురువాయూరు కృష్ణ దేవా!, తవ = నీకు, ఇహ= ఇక్కడ, గోపమండలే= గోపబాలుర నడుమ, సుఖ అశనం తు= చేయుచున్న సుఖ భోజనము, దేవ మండలే= ఇంద్రాది దేవనాయకుల మధ్య, మఖ అశనాత్= యజ్ఞయాగాదులలో నీకు సమర్పించు హవిర్భోజనము కంటె (మఖము=మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర – దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము), ప్రియమ్ ఇవ = ప్రియముగా ఉన్నట్లున్నది (ప్రీణాతి అసౌ సంతోషపెట్టువాడు ప్రియమైనది ప్రియము చేయునది), ఇతి= అని, త్రిదశవరైః= బ్రహ్మాదిదేవతలచే(తృతీయా యౌవనాఖ్యా దశా యస్య మూడవ దశలో, యౌవనావస్థలో వున్నవాడు), స్తుతః= పొగడబడుతున్న నువ్వు, మామ్= నన్ను, గదాత్=రోగమునుండి, ప్రపాహి= రక్షించుము.

**తాత్పర్యము:** ఓ జగత్పతీ! గురువాయూరు కృష్ణ దేవా! "నీకు గోపబాలుర నడుమ చేయుచున్న సుఖ భోజనము ఇంద్రాది దేవనాయకుల మధ్య యజ్ఞయాగాదులలో నీకు సమర్పించు హవిర్భోజనము కంటె ప్రియముగా ఉన్నట్లున్నది" అని బ్రహ్మాదిదేవతలచే పొగడబడుతున్న నువ్వు నన్ను రోగమునుండి రక్షించుము.

**విశేషము:** తమ వెనుక కృష్ణుడున్నాడని నమ్మి గోపాలకులు అఘాసురుని నోట్లో ప్రవేశించారు. మన వెనకాల ఈశ్వరుడు ఉన్నాడని నమ్మి మనం కూడా జీవన యానం చేయాలి.ఇదే ఈ ఉపాఖ్యాన సందేశం.

***దశమ స్కంధము***
**51వ దశకము పూర్తి.**

# దశకమ్ 52 –బ్రహ్మగర్వశమనము

**52–1 శ్లో.**
**అన్యావతారనికరేష్వనిరీక్షితం తే**
**భూమాతిరేకమభివీక్ష్య తదాఘమోక్షే ।**
**బ్రహ్మా పరీక్షితుమనాః స పరోక్షభావం**
**నిన్యేఽథ వత్సకగణాన్ ప్రవితత్య మాయామ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, అన్య అవతార= నృసింహ మొదలయిన నీ ఇతర అవతారముల (అవతరతి తస్య భావః దేవతలు మానుషరూపములో భూమిపై నవతరించుట), నికరేషు = సమూహములందు, అనిరీక్షితం= ఎప్పుడు కనబడని (బాగా చూడబడని), తే = నీయొక్క, భూమా–అతిరేకమ్= ఐశ్వర్యాతిశయమును (పాపహరణ నిపుణములైన) (భూమా=మహత్త్వం. సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థం) (అతిరేకం=అతిశయితం రిచ్యతే ఆధిక్యము గొప్పదనము), అఘ మోక్షే=అఘాసుర మోక్ష విషయమును, అభివీక్ష్య =చూసి, తదా=అప్పుడు, పరీక్షితు మనాః= నీ కృష్ణావతార విశేషం పరీక్షింపదలచి, స బ్రహ్మా= ఆ బ్రహ్మ దేవుడు, వత్సక గణాన్ = ఆవుల మందలయందు, మాయామ్ ప్రవితత్య = మాయను విస్తరింపచేసి, పరోక్షభావం=వాటిని అంతర్ధానము (అక్ష్ణోః పరమ్ కండ్లకు దూరంగా మాటుగా), నిన్యే = చేసెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట నృసింహ మొదలయిన నీ ఇతర అవతారముల సమూహములందు ఎప్పుడు కనబడని నీయొక్క ఐశ్వర్యాతిశయమును (పాపహరణ నిపుణములైన), అఘాసుర మోక్ష విషయమును చూసి అప్పుడు నీ కృష్ణావతార విశేషం పరీక్షింపదలచి ఆ బ్రహ్మ దేవుడు ఆవుల మందలయందు మాయను విస్తరింపచేసి వాటిని అంతర్ధానము చేసెను .

**52-2 శ్లో.**

**వత్సానవీక్ష్య వివశే పశుపోత్కరే తాన్**
**ఆనేతుకామ ఇవ ధాతృమతానువర్తీ ।**
**త్వం సామిభుక్తకబలో గతవాంస్తదానీం**
**భుక్తాంస్తిరోఽధిత సరోజభవః కుమారాన్ ॥**

**ప్రతిపదార్థము:** వత్సాన్ =అవుల మందలు, అవీక్ష్య = కనబడకపోవుటచే, వివశే=ఆందోళనచెందిన, పశుప ఉత్కరే= గోపబాలురను చూసి, తాన్ = వాటిని, ఆనేతుకామ ఇవ = నువ్వే వెదికి తేవలెనని తలచి, ధాతృ మత అనువర్తీ= బ్రహ్మమాయలో పడినవాడిలా నటించి, త్వం= నువ్వు, సామిభుక్త= సగము తిన్న, కబలః = అన్నపు ముద్దతో, గతవాన్= వెళ్ళావు, తదానీం = నువ్వు దూరముగా వెళ్ళిన ఆ సమయములో, భుక్తాన్= అన్నము తినుచున్న, కుమారాన్= గోప బాలురను అదే స్థితిలో, సరోజభవః = బ్రహ్మదేవుడు, తిరః అధిత= మాయము చేసెను.

**తాత్పర్యము:** అవుల మందలు కనబడకపోవుటచే ఆందోళనచెందిన గోపబాలురను చూసి వాటిని నువ్వే వెదికి తేవలెనని తలచి బ్రహ్మమాయలో పడినవాడిలా నటించి నువ్వు సగము తిన్న అన్నపు ముద్దతో వెళ్ళావు. నువ్వు దూరముగా వెళ్ళిన ఆ సమయములో అన్నము తినుచున్న గోప బాలురను అదే స్థితిలో బ్రహ్మదేవుడు మాయము చేసెను.

**52-3 శ్లో.**

**వత్సాయితస్తదను గోపగణాయితస్త్వం**
**శిక్యాదిభాండమురళీగవలాదిరూపః ।**
**ప్రాగ్వత్ విహృత్య విపినేషు చిరాయ సాయం**
**త్వం మాయయాఽథ బహుధా వ్రజమాయయాథ ॥**

**ప్రతిపదార్థము:** తదను= అప్పుడు, త్వం =నీవే, మాయయా= మాయతో, వత్సాయితః= గోమందలుగను (వత్స ఇవ ఆచరన్), గోపగణాయితః=

గోపబాలకులుగను, శిక్య ఆదిభాండ=ఉట్లు, కుండలుగను (స్రంసతే అవలంబతే స్తంభేభ్యః–స్తంభములకు వ్రేలాడునది. ఉట్టి.)(భణ్యతే భణతి వా, శబ్దం కరోతి శబ్దము చేయునది. పాత్రము), మురళీ = వేణువులు, గవల = కొమ్ముబూరలు, ఆదిరూపః=మొదలయిన రూపములను పొంది, ప్రాక్ వత్=పూర్వము వలె, చిరాయ = చాలా సేపు, విహృత్య =ఆటలాడుకొనుచు (విహరించి), విపినేషు = ఆ వనములలోగడిపి, సాయం=సాయం కాలములో, త్వం = నువ్వు, అథ బహుధా= అట్లు అనేక రూపములతో, వ్రజమ్ = వ్రేపల్లెకు, ఆయయాథ= తిరిగి వచ్చితివి.

**తాత్పర్యము:** అప్పుడు నీవే మాయతో గోమందలుగను గోపబాలకులుగను, ఉట్లు , కుండలుగను వేణువులు కొమ్ముబూరలు మొదలయిన రూపములను పొంది పూర్వము వలె చాలా సేపు ఆటలాడుకొనుచు ఆ వనములలోగడిపి సాయం కాలములో నువ్వు అట్లు అనేక రూపములతో వ్రేపల్లెకు తిరిగి వచ్చితివి.

**52–4 శ్లో.**
**త్వామేవ శిక్య గవలాదిమయం దధానో**
**భూయస్త్వమేవ పశువత్సకబాలరూపః ।**
**గోరూపిణీభిరపి గోపవధూమయీభిః**
**ఆసాదితోఽసి జననీభిరతిప్రహర్షాత్ ॥**

**ప్రతిపదార్థము:** త్వామ్ ఏవ= నువ్వే, శిక్య గవల ఆదిమయం= సృష్టించిన ఉట్లు, కొమ్ము బూరలు, దధానః= ధరించి, భూయః = మరలా, త్వమ్ ఏవ= నువ్వే, పశు వత్సక బాల రూపః= దూడలు గోపబాలుర రూపములు ధరించి రాగా, గో రూపిణీభిః జననీభిః అపి = గోరూపమునున్నతల్లులతో, గోప వధూమయీభిః = గోపికల రూపమున, ఆసాదితః అసి= వాత్సల్యమును పొందావు.

**తాత్పర్యము:** నువ్వు సృష్టించిన 'ఉట్లు, కొమ్ము బూరలు' ధరించి– గోపబాలురు మరియు గోవులుగా, అందరి రూపాలు ధరించి బృందావనమును చేరావు. గోప బాలకుల ఆకృతిలో ఉన్న నిన్నుచూసి ఆ గోపాలకుల – తల్లులు మిక్కిలి ప్రేమతోను నిన్ను ఆదరించారు.

**52-5 శ్లో.**

**జీవం హి కంచిదభిమానవశాత్ స్వకీయం**
**మత్వా తనూజ ఇతి రాగభరం వహంత్యః ।**
**ఆత్మానమేవ తు భవంతమవాప్య సూనుం**
**ప్రీతిం యయుర్న కియతీం వనితాశ్చ గావః ॥**

**ప్రతిపదార్థము:** కంచిత్ జీవం = ఈ లోకములో తన కర్మను తాను అనుభవించుటకు వచ్చిన జీవుని, అభిమాన వశాత్ = స్థూల సూక్ష్మ శరీరమును (ఉపాధిని), స్వకీయం తనూజ ఇతి = నా కుమారుడను మమకారము(స్వస్య ఇదమ్ తనది, తనకు సంబంధించినది), మత్వా= వహించి, రాగభరం = ఈ లోకములో తల్లులు అనురాగము, వహంత్యః= పెంచుకొందురు, ఆత్మానమ్ ఏవ తు = కేవలము పరమాత్మవైయున్న, భవంతమ్ = నిన్ను, సూనుం = కుమారునిగా (సూయతే ప్రసూయతే కనబడ్డవాడు పుట్టినవాడు. కొడుకు), అవాప్య = పొంది, వనితాః చ గావః హి =గోప వనితలు, ఆవులు (వన్యతే సేవ్యతే సేవింపబడునది. స్త్రీ), ప్రీతిం యయుః= ఎంత ప్రీతిని పొందారో, న కియతీం హి= లెక్కపెట్టుటకు వీలు లేదు కదా!

**తాత్పర్యము:** ఈ లోకములో తన కర్మను తాను అనుభవించుటకు వచ్చిన జీవునిపై (ఆత్మపై) నా కుమారుడను మమకారము ఈ లోకములో తల్లులు అనురాగము పెంచుకొందురు కాని పరమాత్మవేయైయున్న నిన్ను కుమారునిగా పొంది గోప వనితలు, ఆవులు ఎంత ప్రీతిని పొందారో లెక్కపెట్టుటకు వీలు లేదు కదా!

**52-6 శ్లో.**

**ఏవం ప్రతిక్షణవిజృంభితహర్షభార-**
**నిశ్శేషగోపగణలాలితభూరిమూర్తిమ్ ।**
**త్వామగ్రజోఽపి బుబుధే కిల వత్సరాంతే**
**బ్రహ్మాత్మనోరపి మహాన్ యువయోర్విశేషః ॥**

**ప్రతిపదార్థము:** ఏవం = ఇట్లు, ప్రతిక్షణ= ప్రతిక్షణమును (క్షణం క్షణమ్),

విజృంభిత = ఉప్పొంగుచున్న(విజృంభితః ఉద్ఘాటితః, క్రీడా ఆవలించబడినది ఆట, మనోరంజనము), హర్షభార= ఆనంద భారముతో, నిశ్శేష = సమస్త, గోపగణ = గోప కులముచే, లాలిత= లాలింపబడిన, త్వామ్ భూరిమూర్తిమ్= ఆవుదూడలలో, గోపాలకులలో వ్యాపించిన నీ భూరి మూర్తిని, అగ్రజః అపి = నీ అన్న అయిన బలరాముడు కూడా, వత్సర —అంతే= సంవత్సరము చివర, బుబుధే కిల = తెలుసుకొనెను కదా!, మహాన్ బ్రహ్మాత్మనః అపి = మీరిరువురును పరబ్రహ్మ స్వరూపులే అయినప్పటికి, యువయోః= నువ్వు, విశేషః= ప్రత్యేకముగా ఉన్నావు.

**తాత్పర్యము:** ఇట్లు ప్రతిక్షణమును ఉప్పొంగుచున్న ఆనంద భారముతో సమస్త గోప కులము చే లాలింపబడిన ఆవుదూడలలో, గోపాలకులలో వ్యాపించిన నీ భూరి మూర్తిని నీ అన్న అయిన బలరాముడు కూడా సంవత్సరము చివర తెలుసుకొనెను కదా! మీరిరువురును పరబ్రహ్మస్వరూపులే అయినప్పటికి నువ్వు ప్రత్యేకముగా ఉన్నావు. (శ్రీ కృష్ణుడు నిష్కల బ్రహ్మవిశేషము కలవాడివి. బలరాముడు సకల బ్రహ్మ విశేషమని భావం)

**విశేషాలు**

**కలా:** ఒక శకలం. ఒక భాగం. ఒక ముక్క. ప్రాణం మొదలు నామంవరకూ పదహారు ఇవి. మొత్తం అనాత్మ. ప్రపంచమంతా ఈ పదహారే. షోడశ కళలని పేరు వీటికి. వీటితో కలిపి పట్టుకుంటే ఆత్మసకలం. వాటిని లయం చేసి పట్టుకుంటే నిష్కలం లేదా అకలం. Indivisible. కళాప్రళయ మార్గమేదో గురూపదేశంవల్ల గ్రహించాలని ప్రశ్నోపనిషత్తులో భాష్యకారుల ఉపదేశం.

**52-7 శ్లో.**
**వర్షావధౌ నవపురాతనవత్సపాలాన్**
**దృష్ట్వా వివేకమసృణే ద్రుహిణే విమూఢే ।**
**ప్రాదీదృశః ప్రతినవాన్ మకుటాంగదాది-**
**భూషాంశ్చతుర్భుజయుజః సజలాంబుదాభాన్ ॥**

**ప్రతిపదార్థము:** వర్ష అవధౌ= ఒక సంవత్సరము తరువాత(వృష్యతే సిచ్యతే ప్రియతే ప్రార్థ్యతే సంవత్సరము), నవ = క్రొత్తగా శ్రీకృష్ణమయులైయున్న దూడలను గోపాలకులను (నూయతే ప్రశస్యతే అచిరకృతత్వాత్ అప్పుడే చేయబడ్డది ప్రశంసింపబడ్డది. ప్రశంస), పురాతన వత్సపాలాన్ = తాను దాచిన వెనుకటి దూడలను, గోపాలకులను (పురాకాలే భవం (కాలవాచీ) పూర్వకాలంలో జరిగినది ప్రాచీనమైనది), దృష్ట్వా= చూసి, ద్రుహిణే= బ్రహ్మ (ద్రుహ్యతి దుష్టేభ్యః దుష్టులను హింసించువాడు. బ్రహ్మ), విమూఢే = తికమకపడి, వివేకమ్ అస్పృణే =ఆలోచించుటకు అసమర్థుడయ్యాడు. (విశేషేణ వినక్తి విచారయతి తస్య భావః కర్మ వా విచారణ, ఆలోచన, వివేచించుట, వివేచన), ప్రతినవాన్ =అప్పుడు మాయా మయములైన, మకుట అంగద ఆది–భూషాన్ = కిరీటములు భుజకీర్తులు మొదలగు వానిని ధరించి(మంకతే భూషయతి అనేన దీనితో అలంకరించు కొందురు. కిరీటము), చతుర్భుజ యుజః= నాలుగు భుజములతో (చత్వారో భుజాః అస్య – నాల్గు భుజములు కలవాడు. విష్ణువు), సజల అంబుద ఆభాన్ = తొలకరి మేఘపు రంగులతో, ప్రాదీదృశః= నీ వలె ఉన్న గోపాలక మూర్తులను బ్రహ్మకు చూపించితివి.

**తాత్పర్యము:** ఒక సంవత్సరము తరువాత క్రొత్తగా శ్రీకృష్ణమయులైయున్న దూడలను గోపాలకులను తాను దాచిన వెనుకటి దూడలను, గోపాలకులను చూసి బ్రహ్మ తికమకపడి ఆలోచించుటకు అసమర్థుడయ్యాడు. అప్పుడు మాయా మయములైన కిరీటములు భుజకీర్తులు మొదలగు వానిని ధరించి నాలుగు భుజములతో తొలకరి మేఘపు రంగులతో నీ వలె ఉన్న గోపాలక మూర్తులను బ్రహ్మకు చూపించితివి.

**52–8 శ్లో.**
**ప్రత్యేకమేవ కమలా పరిలాలితాంగాన్**
**భోగీంద్రభోగశయనాన్ నయనాభిరామాన్ ।**
**లీలానిమీలితదృశః సనకాదియోగి**
**వ్యాసేవితాన్ కమలభూర్భవతో దదర్శ ॥**

**ప్రతిపదార్థము:** కమలా = లక్ష్మీదేవి(కమలం విద్యతే అస్యాః – కమలమునం దుండునది. లక్ష్మి), అంగాన్ = పాదములకు, పరిలాలిత = పరిచర్యలు చేయుచుండగా, భోగీంద్ర భోగ = ఆదిశేషుని పడగల శయ్యల యందు(భోగినాం సర్పాణాం ఇంద్రః – సర్పముల రాజు.)( భుజ్యతే తస్య భావః – అనుభవము పాము పడగ), శయనాన్= నిద్రపోవుచున్నట్లు, నయన అభిరామాన్= కన్నుల పండువగా, లీలా నిమీలిత దృశః = లీలగా కన్ను మొగిచియున్న (లియం ఆమోదం లాతి క్రీడ, ఆమోదము.)(లీలా=ప్రేక్షణే పశ్యతి చూచుట), సనక ఆది యోగి= సనకాది మహాయోగులచే, వ్యాసేవితాన్= కొలువబడుచున్న విష్ణుమూర్తిగా, ప్రత్యేకమ్ ఏవ =ప్రత్యేకముగా ప్రతి గోపాలకునిలోను, కమలభూః= ఆ బ్రహ్మ, భవతః = నిన్ను, దదర్శ= దర్శించెను.

**తాత్పర్యము:** లక్ష్మీదేవి పాదములకు పరిచర్యలు చేయుచుండగా ఆదిశేషుని పడగల శయ్యల యందు చూచు భక్తులకు కన్నుల పండువగా కన్ను మొగిచియున్న, సనకాది మహాయోగులచే కొలువబడుచున్న విష్ణుమూర్తిగా ప్రత్యేకముగా ప్రతి గోపాలకునిలోను ఆ బ్రహ్మ నిన్ను దర్శించెను. (ప్రతి గోపాలకునిలోను విష్ణుమూర్తిని బ్రహ్మ దర్శించెనని భావం)

**52–9 శ్లో.**

**నారాయణాకృతిమసంఖ్యతమాం నిరీక్ష్య**
**సర్వత్ర సేవకమపి స్వమవేక్ష్య ధాతా ।**
**మాయానిమగ్నహృదయో విముమోహ యావత్**
**ఏకో బభూవిథ తదా కబలార్ధపాణిః ॥**

**ప్రతిపదార్థము:** మాయా నిమగ్న హృదయః = మాయ పూర్తిగా ఆవరించిన హృదయము కలిగిన, ధాతా = బ్రహ్మదేవుడు, అసంఖ్యతమాం = లెక్కలేనంతమంది, నారాయణ ఆకృతిమ్= నారాయణ మూర్తులను (నారా జలం అయనం స్థానం యస్య – జలము నివాస స్థానంగా కలవాడు. విష్ణువు), నిరీక్ష్య = చూసి, సర్వత్ర= అందరి నారాయణమూర్తుల చెంత, సేవకమ్ అపి = ఒక్కొక్క దాసునిగా ఉన్న(సేవతే అసౌ సేవించువాడు), స్వమ్ = తనను, అవేక్ష్య = చూసి, యావత్ విముమోహ =బ్రహ్మ

అచేతన ప్రాయునిగా ఎప్పుడయ్యాడో (తబ్బిబ్బయ్యాడో), తదా= అప్పుడు నువ్వు, కబల అర్ధపాణిః = విశ్వరూప మును చాలించి చేతిలో పెరుగన్నపుముద్ద తీసుకొని, ఏకః = దూడలను వెతకుచున్న ఒక్క గోపాలమూర్తివిగా, బభూవిథ= కనిపించావు.

**తాత్పర్యము:** మాయ పూర్తిగా ఆవరించిన హృదయము కలిగిన బ్రహ్మదేవుడు లెక్కలేనంతమంది నారాయణ మూర్తులను చూసి అందరి నారాయణమూర్తుల చెంత ఒక్కొక్క దాసునిగా ఉన్న తనను చూసి బ్రహ్మ అచేతన ప్రాయునిగా ఎప్పుడయ్యాడో ( తబ్బిబ్బయ్యాడో), అప్పుడు నువ్వు బ్రహ్మను కరుణించి విశ్వరూప మును చాలించి చేతిలో పెరుగన్నపుముద్ద తీసుకొని దూడలను వెతకుచున్న ఒక్క గోపాలమూర్తివిగా కనిపించావు.

**52-10 శ్లో.**
**నశ్యన్ మదే తదను విశ్వపతిం ముహుస్త్వాం**
**నత్వా చ నూతవతి ధాతరి ధామ యాతే ।**
**పోతైస్సమం ప్రముదితైః ప్రవిశన్ నికేతం**
**వాతాలయాధిప! విభో! పరిపాహిరోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** వాతాలయ అధిప= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మదే నశ్యన్= మదము నశింపగా, తదను= అప్పుడు, విశ్వపతిం= విశ్వాధిపతివయిన, త్వాం = నీకు, ముహుః = మరలా మరలా, నత్వా చ = నమస్కరించి, నూతవతి= స్తుతించి, ధాతరి= బ్రహ్మ దేవుడు, ధామ యాతే= తనస్థానమయిన సత్యలోకమునకు వెడలెను(ధీయతే ద్రవ్యజాతమస్మిన్ వస్తువులు పెట్టు చోటు. ఇల్లు), పోతైః= గోపాలకులతో (పునాతి పవిత్రము చేయువాడు. బాలకుడు), సమం= కలిసి, ప్రముదితైః =సంతోషించి, నికేతం = గృహములో(నికేతంతి నివసంతి అత్ర -ఇక్కడ నివసింతురు. ఇల్లు), ప్రవిశన్ = ప్రవేశించిన, విభో= ప్రభూ!, రోగాత్ =రోగము నుండి, పరిపాహి= నన్ను రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! మదము నశింపగా అప్పుడు విశ్వాధిపతివయిన నీకు మరలా మరలా నమస్కరించి స్తుతించి బ్రహ్మ దేవుడు

తనస్థానమయిన సత్యలోకమునకు వెడలెను. గోపాలకులతో కలిసి సంతోషించి గృహములో ప్రవేశించిన ప్రభూ! రోగము నుండి నన్ను రక్షించు.

**దశమ స్కంధము**

**52వ దశకము సమాప్తము**



# దశకమ్ 53 – ధేనుకాసురవధ

**53–1 శ్లో.**

**అతీత్య బాల్యం జగతాంపతే! త్వముపేత్య పౌగండవయో మనోజ్ఞమ్ ।**
**ఉపేక్ష్య వత్సావనముత్సవేన ప్రావర్తథా గోగణపాలనాయామ్ ॥**

**ప్రతిపదార్థము:** జగతాం పతే= ఓ లోక పతీ! గురువాయూరు ప్రభూ!, త్వమ్ = నువ్వు, బాల్యం = బాల్యమును (అయిదేండ్లు) (బాలస్య భావః కర్మ వా బాల్యము), అతీత్య = దాటి, మనోజ్ఞమ్ = అతి మోహనమయిన(మనసా జానాతి గృహ్ణాతి మనసుతో గ్రహించునది. అందమైనది), పౌగండ వయః= ద్వితీయ పంచకమయిన ఆరవయేడును (పోగండస్య ఇదం ఉచితం వా బాలోచితమైనది. బాల్యావస్థ), ఉపేత్య= పొంది, వత్స అవనమ్= చిన్ని లేగదూడలను రక్షించు పనిని(అవతి రక్షతి తస్య భావః–రక్షించునది, రక్ష), ఉపేక్ష్య = విడిచిపెట్టి, ఉత్సవేన = ఉత్సాహముగా, గోగణపాలనాయామ్= గోవుల మందలను రక్షించు పనిని, ప్రావర్తథాః= ప్రారంభించితివి.

**తాత్పర్యము:** ఓ లోక పతీ! గురువాయూరు ప్రభూ! నువ్వు బాల్యమును (అయిదేండ్లు) దాటి అతి మోహనమయిన ఆరవయేడును పొంది చిన్ని లేగదూడలను రక్షించు పనిని విడిచిపెట్టి ఉత్సాహముగా గోవుల మందలను రక్షించు పనిని ప్రారంభించితివి.

**53–2 శ్లో.**

**ఉపక్రమస్యానుగుణైవ సేయం మరుత్పురాధీశ! తవ ప్రవృత్తిః ।**
**గోత్రాపరిత్రాణకృతేఽవతీర్ణస్తదేవ దేవాఽఽరభథాస్తదా యత్ ॥**

**ప్రతిపదార్థము:** మరుత్పురాధీశ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, దేవ= ఓ దేవా!, ఉపక్రమస్య= ఆరంభమునకు, అనుగుణ ఏవ= తగినట్లుగానే, (ఆరభథాః =నీ నడతయు ఆరంభించితివి), గోత్రా = గోవుల యొక్క (గవాం సమూహః – ఆవుల సమూహము, ఆవుల మంద), పరిత్రాణ కృతే = రక్షణకై, అవతీర్ణః= అవతరించిన, యత్ తవ ప్రవృత్తిః = నీ యొక్క ప్రవృత్తి ఏదయితే ఉన్నదో, తత్–ఏవ =ఆ ప్రవృత్తికి

తగినట్లుగానే, తదా=అప్పుడు, గోత్రా=భూమియొక్క, (గోత్రాః పర్వతాః సంతి అస్యాః – పర్వతములు కలది. భూమి), పరిత్రాణం=రక్షణమునే, ఆరభథాః =ఆరంభించితివి, సా= అదే (పూర్వపు ప్రవృత్తి), ఇయం= ఇది(ఇప్పటి ప్రవృత్తి).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఓ దేవా! ఆరంభమునకు నీ నడతయు ఆరంభించితివి. గోవు యొక్క రక్షణకై, అవతరించిన నీ యొక్క ప్రవృత్తి ఏదయితే ఉన్నదో ఆ ప్రవృత్తికి తగినట్లుగానే భూమియొక్క, రక్షణమునే, ఆరంభించితివి. అదే( పూర్వపు ప్రవృత్తి) ఇది( ఇప్పటి ప్రవృత్తి)

**విశేషాలు:** ఈ శ్లోకంలో "గోత్రా" పదంతో కవి శబ్ద చమత్కారం చేసాడు.

**53–3 శ్లో.**

**కదాపి రామేణ సమం వనాంతే వనశ్రియం వీక్ష్య చరన్ సుఖేన ।**
**శ్రీదామనామ్నః స్వసఖస్య వాచా మోదాదగా ధేనుకకాననం త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** కదాపి= ఒకనాడు, రామేణ సమం = బలరామునితో కలిసి (రమయతి ప్రజాః – ప్రజలను ఆనందింపజేయువాడు. రాముడు, శ్రీరాముడు పరశురాముడు బలరాముడు), వనాంతే= అడవిలో, వనశ్రియం= ఆవన రామణీయకమును, వీక్ష్య= చూసి, సుఖేన= సుఖముతో, చరన్= విహరించావు, శ్రీదామనామ్నః= శ్రీ దాముడను పేరుగల, స్వసఖస్య= మిత్రుని యొక్క, వాచా= మాట వలన(దగ్గరలో ఉన్న ధేనుకవనమును గురించి నీకు చెప్పగా), మోదాత్ = సంతోషముతో, ధేనుక కాననం= ధేనుకుడను రాక్షసుడు ఉన్న తాళ వనమును (ధేనురివ, ధేన్వాః ప్రతికృతిః – ఆవువలె నుండునది. హస్తిని అసురుడు), త్వమ్= నువ్వు, అగాః= ప్రవేశించితివి.

**తాత్పర్యము:** ఒకనాడు బలరామునితో కలిసి అడవిలో ఆవన రామణీయకమును చూసి సుఖముతో విహరించావు. శ్రీ దాముడను పేరుగల మిత్రుడు దగ్గరలో ఉన్న ధేనుకవనమును గురించి నీకు చెప్పగా సంతోషముతో ధేనుకుడను రాక్షసుడు ఉన్న తాళ వనమును నువ్వు ప్రవేశించితివి.

**విశేషాలు:** వీఁడు ఒకప్పుడు గార్దభాకారుఁడు అయి తన అనుచరులతోడ

బృందావనము నందలి జనులను హింసింపఁగా బలరాముఁడు వీనిని చంపెను.

**53-4 శ్లో.**

**ఉత్తాలతాలీనివహే త్వదుక్త్యా బలేన ధూతేఽథ బలేన దోర్భ్యామ్ ।**
**మృదుః ఖరశ్చాభ్యపతత్ పురస్తాత్ ఫలోత్కరో ధేనుకదానవోఽపి ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, త్వత్ ఉక్త్యా = నీ మాటను అనుసరించి, ఉత్తాల= బాగా ఎత్తుగా ఉన్న (ఉత్తాలయతి ప్రతిష్ఠితో భవతి పొడవైన), తాలీ నివహే= తాటిచెట్ల సమూహమును (తలతి ప్రతిష్ఠితో ఉన్నతః భవతి ఉన్నతంగా వుండునది. తాడి చెట్టు), బలేన = నీ అన్న బలరాముడు, దోర్భ్యామ్= తన రెండు చేతులతో, బలేన = బలముగా (బలతి బలయుక్తో భవతి అనేన దీనితో యుక్తుడగును. బలము), ధూతే = ఊపగా(ధూతః కంపితః గతః త్యక్తః- వణికించబడినదివెళ్ళిపోయినదివదలబడినది),పురస్తాత్=ముందుగా(పూర్వస్మిన్, పూర్వస్యాం, పూర్వస్మాత్ (దిగ్వాచీ) ముందు, పూర్వపు దిశ), మృదుః= అపరిణతమైన(మృద్యతే మర్దితుం శక్యతే నలుచుటకు వీలైనది కోమలమైనది), ఖరః చ =పరిణతమైన (ఖం ముఖబిలం అతిశయేన అస్తి అస్య - ముఖము పెద్దగా గలది), ఫల ఉత్కరః = తాటిపండ్ల సమూహము (ఫలతి ఫలించునది. పండు) (ఉత్కరణం ఏకత్రీకరణం విస్తృతీకరణం వా ప్రోగు), అభ్యపతత్= రాలెను, ధేనుక దానవః అపి= ధేనుకాసురుడు అను రాక్షసుడు ఒక గాడిద రూపమున (అభ్యపతత్= మీ ముందు వ్రాలెను).

**తాత్పర్యము:** అటుపిమ్మట నీ మాటను అనుసరించి బాగా ఎత్తుగా ఉన్న తాటిచెట్ల సమూహమును నీ అన్న బలరాముడు తన రెండు చేతులతో బలముగా ఊపగా ముందుగా అపరిణతమైన పరిణతమైన తాటిపండ్ల సమూహము రాలెను. ధేనుకాసురుడు అను రాక్షసుడు కూడా ఒక గాడిద రూపమున మీ ముందు వ్రాలెను.

**53-5 శ్లో.**

**సముద్యతో ధైనుకపాలనేఽహం కథం వధం ధైనుకమద్య కుర్వే ।**
**ఇతీవ మత్వా ధ్రువమగ్రజేన సురౌఘయోద్ధారమజీఘనస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** ధైనుక= ధేనువుల సమూహము, పాలనే=పాలించుటలో, సముద్యతః = ఉత్సాహినయిన (సమ్యక్ ఉద్యతః కృతప్రయత్నః-ప్రయత్నించిన వాడుసిద్ధమైనవాడు),అహం=నేను,ధైనుకమ్=ధేనుకాసురునియొక్క(గోసమూహ సంహారముయొక్క), వధం = వధను, అద్య = ఇప్పుడు, కథం =ఎట్లు, కుర్వే = చేయుదును, ఇతి ఇవ = అని ఆవిధముగా, మత్వా= తలచి, ధ్రువమ్ = నిశ్చయించి, అగ్రజేన=అన్న బలరామునిచే, సురౌఘ యోద్ధారమ్= దేవతల శత్రువయిన ధేనుకాసురుని, త్వమ్= నువ్వు, అజీఘనః= సంహరింపచేసావు.

**తాత్పర్యము:** ధేనువుల సమూహము పాలించుటలో ఉత్సాహినయిన నేను ధేనుకాసురునియొక్క(గోసమూహ సంహారముయొక్క) వధను ఇప్పుడు ఎట్లు చేయుదును అని ఆవిధముగా తలచి నిశ్చయించి అన్న బలరామునిచే దేవతల శత్రువయిన ధేనుకాసురుని నువ్వు సంహరింపచేసావు.

**విశేషము:** ధైనుక పదంలో కవిశ్లేష వాడినాడు. ధైనుక= గోసమూహ సంహారము, ధేనుకాసురునియొక్క వధ అని రెండు అర్థాలు.

**53-6 శ్లో.**

**తదీయ భృత్యానపి జంబుకత్వేనోపాగతానగ్రజసంయుతస్త్వమ్ ।**
**జంబూఫలానీవ తదా నిరాస్థస్తాలేషు ఖేలన్ భగవన్! నిరాస్థః ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ భగవంతుడా! గురువాయూరు దేవా!, తదా = అప్పుడు, తదీయ భృత్యాన్ అపి= ధేనుకాసురుని అనుచరులగు దానవులు (భ్రియతే భర్తుం యోగ్యో వా, భర్తవ్యః - భరించదగినవాడు, సేవకుడు), జంబుకత్వేన =నక్కల రూపంలో(జమతి భక్షయతి శశకాదీన్ కుందేలు మొదలగు జంతువులను తినునది. నక్క), ఉపాగతాన్= రాగా, త్వమ్ = నువ్వు, అగ్రజ సంయుతః =అన్న బలరామునితో కూడి(సమ్యక్ యుతః మిశ్రితః - కలుపబడినది మిశ్రితమైనది), జంబూఫలాని ఇవ= నేరేడు పండ్లు రాల్చినట్టుగా (జమ్యతే భక్ష్యతే భక్షింపబడునది. అల్లనేరేడు), నిరాస్థః= ఎక్కువ శ్రమ పడకుండా (ఆస్తీయతే అత్ర-కూర్చొను చోటు), తాలేషు = ఆ తాటితోపులో, ఖేలన్= ఆటలాడుకొనునట్లుగా, నిరాస్థః = వధించారు ( నిరసనం కృతవాన్ నిగృహీతవాన్).

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! గురువాయూరు దేవా! అప్పుడు ధేనుకాసురుని అనుచరులగు దానవులు నక్కల రూపంలో రాగా నువ్వు అన్న బలరామునితో కూడి నేరేడు పండ్లు రాల్చినట్టుగా వాళ్ళను ఆ తాటితోపులో ఆటలాడుకొనునట్లుగా వధించారు.

**53-7 శ్లో.**

**వినిఘ్నతి త్వయ్యథ జంబుకౌఘం సనామకత్వాద్వరుణస్తదానీమ్ ।**
**భయాకులో జంబుకనామధేయం శ్రుతి ప్రసిద్ధం వ్యధితేతి మన్యే ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, త్వయి = నీవు, జంబుక ఔఘం = జంబుకముల గుంపును, వినిఘ్నతి = వధించి వారికి బంధవిముక్తి (మోక్షమును) జేకూర్చితివని వినికాబోలు, తదానీమ్= అప్పుడు, వరుణః = వరుణుడు (వృణోతి ఆచ్ఛాదయతి సర్వమ్, ప్రియతే జనైః – అన్నింటిని ఆచ్ఛాదించువాడు జనులచే వరింపబడువాడు. వరుణుడు, పశ్చిమ దిశాధిపతి), భయాకులః =భయముచే నిండి ఉన్నవాడై, సనామకత్వాత్ =అదే పేరు కలిగిన, శ్రుతి ప్రసిద్ధం = శ్రుతి ప్రసిద్ధమైన (శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్థం తెలియును. వేదము), జంబుక నామ ధేయం = తన జంబుక నామమును తలచి, వ్యధిత ఇతి= బాధ పడ్డాడని, మన్యే= తలంతును.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీవు జంబుకముల గుంపును వధించి వారికి బంధవిముక్తి (మోక్షమును) జేకూర్చితివని విని, అదే పేరు కలిగిన శ్రుతి ప్రసిద్ధమైన తన జంబుక నామమును తలచి వరుణుడు భయపడి బాధ పడ్డాడని తలంతును.

**విశేషము:** వరుణ దేవునికి జంబుకుడను వేద ప్రసిద్ధమయిన పేరు . కవి ఆపదంతో చమత్కారము చేసాడు.

**53-8 శ్లో.**

**తవావతారస్య ఫలం మురారే! సంజాతమద్యేతి సురైర్నుతస్త్వమ్ ।**
**సత్యం ఫలం జాతమిహేతి హాసీ బాలైస్సమం తాలఫలాన్యభుంక్థాః ॥**

**ప్రతిపదార్థము:** మురారే = ఓ మురారీ! (మురస్య అరిః మురాసురుని శత్రువు.

శ్రీకృష్ణుడు), తవ అవతారస్య = నీ అవతారమునకు(అవతరతి తస్య భావః దేవతలు మానుషరూపములో భూమిపై నవతరించుట), ఫలం = ఫలము(ధేనుకవధ) (ఫలతి ఫలించునది. పండు లాభము ప్రయోజనము), అద్య = ఇప్పుడు, సంజాతమ్ ఇతి= కలిగినదని, సురైః = దేవతలు, త్వమ్= నిన్ను, నుతః = నుతించగా, సత్యం = నిజము, ఇహ = ఇక్కడ, ఫలం జాతమ్=ఫలము పుట్టింది, ఇతి= అని, హాసీ = హాస్యముగా పలుకుచూ, బాలైః సమం = గోపాలకులతో కలిసి, తాలఫలాని= తాటిపండ్లను, అభుంక్థాః= నువ్వు భుజించితివి.

**తాత్పర్యము:** ఓ మురారీ! నీ అవతారమునకు ఫలము(ధేనుకవధ) ఇప్పుడు కలిగినదని దేవతలు నిన్ను నుతించగా "నిజము ఇక్కడ ఫలము పుట్టింది "అని హాస్యముగా పలుకుచూ గోపాలకులతో కలిసి తాటిపండ్లను నువ్వు భుజించితివి.

**విశేషము:** "ఫల" శబ్దముతో కవి చేసిన చమత్కారం ఈ శ్లోకంలో ఉంది.

**53-9 శ్లో.**

**మధుద్రవస్రుంతి బృహంతి తాని ఫలాని మేదోభరభృంతి భుక్త్వా ।**
**తృప్తైశ్చ దృప్తైర్భవనం ఫలౌఘం వహద్భిరాగాః ఖలు బాలకైస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** మధుద్రవ = తేనెలూరుచూ తీయని రసమును(మన్యంతే విశేషేణ జానంతి యస్మిన్ – విశేషంగా తెలుసుకొందురు. మద్యము – తేనె), స్రుంతి= స్రవించుచు, మేదోభర భృంతి= మంచి గుంజు(గుజ్జు)తో నిండి ఉన్న (మేద్యతి స్నిహ్యతి స్నిగ్ధో భవతి స్నిగ్ధంగా వుండునది. కొవ్వు), తాని బృహంతి ఫలాని = ఆ పెద్ద తాటి పండ్లను, భుక్త్వా= భుజించి, తృప్తైః చ = తనివి చెంది (తృప్నోతి ఆకాంక్షారహితో భవతి తస్య భావః – కోరిక లేకపోవడం. తృప్తి సంతృప్తి), దృప్తైః = విజయోత్సాహముతో(దృప్తః గర్విత – గర్వించినది(వాడు)), ఫలౌఘం= మోయగలిగినన్ని ఫలములను ఇళ్ళలో ఉండే బంధువుల కొరకు, వహద్భిః = మోసుకొని, త్వమ్= నువ్వు, బాలకైః = గోపాలకులతో, భవనం = ఇంటికి, ఆగాః ఖలు = వచ్చితిరి కదా!

**తాత్పర్యము:** తేనెలూరుచూ తీయని రసమును స్రవించుచు మంచి గుంజు (గుజ్జు)

తో నిండి ఉన్న ఆ పెద్ద తాటి పండ్లను భుజించి తనివి చెంది విజయోత్సాహముతో మోయగలిగినన్ని ఫలములను మోసుకొని నువ్వు గోపాలకులతో ఇంటికి వచ్చితిరి కదా!

**53-10 శ్లో.**

**హతోహతో ధేనుక ఇత్యుపేత్య ఫలాన్యదద్భిర్మధురాణి లోకైః ।**
**జయేతి జీవేతి నుతో విభో! త్వం మరుత్పురాధీశ్వర! పాహి రోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** మరుత్పురాధీశ్వర = ఓ గురువాయూరు దేవా!, ధేనుకః = ధేనుకుడు, హతః హతః = చనిపోయెను, చనిపోయెను ( హర్షాతిశయములో ద్విరుక్తి), ఇతి = అని సంతోషపడి, ఉపేత్య = నిన్ను సమీపించి, మధురాణి = తియ్యని, ఫలాని అదద్భిః = పండ్లు తినుచు, లోకైః = ఆ బృందావన వాసులతో, జయ ఇతి = జయము జయము అని, జీవ ఇతి = "చిరంజీవ" "చిరంజీవ" అని, త్వం = నువ్వు, నుతః = నుతించబడ్డావు, విభో = ఓ కృష్ణ ప్రభూ!, రోగాత్ = రోగము నుండి, పాహి = రక్షించుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! "ధేనుకుడు చనిపోయెను, చనిపోయెను" అని సంతోషపడి నిన్ను సమీపించి నువ్వు తెచ్చిన తియ్యని తాటి పండ్లు తినుచు –ఆ బృందావన వాసులు – జయము జయము అని "చిరంజీవ" "చిరంజీవ" అని నిన్ను దీవించి –నుతించారు. ఓ కృష్ణ ప్రభూ ! రోగము నుండి నన్ను రక్షించుము.

***దశమ స్కంధము***

**53వ దశకము పూర్తి.**

# దశకమ్ 54 –కాలిన్దీప్రాప్తి

**54–1 శ్లో.**

**త్వత్సేవోత్కః సౌభరిర్నామ పూర్వం కాళిన్ద్యంతర్ద్వాదశాబ్దం తపస్యన్।**
**మీనవ్రాతే స్నేహవాన్ భోగలోలే తార్ క్ష్యం సాక్షాదైక్షతాగ్రే కదాచిత్ ॥**

**ప్రతిపదార్థము:** పూర్వం= పూర్వము (పూర్వే పూర్వకాలే భవః (కాలవాచీ) పూర్వములో వున్నది పూర్వ కాలంలో ఉన్నది మునుపు), సౌభరిః నామ= సౌభరి అను ముని, త్వత్ సేవ = నీ సేవయందు (సేవతే తస్య భావః కర్మ వా సేవ), ఉత్కః= ఉత్సాహము కలిగిన వాడై (ఆనందము కలిగిన) (ఉత్కంఠితః మనః యస్య, ఉత్సుకః – ఉత్కంఠ కలవాడు, ఔత్సుక్యం కలవాడు), కాళింది –అంతః= కాళింది మడువులో, ద్వాదశ అబ్దం= పన్నెండు సంవత్సరముల కాలము, తపస్యన్= తపస్సుచేసి, మీనవ్రాతే = ఆ మడుగులో ఉన్న చేపపిల్లలపై (మీయతే హింస్యతే హింసింపబడునది. చేప), స్నేహవాన్= స్నేహ తాత్పర్యమును వహించెను, కదాచిత్= ఒకరోజు, భోగలోలే = భోగలోలుడైన, తార్ క్ష్యం= 'గరుత్మంతుడు ఆ చేపల కొఱకు వచ్చియుండుట (తార్క్ష్యస్య అపత్యమ్ కశ్యపుని కుమారుడు. గరుడుడు), సాక్షాత్ అగ్రే ఐక్షత =తన కళ్ళ ఎదురుగా సౌభరి చూసెను.( సహ అక్షతి కనబడునది కండ్లముందున్నది).

**తాత్పర్యము:** పూర్వము సౌభరి అను ముని నీ సేవయందు ఉత్సాహము కలిగిన వాడై కాళింది మడువులో పన్నెండు సంవత్సరముల కాలము తపస్సుచేసి ఆ మడుగులో ఉన్న చేపపిల్లలపై స్నేహ తాత్పర్యమును వహించెను. ఒకరోజు భోగలోలుడైన గరుత్మంతుడు ఆ చేపల కొఱకు వచ్చియుండుట తన కళ్ళ ఎదురుగా సౌభరి చూసెను.

**విశేషాలు**

**కాళింది :** 1. యమునానది. (కళింద పర్వతమునందు పుట్టినది అని అర్థము.) ఒకప్పుడు బలరాముడు వ్రేపల్లెయందు ఉండువేళ దప్పిగొని కాళిందిని తన సమీపమునకు రమ్మనఁగా రానందున ఆయన కోపించి హలాయుధముచేత

భేదించి నూఱు పాయలుగ ప్రవహించునట్లు చేసెను అని పురాణప్రసిద్ధి. సూర్యుని కూతురు.

**54-2 శ్లో.**

**త్వద్వాహం తం సక్షుధం తృక్షసూనుం మీనం కంచిజ్జక్షతం లక్షయన్ సః ।**
**తప్తశ్చిత్తే శప్తవానత్ర చేత్త్వం జంతూన్ భోక్తా జీవితం చాపి మోక్తా ॥**

**ప్రతిపదార్థము:** సక్షుధం= ఆకలితో (క్షుధ ఏవ క్షుధా భోజనేచ్ఛా ఆకలి. భోజనేచ్ఛ), త్వత్ వాహం= నీ వాహనమగు (ఉహ్యతే అనేన – దీనితో మోయబడును), తం తృక్షసూనుం= ఆ గరుత్మంతుడు, కంచిత్= ఒక, మీనం= చేపపిల్లను, జక్షతం = తినుటను, లక్షయన్= చూసిన, సః = ఆ సౌభరి, చిత్తే = మనస్సులో, తప్తః = శోకించి, అత్ర = ఈ కాళింది సరస్సులో, త్వం = నువ్వు, జంతూన్= చేపలు మొదలయినవాటిని, భోక్తా చేత్= తిన్నచో, జీవితం చ అపి= నీ జీవితమును (ప్రాణములను)(జీవస్య భావః జీవితము బ్రతుకు), మోక్తా= విడిచెదవు అని, శప్తవాన్= శపించెను.

**తాత్పర్యము:** ఆకలితో నీ వాహనమగు ఆ గరుత్మంతుడు ఒక చేపపిల్లను తినుటను చూసిన ఆ సౌభరి మనస్సులో శోకించి "ఇకపై నువ్వు ఈ కాళింది సరస్సులో చేపలు మొదలయినవాటిని తిన్నచో నీ ప్రాణములను విడిచెదవు." అని శపించెను.

**54-3 శ్లో.**

**తస్మిన్ కాలే కాళియః క్ష్వేలదర్పాత్ సర్పారాతేః కల్పితం భాగమశ్నన్ ।**
**తేన క్రోధాత్ త్వత్పదాంభోజభాజా పక్షక్షిప్తస్తద్దురాపం పయోఽగాత్ ॥**

**ప్రతిపదార్థము:** తస్మిన్ కాలే= ఆసమయములో, క్ష్వేల దర్పాత్= విష సంచలన సామర్థ్యముచే గర్వించియున్న(క్ష్వేలతి (గచ్ఛతి) సంచలతి తస్య భావః – సంచలనము క్రీడ, ఆట), కాళియః =కాళియుడను సర్పరాజు, సర్ప అరాతేః = సర్పములకు శత్రువగు గరుత్మంతుని కొరకు, కల్పితం భాగమ్= సర్పములు తమ ఆత్మ రక్షణార్థము నివేదించిన మాసిక బలిని, అశ్నన్= తినగా, త్వత్ పద అంభోజ భాజా = నీ పాదపద్మములను సేవించు, తేన= ఆ గరుత్మంతుడు, క్రోధాత్ = కోపముతో, పక్ష =తన రెక్కలు విదల్చుకొని (పక్షతే చంద్రస్య పంచదశానాం

కలానాం ఆపూరణమ్, క్షయో వా యేన – శుక్ల పక్షము, కృష్ణ పక్షము (న్యాయశాస్త్రంలో) పక్షము రెక్క), తత్ దురాపం= ఆదుష్టుడయిన కాళిందుని, క్షిప్తః= త్రోయగా, తరుమగా (క్షిప్తః ప్రక్షిప్తః ప్రేషితః – పారవేయబడినది పంపబడినది), పయః =అది గరుడుడు చొరబడలేని కాళింది మడువులోకి, అగాత్= చేరెను.

**తాత్పర్యము:** ఆసమయములో విష సంచలన సామర్థ్యముచే గర్వించియున్న కాళియుడను సర్పరాజు– సర్పములు తమ ఆత్మ రక్షణార్థము తమ శత్రువగు గరుత్మంతుని కొరకు నివేదించు మాసిక బలిని — గరుత్మంతుని లెక్కచేయక తానే తినగా – నీ పాదపద్మములను సేవించు ఆ గరుత్మంతుడు కోపముతో తన రెక్కలు విదల్చుకొని ఎగిరి ఆదుష్టుడయిన కాళిందుని తరుమగా అది గరుడుడు చొరబడలేని కాళింది మడువులోకి చేరెను.

**54–4 శ్లో.**
**ఘోరే తస్మిన్ సూరజానీరవాసే తీరే వృక్షా విక్షతాః క్ష్వేలవేగాత్ ।**
**పక్షివ్రాతాః పేతురభ్రే పతంతః కారుణ్యార్ద్రం త్వన్మనస్తేన జాతమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఘోరే = క్రూర కర్ముడయిన(హంతి వినాశయతి స్వరౌద్రరూపేణ పూజనీయః – తన రౌద్రరూపంతో చంపువాడు, వినాశము చేయువాడు), తస్మిన్= ఆ కాళియుని విష ప్రభావముతో, సూరజా నీర వాసే= ఆ సూర్యుని కూతురయిన కాళింది నదిలో ఉన్న, తీరే= మరియు తీరములో ఉన్న (తీరయతి సమాపయతి నద్యాదికమ్ నదీ కూలము, నది ఒడ్డు), వృక్షాః= చెట్లు (వృశ్చ్యతే ఛిద్యతే అసౌ నరకబడునది. వృక్షము), క్ష్వేల వేగాత్ = విషపు వేగ ప్రభావముతో, విక్షతాః = మాడిపోయాయి, అభ్రే పతంతః = ఆకాశములో ఎగురుచున్న (ఆపః బిభర్తి నీటిని ధరించునది. మేఘము ఆకాశము), పక్షివ్రాతాః = పక్షుల సమూహములు ( పక్షి= పక్షములు గలది ), పేతుః = ఆ విషగాలులకు చనిపోయి కిందపడ్డాయి, తేన = ఇలా ఏర్పడిన పరిస్థితిని చూసి, త్వత్ మనః = ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నీ మనస్సులో(మన్యతే అనేన –దీనితో తెలుసుకొందురు), కారుణ్య ఆర్ద్రం జాతమ్ = జాలి కలిగింది. (కరుణస్య భావః, కరుణ ఏవ కారుణ్యమ్ కారుణ్యము, దయా

తాత్పర్యము)(అర్దతి సించతి తస్య భావః – తడిసినది).

**తాత్పర్యము:** క్రూర కర్ముడయిన ఆ కాళియుని విష ప్రభావముతో ఆ కాళింది నదిలో ఉన్న మరియు తీరములో ఉన్న చెట్లు విషపు వేగ ప్రభావముతో మాడిపోయాయి. ఆకాశములో ఎగురుచున్న పక్షుల సమూహములు ఆ విషగాలులకు చనిపోయి కిందపడ్డాయి .ఇలా ఏర్పడిన పరిస్థితిని చూసి ఓ గురువాయూరు కృష్ణ దేవా! నీ మనస్సులో జాలి కలిగింది.

**54–5 శ్లో.**
**కాలే తస్మిన్నేకదా సీరపాణిం ముక్త్వా యాతే యామునం కాననాంతమ్ ।**
**త్వయ్యుద్ధామగ్రీష్మభీష్మోష్మతప్తా గోగోపాలా వ్యాపిబన్ క్ష్వేలతోయమ్ ॥**

**ప్రతిపదార్థము:** తస్మిన్ కాలే= ఆ కాలమునందు, ఏకదా = ఒకరోజు, సీరపాణిం= బలరాముడిని (సీరః హలః పాణౌ యస్య–నాగలి చేతియందు కలవాడు. బలరాముడు), ముక్త్వా= వదలి, యామునం కానన అంతమ్= యమునానదీ తీరమునగల వన ప్రాంతానికి, త్వయి= నువ్వు, యాతే= వెళ్ళగా, ఉద్దామ= స్వతంత్రముగా (ఉద్గతః దామ్నః బంధనాత్ బంధవిముక్తుడు స్వతంత్రుడు), భీష్మ = భయపెట్టు (బిభేత్యస్మాత్, భీషయతే వా దీనితో భయపడుదురు. ఇది భయపెట్టును), గ్రీష్మ= గ్రీష్మర్తువు యొక్క (గ్రసతే రసాన్ జలములను మ్రింగునది. గ్రీష్మర్తువు), ఊష్మ= వేడిచే (ఓషతి దహతి గ్రీష్మఋతువు, వేడి), తప్తా= తపించబడిన దాహం కలిగిన (సంతప్త సంతాపతో వా సంతప్తుడు వేడి చేయబడ్డది), గో గోపాలాః= గోవులు గోపాలురు, క్ష్వేల తోయమ్= విష జలమును, వ్యాపిబన్= యథాసుఖముగా తాగిరి.

**తాత్పర్యము:** ఆ కాలమునందు ఒకరోజు బలరాముడిని వదలి యమునానదీ తీరమునగల వన ప్రాంతానికి నువ్వు వెళ్ళగా భయపెట్టు ఎండవేడికి తట్టుకోలేక దాహం కలిగిన గోవులు గోపాలురు కాళింది మడుగులోని విష జలమును తాగిరి.

**54-6 శ్లో.**

**నశ్యజ్జీవాన్ విచ్యుతాన్ క్ష్మాతలే తాన్ విశ్వాన్ పశ్యన్నచ్యుత! త్వం దయార్ద్రః ।**
**ప్రాప్యోపాంతం జీవయామాసిథ ద్రాక్ పీయూషాంభోవర్షిభిః శ్రీకటాక్షైః ॥**

**ప్రతిపదార్థము:** నశ్యత్ జీవాన్ = పోయిన ప్రాణములతో, క్ష్మాతలే = భూతలమునందు(క్షమతే ప్రాణినః భారం చ – ప్రాణులను, భారమును సహించునది. భూమి), విచ్యుతాన్ = పడిపోయిన(అధికం చ్యుతః, అధఃపతితః – క్రిందబడినది, జారిపోయినది, దిగజారినది), తాన్ విశ్వాన్= ఆ గో గోపాలకుల సమస్తమును, పశ్యన్= చూసి, అచ్యుత = ఓ గురువాయూరు దేవా (కృష్ణా !) (స్వరూప సామర్థ్యాత్ న చ్యుతః చ్యవతే వా స్వరూప సామర్థ్యం వలన చ్యుతుడు కానివాడు. విష్ణుడు), త్వం= నువ్వు, దయార్ద్రః = దయతో తడిసిన హృదయము కలవాడివై, ఉపాంతం ప్రాప్య= వారి దగ్గరకు వెళ్లి(ఉపమితం అంతేన అంతముతో సమానమైనది కొనతో సమానము దగ్గరవున్నది అంచు), ద్రాక్ = వెంటనే(ద్రాతి శీఘ్రమ్ త్వరగా), పీయూష అంభోవర్షిభిః = అమృత మేఘధారలను వర్షించు(పీయతే దేవైః – దేవతలచే త్రాగబడునది. అమృతము), శ్రీకటాక్షైః= నీ చూపులతో, జీవయామాసిథ= వారందరిని బ్రతికించితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! పోయిన ప్రాణములతో భూతలమునందు పడిపోయిన ఆ గో గోపాలకుల సమస్తమును చూసి నువ్వు దయతో తడిసిన హృదయము కలవాడివై వారి దగ్గరకు వెళ్లి వెంటనే అమృత మేఘధారలను వర్షించు నీ చూపులతో వారందరిని బ్రతికించితివి.

**54-7 శ్లో.**

**కింకిం జాతో హర్షవర్షాతిరేకః సర్వాంగేష్విత్యుత్థితా గోపసంఘాః ।**
**దృష్ట్వాఽగ్రే త్వాం త్వత్కృతం తద్విదంతస్త్వామాలింగన్**
**దృష్టనానాప్రభావాః ॥**

**ప్రతిపదార్థము:** గోపసంఘాః = గో గోపాలకసమూహములు, సర్వ అంగేషు = సర్వావయములలో, హర్ష వర్షా అతిరేకః = అపరిమిత ఆనందముతో (అతిశయితం

రిచ్యతే ఆధిక్యము గొప్పదనము), కింకిం జాతః= ఏమి జరిగినది ? అనుచు, ఇతి = అనుచు, ఉత్థితాః= లేచివచ్చిరి. (జీవించిరి)(ఉత్థితః జాగృతః ఉద్గతో వా మేల్కొన్నవాడు ఉదయించినవాడు), అగ్రే= ఎదుట, త్వాం= నిన్ను, దృష్ట్వా= చూసి, త్వత్ కృతం= ఇంతకు పూర్వము నువ్వు చేసిన లీలలు, దృష్ట నానా ప్రభావాః= నానామహిమలు చూచినవారగుటచే(దృష్టః అవలోకితః – చూడబడినది కనబడునది), తత్ విదంతః = తాము తిరిగి జీవించుట నీ అనుగ్రహమే అని తెలుసుకొన్నవారయి, త్వామ్= నిన్ను అభిమానంతో, ఆలింగన్ = కౌగిలించిరి.

**తాత్పర్యము:** గో గోపాలకసమూహములు సర్వావయములలో అపరిమిత ఆనందముతో తిరిగి జీవించి ఏమి జరిగినది? అనుచు కృష్ణుని దగ్గరగా వచ్చారు. ఎదుట నిన్ను చూసి ఇంతకు పూర్వము నువ్వు చేసిన లీలలు నానామహిమలు చూచినవారగుటచే తాము తిరిగి జీవించుట నీ అనుగ్రహమే అని తెలుసుకొన్నవారయి నిన్ను అభిమానంతో కౌగిలించిరి.

**54–8 శ్లో.**

**గావశ్చైవం లబ్ధజీవాః క్షణేన స్ఫీతానందాస్త్వాం చ దృష్ట్వా పురస్తాత్ ।**
**ద్రాగావవ్రుః సర్వతో హర్షబాష్పం వ్యాముంచంత్యో మందముద్యన్నినాదాః ॥**

**ప్రతిపదార్థము:** గావః చ= ఆవులు కూడా, ఏవం = గోపాలకులవలె, క్షణేన = క్షణకాలములో, లబ్ధ జీవాః= ప్రాణాలు పొంది, స్ఫీత ఆనందాః = చాలా అనంద పడ్డాయి. (స్ఫీతః వర్ధితః స్థూలః విస్తృతః వృద్ధి నొందినది విస్తృతమైనది), పురస్తాత్ = ఎదుట, త్వాం చ దృష్ట్వా = నిన్ను చూసి, ద్రాక్= వెంటనే, సర్వతః ఆవవ్రుః = నీ చుట్టూ చేరి, హర్ష బాష్పం= ఆనంద బాష్పములు (హృష్యతి తస్య భావః – సుఖము సంతోషము రోమాంచము), వ్యాముంచంత్యః = కురిపిస్తూ, మందమ్= గంభీరముగా, నినాదాః ఉద్యన్= అంబారవములు చేసినవి.

**తాత్పర్యము:** ఆవులు కూడా గోపాలకులవలె క్షణకాలములో ప్రాణాలు పొంది చాలా అనంద పడ్డాయి. ఎదుట నిన్ను చూసి వెంటనే నీ చుట్టూ చేరి ఆనంద బాష్పములు కురిపిస్తూ గంభీరముగా అంబారవములు చేసినవి.

**54-9 శ్లో.**

**రోమాంచోఽయం సర్వతో నశ్శరీరే భూయస్యంతః కాచిదానందమూర్ఛా ।**
**ఆశ్చర్యోఽయం క్ష్వేలవేగో ముకుందేత్యుక్తో గోపైర్నందితో వందితోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** ముకుంద = ఓ ముకుందా! (ముకుం మోక్షం దదాతి మోక్షము నిచ్చువాడు. విష్ణువు), అయం= నీ లీలలకు, శరీరే= మా శరీరములు, సర్వతః= అంతటా, రోమాంచః= పులకించుచున్నవి, నః = మా యొక్క, అంతః = అంతరంగములు, కాచిత్ = ఏదో తెలియని ఒకానొక, ఆనందమూర్ఛా = నిరతిశయ సుఖ వృద్ధిని, భూయసీ= పొందుచున్నవి, అయం=ఈ, క్ష్వేలవేగః= విష వేగమును నువ్వు శమింప చేయుట, ఆశ్చర్యః=ఆశ్చర్యము, ఇతి గోపైః= గోపాలకులతో, ఉక్తః = చెప్పబడినవాడివై, నందితః= అభినందనములను, వందితః = వందనములను, అభూః= అందుకొన్నావు.

**తాత్పర్యము:** "ఓ ముకుందా! నీ లీలలకు మా శరీరములు అంతటా పులకించుచున్నవి. మా యొక్క అంతరంగములు ఏదో తెలియని ఒకానొక నిరతిశయ సుఖ వృద్ధిని పొందుచున్నవి. ఈ విష వేగమును నువ్వు శమింప చేయుట ఆశ్చర్యము'' అని గోపాలకులతో చెప్పబడినవాడివై వారి అభినందనములను, వందనములను అందుకొన్నావు

**54-10 శ్లో.**

**ఏవం భక్తాన్ ముక్తజీవానపి త్వం ముగ్ధాపాంగైరస్తరోగాంస్తనోషి ।**
**తాదృగ్భూతస్ఫీతకారుణ్యభూమా రోగాత్ పాయా వాయుగేహాధివాస ॥**

**ప్రతిపదార్థము:** వాయుగేహాధివాస= ఓ గురువాయూరు దేవా, ఏవం= ఇట్లు, త్వం= నువ్వు, ముగ్ధ అపాంగైః= మనోహరమైన చూపులు ప్రసరింపచేసి (మోహయతి మోహింప చేయునది.)(అప అంగతి = వక్రం గచ్ఛతి చక్షుః యత్ర – కన్ను కొనభాగము), భక్తాన్ = భక్తులకు, ముక్తజీవాన్ అపి= ముక్త జీవులకు(జీవితము కోల్పోయినవారిని), అస్తరోగాన్ = రోగవిముక్తిచేసి పునర్జీవితులుగా, తనోషి = చేయుచుందువు, తాదృక్= అటువంటి, భూతస్ఫీత

కారుణ్యభూమా= భూతములయందు విస్తృతమగు దయానుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా!, (భవతి న్యాయసమ్మతమ్ న్యాయ సమ్మతమైనది. సరియైనది పంచమహాభూతములు.) (స్ఫీతః వర్ధితః స్థూలః విస్తృతః – వృద్ధి నొందినది విస్తృతమైనది లావైనది.)( భూమా= మహత్త్వం. సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధం), రోగాత్ పాయా = నారోగమును పోగొట్టి నన్ను కాపాడుము.

**తాత్పర్యము:** వాయుగేహాధివాస= ఓ గురువాయూరు దేవా! ఇట్లు నువ్వు మనోహరమైన చూపులు ప్రసరింపచేసి భక్తులకు ముక్త జీవులకు రోగవిముక్తిచేసి పునర్జీవితులుగా చేయుచుందువు. అటువంటి భూతములయందు విస్తృతమగు దయానుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా! నారోగమును పోగొట్టి నన్ను కాపాడుము.

*దశమ స్కంధము*

**54వ దశకము పూర్తి.**

# దశకమ్ 55 – కాలియనర్తనమ్

**55–1 శ్లో.**

**అథ వారిణి ఘోరతరం ఫణినం ప్రతివారయితుం కృతధీర్భగవన్ ।**
**ద్రుతమారిథ తీరగనీపతరుం విషమారుతశోషితపర్ణచయమ్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ గురువాయూరు కృష్ణ దేవా ! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), అథ= అటుపిమ్మట, వారిణి= ఆ కాళింది మడుగు నీటినుండి (వారయతి తృష్ణామ్ దప్పిని వారించునది. జలము), ఘోరతరం= భయంకరమగు (ఘోరయతి భయానక రస నిమిత్తే భవతి ఘోరమైనది), ఫణినం= విషసర్పమగు ఆ కాళీయుని (ఫణ= ఫణతి విస్తృతో భవతి విస్తృతమగునది. పాము పడగఫణము కలది ఫణి), ప్రతివారయితుం= తరిమివేయుటకు, కృతధీః=కృతనిశ్చయుడవై, ద్రుతమ్=వెంటనే, తీరగ= ఆ నదీతీరమున ఉన్న, విష మారుత = విషాగ్నుల గాలులతో, శోషిత= మాడిన, పర్ణచయమ్=ఆకులతో మ్రోడువడిన (పిపర్తి పూరయతి, పర్ణయతి వృక్షమును పూరించునది పచ్చగా చేయునది. ఆకు), నీప తరుం= ఒక కదంబవృక్షముపైకి (నయంతి ప్రాప్నువంతి ఏనం ఛాయార్థినః నీడ కొరకు దీనిని ఆశ్రయింతురు. కదంబ వృక్షము, కడిమి చెట్టు), ఆరిథ= ఎక్కితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! అటుపిమ్మట ఆ కాళింది మడుగు నీటినుండి భయంకరమగు విషసర్పమగు ఆ కాళీయుని తరిమివేయుటకు కృతనిశ్చయుడవై –వెంటనే ఆ నదీతీరమున ఉన్న విషాగ్నుల గాలులతో మాడిన ఆకులతో మ్రోడువడిన ఒక కదంబవృక్షముపైకి ఎక్కితివి.

**55–2 శ్లో.**

**అధిరుహ్య పదాంబురుహేణ చ తం నవపల్లవతుల్యమనోజ్ఞరుచా ।**
**హ్రదవారిణి దూరతరం న్యపతః పరిఘూర్ణితఘోరతరంగగణే ॥**

**ప్రతిపదార్థము:** నవ పల్లవ తుల్య= లేత చిగురుటాకులట్లున్న (పల్యతే గచ్ఛతి వృద్ధిమ్ వృద్ధిని పొందునది. చిగురు), మనోజ్ఞ రుచా=మనోహరమైన కాంతి

కలిగిన (రోచతే ప్రకాశతే అసౌ ప్రకాశించునది. దీప్తి, ప్రకాశము), పద–అంబురుహేణ = నీ పాద పద్మములతో, తం అధిరుహ్యా చ= ఆ కదంబతరువు పై కెక్కి( అధి = ఉపరి రోహణం = ఆరోహణమ్ పైకి పోవుట ఎక్కుట), పరిఘూర్ణిత= ఉధృతముగా ప్రవహించుచున్న తిరుగుడు పడుచున్న, ఘోర తరంగ గణే= తరంగములతో ఎగిసిపడుచున్న(తరతి ప్లవతి ఎగురునది. అల, తరంగము), హ్రద వారిణి= ఆ లోతయిన యమునానదీ నీటిలోనికి (హ్రాదయతి తోషయతి అసౌ సంతోషపెట్టునది. హ్రదము, కొలను), దూరతరం = అల్లంత దూరమునుండి న్యపతః= దూకితివి.

**తాత్పర్యము:** లేత చిగురుటాకులట్లున్న మనోహరమైన కాంతి కలిగిన నీ పాద పద్మములతో ఆ కదంబతరువు పై కెక్కి ఉధృతముగా ప్రవహించుచున్న తరంగములతో ఎగిసిపడుచున్న ఆ లోతయిన యమునానదీ నీటిలోనికి అల్లంత దూరమునుండి దూకితివి.

**విశేషాలు:** 1."లేత చిగురుటాకులట్లున్న మనోహరమైన కాంతి కలిగిన నీ పాద పద్మములతో " అను వర్ణన వలన స్వామి స్పర్శతో ఆ కదంబ వృక్షము తన విష దోషాన్ని పోగొట్టుకొని చిగురుటాకులతో వికసించినదను అర్థము వచ్చుచున్నది. 2. కాళిందిని నదిగాను, కొలనుగాను రెండు విధములుగా ఈ కావ్యంలో వర్ణించారు..

**55–3 శ్లో.**
**భువనత్రయభారభృతో భవతో గురుభారవికంపివిజృంభిజలా ।**
**పరిమజ్జయతి స్మ ధనుశ్శతకం తటినీ ఝటితి స్ఫుటఘోషవతీ ॥**

**ప్రతిపదార్థము:** భువన త్రయ= మూడు లోకముల (1. స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలు.2. భూలోక, సువర్లోక, మహర్లోకాలు.)( భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము ఆకాశము భూమి), భార భృతః=బరువును మోయుచున్న(భ్రియతే ధ్రియతే మోయబడునది), భవతః = నీయొక్క, గురు భార= నీ బరువుకి, వికంపి= బాగా కంపించి, విజృంభి జలా = వర్ధన శీలమైన నీటితో (చెలరేగిన నీటితో), తటినీ = ఆ కాళింది మడుగు(తట అస్తి అస్య–ఒడ్డు గలది.

నది), ఝుటితి= వెంటనే (శీఘ్రమ్ త్వరగా తొందరగా), స్ఫుట ఘోషవతీ= పెద్దధ్వనితో ఉప్పొంగి, ధనుః శతకం= వంద ధనువుల దూరము వరకు (నూరు గజముల దూరమువరకూ)(ధనతి శబ్దం కరోతి శబ్దము చేయునది. విల్లు. నాలుగు మూరల కొలది), పరిమజ్జయతి స్మ= తన తీర ప్రాంతభూములను ముంచెత్తింది.

**తాత్పర్యము:** మూడు లోకముల బరువును మోయుచున్న నీయొక్క నీ బరువుకి బాగా కంపించి – వర్ధన శీలమైన నీటితో ఆ కాళింది మడుగు వెంటనే పెద్దధ్వనితో ఉప్పొంగి నూరు గజముల దూరమువరకూ తన తీర ప్రాంతభూములను ముంచెత్తింది.

**55–4 శ్లో.**
**అథ దిక్షు విదిక్షు పరిక్షుభిత భ్రమితోదరవారినినాదభరైః ।**
**ఉదకాదుదగాదురగాధిపతిస్త్వదుపాంతమశాంతరుషాంధమనాః ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, దిక్షు= దిక్కులలోను(1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము), విదిక్షు= మూలలలోను (ఈశాన్యమూల, ఆగ్నేయమూల, నైరృతిమూల, వాయవ్యమూల), పరిక్షుభిత=పరిచలితమయిన (క్షుభితః ఆలోడితః వ్యాకులఃకలియబెట్టబడినది భయపడినవాడు), భ్రమిత =సుడులతో భ్రమితమయిన, ఉదర= అంతర్భాగ, వారి నినాద భరైః = నీటి కెరటముల చప్పుడుతో, అశాంతరుషా=అశాంతి వలన కలిగిన రోషముతో(రుష్యతి తస్య భావః కర్మ వా కోపము), అంధమనాః= కళ్లు మూసుకొనిపోయి (అంధయతే కనిపించక పోవుట), ఉరగ–అధిపతిః = కాళీయుడు (ఉరసా గచ్ఛతి వక్షఃస్థలంతో నడచునది. పాము), ఉదకాత్= నీటినుండి, త్వత్ ఉపాంతమ్ = నీదగ్గరకు (ఉపమితం అంతేన – అంతముతో సమానమైనది కొనతో సమానము దగ్గరవున్నది అంచు), ఉదగాత్= పైకి లేచెను (వచ్చెను).

**తాత్పర్యము:** అటుపిమ్మట అన్ని దిక్కులలోను సుడులతో చెలరేగిన ఆకాళింది నది యొక్క భయంకర కెరటముల చప్పుడుతో తట్టుకోలేక అశాంతి వలన కలిగిన రోషముతో, కళ్లు మూసుకొనిపోయి నీదగ్గరకు కాళియుడు వచ్చెను.

**55–5 శ్లో.**

**ఫణశృంగసహస్రవినిఃసృమరజ్వలదగ్నికణోగ్రవిషాంబుధరమ్ ।**
**పురతః ఫణినం సమలోకయథా బహుశృంగిణమంజనశైలమివ ॥**

**ప్రతిపదార్థము:** విష అంబు= విష ద్రవాన్ని (విశ్యతే సిచ్యతే అనేన–దీనితో తడపబడును. విషము), ధరమ్ = ధరించి, జ్వలత్ అగ్నికణ= మండుచున్న అగ్ని కణములతో(జ్వలత్= దీప్యత్ ప్రకాశించుచున్నది ప్రకాశము కలది), ఫణ శృంగ సహస్ర=.వేయిపడగలనుండివిషద్రవాన్ని(శృంగ=శృణాతిహినస్తి హింసించునది. కొమ్ము), వినిః సృమర =నాశన మరియు ప్రవాహ శీలముతో బయటికి చిమ్ముచున్న, ఉగ్ర= క్రూరమైన, బహుశృంగిణమ్= పెక్కు శిఖరములతో ఉన్న, అంజనశైలమ్ ఇవ= నల్లనైన కాటుకకొండ వలె ఉన్న, ఫణినం = కాళియ సర్పాన్ని, పురతః = ఎదుట, సమలోకయథాః = నువ్వు చూసితివి.

**తాత్పర్యము:** క్రూరమైన విష ద్రవాన్ని ధరించి, మండుచున్న అగ్ని కణములతో విష ద్రవాన్ని వేయిపడగలనుండి చిమ్ముచున్న పెక్కు శిఖరములతో ఉన్న నల్లనైన కాటుకకొండ వలె ఉన్న కాళియ సర్పాన్ని నీ ఎదుట నువ్వు చూసితివి.

**విశేషాలు:** శృంగ పదానికి 1.హింసించునది.2. కొమ్ము అని రెండు అర్థాలు. అందువలననే కాలియుని పడగలను శృంగములన్నాడు. ( హింసించునవి) అవి అంజనా శైల శృంగములన్నాడు ( కొమ్ములు) . చక్కటి పోలిక.

**55–6 శ్లో.**

**జ్వలదక్షి పరిక్షరదుగ్రవిషశ్వసనోష్మభరః స మహాభుజగః ।**
**పరిదశ్య భవంతమనంతబలం సమవేష్టయదస్ఫుటచేష్టమహో ॥**

**ప్రతిపదార్థము:** జ్వలత్ అక్షి= నిప్పులు చెఱగు నల్లని కన్నులతో (అశ్నుతే విషయాన్ విషయములను గ్రహించునది. కన్ను), ఉగ్ర విషః = కోరలనుండి అగ్ని విషధారలు (ఉచ్యతి సమవైతి ఉగ్రత్వము), పరిక్షరత్= స్రవిస్తూ, ఊష్మభరః శ్వసన్= వేడి ఉచ్ఛ్వాస నిశ్వాసములను విడుస్తూ, సః మహాభుజగః= ఆ మహా సర్పము కాళియుడు, అనంతబలం = అతిబలశాలివయిన, భవంతమ్ = నిన్ను,

పరిదశ్య= కాటువేసి(దంశన దర్శనయోః దంశయతే కుట్టుట), అస్ఫుటచేష్టమ్= అదృశ్య వ్యాపారముతో, సమవేష్టయత్= నిన్ను చుట్టుకొనెను, అహో= ఆశ్చర్యము.

**తాత్పర్యము:** నిప్పులు చెఅగు నల్లని కన్నులతో కోరలనుండి అగ్ని విషధారలు స్రవిస్తూ , వేడిగా ఉచ్ఛ్వాస నిశ్వాసములను విడుస్తూ బుసలు కొడుతూ ఆ మహా సర్పము కాళియుడు అతిబలశాలివయిన నిన్ను కాటువేసి అదృశ్య వ్యాపారముతో (నువ్వు ఇతరులకు కనబడకుండా) నిన్ను చుట్టుకొనెను. ఆశ్చర్యము.

**55-7 శ్లో.**
**అవిలోక్య భవంతమథాకులితే తటగామిని బాలకధేనుగణే ।**
**వ్రజగేహతలేఽప్యనిమిత్తశతం సముదీక్ష్య గతా యమునాం పశుపాః ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, భవంతమ్= నువ్వు, అవిలోక్య = కనబడక, ఆకులితే = కలవరపడి అంతట వెదకి, బాలక ధేను గణే = గోపాలురు, ఆవుల సమూహం (బాల ఏవ బాలకః-బాలుడు), తట గామిని = యమునానదీ తీరమును చేరిరి (తటతి ఉచ్ఛ్రితో భవతి ఒడ్డు), వ్రజ గేహ తలే అపి = అక్కడ వ్రేపల్లెలో కూడా, అనిమిత్త శతం= అనేక దుశ్శకునములు (నాస్తి నిమిత్తం యస్య-కారణం లేనిది ప్రమాణంలేనిది),సముదీక్ష్య=కనిపించి,పశుపాః=అక్కడి నందుడు మొదలయిన వారు కూడా, యమునాం= యమునానదీ తీరమును, గతాః = చేరిరి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నువ్వు కనబడక కలవరపడి అంతట వెదకి గోపాలురు, ఆవుల సమూహం యమునానదీ తీరమును చేరిరి. అక్కడ వ్రేపల్లెలో కూడా అనేక దుశ్శకునములు కనిపించి అక్కడి నందుడు మొదలయిన వారు కూడా యమునానదీ తీరమును చేరిరి.

**55-8 శ్లో.**
**అఖిలేషు! విభో! భవదీయదశామవలోక్య జిహాసుషు జీవభరమ్ ।**
**ఫణిబంధనమాశు విముచ్య జవాదుదగమ్యత హాసజుషా భవతా ॥**

**ప్రతిపదార్థము:** విభో= ఓ గురువాయూరు కృష్ణ ప్రభో!, భవదీయదశామ్=

నువ్వున్న దశను, అవలోక్య =చూసి, అఖిలేషు = వారందరూ, జీవభరమ్= నీ విరహమును సహించలేక, జిహసుషు= ప్రాణములను వదలుటకు సిద్ధమైన వారికి, ఆశు = వెంటనే (ఆశు శీఘ్రమ్ శీఘ్రము, తొందరగా), హాసజుషా= ఆత్మ కుశల జ్ఞాపనార్థముగా నవ్వుచూ(హసతి తస్య భావః కర్మ వా నవ్వు), భవతా= నువ్వు, జవాత్ = వేగముగా, ఫణి బంధనమ్ = ఆ సర్పబంధమును, విముచ్య = విడిచి, ఉదగమ్యత= చెట్టుపైకి ఎక్కితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభో! నువ్వున్న తీరు చూసి ఆ గోపాలకులందరూ నీ విరహమును సహించలేక ప్రాణములను వదలుటకు సిద్ధము కాగా వెంటనే ఆత్మ కుశల జ్ఞాపనార్థముగా నవ్వుచూ నువ్వు వేగముగా ఆ సర్పబంధమును విడిపించుకొని చెట్టుపైకి ఎక్కితివి.

**55–9 శ్లో.**

**అధిరుహ్య తతః ఫణిరాజఫణాన్ ననృతే భవతా మృదుపాదరుచా ।**
**కలశింజితనూపురమంజుమిలత్కరకంకణసంకులసంక్వణితమ్ ॥**

**ప్రతిపదార్థము:** తతః = అటుపిమ్మట, ఫణి రాజ = సర్పరాజు, ఫణాన్= పడగలపైకి ఎక్కి, భవతా= నీ, మృదుపాదరుచా= నీ మృదు కాంతి కలగలిపిన (పడగల మీద ఉన్న మణుల కాంతులతో కలిపి), కలశింజిత= మధుర భూషణముల ధ్వనులు కలిగిన (భూషణముల మ్రోత), నూపుర =చిఱుమువ్వలు గలగల ధ్వనులు చేయుచుండగా (వాటితో) (నూయతే ప్రశస్యతే ప్రశంసింపబడునది. కాళ్ల గొలుసు, అందె), మంజు= మనోజ్ఞముగా (మంజతి మనోహరం ధ్వనిం కరోతి మనోహరమైనది), మిలత్= కలిసిన, కర కంకణ = చేతి మణి కంకణముల ధ్వని (కరోతి అనేన కార్యాణి దీనితో పనులు చేయుదురు. చెయ్యి) (కంకణ= కం శుభం కణతి శబ్దం కరోతి కంకణము, ఆభరణము), సంకుల= సంకులముగా (సంకులః ఆకీర్ణః అవ్యవస్థితః ఒకటొకటి కలిసినది వ్యాపించినది), సంక్వణితమ్= మ్రోయగా, ననృతే= నువ్వు నృత్యము చేసావు.

**తాత్పర్యము:** అటుపిమ్మట కాళియుని పడగలపైకి ఎక్కి నీ మృదు కాంతి కలగలిపిన మధుర ధ్వనులు కలిగిన చిఱుమువ్వలు గలగల ధ్వనులు చేయుచుండగా, వాటితో

మనోజ్ఞముగా కలిసిన చేతి మణి కంకణముల ధ్వని కలిసి మ్రోగగా నువ్వు నృత్యము చేసావు.

**55-10 శ్లో.**

**జహృషుః పశుపాస్తుతుషుర్మునయో వవృషుః కుసుమాని సురేంద్రగణాః ।**
**త్వయి నృత్యతి మారుతగేహపతే! పరిపాహి స మాం త్వమదాంతగదాత్ ॥**

**ప్రతిపదార్థము:** పశుపాః= ఆ వ్రేపల్లె గోపాలకులు, త్వయి నృత్యతి= నీవు నృత్యము చేయుచుండగా, జహృషుః= మిక్కిలి ఆనందించారు, మునయః = మునులు, తుతుషుః=సంతోషించి స్తోత్రాలు చేసారు, సురేంద్రగణాః= దేవతల గణాలు, కుసుమాని=పూల వానలు (కుంసయతి ప్రకాశతే అసౌ ప్రకాశించునది. పుష్పము), వవృషుః=కురిపించారు, మారుతగేహపతే= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, సః= అట్లు కాళియుని పడగలపైనృత్యము చేసిన, త్వమ్= నువ్వు, మాం= నన్ను, అదాంత= విరామము లేక వర్ధిల్లు చున్న, గదాత్= రోగము నుండి, పరిపాహి= రక్షించుము.

**తాత్పర్యము:** ఆ వ్రేపల్లె ప్రజలు నీవు నృత్యము చేయుచుండగా మిక్కిలి ఆనందించారు. మునులు సంతోషించి స్తోత్రాలు చేసారు. దేవతల గణాలు పూల వానలు కురిపించారు. ఓ గురువాయూరు కృష్ణ దేవా! అట్లు కాళియుని పడగలపైనృత్యము చేసిన నువ్వు నన్ను వర్ధిల్లుచున్న రోగము నుండి రక్షించుము.

***దశమ స్కంధము***

**55వ దశకము పూర్తి.**

# దశకమ్ 56 – కాలియగర్వశమనము

**56-1 శ్లో.**

**రుచిరకంపితకుండలమండలః సుచిరమీశ! ననర్తిథ పన్నగే ।**
**అమరతాడితదుందుభిసుందరం వియతి గాయతి దైవతయౌవతే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, వియతి = ఆకాశమున (వియచ్ఛతి న విరమతి సర్వవ్యాపత్వాత్ సర్వవ్యాపకము వలన ఎప్పుడు విరమించనిది. ఆకాశము), అమర తాడిత దుందుభిః= దేవదుందుభులు మ్రోగగా (దుందు ఇతి శబ్దేన ఉభతి పూరయతి దుందుం అను శబ్దంతో ఆకాశమును పూరించునది. దుందుభి వాయిద్యము), దైవత యౌవతే= దేవ స్త్రీ సమూహములు (అప్సరసలు) (యువతీనాం సమూహః – యువతుల సమూహము), సుందరం గాయతి= నిన్ను చూసి అందంగా పాడగా, పన్నగే= నువ్వు ఆ కాళియఫణిరాజు పడగపై, కుండల మండలః=నీ అడుగులకు అనుగుణముగా కర్ణకుండలములు, రుచిర= మనోహరంగా, కంపిత =కదులుచుండగా, సుచిరమ్= చాలాకాలము, ననర్తిథ = తాండవము చేసావు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఆకాశమున దేవదుందుభులు మ్రోగగా దేవ స్త్రీ సమూహములు (అప్సరసలు) నిన్ను చూసి అందంగా పాడగా నువ్వు ఆ కాళియఫణిరాజు పడగపై నీ అడుగులకు అనుగుణముగా కర్ణకుండలములు మనోహరంగా కదులుచుండగా చాలాకాలము తాండవము చేసావు

**56-2 శ్లో.**

**నమతి యద్యదముష్య శిరోహరే! పరివిహాయ తదున్నతమున్నతమ్ ।**
**పరిమథన్ పదపంకరుహా చిరం వ్యహరథాః కరతాళమనోహరమ్ ॥**

**ప్రతిపదార్థము:** హరే=.శ్రీహరీ!, అముష్య = ఆ కాళియుని శిరస్సుపై నీవు తాండవము చేయునప్పుడు, యత్ యత్ శిరః = ఏ ఏ పడగ (శ్రియతే ఆశ్రియతే శరీరేణ–శరీరమును ఆశ్రయించునది. శిరస్సు. తల), నమతి= వాలిపోతున్నదో,

తత్= ఆ పడగను, పరివిహాయ = విడిచి, ఉన్నతమ్ ఉన్నతమ్ = ఆమీది తలల పైకి ఎక్కి, పదపంకరుహా= నీ పాదకమలములచే, పరిమథన్ = చిందులు తొక్కుచు, కరతాళ మనోహరమ్= నీ రెండుహస్తములతో చప్పట్లు చరుచుచూ, చిరం = చాలాసమయము, వ్యహరథాః= అద్భుత నర్తన క్రీడ చేసావు.

**తాత్పర్యము :** శ్రీహరీ! ఆ కాళియుని శిరస్సుపై నీవు తాండవము చేయునప్పుడు ఏ ఏ పడగ వాలిపోతున్నదో ఆ పడగను విడిచి ఆమీది తలల పైకి ఎక్కి నీ పాదకమలములచే చిందులు తొక్కుచు నీ రెండుహస్తములతో చప్పట్లు చరుచుచూ చాలాసమయము అద్భుత నర్తన క్రీడ చేసావు.

**56–3 శ్లో.**
**త్వదవభగ్నవిభుగ్నఫణాగణే గళితశోణిత శోణిత పాథసి ।**
**ఫణిపతావవసీదతి సన్నతాస్తదబలాస్తవ మాధవ! పాదయోః ॥**

**ప్రతిపదార్థము:** మాధవ= లక్ష్మీ పతీ ! (మాయాః లక్ష్మ్యాః ధవః – లక్ష్మి భర్త. మాధవుడు), త్వత్ అవభగ్న= నీ మర్దనముచే, ఫణాగణే = పడగలు, విభుగ్న =ఛిద్రము కాగా (విశేషేణ భుగ్నః వక్రః – వంకరయైనది కుటిలమైనది), గళిత = ఆ పడగల నుండి చితికి కారిన రక్తము చే, శోణిత పాథసి= యమునానదిలోని నీళ్లు ఎరుపురంగులోనికి మారగా (శోణిః రక్తవర్ణః సంజాతః అస్య– రక్తం వర్ణం కలది. రక్తము), ఫణిపతౌ= ఆ కాళియుడు, అవసీదతి= భగ్న గాత్రుడు కాగా (పూర్తిగా అలసిపోగా), తత్ అబలాః = ఆ కాళియుని భార్యలైన నాగ కన్యలు, తవ పాదయోః సన్నతాః = పతిభిక్ష కొరకయి నిన్ను శరణువేడిరి. (ప్రణతః శబ్దకృత్ వంగునది).

**తాత్పర్యము :** లక్ష్మీ పతీ! నీ మర్దనముచే పడగలు ఛిద్రము కాగా ఆ పడగల నుండి చితికి కారిన రక్తము చే యమునానదిలోని నీళ్లు ఎరుపురంగులోనికి మారగా ఆ కాళియుడు భగ్న గాత్రుడు కాగా (పూర్తిగా అలసిపోగా) ఆ కాళియుని భార్యలైన నాగ కన్యలు పతిభిక్ష కొరకయి నీ పాదములపై పడి నిన్ను శరణువేడిరి.

**విశేషము:** ఆ కాళియుని భార్యలైన నాగ కన్యలు పతిభిక్ష కొరకయి కృష్ణుని పాదములపై పడి శరణువేడు సందర్భములో మాధవ(లక్ష్మీపతీ !) అను సంబోధన

సముచితంగా, రమణీయంగా ఉన్నది. భార్య ఉన్నవాడివి. మా భర్తను కూడా భార్యా సహితుడిని చేయుమనే వ్యంగ్యం కూడా ధ్వనిస్తున్నది.

**56-4 శ్లో.**

**అయి! పురైవ చిరాయ పరిశ్రుతత్వదనుభావవిలీనహృదో హి తాః ।**
**మునిభిరప్యనవాప్యపథైః స్తవైర్నునువురీశ! భవంతమయంత్రితమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి ఈశ। = ఓ గురువాయూరు దేవా!, పురా ఏవ= పూర్వమే, చిరాయ= ఎంతోకాలము నుండి, త్వత్ అనుభావ = నీ మాహాత్మ్యమును (అనుభావయతి ఉద్బోధయతి అనేన ప్రభావము), పరిశ్రుత= విని, విలీన హృదః = నీయందే లగ్నమయిన హృదయములు కలిగిన (విశేషేణ లీనః ప్రవాహితః, వినష్టః – కారునది, నశించిపోయినది), తాః= ఆ కాళీయుని భార్యలు, మునిభిః అపి = మునులుకూడా, అనవాప్య= అందుకొనలేని, పథైః= రీతిలో, భవంతమ్= నిన్ను, స్తవైః= స్తోత్రములతో (స్తౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తవము. దీనితో స్తోత్రము చేయుదురు), అయంత్రితమ్= అనర్గళముగా(న యంత్రితః, న నియంత్రితః వశములో లేని స్వేచ్ఛగా తిరుగు), నునువుః హి= స్తుతించిరి కదా.

**తాత్పర్యము :** ఓ గురువాయూరు దేవా! పూర్వమే ఎంతోకాలము నుండి నీ మాహాత్మ్యమును విని నీయందే లగ్నమయిన హృదయములు కలిగిన ఆ కాళీయుని భార్యలు మునులుకూడా అందుకొనలేని రీతిలో నిన్ను స్తోత్రములతో అనర్గళముగా స్తుతించిరి.

**56-5 శ్లో.**

**ఫణివధూగణభక్తివిలోకనప్రవికసత్కరుణాకులచేతసా ।**
**ఫణిపతిర్భవతాచ్యుత! జీవితస్త్వయి సమర్పితమూర్తిరవానమత్ ॥**

**ప్రతిపదార్థము:** అచ్యుత = ఓ దేవా!, ఫణి వధూ గణ= ఆ కాళియ సర్పము యొక్క భార్యల, భక్తి = భక్తిని, విలోకన= చూసి, ప్రవికసత్ = సంతోషించి, కరుణా ఆకులచేతసా= దయార్ద్రహృదయుడవై(కరోతి మనః ఆనుకూల్యాయ దీనత్వము దుఃఖము), భవతా = నీచే, ఫణిపతిః= ఆ కాళియుడు, జీవితః = మరణము నుండి

నివారింపబడగా – అనగా బతుకగా (మరణాత్ నివర్తితః )(జీవస్య భావః –జీవితము బ్రతుకు), త్వయి= నీయందు, సమర్పితమూర్తిః= తన జీవితమును అర్పణచేయుచూ, అవానమత్ = అతడు వినయముతో నీకు సాష్టాంగ నమస్కారము చేసెను.

**తాత్పర్యము:** ఓ దేవా! ఆ కాళియ సర్పము యొక్క భార్యల భక్తిని చూసి సంతోషించి దయార్ధ్రహృదయుడవై, నువ్వు కాళియుని బతికించగా అతడు నీకు వినయముతో సాష్టాంగ నమస్కారము చేసెను.

**56–6 శ్లో.**

**రమణకం వ్రజవారిధిమధ్యగం ఫణిరిపుర్న కరోతి విరోధితామ్ ।**
**ఇతి భవద్వచనాన్యతిమానయన్ ఫణిపతిర్నిరగాదురగైః సమమ్ ॥**

**ప్రతిపదార్ధము:** వారిధి మధ్యగం = సముద్రమధ్యమందున్న (వారీణి ధీయంతే అస్మిన్ ఇందులో జలములు వుంచబడును. సముద్రము), రమణకం= రమణక ద్వీపమునకు, వ్రజ = పొమ్ము, ఫణిరిపుః= అక్కడ గరుత్మంతుడు, విరోధితామ్= నీతో విరోధము, న కరోతి = కలిగిఉండడు, ఇతి = అను, భవత్ వచనాని= నీ మాటలను, అతిమానయన్ = గౌరవించుచూ, ఫణిపతిః =ఆ సర్పరాజు కాళియుడు, ఉరగైః సమమ్= ఇతర సర్పములతో కలిసి, నిరగాత్= యమునానదినుండి వెళ్లిపోయెను.

**తాత్పర్యము:** "సముద్రమధ్యమందున్న రమణకద్వీపమునకు పొమ్ము. అక్కడ గరుత్మంతుడు నీతో విరోధము కలిగిఉండడు "అను నీ మాటలను గౌరవించుచూ ఆ సర్పరాజు కాళియుడు ఇతర సర్పములతో కలిసి యమునానదినుండి వెళ్లిపోయెను.

**56–7 శ్లో.**

**ఫణివధూజనదత్తమణివ్రజజ్వలితహారదుకూలవిభూషితః ।**
**తటగతైః ప్రమదాశ్రువిమిశ్రితైః సమగథాః స్వజనైర్దివసావధౌ ॥**

**ప్రతిపదార్ధము:** ఫణివధూజన= కాళియుని భార్యలు, దత్త = నీకు ఇచ్చిన(దత్తః

ప్రదత్తః విసృష్టః ఇవ్వబడినది వదలబడినది), మణివ్రజ జ్వలిత హార=మణికాంతిమనోహరములగు (అవ్యక్తం శబ్దం కరోతి అవ్యక్త శబ్దము చేయునది. మణి, రత్నము), హారాః= హారములతో, (హరతి మనః మనస్సును హరించునది. మాల.), దుకూల = సన్నని వస్త్రములచే (బంగారు జరీ పట్టు వస్త్రములచే) (ప్రావారోత్తరాసంగరూపేణ ద్విధా కూల్యత ఇతి దుకూలమ్ కట్టుకొనుటకు, మీద వేసుకొనుటకును రెండు విధములుగా గప్పబడునది. వెలిపట్టు చీర తెల్లని వస్త్రము), విభూషితః=అలంకరింపబడి(అనగా వాటిని ధరించి), తటగతైః= యమునానదీతీరములో, ప్రమద అశ్రు= నీ కొరకు కాచుకొని నిన్ను చూసిన తరువాత ఆనందబాష్పములు (ప్రకృష్టః మదః హర్షో వా యస్య – ఉన్మాదము హర్షము, సంతోషము), విమిశ్రితైః= కలిసిన (విశేషేణ మిశ్రితం సంపృక్తమ్ కలుపబడినది), స్వజనైః= నీ బంధువులతో, దివస అవధౌ= ప్రొద్దుక్రుంకు చుండగా, సమగథాః= కలిసితివి.

**తాత్పర్యము:** కాళియుని భార్యలు నీకు ఇచ్చిన మణికాంతిమనోహరములగు హారములతో సన్నని వస్త్రములచే (బంగారు జరీ పట్టు వస్త్రములచే) ఆలంకరింపబడి (అనగా వాటిని ధరించి) యమునానదీతీరములో నిన్ను చూసి ఆనందబాష్పములు కురియుచున్న నీ బంధువులతో ప్రొద్దుక్రుంకుచుండగా కలిసితివి.

**56–8 శ్లో.**

**నిశి పునస్తమసా వ్రజమందిరం వ్రజితుమక్షమ ఏవ జనోత్కరే ।**
**స్వపతి తత్ర భవచ్చరణాశ్రయే దవకృశానురరుంధ సమంతతః ॥**

**ప్రతిపదార్థము:** పునః = మరలా(తరువాత), నిశి= ఆ రాత్రి (నితరాం శ్యతి తనూకరోతి జీవానాం వ్యాపారాన్ జీవుల పనులను తగ్గింప చేయునది. రాత్రి), తమసా= చీకట్లలో (తామ్యతి, సంతాపం జనయతి సంతాపమును కల్గించునది. అంధకారము), వ్రజ మందిరం= బృందావనమునకు, వ్రజితుమ్ = వెళ్ళుటకు, అక్షమ ఏవ = అశక్తులైన (న క్షమా సామర్థ్యము లేనివాడు), జన ఉత్కరే= వ్రేపల్లె వాసులు (ఉత్కరణం ఏకత్రీకరణం విస్తృతీకరణం వా ప్రోగు చేయుట), తత్ర= ఆ కాళింది తీరములోనే, భవత్ చరణ ఆశ్రయే= నీ చరణములను ఆశ్రయించి (చరతి

అనేన–దీనిచే నడుచుదురు. కాలు), స్వపతి = నిద్రించిరి, దవకృశానుః = అంతలో దావాగ్ని(దవ=దునోతి పీడయతి దునోతి తస్య భావః–పీడించునది. కార్చిచ్చు) (కృశానుః=కృశ్యతి తనూకరోతి తృణకాష్ఠాది వస్తుజాతమ్ తృణకాష్ఠాదులను తక్కువ చేయువాడు. అగ్ని) (దావాగ్ని=దావస్య వనస్య అగ్ని, దావోద్భవః అగ్ని వనములో పుట్టు అగ్ని. దావానలము), సమంతతః = వారు పడుకొన్న ప్రదేశము నలువైపులా, అరుంధ= చుట్టుముట్టెను.

**తాత్పర్యము :** తరువాత ఆ రాత్రి చీకట్లలో బృందావనమునకు వెళ్ళుటకు అశక్తులైన వ్రేపల్లె వాసులు ఆ కాళింది తీరములోనే నీ చరణములను ఆశ్రయించి నిద్రించిరి. అంతలో దావాగ్ని వారు పడుకొన్న ప్రదేశము నలువైపులా చుట్టుముట్టెను.

**56–9 శ్లో.**

**ప్రబుధితానథ పాలయ పాలయేత్యుదయదార్తరవాన్ పశుపాలకాన్ ।**
**అవితుమాశు పపాథ మహానలం కిమిహ చిత్రమయం ఖలు తే ముఖమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, ప్రబుధితాన్ = దావాగ్ని వేడితో గోపజనులందరూ మేల్కొని (బుధిత= బుద్ధం జ్ఞాతమ్ తెలిసినది తెలుసుకొన బడినది), పాలయ పాలయ= రక్షింపుము, రక్షింపుము, ఇతి= అని, ఉదయత్= ఉద్భవించిన(బిగ్గరగా ఆక్రందించు), పశుపాలకాన్ ఆర్తరవాన్ = గోపాలకుల ఆర్త రావములను విని, ఆశు= వెంటనే (ఆశు శీఘ్రమ్ శీఘ్రము, తొందరగా), అవితుమ్= వారిని రక్షించవలెనని, మహానలం= ఆ అగ్నిని, పపాథ = త్రావివేసితివి, ఇహ= ఈ దావాగ్నిని త్రాగి వేయుటలో, కిమ్ చిత్రమ్= ఆశ్చర్యము ఏమున్నది?, అయం= ఈ అగ్ని, తే ముఖమ్ ఖలు= నీ ముఖమే కదా!

**తాత్పర్యము:** అటుపిమ్మట దావాగ్ని వేడితో గోపజనులందరూ మేల్కొని "రక్షింపుము, రక్షింపుము "అని బిగ్గరగా ఆక్రందించు గోపాలకుల ఆర్తరావములను విని వెంటనే వారిని రక్షించవలెనని ఆ అగ్నిని త్రావివేసితివి. ఈ దావాగ్నిని త్రాగి వేయుటలో ఆశ్చర్యము ఏమున్నది? ఈ అగ్ని నీ ముఖమే కదా! (విశ్వరూపంలో నీ ముఖం నుంచి బయట పడిన పంచభూతాలలో అగ్ని ఒకటి.)

**56-10 శ్లో.**
**శిఖిని వర్ణత ఏవ హి పీతతా పరిలసత్యధునా క్రియయాప్యఽసౌ ।**
**ఇతి నుతః పశుపైర్ముదితైర్విభో! హర హరే! దురితైః సహ మే గదాన్ ॥**

**ప్రతిపదార్థము:** శిఖిని= (ఇదివరలో – నువ్వు అగ్ని తాగక మునుపు) అగ్నికి (శిఖా అస్తి అస్య–శిఖ కలవాడు(ది). అగ్ని, వర్ణతః ఏవ = వర్ణ మాత్రము ననే అనగా రంగుమాత్రముననే (వర్ణ్యతే అనేన–దీనితో వర్ణింతురు. రంగు), పీతతా= పసుపురంగని, పరిలసతి హి= అందరికి తెలియును కదా!, అధునా= ఇప్పుడు, క్రియయా అపి = క్రియలోగూడపీతత్వము అగుట (క్రియతే అసౌచేయబడునది. క్రియ, పని), అసౌ = ఈ అగ్నికి కలిగినది, ఇతి = అని, ముదితైః= ఆనందించుచు, పశుపైః=గోపాలకులు చేసిన, నుతః =నుతులతో ఒప్పిన, విభో= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, హరే = ఓ శ్రీ హరీ!, దురితైః= రోగ కారణ భూతములైన దుష్కర్మ ఫలములతో (దుష్టం ఇతం గమనం నరకాది ప్రాప్తిః అనేన – దీనితో నరకమును పొందుదురు. పాపము దురాచారము), సహ = కలిపి, మే = నాయొక్క, గదాన్= రోగములను, హర= హరింపుము.

**తాత్పర్యము:** ఇదివరలో – నువ్వు అగ్నితాగక మునుపు అగ్నికి – రంగుమాత్రముననే పసుపురంగని అందరికి తెలియును కదా ! ఇప్పుడు క్రియలోగూడ పీతత్వము అగుట ఈ అగ్నికి కలిగినది అని ఆనందించుచు గోపాలకులు చేసిన నుతులతో ఒప్పిన ఓ గురువాయూరు కృష్ణ దేవా ! ఓ శ్రీ హరీ ! రోగ కారణ భూతములైన దుష్కర్మ ఫలములతో కలిపి నాయొక్క రోగములను హరింపుము.

**విశేషము**

**పీత:** పీత పదానికి రెండు అర్థాలు. 1.(పీతః వర్ణః అస్తి అస్య) పసుపు రంగు కలది. పచ్చనిది పసుపు. 2.( పీతం పానమ్ ) త్రాగబడినది. కవి ఈ రెండు అర్థములను చమత్కారంగా ఈ శ్లోకంలో ప్రయోగించాడు. కృష్ణుడు దావాగ్ని త్రాగక మునుపు పీత అంటే పసుపు రంగు అని ఒకటే అర్థం. కృష్ణుడు దావాగ్ని త్రాగిన తరువాత పీత పదానికి త్రాగబడినది అను అర్థం వచ్చిందని కవి చమత్కారం.

*దశమ స్కంధము*

**56వ దశకము పూర్తి.**

# దశకమ్ 57 – ప్రలంబాసురవధ

**57–1 శ్లో.**

**రామసఖః క్వాపి దినే కామద! భగవన్! గతో భవాన్ విపినమ్ ।**
**సూనుభిరపి గోపానాం ధేనుభిరభిసంవృతో లసద్వేషః ॥**

**ప్రతిపదార్థము:** కామద భగవన్ = కోర్కెలు నెరవేర్చు భగవంతుడా! (కామాన్ దదాతి కోరికలను పూరించువాడు)(భగః ఐశ్వర్యాది అస్తి అస్య–ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), క్వాపి దినే= ఒకనాడు, భవాన్ = నువ్వు, లసత్ వేషః= శోభమాన అలంకారములు ధరించి (చక్కని వేషములతో), రామసఖః = బలరామునితో, గోపానాం సూనుభిః అపి= గోప కుమారులతో, ధేనుభిః అభిసంవృతః = ఆవుల మందలతో(సమ్యక్ రుతః ఆవృతః పిహితో వా బాగా కప్పబడ్డది దాచబడ్డది), విపినమ్= అడవికి (వేపనే బిభ్యతి జనాః అత్ర జనులు ఇచట భయపడుదురు. అడవి), గతః= వెళ్ళితివి.

**తాత్పర్యము:** కోర్కెలు నెరవేర్చు భగవంతుడా! ఒకనాడు నువ్వు చక్కని వేషములతో బలరామునితో గోప కుమారులతో ఆవుల మందలతో అడవికి వెళ్ళితివి.

**57–2 శ్లో.**

**సందర్శయన్ బలాయ స్వైరం బృందావనశ్రియం విమలామ్ ।**
**కాండీరైః సహ బాలైర్భాండీరకమాగమో వటంక్రీడన్ ॥**

**ప్రతిపదార్థము:** బలాయ= బలరామునకు (బలతి బలయుక్తో భవతి అనేన–దీనితో యుక్తుడగును. బలము), బృందావన శ్రియం= బృందావన శోభను, సందర్శయన్ = చూపించుచూ, విమలామ్ = స్వచ్ఛమైన, కాండీరైః సహ= బాణములతో, చేతికర్రలతో ఉన్న(కాండః బాణః అస్య అస్తి బాణము కలవాడు ధనుస్సు కలవాడు), బాలైః= గోపబాలకులతో, భాండీరకమ్= భాండీర మను పేరు గల, వటం క్రీడన్= మర్రి వృక్షము కింద ఆటలాడుకొనుటకు(వటతి వేషయతి భూమిమ్ భూమిని చుట్టుకొనునది. మర్రిచెట్టు), స్వైరం = స్వతంత్ర సంతోషముతో (స్వస్య ఈరం స్వేర స్వాతంత్ర్యేణ ఈర్తే స్వతంత్రంగా ప్రవర్తించువాడు), ఆగమః= వెళ్ళితివి.

**తాత్పర్యము:** బలరామునకు బృందావన శోభను చూపించుచూ స్వచ్ఛమైన చేతికర్రలతో ఉన్న గోపబాలకులతో భాండీర మను పేరు గల మర్రి వృక్షము కింద ఆటలాడుకొనుటకు సంతోషముతో వెళ్ళితివి.

**57-3 శ్లో.**

**తావత్తావకనిధనస్పృహయాలుర్గోపమూర్తిరదయాళుః ।**

**దైత్యః ప్రలంబనామా ప్రలంబబాహుం భవంతమాపేదే ॥**

**ప్రతిపదార్థము:** తావత్=ఆ సమయమున (తరువాత), తావక నిధన స్పృహయాలుః = నిన్ను సంహరించు ఆలోచనతో (తవ ఇదమ్ నీకు సంబంధించినది. నీది.) (నితరాం దధాతి ప్రాణినః–ప్రాణులను ధరించునది. మృత్యువు)( స్పృహయితుం శీలం అస్య కోరు స్వభావం కలవాడు. కోరువాడు), గోపమూర్తిః= గోపాలబాలక వేషములో, అదయాళుః= నిర్దయుడగు, ప్రలంబనామా దైత్యః= ప్రలంబుడను పేరు కలిగినరాక్షసుడు,ప్రలంబబాహుం=వ్రేలాడుబాహువులతో(ప్రలంబతే వ్రేలాడుట) (బాహు= బాధతే శత్రూన్ శత్రువులను బాధించునది), భవంతమ్ = నిన్ను, ఆపేదే= సమీపించినాడు.

**తాత్పర్యము:** ఆ సమయమున నిన్ను సంహరించు ఆలోచనతో గోపాలబాలక వేషములో నిర్దయుడగు ప్రలంబుడను పేరు కలిగిన రాక్షసుడు వ్రేలాడు బాహువులతో నిన్ను సమీపించినాడు.

**57-4 శ్లో.**

**జానన్నప్యవిజానన్నివ తేన సమం నిబద్ధసౌహార్దః ।**

**వటనికటే పటుపశుపవ్యాబద్ధమ్ ద్వంద్వయుద్ధమారబ్ధాః ॥**

**ప్రతిపదార్థము:** జానన్ అపి= వచ్చినవాడు రాక్షసుడు – అని తెలిసియూ, అవిజానన్ ఇవ = ఏమియు తెలియనివానివలె, తేన సమం= అతనితో, నిబద్ధ సౌహార్దః = స్నేహము చేసి (నితరాం బద్ధః బంధింపబడ్డవాడు.)(సుహృదః భావః – సౌహార్ద భావము. మైత్రి స్నేహము), వట నికటే= మర్రిచెట్టు సమీపమున(ని సమీపే కటతి వర్తతే దగ్గర వుండునది. దగ్గర), పటు= మల్లయుద్ధ నేర్పరులగు (పాటయతి

చతురో భవతి చాతుర్యం కలవాడు. చతురుడు), పశుప = శ్రీదాముడు మొదలైన నీతోడి గోపబాలురతో, వ్యాబద్ధమ్= ఇతరేతర సంబద్ధమైన (ఒకరికొకరితో ముడిపడిన), ద్వంద్వ యుద్ధమ్= ద్వంద్వయుద్ధము ను (ద్వౌ ద్వౌ సహ అభివ్యక్తౌ రెంటిని ఒకమారు వ్యక్తపరచునది), ఆరబ్ధాః= ప్రారంభించితివి.

**తాత్పర్యము:** వచ్చినవాడు రాక్షసుడు – అని తెలిసియూ ఏమియు తెలియనివానివలె అతనితో స్నేహము చేసి మర్రిచెట్టు సమీపమున మల్లయుద్ధ నేర్పరులగు శ్రీదాముడు మొదలైన నీతోడి గోపబాలురతో ఒకరికొకరితో ముడిపడిన ద్వంద్వయుద్ధము ను ప్రారంభించితివి.

**57–5 శ్లో.**

**గోపాన్ విభజ్య తన్వన్ సంఘం బలభద్రకం భవత్కమపి ।**
**త్వద్బలభీరుం దైత్యం త్వద్బలగతమన్వమన్యథా భగవన్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్= ఓ భగవంతుడా!, గోపాన్ = గోపాలకులను, బలభద్రకం= బలరామునిపక్షము (బలం భద్రం శ్రేష్ఠ అస్య – బలవంతుడైనప్పటికి మంచివాడు, శ్రేష్ఠమైన బలము కలవాడు. బలరాముడు), భవత్కమ్ అపి= నీ పక్షము అని, విభజ్య= విడగొట్టి, సంఘం తన్వన్ =రెండు సంఘములుగా చేసి, త్వత్ బలభీరుం= నీ బలముకు భయపడిన, దైత్యం = ప్రలంబుని, త్వత్ బలగతమ్ =నీవైపు ఉండుటకు, అన్వమన్యథా = అంగీకరించితివి.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! గోపాలకులను బలరామునిపక్షము నీ పక్షము అని విడగొట్టి రెండు సంఘములుగా చేసి నీ బలముకు భయపడిన ప్రలంబుని నీవైపు ఉండుటకు అంగీకరించితివి.

**విశేషము**

**త్వత్ బలభీరుం(నీ బలముకు భయపడిన):** ఓడినవాడు ఓడని వానిని మోయవలసియున్నదని ఆటలో నియమం. అందువలన బలరామునిపక్షమున చేరితే ఒకవేళ ఓడి కృష్ణుని మోయవలసి వస్తుందేమో... అప్పుడు తృణావర్తుని వలె

అతని చేతిలో చనిపోతానేమో అను భయంతో ప్రలంబుడు కృష్ణ పక్షములో చేరాడు అను భావమంతటిని " త్వత్ బలభీరుం" అను పద సంఘటనంలో కవి చెప్పాడు.

**57-6 శ్లో.**
**కల్పితవిజేతృవహనే సమరే పరయూథగం స్వదయితతరమ్ ।**
**శ్రీదామానమధత్థాః పరాజితో భక్తదాసతాం ప్రథయన్ ॥**

**ప్రతిపదార్థము:** కల్పిత విజేతృ వహనే= జయించినవానిని ఓడినవారు ఎత్తుకొని వెళ్ళవలయు నను నియమము ననుసరించి (ఉహ్యాతే అనేన – దీనితో మోయుదురు), సమరే= ద్వంద్వ యుద్ధంలో (సమ్యక్ ఋచ్ఛంతి గచ్ఛంతి యోద్ధుం యోద్ధారః అత్ర–యోద్ధలు యుద్ధము చేయుటకు ఇక్కడికి వెళ్లుదురు. యుద్ధము), పరాజితః = ఓడిపోయిన నువ్వు(పరాజితః పరాభూతః విజితః శత్రుభిః– జయింపబడ్డవాడు), పరయూథగం= బలరాముని పక్షం లో నున్న (యౌతి మిశ్రీభవతి కలిసి వుండునది. సమూహము, గుంపు), స్వదయితతరమ్= నీకు ఎంతో ఇష్టమైన ప్రియమిత్రుని, శ్రీదామానమ్= శ్రీదాముని, భక్త దాసతాం = నీవు భక్తులకు దాసుడవు! అను విషయమును, ప్రథయన్= ప్రకటించుచు, అధత్థాః= మోసావు.

**తాత్పర్యము:** జయించినవానిని ఓడినవారు ఎత్తుకొని వెళ్ళవలయు నను నియమము ననుసరించి ద్వంద్వ యుద్ధంలో ఓడిపోయిన నువ్వు బలరాముని పక్షం లో నున్న నీకు ఎంతో ఇష్టమైన ప్రియమిత్రుని శ్రీదాముని "నీవు భక్తులకు దాసుడవు!" అను విషయమును ప్రకటించుచు మోసావు.

**57-7 శ్లో.**
**ఏవం బహుషు విభూమన్! బాలేషు వహత్సు వాహ్యమానేషు ।**
**రామవిజితః ప్రలంబో జహార తం దూరతో భవద్భీత్యా ॥**

**ప్రతిపదార్థము:** విభూమన్ = ఓ గురువాయూరు దేవా! మహత్త్వం. సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా!, ఏవం=ఇట్లు, బహుషు బాలేషు వహత్సు= అనేక మంది గోపాలురను ఎత్తుకొనుట పలుపర్యాయములు జరిగినతర్వాత

వాహ్యమానేషు = మోయవలసినవారిలో, రామ విజితః= బలరామునికి ఓడిపోయిన, ప్రలంబః = ప్రలంబుడు (ప్రలంబతే వ్రేలాడుట ఒక దైత్యుడు), భవత్ భీత్యా= నీ భయంతో, తం = బలరాముని ఎత్తుకొని, దూరతః జహార= చాలాదూరమునకు తీసుకొనిపోసాగెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ఇట్లు అనేక మంది గోపాలురను ఎత్తుకొనుట పలుపర్యాయములు జరిగినతర్వాత – మోయవలసినవారిలో ఉన్న బలరామునికి ఓడిపోయిన ప్రలంబుడు నీ భయంతో బలరాముని ఎత్తుకొని చాలాదూరమునకు తీసుకొనిపోసాగెను.

**57–8 శ్లో.**

**త్వద్దూరం గమయంతం తం దృష్ట్వా హలిని విహితగరిమభరే ।**
**దైత్యఃస్వరూపమాగాద్యద్రూపాత్ స హి బలోఽపి చకితోఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ = నీ దగ్గర నుండి, దూరం గమయంతం= దూరముగా తనను కొనిపోవుట చూసిన, తం = ఆ రాక్షసుని, దృష్ట్వా = చూసి, హాలిని= బలరాముడు బాగా బరువు కాగా (హలః అస్తి అస్య–నాగలి కలవాడు. బలరాముడు), విహిత గరిమ భరే = అతనిని మోయలేక, దైత్యః = ప్రలంబాసురుడు, స్వరూపమ్ = తన సహజరూపమును(స్వస్య రూపమ్ తన రూపము), అగాత్= ధరించెను, యత్ రూపాత్= ఏ ప్రలంబాసురుని భీకర రూపమున్నదో ఆ సహజ రూపమును చూసి, స హి బలః అపి= ఆ బలరాముడు బలుడయినప్పటికి (ఆదిశేషుని అవతారమయినప్పటికి మనుష్యత్వం వలన), చకితః అభూత్= కొంచెము భయపడ్డాడు.

**తాత్పర్యము:** నీ దగ్గర నుండి దూరముగా తనను కొనిపోవుట చూసిన ఆ రాక్షసుని చూసి బలరాముడు బాగా బరువు కాగా, అతనిని మోయలేక ప్రలంబాసురుడు తన సహజరూపమును ధరించెను. ఏ ప్రలంబాసురుని భీకర రూపమున్నదో – ఆ సహజ రూపమును చూసి – ఆ బలరాముడు బలుడయినప్పటికి కొంచెము భయపడ్డాడు.

**57-9 శ్లో.**

**ఉచ్చతయా దైత్యతనోస్త్వన్ముఖమాలోక్య దూరతో రామః ।**
**విగతభయో దృఢముష్ట్యా భృశదుష్టం సపది పిష్టవానేనమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఉచ్చతయా = బాగా ఎత్తుగా ఉన్న, దైత్యతనోః = ఆ రాక్షసుని భుజములపై నున్న, రామః= బలరాముడు, దూరతః = దూరముగా ఉన్న, త్వత్ ముఖమ్= నీ ముఖమును, ఆలోక్య = చూసి, విగతభయః = భయము లేనివాడై (విగతః లుప్తః విరహితః మృతః – లోపించినది), సపది = వెంటనే (సహ పద్యతే వెంబడి వుండునది. తత్క్షణము), భృశదుష్టం= మిక్కిలి దుష్టుడైన (భృశ్యతి ప్రాచుర్యేణ వర్తతే ఎక్కువగా వున్నది. మిక్కిలి.)(దుష్యతి అసౌ తప్పు చేయువాడు. దుర్బలుడు నీచుడు), ఏనమ్= ఆ రాక్షసుని, దృఢముష్ట్యా = స్థిరమైన పిడికిలితో పొడిచి (ముషతి బధ్నాతి బంధింపబడునది. పిడికిలి), పిష్టవాన్ = పిండిచేసెను (చంపెను).

**తాత్పర్యము:** బాగా ఎత్తుగా ఉన్న ఆ రాక్షసుని భుజములపై నున్న బలరాముడు దూరముగా ఉన్న నీ ముఖమును చూసి భయము లేనివాడై వెంటనే మిక్కిలి దుష్టుడైన ఆ రాక్షసుని స్థిరమైన పిడికిలి పోటు పొడిచి చంపెను.

**57-10**

**హత్వా దానవవీరం ప్రాప్తం బలమాలిలింగిథ ప్రేమ్ణా ।**
**తావన్మిలతోర్యువయోః శిరసి కృతా పుష్పవృష్టిరమరగణైః ॥**

**ప్రతిపదార్థము:** దానవ –వీరం = దానవ వీరుడయిన ప్రలంబాసురుని, హత్వా= వధించి, ప్రాప్తం= నీ దగ్గరకు వచ్చిన, బలమ్= బలరాముని, ప్రేమ్ణా= ప్రేమతో (ప్రియస్య భావః – ప్రేమ), ఆలిలింగథ =నువ్వు ఆలింగనము చేసుకొంటివి, తావత్ మిలతోః = ఆవిధముగ మీరు కలిసికొనుట చూసి, యువయోః శిరసి= మీ శిరస్సులపై, అమరగణైః= దేవతాగణములచే, పుష్పవృష్టిః= పూల వాన (పుష్యతి వికసతి వికసించునది. పుష్పము.)(వర్షతి వర్షించునది. వర్షము), కృతా= చేయబడినది.

**తాత్పర్యము:** దానవ వీరుడయిన ప్రలంబాసురుని వధించి నీ దగ్గరకు వచ్చిన బలరాముని ప్రేమతో నువ్వు ఆలింగనము చేసుకొంటివి. ఆవిధముగ మీరు కలిసికొనుట చూసి మీ శిరస్సులపై దేవతాగణములు పూల వాన కురిపించిరి.

**విశేషము:** తావత్ మిలతోః (ఆవిధముగ మీరు కలిసికొనుట చూసి) సకలము, నిష్కలమైన బ్రహ్మైక్యము ఈ బలరామ కృష్ణుల ఆలింగనమని దేవతల ఆనందం.

కల అంటే భాగం. Part. కలలతో కూడినది సకలం. Whole.

చైతన్యం నామరూపాలతో కలిస్తే అది సకలం.

అలాకాక వాటిని తనలో కలుపుకుని శేషిస్తే నిష్కలం లేదా అకలం. A whole without parts.

**57-11 శ్లో.**

**ఆలంబో భువనానాం ప్రాలంబం నిధనమేవమారచయన్ ।**
**కాలం విహాయ సద్యో లోలంబరుచే హరే హరేః క్లేశాన్ ॥**

**ప్రతిపదార్థము:** హరే = ఓ గురువాయూరు దేవా ! ( హరతి పాపాన్ పాపములను నశింపచేయువాడు. విష్ణువు), లోలంబరుచే = నల్లతుమ్మెద మేనిఛాయతో ప్రకాశించువాడా! (రవన్ లంబతే గచ్ఛతి, రౌః సంలంబతే శబ్దము చేయుచు వెళ్లునది. తుమ్మెద), భువనానాం ఆలంబః = సకల భువనములకు ఆలంబమైన నువ్వు(ఆలంబ్యతే ఆశ్రీయతే అసౌ ఆలంబము, ఆశ్రయము), ఏవమ్ = ఇట్లు, ప్రాలంబం నిధనమ్= ప్రలంబాసురుని వధను, ఆరచయన్ = ఇట్లు నిర్వహించితివి, కాలం = కాలమును పొడిగించుటను, విహాయ= విడిచి, సద్యః= వెంటనే, క్లేశాన్= నా క్లేశములు ( రోగ కష్టములు) (క్లిష్ణాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము యోగ శాస్త్రంలో చెప్పబడిన 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభిమానము అను పంచక్లేశములు), హరేః = హరింపుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! నల్లతుమ్మెద మేనిఛాయతో ప్రకాశించువాడా! సకల భువనములకు ఆలంబమైన నువ్వు ఇట్లు ప్రలంబాసురుని

వధను ఇట్లు నిర్వహించితివి. కాల విలంబమును విడిచి వెంటనే నా రోగ కష్టములు హరింపుము.

**దశమ స్కంధము**

**57వ దశకము పూర్తి.**



# దశకమ్ 58 – దావాగ్నిసంరక్షణం, ఋతువర్ణన

**58–1 శ్లో.**

**త్వయి విహరణలోలే బాలజాలైః ప్రలంబ–**
**ప్రమథన సవిలంబే ధేనవః స్వైరచారాః ।**
**తృణకుతుకనివిష్టా దూరదూరం చరంత్యః**
**కిమపి విపినమైషికాఖ్యమీషాంబభూవుః ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= నువ్వు, బాలజాలైః= గోపబాలకులతో కలిసి, విహరణలోలే = విహరించు సమయంలోను, ప్రలంబ–ప్రమథన=ప్రలంబాసురుని బలరాముడు వధించు, సవిలంబే = ఆలస్యసమయములోను, తృణకుతుకనివిష్టాః= పచ్చిక తినవలెనను ఆసక్తితో (తృణ్యతే భక్ష్యతే గవాదిభిః–పశువులచే తినబడునది. గడ్డి), స్వైరచారాః = స్వేచ్ఛగా అటునిటు తిరుగుచూ, ధేనవః = మీతో వచ్చిన ఆవులు, దూర దూరం= మీకు దూరముగా, చరంత్యః = చరిస్తూ, కిమపి = ఒకానొక, ఐషిక ఆఖ్యమ్ =ఐషికము అను పేరుగల (ఇషీకము అనగా ముంజగడ్డి. దేనితో శుద్ధి చేయబడునో అది ముంజ గడ్డి. అది కలిగిన వనం ఐషికము), విపినమ్ = వనములో, ఈషాం బభూవుః= ప్రవేశించాయి.

**తాత్పర్యము:** నువ్వు గోపబాలకులతో కలిసి విహరించు సమయంలోను, ప్రలంబాసురుని బలరాముడు వధించు సమయములోను పచ్చిక తినవలెనను ఆసక్తితో స్వేచ్ఛగా అటునిటు తిరుగుచూ మీతో వచ్చిన ఆవులు మీకు దూరముగా చరిస్తూ ఒకానొక ఐషికము అను పేరుగల వనములోనికి ప్రవేశించాయి.

**58–2 శ్లో.**

**అనధిగతనిదాఘక్రౌర్యబృందావనాంతాద్**
**బహిరిదముపయాతాః కాననం ధేనవస్తాః ।**
**తవ విరహవిషణ్ణా ఊష్మలగ్రీష్మతాప–**
**ప్రసరవిసరదమ్భస్యాకులాః స్తమ్భమాపుః ॥**

**ప్రతిపదార్థము:** అనధిగత = అప్రాప్తమైన, నిదాఘ క్రౌర్య= వేసవి కాలములో పుట్టు బాధ కొంచెమైనా లేని (నితరాం దహ్యాతే అత్రబాగా మండించునది. గ్రీష్మఋతువు), బృందావన అంతాత్ = బృందావనము విడిచి, బహిః = దానికి కడు దూరములో ఉన్న, ఇదమ్ కాననం = ముంజవనములోనికి, ఉపయాతాః= ప్రవేశించి, తాఃధేనవః = ఆ ఆవులు, తవ విరహ = నీ విరహపు వేడి, విషణ్ణా= బాధింపగా, ఊష్మల = వేడిచిమ్ము, గ్రీష్మతాప= గ్రీష్మ బాధవల్ల, ప్రసర విసరత్= క్రమ్ము కొను వ్యాపించు, అమ్భస్య = నీటి దప్పిక చే, (ఆప్యతే అంభతే శబ్దం కరోతి వా అన్నిచోట్ల లభించునది), ఆకులాః= వ్యాకులమైన, స్తమ్భమ్= నిశ్చేష్టతను (స్తభ్నాతి తస్య భావః కర్మ వా ఆగిపోవుట చలనం లేకుండా వుండుట), ఆపుః= పొందినవి.

**తాత్పర్యము:** వేసవి కాలములో పుట్టు బాధ కొంచెమైనా లేని బృందావనము విడిచి దానికి కడు దూరములో ఉన్న వేసవి కాలపు వేడి అధికంగా ఉన్న ముంజవనములోనికి ప్రవేశించి ఆ ఆవులు నీ విరహపు వేడి బాధింపగా – దానితో పాటు ముంజవనములో వేడిచిమ్ము గ్రీష్మ బాధవల్ల కలిగిన దప్పిక చే, నిశ్చేష్ట తను పొందినవి.

**58–3 శ్లో.**
**తదను సహ సహాయైర్దూరమన్విష్య శౌరే!**
**గలితసరణి ముంజారణ్యసంజాత ఖేదమ్ ।**
**పశుకులమభివీక్ష్య క్షిప్రమానేతుమారాత్**
**త్వయి గతవతి హీహీ సర్వతోఽగ్నిర్జజృంభే ॥**

**ప్రతిపదార్థము:** శౌరే = ఓ గురువాయూరు కృష్ణ దేవా! (శూరస్య గోత్రాపత్యమ్ శూరుని గోత్రములో పుట్టినవాడు. శ్రీకృష్ణుడు), తదను= తరువాత, సహ సహాయైః= నీవు నీ సహచరులతో కలిసి, దూరమ్= ఆ గోమందల కొరకు దూరముగా (దుఃఖేన హీయతే ప్రాప్యతే కష్టంగా పొందబడునది. దూరము), అన్విష్య= వెతికి, గలితసరణి= దారి తప్పి (గలితః నిసృతః పతితః – క్రింద పడినది స్రవించినది.) (సరంతి గచ్ఛంతి అస్యామ్ దీనియందు వెళ్లుదురు. పంక్తి మార్గము), ముంజ అరణ్య = ముంజారణ్యములోకి ప్రవేశించి(ముంజ్యతే శోధ్యతే అనేన

తృణవిశేషః – దీనితో శుద్ధి చేయబడును. ముంజ గడ్డి), సంజాత ఖేదమ్= అలసటతో దుఃఖముతో నిలిచియున్న(ఖిద్యతే అనేన దీనితో బాధనొందుదురు. ఖేదము దుఃఖము కష్టము), పశుకులమ్= గోవులను, అభివీక్ష్య=చూసి, క్షిప్రమ్ = వెంటనే, ఆనేతుమ్= ఆ అవులను మరలించుటకు, త్వయి= నువ్వు, ఆరాత్= వాటి దగ్గరకు (ఆరాత్ దూరసమీపయోః – దూరము సమీపము), గతవతి= వెళ్లగా, హీహీ= కష్టము.. కష్టము, సర్వతః = నాలుగుమూలలలోను, అగ్నిః = దావాగ్ని (కార్చిచ్చు) మంటలు (అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), జజృంభే= అలముకొన్నాయి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! తరువాత నీవు నీ సహచరులతో కలిసి ఆ గోమందల కొరకు దూరముగా వెతికి ముంజారణ్యములోకి ప్రవేశించి అలసటతో దుఃఖముతో నిలిచియున్న గోవులను చూసి వెంటనే ఆ అవులను మరలించుటకు నువ్వు వాటి దగ్గరకు వెళ్లగా... కష్టము.. కష్టము.. నాలుగుమూలలలోను దావాగ్ని (కార్చిచ్చు) మంటలు అలముకొన్నాయి.

**58-4 శ్లో.**
**సకలహరితి దీప్తే ఘోరభాంకారభీమే**
**శిఖిని విహతమార్గా అర్ధదగ్ధా ఇవార్తాః ।**
**అహహ భువనబంధో! పాహి పాహీతి సర్వే!**
**శరణముపగతాస్త్వాం తాపహర్తారమేకమ్ ॥**

**ప్రతిపదార్థము:** భువనబంధో= సకల భువనములకు బంధువా!, సకలహరితి= ముంజారణ్యములో రగుల్కొనిన మంటలు అన్ని దిక్కులలోను, దీప్తే = వ్యాపించి ప్రకాశించగా, ఘోర = ఆ భీకర దావాగ్నినుండి, భాంకార= వెలువడు శబ్దములు (ఒకవిధమైన ఊదువాద్యమునుండి వెలువడు ధ్వనులు), భీమే = భయము కలిగించుచుండగా, శిఖిని= అగ్నినుండి (శిఖా అస్తి అస్య శిఖ కలవాడు అగ్ని), విహత మార్గా= బయటకు పడుటకు మార్గము లేక (విశేషేణ హతః వినష్టః – చంపబడినది, నష్టపోయినది), అర్ధ దగ్ధా ఇవ= సగము చచ్చినట్లుగా, ఆర్తాః= ఆర్తులయి, అహహ= అయ్యో! అయ్యో!, సర్వే = అందరు గోపబాలురు, పాహి

పాహి ఇతి= రక్షింపు రక్షింపుమని, ఏకమ్ తాప హర్తారమ్= తమకష్టములను తీర్చగల ఒకే ఒక్క దైవమయిన (తపతి అసౌ తపించునది. సంతాపము వేడి), త్వాం = నిన్ను, శరణమ్ = శరణము (శృణాతి దుఃఖం అనేన – దీనితో దుఃఖము పోగొట్టబడును. రక్షకుడు ఇల్లు), ఉపగతాః= కోరిరి

**తాత్పర్యము:** సకల భువనములకు బంధువా! శ్రీ కృష్ణా! ఆ ముంజారణ్యములో రగుల్కొనిన మంటలు అన్ని దిక్కులలోను వ్యాపించగా, ఆ భీకర దావాగ్నినుండి వెలువడు శబ్దములు భయము కలిగించుచుండగా, ఆఅగ్నినుండి బయటకు పడుటకు మార్గము లేక సగము చచ్చినట్లుగా ఆర్తులయి అయ్యో! అయ్యో! అందరు గోపబాలురు రక్షింపు రక్షింపుమని తమకష్టములను తీర్చగల ఒకే ఒక్క దైవమయిన నిన్ను శరణము కోరిరి.

**58–5 శ్లో.**

**అలమలమతిభీత్యా సర్వతో మీలయధ్వం**
**దృశమితి తవ వాచా మీలితాక్షేషు తేషు ।**
**క్వ ను దవదహనోఽసౌ కుత్ర ముంజాటవీ సా**
**సపది వవృతిరే తే హంత భాండీరదేశే ॥**

**ప్రతిపదార్థము:** అతిభీత్యా =అతి భయంతో, అలమ్ అలమ్= భయపడకుడు భయపడకుడు, సర్వతః =అందరు, దృశమ్= మీ కన్నులను (పశ్యతి అనేన–దీనితో చూచుదురు. నేత్రము), మీలయధ్వం = మూసుకొనండి, ఇతి= అని, తవ వాచా= నువ్వు చెప్పినంతలో, తేషు మీలిత అక్షేషు= వారు కన్నులను మూసుకొనిరి. (నిమేషితః న వికసితః – వికసించనిది), సపది= ఆ గోపాలురు కన్నులను మూసితెరిచి చూచినంతలో, అసౌ దవదహనః= ఈ దావాగ్ని, క్వ ను= ఎక్కడ?, సా ముంజా అటవీ = ఆ ముంజ వనము, కుత్ర= ఎక్కడ? (అదృశ్యమయ్యాయని భావం), హంత= ఆశ్చర్యము, భాండీర దేశే=భాండీర వనమునందు, తే వవృతిరే= అందరూ యథా ప్రకారముగా పూర్వ స్థానములో స్వామి మహిమతో ఆనందంగా ఉన్నారు.

**తాత్పర్యము:** గురువాయూరు దేవా! "అతి భయంతో భయపడకుడు. భయపడకుడు .అందరు మీ కన్నులను మూసుకొనండి" అని నువ్వు చెప్పినంతలో వారు కన్నులను మూసుకొనిరి. ఆ గోపాలురు కన్నులను మూసితెరిచి చూచినంతలో దావాగ్ని లో వారందరు ఎక్కడ? ఆ ముంజ వనము ఎక్కడ? (అదృశ్యమయ్యాయని భావం) ఆశ్చర్యము! భాండీర వనమునందు అందరూ యథా ప్రకారముగా పూర్వ స్థానములో నీ మహిమతో ఉన్నారు.

**58-6 శ్లో.**

**జయజయ తవ మాయా కేయమీశేతి తేషాం**
**నుతిభిరుది తహాసో బద్ధనానావిలాసః ।**
**పునరపి విపినాంతే ప్రాచరః పాటలాది-**
**ప్రసవనికరమాత్రగ్రాహ్య ఘర్మానుభావే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ =ఓ గురువాయూరు దేవా! కృష్ణా!, జయజయ= జయము జయము, తవ మాయా = నీమాయ(ఐషిక వనములో ఉన్న మేము కన్నులు మూసుకొనగనే భాండీర వట వృక్షము దగ్గరకు వచ్చుట), కా ఇయమ్= ఇది ఏమిటి? (ఎంతో వింతయైనది అని భావం), ఇతి = అని, తేషాం నుతిభిః = వారు పొగడగా, ఉదితహాసః = నీ యోగమాయ వారికి అర్థము గాకుండ చేయుటకు చిరునవ్వు నవ్వి (ఉత్ ఉచ్చైః ఇతః గతః - ఉదయించినది మొలచినది వృద్ధి చెందినది), పునః అపి= మరలా, బద్ధ నానా విలాసః= అనేక విలాసబద్ధుడవై, విపిన -అంతే= బృందావన అరణ్యప్రాంతములో, పాటలాది= పాటలములు మల్లెలు మొదలగు, ప్రసవ నికర మాత్ర గ్రాహ్య= పూవులనుబట్టి మాత్రమే ఇది గ్రీష్మఋతువని గుర్తింప వీలయిన, ఘర్మ అనుభావే= చెమటల ప్రభావము కలుగు గ్రీష్మ ఋతు వాతావరణంలో (ఘరతి క్షరతి అంగాత్ అంగముల నుండి కారునది. చెమట), ప్రాచరః= తిరిగితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! కృష్ణా! జయము జయము నీమాయ(ఐషిక వనములో ఉన్న మేము కన్నులు మూసుకొనగనే భాండీర వట వృక్షము దగ్గరకు వచ్చుట) ఇది ఏమిటి? (ఎంతో వింతయైనది అని భావం) అని వారు పొగడగా నీ

యోగమాయ వారికి అర్థము గాకుండ చేయుటకు చిరునవ్వు నవ్వి మరలా అనేక విలాసములు చూపుచూ బృందావన అరణ్యప్రాంతములో పాటలములు మల్లెలు మొదలగు ప్రసవ పూవులనుబట్టి మాత్రమే ఇది గ్రీష్మఋతువని గుర్తింప వీలయిన వేడిగాలులు వీచు గ్రీష్మ ఋతు వాతావరణంలో తిరిగితివి.

**58–7 శ్లో.**

**త్వయి విముఖమివోచ్చైస్తాపభారం వహంతం**
**తవ భజనవదంతః పంకముచ్ఛోషయంతం ।**
**తవ భుజవదుదంచద్భూరితేజః ప్రవాహం**
**తపసమయమినైషీర్యామునేషు స్థలేషు ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= ఈశ్వరునియందు, విముఖమ్ ఇవ = సేవారహితుని వలె(విరుద్ధం అననుకూలం ముఖం యస్య–విరుద్ధంగా ముఖం గలవాడు ముఖము తిప్పినవాడు), ఉచ్చైః = దట్టముగా, తాపభారం= తాపభారమును, వహంతం = మోయుచు, తవ భజన= నీ సేవ చేయువారు, వదంతః = చెప్పునట్లుగా, పంకమ్ = పంకములను( పాపములను, బురదలను) (పచ్యతే వ్యాప్యతే క్లిద్యతే వా అనేన– దీనితో కష్టపడుదురు. బురద పాపము), ఉచ్ఛోషయంతం= ఇంకింప చేయుచు (ఉచ్ఛోషయతి అసౌ ఎండబెట్టునది ఎండబెట్టుట), తవ భుజ వత్= నీ భుజమువలె, ఉదంచత్=విజృంభించు, భూరితేజ= ప్రశస్తమైన ప్రతాపమును (ప్రశస్తమైన సూర్యకాంతి), ప్రవాహం =ప్రవాహమును కలిగిన, తప సమయమ్ =తాప సమయమును (ఆధిదైవికాది తాపములు, గ్రీష్మ ఋతువును)(తాపయతి అసౌ తపింప చేయునది. గ్రీష్మఋతువు), యామునేషు స్థలేషు= యమునానది ఒడ్డున, అనైషీః= గడపితివి.

**తాత్పర్యము:** ఈశ్వరునియందు సేవారహితుని వలె దట్టముగా తాపభారమును (వేడి.) మోయుచు, నీ సేవ చేయువారు చెప్పునట్లుగా పంకములను పాపములను (బురదలను) ఇంకింప చేయుచు, నీ భుజమువలె ప్రశస్తమైన ప్రతాపమును (ప్రశస్తమైన సూర్యకాంతి) కలిగిన ఆధిదైవికాది తాపసమయమును (గ్రీష్మ ఋతువును) యమునానది ఒడ్డున నువ్వు గడపితివి.

**విశేషము:** గ్రీష్మ ఋతువును, కృష్ణ కృత్యములతో శ్లేషాలంకారముతో ఒకే చోట కవి ఈ శ్లోకంలో చెప్పాడు. తాత్పర్యములో కుండలీకరణములలో చెప్పిన అర్థాలు గ్రీష్మర్తువునకు సంబంధించినవి. ముందు చెప్పిన అర్థాలు కృష్ణునికి సంబంధించినవి.

**58–8 శ్లో.**

**తదను జలదజాలైః త్వద్వపుస్తుల్యభాభిః।**
**వికసదమలవిద్యుత్పీతవాసోవిలాసైః ।**
**సకలభువనభాజాం హర్షదాం వర్షవేళాం**
**క్షితిధరకుహరేషు స్వైరవాసీ వ్యనైషీః ॥**

**ప్రతిపదార్థము:** తదను= తరువాత, త్వత్ వపుః తుల్య = నీ శరీరకాంతినిబోలిన (వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర– దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), భాభిః = దీప్తులు కలిగిన (దీప్తౌ భాతి ప్రకాశించుట), జలదజాలైః = నీలిమేఘములతో, (జలం దదాతి జలము నిచ్చునది. మేఘము), వికసత్=నీ శోభనమైన, అమల= స్వచ్ఛమయిన, పీతవాసః = బంగారు పీతాంబరపు(పీతం వాసం యస్య–పసుపు వస్త్రం కలవాడు, శ్రీకృష్ణుడు), విలాసైః= శోభలతో కూడిన, విద్యుత్ = మెరుపుల సొంపుతో (విద్యోతతే ప్రకాశించునది. విద్యుత్, మెరుపు), సకలభువనభాజాం= సకలభువనములలోని జీవులకు, హర్షదాం= సంతాప శాంతి మరియు సస్య సంపత్తి కలిగించుట ద్వార సంతోషమును ఇచ్చు, వర్షవేళాం = వర్ష ఋతువు ప్రారంభము కాగా, క్షితిధరకుహరేషు= గోవర్ధన పర్వతపు గుహలందు (క్షితిం భూమిం ధరతి భూమిని ధరించునది. పర్వతము), స్వైరవాసీ = నువ్వు స్వేచ్ఛగా, వ్యనైషీః= గడిపితివి.

**తాత్పర్యము:** తరువాత నీ శరీరకాంతినిబోలిన కలిగిన కాంతులు కలిగిన నీలిమేఘములతో, నీ శోభనమైన స్వచ్ఛమయిన బంగారు పీతాంబరపు శోభలతో కూడిన మెరుపుల సొంపుతో సకలభువనములలోని జీవులకు సంతాప శాంతి మరియు సస్య సంపత్తి కలిగించుట ద్వార సంతోషమును ఇచ్చు వర్ష ఋతువు

ప్రారంభము కాగా గోవర్ధన పర్వతపు గుహలందు నువ్వు స్వేచ్ఛగా గడిపితివి.

**58-9 శ్లో.**
**కుహరతలనివిష్టం త్వాం గరిష్ఠం గిరీంద్రః**
**శిఖికులనవకేకాకాకుభిః స్తోత్రకారీ ।**
**స్ఫుటకుటజకదంబస్తోమపుష్పాంజలిం చ**
**ప్రవిదధదనుభేజే దేవ! గోవర్ధనోఽసౌ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు దేవా!, కుహరతలనివిష్టం= అత్మ గుహాశ్రితుడవై తన గుహను అలంకరించిన (కుం భూమిం హరతి భూమిని హరించునది. గుహ), గరిష్ఠం = మహానుభావుడవైన (అతిశయేన గురుః-చాలా పెద్దది), త్వాం= ఈ శ్వరుడవైన నిన్ను, గిరీంద్రః= గోవర్ధన పర్వతము, శిఖి కుల = నెమళ్ళ (శిఖా అస్తి అస్య-శిఖ కలది నెమలి), నవ = వర్షారంభముతో వెలువడిన నూతనమైన, కేకా కాకుభిః = భక్తి భరితమైన అందమైన మాటలచేత(కే మూర్ధ్ని కాయతి మయూర ధ్వని, నెమలి కూత)(కకతి శోకభయనిందాదిభిః వికారం ఆప్నోతి శోకాదులచే మార్పు చెందిన గొంతు. ధ్వని), స్తోత్రకారీ= స్తుతించి, స్ఫుట= పుష్పించిన, కుటజ =గిరిమల్లికా (కొండమల్లె) పుష్పముల చేత, కదంబ= కదంబ కుసుమముల (కందయతి ఆహ్లాదయతి ఆహ్లాదపరచునది. కడిమిచెట్టు), స్తోమ = సమూహముల చేత, పుష్పాంజలిం చ= పుష్పములతో నమస్కరించి, అసౌ గోవర్ధనః= ఈ గోవర్ధన పర్వతము, ప్రవిదధత్ అనుభేజే = పూజించెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! తన గుహను అలంకరించిన మహానుభావుడవైన ఈ శ్వరుడవైన నిన్ను – నెమళ్ళ నూతనమైన భక్తి భరితమైన అందమైన మాటలచేత స్తుతించి, పుష్పించిన గిరిమల్లికా పుష్పముల చేత కదంబ కుసుమముల సమూహముల చేత పుష్పములతో నమస్కరించి –ఈ గోవర్ధన పర్వతము నిన్ను పూజించెను.

**58-10 శ్లో.**

**అథ శరదముపేతాం తాం భవద్భక్తచేతో-**
**విమల సలిలపూరాంమానయన్ కాననేషు ।**
**తృణమమలవనాంతే చారు సంచారయన్ గాః**
**పవనపురపతే! త్వం దేహి మే దేహసౌఖ్యమ్ ॥**

**ప్రతిపదార్ధము:** పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అథ= అటుపిమ్మట, భవత్ భక్త చేతః= నీ భక్తుల మనస్సు వలె, విమల = నిర్మలమైన (విగతః మలః యస్మాత్ మలము లేనిది మలము కానిది. నిర్మలమైనది, స్వచ్ఛమైనది), సలిలపూరాం= జలప్రవాహములచే (సలతి గచ్ఛతి ప్రవహతి ప్రవహించునది. జలము), కాననేషు = అడవులకు, మానయన్= అందమును ఇచ్చుచూ, తాం శరదమ్= ఆ శరదృతువు ( శరదః కాలః-శరత్కాలము)(శృణాతి హినస్తి హింసించునది. ఉపేతాం=ప్రవేశించగా, అమల వనాంతే =ఆ స్వచ్ఛమయిన అడవిలో, చారు = ఆనందంగా, గాః= ఆవులు, తృణమ్ సంచారయన్ = లేత పచ్చికలను తినుచుండగా నువ్వు వాటిని రక్షించావు. ( తృణ్యతే భక్ష్యతే గవాదిభిః- పశువులచే తినబడునది. గడ్డి), త్వం= అట్లు రక్షించిన నువ్వు, మే= నాకు, దేహసౌఖ్యమ్ = ఆరోగ్యమును ( విదేహ కైవల్యము), దేహి= ఇమ్ము.

**తాత్పర్యము :** ఓ గురువాయూరు కృష్ణ దేవా! అటుపిమ్మట నీ భక్తుల మనస్సు వలె నిర్మలమైన జలప్రవాహములచే అడవులకు అందమును ఇచ్చుచూ ఆ శరదృతువు ప్రవేశించగా ఆ స్వచ్ఛమయిన అడవిలో ఆనందంగా ఆవులు లేత పచ్చికలను తినుచుండగా నువ్వు వాటిని రక్షించావు. అట్లు రక్షించిన నువ్వు నాకు ఆరోగ్యమును ( విదేహ కైవల్యము ) ఇమ్ము.

*దశమ స్కంధము*

**58వ దశకము పూర్తి.**

# దశకమ్ 59 – వేణుగానవర్ణన

**59–1 శ్లో.**

**త్వద్వపుర్నవకలాయకోమలం ప్రేమదోహనమశేషమోహనమ్ ।**
**బ్రహ్మతత్త్వపరచిన్ముదాత్మకం వీక్ష్య సమ్ముముహురన్వహం స్త్రియః ॥**

**ప్రతిపదార్థము:** నవ కలాయ= అప్పుడే విచ్చుకొనిన ఇరుగుడుపూవు లేదా నల్లదిరిసెన పూవువంటి తళుకుతో, కోమలం= కోమలమై (కామ్యతే కమనీయో భవతి కోమలమైనది మృదువైనది సుందరమైనది), ప్రేమ దోహనమ్= రాగ వర్ధనమై అంతులేని ప్రేమను కలిగించు, అశేష మోహనమ్ =సకల జీవులకూ ఆకర్షణీయముగను, సమ్మోహితముగను ఉన్న(మోహయతి మోహింప చేయువాడు. కామదేవుని ఒక శరము), బ్రహ్మ తత్త్వ = బ్రహ్మతత్వము, పరచిత్ ముద ఆత్మకం= సచ్చిదానందస్వరూపమూ అయిన, త్వత్ వపుః= నీరూపము, వీక్ష్య= చూసి, స్త్రియః= గోపికలు (1.స్త్యాయతి గర్భం యస్యామ్ గర్భము దీనియందు పెరుగును. స్త్రీ. 2.స్తృణాతి దుర్వినీతా సతి ఆత్మనః పరస్య చ గుణగుణం ప్రచ్ఛాదయతి తన గుణములను కప్పిపుచ్చునది. స్త్రీ.3. స్తృణాతి ఆవృణోతి కల్యాణపరంపరాభిః స్వకులం చ పతికులం చ పితృ కులమును పతి కులమును ప్రకటించునది.స్త్రీ),అన్వహం=ప్రతిరోజు (అహని అహని ప్రతిరోజు,ప్రతిదినము), సమ్ముముహుః= మోహము చెందసాగారు.

**తాత్పర్యము:** అప్పుడే విచ్చుకొనిన ఇరుగుడుపూవు లేదా నల్లదిరిసెన పూవువంటి కాంతితో కోమలమై రాగ వర్ధనమైఅంతులేని ప్రేమను కలిగించు సకల జీవులకూ ఆకర్షణీయముగను, సమ్మోహితముగను ఉన్న బ్రహ్మతత్వము సచ్చిదానందస్వరూపమూ అయిన నీరూపము చూసి గోపికలు ప్రతిరోజు మోహము చెందసాగారు.

**విశేషాలు**

**పరచిత్:** చిత్ అనగా చైతన్యం. పర చిత్ అనగా శ్రేష్ఠమయిన చైతన్యం.

స్ఫురణ. నేనున్నాననే భావం. ఇదే ఆత్మ. చైతన్యమే దాని స్వరూపం. ఆత్మచైతన్యమని పేర్కొనటం కొయ్యబొమ్మ అనటం లాంటిది. రెండూ ఒకటే వాస్తవంలో. అయినా వ్యావహారికంగా వచ్చిందీ మాట.

సత్ అన్నా సత్యమన్నా ఉన్నది అని అర్థం.

కలిగిన ఆత్మజ్ఞానాన్ని అలాగే నిలుపుకొంటూ పోవడం. సత్తా అంటే ఉనికని అర్థం. ఎప్పటికీ మారకుండా నిలిచి ఉన్నదేదో అది సత్ లేదా సత్యం. అది సాకారం కాదు కేవల జ్ఞానరూపం. కనుకనే సత్తా అన్నా అదే. అంటే అస్తిత్వమన్నమాట.

విష్ణునామాలలో సత్తా అని ఒక నామం ఉంది. అంటే విష్ణువు సాకారంగా ఎక్కడో ఉన్నాడని కాదు. నిరాకారమైన భావమే లేదా అస్తిత్వమే విష్ణువు అనే మాటకు అర్థం. అంటే పరమాత్మ స్వరూపం. 'సదేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్' అని ఉపనిషత్తు. ఈ ప్రపంచమంతా సృష్టికి పూర్వం సద్రూపంగానే ఉందట. అప్పటికి ఆత్మా, అనాత్మా అనే తేడా లేక అంతా సద్రూపమే. అయితే అది స్వతఃప్రమాణం కనుక చిద్రూపం కూడా అదే. సచ్చిత్తులే పరమాత్మ అంటే.

**ఆనంద :** నందమన్నా ఆనందమన్నా సుఖమని అర్థం. ఇది విషయ జన్యం కాదు. విషయి రూపమైన ఆత్మజన్యం. తైత్తిరీయంలో ఆనందాన్ని గూర్చిన మీమాంస ఎక్కువగా వస్తుంది. మనుష్యుడి స్థాయినుంచి పరబ్రహ్మ స్థాయివరకు ఎన్నో ఆనంద భూమికలు వర్ణించారు. అన్నింటికీ కడపటిది బ్రహ్మానందమే. పంచకోశాలలో ఆనందమయకోశ మొకటున్నది. దానిలో కలిగే ఆనందం కాదిది. 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా.' అనే మాటను బట్టి బ్రహ్మానందమే అసలైన ఆనందం అని పరిష్కారం.

**59-2 శ్లో.**

**మన్మథోన్మథితమానసాః క్రమాత్ త్వద్విలోకనరతాస్తతస్తతః ।**
**గోపికాస్తవ న సేహిరే హరే! కాననోపగతిమప్యహర్ముఖే ॥**

**ప్రతిపదార్థము:** హరే = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, గోపికాః = గోపికలు (గోపీ ఏవ గోపికా గోపియే గోపిక), మన్మథ = మన్మథునిచే (మనః మథ్నాతి

వికరోతి మనస్సును మార్చువాడు. మన్మథుడు), ఉన్మథిత= మథింపబడిన, మానసాః= మనస్సులు కలవారయి, తతః తతః = మరల మరలా, త్వత్ విలోకనరతాః= నిన్ను చూడవలెనను కోరికతో (విలోకతే తస్య భావః కర్మ వా చూచుట, చూపు), క్రమాత్= క్రమముగా, అహః ముఖే= దినప్రారంభంలో, తవ కానన ఉపగతిమ్ అపి = నీవు గోవులతో అడవికి వెళ్ళినప్పటికి, న సేహిరే= నీ విరహమును ఓర్చుకొనలేక పోవుచుండిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! గోపికలు మన్మథునిచే మథింపబడిన మనస్సులు కలవారయి మరల మరలా నిన్ను చూడవలెనను కోరికతో క్రమముగా దినప్రారంభంలో నీవు గోవులతో అడవికి వెళ్ళినప్పటికి నీ విరహమును ఓర్చుకొనలేక పోవుచుండిరి.

**59-3 శ్లో.**
**నిర్గతే భవతి దత్తదృష్టయస్త్వద్ గతేన మనసా మృగేక్షణాః ।**
**వేణునాదముపకర్ణ్య దూరతస్త్వద్విలాసకథయాభిరేమిరే ॥**

**ప్రతిపదార్థము:** నిర్గతే భవతి= నువ్వు బృందావనమునకు వెళ్ళినపుడు (నిశ్శేషేణ గతః–వెళ్లిపోయినది జరిగిపోయినది), దత్త దృష్టయః= నీపైనే చూపులు పెట్టి (దత్తః ప్రదత్తః విసృష్టః – ఇవ్వబడినది వదలబడినది), త్వత్ గతేన= నీతో పాటు తమను వీడి వెళ్ళిపోయిన, మనసా = మనస్సుతో, మృగేక్షణాః = లేడికండ్లవంటి కండ్లుగల ఆ గోపికలు (మార్ష్టి గచ్ఛతి విచరణశీలః–తిరుగు స్వభావం కలది. జింక), దూరతః = దూరమందుండియు, వేణు నాదమ్= నీ వేణునాదమును, ఉపకర్ణ్య= విని, త్వత్ విలాస కథయా= నీ లీలలను ఒకరికొకరు కథలుగా చెప్పికొంటూ, అభిరేమిరే= ఆనందముతో కాలము గడుపుచుండిరి.

**తాత్పర్యము:** నువ్వు బృందావనమునకు వెళ్ళినపుడు నీపైనే చూపులు పెట్టి నీతో పాటు తమను వీడి వెళ్ళిపోయిన మనస్సుతో లేడికళ్ళవంటి కళ్ళుగల ఆ గోపికలు చాలా దూరము నుంచి వినబడుతున్న నీ వేణునాదమును విని, నీ లీలలను ఒకరికొకరు కథలుగా చెప్పికొంటూ ఆనందముతో కాలము గడుపుచుండిరి.

**59-4 శ్లో.**

**కాననాంతమితవాన్ భవానపి స్నిగ్ధపాదపతలే మనోరమే ।**

**వ్యత్యయాకలితపాదమాస్థితః ప్రత్యపూరయత వేణునాళికామ్ ॥**

**ప్రతిపదార్థము:** కానన అంతమ్= నీవు వనమునకు, ఇతవాన్ = వెళ్ళినప్పుడు, భవాన్ అపి= నువ్వు, స్నిగ్ధ పాదప తలే= అచ్చట ఒక చల్లని వృక్షఛ్ఛాయలో (పాదేన మూలే పిబతి సిక్తం జలమ్ జలమును వేరుతో త్రాగునది. చెట్టు), మనోరమే= అందంగా, వ్యత్యయ ఆకలిత పాదమ్= వ్యత్యస్తముగా ఉంచిన పాదముపై (కుడిపాదము ఎడమ పాదంపై ఆనించి)( విశేషేణ అత్యేతి పారం గచ్ఛతి విరోధం కరోతి తస్య భావః కర్మ వా), ఆస్థితః = వయ్యారముగ నిలిచి, వేణునాళికామ్= పిల్లనగ్రోవిని(వేణతి వాదయతి వాయింపబడునది. వేణువు, పిల్లన గ్రోవి), ప్రత్యపూరయత= పూరించితివి.

**తాత్పర్యము:** వనమునకు వెళ్ళినప్పుడు నువ్వు ఒక చల్లని వృక్షపు నీడలో అందంగా వ్యత్యస్తముగా ఉంచిన పాదముపై (కుడిపాదము ఎడమ పాదంపై ఆనించి) వయ్యారముగ నిలిచి పిల్లనగ్రోవిని పూరించితివి.

**59-5 శ్లో.**

**మారబాణధుతఖేచరీకులం నిర్వికారపశుపక్షిమండలమ్ ।**

**ద్రావణం చ దృషదామపి ప్రభో! తావకం వ్యజని వేణుకూజితమ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో = ఓ కృష్ణ ప్రభూ!, తావకం = నీయొక్క (తవ ఇదమ్ నీకు సంబంధించినది. నీది.), వేణుకూజితమ్= వేణు నాదములో, మార బాణ= మన్మథుని బాణములకు (మారయతి మ్రియంతే ప్రాణినః అనేన-చంపువాడు. ఇతని వలన ప్రాణులు చనిపోవును. మన్మథుడు.)(బణనం శబ్దః, తదస్తి అస్య-శబ్దము చేయునది. బాణము), ధుత= గురి అయిన (ధుత కంపితః త్యక్తః శోధితో వా వణకబడినది), ఖేచరీ కులం= దేవతాంగనలు, (ఖే ఆకాశే చరతి ఆకాశంలో చరించునది. దేవత), నిర్వికార = నిర్వికారముగా నిలిచిన, పశు పక్షి మండలమ్= పశు పక్ష్యాదులు(పాశ్యతే బధ్యతే అసౌ బంధింపబడినది. గ్రామ్య పశువు)(పక్షౌ

అస్య స్తః–రెక్కలు గలది. పక్షి బాణము), ద్రావణం చ = కరిగిన(ద్రవతి గచ్ఛతి తస్య భావః), దృషదామ్ అపి= రాళ్ళు(దృషత్=దీర్యతే అనయాదీనితో రుబ్బుదురు. రుబ్బురాయి), వ్యజని= మనోహరత్వానికి నిలువెత్తు సాక్ష్యాలుగా జనించాయి.

**తాత్పర్యము:** ఓ కృష్ణ ప్రభూ! నీయొక్క వేణు నాదము విని దేవతాంగనలు మన్మథుని బాణములకు గురి అయ్యారు. పశు పక్ష్యాదులు నిర్వికారముగా నిలిచాయి. రాళ్ళు కరిగాయి.

**59-6 శ్లో.**
**వేణురంధ్రతరలాంగులీదళం తాళసంచలితపాదపల్లవమ్ ।**
**తత్ స్థితం తవ పరోక్షమప్యహో సంవిచింత్య ముముహుర్వ్రజాంగనాః ॥**

**ప్రతిపదార్థము:** వేణురంధ్ర = ఆరు వేణురంధ్రములపై (రంధయతి హినస్తి అనేన– రంధ్రము చేయుట దూషించుట రంధ్రము), తరల అంగులీ దళం = నీ ప్రకాశవంతమైన వ్రేళ్లను మూసి తెరుస్తూ (అంగౌ హస్తౌ లీయతే చేతిలో నుండునది. వ్రేలు), తాళ = లయానుకూలతాళమేళనముతో (తలతి ప్రతిష్ఠితో ఉన్నతః భవతి ఉన్నతంగా వుండునది. తాళ వాయిద్యము, తాలము), సంచలిత= సంచలించు, పాద పల్లవమ్ = నీ మృదులపాదములను, తత్ స్థితం = అలా వేణువు వాయించు సందర్భములో ఉన్న నీ వయ్యారమును, తవ పరోక్షమ్ అపి= నీ పరోక్షములో కూడా (అక్ష్ణోః పరమ్ కండ్లకు దూరంగా మాటుగా), సంవిచింత్య= భావించి, వ్రజాంగనాః = గోపికలు, ముముహుః = భావ పారవశ్యం పొందారు, అహో = ఆశ్చర్యము.

**తాత్పర్యము:** ఆరు వేణురంధ్రములపై నీ ప్రకాశవంతమైన వ్రేళ్లను మూసి తెరుస్తూ లయానుకూలతాళమేళనముతో సంచలించు నీ మృదులపాదములను అలా వేణువు వాయించు సందర్భములో ఉన్న నీ వయ్యారమును నీ పరోక్షములో కూడా భావించి గోపికలు భావ పారవశ్యం పొందారు. ఆశ్చర్యము.(ప్రత్యక్షముగా చూడకపోయిన భావించి పారవశ్యము పొందుట గొప్ప విషయమని భావం)

**59– 7 శ్లో.**

**నిర్విశంకభవదంగదర్శినీః ఖేచరీః ఖగమృగాన్ పశూనపి ।**

**త్వత్పదప్రణయి కాననం చ తాః ధన్యధన్యమితి నన్వమానయన్ ॥**

**ప్రతిపదార్థము:** ఖేచరీః = ఆకాశమున తిరుగుచున్న దేవతాస్త్రీలు, ఖగ= పక్షులు (ఖే ఆకాశే గచ్ఛతి ఆకాశములో వెళ్లువాడు. సూర్యుడు గ్రహాలు పక్షి), మృగాన్ = అరణ్యములో తిరుగు మృగములు, పశూన్ అపి= పశువులు కూడా, నిర్విశంక= ఏ సంకోచములేకుండగనే, భవత్ = నీ, అంగ= అంగ ప్రత్యంగముల యొక్క (అంగయతి చేషయతి దేహావయవము), దర్శినీః= దర్శనము చేసిరి, త్వత్ పదప్రణయి= నీ పాదస్పర్శకు నోచుకొనిన, కాననం చ= ఆ అడవి (మరియు వారు), ధన్య ధన్యమ్= ఎంత ధన్యధన్యములో కదా! (అతిశయ భాగ్యము పొందినవి), ఇతి= అని, తాః = ఆ గోపాంగనలు, అమానయన్ నను = నిన్ను ప్రశంసించిరి కదా!

**తాత్పర్యము:** ఆకాశమున తిరుగుచున్న దేవతాస్త్రీలు, పక్షులు అరణ్యములో తిరుగు మృగములు పశువులు కూడా ఏ సంకోచములేకుండగనే నీ అంగ ప్రత్యంగముల యొక్క దర్శనము చేసి పులకించిరి. నీ పాదస్పర్శకు నోచుకొనిన ఆ అడవి (మరియు వారు) ఎంత ధన్యధన్యములో కదా! అని ఆ గోపాంగనలు నిన్ను ప్రశంసించిరి కదా !

**59–8 శ్లో.**

**ఆపిబేయమధరామృతం కదా వేణుభుక్తరసశేషమేకదా ।**

**దూరతో బత కృతం దురాశయేత్యాకులా ముహురిమాః సమాముహన్ ॥**

**ప్రతిపదార్థము:** బత = అయ్యో!, వేణు భుక్త రసశేషమ్ ఆపిబేయమ్= ఈ పిల్లన గ్రోవి కడుపునిండ త్రాగగా మిగిలిన, అధర అమృతం= నీ మధురమైన అధరామృతము (ముఖస్య అధో భవః–పెదవులు), కదా =ఎప్పుడయినా (కస్మిన్ కాలే ఎపుడు?), ఏకదా = ఒక్కసారైనా తాగే కోరిక మాకు తీరుతుందా? ( ఏకస్మిన్ కాలే ఒకప్పుడు), దూరతః కృతం = ఆ భాగ్యము దూరముగా ఉన్న మాకు దక్కుట,

దురాశయ= దురాశ కాదుకదా, ఇతి= అని, ముహుః = మరలా మరలా, ఆకులాః = ఆకులులై (అత్యంతం క్షుబ్ధః అసంగతశ్చ – క్షోభ చెందిన), ఇమాః= ఆ గోపికలు, సమాముహన్= నిస్పృహ చెందిరి.

**తాత్పర్యము:** "అయ్యో! ఈ పిల్లన గ్రోవి కడుపునిండ త్రాగగా మిగిలిన నీ మధురమైన అధరామృతము – ఎప్పుడయినా ఒక్కసారైనా తాగే కోరిక మాకు తీరుతుందా? ఆ భాగ్యము దూరముగా ఉన్న మాకు దక్కుట దురాశ కాదుకదా!'' అని మరలా మరలా బాధపడి ఆగోపికలు నిస్పృహ చెందిరి.

**59–9 శ్లో.**

**ప్రత్యహం చ పునరిత్థమంగనాశ్చిత్తయోనిజనితాదనుగ్రహాత్ ।**
**బద్ధరాగవివశాస్త్వయి ప్రభో! నిత్యమాపురిహ కృత్యమూఢతామ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో = ఓ గురువాయూరు కృష్ణా!, ప్రత్యహం చ= దినదినము, ప్రతిదినము, పునః = మరలా మరలా, ఇత్థమ్= ఈ విధముగా (పై శ్లోకములో చెప్పినట్లు) (అనేన ప్రకారేణ–ఈ విధంగా), అంగనాః =ఆ గోప స్త్రీలు (ప్రశస్తం అంగం అస్యాః–ప్రశస్తమైన అంగములు గలది. కామిని), చిత్తయోని జనితాత్= మన్మథుని వలన పుట్టిన, అనుగ్రహాత్ = అనుగ్రహము వలన(అనుగ్రహః దుఃఖదూరకరణేచ్ఛా దయ చూపుట అనుగ్రహించుట), త్వయి = నీ పట్ల, బద్ధ రాగ వివశాః = ప్రేమానురాగబద్ధులై, ఇహ = ఇక్కడ (గృహములలో), నిత్యమ్ = చేయవలసిన నిత్య కార్యక్రమములను, కృత్య మూఢతామ్, ఆపుః= చేయుటకు ఉపేక్ష చూపిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణా! ప్రతిదినము మరలా మరలా నిన్ను తలుచుకొనుచూ ఆ గోప స్త్రీలు మన్మథుని వలన పుట్టిన అనుగ్రహము వలన నీ పట్ల ప్రేమానురాగబద్ధులై గృహములలో చేయవలసిన నిత్య కార్యక్రమములను కూడా చేయుటకు ఉపేక్ష చూపిరి.

**విశేషము:** శృంగారరసరూపమైన ప్రేమలక్షణమయిన భక్తితో గోపికలు ఉన్నారు కనుక కృష్ణునిపట్ల గోపికలకు మోహము కలిగించుట మన్మథుడు గోపికల పట్ల చూపిన అనుగ్రహమని కవి భావం.

**59-10 శ్లో.**

**రాగస్తావజ్జాయతే హి స్వభావాన్మోక్షోపాయో యత్నతః స్యాన్న వా స్యాత్ ।**
**తాసాం త్వేకం తద్ ద్వయం లబ్ధమాసీద్ భాగ్యం భాగ్యం పాహి మాం మారుతేశ !॥**

**ప్రతిపదార్థము:** మారుతేశ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, రాగః= స్త్రీపురుషులనడుమ ప్రేమ, తావత్ = స్త్రీ లకుగాని పురుషులకుగాని, స్వభావాత్ = స్వభావసిద్ధముగా, జాయతే హి= పుడుతుంది. (దానికి ప్రయత్నము అవసరము లేదు), మోక్ష ఉపాయః = మోక్ష రూపమైన భక్తి(మోక్ష్యతే దుఃఖం అనేన-దీనితో దుఃఖము వదిలి పెట్టబడును. ముక్తి, మోక్షము), యత్నతః = ప్రయత్నముతో, స్యాత్= సిద్ధిం చవచ్చు, న వా స్యాత్ = సి ద్ధిం చకపోవచ్చు, తాసాం తు= ఆ గోపికలకు, తద్ ద్వయం= కామసుఖము కలిగించు కాంతునిపై ప్రేమ, మోక్షసుఖమును ఇచ్చు ఈశ్వరునిపై ప్రేమ (ద్వౌ అవయవౌ యస్య-రెండు అవయవములు కలది. రెండు), ఏకం = కాంతుడు. ఈశ్వరుడు కూడా అయినందువలన ఒక్క కృష్ణుని రూపంలో, లబ్ధమ్ ఆసీత్= లభించాయి, భాగ్యం భాగ్యం= వారి భాగ్యమే భాగ్యము, మాం= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! స్త్రీపురుషులనడుమ ప్రేమ స్త్రీ లకుగాని పురుషులకుగాని స్వభావసిద్ధముగా పుడుతుంది. దానికి ప్రయత్నము అవసరములేదు కాని మోక్ష రూపమైన భక్తి ప్రయత్నముతో సిద్ధిం చవచ్చు లేదా సి ద్ధిం చకపోవచ్చు . ఆ గోపికలకు కామసుఖము కలిగించు కాంతునిపై ప్రేమ, మోక్షసుఖమును ఇచ్చు ఈశ్వరునిపై ప్రేమ కాంతుడు, ఈశ్వరుడు కూడా అయినందువలన ఒక్క కృష్ణుని రూపంలో లభించాయి. వారి భాగ్యమే భాగ్యము. నన్ను రక్షించు.

***దశమ స్కంధము***

**59వ దశకము పూర్తి.**

# దశకమ్ 60 – గోపీవస్త్రాపహరణము

**60–1 శ్లో.**
**మదనాతురచేతసోఽన్వహం భవదంఘ్రిద్వయదాస్యకామ్యయా ।**
**యమునాతటసీమ్ని సైకతీం తరళాక్ష్యో గిరిజాం సమార్చిచన్ ॥**

**ప్రతిపదార్థము:** తరళ అక్ష్యాః= అందంగా చలించు కన్నులు కలవారయిన గోపకన్యలు, మదన ఆతురచేతసః = మన్మథ బాధతో నిండిన మనస్సు కలవారయి (మనసు నీపై చేర్చి) (మదయతి మత్తెక్కించువాడు. కామదేవుడు)(ఆతుతోర్తి త్వరయతి అసౌ తొందర పెట్టువాడు, రోగి తొందర పెట్టునది), అన్వహం= ప్రతిరోజు ( అహని అహని ప్రతిరోజు, ప్రతిదినము), భవత్ = నీయొక్క, అంఘ్రి ద్వయ= పాదములను (అంఘతే గచ్ఛతి అనేన చరణము. కాలు ), దాస్య = సేవించు (దాసస్య భావః – దాసుని భావము. దాస్యము), కామ్యయా= కోర్కెతో (కామ్యతే కామయితుం యోగ్యం కమనీయమ్ కోరదగినది), యమునా తట సీమ్ని= యమునాతీరమందు, సైకతీం గిరిజాం = ఇసుకతో గిరిజాదేవి ప్రతిమను ప్రతిష్ఠించి (సికతాః సంతి అత్ర–ఇసుక వున్న ప్రదేశము. నది ఒడ్డు), సమార్చిచన్= కాత్యాయనీవ్రత మనుపేర గౌరీపూజలు ప్రారంభించిరి.

**తాత్పర్యము:** ప్రకాశించు కన్నులు కలవారయిన గోపకన్యలు మన్మథ బాధతో నిండిన మనస్సు కలవారయి (మనసు నీపై చేర్చి ) ప్రతిరోజు నీయొక్క పాదములను సేవించు కోర్కెతో యమునాతీరమందు ఇసుకతో గిరిజాదేవి ప్రతిమను ప్రతిష్ఠించి, కాత్యాయనీవ్రత మనుపేర గౌరీపూజలు ప్రారంభించిరి.

**60–2 శ్లో.**
**తవ నామకథారతాః సమం సుదృశః ప్రాతరుపాగతా నదీమ్ ।**
**ఉపహారశతైరపూజయన్ దయితో నందసుతో భవేదితి ॥**

**ప్రతిపదార్థము:** తవ నామ= నీ పేరులోను, కథా రతాః = నీకథలలోను ఇష్టము కలిగిన (నీ పేరులు నీ కథలు కలిగిన పాటలు పాడుకొనుచు)(కథ్యతే ఇతి కథా చెప్పబడునది చెప్పుట కథాసాహిత్యము), సమం సుదృశః= అందమైన

కన్నులు కలిగిన ఆ గోపకన్యలు, ప్రాతః = ప్రతిదినము — ఉదయముననే, నదీమ్ ఉపాగతా = ఆ యమునానదీ తీరమును చేరుకొని (నాదయతి శబ్దం కరోతి జలేన – జలముతో శబ్దము చేయునది. నది), ఉపహార శతైః = జల గంధ పుష్పధూపాదులతో (ఉపహ్రియతే ఉపాయనీ క్రియతే అసౌ ఉపహారము, బహుమానము, కానుక), నందసుతః = నందుని కుమారుడయినట్టి శ్రీకృష్ణునినే, దయితః భవేత్ ఇతి = తమకు భర్తగా అనుగ్రహించమని(మనోహరునిగా కావలెనని)(దయతే రక్షణాదికం కరోతి రక్షించువాడు. భర్త), అపూజయన్=గౌరిని పూజించిరి.

**తాత్పర్యము:** నీ పేరులోను నీకథలలోను ఇష్టము కలిగిన అందమైన కన్నులు కలిగిన ఆ గోపకన్యలు – ప్రతిదినము ఉదయముననే ఆ యమునానదీ తీరమును చేరుకొని జల గంధ పుష్పధూపాదులతో నందుని కుమారుడయినట్టి శ్రీకృష్ణునినే తమకు భర్తగా అనుగ్రహించమని గౌరిని పూజించిరి.

**60–3 శ్లో.**
**ఇతి మాసముపాహితవ్రతాస్తరలాక్షీరభివీక్ష్య తా భవాన్ ।**
**కరుణామృదులో నదీతటం సమయాసీత్ తదనుగ్రహేచ్ఛయా ॥**

**ప్రతిపదార్థము:** ఇతి = ఈ విధముగా ( పై శ్లోకంలో చెప్పిన విధంగా), మాసమ్= ఒక మాసకాలము (మస్యతే పరిమీయతే అసౌ అనేన వా ఇది కొలువబడును, దీనితో కొలుతురు. మాసము, నెల), ఉపాహిత వ్రతాః = కాత్యాయని వ్రతమును ఉపాసించిరి.(ఉపాహితః నిహితః సంబద్ధో వా ఉంచబడినది పెట్టబడినది సంబద్ధమైనది.)(వారయతి పాపాచరణాత్ పాపాచరణము నుండి వారించునది. వ్రతము), తాః తరలాక్షీః= ఆ అందమైన కన్నులు కలిగిన గోపికల యొక్క, అభివీక్ష్య =భక్తిప్రపత్తులనుచూసి, భవాన్= నీ, కరుణా మృదులః =కరుణార్ద్ర హృదయముతో (కరోతి మనః ఆనుకూల్యాయ–దీనత్వము దుఃఖము.)(మృదుత్వం అస్తి అస్య– మృదుత్వం కలది. జలము మృదువైనది), తదనుగ్రహ ఇచ్ఛయా= వారిని అనుగ్రహించవలెనని తలచి, నదీతటం = యమునా నదీ తీరమునకు, సమయాసీత్= వెళ్ళితివి.

**తాత్పర్యము:** ఈ విధముగా (పై శ్లోకంలో చెప్పిన విధంగా) ఒక మాసకాలము కాత్యాయని వ్రతమును ఉపాసించిరి. ఆ అందమైన కన్నులు కలిగిన గోపికల యొక్క భక్తిప్రపత్తులనుచూసి నీ కరుణార్ద్ర హృదయముతో వారిని అనుగ్రహించ వలెనని యమునా నదీ తీరమునకు వెళ్ళితివి.

**60-4 శ్లో.**

**నియమావసితౌ నిజాంబరం తటసీ మన్యవముచ్య తాస్తదా ।**
**యమునాజలఖేలనాకులాః పురతస్త్వామవలోక్య లజ్జితాః ॥**

**ప్రతిపదార్థము:** నియమ అవసితౌ =కాత్యాయని వ్రతము పూర్తి అయిన సమయంలో (నియచ్ఛంతి రుందంతి అనాచారాదికమ్ దీనితో అనాచారము ఆపబడును. నియమము కట్టుబాటు), నిజ అంబరం= తమచీరలు(అంబః శబ్దః తం రాతి ధత్తే శబ్దము కల్గియున్నది), తటసీమని= యమునానది గట్టున, అవముచ్య= విడిచి, తాః = ఆ గోపికలు, తదా= అప్పుడు, యమునా జలఖేలన= యమునానదీ జలములలో జలక్రీడలలో (ఖేలనం క్రీడనమ్ ఆడుట ఆట), ఆకులాః = మునిగి(ఆకులం ఆసమంతాత్ పూర్ణమ్ నిండియున్నది), పురతః = ఎదుట (పురతి అగ్రే గచ్ఛతి ముందు ఉండునది. ముందు ముందుగా), త్వామ్= నిన్ను, అవలోక్య = చూసి, లజ్జితాః=సిగ్గుపడిరి (లజ్జా సంజాతా).

**తాత్పర్యము:** కాత్యాయని వ్రతము పూర్తి అయిన సమయంలో తమచీరలు యమునానది గట్టున విడిచి నగ్నలై ఆ గోపికలు అప్పుడు యమునానదీ జలములలో జలక్రీడలలో మునిగి ఎదుట నిన్ను చూసి సిగ్గుపడిరి.

**60-5 శ్లో.**

**త్రపయా నమితాననా స్వథో వనితాస్వంబరజాలమంతికే ।**
**నిహితం పరిగృహ్య భూరుహో విటపం త్వం తరసాఽధిరూఢవాన్ ॥**

**ప్రతిపదార్థము:** త్రపయా= (నీవు అట్లు ఆకస్మాత్తుగా కనిపించగా – ఆ గోపకాంతలు) సిగ్గుతో (త్రపతే లజ్జతే తస్య భావః–సిగ్గు), నమిత ఆననాసు= ముఖములు వంచికొనగా(నమః అస్య జాతః – నమస్కారము పెట్టబడ్డవాడు.

వంగినది), అథః =అటుపిమ్మట, అంతికే నిహితం = దగ్గరిలోనే ఉన్న(అంతః సామీప్యం అస్తి అస్య–దగ్గర ఉండువాడు సమీపం, దగ్గర) (నిహితః స్థాపితః గూఢః–పెట్టబడ్డది దాచబడినది), వనితాసు అంబరజాలమ్= వారి వస్త్రములను, పరిగృహ్య = తీసుకొని, భూరుహః విటపం = దాపులో ఉన్న పొన్నచెట్టు కొమ్మపైకి(భువి రోహతి ప్రాదుర్భవతి భూమిలో మొలచునది, పుట్టినది. వృక్షాదులు)(వేటతి శబ్దాయతే శబ్దం చేయునది. కొమ్మ), త్వం = నువ్వు, తరసా= వెంటనే (ఝటితి వేగేన–తొందరగా. శీఘ్రంగా), అధిరూఢవాన్= ఎక్కితివి.

**తాత్పర్యము:** నీవు అట్లు ఆకస్మాత్తుగా కనిపించగా – ఆ గోపకాంతలు – సిగ్గుతో ముఖములు వంచికొనగా దగ్గరిలోనే ఉన్న వారి వస్త్రములను తీసుకొని దాపులో ఉన్న పొన్నచెట్టు కొమ్మపైకి నువ్వు వెంటనే ఎక్కితివి.

**60–6 శ్లో.**

**ఇహ తావదుపేత్య నీయతాం వసనం వః సుదృశో! యథాయథమ్ ।**

**ఇతి నర్మమృదుస్మితే త్వయి బ్రువతి వ్యముముహే వధూజనైః ॥**

**ప్రతిపదార్థము:** సుదృశః= ఓ! సుందర యువతులారా! (శోభనే దృశౌ నేత్రే యస్యాః–అందమైన కండ్లు కలవారు), ఇహ తావత్ ఉపేత్య = మీరిక్కడకు వచ్చి, వః = మీ, వసనం= వస్త్రములను (వస్యతే ఆచ్ఛాద్యతే అనేన–దీనితో కప్పబడును. వస్త్రము), యథాయథామ్= ఎవరికి సంబంధించినవి వారివి (యథా స్వభావమ్ స్వభావముననుసరించి. ఉన్నదున్నట్టు), నీయతాం = తీసుకొనుడు, ఇతి= అని, నర్మ మృదు స్మితే= నర్మ గర్భముగా మృదు దరహాసముతో (నయతి ఆనందమ్ ఆనందము నిచ్చునది. పరిహాసము), త్వయి బ్రువతి = నువ్వు పలుకగా, వధూజనైః= ఆ గోపవనితలు, వ్యముముహే= ఏమిచేయవలయునో –ఏమి మాట్లాడవలయునో తోచని సందేహ స్థితికి లోనయిరి.

**తాత్పర్యము:** "ఓ సుందర యువతులారా! మీరిక్కడకు వచ్చి మీ వస్త్రములను ఎవరికి సంబంధించినవి వారివి తీసుకొనుడు" అని నర్మ గర్భముగా మృదు – దరహాసముతో నువ్వు పలుకగా ఆ గోపవనితలు ఏమిచేయవలయునో –ఏమి మాట్లాడవలయునో తోచని సందేహ స్థితికి లోనయిరి.

**60–7 శ్లో.**

**అయి జీవ చిరం కిశోర! నస్తవ దాసీరవశీకరోషి కిమ్ ।**
**ప్రదిశాంబరమంబుజేక్షణేత్యుదితస్త్వం స్మితమేవ దత్తవాన్ ॥**

**ప్రతిపదార్థము:** అయి కిశోర= ఓయి పిల్లవాడా! (కించిత్ శృణాతి కొద్దిగా బాధపెట్టునది(వాడు), చిరంజీవ= నీవు చిరంజీవివి అవుదువు గాక!, నః తవ దాసీః= ఈ నీదాసురాండ్రను (దాస్యతే దీయతే అన్నాదికం అస్యై అన్నాదులు ఈమెకు ఇవ్వబడును. దాసి), కిమ్ = ఎందుకు, అవశీ కరోషి = పరవశలజేయు చున్నావు?, అంబుజ ఈక్షణ= పద్మనేత్రా!, అంబరమ్ = మా వస్త్రములను, ప్రదిశ = మాకు ఇచ్చివేయుము, ఇతి = అని, ఉదితః = గోపికలు చెప్పగా ( వేడుకొనగా), త్వం= నువ్వు, స్మితమ్ ఏవ= వారికి చిరునవ్వును మాత్రమే (ఈషద్ధసతి తస్య భావః కర్మ వా చిరునవ్వు, మందస్మితము), దత్తవాన్= అనుగ్రహించితివి.

**తాత్పర్యము:** ఓయి పిల్లవాడా! నీవు చిరంజీవివి అవుదువుగాక! ఈ నీదాసురాండ్రను ఎందుకు పరవశలజేయుచున్నావు? (బాధ పెట్టుచున్నావు) పద్మనేత్రా! మా వస్త్రములను మాకు ఇచ్చివేయుము అని గోపికలు వేడుకొనగా నువ్వు వారికి చిరునవ్వును అనుగ్రహించితివి.

**60–8 శ్లో.**

**అధిరుహ్య తటం కృతాంజలీః పరిశుద్ధాః స్వగతీర్నిరీక్ష్య తాః ।**
**వసనాన్యఖిలాన్యనుగ్రహం పునరేవం గిరమప్యదా ముదా ॥**

**ప్రతిపదార్థము:** తటం =ఒడ్డును (తటతి ఉచ్ఛ్రితో భవతి పెరుగునది పైకి లేచి వున్నది. ఒడ్డు), అధిరుహ్య= ఎక్కి(అధి = ఉపరి రోహణం = ఆరోహణమ్ పైకి పోవుట ఎక్కుట), కృత–అంజలీః = నమస్కరించి, పరిశుద్ధాః =పరిశుద్ధులై, స్వగతీః = నిన్ను శరణు వేడిన, నిరీక్ష్య =వారిని చూసి, తాః అఖిలాని వసనాని= వారివారి వస్త్రములను వారికి ఇచ్చి, పునః =మరలా, అనుగ్రహం= అనుగ్రహముతో, ఏవం=ఇట్లు, గిరమ్ అపి= చక్కనిపలుకులను కూడా, ముదా= సంతోషముతో, అదాః=వారికి ఇచ్చావు(పలికావు).

**తాత్పర్యము:** ఒడ్డును ఎక్కి నమస్కరించి నమన రూప ప్రాయశ్చిత్తముతో పరిశుద్ధులై నిన్ను శరణు వేడిన గోపికలకు వారివారి వస్త్రములను వారికి ఇచ్చి అనుగ్రహముతో ఇట్లు చక్కనిపలుకులను కూడా సంతోషముతో పలికావు

**60-9 శ్లో.**
**విదితం నను వో మనీషితం వదితారస్త్విహ యోగ్యముత్తరమ్ ।**
**యమునాపులినే సచంద్రికాః క్షణదా ఇత్యబలాస్త్వమూచివాన్ ॥**

**ప్రతిపదార్థము:** వః= మీ మనసులలోని, మనీషితం= సంకల్పములు(కోరికలు), విదితం నను = నాకు తెలిసినదేకదా!, యమునాపులినే=యమునానది ఒడ్డున ఉన్న ఇసుక తిన్నెలలో గడిపే (పులిన= పోలతి ఉచ్ఛ్రితో భవతి తోయోత్థిత తటమ్ ఎత్తుగా వున్న నదీతటము. ఇసుకదిన్నె), క్షణదాః= రాత్రులు (క్షణం సుఖం దదాతి సుఖమును ఇచ్చునది. రాత్రి), సచంద్రికాః= వెన్నెలల పండువులు. (చంద్రః ఆశ్రయత్వేన అస్తి అస్యాః-చంద్రుడు ఆశ్రయంగా కలది. వెన్నెల), ఇహ తు =ఇక్కడ, యోగ్యమ్ ఉత్తరమ్ = యోగ్యమైన జవాబుతో, వదితారః=నేను మీయెడల ప్రతిస్పందిస్తాను, ఇతి= అని, త్వమ్= నువ్వు, అబలాః= ఆగోపికలతో, ఊచివాన్= పలికావు.

**తాత్పర్యము:** "మీ మనసులలోని కోరికలు విదితం నాకు తెలిసినవే కదా! యమునానది ఒడ్డున గడిపే రాత్రులు వెన్నెలల పండువులు. ఇక్కడ యోగ్యమైన జవాబు మీకు ఇస్తాను'' అని నువ్వు ఆగోపికలతో పలికావు.

**60-10 శ్లో.**
**ఉపకర్ణ్య భవన్ముఖచ్యుతం మధునిష్యంది వచో మృగీదృశః ।**
**ప్రణయాదయి వీక్ష్య వీక్ష్య తే వదనాబ్జం శనకైర్గృహం గతాః ॥**

**ప్రతిపదార్థము:** అయి = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, భవత్ ముఖ చ్యుతం= నీ నోటినుండి వెలువడిన, మధు నిష్యంది వచః = ఆ తేనెలొలుకు పలుకులను (మన్యంతే విశేషేణ జానంతి యస్మిన్ విశేషంగా తెలుసుకొందురు. తేనె), ఉపకర్ణ్య = విని( చెవులనే దోసిళ్ళతో తాగి), మృగీదృశః = లేడికన్నులవంటి కన్నులు గల ఆ

గోపవనితలు(మృగజాతి స్త్రీ ఆడ మృగము), ప్రణయాత్ = ప్రేమభారముతో (ప్రణయః ప్రీతిః ప్రశ్రయః ప్రణయము ప్రీతి నమ్మకము), తే వదన అబ్జం= నీ ముఖ పద్మమును, వీక్ష్య వీక్ష్య= పదే పదే చూసి చూసి, శనకైః= నెమ్మదిగా (శనైః శనైః – మెల్లగా), గృహం గతాః= తమ ఇండ్లకు వెడలిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! నీ నోటినుండి వెలువడిన ఆ తేనెలొలుకు పలుకులను విని లేడికన్నులవంటి కన్నులు గల ఆ గోపవనితలు ప్రేమభారముతో నీ ముఖ పద్మమును పదే పదే చూసి చూసి నెమ్మదిగా తమ ఇండ్లకు వెడలిరి.

**60–11 శ్లో.**

**ఇతి నన్వనుగృహ్య వల్లవీర్విపినాంతేషు పురేవ సంచరన్ ।**
**కరుణాశిశిరో హరే! హర త్వరయా మే సకలామయావళిమ్ ॥**

**ప్రతిపదార్థము:** కరుణాశిశిరః=దయార్థ్రహృదయా! (శిశిరః= శృణాతి హినస్తి శీతేన శీతంతో బాధించునది.చల్లనిది), హరే= ఓ గురువాయూరు శ్రీహరీ!, ఇతి= ఇట్లు, వల్లవీః= గోపికలను (వల్లవజాతి స్త్రీ వల్లవజాతి స్త్రీ. గోపికా), అనుగృహ్య= అనుగ్రహించి, విపిన అంతేషు= వన ప్రాంతములలో, పురా ఇవ= ఇదివరకటి మాదిరిగా, సంచరన్= విహరించుచుంటివి, త్వరయా= త్వరగా, మే= నాయొక్క, సకల ఆమయావళిమ్= సమస్తరోగములను (ఆమయతి పీడయతి పీడించునది. రోగము), నను = నిశ్చయముగా(నసుదతి ప్రేరయతి ప్రేరేపించునది ప్రశ్నించుట నిశ్చయము), హర = హరించుము.

**తాత్పర్యము:** దయార్థ్రహృదయా ! ఓ శ్రీహరీ! ఇట్లు గోపికలను అనుగ్రహించి వన ప్రాంతములలో ఇదివరకటి మాదిరిగా విహరించుచుంటివి. త్వరగా నాయొక్క సమస్తరోగములను నిశ్చయముగా హరించుము.

***దశమ స్కంధము***

**60వ దశకము పూర్తి.**

## దశకమ్ 61 – విప్రపత్న్యనుగ్రహము

**61–1 శ్లో.**

**తతశ్చ బృందావనతోఽతిదూరతో వనం గతస్త్వం ఖలు గోప గోకులైః ।**
**హృదంతరే భక్తతర ద్విజాంగనాకదంబకానుగ్రహణాగ్రహం వహన్ ॥**

**ప్రతిపదార్థము:** తతః చ= అటుపిమ్మట, త్వం= నువ్వు, గోప గోకులైః= గోవులు, గోపాలురతో కలిసి, బృందావనతః = బృందావనమునకు (వృందానాం తులసీ గుల్మానాం వనమ్ తులసివనము), అతిదూరతః = ఎంతో దూరములో ఉన్న, వనం=అడవికి, గతః = వెళ్ళి, హృదంతరే = తమ హృదయములలో, భక్తతర ద్విజ –అంగనా కదంబక = నీయందు దృఢభక్తి కలిగియున్న బ్రాహ్మణస్త్రీల సమూహమును (ద్విజ=ద్విః జాయతే రెండుసార్లు పుట్టువాడు. బ్రాహ్మణ – క్షత్రియ – వైశ్యులు) (అంగనా=ప్రశస్తం అంగం అస్యాః–ప్రశస్తమైన అంగములు గలది. కామిని సుందరాంగి), అనుగ్రహణ= అనుగ్రహించాలని, ఆగ్రహం= తలంపును (ఆగృహ్యతే తస్య భావః–పట్టుకొనుట గ్రహించుట దృఢ సంకల్పము భక్తి), వహన్ ఖలు = వహించితివి కదా!

**తాత్పర్యము:** అటుపిమ్మట నువ్వు గోవులు, గోపాలురతో కలిసి బృందావనమునకు ఎంతో దూరములో ఉన్న అడవికి వెళ్ళి తమ హృదయములలో నీయందు దృఢభక్తి కలిగియున్న బ్రాహ్మణస్త్రీల సమూహమును అనుగ్రహించాలనుకొన్నావు.

**61–2 శ్లో.**

**తతో నిరీక్ష్యాశరణే వనాంతరే కిశోరలోకం క్షుధితం తృషాకులమ్ ।**
**అదూరతో యజ్ఞ పరాన్ ద్విజాన్ ప్రతి వ్యసర్జయో దీదివియాచనాయ తాన్ ॥**

**ప్రతిపదార్థము:** తతః = అటుపిమ్మట, అశరణే= గృహరహితులై నిలువనీడ లేక (నాస్తి శరణం రక్షణం యస్య–శరణము (ఇల్లు) లేనివాడు), వనాంతరే= ఆ అడవిలో, తృషా ఆకులమ్= దాహముతో (తృష్యతి తస్య భావః–దప్పిక), క్షుధితం =ఆకలితో నకనకలాడుతున్న (క్షుధా అస్య సంజాతా ఆకలి కలవాడు), కిశోరలోకం= గోపబాలురను ( కించిత్ శృణాతి] కొద్దిగా బాధపెట్టునది(వాడు),

పది నుండి 15 సంవత్సరముల పిల్లవాడు), నిరీక్ష్య= చూసి, అదూరతః = వారున్న ప్రదేశమునకు దగ్గరలో ఉన్న, యజ్ఞ పరాన్= కర్మ ప్రధానత్వముతో భక్తి జ్ఞాన విముఖులై యజ్ఞము చేయుచున్న (ఇజ్యతే హవిః దీయతే అత్ర – ఇక్కడ హవిని ఈయబడును. యజ్ఞము.2. ఇజ్యంతే పూజ్యంతే దేవతాః అత్ర – దేవతలు ఇక్కడ పూజింపబడుదురు. యజ్ఞము), ద్విజాన్ ప్రతి = బ్రాహ్మణుల దగ్గరికి వెళ్లి, దీదివి = వండిన అన్నమును (దీవ్యంతి అనేన ఇతి దీదివిః దీనిచేత ప్రకాశింతురు. అన్నము), యాచనాయ = అర్థించుమని, తాన్= గోపబాలురను, వ్యసర్జయః =నువ్వు పంపితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట గృహరహితులై నిలువనీడ లేక ఆ అడవిలో దప్పికతో ,ఆకలితో నకనకలాడుతున్న గోపబాలురను చూసి వారున్న ప్రదేశమునకు దగ్గరలో యజ్ఞము చేయుచున్న బ్రాహ్మణుల దగ్గరికి వెళ్లి వండిన అన్నమును అర్థించుమని ఆ గోపబాలురను నువ్వు పంపితివి.

**61–3 శ్లో.**
**గతేష్వథో తేష్వభిదాయ తేఽభిధాం కుమారకేష్వోదనయాచిషు ప్రభో! ।**
**శ్రుతిస్థిరా అప్యభినిన్యురశ్రుతిం న కించిదూచుశ్చ మహీసురోత్తమాః ॥**

**ప్రతిపదార్థము:** ప్రభో = ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, అథః=అటుపిమ్మట, తేషు కుమారకేషు = ఆ గోపాల బాలురు(కుమారయతి క్రీడతి ఆడుకొనువాడు. పిల్లవాడు), గతేషు= యాగముచేయుచున్న బ్రాహ్మణులవద్దకు పోయి, తే అభిధాం = నీ పేరును(అభిధీయతే అనేన–పేరు), అభిదాయ= ప్రస్తావించి, ఓదన యాచిషు= ఆహారముకొరకు అర్థించగా(ఉనత్తి ఆర్ద్రీభవతి అన్నము వండిన బియ్యము), శ్రుతి స్థిరా అపి= మంచి శ్రవణేంద్రియ శక్తి ఉన్నవారయ్యును (శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్థం తెలియును. వేదము చెవి), మహీసుర ఉత్తమాః= ఆ బ్రాహ్మణోత్తములు, అశ్రుతిం = వినిపించుకొనక పోవుటను, అభినిన్యుః= పొందిరి.(వాళ్ళ మాటలను బ్రాహ్మణులు వినలేదని భావం), కించిత్= ఏమీ, నఊచుః చ = జవాబివ్వలేదు కూడా!

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! అటుపిమ్మట ఆ గోపాల బాలురు

యాగముచేయుచున్న బ్రాహ్మణులవద్దకు పోయి నీ పేరును ప్రస్తావించి ఆహారముకొరకు అర్థించగా మంచి శ్రవణేంద్రియ శక్తి ఉన్నవారయినప్పటికి ఆ బ్రాహ్మణోత్తములు వాళ్ళ మాటలను వినలేదు. ఏమీ జవాబివ్వలేదు కూడా !

**విశేషము:** ఈ శ్లోకంలో " శ్రుతిస్థిరాః "దగ్గర శ్లేషాలంకారముంది.

శ్రుతిస్థిరాః అపి= వేదములందు నిశ్చయ జ్ఞానం గలవారయ్యు ,అనేక శాస్త్ర విషయములను బాగుగా శ్రవణము సేసిన వారయినప్పటికి,

**61-4 శ్లో.**

**అనాదరాత్ ఖిన్నధియో హి బాలకాః సమాయయుర్యుక్తమిదం హి యజ్వసు ।**
**చిరాదభక్తాః ఖలు తే మహీసురాః కథం హి భక్తం త్వయి తైః సమర్ప్యతే ॥**

**ప్రతిపదార్థము:** అనాదరాత్= అట్లు నిరాదరణతో (న ఆదరః గౌరవహేతునా సమ్మాననా అనాదరము పరాభవము తిరస్కారము), ఖిన్నధియః = దుఃఖపడిన మనస్సులతో(ఖిన్నః జాతభేదః-దుఃఖపడువాడు), బాలకాః= ఆ గోపబాలకులు, సమాయయుః= నీవద్దకు తిరిగి వచ్చిరి, ఇదం= ఆ సోమయాజులయిన (సోమరసంతో యజ్ఞం చేయువాడు) బ్రాహ్మణులు చేసిన పని, యుక్తమ్ హి= న్యాయమే, యజ్వసు= ఆ బ్రాహ్మణులు తాముచేయుచున్న యజ్ఞములందు మాత్రమే శ్రద్ధ కలవారు (విధినా ఇష్టవాన్ విధిపూర్వకంగా యజ్ఞం చేసినవాడు), చిరాత్= చాలాకాలము నుండి, అభక్తాః ఖలు= యజ్ఞపురుషుడవగు నీయందు శ్రద్ధ లేనివారు కదా ! (న భక్తిః భక్తే రభావః – భక్తి లేకపోవుట విశ్వాసము లేకపోవుట), తే మహీసురాఃహి = అటువంటి ఆ బ్రాహ్మణులు, కథం= ఎట్లు, తైః =వారిచేత (బ్రాహ్మణుల చేత), త్వయి= (నీవే స్వయముగా కోరిననూ) నీకు, కథం= ఎట్లు, భక్తం సమర్ప్యతే హి = ఆహారము సమర్పించగలరు?( భజ్యతే సేవ్యతే తినదగినది. అన్నము).

**తాత్పర్యము:** అట్లు నిరాదరణతో చిన్నబోయిన మనస్సులతో ఆగోపబాలకులు నీవద్దకు తిరిగి వచ్చిరి. ఆ సోమయాజులయిన బ్రాహ్మణులు చేసిన పని న్యాయమే. ఆ బ్రాహ్మణులు తాముచేయుచున్న యజ్ఞములందు మాత్రమే శ్రద్ధ కలవారు.

చాలాకాలము నుండి యజ్ఞపురుషుడవగు నీయందు శ్రద్ధ లేనివారు కదా ! అటువంటి ఆ బ్రాహ్మణులు ఎట్లు నీవే స్వయముగా కోరిననూ – ఎట్లు ఆహారము సమర్పించగలరు?

**విశేషము:** అభక్తాః అను పదములో శ్లేషాలంకారమున్నది. చిరాత్= చిరకాలము, అభక్తా = భక్తము అనగా అన్నము లేనివారు, అన్నము లేనివారిచే నీయెడ భక్తం=అన్నము, కథం సమర్ప్యతే = ఎట్లు సమర్పింపబడును? అన్నము లేక ఉపవాసము లుండు బ్రాహ్మణులు నువ్వు పంపిన గోప బాలురకు అన్నము ఎలా పెడతారని భావము.

**61–5 శ్లో.**
**నివేదయధ్వం గృహిణీజనాయ మాం దిశేయురన్నం కరుణాకులా ఇమాః ।**
**ఇతి స్మితార్ద్రం భవతేరితా గతాస్తే దారకా దారజనం యయాచిరే ॥**

**ప్రతిపదార్థము:** గృహిణీజనాయ= ఆ సోమయాజుల భార్యలయిన సోమి దేవమ్మలకు (గృహం గృహస్వామిత్వం అస్తి అస్యాః (భార్యా) ఇంటి యజమానురాలు), మాం = నాపేరు, నివేదయధ్వం= చెప్పుడు, కరుణాకులాః = దయార్ద్ర హృదయులైన, ఇమాః = ఆ సోమయాజుల పత్నులు, అన్నం = అన్నము (అనితి జీవతి అనేన–దీనితో జీవింతురు. అన్నము), దిశేయుః= పెట్టగలరు, ఇతి= అని, స్మిత ఆర్ద్రం= చిరునవ్వుచే(ఈషద్ధసతి తస్య భావః కర్మ వా చిరునవ్వు, మందస్మితము), భవతా ఈరితాః = నీ చే చెప్పబడిన మాటను విని, తే దారకాః= ఆ గోపబాలురు (దారయతి నాశయతి జనకస్య పితౄణమ్ తండ్రి ఋణమును తీర్చువాడు. కొడుకు), గతాః= వెళ్లి, దారజనం= ఆ బ్రాహ్మణ పత్నులకు కృష్ణుడు చెప్పినట్లే చెప్పి (1. దారయంతి భ్రాతృ స్నేహమ్ అన్నదమ్ములను వేరు చేయునది, 2. దారయంతి కుటుంబమ్ కుటుంబమును వేరు చేయునది. భార్య. 3.దారయంతి జ్ఞాతిబంధూన్ జ్ఞాతులను, బంధువులను వేరు చేయునది. భార్య), యయాచిరే= అన్నము పెట్టుడని వేడుకొనిరి.

**తాత్పర్యము:** “ఆ సోమయాజుల భార్యలయిన సోమిదేవమ్మలకు నాపేరు చెప్పుడు. దయార్ద్ర హృదయులైన ఆ సోమయాజుల పత్నులు అన్నము పెట్టగలరు” అని

చిరునవ్వుచే నీ చే చెప్పబడిన మాటను విని ఆ గోపబాలురు వెళ్లి ఆ బ్రాహ్మణ పత్నులకు కృష్ణుడు చెప్పినట్లే చెప్పి అన్నము పెట్టుడని వేడుకొనిరి.

**61-6 శ్లో.**

**గృహీతనామ్ని త్వయి సంభ్రమాకులాశ్చతుర్విధం భోజ్యరసం ప్రగృహ్య తాః ।**
**చిరం ధృతత్వత్ప్రవిలోకనాగ్రహాః స్వకైర్నిరుద్ధా అపి తూర్ణమాయయుః ॥**

**ప్రతిపదార్థము:** త్వయి గృహీత నామ్ని= నీ పేరును వినీవినగనే, సంభ్రమ ఆకులాః= తొట్రుపడి, తాః= ఆ విప్రపత్నులు, చతుర్విధం = నాలుగు విధములయిన భోజ్య-ఖాద్య- పేయ - లేహ్యరూపమున ఉన్న నాలుగు విధములయిన, భోజ్య రసం = రసవంతములయిన వంటలను (భోక్తుం యోగ్యమ్ తినదగినది), ప్రగృహ్య = తీసుకొని, చిరం ధృత =చాలకాలముగా ధరించిన (మనస్సులో ఉన్న), త్వత్ ప్రవిలోకన ఆగ్రహాః= నిన్ను చూడవలెనని కోరికతో ఉన్నవారు కనుక, స్వకైః= తమ వారయిన భర్త మొదలయిన వారితో, నిరుద్ధాః అపి= అడ్డగింపబడినప్పటికి, తూర్ణమ్= లెక్క సేయక వెంటనే(త్వరతే తస్య భావః-శీఘ్రము, తొందర), ఆయయుః= నీదగ్గరకు వచ్చారు.

**తాత్పర్యము:** నీ పేరును వినీవినగనే తొట్రుపడి ఆ విప్రపత్నులు నాలుగు విధములయిన భోజ్య-ఖాద్య(ఖాదితుం యోగ్యమ్ తినదగినది. భోజనము.) - పేయ – (పీయతే పాతుం యోగ్యో వా త్రాగదగినది త్రాగుటకు యోగ్యమైనది.) లేహ్య(లేఢుం యోగ్యమ్ నాకదగినది. అమృతము).రూపమున ఉన్న నాలుగు విధములయిన రసవంతములయిన వంటలను తీసుకొని -చాలకాలముగా నిన్ను చూడవలెనని కోరికతో ఉన్నవారు కనుక -భర్త మొదలయిన వారితో అడ్డగింపబడినప్పటికి లెక్క సేయక వెంటనే నీదగ్గరకు వచ్చారు.

**విశేషము:** పంచభక్ష్యములుగా, చతుర్విధములుగా సాహిత్యంలో భోజ్యాదులు ప్రసిద్ధిలో ఉన్నాయి. ఈ శ్లోకంలో చతుర్విధములుగా కవి చెప్పాడు. చతుర్విధముల వంటకాల గురించి తాత్పర్యంలో పేర్కొన్నాను. ఇప్పుడు పంచభక్ష్యముల వివరణ చూద్దాం. .1.భక్ష్యము, 2.భోజ్యము, 3.లేహ్యము, 4.చోష్యము, 5.పానీయము. భక్ష్యం అంటే కొరికి తినేది.నమలదగినవి (గారె, అప్పము వంటివి),భోజ్యం అంటే

కొరకకుండా నమలి మింగేది .తినదగినవి( దధ్యోదనం వంటివి)

లేహ్యం అంటే నాకి భుజింపదగిన వ్యంజనవిశేషము.తేనె వంటి పదార్థాలను చోష్యం అంటే పీల్చదగ్గది లేదా జుర్రుకోడానికి వీలైనది. పానీయం అంటే త్రాగదగినది అని అర్థం.

**61–7 శ్లో.**

**విలోలపింఛం చికురే కపోలయోః సముల్లసత్కుండలమార్ద్రమీక్షితే ।**
**నిధాయ బాహుం సుహృదంససీమని స్థితం భవంతం సమలోకయంత తాః ॥**

**ప్రతిపదార్థము:** చికురే = ముంగురులందు(చి ఇతి అవ్యక్తం శబ్దం కురతి చి అను శబ్దము చేయునది. వెంట్రుకలు), విలోల= ఊగు (విశేషేణ లోలః చంచలః ఊగుట), పింఛం= పింఛము.( పింఛయతీతి పింఛం ప్రకాశించునది నెమలిపురి), కపోలయోః = చెక్కిళ్ళను(కంపతే అసౌ కదలునది. చెక్కిలి, చెంప), సముల్లసత్ = ప్రకాశవంతముచేయు, కుండలమ్= కర్ణకుండలములతో (కుండ్యతే రక్ష్యతే కుండం తదాకారం లాతి గృహ్ణాతి రక్షింపబడునది. ఒక విశిష్ట ఆకారములో వుండునది. కుండలములు), ఆర్ద్రమ్ ఈక్షితే = దయతో తడిసిన నేత్రములతో( వాత్సల్యాతిశయజనితమైన ఆనంద బాష్పములతో తడిసిన) సుహృత్ = ఒక మిత్రుని, అంస సీమని= భుజముపై(అమతి అమ్యతే వా భారాదినా భారమును వహించునది. స్కంధము భుజము), బాహుం = నీ చేతిని(బాధతే శత్రూన్ శత్రువులను బాధించునది), నిధాయ= నిలిపి, స్థితం= నిలబడి ఉన్న, భవంతం= నిన్ను, తాః= ఆ ముని పత్నులు, సమలోకయంత = దర్శించిరి.

**తాత్పర్యము:** శిరమునందు ఊగు పింఛము, చెక్కిళ్ళను ప్రకాశవంతముచేయు కర్ణకుండలములతో, దయతో తడిసిన నేత్రములతో ఒక మిత్రుని భుజముపై నీ చేతిని నిలిపి కనుల విందుగా నిలబడి ఉన్న నిన్ను ఆ ముని పత్నులు దర్శించిరి.

**61–8 శ్లో.**

**తదా చ కాచిత్ త్వదుపాగమోద్యాతా గృహీతహస్తా దయితేన యజ్వనా ।**
**తదైవ సంచింత్య భవంతమంజసా వివేశ కైవల్యమహో కృతిన్యసౌ ॥**

**ప్రతిపదార్థము:** తదా చ= అక్కడ (ఆ మునివాటికలో)(తస్మిన్ కాలే ఆ కాలమున ఆ సమయంలో అపుడు), కాచిత్= ఒక మునిభార్య ( కాచన కాపి స్త్రీ ఒక స్త్రీ), త్వత్ ఉపాగమ= నిన్ను దగ్గరనుండి చూడవలెనని(ఉప సమీపే గమనం ఆగమనం వా స్వీకరణమ్ దగ్గరకు వెళ్లుట స్వీకరించుట), ఉద్యాతా= ముందుకు వచ్చుచుండగా, దయితేన యజ్వనా= యజ్ఞకర్తయగు ఆమెభర్త, గృహీత హస్తా= ఆమెను అడ్డగించుటకు చేతిని పట్టుకొనగా, తదా ఏవ = అప్పుడే, భవంతమ్ = నిన్ను, సంచింత్య = ధ్యానించుచూ, అంజసా = అనాయాసముగా ,చాలా సులభముగా (అంజం గతిం విలంబం వా స్యతి నాశయతి విలంబమును పోగొట్టునది. శీఘ్రము, తొందర), కైవల్యమ్ = కైవల్యమును (మోక్షమును), వివేశ = పొందెను( ప్రాణము వీడి కృష్ణునిలో ఐక్యమయ్యెనని భావం), అహో = ఆహా!, అసౌ= ఆమె, కృతినీ = ఎంతపుణ్యాత్మురాలో కదా! (కృతం కర్మ ప్రశస్తం అస్యాః అస్తి ప్రశస్తమైన పని చేసినది).

**తాత్పర్యము:** ఆ మునివాటికలో ఒక మునిభార్య నిన్ను దగ్గరనుండి చూడవలెనని బయలుదేరగా ఆమెభర్త అడ్డగించెను. అప్పుడే నిన్ను ధ్యానించుచూ – చాలా సులభముగా మోక్షమునుపొందెను . ఆహా ! ఆమె ఎంతపుణ్యాత్మురాలో కదా!

**విశేషాలు:** కృష్ణ ధ్యానముతో కలిగిన నిరతిశయ సంకల్ప సుఖానుభవము చేత, కృష్ణ విరహము వలన కలిగిన సంతాపదుఃఖానుభవముచేత సుఖదుఃఖరూప బంధములు ఆమునిపత్నికి తెగిపోయి– అనగా సుఖ దుఃఖములు క్షీణించి అనాయాసముగ మోక్షమును పొందెనని విశేష వ్యాఖ్యానం. .

**61–9 శ్లో.**

**ఆదాయ భోజ్యాన్యనుగృహ్య తాః పునస్త్వదంగసంగ స్పృహయోజ్ఝతీర్గృహమ్।**
**విలోక్య యజ్ఞాయ విసర్జయన్నిమాశ్చకర్థ భర్తౄనపి తాస్వగర్హణాన్ ॥**

**ప్రతిపదార్థము:** భోజ్యాని = ఆ బ్రాహ్మణపత్నులు తెచ్చిన ఆహారపదార్థములను, ఆదాయ= స్వీకరించి, పునః = మరలా, త్వత్ అంగసంగ స్పృహయా= నీ శరీర స్పర్శకోరి (సజతి మిలతి తస్య భావః కర్మ వా కలియునది కూడుట మనస్సు యొక్క ఆసక్తి.)(ఈప్సాయాం స్పృహయతి కోరుట), గృహమ్ = ఇండ్లు, ఉజ్ఝతీః = విడిచి

వచ్చినారని(ఉజ్ఝ ఉత్సర్గే ఉజ్ఝతి త్యజించుట, వదలి పెట్టుట), తాః = వారిని, అనుగృహ్య = అనుగ్రహించి, యజ్ఞాయ విలోక్య= యజ్ఞ సం పూర్తిని చూచుటకు, భర్తౄన్ అపి= వారిభర్తలుకూడా, తాసు అగర్హణాన్= వారియెడల కోపపడక ఆదరించునట్లు చేయుట కొరకు, ఇమాః= ఆ మునిపత్నులను, విసర్జయన్ చకర్థ = తిరిగి పంపుట చేసితివి.

**తాత్పర్యము:** ఆ బ్రాహ్మణపత్నులు తెచ్చిన ఆహారపదార్థములను స్వీకరించి ,నీ శరీర స్పర్శకోరి ఇండ్లు విడిచి వచ్చిన వారిని అనుగ్రహించి యజ్ఞ సం పూర్తిని చూచుటకు వారిభర్తలు వారియెడల కోపపడక ఆదరించునట్లు చేయుట కొరకు ఆ మునిపత్నులను తిరిగి వారి ఇండ్లకు పంపించావు.

**61-10 శ్లో.**
**నిరూప్య దోషం నిజమంగనాజనే విలోక్య భక్తిం చ పునర్విచారిభిః ।**
**ప్రబుద్ధతత్త్వైస్త్వమభిష్టుతో ద్విజైర్మరుత్పురాధీశ! నిరుంధి మే గదాన్ ॥**

**ప్రతిపదార్థము:** నిజమ్ దోషం నిరూప్య = తమతప్పు నిరూపింపబడుట తెలుసుకొని (దూష్యతే దూషించునది. దోషము), అంగనాజనే భక్తిం = తమ భార్యల భక్తిని, విలోక్య చ= గమనించి, పునః= మరలా, ప్రబుద్ధ తత్త్వైః విచారిభిః= తత్త్వ విమర్శనముతో వాస్తవము తెలుసుకొన్న(అతిశయేన బుద్ధః జాగృతో వా మేల్కొనినవాడు), ద్విజైః = ఆ యాగము నిర్వర్తించుచున్న బ్రాహ్మణుల చేత, త్వమ్ = నువ్వు, అభిష్టుతః = ప్రశంసింపబడ్డావు, మరుత్పురాధీశ = ఓ గురువాయూరు దేవా!, మే= నాయొక్క, గదాన్= రోగములను (గద్యతే పీడ్యతే అనేన-దీనితో పీడింపబడును. గద రోగము), నిరుంధి= తొలగింపుము.

**తాత్పర్యము:** తమతప్పు తాము తెలుసుకొని . తమ భార్యల భక్తిని గమనించి . తత్త్వ విమర్శనముతో వాస్తవము తెలుసుకొన్న ఆ యాగము నిర్వర్తించుచున్న బ్రాహ్మణులు నిన్ను ప్రశంసించారు. ఓ గురువాయూరు దేవా! నాయొక్క రోగములను తొలగింపుము.

***దశమ స్కంధము***

**61వ దశకము పూర్తి.**

# దశకమ్ 62 – ఇన్ద్రయజ్ఞనిరోధనం, గోవర్ధనయాగము

**62–1 శ్లో.**

**కదాచిద్గోపాలాన్ విహితమఖ సంభారవిభవాన్**
**నిరీక్ష్య త్వం శౌరే! మఘవమదముద్ధ్వంసితుమనాః ।**
**విజానన్నప్యేతాన్ వినయమృదు నందాదిపశుపాన్**
**అపృచ్ఛః కో వాయం జనక! భవతాముద్యమ ఇతి ॥**

**ప్రతిపదార్థము:** శౌరే = ఓ శౌరీ !, కదాచిత్ = ఒకసారి, గోపాలాన్= గోపాలకులు, విహిత = శాస్త్రోక్తంగా చేయుచున్న (విధినా బోధితః – చేయబడ్డది శాస్త్రోక్తంగా చెప్పబడ్డది), మఖ సంభార విభవాన్= ఇంద్రయాగ సాధన రూప వైభవములు (మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర – దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము), నిరీక్ష్య = చూసి, త్వం= నువ్వు, మఘవ మదమ్= ఇంద్రుని గర్వము(మహః పూజా అస్తి అస్య–పూజించదగినవాడు. ఇంద్రుడు), ఉద్ధ్వంసితు మనాః = అణచివేయవలెననెడి తలంపుతో, విజానన అపి= తెలిసి కూడా ఏమీ తెలియనివానివలె, ఏతాన్ నంద ఆదిపశుపాన్ = నందునితో ఆ గోపాలురతో, జనక= తండ్రీ!, భవతామ్ = మీయొక్క, అయం ఉద్యమః = ఈ ప్రయత్నము (ఉద్యమ్యతే ఆయాస్యతే శరీరాదికం యస్మిన్ ఉద్యోగము పరిశ్రమ కాయకష్టము), కః వా = దేని కొరకు, ఇతి= అని, వినయ మృదు = వినయంతో మృదు మధురముగా (మృద్యతే మర్దితుం శక్యతేనలుచుటకు వీలైనది కోమలమైనది), అపృచ్ఛః= అడిగితివి.

**తాత్పర్యము:** శౌరీ! ఒకసారి గోపాలకులు శాస్త్రోక్తంగా చేయుచున్న ఇంద్రయాగ సాధన రూప వైభవములు చూసి నువ్వు ఇంద్రుని గర్వము అణచివేయవలెననెడి తలంపుతో తెలిసి కూడా ఏమీ తెలియనివానివలె నందునితో, ఆ గోపాలురతో "తండ్రీ! మీయొక్క ఈ ప్రయత్నము దేని కొరకు?'' అని వినయంతో మృదు మధురముగా అడిగితివి.

**62-2 శ్లో.**

**బభాషే నందస్త్వాం సుత! నను విధేయో మఘవతో**
**మఖో వర్షే వర్షే సుఖయతి స వర్షేణ పృథివీమ్ ।**
**నృణాం వర్షాయత్తం నిఖిలముపజీవ్యం మహితలే**
**విశేషాదస్మాకం తృణసలిలజీవ్యా హి పశవః ॥**

**ప్రతిపదార్థము:** నందః= నందుడు, త్వాం బభాషే= నీతో ఇలా అన్నాడు, సుత = కుమారా!, వర్షే వర్షే = ఏటేటా (వృష్యతే సిచ్యతే ప్రియతే ప్రార్థ్యతే తడుపబడునది. వర్షము ప్రార్థింపబడునది. జంబూ ద్వీపంలో ఒక భాగము మేఘము సంవత్సరము), మఘవతః విధేయః = ఇంద్రుని గూర్చి విధేయముగా, మఖః = యాగము చేయాలి, సః = అందువలన అతడు తృప్తిపొంది, వర్షేణ = వర్షము కురిపించి, పృథివీమ్ = భూమిని( ప్రథతే విస్తారం యాతి విస్తరించి యున్నది. భూమి), సుఖయతి= సుఖింపజేయును, మహితలే= ఈ భూమిలో (మహ్యతే పూజ్యతే పూజింపబడునది. పృథివి), నృణాం = మానవులకు, నిఖిలమ్ ఉపజీవ్యం = బతుకంతా (నివృత్తం ఖిలం శేషః యస్మాత్ మిగులు లేనిది. సమస్తము.)(ఉపజీవనాయ యోగ్యః-జీవిక కల్పించువాడు ఆశ్రయము), వర్షాయత్తం నను= నిశ్చయముగా వర్షాధీనము కదా!, విశేషాత్= విశేషించి, అస్మాకం =పశువృత్తి కలిగిన మన, పశవః= పశువులు, తృణ సలిల జీవ్యా హి = గడ్డి నీరుచే జీవించును కదా! (కనుక వర్షము కొరకు తప్పనిసరిగా ఇంద్ర యాగము చేయ వలెనని భావం) (తృణ్యతే భక్ష్యతే గవాదిభిః-పశువులచే తినబడునది. గడ్డి).

**తాత్పర్యము:** నందుడు నీతో ఇలా అన్నాడు. "కుమారా! ఏటేటా ఇంద్రుని గూర్చి విధేయముగా యాగము చేయాలి. అందువలన అతడు తృప్తిపొంది వర్షము కురిపించి భూమిని సుఖింపజేయును. ఈ భూమిలో మానవులకు బతుకంతా నిశ్చయముగా వర్షాధీనము కదా ! విశేషించి పశువృత్తి కలిగిన మన పశువులు గడ్డి నీరుచే జీవించును కదా !"

**62-3 శ్లో.**

**ఇతి శ్రుత్వావాచం పితురయి భవానాహ సరసం**
**ధిగేతన్నో సత్యం మఘవజనితా వృష్టిరితి యత్ ।**
**అదృష్టం జీవానాం సృజతి ఖలు వృష్టిం సముచితాం**
**మహారణ్యే వృక్షాః కిమివ బలిమింద్రాయ దదతే ॥**

**ప్రతిపదార్థము:** అయి =ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, ఇతి = ఈ విధముగా (పై శ్లోకంలో చెప్పినట్లుగా), పితుః = నీ తండ్రి నందుని, వాచం = మాటలను, శ్రుత్వా= విని, భవాన్ =నువ్వు, ఆహ= ఇలా చెప్పావు, ధిక్ = అహో! (నిందాయామ్, లజ్జాయామ్ నింద లజ్జ), సరసం= సరియైన కారణం ఆలోచిస్తే (సహ రసేన జలేన ఆస్వాదేన చ – రసంతో కూడినది నీటితో, రుచితో కూడినది), మఘవ జనితా వృష్టిః= ఇంద్రుని వలన వర్షము కురియుచున్నది (మహః పూజా అస్తి అస్య– పూజించదగినవాడు. ఇంద్రుడు), ఇతి= అని, యత్ ఏతత్ = ఏ మాట అయితే ఉన్నదో అది, నో సత్యం=సత్యము కాదు, జీవానాం అదృష్టం= ప్రాణుల అదృష్టము, సముచితాం వృష్టిం = సముచితమైన వర్షము, సృజతి ఖలు= సృష్టించును కదా! (ఇంద్రుడు కాదు. ఆ ఇంద్రుడు కూడా అదృష్టము అనుసరించి ఆపదవికి వచ్చినాడని భావం), మహా అరణ్యే= మహారణ్యములోని (అపార్ణం దూరం గతం గ్రామాత్ గ్రామమునకు దూరముండునది. అరణ్యము), వృక్షాః= వృక్షములు, ఇంద్రాయ = ఇంద్రునికొరకు, బలిమ్ =యజ్ఞబలులను (బల్యతే దీయతే దేవతాదిభ్యః దేవతలకు ఇచ్చునది. బలి), దదతే కిమ్ ఇవ= ఇచ్చుచున్నావా? ( లేదని భావం).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! నీ తండ్రి నందుని మాటలను విని నువ్వు ఇలా చెప్పావు. సరియైన కారణం ఆలోచిస్తే ఇంద్రుని వలన వర్షము కురియుచున్నది అని ఏ మాట అయితే ఉన్నదో అది సత్యము కాదు. ప్రాణుల అదృష్టము సముచితమైన వర్షము సృష్టించును కదా! మహారణ్యములోని వృక్షములు ఇంద్రునికొరకు యజ్ఞబలులను ఇచ్చుచున్నావా? (ఇంద్రునికి యాగములు చేయకపోయినను అడవిలోని చెట్లపై వర్షము కురియుచున్నదని, మనము చేయనవసరం లేదని భావం).

**62–4 శ్లో.**

**ఇదం తావత్ సత్యం యదిహ పశవో నః కులధనం**
**తదాజీవ్యాయాసౌ బలిరచలభర్త్రే సముచితః ।**
**సురేభ్యోఽప్యుత్కృష్టా నను ధరణిదేవాః క్షితితలే**
**తతస్తేఽప్యారాధ్యా ఇతి జగదిథ త్వం నిజ జనాన్ ॥**

**ప్రతిపదార్థము:** యత్ ఇహ = ఇక్కడ, ఏ పశవః= పశువులయితే ఉన్నాయో అవి, నః= మనయొక్క, కులధనం = కులధనమని మీరు చెప్పిన (తత్), ఇదం తావత్ సత్యం= ఇది ఒక్కటి మాత్రము నిజము, తత్ ఆజీవ్యాయ = ఆ పశువులకు తృణ జల సమృద్ధి కావలెనన్న, అసౌ =ప్రారంభించిన ఈ, బలిః =యజ్ఞ బలులను, అచలభర్త్రే= ఈ కొండలరాజగు గోవర్ధన పర్వతమునకు ఇచ్చుట (న చలతికదలనిది. వృక్షము, పర్వతము), సముచితః= సముచితమయినది, క్షితితలే = భూమిలో, ధరణిదేవాః= బ్రాహ్మణులు, సురేభ్యః అపి = దేవతల కంటె, ఉత్కృష్టా నను = గొప్పవారు కదా!, తతః=అందువలన, తే –అపి= బ్రాహ్మణులు కూడా, ఆరాధ్యా= ఆరాధింపదగిన వారు, ఇతి = అని, త్వం= నువ్వు, నిజ జనాన్= నీవారితో, జగదిథ= చెప్పితివి.

**తాత్పర్యము:** ఇక్కడ ఏ పశువులయితే ఉన్నాయో అవి మనయొక్క కులధనమని మీరు చెప్పిన మాట నిజము. ఆ పశువులకు తృణ జల సమృద్ధి కావలెనన్న ప్రారంభించిన ఈ యజ్ఞ బలులను ఈ కొండలరాజగు గోవర్ధన పర్వతమునకు ఇచ్చుట సముచితమయినది (ఆ పర్వతము మనకు జలము, తృణము రెండింటిని ఇచ్చుచున్నదని భావం) భూమిలో బ్రాహ్మణులు దేవతల కంటె గొప్పవారు కదా ! అందువలన బ్రాహ్మణులు కూడా ఆరాధింపదగినవారు అని నువ్వు నీవారితో చెప్పితివి(గోవర్ధన పర్వతమును, బ్రాహ్మణులను పూజిద్దామని, ఇంద్రునికి పూజ వద్దని భావం)

**62–5 శ్లో.**

**భవద్వాచం శ్రుత్వా బహుమతియుతాతేఽపి పశుపాః**
**ద్విజేంద్రానర్చంతో బలిమదదురుచ్చైః క్షితిభృతే ।**

**వ్యధుః ప్రాదక్షిణ్యం సుభృశమనమన్నాదరయుతాః**
**త్వమాదః శైలాత్మా బలిమఖిలమాభీరపురతః ॥**

**ప్రతిపదార్థము:** భవత్= నీయొక్క, వాచం= మాటలను, శ్రుత్వా= విని, బహు మతి యుతాః= బుద్ధిమంతులయిన, తే పశుపాః అపి = ఆ గోపాలురు కూడా, ద్విజేంద్రాన్ =బ్రాహ్మణులను, అర్చంతః = పూజించి, ఉచ్చైః క్షితిభృతే=ఎత్తయిన గోవర్ధన పర్వతమునకు, బలిమ్ అదదుః = యజ్ఞ బలులను ఇచ్చిరి, ప్రాదక్షిణ్యం = గిరి ప్రదక్షిణములు(ప్రదక్షిణస్య భావః కర్మ వా ప్రదక్షిణ చేయుట), వ్యధుః = చేసి, సుభృశమ్ = మరల మరలా(సుష్ఠు భృశమ్ అతిశయము), అనమన్ = నమస్కరించిన, ఆదరయుతాః= వారియెడల అదరణతో, త్వమ్ = నువ్వు, శైల ఆత్మా= ఆ గోవర్ధన పర్వతరూపము ధరించి(శిలాః సంతి శిలలు కలది. పర్వతము), ఆభీర= గోపాలకుల(ఆసమంతాత్ భయం రాతి గోపాలకః అవిపాలకః భయం కల్గించువాడు. గొల్లవాడు), పురతః= ఎదుట, అఖిలమ్ బలిమ్= నైవేద్యముగా పెట్టిన సమస్త యజ్ఞ బలులను, ఆదః= ఆరగించితివి.

**తాత్పర్యము:** నీయొక్క మాటలను విని బుద్ధిమంతులయిన ఆ గోపాలురు కూడా బ్రాహ్మణులను పూజించి ఎత్తయిన గోవర్ధన పర్వతమునకు యజ్ఞ బలులను ఇచ్చిరి. గిరి ప్రదక్షిణములు చేసి మరల మరలా నమస్కరించిన వారియెడల అదరణతో నువ్వు ఆ గోవర్ధన పర్వతరూపము ధరించి గోపాలకుల ఎదుట నైవేద్యముగా పెట్టిన సమస్త యజ్ఞ బలులను ఆరగించితివి.

**62-6 శ్లో.**
**అవోచశ్చైవం తాన్ కిమిహ వితథం మే నిగదితం**
**గిరీంద్రో నన్వేష స్వబలిముపభుంక్తే స్వవపుషా ।**
**అయం గోత్రో గోత్రద్విషి చ కుపితే రక్షితుమలం**
**సమస్తానిత్యుక్తా జహృషురఖిలా గోకులజుషః ॥**

**ప్రతిపదార్థము:** ఏవం = ఇట్లు, తాన్= నీవు ఆ గోకులవాసులతో, అవోచ చ= పలికితివి, ఇహ మే నిగదితం = నా పలుకులలో(నితరాం గదితం ఉక్తమ్ మంచి

ఉపన్యాసము), కిమ్ వితథం = అసత్యము ఏమి – యున్నది!?(విరుద్ధం తన్యతే కథ్యతే తత్ విరుద్ధంగా చెప్పుట. మిథ్యా అబద్ధము), నను= నిశ్చయముగా, ఏష గిరీంద్రః = ఈ పర్వతము, స్వబలిమ్ = మీరు తనకు సమర్పించిన బలులను స్వయముగా, ఉపభుంక్తే = తిన్నది, స్వ వపుషా అయం గోత్రః = ఈ కనబడుచున్న రూపముతో గోత్రము (గోవర్ధనమను కొండ)(గాం పృథివీం త్రాయతే పృథివిని రక్షించునది. పర్వతము), గోత్రద్విషి చ కుపితే = ఇంద్రుడు కోపించినను, సమస్తాన్= మనందరినీ, రక్షితుమ్ = రక్షించుటకు, అలం= సమర్థమైనది, ఇతి= అని, ఉక్తా = నువ్వు చెప్పగా, అఖిలా గోకుల జుషః= సమస్త గోకుల వాసులు, జహృషుః = ఆనందపడిరి.

**తాత్పర్యము:** ఇట్లు నీవు ఆ గోకులవాసులతో పలికితివి. "నా పలుకులలో అసత్యము ఏమి – యున్నది!? ఈ పర్వతము మీరు తనకు సమర్పించిన బలులను స్వయముగా తిన్నది. ఈ గోత్రము (గోవర్ధనమను కొండ) ఇంద్రుడు కోపించినను మనందరినీ రక్షించుటకు సమర్థమైనది" అని నువ్వు చెప్పగా సమస్త గోకుల వాసులు ఆనందపడిరి.

**62–7 శ్లో.**

**పరిప్రీతా యాతాః ఖలు భవదుపేతా వ్రజజుషో**
**వ్రజం యావత్ తావన్నిజమఖవిభంగం నిశమయన్ ।**
**భవంతం జానన్నప్యధికరజసాక్రాంతహృదయో**
**న సేహే దేవేంద్రస్త్వదుపరచితాత్మోన్నతిరపి ॥**

**ప్రతిపదార్థము:** యావత్ వ్రజజుషః = సమస్త గోకుల వాసులు, పరిప్రీతా = సంతోషించి, భవత్ ఉపేతా= నీ తో కలిసి (ఉప సమీపం ఇతః ఆగతః ఉపస్థితః ప్రాప్తః–దగ్గరకు వచ్చినవాడు పొందబడినది), వ్రజం= వ్రేపల్లెకు(వ్రజంతి జనాః అస్మిన్, జనపద విశేషః – వ్రజ జనపదము. మథురా–వృందావన ప్రదేశము), యాతాః ఖలు = వెళ్ళిరి కదా!, తావత్= అంతట, నిజ మఖ విభంగం = తనను గూర్చినయజ్ఞము భంగమైనదని, నిశమయన్= విని, భవంతం= నీగురించి, జానన్ అపి= తెలిసినప్పటికి, అధిక రజసా= అధికమైన రజోగుణము

(రంజయతి రజోగుణము), ఆక్రాంత హృదయః= ఆక్రమించిన హృదయముతో (ఆక్రాంతః శత్రుణా అభిగతః – శత్రువుచేత దాడి చేయబడినవాడు), త్వత్ = నీచేత, ఉపరచిత=కృతమైన, ఆత్మ ఉన్నతిః అపి= ఇంద్ర పదవిని తలచుకొని కూడా(నీ వలన తనకు ఇంద్ర పదవి వచ్చినదని తెలిసినప్పటికి), దేవేంద్రః న సేహే = నువ్వు చేసిన పనిని దేవేంద్రుడు సహింపలేకపోయెను.

**తాత్పర్యము:** సమస్త గోకుల వాసులు సంతోషించి నీ తో కలిసి వ్రేపల్లెకు వెళ్ళిరి కదా! అంతట తనను గూర్చినయజ్ఞము భంగమైనదని విని నీగురించి తెలిసినప్పటికి అధికమైన రజోగుణము ఆక్రమించిన హృదయముతో, నీ వలన తనకు ఇంద్ర పదవి వచ్చినదని తెలిసినప్పటికి నువ్వు చేసిన పనిని దేవేంద్రుడు సహింపలేక పోయెను.

**విశేషము**

**రజస్ :** గుణత్రయంలో మొదటిది. సృష్టికి మూలమిది. ప్రకృతి గుణాలలో చేరుతుంది. రజస్సు వల్ల సృష్టి, సత్త్వం వల్ల స్థితి, తమస్సు వల్ల లయం. సంసార మంతా దీనితోనే నిండిపోయింది. ధూళి, మాలిన్యం అని కూడా ఒక అర్థం.

**62–8 శ్లో.**
**మనుష్యత్వం యాతో మధుభిదపి దేవేష్వవినయం**
**విధత్తే చేన్నష్టస్త్రిదశసదసాం కోఽపి మహిమా ।**
**తతశ్చ ధ్వంసిష్యే పశుపహతకస్య శ్రియమితి**
**ప్రవృత్తస్త్వాం జేతుం స కిల మఘవా దుర్మదనిధిః ॥**

**ప్రతిపదార్థము:** మధుభిత్ అపి = మధువైరి అయిన విష్ణువే అగుగాక ! (మధుం తన్నామ్నాం దైత్యం భినత్తి నాశయతి మధువను పేరు గల రాక్షసుని చంపినవాడు. విష్ణువు), మనుష్యత్వం =ఇప్పుడు మానవ జన్మను (మనోః అపత్యమ్ మనువు సంతానము. మనుష్య జాతి), యాతః = పొందినాడు, చేత్=ఒకవేళ నిజముగా విష్ణువే యైనచో (చిత్ విచ్ ఒకవేళ సందేహించుట ప్రశ్నించుట. అయినట్లైతే ఇట్టులైనచో), దేవేషు= దేవతలయెడ, అవినయం= అవినయము (ద్రోహము)

(వినయస్య నియమస్య అభావః-నియమము పాటించపోవుట అపరాధము), విధత్తే= చూపునా (చూపడని భావం), త్రిదశసదసాం= దేవ సభ యొక్క (తృతీయా యౌవనాఖ్యా దశా యస్య-మూడవ దశలో, యౌవనావస్థలో వున్నవాడు), కః అపి= ఇది అని నిర్దేశించలేని, మహిమా= ప్రభావము(మహతః భావః - గొప్ప దనము. మహత్త్వము), నష్టః= నష్ట పరచబడినది, తతః చ = అందువలన, పశుప హతకస్య= గోపాలాధముడైన కృష్ణునియొక్క, శ్రియమ్ = సంపదనంతా (శ్రయతి హరిమితి శ్రీః- విష్ణువును ఆశ్రయించునది. శ్రీ), ధ్వంసిష్యే = నాశనము చేసెదను, ఇతి= అని, త్వాం =నిన్ను, జేతుం= జయించుటకు, స దుర్మద నిధిః= ఆ మదమెక్కిన దురహంకారి అగు, మఘవా= ఇంద్రుడు (మహః పూజా అస్తి అస్య-పూజించదగినవాడు. ఇంద్రుడు), ప్రవృత్తః కిల = నిశ్చయించుకొన్నాడు కదా! (ప్రవృత్తః ఆరబ్ధః నిర్ధారితః - ప్రారంభింపబడినది నిర్ధారణ చేయబడినది నిశ్చయింపబడినది).

**తాత్పర్యము:** మధువైరి అయిన విష్ణువే అగుగాక! మానవ జన్మను పొందినాడు. ఒకవేళ నిజముగా విష్ణువే యైనచో దేవతలయెడ అవినయము చూపునా? (చూపడని భావం) దేవతల యొక్క మహిమ నష్టపరచబడినది. అందువలన గోపాలాధముడైన కృష్ణునియొక్క సంపదనంతా నాశనము చేసెదను అని నిన్ను జయించుటకు ఆ మదమెక్కిన దురహంకారి అగు ఇంద్రుడు నిశ్చయించుకొన్నాడు.

**62-9 శ్లో.**

**త్వదావాసం హంతుం ప్రళయ జలదానంబరభువి**
**ప్రహిణ్వన్ బిభ్రాణః కులిశమయమభ్రేభగమనః ।**
**ప్రతస్థేఽన్యైరంతర్దహనమరుదాద్యైర్విహసితో**
**భవన్మాయా నైవ త్రిభువనపతే! మోహయతి కమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ = నువ్వున్న, ఆవాసం = నివాసమును(ఆవసంతి నివసంతి అత్ర-ఆవాసము. గృహము, ఇల్లు), హంతుం= కూల్చుటకు, అంబరభువి= ఆకాశప్రదేశములో(అంబః శబ్దః తం రాతి ధత్తే శబ్దము కల్గియున్నది. శబ్దము గుణముగా కల్గియున్నది. ఆకాశము), ప్రళయ జలదాన్= ప్రళయకాల

మేఘములను(ప్రలీయతే అస్మిన్ జగత్సర్వమ్ ప్రపంచమంతా దీనిలో లీనమగును. ప్రళయము వినాశము మృత్యువు)(జలం దదాతి జలము నిచ్చునది. మేఘము), ప్రహిణ్వన్= ప్రేరేపించెను, కులిశమ్ బిభ్రాణః= వజ్రాయుధమును చేతబట్టి (కులిసం పర్వతం శ్యతి ఖండయతి పర్వతమును చెక్కునది. వజ్రము), అయమ్ అభ్రేభ గమనః= ఈ ఐరావతమును అధిరోహించిన ఇంద్రుడు, ప్రతస్థే = బయలుదేరెను, అంతః = యముడు (అంతం నాశం కరోతీత్యంతకః నాశనమును చేయువాడు), దహన= అగ్ని (దహతి అసౌ కాల్చునది. అగ్ని), మరుత= వాయుదేవుడు (మ్రియతే ప్రాణినః అస్య అభావాత్ ఇది లేకపోయినచో ప్రాణులు మరణించును. వాయువు, గాలి దేవత), ఆద్యైః = మొదలగు, అన్యైః = ఇతర దేవతలు, విహసితః = ఇంద్రుని మూర్ఖత్వమునకు నవ్వుకొన్నారు. (విశిష్టం హసితమ్ విహసితము, మధ్యమ హసితము), త్రిభువనపతే = త్రిభువనాధీశా!, భవత్ మాయా= నీమాయ, కమ్ న ఏవ మోహయతి= ఎవరిని మోహింపచేయదు? (ముహ్యతి తస్య భావః – మోహము. మూర్ఛ, అజ్ఞానము, భ్రాంతి).

**తాత్పర్యము:** నువ్వున్న నివాసమును కూల్చుటకు ఆకాశప్రదేశములో ప్రళయకాల మేఘములను ప్రేరేపించి, వజ్రాయుధమును చేతబట్టి ఈ ఐరావతమును అధిరోహించిన ఇంద్రుడు బయలుదేరెను. యముడు, అగ్ని, వాయుదేవుడు, మొదలగు ఇతర దేవతలు ఇంద్రుని మూర్ఖత్వమునకు నవ్వుకొన్నారు. త్రిభువనాధీశా! నీమాయ ఎవరిని మోహింపచేయదు? (మాయ అందరిని మోహింపచేయునని భావం)

**62–10 శ్లో.**

**సురేంద్రః క్రుద్ధశ్చేద్ ద్విజ కరుణయా శైలకృపయా–**
**ప్యనాతంకోఽస్మాకం నియత ఇతి విశ్వాస్య పశుపాన్ ।**
**అహో కిం నాయాతో గిరిభిదితి సంచింత్య నివసన్**
**మరుత్ గేహాధీశ! ప్రణుద మురవైరిన్! మమ గదాన్ ॥**

**ప్రతిపదార్థము:** మురవైరిన్ = ఓ మురారి!, సురేంద్రః = దేవేంద్రుడు, క్రుద్ధః చేత్= మనపై ఆగ్రహించిననూ, ద్విజ = బ్రాహ్మణుల, కరుణయా= దయచేతను, శైల

కృపయా అపి = ఆ గోవర్ధన పర్వతము దయచేతను, అస్మాకం = మనకు, అనాతంకః = సుఖము (ఆతంకతి పీడయతి పీడించునది, రోగము.దానికి వ్యతిరేకము ఆనాతంకము), నియతః = నిశ్చయము(నియతః నియమనమ్, నిత్యకర్మ–నిశ్చితమైనది. నిత్యకర్మ), ఇతి= అని, పశుపాన్= ఆ గోపాలబాలురకు, విశ్వాస్య = నమ్మకము కల్గించి, అహో= ఆహా!, గిరిభిత్ = ఇంద్రుడు, కిం న ఆయాతః = ఇంకనూ రాలేదేమి?, ఇతి సంచింత్య నివసన్= అని అనుకొనుచుంటివి, మరుత్ గేహాధీశ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మమ= నాయొక్క, గదాన్= రోగములను, ప్రణుద= పోగొట్టుము.

**తాత్పర్యము:** ఓ మురారి! “దేవేంద్రుడు మనపై ఆగ్రహించిననూ బ్రాహ్మణుల దయచేతను, ఆ గోవర్ధన పర్వతము దయచేతను మనకు సుఖము నిశ్చయము” అని ఆ గోపాలబాలురకు నమ్మకము కల్గించి “ఇంద్రుడు ఇంకనూ రాలేదేమి? “ అని అనుకొనుచుంటివి. ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నాయొక్క రోగములను పోగొట్టుము.

***దశమ స్కంధము***

**62వ దశకము పూర్తి.**

# దశకమ్ 63 – గోవర్ధనోద్ధారణము

**63–1 శ్లో.**

**దదృశిరే కిల తత్క్షణమక్షతస్తనితజృంభితకంపితదిక్తటాః ।**
**సుషమయా భవదంగతులాం గతా వ్రజపదోపరి వారిధరాస్త్వయా ॥**

**ప్రతిపదార్థము:** తత్క్షణమ్ = ఆ క్షణములోనే, అక్షత= అవిచ్ఛిన్నంగా (న క్షతః– క్షతము గానిది. గాయము గానిది క్షీణము గానిది), స్తనిత= పిడుగుల చప్పుడును (స్తనితః ధ్వనితః గర్జితమ్ మేఘ శబ్దము శబ్దం చేయబడినది శబ్దము), జృంభిత= పెంచుచూ, కంపిత దిక్తటాః = దిక్కులు కంపింపచేయుచు, భవత్ అంగ తులాం = నీ శరీరకాంతిని పోలిన, సుషమయా =శోభను (సుందర సమః–బాగా అందం కలది సమాప్తం కలది), గతాః =పొంది దట్టముగా పరచుకొనిన, వారిధరాః= నీటిమేఘములు, వ్రజపద ఉపరి= ఆ వ్రజపదమునకు( వ్రేపల్లెకు) పైన, త్వయా= నీచేత, దదృశిరే కిల= చూడబడినది కదా.

**తాత్పర్యము:** ఆ క్షణములోనే అవిచ్ఛిన్నంగా పిడుగుల చప్పుడు చేయుచు, దిక్కులు కంపింపచేయుచు నీ శరీరకాంతిని పోలిన శోభను పొంది దట్టముగా పరచుకొనిన నీటిమేఘములు వ్రేపల్లెకు పైన క్రమ్ముకొని నీచేత చూడబడినది.

**63–2 శ్లో.**

**విపులకరకమిశ్రైస్తోయధారానిపాతైః**
**దిశి దిశి పశుపానాం మండలే దండ్యమానే ।**
**కుపితహరికృతాన్నః పాహి పాహీతి తేషాం**
**వచనమజిత! శృణ్వన్ మా బిభీతేత్యభాణీః ॥**

**ప్రతిపదార్థము:** అజిత= ఎదురులేని వాడా! (న జితః–జయింపబడనివాడు), దిశి దిశి= అన్ని వైపులా, విపుల = బాగా పెద్దవైన (విశేషేణ పోలతి విస్తృతో భవతి విస్తృతమైనది, విస్తీర్ణమైనది), కరక= వడగండ్లతో (కిరతి విక్షిపతి జలం అస్మాత్ దీనినుండి జలము వచ్చును. వడగండ్లు), మిశ్రైః = కలిసిన, తోయధారా=

ఏనుగుతొండమంత ధారలతో, నిపాతైః= జడివాన పడుతూ, పశుపానాం మండలే = గోపాలక జనులను, దండ్యమానే= బాధించసాగగా, కుపిత= కుపితుడైన, హరికృతాత్=ఇంద్రుని బారి నుండి(హరతి గృహ్ణాతి అసౌ తీసుకొనువాడు. ఇంద్రుడు), నః = మమ్ములను, పాహి పాహి= రక్షింపుము! రక్షింపుము!, ఇతి= అను, తేషాం వచనమ్= వారి ఆక్రందనలు, శృణ్వన్ = విని, మా బిభీత = భయపడవలదు, ఇతి అభాణీః=అని పలికితివి.

**తాత్పర్యము:** జయింపబడనివాడా! ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! అన్ని వైపులా బాగా పెద్దవైన వడగండ్లతో కలిసిన ఏనుగుతొండమంత ధారలతో జడివాన పడుతూ గోపాలక జనులను బాధించసాగగా "కుపితుడైన ఇంద్రుని బారి నుండి మమ్ములను రక్షింపుము! రక్షింపుము!" అను వారి ఆక్రందనలు విని "భయపడవలదు "అని నువ్వు పలికితివి.

**63-3 శ్లో.**

**కుల ఇహ ఖలు గోత్రో దైవతం గోత్రశత్రోః**
**విహతిమిహ స రుంధ్యాత్ కో ను వః సంశయోఽస్మిన్ ।**
**ఇతి సహసితవాదీ దేవ! గోవర్ధనాద్రిం**
**త్వరితముదముమూలో మూలతో బాలదోర్భ్యామ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, ఇహ కుల= ఈగోకులము, గోత్రః= కొండ (గోరక్షకః పర్వతః), దైవతం ఖలు = దేవతగా కలది కదా! (దేవసంబంధిని), గోత్రశత్రోః = కొండల రెక్కలు ఖండించిన శత్రువైన ఇంద్రుడు చేయు, విహతిమ్ = నాశనమును (కురిపించు వానను), ఇహ= ఇప్పుడు, సః=ఆ గోవర్ధనపర్వతము( గోత్రాణాత్ గోత్రో గోవర్ధన), రుంధ్యాత్= అడ్డగించి మనలను రక్షించును, అస్మిన్= నేను చెప్పిన మాటలో, కః ను వః సంశయః= మీకు అనుమానము ఎందుకు?, ఇతి = అని, సహసిత వాదీ= నవ్వుతూ చెప్పుచూ (1. హాస్యరసస్థాయిభావః -2. మందహాసః -3. మన్మథధనుః), బాల దోర్భ్యామ్= నీచిట్టి చేతులతో, త్వరితమ్= వేగముగా, గోవర్ధన అద్రిం= గోవర్ధనపర్వతమును, మూలతః= సమూలముగా, ఉదముమూలః= పెళ్ళగించావు(పైకి ఎత్తావు).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఈగోకులము కొండ దేవతగా కలది కదా! అందువలన కొండల రెక్కలు ఖండించిన శత్రువైన ఆ ఇంద్రుడు చేయు నాశనమునుండి (కురిపించు వానను) ఇప్పుడు ఆ గోవర్ధనపర్వతము రక్షించును. నేను చెప్పిన మాటలో మీకు అనుమానము ఎందుకు? అని నవ్వుతూ చెప్పుచూ నీచిట్టి చేతులతో వేగముగా గోవర్ధనపర్వతమును సమూలముగా పెళ్ళగించావు (పైకి ఎత్తావు)

**63–4 శ్లో.**

**తదను గిరివరస్య ప్రోద్ధృతస్యాస్య తావత్**
**సికతిలమృదుదేశే దూరతో వారితాపే ।**
**పరికరపరిమిశ్రాన్ ధేనుగోపానధస్తాత్**
**ఉపనిదధదధత్థా హస్తపద్మేన శైలమ్ ॥**

**ప్రతిపదార్థము:** తదను= ఆ విధముగా, గిరివరస్య= ఆ గోవర్ధనగిరిని(గిరిః= సముద్గీర్ణో భవతి భూమి నుండి పైకి లేచునది. పర్వతము), ప్రోద్ధృతస్య = మూలములతో అట్లు పెళ్ళగించి, అస్య తావత్ = ఆ పర్వతపు, మృదు సికతిల= మెత్తని ఇసుకతో (సికతాః సంతి అత్ర–ఇసుక కలది), దేశే= క్రింది ప్రదేశములో, ఆపే= వర్షపునీరు ప్రవహించకుండునట్లు(ఆప్యతే సుఖం ఆభిః–వీటితో సుఖము ననుభవింతురు. జలములు), దూరతః = దూరముగా, వారిత= నిలువరించితివి, పరికర= చల్దిచిక్కములు కొమ్ము బూరలు చేగజ్జలు మొదలగు సాధనములతో (పరికీర్యతే అనేన–దీనితో పనులు చేయుదురు. పనిముట్టు), పరిమిశ్రాన్= కలిసి ఉన్న, ధేనుగోపాన్= గోవులను గోపాలురను, అధస్తాత్= కొండ క్రిందికి, ఉపనిదధత్= రమ్మని పిల్చి, హస్త పద్మేన= నీ ఎడమ చేయి అను పద్మముపై, శైలమ్= ఆ గోవర్ధనగిరిని (శిలాః సంతి శిలలు కలది. పర్వతము), అధత్థాః= ఎత్తి పట్టినావు.

**తాత్పర్యము:** ఆ విధముగా ఆ గోవర్ధనగిరిని మూలములతో పెళ్ళగించి, ఆ పర్వతపు మెత్తని ఇసుకతో ఉన్న క్రింది ప్రదేశములో వర్షపునీరు ప్రవహించకుండునట్లు దూరముగా నిలువరించితివి. చల్దిచిక్కములు, కొమ్ము బూరలు, చేగజ్జలు

మొదలగు సాధనములతో కలిసి ఉన్న గోవులను గోపాలురను కొండ క్రిందికి రమ్మని పిల్చి నీ ఎడమ చేయి అను పద్మముపై ఆ గోవర్ధనగిరిని ఎత్తి పట్టినావు.

**63–5 శ్లో.**

**భవతి విధృతశైలే బాలికాభిర్వయస్యైః**
**అపి విహితవిలాసం కేళిలాపాదిలోలే ।**
**సవిధమిలితధేనూరేకహస్తేన కండూ**
**యతి సతి పశుపాలాస్తోషమైషంత సర్వే ॥**

**ప్రతిపదార్థము:** భవతి = నువ్వు, విధృత శైలే= ఒక హస్తముతో పర్వతమును ఎత్తిపట్టుకొని (విశేషేణ ధృతమ్ ధరించబడినది పట్టుకొనబడినది), బాలికాభిః = గోపబాలికలతోను, వయస్యైః అపి=, నీ సహచర మిత్రులతోను (నూతనమిత్రమ్ , వయసా తుల్యః సఖా వయస్సుచే సమానమైనవాడు. స్నేహితుడు), విహిత విలాసం= సరస–సంభాషణలు చేయుచుంటివి.( విశేషేణ లసతి తస్య భావః కర్మ వా విలాసము), కేళి లాప ఆది= క్రీడా సల్లాపములందు(కేలంతి విలసంతి తస్య భావః – పరిహాసము విలాసము) (లపతి భాషతే తస్య కర్మ – మాట్లాడుట), లోలే = కుతూహలము చూపుచూ, సవిధ మిలిత = దగ్గరకు చేరుచున్న (సమానా విధా అస్య – దగ్గరగా వున్నది), ధేనూః= ఆవులమేనులను (ధయతి సుతాన్ దూడలను నాకునది. ఆవు), ఏకహస్తేన= ఒక చేతితో, కండూయతి సతి = నిమురుచుంటివి (గాత్రఘర్షణే కండూయతే గోకుట), సర్వే పశుపాలాః = సమస్త గోపాలక బృందము, తోషమ్= సంతోషమును (తుష్యతి తస్య భావః–సంతోషము తృప్తి), ఐషంత = పొందారు.

**తాత్పర్యము:** నువ్వు ఒక హస్తముతో పర్వతమును ఎత్తిపట్టుకొని గోపబాలికలతోను, నీ సహచర మిత్రులతోను సరస–సంభాషణలు చేయుచుంటివి. క్రీడా సల్లాపములందు కుతూహలము చూపుచూ దగ్గరకు చేరుచున్న ఆవులమేనులను ఒక చేతితో నిమురుచుంటివి. సమస్త గోపాలక బృందము సంతోషమును పొందారు.

**63–6 శ్లో.**

**అతిమహాన్ గిరిరేష తు వామకే కరసరోరుహి తం ధరతే చిరమ్ ।**
**కిమిదమద్భుతమద్రిబలం న్వితి త్వదవలోకిభిరాకథి గోపకైః ॥**

**ప్రతిపదార్థము:** ఏషః గిరిః = ఈ కొండ(గిరతి ధారయతి పృథ్వీమ్ భూమిని ధరించునది), అతిమహాన్ = పెద్దది. (మహ్యతే పూజ్యతే పూజింపబడునది. గొప్పవాడు), తు = కాని, వామకే కర సరోరుహి = ఈ చిన్నపిల్లవాడు అవలీలగ తన ఎడమ చేతితో(వాతి గచ్ఛతి అసౌ ఎడమ ప్రక్క), తం చిరమ్ ధరతే= ఎంత సేపు పట్టుకొన్నాడో!, కిమ్ ఇదమ్ = ఈ పని ఎంత, అద్భుతమ్ =అద్భుతము!? (అభూతం ఇవ – ఇదివరకు జరగనిది ), అద్రిబలం ను = ఇది గోవర్ధన గిరి యొక్క ప్రభావమా?, ఇతి = అని, త్వత్ అవలోకిభిః= నిన్ను చూస్తూ, గోపకైః= గోపబాలురు, ఆకథి= వారిలో వారే చెప్పుకొనసాగిరి.

**తాత్పర్యము:** ఈ కొండ పెద్దది. కాని ఈ చిన్నపిల్లవాడు అవలీలగ తన ఎడమ చేతితో ఎంత సేపు పట్టుకొన్నాడో ! ఈ పని ఎంత అద్భుతము . ఇది గోవర్ధన గిరి యొక్క ప్రభావమా? (కొండల రెక్కలు ఖండించిన ఇంద్రునిపై పగచేత తనకుదానె గోవర్ధన పర్వతము తేలికయైపోయినదా? అని భావం) అని నిన్ను చూస్తూ గోపబాలురు వారిలో వారే చెప్పుకొనసాగిరి.

**63–7 శ్లో.**

**అహాహ ధార్ష్ట్యమముష్య వటోర్గిరిం వ్యథితబాహురసావవరోపయేత్ ।**
**ఇతి హరిస్త్వయి బద్ధవిగర్హణో దివససప్తకముగ్రమవర్షయత్ ॥**

**ప్రతిపదార్థము:** అహాహ =ఆహా!, అముష్య వటోః = ఈ కుర్రవాని(వటతి అల్పం వస్త్రమ్ చిన్న వస్త్రమును ధరించువాడు. చిన్న పిల్లవాడు, బ్రహ్మచారి), ధార్ష్ట్యమ్ = మొండితనము (ధృష్టస్య భావః), వ్యథిత బాహుః= చేయి నొప్పి పుట్టినచో (పీడితః విక్షుణ్ణః – పీడించబడినవాడు ఆందోళన చెందినవాడు), అసౌ గిరిం= ఈ కొండను, అవరోపయేత్ = కింద పడేస్తాడు, ఇతి = అని, హరిః = ఇంద్రుడు(హరతి గృహ్ణాతి అసౌ తీసుకొనువాడు. ఇంద్రుడు), త్వయి= నీయందు, బద్ధవిగర్హణః = నింద చేసి

(అత్యంతం గర్హతే తస్య భావః – నిందించుట, నింద), దివస సప్తకమ్ = ధారాపాతంగా ఏడురోజులు, ఉగ్రమ్= ఉగ్రముగా పిడుగులతో మెఱుపులతో (ఉచ్యతి సమవైతి ఉగ్రత్వము), అవర్షయత్= కుంభవృష్టిని కురిపించెను.

**తాత్పర్యము:** ఆహా! ఈ కుఱ్రవాని మొండితనము!? చేయి నొప్పి పుట్టినచో ఈ కొండను కింద పడేస్తాడు అని ఇంద్రుడు నీయందు నింద చేసి ధారాపాతంగా ఏడురోజులు ఉగ్రముగా పిడుగులతో మెఱుపులతో కుంభవృష్టిని కురిపించెను.

**63–8 శ్లో.**

**అచలతి త్వయి దేవ! పదాత్పదం గలితసర్వజలే చ ఘనోత్కరే ।**
**అపహృతే మరుతా మరుతాంపతిస్త్వదభిశంకితధీః సముపాద్రవత్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, త్వయి= నువ్వు, పదాత్ పదం = గోవర్ధన పర్వతమును ధరించి — స్వస్థానము నుండి ఒక అడుగయినను కదపకుండా (పద్యతే స్థానము), అచలతి = అట్లే నిలచి ఉన్నావు, గలిత సర్వ జలే చ= ఎడతెగక కురియుటతో – తమలోని నీరు ఇంకిపోయి నిస్సారము కాగా(గలితః నిసృతః పతితః – క్రింద పడినది స్రవించినది), ఘన ఉత్కరే=మేఘ సమూహములు (ఘనతి దీప్యతే ప్రకాశించునది. మేఘము), మరుతా అపహృతే= గాలులు వీచుటచే మాయమయ్యాయి, మరుతాంపతిః= దేవతలకు అధిపతియగు ఇంద్రుడు, త్వత్ అభిశంకిత ధీః =నిన్ను శంకించిన బుద్ధితో ( అనగా నువ్వు ఏమి చేయుదువో అని భయపడి) (శంకా జాతా అస్య–సందేహం కల్గినవాడు), సముపాద్రవత్= అచ్చటనుండి వెడలిపోయెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! నువ్వు గోవర్ధన పర్వతమును ధరించి — స్వస్థానము నుండి ఒక అడుగయినను కదపకుండా అట్లే నిలచి ఉన్నావు. ఎడతెగక కురియుటతో – తమలోని నీరు ఇంకిపోయి నిస్సారము కాగా మేఘ సమూహములు గాలులు వీచుటచే మాయమయ్యాయి. దేవతలకు అధిపతియగు ఇంద్రుడు నిన్ను శంకించిన బుద్ధితో (అనగా నువ్వు ఏమి చేయుదువో అని భయపడి) అచ్చటనుండి వెడలిపోయెను.

**విశేషము:** నిన్ను( అచిన్నికృష్ణుని ) విష్ణువుగా సందేహించి తనను ఏమి చేయుదువో అను భయముతో ఇంద్రుడు పారిపోయాడని మరొక సమన్వయం.

**63-9 శ్లో.**
**శమముపేయుషి వర్షభరే తదా పశుపధేనుకులే చ వినిర్గతే ।**
**భువి విభో! సముపాహితభూధరః ప్రముదితైః పశుపైః పరిరేభిషే ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, వర్షభరే= వర్ష భారము నుండి, శమమ్ = శాంతి, ఉపేయుషి = ప్రాప్తించగా(అనగా వర్షము ఆగిపోగా), తదా = అప్పుడు, పశుప ధేను కులే చ = గోపాలురు గోవులు, భువి= ఆ పర్వతము క్రిందనుండి, వినిర్గతే= బయటకు రాగా, భూధరః సముపాహిత = ఆ గోవర్ధన పర్వతమును నువ్వు యథాస్థానములో ఉంచగా (ఉపాహితః నిహితః సంబద్ధో వా ఉంచబడినది పెట్టబడినది సంబద్ధమైనది), ప్రముదితైః= చాల సంతోషించిన, పశుపైః = గోపాలకులతో, పరిరేభిషే= నువ్వు కౌగిలించుకొనబడితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! వర్షము ఆగిపోగా , అప్పుడు గోపాలురు గోవులు ఆ పర్వతము క్రిందనుండి బయటకు రాగా, ఆ గోవర్ధన పర్వతమును నువ్వు యథాస్థానములో ఉంచగా చాల సంతోషించిన గోపాలకులతో నువ్వు కౌగిలించుకొనబడితివి.

**63-10 శ్లో.**
**ధరణిమేవ పురా ధృతవానసి క్షితిధరోద్ధరణే తవ కః శ్రమః ।**
**ఇతి నుతస్త్రిదశైః కమలాపతే! గురుపురాలయ! పాలయ మాం గదాత్ ॥**

**ప్రతిపదార్థము:** కమలాపతే =ఓ కమలాపతీ!, గురుపురాలయ = గురువాయూరు కృష్ణ దేవా!, పురా= చాలాకాలము క్రితమే (పురతి అగ్రే గచ్ఛతి (కాలవాచీ) పూర్వకాలము మునుపు), ధరణిమ్ ఏవ= వరాహావతారమెత్తి సర్వభూమిని, ధృతవాన్ అసి= ఎత్తిన నీకు (ధరతి జీవాదీన్ జీవాదులను ధరించునది. పృథివి), క్షితిధర = కొండ, ఉద్ధరణే = ఎత్తుట(ఉత్ ధ్రియతే అసౌ తస్య భావో వా పైకి లేపుట విడిచిపెట్టుట), తవ = నీకు, కః శ్రమః = పెద్దగా శ్రమ కలిగించు పనియా?

(శ్రామ్యతి తస్య భావః కర్మ వా ఖేదము కష్టము, ఇతి = అని, త్రిదశైః= దేవతలచే( తృతీయా యౌవనాఖ్యా దశా యస్య–మూడవ దశలో, యౌవనావస్థలో వున్నవాడు),నుతః=నుతింపబడినవాడవు,మాం =నన్ను,గదాత్=రోగమునుండి, పాలయ= కాపాడుము.

**తాత్పర్యము:** ఓ కమలాపతీ! గురువాయూరు కృష్ణ దేవా! చాలాకాలము క్రితమే వరాహావతారమెత్తి సర్వభూమిని ఎత్తిన నీకు కొండ ఎత్తుట నీకు పెద్దగా శ్రమ కలిగించు పనియా? (శ్రమ కలిగించదు అని భావం) అని దేవతలచే నుతింపబడినవాడవు. నన్ను రోగమునుండి కాపాడుము.

***దశమ స్కంధము***

**63వ దశకము పూర్తి.**



# దశకమ్ 64 – గోవిన్దపట్టాభిషేకము

**64-1 శ్లో.**

**ఆలోక్య శైలోద్ధరణాదిరూపం ప్రభావముచ్చైస్తవ గోపలోకాః ।**
**విశ్వేశ్వరం త్వామభిమత్య విశ్వే నందం భవజ్జాతకమన్వపృచ్ఛన్ ॥**

**ప్రతిపదార్థము:** విశ్వే= సమస్త, గోప లోకాః= గోపాలకులు, తవ= నీయొక్క, ఉచ్చైః= ఉత్కృష్టమైన (మహాన్ గొప్పది), శైల ఉద్ధరణ ఆదిరూపం = నువ్వు గోవర్ధనపర్వతమును ఎత్తుట మరియు మొదలగు గొప్పతనముల, ప్రభావమ్= ప్రభావమును, ఆలోక్య = చూసి, త్వామ్ = నిన్ను, విశ్వ ఈశ్వరం= విశ్వనాథుడవగు శ్రీవిష్ణువు అవతారమే అని, అభిమత్య = భావించి, భవత్ జాతకమ్ = నీ జాతకవిషయమును గురించి (జాతబాలకస్య శుభాశుభనిర్ణాయకగ్రహః పుట్టిన శిశువు శుభాశుభములను తెలుపునది. జాతకము), నందం = నందుని, అన్వపృచ్ఛన్= ప్రశ్నించిరి.

**తాత్పర్యము:** సమస్త గోపాలకులు నీయొక్క ఉత్కృష్టమైన గోవర్ధనపర్వతమును ఎత్తుట మరియు మొదలగు నీగొప్పతనముల ప్రభావమును చూసి నిన్ను విశ్వనాథుడవగు శ్రీవిష్ణువు అవతారమే అని భావించి నీ జాతకవిషయమును గురించి నందుని ప్రశ్నించిరి.

**64-2 శ్లో.**

**గర్గోదితో నిర్గదితో నిజాయ వర్గాయ తాతేన తవ ప్రభావః ।**
**పూర్వాధికస్త్వయ్యనురాగ ఏషామైధిష్ట తావద్ బహుమానభారః ॥**

**ప్రతిపదార్థము:** గర్గ ఉదితః = గర్గుడు చెప్పిన నీ మహోన్నత జాతక విశేషములను (గృణాతి ఉపదిశతి అసౌ వేదమును ఉపదేశించువాడు. ఒక ఋషి), నిజాయ వర్గాయ= ఆ గోపాలురకు, తాతేన =నందునిచే (తనోతి విస్తారయతి గోత్రాదికమ్ వంశమును విస్తరించువాడు. తండ్రి), తవ ప్రభావః= నీ ప్రభావము(ప్రకృష్టం భవతి తస్య భావః – బాగా ప్రకాశించునది. ఆజ్ఞవలన పుట్టిన తేజస్సు), నిర్గదితః= చెప్పబడినది, త్వయి=అది విన్నతరువాత నీయందు, పూర్వ

అధికః= పూర్వము కంటె ఎక్కువగా, ఏషామ్= వీరికి, అనురాగః = ప్రేమ (అనురూపో రాగః – అనురాగము ప్రేమ), ఐధిష్ట = పెరిగింది, తావద్ =అటుపై, బహుమానభారః= నీపై అధికమైన ఆదరణ పెరిగింది. (బహు అధికం మానం ఆదరః–ఎక్కువ ఆదరము).

**తాత్పర్యము:** గర్గుడు చెప్పిన నీ మహోన్నత జాతక విశేషములను ఆ గోపాలురకు నందుడు చెప్పాడు. అది విన్నతరువాత నీయందు పూర్వము కంటె ఎక్కువగా గోపాలురకు ప్రేమ పెరిగింది. అటుపై నీపై అధికమైన ఆదరణ పెరిగింది.

**64–3 శ్లో.**
**తతోఽవమానోదితతత్త్వబోధః సురాధిరాజః సహదివ్యగవ్యా ।**
**ఉపేత్య తుష్టావ స నష్టగర్వః స్పృష్ట్వా పదాబ్జం మణిమౌళినా తే ॥**

**ప్రతిపదార్థము:** తతః=పిమ్మట,అవమాన=అవమానమునుండి(పరాజయముతో) (అవమన్యతే తిరస్కరోతి తస్య భావః–తిరస్కారము అనాదరము), ఉదిత= పుట్టిన(ఉత్ ఉచ్చైః ఇతః గతః–ఉదయించినది మొలచినది), తత్త్వబోధః = తత్వజ్ఞానమును పొంది (తతో భావః తస్య భావో వా దాని స్వరూపము సత్యము), నష్టగర్వః= గర్వము నశించిన, సః సుర అధిరాజః= ఆ దేవతలకు రాజగు దేవేంద్రుడు, స దివ్య గవ్యా = కామధేనువుతో, సహ= కలిసి, ఉపేత్య= నీ వద్దకు వచ్చి, తే= నీయొక్క, పద అబ్జం=పాదపద్మములను, మణిమౌళినా= తన మణిమయకిరీటముతో, స్పృష్ట్వా= తాకి, తుష్టావ=నిన్ను స్తుతించెను.

**తాత్పర్యము:** పిమ్మట పరాజయముతో పుట్టిన తత్వజ్ఞానమును పొంది (నాకొరకే ఈ కృష్ణస్వామి అవతరించాడను జ్ఞానము) గర్వము నశించిన అ దేవతలకు రాజగు దేవేంద్రుడు– కామధేనువుతో కలిసి, నీ వద్దకు వచ్చి నీ పాదపద్మములను తన మణిమయకిరీటముతో తాకి నిన్ను స్తుతించెను.

**64–4 శ్లో.**
**స్నేహస్నుతైస్త్వాం సురభిః పయోభిర్గోవిందనామాంకితమభ్యషించత్ ।**
**ఐరావతోపాహృతదివ్యగంగాపాథోభిరింద్రోఽపి చ జాతహర్షః ॥**

**ప్రతిపదార్థము:** త్వాం=నీకు, సురభిః= కామధేనువు (సుష్ఠు రభతే అనేన-దీనితో ఆనందింతురు), స్నేహ = స్నేహముతో(స్నిహ్యతి తస్య భావః కర్మ వా స్నేహము నూనె), పయోభిః చ =తన పాల (పీయతే అసౌ త్రాగబడునది. జలము పాలు), స్నుతైః=ధారలతో (క్షరితః-కారినది), అభ్యషించత్ =అభిషేకము చేసింది, ఐరావత = తన వాహనమయిన గజరాజు అగు 'ఐరావతము(ఇరావాన్ సముద్రః తత్ర భవః తస్య అపత్యం వా సముద్రములో పుట్టినది. ఐరావతము), ఉపాహృత= తీసుకు వచ్చిన, దివ్యగంగా పాథోభిః=దివ్య గంగాజలముతో, ఇంద్రః అపి= ఇంద్రుడు కూడా, జాతహర్షః= సంతోషముతో, గోవిందనామ అంకితమ్= నిన్ను "గోవిందా" అని స్తుతించి (అభ్యషించత్ =అభిషేకము చేసాడు) (గాం పృథివీం ధేనుం వాణీం వా విందతి భూమిని, ఆవును సంతోషింప చేయువాడు. శ్రీకృష్ణుడు వాక్కును సంతోషింప చేయువాడు).

**తాత్పర్యము:** కామధేనువు స్నేహముతో తన పాల ధారలతో నీకు అభిషేకము చేసింది. తన వాహనమయిన గజరాజు అగు ఐరావతము తీసుకు వచ్చిన దివ్య గంగాజలముతో ఇంద్రుడు కూడా సంతోషముతో నిన్ను "గోవిందా" (గోవులను పాలించువాడా!గాః – గోవులను విందతి= పొందువాడా) అని స్తుతించి అభిషేకము చేసాడు.

**64-5 శ్లో.**

**జగత్త్రయేశేత్వయి గోకులేశే తథాభిషిక్తే సతి గోపవాటః ।**
**నాకేఽపి వైకుంఠపదే ఽప్యలభ్యామ్ శ్రియం ప్రపేదే భవతః ప్రభావాత్ ॥**

**ప్రతిపదార్థము:** జగత్రయ ఈశే= మూడు లోకములకు అధిపతివైన, త్వయి= నువ్వు, తథా= అట్లు, గోకులేశే= గోకులమునకు ప్రభువుగా(బృందావనము దగ్గఱ ఉండుగొల్లపల్లె.వ్రేపల్లె),అభిషిక్తేసతి=పట్టాభిషిక్తుడవగుటవలన(గోత్రప్రవరాదిభిః స్వనామకథనేన నమస్కరణమ్ నీరు చిలకరించుట రాజ్యాభిషిక్తుడు), భవతః ప్రభావాత్= నీ ప్రభావముతో, గోపవాటః= ఆ గోపాలురు నివసించుచున్న ఆ వ్రజము (వట్యతే గమ్యతే అనేన-దీనితో వెళ్లబడును. మార్గము), నాకే అపి= స్వర్గమందు కాని(న కం అకం దుఃఖ తన్నాస్తి యత్ర-దుఃఖము లేని చోటు.

స్వర్గము), వైకుంఠపదే అపి = వైకుంఠపదమందు కాని (వివిధా కుంఠా మాయా యస్య–మాయ గలవాడు. విష్ణువు), అలభ్యామ్ = అలభ్యమగు, శ్రియం= పరమైశ్వర్యములను, ప్రపేదే = పొందెను.

**తాత్పర్యము:** మూడు లోకములకు అధిపతివైన నువ్వు అట్లు గోకులమునకు ప్రభువుగా పట్టాభిషిక్తుడవగుట వలన నీ ప్రభావముతో ఆ గోపాలురు నివసించు చున్న ఆ వ్రజము స్వర్గమందు కాని వైకుంఠపదమందు కాని అలభ్యమగు పరమైశ్వర్యములను పొందెను.

**64–6 శ్లో.**

**కదాచింతర్యమునం ప్రభాతే స్నాయన్ పితా వారుణ పూరుషేణ ।**
**నీతస్తమానేతుమగాః పురీం త్వం తాం వారుణీం కారణమర్త్యరూపః ॥**

**ప్రతిపదార్థము:** కదాచిత్ = ఒక రోజున(ఒకానొకప్పుడు. అనియతకాలః), అంతర్యమునం= యమునానదియందు, ప్రభాతే = వేకువజామునకు ముందుగనే (ప్రకర్షేణ భాతుం ప్రవృత్తమ్ ప్రకాశించుటకు సిద్ధమైనది. ప్రభాత సమయము), పితా = నీ తండ్రియగు నందుడు, స్నాయన్= స్నానము చేయుటకు వెళ్ళగా, వారుణ పూరుషేణ= వరుణ దూత (వరుణస్య ఇదమ్ వరుణునికి సంబంధించినది), తమ్ = అతనిని బంధించి, నీతః = వరుణలోకమునకు తీసుకొనిపోయెను, కారణ మర్త్య రూపః= కారణాంతరమున మానవజన్మను ఎత్తిన (యేన వినా యత్ న భవతి తత్ ఇది లేనిచో కార్యము జరుగదు. కార్యోత్పత్తికి కారణమైనది. సాధనము), త్వం = నువ్వు, ఆనేతుమ్ = తండ్రిని తిరిగి తీసుకొని వచ్చుటకు, తాం వారుణీం పురీం= ఆ వరుణ లోకమునకు (పూర్యతే ప్రాణిభిః–ప్రాణులచే నింపబడునది. పురము), అగాః= వెళ్లితివి.

**తాత్పర్యము:** ఒక రోజున యమునానదియందు వేకువజామునకు ముందుగనే నీ తండ్రియగు నందుడు స్నానము చేయుటకు వెళ్ళగా వరుణ దూత అతనిని బంధించి వరుణలోకమునకు తీసుకొనిపోయెను. కారణాంతరమున మానవజన్మను ఎత్తిన నువ్వు తండ్రిని తిరిగి తీసుకొని వచ్చుటకు ఆ వరుణ లోకమునకు వెళ్లితివి.

**64-7 శ్లో.**

**ససంభ్రమం తేన జలాధిపేన ప్రపూజితస్త్వం ప్రతిగృహ్య తాతమ్ ।**
**ఉపగతస్తత్క్షణమాత్మ గేహం పితాఽవదత్ తచ్చరితం నిజేభ్యః ॥**

**ప్రతిపదార్థము:** తేన జలాధిపేన= ఆ వరుణుడు నిన్నుచూచి, ససంభ్రమం= సంభ్రమాశ్చర్యములకు లోనయి, ప్రపూజితః= నిన్ను పూజించెను, త్వం= నువ్వు, తాతమ్ =నీతండ్రిని, ప్రతిగృహ్య= తీసుకొని, తత్ క్షణమ్= తత్క్షణమే, ఆత్మ గేహం= నీగృహమునకు(గేహం=గో గణేశః గంధర్వః తేన ఈహః ఈప్సితః యత్ర- గణేశుడు లేదా గంధర్వుడు ఇక్కడ వుండవలెనని కోరబడునది. ఇల్లు), ఉపగతః= చేరితివి.(ఉప సమీపం గతః సమ్యక్ గతః జ్ఞాత-దగ్గరకు వెళ్ళినది చక్కగా తెలుసుకున్నది), పితా= నీ తండ్రి, తత్ చరితం= జరిగిన వృత్తాంతము, నిజేభ్యః= ఆ గోకుల వాసులకు, అవదత్= చెప్పెను.

**తాత్పర్యము:** ఆ వరుణుడు నిన్నుచూచి సంభ్రమాశ్చర్యములకు లోనయి నిన్ను పూజించెను . నువ్వు నీతండ్రిని తీసుకొని తత్క్షణమే నీగృహమునకు చేరితివి. నీ తండ్రి జరిగిన వృత్తాంతము ఆ గోకుల వాసులకు చెప్పెను.

**64-8 శ్లో.**

**హరిం వినిశ్చిత్య భవంతమేతాన్ భవత్పదాలోకనబద్ధతృష్ణాన్ ।**
**నిరీక్ష్య విష్ణో! పరమం పదం తద్ దురాపమన్యైస్త్వమదీదృశస్తాన్ ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో= ఓ గురువాయూరు లో వెలసిన విష్ణుదేవా!, భవంతమ్= నిన్ను, హరిం= శ్రీహరియే, వినిశ్చిత్య=అని నిశ్చయించుకొని, ఏతాన్= ఆ గోకుల వాసులు, భవత్ పదఆలోకనబద్ధ తృష్ణాన్= నీ నివాసమయిన వైకుంఠమును చూడవలెనని కోరిక తో ఉన్న ( ఆలోక్యంతే ప్రకాశ్యంతే అనేన - దృష్టి, చూపు చూచుట), నిరీక్ష్య =వారిని చూసి, అన్యైః తద్ దురాపమ్ =ఇతర బద్ధజీవులు చూచుటకు అనితరసాధ్యమయున, పరమం పదం = నీ వైకుంఠధామమును, త్వమ్= నువ్వు, తాన్= వారికి (బృందావన వాసులకు), అదీదృశః= దర్శింపచేసితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు లో వెలసిన విష్ణుదేవా! నిన్ను శ్రీహరియే అని నిశ్చయించుకొని ఆ గోకుల వాసులు నీ నివాసమయిన వైకుంఠమును చూడ వలెనని కోరిక వెలిబుచ్చిరి. ఇతర బద్ధజీవులు చూచుటకు అనితరసాధ్యమయున నీ వైకుంఠధామమును నువ్వు వారికి దర్శింపచేసితివి.

**64-9 శ్లో.**

**స్ఫురత్పరానందరసప్రవాహప్రపూర్ణకైవల్యమహాపయోధౌ ।**
**చిరం నిమగ్నాః ఖలు గోపసంఘస్త్వయైవ భూమన్! పునరుద్ధృతాస్తే ॥**

**ప్రతిపదార్థము:** గోపసంఘః = గోపాలురు (సం ఏకత్ర హంతి గచ్ఛంతి తత్ ఒకచోట కలయిక సమూహము సంఘము), స్ఫురత్= ప్రకాశించు, పరానందరస = పరమానందస్థితి అను రసము యొక్క (పర= ప్రీణయతి అసౌ సంతోషపెట్టువాడు. బ్రహ్మ ఇతరము భిన్నము తరువాత శ్రేష్ఠము మోక్షము), ప్రవాహప్రపూర్ణ= ప్రవాహములో ఓలలాడి (పరంపరయా ఆగచ్ఛతి పరంపరగా వచ్చునది. ప్రవాహము), కైవల్య = మోక్షము అను (కేవలస్య శుద్ధస్య భావః సర్వోపాధివర్జితస్య భావః–శుద్ధ స్వభావము కలది దోష రహితమైనది. ముక్తి, నిర్వాణము, మోక్షము), మహాపయోధౌ= సముద్రమును చేరి (పయాంసి ధీయంతే అస్మిన్ ఇందులో నీరుండును. సముద్రము), చిరం = చిరకాలము (చాలా సమయము), నిమగ్నాః ఖలు= నిమగ్నమయిరి కదా! (నితరాం మగ్నః–నిమగ్నుడు. మునిగిపోయినవాడు), భూమన్= పూర్ణపరబ్రహ్మమా! ఓ గురువాయూరు దేవా! (భూమన్ = విరాట్పురుషః, మహత్త్వం. సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థం), తే= వారు, త్వయా ఏవ = నీ చేతనే, పునః = మరలా, ఉద్ధృతాః = భౌతికజగత్తునకు తీసుకొనిరాబడిరి. (ఉత్ ఊర్ధ్వం హృతః ధృతో వా పైకి లేపబడినది ధరించబడినది నశింపబడినది), పరమానందరస ప్రవాహ పరిపూర్ణమైన కైవల్యమనెడి సాగరమందిట్లు చిరకాలము మునుకలు వెట్టించి వారి నుద్ధరించితివి. నీవు కేవల పూర్ణపరబ్రహ్మము.

**తాత్పర్యము:** గోపాలురు ప్రకాశించు పరమానందస్థితి అను రసము యొక్క ప్రవాహములో ఓలలాడి మోక్షము అను సముద్రమును చేరి చిరకాలము (చాలాసమయము) నిమగ్నమయిరి కదా ! పూర్ణపరబ్రహ్మమా ! వారు నీ చేతనే మరలా భౌతికజగత్తునకు తీసుకొనిరాబడిరి.

**64-10 శ్లో.**

**కరబదరవదేవం దేవ కుత్రావతారే**
**నిజపదమనవాప్యం దర్శితం భక్తిభాజామ్ ।**
**తదిహ పశుపరూపీ త్వం హి సాక్షాత్ పరాత్మా!**
**పవనపుర నివాసిన్ పాహి మామామయేభ్యః ॥**

**ప్రతిపదార్థము:** పవనపురనివాసిన్ దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, ఏవం= ఇట్లు(ఇదం ఇవ సాదృశ్య-నిశ్చయ స్వీకార ప్రశ్నాదిషు-సాదృశ్యము, నిశ్చయము, ప్రశ్న మొదలగునవి), కరబదర వత్ = అరచేతిలో రేగుపండట్లు (చేతిలోని రేగుపండు మాదిరిగా స్పష్టంగా కనబడినట్లు), కుత్ర= ఎచ్చట(ఏ), అవతారే = అవతారమందు, తత్ అనవాప్యం = ఆ దుర్లభమగు, నిజపదమ్= నీవైకుంఠ స్థానమును, ఇహ = ఇక్కడ, భక్తిభాజామ్= భక్తులకు(భక్తిం భజతి భక్తి కలవాడు), దర్శితం = దర్శింపచేసావు?, పశుపరూపీ = గోపబాలకుని రూపము ధరించిన వాడా! కృష్ణా!, త్వం సాక్షాత్= నువ్వు సాక్షాత్తుగా, పరాత్మా హి = పరమాత్మవి!, మామ్ = నన్ను, ఆమయేభ్యః= రోగములనుండి (ఆమం రోగం యాతి అనేన-దీనితో రోగులగుదురు. రోగము మనోవ్యాధి), పాహి= కాపాడు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఇట్లు అరచేతిలో రేగుపండట్లు ఏ అవతారమందు ఆ దుర్లభమగు నీవైకుంఠ స్థానమును ఇక్కడ భక్తులకు దర్శింపచేసావు? (కేవలము నీవు ఈ కృష్ణ అవతారములోనే – నీ భక్తజనులకు అరచేతిలో నిలిచిన రేగిపండు చందముగా వైకుంఠమును సాక్షాత్కరింపజేసావని భావం). గోపబాలకుని రూపము ధరించిన వాడా! కృష్ణా! నువ్వు సాక్షాత్తుగా పరమాత్మవి! నన్ను రోగములనుండి కాపాడు.

**విశేషము**

**పరమాత్మ:** అండ పిండాదులన్నిటికీ సాక్షియైన చైతన్యం. అన్ని ఉపాధులనూ వ్యాపించి అన్నిటినీ తనలో కలుపుకొన్న సామాన్య చైతన్యం. నిర్మలమైన తత్త్వం. బ్రహ్మం.

**దశమ స్కంధము**

**64వ దశకము పూర్తి.**



# దశకమ్ 65 – గోపికల భగవత్సామీప్యప్రాప్తి

**65-1 శ్లో.**
**గోపీజనాయ కథితం నియమావసానే**
**మారోత్సవం త్వమథ సాధయితుం ప్రవృత్తః ।**
**సాంద్రేణ చాంద్రమహసా శిశిరీకృతాశే**
**ప్రాపూరయో మురలికాం యమునావనాంతే ॥**

**ప్రతిపదార్థము:** నియమ అవసానే= కాత్యాయనీవ్రత సమాప్తి సమయములో (నియచ్ఛంతి రుందంతి అనాచారాదికమ్ దీనితో అనాచారము ఆపబడును. నియమము కట్టుబాటు), గోపీజనాయ= గోపికలకు, కథితం = వాగ్దానము చేసిన, మార ఉత్సవం= రాస క్రీడాది ఉత్సవములను (మారయతి మ్రియంతే ప్రాణినః అనేన – చంపువాడు. ఇతని వలన ప్రాణులు చనిపోవును. మన్మథుడు), సాధయితుం ప్రవృత్తః= ఆచరించుటకు, త్వమ్= నువ్వు, సాంద్రేణ= దట్టముగ, చాంద్రమహసా= వెన్నెలల కాంతులు అలముకొని (చంద్రస్య ఇదమ్ చంద్రునికి సంబంధించినది.)(మహ్యతే పూజ్యతే పూజ్యతే వా అనేన (ప్రశంసా) పూజింపబడును, ప్రశసింపబడును. జ్ఞానము), శిశిరీకృత ఆశే= అన్ని దిక్కులలోను చల్లదనములు నిండిన, యమునా వన అంతే= యమునానదీ తీరములో ఉండి, మురళీకాం= నీ దివ్య మురళీగానమును (మురం అంగుళివేష్టనం లాతి ప్రాప్నోతి వేళ్లతో కప్పబడునది. మురళి), ప్రాపూరయః = పూరించితివి(వేణువు వాయించుట మొదలుపెట్టావు).

**తాత్పర్యము:** కాత్యాయనీవ్రత సమాప్తి సమయములో గోపికలకు వాగ్దానము చేసిన రాస క్రీడాది ఉత్సవములను ఆచరించుటకు, నువ్వు దట్టముగ వెన్నెలలు అలముకొని అన్ని దిక్కులలోను చల్లదనములు నిండిన యమునానదీ తీరములో నీ దివ్య మురళీగానమును పూరించితివి(వేణువు వాయించుట మొదలుపెట్టావు)

**65-2 శ్లో.**

**సమ్మూర్ఛనాభిరుదితస్వరమండలాభిః**
**సమ్మూర్ఛయంతమఖిలం భువనాంతరాలమ్ ।**
**త్వద్వేణునాదముపకర్ణ్య విభో! తరుణ్యః**
**తత్తాదృశం కమపి చిత్తవిమోహమాపుః ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, స్వరమండలాభిః = చక్కగ స్వరమండలము యొక్క ఆరోహణావరోహణాది వివిధ విన్యాస భేదములనుండి (స్వయం రాజతే స్వయంగా ప్రకాశించునది. సంగీతంలో సప్త స్వరాలు), ఉదిత= పుట్టిన, సమ్మూర్ఛనాభిః = మూర్ఛనలచే (మూర్ఛయతి ఆనందం వర్ధయతి స్వరగ్రామః–ఆనందము పెంపొందింప చేయునది. సంగీత స్వరగ్రామము), అఖిలం భువన అంతరాలమ్ = అఖిల భువనములమధ్య, సమ్మూర్ఛయంతమ్ = సమ్మోహింప జేయుచున్నటువంటి, తత్ తాదృశం =అనుపమమయిన (పోలికలేని), త్వత్ వేణునాదమ్ = నీ వేణుగీతమును, ఉపకర్ణ్య= విని, తరుణ్యః = గోపవనితలు, కమ్ అపి= ఇటువంటిది అని చెప్పలేని, చిత్త విమోహమ్ = చిత్త విమోహమును(మిక్కిలి మోహము), ఆపుః = పొందిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! చక్కగ స్వరమండలము యొక్క ఆరోహణావరోహణాది వివిధ విన్యాస భేదములనుండి పుట్టిన మూర్ఛనలచే అఖిల భువనములను సమ్మోహింప జేయుచున్నటువంటి పోలికలేని నీ వేణుగీతమును విని గోపవనితలు ఇటువంటిది అని చెప్పలేని చిత్త విమోహమును పొందిరి.

**విశేషము**

**మూర్ఛనలు:** సప్తస్వరముల యొక్క (1. నిషాదము, 2. ఋషభము, 3. గాంధారము, 4. షడ్జము, 5. మధ్యమము, 6. ధైవతము, 7. పంచమము) ఆరోహణావరోహణములను మూర్ఛనలందురు

'స' తో మొదలు పెట్టి ఒక్కో మెట్టూ ఎక్కుతున్నట్లుగా స్వర స్థాయిని మార్చి తిరిగి 'స' కి చేరడాన్ని ఆరోహణ అంటారు. అలాగే పై మెట్టు నుండి ఒక్కో మెట్టూ

దిగుతున్నట్లుగా స్వరాలని వ్యతిరేక క్రమంలో దిగడాన్ని అవరోహణ అంటారు. పైన చెప్పినట్లుగా ప్రతీ రాగంలో స్వరాలున్నాయి కాబట్టి వాటికొక ఆరోహణా, అవరోహణా ఉంటుంది. దీన్నే మూర్ఛన (స్కేల్) అని కూడా వ్యవహరిస్తూ వుంటారు. ప్రతీ రాగానికీ ఖచ్చితమైన స్వరాల ఆరోహణా, అవరోహణా ఉంటాయి. ( సాయి బ్రహ్మానందంగొర్తి—ఈమాట జూలై 2009)

**65–3 శ్లో.**

**తా గేహకృత్యనిరతాస్తనయ ప్రసక్తాః**
**కాంతోపసేవనపరాశ్చ సరోరుహాక్ష్యః ।**
**సర్వం విసృజ్య మురలీరవమోహితాస్తే**
**కాంతారదేశమయి కాంతతనో! సమేతాః ॥**

**ప్రతిపదార్థము:** అయి = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, కాంతతనో = కాంతి కలిగిన శరీరము కలిగినవాడా! (కామ్యతే ఇతి కోరబడునది. మనోహరమైనది), గేహ కృత్య నిరతాః = ఇంటి పనులు నిర్వహించుచున్నవారు, తనయ ప్రసక్తాః = బిడ్డలకు పాలిచ్చుచున్నవారు (తనోతి కులమ్ కులమును విస్తరించువాడు), కాంత ఉపసేవన పరాః చ= భర్తలను సేవించుచున్నవారు అయిన, తాః సరోరుహ అక్ష్యః= ఆ పద్మముల వంటి కన్నులు కలిగిన గోపవనితలు, తే మురళీరవ మోహితాః= నీ మురళీగానమునకు పరవశలై, సర్వం= అన్ని పనులను, విసృజ్య= విడిచిపెట్టి, కాంతార దేశమ్= యమునాతీర వనప్రాంతమునకు (కస్య జలస్య సుఖస్య అంతః కాంతః తం ఋచ్ఛతి సుఖము నిచ్చునది. శాంతినిచ్చునది. అడవి), సమేతాః=వచ్చిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! కాంతి కలిగిన శరీరము కలిగినవాడా! ఇంటి పనులు నిర్వహించుచున్నవారు, బిడ్డలకు పాలిచ్చుచున్నవారు, భర్తలను సేవించుచున్నవారు అయిన ఆ పద్మముల వంటి కన్నులు కలిగిన గోపవనితలు నీ మురళీగానమునకు పరవశలై అన్ని పనులను విడిచిపెట్టి యమునాతీర వనప్రాంతమునకు వచ్చిరి.

**65-4 శ్లో.**

**కాశ్చిన్నిజాంగపరిభూషణమాదధానాః**
**వేణుప్రణాదముపకర్ణ్య కృతార్ధభూషాః ।**
**త్వామాగతా నను తథైవ విభూషితాభ్యః**
**తా ఏవ సంరురుచిరే తవ లోచనాయ ॥**

**ప్రతిపదార్ధము:** కాశ్చిత్= కొందరు, నిజ అంగ పరిభూషణమ్ = సర్వావయవ భూషణములను (పరిభూషయతి అసౌ భూషణము అలంకారము), ఆదధానాః= ధరించి రాగా, వేణు ప్రణాదమ్= మరికొందరు ఆ వేణునాదమును, ఉపకర్ణ్య= విని, కృత అర్ధభూషాః = సగము సగముగా అలంకరించుకొని, త్వామ్ = నీ దగ్గరకు, ఆగతాః= వచ్చిరి, తథా =అలా, విభూషితాభ్యః = అసంపూర్ణ అలంకార ధారణతో సరిగా అలంకరించకొనకయే వచ్చిన, తా ఏవ= వారే, తవ లోచనాయ= నీ కన్నులకు, సంరుచిరే= చక్కగా అలంకరించుకొని వచ్చినవారికంటె ఎక్కువ ఆనందమును నీకు కలిగించారు. నను = సముచితమే కదా!

**తాత్పర్యము:** కొందరు సర్వావయవ భూషణములను ధరించి రాగా, మరికొందరు ఆ వేణునాదమును విని సగము సగముగా అలంకరించుకొని నీ దగ్గరకు వచ్చిరి .అలా – అసంపూర్ణ అలంకార ధారణతో సరిగా అలంకరించకొనకయే వచ్చిన వారు – నీ కన్నులకు చక్కగా అలంకరించుకొని వచ్చినవారికంటె ఎక్కువ ఆనందమును కలిగించారు. సముచితమే కదా!

**విశేషం:** సరిగా అలంకరించకొనకయే వచ్చిన వారు – చక్కగా అలంకరించుకొని వచ్చినవారికంటె కృష్ణుని కన్నులకు ఎక్కువ ఆనందమును కలిగించుటకు కారణం వారి భక్తి తీవ్రత .

**65-5 శ్లో.**

**హారం నితంబభువి కాచన ధారయంతీ**
**కాంచీం చ కంఠభువి దేవ! సమాగతా త్వామ్ ।**
**హారిత్వమాత్మ జఘనస్య ముకుంద! తుభ్యం**
**వ్యక్తం బభాష ఇవ ముగ్ధముఖీ విశేషాత్ ॥**

**ప్రతిపదార్థము:** ముకుంద= ముకుందా! (ముకుం మోక్షం దదాతి మోక్షము నిచ్చువాడు. విష్ణువు), దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా, కాచన ముగ్ధముఖీ = ఒక మనోహరమైన మోము కలిగిన గోపిక, హారం = మెడలో ధరింపవలసిన హారమును(హరతి మనః–మనస్సును హరించునది. మాల), ఆత్మ జఘనస్య = తన జఘనము యొక్క(హన్యతే అసౌ తొడ గొట్టబడునది. జఘనము), విశేషాత్ = విశేష, హారిత్వమ్= మనోహరత్వమును(వైశాల్యమును)( హరతి మనః– మనస్సును హరించునది), తుభ్యం= నీకు, వ్యక్తం= స్పష్టముగా, బభాష ఇవ = చెప్పినట్లుగా, నితంబభువి= ఒడ్డాణము పెట్టుకొన వలసిన నితంబ ప్రదేశములో ధరించింది. (నిభృతం తమ్యతే కామ్యతే కాముకైః – కాముకులచే కోరబడునది. పిరుదు), కాంచీం చ = నడుమున అలంకరించుకొనవలసిన వడ్డాణమును (కాంచతే దీప్తా భవతి ప్రకాశించునది. వడ్డాణము), కంఠభువి = కంఠములో, ధారయంతీ = అలంకరించుకొని, త్వామ్ సమాగతా = నిన్ను చేరింది.

**తాత్పర్యము:** ముకుందా! ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఒక మనోహరమైన మోము కలిగిన గోపిక మెడలో ధరింపవలసిన హారమును –వడ్డాణము పెట్టుకొన వలసిన నితంబ ప్రదేశములో ధరించింది. తన జఘనము యొక్క విశేష వైశాల్యమును నీకు అది స్పష్టముగా చెప్పినట్లుగా ఉన్నది. నడుమున అలంకరించుకొనవలసిన వడ్డాణమును కంఠములో అలంకరించుకొని నిన్ను చేరింది. (ఇది తన కంఠమును కౌగలించుకొనరమ్మని నిన్ను పిలిచెనా అన్నట్లున్నది)

**65–6 శ్లో.**

**కాచిత్ కుచే పునరసజ్జితకంచులీకా**
**వ్యామోహతః పరవధూభిరలక్ష్యమాణా ।**
**త్వామాయయౌ నిరుపమప్రణయాతిభార–**
**రాజ్యాభిషేకవిధయే కలశీధరేవ ॥**

**ప్రతిపదార్థము:** పునః= మరలా, కాచిత్= ఒక గోపకన్య (కాచన కాపి స్త్రీ), వ్యామోహతః= నీ పై వ్యామోహముతో (విశేషేణ సంపూర్ణతయా ముహ్యతి తస్య భావః – మోహము వ్యాకులత్వము), పరవధూభిః= ఇతర గోపస్త్రీలు, అలక్ష్యమాణా

=గమనించలేని పరిస్థితిలో, నిరుపమ= పోలికలేని(నాస్తి ఉపమా యస్య–సాటి లేనిది), ప్రణయ అతిభార–రాజ్య అభిషేకవిధయే = నీ ప్రణయ సామ్రాజ్య పట్టాభిషేకమందు, కలశీధర ఇవ= బంగారు కలశములతో(పెరుగుజిలికెడు కుండ) వచ్చుచున్నట్లుగా, కుచే= కుచములపై, అసజ్జిత కంచులీకా= పై వస్త్రము ధరించుట మరిచి( రైక తొడిగికొనకుండ), త్వామ్= నీ వద్దకు, ఆయయౌ = ప్రయాణమయ్యెను.

**తాత్పర్యము:** మరలా ఒక గోపకన్య నీ పై వ్యామోహముతో– ఇతర గోపస్త్రీలు గమనించలేని పరిస్థితిలో– పోలికలేని నీ ప్రణయ సామ్రాజ్య పట్టాభిషేకమందు బంగారు కలశములతో వచ్చుచున్నట్లుగా– కుచములపై రైక తొడిగికొనకుండ నీ వద్దకు ప్రయాణమయ్యెను. (కుచములు బంగారు కలశముల వలె ఉండెనని భావం)

**65–7 శ్లో.**

**కాశ్చిద్ గృహాత్ కిల నిరేతుమపారయంత్యః**
**త్వామేవ దేవ! హృదయే సుదృఢం విభావ్య ।**
**దేహం విధూయ పరచిత్సుఖరూపమేకం**
**త్వామావిశన్ పరమిమా నను ధన్యధన్యాః ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణదేవా!, కాశ్చిత్ = కొందరుగోపికలు, గృహాత్= గృహబంధములను, నిరేతుమ్ = త్రెంచుకొని బయటికి రాలేక, అపారయంత్యః = అశక్తులై, త్వామ్ ఏవ=నిన్నే, హృదయే= హృదయమునందు, సుదృఢం=దృఢముగా, విభావ్య= నీమూర్తిని భావనచేసుకొనుచూ, దేహం = స్థూలమైన సూక్ష్మమైన శరీరమును(దేగ్ధి వృద్ధిం గచ్ఛతి నిరంతరము వృద్ధి పొందునది. శరీరము), విధూయ = విడిచి, ఏకం పరచిత్ సుఖరూపమ్ = కేవల నిర్గుణ బ్రహ్మమయిన(ఏకం=ఏతి గచ్ఛతి ఒకటి ముఖ్యమైనది నిజమైనది), త్వామ్ = నిన్ను(నీలో), నను= నిశ్చయముగా, ఆవిశన్ = ఐక్యమయ్యారు, ఇమాః= ఈ గోపికలు, పరమ్= అందరి కంటెను, ధన్య ధన్యాః కిల = ధన్యాతిధన్యలు కదా! (సుకృతీ కృతార్థుడు).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! కొందరుగోపికలు గృహబంధములను త్రెంచుకొని బయటికి రాలేక అశక్తులై నిన్నే దృఢముగా నీమూర్తిని భావనచేసుకొనుచూ స్థూలమైన మరియు సూక్ష్మమైన శరీరమును విడిచి కేవల నిర్గుణ బ్రహ్మమయిన(రూపం గానీ, భౌతికమైన మరే లక్షణాలు గానీ లేని దైవం. మానవుడి జ్ఞానానికీ, అవగాహనకు అందని దైవం.) నీలో ఐక్యమయ్యారు. ఈ గోపికలు అందరి కంటెను ధన్యాతిధన్యలు కదా!

**65-8 శ్లో.**
**జారాత్మనా న పరమాత్మతయా స్మరంత్యో**
**నార్యో గతాః పరమహంసగతిం క్షణేన ।**
**తం త్వాం ప్రకాశపరమాత్మతనుం కథంచిత్**
**చిత్తే వహన్నమృతమశ్రమమశ్నువీయ ॥**

**ప్రతిపదార్థము:** పరమాత్మతయా న= నువ్వు కేవలము పరమాత్మ అనుకొనక, జార ఆత్మనా= కేవలము జారుడవని (జీర్యతే స్త్రియాః సతీత్వం అనేన-కులస్త్రీలను చెడగొట్టువాడు. జారుడు), స్మరంత్యః= మనుష్య బుద్ధితో భావించిన, నార్యః = గోపికలు (నరస్య ధర్మ్యా స్త్రీ నరుని భార్య. స్త్రీ), పరమహంసగతిం=పరమహంసలు అందుకొను మోక్ష స్థానమును (పరమః శ్రేష్ఠః హంసః సోఽహం ఆత్మా యస్య- శ్రేష్ఠమైన ఆత్మ గలవాడు. పరమహంస, ఒక విధమైన సన్న్యాసి), క్షణేన= క్షణకాలములో, గతాః = పొందిరి, తం ప్రకాశ పరమాత్మ తనుం= ఆ ప్రకటీకృత బ్రహ్మ స్వరూపుడవయిన, త్వాం= నిన్ను, కథంచిత్= ఏదో ఒక పద్ధతిలో(కామము చేత ,వైరముచేత, భయముచేత, భక్తి చేత), చిత్తే = మనస్సులో, వహన్ = వహించి (ధ్యానించి), అశ్రమమ్= అశ్రమముగా (శ్రమలేకుండా), అమృతమ్ = అమృత స్థితిని (మోక్షమును)( నాస్తి మరణం యస్మాత్ అమృతము), అశ్నువీయ= పొందెదము.

**తాత్పర్యము:** నువ్వు కేవలము పరమాత్మ అనుకొనక కేవలము జారుడవని మనుష్య బుద్ధితో భావించిన గోపికలు పరమహంసలు అందుకొను మోక్ష స్థానమును క్షణకాలములో పొందిరి. ప్రకటీకృత బ్రహ్మ స్వరూపుడవయిన నిన్ను ఏదో ఒక

పద్ధతిలో(కామము చేత ,వైరముచేత, భయముచేత, భక్తి చేత) మనస్సులో ధ్యానించి శ్రమలేకుండా మోక్షమును పొందెదము.

**విశేషాలు**

**పరమాత్మ:** ఈ పదాన్ని పలువురు పలు విధాలుగా నిర్వచించారు. అందులో కొన్ని: 1. స్వయం ప్రకాశం కలిగి, జ్ఞానరూపమైన ఆత్మ. 2. కార్యకారణాలకంటే భిన్నమై, క్షరాక్షరాల కంటే కూడావేరుదై, స్వాభావికంగా నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమైన పదార్థం. 3. అవిద్య వల్ల ఆత్మగా తలచిన దేహం మొదలు బుద్ధివరకు ఉన్న తత్త్వాలకు అతీతమైనది. సర్వోత్కృష్టమైనదీ, ఉపద్రష్టృత్వాది విశేషణ విశిష్టమై ప్రకాశించే ఆత్మ. 4. ఆత్మగా కల్పితాలైన పంచ కోశాలకు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత తత్త్వాలకు అతీతమై, బ్రహ్మకు పూర్వం నుంచి ఉన్న పదార్థం. 5. సమస్త భూతాలలోని ప్రత్యక్చేతనం. 6. మాయాశక్తికి ఆశ్రయం. 7. సర్వానికి అధిష్ఠానమైనది. 8. పర దేవత. 9. దైవం / పరబ్రహ్మం.

**పరమహంస:** ఆనందాత్మను నేను అని ఎరుక కలిగిన వాడు పరమహంస. (పరం ఆనందాత్మా అహం అస్మీతిహన్తి గచ్ఛతి జనాతీతి పరమహంసః – శబ్ద కల్పద్రుమం). యతులకు వాడేపదం.

**65–9 శ్లో.**
**అభ్యాగతాభిరభితో వ్రజసుందరీభిః**
**ముగ్ధస్మితార్ద్రవదనః కరుణావలోకీ ।**
**నిస్సీమకాంతిజలధిస్త్వమవేక్ష్యమాణో**
**విశ్వైకహృద్య! హర మే పవనేశ! రోగాన్ ॥**

**ప్రతిపదార్థము:** విశ్వ ఏకహృద్య =సమస్త లోకాలకు ప్రీతి పాత్రుడా! (విశ్వ=విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము.)(హృద్య= హృదయస్య బంధనమ్ హృదయమును బంధించువాడు), పవన ఈశ = ఓ గురువాయూరు కృష్ణదేవా!, అభ్యాగతాభిః= అభ్యాగతులై (అభి ఆగతః అతిథిత్వేన ఆగతః–అభ్యాగతుడు అతిథి ఎదురు

వచ్చినవాడు.)( ఉత్సవాది సందర్భాలలో ఏదైనాద్రవ్యాదులు లభిస్తాయనో, ఏదైనా అడిగి లబ్ధి పొందుదామనో అపేక్షతో వచ్చే వ్యక్తి అభ్యాగతుడు), అభితః =నీ చుట్టూ చేరి, వ్రజసుందరీభిః= గోప సుందరీ మణులు, ముగ్ధ = ముగ్ధమైన (మోహయతి మోహింప చేయునది), స్మిత= చిరునవ్వుచే(ఈషద్ధసతి తస్య భావః కర్మవా చిరునవ్వు, మందస్మితము), ఆర్ద్రవదనః=ప్రకాశించు మోముకలవాడివయి (అర్దతి సించతి తస్య భావః – తడిసినది), కరుణా అవలోకీ=కరుణా కటాక్షములతో చూచు, నిస్సీమ కాంతి జలధిః=అంతులేని లావణ్యము మూర్తీభవించిన సముద్రము వలె ఉన్న, త్వమ్ = నిన్ను, అవేక్ష్యమాణః = దర్శించిరి, మే రోగాన్= నా రోగములను, హర= నిర్మూలించుము.

**తాత్పర్యము:** సమస్త లోకాలకు ప్రీతి పాత్రుడా! ఓ గురువాయూరు కృష్ణదేవా! అభ్యాగతులై నీ చుట్టూ చేరి గోప సుందరీ మణులు ముగ్ధమైన చిరునవ్వుచే ప్రకాశించు మోముకలవాడివయి, కరుణా కటాక్షములతో చూచు అంతులేని లావణ్యము మూర్తీభవించిన సముద్రము వలె ఉన్న నిన్ను దర్శించిరి. నా రోగములను నిర్మూలించుము.

(ఈ దశకములో తొమ్మిది శ్లోకములు మాత్రమే ఉన్నాయి)

***దశమ స్కంధము***

**65వ దశకము పూర్తి.**

# దశకమ్ 66 – గోపీజనాహ్లాదనము

**66–1 శ్లో.**

**ఉపయాతానాం సుదృశాం**
**కుసుమాయుధబాణపాతవివశానామ్ ।**
**అభివాంఛితం విధాతుం**
**కృతమతిరపి తా జగాథ వామమివ ॥**

**ప్రతిపదార్థము:** ఉపయాతానాం= నీ సమీపమునకు వచ్చిన (యా = ప్రాపణే), కుసుమ ఆయుధ= పూలు బాణములుగా కలిగిన మన్మథుని యొక్క (కుసుమం ఆయుధం అస్య – పూవులే ఆయుధంగా కలవాడు. కామదేవుడు), బాణపాత= బాణపు దెబ్బలకు(బణనం శబ్దః, తదస్తి అస్య – శబ్దము చేయునది. బాణము) (పతతి తస్య భావః కర్మ వా పతనము పడుట), వివశానామ్ = మోహ పరవశలైన( వశంలో లేని, అధీనంలో లేని), సుదృశాం= సుందరీమణులయిన గోపికల యొక్క(శోభనే దృశౌ నేత్రే యస్యాః – అందమైన కండ్లు కలది), అభివాంఛితం= మనోత్సవమును (కోరబడినదానిని), విధాతుం = తీర్చవలెనని, కృతమతిః అపి= నిశ్చయించిన బుద్ధి కలవాడవై, తాః= ఆ గోపికలతో ముందుగా, వామమ్ ఇవ= ప్రతికూలములుగా ఉన్నట్లున్న మాటలను, జగాథ= పలికితివి.

**తాత్పర్యము:** నీ సమీపమునకు వచ్చిన పూలు బాణములుగా కలిగిన మన్మథుని యొక్క మోహ పరవశలైన, సుందరీమణులయిన గోపికల యొక్క కోరికను తీర్చవలెనని నిశ్చయించుకొని ఆ గోపికలతో ముందుగా ప్రతికూలములుగా ఉన్నట్లున్న మాటలను పలికితివి.

**విశేషము:** వక్రోక్తి శృంగారోద్దీపన కనుక ముందుగా కృష్ణుడు ప్రతికూలముగా – పెడసరముగా గోపికలతో మాటలాడినాడని కవి హృదయం.

**66–2 శ్లో.**

**గగనగతం మునినివహం శ్రావయితుం జగిథ కులవధూధర్మమ్ ।**
**ధర్మ్యం ఖలు తే వచనం కర్మ తు నో నిర్మలస్య విశ్వాస్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** గగనగతం= ఆకాశమున ఉన్న(గచ్ఛంత్యస్మిన్ దేవాః పక్షిణశ్చ– ఇందులో పక్షులు, దేవతలు వెళ్లుదురు. ఆకాశము), మునినివహం= ముని సమూహములు (మనుతే జానాతి తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు), శ్రావయితుం= వినుటకై, కుల వధూ ధర్మమ్ = గృహిణీ ధర్మములు, జగిథ= ఆ గోపికలకు చెప్పితివి, తే= ఈశ్వరుడవయిన నీ, వచనం = మాటలు, ధర్మ్యం ఖలు= ధర్మమే.. (ధర్మేణ ప్రాప్యః – ధర్మాచరణముతో పొందబడునది. పుణ్యము శుభము), నిర్మలస్య= నిర్మలుడవు, నిర్గుణ పరబ్రహ్మమయిన నీ సందేశము, విశ్వాస్యమ్= నమ్మదగినది, కర్మ తు నో= నీ చేతలు నమ్మదగినవి కావు.

**తాత్పర్యము:** ఆకాశమున ఉన్న ముని సమూహములు వినుటకై గృహిణీ ధర్మములు ఆ గోపికలకు చెప్పితివి. ఈశ్వరుడవయిన నీ మాటలు ధర్మమే. నిర్మలుడవు, నిర్గుణ పరబ్రహ్మమయిన నీ సందేశము నమ్మదగినది. కాని నీ చేతలు నమ్మదగినవి కావు.

**విశేషము:** ఉపనయనము కాని కృష్ణుడు కులకాంతలతో కామోత్సవము చేయుట అధర్మము. అటువంటి అధర్మము చేసినవాడు కులస్త్రీల ధర్మములు చెప్పిన సందర్భములో మునులు వాటిని ఎలా నమ్మారు? అను సందేహము కలుగుతుందేమో అని తనను తాను ప్రశ్నించుకొని "ఈశ్వరుడవయిన నీ మాటలు ధర్మమే. నిర్మలుడవు, నిర్గుణ పరబ్రహ్మమయిన నీ సందేశము నమ్మదగినది. కాని నీ చేతలు నమ్మదగినవి కావు. " అని జవాబు ఈ శ్లోకంలో చెప్పాడు.

**66–3 శ్లో.**
**ఆకర్ణ్య తే ప్రతీపాం వాణీమేణీదృశః పరం దీనాః ।**
**మా మా కరుణాసింధో! పరిత్యజేత్యతిచిరం విలేపుస్తాః ॥**

**ప్రతిపదార్థము:** తే = నీ యొక్క, ప్రతీపాం= విరసములయిన (ప్రతికూలా ఆపః యస్మిన్ ప్రతికూలమైనది), వాణీమ్= మాటలను (వణ్యతే శబ్ద్యతే అనయా దీనితో మాట్లాడబడును. మాట), ఆకర్ణ్య = విని, తాః ఏణీదృశః = ఆ లేడి కన్నులవంటి కన్నులు కలిగిన ఆ గోపకాంతలు (ఏణీ= పెద్దకన్నులు గల నల్లలేడి), పరం దీనాః= మిక్కిలి వ్యధచెంది, కరుణాసింధో= ఓ దయా సముద్రుడా!, మా మా పరిత్యజ=

వద్దు వద్దు మమ్ము విడువకు, ఇతి= అని, అచిరం = చాలా సేపు, విలేపుః = నిన్ను ప్రార్థించారు.

**తాత్పర్యము:** నీ యొక్క విరసములయిన మాటలను విని లేడి కన్నులవంటి కన్నులు కలిగిన ఆ గోపకాంతలు మిక్కిలి వ్యధచెంది "ఓ దయా సముద్రుడా! వద్దు వద్దు మమ్ము విడువకు" అని చాలా సేపు నిన్ను ప్రార్థించారు.

**విశేషాలు**

**విరసములయిన మాటలు:** "ఇలా అర్థరాత్రి పూట మీ భర్తలను విడిచి ఇలా నాదగ్గరకు వచ్చుట తప్పు. కావున తిరిగి వెళ్ళిపొమ్మ"ని కృష్ణుడు గోపికలతో పలికిన విరసములయిన మాటలు.

**66-4 శ్లో.**
**తాసాం రుదితైర్లపితైః కరుణాకులమానసో మురారే త్వమ్ ।**
**తాభిః సమం ప్రవృత్తో యమునాపులినేషు కామమభిరంతుమ్ ॥**

**ప్రతిపదార్థము:** మురారే= శ్రీ కృష్ణా! (మురస్య అరిః-మురాసురుని శత్రువు. శ్రీకృష్ణుడు), తాసాం= వారియొక్క( గోపికల యొక్క), రుదితైః=రోదిస్తూ (రోదితి తస్య భావః కర్మ వా ఏడ్చుట, క్రందనము), లపితైః =పలికిన పలుకులకు(లపితః కథితః - చెప్పబడినది), కరుణా ఆకులమానసః =దయ తలచిన మనస్సుతో, త్వమ్= నువ్వు, తాభిః సమం ప్రవృత్తః= వారితో కలిసి, యమునా పులినేషు= యమునానది ఇసుక తిన్నెలపై(పులిన= పోలతి ఉచ్ఛ్రితో భవతి తోయోత్థిత తటమ్ ఎత్తుగా వున్న నదీతటము), కామమ్ = యథేచ్ఛగా(ఇష్టముచేత నంగీకరించడము), అభిరంతుమ్= క్రీడించుట ( రమించుట) ఆరంభించితివి.

**తాత్పర్యము:** ఓ మురారీ! గోపికలు రోదిస్తూ పలికిన పలుకులకు దయ తలచి, నువ్వు వారితో కలిసి యమునానది ఇసుక తిన్నెలపై యథేచ్ఛగా క్రీడించుట ఆరంభించితివి.

**66-5 శ్లో.**
**చంద్రకరస్యందలసత్ సుందరయమునాతటాంతవీథీషు ।**
**గోపీజనోత్తరీయైరాపాదితసంస్తరో న్యషీదస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** చంద్రకర= చంద్రుని అమృతకిరణములు (వెన్నెలలు) (చందతి ఆహ్లాదయతి ఆనందింపచేయువాడు. చంద్రుడు), స్యంద= ద్రవించి (ప్రసారముతో), లసత్ = ప్రకాశించు, సుందర = అందమయిన, యమునాతటాంత వీథీషు= ఆ యమునానదీ ఇసుకతీరములందు, గోపీజన ఉత్తరీయైః= గోపికలు పైటచెఱగులు పరచి (ఉత్తరే ఉపరి భవం ధార్యమాణం వస్త్రం – పైన కప్పుకొనునది. ఉత్తరీయము), ఆపాదిత= కలిగింపబడిన (ఏర్పాటు చేసిన), సంస్తరః = శయ్యలపై (సమ్యక్ సృతః రచితః – బాగా పరచపడినది. శయ్య, పడక), త్వమ్ = నువ్వు, న్యషీదః = ఆసీనుడవయ్యావు.

**తాత్పర్యము:** చంద్రుని అమృతకిరణములయిన వెన్నెలల ప్రసారముతో ప్రకాశించు అందమయిన ఆ యమునానదీ ఇసుకతీరములందు, గోపికలు పైటచెఱగులు పరచి ఏర్పాటు చేసిన శయ్యలపై నువ్వు ఆసీనుడవయ్యావు.

**66-6 శ్లో.**
**సుమధుర నర్మాలపనైః కరసంగ్రహణైశ్చ చుంబనోల్లాసైః ।**
**గాఢాలింగనసంగైస్త్వమంగనాలోకమాకులీ చకృషే ॥**

**ప్రతిపదార్థము:** సుమధుర = చెవులకు ఇంపుగొలుపు (అతిశయమధుర రసయుక్తము), నర్మ ఆలపనైః =క్రీడావచనములతో (ముద్దులొలుకు హాస్యములతో, సరససంభాషణలతో)( నయతి ఆనందమ్ ఆనందము నిచ్చునది. పరిహాసము), కరసంగ్రహణైః చ= చేయిచేయి పట్టుకొనుటలతో, చుంబన ఉల్లాసైః= ముద్దుల ఉల్లాసములతో (చుంబతి తస్య భావః – ముద్దు.) (ఉల్లసతి ప్రకాశతే ప్రకాశము ఆహ్లాదము గ్రంథ విభాగము), గాఢ ఆలింగన సంగైః= పాలు నీళ్లలా కలిసిన అంగ ప్రత్యంగముల గాఢపు కౌగిలింతల కలయికలతో (ఆలింగనం ఆశ్లేషణమ్ కౌగిలించుకొనుట.) (సంగ= సజతి మిలతి తస్య భావః కర్మ వా కలియునది

కూడుట మనస్సు యొక్క ఆసక్తి), త్వమ్= నువ్వు, అంగనాలోకమ్= ఆ గోపికలను(ప్రశస్తం అంగం అస్యాః – ప్రశస్తమైన అంగములు గలది. కామిని), ఆకులీ చక్రుషే= కరిగించి పరవశింపచేసావు.

**తాత్పర్యము:** చెవులకు ఇంపుగొలుపు సరససంభాషణలతో, చేయిచేయి పట్టుకొనుటలతో, ముద్దుల ఉల్లాసములతో, పాలు నీళ్లలా కలిసిన అంగ ప్రత్యంగముల గాఢపు కౌగిలింతలతో నువ్వు ఆ గోపికలను కరిగించి పరవశింప చేసావు.

**66–7 శ్లో.**
**వాసోహరణదినే యద్ వాసోహరణం ప్రతిశ్రుతం తాసామ్ ।**
**తదపి విభో రసవివశస్వాంతానాం కాంతసుభ్రువామదధాః ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ!, కాంత = ఓ మనోహరుడా! (కామ్యతే ఇతి. భర్త), వాసోహరణదినే = గిరిజార్చన సమాప్తి దినములో (కాత్యాయనీవ్రత ముగింపుదినమున) (వసతే అనేన శరీరమ్ దీనితో శరీరమును కప్పుకొందురు. వస్త్రము.)(హరణ=హరతి తస్య భావః కర్మ వా తీసుకపోవుట మోయుట మరొక ప్రదేశమునకు తీసుకొని వెళ్లుట దొంగిలించుట), యత్=ఏదయితే, తాసామ్= వారికి, ప్రతిశ్రుతం= ప్రతిజ్ఞాతమైన(అంగీకృతః ప్రతిధ్వనిః–అంగీకరింపబడినది ప్రతిజ్ఞ చేయబడినది అంగీకరింపబడినది), వాసోహరణం= మీ వలువలు హరింతునని(మానహరణం సేయుదునని) (వస్తే ఆచ్ఛాదయతి అనేన – దీనితో కప్పుకొందురు. వస్త్రము), తత్ అపి = ఇచ్చిన మాటను కూడా, రస వివశ స్వాంతానాం= రసముతో పరవశలైన మనస్సు కలిగిన, సుభ్రువామ్ = అందమయిన కన్నులు కలిగిన గోపికలకు, అదధాః= ఇప్పుడు చెల్లించితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ ప్రభూ! ఓ మనోహరుడా! కాత్యాయనీవ్రత ముగింపు సమయములో – గోపికల వలువలు హరింతునని ఇచ్చిన మాటను – ఆ గోపికల నితంబ దేశములో వస్త్రాపహరణము చేసి – ఇప్పుడు యమునా తీరములో నిలబెట్టుకొన్నావు.

**66-8 శ్లో.**

**కందళితఘర్మలేశం కుందమృదుస్మేరవక్త్రపాథోజమ్ ।**

**నందసుత! త్వాం త్రిజగత్ సుందరముపగూహ్య నందితా బాలాః ॥**

**ప్రతిపదార్థము:** నందసుత= నందుని పుత్రుడవైన శ్రీహరీ!, కందళిత = అంకురించిన, ఘర్మ లేశం= చిరుచెమట్లతో(ఘరతి క్షరతి అంగాత్ అంగముల నుండి కారునది. చెమట), కుంద = మల్లెమొగ్గలు తొడిగినట్లున్న (కుం భూమిం దృతి ఖండయతి భూమిని చీల్చుకొని పుట్టునది. అడవిమల్లె), మృదుస్మేరవక్త్ర పాథోజమ్ =చిఱునగవులు నిండిన ముఖకమలముతో(పాథసి జలే జాయతే నీటిలో పుట్టునది. కమలము), త్రిజగత్ సుందరమ్= త్రిలోకసుందరుడవు అగు, త్వాం = నిన్ను, ఉపగూహ్య = కౌగిటిలో చేర్చి(ఉపగూహితుం యోగ్యః ఆలింగనము చేయుటకు తగినవాడు), బాలాః= ఆ గోపికలు, నందితాః= ఆనందించిరి.

**తాత్పర్యము:** నందుని పుత్రుడవైన శ్రీహరీ! అంకురించిన చిరుచెమట్లతో మల్లెమొగ్గలు తొడిగినట్లున్న చిఱునగవులు నిండిన ముఖకమలముతో త్రిలోక సుందరుడవు అగు నిన్ను కౌగిటిలో చేర్చి ఆ గోపికలు ఆనందించిరి.

**66-9 శ్లో.**

**విరహేష్వంగారమయః శృంగారమయశ్చ సంగమే హి త్వమ్ ।**

**నితరామంగారమయస్తత్ర పునః సంగమేఽపి చిత్రమిదమ్ ॥**

**ప్రతిపదార్థము:** విరహేషు = నీ భక్తులు నిన్నుదర్శించుకొనలేని విరహ సమయములో, అంగారమయః= అంగారమయుడవు (నిప్పు కణిక వలె తాపము కలిగించి దహిస్తావని భావం) (అగి గతౌ మంట, వన్నె మొదలైన వానిచే వ్యాపించునది), సంగమే హి= సంగమ సమయములో, త్వమ్= నువ్వు, శృంగారమయః చ = శృంగారమయుడవు. (శృంగార రసోచితమైన భాషా వేష వ్యాపారుడవు), సంగమే అపి= కూడినప్పుడు కూడ (సం సహ గమనమ్ కలయిక), తత్ర= అక్కడ, పునః = మరలా, నితరామ్ = ఎల్లప్పుడు. (నితరాం అతిశయం సర్వదా మిక్కిలి ఎల్లప్పుడు), అంగారమయః= నిప్పుకణము లాంటివాడివి, ఇదమ్=ఇది, చిత్రమ్ = చిత్రము.

**తాత్పర్యము:** నీ భక్తులు నిన్నుదర్శించుకొన లేని విరహ సమయములో అంగారమయుడవు (నిప్పు కణిక వలె తాపము కలిగించి దహిస్తావని భావం) సంగమ సమయములో నువ్వు శృంగారమయుడవు. (శృంగార రసోచితమైన భాషా వేష వ్యాపారుడవు) కాని గోపికల సంగమ సమయంలో నువ్వు అంగారమయుడవు.(నిప్పుకణము లాంటివాడివయ్యావు..) ఇది చిత్రము. (అంగ అరమయ అని పదాలను విడగొట్టు కోవాలి.అంగ = ఓ ప్రియమైన కృష్ణా! అరమయః = రమింపచేసితివి అని అర్థం చెప్పుకొంటే అంగారమయపదంలోని విరోధము తొలగిపోతుంది).

**66-10 శ్లో.**

**రాధాతుంగపయోధరసాధుపరీరంభలోలుపాత్మానమ్ ।**
**ఆరాధయే భవంతం పవనపురాధీశ! శమయ సకలగదాన్ ॥**

**ప్రతిపదార్థము:** రాధా= రాధాదేవి యొక్క (రాధ్నోతి సాధయతి కార్యాణి కార్యములను సాధించునది. రాధ), తుంగ = ఎత్తైన, పయోధర= స్తనములను(పయం దుగ్ధం దధాతి పాలను ధరించునది. స్తనము), సాధు= చక్కగా, పరీరంభ= కౌగిలించుకొను, లోలుప= ఆసక్తి కలిగిన(గర్ధితుం లుంపతి అతిశయమైన ఆశ కలవాడు. ఆశ గలవాడు), ఆత్మానమ్= మనస్సు కలవాడా!, భవంతం= నిన్ను, ఆరాధయే= ఆరాధిస్తాను, పవనపురాధీశ= ఓ గురువాయూరు దేవా!, సకలగదాన్= సమస్త రోగములను, శమయ= తొలగించుము.

**తాత్పర్యము:** రాధాదేవి యొక్క ఎత్తైన స్తనములను చక్కగా కౌగిలించుకొనుటలో ఆసక్తి కలిగిన మనస్సు కలవాడా! నిన్ను ఆరాధిస్తాను. ఓ గురువాయూరు దేవా ! నా సమస్త రోగములను తొలగించుము.

**విశేషాలు**

**రాధ:** గోలోకంలో రమణీ రూపంలో ఆవిర్భవించిన పరమేశ్వరార్ధాంగ స్వరూప శక్తి.

వృష భానుడి పుత్రిక.

శ్రీకృష్ణునికి ప్రియురాలు. నందుని చెల్లెలు

**రాసక్రీడ:** శ్రీకృష్ణుడు గోపికలతో కలసి క్రీడ జరపడం రాసగా, రాసక్రీడగా, రాసలీలగా భాగవతం, విష్ణు, బ్రహ్మ, బ్రహ్మవైవర్త, పద్మాది పురాణాలలో వర్ణనలు కనిపిస్తాయి. పంచభూతాలైన పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం ప్రతి జీవికీ అందుబాటులో ఉండి, అందరికీ ఎలా అనుభవయోగ్యాలైనాయో శ్రీకృష్ణుడూ అలాగే గోపికలందరికీ లభ్యమైనవాడు. కృష్ణుడు ఒక్కడే, కాని గోపికలు పలువురు. ఐనా, కృష్ణుడు ప్రతి గోపికతోనూ ఉంటాడు. సమస్త జీవ గణంలో శ్రీకృష్ణుడు వ్యాపకుడు. అతడు ఆత్మ స్వరూపుడు కనుక అందరిలోనూ ఉన్నవాడు. ఆత్మ సమస్త ప్రాణిగతమైనట్లు శ్రీకృష్ణుడూ అందరిలోని వాడు. భారతంలోని కృష్ణపాత్రకూ, భాగవతంలోని కృష్ణపాత్రకూ తేడా ఉంది. భాగవతంలో దశమ స్కంధం 29 వ అధ్యాయం నుంచి 33వ అధ్యాయం వరకు, అంటే ఐదు అధ్యాయాలు పూర్తిగా రాసక్రీడకు సంబంధించినవే. వీటిని రాస పంచాధ్యాయి అంటారు. పేరుకు శృంగారమైనప్పటికీ విషయ సుఖ నివృత్తి సందేశం ఇందులో ఉన్నదని పెద్దలమాట.

***దశమ స్కంధము***

**66వ దశకము సమాప్తము**

## దశకమ్ 67 – శ్రీకృష్ణతిరోధానం గోపికా ప్రీణనము

**67–1 శ్లో.**

**స్ఫురత్పరానందరసాత్మకేన త్వయా సమాసాదితభోగలీలాః ।**
**అసీమమానందభరం ప్రపన్నాః మహాంతమాపుర్మదమంబుజాక్ష్యః ॥**

**ప్రతిపదార్థము:** స్ఫురత్= స్వప్రకాశ, పరానంద= పరమానందరూపుడివి, రస ఆత్మకేన = రసాత్మకుడవైన (రస్యతే ఆస్వాద్యతే ఆస్వాదింపబడునది. రసము), త్వయా= నీతో, సమాసాదిత= ప్రాప్తమైన (పొందిన)(సమ్యక్ ఆసాదితః ప్రాప్తః ఆపన్నో వా పొందబడ్డది దగ్గర వున్నది సమీపము), భోగలీలాః= రతిక్రీడల వలన (భుజ్యతే తస్య భావః–అనుభవము), అసీమమ్ = అవధిలేని, ఆనందభరం= ఆనంద రసమును(బ్రహ్మానందమును), ప్రపన్నాః = పొంది(ప్రపన్నః శరణాగతః సుసజ్జితః ప్రాప్తః – శరణు కోరినవాడు అలంకరింపబడినవాడు పొందబడినది), మహాంతమ్ = చాలా, మదమ్ = గర్వమును (మాదయతి మాద్యతి అనేన – దీనితో ఆనందింతురు, మత్తును పొందుదురు. అహంకారము), అంబుజ అక్ష్యః= ఆ పద్మము వంటి కన్నులు కలిగిన గోపికలు, ఆపుః= పొందిరి.

**తాత్పర్యము:** స్వప్రకాశ పరమానందరూప రసాత్మకుడవైన నీతో పొందిన రతిక్రీడల వలన అవధిలేని ఆనంద రసమును( బ్రహ్మానందమును)పొంది చాలా గర్వమును ఆ పద్మము వంటి కన్నులు కలిగిన గోపికలు పొందిరి.

**విశేషాలు**

**రస :** ఎక్కువ అభిలాష. ఆస్వాదించటం. ఆనంద స్వరూపమైన పరమాత్మకు కూడా రసమనే పేరు. 'రసోవైసః' ఆయన ఆడే జగన్నాటకమంతా రాసక్రీడ క్రిందికి వస్తుంది.

**67–2 శ్లో.**

**నిలీయతేఽసౌ మయి మయ్యమాయం రమాపతిర్విశ్వమనోఽభిరామః ।**
**ఇతి స్మ సర్వాః కలితాభిమానాః నిరీక్ష్య గోవింద! తిరోహితోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** గోవింద = ఓ గోవిందుడా! (గాం పృథివీం ధేనుం వాణీం వా విందతి భూమిని, ఆవును సంతోషింప చేయువాడు. శ్రీకృష్ణుడు వాక్కును సంతోషింప చేయువాడు), అసౌ రమాపతిః = ఈ కృష్ణుడు (రమాయాః లక్ష్మ్యాః పతిః-రమ యొక్క పతి. విష్ణువు), మయి= నాయందే(లీనుడైనాడు), విశ్వ మన అభిరామః= ఈ విశ్వమోహనుడు, మయి = నాయందే, అమాయం= నిర్వ్యాజముగా (కారణరహితముగా), నిలీయతే= ఆసక్తి కలిగినవాడయ్యాడు, ఇతి స్మ సర్వాః= ఈ విధముగా, ఆ గోప భామినులు - ప్రతి ఒక్కరూ, కలిత అభిమానాః= తమ సౌభాగ్యమునకు గర్వింపగా, నిరీక్ష్య = ఆ పరిస్థితిని గమనించి దానిని పోగొట్టుటకు, తిరోహితః అభూః= బృందావనమునందు అంతర్ధానమైతివి.

**తాత్పర్యము:** ఓ గోవిందుడా! "ఈ కృష్ణుడు నాయందే లీనుడైనాడు... కాదు ఈ విశ్వమోహనుడు నిర్వ్యాజముగా ఆసక్తి కలిగినవాడయి నాయందే లీనమయ్యాడు". ఈ విధముగా ఆ గోప భామినులు - ప్రతి ఒక్కరూ - తమ సౌభాగ్యమునకు గర్వింపగా ఆ పరిస్థితిని గమనించి దానిని పోగొట్టుటకు బృందావనమునందు అంతర్ధానమైతివి.

**67-3 శ్లో.**

**రాధాభిధాం తావదజాతగర్వామతిప్రియాం గోపవధూం మురారే! ।**
**భవానుపాదాయ గతో విదూరం తయా సహ స్వైరవిహారకారీ ॥**

**ప్రతిపదార్థము:** మురారే = ఓ మురారీ ! (మురస్య అరిః - మురాసురుని శత్రువు. శ్రీకృష్ణుడు), తావత్= అంతయు(ఆ గోపకాంతల అందరిలోను), అజాతగర్వామ్= గర్వమన్నదే పుట్టని, అతిప్రియాం = అత్యంత ప్రీతి కలిగిన, రాధా అభిధాం= రాధ అను పేరుగల (అభిధీయతే అనేన-పేరు), గోపవధూం= గోప స్త్రీని, భవాన్= నువ్వు, ఉపాదాయ = స్వీకరించి, విదూరం గతః = చాలా దూరము పోయి (విశిష్టం దూరం, విశేషేణ దూరః - చాలా దూరము), తయా సహ= ఆమెతో కలిసి, స్వైర విహార కారీ= స్వేచ్ఛా విహారములు చేసావు.( స్వస్య ఈరం స్వేర స్వాతంత్ర్యేణ ఈర్తే స్వతంత్రంగా ప్రవర్తించువాడు).

**తాత్పర్యము:** ఓ మురారీ! ఆ గోపకాంతలందరిలోను గర్వమన్నదే పుట్టని, అత్యంత

ప్రీతి కలిగిన రాధ అను పేరుగల గోప స్త్రీని నువ్వు స్వీకరించి చాలా దూరము పోయి ఆమెతో కలిసి స్వేచ్ఛా విహారములు చేసావు.

**విశేషము:** గర్వము లేని కారణమున రాధాదేవిని కృష్ణుడు స్వీకరించాడని "అజాతగర్వామ్" అను అను సమాసములో కవి హృదయం.

**67-4 శ్లో.**
**తిరోహితేఽథ త్వయి జాతతాపాః సమం సమేతాః కమలాయతాక్ష్యః ।**
**వనే వనే త్వాం పరిమార్గయంత్యో విషాదమాపుర్భగవన్నపారమ్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్= ఓ భగవంతుడా! గురువాయూరు దేవా! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య-ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), అథ= అటుపిమ్మట, త్వయి= నువ్వు, తిరోహితే= కనబడకపోవుటచే(అంతర్హితః ఆచ్ఛాదితః - కప్పబడినది మాయమైనది), జాత తాపాః=విరహ తాపమునకు గురయిరి, కమల -ఆయత అక్ష్యః = పద్మముల వంటి విశాలమైన కన్నులు కలిగిన ఆ గోపికలు (కం జలం అలతి భూషయతి నీటిని అలంకరించునది. కమలము) (ఆయతః దీర్ఘః - పొడవు, దీర్ఘము వెడల్పు)(అక్షతి వ్యాప్నోతి- దూరముగా వ్యాపించునది. కన్ను), సమం సమేతాః= అందరు కలిసి, వనే వనే = ప్రతి వనములోనూ, త్వాం = నిన్ను, పరిమార్గయంత్యః = వెతుకుచు తిరుగుచూ నీదర్శనము కలుగనందువలన(పరిమృగ్యతే అన్విష్యతే తస్య భావః కర్మ వా వెదకుట), అపారమ్ = అంతులేని(ఉత్తరో అవధి పారః తన్నాస్తి యస్య-హద్దు లేనిది), విషాదమ్ ఆపుః = దుఃఖమును పొందిరి. (విశేషేణ సీదతి దుఃఖీభవతి తస్య భావః - విషాదము, దుఃఖము).

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! గురువాయూరు దేవా! అటుపిమ్మట నువ్వు కనబడకపోవుటచే విరహ తాపమునకు గురయిరి. పద్మముల వంటి కన్నులు కలిగిన ఆ గోపికలు అందరు కలిసి ప్రతి వనములోనూ నిన్ను వెతుకుచూ, తిరుగుచూ నీదర్శనము కలుగనందువలన శ్రీ కృష్ణ దర్శనము ఎట్లు కలుగునని అంతులేని దుఃఖమును పొందిరి.

**67–5 శ్లో.**

**హా చూత! హా చంపక! కర్ణికార! హా మల్లికే! మాలతి! బాలవల్ల్యః ।**
**కిం వీక్షితో నో హృదయైకచోర ఇత్యాది తాస్త్వత్ప్రవణా విలేపుః ॥**

**ప్రతిపదార్థము:** హా చూత= ఓ! చూత (మామిడి) వృక్షమా!(చూష్యతే పీయతే అసౌ తాగబడునది. మామిడిచెట్టు), హా చంపక= ఓచంపకమా! (సంపెంగ వృక్షమా!)(చంపతి సుగంధం గచ్ఛతి సుగంధమును వెదజల్లునది. చంపకము), కర్ణికార = ఓ కర్ణికారమ!(పచ్చగన్నేరు వృక్షమా!) (కర్ణికాం పద్మబీజకోశం ఋచ్ఛతి ప్రాప్నోతి పద్మబీజకోశము కలది. గన్నేరు వృక్షము), హా మల్లికే మాలతి బాలవల్ల్యః = ఓ మల్లికా – మాలతీ తీగలారా! (మల్ల్యతే ధార్యతే శిరసి శిరస్సునందు ధరించునది. మల్లెపూవు.)(మలతే శోభాం ధరతి అందము నిచ్చునది, అందము ధరించునది. మాలతీలత)(వల్లతే సంవృణోతి వృక్షాదీన్ వృక్షాదులను కప్పునది. తీగ), నః = మా యొక్క, హృదయ ఏక చోర= హృదయచోరుని, కిం వీక్షితః = ఎక్కడైనా చూసారా?, ఇతి ఆది= ఈ విధముగా, త్వత్ ప్రవణాః= నీయందే మనస్సులను నిలిపిన, తాః విలేపుః= ఆ గోప కన్యలు ప్రతి చెట్టును – తీగను అడుగుచు, తిరుగుచూ వలపుతో విలపించారు.

**తాత్పర్యము:** ఓ చూత (మామిడి) వృక్షమా! ఓచంపకమా! (సంపెంగ వృక్షమా!) ఓ కర్ణికారమ! (పచ్చగన్నేరు వృక్షమా!) ఓ మల్లికా – మాలతీ తీగలారా! మా యొక్క హృదయచోరుని ఎక్కడైనా చూసారా? ఈ విధముగా నీయందే మనస్సులను నిలిపిన ఆ గోప కన్యలు ప్రతి చెట్టును – తీగను అడుగుచు, తిరుగుచూ వలపుతో విలపించారు.

**67–6 శ్లో.**

**నిరీక్షితోఽయం సఖి! పంకజాక్షః పురో మమేత్యాకులమాలపంతీ ।**
**త్వాం భావనా చక్షుషి వీక్ష్య కాచిత్ తాపం సఖీనాం ద్విగుణీచకార ॥**

**ప్రతిపదార్థము:** సఖి= ఓ చెలీ! (సహ సమానం ఖ్యాయతే సమానంగా చెప్పబడువాడు. చెలికాడు, స్నేహితుడు), అయం పంకజాక్షః= ఈ పద్మనేత్రుడగు

కృష్ణుని, మమ పురః = నా ఎదుట(పూర్వస్యాం దిశి అగ్రతః ముందు ఎదుట), నిరీక్షితః = చూచితిని, ఇతి= అని, త్వాం= నిన్ను, భావనా చక్షుషి= భావనాదృష్టితో(ఊహామార్గములో) (భావయతి చింతయతి తస్య భావః ఆలోచన), వీక్ష్య= నిన్నుచూసి, ఆకులమ్ = వ్యాకులపాటుతో (అత్యంతం క్షుబ్ధః అసంగతశ్చ – క్షోభ చెందినవాడు అసంగతుడు), కాచిత్= ఒక గోపిక, ఆలపంతీ = పలుకగా, సఖీనాం = అది విన్న గోపికలలో, తాపం= తాపము (తపతి అసౌ తపించునది. సంతాపము), ద్విగుణీ చకార= రెట్టింపు అయ్యెను.

**తాత్పర్యము:** "ఓ చెలీ! ఈ పద్మనేత్రుడగు కృష్ణుని నా ఎదుట చూచితిని." అని నిన్ను భావనాదృష్టితో నిన్నుచూసి వ్యాకులపాటుతో ఒక గోపిక పలుకగా అది విన్న గోపికలలో తాపము రెట్టింపు అయ్యెను.

**67–7 శ్లో.**

**త్వదాత్మికాస్తా యమునాతటాంతే తవానుచక్రుః కిల చేష్టితాని ।**
**విచిత్య భూయోఽపి తథైవ మానాత్ త్వయా వియుక్తాం దదృశుశ్చ రాధామ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ = నీయొక్క, తాః ఆత్మికాః= భావనాబలముచే నీ ధ్యానసమాధి సిద్ధించి నీతో తాదాత్మ్యము పొందిన ఆ గోపికలు, యమునాతట అంతే= యమునాతీరమందు, తవ చేష్టితాని = నీచేష్టలను (పూతన యొక్క అనుగ్రహము మొదలయిన విలాసములను), అనుచక్రుః కిల=అనుకరింపసాగిరి కదా!, తథా ఏవ=అట్లే, భూయః అపి= మరలా, విచిత్య= అన్వేషించి, మానాత్ = నేను కృష్ణునకు ఎక్కువ యిష్టురాలనను స్వాభిమానముచే, త్వయా వియుక్తాం= నీ ఎడబాటు పొందిన, రాధామ్ = రాధను, దదృశుః =గోపికలు దర్శించారు.

**తాత్పర్యము:** నీయొక్క భావనాబలముచే నీ ధ్యానసమాధి సిద్ధించి నీతో తాదాత్మ్యము పొందిన ఆ గోపికలు యమునాతీరమందు నీచేష్టలను (పూతన యొక్క అనుగ్రహము మొదలయిన విలాసములను) అనుకరింపసాగిరి కదా! అట్లే మరలా అన్వేషించి "నేను కృష్ణునకు ఎక్కువ యిష్టురాల"నను స్వాభిమానముచే నీ ఎడబాటు పొందిన రాధను గోపికలు దర్శించారు.

**67–8 శ్లో.**

**తతః సమం తా విపినే సమంతాత్ తమోఽవతారావధి మార్గయంత్యః ।**
**పునర్విమిశ్రా యమునాతటాంతే భృశం విలేపుశ్చ జగుర్గుణాంస్తే ॥**

**ప్రతిపదార్థము:** తతః= ఆ తరువాత, సమం= ఆ రాధతో కలిసి (సహితమ్ కూడుకున్న), తాః = ఆ గోపికలు, విపినే = అడవిలో (వేపనే బిభ్యతి జనాః అత్ర– జనులు ఇచట భయపడుదురు. అడవి), సమంతాత్ = చుట్టు పక్కల(సమంతతః– నలువైపుల అంతట), తమోవతార అవధి= చీకట్లు తొలగు పర్యంతము (చంద్రాస్తమ పర్యంతము),మార్గయంత్యః =వెదికిరి, పునః=నిన్నుకనుగొనజాలక మరలా, యమునా తట —అంతే= యమునానదీతీరమునకు తిరిగి వచ్చి, విమిశ్రాః = గుమిగూడి(విశేషేణ మిశ్రితం సంపృక్తమ్ కలుపబడినది), భృశం విలేపుః= అధికముగా నీ ప్రార్థనలతో నువ్వు కనబడాలని దుఃఖించిరి, తే= నీ, గుణాన్ చ= గుణములను (గుణ్యంతే ప్రశస్యంతే ఇతి గుణాః–పొగడబడునది. సద్గుణము), జగుః= కీర్తించిరి.

**తాత్పర్యము:** ఆ తరువాత ఆ రాధతో కలిసి ఆ గోపికలు అడవిలో చుట్టు పక్కల చీకట్లు తొలగు పర్యంతము (చంద్రాస్తమ పర్యంతము) నీ కొరకు వెదికిరి. నిన్ను కనుగొనజాలక మరలా యమునానదీతీరమునకు తిరిగి వచ్చి గుమిగూడి అధికముగా నీ ప్రార్థనలతో నువ్వు కనబడాలని దుఃఖించిరి. నీ గుణములను కీర్తించిరి.

**67–9 శ్లో.**

**తథావ్యథాసంకులమానసానాం వ్రజాంగనానాం కరుణైకసింధో ।**
**జగత్త్రయీమోహనమోహనాత్మా త్వం ప్రాదురాసీరయి మందహాసీ ॥**

**ప్రతిపదార్థము:** అయి కరుణైకసింధో =ఓ దయా సముద్రుడా!, తథా=అట్లు, వ్యథా సంకుల = బాధపడిన( వ్యథతే తస్య భావః కర్మ వా వ్యథ బాధ దుఃఖము – (సంకులః ఆకీర్ణః అవ్యవస్థితః అవ్యవస్థితమైనది ),మానసానాం =మనస్సు కలవారయిన(మన ఏవ మానసమ్ మనస్సు), వ్రజ–అంగనానాం= గోపికల ఎదుట(వ్రజంతి జనాః

అస్మిన్, జనపద విశేషః – వ్రజ జనపదము. మథురా–వృందావన ప్రదేశము), జగత్ త్రయీ మోహనః = మూడులోకములను మోహపరవశులనుచేయు, మోహన ఆత్మా = మోహన రూపములో(మోహయతి మోహింప చేయువాడు), త్వం = నువ్వు, మందహాసీ= చిరునవ్వుతో, ప్రాదుః ఆసీః = వారి ఎదుట కనిపించితివి.

**తాత్పర్యము:** ఓ దయా సముద్రుడా! అట్లు బాధపడిన మనస్సు కలవారయిన గోపికల ఎదుట మూడులోకములను మోహపరవశులనుచేయు మోహన రూపములో నువ్వు చిరునవ్వుతో వారి ఎదుట కనిపించితివి.

**67–10 శ్లో.**
**సందిగ్ధసందర్శనమాత్మకాంతం త్వాం వీక్ష్య తన్వ్యః సహసా తదానీమ్ ।**
**కింకిం న చక్రుః ప్రమదాతిభారాత్ స త్వం గదాత్ పాలయ మారుతేశ ॥**

**ప్రతిపదార్థము:** సందిగ్ధ సందర్శనమ్ = నీ సందర్శనము పట్ల సందిగ్ధముగా ఉన్న సందర్భములో(జాత సందేహః – సందేహము కల్గినది. సందిగ్ధమైనది.) (సమ్యక్ప్రకారేణ దర్శనమ్), ఆత్మకాంతం=ఆత్మవల్లభుని (అతతి నిరంతరం కర్మఫలాని ప్రాప్నోతి నిరంతరము కర్మఫలములను పొందునది. ఆత్మ శరీరము మనస్సు బుద్ధి)(కామ్యతే ఇతి కోరబడునది. మనోహరమైనది. భర్త), త్వాం = నిన్ను, వీక్ష్య = చూసి, తన్వ్యః = ఆ గోపికలు (తనుః అల్పా కృశాంగీ కృశించిన అంగములు గలది. స్త్రీ ఒక లత), తదానీమ్= అప్పుడు(తస్మిన్కాలే అపుడు ఆ సమయమున), ప్రమద అతి భారాత్= హర్షావేశముతో (ప్రకృష్టః మదః హర్షో వా యస్య–ఉన్మాదము హర్షము, సంతోషము), సహసా= వెంటనే (హఠాత్, అకస్మాత్ ఒక్కసారిగా హఠాత్తుగా తొందరగా బలవంతంగా), కింకిం = ఏమి ఏమి, న చక్రుః= చేయలేదు (ఎన్నో అనిర్వచనీయములయిన చేష్టలు చేసారని భావం), స త్వం= అటువంటి గోపికల చేష్టలకు నిలయమైన, మారుతేశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, గదాత్ = రోగములనుండి, పాలయ = నన్ను రక్షింపుము.

**తాత్పర్యము:** నీ సందర్శనము పట్ల సందిగ్ధముగా ఉన్న సందర్భములో ఆత్మవల్లభుడవైన నిన్ను చూసి ఆ గోపికలు అప్పుడు హర్షావేశముతో వెంటనే ఏమి ఏమి చేయలేదు? (ఎన్నో అనిర్వచనీయములయిన చేష్టలు చేసారని భావం) అటువంటి గోపికల చేష్టలకు నిలయమైన ఓ గురువాయూరు కృష్ణ దేవా! రోగములనుండి నన్ను రక్షింపుము

**విశేషాలు:** కృష్ణ విరహంలో ఉన్న గోపికలకు కృశించిన అంగములు గలవారు అను అర్థము కలిగిన "తన్వ్యః" అను పద ప్రయోగము సముచితమైనది.

***దశమ స్కంధము***

**67వ దశకము సమాప్తము**



# దశకమ్ 68 – గోపికాహ్లాదప్రకటనము

**68–1 శ్లో.**
**తవ విలోకనాద్ గోపికాజనాః**
**ప్రమదసంకులాః పంకజేక్షణ ।**
**అమృతధారయా సంప్లుతా ఇవ**
**స్తిమితతాం దధుస్త్వత్పురో గతాః ॥**

**ప్రతిపదార్థము:** పంకజ ఈక్షణ =కమలములవంటి కన్నులు కలవాడా ! (పంకే జాయతే బురదలో పుట్టునది. కమలము)(ఈక్షతే అనేన–దీనితో చూచుదురు. నేత్రము), తవ విలోకనాత్ = నీవు అట్లు తిరిగి కనిపించగనే, గోపికా జనాః = గోప స్త్రీలు, ప్రమద సంకులాః = బాగా ఆనందపడిరి.(ప్రకృష్టః మదః హర్షో వా యస్య– ఉన్మాదము హర్షము, సంతోషము), అమృత ధారయా= అమృతధారలలో, సంప్లుతా ఇవ= మునిగితేలినట్లుగా, స్తిమితతాం= నిశ్చలత్వమును (మానసిక స్థిరత్వమును)(ఆర్ద్రీకృతః అచలశ్చ–తడుపబడ్డది కదలనిది), దధుః= పొంది, త్వత్ = నీ, పురో గతాః= ముందు నిలిచిరి.

**తాత్పర్యము:** కమలములవంటి కన్నులు కలవాడా! నీవు అట్లు తిరిగి కనిపించగనే గోప స్త్రీలు బాగా ఆనందపడిరి. అమృతధారలలో మునిగితేలినట్లుగా నిశ్చలత్వమును ( మానసిక స్థిరత్వమును) పొంది నీ ముందు నిలిచిరి.

**68–2 శ్లో.**
**తదను కాచన త్వత్కరాంబుజం సపది గృహ్ణతీ నిర్విశంకితమ్ ।**
**ఘనపయోధరే సంనిధాయ సా పులకసంవృతా తస్థుషీ చిరమ్ ॥**

**ప్రతిపదార్థము:** తదను= అప్పుడు, కాచన = విరహతాపముచే వివశయైన ఒక గోపిక, నిర్విశంకితమ్= నిస్సంకోచముగా(ఇతరులు చూస్తున్నారని బిడియ పడక), సపది= వెంటనే( నిన్ను చూసిన వెంటనే), త్వత్ కర అంబుజం=నీ చేయి అను పద్మమును, ఘన పయోధరే= తన ఎత్తయిన స్తనాగ్రముపై (పయం దుగ్ధం

దధాతి పాలను ధరించునది. స్తనము), సంనిధాయ = ఉంచుకొని, సా= ఆమె, పులక సంవృతా= పులకరించిన శరీరము కలదై(పోలయంతి రోమాణి అత్ర– వెంట్రుకలు నిక్కపొడుచును. రోమాంచము), చిరమ్= చాలాసమయము, తస్థుషీ= నిలచిపోయెను.

**తాత్పర్యము:** అప్పుడు విరహతాపముచే వివశయైన ఒక గోపిక నిస్సంకోచముగా వెంటనే నీ చేయి అను పద్మమును తన స్తనాగ్రముపై ఉంచుకొని ఆమె పులకరించిన శరీరము కలదై చాలాసమయము నిలచిపోయెను. (ఇది హ్రీ త్యాగము అను మన్మథ దశావిశేషము).

**68–3 శ్లో.**

**తవ విభోఽపరాకోమలం భుజం నిజగలాంతరే పర్యవేష్టయత్ ।**
**గలసముద్ గతం ప్రాణమారుతం ప్రతినిరుంధతీవాతిహర్షులా ॥**

**ప్రతిపదార్థము:** విభో= ప్రభూ!( విశేషేణ భవతి సర్వగతః–విశేషంగా ఉండువాడు అంతట ఉండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), అపరా= మరియొక గోపవనిత, తవ= నీయొక్క, కోమలం భుజం= సున్నితమయిన చేతిని తీసుకొని, అతిహర్షులా= బాగా సంతోషించి, గల సముద్ గతం= నీ వియోగదుఃఖముచే కంఠము నుండి బయటికి వెడలుచున్న, ప్రాణ మారుతం= ప్రాణమును (ప్రాణితి జీవతి అనేన– దీనితో జీవింతురు. ప్రాణవాయువు), ప్రతినిరుంధతి ఇవ= అదిమిపట్టుకొన్నట్లుగా, నిజ గల అంతరే = తనకంఠమునకు (గాలయతి ఆస్వాద్యతే భోజనాదికమ్ ఆస్వాదించునది. కంఠము), పర్యవేష్టయత్ = చుట్టుకొనెను,

**తాత్పర్యము:** ప్రభూ! మరియొక గోపవనిత నీయొక్క సున్నితమయిన చేతిని తీసుకొని బాగా సంతోషించి నీ వియోగదుఃఖముచే బయటికి వెడలుచున్న ప్రాణమును అదిమిపట్టుకొన్నట్లుగా తనకంఠమునకు చుట్టుకొనెను.

**విశేషము:** కృష్ణుని చేతిని తనకంఠమునకు చుట్టుకొని గట్టిగా బంధించుట వలన – గోపిక ప్రాణాయామ రూపములో సమాధి సుఖము అనుభవించుచున్నట్లున్నదని మరియొక అర్థము.

**ప్రాణ:** ప్ర+అన. జీవం ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానాలని ఇవి ఐదు విధాలు. వీటికే పంచ ప్రాణాలని పేరు 1. ప్రాణము (హృదయమున నుండునది), 2. అపానము (గుదమున నుండునది), 3. సమానము (నాభి మండలమున నుండునది), 4. ఉదానము (కంఠమున నుండునది), 5. వ్యానము (శరీరమంతటా వ్యాపించి యుండునది).

"ప్రాణోఽపానః సమానశ్చోదాన వ్యానే చ వాయవః శరీరస్థా ఇమే" (అమరకోశము 1-1-64)

**68-4 శ్లో.**

**అపగతత్రపా కాపి కామినీ తవ ముఖాంబుజాత్ పూగచర్వితమ్ ।**
**ప్రతిగృహయ్య తద్ వక్త్రపంకజే నిదధతీ గతా పూర్ణకామతామ్ ॥**

**ప్రతిపదార్థము:** కాపి =వేరొక, కామినీ= గోపిక (ప్రియసంగమమునందు మిక్కిలి యాసగలయాడుది), అపగత త్రపా = సిగ్గు విడిచి (అప దూరం గతః- పారిపోయిన) ( త్రపతే లజ్జతే తస్య భావః-సిగ్గు), తవ ముఖ అంబుజాత్= నీ ముఖ పద్మములో(ఖనతి అన్నాదికమనేన-దీనితో అన్నాదులు నమలుదురు), పూగచర్వితమ్= నువ్వు నమలుచున్న తాంబూలమును (పూయతే ముఖం అనేన- దీనితో ముఖము పవిత్రమగును. పోక.)(చర్వితః ఖాదితః-తినబడినది), ప్రతిగృహయ్య= స్వీకరించి, తత్ = దానిని(ఆ తాంబూలమును), వక్త్ర పంకజే = తన ముఖ పద్మములో, నిదధతీ = ఉంచుకొని ఆస్వాదించెను, పూర్ణ కామతామ్= తనకోరిక పూర్తిగా నెరవేరిన ఆనందమును (జీవన సాఫల్యమును), గతా =పొందెను.

**తాత్పర్యము:** వేరొక గోపిక సిగ్గు విడిచి నీ ముఖ పద్మములో నువ్వు నమలుచున్న తాంబూలమును స్వీకరించి దానిని తన ముఖ పద్మములో ఉంచుకొని ఆస్వాదించెను. తనకోరిక పూర్తిగా నెరవేరిన ఆనందమును పొందెను.

**విశేషము**

**కామ:** కోరిక. కోరబడ్డ పదార్థంకూడా కామము. అవిద్యా కామకర్మలనే మూడు

పాతకాలలో ఇది రెండవది. సూక్ష్మశరీర లక్షణమిది. జీవుడి స్వరూపమిదే అసలు. చతుర్విధ పురుషార్థాలలో రెండవది కూడా. చతుర్విధ పురుషార్థాలలో కామమంటే స్త్రీ పురుష విషయం. కామముఅంటే మామూలుగా అయితే కేవలం కర్మఫలంమీద ఆసక్తి మాత్రమే! నిష్కామకర్మ అంటే అలాటి ఆసక్తి లేని కర్మ.

కృష్ణపరబ్రహ్మమందు తనకు కలిగిన కామము సంపూర్ణముగా ఫలించిన1దని గోపిక సంతోషించిదట. అనగా తన శృంగారము మోక్షానంద పర్యవసాన మయ్యెనని మురిసిపోయెనని ధ్వని.

**68–5 శ్లో.**
**వికరుణో వనే సంవిహాయ మామపగతోఽసి కా త్వామిహ స్పృశేత్ ।**
**ఇతిసరోషయా తావదేకయా సజలలోచనం వీక్షితో భవాన్ ॥**

**ప్రతిపదార్థము:** వికరుణః = దయలేక, మామ్ వనే = నన్ను అడవిలో, సంవిహాయ = విడచి, అపగతః అసి= వెళ్ళిపోయావు, ఇహ = మాయందు, కా= ఎవరు, త్వామ్= దయలేని నిన్ను, స్పృశేత్ = తాకుదురు?, ఇతి = అని, సరోషయా = రోష దృష్టితో(రుష్యతి తస్య భావః – కోపము), తావత్= అప్పుడు, ఏకయా= ఒక గోపిక, భవాన్= నిన్ను, సజలలోచనం= తన కన్నులలో నీరు నిండగా, వీక్షితః= చూసెను.

**తాత్పర్యము:** “దయలేక నన్ను అడవిలో విడచి వెళ్ళిపోయావు. మాయందు ఎవరు దయలేని నిన్ను తాకుదురు?” అని రోష దృష్టితో పలికి తరువాత ఒక గోపిక నిన్ను తన కన్నులలో నీరు నిండగా చూసెను.

**68–6 శ్లో.**
**ఇతి ముదాకులైర్వల్లవీజనైః సమముపాగతో యామునే తటే ।**
**మృదుకుచాంబరైః కల్పితాసనే ఘుసృణభాసురే పర్యశోభథాః ॥**

**ప్రతిపదార్థము:** ఇతి= ఈవిధముగా నీతో కలసిమెలసి, ముదా ఆకులైః = సంతోషముతో నిండిన (మోదంతే తస్య భావః – హర్షము సంతోషము), వల్లవీజనైః= ఆ గోపికలతో (వల్లవజాతి స్త్రీ వల్లవజాతి స్త్రీ. గోపికా), సమమ్= కలిసి,

యామునే తటే= ఆ యమునానదీతీరమున, ఉపాగతః =విహారమునకై వెళ్ళిరి, ఘుసృణ భాసురే= కుంకుమపూతతో పరిమళించు (ఘృష్యతే అసౌ రుబ్బబడునది. పసుపు కుంకుమ), మృదు కుచ అంబరైః =మృదువైన కుచ వస్త్రములతో (పైట కొంగులతో) (కుచతి సంకుచతి సంకోచము చెందునది.స్తనము), కల్పిత ఆసనే= కల్పించబడిన ఆసనములతో, పర్యశోభథాః= విరాజిల్లావు.

**తాత్పర్యము:** ఈవిధముగా నీతో కలసిమెలసి సంతోషముతో నిండిన ఆ గోపికలతో కలిసి ఆ యమునానదీతీరమున విహారమునకై వెళ్ళిరి. కుంకుమపూతతో పరిమళించు మృదువైన వారి పైట కొంగులతో కల్పించబడిన ఆసనములతో నువ్వు విరాజిల్లావు.

**68–7 శ్లో.**

**కతివిధా కృపా కేఽపి సర్వతో ధృతదయోదయాః కేచిదాశ్రితే ।**
**కతిచిదీదృశా మాదృశేష్వపీత్యభిహితో భవాన్ వల్లవీజనైః ॥**

**ప్రతిపదార్థము:** కృపా= లోకములో దయ (కల్పతే సమర్థో భవతి అనయా అనుగ్రహాయ–దీనులపై దయ చూపుట), కతివిధః = అనేకరకాలుగా ఉంటుంది, కే అపి= కొందరు, సర్వతః = అందరిపట్ల, ధృత దయ ఉదయాః= ధరించబడిన దయ కలవారు(సరిసమానమయిన దయతో ఉంటారు) (ధృతః ధ్వస్తః స్థితః స్థిరీకృతః–ధరింపబడినది ఉంచబడినది స్థిరంగా వున్నది), కేచిత్ = ఇంకొందరు, ఆశ్రితే = తమను ఆశ్రయించిన వారిపట్ల మాత్రమే దయకలిగిఉంటారు, కతిచిత్= మరికొందరు, మాదృశేషు అపి = నీవే సర్వస్వమని నమ్మి నిన్ను ఆశ్రయించిన వారిపట్ల, ఈదృశా= నీవలె దయ లేక ఉంటారు.( అస్యైవ దర్శనం అస్య – దీనివలె వున్నది దీనితో సమానమైనది), ఇతి = అని, భవాన్= నీతో, వల్లవీజనైః=గోపికలతో, అభిహితః= చెప్పబడింది.( అభిహితః కథితః – చెప్పబడినది).

**తాత్పర్యము:** లోకములో దయ అనేకరకాలుగా ఉంటుంది. కొందరు అందరిపట్ల సరిసమానమయిన దయతో ఉంటారు. ఇంకొందరు తమను ఆశ్రయించిన వారిపట్ల మాత్రమే దయకలిగిఉంటారు. మరికొందరు నీవే సర్వస్వమని నమ్మి నిన్ను ఆశ్రయించిన వారిపట్ల నీవలె దయ లేక ఉంటారు. అని నీతో గోపికలు

చెప్పారు. (నిన్ను ఆశ్రయించిన వారిపట్ల నీవలె దయ లేక ఉంటారు అను వాక్యములో గోపికల ఎత్తి పొడుపు ఉంది.)

**68-8 శ్లో.**

**అయి కుమారికా! నైవ శంక్యతాం కఠినతా మయి ప్రేమకాతరే ।**
**మయి తు చేతసో వోఽనువృత్తయే కృతమిదం మయేత్యూచివాన్ భవాన్ ॥**

**ప్రతిపదార్థము:** అయి కుమారికాః=ఓ అబలలారా! (కుమారయతి క్రీడతి ఆడుకొనునది. కుమారి), ప్రేమ కాతరే = ప్రణయాపాయ భీరువులుగా(ప్రియస్య భావః–ప్రేమ.)( కు కష్టేన తరతి కష్టంతో పని నిర్వహించువాడు వ్యాకులచిత్తుడు. అధీరుడు పిరికివాడు వివశుడు), మయి= నాయందు, కఠినతా= నిష్కారుణ్యము(కఠిన కృచ్ఛ్రః క్రూరః–క్రూరుడు కఠోరమైనది స్తంభింపబడ్డది పళ్లెము), న ఏవ శంక్యతాం= సందేహించకండి. (నన్ను అన్యునిగా చూడవద్దు), వః = మీరు, (మయి= నాయందు), చేతసః తుఅనువృత్తయే = మనస్సమాధానము కొరకు (నామీద మీకు దృఢమైన అనురక్తి నిష్ఠ కుదురుటకే) (చేతత్యనేన–దీనిచే చైతన్యవంతులగుదురు. చిత్తము), మయా = నా చేత, ఇదం కృతమ్ = ఈ అంతర్ధాన వృత్తాంతము చేయబడినది, ఇతి= అని, భవాన్= నువ్వు, ఊచివాన్= చెప్పావు.

**తాత్పర్యము:** ఓ అబలలారా! గోపికలారా! మీయందు ప్రేమ కలిగిన నన్ను అన్యునిగా చూడవద్దు. నామీద మీకు దృఢమైన అనురక్తి నిష్ఠ కుదురుటకే నేను మాయమయ్యాను. అని నువ్వు చెప్పావు.

**68-9 శ్లో.**

**అయి నిశమ్యతాం జీవవల్లభా! ప్రియతమో జనో నేదృశో మమ ।**
**తదిహ రమ్యతాం రమ్యయామినీష్వనుపరోధమిత్యాలపో విభో! ॥**

**ప్రతిపదార్థము:** విభో= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అయి జీవవల్లభాః = ఓ ప్రాణ ప్రియలారా! ప్రియగోపికలారా! (వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపునది. ప్రియురాలు), నిశమ్యతాం = నా మాట మీరు శ్రద్ధగా

వినండి, మమ = నాకు, ఈదృశః ప్రియతమః జనః = మీవలె ప్రియమైనవారు (అస్యేవ దర్శనం అస్య – దీనివలె వున్నది దీనితో సమానమైనది), న = నాకు ఎవ్వరును లేరు, తత్ = అందువలన, ఇహ= ఈ యమునా తీరములో, రమ్య యామినీషు= అందమయిన వెన్నెల రాత్రులందు (రమ్యతే అత్ర – ఇచట ఆనందింతురు, రమ్యమైనది. చంపక వృక్షము.)(యామాః సంతి అస్యామ్ యామములు కలది. రాత్రి), అనుపరోధమ్= నిశ్శంకముగా(ఉపరోధ= ఉపరుణద్ధి తస్య భావః – అడ్డంకి అనుగ్రహము. దానికి వ్యతిరేకము అనుపరోధము), రమ్యతాం= నాతో కలిసి విహరింపుడు, ఇతి= అని, ఆలపః = గోపికలతో పలికితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! "ఓ ప్రాణ ప్రియలారా! ప్రియగోపికలారా! నా మాట మీరు శ్రద్ధగా వినండి. నాకు మీవలె ప్రియమైనవారు నాకు ఎవ్వరును లేరు. అందువలన ఈ యమునా తీరములో అందమయిన వెన్నెల రాత్రులందు నిశ్శంకముగా నాతో కలిసి విహరింపుడు" అని గోపికలతో పలికితివి.

**విశేషము:** గోపికలు భగవత్సాయుజ్య లాభమునకై తపస్సు సేసిన మహర్షులని ప్రసిద్ధి. "నాకు మీవలె ప్రియమైనవారు ఎవ్వరును లేరు." అనగా మహర్షులయిన గోపికలు భగవంతునికి ఆత్మ స్వరూపులే అయి యున్నందున ఆత్మకంటే ప్రియమైన వస్తువు ఇంకొకటి లేదని కృష్ణుని వాక్యము. " రమ్యతాం" అను క్రియలో షోడశకలా పరిపూర్ణమైన యానందము ధ్వనించుచున్నది. గోపికలకు స్వామి ప్రసాదించినది లౌకిక రతి కాదు. సాయుజ్యమని కవి హృదయం.

**68–10 శ్లో.**

**ఇతి గిరాధికం మోదమేదురైర్వ్రజవధూజనైః సాకమారమన్ ।**
**కలితకౌతుకో రాసఖేలనే గురుపురీపతే! పాహిమాం గదాత్ ॥**

**ప్రతిపదార్థము:** ఇతి= ఈ విధముగా, గిరా= నీవు పలికిన పలుకులకు(గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము వాణి), అధికం మోద మేదురైః = అధిక సంతోషముతో వ్యాపించిన (నిండిన)హృదయములు కలిగిన (మోదతే తస్య భావః – హర్షము, సంతోషము.) (మేదుర=మేద్యతి స్నిహ్యతి గట్టిగా వుండునది దట్టంగా వుండునది), వ్రజ వధూజనైః సాకమ్ = ఆ గోపస్త్రీలతో, రాసఖేలనే= రాస క్రీడలో

(రసస్య శృంగారరసస్య ఇదమ్, తత్సంబంధి క్రీడావిశేషః – శృంగారస సంబంధమైన క్రీడా విశేషము, రాసలీల), కలితకౌతుకః= ధృతానుగ్రహముతో (వారియందు ఉంచిన దయతో), ఆరమన్= చక్కగా నువ్వు విహారము చేసావు, గురుపురీపతే= అలా విహారము చేసిన గురువాయూరు కృష్ణ దేవా!, మాం = నన్ను, గదాత్= రోగము తొలగించి, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఈ విధముగా నీవు పలికిన పలుకులకు అధిక సంతోషముతో వ్యాపించిన (నిండిన) హృదయములు కలిగిన ఆ గోపస్త్రీలతో రాస క్రీడలో వారియందు ఉంచిన దయతో చక్కగా నువ్వు విహారము చేసావు. అలా విహారము చేసిన గురువాయూరు కృష్ణ దేవా! నన్ను రోగము తొలగించి రక్షించు.

**విశేషము:** శృంగారః శుచి రుజ్వలః"– ఈ రాస క్రీడ "శుచి శృంగారం" శృంగార రసం గోపికా కృష్ణ శృంగారం లోకి లౌకికాలౌకికాతీతమై బ్రహ్మానంద సబ్రహ్మచారి.

***దశమ స్కంధము***

**68వ దశకము సమాప్తము**

# దశకమ్ 69 – రాసక్రీడ

**69–1 శ్లో.**

**కేశపాశధృత పింఛికావితతి సంచలన్మకరకుండలం**
**హారజాలవనమాలికాలలితమంగరాగఘనసౌరభమ్ ।**
**పీతచేలధృతకాంచికాంచితముదంచదంశుమణినూపురం**
**రాసకేళిపరిభూషితం తవ హి రూపమీశ! కలయామహే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ప్రభూ!, కేశపాశధృత=నీ జుట్టు ముడిలో ధరించిన, పింఛికావితతి= పలురంగుల నెమలి పింఛములతో, మకర కుండలం = చెవులకు ఉన్న మకర కుండలములు(మకరాకృతి కుండలం కర్ణభూషణమ్ మకరాకృతి గల చెవులకు ధరించు అలంకారము), సంచలన్= అందంగా కదలుచుండగా, హార జాల= కంఠమునందున్న నవరత్నముల నానావిధకాంతుల సమ్మేళనముతో మెరసే ముత్యాల హారములతో, వన మాలికా = వనమాల, లలితమ్ = అందంగా శోభిస్తుండగా, అంగరాగ = చందనము పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, పునుగు, జవ్వాది మొదలగు పరిమళవస్తువుల తో నీశరీరము (అంగం రజ్యతే అనేన–అంగమును అలంకరించునది. కేసర చందనాదులు, మైపూతలు), ఘన సౌరభమ్= కమ్మని వాసనలు ప్రసరిస్తుండగా (సురభిః సుగంధః అస్తి అస్య–మంచి వాసన కలది), పీత చేల= నువ్వు ధరించిన పీతాంబరము పై (పీతః వర్ణః అస్తి అస్య–పసుపు రంగు కలది), ధృత= ధరించిన, కాంచికా = మేఖల, అంచితమ్ = నిగనిగలాడుచుండగా, ఉదంచత్= బహిర్గతమైన, అంశు = కిరణములు కలిగిన (అంశయతి విభజతే కిరణము), మణి నూపురం = మణులు పొదివిన బంగారుటందెతో (అవ్యక్తం శబ్దం కరోతి అవ్యక్త శబ్దము చేయునది. మణి, రత్నము), రాస కేళి= రాస కేళిలో, పరిభూషితం= అలంకరించుకొన్న, తవ హి= నీ యొక్క, రూపమ్= మనోహరమైన రూప సౌందర్య మాధుర్యమును (రూపయతే కీర్త్యతే అసౌ కీర్తించబడునది. ప్రసిద్ధి సౌందర్యము), కలయామహే= ధ్యానిస్తాము.

**తాత్పర్యము:** ప్రభూ! నీ జుట్టు ముడిలో ధరించిన పలురంగుల నెమలి పింఛములతో, చెవులకు ఉన్న మకర కుండలములు అందంగా కదలుచుండగా,

కంఠమునందున్న నవరత్నముల నానావిధకాంతుల సమ్మేళనముతో మెరసే ముత్యాల హారములతో, వనమాల అందంగా శోభిస్తుండగా, చందనము పచ్చ కర్పూరము, కుంకుమపువ్వు, పునుగు, జవ్వాది మొదలగు పరిమళవస్తువుల తో నీ శరీరము కమ్మని వాసనలు ప్రసరిస్తుండగా, నువ్వు ధరించిన పీతాంబరము పై ధరించిన మేఖల నిగనిగలాడుచుండగా, వెలికి వచ్చిన కిరణములు కలిగిన మణులు పొదివినబంగారుటందెతో రాస కేళిలో అలంకరించుకొన్న నీ యొక్క మనోహరమైన రూప సౌందర్య మాధుర్యమును ధ్యానిస్తాము.

**విశేషము:** రాసక్రీడయనగా అనేక మంది నాట్యకత్తెలతో గలిసి చేసిన నృత్యము.

ఈ దశకమందలి వృత్తము నాట్యానుకూలమైన కుసుమమంజరి. రనరన రనర. 21 అక్షరములు.

**69-2 శ్లో.**

**తావదేవ కృతమండనే కలితకంచులీకకుచమండలే**
**గండలోలమణికుండలే యువతిమండలేఽథ పరిమండలే ।**
**అంతరా సకలసుందరీయుగళమిందిరారమణ! సంచరన్**
**మంజులాం తదను రాసకేళిమయి కంజనాభ! సముపాదధాః ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ కృష్ణా!, కంజనాభ= పద్మము నాభియందుకలవాడా!, ఇందిరా రమణ = లక్ష్మీపతీ! (ఇందతి పరమైశ్వర్యవతీ భవతి పరమైశ్వర్యము కలిగినది. లక్ష్మి), అథ= అటుపిమ్మట, తావత్ ఏవ= నువ్వు ఎలా చక్కగా ఆలంకరించుకొన్నావో ఆ విధముగానే, యువతిమండలే = గోపాంగనలు, కృతమండనే = అలంకరించుకొని, కుచ మండలే= స్తన మండలములందు, కలిత కంచులీక= రవికలు బిగించి, గండ= చెక్కిళ్ళలో, మణికుండలే = మణులు పొదిగిన కుండలములు, లోల = కదలుచుండగా, పరిమండలే= మండలాకృతిలో (వృత్తాకారములో) వారు విలసిల్లుచుండగా, సకల సుందరీ యుగళమ్= ఆ సమస్తమైన గోపికా సుందరీమణుల, అంతరా= మధ్య (ప్రతి ఇరువురు గోపికల మధ్య), సంచరన్= అందంగా మురిపించి సంచరించుచూ, తదను రాసకేళిమ్= ఆ

రాసకేళీ సమయమును, మంజులాం = మనోహరముగా(మంజు మనోహరత్వం అస్తి అస్య-మనోహరము కలది. అందమైనది), సముపాదధాః= ప్రారంభించితివి.

**తాత్పర్యము:** ఓ పద్మము నాభియందుకలవాడా! లక్ష్మీపతీ! అటుపిమ్మట నువ్వు ఎలా చక్కగా ఆలంకరించుకొన్నావో ఆ విధముగానే గోపాంగనలు అలంకరించుకొని స్తన మండలములందు రవికలు బిగించి, చెక్కిళ్ళలో మణులు పొదిగిన కుండలములు కదలుచుండగా, వృత్తాకారములో వారు విలసిల్లుచుండగా ఆ సమస్తమైన గోపికా సుందరీమణుల మధ్య నాట్య సందర్భములో వారి కుచములు , కంఠములు, భుజములు మొదలగువానిపై హస్తములను ఆనించుచు అందంగా మురిపించి తిరుగుచూ - ఆ రాసకేళీ సమయమును మనోహరముగా ప్రారంభించితివి.

**విశేషము:** ఈ శ్లోకము లీలాశుకులవారి కృష్ణకర్ణామృతము లోని అంగనామంగనా మంతరే మాధవం మాధవం మాధవం అను శ్లోకమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

కృష్ణ పరమాత్మ యోగేశ్వరేశ్వరుడు కనుక అన్ని రూపములను గోపికల మధ్య ధరించాడు.

**69-3 శ్లో.**
**వాసుదేవ! తవ భాసమానమిహ రాసకేళిరససౌరభం**
**దూరతోఽపి ఖలు నారదాగదితమాకలయ్య కుతుకాకులా ।**
**వేషభూషణవిలాసపేశలవిలాసినీశతసమావృతా**
**నాకతో యుగపదాగతా వియతి వేగతోఽథ సురమండలీ ॥**

**ప్రతిపదార్థము:** వాసుదేవ= ఓ వాసుదేవా! (వసతి సర్వత్ర ఆత్మరూపేణ వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చ-అంతటా ఆత్మరూపంలో వుండువాడు. వాసుదేవుడు), అథ=అటుపిమ్మట, తవ= నువ్వు, ఇహ = ఈ భూమిపై, రాస కేళి భాసమానమ్ = రాసక్రీడ నృత్యము చేయుచు ప్రకాశించుచుండగా చూచి, రససౌరభం= ఆ సకలేంద్రియాహ్లాదకత్వమును కలిగిన ఆనందరస సౌరభమును, దూరతః అపి= దూరముగా ఉన్నప్పటికి, నారద = నారదుని (నారం పరమాత్మ విషయకం జ్ఞానం

దదాతి పరమాత్మ జ్ఞానవిషయము ఇచ్చువాడు. నారదుడు), ఆగదితమ్= నివేదిక వలన, ఆకలయ్య= విని, కుతుక ఆకులా= నీరాస క్రీడను చూడవలెనను కుతూహలముతో కూడుకొన్నవారై, వేష భూషణ విలాస = వేష భూషణ విలాసములందు, పేశల= నేర్పరులైన (పేశలం సౌందర్యం లాతి, పేశః సౌందర్యం అస్తి అస్య–సౌందర్యము కలది. సౌందర్యవంతురాలు), విలాసినీ శత = నెరజాణలైన దేవాంగనలతో, సమావృతా = కూడుకొని, సురమండలీ= దేవతా సమూహము, నాకతః= స్వర్గము నుండి, యుగపత్= అందరు కలిసి ఒకే కాలములో (యుగం ఇవ పద్యతే, ఏకకాలీనం, సమకాలీనమ్ ఒకే కాలము), వేగతః = వేగముగా, వియతి = ఆకాశ వీథులలో, ఆగతా ఖలు = వచ్చిరి కదా!

**తాత్పర్యము:** ఓ వాసుదేవా! అటుపిమ్మట నువ్వు రాసక్రీడ నృత్యము చేయు వృత్తాంతము నారదుని వలన విని నీరాస క్రీడను చూడవలెనను కుతూహలముతో కూడుకొన్నవారై నెరజాణలైన దేవాంగనలతో కూడుకొని దేవతా సమూహము స్వర్గము నుండి వేగముగా ఆకాశ వీథులలో వచ్చిరి కదా!

**69–4 శ్లో.**

**వేణునాదకృత తాన దాన కల గానరాగ గతియోజనా**
**లోభనీయమృదుపాదపాతకృతతాళమేళనమనోహరమ్ ।**
**పాణిసంక్వణితకంకణం చ ముహురంసలంబితకరాంబుజం**
**శ్రోణిబింబచలదంబరం భజత రాసకేళిరసడంబరమ్ ॥**

**ప్రతిపదార్థము:** వేణు నాద= వేణురంధ్రములలో మెత్తనైన నీ అంగుళితో నాద విన్యాసముచేసి(వేణతి వాదయతి వాయింపబడునది. వేణువు, పిల్లన గ్రోవి), తాన='తానము' అనెడి స్వరారోహణావరోహణ ప్రక్రియా విశేషముతో(తన్యతే గీతం అనేన–దీనితో పాడుదురు. సంగీతంలో తానము), కృత= చేయబడిన, కల= కంఠోత్థితమైన అతి మధురమైన, గాన= మధుర గానముతో (గీయతే ఇతి పాడబడునది. పాట),రాగ గతి యోజనా=రాగ విశేషమార్గ సంయోజనముతో (ఆయా రాగాలాపన రూపమైన పాట యొక్క గతివిలాసముతో) (రజ్యతే అనేన– దీనితో అనురక్తుడగును. ప్రేమ, అనురాగము సంగీతంలో రాగము), లోభనీయ=

లోభనీయమైన (ఆకర్షితమైన), మృదు = మెత్తని, పాద పాత= పాదములు పడుటతో (పతతి తస్య భావః కర్మ వా పతనము పడుట), కృత= చేయబడిన, తాళ మేళన మనోహరమ్= తాళ మేళన మనోహరముగా, పాణి సంక్వణిత కంకణం చ = చేతికి కంకణములు మ్రోయగా(పణంతే వ్యవహరంతి అనేన–దీనితో వ్యవహరింతురు. చెయ్యి), ముహుః = మాటిమాటికి, అంస లంబిత= కృష్ణుని భుజములు(అమతి అమ్యతే వా భారాదినా భారమును వహించునది. స్కంధము (భుజము), కర అంబుజం =చేతితోఊతగ గ్రహించి, శ్రోణి బింబ =పిరుదులందు (శ్రూయతే దృశ్యతే పుంభిః–పురుషులచే చూడబడునది), చలత్ = చెదిరిన, అంబరం = చీరలు కలవారయిన, రస డంబరమ్= రస విజృంభణము కలిగిన, రాసకేళి= రాసకేళిని, భజత= సేవింపుడు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! వేణురంధ్రములలో మెత్తనైన నీ అంగుళితో నాద విన్యాసముచేసి 'తానము' అనెడి స్వరారోహణావరోహణ ప్రక్రియా విశేషము చేయగా గోపికలు కమ్మగా పాడుచుంటిరి.ఆ తాన గానములకు అనుగుణముగా నీ మెత్తని పాదములతో చేతి కంకణములు మధురముగా మ్రోగుచుండగా తాళము వేయుచుంటివి. ఈ రాసకేళిలో కృష్ణుని భుజములపై చేతులు వేయుచూ, పిరుదులందు చెదిరిన చీరలు కలవారయిన గోపికల యొక్క రస విజృంభణము కలిగిన రాసకేళిని సేవింపుడు.

**69–5 శ్లో.**

**శ్రద్ధయా విరచితానుగానకృతతారతారమధురస్వరే**
**నర్తనేఽథ లలితాంగహారలులితాంగహారమణిభూషణే ।**
**సమ్మదేన కృతపుష్పవర్షమలమున్మిషద్దివిషదాం కులం**
**చిన్మయే త్వయి నిలీయమానమివ సమ్ముమోహ సవధూకులమ్ ॥**

**ప్రతిపదార్థము:** శ్రద్ధయా =శ్రద్ధతో (కుతూహలముతో)(శ్రత్ శ్రద్ధాం దధాతి శ్రద్ధను ధరించునది. శ్రద్ధ), విరచిత= రచింపబడిన (విశేషేణ రచితః నిర్మితః– రచింపబడినది నిర్మింపబడినది), అనుగాన= అనుగానముతో (ఒకరి తరువాత ఇంకొకరు పాడుచూ), తార తార = తారస్థాయిలో (క్రమముగా అత్యున్నత స్థాయికి

చేరుకొన్నట్లు) (తృతో విస్తృతో (ధ్వనిః) శబ్దాదికమ్ శబ్దాదులను విస్తృతపరచునది. చాలా విస్తారము కల్గినది), కృత = చేయబడిన, మధుర స్వరే నర్తనే= గోపికలు మధుర స్వర నర్తనముతో (రాసలీల కొనసాగించారు), అథ= అటుపిమ్మట, లలిత అంగ హార = లలితములైన అంగ విక్షేపములచే(అంగానాం హారః ఏకస్థానా దన్యస్థానే హరణం చాలనమ్ అంగ విక్షేపము అవయవముల కదలిక), లులిత = స్వస్థానము నుండి చెదరిన(ఆందోలితః చలితః–కదలినది), అంగహార= అవయవములపైనున్న హారములు, మణి భూషణే = మణిభూషణములు – కంఠహారములు కలవారయిన గోపికల రాస లీల చూసి, సమ్మదేన = ఆనంద పారవశ్యములతో, కృత = చేయబడిన, పుష్ప వర్షమ్= పుష్ప వర్షము కలవారయి, అలమ్ = అతిశయముతో, ఉన్మిషత్= దర్శనోత్సుకముతో రెప్పవేయకుండా, సవధూకులమ్= సస్త్రీ సమూహమును ( గోప వనితలతో ఉన్న కృష్ణుని), దివిషదాం కులం= దేవ సమూహము (దివి సీదతి స్వర్గమునందు ఉండువాడు. దేవత), చిన్మయే=చిన్మయ రూపి వైన (చిదేవ చిన్మయ–చైతన్య స్వరూపుడు. పరమేశ్వరుడు), త్వయి = నీయందు, నిలీయమానమ్ ఇవ = అదృష్ట ద్రష్టదృశ్య దర్శనభేదము వలె నీలో లీనమయి (బ్రహ్మరసానుభవము వలన లీనమయి), సమ్మ్మమోహ = మైమరపు పొందిరి.

**తాత్పర్యము:** శ్రద్ధతో ఒకరి తరువాత ఇంకొకరు పాడుచూ తారస్థాయిలో గోపికలు మధుర స్వర నర్తనముతో రాసలీల కొనసాగించారు. లలితములైన తమ అవయవముల కదలికలచే స్వస్థానము నుండి చెదరిన మణిభూషణములు – కంఠహారములు కలవారయిన గోపికల రాస లీల చూసి ఆనంద పారవశ్యములతో దేవతలు పుష్ప వర్షము కురిపించారు.రెప్పపడని ఆ దేవతల సమూహము నిన్ను తదేకంగా చూస్తూ చిన్మయ రూపివైన నీయందు బ్రహ్మరసానుభవము వలన లీనమయి మైమరపు పొందారు.

**విశేషాలు**

**చిత్:** చిత్ అనగా చైతన్యం. స్ఫురణ. నేనున్నాననే భావం. ఇదే ఆత్మ. చైతన్యమే దాని స్వరూపం. ఆత్మచైతన్యమని పేర్కొనటం కొయ్యబొమ్మ అనటం లాంటిది. రెండూ ఒకటే వాస్తవంలో. అయినా వ్యావహారికంగా వచ్చిందీ మాట.

**69–6 శ్లో.**

**స్విన్నసన్నతనువల్లరీ తదను కాऽపి నామ పశుపాంగనా**
**కాంతమంసమవలంబతే స్మ తవ తాంతిభారముకులేక్షణా ।**
**కాచిదాచలితకుంతలా నవపటీరసారఘనసౌరభం**
**వంచనేన తవ సంచుచుంబ భుజమంచితోరుపులకాంకురా ॥**

**ప్రతిపదార్థము:** తదను నామ= ఆ తరువాత రూఢిగా, కాపి పశుప అంగనా= ఒకానొక గోపస్త్రీ, స్విన్న=స్వేదార్ద్రమై(జాత స్వేదః–చెమట కల్గినవాడు), సన్న = కృశించిన, తనువల్లరీ = తీగవంటి శరీరము కలదై(వల్లతే ఆవృణోతి వృక్షాదికమ్ చెట్లను కప్పునది. తీగ), తాంతి భార =బడలిక భారముచేత (తామ్యతి శ్రాంతో భవతి అసౌ అలసిపోయిన), ముకుల ఈక్షణా=అరమోడ్పు కన్నులతో, తవ కాంతమ్ = సుందరుడవైన నీ యొక్క, అంసమ్= భుజ మూలమును (అమతి అమ్యతే వా భారాదినా భారమును వహించునది. స్కంధము (భుజము), అవలంబతే స్మ= ఆశ్రయించింది, కాచిత్= ఇంకొక గోప కాంత, ఆచలిత కుంతలా = చెదిరిన ముంగురులతో (కుంతం కుంతాగ్రాకారం లాతి గృహ్ణాతి బల్లెం ఆకారమును పొందునది. శిరోకేశము, తలవెంట్రుక), నవ పటీర సార= మంచిగంధపుపూతచే (పటతి గచ్ఛతి పట్యతే వా దీనితో జల్లెడ పట్టుదురు. చందనము), ఘన సౌరభం= అమోఘ వాసన కలిగిన (సురభిః సుగంధః అస్తి అస్య–మంచి వాసన కలది), తవ భుజమ్ = నీ భుజమును, వంచనేన = ఏదో ఒక నెపముతో, సంచుచుంబ = ముద్దు పెట్టుకొనెను, అంచిత ఉరు పులక అంకురా= అధికమయిన పులకరింతలతో కూడుకొన్నదయ్యెను.

**తాత్పర్యము:** ఆ తరువాత ఒకానొక గోపస్త్రీ నృత్యమువలన శరీరమంతా చెమర్చగా –బడలిక భారముచేత –అరమోడ్పు కన్నులతో సుందరుడవైన నీ యొక్క భుజ మూలమును ఆశ్రయించింది. ఇంకొక గోప కాంత చెదిరిన ముంగురులతో మంచిగంధపుపూతచే అమోఘ వాసన కలిగిన నీ భుజమును ఏదో ఒక నెపముతో ముద్దు పెట్టుకొని అధికమయిన పులకరింతలతో కూడుకొన్నదయ్యెను.

**69–7 శ్లో.**

**కాఽపి గండభువి సన్నిధాయ నిజగండమాకులితకుండలం**
**పుణ్యపూరనిధిరన్వవాప తవ పూగచర్వితరసామృతమ్ ।**
**ఇందిరావిహృతిమందిరం భువనసుందరం హి నటనాంతరే**
**త్వామవాప్య దధురంగనాః కిము న సమ్మదోన్మదదశాంతరమ్ ॥**

**ప్రతిపదార్థము:** కాపి= ఇంకొక, పుణ్య పూర నిధిః = పుణ్యాత్మురాలగు ఒక గోపికాంగన (పునాతి పవిత్రీ భవతి అనేన వా దీనితో పవిత్రమగును. పుణ్యము), తవ = నీయొక్క, గండభువి= చెక్కిలి ప్రదేశములో(గండః వదనైకదేశః–చెంప), ఆకులిత కుండలం=కుండలములతో కూడుకొన్న, నిజగండమ్= తన చెక్కిలిని, సన్నిధాయ= చేర్చి, పూగ చర్విత రస అమృతమ్= నీ నోటిలో ఉన్న అమృతమయమయిన తాంబూలరసమును స్వీకరిస్తూ (పూయతే ముఖం అనేన– దీనితో ముఖము పవిత్రమగును. పోక), (చర్వితః ఖాదితః–తినబడినది), సమ్మద= సంతోషాతిశయముతో, ఉన్మద దశాంతరమ్ = ఉన్మాద దశను(ఉద్గతః మదః హర్షోఽస్యాః పిచ్చి), అన్వవాప హి= పొందింది, భువనసుందరం = భువన సుందరమైన, ఇందిరా విహృతి మందిరం = మహాలక్ష్మి విహరించు విశ్రాంతి మందిరమైన పరమాత్మ వైన(ఇందతి పరమైశ్వర్యవతీ భవతి పరమైశ్వర్యము కలిగినది. లక్ష్మి), త్వామ్= నిన్ను, నటన అంతరే= నృత్య సమయములో, అవాప్య =పొందిన(ఆశ్రయించిన), అంగనాః= ఆ గోపికాంగనలు, కిము న దధుః= ఏ సంతోషాన్ని పొందలేదు? (అన్ని సంతోషాలను పొందారని భావం).

**తాత్పర్యము:** ఇంకొక పుణ్యాత్మురాలగు ఒక గోపికాంగన నీయొక్క చెక్కిలికి తన చెక్కిలిని చేర్చి నీ నోటిలో ఉన్న అమృతమయమయిన తాంబూలరసమును స్వీకరిస్తూ సంతోషాతిశయముతో ఉన్మాద దశను పొందింది. భువన సుందరుడవైన, మహాలక్ష్మి విహరించు విశ్రాంతి మందిరమైన పరమాత్మవైన నిన్ను నృత్య సమయములో ఆశ్రయించిన ఆ గోపికాంగనలు అన్ని సంతోషాలను పొందారు.

**69–8 శ్లో.**

**గానమీశ।విరతం క్రమేణ కిల వాద్యమేళనముపారతం**
**బ్రహ్మసమ్మదరసాకులాస్సదసి కేవలం నన్నృతురంగనాః ।**
**నావిదన్నపి చ నీవికాం కిమపి కుంతలీమపి చ కంచులీం**
**జ్యోతిషామపి కదంబకం దివి విలంబితం కిమపరం బ్రువే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ గురువాయూరు ప్రభూ!, గానమ్= ఆ రాసక్రీడలో గానము(గీయతే ఇతి పాడబడునది. పాట), విరతం= ఆగిపోయింది. (విరతః విశ్రాంతః సమాప్తః దూరీకృతః), క్రమేణ= క్రమముగా, వాద్య మేళనమ్= వాద్యముల మేళవింపు(వాదయంతి ఏనమ్ దీనిని వాయింతురు. బాజా), ఉపారతం కిల= వెళ్ళిపోయింది కదా! ( ఆగిపోయిందని భావం), అంగనాః = గోపస్త్రీలు (ప్రశస్తం అంగం అస్యాః – ప్రశస్తమైన అంగములు గలది. కామిని), నీవికాం=కోకముడి విడిపోవుట(నివ్యయతి నివీయతే వా బధ్యతే అనయా దీనితో బంధింతురు. బొందు), కిమపి కుంతలీమ్= జుట్టు ముడి విడిపోవుట(కుంతం కుంతాగ్రాకారం లాతి గృహ్ణాతి బల్లెం ఆకారమును పొందునది. శిరోకేశము, తలవెంట్రుక ), అపి చ= మరియు, కంచులీం= రైక ముడి విడిపోవుట, న అవిదన్ = ఎరుగలేక ( దేహధ్యాస లేదని భావం), బ్రహ్మసమ్మద రస= బ్రహ్మానందానుభవ రసము చేత, ఆకులాః= పరవశులై, కేవలం=కేవలము, సదసి= ఆ రాసక్రీడలో, నన్నృతుః= నృత్యము చేసిరి, జ్యోతిషామ్ = నక్షత్రతారాగ్రహాది జ్యోతుల యొక్క (జ్యోతతే అసౌ ప్రకాశించునది ప్రకాశము సూర్యుడు అగ్ని చంద్రుడు), కదంబకం అపి= సమూహము కూడా, దివి = ఆ కాశములో(దీవ్యతి ప్రకాశతే ప్రకాశించునది. స్వర్గము), విలంబితం = ఆ రాస క్రీడను చూస్తూ పరవశంతో చలనము లేక స్థిరంగా ఉన్నాయి.( లంబమానః, ఆశ్రితః, మందః – వ్రేలాడునది ఆశ్రయింపబడ్డది), అపరం =వేరేవాటిని గురించి, కిమ్ బ్రువే=చెప్పటానికి ఏమున్నది?

**తాత్పర్యము:** ఓ గురువాయూరు ప్రభూ! ఆ రాసక్రీడలో క్రమముగా గానము ఆగిపోయింది. క్రమక్రమముగా వాద్యముల మేళవింపు ఆగిపోయింది. గోపస్త్రీలు తమ కోకముడి, జుట్టుముడి, రైకముడి విడిపోవుటలుకూడా ఎరుగలేక , దేహధ్యాస

లేక బ్రహ్మానందానుభవ రసము చేత పరవశులై ఆ రాసక్రీడలో నృత్యము చేసిరి. నక్షత్రతారాగ్రహాది జ్యోతుల యొక్క సమూహము కూడా ఆ కాశములో ఆ రాస క్రీడను చూస్తూ పరవశంతో చలనము లేక స్థిరంగా ఉన్నాయి. వేరేవాటిని గురించి చెప్పటానికి ఇంకా ఏమున్నది?

**69-9 శ్లో.**
**మోదసీమ్ని భువనం విలాప్య విహృతిం సమాప్య చ తతో విభో!**
**కేళిసమ్మృదితనిర్మలాంగనవఘర్మలేశసుభగాత్మనామ్ ।**
**మన్మథాసహనచేతసాం పశుపయోషితాం సుకృతచోదితః**
**తావదాకలితమూర్తిరాదధిథ మారవీరపరమోత్సవాన్ ॥**

**ప్రతిపదార్థము:** విభో = ప్రభూ!, తతః= అటుపిమ్మట, మోదసీమ్ని= బ్రహ్మానందములో, భువనం= సమస్త భువనములను, విలాప్య = ముంచి, విహృతిం= నాట్యవిహారము, సమాప్య చ= విరమించి, కేళి సమ్మృదిత = రాసక్రీడా పరిశ్రమచే నలుగుడుపడిన, నిర్మల అంగ= అందమైన అవయవములందు, నవ ఘర్మ లేశ= చిరు చెమటలు పట్టి, సుభగ ఆత్మనామ్= అందమైన శరీరములు కలిగి, మన్మథ= మన్మథ లీల ఆలస్యమగుటకు (సురతము)(మనః మథతి ] (మనస్సును మథించువాడుమన్మథుడు), అసహన చేతసాం=సహింపలేని మనస్సుతో ఉన్న, పశుప యోషితాం= ఆ గోపాంగనలకు, సుకృత చోదితః= వారి పూర్వజన్మ కృత అదృష్టం చే(సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము శుభకర్మ), తావత్ = ఎంతమంది గోపికలు ఉన్నారో అన్ని, ఆకలిత మూర్తిః= కృష్ణ రూపములతో, మారవీర పరమ ఉత్సవాన్=రాస క్రీడలను ( మారయతి మ్రియంతే ప్రాణినః అనేన-చంపువాడు. ఇతని వలన ప్రాణులు చనిపోవును. మన్మథుడు), ఆదధిథ = అనుగ్రహించావు.

**తాత్పర్యము:** ప్రభూ! అటుపిమ్మట బ్రహ్మానందములో సమస్త లోకములను ఓలలాడించి ,నాట్యవిహారము ,విరమించి రాసక్రీడా పరిశ్రమచే నలుగుడుపడి అందమైన అవయవములందు చిరు చెమటలు పట్టి అందమైన శరీరములు కలిగి మన్మథ లీల ఆలస్యమగుటకు సహింపలేని మనస్సుతో ఉన్న ఆ గోపాంగనలకు

వారి పూర్వజన్మ కృత అదృష్టం చే ఎంతమంది గోపికలు ఉన్నారో అన్ని కృష్ణ రూపములతో రాస క్రీడలను అనుగ్రహించావు.

**69-10 శ్లో.**

**కేళిభేదపరిలోలితాభిరతిలాలితాభిరబలాలిభిః**
**స్వైరమీశ నను సూరజాపయసి చారునామ విహృతిం వ్యధాః ।**
**కాననేఽపి చ విసారిశీతలకిశోరమారుతమనోహరే**
**సూనసౌరభమయే విలేసిథ విలాసినీశతవిమోహనమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ గురువాయూరు ప్రభూ!, కేళి భేద= ఆలింగన చుంబన ప్రహరణ దంతక్షత నఖక్షత సీత్కారాది విలాసములచే, పరిలోలితాభిః =గోపికలకు సాటిలేని వేడుకలు కలిగించి, అతి లాలితాభిః= లాలించి, అబలాలిభిః = ఆ అబలలతో, స్వైరమ్ = స్వేచ్ఛగా, సూరజా పయసి = యమునా జలములందు, చ = మరియు, విసారి =ప్రసరించు(విసర్తుం ప్రవర్తుం శీలం అస్య-విస్తరించు స్వభావం కలది), శీతల= చల్లని (శీతం అస్తి అస్య-చల్లదనము కలది), కిశోర మారుత = మందవాయువులు కలిసిన, మనోహరే=మనోహరమైన, సూన=పుష్పములయొక్క, సౌరభమయే= సుగంధములు కలిసిన (సురభిః సుగంధః అస్తి అస్య-మంచి వాసన కలది), కాననే అపి = యమున ఒడ్డున ఉన్న అడవులలో, చారు నామ=అందంగా, విలేసిథ=నువ్వు వారిచుట్టూ ప్రకాశంగా తిరుగుతూ, విలాసినీ శత విమోహనమ్= అనేకమంది గోపికలకు సమ్మోహనము కలిగించి(విలాసః అస్తి అస్యాః-విలాసము కలది శృంగార చేష్ట), విహృతిం =విహారములు, వ్యధాః= చేసితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు ప్రభూ! ఆలింగన చుంబన ప్రహరణ దంతక్షత నఖక్షత సీత్కారాది విలాసములచే గోపికలకు సాటిలేని వేడుకలు కలిగించి లాలించి ,ఆ అబలలయిన గోపికలతో స్వేచ్ఛగా యమునా జలములందు, మరియు ప్రసరించు చల్లని కిశోర మందవాయువులు కలిసిన మనోహరమైన పుష్పముల యొక్క సుగంధములు కలిసిన యమున ఒడ్డున ఉన్న అడవులలో అనేకమంది గోపికలకు సమ్మోహనము కలిగిస్తూ అందంగా విహారములు చేసితివి.

**69-11 శ్లో.**

**కామినీరితి హి యామినీషు ఖలు కామనీయకనిధే! భవాన్**
**పూర్ణసమ్మదరసార్ణవం కమపి యోగిగమ్యమనుభావయన్ ।**
**బ్రహ్మశంకరముఖానపీహ పశుపాంగనాసు బహుమానయన్**
**భక్తలోకగమనీయరూప! కమనీయ! కృష్ణ! పరిపాహి మామ్ ॥**

**ప్రతిపదార్థము:** కామనీయకనిధే=ఓ సౌభాగ్య సముద్రుడా! (అందానికి నిధి వంటివాడా!),భవాన్=నువ్వు,యామినీషు=పండువెన్నెలరాత్రివేళలలో(యామాః సంతి అస్యామ్ యామములు కలది. రాత్రి), కామినీః= గోప కామినులను (అతిశయేన కామః అస్యాః అస్తి కోరిక కలది. స్త్రీ), కమపి యోగిగమ్యమ్= యోగిహృదయములకు మాత్రమే తెలియదగిన (యోజయతి సమానం పశ్యతి సుఖం చ దుఃఖం చ – సుఖదుఃఖములను సమానంగా చూచువాడు. యోగి), పూర్ణసమ్మద రస ఆర్ణవం =అద్వైత బ్రహ్మానంద సంపూర్ణ మహాసముద్రమును (అర్ణాంసి పయాంసి సంతి అస్మిన్ ఇందులో జలములుండును. సముద్రము), అనుభావయన్ = ఆస్వాదింపచేసి, బ్రహ్మ శంకర ముఖాన్ అపి = బ్రహ్మ, శంకరుల చేత కూడా, పశుప అంగనాసు= గోపాలకాంగనలను, ఇహ=ఇక్కడ (బృందావనములో), బహుమానయన్ = మెచ్చుకొనునట్లు చేసిన, భక్త లోక= భక్తలోకమునకు, గమనీయ = ప్రాప్యమైన(పొందదగిన , తెలియదగిన), రూప ఖలు = రూపము కలవాడివి కదా! (రూపయతి తస్య భావః కర్మ వా రూపము, స్వభావము, సౌందర్యము), కమనీయ= అందగాడా! ( కామ్యతే కమనీయం వా కోరబడువాడా !), కృష్ణ! = శ్రీ కృష్ణా! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః–భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), ఇతి హి =ఈవిధముగా, మామ్= నన్ను, పరిపాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఓ సౌభాగ్య సముద్రుడా! నువ్వు పండువెన్నెల రాత్రివేళలలో –గోపాలక కామినులకు – యోగిహృదయములకు మాత్రమే తెలియదగిన అద్వైత బ్రహ్మానంద సంపూర్ణ మహాసముద్రమును ఆస్వాదింపచేసి బ్రహ్మ, శంకరుల చేత కూడా గోపాలకాంగనలను మెచ్చుకొనునట్లు చేసిన , భక్తలోకమునకు ప్రాప్యమైన

రూపము కలవాడివి కదా ! అందగాడా ! శ్రీ కృష్ణా ! ఈవిధముగా నన్ను రక్షించు.

**విశేషము:** హృదా మనీషా మనసా – భిక్లుప్తో యఏనం విదురమృతాస్తే భవంతి( మహా నారాయణోపనిషత్ అనువాకము 3 మంత్రము 01)

హృదయం, బుద్ధి మరియు మనస్సులకు మాత్రమే పరమాత్మ జ్ఞానం అనుభూతమవుతుంది. ఆ విధంగా జ్ఞానం పొందినవారు అమృతత్వ స్థితిని చేరుకొంటాడు అను భావాన్ని కవి ఈశ్లోకంలో యోగి హృదయగమ్యము అను పదబంధంలో పొదిగాడు.

***దశమ స్కంధము***

**69వ దశకము సమాప్తము**



## దశకమ్ 70 – సుదర్శనశాపమోక్షము, శఙ్ఖచూడ–అరిష్టవధ

**70–1 శ్లో.**

**ఇతి త్వయి రసాకులం రమితవల్లభే వల్లవాః**
**కదాఽపి పురమంబికాకమితురంబికాకాననే ।**
**సమేత్య భవతా సమం నిశి నిషేవ్య దివ్యోత్సవం**
**సుఖం సుషుపురగ్రసీద్ వ్రజపముగ్రనాగస్తదా ॥**

**ప్రతిపదార్థము:** ఇతి = చెప్పబడిన విధంగా, త్వయి= నువ్వు, రసా= కుతూహలముతో, ఆకులం = కూడుకొన్న వాడవై, రమిత వల్లభే = గోపికలను రసతన్మయులుగా చేస్తుండగా, వల్లవాః= గోపకులు(వల్లం ప్రీతి వాతి ప్రీతిని చూపువాడు. గోపాలకుడు), కదా అపి= ఒకనాడు, అంబికా కాననే = అంబికా వనమను పేరుగల శివక్షేత్రములో (అంబా ఏవ అంబిక – తల్లి పార్వతి), అంబికా కమితుః పురమ్= పార్వతీదేవి భర్త యైన శివుని మందిరమునకు (కమితృ=కామయతే అసౌ కోరిక కలవాడు)(పురమ్= ప్రియతే పూర్యతే అసౌ– పూరించునది పూరించబడునది. ఇల్లు), భవతా సమం= నీతో కలిసి, సమేత్య= వచ్చి, నిశి = రాత్రి వేళ, దివ్య ఉత్సవం= శివరాత్రి మహోత్సవమును, నిషేవ్య= సేవించి, సుఖం = సుఖముగా, సుషుపుః = నిద్రపోయిరి, తదా= అప్పుడు, ఉగ్రనాగః = ఒక భయంకరమయిన కొండ చిలువ, వ్రజపమ్= వ్రజనాయకుడైన నందుని, అగ్రసీద్= మింగసాగెను.

**తాత్పర్యము:** చెప్పబడిన విధంగా నువ్వు కుతూహలముతో కూడుకొన్న వాడవై గోపికలను రసతన్మయులుగా చేస్తుండగా గోపాలకులు ఒకనాడు, అంబికా వనమను పేరుగల శివక్షేత్రములో పార్వతీదేవి భర్త యైన శివుని మందిరమునకు నీతో కలిసి వచ్చి రాత్రి వేళ శివరాత్రి మహోత్సవమును సేవించి సుఖముగా నిద్రపోయిరి. అప్పుడు ఒక భయంకరమయిన కొండ చిలువ వ్రజనాయకుడైన నందుని మింగసాగెను.

**70–2 శ్లో.**

**సమున్ముఖమథోల్ముకైరభిహతేఽపి తస్మిన్ బలాత్**
**అముంచతి భవత్పదే న్యపతి పాహి పాహీతి తైః ।**
**తదా ఖలు పదా భవాన్ సముపగమ్య పస్పర్శ తం**
**బభౌ స చ నిజాం తనుం సముపసాద్య వైద్యాధరీమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట గోపాలకులు, సమున్ముఖమ్ =ఎదుట కనిపించుచున్న కొండచిలువను (సమ్ పూర్వక ఉన్ముఖమ్= ఉత్ ఊర్ధ్వం ముఖం అస్య పైకి ముఖం లేపినవాడు), ఉల్ముకైః= మండుచున్న కట్టెలతో (ఓషతి దహతి దహించునది. కొరవి , నిప్పు), అభిహతే అపి=కొట్టినప్పటికి (అభిహతః పీడిత ఆహతః–పీడింపబడినవాడు దెబ్బతిన్నవాడు), తస్మిన్= ఆకొండచిలువ, బలాత్ = బలముగా, అముంచతి= నందుని విడువలేదు, తదా = అప్పుడు, తైః= ఆ గోపాలకులు, భవత్ పదే= నీ పాదములపై, న్యపతి= పడి, పాహి పాహి =రక్షింపు రక్షింపుము, ఇతి= అని (కోరిరి), భవాన్= నువ్వు గోపాలకుల ప్రార్థనపై, సముపగమ్య= ఆ ప్రదేశమునకు వచ్చి, పదా= నీ పాదముతో, తం పస్పర్శ= ఆ కొండ చిలువను స్పృశింపగా, స చ= ఆ పాము, నిజాం తనుం= తన మునుపటి రూపమైన, వైద్యాధరీమ్= విద్యాధరస్వరూపమును (విద్యాం మంత్రాదికం ధరతి మంత్రములను ధరించినవాడు. ఒక యోని విశేషము, విద్యాధరుడు), సముపసాద్య = పొంది, బభౌ ఖలు = ఉన్నది కదా (ప్రకాశించింది కదా! ).

**తాత్పర్యము:** అటుపిమ్మట గోపాలకులు తమ ఎదుట కనిపించుచున్న కొండచిలువను మండుచున్న కట్టెలతో కొట్టినప్పటికి అది బలముగా నందుని విడువలేదు. అప్పుడు ఆ గోపాలకులు నీ పాదములపై పడి రక్షింపు రక్షింపుము అని కోరిరి. నువ్వు గోపాలకుల ప్రార్థనపై ఆ ప్రదేశమునకు వచ్చి నీ పాదముతో ఆ కొండ చిలువను స్పృశింపగా ఆ పాము తన మునుపటి రూపమైన విద్యాధరస్వరూపమును పొంది ప్రకాశించింది.

**70-3 శ్లో.**

**సుదర్శనధర! ప్రభో! నను సుదర్శనాఖ్యోఽస్మ్యహం**
**మునీన్ క్వచిదపాహసం త ఇహ మాం వ్యధుర్వాహసమ్ ।**
**భవత్పదసమర్పణాదమలతాం గతోఽస్మీత్యసౌ**
**స్తువన్ నిజపదం యయౌ వ్రజపదం చ గోపా ముదా ॥**

**ప్రతిపదార్థము:** సుదర్శనధర=సుదర్శన చక్రమును ధరించు స్వామీ! (సుదర్శనశ్చాసౌ చక్రం చ - సుదర్శన చక్రము), ప్రభో= ప్రభూ!, అహం = నేను, సుదర్శన = సుదర్శనుడను, ఆఖ్యః అస్మి నను = పేరు కలవాడను. (ఆఖ్యాయతే అనయా దీనితో పిలువబడును. పేరు), క్వచిత్ = ఒకప్పుడు, మునీన్ = మునులను, అపాహసం = అవహేళనచేసాను, తే = ఆ మునులు, ఇహ= ఈ ప్రదేశములో, మాం= నన్ను, వాహసమ్ = కొండచిలువ రూపమును (వా అనగా వాయువు. దానిచేత సంతోషించునది వాతీతి వాయుః తేన హసతీతి), వ్యధుః = పొందమని శపించిరి, భవత్ పద సమర్పణాత్= నీ పాదము తాకినందువలన, అమలతాం = శాపవిమోచనము, గతః అస్మి= పొందినవాడినయ్యాను, ఇతి= అని, అసౌ = ఆవిద్యాధరుడు, స్తువన్ = పొగిడి, నిజపదం=తన విద్యాధరలోకమునకు, యయౌ= వెళ్ళెను, గోపాః= గోపాలకులు కూడా, ముదా= సంతోషముతో, వ్రజపదం చ =తమ వ్రజమునకు బయలుదేరిరి. (జనపద విశేషః-వ్రజ జనపదము. మథురా- వృందావన ప్రదేశము).

**తాత్పర్యము:** "సుదర్శన చక్రమును ధరించు స్వామీ ! ప్రభూ ! నేను సుదర్శనుడను పేరు కలవాడను. ఒకప్పుడు మునులను అవహేళనచేసాను. ఆ మునులు ఈ ప్రదేశములో నన్ను సర్పరూపమును పొందమని శపించిరి. నీ పాదము తాకినందువలన శాపవిమోచనము పొందాను" అని ఆవిద్యాధరుడు కృష్ణుని పొగిడి తన విద్యాధరలోకమునకు వెళ్ళెను. గోపాలకులు కూడా సంతోషముతో తమ వ్రజమునకు బయలుదేరిరి.

**విశేషము:** సుదర్శనుడను విద్యాధరుడు తన అందమైన రూపమునకు గర్వించి

బారెడు గడ్డములతో అందంగా లేని మునులను అపహాసము చేయగా అతనికి శాపము లభించింది.

**70-4 శ్లో.**

**కదాపి ఖలు సీరిణా విహరతి త్వయి స్త్రీజనైః**
**జహార ధనదానుగస్స కిల శంఖచూడోఽబలాః ।**
**అతిద్రుతమనుద్రుతస్తమథ ముక్తనారీజనం**
**రురోజిథ శిరోమణిం హలభృతే చ తస్యాదదాః ॥**

**ప్రతిపదార్థము:** కదాపి= ఒకప్పుడు, సీరిణా= బలరామునితో సహ (సీరః హలః అస్తి ఆయుధత్వేన–నాగలి ఆయుధంగా కలవాడు. బలరాముడు), త్వయి= నువ్వు, విహరతి = విహరించుచుండగా, ధనద అనుగః= కుబేరుని సేవకుడయిన (ధనం దయతే రక్షతి ధనమును రక్షించువాడు. కుబేరుడు.)(అను పశ్చాత్ గచ్ఛతి అనుచరుడు సేవకుడు), స శంఖచూడః= ఆ శంఖచూడుడను వాడు, అబలాః జనైః = కొందరు గోపికలను(అల్పం పురుషాత్ శారీరకం బలం యస్యాః– పురుషుని కంటే తక్కువ శారీరక (కండ) బలము కలది కొంచెము బలము కలది, స్త్రీ), జహార = అపహరించుకొని పోయెను, అథ= అటుపిమ్మట, అతిద్రుతమ్= శీఘ్రముగా, తమ్ = అతనిని, అనుద్రుతః= వెంబడించి(అను పశ్చాత్ ద్రుతః ఆగతః–అనుసరించువాడు), ముక్త నారీ జనం= స్త్రీలను విడిపించి(త్యక్తః, ప్రాప్తమోక్షణ–వదలబడినది మోక్షమును పొందినవాడు.)( నరస్య ధర్మ్యా స్త్రీ నరుని భార్య. స్త్రీ), రురోజిథ = అతనిని పట్టుకొని, తస్య శిరోమణిం= అతని శిరోమణిని(శంఖమును పోలిన శిరోమణిని)గ్రహించి(శిరసి ధార్య మణిః– శిరస్సునందు ధరించదగిన మణి), హలభృతే చ= బలరామునికి (హలం బిభర్తి హలమును ధరించువాడు. బలరాముడు రైతు), అదదాః ఖలు = ఇచ్చావు.

**తాత్పర్యము:** ఒకప్పుడు బలరామునితో సహ నువ్వు విహరించుచుండగా కుబేరుని సేవకుడయిన ఆ శంఖచూడుడను వాడు కొందరు గోపికలను అపహరించుకొని పోయెను.వెంటనే నువ్వు అతనిని వెంబడించి స్త్రీలను విడిపించి అతనిని పట్టుకొని అతని శిరోమణిని గ్రహించి బలరామునికి ఇచ్చావు.

**70-5 శ్లో.**

**దినేషు చ సుహృజ్జనైస్సహ వనేషు లీలాపరం**
**మనోభవమనోహరం రసితవేణునాదామృతమ్।**
**భవంతమమరీదృశామమృతపారణాదాయినం**
**విచింత్య కిము నాలపన్ విరహతాపితా గోపికాః ॥**

**ప్రతిపదార్థము:** దినేషు చ= పగటి దినములలో (ద్యతి అంధకారమ్ చీకటిని నాశనము చేయునది. దినము, పగలు), సుహృత్ జనైః సహ= నీవు నీమిత్రబృందమయిన గోపాలకులతో కలిసి(సుష్ఠు హృదయం యస్యః-మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), వనేషు = అడవులయందు (వనతి ఘనీభవతి దట్టంగా ఉండునది. అడవి), లీలాపరం = లీలగా ఆటపాటలతో విహరించుచుండగా, మనోభవ మనోహరం= మన్మథుని కంటె అందగాడవయిన (మనసి భవతి, మనసః భవః ఉత్పత్తిః యస్య-మనస్సున బుట్టినవాడు, మనస్సుకు పుట్టినవాడు. కాముడు), రసిత వేణునాద అమృతమ్= నీ వేణునాద మాధుర్యమును ఆస్వాదిస్తూ(రసితః శబ్దాయితః-శబ్దం చేయబడినది), భవంతమ్ అమరీదృశామ్= స్వర్గ స్త్రీల కన్నులకు, అమృతపారణా దాయినం= నిజరూపమను అమృత పానమును కలిగించుచున్న (దేవతా స్త్రీల కన్నుల పండువగుచు), విచింత్య= నిన్ను భావించుచూ, విరహ తాపితా = విరహ సంతప్త హృదయులై (విరహ తాపముతో) (విశేషేణ రహతి త్యజతి తస్య భావః-విరహము, విచ్ఛేదము.)( తాపితః పీడితః ఉష్ణీకృతః-పీడింపబడ్డవాడు. వేడి చేయబడినది), గోపికాః= గోపికా స్త్రీలు (గోపస్య స్త్రీ గోపాలుని భార్య. గోపిక), కిము న ఆలపన్= ఎన్ని విధములుగా బాధపడ్డారో చెప్పుట తరమా? (అనేక విధములుగా వాపోయారని భావం).

**తాత్పర్యము:** పగటి దినములలో నీవు నీమిత్రబృందమయిన గోపాలకులతో కలిసి అడవులయందు లీలగా ఆటపాటలతో విహరించుచుండగా మన్మథుని కంటె అందగాడవయిన నీ వేణునాద మాధుర్యమును ఆస్వాదిస్తూ దేవతా స్త్రీల కన్నుల పండువగుచు నిన్ను భావిస్తూ విరహ తాపముతో గోపికా స్త్రీలు అనేక విధములుగా వాపోయారని భావం.

**70-6 శ్లో.**
**భోజరాజభృతకస్త్వథ కశ్చిత్ కష్టదుష్టపథదృష్టిరరిష్టః ।**
**నిష్ఠురాకృతిరపష్ఠునినాదస్తిష్ఠతే స్మ భవతే వృషరూపీ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, భోజరాజ= భోజరాజు అయిన కంసుని (భోజశ్చ అసౌ రాజా చ-భోజరాజు), భృతకః తు= సేవకుడయిన(భృతేన వేతనేన ఉపజీవతి జీతముతో బ్రతుకువాడు. కూలి), కష్ట = హింసా బహుళ మైన, దుష్ట పథ = పరోపద్రవమయిన దుష్ట మార్గమునందు(దుష్యతి అసౌ తప్పు చేయువాడు. దుర్బలుడు నీచుడు), దృష్టిః= అన్వేషణము కలిగినవాడయిన (పరహింసాపరుడు) (దృష్టిః దర్శనం జ్ఞానమ్ చూచుట తెలుసుకొనుట బుద్ధి), నిష్ఠుర ఆకృతిః = క్రూరాకృతి కలిగినవాడయిన(నిష్ఠురః పరుషః-పరుష వాక్యము పలుకువాడు పరుష వాక్యము నిర్దయుడు మొరటువాడు), కశ్చిత్ అరిష్టః = అరిష్టుడు అను పేరు కలవాడొకడు (ఋచ్యతే గమ్యతే ప్రాప్యతే అశుభాదికమ్ అశుభములు), వృషరూపీ = వృషభము యొక్క రూపములో (వర్షతి కామాన్ కోరికలను కురిపించునది. వృషభము), అపష్ఠు నినాదః = కర్ణ కఠోరమయిన ధ్వని చేయుచూ(రంకె వేయుచూ)(అప వామభాగః తత్ర తిష్ఠతి ప్రతికూలపదార్థో వా వామభాగంలో వుండువాడు ప్రతికూలుడు), భవతే = నీ ఎదుట, తిష్ఠతే స్మ = నిలబడెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట భోజరాజు అయిన కంసుని సేవకుడయినవాడు, దుష్ట మార్గమునందు అన్వేషణము కలిగినవాడు, క్రూరాకృతి కలిగినవాడయిన అరిష్టుడు అను పేరు కలవాడొకడు వృషభము యొక్క రూపములో కర్ణ కఠోరమయిన ధ్వని చేయుచూ నీ ఎదుట నిలబడెను.

**70-7 శ్లో.**
**శాక్వరోఽథ జగతీధృతిహారీ మూర్తిమేష బృహతీం ప్రదధానః ।**
**పంక్తిమాశు పరిఘూర్ణ్య పశూనాం ఛందసాం నిధిమవాప భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, శాక్వరి= ఆ వృషభము (1. బలిష్ఠమైన రూపం కలది 2. శక్వరీ ఛందస్య ఇయమ్ శక్వర ఛందస్సులో వున్న ఋక్కులు),

జగతి=భూమియొక్క,(1.గచ్ఛతి కార్యత్వాత్ వినశ్యతి కార్యమగుటవలన నశించునది. పృథివి 2.జగతీ ఛందోభేదము), ధృతిహారీ = ధైర్యమును సడలింపజేసి, (ధృతి= 1.ధార్యతే ధ్రియతే వా ధరించబడునది. ధైర్యము2. ఒక ఛందోభేదము), బృహతి=పెద్దది యగు మూర్తిని, (1.బృంహతే వర్ధతే చాలా పెద్దది 2.బృహతీ అను ఒక ఛందస్సు), ప్రదధానః= ధరించి, పశూనాం పంక్తిమ్= పశువుల సమూహమును(పంక్తి= పచ్యతే వ్యక్తీక్రియతే శ్రేణీ విశేషేణ–వరుస.2. ఒక ఛందోభేదము), ఆశు= వెంటనే, పరిఘూర్ణ్య= క్షోభింపజేసి, ఛందసాం నిధిమ్ = సకలచందస్సులకు నిధివయిన వేదగర్భుడవైన (ఛందతి హృష్యతి అనేన–దీనితో సంతోషింతురు. ఛందస్సు), భవంతమ్= నిన్ను, అవాప= చేరెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆరిష్టా సురుడను వృషభము భూమియొక్క ధైర్యమును సడలింపజేసి పెద్దది యగు మూర్తిని, ధరించి పశువుల సమూహమును వెంటనే క్షోభింపజేసి, వేదగర్భుడవైన నిన్ను చేరెను.

**విశేషం:** ఇక్కడ శ్లేషార్థము ఇంకొకటున్నది. అరిష్టుడు – శాక్వరి, జగతి, పంక్తి, బృహతి, ధృతి అను ఛందస్సులకు మాత్రమే పరిమితుడు. కాని నువ్వు సకలఛందస్సులకు నిధివి. కనుక కృష్ణుడు అరిష్టునికంటె గొప్పవాడని భావం.

**70–8 శ్లో.**

**తుంగశృంగముఖమాశ్వభియంతం సంగృహయ్య రభసాదభియంతమ్ ।**
**భద్రరూపమపి దైత్యమభద్రం మర్దయన్నమదయః సురలోకమ్ ॥**

**ప్రతిపదార్థము:** తుంగ = ఉన్నతమయిన( ఎత్తైన)(తుజ్యతే హింస్యతే వాయ్వాదినా ఉన్నతమైన), శృంగ ముఖమ్ = కొమ్ములు కలిగిన ముఖముతో (శృణాతి హినస్తి హింసించునది. కొమ్ము), ఆశు= అతివేగముగా, అభియంతం= పరిగెత్తుకొని వచ్చి నినుపొడువబోవుచున్న, తమ్= ఆ, అభియం= భయరహితుని, భద్ర రూపమ్ అపి = వృషభ స్వరూపములో ఉన్నప్పటికి(భందతే శుభం కరోతి శుభమును చేయువాడు), అభద్రం= దుష్టుడైన, దైత్యమ్= ఆ రాక్షసుని(దితేః అపత్యమ్ దితి సంతానము. రాక్షసులు), రభసాత్ = వేగముగా(రభతే వేగేన గచ్ఛతి తస్య భావః కర్మ వా వేగము, సంతోషము, ఉత్సాహము), సంగృహయ్య=

చేత్తో పట్టుకొని, మర్దయన్= చంపితివి, సురలోకమ్= దేవతలు, అమదయః= సంతోషించారు.

**తాత్పర్యము:** ఎత్తైన కొమ్ములు కలిగిన ముఖముతో అతివేగముగా పరిగెత్తుకొని వచ్చి నినుపొడువబోవుచున్న ఆ భయరహితుని , దుష్టుడైన ఆ రాక్షసుని వేగముగా చేత్తో పట్టుకొని చంపితివి. దేవతలు సంతోషించారు.

**విశేషం:** ఇక్కడ భద్రరూపుడయిన –అభద్రుడు అనుచోట శ్లేషతో కూడిన విరోధాభాసాలంకారం.

**70–9 శ్లో.**

**చిత్రమద్య భగవన్! వృషఘాతాత్ సుస్థిరాఽజని వృషస్థితిరుర్వ్యామ్ ।**
**వర్ధతే చ వృషచేతసి భూయాన్మోద ఇత్యభినుతోఽసి సురైస్త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** భగవన్= ఓ భగవంతుడా!, వృష ఘాతాత్= వృషభరూపంలో ఉన్న అరిష్టుడను రాక్షసుని చంపుట వలన, ఉర్వ్యామ్ = భూమియందు, సుస్థిరా వృష= ధర్మము యొక్క, స్థితిః= నిలుకడ, అజని= అయింది.( సుస్థిరమయ్యెను), వృష = ఇంద్రుని యొక్క(ధర్మమును అనుసరించు వారి), చేతసి = మనస్సులలో, భూయాన్ మోద= గొప్ప సంతోషము, వర్ధతే చ= పెరిగింది, అద్య = ఇది నేడు, చిత్రమ్ = చిత్రము (చిత్రయతి అద్భుతమైనది), సురైః= దేవతల చేత (సుష్ఠు రాతి దదాతి అభీష్టమ్ కోరికను నెరవేర్చువాడు. దేవత), త్వమ్= నువ్వు, ఇతి = అని, అభినుతః అసి= పొగడబడితివి (నౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తుతి).

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! వృషభరూపంలో ఉన్న అరిష్టుడను రాక్షసుని చంపుట వలన భూమియందు ధర్మము సుస్థిరమయినది. ఇంద్రుని మనస్సులో గొప్ప సంతోషము పెరిగింది. ఇది చిత్రమని దేవతల చేత నువ్వు పొగడబడితివి.

**విశేషము**

**చిత్రము:** వృషభసంహారముచే భూమియందు ధర్మము యొక్క నిలుకడ సుస్థిరమయ్యెను. దాని వలన ఇంద్రుని మనసును కూడా ఆనంద సమృద్ధి కలిగెను

అని దేవతలు ఇది చిత్రమనిరి. వృష( ఎద్దు ) ఘాతము వలన –వృషము(ధర్మము) యొక్క స్థితి– వృష (ఇంద్రుడు)చేతము కలవారికి సంతోషము కలిగించినది. వృషభశబ్దమునకు వృషభము–ఇంద్రుడు–ధర్మము అను నానార్థములు ఉన్నవి. ఆ వృష పదముతో చేసిన శ్లేషకల్పనము చిత్రము.

**70–10 శ్లో.**
**ఔక్షకాణి పరిధావత దూరం**
**వీక్ష్యతామయమిహోక్షవిభేదీ ।**
**ఇత్థమాత్తహసితైస్సహ గోపై**
**ర్గేహగస్త్వమవ వాతపురేశ! ॥**

**ప్రతిపదార్థము:** ఔక్షకాణి= ఓ ఎద్దులారా! (ఉక్షాణాం వృషాణామ్ ఎడ్ల మంద), దూరం= మీరు దూరముగా, పరిధావత= పారిపోండి, ఉక్షవిభేదీ = ఎద్దును (వృషభాసురుని) చంపిన, అయమ్ = ఈ కృష్ణుడు, ఇహ = ఇక్కడే ఉన్నాడు, వీక్ష్యతామ్= చూడండి, ఇత్థమ్= ఈ విధముగా(అనేన ప్రకారేణ – ఈ విధంగా), ఆత్త హసితైః = హాస్య వచనములు పలుకుచున్న(ఆదత్తః గృహీతః ప్రాప్తో వా పొందబడిన), గోపైః సహ= గోపాలకులతో, త్వమ్ = నువ్వు, గేహగః = ఇంటికి వెళ్ళావు, వాతపురేశ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అవ= రక్షింపుము.

**తాత్పర్యము:** ‘ఓ ఎద్దులారా! మీరు దూరముగా పారిపోండి. ఎద్దును (వృషభాసురుని) చంపిన కృష్ణుడు ఇక్కడే ఉన్నాడు. చూడండి.’ ఈ విధముగా హాస్య వచనములు పలుకుచున్న గోపాలకులతో నువ్వు ఇంటికి వెళ్ళావు. ఓ గురువాయూరు కృష్ణ దేవా! రక్షింపుము

***దశమ స్కంధము***

**70వ దశకము సమాప్తము**

# దశకమ్ 71 – కేశీ , వ్యోమాసురవధ

**71–1 శ్లో.**

**యత్నేషు సర్వేష్వపి నావకేశీ కేశీ స భోజేశితురిష్టబంధుః ।**

**త్వం సింధుజాఽవాప్య ఇతీవ మత్వా సంప్రాప్తవాన్ సింధుజవాజిరూపః ॥**

**ప్రతిపదార్థము:** స భోజ ఈశితుః= ఆ భోజ మహారాజు ఆయిన కంసునికి, ఇష్టబంధుః= చాలా ప్రియమైన ఇష్టబంధువు అయిన (ఇష్యతే అసౌ అభిలషితము, ఇష్టమైనది పూజింపబడ్డవాడు), కేశీ = 'కేశి' అను పేరుగలవాడు (మంచి వెండ్రుకలు గలవాడు), సర్వేషు = అన్నివిధములైన, యత్నేషు అపి= ప్రయత్నములందు(యతతే తస్య భావః కర్మ వా ప్రయత్నము), న అవకేశీ= అవంధ్యుడు (విఫలమెరుగనివాడు) (అవకేశి= గొడ్డు వోయినది (చెట్టు), ఫలింపనిది. తక్కువ వెండ్రుకలు గలవాడు), త్వం = నిన్ను, సింధుజా= సముద్రుని కూతురు మహాలక్ష్మికి, (స్యందతే జలం అస్యదీని జలము ప్రవహించును. సింధూ దేశము), అవాప్య = పొందదగినది, ఇతి = అని, మత్వా = తలచి కాబోలు, సింధుజ వాజి రూపః = సింధుదేశమందు బుట్టిన గుర్రము (సైంధవము), ఇవ= వలె, సంప్రాప్తవాన్=నిన్ను సమీపించెను.

**తాత్పర్యము:** ఆ భోజ మహారాజు ఆయిన కంసునికి చాలా ప్రియమైన ఇష్టబంధువు అయిన 'కేశి' అను పేరుగలవాడు అన్నివిధములైన ప్రయత్నములందు బహు నేర్పరి. నిన్ను సముద్రుని కూతురు మహాలక్ష్మికి నిలయుడవని తలచి కాబోలు – తాను కూడా సముద్రమందు పుట్టిన అశ్వరూపమును ధరించి నీ దగ్గరకు వచ్చెను.

**విశేషము:** సింధుజా అనే పదాన్ని కవి ఈ శ్లోకంలో చమత్కరించాడు. సింధుజా అనగా సముద్రుని కూతురు మహాలక్ష్మి అని ఒక అర్థం. సింధుదేశమందు పుట్టిన గుర్రము అని మరొక అర్థం. సింధువనగా సముద్రమని అర్థము కనుక సాగరమందు పుట్టిన గుర్రము అని ఇంకొక అర్థం.

**71-2 శ్లో.**

**గంధర్వతామేష గతోఽపి రూక్షైర్నాదైః సముద్వేజితసర్వలోకః ।**
**భవద్విలోకావధి గోపవాటీం ప్రమర్ద్య పాపః పునరాపతత్ త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏషః = వీడు, గంధర్వతామ్= గుఱ్ఱము యొక్క స్వరూపము, గతః అపి = పొందినప్పటికి, రూక్షైః నాదైః= భయంకరమైన సకిలింపులచే(రూక్షయతి పరుషమైనది), సర్వ లోకః= సమస్త లోకములను, సముద్వేజిత= బాగా భయ పెట్టుచు, భవత్ విలోక అవధి= నీ దర్శనమగునంతవరకు, గోపవాటీం = వ్రేపల్లెను, ప్రమర్ద్య= బాధించి, పాపః= ఆ పాపాత్ముడు (పాపం తద్యోగాత్ పాపః-పాపము వున్నవాడు), పునః = మరలా, త్వామ్= నిన్ను, ఆపతత్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యము:** వీడు గుఱ్ఱము యొక్క స్వరూపము పొందినప్పటికి, భయంకరమైన సకిలింపులచే సమస్త లోకములను భయ పెట్టుచు నీ దర్శనమగునంతవరకు వ్రేపల్లెను బాధించి ఆ పాపాత్ముడు మరలా నిన్ను ఎదుర్కొన్నాడు. (కృష్ణ దర్శన మయిన తరువాత పాపకార్యాలకు చోటు లేదని భావం)

**విశేషము:** ఈ శ్లోకంలో గంధర్వ శబ్దంతో చమత్కారం. గంధర్వ పదానికి గుఱ్ఱము ,మగకోయిల ,దేవయోని విశేషము, పాట పాడువాడు అని రకరకాల అర్థాలున్నాయి. వీటిలో గుఱ్ఱము, పాట పాడువాడు అను రెండు అర్థాలను కవి వాడు కొన్నాడు. గంధర్వుడు చక్కగా పాట పాడతాడు. వినసొంపుగా ఉంటుంది. కాని కేశి గంధర్వుడయినప్పటికి గుఱ్ఱము యొక్క స్వరూపము పొంది, భయంకరమైన సకిలింపులతో వినుటకు అయోగ్యుడయ్యాడని భావం.

**71-3 శ్లో.**

**తార్క్ష్యార్పితాంఘ్రేస్తవ తార్క్ష్య ఏష చిక్షేప వక్షోభువి నామపాదమ్ ।**
**భృగోః పదాఘాతకథాం నిశమ్య స్వేనాపి శక్యం తదితీవ మోహాత్ ॥**

**ప్రతిపదార్థము:** ఏష తార్క్ష్యః = ఈ తార్క్ష్య (గుఱ్ఱము) రూపములో ఉన్న ఈ కేశి అనే రాక్షసుడు, తార్క్ష్య= గరుత్మంతుని యందు (తార్క్ష్యస్య అపత్యమ్ కశ్యపుని కుమారుడు. గరుడుడు), అర్పిత= ఉంచబడిన, అంఘ్రేః తవ= పాదము గల నీ

యొక్క, వక్షోభువి= వక్ష స్థలము నందు, నామ = రూఢిగా (పూర్వము), భృగోః = భృగు మహర్షి, పద ఆఘాత = తనపాదముతో నీ వక్షస్థలమును తన్నిన, కథాం= కథను (కథ్యతే ఇతి కథా– చెప్పబడునది చెప్పుట కథాసాహిత్యము), నిశమ్య = విని, స్వేన అపి = తానుకూడా, తత్ శక్యం= అది చేయుటకు శక్యమగునని(శక్నోతి తస్య భావః కర్మ వా సమర్థుడు, శక్తి కలవాడు. శక్యము), ఇతి ఇవ= అని అనుకొన్నట్లుగా, మోహాత్= మోహము వలన (అజ్ఞానము వలన), పాదమ్= తన పాదమును (పద్యతే గమ్యతే అనేన–దీనితో వెళ్లుదురు. పాదము), చిక్షేప = విసరెను (అనగా నిన్ను తన్నెను).

**తాత్పర్యము:** ''పూర్వకాలములో త్రిమూర్తులలో శ్రేష్ఠుడు ఎవరో తెలిసికొనిరమ్మ'' – అని భృగుమహర్షిని పంపిస్తే , ఆ మహర్షి వైకుంఠంలో ఉన్న విష్ణువు యొక్క ఎదపై తన్నాడు. తార్క్ష్య (గుఱ్ఱము) రూపములో ఉన్న ఈ కేశి అనే రాక్షసుడు కూడా భృగుమహర్షి లా తార్క్ష్య (గరుడ) వాహనుడవైన నీయొక్క ఎదను తన్నుటకు సిద్ధపడ్డాడు. ఈ కేశి ఆ భృగుమహర్షి చేసిన పనిని విన్నాడో ! ఏమో !

**71–4 శ్లో.**

**ప్రవంచయన్నస్య ఖురాంచలం ద్రాగముం చ చిక్షేపిథ దూరదూరమ్ ।**
**సమ్మూర్ఛితోఽపి హ్యతిమూర్ఛితేన క్రోధోష్మణా ఖాదితుమాద్రుతస్త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** అస్య= నీవు ఆ రాక్షసుడు – అగు 'కేశి' యొక్క, ఖురాంచలం= ఖురప్రహారమును (పాద తాడనమును) (ఖుర్యతే ఛిద్యతే ద్విధా అసౌ రెండుగా చీల్చబడినది. గిట్ట), ప్రవంచయన్నస్య = తప్పించుకొని (ప్రకృష్టం వంచనమ్ మోసము), ద్రాక్= తటాలున (ద్రాతి శీఘ్రమ్ త్వరగా), అముం చ= అతని కాళ్ళను పట్టుకొని బలముగా, దూరదూరమ్= చాలా దూరము, చిక్షేపిథ = విసరితివి, సమ్మూర్ఛితః అపి= వాడు మూర్ఛపోయినప్పటికి తేరుకొని (సం అధికం మూర్ఛనం విస్తారో వా మూర్ఛ), అతిమూర్ఛితేన = ప్రవృద్ధమైన, క్రోధ ఊష్మణా= క్రోధావేశముతో, త్వామ్ = నిన్ను, ఖాదితుమ్= తినుటకు(మింగుటకు), ఆద్రుతః హి = నీ మీదికి దూకెను.

**తాత్పర్యము:** నీవు ఆ రాక్షసుడు – అగు 'కేశి' యొక్క పాద తాడనమును తప్పించుకొని తటాలున అతని కాళ్ళను పట్టుకొని బలముగా చాలా దూరము విసరితివి. వాడు మూర్ఛపోయినప్పటికి తేరుకొని ప్రవృద్ధమైన క్రోధావేశముతో నిన్ను మ్రింగుటకు నీ మీదికి దూకెను.

**71–5 శ్లో.**

**త్వం వాహదండే కృతధీశ్చ బాహాదండం న్యధాస్తస్య ముఖే తదానీమ్ ।**
**తద్వృద్ధిరుద్ధశ్వసనో గతాసుః సప్తీభవన్నప్యయమైక్యమాగాత్ ॥**

**ప్రతిపదార్థము:** త్వం =నువ్వు, వాహ= వాహము యొక్క అనగా గుఱ్ఱము యొక్క (ఉహ్యతే అనేన దీనితో మోయబడును. గుఱ్ఱము), దండే = దండించుటను, కృతధీః చ= కోరియున్నప్పటికి(కృతా సంపాదితా అధ్యయనాదినా ధీః బుద్ధిః యేన – అధ్యయనాదుల ద్వారా జ్ఞానమును పొందినవాడు శుద్ధ అంతఃకరణము కలవాడు), బాహా దండం = నీ బాహుదండమును (దండమువలె దీర్ఘమైన బాహువును), తస్య ముఖే = వాని నోటియందు, న్యధాః= దూర్చితివి, తదానీమ్ =అప్పుడు, తద్ వృద్ధిః = లోపలికి వెళ్ళిన ఆ చేయి ఉబ్బగా, (వర్ధతే తస్య భావః కర్మ వా వృద్ధి, సమృద్ధి, అభ్యుదయము), రుద్ధ శ్వసనః = ఊపిరాడక (రుద్ధః అవరుద్ధః, ఆవృతః–ఆపబడ్డది, కప్పబడ్డది), గతాసుః = ప్రాణము కోల్పోయి, సప్తీభవన్ అపి= గుర్రమైనప్పటికి, ఐక్యమ్ = నీలో ఐక్యమును (సాయుజ్యమును=దేవునిలో కలిసిపోవుటను పొందాడు), ఆగాత్= పొందెను, సప్తిభవన్ అపి=ఏడు ముక్కలై కూడా, ఐక్యం= ఒక్కడగుటను, ఆగాత్=పొందెను, అని రెండవ అర్థం

**తాత్పర్యము:** నువ్వు గుఱ్ఱము యొక్క వధను కోరి దండమువలె ఉన్న దీర్ఘమైన నీ బాహువును వాని నోటియందు దూర్చితివి. అప్పుడు లోపలికి వెళ్ళిన ఆ చేయి ఉబ్బగా, ఊపిరాడక ప్రాణము కోల్పోయి గుర్రమైనప్పటికి నీలో ఆ కేశి అను రాక్షసుడు ఐక్యమును పొందెను (ఏడు ముక్కలై కూడా ఒక్కడగుటను పొందెను.)

**71-6 శ్లో.**

**ఆలంభమాత్రేణ పశోః సురాణాం ప్రసాదకే నూత్న ఇవాశ్వమేధే ।**
**కృతే త్వయా హర్షవశాత్ సురేంద్రాస్త్వాం తుష్టువుః కేశవనామధేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** పశోః= అశ్వమేధయాగములో పశువు యొక్క(పాశ్యతే బధ్యతే అసౌ బంధింపబడినది. గ్రామ్య పశువు), ఆలంభ మాత్రేణ= హింసచేత (ఆలంభతే స్పృశతి తస్య భావః–స్పృశించుట. 'అశ్వాలంభము, గవాలంభము'. (అశ్వమేధ గోమేధయాగంలో జంతువులను యాగాంతములో స్పృశించి వదిలి పెట్టుట), సురాణాం= దేవతలకు, ప్రసాదకే= సంతోషము కలుగును(వారి అనుగ్రహము కలుగును), నూత్న ఇవ = ఆవిధముగానే కొత్తదయిన, అశ్వమేధే =అశ్వమేధము (కేశిరూపములో అశ్వసంహారము) (అశ్వః మేధ్యతే హింస్యతే అత్ర–ఇక్కడ గుఱ్ఱము చంపబడును. అశ్వమేధ యాగము), త్వయా కృతే= నువ్వు చేయగా, సుర –ఇంద్రాః = దేవతాశ్రేష్ఠులు, హర్షవశాత్= సంతోషించి, కేశవ నామధేయమ్= కేశవ అను నామముతో, త్వాం = నిన్ను, తుష్టువుః= స్తుతించిరి.

**తాత్పర్యము:** అశ్వమేధయాగములో పశువు యొక్క హింసచేత దేవతల అనుగ్రహము కలుగును. ఆవిధముగానే కొత్తదయిన అశ్వమేధము (కేశి రూపములో అశ్వసంహారము) నువ్వు చేయగా దేవతాశ్రేష్ఠులు సంతోషించి ''కేశవ'' అను నామముతో నిన్ను స్తుతించిరి.

**విశేషము:** కేశం కేశినం వాతి హినస్తి – కేశిని చంపినవాడు కనుక కేశవుడు అను విష్ణువుకు పేరువచ్చెను. కేశవ పదముతో కవి చేసిన చమత్కారము ఈ శ్లోకంలో కనబడుతుంది..

**71-7 శ్లో.**

**కంసాయ తే శౌరిసుతత్వముక్త్వా తం తద్వధోత్కం ప్రతిరుధ్య వాచా ।**
**ప్రాప్తేన కేశిక్షపణావసానే శ్రీనారదేన త్వమభిష్టుతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** కంసాయ= కంసునికొరకు (కంసునికి), తే= నీయొక్క, శౌరి సుతత్వమ్= వసుదేవసుతుడవగు 'శౌరివి' – అని నీగురించి (శూరుని కొడుకు

అయిన వసుదేవునికి పుట్టినందున కృష్ణునికి శౌరి అని పేరు కలిగెను), ఉక్త్వా= చెప్పి, తత్ వధ= వసుదేవుని చంపవలెననుకొని, ఉత్కం=ప్రయత్నము చేయ బోయిన (ఉద్యతమనస్కమ్ ఉత్కంఠగల), తం= ఆ కంసుని, వాచా ప్రతిరుధ్య = వలదని మాటలతో నివారించి, కేశి క్షపణ అవసానే= కేశిసంహారమయిన తరువాత విరాజిల్లుతున్న, త్వమ్= నువ్వు, ప్రాప్తేన = కలుసుకొన్న, శ్రీ నారదేన= శ్రీ నారద మహర్షిచే, అభిష్టుతః అభూః= కీర్తింపబడినవాడివి అయితివి, నారదుడు నీవు వసుదేవుని కుమారుడు కంసునికి దెలిపి, కంసుడు వసుదేవుని జంపబోగా వలదని నివారించి, వచ్చి కేశిసంహారమయిన తరువాత, నిన్ను కీర్తించెను.

**తాత్పర్యము:** నారదముని – కంసుని వద్దకు వెళ్ళి నీవు వసుదేవసుతుడవయిన 'శౌరివి' – అని చెప్పెను. అందువలన కోపించి వసుదేవుని చంపవలెననుకొని కృతనిశ్చయముతోనున్న కంసుని ఆ ప్రయత్నము మానుకొమ్మని నివారించెను. . ఆ తరువాత నారదముని నీ చెంతకు వచ్చి కేశి సంహార కారకుడవయిన నిన్ను స్తుతించెను.

**71–8 శ్లో.**

**కదాపి గోపైస్సహ కాననాంతే నిలాయనక్రీడనలోలుపం త్వామ్ ।**
**మయాత్మజః ప్రాప దురంతమాయో వ్యోమాభిధో వ్యోమచరోపరోధీ ॥**

**ప్రతిపదార్థము:** కదాపి= ఒకప్పుడు, గోపైః సహ= గోపాలకులతో, కాననాంతే= అడవియందు (కం జలం అననం జీవనం అస్య–జలమే జీవనంగా గలది. వనము), నిలాయన క్రీడన = దొంగను పట్టుకొనే దాగుడు మూతల ఆటలో, లోలుపం=నిమగ్నుడవై ఉన్న, త్వామ్ = నీ దగ్గరకు, వ్యోమచర ఉపరోధీ= దేవతల శత్రువైన (వ్యోమ్ని చరతి ఆకాశంలో విహరించునది. పక్షి దేవత గ్రహ నక్షత్రములు సూర్యుడు), మయ ఆత్మజః= మయుని కుమారుడైన, వ్యోమ అభిధః = వ్యోమాసురుడను పేరు కలిగిన, దురంతమాయః = గొప్ప మాయావి(దుష్టః అంతః యస్య–చెడు ఫలితము కలది. దురలవాట్లు), ప్రాప = వచ్చెను.

**తాత్పర్యము:** ఒకప్పుడు గోపాలకులతో అడవియందు దొంగను పట్టుకొనే దాగుడు

మూతల ఆటలో నిమగ్నుడవై ఉన్న నీ దగ్గరకు దేవతల శత్రువైన మయుని కుమారుడైన వ్యోమాసురుడను పేరు కలిగిన గొప్ప మాయావి వచ్చెను

**71-9 శ్లో.**

**స చోరపాలాయితవల్లవేషు చోరాయితో గోపశిశూన్ పశూంశ్చ ।**
**గుహాసు కృత్వా పిదధే శిలాభిస్త్వయా చ బుద్ధ్వా పరిమర్దితోఽభూత్ ॥**

**ప్రతిపదార్థము:** చోరపాలాయిత వల్లవేషు=గోపాల బాలురు ఆడుకొను ''చోరుడు – రక్షక భటులు'' అను ఆటలో, సః = ఆ వ్యోమాసురుడు, చోరాయితః = ఒక దొంగగామారి (చోరయతి అసౌ దొంగిలించువాడు. దొంగ), గోప శిశూన్ = గోప బాలకులను, పశూన్ చ= ఆవులను, గుహాసు= పర్వత గుహలలో, కృత్వా = ఉంచి, శిలాభిః = వారు బయటకు రాకుండా బండ రాళ్లతో(శీర్యతే ఛిద్యతే ఘనాదిభిః– దెబ్బలచే చీల్చబడునది. శిలా), పిదధే = మూసివేసెను, త్వయా చ బుద్ధ్వా = నువ్వు ఈ దుష్ట ప్రయత్న విషయము గుర్తించి, పరిమర్దితః అభూత్= ఆ వ్యోమాసురుని సంహరించావు.

**తాత్పర్యము:** గోపాల బాలురు ఆడుకొను ''చోరుడు – రక్షక భటులు'' అను ఆటలో ఆ వ్యోమాసురుడు ఒక దొంగగామారి గోప బాలకులను, ఆవులను పర్వత గుహలలో ఉంచి వారు బయటకు రాకుండా బండ రాళ్లతో మూసివేసెను. నువ్వు ఈ దుష్ట ప్రయత్న విషయము గుర్తించి ఆ వ్యోమాసురుని సంహరించావు.

**71-10 శ్లో.**

**ఏవంవిధైశ్చాద్భుతకేళిభేదైరానందమూర్ఛామతులాం వ్రజస్య ।**
**పదే పదే నూతనయన్నసీమాం పరాత్మరూపిన్! పవనేశ! పాయాః ॥**

**ప్రతిపదార్థము:** ఏవంవిధైః చ = ఇటువంటి, అద్భుతకేళిభేదైః = చిత్రాతి చిత్రమైన లీలలు చేసి(కేలంతి విలసంతి తస్య భావః–పరిహాసము విలాసము ఆట), వ్రజస్య = గోకులములో, పదే పదే= అడుగడుగున (అనుక్షణము), అతులాం= పోలికలేని, నూతనయన్= నిత్య నూతనమైన, అసీమాం= అంతులేని, ఆనందమూర్ఛామ్ =

ఆనందాతిశయాన్ని కలిగించుచుంటివి, పరాత్మరూపిన్= పరమాత్మ రూపీ!, పవనేశ = ఓ గురువాయూరు కృష్ణదేవా!, పాయాః = నన్ను రక్షింపుము.

**తాత్పర్యము:** ఇటువంటి చిత్రాతి చిత్రమైన లీలలు చేసి గోకులములో అనుక్షణము దేనితో పోలికలేని, నిత్య నూతనమైన, అంతులేని ఆనందాతిశయాన్ని కలిగించు చుంటివి. ఓ పరమాత్మ రూపీ! ఓ గురువాయూరు కృష్ణదేవా! నన్ను రక్షింపుము.

**విశేషాలు**

**పరాత్మ:** పరాత్మ అనగా పరమాత్మ. అండ పిండాదులన్నిటికీ సాక్షియైన చైతన్యం. అన్ని ఉపాధులనూ వ్యాపించి అన్నిటినీ తనలో కలుపుకొన్న సామాన్య చైతన్యం. నిర్మలమైన తత్త్వం. బ్రహ్మం.

*దశమ స్కంధము*

**71వ దశకము సమాప్తము**

# దశకమ్ 72 – అక్రూరగోకులయాత్ర

**72-1 శ్లో.**

**కంసోఽథ నారదగిరా వ్రజవాసినం త్వాం**
**ఆకర్ణ్య దీర్ణహృదయస్స హి గాందినేయమ్ ।**
**ఆహూయ కార్ముకమఖచ్ఛలతో భవంతం**
**అనేతుమేనమహినోదహినాథశాయిన్ ॥**

**ప్రతిపదార్థము:** అహినాథశాయిన్ = శేష శాయీ! (పాముపై పరుండువాడు. విష్ణువు), అథ = అటుపిమ్మట, కంసః = కంసుడు (కనతి కామయతే పరపదార్థాన్ ఇతర పదార్థములను కోరువాడు, బలాత్కారంగా తీసుకొనువాడు. ఉగ్రసేనుని కుమారుడు, కంసుడు), నారద గిరా = నారదుని మాట వలన (నారం అజ్ఞానం ద్యతి నాశయతి అజ్ఞానమును నాశనము చేయువాడు. నారదుడు), త్వాం వ్రజవాసినం= నీవు వ్రేపల్లెలో ఉన్నట్లు, ఆకర్ణ్య= విని, దీర్ణ హృదయః= చకిత మతియై (మనసుచెదరి)(దీర్ణః విదారితః – చీల్చబడినది భయపడినవాడు), సః= అతడు (కంసుడు), గాందినేయమ్ = గాందిని పుత్రుడగు అక్రూరుని(గాందిన్యా సుతః అక్రూరః – గాందిని కుమారుడు. అక్రూరుడు.)(గాం ధేనుం దదాతి ప్రతిదినము గోదానము చేయునది. అక్రూరుని తల్లి, గాందిని), ఆహూయ= పిలిచి, కార్ముక మఖః చలతః = మధురలో జరుగుచున్న ధనుర్యాగము చూచుటకు రమ్మను నెపము చేత (కర్మణే ప్రభవతి కర్మయందు యోగ్యత గలది. ధనుస్సు) (మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర–దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము, యాగము), భవంతం= నిన్ను, అనేతుమ్ = తీసికొనిరమ్మని, ఏనమ్ = ఆ అక్రూరుని, అహినోత్ హి= పంపెను కదా!

**తాత్పర్యము:** శేష శాయీ! అటుపిమ్మట కంసుడు నారదుని మాట వలన నీవు వ్రేపల్లెలో ఉన్నట్లు విని మనసుచెదరి, గాందిని పుత్రుడగు అక్రూరుని పిలిచి మధురలో జరుగుచున్న ధనుర్యాగము చూచుటకు రమ్మను నెపము చేత నిన్ను తీసికొనిరమ్మని ఆ అక్రూరుని పంపెను.

**విశేషాలు**

**నారదుని మాట:** "విష్ణువు నిన్ను వధించుటకు దేవకికి జన్మించి నంద వ్రజములో పెరుగుచున్నాడు" అని నారదుడు కంసునితో చెప్పిన మాట.

**72-2 శ్లో.**
**అక్రూర ఏష భవదంఘ్రిపరశ్చిరాయ**
**త్వద్దర్శనాక్షమమనాః క్షితిపాలభీత్యా ।**
**తస్యాజ్ఞయైవ పునరీక్షితుముద్యతస్త్వాం**
**ఆనందభారమతిభూరితరం బభార ॥**

**ప్రతిపదార్థము:** ఏషః అక్రూరః= ఈ అక్రూరుడు(న క్రూరః-క్రూరత్వం లేనివాడు. దయాళువు ఒకానొక యదువంశ రాజు), భవత్ అంఘ్రి పరః= నీ పాద ధ్యాన నిరతుడు (నీ భక్తుడు) (అంఘతే గచ్ఛతి అనేన – చరణము. కాలు), చిరాయ= చాలాకాలమునుండి, త్వత్ దర్శన= నీ దర్శనము చేసుకొనవలెనని, మనాః = కోరిక ఉన్నప్పటికి, క్షితిపాల భీత్యా= రాజైన కంసుని వలని భయముతో, అక్షమః= ఆ కోరిక నెరవేర్చుకోలేక పోయాడు. (న క్షమా సామర్థ్యము లేనివాడు), పునః = మరలా ఇప్పుడు, తస్య ఆజ్ఞయా ఏవ= రాజాజ్ఞచేతనే (ఆజ్ఞాపనం ఆదేశః- ఆజ్ఞాపనము, ఆదేశము), త్వాం= నిన్ను, ఈక్షితుమ్ ఉద్యతః = చూచుటకు ఏర్పాటు మొదలు పెట్టి, అతి భూరితరం= (నిన్ను చూచుభాగ్యము వచ్చినదని) అంతులేని, ఆనంద భారమ్= ఆనంద పరవశ భారము(ఆనందయతి నితరాం తోషయతి అసౌ ఆనందింపచేయునది. సంతోషము), బభార= పొందెను.

**తాత్పర్యము:** ఈ అక్రూరుడు నీ భక్తుడు. చాలాకాలమునుండి నీ దర్శనము చేసుకొనవలెనని కోరిక ఉన్నప్పటికి రాజైన కంసుని వలని భయముతో ఆ కోరిక నెరవేర్చుకోలేక పోయాడు. ఇప్పుడు రాజాజ్ఞచేతనే నిన్ను చూచుభాగ్యము వచ్చినదని అంతులేని ఆనంద పరవశము పొందెను.

**72–3 శ్లో.**

**సోఽయం రథేన సుకృతీ భవతో నివాసం**
**గచ్ఛన్ మనోరథగణాంస్త్వయి ధార్యమాణాన్ ।**
**ఆస్వాదయన్ ముహురపాయభయేన దైవం**
**సంప్రార్థయన్ పథి న కించిదపి వ్యజానాత్ ॥**

**ప్రతిపదార్థము:** సః అయం సుకృతీ = ఆ పుణ్యశాలియగు అక్రూరుడు (సుకృతం అనేన సుకృతం అస్తి అస్య – ఇతనిచే మంచి చేయబడినది మంచి కలవాడు పుణ్యవంతుడు శుభయుక్తుడు), రథేన = రథమెక్కి(రమ్యతే అనేన అత్ర వా దీనితో ఆనందింతురు. రథము), భవతః నివాసం= నీ నివాసమైన వ్రేపల్లెకు, గచ్ఛన్= బయలుదేరి, త్వయి= నీయందు, ముహుః= మాటిమాటికి, మనోరథ గణాన్= అనేక మనోరథములను(దర్శనము, స్పర్శనముమొదలయిన కోరికలను)(మన ఏవ రథః అత్ర, మనసః రథః ఇతి వా మనస్సే రథము. కోరిక), ధార్యమాణాన్ = మనసులో ధరించి (తలచుకొనుచు), ఆస్వాదయన్= నీ లీలలను ఆస్వాదించుచూ, అపాయ భయేన = కంస భృత్యుల వలన నీ దర్శనమునకు ఏదైనా ఆటంకము కలుగునేమో అను అపాయ భయముతో (అప అయనం గమనమ్ ప్రక్కకు పోవుట దుఃఖము ఆపద), దైవం సంప్రార్థయన్= నాకు శ్రీ కృష్ణ దర్శనం కలగాలని దైవాన్ని ప్రార్థిస్తూ, పథి = మార్గ మధ్యములో, కించిత్ అపి= నువ్వు కాక మరే ఇతర విశేష విషయాన్ని, న వ్యజానాత్= మరిచిపోయెను.

**తాత్పర్యము:** ఆ పుణ్యశాలియగు అక్రూరుడు రథమెక్కి నీ నివాసమైన వ్రేపల్లెకు బయలుదేరి నిన్నే తలచుకొనుచు, నీ లీలలను ఆస్వాదించుచూ కంస భృత్యుల వలన నీ దర్శనమునకు ఏదైనా ఆటంకము కలుగునేమో అను అపాయ భయముతో నాకు శ్రీ కృష్ణ దర్శనం కలగాలని దైవాన్ని ప్రార్థిస్తూ మార్గ మధ్యములో నువ్వు కాక మరే ఇతర విశేష విషయాన్ని మరిచిపోయెను. (నీ సందర్భమందలి కోరికచే ప్రపంచమునేమర్చిపోయెనని భావం).

**72-4 శ్లో.**

**ద్రక్ష్యామి వేదశతగీతగతిం పుమాంసం**
**స్ప్రక్ష్యామి కింస్వి దపి నామ పరిష్వజేయమ్ ।**
**కిం వక్ష్యతే స ఖలు మాం క్వను వీక్షితః స్యాత్**
**ఇత్థం నినాయ స భవన్మయమేవ మార్గమ్ ॥**

**ప్రతిపదార్థము:** వేద శత=వేదములచే (ఉపనిషత్తులచే)(విదంతి జానంతి బుధాః సర్వం అనేన మంత్రబ్రాహ్మణాత్మకః శ్రుతికదంబః-విజ్ఞులు దీనితో అంతయు తెలుసుకొందురు. మంత్ర బ్రాహ్మణములతో కూడుకున్న వేద సమూహము), గీత= ప్రతిపాదితమయిన, గతిం= స్వరూపము కలిగిన, పుమాంసం = వేద పురుషుని, కింస్విత్ = ఎట్లు, ద్రక్ష్యామి = చూసెదను?, స్ప్రక్ష్యామి= ఎట్లు అతని స్పర్శన సుఖమును అనుభవిస్తాను?, అపి నామ= ఎట్లు, పరిష్వజేయమ్ = కౌగిలింతును?, కిం వక్ష్యతే = నన్ను చూడగానే అతడు ఏమి పలుకును?, క్వను= ఏ ప్రదేశములో, మాం = నన్ను, సః వీక్షితః స్యాత్=అతడు చూచునో?, ఇత్థం = ఈ విధముగా నీ స్మరణములతో, భవన్మయమ్ ఏవ మార్గమ్= అంతటా నువ్వే నిండియున్న మార్గములో, సః నినాయ ఖలు = అక్రూరుడు ప్రయాణించెను కదా!

**తాత్పర్యము:** ఉపనిషత్తులచే ప్రతిపాదితమయిన స్వరూపము కలిగిన వేద పురుషుని ఎట్లు చూసెదను? ఎట్లు అతని స్పర్శన సుఖమును అనుభవిస్తాను? ఎట్లు కౌగిలింతును? నన్ను చూడగానే అతడు ఏమి పలుకును? (నా నమస్కారము స్వీకరించి హే అక్రూరా అని పలుకునా? ) ఏ ప్రదేశములో నన్ను అతడు చూచునో? ఈ విధముగా నీ స్మరణములతో - అంతటా నువ్వే నిండియున్న మార్గములో - అక్రూరుడు ప్రయాణించెను కదా!

**72-5 శ్లో.**

**భూయః క్రమాదభివిశన్ భవదంఘ్రిపూతం**
**బృందావనం హరవిరించసురాభివంద్యమ్ ।**
**ఆనందమగ్న ఇవ లగ్న ఇవ ప్రమోహే**
**కిం కిం దశాంతరమవాప న పంకజాక్ష! ॥**

**ప్రతిపదార్థము:** పంకజ అక్ష =పద్మముల వంటి కన్నులు కలవాడా!, భూయః = మరలా, క్రమాత్ = క్రమముగా, అభివిశన్ = ప్రయాణము చేసి చేసి చివరకు, భవత్ = నీ, అంఘ్రిపూతం= పాదస్పర్శతో పవిత్రమైన, హర విరించ సుర అభివంద్యమ్ = శివ బ్రహ్మాది దేవతలచే వందనీయమయిన(హరతి పాపాన్ పాపములను హరించువాడు. రుద్రుడు) (విపూర్ణతయా రిణక్తి రిక్తం కరోతి బ్రహ్మాండం, తస్మాత్ నిష్క్రమ్య బ్రహ్మాండమునుండి నిష్క్రమించి దానిని పూర్తిగా ఖాళీ చేసినవాడు. బ్రహ్మ), బృందావనం = బృందావనములో ప్రవేశించి (వృందానాం తులసీగుల్మానాం వనమ్ తులసివనము. వృందావన తీర్థము), ఆనంద మగ్న ఇవ= ఆనంద సముద్రమున మునిగిన వాని వలె(మగ్నః నిమగ్నః, స్నాతః – నిమగ్నుడైనవాడు మునిగినవాడు), ప్రమోహే లగ్న ఇవ = బహిర్వికార అభావుడై మూఢుని వలె (మై మరచి), కిం కిం దశాంతరమ్= అతని హృదయము ఎన్నెన్ని విధములుగా స్పందించి ఆనందించెనో, న అవాప = ఆ ఆనంద దశా పరిణామములను చెప్పుటకు వీలుకాదు.(అద్భుతమైన అనందమును పొందాడని భావం).

**తాత్పర్యము:** పద్మముల వంటి కన్నులు కలవాడా! అక్రూరుడు క్రమముగా ప్రయాణము చేసి చేసి చివరకు నీ పాదస్పర్శతో పవిత్రమైన, శివ బ్రహ్మాది దేవతలచే వందనీయమయిన బృందావనములో ప్రవేశించి, ఆనంద సముద్రమున మునిగి అద్భుతమైన అనందమును పొందాడు.

**72–6 శ్లో.**
**పశ్యన్నవందత భవద్విహృతిస్థలాని**
**పాంసుష్వవేష్టత భవచ్చరణాంకితేషు ।**
**కిం బ్రూమహే బహుజనా హి తదాపి జాతాః**
**ఏవం తు భక్తితరలా విరలాః పరాత్మన్ ॥**

**ప్రతిపదార్థము:** పరాత్మన్= ఓ పరమాత్మా!, భవత్ విహృతి స్థలాని= బృందావనములో నువ్వు క్రీడించిన స్థలములను, పశ్యన్ = చూసి, అవందత= నమస్కారములు చేసెను, భవత్ చరణ అంకితేషు= నీ పాదములందు శంఖు చక్రాది చిహ్నములంటిన ఆ బృందావనములోని, పాంసుషు= ధూళిలో (పసయతి

నాశయతి ఆత్మానమ్ నశించునది. ధూళి, దుమ్ము), అవేష్టత = పొర్లాడెను, కిం బ్రూమహే= ఏమని చెప్పుదుము?, తదాపి = నువు తిరుగాడిన కాలములో, బహుజనా హి = నీకు ఎందరో భక్తులు, జాతాః= పుట్టారు, ఏవం తు = కాని అక్రూరుని వంటి, భక్తితరలాః= భక్తి పరవశులు, విరలాః =తక్కువ (చాలా అరుదుగా ఉంటారు).

**తాత్పర్యము:** ఓ పరమాత్మా! బృందావనములో నువ్వు క్రీడించిన స్థలములను చూసి నమస్కారములు చేసెను. నీ పాదములందు శంఖు చక్రాది చిహ్నములంటిన ఆ బృందావనములోని ధూళిలో పొర్లాడెను. ఏమని చెప్పుదుము? నువు తిరుగాడిన కాలములో నీకు ఎందరో భక్తులు పుట్టారు. కాని అక్రూరుని వంటి భక్తి పరవశులు తక్కువ (చాలా అరుదుగా ఉంటారు)

**72-7 శ్లో.**
**సాయం స గోపభవనాని భవచ్చరిత్ర-**
**గీతామృత ప్రసృతకర్ణరసాయనాని ।**
**పశ్యన్ ప్రమోదసరితేవ కిలోహ్యమానో**
**గచ్ఛన్ భవద్భవనసన్నిధిమన్వయాసీత్ ॥**

**ప్రతిపదార్థము:** సాయం=సాయంసమయానికి (స్యతి సమాయతి దినమ్ దినమును సమాప్తి చేయునది. సాయంకాలము), సః= ఆ అక్రూరుడు, భవత్ చరిత్ర =నీ లీలలను వర్ణించిన, గీత =గానములతో (గీయతే ఇతి పాడబడునది. గీత), ప్రసృత= విస్తరించి(అతిశయేన సృతః అగ్రే గతః విస్తృతో వా ముందు వెళ్లినవాడు విస్తరించినది), అమృత= అమృత నిష్యందములై (నాస్తి మరణం యస్మాత్ అమృతము), కర్ణ రసాయనాని = శ్రోత్రానందకరముగా ఉన్న (చెవుల కింపైన), గోపభవనాని = గోకులములోని గోపికల భవనములను, పశ్యన్ = చూస్తూ, ప్రమోదసరితా ఇవ= బ్రహ్మానందరూపమున ఉన్న నదులు, ఉహ్యమానః= తనను అనాయాసముగా మోయుచుండగా(ఆనంద సాగరంలోఓలలాడుచు), గచ్ఛన్ = ప్రయాణించుచూ, భవత్ భవన సన్నిధిమ్= నువ్వు నివసించు నంద భవన సమీపమునకు, అన్వయాసీత్ కిల= అక్రూరుడు చేరుకొనెను కదా!

**తాత్పర్యము:** సాయంసమయములో అక్రూరుడు నీ గృహమునకు చేరు – త్రోవలో గోపజనుల ఇండ్లనుండి – నీలీలలను వర్ణించు అమృత సదృశమయిన శ్రావ్యమయిన గానములను – వినెను. వారి గాన–గీతామృతములను ఆస్వాదించుచు ఆనందంతో అక్రూరుడు నువ్వు నివసించు నంద భవన సమీపమునకు చేరుకొనెను.

**72–8 శ్లో.**
**తావద్దదర్శ పశుదోహవిలోకలోలం**
**భక్తోత్తమాగతిమివ ప్రతిపాలయంతమ్ ।**
**భూమన్! భవంతమయమగ్రజవంతమంత–**
**ర్బ్రహ్మానుభూతిరససింధుమివోద్వమంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** భూమన్ = భగవానుడా! (సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థం), తావత్ = అప్పుడు, అగ్రజవంతమ్ = అన్న బలరామునితో కలిసి(అగ్రే జాతః–ముందు పుట్టినవాడు. అన్న), పశు దోహ విలోక లోలం= గోవులనుండి పాలు స్వీకరించు కార్యక్రమమును చూచుచున్న (దోగ్ధి తస్య భావః కర్మ వా పాలు పితుకుట), ఉత్తమ భక్త ఆగతిమ్ = ఉత్తమ భక్తుడైన అక్రూరుని రాకకై(ఆగతిః ఆగమనమ్ చేరుట), ప్రతిపాలయంతమ్ ఇవ= ఎదురుచూచుచున్నట్లున్న(ప్రతిపాలయతి రక్షతి తస్య భావః కర్మ వాసంరక్షించుట), అంతః = అక్రూరుని హృదయములో ఉన్న, బ్రహ్మ అనుభూతి రస సింధుమ్ = బ్రహ్మానందసాగరము, ఉద్వమంతమ్ ఇవ = తనకు ఎదుర్కోలు ఇవ్వటానికి ఒక రూపము ధరించి ఉబికి వచ్చినట్లుగా ఉన్న, భవంతమ్ = నిన్ను, అయమ్ దదర్శ= అక్రూరుడు చూసెను.

**తాత్పర్యము:** అప్పుడు అన్న బలరామునితో కలిసి– గోవులనుండి పాలు స్వీకరించు కార్యక్రమమును చూచుచున్న, ఉత్తమ భక్తుడైన అక్రూరుని రాకకై ఎదురుచూచు చున్నట్లున్న, అక్రూరుని హృదయములో ఉన్న బ్రహ్మానందసాగరము తనకు ఎదుర్కోలు ఇవ్వటానికి ఒక రూపము ధరించి ఉబికి వచ్చినట్లుగా ఉన్న కృష్ణుని – అక్రూరుడు చూసెను. (అక్రూరుడు చూచు సమయంలో కృష్ణుడు గోవులనుండి పాలు స్వీకరించు కార్యక్రమమును చూచుచున్నాడు. ఉత్తమ భక్తుడైన అక్రూరుని

రాకకై ఎదురుచూచుచున్నట్లున్నాడు. అక్రూరుని హృదయములో ఉన్న బ్రహ్మానంద సాగరము ఒక రూపు ధరించినట్లున్నాడు)

**72-9 శ్లో.**
**సాయంతనాప్లవవిశేషవివిక్తగాత్రౌ**
**ద్వౌ పీత నీలరుచిరాంబర లోభనీయౌ ।**
**నాతిప్రపంచధృతభూషణచారువేషౌ**
**మందస్మితార్ద్రవదనౌ స యువాం దదర్శ ॥**

**ప్రతిపదార్థము:** సాయంతన= సాయంసమయమున చేసిన (సాయం భవః సాయంకాలంలో జరుగునది), ఆప్లవ = అంతటా తడిసిన స్నాన(ఆసమంతాత్ ప్లష్ణాతి అసౌ అంతటా తడుపునది. జలప్రవాహము నీటి వరద), విశేష = విశేషముచే, వివిక్త గాత్రౌ = స్వచ్ఛ శరీరములు కలిగియున్న(విశేషేణ విక్తః పృథక్కృతః), పీత = పీత (పీతః వర్ణః అస్తి అస్య – పసుపు రంగు కలది. పచ్చనిది), నీల = నీలపు రంగులతో(నీలతి ఆచ్ఛాదయతి అన్యవర్ణాన్ ఇతర రంగులను కప్పునది. కృష్ణ వర్ణము), రుచిర= మెరయుచున్న(రుచిం రాతి దదాతిరుచిని ఇచ్చునది. మాధుర్యము, మనోహరము, కేసరము, లవంగము), అంబర = వస్త్రములతో, లోభనీయౌ= ఆకర్షణీయులుగా ఉన్న(లుభ్యతి తస్య భావః – లోభము, ఆశ), న అతి ప్రపంచ = అనతి బహుళముగా (తక్కువగా)(ప్రపంచ=అతిశయేన పంచయతి విస్తృతో భవతి చాలా విస్తరించినది), ధృత= ధరించిన (ధృతః ధ్వస్తః స్థితః స్థిరీకృతః – ధరింపబడినది), భూషణ= అభరణములతో (భూష్యతే మండ్యతే అనేన–దీనితో అలంకరించుకొందురు. భూషణము, అలంకారము), చారువేషౌ = అందంగా కనబడు వేష భూషలు కలవారును, మందస్మిత= మంద స్మితముతో, ఆర్ద్రవదనౌ= ప్రసన్న వదనములతో ఉన్న, యువాం ద్వౌ= మీ ఇద్దరిని, సః =ఆ అక్రూరుడు, దదర్శ= చూసెను.

**తాత్పర్యము:** సాయంసమయమున చేసిన స్నాన విశేషముచే స్వచ్ఛ శరీరములు కలిగిన, పీత, నీల రంగులతో మెరయుచున్న వస్త్రములు ధరించి ఆకర్షణీయులుగా ఉన్న, (కృష్ణుడు పీతాంబరధారి. బలరాముడు నీలాంబర ధారి) తక్కువగా

ధరించిన అభరణములతో అందంగా కనబడుతున్న , మంద స్మితములతో ప్రసన్న వదనములతో ఉన్న మీ ఇద్దరిని(కృష్ణ బలరాములను) ఆ అక్రూరుడు చూసెను.

**72–10 శ్లో.**

**దూరాద్రథాత్ సమవరుహ్య నమంతమేనం**
**ఉత్థాప్య భక్తకులమౌళిమథోపగూహన్ ।**
**హర్షాన్మితాక్షరగిరా కుశలానుయోగీ**
**పాణిం ప్రగృహ్య సబలోఽథ గృహం నినేథ ॥**

**ప్రతిపదార్థము:** అథ = పిమ్మట, దూరాత్= నంద భవనమునకు దూరము నందే, రథాత్ =రథమునుండి, సమవరుహ్య=దిగి, నమంతమ్=నీకు నమస్కరించుచున్న, ఏనం భక్తకుల మౌళిమ్ = ఆ పరమ భక్తుడైన అక్రూరుని, ఉత్థాప్య= పైకి లేవనెత్తి, హర్షాత్ ఉపగూహన్= ఆనందముతో కౌగిలించుకొని, మిత అక్షర గిరా= తక్కువ పదములకే పరిమితమైన(క్లుప్తముగా), కుశల అనుయోగీ =కుశలమడిగి( కుం పాపం తస్మాత్ శలతి పృథక్త్వం ప్రాప్నోతి పాపమును తొలగించి శుభమును చేకూర్చునది. కల్యాణము, మంగళము, పాణిం ప్రగృహ్య= అతని చేతిని పట్టుకొని (పణంతే వ్యవహరంతి అనేన–దీనితో వ్యవహరింతురు. చెయ్యి), సబలః= బలరామునితో, అథ= అటుపిమ్మట, గృహం = నీవు నీ గృహమునకు, నినేథ= అక్రూరుని తీసుకొనిపోయావు.

**తాత్పర్యము:** నంద భవనమునకు దూరము నందే రథమునుండి దిగి నీకు నమస్కరించుచున్న ఆ పరమ భక్తుడైన అక్రూరుని పైకి లేవనెత్తి ఆనందముతో కౌగిలించుకొని క్లుప్తముగా కుశలమడిగి అతని చేతిని పట్టుకొని బలరామునితో నీవు నీ గృహమునకు తీసుకొనిపోయావు.

**72–11 శ్లో.**

**నందేన సాకమమితాదరమర్చయిత్వా**
**తం యాదవం తదుదితాం నిశమయ్య వార్తామ్ ।**
**గోపేషు భూపతినిదేశకథాం నివేద్య**
**నానాకథాభిరిహ తేన నిశామనైషీః ॥**

**ప్రతిపదార్థము:** నందేన సాకమ్ = నందునితో కలిసి, తం యాదవం = ఆ యాదవుని (అక్రూరుని), అమిత ఆదరమ్ = అత్యంత ఆదరముతో (న మితః పరిమితః– పరిమితి లేనిది అనంతమైనది.)( ఆద్రియతే తస్య భావః ఆదరణ ప్రతిష్ఠ సన్మానము ఆరంభము), అర్చయిత్వా= పూజించి, తత్ ఉదితాం వార్తామ్ = ఆ అక్రూరుడు తెలుపు వార్తలను(ధనుర్యాగ వృత్తాంత వార్తలను), నిశమయ్య= నందుడుగూడ వినునట్లుగా చేసి, గోపేషు = ఇతరగోపాలురకు, భూపతి నిదేశ కథాం= కంసుడు పంపిన ఆజ్ఞను(భువః పతి భూమికి పతి. రాజు), నివేద్య = తెలిపి, తేన= అక్రూరునితో, నానాకథాభిః = పెక్కు కథలు ముచ్చటించుచు, ఇహ= ఇక్కడ, నిశామ్= రాత్రి యంతయు(నితరాం శ్యతి తనూకరోతి జీవానాం వ్యాపారాన్ జీవుల పనులను తగ్గింప చేయునది. రాత్రి), అనైషీః= గడిపితివి.

**తాత్పర్యము:** నందునితో కలిసి ఆ అక్రూరుని అత్యంత ఆదరముతో పూజించి ఆ అక్రూరుడు తెలుపు వార్తలను నందునితో విని ,ఇతరగోపాలురకు కంసుడు పంపిన ఆజ్ఞను తెలిపి అక్రూరునితో పెక్కు కథలు ముచ్చటించుచు రాత్రి యంతయు గడిపితివి.

**72–12 శ్లో.**
**చంద్రాగృహే కిముత చంద్రభగాగృహే ను**
**రాధాగృహే ను భవనే కిము మైత్రవిందే ।**
**ధూర్తో విలంబత ఇతి ప్రమదాభిరుచ్చైః**
**ఆశంకితో నిశి మరుత్పురనాథ! పాయాః ॥**

**ప్రతిపదార్థము:** చంద్రాగృహే= చంద్రికయను గోపిక ఇంటిలో (చందయతి ఆహ్లాదయతి ఆహ్లాదపరచునది), కిముత = లేక (కిం చ ఉత్ చ–వితర్కము విమర్శ ప్రశ్న సందేహము వికల్పము. ఏల, ఎందుచేత), చంద్రభగాగృహే = చంద్రభాగ యను గోపిక ఇంటిలో (చంద్రభాగ మందిరములో), ను= లేక, రాధాగృహే= రాధగృహములోనో, కిమును= లేదా, మైత్రవిందే భవనే = మిత్రవింద గృహములోనో, ధూర్తః = ధూర్తుడైన శ్రీ కృష్ణుడు(ధుర్వతి హినస్తి కష్టపెట్టువాడు. దొంగ వంచకుడు దుష్టుడు జూదరి), నిశి= ఈరాత్రి, విలంబత ఇతి = మన దగ్గరకు

రాక చాలా ఆలస్యము చేయుచున్నాడు అని (విశేషేణ లంబతే తస్య భావః కర్మ వా పొడిగించుట ఆలస్యం చేయుట), ప్రమదాభిః = మితిమీరిన ప్రేమతో గోపికలు(ప్రకృష్టః మదః హర్షః అస్తి అస్యాః–ఎప్పుడు సంతోషపడునది. ఉత్తమ స్త్రీ), ఉచ్చైఃఆశంకితః = బాగా సందేహ పడ్డారు, మరుత్పురనాథ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, పాయాః= నన్ను రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! అట్లు అక్రూరునితో నువ్వు ఉండగా "చంద్రికయను గోపిక ఇంటిలో లేక చంద్ర భాగ యను గోపిక ఇంటిలో (చంద్రభాగ మందిరములో) లేక రాధగృహములోనో లేదా మిత్రవింద గృహములోనో ఉండి ధూర్తుడైన శ్రీకృష్ణుడు ఈరాత్రి మన దగ్గరకు రాక చాలా ఆలస్యము చేయుచున్నాడు" అని మితిమీరిన ప్రేమతో గోపికలు నీ గురించి బాగా సందేహ పడ్డారు. నన్ను రక్షించు.

***దశమ స్కంధము***

**72వ దశకము సమాప్తము**

# దశకమ్ 73 – శ్రీకృష్ణ మథురాయాత్ర

**73–1 శ్లో.**

**నిశమయ్య తవా థ యాన వార్తాం**
**భృశమార్తాః పశుపాలబాలికాస్తాః ।**
**కిమిదం కిమిదం కథం న్వితీమాః**
**సమవేతాః పరిదేవితాన్యకుర్వన్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, తవ = నీ యొక్క, యానవార్తాం=అక్రూరునితో కలిసి మధురకు పయనమగుచున్న సంగతి (యాతి తస్య భావః–పోవుట, వెళ్లుట), నిశమయ్య= విని, భృశమ్= బాగా (భృశ్యతి ప్రాచుర్యేణ వర్తతే ఎక్కువగా వున్నది. మిక్కిలి), ఆర్తాః= బాధపడిన, తాః పశుపాల బాలికాః= ఆ గోపికలు, కిమ్ ఇదం = ఇదేమి?, కిమ్ ఇదం= ఇదేమి?, కథం ను=ఇది ఎట్లు జరిగినది?, ఇతి = అని, ఇమాః సమవేతాః = ఒకచోట గుమికూడి ఒకరితో ఒకరు తమ బాధను చెప్పుకొనుచు (సమ్యక్ అవేతః సమూహితః–సమూహంతో కలిసి), పరిదేవితాని= రోదనములు (పరి దీవ్యతి శోకం కరోతి ఏడ్చు), అకుర్వన్= చేయసాగిరి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నువ్వు అక్రూరునితో కలిసి మధురకు పయనమగుచున్న సంగతి విని బాగా బాధపడిన ఆ గోపికలు “ఇదేమి? ఇదేమి? ఇది ఎట్లు జరిగినది?” అని ఒకచోట గుమికూడి ఒకరితో ఒకరు తమ బాధను చెప్పుకొనుచు రోదనములు చేయసాగిరి.

**73–2 శ్లో.**

**కరుణానిధిరేష నందసూనుః కథమస్మాన్విసృజేదనన్యనాథాః ।**
**బత నః కిము దైవమేవమాసీదితి తాస్త్వద్గతమానసా విలేపుః ॥**

**ప్రతిపదార్థము:** ఏషః నందసూనుః= ఈ నందసూనుడయిన కృష్ణుడు (సూయతే ప్రసూయతే కనబడ్డవాడు పుట్టినవాడు. కొడుకు), కరుణానిధిః= కరుణచే నందనవనమువంటివాడు, కథమ్= ఎట్లు, అస్మాన్= మనలనందఱును, విసృజేత్=

విడిచి వెళ్ళినాడు?, అనన్యనాథాః = తనే తప్ప వేరేదిక్కు లేనివారమే! (న అన్యః–వేరే కానిది), బత = అయ్యో! ( ఖేదే, సంబోధనే, ఆశ్చర్యే, నిందాయామ్ ఖేదము, సంబోధనము, ఆశ్చర్యము, నిందల యందు వాడబడును), నః =మనకు, కిము = ఏ (కిం చ ఉ చ, సంభావనాయాం విమర్శే సంభావించుట విమర్శించుట శంకించుట), దైవమ్ = దైవము(విధివ్రాత) (దేవస్య ఇదమ్ దేవతలకు సంబంధించినది. భాగ్యము పూర్వజన్మ కర్మ), ఏవమ్ = ఇట్లు, ఆసీత్ = ఉన్నది, ఇతి = అని, తాః = ఆ గోప వనితలు, త్వత్ గతమానసా = నీ యందు ఉంచబడిన మనస్సు కలవారయి, విలేపుః = దుఃఖించారు.

**తాత్పర్యము:** "ఈ నందసూనుడయిన కృష్ణుడు ఎట్లు మనలనందఱును విడిచి వెళ్ళినాడు? తనే తప్ప వేరేదిక్కు లేనివారమే! అయ్యో! మనకు విధివ్రాత ఇట్లున్నది" అని ఆ గోప వనితలు నీ యందు ఉంచబడిన మనస్సు కలవారయి దుఃఖించారు.

**73–3 శ్లో.**

**చరమప్రహరే ప్రతిష్ఠమానః సహ పిత్రా నిజమిత్రమండలైశ్చ ।**

**పరితాపభరం నితంబినీనాం శమయిష్యన్ వ్యముచస్సఖాయమేకమ్ ॥**

**ప్రతిపదార్థము:** చరమప్రహరే=రాత్రియొక్క చివరిజామునందు(వేకువజామననే) (చరతి ఇతః పర్యంతం అంతః అంతిమః–చివర వుండునది. చివర)(ప్రహ్రియతే ఢక్కాది అస్మిన్ దీనిని సూచించుటకు ఢక్కా నాదమును చేయుదురు. ఒక జాము. దినములో ఎనిమిదవ భాగము), పిత్రా సహ = నీ తండ్రినందునితో, నిజమిత్రమండలైః చ= మిత్రబృందముతో, ప్రతిష్ఠమానః = మధురకు బయలుదేరుటకు నిశ్చయించుకొని, నితంబినీనాం = గోపికల యొక్క(అతిశయితో నితంబో అస్తి అస్యాః మంచి పిరుదులు గలది), పరితాపభరం= దుఃఖ భారమును (అత్యంతం తాపః–తాపము దుఃఖము వేడి), శమయిష్యన్ = తగ్గించుటకు, ఏకమ్ సఖాయమ్ = ఒక స్నేహితుని వారి వద్దకు దూతగా, వ్యముచః= పంపావు.

**తాత్పర్యము:** రాత్రి యొక్క చివరి జామునందు నీ తండ్రినందునితో మిత్రబృందముతో మధురకు బయలుదేరుటకు నిశ్చయించుకొని గోపికల యొక్క దుఃఖ భారమును తగ్గించుటకు ఒక స్నేహితుని వారి వద్దకు దూతగా పంపావు.

**73-4 శ్లో.**

**అచిరాదుపయామి సన్నిధిం వో భవితా సాధు మయైవ సంగమశ్రీః ।**
**అమృతాంబునిధౌ నిమజ్జయిష్యే ద్రుతమిత్యాశ్వసితా వధూరకార్షీః ॥**

**ప్రతిపదార్థము:** అచిరాత్ = త్వరలోనే(అచిరం అతతి శీఘ్రము. తొందరగా), వః = మీ, సన్నిధిం= సన్నిధికి(సమ్యక్ సమీపం నిధీయతే తస్య భావః కర్మ వా సామీప్యము సన్నిధి), ఉపయామి = వచ్చెదను, మయా ఏవ = నాతో, సంగమశ్రీః = సమాగమ సౌఖ్యము( సం సహ గమనమ్ కలయిక), సాధు భవితా = మీకు కలుగగలదు(సాధ్నోతి ఉపకరోతి ప్రవీణో భవతి ఉపకరించుట. ప్రవీణత), ద్రుతమ్= శీఘ్రకాలంలో (ద్రవంతి శీఘ్రం గచ్ఛంతి నృత్యంతి తస్య భావః తొందరగా పోవుట), అమృత అంబునిధౌ = సుఖ సముద్రములో (మోక్ష రూపమైన సముద్రములో) (నాస్తి మరణం యస్మాత్ అమృతము), నిమజ్జయిష్యే = మిమ్ము ముంచెత్తదను, ఇతి= అని, ఆశ్వసితాః = ఓదార్పు మాటలను, వధూః = ఆ గోపికలకు ఉద్ధవుని ద్వారా తెలిపి (ఉహ్యతే పితృగృహాత్ పతిగృహమ్ తండ్రి గృహము నుండి పతి గృహమునకు పోవునది. భార్య), అకార్షీః= ఓదార్చితివి.

**తాత్పర్యము:** "త్వరలోనే మీ సన్నిధికి వచ్చెదను. నాతో సమాగమ సౌఖ్యము మీకు కలుగగలదు. శీఘ్రకాలంలో సుఖ సముద్రములో (మోక్షరూపమైన సముద్రములో) మిమ్ము ముంచెత్తదను" అని ఓదార్పు మాటలను ఆ గోపికలకు నీ స్నేహితుడవైన ఉద్ధవుని ద్వారా తెలిపి ఓదార్చితివి.

**73-5 శ్లో.**

**స విషాద భరం సయాచ్ఞముచ్చైరతిదూరం వనితాభిరీక్ష్యమాణః ।**
**మృదు తద్దిశి పాతయన్నపాంగాన్ సబలోఽక్రూరరథేన నిర్గతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** ఉచ్చైః = బిగ్గరగా(మహాన్ గొప్పది), సవిషాదభరం= విషాదపు భారముతో(దుఃఖముతో)(విశేషేణ సీదతి దుఃఖీభవతి తస్య భావః విషాదము, దుఃఖము), సయాచ్ఞమ్= దైన్యభావముతో (యాచతే తస్య భావః కర్మ వా యాచనము), అతిదూరం= కనిపించినంత దూరమువరకు (చాలా దూరము

వరకు) (అత్యంతం అధికం దూరమ్ మిక్కిలి దూరము), వనితాభిః = గోపాల బాలికలు (యాచితః సేవితః–కోరబడినది సేవింపబడినది), ఈక్ష్యమాణః = నీ వైపు చూచుచుండగా (దర్శనే ఈక్షతేచూచుట), తత్ దిశి = వారున్న వైపు (దిశతి చూపునది. దిక్కు), మృదు= నువ్వు కూడా మృదువుగా(మృద్యతే మర్దితుం శక్యతే నలుచుటకు వీలైనది కోమలమైనది), అపాంగాన్= నీ అపాంగములను (అప అంగతి = వక్రం గచ్ఛతి చక్షుః యత్ర–కన్ను కొనభాగము), పాతయన్= ప్రసరింపచేయుచు, సబలః = బలరామునితో, అక్రూరరథేన = అక్రూరుని రథమున, నిర్గతః అభూః=నువ్వు బయలుదేరావు.

**తాత్పర్యము:** బిగ్గరగా గొంతెత్తి విలపించుచు, దైన్యభావముతో నువ్వు కనిపించినంత దూరమువరకు గోపాల బాలికలు నీ వైపు చూచుచుండగా – వారున్న వైపు నువ్వు కూడా మృదువుగా నీ కటాక్షములను ప్రసరింపచేయుచు –బలరామునితో అక్రూరుని రథమున నువ్వు బయలుదేరావు.

**73–6 శ్లో.**

**అనసా బహుళేన వల్లవానాం మనసా చానుగతోఽథ వల్లభానామ్ ।**
**వనమార్తమృగం విషణ్ణవృక్షం సమతీతో యమునాతటీమయాసీః ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, బహుళేన = అనేక (బహూనర్థాన్ లాతి ప్రచురమ్ ఎక్కువ అర్థములను ఇచ్చునది. అధికము), వల్లవానాం= గోపాలకుల యొక్క(వల్లం ప్రీతి వాతి ప్రీతిని చూపువాడు. గోపాలకుడు), అనసా= బండ్లతో పాటు(అనితి శబ్దం కరోతి శబ్దము చేయునది. ఎడ్ల బండి), వల్లభానామ్ = గోపికల యొక్క(వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపునది. ప్రియురాలు), మనసా చ అనుగతః= మనస్సులు కూడా నిన్ను అనుసరించు చుండగా, వనమ్ = బృందావనములో, ఆర్త మృగం= నీ వియోగముచే మృగములు పీడితులు కాగా, విషణ్ణ వృక్షం = నీ వియోగ వగచే చెట్లు వాడిపోగా, సమతీతః = బృందావనమును దాటి (సం సంపూర్ణతయా అతీతః వ్యతీతః గడచిపోయినది), యమునా తటీమ్= యమునానదీతీరమునకు, అయాసీః= చేరావు.

**తాత్పర్యము:** అనేక గోపాలకుల యొక్క బండ్లతో పాటు , గోపికల యొక్క

మనస్సులు కూడా నిన్ను అనుసరించుచుండగా, నీ వియోగముచే మృగములు పీడితులు కాగా, నీ వియోగ వగచే చెట్లు వాడిపోగా బృందావనమును దాటి – యమునానదీతీరమునకు చేరావు.

**73–7 శ్లో.**

**నియమాయ నిమజ్జ్య వారిణి త్వామభివీక్ష్యాథ రథేఽపి గాందినేయః ।**
**వివశోఽజని కిన్విదం విభోస్తే నను చిత్రం త్వవలోకనం సమంతాత్ ॥**

**ప్రతిపదార్థము:** నియమాయ= సంధ్యావందన కార్యక్రమమును నిర్వర్తించుటకు (నియచ్ఛంతి రుందంతి అనాచారాదికమ్ దీనితో అనాచారము ఆపబడును. నియమము కట్టుబాటు), వారిణి = యమునా జలమునందు(వారయతి తృష్ణామ్ దప్పిని వారించునది. జలము), నిమజ్జ్య= మునిగి, త్వామ్= నిన్ను, అభివీక్ష్య=చూసి,అథ=అటుపిమ్మట,రథేఅపి =గట్టుమీదనున్నరథములోనుకూడా (నిన్ను చూసి), గాందినేయః = అక్రూరుడు, వివశః అజని= అశ్చర్యముచే వివశుడయ్యెను, నను= నిశ్చయముగా, విభోః = ఓ ప్రభూ!, సమంతాత్= సర్వవ్యాపివైన, తే = నువ్వు, ఇదం అవలోకనం= ఈ రెండు చోట్ల కనిపించుటలో, కిమ్ ను చిత్రం = ఆశ్చర్యము ఏమున్నది? (సర్వవ్యాపివైన ఈ రెండు చోట్ల కనిపించుటలో ఆశ్చర్యము లేదని భావం).

**తాత్పర్యము:** సంధ్యావందన కార్యక్రమమును నిర్వర్తించుటకు యమునా జలమునందు మునిగి నిన్ను చూసాడు. అటుపిమ్మట గట్టుమీదనున్న రథములోను కూడా నిన్ను చూసి అక్రూరుడు అశ్చర్యముచే వివశుడయ్యెను. ఓ ప్రభూ! సర్వవ్యాపివైన నువ్వు ఈ రెండు చోట్ల కనిపించుటలో ఆశ్చర్యము ఏమున్నది? (సర్వవ్యాపివైన ఈ రెండు చోట్ల కనిపించుటలో ఆశ్చర్యము లేదని భావం)

**73–8 శ్లో.**

**పునరేష నిమజ్జ్య పుణ్యశాలీ పురుషం త్వాం పరమం భుజంగభోగే ।**
**అరికంబుగదాంబుజైః స్ఫురంతం సురసిద్ధౌఘపరీతమాలులోకే ॥**

**ప్రతిపదార్థము:** పునః= తిరిగి, ఏషః పుణ్యశాలీ = పుణ్యశాలియైన అక్రూరుడు,

నిమజ్జ్య=మునుగగా, భుజంగభోగే = వేయిపడగల అనంతునిపై శయనించి (భుజస్సన్ గచ్ఛతి, వక్రం గచ్ఛతి వంకరగా వెళ్లునది.)(భుజ్యతే తస్య భావః – అనుభవము పాము పడగ), అరి= చక్రము(అరములు కలది అరి = చక్రము), కంబు= శంఖము (కమనీయో భవతి కమనీయంగా వుండునది. శంఖము కంకణము), గదా= గద(గద్యతే పీడ్యతే అనేన–దీనితో పీడింపబడును), అంబుజైః= పద్మములను ధరించి, స్ఫురంతం=ప్రకాశిస్తూ, సుర =దేవతలు, సిద్ధ–ఔఘ = సిద్ధులు మొదలైన వారితో, పరీతమ్=కూడుకొన్న తెలుసుకొనబడిన (పరి ఇతః గతః, సమాప్తః పర్యాప్తః అధికృతో వా వెళ్లబడినది సమాప్తి చేయబడినది తెలుసుకొనబడినది తిరిగి వచ్చినవాడు), పరమం పురుషం=పరమ పురుషునివిగా ఉన్న, త్వాం =నిన్ను, ఆలులోకే= చూసెను.

**తాత్పర్యము:** పుణ్యశాలియైన అక్రూరుడు తిరిగి మునుగగా – వేయిపడగల అనంతునిపై శయనించి చక్రము శంఖము గద పద్మములను ధరించి ప్రకాశిస్తూ– దేవతలు సిద్ధులు మొదలైన వారితో తెలుసుకొనబడిన పరమ పురుషునివిగా విష్ణువుగా ఉన్న నిన్ను చూసెను.

**73–9 శ్లో.**

**స తదా పరమాత్మసౌఖ్యసింధౌ వినిమగ్నః ప్రణువన్ ప్రకారభేదైః ।**
**అవిలోక్య పునశ్చ హర్షసింధోరనువృత్త్యా పులకావృతో యయౌ త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** తదా= అప్పుడు, సః =అతడు (అక్రూరుడు) నిన్ను దర్శించి, పరమాత్మ సౌఖ్య సింధౌ= బ్రహ్మానందమను సముద్రములో (సుఖం ఏవ సౌఖ్యమ్ సుఖము), వినిమగ్నః = మునిగి, ప్రకారభేదైః= సగుణ నిర్గుణ భేదములతో ఉన్ననిన్ను అనేక విధములుగా, ప్రణువన్= స్తుతించి, పునః చ = తరువాత మరలా చూడగా, అవిలోక్య = నీటిలో నువ్వు కన్పించలేదు, అనువృత్త్యా= ముందటి పరమానందఅనుభవఅనుసరణముతో(అనురూపోవృత్తిఃవర్తనమ్ అనుకూలంగా ప్రవర్తించుట), పులక ఆవృతః = పులకితుడై (పోలయంతి రోమాణి అత్ర– వెంట్రుకలు నిక్కపొడుచును. రోమాంచము), త్వామ్= నిన్ను, యయౌ= చేరెను.

**తాత్పర్యము:** అప్పుడు అక్రూరుడు నిన్ను దర్శించి బ్రహ్మానందమను సముద్రములో మునిగి సగుణ నిర్గుణ భేదములతో ఉన్ననిన్ను అనేక విధములుగా స్తుతించి తరువాత గట్టెక్కి మరలా చూడగా నీటిలో నువ్వు కన్పించలేదు. ముందటి పరమానంద అనుభవ అనుసరణముతో పులకితుడై నిన్ను చేరెను.

**73-10 శ్లో.**

**కిము శీతలిమా మహాన్ జలే యత్ పులకోఽసావితి చోదితేన తేన ।**
**అతిహర్షనిరుత్తరేణ సార్ధం రథవాసీ పవనేశ! పాహిమాం త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** జలే= ఈ నదీజలములు (జలతి శీతలం భవతిశీతల గుణము గలది), మహాన్= బాగా, శీతలిమా కిము = చల్లగా ఉన్నాయా ఏమి?, యత్ =అందువలన, అసౌ పులకః = నీ శరీరమంతా ఇన్ని పులకలు?, ఇతి= అని, చోదితేన= నీ యోగ విభూతి మఱుగుపరచుటకై నువ్వు అడుగగా, తేన = ఆ అక్రూరుడు, అతిహర్ష= సంతోషము ఎక్కువై, నిరుత్తరేణ =సమాధానము ఇవ్వని, సార్ధం= అట్టి అక్రూరునితో కలిసి(సహ అర్ధేన-వెంటనే తోడు), రథవాసీ= రథమునందున్న, పవనేశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, త్వమ్= నువ్వు, మాం= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** "ఈ నదీజలములు బాగా చల్లగా ఉన్నాయా ఏమి? అందువలన నీ శరీరమంతా ఇన్ని పులకలు?" అని నీ యోగ విభూతి మఱుగుపరచుటకై నువ్వు అడుగగా ఆ అక్రూరుడు సంతోషము ఎక్కువై సమాధానము ఇవ్వలేదు. అట్టి అక్రూరునితో కలిసి రథమునందున్న ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నువ్వు నన్ను రక్షించు.

***దశమ స్కంధము***

**73వ దశకము సమాప్తము**

# దశకమ్ 74 –మథురాపురీప్రవేశము

**74-1 శ్లో.**
**సంప్రాప్తో మథురాం దినార్ధవిగమే తత్రాంతరస్మిన్ వసన్**
**ఆరామే విహితాశనస్సఖిజనైర్యాతః పురీమీక్షితుమ్ ।**
**ప్రాప్తో రాజపథం చిరశ్రుతిధృతవ్యాలోకకౌతూహల–**
**స్త్రీపుంసోద్యదగణ్యపుణ్యనిగళైరాకృష్యమాణో ను కిమ్ ॥**

**ప్రతిపదార్థము:** దిన అర్ధ విగమే= మధ్యాహ్న సమయమునకు(విగమ=అత్యంతం గమనమ్ వెళ్లిపోవుట నాశనము), మథురాం = మధురానగరమును(మథ్యతే పాపరాశిః యయా పాపరాశిని పోగొట్టునది. మథురా (నగరము) జనపదము), సంప్రాప్తః= చేరిరి, తత్ర = అచ్చట ఆనగరమునకు, అంతరస్మిన్ ఆరామే = వెలుపల ఉన్న ఉద్యానవనములో(ఆరమంతే క్రీడంతి అత్ర–క్రీడించుటకు నిర్మించినది. ఉపవనము), వసన్ = విశ్రాంతి తీసుకొని, విహిత అశనః= భోజనముచేసి(అశ్నాతి భుంక్తే తస్య భావః–భోజనము, అన్నము), సఖి జనైః = మిత్రులతో, పురీమ్ ఈక్షితుమ్= ఆ పట్టణమును చూడవలెనను ఆలోచనతో, యాతః= బయలుదేరితివి, చిర శ్రుతి= చాలాకాలము నుండి నీ గురించి విని, ధృత వ్యాలోక కౌతూహల= నిన్ను చూడవలెనని కుతూహల పడుచున్న(కుతూహలస్య భావః కర్మ వా కౌతూహలము, ఉత్సాహము మిక్కుటమైన కోరిక), స్త్రీపుంస= ఆ నగరములోని స్త్రీ పురుషులు, ఉద్యత్ = చేసుకొన్న, అగణ్య = లెక్కింపలేని, పుణ్యనిగళైః = పుణ్యఫలమనెడి సంకెళ్ళతో, ఆకృష్యమాణః కిమ్ ను= నిన్ను వారివైపు లాగుకొనిపోవుచున్నదా! అనునట్లు, రాజపథం= ఆ నగరములోని రాజ మార్గమును, ప్రాపః= ప్రవేశించితివి.

**తాత్పర్యము:** మీరు – మధ్యాహ్న సమయమునకు మధురానగరమును చేరి ఆనగరమునకు వెలుపల ఉన్న ఉద్యానవనములో విశ్రాంతి తీసుకొని భోజన కార్యక్రమములు ముగించుకొని పిదప, మిత్రులతో ఆ పట్టణమును చూడవలెనను ఆలోచనతో బయలుదేరావు. చాలాకాలము నుండి నీ గురించి విని నిన్ను చూడవలెనని కుతూహల పడుచున్న ఆనగర స్త్రీపురుషులు వారి పుణ్యఫలమనెడి

సంకెళ్ళు – నిన్ను వారివైపు లాగుకొనిపోవుచున్నదా! అనునట్లు, ప్రభూ! నీవు ఆ రాజమార్గమును ప్రవేశించితివి.

**74–2 శ్లో.**

**త్వత్పాదద్యుతివత్సరాగసుభగాస్త్వన్మూర్తివద్యోషితః**
**సంప్రాప్తా విలసత్పయోధరరుచో లోలాభవద్దృష్టివత్ ।**
**హారిణ్యస్త్వదురః స్థలీవ దయితే మందస్మిత ప్రౌఢివ–**
**న్నైర్మల్యోల్లసితాః కచౌఘరుచివద్రాజత్కలాపాశ్రితాః ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ పాదద్యుతివత్= నీచరణకాంతివలె, సరాగ = ఎఱుపుచే, సుభగాః= అందమైనవారు (అనురాగముచే అందమైనవారు), త్వత్ మూర్తివత్= నీ ఆకారమట్లు ఉన్న, విలసత్ = చక్కని సొంపుగులుకు, పయోధర రుచః= పాలిండ్ల శోభ కలిగిన, యోషితః= స్త్రీలు, సంప్రాప్తాః= నిన్ను దర్శించుటకు వచ్చారు. (నీ మూర్తి పయోధరము(మేఘము)యొక్క కాంతిగలది. స్త్రీలు కూడా పయోధర కాంతులు కలవారు. పయోధరశబ్దము శ్లేష), లోలా =ఇటునటు నీదగ్గరకు వస్తున్న స్త్రీలను చూచుటకు చంచలమైన, భవత్ దృష్టివత్ = నీ చూపుల వలె నిన్ను చూచుటకు వచ్చిన స్త్రీలు కూడా లోలలు. (మిక్కిలి కోర్కె కలవారు), త్వత్ ఉరః స్థలీవత్= నీ వక్షః స్థలమువలె, హారిణ్యః= ఆ స్త్రీలు కూడా మనస్సును హరించువారు(హారములు కలవారు. నీవక్షము హారములు గలది. స్త్రీలు హారిణులు), అయి= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తే = నీయొక్క, మంద స్మిత ప్రౌఢివత్= మందస్మితమువలె, నైర్మల్య ఉల్లసితాః= ఆ స్త్రీలు కూడా నిర్మలలు స్వచ్ఛమైనవారు, కచౌఘ రుచివత్= నీ జుట్టు యొక్క కాంతివలె (నీ జుట్టు పై ఉన్న నెమలిపురి కాంతివలె), రాజత్ కలాప ఆశ్రితాః= ఆ స్త్రీలు కూడా ప్రకాశించు భూషణములుగలవారు(నీ జుట్టుముడి అందముగుల్కు కలాపము (నెమలి పించెము) కలదని శ్లేష.

**తాత్పర్యము:** ఈ శ్లోకములో కృష్ణునికి ఉన్న లక్షణాలన్ని మధురానగర స్త్రీలకు ఉన్నాయని శ్లేష అలంకారం ద్వారా (ఒక పదానికి రెండు అర్థాలద్వారా) కవి అపూర్వంగా వర్ణించాడు.

ఓ శ్రీ కృష్ణా ! మధురానగరములో నిన్ను దర్శించటానికి వచ్చిన స్త్రీలు కూడా నీలాగే ఉన్నారు.

నీ ఎఱ్ఱని పాద కాంతివలె, స్త్రీలు కూడా సరాగలు (రాగ శబ్దానికి ఎరుపు, అనురాగము అని రెండు అర్థాలు)

నీ పయోధర ఆకారమట్లు. స్త్రీలు కూడా పయోధర కాంతులు కలిగినవారు (పయోధర పదానికి నీల మేఘము, స్తనము అని రెండు అర్థాలు)

నువ్వు లోలుడవు. స్త్రీలు కూడా లోలలు. (లోలపదానికి చంచలత్వము, మిక్కిలి కోర్కె కలవారు అని రెండు అర్థాలు)

హారి అయిన నీ వక్షః స్థలమువలె ఆ స్త్రీలు కూడా హారిణులు (హారి పదానికి 1.హారములు గలది 2. మనస్సును హరించువారు అని రెండు అర్థాలు)

నీయొక్క నిర్మలమైన చిరునవ్వు వలె ఆ స్త్రీలు కూడా నిర్మలలు. స్వచ్ఛమైనవారు

నీ జుట్టుపై ఉన్న కలాపము యొక్క కాంతివలె స్త్రీలు కూడా కలాపమును ఆశ్రయించిన వారు (కలాపము అనగా 1.నెమలిపురి, 2.ఇరువదియైదుపేటలు గల స్త్రీల యొడ్డాణము అని రెండు అర్థాలు)

(కుండలీకరణములో ఉన్న మొదటి అర్థం కృష్ణునికి, రెండవ అర్థం స్త్రీలకు సంబంధించినది)

**74-3 శ్లో.**
**తాసామాకలయన్నపాంగవలనైర్మోదం ప్రహర్షాద్భుత**
**వ్యాలోలేషు జనేషు తత్ర రజకం కంచిత్ పటీం ప్రార్థయన్ ।**
**కస్తేదాస్యతి రాజకీయవసనం యాహీతి తేనోదితః**
**సద్యస్తస్యకరేణ శీర్షమహృథాస్సోఽప్యాప పుణ్యాం గతిమ్ ॥**

**ప్రతిపదార్థము:** తాసామ్ = ఆ మధురా పురాంగనలను, అపాంగ వలనైః = నీ కటాక్ష వీక్షణములచే (అప అంగతి = వక్రం గచ్ఛతి చక్షుః యత్ర–కన్ను కొనభాగము),

మోదం= సంతోషమును (మోదతే తస్య భావః-హర్షము, సంతోషము), ఆకలయన్= కలిగించి, జనేషు= జనములు, ప్రహర్ష అద్భుత= పరమానందంగా (అతిశయేన హృష్యతి తస్య భావః కర్మ వా అమితానందము, వ్యాలోలేషు= నిన్ను చూసి తహతహలాడుతూ రాగా (వ్యాలోల=అధికం లోడతి కంపతే అసౌ కంపించువాడు అవ్యవస్థితము ఊగునది), తత్ర= వారిలో, కంచిత్ = ఒకానొక, రజకం = రజకుని చూసి (రజతి నిర్ణేజనేన శ్వేతిమానం ఆపాదయతి వస్త్రాణామ్ వస్త్రములను తెల్లగా చేయువాడు), పటీం= అతని దగ్గర ఉన్న విలువైన వస్త్రములను, ప్రార్థయన్= నువ్వు అడుగగా, కః తే దాస్యతి= ఎవడు నీ కు ఇచ్చేది?, రాజకీయ వసనం= ఇవి రాజుగారు ధరించు వస్త్రములు (రాజ్ఞః ఇదమ్ రాజునకు సంబంధించినది. రాజ కార్యము), యాహి = వెళ్ళిపో, ఇతి = అని, తేన= ఆ రజకునిచే, ఉదితః = చెప్పబడి, సద్యః= వెంటనే, కరేణ = నీ చేతిలో, తస్య శీర్షమ్ = అతని శిరస్సుపై(ముసలితనంలో క్షీణించబడునది. శిరస్సు), అహృథాః = కొట్టితివి, సః అపి = ఆ విధముగా నీ చేతిలో చనిపోయిన అతడు, పుణ్యాం గతిమ్= పుణ్యమైన గతిని, ఆప= పొందెను.

**తాత్పర్యము:** ఆ మధురా పురాంగనలకు నీ కటాక్ష వీక్షణములచే సంతోషమును కలిగించి ,జనములు పరమానందంగా నిన్ను చూసి తహతహలాడుతూ రాగా వారిలో ఒకానొక రజకుని చూసి అతని దగ్గర ఉన్న విలువైన వస్త్రములను నువ్వు అడుగగా "ఎవడు నీ కు ఇచ్చేది? ఇవి రాజుగారు ధరించు వస్త్రములు వెళ్ళిపో" అని ఆ రజకుడు జవాబిచ్చాడు. వెంటనే నీ చేతితో అతని శిరస్సుపై కొట్టితివి. ఆ విధముగా నీ చేతిలో చనిపోయిన అతడు పుణ్యమైన గతిని పొందెను .

**74-4 శ్లో.**

**భూయో వాయక మేకమాయతమతిం తోషేణ వేషోచితం**
**దాశ్వాంసం స్వపదం నినేథ సుకృతం కో వేద జీవాత్మనామ్ ।**
**మాలాభిఃస్తబకైః స్తవైరపి పునర్మాలాకృతా మానితో**
**భక్తిం తేన వృతాం దిదేశిథ పరాం లక్ష్మీం చ లక్ష్మీపతే! ॥**

**ప్రతిపదార్థము:** లక్ష్మీపతే=ఓలక్ష్మీ పతీ! (లక్ష్మ్యాః పతిః-లక్ష్మి యొక్క భర్త.

నారాయణుడు)చ, భూయః = మరలా, ఆయతమతిం = విపుల మనస్కుడయిన (బుద్ధిమంతుడయిన) (ఆయతః దీర్ఘః–పొడవు, దీర్ఘము వెడల్పు), ఏకమ్ = ఒక, వాయకమ్= సాలెవాడు(వయతి అసౌ నేయువాడు, సాలెవాడు), తోషేణ= సంతోషముతో, వేష ఉచితం= నీ అందమునకు తగిన విచిత్ర వర్ణ వస్త్రములను, దాశ్వాంసం= భక్తితో నీకు సమర్పింపగా( దాశతి దానం కరోతి అసౌ దానము చేయువాడు. దాత), స్వపదం= నీ స్థానమైన వైకుంఠమును, నినేథ= అతనికి అనుగ్రహించితివి, జీవాత్మనామ్ సుకృతం= జీవుల పుణ్యఫలములు (జీవస్య జీవనస్య ఆత్మా అధిష్ఠాతాజీవాత్మ.)(సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము శుభకర్మ), కః = ఎవడు, వేద= తెలుసుకొనును?, పునః = మరలా, స్తబకైః= పూలగుత్తులు (స్తుప్యతి కృతరాశీ భవతి దట్టంగా వుండునది. పూలగుత్తి),మాలాభిః=మాలలునీకుఇచ్చి(మాతిమానహేతుర్భవతి గౌరవమునకు కారణమైనది. దీనితో గౌరవించుదురు. పుష్పమాల), స్తవైః అపి =స్తోత్రముల చేత (స్తౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తవము. దీనితో స్తోత్రము చేయుదురు), మాలాకృతా = ఒక మాలాకారుడు (మాలాం కరోతి మాలను అల్లువాడు), మానితః = నిన్ను స్తుతించి పూజింపగా, తేన వృతాం = అతను కోరుకొన్న (ప్రార్థితః సంభక్తః–వరించబడినది, విభాగము చేయబడినది, సేవించబడినది), భక్తిం = భక్తిని (భజ్యతే సేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ), పరాం లక్ష్మీం చ= ఉత్కృష్టమైన సంపదను, దిదేశిథ = నువ్వు అనుగ్రహించావు.

**తాత్పర్యము:** ఓలక్ష్మీ పతీ! బుద్ధిమంతుడయిన ఒక సాలెవాడు సంతోషముతో నీ అందమునకు తగిన విచిత్ర వర్ణ వస్త్రములను భక్తితో నీకు సమర్పింపగా నీ స్థానమైన వైకుంఠమును అతనికి అనుగ్రహించితివి. జీవుల పుణ్యఫలములు ఎలా ఉండునో ఎవడు తెలుసుకొనును? (పుణ్యములు కేవలము ఫలముల ద్వారానే తెలియును) పూలగుత్తులు మాలలు నీకు ఇచ్చి స్తోత్రముల చేత ఒక మాలాకారుడు నిన్ను స్తుతించి పూజింపగా అతను కోరుకొన్న భక్తిని ఉత్కృష్టమైన సంపదను నువ్వు అనుగ్రహించావు.

**74–5 శ్లో.**

**కుబ్జామబ్జవిలోచనాం పథి పునర్దృష్ట్వాంగరాగే తయా**
**దత్తే సాధు కిలాంగరాగమదదాస్తస్యా మహాంతం హృది ।**
**చిత్తస్థామృజుతామథ ప్రథయితుం గాత్రేఽపి తస్యాః స్ఫుటం**
**గృహ్ణన్ మంజుకరేణ తాముదనయస్తావజ్జగత్సుందరీమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, పునః= మరలా, పథి= రాజవీథిలో(పథతి గచ్ఛతి అత్ర ఇక్కడ వెళ్లుదురు. మార్గము, బాట), అబ్జ విలోచనాం = పద్మములవంటి కన్నులుగలదయిన (అప్సు జాయతే నీటిలో పుట్టునది. కమలము), కుబ్జామ్= గూనితో నడుము వంగిన కుబ్జను ( ఈషత్ ఉబ్జం ఆర్జవం అస్యాః – చక్కగా నిలబడనిది. గూనిది), దృష్ట్వా= చూసి, తయా= ఆమెచే, అంగరాగే దత్తే= సుగంధవస్తువులను (అంగరాగములను) నీకు అర్పింపగా(అంగం రజ్యతే అనేన – అంగమును అలంకరించునది. కేసర చందనాదులు, మైపూతలు), తస్యాః= ఆమె యొక్క, హృది= హృదయములో, మహాంతం= గొప్పదయిన, అంగ రాగమ్ = అనంగరాగమును (అనురాగమును), అదదాః =కలుగునట్లు చేసావు.(అంగ= ప్రియమైన దైవమా! అని మరొక విభాగము. తరువత రాగమ్ మొదలయిన అర్థాలు యథాతథము), చిత్తస్థామ్ ఋజుతామ్ = ఆమె హృదయమునందుగల సూటితనం, గాత్రే = ఆమె శరీరమందు (గచ్ఛతి అనేన–దీనితో వెళ్లుదురు. శరీరము), ప్రథయితుం అపి= బయటపడేటట్లు చేయుటకు, తస్యాః = అమెను, స్ఫుటం= స్ఫుటముగా, గృహ్ణన్= గ్రహించి, తావత్ = అప్పుడు, మంజుకరేణ= నీ మెత్తని చేతితో, తామ్ =ఆమెను, జగత్ సుందరీమ్ = జగదేక సుందరిగా, ఉదనయః = చేసితివి, సాధు కిల= నీ చర్య బాగుంది కదా!

**తాత్పర్యము:** అటుపిమ్మట పద్మములవంటి కన్నులుగలదయిన గూనితో నడుము వంగిన కుబ్జను రాజవీథిలో చూసావు. ఆమె సుగంధవస్తువులను నీకు అర్పింపగా ఆమె యొక్క హృదయములో గొప్పదయిన అనురాగమును కలుగునట్లు చేసావు. ఆమె హృదయమునందుగల సూటితనం ఆమె శరీరమందు బయటపడేటట్లు చేయుటకు అమెను స్ఫుటముగా గ్రహించి నీ మెత్తని చేతితో ఆమెను జగదేక

సుందరిగా చేసితివి (కృష్ణుడు తన చేతులను కుబ్జ మెడక్రింద ఉంచి తన పాదములతో కుబ్జ పాదములను అదిమి తరువాత ఆమెను సాగలాగి మేని వంకరలు పోగొట్టాడని భావం)

**విశేషాలు**

**కుబ్జ:** నడుమున మెడను పాదములందు మూడు వంకరలు తిరిగి వికృతమైన గూనుగల్లి మరుగుజ్జుగనున్న స్త్రీ.

**74-6 శ్లో.**
**తావన్నిశ్చితవైభవాస్తవ విభో! నాత్యంతపాపా జనాః**
**యత్కించిద్దదతే స్మ శక్త్యనుగుణం తాంబూలమాల్యాదికమ్ ।**
**గృహ్ణానః కుసుమాది కించన తదా మార్గే నిబద్ధాంజలిః**
**నాతిష్ఠం బత హా యతోఽద్య విపులామార్తిం వ్రజామి ప్రభో! ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణదేవా!, తావత్= కుబ్జను నువ్వు అనుగ్రహించిన విధానము చూసి, తవ నిశ్చితవైభవాః= నీ వరప్రదాన ప్రభావములను (మహిమలను) నమ్మిన, న అత్యంత పాపా జనాః = అధిక పాపములు చేయని పుణ్యాత్ములయిన జనులు, శక్తి అనుగుణం= తమ శక్త్యానుసారము, తాంబూల మాల్య ఆదికమ్= తాంబూలమో పూలమాల మొదలయిన వాటిలో (తాంబూల=తామ్యతి అజీర్ణాదీన్ అజీర్ణాదులను పోగొట్టునది), యత్ కించిత్ = ఏదో ఒక కానుకను, దదతే స్మ= నీకు సమర్పించి కృతార్థులయిరి, ప్రభో= ఓ కృష్ణ ప్రభూ!, తదా= ఆ సమయములో నేనుకూడా, నిబద్ధ అంజలిః =నీకు అంజలిని బంధించి అనగా నమస్కరించి(నితరాం బద్ధః- బంధింపబడ్డవాడు.)(అంజ్యతే వ్యజ్యతే భక్తి రనేనేతి భక్తిని తెలుపునది. అంజలి, చేతులు జోడించుట), కించన కుసుమ ఆది గృహ్ణానః = పువ్వులు మొదలైన చిరుకానుకలను సమర్పించుటకు, మార్గే = నువ్వువచ్చుమార్గమునందు, న అతిష్ఠం= నిలుచుండలేదు, హా బత= అయ్యో!, యతః= ఆ కారణముగా (నీకు ఆనాడు నమస్కరించి పువ్వో, పండో సమర్పించనందువలన), అద్య= నేడు,

విపులామ్ =తీరని (గొప్ప), ఆర్తిం= బాధలను, వ్రజామి= పొందుచున్నాను (దుఃఖించుచున్నాను).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! కుబ్జను నువ్వు అనుగ్రహించిన విధానము చూసి నీ వరప్రదాన ప్రభావములను (మహిమలను) నమ్మిన పుణ్యాత్ములయిన జనులు తమ శక్త్యానుసారము తాంబూలమో పూలమాల మొదలయిన వాటిలో ఏదో ఒక కానుకను నీకు సమర్పించి కృతార్థులయిరి. ఓ కృష్ణ ప్రభూ! ఆ సమయములో నేనుకూడా నీకు నమస్కరించి పువ్వులు మొదలైన చిరుకానుకలను సమర్పించుటకు నువ్వువచ్చుమార్గమునందు నిలుచుండలేదు. అయ్యో! ఆ కారణముగా –నీకు ఆనాడు నమస్కరించి పువ్వో, పండో సమర్పించ నందువలన నేడు తీరని గొప్ప బాధలను పొంది దుఃఖించుచున్నాను.

**74–7 శ్లో.**

**ఏష్యామీతి విముక్తయాపి భగవన్నాలేపదాత్ర్యా తయా**
**దూరాత్ కాతరయా నిరీక్షితగతిస్త్వం ప్రావిశో గోపురమ్ ।**
**అఘోషానుమితత్వదాగమమహాహర్షోల్లలద్దేవకీ–**
**వక్షోజప్రగలత్పయోరసమిషాత్ త్వత్కీర్తిరంతర్గతా ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ గురువాయూరు దేవా!, ఏష్యామి= తన ఇంటికి రమ్మన్న ఆ కుబ్జతో, "తిరిగి నీ వద్దకు వచ్చెదను", ఇతి= అని పలికి, విముక్తయాపి= ఆమెను పంపించివేసావు, తయా ఆలేప దాత్ర్యా =అంగరాగమును ఇచ్చిన త్రివక్రయైన ఆ కుబ్జ, కాతరయా= విరహ భీతితో, దూరాత్ నిరీక్షితగతిః = నీ కొరకు ఎంతగానో ఎదురుచూచినది.(నితరాం ఈక్షితః అవలోకిత–బాగా చూడబడినది), త్వం= నువ్వు, గోపురమ్= పురద్వారములో ఉన్న గోపురమునందు(గావః పూర్యంతే ఆవులు కూడు చోటు. నగర ద్వారము గోపురము), ప్రావిశః = ప్రవేశించావు, అఘోష = నీ రాకకు సంతోషించి ఆ మధురానగర ప్రజలు చేయుచున్న జయజయధ్వనులను విని, త్వత్ ఆగమ= నీ రాకను, అనుమిత = ఊహించి, మహా హర్ష = మహా సంతోషముతో, ఉల్లలత్ =కదులుచున్న, దేవకీ వక్షోజ= నిన్ను కన్నతల్లి దేవకీదేవి యొక్క స్తనయుగమందు(దేవకస్య అపత్యం

స్త్రీ దేవకుని కుమార్తె. దేవకీ, శ్రీకృష్ణుని తల్లి.)(వక్షసి జాయతే వక్షఃస్థలమున పుట్టినది. స్తనము), ప్రగలత్ = పొంగు, పయోరసమిషాత్= స్తన్యము నెపమున, త్వత్ కీర్తిః = నీ కీర్తి, అంతః గతా = నగరము అంతా వ్యాపించింది. (కీర్తిని తెలుపుతో పోల్చుట కవి సమయం. పాలు తెలుపు. కనుక పాల రూపంలో కీర్తి ప్రసరించినదని ఒక అర్థం).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! తన ఇంటికి రమ్మన్న ఆ కుబ్జతో , "తిరిగి నీ వద్దకు వచ్చెదను" అని పలికి ఆమెను పంపించివేసావు. త్రివక్రయైన ఆ కుబ్జ విరహ భీతితో నీ కొరకు ఎంతగానో ఎదురుచూచినది. నువ్వు పురద్వారములో ఉన్న గోపురమునందు ప్రవేశించావు. నీ రాకకు సంతోషించి ఆ మధురానగర ప్రజలు చేయుచున్న జయజయధ్వనులను విని – నీ రాకను ఊహించి మహా సంతోషముతో ప్రకాశించుచున్న నిన్ను కన్నతల్లి దేవకీదేవి యొక్క స్తనయుగమందు పొంగు స్తన్యము నెపమున నీ కీర్తి నగరము అంతా వ్యాపించింది.

**74-8 శ్లో.**

**ఆవిష్టో నగరీం మహోత్సవవతీం కోదండశాలాం వ్రజన్**
**మాధుర్యేణ ను తేజసా ను పురుషైర్దూరేణ దత్తాంతరః ।**
**స్రగ్భిర్భూషితమర్చితం వరధనుర్మామేతి వాదాత్ పురః**
**ప్రాగృహ్ణాస్సమరోపయః కిల సమాక్రాక్షీరభాంక్షీరపి ॥**

**ప్రతిపదార్థము:** మహా ఉత్సవవతీం= ధనుర్యాగము కారణముగా మహోత్సవము జరుగుచున్న, నగరీం = కంస నగరములో నువ్వు, ఆవిష్టః = ప్రవేశించి (ఆవిష్టః ప్రవిష్టః సంపన్నః వశీకృతః–ప్రవేశించినవాడు), కోదండశాలాం= ధనుర్యాగము జరుగుచున్న యాగశాలను (కౌతి శబ్దం కరోతి దండః అస్య–శబ్దము చేయు దండము కలది. ధనుస్సు), వ్రజన్= సమీపించి, మాధుర్యేణ ను= మాధుర్యము వల్లనో (మధురస్య భావః–మాధుర్యము), తేజసా ను= నీ ప్రతాపము వల్లనో, పురుషైః = అక్కడ రక్షణగా ఉన్న పురుషులు, దూరేణ= తమంతట తాము దారితొలగి, దత్త అంతరః= నీకు యాగశాలలో ప్రవేశించుటకు మార్గము ఇచ్చిరి, స్రగ్భిః= (ఆధనుశ్శాలలో)పూల మాలలతో, భూషితమ్= అలంకరింపబడి,

అర్చితం = అర్చింపబడిన, వర ధనుః= మహాధనుస్సును, మా మా ఇతి = ముట్టుకోవద్దు.. ముట్టుకోవద్దు అని, వాదాత్= అక్కడి కావలివారు వారిస్తున్నా వినక, పురః= ముందే, ప్రాగృహ్ణాః = ఎక్కుపెట్టి, సమరోపయః = ఎక్కుపెట్టి, సమాక్రాక్షీః కిల = ఆకర్షించితివి కదా!, అభాంక్షీః అపి= ఆ ధనుస్సును విరిచితివి కూడ.

**తాత్పర్యము:** ధనుర్యాగము కారణముగా మహోత్సవము జరుగుచున్న కంస నగరములో నువ్వు ప్రవేశించి ధనుర్యాగము జరుగుచున్న యాగశాలను సమీపించి నీ మాధుర్యము వల్లనో ,నీ ప్రతాపము వల్లనో అక్కడ రక్షణగా ఉన్న పురుషులు తమంతట తాము దారితొలగి నీకు యాగశాలలో ప్రవేశించుటకు మార్గము ఇచ్చిరి. ఆధనుశ్శాలలో పూల మాలలతో ఆలంకరింపబడి అర్చింపబడిన మహాధనుస్సును ముట్టుకోవద్దు ముట్టుకోవద్దు అని అక్కడి కావలివారు వారిస్తున్నా వినక ముందే ఎక్కుపెట్టి ఎక్కుపెట్టి ఆకర్షించితివి కదా! ఆ ధనుస్సును విరిచితివి .

**74-9 శ్లో.**
**శ్వః కంసక్షపణోత్సవస్య పురతః ప్రారంభతూర్యోపమః**
**చాపధ్వంసమహాధ్వనిస్తవ విభో! దేవానరోమాంచయత్ ।**
**కంసస్యాపి చ వేపథుస్తదుదితః కోదండఖండద్వయీ-**
**చండాభ్యాహతరక్షిపూరుషరవైరుత్కూలితోఽభూత్త్వయా ॥**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తవ = నీయొక్క, చాప ధ్వంస = ఆ ధనుర్భంగమయిన సందర్భములో(చపస్య వంశభేదస్య వికారః - వెదురుతో చేయబడిన ధనుస్సు), మహా ధ్వనిః = గొప్ప చప్పుడు(ధ్వనిః ధ్వననమ్ ధ్వని, శబ్దము), శ్వః = మరునాడు జరగబోవు(అనాగతాహః రేపు), కంస క్షపణ =నిర్లజ్జ కలిగిన కంససంహార, ఉత్సవస్య = మహోత్సవమునకు, పురతః = ముందుగా, ప్రారంభ = మ్రోగుటకు ఆరంభించిన, తూర్య ఉపమః = దుందుభి నాదమును (ఆరంభమంగళవాద్య ఘోషముగా)తలపించెను. (తూర్యతే తాడ్యతే కొట్టబడునది. వాద్య విశేషము), దేవాన్= (ధనుర్భంగమయిన సందర్భములో వచ్చిన మహా ధ్వని) దేవతల శరీరమును, అరోమాంచయత్= రోమాంచితము

చేసింది, తత్ =దానినుండి(ధనుర్భంగము నుండి), ఉదితః= పుట్టిన ధ్వని, కంసస్య అపి చ= కంసుని హృదయమున, వేపథుః = వణుకు కలిగించింది. (వేపతే తస్య భావః కర్మ వా కంపనము, వణుకు), కోదండ= విరిగిపోయిన ఆ ధనుస్సు యొక్క, ఖండ ద్వయీ= రెండు ఖండములచే, చండ అభి ఆహత త్వయా = నిన్ను అడ్డగించి నీచేతచావుదెబ్బలుతిన్న,రక్షిపూరుషరవైః=కావలిపురుషులఆర్తనాదములచే(పురి శేతే, పురతి అగ్రగచ్ఛతి పురుషుడు), ఉత్కూలితః అభూత్ = కంసుని వణుకు రెట్టింపయ్యెను. (గట్లునిండి పొంగి పొరలుచున్న వరద ప్రవాహమువలె వణుకురెట్టింపయ్యెను)(ఉత్కూలం కూలం యావత్ గతః – కూలము వరకు పోయినవాడు ఒడ్డువరకు చేరినవాడు).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! నీయొక్క ఆ ధనుర్భంగమయిన సందర్భములో వచ్చిన గొప్ప చప్పుడు మరునాడు జరగబోవు కంససంహార మహోత్సవమునకు ముందుగా మ్రోగుటకు ఆరంభించిన దుందుభి నాదమును తలపించెను . ధనుర్భంగమయిన సందర్భములో వచ్చిన ఆ మహా ధ్వని దేవతల శరీరమును రోమాంచితము చేసింది. కంసుని హృదయమున వణుకు కలిగించింది. విరిగిపోయిన ఆ ధనుస్సు యొక్క రెండు ఖండములచే నిన్ను అడ్డగించి నీ చేత చావు దెబ్బలు తిన్న కావలిపురుషుల ఆర్తనాదములచే కంసుని వణుకు రెట్టింపయ్యెను.

**74-10 శ్లో.**

**శిష్టైర్దుష్టజనైశ్చ దృష్టమహిమా ప్రీత్యా చ భీత్యా తతః**
**సంపశ్యన్ పురసంపదం ప్రవిచరన్ సాయంగతో వాటికామ్ ।**
**శ్రీ దామ్నా సహ రాధికావిరహజం ఖేదం వదన్ ప్రస్వపన్**
**ఆనందన్నవతారకార్యఘటనాద్ వాతేశ! సంరక్ష మామ్ ॥**

**ప్రతిపదార్థము:** తతః = అటుపిమ్మట, దృష్టమహిమా= నీ మహిమను చూసి(దృష్టః అవలోకితః చూడబడినది కనబడునది), శిష్టైః= మంచివారు(శినష్టి విశిష్టో భవతివిశిష్టమైనది విశిష్టుడు శాంతుడు ధీరుడు), ప్రీత్యా చ= ప్రేమతో, దుష్టజనైః చ = దుష్టులు (దుష్యతి అసౌ తప్పు చేయువాడు. దుర్బలుడు నీచుడు), భీత్యా =

భయపడుతూ, సంపశ్యన్ = నిన్ను చూసారు, పుర సంపదం=మథురాపుర శోభలో, ప్రవిచరన్= విహరించి, సాయం= సంధ్యా సమయములో, వాటికామ్ = బసకు (వట్యతే వేష్ట్యతే ప్రాచీరాదిభిః–గోడతో చుట్టబడినది. వాటిక), గతః = వచ్చి, శ్రీ దామ్నా సహ= మిత్రుడగు శ్రీదామునితో, రాధికా విరహజం = రాధా విరహముగా కలిగిన, ఖేదం = విచారమును, వదన్ = చెప్పి, ప్రస్వపన్ = నిద్రించితివి, అవతార కార్యఘటనాత్ = నీ అవతార ప్రయోజనమైన కంససంహారముజరుగబోవు చున్నందుకు, ఆనందన్= ఆనందించితివి, వాతేశ= ఓ గురువాయూరు దేవా!, మామ్= నన్ను, సంరక్ష= కాపాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీ మహిమను చూసి మంచివారు ప్రేమతో దుష్టులు భయపడుతూ నిన్ను చూసారు. మథురాపుర శోభలో విహరించి సంధ్యా సమయములో బసకు వచ్చి మిత్రుడగు శ్రీదామునితో రాధా విరహముగా కలిగిన విచారమును చెప్పి నిద్రించితివి. నీ అవతార ప్రయోజనమైన కంససంహారము జరుగబోవుచున్నందుకు ఆనందించితివి ఓ గురువాయూరు దేవా ! నన్ను కాపాడు.

***దశమ స్కంధము***

**74వ దశకము సమాప్తము**

# దశకమ్ 75 – కంసవధ

**75-1 శ్లో.**

**ప్రాతస్సంత్రస్తభోజక్షితిపతివచసా ప్రస్తుతే మల్లతూర్యే**
**సంఘే రాజ్ఞాం చ మంచానభియయుషి గతే నందగోపేఽపి హార్మ్యమ్ ।**
**కంసే సౌధాధిరూఢే త్వమపి సహబలస్సానుగశ్చారువేషో**
**రంగద్వారం గతోఽభూః కుపితకువలయాపీడనాగావలీఢమ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రాతః= మరు నాడు ప్రొద్దున(సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు పగటి కాలాన్ని ఐదు భాగాలు చేస్తే అందులో మొదటి భాగం), సంత్రస్త =భయపడిన (దేవకికి జన్మించిన అష్టమ పుత్రుడయిన ఈకృష్ణుడు తనను చంపునను భయముచేత), భోజ క్షితిపతిః = ఆ భోజరాజు కంసుని, వచసా= ఆజ్ఞతో, మల్లతూర్యే= మల్లక్రీడానుసరియైన నగారావాద్య ప్రయోగము (మల్లతే ధరతి బలమ్, ధరతి ప్రతిద్వంద్వినమ్ బలము కలవాడు ఎదుటివానిని ఎదుర్కొనువాడు. మల్లుడు)(తూర్యతే తాడ్యతే కొట్టబడునది. వాద్య విశేషము), ప్రస్తుతే= ప్రారంభింపబడగా (మల్లయుద్ధము ప్రారంభమగుచున్నది అనుటకు సూచనగా ఘంటానాదము మ్రోగించగా), రాజ్ఞాం సంఘే చ= రాజులు వచ్చి, మంచాన్= మల్లరంగములో అమర్చబడిన మంచములలో(మంచెలలో) (మంచతి ఉచ్చైః భవతి పైకి వుండునది. మంచము మంచె), అభియయుషి= కూర్చొనగా, నందగోపే అపి హార్మ్యమ్ గతే = నందగోపుడు కూడా రాజ ప్రాసాదమునకు కూర్చొని ఉండగా, కంసే= కంసుడు, సౌధ అధిరూఢే= ఆ రంగస్థల భవన పైభాగమున ఉన్నతాసనములో కూర్చొనగా, త్వమ్ అపి=నువ్వు, బలః సహ= బలరామునితో, స అనుగః= నీ వెంట వచ్చిన మిత్రులతోను, చారువేషః = చక్కని వస్త్రములు ధరించి, కుపిత= కంసుని ప్రధానమంత్రిచే రెచ్చగొట్టబడి కోపించిన, కువలయాపీడ = కువలయాపీడమను(కువలయం సర్వం భూమండలం ఆపీడయతి భూమండలమునంతా పీడించువాడు. కువలయాపీడుడు అనునొక రాక్షసుడు), నాగః= ఏనుగు (న గచ్ఛతి అగః, న అగః – స్థిరంగా వుండనిది, పోవునది. సర్పము ఏనుగు), అవలీఢమ్= మీరు లోపలికి ప్రవేశించుటకు

అడ్డముగా నిలిచిన(అవలీఢం భుక్తమ్ తినబడినది నాకబడినది), రంగద్వారం = ఆ మల్లరంగద్వారము వద్దకు, గతః అభూః= వెళ్లావు.

**తాత్పర్యము:** మరునాడు ప్రొద్దున దేవకికి జన్మించిన అష్టమ పుత్రుడయిన ఈకృష్ణుడు తనను చంపునను భయముతో ఉన్న ఆ భోజరాజు కంసుని ఆజ్ఞతో మల్లక్రీడానుసరియైన నగారావాద్య ప్రయోగము ప్రారంభింపబడింది. రాజులు వచ్చి మల్లరంగములో అమర్చబడిన మంచములలోకూర్చొనిరి. నందగోపుడు కూడా రాజ ప్రాసాదమున కూర్చున్నాడు. కంసుడు ఆ రంగస్థల భవన పైభాగమున ఉన్నతాసనములో కూర్చున్నాడు. నువ్వు బలరామునితో నీ వెంట వచ్చిన మిత్రులతోను చక్కని వస్త్రములు ధరించి ఆ మల్లరంగద్వారము వద్దకు వెళ్లావు . అక్కడ కంసుని ప్రధానమంత్రిచే రెచ్చగొట్టబడిన కువలయాపీడమను ఏనుగు మీరు లోపలికి ప్రవేశించుటకు వీలుగాకుండా అడ్డముగా నిలిచినది.

**75-2 శ్లో.**
**పాపిష్ఠాపేహి మార్గాద్ద్రుతమితి వచసా నిష్ఠురక్రుద్ధబుద్ధేః**
**అంబష్ఠస్య ప్రణోదాదధికజవజుషా హస్తినా గృహ్యామాణః ।**
**కేళీముక్తోఽథ గోపీకుచకలశచిరస్పర్ధినం కుంభమస్య**
**వ్యాహత్యాలీయథాస్త్వం చరణభువి పునర్నిర్గతో వల్గుహాసీ ॥**

**ప్రతిపదార్థము:** పాపిష్ఠ= ఓరి ! పాపిష్ఠివాడా! (ఏతేషాం అతిశయేన పాపీ అందరి కంటే ఎక్కువగా పాపం చేసినవాడు), మార్గాత్ = మార్గమునుండి (మార్గయతి అన్విషంతి లక్ష్యం అనేన-దీనితో లక్ష్యమును వెదుకుదురు. మార్గము, బాట), ద్రుతమ్ = వేగముగా, అపేహి = దూరముగా పొమ్ము!, ఇతి వచసా = అను నీ మాటలతో, నిష్ఠుర క్రుద్ధ బుద్ధేః = దుష్టుడు, కోపిష్టివాడు అయిన (నిష్ఠురః పరుషః- పరుష వాక్యము పలుకువాడు పరుష వాక్యము నిర్దయుడు మొరటువాడు), అంబష్ఠస్య= మహా మంత్రియైన అంబష్ఠుని, ప్రణోదాత్= ప్రేరణతో, అధికజవజుషా =అధిక వేగముతో, హస్తినా= ఆ కువలయాపీడము తన తొండముచే, గృహ్యామాణః = నిన్ను బంధింపగా, కేళీ ముక్తః= అవలీలగా తప్పించుకొని, అథ= అటుపిమ్మట, గోపీ= గోపస్త్రీలయొక్క కుచ కలశములతో, చిర స్పర్ధినం= చాలాకాలము నుండి

తగవులాడుతున్న, అస్య కుంభమ్ = ఆ ఏనుగు యొక్క కుంభస్థలమును, వ్యాహత్య=చేతితో కొట్టి(విశేషేణ ఆహతః వ్యాకులః అవరుద్ధో వా కొట్టబడినది), చరణభువి = దానిపాదములసందున, అలీయథాః= దాగుకొని, పునః= మరలా, వల్గు హాసీ= మధురముగా నవ్వుచూ(వల్గతే మనోహరో భవతి అందంగా వుండునది), త్వం= నువ్వు, నిర్గతః = బయటికి వచ్చితివి.

**తాత్పర్యము:** ఓరి! పాపిష్ఠివాడా! మార్గమునుండి వేగముగా దూరముగా పొమ్ము! అను నీ మాటలతో కోపించిన మహా మంత్రియైన అంబష్ఠుని ప్రేరణతో అధిక వేగముతో ఆ కువలయాపీడము తన తొండముచే నిన్ను బంధింపగా అవలీలగా తప్పించుకొంటివి. అటుపిమ్మట గోపస్త్రీలయొక్క కుచ కలశములతో చాలాకాలము నుండి తగవులాడుతున్న ఆ ఏనుగు యొక్క కుంభస్థలమును చేతితో కొట్టి దానిపాదములసందున దాగుకొని మధురముగా నవ్వుచూ నువ్వు బయటికి వచ్చితివి. ( గోపాలక స్త్రీ కుచములతో పోలిక అను పుణ్యము ఉండుటవలన స్వామివారి కరస్పర్శను ఆ ఏనుగు కుంభ స్థలము పొందిందని సంస్కృత వ్యాఖ్యానం)

**75-3 శ్లో.**

**హస్తప్రాప్యోఽప్యగమ్యో ఝటితి మునిజనస్యేవ ధావన్ గజేంద్రం**
**క్రీడన్నాపత్య భూమౌ పునరభిపతతస్తస్య దంతం సజీవమ్ ।**
**మూలాదున్మూల్య తన్మూలగమహితమహామౌక్తికాన్యాత్మమిత్రే**
**ప్రాదాస్త్వం హారమేభిర్లలితవిరచితం రాధికాయై దిశేతి ॥**

**ప్రతిపదార్థము:** మునిజనస్య ఇవ =నువ్వు మునిజనులకు ప్రత్యక్షమయి అంతలోనే అదృశ్యమయినట్లుగా( మనుతే జానాతి తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు), హస్త= ఆ కువలయాపీడము అను ఏనుగుయొక్క హస్తమునకు- తొండమునకు (హసతి వికసతి అసౌ వికసించునది విప్పుకొనునది), ప్రాప్యః అపి = అందియును, అగమ్యః = అందనివానివిగా ఉంటివి, ఝటితి = వెంటనే, ధావన్= ఇటు అటు పరుగెత్తుచు, క్రీడన్=ఇలా కొంతసేపు ఆఏనుగుతో ఆడుకొని, గజేంద్రం = ఆ ఏనుగును, భూమౌ ఆపత్య= భూమిపై పడగొట్టి, పునః= మరలా, అభిపతతః తస్య= కిందపడిన ఆ ఏనుగు యొక్క, దంతం= దంతములను(దామ్యతే అనేన -

దీనితో నములుదురు. పన్ను), సజీవమ్ = ప్రాణములతో పాటుగా(ఏనుగు బతికి ఉండగానే), మూలాత్ ఉన్మూల్య= సమూలముగా పెరికివేసి, తత్ మూలగ= ఆ దంత మూలములందున్న (మూలయతి ప్రతిష్ఠితో భవతి పాతుక పోయినది. మొదలు), మహిత = ఇతరులు కోరదగిన, మహా మౌక్తికాని= చాలా విలువైన ముత్యాలను తీసి (ముక్తా ఏవ మౌక్తికమ్ ముత్యము), ఆత్మ మిత్రే= నీ ప్రాణ మిత్రుడైన శ్రీ దామునికి, త్వం = నువ్వు, ప్రాదాః = ఇచ్చి, ఏభిః = ఈముత్యాలతో, లలిత = మనోహరముగా (లలతే ఈషతే అందమైనది), విరచితం = తయాతుచేయబడిన, హారమ్ = హారమును (హరతి మనఃమనస్సును హరించునది. మాల), రాధికాయై= రాధ కొరకు, దిశ ఇతి= ఇమ్మని చెప్పితివి.

**తాత్పర్యము:** నువ్వు మునిజనులకు ప్రత్యక్షమయి అంతలోనే అదృశ్యమయినట్లుగా ఆ కువలయాపీడము అను ఏనుగుయొక్క తొండమునకు అందియును అందనివానివిగా ఉంటివి. వెంటనే ఇటు అటు పరుగెత్తుచు ఇలా కొంతసేపు ఆఏనుగుతో ఆడుకొని దానిని భూమిపై పడగొట్టి కిందపడిన ఆ ఏనుగు యొక్క దంతములను ప్రాణములతో పాటుగా(ఏనుగు బతికి ఉండగానే) సమూలముగా పెరికివేసి ఆ దంత మూలములందున్న ఇతరులు కోరదగిన చాలా విలువైన ముత్యాలను తీసి నీ ప్రాణ మిత్రుడైన శ్రీ దామునికి నువ్వు ఇచ్చి ఈముత్యాలతో మనోహరముగా తయారుచేయబడిన హారమును రాధ కొరకు ఇమ్మని చెప్పితివి (ఏనుగు దంతమూలములలో ముత్యములుండునని కవి సమయం)

**75-4 శ్లో.**

**గృహ్ణానం దంతమంసే యుతమథ హలినా రంగమంగాఽవిశంతం**
**త్వాం మంగళ్యాంగభంగీరభసహృతమనోలోచనా వీక్ష్య లోకాః ।**
**హంహో ధన్యో ను నందో న హి న హి పశుపాలాంగనా నో యశోదా**
**నో నో ధన్యేక్షణాః స్మస్త్రిజగతి వయమేవేతి సర్వే శశంసుః ॥**

**ప్రతిపదార్థము:** అంగ = ఓ శ్రీ కృష్ణా!, అథ= కువలయా పీడమను ఏనుగును చంపిన పిమ్మట, దంతమ్= దాని ఊడబెరికిన దంతములను, గృహ్ణానం= గ్రహించి, అంసే = భుజము పై ఉంచి (అమతి అమ్యతే వా భారాదినా భారమును

వహించునది) స్కంధము (భుజము), హలినా యుతమ్= బలరామునితో సహ, రంగమ్= మల్ల క్రీడా రంగమునకు, ఆవిశంతం= రాగా, త్వాం= నీయొక్క, మంగళ్య=శుభదాయకమైన (మంగళాయ హితమ్ మంగళమునకు హితమైనది), అంగ భంగీ= శరీరసౌష్ఠవమును, వీక్ష్య =చూసి, లోకాః= ప్రజలు, రభస హృత= బలాత్కారముగా అపహరించబడిన(రభతే వేగేన గచ్ఛతి తస్య భావః కర్మ వా వేగము, సంతోషము, ఉత్సాహము), మనః లోచనా = మనస్సు , కన్నులు కలవారయ్యారు, హంహో = ఆహా! (హం ఇతి అవ్యక్తం జహాతి సంబోధనము. పిలుచుట ప్రశ్నించుట), నందః = నందుడు, ధన్యః ను = ధన్యుడనుట నిశ్చయము, న హి= కాదు, న హి = కాదు, పశుపాల అంగనాః= గోపికలు పుణ్యాత్ములు, నో= కాదు, యశోదా= యశోద ధన్యురాలు, నో నో = కాదు కాదు (నో= నిషేధః, అభావః–నిషేధము అభావము నివారించుట), త్రిజగతి= మూడు లోకములలో, వయమ్ ఏవ = మనమే, ధన్య ఈక్షణాః స్మః = శ్రీ కృష్ణుడను పరబ్రహ్మము నందు నిమగ్నమైన పరిశుద్ధమైన మన చూపులే భాగ్యవంతములు. (ధనం లబ్ధా, ధనం లబ్ధం యేన ధనమును పొందబోవువాడు. కృతార్థుడు), ఇతి = అని, సర్వే= వారందరు, శశంసుః= పొగిడిరి.

**తాత్పర్యము:** ఓ శ్రీ కృష్ణా! కువలయా పీడమను ఏనుగును చంపిన పిమ్మట దాని ఊడబెరికిన దంతములను గ్రహించి భుజము పై ఉంచి బలరామునితో సహ మల్ల క్రీడా రంగమునకు రాగా నీయొక్క శుభదాయకమైన శరీరసౌష్ఠవమును చూసి ప్రజలు ఆకర్షింపబడి "ఆహా! నందుడు ధన్యుడనుట నిశ్చయము. కాదు కాదు గోపికలు పుణ్యాత్ములు. కాదు యశోద ధన్యురాలు . కాదు కాదు– మూడు లోకములలో మనమే– శ్రీ కృష్ణుడను పరబ్రహ్మము నందు నిమగ్నమైన పరిశుద్ధమైన మన చూపులే – భాగ్యవంతములు'' అని వారందరు పొగిడిరి.

**75–5 శ్లో.**

**పూర్ణం బ్రహ్మైవ సాక్షాన్నిరవధిపరమానందసాంద్రప్రకాశం**
**గోపేషు త్వం వ్యలాసీర్న ఖలు బహుజనైస్తావదావేదితోఽభూః ।**
**దృష్ట్వాఽథ త్వాం తదేదం ప్రథమముపగతే పుణ్యకాలే జనౌఘాః**
**పూర్ణానందా విపాపాస్సరసమభిజగుస్త్వత్కృతాని స్మృతాని ॥**

**ప్రతిపదార్థము:** త్వాం= నువ్వు, సాక్షాత్= సాక్షాత్తుగా (సహ అక్షతి కనబడునది కండ్లముందున్నది), పూర్ణం బ్రహ్మ–ఏవ= పరబ్రహ్మవు. (పూర్ణః పూరితః సకలః– నిండుగా వున్నది. సంపూర్ణము), గోపేషు = గోపాలుర మధ్య, నిరవధి = అవధులు లేని, పరమ ఆనంద సాంద్ర ప్రకాశం = అవధులులేని జ్ఞానానంద స్వరూపముగా, త్వం= నువ్వు, వ్యలాసీః= ప్రకాశించుచుంటివి, బహుజనైః = చాలామందికి, తావత్= ఇంతవరకు, న ఖలు ఆవేదితః అ భూః =నీ మహిమ తెలియకుండెను, అథ=అటుపిమ్మట, తత్ ఉపగతే పుణ్యకాలే = పుణ్యములు ఫలించు కాలము వచ్చినందున(పుణ్యములుపండి), జన ఔఘాః = మల్లరంగములో నిన్ను చూసిన జనములు, ఇదం ప్రథమమ్ దృష్ట్వా = ప్రత్యక్షముగా ఇటు మొదటిసారి దర్శించి, విపాపాః = వారి పాపములు నశించి, పూర్ణానందా= పరిపూర్ణానందమును పొందారు, త్వత్ = నువ్వు, కృతాని= చేసిన అద్భుత కార్యములను, స్మృతాని= స్మరించి(కృత స్మరణః–స్మరింపబడినది), సరసమ్= ఆనందముతో, అభిజగుః = కొనియాడారు.

**తాత్పర్యము:** నువ్వు సాక్షాత్తుగా పరబ్రహ్మవు. గోపాలుర మధ్య అవధులులేని జ్ఞానానంద స్వరూపముగా నువ్వు ప్రకాశించుచుంటివి. చాలామందికి ఇంతవరకు నీ మహిమ తెలియకుండెను. అటుపిమ్మట పుణ్యములు ఫలించు కాలము వచ్చినందున(పుణ్యములుపండి) మల్లరంగములో నిన్ను చూసిన జనములు ప్రత్యక్షముగా ఇటు మొదటిసారి దర్శించి వారి పాపములు నశించి పరిపూర్ణానందము పొందారు. నువ్వు చేసిన అద్భుత కార్యములను స్మరించి ఆనందముతో కొనియాడారు.

**విశేషాలు**

**సరసం:** రసమంటే ఎక్కువ అభిలాష. ఆస్వాదించటం. వృత్తి వాసనగా మారటం. 'రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.' ఇక్కడ రసమంటే వాసన అనే అర్థం. ఆనంద స్వరూపమైన పరమాత్మకు కూడా రసమనే పేరు. 'రసోవైసః' ఆయన ఆడే జగన్నాటకమంతా రాసక్రీడ క్రిందికి వస్తుంది.

**75-6 శ్లో.**

**చాణూరో మల్లవీరస్తదను నృపగిరా ముష్టికో ముష్టిశాలీ।**
**త్వాం రామం చాభిపేదే ఝటఝటితి మిథో ముష్టిపాతాతిరూక్షమ్ ।**
**ఉత్పాతాపాతనాకర్షణవివిధరణా న్యాసతాం తత్ర చిత్రం**
**మృత్యోఃప్రాగేవ మల్లప్రభురగమదయం భూరిశో బంధమోక్షాన్ ॥**

**ప్రతిపదార్థము:** తదను= ఆతరువాత, నృప గిరా = భోజరాజగు కంసుని ఆజ్ఞతో, మల్లవీరః = మల్లవీరుడయిన, చాణూరః = చాణూరుడు (చణతి హినస్తి అసౌ హింసించువాడు. చాణూరుడు), ముష్టిశాలీ =ముష్టి యుద్ధమునందు నేర్పరి యైన(ముషతి బధ్నాతి బంధింపబడునది. పిడికిలి), ముష్టికః = ముష్టికుడు (ముష్టిః మోషణం ప్రయోజనం అస్య-దొంగతనమే ప్రయోజనంగా గలవాడు. ఒక రాక్షసుడు), త్వాం = నీతోను, రామం చ= నీ అన్న బలరామునితోను, అభిపేదే = ఎదుర్కొన్నారు.(మల్లయుద్ధమునకు దిగిరి), ఝటఝటితి= ఝటఝట అను శబ్దములు వినవడుచుండగా, మిథః= ఒకరికొకరు, ముష్టి పాతైః= ముష్టి పాతములతో, అతి రూక్షమ్= మిక్కిలి కఠినముగా, ఉత్పాత= పైకి లేచుచు ఎగురుచు( ఉత్పతతి ఉద్గచ్ఛతి తస్య భావః ఒకరినొకరు పైకి విసరి వేసుకొన్నారు), ఆపాతన = ఆక్రమణము చేయుచు హఠాత్తుగా మీద పడుచు కిందికి లాగుచు(ఆసమంతాత్ అకస్మాత్ వా పతనం ఆక్రమణమ్ ఒకరినొకరు కిందపడవేసారు), ఆకర్షణ= బద్ధ హస్త పాదములతో ఒకరినొకరు లాగుచు (ఆకర్షతి తస్య భావః), వివిధ రణాని = ఈ విధముగా పలురీతులలో మల్ల యుద్ధము, ఆసతాం = చేయసాగిరి, తత్ర చిత్రం= అక్కడ విచిత్రమయిన విషయమున్నది, మృత్యోః ప్రాక్ ఏవ= ప్రాణములు పోవుటకుముందే, అయం మల్లప్రభుః= మల్లవీరుడయిన చాణూరుడు, భూరిశః = చాలా సార్లు, బంధమోక్షాన్= బంధ మోక్షములను, అగమత్ = పొందెను.

**తాత్పర్యము:** ఆతరువాత భోజరాజగు కంసుని ఆజ్ఞతో మల్లవీరుడయిన చాణూరుడు -ముష్టి యుద్ధమునందు నేర్పరి యైన ముష్టికుడు- వరుసగా నీతోను నీ అన్న బలరామునితోను మల్లయుద్ధమునకు దిగిరి. ఝటఝట అను శబ్దములు

వినవడుచుండగా ఒకరికొకరు ముష్టి పాతములతో ఒకరినొకరు పైకి విసరి వేసుకొన్నారు ఒకరినొకరు కింద పడవేసారు. ఒకరినొకరు లాగారు. ఈ విధముగా పలురీతులలో మల్ల యుద్ధము వారు చేయసాగిరి. అక్కడ విచిత్రమయిన విషయమున్నది. ప్రాణములు పోవుటకుముందే మల్లవీరుడయిన చాణూరుడు బంధ మోక్షములను పొందెను (మల్ల యుద్ధమున బంధింపబడుట, విడిపించుకొనుట అని ఒక అర్థము. నీచేతి స్పర్శచే బ్రతికియుండగానే సంసారబంధమునుండి మోక్షము పొందాడని రెండవ అర్థము)

**75-7 శ్లో.**

**హా ధిక్ కష్టం కుమారౌ సులలితవపుషౌ మల్లవీరౌ కఠోరౌ**
**న ద్రక్ష్యామో వ్రజామస్త్వరితమితి జనే భాషమాణే తదానీమ్ ।**
**చాణూరం తం కరోద్భ్రామణవిగళదసుం పోథయామాసిథోర్వ్యాం**
**పిష్టోఽభూన్ముష్టికోఽపి ద్రుతమథ హలినా నష్టశిష్టైర్దధావే ॥**

**ప్రతిపదార్థము:** హా ధిక్ కష్టం=అయ్యో! ఎంత కష్టం. (నిందాయామ్, లజ్జాయామ్ నింద లజ్జ), కుమారౌ= ఈ చక్కని కుమారులు కృష్ణ, బలరాములు(కుమారయతి క్రీడతి ఆడుకొనువాడు. పిల్లవాడు), సులలిత వపుషౌ= మిక్కిలి సుకుమారమయిన శరీరములు కలిగిన వారు, మల్లవీరౌ = ఈ చాణూరుడు, ముష్టికుడు అను మల్లవీరులు, కఠోరౌ = కఠినమయిన శరీరములు కలవారు(అతిక్రూరులు) (కృచ్ఛ్రేన జీవతి యేన-దీనివలన కష్టంగా జీవింతురు. కాఠిన్యము), న ద్రక్ష్యామః = సమానులు కాని వారి మధ్య జరిగే ఈ ఘోరమును మనము చూడలేము, త్వరితమ్= త్వరగా, వ్రజామః = వెళ్లిపోవుదుము, ఇతి = అని, జనే = పురజనులు, భాషమాణే= అనుకొనుచుండగా, తదానీమ్= అప్పుడు, తం చాణూరం= ఆచాణూరుని, కర ఉద్భ్రామణ= నీ రెండు చేతులతో ఎత్తి గిరగిరా త్రిప్పుచు, విగళత్ అసుం= ప్రాణములు హరించి, ఉర్వ్యాం పోథయామాసిథ= నేలపై విసిరి వేసావు, అథ= అటుపిమ్మట, హలినా= బలరామునిచే, ముష్టికః అపి= ముష్టికుడు కూడ, పిష్టః అభూత్= పిండి చేయబడ్డాడు.(ప్రాణములుపోగొట్టుకొన్నాడు).(పిష్టః చూర్ణితః దలితః-చూర్ణము చేయబడినది పిసకబడినది విసరబడినది. పిండి), నష్ట శిష్టైః

=ఇది చూసి చావగా మిగిలినవారు భయపడుతూ, ద్రుతమ్= వేగముగా, దధావే= పారిపోయిరి.

**తాత్పర్యము:** అయ్యో! ఎంత కష్టం. ఈ చక్కని కుమారులు కృష్ణ, బలరాములు మిక్కిలి సుకుమారమయిన శరీరములు కలిగిన వారు. ఈ చాణూరుడు, ముష్టికుడు అను మల్లవీరులు కఠినమయిన శరీరములు కలవారు(అతిక్రూరులు) సమానులు కాని వారి మధ్య జరిగే ఈ ఘోరమును మనము చూడలేము. త్వరగా వెళ్లిపోవుదుము అని పురజనులు అనుకొనుచుండగా అప్పుడు ఆచాణూరుని నీ రెండు చేతులతో ఎత్తి గిరగిరా త్రిప్పుచు ప్రాణములు హరించి నేలపై విసిరి వేసావు. బలరామునిచే ముష్టికుడు కూడ పిండి చేయబడ్డాడు.(ప్రాణములుపోగొట్టుకొన్నాడు) ఇది చూసి చావగా మిగిలినవారు భయపడుతూ వేగముగా పారిపోయిరి.

**75-8 శ్లో.**

**కంసః సంవార్య తూర్యం ఖలమతిరవిదన్ కార్యమార్యాన్ పితౄంస్తాన్**
**ఆహంతుం వ్యాప్తమూర్తేస్తవ చ సమశిషద్ దూరముత్సారణాయ ।**
**రుష్టో దుష్టోక్తిభిస్త్వం గరుడ ఇవ గిరిం మంచమంచన్నుదంచత్**
**ఖడ్గవ్యావల్గదుస్సంగ్రహమపి చ హఠాత్ ప్రాగ్రహీరౌగ్రసేనిమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఖల - మతిః = దుష్టబుద్ధి అయిన(స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు మూర్ఖుడు),కంసః =కంసుడు, తూర్యం =భేరీనాదమును, సంవార్య = ఆపించి, కార్యమ్ అవిదన్= కువలయా పీడ వధ , చాణూర ముష్టిక సంహారము జరిగిన తరువాత ఏమి చేయాలో తోచక, వ్యాప్తమూర్తేః = సర్వమూర్తివయిన నిన్ను(అంతటా కనిపించుచున్న నిన్ను),దూరమ్=దూరముగా, ఉత్సారణాయ =తరిమివేయమని (దూరీకరణమ్ దూరం చేయుట దూరమగుట), తాన్ ఆర్యాన్ = ఆ సజ్జనులైన పెద్దలను, తవ చ పితౄన్ = నీ తండ్రులయిన వసుదేవ-నంద ఉగ్రసేనులలను, ఆహంతుం = చంపుడని, సమశిషద్ = అజ్ఞ ఇచ్చెను, దుష్ట= ఆదుష్టుడయిన, ఉక్తిభిః = కంసుని వచనములకు, రుష్టః = కోపించి, త్వం = నువ్వు, గిరిం= పర్వత శిఖరము పైకి ఎగిరిన, గరుడ ఇవ = గరుత్మంతుని వలె (గరుడ్భ్యాం పక్షాభ్యాం ఉడ్డయతే రెక్కలతో ఎగురునది. గరుడ పక్షి), మంచమ్

ఉంచన్ =కంసుడు ఉన్న మంచెపై దూకితివి(మంచతి ఉచ్చైః భవతి పైకి వుండునది. మంచము), ఉదంచత్ = పైకి ఎత్తిన, ఖడ్గ = ఖడ్గము యొక్క (ఖంద్యతే భిద్యతే అనేన–దీనిచేత ఖండింతురు. ఖడ్గము), వ్యావల్గ= చలనము చేత, దుస్సంగ్రహమ్ అపి చ= ఆ కంసుడు గ్రహించుటకు అసాధ్యమయినప్పటికి, హఠాత్= బలాత్కారముగా, ఔగ్రసేనిమ్= కంసుని, ప్రాగ్రహీః= పట్టుకొంటివి.

**తాత్పర్యము:** దుష్టబుద్ధి అయిన కంసుడు భేరీనాదమును ఆపించి, కువలయా పీడ వధ, చాణూర ముష్టిక సంహారము జరిగిన తరువాత ఏమి చేయాలో తోచక అంతటా కనిపించుచున్న నిన్ను దూరముగా తరిమివేయమని, నీ తండ్రులయిన వసుదేవ–నంద ఉగ్రసేనులను చంపుడని అజ్ఞ ఇచ్చెను. ఆ దుష్టుడయిన కంసుని వచనములకు కోపించి నువ్వు పర్వత శిఖరము పైకి ఎగిరిన గరుత్మంతుని వలె అతడు ఉన్న మంచెపై దూకితివి. పైకి ఎత్తిన ఖడ్గమును గిరగిరా తిప్పుచూ ఆ కంసుడు గ్రహించుటకు అసాధ్యమయినప్పటికి– బలాత్కారముగా కంసుని నువ్వు పట్టుకొంటివి.

**75–9 శ్లో.**
**సద్యో నిష్పిష్టసంధిం భువి నరపతిమాపాత్య తస్యోపరిష్టాత్**
**త్వయ్యాపాత్యే తదైవ త్వదుపరి పతితా నాకినాం పుష్పవృష్టిః ।**
**కిం కిం బ్రూమస్తదానీం సతతమపి భియా త్వద్గతాత్మా స భేజే**
**సాయుజ్యం త్వద్వధోత్థాపరమ! పరమియం వాసనా కాలనేమేః ॥**

**ప్రతిపదార్థము:** పరమ పరమ = శ్రేష్ఠాతిశ్రేష్ఠా! (పరం పరత్వం శ్రేష్ఠత్వం మాతి శ్రేష్ఠత్వమును పొందునది. ఉత్కృష్టము), సద్యః = వెంటనే, నరపతిమ్ = ఆ కంసుని, భువి ఆపాత్య= క్రిందపడవైచి, తస్య ఉపరిష్టాత్ = అతని పై (ఉపరిష్టాత్= ఊర్ధ్వదేశః), త్వయి = నువ్వు, ఆపాత్యే =దూకి(కూర్చుని), తదా= అప్పుడు, సంధిం = కంసుని శరీరములోని కీలు కీలు సంధులను (సంధీయతే అసౌ కలుపుట కలుపబడునది), నిష్పిష్ట ఏవ= విడగొట్టితివి. (నుగ్గు నుగ్గు చేసితివి), తదానీం= అప్పుడు, త్వత్ ఉపరి పతితా= కంసునిపై నువ్వు పడుట, నాకినాం= స్వర్గము నుండి దేవతల (నాకః స్వర్గః వాసస్థానత్వేన అస్తి అస్య–స్వర్గము నివాస స్థానంగా

కలవాడు. దేవత), పుష్ప వృష్టిః = పూలవాన కురియుట ఒకేసారి జరిగినది, కిం కిం బ్రూమః= ఇంకా ఏమి చెప్పవలెను?, సతతమ్ అపి = ఎల్లప్పుడు, త్వత్ భియా=నీభయముచే, గత ఆత్మా= నీయందే ఉంచిన ఆత్మచే (నిన్నే ధ్యానించి), సః= ఆ కంసుడు, త్వత్= నీయొక్క, సాయుజ్యం = సాయుజ్యమును, భేజే = పొందెను, ఇయం= ఇది, కాలనేమేః వధ= క్రితం జన్మలో కాలనేమి అను రాక్షసునిగా పుట్టి నీచే చనిపోయినందున, ఉత్థా వాసనా= కంసునికి కల్గిన పూర్వజన్మవాసన.

**తాత్పర్యము:** శ్రేష్ఠాతిశ్రేష్ఠా! వెంటనే ఆ కంసుని క్రిందపడవైచి అతనిపైకి దూకి అతని శరీరములోని కీలు కీలు సంధులను నుగ్గు నుగ్గు చేసితివి. కంసునిపై నువ్వు పడుట స్వర్గము నుండి దేవతల పూలవాన కురియుట ఒకేసారి జరిగినది. ఇంకా ఏమి చెప్పవలెను? సదా నీస్మరణముచే నీ సాయుజ్యము లభించుననుటకు ఉదాహరణములు అనేకము మేము చెప్పనవసరంలేదు. ఈ కంసుని ఉదాహరణమే దానికి ఒక సాక్షి. ఎల్లప్పుడు నీభయముచే నిన్నే ధ్యానించి ఆ కంసుడు నీయొక్క సాయుజ్యమును పొందెను. ఇది క్రితం జన్మలో కాలనేమి అను రాక్షసునిగా పుట్టి నీచే చనిపోయినందున కంసునికి కల్గిన పూర్వజన్మవాసన (ఈ పూర్వజన్మ వాసనా ఫలితముగా ఈ జన్మలో కంసుడు సాయుజ్యముక్తి పొందెనని భావం)

**75-10 శ్లో.**

**తద్ భ్రాతౄనష్ట పిష్ట్వా ద్రుతమథ పితరౌ సన్నమన్నుగ్రసేనం**
**కృత్వా రాజానముచ్చైర్యదుకులమఖిలం మోదయన్ కామదానైః ।**
**భక్తానాముత్తమం చోద్ధవమమరగురోరాప్తనీతిం సఖాయం**
**లబ్ధ్వా తుష్టో నగర్యాం పవనపురపతే! రుంధి మే సర్వరోగాన్ ॥**

**ప్రతిపదార్థము:** తత్ అష్ట భ్రాతౄన్= ఆ కంసుని ఎనిమిది సోదరులైన కంకన్యగ్రోధాదులను(భ్రాజతే, భరతి హరతి భాగమ్ ప్రకాశించువాడు సహోదరుడు, భాగమును భరించువాడు), ద్రుతమ్= వెంటనే, పిష్ట్వా = సంహరించి, అథ= అటుపిమ్మట, పితరౌ = నీ తల్లితండ్రులగు దేవకీ వసుదేవులదగ్గరకు వెళ్ళి, సన్నమన్ = వారికి నమస్కరించావు, ఉగ్రసేనం= నీ మాతామహుడు,(తల్లితండ్రి) కంసుని తండ్రియగు ఉగ్రసేనుని(ఉగ్రా సేనా యస్య-చురుకైన సేన గలవాడు.

మథురానగర రాజు, ఉగ్రసేనుడు), రాజానమ్ = రాజుగా, కృత్వా=చేసి, ఉచ్చైః = అతిశయముగా, అఖిలం యదుకులమ్= యాదవులనందరిని, కామదానైః= కోరుకున్న వస్తువుల దానములతో, మోదయన్= ఆనందపరిచి, అమరగురోః= బృహస్పతి నుండి(న మ్రియతే మరణించనివాడు. దేవత), ఆప్త = గ్రహించబడిన, నీతిం= నీతిశాస్త్రము కలిగిన, భక్తానామ్ ఉత్తమం చ = భక్తులలో ఉత్తముడైన, ఉద్ధవమ్=ఉద్ధవుని (ఉద్ హూయతే అస్మిన్ ఇందులో ఆహుతి నిచ్చుదురు. యజ్ఞాగ్ని ఉద్ధవుడు), సఖాయం = కార్య సచివత్వముచే, నర్మ సచివత్వముచే నెచ్చెలిగా, లబ్ధ్వా= పొంది, నగర్యాం= ఆ మథురానగరమందు, తుష్టః = ఆనందముగా ఉన్నావు, పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మే = నాయొక్క, సర్వరోగాన్= సర్వరోగములను, రుంధి= కరుణతో దూరము చేయవలసినది.

**తాత్పర్యము:** ఆ కంసుని ఎనిమిది సోదరులైన కంకన్యగ్రోధాదులను వెంటనే సంహరించి అటుపిమ్మట నీ తల్లితండ్రులగు దేవకీ వసుదేవులదగ్గరకు వెళ్ళి వారికి నమస్కరించావు. నీ మాతామహుడు, కంసుని తండ్రియగు ఉగ్రసేనుని రాజుగా చేసి అతిశయముగా యాదవులనందరిని కోరుకున్న వస్తువుల దానములతో ఆనందపరిచి బృహస్పతి నుండి నీతిశాస్త్రము నేర్చుకొన్నవాడు, భక్తులలో ఉత్తముడైన ఉద్ధవుని నెచ్చెలిగా పొంది ఆ మథురానగరమందు ఆనందముగా ఉన్నావు. ఓ గురువాయూరు కృష్ణ దేవా! నాయొక్క సర్వరోగములను కరుణతో దూరముచేయవలసినది.

*దశమ స్కంధము*

**75వ దశకము సమాప్తము**

# దశకమ్ 76 – ఉద్ధవదౌత్యము

**76-1 శ్లో.**

**గత్వా సాందీపనిమథ చతుష్షష్టిమాత్రైరహోభిః**
**సర్వజ్ఞస్త్వం సహ ముసలినా సర్వవిద్యా గృహీత్వా ।**
**పుత్రం నష్టం యమనిలయనాదాహృతం దక్షిణార్థం**
**దత్వా తస్మై నిజపురమగా నాదయన్ పాంచజన్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, త్వం = నువ్వు, సర్వజ్ఞః= సర్వజ్ఞుడవయ్యి (సర్వం జానాతి అంతా తెలిసినవాడు. పరమేశ్వరుడు), ముసలినా సహ = బలరామునితో (ముసలం ప్రహరణత్వే అస్తి అస్య-ముసలము (రోకలి) ఆయుధంగా కలవాడు. బలరాముడు), సాందీపనిమ్= సాందీపనిమహర్షి దగ్గరకు (సందీపనస్య అపత్యమ్ సందీపనుని సంతానము. సాందీపని), గత్వా= వెళ్ళి, చతుః షష్టి మాత్రైః అహోభిః = అరువదినాలుగు రోజులలో, సర్వవిద్యాః= సర్వవిద్యలు (వేద్యంతే జ్ఞాయంతే విషయాః అనయా దీనితో విషయములు తెలుసుకొనబడును. విద్య.)(వేద్యంతే జ్ఞాయంతే పారలౌకికవిషయాః అనయా దీనితో పరలోక విషయములు తెలుసుకొనబడును. పరావిద్య), గృహీత్వా = గ్రహించి, నష్టం = మృతుడైన, పుత్రం= సాందీపని గురుపుత్రుని, యమ నిలయనాత్= యమలోకము నుండి(యమయతి నియమయతి జీవానాం ఫలాఫలమ్ జీవుల ఫలాఫలములను నిర్ణయించువాడు. యముడు.)(నిలయనము =నిలీయతే తస్య భావః – ఉండుట ఆశ్రయ స్థానము నివాసము), ఆహృతం= తీసుకొని వచ్చి, దక్షిణా అర్థం= గురుదక్షిణగా(విద్యార్థి తన విద్య పూర్తిఐన తరువాత గురువునకు ఇచ్చు కానుక. వేదాధ్యయన అనంతరే గురవే దేయా దక్షిణా), తస్మై దత్వా =గురువుకు సమర్పించి, పాంచజన్యమ్= పాంచజన్య శంఖమును, నాదయన్ = పూరించుచు, నిజ పురమ్= మధురానగరానికి, అగాః= తిరిగి వచ్చితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నువ్వు సర్వజ్ఞుడవయ్యి–లోకశిక్షణ కొరకు– బలరామునితో సాందీపనిమహర్షి దగ్గరకు వెళ్ళి అరువదినాలుగు రోజులలో

సర్వవిద్యలు(సాంగోపాంగ ఉపవేదరూపములు) గ్రహించి , మృతుడైన సాందీపని గురుపుత్రుని యమలోకము నుండి తీసుకొని వచ్చి గురుదక్షిణగా గురువుకు సమర్పించి పాంచజన్య శంఖమును పూరించుచు మధురానగరానికి తిరిగి వచ్చితివి.

**విశేషములు**

**పాంచజన్యము:** పంచజనే దైత్యభేదే భవః పంచజన అను దైత్యునికి సంబంధించినది. సాందీపుని పుత్రుని ప్రభాసతీర్థములోనికి తీసికొనిపోయిన రాక్షసుడు. వీడు తన గురుపుత్రుని కొనిపోయెనని కృష్ణుడు వీనిని చంపి వీని మెడ యెముకను పుచ్చుకొనెను. అదియే పాంచజన్యము అనబడిన కృష్ణుని శంఖము.

**76-2 శ్లో.**
**స్మృత్వా స్మృత్వా పశుపసుదృశఃప్రేమభారప్రణున్నాః**
**కారుణ్యేన త్వమపి వివశః ప్రాహిణోరుద్ధవం తమ్ ।**
**కిం చాముష్మై పరమసుహృదే భక్తవర్యాయ తాసాం**
**భక్త్యుద్రేకం సకలభువనే దుర్లభం దర్శయిష్యన్ ॥**

**ప్రతిపదార్థము:** పశుప సుదృశః = నంద గోకులములోని గోపికలు(శోభనే దృశౌ నేత్రే యస్యాః అందమైన కండ్లు కలది), స్మృత్వా స్మృత్వా=నిన్ను స్మరించి స్మరించి (ఎల్లప్పుడు తలుచుకొంటూ), ప్రేమ భార = అనురాగాతిశయముతో, ప్రణున్నాః= పరవశలయిరి, త్వమ్ అపి= నువ్వు కూడా, కారుణ్యేన= భక్త వాత్సల్యముతో (జాలిపడి), వివశః =వారిపట్ల పరవశుడవయి, కిం చ= మరియు, సకలభువనే దర్శయిష్యన్ దుర్లభం = సకల భువనములందు చూచుటకు దుర్లభమైన(ఎక్కడా కనిపించని)(దుఃఖేన లభ్యతే కష్టంతో లభించునది), తాసాం = ఆ గోపికల యొక్క, భక్తి ఉద్రేకం= అనన్య భక్తిని (సాటిరాని భక్తి) (ఉద్రిచ్యతే వర్ధతే ప్రారభ్యతే వా ఉద్రేకము వృద్ధి ఉపక్రమము ప్రారంభము), అముష్మై = ఉద్ధవునికి తెలియచేయుటకు, పరమ సుహృదే = పరమ మిత్రుడు, భక్తవర్యాయ= గొప్ప భక్తుడు అగు, తమ్ ఉద్ధవం= ఆ ఉద్ధవుని, ప్రాహిణోః= ఆ గోపికల దగ్గరకు సందేశముతో పంపితివి.

**తాత్పర్యము:** నంద గోకులములోని గోపికలు నిన్ను ఎల్లప్పుడు తలుచుకొంటూ అనురాగాతిశయముతో పరవశలయిరి. నువ్వు కూడా వారిపై జాలిపడి సకల భువనములందు ఎక్కడా కనిపించని ఆ గోపికల యొక్క సాటిరాని భక్తిని ఉద్ధవునికి తెలియచేయుటకు , పరమ మిత్రుడు గొప్ప భక్తుడు అగు ఆ ఉద్ధవుని ఆ గోపికల దగ్గరకు సందేశముతో పంపితివి.

**విశేషము:** కృష్ణునకు భక్తుడనని మిత్రుడనని అహంభావము ఉద్ధవునిలో పుట్టకుండుటకు అతనిని పవిత్రంగా ఉంచుటకు గోపికలను ఓదార్చి రమ్మని కృష్ణుడు పంపాడని ఒక సమన్వయం.

**76-3 శ్లో.**

**త్వన్మాహాత్మ్యప్రథిమపిశునం గోకులం ప్రాప్య సాయం**
**త్వద్వార్తాభిర్బహు స రమయామాస నందం యశోదామ్ ।**
**ప్రాతర్దృష్ట్వా మణిమయరథం శంకితాః పంకజాక్ష్యః**
**శ్రుత్వా ప్రాప్తం భవదనుచరం త్యక్తకార్యాస్సమీయుః ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ మాహాత్మ్య= నీ యొక్క మాహాత్మ్య (మహాత్మనో భావః- మాహాత్మ్యము. గొప్పదనము), ప్రథిమ= విస్తారమును (పృథోర్భావఃలావు, స్థూలము), పిశునం = సూచించుచున్న(పింశతి పిశ్యతే చెవిలో ఊదు), గోకులం= వ్రేపల్లెను(నీమహిమలు అయిన పూతనా-శకటాసుర భంజనము మొదలయిన వాటి జాడలుగల వ్రేపల్లె అని భావం), సాయం = సాయంసంధ్యాసమయములో (గోవులు ఇంటికి వచ్చు గోధూళి వేళలో), ప్రాప్య =చేరుకొని, నందం యశోదామ్= నంద యశోదలను, త్వత్ వార్తాభిః = నీ వార్తలతో (నీ యోగక్షేమ వార్తలతో), సః = ఆ ఉద్ధవుడు, బహు= అతిశయముగా(ఎక్కువగా), రమయామాస = ఆనంద పరిచెను, ప్రాతః = ప్రాతః కాలములో, మణిమయ రథం =నందుని ఇంటి ముందున్న మణులతో కూడిన రథమును, దృష్ట్వా= చూసి, శంకితాః= అక్రూరుడు వచ్చెనా అని సందేహించిన, పంకజాక్ష్యః = పద్మనేత్రలయిన గోపికలు, భవత్ అనుచరం= నీ అనుచరుడైన ఉద్ధవుడు, ప్రాప్తం శ్రుత్వా = వచ్చెనని విని,

త్యక్తకార్యాః= తమ పనులను వదలి(త్యక్తః పరిత్యక్తః దత్తః–విడిచిపెట్టబడినది), సమీయుః= ఉద్ధవుని కలుసుకొనుటకు వచ్చిరి.

**తాత్పర్యము:** నీమహిమలు అయిన పూతనా–శకటాసుర భంజనము మొదలయిన వాటి జాడలుగల వ్రేపల్లెకు సాయంసంధ్యాసమయములో ఉద్ధవుడు చేరుకొని నంద యశోదలను నీ యోగక్షేమ వార్తలతో ఆనంద పరిచెను. ప్రాతః కాలములో నందుని ఇంటి ముందున్న మణులతో కూడిన రథమును చూసి అక్రూరుడు వచ్చెనా అని సందేహించిన గోపికలు నీ అనుచరుడైన ఉద్ధవుడు వచ్చెనని విని తమ పనులను వదలి ఉద్ధవుని కలుసుకొనుటకు వచ్చిరి.

**76–4 శ్లో.**

**దృష్ట్వా చైనం త్వదుపమలసద్వేషభూషాభిరామం**
**స్మృత్వా స్మృత్వా తవవిలసితాన్యుచ్చకైస్తాని తాని ।**
**రుద్ధాలాపాః కథమపి పునర్గద్గదాం వాచమూచుః**
**సౌజన్యాదీన్ నిజపరభిదామప్యలం విస్మరంత్యః ॥**

**ప్రతిపదార్థము:** త్వత్ ఉపమ= నీతో పోలికకలిగి(ఉపమీయతే ఇతి సాదృశ్య కథనమ్ ఉపమాలంకారము. సాదృశ్యము చెప్పుట), లసత్ = ప్రకాశించుచూ, వేషభూషా = నీ వలెనే వేష భూషణములు ధరించి, అభిరామం = అందంగా ఉన్న(అభిరమతే మనో అత్ర సుందరమైనది మనోహరమైనది ప్రియమైనది), ఏనం చ= ఆ ఉద్ధవుని, దృష్ట్వా= చూసి, ఉచ్చకైః = అతిశయముతో (ఉచ్చైః ఉత్తుంగః ఉచ్చస్థానే భవః–ఎత్తైనది ఎత్తు, ఉన్నత స్థానములో ఉన్నది), తవవిలసితాని = నీ విలాసములతో కూడుకొన్న, తాని తాని= నువ్వు చేసిన లీలలు, స్మృత్వా స్మృత్వా = స్మరించి స్మరించి, రుద్ధ ఆలాపాః= మాటలేక(రుద్ధః అవరుద్ధః, ఆవృతః–ఆపబద్దది, కప్పబడ్డది.)(ఆలప్యతే కథ్యతే అనేన–సంభాషణము ఆలపించుట),సౌజన్య ఆదీన్ = ఉద్ధవుని మంచితనమువలన (సుజనస్య భావః–సౌజన్యము, సజ్జనత), నిజ పర భిదామ్ అపి= నిజ పరభేదమును(భినత్తి తస్య భావః కర్మ వా చీలిక చీరుట), అలం= సంపూర్ణముగా, విస్మరంత్యః= మరచి, కథమ్ అపి= ఎట్లో, పునః= మరలా,

గద్గదాం వాచమ్ = గద్గద స్వరముతో (గద ఇతి అవ్యక్తం గదతి తస్యాః కర్మ–అవ్యక్త శబ్దము కలది), ఊచుః = మాట్లాడిరి.

**తాత్పర్యము:** నీతో పోలికకలిగి, ప్రకాశించుచూ– నీ వలెనే వేష భూషణములు ధరించి అందంగా ఉన్న ఆ ఉద్ధవుని చూసి, అతిశయముతో నీ విలాసములతో కూడుకొన్న నువ్వు చేసిన లీలలు స్మరించి స్మరించి ,మాటలేక ,ఉద్ధవుని మంచితనమువలన నిజ పరభేదమును(ఉద్ధవుడు మధురా నగర రాజాస్థాన దూత అను విషయం) సంపూర్ణముగా మరచి ఎట్లో మరలా గద్గద స్వరముతో ఆ గోపికలు ఇట్లు మాట్లాడిరి.

**76–5 శ్లో.**

**శ్రీమన్ కిం త్వం పితృజనకృతే ప్రేషితో నిర్దయేన**
**క్వాసౌ కాంతో నగరసుదృశాం హా! హరే! నాథ! పాయాః ।**
**ఆశ్లేషాణామమృతవపుషో హంత తే చుంబనానామ్**
**ఉన్మాదానాం కుహకవచసాం విస్మరేత్ కాంత! కా వా ॥**

**ప్రతిపదార్థము:** శ్రీమన్ = మహానుభావా!, నిర్దయేన = దయలేని ఆ కృష్ణుడు, పితృజనకృతే= నంద యశోదల సంతోషము కొరకై (పాతి రక్షతి అసౌ రక్షించువాడు, కనువాడు. తండ్రి), త్వం = నిన్ను, కిం ప్రేషితః(అసి)= ఇక్కడికి పంపించాడా?, నగర సుదృశాం= మధురా నగర యువతులకు, కాంతః= ఆనందము కలిగించుచున్న, అసౌ= ఆ కృష్ణుడు, క్వ= ఇప్పుడెక్కడ ఉన్నాడు?, హా= అహా!, హరే= భక్తజన సంతాపములను హరించువాడా! (హరతి పాపాన్ పాపములను నశింపచేయువాడు. విష్ణువు), నాథ= మా ప్రాణములను రక్షించువాడా! (నాథతే ఐశ్వర్యవాన్ భవతి ఐశ్వర్యవంతుడు. రాజు శివుడు), పాయాః= నీ నిజ రూప అమృత పానము కలిగించి మమ్ము రక్షింపుము, అమృతవపుషః=అమృత సమానమైన రూపము కలిగిన(వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర–దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), ఆశ్లేషాణామ్= నీ కౌగిలింతలను (ఆ ఈషత్, ఏకదేశేనవాశ్లేషసంబంధః–కొద్దిగాసంబంధముకలిగివున్నదికౌగిలించుకొనుట),

తే చుంబనానామ్= నీ ముద్దులను(చుంబతి తస్య భావః ముద్దు), ఉన్మాదానాం = దుడుకు చేష్టలను (ఉన్మాదయతి చిత్తవిభ్రమం కరోతి అసౌ చిత్తవిభ్రమమును కల్గించునది. పిచ్చి), కుహక వచసాం = కపటపు మాటలను (కుహక= కుహయతే జనాన్ మోహయతి జనమును మోహింపచేయునది. మాయ ఇంద్రజాలము కపటి), కా కాంత = ఏ కాంత అయినా, విస్మరేత్ వా=మరచిపోగలదా?, హంత= అయ్యో! (మరొక సమన్వయము), ఓ కుహక = ఓ కపటీ!, ఉన్మాదానాం = నీ దుడుకు చేష్టలను, వచసాం = వర్ణ సంయోగము లేక పూర్వాపరములు కలిగిన నీ మాటలను, కా కాంత = ఏ కాంత అయినా, విస్మరేత్ వా=మరచిపోగలదా?

**తాత్పర్యము:** మహానుభావా! ఉద్ధవా! దయలేని ఆ కృష్ణుడు నంద యశోదల సంతోషము కొరకై నిన్ను ఇక్కడికి పంపించాడా? మధురా నగర యువతులకు ఆనందము కలిగించుచున్న ఆ కృష్ణుడు ఇప్పుడెక్కడ ఉన్నాడు? భక్తజన సంతాపములను హరించువాడా! మా ప్రాణములను రక్షించువాడా! కృష్ణా ! నీ నిజ రూప అమృత పానము కలిగించి మమ్ము రక్షింపుము. అమృత సమానమైన రూపము కలిగిన నీ కౌగిలింతలను , నీ ముద్దులను , నీ దుడుకు చేష్టలను కపటపు మాటలను ఏ కాంత అయినా మరచిపోగలదా? ( మరచిపోదని భావం) (ఓ కపటీ ! నీ దుడుకు చేష్టలను వర్ణ సంయోగము లేక పూర్వాపరములు కలిగిన నీ మాటలను ఏ కాంత అయినా మరచిపోగలదా?)

**76-6 శ్లో.**

**రాసక్రీడాలులితలలితం విశ్లథత్కేశపాశం**
**మందోద్భిన్నశ్రమజలకణం లోభనీయం త్వదంగమ్ ।**
**కారుణ్యాబ్దే! సకృదపి సమాలింగితుం దర్శయేతి**
**ప్రేమోన్మాదాద్భువనమదన! త్వత్ప్రియాస్త్వాం విలేపుః ॥**

**ప్రతిపదార్థము:** భువనమదన= త్రిభువన మన్మథుడా! (భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము ఆకాశము భూమి.)(మాద్యతి అనేన – ఇతనితో సంతోషింతురు. కాముడు), కారుణ్య అబ్దే = ఓ కారుణ్య సముద్రుడా! (కరుణస్య భావః, కరుణ ఏవ కారుణ్యమ్ కారుణ్యము, దయాభావము.)(ఆపః

ధీయంతే అస్మిన్ ఇత్యబ్ధిః జలములు దీనియందు ధరింపబడును), రాసక్రీడా= అప్పుడు రాసక్రీడలో (గోపికలును- శ్రీకృష్ణుడును మండలాకారమున చేసిన నృత్యము), లులిత =మర్దించబడి కదలిన(ఆందోలితః చలితః-కదలినది), లలితం = అందంగా, విశ్లథత్ = చెదరుచున్న (విశేషేణ శ్లథః శిథిలీకృతః-శిథిలమైనది), కేశపాశం = కేశపాశములు(కేశానాం పాశి అలంకారఃకేశములకు సౌందర్యము కల్పించునది. పాపిట), మంద = కొంచెం కొంచెంగా (మందతే మందో భవతి మెల్లగా), ఉద్భిన్న = ఏర్పడిన (పుట్టిన), శ్రమజల కణం= స్వేదబిందువులతో ఉన్న, త్వత్ అంగమ్= నీ సుందరశరీరము(అంగయతి చేషయతి దేహావయవము), లోభనీయం = లోభనీయమైనది.(లుభ్యతి తస్య భావః-లోభము, ఆశ), సకృత్ అపి= ఒక్కసారయినా (ఏకవారమ్ ఒకసారి), సమాలింగితుం = నీ సుందరశరీరమును మాకౌగిట చేర్చుటకు, దర్శయ= దర్శింపచేయుము, ఇతి= అని, ప్రేమ ఉన్మాదాత్= ప్రేమ పిచ్చితో (పరవశలై), త్వత్ ప్రియాః= నీ ప్రియురాండ్రైన గోపికలు, త్వాం = నీ కొరకు, విలేపుః=విలపించిరి.

**తాత్పర్యము:** 'త్రిభువన మన్మథుడా! ఓ కారుణ్య సముద్రుడా! అప్పుడు రాసక్రీడలో మర్దించబడి అందంగా చెదరుచున్న కేశపాశములతో కొంచెం కొంచెంగా ఏర్పడిన స్వేదబిందువులతో ఉన్న నీ సుందరశరీరము లోభనీయమైనది. ఒక్కసారయినా నీ సుందరశరీరమును మాకౌగిట చేర్చుటకు దర్శింపచేయుము' అని ప్రేమ పిచ్చితో (పరవశలై) నీ ప్రియురాండ్రైన గోపికలు నీ కొరకు విలపించిరి.

**76-7 శ్లో.**

**ఏవం ప్రాయైర్వివశవచనైరాకులా గోపికాస్తాః**
**త్వత్ సందేశైః ప్రకృతిమనయత్ సోఽథ విజ్ఞానగర్భైః ।**
**భూయస్తాభిర్ముదితమతిభిస్త్వన్మయీభిర్వధూభిః**
**తత్తద్వార్తాసరసమనయత్ కానిచిద్వాసరాణి ॥**

**ప్రతిపదార్థము:** అథ= ఆతరువాత, ఏవం= ఈ విధముగా, ప్రాయైః=బాహుళ్యము (ఆధిక్యము)కలిగిన, వివశవచనైః = తమ్ముతాము మరచిన మాటలతో, ఆకులాః= ఆరాటపడుచున్న (ఆకులం ఆసమంతాత్ పూర్ణమ్ నిండియున్నది), తాః గోపికాః=

ఆ గోపికలను, సః = ఆ ఉద్ధవుడు, త్వత్ విజ్ఞాన గర్భైః సందేశైః = విజ్ఞాన గర్భితములైన (తత్వ జ్ఞానము కలిగిన )నీ మాటలు చెప్పి (విశిష్టం జ్ఞానమ్ విశిష్ట జ్ఞానము )(సమ్యక్ దిశతి సూచయతి తస్య భావః కర్మ వా సూచించుట సమాచారము సందేశము), ప్రకృతిమ్= ప్రకృత స్థితికి(యథార్థ స్థితికి), అనయత్ = చేర్చెను.(ఓదార్చెనని భావం), భూయః= మరలా, త్వత్ మయీభిః= నిన్నే తలచుకొనుచు, ముదితమతిభిః= తన్మయులై ఉన్న (ముదా హర్షః సంజాతః అస్యాః సంతోషము కలిగినది), తాభిః వధూభిః= ఆ గోపికలతో, తత్ తత్ సరసమ్ వార్తాః = నీకు సంబంధించిన సరసమైన వృత్తాంతములు చెప్పుచూ, కానిచిత్ వాసరాణి= కొన్ని దినములు (వాసయతి ప్రాణినః–ప్రాణులను నివసింపచేయునది. రోజు), అనయత్= ఉద్ధవుడు అక్కడనే ఉండెను.

**తాత్పర్యము:** ఈ విధముగా తమ్ముతాము మరచిన మాటలతో ఆరాటపడుచున్న ఆ గోపికలను ఆ ఉద్ధవుడు విజ్ఞాన గర్భితములైన (తత్వ జ్ఞానము కలిగిన )నీ మాటలు చెప్పి యథార్థ స్థితికి చేర్చెను. మరలా నిన్నే తలచుకొనుచు తన్మయులై ఉన్న ఆ గోపికలతో నీకు సంబంధించిన సరసమైన వృత్తాంతములు చెప్పుచూ కొన్ని దినములు ఉద్ధవుడు అక్కడనే ఉండెను.

**76–8 శ్లో.**
**త్వత్ప్రోద్గానైస్సహితమనిశంసర్వతో గేహకృత్యం**
**త్వద్వార్తైవ ప్రసరతి మిథస్సైవ చోత్స్వాపలాపాః ।**
**చేష్టాః ప్రాయస్త్వదనుకృతయస్త్వన్మయం సర్వమేవం**
**దృష్ట్వా తత్ర వ్యముహదధికం విస్మయాదుద్ధవోఽయమ్ ॥**

**ప్రతిపదార్థము:** సర్వతః = గోపకులమందున్న అందరు స్త్రీలు, గేహ కృత్యం = తమ గృహ కృత్యములు చేసికొనుచూ(గో గణేశః గంధర్వః తేన ఈహః ఈప్సితః యత్ర– గణేశుడు లేదా గంధర్వుడు ఇక్కడ వుండవలెనని కోరబడునది. ఇల్లు), అనిశం = నిరంతరం (న + నిశా–అత్ర. (న.బ.వ్రీ.) చేష్టలుడుగుట లేనట్టిది), త్వత్ = నీయొక్క, ప్రోద్గానైః సహితమ్ =లీలలను గానము చేయుచున్నారు, మిథః = ఒకరికొకరు మాట్లాడుకొనునప్పుడు (మేథతి కలియుట పరస్పరము), త్వత్ వార్తా

ఏవ = నీ విషయాలను(వృత్తిః అస్తి అస్యామ్ వృత్తి కలది. సమాచారము), ప్రసరతి= ప్రస్తావించేవారు, ఉత్స్వ = స్వప్నములందు, అపలాపాః ఏవ = కలవరింతలు కూడా(అప విరుద్ధం లపనం భాషణమ్ విరుద్ధంగా మాట్లాడుట), సా చ = నీ విషయాలే, చేష్టాః= వారి చేష్టలు(చేష్టతే తస్య కర్మ కాయిక వ్యాపారః–ప్రయత్నము శరీర వ్యాపారము), ప్రాయః= తరుచుగా, త్వత్ అనుకృతయః= నీ లీలలను అనుకరించునవి, ఏవం= ఈ విధముగా, తత్ర= ఆ గోకులములో, సర్వమ్= సమస్తము, త్వత్ మయం= నీ మయమగుట(కృష్ణమయమగుట), దృష్ట్వా= చూసి, అయమ్ ఉద్ధవః =ఈ ఉద్ధవుడు, విస్మయాత్ = ఆశ్చర్యము వలన, అధికం = అధికముగా, వ్యముహత్ =తనను తాను మరచిపోయాడు (పరవశుడయ్యాడు).

**తాత్పర్యము:** గోపకులమందున్న అందరు స్త్రీలు తమ గృహ కృత్యములు చేసికొనుచూ నిరంతరం నీయొక్క లీలలను గానము చేయుచున్నారు. ఒకరికొకరు మాట్లాడుకొనునప్పుడు నీ విషయాలను ప్రస్తావించేవారు. స్వప్నములందు కలవరింతలు కూడా నీ విషయాలే. వారి చేష్టలు తరుచుగా నీ లీలలను అనుకరించునవి. ఈ విధముగా ఆ గోకులములో సమస్తము నీ మయమగుట చూసి ఈ ఉద్ధవుడు ఆశ్చర్యము వలన అధికముగా తనను తాను మరచిపోయాడు. (పరవశుడయ్యాడు)

**76–9 శ్లో.**

**రాధాయా మే ప్రియతమమిదం మత్ప్రియైవం బ్రవీతి**
**త్వం కిం మౌనం కలయసి సఖే మానినీ మత్ప్రియేవ ।**
**ఇత్యాద్యేవ ప్రవదతి సఖి! త్వత్ప్రియో నిర్జనే మాం**
**ఇత్థం వాదైరరమయదయం త్వత్ప్రియాముత్పలాక్షీమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఇదం= ఇది, మే రాధాయాః= నారాధకు (రాధ్నోతి సాధయతి కార్యాణి కార్యములను సాధించునది. రాధ), ప్రియతమమ్= ఎంతో యిష్టమైన వస్తువు (అతిశయేన ప్రియః మిక్కిలి ప్రియమైనది), మత్ ప్రియా= నా ప్రియురాలైన రాధ (ప్రీణాతి సంతోషపెట్టునది. భార్య ప్రియురాలు), ఏవం = ఇట్లు, బ్రవీతి = పలుకును, సఖే = ఓ సఖుడా! ఉద్ధవుడా!, త్వం= నువ్వు, మత్ప్రియా మానినీ ఇవ=

మానిని అగు నా ప్రియురాలు వలె, కిం = ఎందుకు, మౌనం కలయసి =మౌనముగా ఉన్నావా?, ఇతి ఆది ఏవ = ఈ విధముగా, సఖి= ఓ రాధా!, త్వత్ ప్రియః = శ్రీ కృష్ణుడు, నిర్జనే = ఏకాంతములో ఉన్నప్పుడు (నిర్గతః జనః యస్మాత్ జనుడు లేని చోటు. ఏకాంతము), మాం = నన్ను (నాతో), ప్రవదతి = పలుకుచుండును, ఇత్థం=ఈ విధముగా, వాద్యైః= మాటలాడుచూ, అయం= ఉద్ధవుడు, ఉత్పల అక్షీమ్= ఉత్పలాక్షి అయిన(కలువకంటి), త్వత్ ప్రియామ్ = నీ ప్రియురాలు రాధను, అరమయత్= సంతోషపెట్టుచుండును.

**తాత్పర్యము:** "ఇది నారాధకు ఎంతో యిష్టమైన వస్తువు . నా ప్రియురాలైన రాధ ఇట్లు పలుకును. ఓ సఖుడా! ఉద్ధవుడా! నువ్వు మానిని అగు నా ప్రియురాలు వలె ఎందుకు మౌనముగా ఉన్నావా? "ఈ విధముగా శ్రీ కృష్ణుడు ఏకాంతములో ఉన్నప్పుడు నాతో పలుకుచుండునని చెప్పుచూ –ఉద్ధవుడు నీ ప్రియురాలు రాధను సంతోషపెట్టుచుండును.

**76–10 శ్లో.**
**ఏష్యామి ద్రాగనుపగమనం కేవలం కార్యభారాత్**
**విశ్లేషేఽపి స్మరణదృఢతాసంభవాన్మాస్తు ఖేదః ।**
**బ్రహ్మానందే మిలతి న చిరాత్ సంగమో వా వియోగః**
**తుల్యో వః స్యాదితి తవగిరా సోఽకరోన్నిర్వ్యథాస్తాః ॥**

**ప్రతిపదార్థము:** ద్రాక్ =నేను వెంటనే(ద్రాతి శీఘ్రమ్ త్వరగా), ఏష్యామి= రాగలను, కేవలం కార్యభారాత్= కేవలము పనుల ఒత్తిడి వలన, అనుపగమనం= మీ సన్నిధికి రాలేక పోతున్నాను. (ప్రేమ లేక పోవుట వలన కాదు), విశ్లేషే అపి= వియోగమునందు కూడా (విగతః శ్లేషః–విశ్లేషము, వియోగము), స్మరణ = మీకు నా స్మరణము(స్మరతి తస్య భావః–స్మరణము జ్ఞప్తి), దృఢతా సంభవాత్= దృఢపడును, ఖేదః మా అస్తు =దుఃఖము వద్దు, న చిరాత్= అచిరకాలములో మీకు, బ్రహ్మానందే = బ్రహ్మానందము, మిలతి = ప్రాప్తించును, సంగమః = నాతో, సంయోగము వా = లేక, వియోగః= వియోగము, వః = మీకు, తుల్యః= సమానముగా, స్యాత్= ఉండును, ఇతి= అను, తవగిరా= నీ సందేశమును, సః = ఆ

ఉద్ధవుడు చెప్పి, తాః= ఆ గోపికలను, నిర్వ్యథాః=బాధ లేనివారిగా, అకరోత్= చేసెను(చెప్పెను).

**తాత్పర్యము:** నేను వెంటనే రాగలను కేవలము పనుల ఒత్తిడి వలన మీ సన్నిధికి రాలేక పోతున్నాను. (ప్రేమ లేక పోవుట వలన కాదు) వియోగమునందు కూడా మీకు నా స్మరణము దృఢపడును. దుఃఖము వద్దు. అచిరకాలములో మీకు బ్రహ్మానందము ప్రాప్తించును. నా తో సంయోగము లేక వియోగము మీకు సమానముగా ఉండును అను నీ సందేశమును ఆ ఉద్ధవుడు చెప్పి ఆ గోపికలను బాధ లేనివారిగా చేసెను.

**విశేషము:** కృష్ణుడు బ్రహ్మస్వరూపుడు కనుక అతనితో సంగమము వలన బ్రహ్మాత్మభావసిద్ధి అగును. వియోగదశలోకూడ గోపికలలో అంతర్యామిరూపమున కృష్ణమూర్తి ఉన్నాడు కనుక వియోగము లేదు ఇది కృష్ణ సందేశములోని విశేషముగ పెద్దలు చెప్పారు.

**బ్రహ్మానందము**

**ఆనందాలు రకరకాలు.**

**1. మనుష్యానందము :** ఉత్తమ ఆశయములు, దృఢమైన సంకల్ప శక్తి కలవాడు, బలిష్ఠుడు, వేదాధ్యయన సంపన్నుడు, సద్గుణశాలి, నడి యవ్వనములోనున్న ఏక ఛత్రాధిపతి, ఐశ్వర్యవంతుడు అయినట్టి మానవుని ఆనందము. మానవులలోకెల్లా అధికాధిక ఆనందమును అనుభవించు మానవుని ఆనందము. ఇది కారణముతో కూడిన ఆనందము. కారణము నశించిన ఉండనిది.

**2. మనుష్య గంధర్వ ఆనందము :** పై చెప్పిన మనుష్యానందమునకు నూరు రెట్లు అధికము.

**3. దేవగంధర్వానందము :** ఇది మనుష్య గంధర్వానందమునకు నూరు రెట్లు అధికము.

**4. చిరలోక వాసులగు పితరుల ఆనందము :** దేవ గంధర్వ ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

**5. అజానజుల ఆనందము :** పితరుల ఆనందము కంటే నూరు రెట్లు అధికము.

**6. వైదిక కర్మల చేత దైవత్వము పొందిన కర్మ దేవతల ఆనందము :** అజానజుల ఆనందముకంటె నూరు రెట్లు అధికము.

**7. దేవతల ఆనందము :** కర్మ దేవతల ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

**8. ఇంద్రుని ఆనందము :** దేవతల ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

**9. బృహస్పతి ఆనందము :** ఇంద్రుని ఆనందము కంటే నూరురెట్లు అధికము.

**10. ప్రజాపతి ఆనందము :** బృహస్పతి ఆనందముకంటె నూరు రెట్లు అధికము.

**11. హిరణ్యగర్భుని ఆనందము :** ప్రజాపతి ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

**12. బ్రహ్మానందము :** హిరణ్యగర్భుని ఆనందము కంటె నూరు రెట్లు అధికము. దీనికే మహానందము అని ఇంకొకపేరు.

**76-11 శ్లో.**
**ఏవం భక్తిస్సకలభువనే నేక్షితా న శ్రుతా వా**
**కిం శాస్త్రౌఘైః కిమిహ తపసా గోపికాభ్యో నమోఽస్తు ।**
**ఇత్యానందాకులముపగతం గోకులాదుద్ధవం తం**
**దృష్ట్వా హృష్టో గురుపురపతే! పాహి మామామయౌఘాత్ ॥**

**ప్రతిపదార్థము:** ఏవం =ఇటువంటి, భక్తిః = గోపికల భక్తి (భజ్యతే సేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ), సకలభువనే= ఏ లోకములోను, న ఈక్షితా= చూడనట్టిది, న శ్రుతా= వినలేదు, శాస్త్ర ఔఘైః= శాస్త్ర జ్ఞానముల సమూహము (శిష్యతే అనేన-దీనితో శాసింపబడుదురు. శాస్త్రము హితమును ఉపదేశించునది), కిమ్= ఎందుకు, వా= లేదా, ఇహ = ఇక్కడ, తపసా=తపస్సులు, కిం =ఎందుకు?

(గోపికల భక్తి వంటి భక్తి శాస్త్ర జ్ఞానముల సమూహము లేదా తపస్సుల వలన లభించదని భావం), గోపికాభ్యః = గోపికలకు, నమః అస్తు= నమస్సులు, ఇతి ఆది= ఈవిధముగా అనేక, ఆనంద= అనందములతో (ఆనందయతి నితరాం తోషయతి అసౌ ఆనందింపచేయునది. సంతోషము), ఆకులమ్= కూడుకొని, గోకులాత్= గోకులమునుండి, ఉపగతం= నీసన్నిధికి చేరుకొన్న(ఉప సమీపం గతః సమ్యక్ గతః జ్ఞాత–దగ్గరకు వెళ్ళినది), తం ఉద్ధవం= ఆ ఉద్ధవుని, దృష్ట్వా= చూసి, హృష్టః =నువ్వు కూడా ఆనందించావు. (ప్రీతః జాతహర్షః ప్రీతినొందినవాడు సంతోషించినవాడు), గురుపురపతే= ఓ గురువాయూరు కృష్ణదేవా!, ఆమయ ఔఘాత్= నా రోగ సమూహములనుండి, మామ్= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఇటువంటి గోపికల భక్తి ఏ లోకములోను చూడనట్టిది. వినలేదు. శాస్త్ర జ్ఞానముల సమూహము ఎందుకు? లేదా ఇక్కడ తపస్సులు ఎందుకు? (గోపికల భక్తి వంటి భక్తి శాస్త్ర జ్ఞానముల సమూహము లేదా తపస్సుల వలన లభించదని భావం) గోపికలకు నమస్సులు. ఈవిధముగా అనేక అనందములతో కూడుకొని గోకులమునుండి నీసన్నిధికి చేరుకొన్న ఆ ఉద్ధవుని చూసి నువ్వు కూడా ఆనందించావు. ఓ గురువాయూరు కృష్ణదేవా! నా రోగ సమూహములనుండి నన్ను రక్షించు.

***దశమ స్కంధము***

**76వ దశకము సమాప్తము**

# దశకమ్ 77 – జరాసన్ధ యుద్ధము

**77-1 శ్లో.**

**సైరంధ్ర్యాస్తదను చిరం స్మరాతురాయాః**
**యాతోఽభూస్సులలితముద్ధవేన సార్ధమ్ ।**
**ఆవాసం త్వదుపగమోత్సవం సదైవ**
**ధ్యాయంత్యాః ప్రతిదిన వాససజ్జికాయాః ॥**

**ప్రతిపదార్థము:** అను చిరం = చాలా కాలము నుండి (చిరకాలః చాలా కాలము), స్మర ఆతురాయాః= మన్మథ ఆత్రుత కలిగినదై (నీ భక్తి తత్పరయైన )(స్మారయతి ఉత్కంఠయతి ప్రియం ప్రతి ప్రియుని గురించి ఉత్కంఠను కల్గించువాడు. కామదేవుడు), సులలితమ్ = చక్కగా అలంకరించుకొని, త్వత్ ఉపగమ ఉత్సవం= నీ రాక అను ఉత్సవమును( నీ సంగమ కౌతుకమును) (ఉత్సవః ఆహ్లాదజనక వ్యాపారః (సవః) ఉత్సవము జాతర యజ్ఞము), సదా ఏవ= ఎల్లప్పుడు ఒంటరిగా, ధ్యాయంత్యాః = ధ్యానించుచున్న (నీ ఇంటికి వత్తునని నీవు మాట ఇచ్చిన రోజు నుండి నిన్నే తలంచుచు), ప్రతిదిన వాస సజ్జికాయాః = ప్రతిదినము వాసక సజ్జికలా ఉన్న(ముస్తాబు చేసికొని కాంతుని రాకకై యెదురుచూచు శృంగార నాయికవలె), తత్ సైరంధ్ర్యాః = సైరంధ్రి అయిన కుబ్జ యొక్క (సైరంధ్రః కృషకః తస్య కర్మకరత్వేన అస్తి అసౌ వ్యవసాయదారుని వద్ద పనిచేయు స్త్రీ జీతగత్తె), ఆవాసం= ఇంటికి (ఆవసంతి నివసంతి అత్ర-ఆవాసము. గృహము, ఇల్లు), ఉద్ధవేన సార్ధమ్ = ఉద్ధవునితో కలిసి(సహ అర్ధేన-వెంటనే తోడు), యాతః అభూః = నువ్వు వెళ్లావు.

**తాత్పర్యము:** చాలా కాలము నుండి మన్మథ ఆత్రుత కలిగినదై (నీ భక్తి తత్పరయై ) చక్కగా అలంకరించుకొని నీ రాక అను ఉత్సవమును ఎల్లప్పుడు కోరుచూ – నీ ఇంటికి వత్తునని నీవు మాట ఇచ్చిన రోజు నుండి నిన్నే తలంచుచు – ప్రతిదినము ముస్తాబు చేసికొని కాంతుని రాకకై యెదురుచూచు శృంగార నాయికలా– నీకోసం ముస్తాబు చేసుకొని ఎదురుచూచుచు న్న ఆ సైరంధ్రి అయిన కుబ్జ యొక్క ఇంటికి ఉద్ధవునితో కలిసి నువ్వు వెళ్లావు.

**77–2 శ్లో.**

**ఉపగతే త్వయి పూర్ణమనోరథాం**
**ప్రమదసంభ్రమకంప్రపయోధరామ్ ।**
**వివిధమాననమాదధతీం ముదా**
**రహసి తాం రమయాంచకృషే సుఖమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= నువ్వు, ఉపగతే= తన ఇంటికి వచ్చుట వలన, పూర్ణ మనోరథాం= నెరవేరిన కోరిక కలిగినదయి(పూర్ణః పూరితః సకలః–నిండుగా వున్నది. సంపూర్ణము.)(మన ఏవ రథః అత్ర, మనసః రథః ఇతి వా మనస్సే రథము. కోరిక), ప్రమద సంభ్రమ = హర్షాతిశయ సంభ్రమముచే(ప్రమద= యౌవనాది మదముగల స్త్రీ.) (సం అధికం భ్రమతి బిభేతి, చపలో భవతి తస్య భావః కర్మ వా చాపల్యము భయం తత్తరపాటు తొందర), కంప్ర= కంపన శీలము కలిగిన(కంపనం శీలం అస్య–కంపించునది), పయోధరామ్ = కుచములతో (పయం దుగ్ధం దధాతి పాలను ధరించునది. స్తనము), వివిధ మాననమ్ = నిన్ను అనేకవిధములుగా, ఆదధతీం = సేవించిన, తాం= ఆమెను, రహసి= ఏకాంతములో, సుఖమ్ రమయాన్ చకృషే = అనేక కేళీవిలాసములచే నువ్వు కరగించావు.

**తాత్పర్యము:** నువ్వు తన ఇంటికి వచ్చుట వలన నెరవేరిన కోరిక కలిగినదయి ఆ కుబ్జ హర్షాతిశయ సంభ్రమముచే కంపన శీలము కలిగిన కుచములతో నిన్ను అనేకవిధములుగా సేవించిన ఆమెను ఏకాంతములో అనేక కేళీవిలాసములచే నువ్వు కరగించావు.

**77–3 శ్లో.**

**పృష్టా వరం పునరసావవృణోద్వరాకీ**
**భూయస్త్వయా సురతమేవ నిశాంతరేషు ।**
**సాయుజ్యమస్త్వితి వదేద్బుధ ఏవ కామం**
**సామీప్యమస్త్వనిశమిత్యపి నాబ్రవీత్ కిమ్ ॥**

**ప్రతిపదార్థము:** పునః = మరలా(తిరుగు ప్రయాణములో), వరం= ఏదయినా వరమును కోరుకొమ్మని (వరయతి తస్య భావః యాచించుట), పృష్టా= నువ్వు అడుగగా (కృత ప్రశ్నః-అడుగబడినది), అసౌ= ఆ కుబ్జ, భూయః= మరలా, త్వయా= నీతో, నిశ అంతరేషు= రాత్రులందు(నితరాం శ్యతి తనూకరోతి జీవానాం వ్యాపారాన్ జీవుల పనులను తగ్గింప చేయునది. రాత్రి)(అంతం రాతి దదాతి అవకాశము అవధి సీమ వస్త్రము దాచుకొనుట ఛిద్రము ఆత్మీయుడు సమానుడు), సురతమ్ = శారీరక సుఖమును (సుష్ఠు రతం రమణం యత్ర దీనియందు ఆనందింతురు. సురతము, రతి), అవృణోత్ = కొరుకొనెను, బుధః = పండితుడయినవాడు, సాయుజ్యమ్ అస్తు ఏవ= నీ సాయుజ్యముక్తిని (సయుజః సహయోగస్య భావః సహ యునక్తి కలిసి యుండుట, (వైష్ణవ మతంలో విష్ణువులో ఏకమగుట), ఇతి వదేత్= అని ప్రార్థింతురు, వరాకీ ఏవ= ఈమె వరాకి కనుక (నిర్విషయమైన ఆనందము యొక్క రుచి ఎఱుగని అమాయకురాలు) (వృణీతుం శీలం యస్యాః యాచించు స్వభావం కలది), కామం= అల్పమైన కామసుఖము కోరినది. (కామ్యతే అసౌ కామము, కోరిక), అనిశమ్= ఎల్లప్పుడు, సామీప్యమ్ అస్తు= నీ సామీప్యముండుగాక!, ఇతి అపి = అనికూడా, కిమ్ న అబ్రవీత్ = ఎందుకు చెప్పలేదు?

**తాత్పర్యము:** ఏదయినా వరమును కోరుకొమ్మని నువ్వు అడుగగా ఆ కుబ్జ నీతో రాత్రులందు శారీరక సుఖమును కోరుకొనెను. పండితుడయినవాడు నీ సాయుజ్యముక్తినే కొరుకొంటారు. ఈమె నిర్విషయమైన ఆనందము యొక్క రుచి ఎఱుగని అమాయకురాలు కనుక అల్పమైన కామసుఖము కోరినది. ఆమె కనీసము ఎప్పుడూ నీ సామీప్యముండుగాక! అనికూడా ఎందుకు చెప్పలేదు? (కృష్ణ లీలలు ఎవరికి బోధపడవని భావం).

**విశేషము:** మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ । ( భగవద్గీత15-15 )నా నుండే జ్ఞాపకశక్తి, జ్ఞానము, మరియు విస్మృతి (మర్చిపోవుట) కలుగుతాయని కృష్ణ వాక్యము. అందువలన కుబ్జకు సాయుజ్య ముక్తి గుర్తుకు రాలేదని పెద్దల వ్యాఖ్యానం.

**77-4 శ్లో.**

**తతో భవాన్ దేవ నిశాసు కాసుచి-**

**న్మృగీదృశం తాం నిభృతం వినోదయన్।**

**అదాదుపశ్లోక ఇతి శ్రుతం సుతం**

**స నారదాత్ సాత్వతతంత్రవిద్బభౌ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు దేవా! (ద్యోతతే, ద్యోతయతే ప్రేరేపించు వాడు ప్రకాశించువాడు), తతః = అటుపిమ్మట, భవాన్ = నువ్వు, కాసుచిత్ నిశాసు = కొన్ని రాత్రులు, తాం మృగీదృశం=ఆ లేడికండ్లవంటి కండ్లుగల కుబ్జ, నిభృతం =రహస్యముగా, వినోదయన్= వినోదముగా సుఖ పెట్టితివి, ఉపశ్లోక = ఉపశ్లోకుడు(పొగడతగినవాడు), ఇతి =అని, శ్రుతం= ప్రసిద్ధికి ఎక్కిన (శ్రూయతే వినబడునది. శాస్త్రము వేదము ప్రసిద్ధము), సుతం= కుమారుని (సుతః ఉత్పన్నః పుట్టినవాడు సంతానము), అదాత్= ప్రసాదించెను, సః= ఆ ఉపశ్లోకుడు, నారదాత్ = నారద మహర్షి వలన (నారం అజ్ఞానం ద్యతి నాశయతి అజ్ఞానమును నాశనము చేయువాడు. నారదుడు, ముని), సాత్వత తంత్రవిత్= సాత్వత తంత్రమును, బభౌ= అభ్యసించెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! అటుపిమ్మట నువ్వు కొన్ని రాత్రులు ఆ మృగాక్షి కుబ్జ రహస్యముగా వినోదముగా సుఖ పెట్టితివి. ఉపశ్లోకుడు అని ప్రసిద్ధికి ఎక్కిన కుమారుని ప్రసాదించితివి. ఆ ఉపశ్లోకుడు నారద మహర్షి వలన సాత్వత తంత్రమును అభ్యసించెను.

**విశేషాలు:** సాత్వతమతం నిర్మించినవాడు కుబ్జ కొడుకు. కుబ్జ ఎవరంటే కంసవధ సమయంలో భగవంతుడైన కృష్ణునిచేత మేనివంకరలు తీయించుకొన్న దాసి. ఆమె కొడుకు సాత్వత సూత్రాలు వ్రాశాడు. ఈ మతాలు ఒకదాని నుండి మరొకటి భిన్నంగా ఉంటుంది. అట్లా భాగవత మతం వేరే ఉన్నది"అని కవిసమ్రాట్ విశ్వనాథ చెప్పారు.(సాహిత్య సురభి)కాలక్రమంలో సాత్వత మతం, భాగవత మతం, వైష్ణవ మతంలో కలిసిపోయాయి. ఇవన్నీ కలిసిపాంచరాత్రము ఒక కొత్త మతానికి దారితీసాయి.

**77-5 శ్లో.**

**అక్రూరమందిరమితోఽథ బలోద్ధవాభ్యాం**
**అభ్యర్చితో బహునుతో ముదితేన తేన ।**
**ఏనం విసృజ్య విపినాగతపాండవేయ-**
**వృత్తం వివేదిథ తథా ధృతరాష్ట్రచేష్టామ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, బల ఉద్ధవాభ్యాం = నీవు బలరామునితోను, ఉద్ధవునితోను కలిసి, అక్రూర మందిరమ్ = అక్రూరుని ఇంటికి వెళ్లి, అభి- అర్చితః = అతనినుండి పూజలు గైకొని, ముదితేన తేన బహునుతః = ఆనందముతో అతడు చేసిన స్తుతులను గ్రహించావు, ఇతః = తరువాత, ఏనం = అతనికి, విసృజ్య= వీడ్కోలు పలికి, విపిన ఆగత =అరణ్యమునుండి హస్తినకు తిరిగివచ్చిన(వేపనే బిభ్యతి జనాః అత్ర-జనులు ఇచట భయపడుదురు. అడవి), పాండవేయ వృత్తం = పాండవుల వృత్తాంతమును(పాండో రపత్యమ్), తథా= అట్లే, ధృతరాష్ట్ర చేష్టామ్= ధృతరాష్ట్రుని కుటిల చేష్టలను(ధృతం రాష్ట్రం యేన-రాష్ట్రమును ధరించినవాడు. ధృతరాష్ట్రుడు), వివేదిథ= తెలుసుకొంటివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీవు బలరామునితోను, ఉద్ధవునితోను కలిసి అక్రూరుని ఇంటికి వెళ్లి అతనినుండి పూజలు గైకొని ఆనందముతో అతడు చేసిన స్తుతులనుగ్రహించావు. తరువాత అతనికి వీడ్కోలు పలికి అరణ్యమునుండి హస్తినకు తిరిగివచ్చిన పాండవుల వృత్తాంతమును అట్లే ధృతరాష్ట్రుని కుటిల చేష్టలను తెలుసుకొంటివి.

**77-6 శ్లో.**

**విఘాతాజ్జామాతుః పరమసుహృదో భోజనృపతేః**
**జరాసంధే రుంధత్యనవధిరుషాంధేఽథ మథురామ్ ।**
**రథాద్యైర్ద్యోర్లబ్ధైః కతిపయబలస్త్వం బలయుతః**
**త్రయోవింశత్యక్షౌహిణి తదుపనీతం సమహృథాః ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, జామాతుః = అల్లుడునూ (జాయాం మాతి

మినోతి మిమీతే వాభార్యను పరీక్షించువాడు భార్యను కోపగించువాడు. అల్లుడు), పరమసుహృదః= తన ప్రియమిత్రుడునూ అయిన (సుష్ఠ హృదయం యస్యః – మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), భోజనృపతేః = భోజరాజగు కంసుని, విఘాతాత్ =నువ్వు చంపితివని(విశేషేణ హననమ్ ఆఘాతము, ప్రహారము, కొట్టుట), జరాసంధే=జరాసంధునకు(జరయా రాక్షస్యా కృతా సంధా దేహసంధిః–జర అను రాక్షసి ద్వారా కలుపబడిన అంగములు కలవాడు. జరాసంధుడు), అనవధి = మిక్కిలి(మేరలేనిది. నిరవధికము. న + అవధిః – అస్య. (న.బ.వ్రీ.), రుషా అంధే= కోపమనెడి అంధకారములో( బాగా కోపము కలిగి) (రుష్యతి తస్య భావః కర్మ వా కోపము), మథురామ్= మథురను, రుంధతి= ముట్టడించెను, ద్యోః= స్వర్గమునుండి (ద్యోతతే అసౌ ప్రకాశించునది. స్వర్గము ఆకాశము), లబ్ధైః = పొందిన (మాతలి తీసుకొని వచ్చిన), రథ ఆద్యః= రథములు మొదలయిన (రమ్యతే అనేన అత్ర వా దీనితో ఆనందింతురు. రథము), కతిపయ బలః= అత్యల్ప బలము(సేన) చేత(కతి ఏవ కతిపయ–కొందరు కొన్ని ఎన్ని? ఎందరు?), త్వం = నువ్వు, బలయుతః = బలరామునితో కలిసి, తత్ ఉపనీతం= జరాసంధుడు తెచ్చుకొన్న(జరాసంధునితో ఉన్న) (ఉపనీతః సమీపం నీతః సమీపమునకు తేబడినవాడు), త్రయః వింశతి అక్షౌహిణి= ఇరువదిమూడు అక్షౌహిణుల సైన్యమును(అక్షములనగా రథములు – యుద్ధసాధనములైన యట్టివాని సమూహము కలది), సమహృథాః= సంహరించితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట అల్లుడునూ, తన ప్రియమిత్రుడునూ అయిన భోజరాజగు కంసుని నువ్వు చంపితివని జరాసంధునకు బాగా కోపము కలిగి మథురను ముట్టడించెను. స్వర్గమునుండి మాతలి తీసుకొని వచ్చిన రథములు మొదలయిన అత్యల్ప సేన చేత నువ్వు బలరామునితో కలిసి జరాసంధునితో ఉన్న ఇరువదిమూడు అక్షౌహిణుల సైన్యమును సంహరించితివి.

**విశేషాలు**

**అక్షౌహిణి:** ఈ సేనలో – 21870 రథములు, అన్నియే ఏనుగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాలిబంట్లును ఉందురు

**77-7 శ్లో.**

**బద్ధం బలాదథ బలేన బలోత్తరం త్వం**
**భూయో బలోద్యమరసేన ముమోచిథైనమ్ ।**
**నిశ్శేషదిగ్జయసమాహృత విశ్వసైన్యాత్**
**కోఽన్యస్తతో హి బలపౌరుషవాంస్తదానీమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, బల ఉత్తరం= పెక్కుమంది బలాఢ్యుల కంటె బాగా బలశాలియైన వాడయిన జరాసంధుని, బలేన= బలరాముడు, బలాత్ = బలవంతముగా(బలతి బలయుక్తో భవతి అనేన-దీనితో యుక్తుడగును. బలము సామర్థ్యము సేన), బద్ధం= బంధించెను, భూయః =(కాని) మరలా, బల ఉద్యమ రసేన= అతనికిగల సకల సైన్యముతో తిరిగి వచ్చిన ఎడల వారితో యుద్ధము చేసి వారిని సంహరించాలనుకొని, త్వం = నువ్వు, ఏనమ్ = జరాసంధుని, ముమోచిథ= విడిచిపెట్టితివి, తదానీమ్ = ఆ కాలములో, నిశ్శేష దిక్ జయ = అన్ని దిక్కులలోని రాజులను - యుద్ధమున జయించి (నిర్గతః శేషాత్ శేషము లేనిది. సంపూర్ణము), సమాహృత= వారి నుంచి సాధించి తెచ్చిన (సమ్యక్ ఆహృతః సంగృహీతః- సంగ్రహించబడినది), విశ్వసైన్యాత్= అన్ని రాజుల సైన్యములు కలిగిన, తతః = ఆ జరాసంధునికంటె, బల పౌరుషవాన్ = బల పరాక్రమశాలి - పౌరుషవంతుడు, కః అన్యః హి = ఇంకొకరెవరు లేరు కదా!

**తాత్పర్యము:** పెక్కుమంది బలాఢ్యుల కంటె బాగా బలశాలియైన వాడయిన జరాసంధుని బలరాముడు బలవంతముగా బంధించెను . కాని అతనికిగల సకల సైన్యముతో తిరిగి వచ్చిన ఎడల వారితో యుద్ధము చేసి వారినందరిని సంహరించాలనుకొని నువ్వు జరాసంధుని విడిచిపెట్టితివి. ఆ కాలములో అన్ని దిక్కులలోని రాజులను - యుద్ధమున జయించి వారి నుంచి సాధించి తెచ్చిన అన్ని రాజుల సైన్యములు కలిగిన ఆ జరాసంధునికంటె బల పరాక్రమశాలి - పౌరుషవంతుడు ఇంకొకరెవరు లేరు కదా !

**77-8 శ్లో.**

**భగ్నస్స లగ్నహృదయోఽపి నృపైః ప్రణున్నో**
**యుద్ధం త్వయా వ్యధిత షోడశకృత్వ ఏవమ్ ।**
**అక్షౌహిణీశ్శివ శివాస్య జఘంథ విష్ణో!**
**సంభూయ సైకనవతిత్రిశతం తదానీమ్ ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో= ఓ విష్ణు మూర్తీ! (వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), సః= ఆ జరాసంధుడు, భగ్నః అపి = నీచేత ఓడిపోయి అవమానము పొంది కూడ (భగ్నః ఖండితః పరాజితః–ఖండించబడినది ఓడించబడినది), నృపైః = తోటి రాజుల, ప్రణున్నః = ప్రేరణతో, లగ్నహృదయః = మనస్సు నీమీద లగ్నముచేసి, షోడశకృత్వః = పదహారు సార్లు(షోడశానాం పూరణః–పదహారవది. చంద్రకళ), త్వయా=నీతో, యుద్ధం = యుద్ధము చేసెను, శివ శివ= శివ శివా!(ఆశ్చర్యార్థకము), తదానీమ్ = అప్పుడు, ఏవమ్ =ఇట్లు, వ్యధిత= బాధించబడి, అస్య = జరాసంధుని యొక్క, సంభూయ =అంతాకలిసి, స ఏక నవతి త్రిశతం = 391, అక్షౌహిణీః= అక్షౌహిణుల లెక్కకువచ్చిన సైన్యమును, జఘంథ=నువ్వు నాశనము చేసావు.

**తాత్పర్యము:** ఓ విష్ణుమూర్తీ! ఆ జరాసంధుడు నీచేత ఓడిపోయి అవమానము పొంది కూడ తోటి రాజుల ప్రేరణతో మనస్సు నీమీద లగ్నముచేసి పదహారు సార్లు నీతో యుద్ధం యుద్ధము చేసెను. అప్పుడు ఇట్లు నీ చేత బాధించబడి జరాసంధుని యొక్క 391 అక్షౌహిణుల లెక్కకువచ్చిన సైన్యమును నువ్వు నాశనము చేసావు.

**77-9 శ్లో.**

**అష్టాదశేఽస్య సమరే సముపేయుషి త్వం**
**దృష్ట్వా పురోఽథ యవనం యవనత్రికోట్యా ।**
**త్వష్ట్రా విధాప్య పురమాశు పయోధిమధ్యే**
**తత్రాఽథ యోగబలతః స్వజనాననైషీః ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, అస్య = వాడు (జరాసంధుడు), అష్టాదశే =

పదునెనిమిదవ పర్యాయము, సమరే = నీతో యుద్ధము చేయుటకు, సముపేయుషి = సిద్ధమగుచుండెను, త్రికోట్యా = మూడుకోట్ల, యవన = యవన సైన్యముతో ఉన్న (యౌతి అసౌ వేగంగా పరుగెత్తువాడు. యవన దేశము యవన దేశస్థుడు), యవనం =యవన రాజును, త్వం= నువ్వు, పురః = ఎదుట, దృష్ట్వా= చూసి, అథ= తరువాత, త్వష్ట్రా= విశ్వ కర్మ చేత ( త్వేషతి దీప్యతి అసౌ ప్రకాశించువాడు), ఆశు= వెంటనే, తత్ర పయోధి మధ్యే= ఆ సముద్రమధ్యమున, పురమ్= ఒక పట్టణమును (ద్వారక), విధాప్య= నిర్మింపచేసి, యోగబలతః = నీయోగశక్తిచే, స్వజనాన్ = మధురలోఉన్న నీ జనులందరిని, అనైషీః= అక్కడికి పంపితివి (చేర్చితివి).

**తాత్పర్యము:** అటుపిమ్మట జరాసంధుడు పదునెనిమిదవ పర్యాయము నీతో యుద్ధము చేయుటకు సిద్ధమగుచుండెను. మూడుకోట్ల యవన సైన్యముతో ఉన్న యవన రాజును నువ్వు ఎదుట చూసి ,విశ్వ కర్మ చేత ఆ సముద్రమధ్యమున ఒక పట్టణమును (ద్వారక) నిర్మింపచేసి నీయోగశక్తి చే మధురలోఉన్న నీ జనులందరిని అక్కడికి పంపితివి.

**77-10 శ్లో.**

**పద్భ్యాం త్వం పద్మమాలీ చకిత ఇవ పురాన్నిర్గతో ధావమానో**
**మ్లేచ్ఛేశేనానుయాతో వధసుకృతవిహీనేన శైలే న్యలైషీః ।**
**సుప్తేనాంఘ్ర్యాహతేన ద్రుతమథ ముచుకుందేన భస్మీకృతేఽస్మిన్**
**భూపాయాస్మై గుహాంతే సులలితవపుషా తస్థిషే భక్తిభాజే ॥**

**ప్రతిపదార్థము:** పద్మమాలీ= పద్మ మాలను ధరించి(పద్యతే అత్ర లక్ష్మీః-ఇక్కడ లక్ష్మి వుండును. పద్మము, కమలము), త్వం= నువ్వు ఒక్కడివే, పద్భ్యాం= కాలినడకన, చకిత ఇవ=భయపడుచున్నట్లు నటించి(చకితః భ్రాంతః భీతః-భ్రాంతి నొందినవాడు భయపడినవాడు), ధావమానః = పరుగెత్తి, పురాత్=పట్టణము, నిర్గతః =దాటి, వధ సుకృత విహీనేన= నీచేత చనిపోవు పుణ్యమునకు నోచుకొనని, మ్లేచ్ఛ ఈశేన= మ్లేచ్ఛ రాజు (యవనుడు) (మ్లేచ్ఛతి అవ్యక్తం వదతి అపశబ్దం వదతి అర్థం కాకుండా మాట్లాడువాడు అపశబ్దములు మాట్లాడువాడు),

అనుయాతః = వెంబడించగా, శైలే= ఒక కొండలో(శిలాః సంతి శిలలు కలది. పర్వతము), న్యలైషీః = లీనమైతివి, అథ=అటుపిమ్మట ఆ గుహలోనికి ప్రవేశించిన కాల యవనుడు, సుప్తేన = నిద్రపోతున్న ముచికుందుని చూసి నువ్వని భ్రమపడి, అంఘ్ర్యా = కాలితో (అంఘతే గచ్ఛతి అనేన–చరణము), హతేన= అతనిని తన్నగా, ద్రుతమ్= వెంటనే, ముచుకుందేన= ఆ ముచికుందుని కోపపు దృష్టి పడగా, భస్మీకృతే = ఆ కాల యవనుడు భస్మము కాగా, అస్మిన్ భక్తిభాజే = నీ భక్తుడైన, భూపాయ = ఆ ముచికుంద మహారాజుకు, అస్మై గుహాంతే = ఆ గుహలో, సులలిత వపుషా= నీ చక్కనిరూపముతో, తస్థిషే =దర్శనము ఇచ్చి ఆ గుహలో ఉన్నావు.

**తాత్పర్యము:** పద్మ మాలను ధరించి నువ్వు ఒక్కడివే కాలినడకన భయపడుచున్నట్లు నటించి పరుగెత్తి పట్టణము దాటి నీచేత చనిపోవు పుణ్యమునకు నోచుకొనని యవనుడు నిన్ను వెంబడించగా ఒక కొండలో లీనమైతివి. ఆ గుహలోనికి ప్రవేశించిన కాల యవనుడు నిద్రపోతున్న ముచికుందుని చూసి నువ్వని భ్రమపడి కాలితో అతనిని తన్నగా వెంటనే ఆ ముచికుందుని కోపపు దృష్టి పడగా ఆ కాల యవనుడు భస్మము కాగా నీ భక్తుడైన ఆ ముచికుంద మహారాజుకు ఆ గుహలో నీ చక్కనిరూపముతో దర్శనము ఇచ్చి ఆ గుహలో ప్రకాశిస్తూ ఉన్నావు.

**విశేషాలు**

**ముచికుందుడు:** మాంధాత కడపటి కొడుకు. ఇతఁడు దేవహితార్థము బహుకాలము మేలుకొని ఉండి అలసి ఒక కొండ గుహలో పండుకొని ఇంద్రియ సంచారము లేక నిద్రించుచు ఉండెను. అదితెలిసి కృష్ణుఁడు తన్ను కాలయవనుడు తఱుముకొని వచ్చినప్పుడు ఆ పర్వతగుహలో దూఱెను. అది చూచి వాఁడును అతనితో కూడ ఆగుహలో దూఱి పండుకొని నిద్రించుచు ఉన్న ఇతనిని కృష్ణుడు అని తలఁచి కాలితో తన్ని లేపి ఇతని క్రూరదృష్టిచే బూడిద అయ్యెను. అనంతరము కృష్ణుఁడు ఇతనికి కనబడెను. అపుడు ఇతడు నమస్కరించి వినుతింపగా గంధమాదన పర్వతమునందలి బదరికాశ్రమమునందు తపము ఆచరింప పొమ్ము అని ఇతనికి ఉపదేశము చేసెను. ఇతడును అట్లే చేసెను.

**77-11 శ్లో.**

**ఐక్ష్వాకోఽహం విరక్తోఽస్మ్యఖిల నృపసుఖే త్వత్ప్రసాదైకకాంక్షీ**
**హా దేవేతి స్తువంతం వరవితతిషు తం నిస్పృహం వీక్ష్య హృష్యన్ ।**
**ముక్తేస్తుల్యాం చ భక్తిం ధుతసకలమలాం మోక్షమప్యాశు దత్వా**
**కార్యం హింసావిశుద్ధ్యై తప ఇతి చ తదా ప్రాత్థ లోక ప్రతీత్యై ॥**

**ప్రతిపదార్థము:** హా దేవ = ఓ దేవా!, అహం = నేను, ఐక్ష్వాకః = ఇక్ష్వాకువంశీయుడను(ఇక్ష్వాకోః గోత్రాపత్యమ్ ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాడు), అఖిల నృపసుఖే= అఖిల రాజ్య భోగములందు(నౄన్ నరాన్ పాతి రక్షతి నరులను రక్షించువాడు. రాజు), విరక్తః = విరక్తుడను అయి, అస్మి= ఉన్నాను, త్వత్ ప్రసాద= నీ అనుగ్రహము మాత్రమే (ప్రసీదతి ప్రసన్నో భవతి తస్య భావః కర్మ వా ప్రసన్నత నిర్మలత్వము), ఏకకాంక్షీ = కోరుకొనుచున్నాను, ఇతి స్తువంతం= అని స్తుతించుచున్న, వర వితతిషు=ఇతర విధములైన వరములందు(వితతిః విస్తారః-విస్తారము), నిస్పృహం= ఆసక్తిలేని, తం= అతనిని(ముచికుందుని), వీక్ష్య= చూసి, హృష్యన్=సంతోషించి, ముక్తేః తుల్యాం చ = ముక్తితో సమానమైన, భక్తిం = భక్తిని అనుగ్రహించి, ఆశు = త్వరలో అతనికి, సకల మలాం = సర్వపాపములను, ధుత= దులిపివేయు, మోక్షమ్ అపి= అజ్ఞాన కల్పిత సంసార నివృత్తి రూపమైన మోక్షము కలుగునట్లుగా (మోక్ష్యతే దుఃఖం అనేన దీనితో దుఃఖము వదిలి పెట్టబడును. ముక్తి, మోక్షము), దత్వా= అనుగ్రహించి, కార్యం హింసావిశుద్ధ్యై= క్షత్రియ ధర్మముతో చేసిన హింస వలన కలిగిన పాపముపోయి శుద్ధి కలుగుటకు, తప ఇతి చ = తపస్సు చేయుమని (తాపయతి అసౌ తపింప చేయునది), లోక ప్రతీత్యై = లోక శిక్షణ కొరకు, తదా= అప్పుడు, ప్రాత్థ = అతనికి చెప్పితివి.

**తాత్పర్యము:** "ఓ దేవా! నేను ఇక్ష్వాకువంశీయుడను. అఖిల రాజ్య భోగములందు విరక్తుడను అయి ఉన్నాను. నీ అనుగ్రహము మాత్రమే కోరుకొనుచున్నాను" అని స్తుతించుచు ఇతర విధములైన వరములందు ఆసక్తిలేని ఆ ముచికుందుని చూసి సంతోషించి ముక్తితో సమానమైన భక్తిని అనుగ్రహించి త్వరలో అతనికి

సర్వపాపములను దులిపివేయు అజ్ఞాన కల్పిత సంసార నివృత్తి రూపమైన మోక్షము కలుగునట్లుగా అనుగ్రహించి క్షత్రియ ధర్మముతో చేసిన హింస వలన కలిగిన పాపముపోయి శుద్ధి కలుగుటకు తపస్సు చేయుమని లోక ప్రతీత్యై లోక శిక్షణ కొరకు అప్పుడు అతనికి చెప్పితివి.

**77-12 శ్లో.**

**తదను మథురాం గత్వా హత్వా చమూం యవనాహృతాం**
**మగధపతినా మార్గే సైన్యైః పురేవ నివారితః ।**
**చరమవిజయం దర్పాయాస్మై ప్రదాయ పలాయితో**
**జలధినగరీం యాతో వాతాలయేశ్వర! పాహిమామ్ ॥**

**ప్రతిపదార్థము:** తదను= అనంతరము, త్వం= నీవు, మథురాం= మథురకు, గత్వా = వెళ్ళి, యవన చమూం= ఆ యవనుని సైన్యమును(చమతి భక్షయతి హినస్తి అరీన్) శత్రువులను చంపునది. సేన(729 రథములు, అన్నియేనుఁగులు, 2187 గుఱ్ఱములు, 3645 కాల్బురును గల సేన), హత్వా= చంపి, ఆహృతాం మార్గే = ద్వారకకేగు దారిలో, మగధపతినా= జరాసంధుని, సైన్యైః = సైన్యముల చేత, పురా ఇవ= పూర్వము వలె (మరల మునుపటివలె), నివారితః =అడ్డగింపబడగా, చరమవిజయం= ఆయుద్ధములో తుదివిజయము వానికి ఇచ్చి, అస్మై దర్పాయ ప్రదాయ = అతని అహంకారమును పెంచుటకు, పలాయితః= పారిపోయి, జలధినగరీం= ద్వారకా నగరమునకు, యాతః = వెడలిపోయితివి, వాతాలయేశ్వర = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మామ్= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** అనంతరము నీవు మథురకు వెళ్ళి ఆ యవనుని సైన్యమును చంపి ద్వారకకేగు దారిలో జరాసంధుని సైన్యముల చేత పూర్వము వలె అడ్డగింపబడగా ఆయుద్ధములో తుదివిజయము వానికి ఇచ్చి అతని అహంకారమును పెంచుటకు పారిపోయి ద్వారకా నగరమునకు వెడలిపోయితివి. ఓ గురువాయూరు కృష్ణ దేవా! నన్ను రక్షించు.

***దశమ స్కంధము***

**77వ దశకము సమాప్తము**

# దశకమ్ 78 –రుక్మిణీసన్దేశప్రాప్తి

**78–1 శ్లో.**

**త్రిదశవర్ధకి వర్ధిత కౌశలం త్రిదశదత్తసమస్తవిభూతిమత్ ।**
**జలధిమధ్యగతం త్వమభూషయో నవపురం వపురంచితరోచిషా ॥**

**ప్రతిపదార్ధము:** త్రిదశ వర్ధకి =దేవతల శిల్పి యైన విశ్వ కర్మ(తృతీయా యౌవనాఖ్యా దశా యస్య–మూడవ దశలో, యౌవనావస్థలో ఉన్నవాడు.) (వర్ధయతి ఛినత్తి దార్వాదికమ్ కట్టెలు మొదలగు వాటిని చీల్చువాడు. వడ్లవాడు), వర్ధిత కౌశలం= తన కౌశలముతో నిర్మించిన (వర్ధితః వృద్ధిం గతః–వృద్ధి పొందినది.)(కుశలస్య భావః కర్మ వా కార్యకుశలత దక్షత నైపుణ్యత), త్రిదశ= దేవతలు,దత్త=ప్రత్యర్పితమైన(సమకూర్చిన)(దత్తః ప్రదత్తః విసృష్టః–ఇవ్వబడినది వదలబడినది దానము చేయబడినది దత్తపుత్రుడు దానము), సమస్త విభూతిమత్=సకల సంపదలతో శోభిల్లుచున్న (విశిష్టా భూతిః ఐశ్వర్యమ్ ఐశ్వర్యము, భస్మము, అణిమాద్యష్ట ఐశ్వర్యములు), జలధి మధ్యగతం= సముద్రమందున్నది అగు(జలాని ధీయంతే అస్మిన్ నీటిని ధరించునది. సముద్రము), నవ పురం= ఆ నవ నగరమును(ద్వారకా నగరము)(నూయతే ప్రశస్యతే అచిరకృతత్వాత్ అప్పుడే చేయబడ్డది ప్రశంసింపబడ్డది. ప్రశంస), వపుః = నీ శరీరపు (వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర– దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), అంచిత రోచిషా= కాంతితో కూడి, త్వమ్= నువ్వు, అభూషయః= అలంకరించితివి.

**తాత్పర్యము:** దేవతల శిల్పి యైన విశ్వ కర్మ తన కౌశలముతో నిర్మించిన, దేవతలు సమకూర్చిన, సకల సంపదలతో శోభిల్లుచున్న ,సముద్రమందున్నది అగు ఆ ద్వారకా నగరమును నీ శరీరపు కాంతితో నువ్వు అలంకరించితివి.

**పాఠాంతరము:** త్రిదివ దశకి అని ఇంకొక పాఠాంతరము.(త్రిదివ=త్రయః

బ్రహ్మాదయః దీవ్యంతి ప్రకాశంతే అత్ర –బ్రహ్మాదులు ముగ్గురు ఇక్కడ ప్రకాశింతురు. స్వర్గము ఆకాశము)

**78–2 శ్లో.**

**దదుషి రేవతభూభృతి రేవతీం హలభృతే తనయాం విధిశాసనాత్ ।**
**మహితముత్సవఘోషమపూపుషః సముదితైర్ముదితై స్సహ యాదవైః ॥**

**ప్రతిపదార్థము:** రేవతః=రేవతుడు (రేవయతి గమయతి రోగాన్ రోగములను పోగొట్టునది. జంబీర ఫలము రేవత రాజు), భూభృతి= అను రాజు (భువం బిభర్తి పాలయతి భూమిని పాలించువాడు. రాజు భూమిని ధరించునది. పర్వతము), రేవతీం= రేవతి అను పేరుగల (రేవతస్య అపత్యం స్త్రీ రేవతుని కుమార్తె. రేవతీ),తనయాం =కుమార్తెను(తనోతి భర్తృకులమ్ భర్తృకులమును విస్తరించునది లత కందగడ్డ కుమార్తె), విధిశాసనాత్= బ్రహ్మదేవుని ఆదేశముతో(విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ), హలభృతే = బలరామునికి(హలం బిభర్తి హలమును ధరించువాడు. బలరాముడు), దదుషి = ఇచ్చి, మహితమ్ ఉత్సవః= గొప్ప వివాహ మహోత్సవమును, సముదితైః ముదితై సహ= సంతోషముతో కూడిన గుంపులు కలిగిన, యాదవైః= యాదవులతో (యదోః గోత్రాపత్యం పుమాన్ యదువంశంలో పుట్టినవాడు. శ్రీకృష్ణుడు యాదవుడు), ఘోషమ్ అపూపుషః = వేడుకగా జరిపించితివి.

**తాత్పర్యము:** రేవతుడు అను రాజు రేవతి అను పేరుగల కుమార్తెను బ్రహ్మదేవుని ఆదేశముతో బలరామునికి ఇచ్చి వివాహము చేసితివి. ఆ వివాహ మహోత్సవమును సంతోషముతో కూడిన గుంపులు కలిగిన యాదవులతో వేడుకగా జరిపించితివి.

**విశేషాలు:** రేవతుడు తన కుమార్తెను తీసుకొని సత్యలోకములో ఈమెను ఎవ్వరికిచ్చి పెండ్లి చేయవలెనని బ్రహ్మను అడిగెను. "నీ సమకాలికులైన రాజులెవరు ఎప్పుడు లేరు. నీవు మరలా భూలోకమునకు వెళ్లునప్పటికి రామకృష్ణులు జన్మిస్తారు. . అందులో బలరామునకు కన్యను ఇచ్చి వివాహం చేయ వలసినది" అని బ్రహ్మ చెప్పెను.

**78–3 శ్లో.**

**అథ విదర్భసుతాం ఖలు రుక్మిణీం ప్రణయినీం త్వయి దేవ సహోదరః ।**
**స్వయమదిత్సత చేదిమహీభుజే స్వతమసా తమసాధుముపాశ్రయన్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అథ=అటుపిమ్మట, విదర్భసుతాం = విదర్భరాజ పుత్రికయగు (విశిష్టాః దర్భాః కుశాః యత్ర–విశిష్టమైన దర్భలు కలది. విదర్భ దేశము), రుక్మిణీం = రుక్మిణికి (రుక్మం స్వర్ణవర్ణః అస్తి అస్యాః స్వర్ణం వంటి కాంతి కలది. రుక్మిణి), త్వయి ప్రణయినీం= నీపై ప్రేమ కలది. (ప్రణయః అస్తి అస్యాః), సహోదరః = రుక్మిణి సోదరుడు(సహ సమానం ఉదరం జన్మస్థానం యస్య–సమానమైన జన్మస్థానం కలవాడు. తమ్ముడు అన్న), స్వయమ్ = స్వయముగా (తండ్రులు కాదని భావం), చేది మహీభుజే= చేది రాజగు శిశుపాలునికి, అదిత్సత= ఇచ్చి పెండ్లి చేయ వలెనని నిర్ణయించెను, స్వ తమసా = తన తమోగుణముతో (తన అజ్ఞానముతో)(తామ్యతి, సంతాపం జనయతి సంతాపమును కల్గించునది. అంధకారము), తమ్ అసాధుమ్ = ఆ పాపియైన శిశుపాలుని (న సాధు న ఉపకారకః–సజ్జనుడు కానివాడు ఉపకరించనివాడు అధార్మికుడు), ఉపాశ్రయన్ ఖలు= స్నేహితునిగా ఆశ్రయించెను కదా!

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! అటుపిమ్మట విదర్భరాజ పుత్రికయగు రుక్మిణికి నీపై ప్రేమ కలదయ్యెను. రుక్మిణి సోదరుడు రుక్మి, చేది రాజగు శిశుపాలునికి ఇచ్చి పెండ్లి చేయ వలెనని నిర్ణయించెను. తన అజ్ఞానముతో ఆ పాపియైన శిశుపాలుని స్నేహితునిగా ఆశ్రయించెను కదా!

**78–4 శ్లో.**

**చిరధృతప్రణయా త్వయి బాలికా సపది కాంక్షితభంగసమాకులా ।**
**తవ నివేదయితుం ద్విజమాదిశత్ స్వకదనం కదనంగవినిర్మితమ్ ॥**

**ప్రతిపదార్థము:** చిర= చాలాకాలమునుండి, త్వయి = నీయందు, ధృత ప్రణయా=ప్రేమను మనస్సులో నిలుపుకొని (అనురాగవతియై), బాలికా = ఆ బాలిక రుక్మిణి (బాలా ఏవ బాలికా బాలిక), కాంక్షిత భంగ = కాంక్షా భగ్నముతో,

సమాకులా= బాధ చెంది(తన కోరిక సఫలము కాదేమోయని బాధపడి) (సం అధికం ఆకులః సంక్షుబ్ధః ఆకీర్ణః–బాగుగా కూడినది. జనసందోహము ఉద్విగ్నము), సపది = ఒకసారి (సహ పద్యతే వెంబడి వుండునది. తత్క్షణము), తవ =నీకు, స్వ కదనం = తన పీడను (కదంతే వికలా భవంతే అత్ర అనేన వా ఇందులో (ఇక్కడ) వికలులు అగుదురు. యుద్ధము పాపము), కదన అంగ =మన్మథునిచే, వినిర్మితమ్= అనుభవిస్తున్న దుః స్థితిని(విశేషేణ నిర్మితః రచితః–రచింపబడినది నిర్మింపబడినది), నివేదయితుం= నివేదించుటకు, ద్విజమ్=ఒక బ్రాహ్మణుని (ద్విః జాయతే రెండుసార్లు పుట్టువాడు. బ్రాహ్మణ–క్షత్రియ–వైశ్యులు), ఆదిశత్ = పంపెను.

**తాత్పర్యము:** చాలాకాలమునుండి నీయందు మనస్సులో నిలుపుకొని (అనురాగవతియై) ఆ బాలిక రుక్మిణి ఒకసారి తన ప్రేమ నెరవేరదేమోనని బాధ చెంది నీకు తన పీడను, మన్మథునిచే అనుభవిస్తున్న దుః స్థితిని (అనురాగము వలన కలిగిన మనో వేదనను) నీకు నివేదించుటకు ఒక బ్రాహ్మణుని పంపెను.

**78–5 శ్లో.**
**ద్విజసుతోఽపి చ తూర్ణముపాయయౌ**
**తవ పురం హి దురాశదురాసదమ్ ।**
**ముదమవాప చ సాదరపూజితః**
**స భవతా భవతాపహృతా స్వయమ్ ॥**

**ప్రతిపదార్థము:** ద్విజసుతః అపి= ఆ బ్రాహ్మణ కుమారుడు, దురాశ దురాసదమ్= దుష్టస్వభావులకు ప్రవేశము పొందుటకు వీలులేని(దుష్టా ఆశా దురాశ.)(దుఃఖేన ఆసద్యతే గమ్యతే అసౌ కష్టంతో చేరుకొనదగినది), తవ పురం చ= మీ ద్వారక పురమునకు (పిపర్తి పుష్ణా పోషయతి ప్రాణినః–ప్రాణులను పోషించునది. నగరము), తూర్ణమ్ = వేగముగా, ఉపాయయౌ= చేరెను. భవతాపహృతా = సంసారతాపముహరించువాడివయిన (భవతి జాయతే తస్య భావ –పుట్టుక మహాదేవుడు సంసారము), భవతా = నీ చేత, స్వయమ్ = స్వయముగా, సాదర

పూజితః = సాదర సత్కారములు పొంది, సః= ఆ బ్రాహ్మణుడు, ముదమ్ అవాప హి = సంతోషమును పొందెను కదా!

**తాత్పర్యము:** ఆ బ్రాహ్మణ కుమారుడు దుష్టస్వభావులకు ప్రవేశము పొందుటకు వీలులేని మీ ద్వారకా పురమునకు వేగముగా చేరెను. సంసారతాపము హరించువాడివయిన నీ చేత స్వయముగా సాదర సత్కారములు పొంది ఆ బ్రాహ్మణుడు సంతోషమును పొందెను .

**78-6 శ్లో.**

**స చ భవంతమవోచత కుండినే నృపసుతా ఖలు రాజతి రుక్మిణీ ।**
**త్వయి సముత్సుకయా నిజధీరతారహితయా హి తయా ప్రహితోఽస్మ్యహమ్ ॥**

**ప్రతిపదార్థము:** సః చ= ఆ బ్రాహ్మణుడు, భవంతమ్= నీతో, అవోచత = ఇట్లు పలికెను, కుండినే = విదర్భరాజధానియగు కుండిననగరములో(కుండి అస్తి అస్య– కమండలము కలవాడు కుండిన పురము. దమయంతి పుట్టిన దేశము), రుక్మిణీ నృప సుతా= రుక్మిణి అను రాకుమార్తె, రాజతి ఖలు= ప్రకాశించుచున్నది, త్వయి = నిన్నే, సముత్సుకయా= ప్రేమించి తపనపడుచు(సం అధికం ఉత్సుకః ఔత్సుక్యము అధికోత్సాహము), నిజ ధీరతా రహితయా హి = కష్ట పరిస్థితిలో తన ధైర్యమును కోల్పోయిన, తయా= ఆమె చేత, అహమ్= నేను నీ వద్దకు, ప్రహితః అస్మి =పంపబడ్డాను.

**తాత్పర్యము:** "విదర్భరాజధానియగు కుండిననగరములో రుక్మిణి అను రాకుమార్తె ప్రకాశించుచున్నది. నిన్నే ప్రేమించి తపన పడుచు, కష్ట పరిస్థితిలో తన ధైర్యమును కోల్పోయి ,నన్ను ఇక్కడికి పంపించినది." అని ఆ బ్రాహ్మణుడు నీతో పలికెను.

**78-7 శ్లో.**

**తవ హృతాస్మి పురైవ గుణైరహం హరతి మాం కిల చేదినృపోధునా ।**
**అయి కృపాలయ! పాలయ మామితి ప్రజగదే జగదేకపతే! తయా ॥**

**ప్రతిపదార్థము:** జగదేకపతే (జగత్ –ఏక పతే) = ఓ విశ్వ పతీ!, తవ = నీయొక్క,

గుణైః= శుభ గుణములచే, అహం= నేను, పురా = స్వయం వరమునకు ముందే, హృతా అస్మి ఏవ= హరించబడి ఉంటిని.(హృతః, అపహృతః, నీతః, ఊఢః– అపహరింపబడినది తీసుకపోబడినది మోయబడినది), అయి కృపాలయ= ఓ దయానిధీ!, అధునా= ఇప్పుడు, చేదినృపః= శిశుపాలుడు (దేశభేదః జనపదః – చేది దేశము), మాం= నీ చేత హరించబడిన మనస్సు కలిగిన నన్ను, హరతి కిల= అపహరించుటకు ఉత్సాహ పడుచున్నాడు, మామ్= నన్ను, పాలయ= రక్షింపుము, ఇతి = ఈవిధముగా, తయా= ఆ రుక్మిణి, ప్రజగదే= నీకు చెప్పినది.

**తాత్పర్యము:** ఓ విశ్వ పతీ! నీయొక్క శుభ గుణములచే నేను స్వయం వరమునకు ముందే హరించబడి ఉంటిని. ఓ దయానిధీ! ఇప్పుడు శిశుపాలుడు నీ చేత హరించబడిన మనస్సు కలిగిన నన్ను అపహరించుటకు ఉత్సాహ పడుచున్నాడు. నన్ను రక్షింపుము అని ఈవిధముగా ఆ రుక్మిణి నీకు చెప్పినది.

**78–8 శ్లో.**

**అశరణాం యది మాం త్వముపేక్షసే**
**సపది జీవితమేవ జహామ్యహమ్ ।**
**ఇతిగిరా సుతనోరతనోద్ భృశం**
**సుహృదయం హృదయం తవ కాతరమ్ ॥**

**ప్రతిపదార్థము:** యది = ఒకవేళ (పక్షాంతరం సంభావనా మరొక పక్షము, ఒక వేళ), అశరణాం= శరణము లేకున్న (శరణ= శృణాతి దుఃఖం అనేన–దీనితో దుఃఖము పోగొట్టబడును. రక్షకుడు ఇల్లు), మాం= నన్ను, త్వమ్= నీవు, ఉపేక్షసే= ఉపేక్షించితివేని (ఈక్ష = దర్శనే ఉప + ఈక్ష్ + ఆ నిర్లక్ష్యము), సపది = తక్షణమే(సహ పద్యతే వెంబడి వుండునది. తత్క్షణము), జీవితమ్ ఏవ= జీవితమునే (నా ప్రాణమును)( జీవస్య భావః–జీవితము బ్రతుకు), అహమ్= నేను, జహామి = విడిచెదను, ఇతి సుతనోః గిరా= ఈ విధముగా రుక్మిణీదేవి సందేశమును (గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము వాణి), అయం సుహృత్ = సహృదయుడయిన ఆ బ్రాహ్మణుడు పలికి (సుష్ఠు హృదయం యస్యః–మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), తవ హృదయం = నీ హృదయమును

(హ్రియతే విషయైః విషయములచే హరింపబడునది. హృదయము), భృశం కాతరమ్= బాగా భయపడునట్లుగా(ప్రియురాలైన రుక్మిణి ప్రాణాపాయమునకు), అతనోత్= చేసెను.

**తాత్పర్యము:** "ఒకవేళ శరణము లేకున్న నన్ను నీవు ఉపేక్షించితివేని తక్షణమే జీవితమునే(నా ప్రాణమును) నేను విడిచెదను " అను రుక్మిణీదేవి సందేశమును చెప్పి సహృదయుడయిన ఆ బ్రాహ్మణుడు నీ హృదయమును కలవరపరిచెను (కృష్ణుని హృదయము రుక్మిణి ప్రాణాపాయ వృత్తాంతమును విని కలత చెందెనని భావం).

**78-9 శ్లో.**

**అకథయస్త్వమథైనమయే సఖే! తదధికా మమ మన్మథవేదనా ।**
**నృపసమక్షముపేత్య హరామ్యహం తదయి తాం దయితామసితేక్షిణామ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ = అప్పుడు, అయే సఖే = ఓ మిత్రుడా! (సహ సమానం ఖ్యాయతే సమానంగా చెప్పబడువాడు. చెలికాడు), తత్ అధికా= ఆమెకంటె ఎక్కువగా, మమ= నాకు, మన్మథవేదనా= మదనవేదన ఉన్నది, అయి = ఓ మిత్రుడా!,తత్=అందువలన,అహం =నేను,నృపసమక్షమ్=రాజ సమక్షమునకు, ఉపేత్య = వచ్చి, తాం అసిత ఈక్షణామ్= ఆ నల్లకలువలవంటి కన్నులుగల, దయితామ్= ప్రియురాలైన రుక్మిణిని(దయితా=భర్తురభీష్టా భర్తకు ప్రియమైనది. భార్య, ప్రియురాలు), హరామి= హరించెదను అని, త్వమ్= నువ్వు, ఏనమ్= అతనితో (ఆ బ్రాహ్మణునితో), అకథయః = చెప్పావు.

**తాత్పర్యము:** "ఓ మిత్రుడా! ఆమెకంటె ఎక్కువగా నాకు మదనవేదన ఉన్నది. అందువలన నేను రాజ సమక్షమునకు వచ్చి(రాజులందరు చూస్తుండగా) ఆ నల్లకలువలవంటి కన్నులుగల ,ప్రేమ స్వరూపిణి అయిన రుక్మిణిని హరించెదను'' అని నువ్వు ఆ బ్రాహ్మణునితో చెప్పావు( రుక్మిణికి ప్రతి సందేశము పంపావు)

**78-10 శ్లో.**

**ప్రముదితేన చ తేన సమం తదా రథగతో లఘు కుండినమేయివాన్ ।**

**గురుమరుత్పురనాయక! మే భవాన్ వితనుతాం తనుతామ్ నిఖిలాపదామ్ ॥**

**ప్రతిపదార్థము:** తేన ప్రముదితేన చ = నీ మాటలకు సంతోషించిన ఆ బ్రాహ్మణునితో (ప్రముదితః ఆహ్లాదితః-సంతోషించినవాడు), సమం= కలిసి, తదా = అప్పుడు, రథ గతః = రథమును ఎక్కి, లఘు = వెంటనే (చాలా కొద్ది సేపట్లోనే) (లంఘతే అనేన లంఘతి గంతుం శక్నోతి దీనితో లంఘింతురు, తొందరగా పోవుదురు), కుండినమ్=కుండిననగరమునకు,ఏయివాన్=వెళ్ళావు,గురుమరుత్పురనాయక= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, భవాన్ =నువ్వు, మే= నాయొక్క, నిఖిల ఆపదామ్ = అన్ని ఆపదలను (ఆపద్ ఏవ ఆపదా ఆపద సంకటము), తనుతామ్= తక్కువగా (తనోః కృశస్య భావః-కృశము బక్కచిక్కుట), వితనుతాం= చేయుము(ఆపదలను వెంటనే హరింపుము అని భావన).

**తాత్పర్యము:** నీ మాటలకు సంతోషించిన ఆ బ్రాహ్మణునితో కలిసి అప్పుడు రథమును ఎక్కి వెంటనే కుండిన నగరమునకు వెళ్ళావు. ఓ గురువాయూరు కృష్ణ దేవా! నువ్వు నాయొక్క ఆపదలను వెంటనే హరింపుము .

***దశమ స్కంధము***

**78వ దశకము సమాప్తము**

# దశకమ్ 79 – రుక్మిణీహరణం, వివాహము

**79-1 శ్లో.**

**బలసమేతబలానుగతో భవాన్ పురమగాహత భీష్మకమానితః ।**
**ద్విజసుతం త్వదుపాగమవాదినం ధృతరసా తరసా ప్రణనామ సా ॥**

**ప్రతిపదార్థము:** బల సమేత= కలహ శంకితుడై సైన్యములతో(బలతి బలయుక్తో భవతి అనేన–దీనితో యుక్తుడగును. బలము సామర్థ్యము సేన), బల అనుగతః = బలరాముడు తోడురాగా, భవాన్= నువ్వు, పురమ్= కుండినపురమున, అగాహత= ప్రవేశించితివి, భీష్మక = రుక్మిణి జనకుడైన భీష్మకునిచే, మానితః= గౌరవింపబడితివి, త్వత్ ఉపాగమ వాదినం= నువ్వు కుండినపురమున ప్రవేశించితివను విషయమును (ఉప సమీపే గమనం ఆగమనం వా స్వీకరణమ్ దగ్గరకు వెళ్లుట స్వీకరించుట), ద్విజ సుతం= బ్రాహ్మణ కుమారుని చేత విని, ధృతరసా =పుట్టిన కౌతుకముతో (ధృతః ధ్వస్తః స్థితః స్థిరీకృతః ధరింపబడినది ఉంచబడినది స్థిరంగా వున్నది), సా = ఆ రుక్మిణి, తరసా = వెంటనే (ఝటితి వేగేన తొందరగా. శీఘ్రంగా), ప్రణనామ = నమస్కరించెను.

**తాత్పర్యము:** కలహ శంకితుడైన బలరాముడు సైన్యములతో తోడురాగా నువ్వు కుండినపురమున ప్రవేశించితివి. రుక్మిణి జనకుడైన భీష్మకునిచే గౌరవింపబడితివి. నువ్వు కుండినపురమున ప్రవేశించితివను విషయమును బ్రాహ్మణ కుమారుని చేత విని పుట్టిన కౌతుకముతో ఆ రుక్మిణి వెంటనే నమస్కరించెను.

(కేవల నమస్కారము తప్ప ఇంకేమి రుక్మిణికి ఇవ్వలేదు. సాక్షాత్తుగా లక్ష్మీ స్వరూపురాలైన ఆమె నమస్కారముతో సమగ్ర ఐశ్వర్యమును అర్పించెనని కవి హృదయము)

**విశేషాలు**

**భీష్మకుడు:** విదర్భదేశపు రాజు. ఇతని కూతురు రుక్మిణి. కొడుకులు రుక్మి, రుక్మధరుడు, రుక్మకేశుడు, రుక్మబాహువు, రుక్మనేత్రుడు అని అయిదుగురు.

**79-2 శ్లో.**

**భువనకాంతమవేక్ష్య భవద్వపుర్నృపసుతస్య నిశమ్య చ చేష్టితమ్ ।**
**విపులఖేదజుషాం పురవాసినాం సరుదితైరుదితైరగమన్నిశా ॥**

**ప్రతిపదార్థము:** భువనకాంతమ్= భువనమోహనమైన (కామ్యతే ఇతి కోరబడునది), భవత్ వపుః = నీ దివ్య రూపమును (నీ అందమును), అవేక్ష్య = చూసి, నృపసుతస్య= రాజ కుమారుడయిన రుక్మి యొక్క, చేష్టితమ్ = చేష్టలను(శిశుపాలునికి తన చెల్లెలిని ఇచ్చి పెండ్లి చేయాలను దుష్ట నిర్ణయమును), నిశమ్య చ= విని, పురవాసినాం = పురవాసులు, విపులఖేదజుషాం= మిక్కిలి బాధపడ్డారు. (ఖిద్యతే అనేన దీనితో బాధనొందుదురు. ఖేదము దుఃఖము) (జోషయతి ఆలోచించుట పీడించుట), సరుదితైః= కన్నీళ్ళతో, ఉదితైః = ఈ విషయాలను చెప్పుకొనుచూ(ఉదితః కథితః-చెప్పబడినది), నిశా= (పౌరులు) ఆరాత్రిని, అగమన్= గడిపిరి.

**తాత్పర్యము:** భువనమోహనమైన నీ అందమును చూసి రాజ కుమారుడయిన రుక్మి యొక్క దుష్ట నిర్ణయమును(శిశుపాలునికి తన చెల్లెలిని ఇచ్చి పెండ్లి చేయాలనెడి నిర్ణయము) విని కుండిన పురవాసులు మిక్కిలి బాధపడ్డారు. కన్నీళ్ళతో ఈ విషయాలను చెప్పుకొనుచూ ఆ పౌరులు ఆరాత్రిని గడిపిరి.

**79-3 శ్లో.**

**తదను వందితుమిందుముఖీ శివాం విహితమంగళభూషణభాసురా ।**
**నిరగమద్ భవదర్పితజీవితా స్వపురతః పురతః సుభటావృతా ॥**

**ప్రతిపదార్థము:** తదను =అటుపిమ్మట, శివాం = పార్వతిని(శివస్య స్త్రీ శివుని భార్య), వందితుమ్ = పూజించుటకు, భవత్ అర్పితజీవితా = నీ కొరకు తన జీవితాన్ని అర్పించిన, ఇందుముఖీ = చంద్రునివంటి మోము కలిగిన ఆ రుక్మిణి, విహిత మంగళ భూషణ భాసురా= స్వర్ణరత్నాభరణములచే మణిహారములచే అందముగ అలంకరించుకొని(విధినా బోధితః చేయబడ్డది శాస్త్రోక్తంగా చెప్పబడ్డది)(భూష్యతే మండ్యతే అనేన-దీనితో అలంకరించుకొందురు. భూషణము, అలంకారము),

పురతః= ముందు భాగమున (పురతి అగ్రే గచ్ఛతి ముందు ఉండునది. ముందు ముందుగా), సుభట = వీరులైన భటులు(భజ్యతే మ్రియతే యోద్ధ, యోధుడు, భటుడు), ఆవృతా= కూడుకొని(నడచుచుండగా), స్వపురతః= తన భవనము నుండి, నిరగమత్= బయటకు వచ్చెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట పార్వతిని పూజించుటకు, నీ కొరకు తన జీవితాన్ని అర్పించిన చంద్రునివంటి మోము కలిగిన ఆ రుక్మిణి స్వర్ణరత్నాభరణములచే మణిహారములచే అందముగ అలంకరించుకొని, ముందు భాగమున వీరులైన భటులు నడచుచుండగా తన భవనమునుండి బయటకు వచ్చెను.

**79-4 శ్లో.**

**కులవధూభిరుపేత్య కుమారికా గిరిసుతాం పరిపూజ్య చ సాదరమ్ ।**
**ముహురయాచత తత్పదపంకజే నిపతితా పతితాం తవ కేవలమ్ ॥**

**ప్రతిపదార్థము:** కులవధూభిః= ముత్తయిదువులతో, ఉపేత్య= కలిసి, కుమారికా= ఆరాజకన్య రుక్మిణి( కుమారయతి క్రీడతి ఆడుకొనునది. కుమారి), గిరిసుతాం = పార్వతీదేవిని, పరిపూజ్య చ= భక్తితో పూజించెను, సాదరమ్= భక్తిప్రపత్తులతో, తత్ పదపంకజే నిపతితా= ఆ పార్వతీదేవి పాదపద్మములకు నమస్కరించి, కేవలమ్ తవ పతితాం = శ్రీ కృష్ణుడు నాకు భర్త కావలెనని, ముహుః = మాటి మాటికి, అయాచత = ప్రార్థించెను.

**తాత్పర్యము:** ముత్తయిదువులతో కలిసి ఆరాజకన్య రుక్మిణి పార్వతీదేవిని భక్తితో పూజించెను. భక్తితో ఆ పార్వతీదేవి పాదపద్మములకు నమస్కరించి శ్రీ కృష్ణుడు నాకు భర్త కావలెనని మాటి మాటికి ప్రార్థించెను.

**79-5 శ్లో.**

**సమవలోకకుతూహలసంకులే నృపకులే నిభృతం త్వయి చ స్థితే ।**
**నృపసుతా నిరగాద్గిరిజాలయాత్ సురుచిరం రుచిరంజితదిఙ్ముఖా ॥**

**ప్రతిపదార్థము:** సమవలోక = ఆ రాజకుమారి రుక్మిణిని చూడవలెనని, కుతూహల

సంకులే = కుతూహలముతో (కుతూం చర్మమయతైలపాత్రవత్ అంతః మనః హలతి సోత్సుకం కరోతి చర్మముతో చేసిన పాత్ర తైలసంస్కారముతో ఎలా మెరుస్తుందో అలాగే మనస్సు కూడ ఉత్సుకంగా వుంటుంది), నృప కులే= రాజుల సమూహము, నిభృతం= ఆలయము దగ్గర నిలబడి ఉండగా(నితరాం బిభర్తి ధారయతి అసౌ ఎల్లప్పుడు ధరించబడునది నిశ్చలమైనది వినీతుడు), త్వయి చ= నువ్వు, స్థితే= ఆమెను అపహరించు సమయము కొరకు ఎదురు చూస్తూ ఉండగా, నృపసుతా= రుక్మిణి, రుచి = తన దేహ కాంతులు(రోచతే శోభతే ప్రకాశము, కాంతి, కోరిక, అభిలాష), దిక్ ముఖాః = నాలుగు దిక్కులను (దిశతి అవకాశం దదాతి నిర్దేశించునది అవకాశము నిచ్చునది. దిశ), రంజిత= రంజింప చేయుచుండగా, గిరిజా ఆలయాత్ = ఆ గిరిజాదేవి ఆలయమునుండి (గిరౌ జాయతే పర్వతరాజు కుమార్తె. పార్వతి), సురుచిరం= ఒప్పిదముగా(మిక్కిలి రమణీయముగా), నిరగాత్= బయటికి వచ్చెను.

**తాత్పర్యము:** ఆ రాజకుమారి రుక్మిణిని చూడవలెనని కుతూహలముతో రాజుల సమూహము ఆలయము దగ్గర నిలబడి ఉండగా, నువ్వు ఆమెను అపహరించు సమయము కొరకు ఎదురు చూస్తూ ఉండగా ,రుక్మిణి తన దేహ కాంతులు నాలుగు దిక్కులను రంజింపచేయుచుండగా– ఆ గిరిజాదేవి ఆలయమునుండి ఒప్పిదముగా బయటికి వచ్చెను.

**79–6 శ్లో.**

**భువనమోహనరూపరుచా తదా వివశితాఖిలరాజకదంబయా ।**

**త్వమపి దేవ! కటాక్షవిమోక్షణైః ప్రమదయా మదయాంచకృషే మనాక్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా !, తదా = అప్పుడు, భువన మోహన రూప= లోకములన్నింటిని మోహింప చేయు రూపము కలిగిన ఆ రుక్మిణి యొక్క, రుచా= దేహ కాంతులకు, అఖిలరాజకదంబయా= అచ్చట గుమిగూడిన రాజులు, వివశితః =పరవశులయిరి, ప్రమదయా = ఆ రుక్మిణీ దేవి యొక్క (ప్రకృష్టః మదః హర్షః అస్తి అస్యాః–ఎప్పుడు సంతోషపడునది. ఉత్తమ స్త్రీ.యౌవనాది మదముగల ఆడుది), కటాక్ష విమోక్షణైః = క్రీగంటి చూపులకు(కటం గండం

అక్షతి వ్యాప్నోతి(క్రీగంటి చూపు)( విశిష్టం మోక్షణం ముక్తిః విడిచిపెట్టుట), త్వమ్ అపి= నువ్వు కూడా, మనాక్= కొంచెము(మన్యతే అల్పత్వమ్ తక్కువగా చూడబడినది), మదయాన్ చకృషే= మదము పొందినవాడివయ్యావు (తీవ్ర మయిన ప్రేమ భావనతో పరవశుడవయితివి).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! అప్పుడు లోకములన్నింటిని మోహింప చేయు రూపము కలిగిన ఆ రుక్మిణి యొక్క దేహ కాంతులకు అచ్చట గుమిగూడిన రాజులు పరవశులయిరి. ఆ రుక్మిణీ దేవి యొక్క క్రీగంటి చూపులకు నువ్వు కూడా కొంచెము మదము పొందినవాడివయ్యావు (తీవ్రమయిన ప్రేమ భావనతో పరవశుడవయితివి)

**79–7 శ్లో.**

**క్వ ను గమిష్యసి చంద్రముఖీతి తాం సరసమేత్య కరేణ హరన్ క్షణాత్ ।**
**సమధిరోప్య రథం త్వమపాహృథా భువి తతో వితతో నినదో ద్విషామ్ ॥**

**ప్రతిపదార్థము:** చంద్రముఖీ = ఓ చంద్రముఖీ! రుక్మిణీ! (చంద్ర ఇవ ముఖం యస్యాః – చంద్రునివలె అందమైన ముఖము కల స్త్రీ), క్వ ను గమిష్యసి= ఎక్కడకు పోయెదవు?, ఇతి= అని, తాం= ఆ రుక్మిణిని, సరసమ్ ఏత్య= వేగముగా సమీపించి, కరేణ హరన్= ఆమె చేయి పట్టుకొని, క్షణాత్ = వెంటనే (క్షణోతి నాశయతి సర్వం యథాకాలమ్ అన్నింటిని నశింపచేయునది. క్షణకాలము ముప్పై కళల పరిమిత కాలము), రథం = రథమును(రమ్యతే అనేన అత్ర వా దీనితో ఆనందింతురు. రథము), సమధిరోప్య= ఎక్కించుకొని పోవుచుంటివి, తతః = అటుపిమ్మట, ద్విషామ్= శత్రువులు చేయు (ద్వేష్టి ద్వేషించువాడు. శత్రువు), నినదః= రణగొణధ్వని(నితరాం నదతి తస్య భావః (ధ్వని)శబ్దము చేయునది. శబ్దము), భువి = భూమిపై, వితతః = విస్తరించుచుండగా(విశేషేణ తతః విస్తృతః – విస్తరించబడినది), త్వమ్ = నువ్వు, అపాహృథాః= రుక్మిణిని అపహరించుకొని పోయావు.

**తాత్పర్యము:** ‘ఓ చంద్రముఖీ! రుక్మిణీ ! ఎక్కడకు పోయెదవు?’ అని ఆ రుక్మిణిని వేగముగా సమీపించి, ఆమె చేయి పట్టుకొని , వెంటనే రథమును ఎక్కించుకొని

పోవుచుంటివి. అటుపిమ్మట శత్రువులు చేయు రణగొణధ్వని భూమిపై విస్తరించుచుండగా నువ్వు రుక్మిణిని అపహరించుకొని పోయావు.

**79–8 శ్లో.**

**క్వను గతః పశుపాల ఇతి కృధా కృతరణా యదుభిశ్చ జితా నృపాః ।**
**న తు భవానుదచాల్యత తైరహో పిశునకైః శునకైరివ కేసరీ ॥**

**ప్రతిపదార్థము:** పశుపాలః = ఈ పశుపాలకుడు (పశూనాం పాలకమ్ పశువులను పాలించువాడు. గోపాలుడు), క్వను గతః= ఎక్కడికి పోయాడు?, ఇతి = అని, కృధా= కోపముతో, యదుభిః చ= యాదవసైన్యముతో, కృతరణాః= యుద్ధము చేసిరి, నృపాః = ఆరాజులు, జితాః = జయిపబడ్డారు(యాదవుల చేతిలో ఓడిపోయారు), అహో = ఆహా!, తైః పిశునకైః = ఆ దుర్జనుల చేతలకు(పింశతి పిశ్యతే చెవిలో ఊదువాడు. దుష్టుడు క్రూరుడు అధముడు), కేసరీ= సింహము (కే శిరసి సరంతీతి కేసరాః సటాః తా అస్య సంతీతి కేసరీ ( జూలు కలది. సింహము), శునకైః ఇవ= కుక్కలకు బెదరనట్లుగా (శున ఏవ శునక–కుక్క), భవాన్= నువ్వు, న తు ఉదచాల్యత= చెదరలేదు (చలింపలేదు).

**తాత్పర్యము:** 'ఈ పశుపాలకుడు (గోపాలుడు) ఎక్కడికి పోయాడు?' అని కోపముతో యాదవసైన్యముతో యుద్ధము చేసిరి. యాదవుల చేతిలో ఓడిపోయారు. ఆహా! ఆ దుర్జనుల చేతలకు – సింహము కుక్కలకు బెదరనట్లుగా –నువ్వు చలింపలేదు.

**79–9 శ్లో.**

**తదను రుక్మిణమాగతమాహవే వధముపేక్ష్య నిబధ్య విరూపయన్ ।**
**హృతమదం పరిముచ్య బలోక్తిభిః పురమయా రమయా సహ కాంతయా ॥**

**ప్రతిపదార్థము:** తదను =ఆతరువాత, ఆహవే = నీపై యుద్ధమునకు (ఆహ్వాయంతే యోద్ధారః యుద్ధాయ పరస్పరం అత్ర – యుద్ధము యుద్ధభూమి), ఆగతమ్= వచ్చిన, రుక్మిణమ్= రుక్మిణి సోదరుడగు 'రుక్మి' యొక్క, వధమ్ = చంపుటను, ఉపేక్ష్య= ఉపేక్షించి (చంపక), నిబధ్య= అతనిని బంధించి, విరూపయన్=

విరూపిగా చేసి(తల వెంట్రుకలు, మీసం , గడ్డం గొరిగించి), మదం = అతని మదమును, హృత= పోగొట్టి, బల ఉక్తిభిః = బలరాముని మాట ప్రకారము, పరిముచ్య= రుక్మిని విడిచిపెట్టి (బంధనములు తొలగించి), రమయా కాంతయా= లక్ష్మీదేవియగు రుక్మిణితో(రమయతి ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి), సహ= కలిసి, పురమ్= నీ నగరమగు ద్వారకా నగరమును, అయాః = చేరితివి.

**తాత్పర్యము:** ఆతరువాత నీపై యుద్ధమునకు వచ్చిన రుక్మిణి సోదరుడగు రుక్మిని చంపక అతనిని బంధించి విరూపిగా చేసి(తల వెంట్రుకలు, మీసం, గడ్డం గొరిగించి) అతని మదమును పోగొట్టి, బలరాముని మాట ప్రకారము రుక్మిని విడిచిపెట్టి, లక్ష్మీదేవియగు రుక్మిణితో కలిసి నీ నగరమగు ద్వారకా నగరమును చేరితివి.

**79-10 శ్లో.**

**నవసమాగమ లజ్జితమానసాం ప్రణయకౌతుకజృంభితమన్మథామ్ ।**
**అరమయః ఖలు నాథ యథాసుఖం రహసి తాం హసితాంశు లసన్ముఖీమ్ ॥**

**ప్రతిపదార్థము:** నాథ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, నవ సమాగమ=కొత్తదైన సమాగమమగుటచే(సం సహ ఆ సమ్యక్ గమనమ్, సహవాసః, సాహచర్యమ్ కలియుట), లజ్జితమానసాం= రుక్మిణీదేవి మనస్సులో సిగ్గు పడుచున్నది. (కాని) (లజ్జా సంజాతా అస్యాః సిగ్గుపడినది), ప్రణయ కౌతుక= నీ పై ఉన్న అధికమైన ప్రేమచే, జృంభిత మన్మథామ్= అమెకు కోరిక రెట్టింపుగా పుట్టుచున్నది, తాం హసిత అంశు లసత్ ముఖీమ్=అటువంటి దరహాస కాంతిరేఖలతో ప్రకాశించుచున్న మోము కలిగిన రుక్మిణితో(అంశయతి విభజతే కిరణము వేగము కాంతి), రహసి= ఏకాంతములో, యథాసుఖం = యథా సుఖముగా, అరమయః ఖలు = క్రీడించితివి కదా!

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! కొత్తదైన సమాగమమగుటచే రుక్మిణీదేవి మనస్సులో సిగ్గు పడుచున్నది. (కాని) నీ పై ఉన్న అధికమైన ప్రేమ చే అమెకు కోరిక రెట్టింపుగా పుట్టుచున్నది. అటువంటి దరహాస కాంతిరేఖలతో

ప్రకాశించుచున్న మోము కలిగిన రుక్మిణితో ఏకాంతములో యథా సుఖముగా క్రీడించితివి కదా !

**విశేషము:** ద్వారక అంటే నవద్వారములు కలిగిన ఈ శరీరము . రుక్మిణీ కృష్ణులు జీవాత్మ పరమాత్మల సంకేతాలు. వారి సమాగమము అనగా బ్రహ్మానందము యొక్క అనుభవము. మన మానవ చక్షువులతో ఈ దాంపత్య సంయోగ వర్ణనలు చూసి పొరబడకూడదు. ప్రతీకలను అర్థం చేసుకోవాలి. పెద్దలు చెప్పిన మాట ఇది.

**79-11 శ్లో.**

**వివిధనర్మభిరేవమహర్నిశం ప్రమదమాకలయన్ పునరేకదా ।**

**ఋజుమతేః కిల వక్రగిరా భవాన్ వరతనోరతనోదతిలోలతామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏవమ్ = ఇట్లు, వివిధ నర్మభిః= వివిధరకములగు హాస్యపు మాటలతో(నయతి ఆనందమ్ ఆనందము నిచ్చునది. పరిహాసము), అహః నిశం = పగలు రాత్రి(అనుదినము), ప్రమదమ్ ఆకలయన్= సంతోష పెట్టితివి, పునః = మరలా, భవాన్ = నువ్వు, ఏకదా= ఒకనాడు, వక్రగిరా =వక్రోక్తులు (వక్రాః కుటిలా ఉక్తిః-అన్యార్థకల్పన మొనర్చుట), ఋజుమతేః = ఆదేవితో పలుకగా, వర తనోః = ఆ ఉత్తమ శరీర (వరా శ్రేష్ఠా తనుః యస్యాః-శ్రేష్ఠమైన శరీరం గలది), అతిలోలతామ్=పరవశత్వమును, అతనోత్ కిల= పొందినది కదా!

**తాత్పర్యము:** ఇట్లు వివిధరకములగు హాస్యపు మాటలతో పగలు రాత్రి(అనుదినము) ఆమెను సంతోష పెట్టితివి. ఒకనాడు వక్రోక్తులు ఆదేవితో పలుకగా ఆమె పరవశత్వమును పొందినది కదా!

**విశేషము:** వక్రోక్తులు ఆదేవితో పలుకగా ఆ రుక్మిణి కలవరపాటు పొందినదని, బాధ పడినదని కొందరు ఈ శ్లోకాన్ని అనువదించారు. పరవశత్వమును పొందినదను సంస్కృత వ్యాఖ్యానమును (పరవశతామనోత్) నేను స్వీకరించాను.

**79-12 శ్లో.**

**తదధికైరథ లాలనకౌశలైః ప్రణయినీమధికం సుఖయన్నిమామ్ ।**

**అయి ముకుంద! భవచ్చరితాని నః ప్రగదతాం గదతాంతిమపాకురు ॥**

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, తత్ అధికైః = నీవు మునుపటికంటె ఎక్కువగా, లాలనకౌశలైః = లాలన నేర్పులతో (లాలయతి స్నిహ్యతి తస్య భావః కర్మ వా లాలనము, స్నేహము), ఇమామ్ ప్రణయినీమ్= నీయందు ప్రేమ కలిగిన రుక్మిణిని, అధికం= ఎక్కువగా, సుఖయన్ = ఆనందపరచుచుంటివి, అయి ముకుంద = ఓ! ముకుందా! (ముకుం మోక్షం దదాతి మోక్షము నిచ్చువాడు. విష్ణువు), భవత్ చరితాని= నీ చరిత్రను( దివ్య గాథలను) (చరితః గతః జ్ఞాతో వా జరిగినది తెలుసుకొనబడినది), ప్రగదతాం = పలుకుచున్న(నుతించుచున్న), నః= మాకు, గద తాంతిమ్ = రోగపీడలను (రోగ బడలికలను), అపాకురు= దూరము చేయుము.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీవు మునుపటికంటె ఎక్కువగా లాలన నేర్పులతో నీయందు ప్రేమ కలిగిన రుక్మిణిని ఎక్కువగా ఆనందపరచుచుంటివి. ఓ! ముకుందా! నీ చరిత్రను( దివ్య గాథలను) పలుకుచున్న(నుతించుచున్న) మాకు రోగపీడలను దూరము చేయుము

***దశమ స్కంధము***

**79వ దశకము సమాప్తము**

# దశకమ్ 80 – స్యమన్తకోపాఖ్యానము

**80-1 శ్లో.**

**సత్రాజితస్త్వమథ లుబ్ధవదర్కలబ్ధం**
**దివ్యం స్యమంతకమణిం భగవన్నయాచీః ।**
**తత్కారణం బహువిధం మమ భాతి నూనం**
**తస్యాత్మజాం త్వయి రతాం ఛలతో వివోఢుమ్ ॥**

( వసంతతిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అథ= అటుపిమ్మట, త్వమ్ = నువ్వు, సత్రాజితః = సత్రాజిత్తు నుండి (సత్రేన ఆజయతి లోకాన్ సత్రంచే, యజ్ఞంచే లోకములను జయించినవాడు. సత్యభామ తండ్రి), అర్క లబ్ధం= సూర్యునివలన అతడు వరముగా పొందిన (అర్కయతి తపతి తాపయతి తపించువాడు. సూర్యుడు), దివ్యం= దివ్యమయిన, స్యమంతకమణిం= స్యమంతకమణిని (స్యమం వితర్కం అంతయతి ఆలోచనను పోగొట్టునది. స్యమంతకమణి)(సత్రాజిత్తుకు సూర్యుడు బహూకరించిన ఒక మణి. ఇది నిత్యం ఎనిమిది బారువుల బంగారాన్ని ఇస్తుందని ఐతిహ్యం)(ఇరవై అయిదుపౌండ్లు ఒక మణుగు .ఇరవై మనుగులు ఒక బారువ అనగా 500 పౌండ్లు), లుబ్ధ వత్ = దురాశాపరునివలె(లుభ్యతి అసౌ లోభము కలవాడు ఆశ కలవాడు), అయాచీః= యాచించితివి, తత్ = ఆ అడుగుటలో, బహువిధం= అనేక విధములుగా, కారణం = కారణములు(కార్యతే అనేన-దీనిచే కార్యము చేయబడును), మమ= నా బుద్ధికి, భాతి= తోచుచున్నవి, నూనం =నువ్వు యాచించుటకు చెప్పబోవు కారణము నిశ్చయముగా కావచ్చు, త్వయి రతాం= నీ యందు ప్రేమ కలిగిన, తస్య = ఆ సత్రాజిత్తు, ఆత్మజాం =కుమార్తెను(సత్యభామను)(ఆత్మనః జాయతే, ఆత్మా వా జాయతే), ఛలతః = ఈ యాచనా కారణముతో, వివోఢుమ్= పెండ్లి చేసుకొనదలిచితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! నువ్వు సత్రాజిత్తు నుండి సూర్యునివలన అతడు వరముగా పొందిన దివ్యమయిన స్యమంతకమణిని దురాశాపరునివలె

యాచించితివి. ఆ అడుగుటలో ఎన్నో కారణములు నా బుద్ధికి తోచుచున్నవి. నీ యందు ప్రేమ కలిగిన ఆ సత్రాజిత్తు కుమార్తెను ఈ యాచనా కారణముతో పెండ్లి చేసుకొనదలిచితివి.

**విశేషాలు**

**బహువిధ కారణములు:** జాంబవంతుని అనుగ్రహించి, అతని కుమార్తె జాంబవతిని వివాహమాడుట. సత్యభామా పరిణయం, శతధన్విని వధ మొదలయిన కారణములతో శ్రీకృష్ణుడు స్యమంతకమణిని దురాశాపరునివలె యాచించెను.

**సత్రాజిత్తు:** యాదవులలో వృష్ణివంశస్థుడు అగు నిమ్నుని కొడుకు. సత్యభామ తండ్రి.ఇతడు సత్యభామను కృష్ణునికి ఇచ్చినందుకు అక్రూరుడును కృతవర్మయు శతధన్వునికి రోషము కలిగేటట్లు బోధించిరి. అంత ఇతడు నిద్ర పోవుచుండ తటిని శతధన్వుడు వచ్చి చంపి పోయెను. అది తెలిసి సత్యభామ దుఃఖింపఁగా ఆమె యొక్క ప్రీతికొఱకు కృష్ణుడు శతధన్విని చంపెను.

**80–2 శ్లో.**

**అదత్తం తం తుభ్యం మణివరమనేనాల్పమనసా**
**ప్రసేనస్తద్భ్రాతా గళభువి వహన్ ప్రాప మృగయామ్ ।**
**అహన్నేనం సింహో మణిమహసి మాంసభ్రమవశాత్**
**కపీంద్రస్తం హత్వా మణిమపి చ బాలాయ దదివాన్ ॥**

(శిఖరిణి **య, మ, న, స, భ, వ(లగ)**)

**ప్రతిపదార్థము:** అల్పమనసా= అల్పబుద్ధికలిగిన, అనేన = ఆ సత్రాజిత్తు, తుభ్యం = నీకు, తం మణివరమ్ = ఆ స్యమంతక మణిని, అదత్తం= ఇయ్యలేదు, తత్ భ్రాతా= అతని తమ్ముడైన, ప్రసేనః= ప్రసేనుడు, గళ భువి= తనకంఠమున, వహన్ = రత్నము ధరించి, మృగయామ్ = వేటకు (మృగాన్ యాతి పదార్థం అనయా దీనితో మృగములను చంపుటకు వెళ్లుదురు. వేట, షికారు), ప్రాప= అడవికి వెళ్లెను, మణి మహసి= మణి యొక్క కాంతిని చూసి, మాంస భ్రమ వశాత్= మాంసపు ముద్ద అని భ్రమ పడి(మన్యతే జాయతే తెలుసుకొనబడును ఆదరింపబడును. మాంసము.)

(మాంస భక్షయితా అముత్ర యస్య మాంస ఇహాద్మ్యహమ్ 'దేని మాంసము ఇక్కడ తింటున్నానో, అది నన్ను తినును), సింహః = ఒక సింహము (హినస్తి చంపునది. సింహము), ఏనం= ఆ ప్రసేనుని, అహన్= చంపెను, కపీంద్రః = కపిశ్రేష్ఠుడయిన భల్లూక రాజయిన జాంబవంతుడు(కపీనాం ఇంద్రః), తం= ఆ సింహమును, హత్వా = చంపి, మణిమ్ అపి చ= ఆ మణిని (అవ్యక్తం శబ్దం కరోతి అవ్యక్త శబ్దము చేయునది. మణి, రత్నము), బాలాయ = తన కుమార్తె జాంబవతికి ఆటబంతిగా, దదివాన్= ఇచ్చెను.

**తాత్పర్యము:** అల్పబుద్ధికలిగిన ఆ సత్రాజిత్తు నీకు ఆ స్యమంతక మణిని ఇయ్యలేదు. అతని తమ్ముడైన ప్రసేనుడు తనకంఠమున రత్నము ధరించి వేటకు అడవికి వెళ్లెను. మణి యొక్క కాంతిని చూసి మాంసపు ముద్ద అని భ్రమపడి ఒక సింహము ఆ ప్రసేనుని చంపెను. భల్లూక రాజయిన జాంబవంతుడు ఆ సింహమును చంపి ఆ మణిని తన కుమార్తె జాంబవతికి ఆటబంతిగా ఇచ్చెను.

**80-3 శ్లో.**

**శశంసుః సత్రాజిద్గిరమనుజనాస్త్వాం మణిహరం**
**జనానాం పీయూషం భవతి గుణినాం దోషకణికా ।**
**తతస్సర్వజ్ఞోఽపి స్వజనసహితో మార్గణపరః**
**ప్రసేనం తం దృష్ట్వా హరిమపి గతోఽభూః కపిగుహామ్ ॥**

(శిఖరిణి **య , మ , న , స , భ , వ**(లగ))

**ప్రతిపదార్థము:** సత్రాజిత్ గిరమ్ = నా తమ్ముని చంపి శ్రీ కృష్ణుడు మణిని అపహరించెనని సత్రాజిత్తు చెప్పిన మాటలను, అను= అనుసరించి(విని), జనాః = ప్రజలు ఇదివరలో నువ్వు మణిని యాచించావని తెలిసి, త్వాం= నిన్ను, మణి హరం= మణిని దొంగిలించినవానిగా, శశంసుః=ప్రజలు చెప్పుకొనసాగిరి, గుణినాం = గుణవంతుల యొక్క, దోషకణికా=దోష లేశము కూడా, జనానాం= జనులకు, పీయూషం= అమృతము వలె (పీయతే దేవైః – దేవతలచే త్రాగబడునది. అమృతము), భవతి= ఉండును, తతః = అటుపిమ్మట, సర్వజ్ఞః – అపి = నీవు సర్వజ్ఞుడవయినప్పటికి, స్వ జన సహితః= నీవు నీ స్వజనులతో కలిసి, మార్గణ

పరః=ఆ మణిని వెతుకుతూ బయలుదేరి (మార్గ్యతే అన్విష్యతే లక్ష్యం అనేన – దీనితో లక్ష్యము వెదకబడును. బాట), తం ప్రసేనం = చనిపోయి ఉన్న ఆ ప్రసేనుని, అపి హరిమ్ = మరియు సింహమును (హరతి గృహ్ణాతి అసౌ సింహము), దృష్ట్వా= చూసి, కపి= జాంబవంతుని యొక్క(చలతి కంపతే వా సతతమ్ ఎల్లప్పుడు చలించును, కంపించును), గుహామ్ = గుహలో (గూహతి సంవృణోతి కప్పునది, దాచునది. గుహ), గతః అభూః= ప్రవేశించితివి.

**తాత్పర్యము:** 'నా తమ్ముని చంపి శ్రీ కృష్ణుడు మణిని అపహరించె'నని సత్రాజిత్తు చెప్పిన మాటలను విని ప్రజలు ఇదివరలో నువ్వు మణిని యాచించావని తెలిసి– నిన్ను మణిని దొంగిలించినవానిగా ప్రజలు చెప్పుకొనసాగిరి. గుణవంతుల యొక్క దోష లేశము కూడా జనులకు అమృతము వలె ఉండును. అటుపిమ్మట నీవు సర్వజ్ఞుడవయినప్పటికి నీవు నీ స్వజనులతో కలిసి ఆ మణిని వెతుకుతూ బయలుదేరి చనిపోయి ఉన్న ఆ ప్రసేనుని మరియు సింహమును చూసి జాంబవంతుని యొక్క గుహలో ప్రవేశించితివి.

**80–4 శ్లో.**

**భవంతమవితర్కయన్నతివయాః స్వయం జాంబవాన్**
**ముకుందశరణం హి మాం క ఇహ రోద్ధుమిత్యాలపన్ ।**
**విభో! రఘుపతే! హరే! జయ జయేత్యలం ముష్టిభిః**
**చిరం తవ సమర్చనం వ్యధిత భక్తచూడామణిః ॥**

(పృథ్వీ **జ , స , జ , స , య , వ(లగ)** )

**ప్రతిపదార్థము:** అతి వయాః= మిక్కిలి ముసలివాడయినందువలన (వయతి గచ్ఛతి కాలకృతా శరీరావస్థా కాలకృత శరీరావస్థ. వెళ్లునది, వయస్సు), జాంబవాన్ = ఆ జాంబవంతుడు, స్వయం = స్వయముగా, భవంతమ్= నిన్ను (శ్రీహరిగా), అవితర్కయన్= గుర్తింపలేకపోయెను, ముకుందశరణం = శ్రీ రాముని భక్తుడనయిన( ముకుందో విష్ణుః శరణం యస్య తం), మాం= నన్ను, రోద్ధుమ్ = ఎదుర్కొనుటకు, ఇహ= ఈ ప్రపంచములో, కః = ఎవడు శక్తిమంతుడు, ఇతి= అని తలపోయుచు, విభో = ప్రభూ!, రఘుపతే= శ్రీ రామ చంద్రా!, హరే= శ్రీ

హరీ!, జయ జయ= నీకు జయమగుగాక!, ఇతి ఆలపన్ =అని నిన్ను ఎఱుగకయే నిన్ను జపించుచు (నీకు ప్రదక్షిణము చేయుచున్నట్లు నీతో ద్వంద్వ యుద్ధ మార్గములో తిరుగుచు), అలం ముష్టిభిః =చాలినంతగా ముష్టిప్రహారముల రూపములో ఉన్న పూలతో, చిరం = చాలా కాలము, తవ సమర్చనం= సంరంభాత్మకభక్తి పురస్సరమైన పూజను (సమ్యక్ అర్చనం పూజనమ్ చక్కగా పూజించుట), వ్యధితః= చేసెను, భక్తచూడామణిః హి = పరమ భక్తుడు కదా! (చూడా శిరోభూషణం తస్య తత్ర స్థితో వా మణిః – శిరోరత్నము. సమాసాంతమునందు శ్రేష్ఠవాచకము).

**తాత్పర్యము:** మిక్కిలి ముసలివాడయినందువలన ఆ జాంబవంతుడు స్వయముగా నిన్ను (శ్రీహరిగా) గుర్తింపలేకపోయెను. శ్రీ రాముని భక్తుడనయిన నన్ను ఎదుర్కొనుటకు ఈ ప్రపంచములో ఎవడు శక్తిమంతుడు అని తలపోయుచు 'ప్రభూ! శ్రీ రామ చంద్రా ! శ్రీ హరీ ! నీకు జయమగుగాక !' అని నిన్ను ఎఱుగకయే నిన్ను జపించుచు, నీకు ప్రదక్షిణము చేయుచున్నట్లు నీతో ద్వంద్వ యుద్ధ మార్గములో తిరుగుచు, ముష్టిప్రహారముల రూపములో పూలతో చాలా కాలము సంరంభాత్మకభక్తి పురస్సరమైన పూజను నీకు చేసెను . (ప్రతి ముష్టి ప్రహార సమయములో ప్రభూ! శ్రీ రామ చంద్రా! అనుచు జాంబవంతుడు శ్రీరాముని కీర్తించేవాడు) అతడు పరమ భక్తుడు కదా!

**80-5 శ్లో.**
**బుద్ధ్వాఽథ తేన దత్తాం**
**నవరమణీం వరమణిం చ పరిగృహ్ణన్ ।**
**అనుగృహ్ణన్నముమాగాః**
**సపది చ సత్రాజితే మణిం ప్రాదాః ॥**

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట, బుద్ధ్వా= నీ గ్రుద్దులకు బాధపడి నీవు పురాణపురుషుడవు హరివని తెలిసి(పశ్చాత్తాపబడి), తేన = ఆ జాంబవంతునిచే, దత్తాం=ఇవ్వబడిన, నవ= అప్రౌఢయైన, రమణీం = రమణి జాంబవతిని (రమతే అస్యామ్ ఈమె యందు రమింతురు. స్త్రీ), వర మణిం చ= స్యమంతక మణిని

కూడా, పరిగృహ్ణన్= గ్రహించి, అముమ్ = భక్తుడైన జాంబవంతుని, అనుగృహ్ణన్= అనుగ్రహించి (నీ పాణిపద్మముచే అతని శరీరమంతా నిమిరి నొప్పుల బాధను తగ్గించి), ఆగాః = ద్వారకకు తిరిగి వచ్చావు, సపది చ= ఆగమన అనంతరము వెంటనే, సత్రాజితే= సత్రాజిత్తుకు, మణిం= స్యమంతక మణిని, ప్రాదాః= ఇచ్చితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీ గ్రుద్దులకు బాధపడి నీవు పురాణపురుషుడవు హరివని తెలిసి–పశ్చాత్తాపబడి– ఆ జాంబవంతునిచే ఇవ్వబడిన అప్రౌఢయైన రమణి జాంబవతిని ,స్యమంతక మణిని కూడా గ్రహించి భక్తుడైన జాంబవంతుని అనుగ్రహించి (నీ పాణిపద్మముచే అతని శరీరమంతా నిమిరి నొప్పుల బాధను తగ్గించి) ద్వారకకు తిరిగి వచ్చావు. తిరిగి వచ్చిన తరువాత సత్రాజిత్తుకు స్యమంతక మణిని ఇచ్చితివి.

**80–6 శ్లో.**

**తదను స ఖలు వ్రీడాలోలో విలోలవిలోచనాం**
**దుహితరమహో ధీమాన్ భామాం గిరైవ పరార్పితామ్ ।**
**అదిత మణినా తుభ్యం లభ్యం సమేత్య భవానపి**
**ప్రముదితమనాస్తస్యైవాదాన్మణిం గహనాశయః ॥**

(హరిణి **న , స , మ , ర , స , వ(లగ)**)

**ప్రతిపదార్థము:** తదను= ఆతరువాత, వ్రీడా లోలః = నీపై నిరాధారముగా అపవాదుమోపినందుకు పశ్చాత్తాపముతో సిగ్గుపడి(వ్రీడ్యతి తస్య భావః–సిగ్గు), సః ధీమాన్= బుద్ధిమంతుడయిన ఆ సత్రాజిత్తు, విలోల= చాంచల్యము కల (విశేషేణ లోలః చంచలః), విలోచనాం= కన్నులు కలిగిన (విలోక్యతే దృశ్యతే అనేన–దీనితో చూడబడును. కన్ను), దుహితరమ్ భామాన్= కుమార్తె అయిన సత్యభామను (దోగ్ధి అపహరతి ధనం మాతృకులాత్ తల్లిగారి ఇంటి నుండి ధనమును తీసుకెళ్లునది. కూతురు.)(భాతి ప్రకాశతే సౌందర్యేణ–సౌందర్యముతో ప్రకాశించునది. అందమైన స్త్రీ), పర అర్పితామ్=శతధన్వునికి ఇచ్చెదనను, గిరా ఏవ = మాటతో పాటు, మణినా = మణితో పాటు, తుభ్యం = నీకు, అదిత= ఇచ్చెను, భవాన్ అపి = నువ్వు కూడా, ప్రముదిత మనాః = సంతోషించిన హృదయము

కలవాడివై, గహన ఆశయః = గాఢమైన ఆలోచనతో (దూరదృష్టితో), లభ్యం = పొందదగినది (లభ్యతే లబ్ధుం యోగ్యమ్ పొందబడినది పొందదగినది), సమేత్య=పొంది, మణిం = ఆ స్యమంతక మణిని, తస్య ఏవ = మరలా సత్రాజిత్తుకే, ఆదాత్ ఖలు =తిరిగి ఇచ్చితివి కదా!, అహో= అశ్చర్యము

**తాత్పర్యము:** ఆతరువాత నీపై నిరాధారముగా అపవాదుమోపినందుకు పశ్చాత్తాపముతో సిగ్గుపడి బుద్ధి మంతుడయిన ఆ సత్రాజిత్తు అందముగా చలించు కన్నులు కలిగిన తన కుమార్తె అయిన సత్యభామను శతధన్వునికి ఇచ్చి వివాహము చేసెదనను మాటను, మణితో పాటు నీకు ఇచ్చెను . నువ్వు కూడా సంతోషించిన హృదయము కలవాడివై దూరదృష్టితో ఆ స్యమంతక మణిని మరలా సత్రాజిత్తుకే తిరిగి ఇచ్చితివి కదా ! . అశ్చర్యము( మణి వద్దన్నాడు కాని మణి రోజు ఇచ్చే ఎనిమిది బారువుల బంగారము కృష్ణుడు కావాలన్నాడని “లభ్యం సమేత్య “పదాలకు కొందరి వ్యాఖ్యానం)

**80-7 శ్లో.**

**వ్రీడాకులాం రమయతి త్వయి సత్యభామాం**
**కౌంతేయదాహకథయాథ కురూన్ ప్రయాతే ।**
**హీ గాందినేయకృతవర్మగిరా నిపాత్య**
**సత్రాజితం శతధనుర్మణిమాజహార ॥** (మదనము **త , భ , జ , జ , గా**(గగ)

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, వ్రీడా ఆకులాం= సిగ్గుతో కూడుకొన్న, సత్యభామామ్ = ఆ సత్యభామతో, త్వయి= నువ్వు, రమయతి = సుఖముగా ఉన్నావు, కౌంతేయ= లక్క ఇంటిలో పాండవులు, దాహ కథయా = దహనమయ్యారను లోక వార్తను విని(దహతి తస్య భావః దహించునది. దప్పి అగ్ని), కురూన్= నువ్వు హస్తినా పురమునకు, ప్రయాతే= ప్రయాణమయ్యావు, హీ= కష్టము.(నువ్వు లేని సమయమున) (విస్మయే, విషాదే చ – ఆశ్చర్యము విషాదము), గాందినేయ= అక్రూరుడు(గాందిన్యా సుతః అక్రూరః – గాందిని కుమారుడు. అక్రూరుడు), కృతవర్మ= మరియు కృతవర్మల, గిరా = చెడు మాటల ప్రేరణతో, శతధనుః = శతధన్వుడు, సత్రాజితం = సత్రాజిత్తును, నిపాత్య = చంపి,

మణిమ్= స్యమంతక మణిని, ఆజహార = అపహరించాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట సిగ్గుతో కూడుకొన్న ఆ సత్యభామతో నువ్వు సుఖముగా ఉన్నావు. లక్క ఇంటిలో పాండవులు దహనమయ్యారను లోక వార్తను విని నువ్వు హస్తినా పురమునకు ప్రయాణమయ్యావు. నువ్వు లేని సమయమున అక్రూరుడు మరియు కృతవర్మల చెడు మాటల ప్రేరణతో శతధన్వుడు సత్రాజిత్తును చంపి స్యమంతక మణిని అపహరించాడు.

**విశేషాలు**

**కృతవర్మ:** హృదికుని కొడుకు. దేవమీఢుని తమ్ముడు. ఇతడు కృపాశ్వత్థామలతో కూడి భారతయుద్ధానంతరమున రాత్రియందు పాండవ శిబిరము చొచ్చి నిద్రపోవు వారిని హత్యచేసిన అశ్వత్థామకు సహాయముగ ఉండెను.

**80-8 శ్లో.**
**శోకాత్ కురూనుపగతామవలోక్య కాంతాం**
**హత్వా ద్రుతం శతధనుం సమహర్షయస్తామ్ ।**
**రత్నే సశంక ఇవ మైథిలగేహమేత్య**
**రామో గదాం సమశిశిక్షత ధార్తరాష్ట్రమ్ ॥**

(మదనము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** శోకాత్ = (తండ్రి మరణము విని) దుఃఖించి (సత్యభామ), కురూన్ = నువ్వు ఉన్న హస్తినాపురమునకు, ఉపగతామ్= రాగా, కాంతాం అవలోక్య =నీ ప్రియురాలిని చూసి, ద్రుతం= వెంటనే, శతధనుం = శతధన్వుని, హత్వా = చంపి, సమహర్షయః= సత్యభామకు ఆనందము కలిగించితివి, తామ్ రత్నే= ఆ స్యమంతక మణి విషయములో, సశంక ఇవ= నీపై అపోహ కల్గిన విధముగా ఉన్న, రామః= బలరాముడు, మైథిలగేహమ్ ఏత్య = మిథిలాధిపతి రాజగృహమునకు వెళ్ళి(మిథిలానగర్యాం జాతః భవః తత ఆగతః, నగర్యాః రాజా మిథిలానగరంలో పుట్టినవాడు, మిథిలానగరము నుండి వచ్చినవాడు మిథిలానగరపు రాజు, జనకుడు), ధార్తరాష్ట్రమ్ = దుర్యోధనునకు (ధృతరాష్ట్రస్య అపత్యమ్ ధృతరాష్ట్రుని

కుమారుడు. దుర్యోధనాదులు), గదాం = గదా యుద్ధమును, సమశిక్షత = నేర్పించెను.

**తాత్పర్యము:** తండ్రి మరణము విని దుఃఖించిన సత్యభామ నువ్వు ఉన్న హస్తినాపురమునకు రాగా ,నీ ప్రియురాలిని చూసి , వెంటనే శతధన్వుని చంపి సత్యభామకు ఆనందము కలిగించితివి. ఆ స్యమంతక మణి విషయములో నీపై అపోహ కల్గిన బలరాముడు మిథిలాధిపతి రాజగృహమునకు వెళ్ళి దుర్యోధనునకు గదా యుద్ధమును నేర్పించెను.

**విశేషాలు:** శతధన్వుని దగ్గర రత్నమున్నదని దానికొరకు కృష్ణుడు సంహరించాడు. ఆ శతధన్వుని వస్త్రములో మణిని వెదకినట్లు కృష్ణుడు నటించాడని "నీవు పురమునకు వెళ్ళి మణిని వెదకుము" అని కృష్ణునికి బలరాముడు చెప్పి తాను మిథిలకు వెళ్లాడని సంస్కృత వ్యాఖ్యానము( త్వాం పురీం గత్వా మణిమన్విచ్ఛ)

**80-9 శ్లో.**

**అక్రూర ఏష భగవన్। భవదిచ్ఛయైవ**
**సత్రాజితః కుచరితస్య యుయోజ హింసామ్ ।**
**అక్రూరతో మణిమనాహృతవాన్ పునస్త్వం**
**తస్యైవ భూతిముపధాతుమితి బ్రువంతి ॥**

(మదనము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ భగవంతుడా! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య- ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), ఏషః అక్రూరః = ఈఅక్రూరుడు, భవత్ ఇచ్ఛయా ఏవ=నీ సంకల్పమును అనుసరించి(ఇచ్ఛతి తస్య భావః అభిలషించునది. కోరిక), కుచరితస్య = దుష్టుడైన, సత్రాజితః= సత్రాజిత్తుయొక్క, హింసామ్ యుయోజ =హింసకు (మరణమునకు) కారణమయ్యెను, పునః = మరలా(అట్లే), త్వం= నువ్వు, తస్య ఏవ =అతని యొక్క (అక్రూరుని యొక్క), భూతిమ్= ఐశ్వర్యమును(భవతి అనయా, సర్వవిధకల్యాణం ఐశ్వర్యాదికం చ-దీనితో సర్వ విధముల శుభములు జరుగును. సకల ఐశ్వర్యాదులు), ఉపధాతుమ్ =

పెంచదలిచి, అక్రూరతః= అక్రూరుని నుండి, మణిమ్ = మణిని, నాహృతవాన్= స్వీకరించలేదు, ఇతి= అని, బ్రువంతి = ప్రజలు అనుకొనుచున్నారు.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా! 'ఈఅక్రూరుడు నీ సంకల్పమును అనుసరించి దుష్టుడైన సత్రాజిత్తుయొక్క హింసకు (మరణమునకు) కారణమయ్యెను. అట్లే నువ్వు అతని యొక్క (అక్రూరుని యొక్క) ఐశ్వర్యమును పెంచదలిచి అక్రూరుని నుండి మణిని స్వీకరించలేదు' అని ప్రజలు అనుకొనుచున్నారు. (అతని వద్దనే స్యమంతకమణి ఉందని గ్రహించికూడా మణిని కృష్ణుడు స్వీకరించలేదని భావం)

**80-10 శ్లో.**

**భక్తస్త్వయి స్థిరతరః స హి గాందినేయః**
**తస్యైవ కాపథమతిః కథమీశ జాతా ।**
**విజ్ఞానవాన్ ప్రశమవానహమిత్యుదీర్ణం**
**గర్వం ధ్రువం శమయితుం భవతా కృతైవ ॥**

(మదనము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** ఈశ = ప్రభూ! (ఈశ ఐశ్వర్యే- ఐశ్వర్యము కలవాడు), సః గాందినేయః= ఆ అక్రూరుడు, త్వయి = నీయొక్క, స్థిరతరః భక్తః హి= స్థిరమైనభక్తి కలిగినవాడు కదా! (అయం అనయోః అతిశయేన స్థిరః-రెండింటిలో ఎక్కువ స్థిరమైన), తస్య ఏవ= అతనికి, కాపథ మతిః= కుత్సితమైన దుర్మార్గ ఆలోచన (సత్రాజిత్తును చంపవలెనను ఆలోచన) (కుత్సితః పంథా (కా. 6.3.104)] చెడు మార్గము), కథమ్ జాతా= ఎట్లు కలిగినది?, అహమ్ = నేను, విజ్ఞానవాన్= విజ్ఞాన వంతుడను (విశిష్టం జ్ఞానమ్ విశిష్ట జ్ఞానము), ప్రశమవాన్ = పరమశాంతుడను (అతిశయేన శామ్యతి శాంతో భవతి తస్య భావః-ప్రశాంతి), ఇతి = అని, ఉదీర్ణం= అక్రూరునిలో ఉత్పన్నమైన (ఉదీర్ణః ఉన్నతః వర్ధితో వా వృద్ధి చెందినది పెరిగినది), గర్వం= గర్వమును (గర్వతి అహంకరోతి తస్య భావః-అహంకారము అభిమానము), శమయితుం= పోగొట్టుటకు, భవతా= నీచేత, కృతా ఏవ= ఇటువంటి పని (సత్రాజిత్తును చంపవలెనను ఆలోచన కలిగించుట) చేయబడినది, ధ్రువం= ఇది స్థిరమైన సత్యము.(ధ్రువతి స్థిరీభవతి స్థిరంగా వుండునది).

**తాత్పర్యము:** ప్రభూ! ఆ అక్రూరుడు నీయొక్క స్థిరమైనభక్తి కలిగినవాడు కదా! అతనికి దుర్మార్గమైన ఆలోచన(సత్రాజిత్తును చంపవలెనను ఆలోచన) ఎట్లు కలిగినది? 'నేను విజ్ఞాన వంతుడను పరమశాంతుడను' అని అక్రూరునిలో ఉత్పన్నమైన గర్వమును పోగొట్టుటకు నీచేత ఇటువంటి పని (సత్రాజిత్తును చంపవలెనను ఆలోచన కలిగించుట) చేయబడినది. ఇది సంపూర్ణ సత్యము.

**80-11 శ్లో.**

**యాతం భయేన కృతవర్మయుతం పునస్తం**
**ఆహూయ తద్వినిహితం చ మణిం ప్రకాశ్య ।**
**తత్రైవ సువ్రతధరే వినిధాయ తుష్యన్**
**భామాకుచాంతరశయః పవనేశ! పాయాః ॥**

(మదనము **త , భ , జ , జ , గా**(గగ)

**ప్రతిపదార్థము:** భయేన = (సత్రాజిత్తు వధకు ప్రేరకుడైన నన్నును చంపక మానడను) భయముతో (బిభేతి అస్మాత్ దీని వలన భయపడుదురు. భయము),కృతవర్మయుతం = కృత వర్మతో కలిసి, యాతం= పారిపోయిన, తమ్ = ఆ అక్రూరుని, పునః = మరలా (దూత ముఖముగా), ఆహుయ= పిలిపించి, తత్ వినిహితం చ = అతనిదగ్గర ఉన్న(నిహితః స్థాపితః గూఢః-పెట్టబడ్డది దాచబడినది), మణిం= స్యమంతక మణిని, ప్రకాశ్య= (సభలో బలరామాదు లందరికి తెలియునట్లుగా) ప్రకాశింప చేసి, తత్ర సువ్రతధరే ఏవ= ఉత్తమ గుణములుగల ఆ అక్రూరుని దగ్గరే, వినిధాయ= ఆమణిని ఉంచి, భామాకుచాంతర శయః= సత్యభామ కుచముల మధ్య సుఖముగా శయనించి, తుష్యన్ = తృప్తి చెందుచుంటివి, పవనేశ = ఓ గురువాయూరు దేవా!, పాయాః = నన్ను రక్షించు.

**తాత్పర్యము:** సత్రాజిత్తు వధకు ప్రేరకుడైన నన్నును చంపక మానడను భయముతో, కృత వర్మతో కలిసి పారిపోయిన ఆ అక్రూరుని మరలా పిలిపించి అతనిదగ్గర ఉన్న స్యమంతక మణిని సభలో బలరామాదులందరికి తెలియునట్లుగా ప్రకాశింప చేసి ,ఉత్తమ గుణములుగల ఆ అక్రూరుని దగ్గరే ఆమణిని ఉంచి సత్యభామ కుచముల మధ్య సుఖముగా శయనించి తృప్తి చెందుచుంటివి. ఓ గురువాయూరు దేవా! రక్షించు.

*దశమ స్కంధము*

**80వ దశకము సమాప్తము**



## దశకమ్ 81 – నరకాసురవధ , సుభద్రాహరణము

**81–1 శ్లో.**

**స్నిగ్ధాం ముగ్ధాం సతతమపి తాం లాలయన్ సత్యభామాం**
**యాతో భూయస్సహ ఖలు తయా యాజ్ఞసేనీవివాహమ్ ।**
**పార్ధప్రీత్యై పునరపి మనాగాస్థితో హస్తిపుర్యాం**
**శక్రప్రస్థం పురమపి విభో! సంవిధాయాగతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** విభో= ఓ దేవా! (విశేషేణ భవతి సర్వగతః–విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), స్నిగ్ధాం = నీకు ప్రియమైనది (స్నిహ్యతి స్నేహకరోతి స్నేహము చేయునది కలిసి వుండునది), ముగ్ధాం = మోహన రూపము కలది అయిన (మోహయతి మోహింప చేయునది), తాం సత్యభామాం = ఆ సత్యభామను, సతతమ్ అపి= ఎల్లప్పుడు, లాలయన్= ప్రణయలీలలచే లాలించుచు, భూయః = మరలా, తయా = ఆమెతో, సహ= కలిసి, యాజ్ఞసేనీ వివాహమ్=ద్రౌపదీకల్యాణమునకు(యజ్ఞసేనస్య ద్రుపదరాజస్య అపత్యం స్త్రీ ద్రుపదుని కుమార్తె. యాజ్ఞసేని), యాతః ఖలు = వెళ్ళితివి కదా!, పార్ధ ప్రీత్యై = అర్జునుని కోరికమేరకు(పృథాయాః కుంత్యాః అపత్యం పుమాన్ కుంతీ పుత్రుడు. అర్జునుడు), పునః అపి = మరలా కూడా, మనాక్= కొంతకాలము (మన్యతే అల్పత్వమ్ తక్కువగా చూడబడినది), హస్తిపుర్యాం = హస్తినాపురములో, ఆస్థితః =ఉంటివి, శక్రప్రస్థం పురమ్ అపి= పాండవుల నివాసముకొరకు ఇంద్రప్రస్థపురమును (శక్రస్య ప్రస్థః–ఇంద్రప్రస్థము), సంవిధాయ= విశ్వకర్మచే నిర్మాణము చేయించి, ఆగతః అభూః= నీ నగరమగు ద్వారకకు తిరిగి వచ్చితివి.

**తాత్పర్యము:** ఓ దేవా! నీకు ప్రియమైనది మోహన రూపము కలది అయిన ఆ సత్యభామను ఎల్లప్పుడు ప్రణయలీలలచే లాలించుచు ,ఆమెతో కలిసి ద్రౌపదీకల్యాణమునకు యాతః వెళ్ళితివి. అర్జునుని కోరికమేరకు కొంతకాలము హస్తినాపురములో ఉంటివి. పాండవుల నివాసముకొరకు ఇంద్రప్రస్థపురమును విశ్వకర్మచే నిర్మాణము చేయించి నీ నగరమగు ద్వారకకు తిరిగి వచ్చితివి.

**విశేషాలు**

**హస్తి పురము:** అజమీఢుని తండ్రి అగు హస్తికునివలన ఈనామము కలిగెను. (హస్తి అనగా ఏనుఁగు కనుక దాని పర్యాయములు అన్నియు దీనికి నామములు అగును. ఉదాహరణము– గజపురి, కరిపురి ఇత్యాది.) ఇది కౌరవులకు రాజధాని. ఇది ఇప్పుడు గంగానదిలో మునిగి ఉన్నది. ఢిల్లీపట్టణమునకు తూర్పున ఇది అఱువది మైళ్లదూరమున ఉండినట్లు తెలియును. ఒకప్పుడు దుర్యోధనుని కొమార్తను వివాహముకాగోరి కృష్ణుని కొడుకు అగు సాంబుడు ఎత్తుకొనిపోవ కౌరవులు వానిబట్టి చెఱసాలలో పెట్టిరి. అనంతరము వానిని విడిపించుకొని పోవుటకై బలరాముడు హస్తిపురికివచ్చి మంచిమాటలచే ఎంతచెప్పినను కౌరవులు వినకపోగా బలరాముడు తన నాగేటిచే హస్తినాపురమును గంగలో త్రోయ సమకట్టెను అని ప్రసిద్ధి.

**81–2 శ్లో.**

**భద్రాం భద్రాం భవదవరజాం కౌరవేణార్థ్యమానాం**
**త్వద్వాచా తామహృతకుహనామస్కరీ శక్రసూనుః ।**
**తత్ర క్రుద్ధం బలమనునయన్ ప్రత్యగాస్తేన సార్ధం**
**శక్రప్రస్థం ప్రియ సఖముదే సత్యభామా సహాయః ॥**

**ప్రతిపదార్థము:** భద్రాం = శుభలక్షణములు కలిగిన (భద్రం కరోతి శుభము నిచ్చునది), భవత్= నీయొక్క, అవరజాం= సోదరి(అవరస్మిన్ కాలే జాతా – . తరువాత పుట్టినది), భద్రాం = సుభద్రను, కౌరవేణ= కౌరవ రాజకుమారుడగు దుర్యోధనుడు (కురోః అపత్యమ్ కురురాజు సంతానము. కౌరవులు–పాండవులు), అర్థ్యమానాం= వివాహమాడదలచి అర్థించాడు, త్వత్ వాచా= నీ మాటచే, శక్రసూనుః= అర్జునుడు (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు)(సూయతే ప్రసూయతే కనబడ్డవాడు పుట్టిన వాడు. కొడుకు), కుహనా మస్కరీ = కపటి సన్యాసి వేషముతో వచ్చి(కుహయతే దంభకరోతి తస్య భావః కర్మ వా దంభాచారము)(మా కర్తు కర్మనిషేద్ధుం శీలం అస్య–పనులను నిషేధించు శీలం కలవాడు లౌకిక కర్మలను విడిచి పెట్టినవాడు.

సన్న్యాసి), తామ్ = ఆ సుభద్రను అహృతః= అపహరించుకొని పోయెను, తత్ర = సుభద్రా హరణ వృత్తాంతములో, క్రుద్ధం= కోపించిన, బలమ్= బలరాముని, అనునయన్= అనునయించి, తేన సార్ధం= అతనితో కలిసి, సత్యభామా సహాయః= సత్యభామాసమేతుడవై, ప్రియ సఖముదే= ప్రియ సఖుడైన అర్జునుని సంతోష పెట్టుటకు, శక్రప్రస్థం = ఇంద్రప్రస్థపురమునకు, ప్రత్యగాః= ప్రయాణమయితివి.

**తాత్పర్యము:** శుభలక్షణములు కలిగిన నీయొక్క సోదరి సుభద్రను కౌరవ రాజకుమారుడగు దుర్యోధనుడు వివాహమాడదలచి అర్థించెను. నీ మాటచే అర్జునుడు కపటి సన్యాసి వేషముతో వచ్చి ఆ సుభద్రను అపహరించుకొని పోయెను. సుభద్రా హరణ వృత్తాంతముతో కోపించిన బలరాముని అనునయించి , అతనితో కలిసి సత్యభామాసమేతుడవై ప్రియ సఖుడైన అర్జునుని సంతోషపెట్టుటకు ఇంద్రప్రస్థపురమునకు ప్రయాణమయితివి.

**81-3 శ్లో.**

**తత్ర క్రీడన్నపి చ యమునాకూలదృష్టాం గృహీత్వా**
**తాం కాళిందీం నగరమగమః ఖాండవప్రీణితాగ్నిః ।**
**భ్రాతృత్రస్తాం ప్రణయవివశాం దేవ! పైతృష్వసేయీం**
**రాజ్ఞాం మధ్యే సపది జహృషే మిత్రవిందామవంతీమ్ ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తత్ర= ఆ ఇంద్రప్రస్థ నగరమందు, క్రీడన్ అపి చ= సరస సల్లాపములతో కాలక్షేపము చేయుచు ఒకనాడు, యమునా కూల= యమునానదీతీరములో, తాం కాళిందీం= సూర్యపుత్రి అయిన కాళింది అను సుందరిని, దృష్టాం= చూసి, గృహీత్వా= ఆమెను గ్రహించి(వివాహము చేసుకొని), నగరమ్ అగమః = నగరమునకు వచ్చితివి, ఖాండవ = అర్జునుని ద్వారా ఖాండవ వనమును దహింపచేసి (ఖాండవ్యాః తదాఖ్యాయాః నగర్యాః జాతం వనమ్ ఖాండవమను నగరంలో వున్న వనము. ఖాండవవనము), అగ్నిః= అగ్నిదేవుని(అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), ప్రీణితః = సంతృప్తి కలుగచేసి (ప్రీణః ప్రసన్న తృప్తః-ప్రసన్నుడైనవాడు తృప్తి పరచినవాడు తృప్తి పొందినవాడు), భ్రాతృ త్రస్తాం = సోదరులయిన

విందానువిందులకు భయపడుచున్న(త్రస్తః భీతః చకితః–భయపడిన), ప్రణయ వివశాం = నీపై సాటిలేని ప్రేమ కలిగిన, పైతృష్వసేయీం= నీ మేనత్త కుమార్తె, అవంతీమ్ = అవంతీ రాజ కుమార్తెను, మిత్రవిందామ్ =మిత్రవిందను, రాజ్ఞాం మధ్యే = రాజ సమాజమందు, సపది= వెంటనే, జహృషే = అపహరించి అర్ధాంగిగా చేసుకొంటివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఆ ఇంద్రప్రస్థ నగరమందు సరస సల్లాపములతో కాలక్షేపము చేయుచు ఒకనాడు యమునానదీతీరములో సూర్యపుత్రి అయిన కాళింది అను సుందరిని చూసి ఆమెను గ్రహించి ( వివాహము చేసుకొని) నగరమునకు వచ్చితివి. అర్జునుని ద్వారా ఖాండవవనమును దహింప చేసి అగ్నిదేవుని సంతృప్తి కలుగచేసి సోదరులయిన విందానువిందులకు భయపడుచున్న– నీపై సాటిలేని ప్రేమ కలిగిన నీ మేనత్త కుమార్తె అయిన అవంతీ రాజకుమార్తెను , మిత్రవిందను రాజ సమాజమందు(స్వయం వరసభలో) వెంటనే అపహరించి అర్ధాంగిగా చేసుకొంటివి.

**విశేషాలు**

**ఖాండవవనము:** కురుక్షేత్ర ప్రాంతంలోని ఇంద్రుని దివ్యౌషధీ వనం. ఒకానొక యజ్ఞంలో ఎక్కువ నేతిని తీసుకొన్నందువల్ల కలిగిన మాంద్యాన్ని పోగొట్టుకొనడానికి అగ్ని ఈ వనాన్ని కృష్ణార్జునుల సహాయంతో దహించాడని ఒక కథ.

**81–4 శ్లో.**
**సత్యాం గత్వా పునరుదవహో నగ్నజిన్నందనాం తాం**
**బద్ధ్వా సప్తాఽపి చ వృషవరాన్ సప్తమూర్తిర్నిమేషాత్ ।**
**భద్రాం నామ ప్రదదురథ తే దేవ। సంతర్దనాద్యాః**
**తత్సోదర్యాం వరద! భవతస్సాపి పైతృష్వసేయీ ॥**

**ప్రతిపదార్థము:** పునః = మరలా, గత్వా= నగ్నజిత్తు యొక్క రాజధానికి వెళ్ళి, నిమేషాత్ సప్త మూర్తిః= ఏడు రూపములను ధరించి, సప్త అపి చ వృష వరాన్= ఏడు పొగరుబోతు కోడెలను(వర్షతి కామాన్ కోరికలను కురిపించునది. ఒక

ఔషధము ధర్మము, వృషభము), బద్ధ్వా= బంధించి, నగ్నజిత్= కోసల దేశపు రాజు అయిన నగ్నజిత్తు యొక్క, నందనాం = కుమార్తె అయిన (నందయతి సంతోషింప చేయునది. కుమార్తె), సత్యాం= సత్య అను మరొక పేరు కలిగిన (సత్యం అస్తి అస్యా సత్యం కలది. సత్య), తాం = ఆ నాగ్నజితి అను పేరుగలదానిని, ఉదవహః = వివాహము చేసుకొంటివి, అథ = అటుపిమ్మట, దేవ= ఓదేవా!, తత్ = ఆ, ఆద్యాః = ప్రతర్దన సందరనాదుల యొక్క, సోదర్యాం= సోదరి అయిన శ్రుతకీర్తి యొక్క కుమార్తె అయిన, భద్రాం నామ= భద్ర అను పేరు గల దానిని, తే= నీకు, ప్రదదుః=ఇచ్చిరి (ఇచ్చి వివాహము చేసారు), వరద= ఓ వరదుడా!, సా అపి= ఆ భద్ర కూడా, భవతః= నీయొక్క, పైతృష్వసేయీ= మేనత్తె కుమార్తె (వసుదేవుని సోదరి కుమార్తె).

**తాత్పర్యము:** కోసల దేశపు రాజు నగ్న జిత్తు. ఆదేశ రాజధా నగ్నజిత్తు యొక్క రాజధానికి వెళ్ళి ఏడు రూపములను ధరించి ఏడు పొగరుబోతు కోడెలను బంధించి , కోసల దేశపు రాజు అయిన నగ్నజిత్తు యొక్క కుమార్తె అయిన, సత్య అను మరొక పేరు కలిగిన నాగ్నజితి అను పేరుగలదానిని వివాహము చేసుకొంటివి. అటుపిమ్మట ఓదేవా! ఆ సంతర్దన ప్రతర్దన సందరనాదుల యొక్క సోదరి అయిన శ్రుతకీర్తి యొక్క కుమార్తె అయిన భద్ర అను పేరు గల దానిని నీకు ఇచ్చి వివాహము చేసారు .ఓ వరదుడా! ఆ భద్ర కూడా నీయొక్క మేనత్తె కుమార్తె. (వసుదేవుని సోదరి కుమార్తె)

**విశేషాలు**

**నాగ్నజితి:** కోసలదేశపు రాజు నగ్నజిత్తు. అతని కుమార్తె నాగ్నజితి. ఆ రాజు దగ్గర మిక్కిలి మదించిన ఏడు ఆబోతులు ఉన్నాయి. ఆ ఎద్దులను తన బాహుబలంతో ఎవడు కట్టివేస్తాడో, అతడే నాగ్నజితికి భర్త అని ఆ రాజు నిర్ణయించాడు. శ్రీకృష్ణుడు విచిత్రరీతిలో ఏడుమూర్తులు ధరించి బాలుడు కొయ్యబొమ్మలను పట్టుకున్నట్లుగా పర్వతాల వంటి ఏడు వృషభాలను పట్టుకుని గ్రుద్ది, క్రుమ్మి, అవలీలగా నేల మీదకు కూలద్రోసి, కట్టి ఈడ్చి నాగ్న జితిని పెండ్లి చేసుకొన్నాడు (పోతన భాగవతం దశమస్కంధము).

**81-5 శ్లో.**

**పార్థాద్యైరప్యకృతలవనం తోయమాత్రాభిలక్ష్యం**
**లక్షం ఛిత్త్వా శఫరమవృథా లక్ష్మణాం మద్రకన్యామ్ ।**
**అష్టావేవం తవ సమభవన్ వల్లభాస్తత్ర మధ్యే**
**శుశ్రోథ త్వం సురపతిగిరా భౌమదుశ్చేష్టితాని ॥**

**ప్రతిపదార్థము:** పార్థ ఆద్యైః అపి = అర్జునుడు మొదలయిన వారు కూడా, అకృత లవనం = ఛేదించుటకు శక్యముగాని(లూయతే తస్య భావః కర్మ వా కోయుట), తోయ మాత్ర అభిలక్ష్యం = కేవలము నీటియందే ప్రతిబింబ రూపములో ఉన్న(తవతే వర్ధయతేవృద్ధింగచ్ఛతివా దీనినినింపుదురు.నీరు),శఫరమ్=మత్స్యాత్మకమయిన (శపాం గతిసాధనావయవాన్ రిణాతి పీడయతి గతిసాధనమైన అవయములను కష్టపెట్టునది.ఒకవిధమైనచేప),లక్షం=లక్ష్యమును (లక్షయతి,లక్ష్యతే చూచునది, చూడబడునది. పదం, చిహ్నము, లక్ష్యము, గురి), ఛిత్త్వా = ఛేదించి, మద్రకన్యామ్ = మద్ర కన్య అయిన, లక్ష్మణాం =లక్షణను, అవృథాః = వివాహమాడావు, ఏవం=ఈ విధముగా,తవ =నీకు, అష్టౌ=ఎనిమిదిమంది,వల్లభాః=భార్యలు (పట్టపురాణులు) (వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపునది. ప్రియురాలు), సమభవన్ = కలిగిరి, తత్ర మధ్యే= వీరందరి మధ్య, త్వం= నువ్వు, సురపతి గిరా= ఇంద్రుని వలన, భౌమ దుశ్చేష్టితాని= నరకాసురుని యొక్క ఆగడములను (భూమేః అపత్యమ్ భూమి సంతానము), శుశ్రోథ= విన్నావు.

**తాత్పర్యము:** అర్జునుడు మొదలయిన వారు కూడా ఛేదించుటకు శక్యముగాని కేవలము నీటియందే ప్రతిబింబ రూపములో ఉన్న మత్స్యాత్మకమయిన లక్ష్యమును– ఛేదించి మద్ర కన్య అయిన లక్షణను వివాహమాడావు. ఈ విధముగా నీకు ఎనిమిదిమంది పట్టపురాణులు నీకు కలిగిరి. వీరందరి మధ్య నువ్వు ఇంద్రుని మాటలద్వార నరకాసురుని యొక్క ఆగడములను విన్నావు.

**విశేషాలు**

**అష్టమహిషులు:** శ్రీకృష్ణుడి ఎనమండుగురు భార్యలను అష్టమహిషులని వ్యవహరిస్తారు. వారు: 1. రుక్మిణి, 2. జాంబవతి, 3. సత్యభామ, 4. కాళింది, 5.

నాగ్నజితి, 6. మిత్రవింద, 7. భద్ర, 8. లక్షణ.

**81-6 శ్లో.**

**స్మృతాయాతం పక్షిప్రవరమధిరూఢస్త్వమగమో**
**వహన్నంకే భామాముపవనమివారాతి భవనమ్ ।**
**విభిందన్ దుర్గాణి త్రుటితపృతనాశోణితరసైః**
**పురం తావత్ ప్రాగ్జ్యోతిషమకురుథాశ్శోణితపురమ్ ॥**

**ప్రతిపదార్థము:** స్మృత ఆయాతం= నీ స్మరణ మాత్రముచే వచ్చిన (కృత స్మరణః- స్మరింపబడినది), పక్షిప్రవరమ్= గరుత్మంతుని పై, అధిరూఢః= ఎక్కి, త్వమ్ = నువ్వు, భామామ్= సత్యభామను, అంకే వహన్ = అంక భాగమున నిలుపుకొని (అంకయతి చిహ్నయతి), ఉపవనమ్ ఇవ = ఉద్యాన వనము వలె (పురసమీప కృత్రిమవనమ్)(ఉపమితం వనేన సదృశమ్ అడవితో సమానమైనది. ఉద్యానవనము), అరాతిభవనమ్ = శత్రువైన నగర భవనమును (నగరమ్ అని పాఠాంతరము. అప్పుడు ప్రాగ్జ్యోతిష నగరమని అర్థము), అగమః = ప్రవేశించావు, దుర్గాణి = గిరిశస్త్రజల అగ్ని అనిలాదులతో దుర్భేద్యములుగా ఉన్న దుర్గములను(దుఃఖేన గమ్యతే కష్టంతో చేరుకొనదగినది. దుర్గము కోట), విభిందన్= కూల్చి వేసి, త్రుటిత పృతనా= సైన్యములను కూల్చి (ప్రియతే వ్యాప్తా భవతివ్యాపించి యుండునది. సేన), శోణిత రసైః = రుధిర ద్రవములతో (రక్తములతో) (శోణిః రక్తవర్ణః సంజాతః అస్య-రక్తం వర్ణం కలది. రక్తము), తావత్ ప్రాగ్జ్యోతిషమ్ పురం = ఆ ప్రాగ్యోతిషమను నగరమును ( ప్రాక్ జ్యోతిషం నక్షత్రం యస్య-ఇక్కడ నక్షత్రములు మొదట ఉదయించును. ప్రాగ్జ్యోతిషము.) (నరకాసురుని రాజధాని. ఇది కిరాతులు వసించు కామరూప దేశమునకు ముఖ్యపట్టణము), శోణితపురమ్= శోణ పురముగా (ఎఱ్ఱని రంగుగల నగరము), అకురుథాః= చేసితివి.

**తాత్పర్యము:** నీ స్మరణ మాత్రముచే వచ్చిన గరుత్మంతుని పై ఎక్కి నువ్వు సత్యభామను అంక భాగమున నిలుపుకొని, ఉద్యాన వనము వలె శత్రువైన నగర భవనమును ప్రవేశించావు. గిరిశస్త్రజల అగ్ని అనిలాదులతో దుర్భేద్యములుగా

ఉన్న దుర్గములను కూల్చి వేసి ,సైన్యములను వధించి రక్తములతో ఆ ప్రాగ్జ్యోతిషమను నగరమును శోణ పురముగా చేసితివి.( ఎఱ్ఱని రంగుగలదానివిగా చేసితివి)

**81-7 శ్లో.**

**మురస్త్వాం పంచాస్యో జలధివనమధ్యాదుదపతత్**
**స చక్రే చక్రేణ ప్రదళితశిరా మంక్షు భవతా ।**
**చతుర్దంతైర్దంతావలపతిభిరింధానసమరం**
**రథాంగేన ఛిత్త్వా నరకమకరోస్తీర్ణనరకమ్ ॥**

**ప్రతిపదార్థము:** పంచ ఆస్యః = అయిదు తలలు కలిగిన నరకాసురుని అనుచరుడైన (అస్యతే గ్రాసః అత్ర-గ్రాసము ఇందులో వేయబడును. నోరు), మురః = మురాసురుడు (మురతి వేష్టతే పాపమ్ పాపము ఆవహించినవాడు. ఒక రాక్షసుడు నరకాసురుని అన్న), జలధి వన మధ్యాత్ = సముద్ర జలముల మధ్య నుండి, త్వాం ఉదపతత్= నీ పైకి రాగా, సః= ఆ మురాసురుని, చక్రేణ = నీ చక్రముతో ఎదుర్కొని, ప్రదళిత శిరాః = ఆ రాక్షసుని శిరస్సులను, మంక్షు= ఒక్కసారిగా (శీఘ్రార్థః), భవతా = నువ్వు, చక్రే =ఖండించితివి, చతుః దంతైః = నాలుగు దంతములు కలిగిన, దంతావలపతిభిః = మదపుటేనుగులతో నీతో (అతిశయితౌ దంతౌ అస్య-మంచిదంతములు కలది. ఏనుగు), ఇంధాన=ప్రవృద్ధమైన (కఠినముగా), సమరం= యుద్ధము చేసిన, నరకమ్= నరకాసురుని(నృణాతి క్లేశం ప్రాయయతి కష్టమును కల్గించునది. నరకము), రథాంగేన = నీ చక్రముచే (రథస్య అంగం చక్రమ్ రథము యొక్క భాగము. రథచక్రము), ఛిత్త్వా= వధించి, తీర్ణనరకమ్ = అతనిని సంసార ఉత్తీర్ణునిగా (సంసార దూరునిగా) (తీర్ణః పారంగతః - ఒడ్డు దాటినవాడు గట్టెక్కినవాడు), అకరోః = చేసావు. (నరకునికి మోక్షము ఇచ్చావని భావము),

**తాత్పర్యము:** అయిదు తలలు కలిగిన నరకాసురుని అనుచరుడైన మురాసురుడు సముద్ర జలముల మధ్య నుండి నీ పైకి రాగా ఆ మురాసురుని నీ చక్రముతో ఎదుర్కొని ఆ రాక్షసుని శిరస్సులనుఒక్కసారిగా నువ్వు ఖండించితివి. నాలుగు

దంతములు కలిగిన మదపుటేనుగులతో నీతో కఠినమైన యుద్ధము చేసిన నరకాసురుని నీ చక్రముచే వధించి అతనిని సంసార ఉత్తీర్ణునిగా (సంసార దూరునిగా) చేసావు. (నరకునికి మోక్షము ఇచ్చావని భావము)

**81-8 శ్లో.**

**స్తుతో భూమ్యా రాజ్యం సపది భగదత్తేఽస్య తనయే**
**గజం చైకం దత్వా ప్రజిఘయిథ నాగాన్నిజపురీమ్ ।**
**ఖలేనాబద్ధానాం స్వగతమనసాం షోడశపునః**
**సహస్రాణి స్త్రీణామపి చ ధనరాశిం చ విపులమ్ ॥**

**ప్రతిపదార్థము:** పునః= మరలా, భూమ్యా = భూదేవిచే, స్తుతః =(నరకుని వధ పిమ్మట) నువ్వు స్తుతింపబడి, రాజ్యం= నరకాసురుని రాజ్యమును, సపది = వెంటనే, అస్య తనయే= అతని కుమారుడైన, భగదత్తే = భగదత్తునికి అప్పగించి (భగం ఐశ్వర్యం దత్తం అస్మై ఐశ్వర్యమును ఈయబడ్డవాడు), ఏకం చ గజం దత్వా = ఒక ఏనుగును మాత్రము వానికిచ్చి (గజతి మత్తో భవతి మదించునది. ఏనుగు), నాగాన్= మిగిలిన ఏనుగులను (న గచ్ఛతి అగః, న అగః – స్థిరంగా వుండనిది, పోవునది. సర్పము ఏనుగు), ఖలేన = దుర్మార్గుడయిన నరకాసురునిచే( స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు మూర్ఖుడు), ఆబద్ధానాం= నరకుని కారాగారమందు బంధించబడి, స్వగతమనసాం = నీయందు ప్రేమానురాగములు కలిగిన (స్వస్మిన్ మనసి ఆత్మని వా గతమ్ తనలో నుండునది), షోడశ సహస్రాణి =పదహారువేలమంది,స్త్రీణామ్అపిచ=స్త్రీలను(స్త్యాయతిగర్భంయస్యామ్ గర్భము దీనియందు పెరుగును. స్త్రీ), విపులమ్ ధనరాశిం చ = అనంతధనరాశులనుకూడా, నిజపురీమ్ = నీ రాజధాని ద్వారకకు, ప్రజిఘయిథ= పంపితివి.

**తాత్పర్యము:** నరకుని వధ పిమ్మట భూదేవిచే నువ్వు స్తుతింపబడి – నరకాసురుని రాజ్యమును అతని కుమారుడైన భగదత్తునికి అప్పగించి – ఒక ఏనుగును మాత్రము వానికిచ్చితివి. మిగిలిన ఏనుగులను ,దుర్మార్గుడయిన నరకుని కారాగారమందు బంధించబడి నీయందు ప్రేమానురాగములు కలిగిన పదహారువేలమంది స్త్రీలను, అనంతధనరాశులనుకూడా నీ రాజధాని ద్వారకకు పంపితివి.

**81-9 శ్లో.**
**భౌమాపాహృతకుండలం తదదితేర్దాతుం ప్రయాతో దివం**
**శక్రాద్యైర్మహితః సమం దయితయా ద్యుస్త్రీషు దత్తహ్రియా ।**
**హృత్వా కల్పతరుం రుషాభిపతితం జిత్వేంద్రమభ్యాగమః**
**తత్తు శ్రీమదదోష ఈదృశ ఇతి వ్యాఖ్యాతుమేవాకృథాః ॥**

**ప్రతిపదార్థము:** భౌమా= నరకునిచే, అపాహృత= అపహరించబడిన, తత్ అదితేః = ఆ అదితియొక్క (న దితిః-దితి కానిది. అదితి, దేవమాత), కుండలం= కుండలములను(కుంద్యతేరక్ష్యతేకుండంతదాకారంలాతిగృహ్ణాతి రక్షింపబడునది. ఒక విశిష్ట ఆకారములో వుండునది. కుండలములు), దాతుం= తిరిగి ఇచ్చుటకు, దివం ప్రయాతః = సత్యభామతో స్వర్గమునకు వెళ్లితివి. (దీవ్యంతి మోదంతే అస్మిన్ ఇక్కడ సంతోష పడుదురు. ఆకాశము దినము వనము స్వర్గము), ద్యు స్త్రీషు= శచి, ఊర్వశి మొదలయిన దివ్య వనితలు(ద్యోతతే అసౌ ప్రకాశించునది), దత్త హ్రియా= తన సోయగమును చూసి సిగ్గుపడుచుండగా(జిహ్రీయతి తస్య భావః కర్మ వా సిగ్గు), దయితయా = (కాంతిటో) వెలుగుతున్న ప్రియురాలు సత్య భామతో, సమం = సమముగా, శక్ర ఆద్యైః= ఇంద్రుడు మొదలయిన వారి చేత, మహితః = గౌరవింపబడితివి, కల్పతరుం = కల్ప వృక్షమును(కల్పతే ఫలదానాయా అసౌ తరుః-కోరికలను పూరించునది. కల్పతరువు), హృత్వా= (సత్యభామ కోరికపై) అపహరించి, రుషా= రోషముతో, అభిపతితం = మీదపడిన(దండెత్తిన), ఇంద్రమ్ = ఇంద్రుని, జిత్వా = జయించి, అభ్యాగమః= నీ నగరమునకు తిరిగి వచ్చితివి, తత్ తు= పారిజాత అపహరణముతో ఇంద్రునికి కలిగిన, శ్రీ మద దోష = ఐశ్వర్య మదము, ఈదృశ ఇతి= ఇలా ఉంటుందని, వ్యాఖ్యాతుమ్ ఏవ= లోకానికి వ్యాఖ్యానించటానికి, అకృథాః= అపహరణము చేసితివి.

**తాత్పర్యము:** నరకునిచే అపహరించబడిన ఆ అదితియొక్క కుండలములను తిరిగి ఇచ్చుటకు సత్యభామతో స్వర్గమునకు వెళ్లితివి. శచి, ఊర్వశి మొదలయిన దివ్య వనితలు సత్య భామ సోయగమును చూసి సిగ్గుపడుచుండగా అమెతో సమముగా ఇంద్రుడు మొదలయిన వారి చేత గౌరవింపబడితివి . కల్ప వృక్షమును సత్యభామ

కోరికపై అపహరించి రోషముతో దండెత్తిన ఇంద్రుని జయించి నీ నగరమునకు తిరిగి వచ్చితివి. పారిజాత అపహరణముతో ఇంద్రునికి కలిగిన ఐశ్వర్య మదము ఇలా ఉంటుందని లోకానికి వ్యాఖ్యానించటానికి అపహరణము చేసితివి.

**విశేషము:** తమ ప్రార్థనతో శ్రీకృష్ణుడు నరకుని బాధ తొలగించాడు కనుక దేవేంద్రునికి కృష్ణునిపట్ల కృతజ్ఞత ఉండాలి. కాని ఇంద్రుడు కృతజ్ఞత చూపలేదు. ఆగ్రహముతో కృష్ణుని ఎదుర్కొన్నాడు. కనుకనే కవి ఐశ్వర్య మదము ఇలా ఉంటుందని లోకానికి వ్యాఖ్యానించటానికి కృష్ణుడు పారిజాత వృక్ష అపహరణము చేసాడని వ్రాసారు.

**81-10 శ్లో.**

**కల్పద్రుం సత్యభామాభవనభువి సృజన్ ద్వ్యష్టసాహస్రయోషాః**
**స్వీకృత్య ప్రత్యగారం విహిత బహువపుర్లాలయన్ కేళిభేదైః ।**
**ఆశ్చర్యాన్నారదాలోకితవివిధగతిస్తత్ర తత్రాపి గేహే**
**భూయస్సర్వాసు కుర్వన్ దశ దశ తనయాన్ పాహి వాతాలయేశ ॥**

**ప్రతిపదార్థము:** కల్పద్రుం = దేవలోకమునుండి తెచ్చిన కల్పవృక్షమును, సత్యభామా భవన భువి= సత్యభామా గృహ ఉద్యానవనములో (పెరటిలో), సృజన్ = స్థాపించి, ద్వి అష్టసాహస్రయోషాః= పదహారు వేలమంది కన్యలను, స్వీకృత్య = స్వీకరించి (పెండ్లి చేసుకొని), ప్రతి అగారం= ప్రతి ఇంటిలోను నువ్వు ఉండునట్లుగా(అగాన్ ఋచ్ఛతి ప్రాప్నోతి గృహము, ఇల్లు), విహిత బహువపుః = అనేక రూపములు ధరించి, కేళిభేదైః = అనేక కేళీ విలాసములతో, లాలయన్= వారిని సుఖ పెట్టావు, ఆశ్చర్యాత్=ఆశ్చర్యముతో ('ఆః' ఇతి విస్మయస్య చర్యా ప్రకటనం అద్భుతమ్ విస్మయము ఆశ్చర్యము అసాధారణము), నారదా= నారదుడు, తత్ర తత్ర అపి గేహే= ఆయాయా ఇండ్లలో, ఆలోకితవివిధగతిః= నిన్ను వివిధ అవస్థలలో ఒకేసారి చూసి (ఆనందపడెను), భూయః = మరలా, సర్వాసు = ఆ వనితలలో అందరికి, దశ దశ తనయాన్ = ఒక్కొక్కరికి పదిమంది కుమారుల

చొప్పున, కుర్వన్ = అనుగ్రహించావు, వాతాలయేశ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, పాహి= రక్షింపుము.

**తాత్పర్యము:** దేవలోకమునుండి తెచ్చిన కల్పవృక్షమును సత్యభామా గృహ ఉద్యానవనములో స్థాపించి ,పదహారు వేలమంది కన్యలను పెండ్లి చేసుకొని , ప్రతి ఇంటిలోను నువ్వు ఉండునట్లుగా అనేక రూపములు ధరించి, అనేక కేళీ విలాసములతో వారిని సుఖ పెట్టావు. ఆశ్చర్యముతో నారదుడు ఆయాయా ఇండ్లలో నిన్ను వివిధ అవస్థలలో ఒకేసారి చూసి ఆనందపడెను ఆ వనితలలో అందరికి ఒక్కొక్కరికి పదిమంది కుమారుల చొప్పున అనుగ్రహించావు. ఓ గురువాయూరు కృష్ణ దేవా ! రక్షింపుము

***దశమ స్కంధము***

**81వ దశకము సమాప్తము**



# దశకమ్ 82 – బాణాసురయుద్ధము తథా నృగశాపమోక్షము

**82-1 శ్లో.**

**ప్రద్యుమ్నో రౌక్మిణేయస్స ఖలు తవ కలా శంబరేణాహృతస్తం**
**హత్వా రత్యా సహాప్తో నిజపురమహరద్ రుక్మికన్యాం చ ధన్యామ్ ।**
**తత్పుత్రోఽథానిరుద్ధో గుణనిధిరవహద్రోచనాం రుక్మిపౌత్రీం**
**తత్రోద్వాహే గతస్త్వం న్యవధి ముసలినా రుక్మ్యపి ద్యూతవైరాత్ ॥**

(స్రగ్ధర **మ , ర , భ , న , య , య , య**)

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, రౌక్మిణేయః= రుక్మిణికి జన్మించిన, సః ప్రద్యుమ్నః = ఆ ప్రద్యుమ్నుడు (ప్రకృష్టం ద్యుమ్నం బలం యస్య– బాగా బలం కలవాడు. ప్రద్యుమ్నుడు, కామదేవుడు), తవ కలా=నీ అంశముతో జన్మించినవాడు. ( విష్ణుదేవుని అంశ) (కలతే శోభతే అసౌ ప్రకాశించునది), తం = అతనిని, శంబరేణ= శంబరాసురుడు (శంబతి సజ్జనాన్ విరుద్ధం గచ్ఛతి సజ్జనులకు విరుద్ధంగా వెళ్లువాడు. శంబరాసురుడు), ఆహృతః= అపహరించాడు, హత్వా= సంహరించి(ప్రద్యుమ్నుడు శంబరాసురుని చంపి), రత్యా సహ = రతీదేవితో కలిసి, నిజపురమ్ ఆప్తః =ద్వారకానగరమునకు తిరిగి వచ్చెను, ధన్యామ్ =ధన్యురాలయిన, రుక్మికన్యాం చ= మేనమామయగు రుక్మి కూతురయిన రుక్మావతి అను పేరుగల దానిని, అహరత్= అపహరించి వివాహము చేసుకొనెను, తత్ పుత్రః = ప్రద్యుమ్ని కుమారుడు (పుతః తన్నామ్నో నరకాత్ త్రాయతే 'పుత్' అను నరకము నుండి రక్షించువాడు. పుత్రుడు), గుణనిధిః = గుణ నిధి అయిన, అనిరుద్ధః = అనిరుద్ధుడు (న కేనాపి యుద్ధేన నిరుద్ధః–యుద్ధంలో ఎవరిచేత కూడ నిరోధింపబడనివాడు. అనిరుద్ధుడు), రుక్మి పౌత్రీం= రుక్మి యొక్క పౌత్రిని (కొడుకు కూతురయిన) (పుత్రస్య అపత్యం స్త్రీ పుత్రుని కుమార్తె. మనుమరాలు), రోచనాం= రోచన అను పేరు గలదానిని (రోచయతి ప్రకాశయతి అసౌ ప్రకాశింప చేయునది, అందమైనది. వెలుతురు, అంతరిక్షము), అవహత్ = వివాహము చేసుకొనెను, త్వం =నువ్వు, గతః = ఆ వివాహమునకు వెళ్లావు, తత్ర ఉద్వాహే= ఆ వివాహమందు (ఉత్ సమ్యతే ఉహ్యతే అత్ర–వివాహము), ద్యూత వైరాత్= జూదమందు బలరాముడు

ఓడిపోవునట్లు చేసి తగవును రేపి(దీవ్యంతి క్రీడంతి ఏనమ్ దీనిని ఆడుదురు. ద్యూతము, జూదము కపటము), ముసలినా= బలరామునిచే(ముసలం ప్రహరణత్వే అస్తి అస్య–ముసలము (రోకలి) ఆయుధంగా కలవాడు. బలరాముడు), రుక్మి అపి=రుక్మిని (రుక్మం స్వర్ణం శోభా వా విద్యతే అస్య–బంగారము కలవాడు, కాంతి కలవాడు. ఒక రాజు), న్యవధి ఖలు= చంపించితివి కదా!

**తాత్పర్యము:** రుక్మిణికి జన్మించిన ఆ ప్రద్యుమ్నుడు నీ అంశకలవాడు. అతనిని శంబరాసురుడు అపహరించాడు. ప్రద్యుమ్నుడు శంబరాసురుని చంపి రతీదేవితో కలిసి ద్వారకానగరమునకు తిరిగి వచ్చెను. మేనమామయగు రుక్మి కూతురయిన రుక్మావతి అను పేరుగల దానిని అపహరించి వివాహము చేసుకొనెను. ప్రద్యుమ్ని కుమారుడు అనిరుద్ధుడు రుక్మి యొక్క పౌత్రిని (కొడుకు కూతురయిన) రోచన అను పేరు గలదానిని వివాహము చేసుకొనెను . నువ్వు ఆ వివాహమునకు వెళ్లావు. ఆ వివాహమందు జూదమందు బలరాముడు ఓడిపోవునట్లు చేసి తగవును రేపి బలరామునిచే రుక్మిని చంపించితివి కదా !

**82–2 శ్లో.**
**బాణస్య సా బలిసుతస్య సహస్రబాహోః**
**మాహేశ్వరస్య మహితా దుహితా కిలోషా ।**
**త్వత్పౌత్రమేనమనిరుద్ధమదృష్టపూర్వం**
**స్వప్నేఽనుభూయ భగవన్! విరహాతురాఽభూత్ ॥**

**(వసంతతిలకము తభజజగా)**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ పరమాత్మా! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య – ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), బలి సుతస్య= బలిచక్రవర్తి కుమారుడయిన(బల్యతే దీయతే రాజ్యే రాజగ్రాహ్యే భాగః రాజ్యమునందు ఇవ్వబడునది. రాజు తీసుకొను పన్ను బలి చక్రవర్తి), సహస్ర బాహోః= వేయి చేతులు కలిగిన (సమానం హసతి సమానంగా నవ్వునది. వేయి సంఖ్య), మాహేశ్వరస్య= శివ భక్తుడయిన (మహేశ్వరాత్ ఆగతం అధిగతం

వా మహేశ్వరుని నుండి పొందబడిన), బాణస్య=బాణునికి (బణనం శబ్దః, తదస్తి అస్య శబ్దము చేయునది. బాణము), మహితా= శ్లాఘ్యమైన (సద్గుణవతి యైన), ఉషా=ఉష అను పేరుగల, దుహితా కిల = కుమార్తె ఉన్నది కదా!, సా = ఆమె ఒకరోజు, త్వత్ పౌత్రమ్= నీ పౌత్రుడైన (పుత్రస్య అపత్యమ్ పుత్రుని సంతానము. మనుమడు), ఏనమ్ అనిరుద్ధమ్= అనిరుద్ధుని, అదృష్ట పూర్వం= మునుపెన్నడు చూడక పోయినప్పటికి, స్వప్నే= స్వప్నములో (స్వపితి తస్య భావః కర్మ – నిద్ర పోవుట కల గనుట), అనుభూయ=చూసి, విరహ ఆతురా= విరహమునకు, అభూత్ = లోనయ్యెను.

**తాత్పర్యము:** ఓ పరమాత్మా! బలిచక్రవర్తి కుమారుడయిన ,వేయి చేతులు కలిగిన, శివ భక్తుడయిన బాణునికి సద్గుణవతి యైన ఉష అను పేరుగల కుమార్తె ఉన్నది. ఆమె ఒకరోజు నీ పౌత్రుడైన అనిరుద్ధుని మునుపెన్నడు చూడక పోయినప్పటికి స్వప్నములో చూసి విరహమునకు లోనయ్యెను.

**విశేషాలు:** బలిచక్రవర్తి యొక్క పెద్దకొడుకు. ఇతఁడు వేయిచేతులు కలవాడు. శివునిగూర్చి ఘోరమైన తపస్సు చేసి తన పురద్వారమునందు అతడు కావలి ఉండునటుల వరము పడసెను. ఇతఁడు తనకు తెలియక తన కొమార్తె ఉష అను నామె కృష్ణుని పౌత్రుడు అగు అనిరుద్ధుని కూడెను అని అతనిని నాగపాశబద్ధుని చేయగా కృష్ణుఁడు ఇతనిపై దండెత్తిపోయి యుద్ధమునందు ఇతని సహస్ర బాహువులలో తొమ్మనూట తొంబదియాఱు చేతులను ఖండించి తన్ను శివుడు ప్రార్థింపగా నాలుగుచేతులతో ప్రాణము తీయక నిలిపి శివునితో నీభక్తులు అగు ప్రమథులలో వీడు ముఖ్యుడు అగును అని అనుగ్రహించి విడిచెను

**82–3 శ్లో.**

**యోగిన్యతీవ కుశలా ఖలు చిత్రలేఖా**
**తస్యాస్సఖీ విలిఖతీ తరుణానశేషాన్ ।**
**తత్రానిరుద్ధముషయా విదితం నిశాయాం**
**ఆనేష్ట యోగబలతో భవతో నికేతాత్ ॥** **(వసంతతిలకము తభజజగా)**

**ప్రతిపదార్థము:** యోగినీ =అణిమాది ఎనిమిది యోగ సిద్ధులు కలిగినది (అణిమ,

మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం), అతీవ కుశలా=చిత్ర కర్మాది కళలయందు మిగుల సమర్ధురాలయిన (కోశతి శ్లిష్యతి వ్యవహర్తుం జానాతి), తస్యాః సఖీ చిత్రలేఖా =ఆ ఉషా కన్య యొక్క చెలికత్తె అయిన చిత్ర లేఖ (చిత్రః లేఖః లేఖన శక్తిః యస్యాః–చిత్రంగా లిఖించునది. ఒక అప్సర), అశేషాన్ తరుణాన్ = ఒకరోజు యువకులందరి యొక్క చిత్ర పటములను (తరంతి కౌమారమ్ కౌమారమును దాటినవాడు. యుక్తవయస్కుడు), విలిఖతీ= చిత్రించి ఉషకు చూపుచుండగా, తత్ర = వారిలో, అనిరుద్ధమ్= అనిరుద్ధుని, ఉషయా విదితం=తన స్వప్నములో కనబడినవానిగా ఉష గుర్తించెను, నిశాయాం= ఒకరాత్రి, యోగ బలతః = చిత్రలేఖ తన యోగశక్తితో, భవతః నికేతాత్= నీ ఇంటినుండి (ద్వారక నుండి) అనిరుద్ధుని (నికేతంతి నివసంతి అత్ర–ఇక్కడ నివసింతురు. ఇల్లు), ఆనేష్ట ఖలు = తీసుకొని వచ్చి రాజ కుమార్తె వద్దకు చేర్చెను కదా!

**తాత్పర్యము:** అణిమాది ఎనిమిది యోగ సిద్ధులు కలిగినది (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం) చిత్ర కర్మాది కళలయందు మిగుల సమర్ధురాలయిన ఆ ఉషా కన్య యొక్క చెలికత్తె అయిన చిత్ర లేఖ ఒకరోజు యువకులందరి యొక్క చిత్ర పటములను చిత్రించి ఉషకు చూపుచుండగా వారిలో అనిరుద్ధుని తన స్వప్నములో కనబడినవానిగా ఉష గుర్తించెను. ఒకరాత్రి చిత్రలేఖ తన యోగశక్తితో నీ ఇంటినుండి (ద్వారక నుండి) అనిరుద్ధుని తీసుకొని వచ్చి రాజ కుమార్తె వద్దకు చేర్చెను కదా !

**82–4 శ్లో.**

**కన్యాపురే దయితయా సుఖమారమంతం**
**చైనం కథంచన బబంధుషి శర్వబంధౌ।**
**శ్రీనారదోక్తతదుదంతదురంతరోషైః**
**త్వం తస్య శోణితపురం యదుభిర్న్యరుంధాః॥**

**(వసంతతిలకము తభజజగా)**

**ప్రతిపదార్థము:** కన్యాపురే=ఆ ఉషా కన్య అంతః పురమునందు(కన్యతే దీప్యతే

కామ్యతే రూపము వలన ప్రకాశించునది. కన్య పెండ్లి గాని స్త్రీ కోరబడునది. కన్య), దయితయా= ప్రియురాలైన ఆమెతో (భర్తురభీష్టా భర్తకు ప్రియమైనది. భార్య), సుఖమ్ చ = సుఖముగా (సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః – ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), ఆరమంతం= అనిరుద్ధుడు క్రీడించెను, కథంచన= ఎట్లో ఈ విషయమును తెలుసుకొన్న(కేనాపి ప్రకారేణ–ఏ విధంగా? ఏదో విధంగా), శర్వబంధౌ =శివభక్తుడైనబాణుడు (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), ఏనం = ఈ అనిరుద్ధుని, బబంధుషి = నాగ పాశముతో బంధించెను, శ్రీనారద ఉక్త = శ్రీ నారదుని వలన, తత్ ఉదంత= ఈ అనిరుద్ధుని బంధన రూప వృత్తాంతమంతయూ తెలుసుకొని (ఉద్గతః అంతః నిర్ణయః యస్మాత్ దీనితో నిర్ణయం చేయుదురు. వృత్తాంతము సమాచారము), దురంత= అవధి లేని, రోషైః= కోపముతో, త్వం= నువ్వు, తస్య శోణితపురం = ఆ బాణుని రాజధానియగు శోణపురిని, యదుభిః = యాదవులతో కలిసి, న్యరుంధాః= ముట్టడించితివి.

**తాత్పర్యము:** ఆ ఉషా కన్య అంతః పురమునందు ప్రియురాలైన ఆమెతో సుఖముగా అనిరుద్ధుడు క్రీడించెను. ఎట్లో ఈ విషయమును తెలుసుకొన్న శివభక్తుడైనబాణుడు ఈ అనిరుద్ధుని నాగ పాశముతో బంధించెను. శ్రీ నారదుని వలన ఈ అనిరుద్ధుని బంధన రూప వృత్తాంతమంతయూ తెలుసుకొని అవధి లేని కోపముతో నువ్వు ఆ బాణుని రాజధానియగు శోణిత పురమును యాదవులతో కలిసి ముట్టడించితివి.

**82–5 శ్లో.**

**పురీపాలశ్శైలప్రియదుహితృనాథోఽస్య భగవాన్**
**సమం భూతవ్రాతైర్యదుబలమశంకం నిరరుధే ।**
**మహాప్రాణో బాణో ఝటితి యుయుధానేన యుయుధే**
**గుహః ప్రద్యుమ్నేన త్వమపి పురహంత్రా జఘటిషే ॥**

**(శిఖరిణి యమనస భవ)**

**ప్రతిపదార్థము:** శైలప్రియ దుహితృ నాథః= హిమవంతుని పుత్రికయగు పార్వతీదేవికి భర్త అయిన (శిలాః సంతి శిలలు కలది. పర్వతము), భగవాన్ =

శివుడు, అస్య పురీపాలః = ఈ శోణిత పురమునకు క్షేత్రపాలకుడు. (బాణునివాకిట నిలిచి శివుడు కావలి కాయుచుండును)(పూర్యతే ప్రాణిభిః–ప్రాణులచే నింపబడునది. పురము), భూతవ్రాతైః = తన భూతగణములతో(భవంతి భూమ్యామ్ భూమి యందుండునది. ప్రాణులు పిశాచములు), సమం=కలిసి, యదుబలమ్= నీ యాదవ బలమును, అశంకం= నిర్భయముగా, నిరరుధే= ఎదుర్కొనెను, మహాప్రాణః = మహా బలశాలి అయిన (మహాన్ దీర్ఘకాలస్థాయినః ప్రాణాః యస్య–చాలా కాలము జీవించువాడు), బాణః= బాణుడు, ఝటితి = వెంటనే, యుయుధానేన = యుయుధానుడు (సాత్యకి)అను యాదవునితో (యుద్ధ్యతే అసౌ యుద్ధం చేయువాడు, యోద్ధ. ఇంద్రుడు సాత్యకి), యుయుధే = యుద్ధము చేసెను, గుహః= గుహుడు (కుమారస్వామి) (గూహతి రక్షతి అసౌ రక్షించు(నది)వాడు.కార్తికేయుడు గుహుడు),ప్రద్యుమ్నేన=ప్రద్యుమ్నునితో, త్వమ్ అపి= నువ్వు కూడా, పురహంత్రా = త్రిపుర సంహారి అయిన శివునితో, జఘటిషే = యుద్ధము చేసిరి.

**తాత్పర్యము:** హిమవంతుని పుత్రికయగు పార్వతీదేవికి భర్త అయిన శివుడు ఈ శోణిత పురమునకు క్షేత్రపాలకుడు. తన భూతగణములతో కలిసి నీ యాదవ బలమును నిర్భయముగా ఎదుర్కొనెను . మహా బలశాలి అయిన బాణుడు వెంటనే యుయుధానుడు అను యాదవునితో యుద్ధము చేసెను. కుమారస్వామి ప్రద్యుమ్నునితో నువ్వు కూడా త్రిపుర సంహారి అయిన శివునితో యుద్ధము చేసిరి.

**82–6 శ్లో.**

**నిరుద్ధాశేషాస్త్రే ముముహుషి తవాస్త్రేణ గిరిశే**
**ద్రుతా భూతా భీతాః ప్రమథకులవీరాః ప్రమథితాః ।**
**పరాస్కందత్ స్కందః కుసుమశరబాణైశ్చ సచివః**
**స కుంభాండో భాండం నవమివ బలేనాశు బిభిదే॥(శిఖరిణి యమనస భవ)**

**ప్రతిపదార్థము:** నిరుద్ధ అశేష అస్త్రే = శంకరుని యొక్క సమస్త అస్త్రములను ఖండించి (నితరాం రుద్ధః అవరుద్ధః–నిరోధింపబడ్డవాడు), తవ అస్త్రేణ = నీ అస్త్రముచే (అస్యతే క్షిప్యతే అసౌ విసరబడునది. బాణము మొదలగునవి), గిరిశే =

శివుని (గిరౌ శేతే పర్వతమున వుండువాడు. శివుడు), ముముహుషి= మోహ పరవశుని చేసితివి, భీతాః = భయముతో, భూతాః = భూత గణములన్నియు, ద్రుతాః = పారిపోయాయి, ప్రమథ కుల వీరాః = ప్రమథ గణ వీరులు(ప్రమథతి హింసించువాడు. శివుని అనుచరుడు), ప్రమథితాః = పీడితులయ్యారు, కుసుమ శర బాణైః చ = మన్మథుని అవతారమైన ప్రద్యుమ్నుని బాణములతో, స్కందః = స్కందుడు(కుమారస్వామి) (స్కందతి శోషయతి దైత్యాన్ దైత్యులను బాధ పెట్టువాడు), పరాస్కందత్ = ప్రతి నివృత్తుడయ్యాడు.(తీవ్రముగా గాయపడి వెడలిపోయెను), సః సచివః కుంభాండః = ఆ బాణుని మంత్రియగు కుంభాండునిశిరస్సును, బలేన = బలరాముడు తన గదతో, నవమ్ భాండం ఇవ= పచ్చి కుండవలె (భణ్యతే భణతి వా, శబ్దం కరోతి శబ్దము చేయునది), ఆశు= వెంటనే, బిభిదే =విచ్చుకొనునట్లు చేసెను (పగుల కొట్టెను).

**తాత్పర్యము:** శంకరుని యొక్క సమస్త అస్త్రములను ఖండించి నీ అస్త్రముచే శివుని మోహ పరవశుని చేసితివి. భయముతో భూత గణములన్నియు పారిపోయాయి. ప్రమథ గణ వీరులు పీడితులయ్యారు. మన్మథుని అవతారమైన ప్రద్యుమ్నుని బాణములతో కుమారస్వామి తీవ్రముగా గాయపడి వెడలిపోయెను .ఆ బాణుని మంత్రియగు కుంభాండునిశిరస్సును బలరాముడు తన గదతో పచ్చి కుండవలె వెంటనే విచ్చుకొనునట్లు చేసెను .

**82-7 శ్లో.**

**చాపానాం పంచశత్యా ప్రసభముపగతే ఛిన్నచాపేఽథ బాణే**
**వ్యర్థేయాతే సమేతో జ్వరపతిరశనైరజ్వరి త్వజ్జ్వరేణ ।**
**జ్ఞానీ స్తుత్వాథ దత్త్వా తవ చరితజుషాం విజ్వరం స జ్వరోఽగాత్**
**ప్రాయోంతర్జ్ఞానవంతోఽపి చ బహుతమసా రౌద్రచేష్టా హి రౌద్రాః ॥**

(స్రగ్ధర **మ , ర , భ , న , య , య , య**)

**ప్రతిపదార్థము:** పంచశత్యా చాపానాం= అయిదువందల బాణములచే, ప్రసభమ్ = ప్రసభముగా (ప్రగతా సభా సభాధికారః యస్మాత్ బలాత్కారముగా), ఉపగతే= నీ పైకి వచ్చిన బాణుని (ఉప సమీపం గతః సమ్యక్ గతః జ్ఞాత దగ్గరకు వెళ్ళినది),

ఛిన్నచాపే= 'బాణములు ధనుస్సులు ఖండించబడగా(ఛిన్నః కృతచ్ఛిన్నః భిన్నః– ఛిన్నాభిన్నము చేయబడినది), బాణే = బాణుడు, వ్యర్థే యాతః= వ్యర్థముగా ఓడిపోయి తిరిగిపోయెను, అథ= అటుపిమ్మట, జ్వరపతిః = శివ జ్వరము(జ్వరతి జీర్ణో భవతి అనేన–దీనితో క్షీణించుదురు. జ్వరము), త్వత్ జ్వరేణ సమేతః = వెంటనే నీ విష్ణు జ్వరముతో యుద్ధము చేయగా, అశనైః = వెంటనే, అజ్వరి= నీ విష్ణు జ్వరము– శివ జ్వరమునకు అమిత తాపము కలిగించెను, జ్ఞానీ = శివ జ్వరము జ్ఞానము పొంది, స్తుత్వా= నిన్ను స్తుతించి, తవ చరితజుషాం = నీ చరితమును పొగుడువారికి, విజ్వరం= జ్వర బాధలుండవని (విగతః జ్వరః యస్య– జ్వరము తొలగినవాడు), దత్త్వా= అనుగ్రహించి, స జ్వరః = ఆ శివ జ్వరము, అగాత్ = వెడలిపోయెను, ప్రాయః = తరచుగా, అంతః జ్ఞాన్వన్తః అపి చ= మనస్సులో జ్ఞాన సంపన్నులయినప్పటికి, బహు తమసా= తమో గుణ ఆధిక్యము వలన, రౌద్రాః= రుద్రుని యొక్క అనుచరులు, రౌద్రచేష్టాః హి = రౌద్రచేష్టలు (క్రూరకార్యములు) చేయుచుందురు.

**తాత్పర్యము:** అయిదువందల బాణములచే బలాత్కారముగా నీ పైకి వచ్చిన బాణుని ధనుస్సులు ఖండించబడగా బాణుడు ఓడిపోయి తిరిగిపోయెను. అటుపిమ్మట శివ జ్వరము వెంటనే నీ విష్ణు జ్వరముతో యుద్ధము చేయగా వెంటనే నీ విష్ణు జ్వరము– శివ జ్వరమునకు అమిత తాపము కలిగించెను. శివ జ్వరము జ్ఞానము పొంది నిన్ను స్తుతించి నీ చరితమును పొగుడువారికి జ్వర బాధలుండవని అనుగ్రహించి ఆ శివ జ్వరము వెడలిపోయెను. తరచుగా మనస్సులో జ్ఞాన సంపన్నులయినప్పటికి తమో గుణ ఆధిక్యము వలన రుద్రుని యొక్క అనుచరులు రౌద్రచేష్టలు (క్రూరకార్యములు) చేయుచుందురు

**82–8 శ్లో.**

**బాణం నానాయుధోగ్రం పునరభిపతితం దర్పదోషాద్వితన్వన్**
**నిర్లూనాశేషదోషం సపది బుబుధుషా శంకరేణోపగీతః ।**
**తద్వాచా శిష్టబాహుద్వితయముభయతో నిర్భయం తత్ప్రియం తం**
**ముక్త్వా తద్దత్తమానో నిజపురమగమస్సానిరుద్ధస్సహోషః ॥**

(స్రగ్ధర **మ , ర , భ , న , య , య , య**)

**ప్రతిపదార్థము:** నానా ఆయుధ ఉగ్రం= భయంకరమైన అనేక ఆయుధాలతో (ఆయుధ్యతే అనేన–ఆయుధము), బాణం= బాణుడు, పునః = మరలా, అభిపతితం= నీతో యుద్ధము చేయుటకు వచ్చి, దర్ప దోషాత్= అహంకార దోషము వలన, నిర్లూన= ఛిన్నమైన, అశేషదోషం = అనేక దోషాలు కలవానిగా, వితన్వన్= తయారయ్యాడు (అతనికి ఉన్నఅనేక బాహువుల దోష గర్వము తొలగిపోయింది. అనగా అతనికి ఉన్న చేతులను విష్ణువు ఖండించాడని భావం), సపది= వెంటనే, బుబుధుషా= తాను మరియు విష్ణువు ఒక్కడే అని తెలుసుకొని, తత్ శంకరేణ వాచా= ఆ శంకరుడు అక్కడికి వచ్చి, ఉపగీతః = నిన్ను స్తుతింపగా, ఉభయతః = రెండు వైపులా, శిష్ట బాహు ద్వితయమ్= బాణుని రెండు బాహువులు మాత్రము ఖండింపక వదలిపెట్టితివి, నిర్భయం= నిర్భయముగా, తత్ ప్రియం = ఆ శివ భక్తుడైన, తం= బాణుని, ముక్త్వా= విడిచిపెట్టి (అనగా బాణునికి అభయము ఇచ్చి), తత్ దత్తమానః = ఆ బాణునిచే ఇవ్వబడిన కానుకలను స్వీకరించి, సహ ఉషః = ఉషతోను, స అనిరుద్ధః= అనిరుద్ధునితోను, నిజపురమ్= నీ ద్వారకానగరమునకు, అగమః= తిరిగి వచ్చితివి.

**తాత్పర్యము:** భయంకరమైన అనేక ఆయుధాలతో బాణుడు నీతో యుద్ధము చేయుటకు వచ్చాడు. అతనికి ఉన్న చేతులను నువ్వు ఖండించావు. ఆ శంకరుడు అక్కడికి వచ్చి నిన్ను స్తుతింపగా బాణుని రెండు బాహువులు మాత్రము ఖండింపక వదలిపెట్టితివి. బాణునికి అభయము ఇచ్చి అతనిచే ఇవ్వబడిన కానుకలను స్వీకరించి ఉషతోను, అనిరుద్ధునితోను నీ ద్వారకానగరమునకు తిరిగి వచ్చితివి.

**82–9 శ్లో.**

**ముహుస్తావచ్ఛక్రం వరుణమజయో నందహరణే**
**యమం బాలానీతౌ దవదహనపానేఽనిలసఖమ్ ।**
**విధిం వత్సస్తేయే గిరిశమిహ బాణస్య సమరే**
**విభో విశ్వోత్కర్షీ తదయమవతారో జయతితే ॥(శిఖరిణి)**

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, ముహుః= మరల, తావత్ = అప్పుడు, శక్రం = (ఇంద్రయాగ పారిజాతాపహరణ ఖాండవవనదహన

సందర్భములలో), ఇంద్రుని (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు), నందహరణే = నందుని హరించిన సందర్భంలో, వరుణమ్= వరుణుని (వృణోతి ఆచ్ఛాదయతి సర్వమ్, వ్రియతే జనైః–అన్నింటిని ఆచ్ఛాదించువాడు జనులచే వరింపబడువాడు. వరుణుడు), బాల ఆనీతౌ = గురుపుత్రుని తీసుకొని వచ్చుచున్నప్పుడు, యమం = యముని (యమయతి నియమయతి జీవానాం ఫలాఫలమ్ జీవుల ఫలాఫలములను నిర్ణయించువాడు. యముడు), దవదహనపానే = దావాగ్నిని ఆర్పు సందర్భములో, అనిల సఖమ్= అగ్నిని(అనిలస్య సఖా వాయువునకు మిత్రుడు. అగ్ని), వత్స స్తేయే = గోవత్సములను అపహరించినప్పుడు (వదతి అభీక్ష్ణం మాతరమ్ పదేపదే తల్లిని పిలుచువాడు. పిల్లవాడు, లేగదూడ.)(స్తేనస్య భావః–దొంగతనము), విధిం = బ్రహ్మను(విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ), ఇహ బాణస్య సమరే= ఈ బాణాసురునితో యుద్ధ సందర్భములో, గిరిశమ్ = పరమశివుని(గిరౌ శేతే పర్వతమున వుండువాడు. శివుడు), అజయః = జయించితివి, తత్= అందువలన, తే= నీయొక్క, అయమ్ అవతారః=ఈ కృష్ణావతారము (అవతరతి తస్య భావః దేవతలు మానుషరూపములో భూమిపై నవతరించుట), విశ్వ = విశ్వములోని అందరి దేవతల కంటె (అన్ని అవతారముల కంటె), ఉత్కర్షీ= మిన్నగా (ఉత్ ఉచ్చైః కర్షః కర్షణం ఉన్నతిర్వా ఉన్నతి), జయతి = జయించుచున్నది.(అలరారుచున్నది).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఇంద్రయాగ పారిజాతాపహరణ ఖాండవవనదహన సందర్భములలో ఇంద్రుని, నందుని హరించిన సందర్భంలో వరుణుని , గురుపుత్రుని తీసుకొని వచ్చుచున్నప్పుడు యముని, దావాగ్నిని ఆర్పు సందర్భములో అగ్నిని, గోవత్సములను అపహరించినప్పుడు బ్రహ్మను ఈ బాణాసురునితో యుద్ధ సందర్భములో పరమశివుని జయించితివి. అందువలన నీయొక్క ఈ కృష్ణావతారము విశ్వములోని అందరి దేవతలను (అన్ని అవతారములను) మిన్నగా జయించుచున్నది.

**82-10 శ్లో.**

**ద్విజరుషా కృకలాసవపుర్ధరం**
**నృగనృపం త్రిదివాలయమాపయన్ ।**
**నిజజనే ద్విజభక్తిమనుత్తమాం**
**ఉపదిశన్ పవనేశ్వర! పాహి మామ్ ॥** **(ద్రుత విలంబితము నభభర)**

**ప్రతిపదార్థము:** ద్విజ రుషా= తనకు దానము చేసిన గోవును మరియొక బ్రాహ్మణునికి కూడా దానము ఇచ్చాడని ఒక బ్రాహ్మణుడు శాపము ఇచ్చుట చేత(ద్విః జాయతే రెండుసార్లు పుట్టువాడు. బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యులు)( రుష్యతి తస్య భావః కర్మ వా కోపము), కృకలాస= ఊసరవెల్లి(కృకం కంఠం లాసయతి శోభాన్వితం కరోతి కంఠము అందముగా వుండునది. తొండ), వపు ధరం= శరీరమును ధరించిన(వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర - దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), నృగనృపం = నృగమహారాజుకు, త్రిదివ ఆలయమ్= స్వర్గమునకు (త్రయః బ్రహ్మాదయః దీవ్యంతి ప్రకాశంతే అత్ర-బ్రహ్మాదులు ముగ్గురు ఇక్కడ ప్రకాశింతురు. స్వర్గము), ఆపయన్= పంపితివి, నిజజనే= నీ వారికి, అనుత్తమాం = అనుత్తమమయిన(న ఉత్తమః యస్మాత్ తనకంటే ఉత్తముడు లేనివాడు. సర్వోత్తముడు), ద్విజ భక్తిమ్= బ్రాహ్మణ భక్తిని, ఉపదిశన్= ఉపదేశించితివి, పవనేశ్వర= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మామ్= నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** తనకు దానము చేసిన గోవును మరియొక బ్రాహ్మణునికి కూడా దానము ఇచ్చాడని ఒక బ్రాహ్మణుడు శాపము ఇచ్చుట చేత ఊసరవెల్లి శరీరమును ధరించిన నృగమహారాజుకు స్వర్గమునకు పంపితివి. నీ వారికి అనుత్తమమయిన బ్రాహ్మణ భక్తిని ఉపదేశించితివి ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నన్ను రక్షించు.

**విశేషాలు**

**నృగుడు:** వైవస్వతమనువు రెండవ కొడుకు. ఇక్ష్వాకుని తమ్ముడు. ఇతడు మహాఖ్యాతికి ఎక్కిన రాజు. వాపీకూపతటాక వనములు అనేకములు ఇతడు ప్రతిష్ఠచేసెను. అయినను ఇతడు ఒకప్పుడు అజ్ఞానముచే ముందు తాను ఒక

బ్రాహ్మణునికి దానము ఇచ్చిన గోవును మరల ఇంకొకనికి దానము ఇచ్చుటజేసి ఊసరవెల్లి అయి శ్రీకృష్ణుని సంస్పర్శన దర్శనములవలన ఆరూపముమాని దివ్యరూపధరుడును దివ్యవిమానారూఢుడును అయి దివమునకు చనియెను.

**దశమ స్కంధము**

**82వ దశకము సమాప్తము**



# దశకమ్ 83 – పౌణ్డ్రకవధ

**83–1 శ్లో.**

**రామేఽథ గోకులగతే ప్రమదాప్రసక్తే**
**హూతానుపేతయమునాదమనే మదాంధే ।**
**స్వైరం సమారమతి సేవకవాదమూఢో**
**దూతం న్యయుంక్త తవ పౌండ్రకవాసుదేవః ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** అథ= అటుపిమ్మట ఒకనాడు, రామే= బలరాముడు, గోకుల గతే= గోకులమునకు వెళ్లి, ప్రమదా ప్రసక్తే = గోపికలతో లోలుడై(ప్రకృష్టః మదః హర్షః అస్తి అస్యాః ఎప్పుడు సంతోషపడునది. ఉత్తమ స్త్రీ), హూత = తాను ఆహ్వానించినప్పటికి, అనుపేత = అనాగతురాలైన (రాని), యమునా= యమునానదిని, దమనే = పరాభవించాడు, మదాంధే = వారుణీ మదిర మదాంధుడై బలరాముడు, స్వైరం= ఆయమునలోనేవిశృంఖలముగా, సమారమతి = సంచరించాడు, సేవక వాద్త్రెః= తనసేవకులు చెప్పిన మాటలను అనుసరించి, మూఢః = మూఢుడై, పౌండ్రకవాసుదేవః = పౌండ్రకవాసుదేవుడు, తవ = నీ దగ్గరకు, దూతం = దూతను(దూయతే వార్తా వహనాదినా సందేశము తీసుకరావడం వలన, తీసుకపోవుట వలన కష్టపడువాడు. దూత), న్యయుంక్త = పంపాడు.

**తాత్పర్యము:** 1.ఒకనాడు బలరాముడు గోకులమునకు వెళ్లి అక్కడ గోపికలతో విహరిస్తూ,మత్తుడై యమునను తనదగ్గరకు రమ్మన్నాడు. రానందున ఆమెను పరాభవించాడు.ఆ యమునలోనే విశృంఖలముగా సంచరించాడు., పౌండ్రక వాసుదేవుడు తన సేవకులు చెప్పిన మాటలను అనుసరించి నీపై ఈర్ష్యతో నీదగ్గరకు తనదూతను పంపాడు.

**విశేషాలు**

**పౌండ్రక వాసుదేవుడు:** భారతంలో ఇతనికథ ఇది. భారతంలో కనిపించే పాత్ర.

కరూశ దేశం రాజు. కృష్ణుడు కైలాసానికి వెళ్లిన సమయంలో ద్వారకకు వెళ్లి తానే కృష్ణుడనని చెప్పి, సాత్యకి చేతిలో దెబ్బలు తిన్నాడు. తరువాత కాశి రాజును కూడగట్టుకొని ద్వారకపై దాడి చేసినప్పుడు కృష్ణుడి చేతిలో ఉభయులూ పరాజితులైనారు.

**83-2 శ్లో.**

**నారాయణోఽహమవతీర్ణ ఇహాస్మి భూమౌ**
**ధత్సే కిల త్వమపి మామకలక్షణాని ।**
**ఉత్సృజ్య తాని శరణం వ్రజ మామితి త్వాం**
**దూతో జగాద సకలైర్హసితస్సభాయామ్ ॥**

(వసంత తిలకము **త, భ, జ, జ, గా**(గగ))

**ప్రతిపదార్థము:** ఇహ భూమౌ = ఈలోకములో, అహమ్ = నేను, అవతీర్ణ = అవతరించిన(అవతీర్ణః స్నాతః పారంగతః స్నానము చేసినవాడు పారంగతుడు, ఒడ్డు దాటినవాడు, దిగినవాడు), నారాయణః= నారాయణుడను(నారా+ఆయన, నారా జలం అయనం స్థానం యస్య జలము నివాస స్థానంగా కలవాడు. విష్ణువు), అస్మి= అయి ఉన్నాను, త్వమ్ అపి = నువ్వు, మామక లక్షణాని= శంఖచక్ర గదాదులు, ధత్సే కిల= నువ్వు ధరించుచున్నావు, తాని = వాటిని, ఉత్సృజ్య = విడిచి పెట్టి, మామ్ = నన్ను, శరణం వ్రజ= శరణు కోరుము, ఇతి= అని ఈ విధముగా, సభాయామ్= సభలో (సహ భాంతి అభీష్టనిశ్చయార్థం ఏకత్రీభవంతి అత్ర అభీష్టనిశ్చయం కొరకు ఇక్కడ కూడుదురు), సకలైః= అందరు, హసితః = నవ్వుచుండగా, త్వాం= నీతో, దూతః = పౌండ్రక వాసుదేవుని దూత, జగాద = పలికాడు.

**తాత్పర్యము:** “నేను ఈ భూమిపై అవతరించిన నారాయణుడను. నా లక్షణములు అయిన శంఖచక్ర గదాదులు నువ్వు ధరించుచున్నావు . వాటిని విడిచి పెట్టి నన్ను సేవింపుము.” ఈ విధముగా పౌండ్రక వాసుదేవుని దూత చెప్పిన సందేశమును విని సభలోని వారందరూ నవ్విరి.

**83-3 శ్లో.**

**దూతఽథ యాతవతి యాదవసైనికైస్త్వం**
**యాతో దదర్శిథ వపుః కిల పౌండ్రకీయమ్ ।**
**తాపేన వక్షసి కృతాంకమనల్పమూల్య-**
**శ్రీకౌస్తుభం మకరకుండలపీతచేలమ్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా(గగ)** )

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, దూతే= దూత నీకు సందేశము వినిపించి, యాతవతి= వెళ్లిపోగా, యాదవ సైనికైః = కొందరు యాదవ సైనికులతో (యదోః గోత్రాపత్యం పుమాన్ యదువంశంలో పుట్టినవాడు. యాదవుడు), త్వం= నీవు, యాతః = అభినవవాసుదేవుని దగ్గరకు వెళ్లితివి, తాపేన = తప్త లోహముతో (ఇనుముకాల్చి), వక్షసి కృత అంకమ్= తన రొమ్మున వేసికొన్న శ్రీ వత్సాంకమును, అనల్పమూల్య= ఎంతోఖరీదు చెల్లించి కొనుక్కొని కంఠములో ధరించిన, శ్రీ కౌస్తుభం = కౌస్తుభమణిని(కుస్తుభ+అణ్, కుం భూమిం స్తుభ్నాతి కుస్తుభః సముద్రః తత్ర భవః సముద్రము నుండి పుట్టినది. కౌస్తుభమణి), మకర కుండలపీత చేలమ్= మకర కుండల పీతాంబరములను ధరించిన (మకర+కుండల, మకరాకృతి కుండలం కర్ణభూషణమ్ మకరాకృతి గల చెవులకు ధరించు అలంకారము)(పీతః వర్ణః అస్తి అస్య పసుపు రంగు కలది. పచ్చనిది పసుపు), పౌండ్రకీయమ్ వపుః = పౌండ్రక వాసుదేవుని రూపమును, దదర్శిథ కిల = చూసితివి కదా!

**తాత్పర్యము:** దూత నీకు సందేశము వినిపించి వెళ్లిపోగా నీవు కొందరు యాదవ సైనికులతో అభినవవాసుదేవుని దగ్గరకు వెళ్లితివి. అతడు ఇనుముకాల్చి తన రొమ్మున వేసికొన్న శ్రీ వత్సాంకమును, ఎంతోఖరీదు చెల్లించి కొనుక్కొని కంఠములో ధరించిన కౌస్తుభమణిని, మకర కుండల పీతాంబరములను ధరించిన పౌండ్రక వాసుదేవుని రూపమును చూచితివి.

**83-4 శ్లో.**

**కాలాయసం నిజసుదర్శనమస్యతోఽస్య**
**కాలానలోత్కరకిరేణ సుదర్శనేన ।**
**శీర్షం చకర్తిథ మమర్దిథ చాస్య సేనాం**
**తన్మిత్ర కాశిపశిరోఽపి చకర్థ కాశ్యామ్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా(గగ)** )

**ప్రతిపదార్థము:** కాల అయసం= ఉక్కుతో నిర్మించిన నల్లని తన చక్రమును వాడు నీపై విసరగా, నిజసుదర్శనమ్ = నీ సుదర్శనమును, అస్య= ఆ పౌండ్రకుని వైపు, అస్యతః = విసరితివి, కాల అనల ఉత్కర కిరేణ= కాలాగ్ని జ్వాలలను వెదజల్లుతున్న(ఉత్కరణం ఏకత్రీకరణం విస్తృతీకరణం ప్రోగు చేయుట కాళ్లు చేతులు విరుచుట ప్రోగు), సుదర్శనేన= సుదర్శనచక్రధారచే, శీర్షం= వానితల (శీర్యతే జరయా ముసలితనంలో క్షీణించబడునది. శిరస్సు), చకర్తిథ= కత్తిరించితివి, అస్య సేనాం = వాని సేనలను, మమర్దిథ చ= నశింపచేసితివి, తత్ మిత్ర= అట్లే వానికి సహాయముగా వచ్చిన మిత్రుడైన, కాశిప శిరః అపి= కాశీ రాజు యొక్క తలను కూడా, కాశ్యామ్= కాశీ నగరమందు, చకర్థ= పడునట్లు చేసితివి.

**తాత్పర్యము:** ఉక్కుతో నిర్మించిన నల్లని తన చక్రమును వాడు నీపై విసరగా, కాలాగ్ని జ్వాలలను వెదజల్లుతున్న నీ సుదర్శనచక్రధారచే వానితల కత్తిరించితివి. వాని సేనలను నశింపచేసితివి.అట్లే వానికి సహాయముగా వచ్చిన మిత్రుడైన కాశీ రాజు యొక్క తలను కాశీ నగరమందు పడునట్లు చేసితివి.

**83-5 శ్లో.**

**జాడ్యేన బాలకగిరా ఽపి కిలాహమేవ**
**శ్రీవాసుదేవ ఇతి రూఢమతిశ్చిరం సః ।**
**సాయుజ్యమేవ భవదైక్యధియా గతోఽభూత్**
**కో నామ కస్య సుకృతం కథమిత్యవేయాత్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా(గగ)** )

**ప్రతిపదార్థము:** జాడ్యేన = జాడ్యముచేత (బుద్ధి లేక) (జడస్య భావః జడత్వము శీతలత్వము), బాలక గిరా అపి= మందబుద్ధిచే (బాల ఏవ బాలకః బాలుడు, శిశువు)( గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము వాణి), అహమ్ ఏవ = నేనే, శ్రీవాసుదేవ= వాసుదేవుడనని(వసతి సర్వత్ర ఆత్మరూపేణ వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చ అంతట ఆత్మరూపంలో వుండువాడు. వాసుదేవుడు), ఇతి= భావించి, చిరం = చాలా కాలము, రూఢ మతిః= స్థిరమతియై, సః = అతడు, భవత్ ఐక్య ధియా= నీ సారూప్యభావనచేత, సాయుజ్యమ్ ఏవ= సాయుజ్యమును (సయుజః సహయోగస్య భావః సహ యునక్తి కలిసి యుండుట, వైష్ణవ మతంలో విష్ణువులో ఏకమగుట), గతః అభూత్= పొందాడు, కః నామ= ఈ లోకములో ఏజీవి, కస్య సుకృతం = ఏ పుణ్యము చేసికొన్నదో, కథమ్ ఇతి= ఎవరికి ఎట్లు, అవేయాత్ కిల= తెలియును? (తెలియదని భావము).

**తాత్పర్యము:** జాడ్యముచేత (బుద్ధి లేక) తెలివిలేక నేనే వాసుదేవుడనని భావించి నీ సారూప్యభావనచేత అతడు నీ సాయుజ్యసిద్ధి పొందాడు. ఈ లోకములో ఏజీవి ఏ పుణ్యము చేసికొన్నదో ఎవరికి ఎట్లు తెలియును? (తెలియదని భావము)

**83-6 శ్లో.**

**కాశీశ్వరస్య తనయోఽథ సుదక్షిణాఖ్యః**
**శర్వం ప్రపూజ్య భవతే విహితాభిచారః ।**
**కృత్యానలం కమపి బాణరణాతిభీతైః**
**భూతైః కథంచన వృతైస్సమమభ్యముంచత్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ) )

**ప్రతిపదార్థము:** అథ = అటుపిమ్మట, కాశీ ఈశ్వరస్య తనయః = ఆ కాశీరాజు కుమారుడు(తనోతి కులమ్ కులమును విస్తరించువాడు. కుమారుడు), సుదక్షిణ ఆఖ్యః= సుదక్షిణుడు అను పేరుగలవాడు, శర్వం = శివుని (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), ప్రపూజ్య = పూజించి, భవతే = నీ కొరకు, విహిత అభిచారః = అభిచార హోమము చేశాడు. (అభి ఆభిముఖ్యేన శత్రునాశార్థం అభిచారకరణమ్ శత్రువుల నాశనము కొరకు మంత్రతంత్రములు

ప్రయోగించుట బాణామతి మొదలగు క్షుద్రవిద్యల ప్రయోగము), కమపి = ఆహోమములో ఒకానొక, కృత్యా అనలం= కృత్య అను అనల శక్తి పుట్టగా(క్రియతే తత్ కర్మ కృత్యం కరణీయం కార్యం వా చేయబడునది చేయదగినది. కార్యము), సమమ్= దానితో, బాణ రణ = బాణునిరణమునందు బెదరిపారిపోయిన, అతి భీతైః=అతి భయంకరములైన, భూతైః = భూతములను, కథంచన వృతైః= ఏదోవిధముగా ఆ కృత్యను చుట్టుముట్టి అనుసరించుచుండగా, అభ్యముంచత్ = నీపై ప్రయోగించెను.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆ కాశీరాజు కుమారుడు సుదక్షిణుడు అను పేరుగలవాడు శివుని పూజించి అభిచార హోమము చేశాడు. అందులో కృత్యయను శక్తి పుట్టగా దానిని మరియు బాణునిరణమునందు బెదరిపారిపోయిన భూతములతో కలిపి నీపై ప్రయోగించెను.

**83-7 శ్లో.**

**తాలప్రమాణచరణామఖిలం దహంతీం**
**కృత్యాం విలోక్య చకితైః కథితోఽపి పౌరైః।**
**ద్యూతోత్సవే కిమపి నో చలితో విభో! త్వం**
**పార్శ్వస్థమాశు విససర్జిథ కాలచక్రమ్॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ) )

**ప్రతిపదార్థము:** విభో = ఓ గురు వాయూరు కృష్ణ దేవా! (విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), తాల ప్రమాణ చరణామ్= తాటిచెట్టు ప్రమాణముగల కాళ్ళతో (తలతి ప్రతిష్ఠితో ఉన్నతః భవతి ఉన్నతంగా వుండునది. తాడి చెట్టు), అఖిలం దహంతీం = ఆ కృత్య సమస్తమును దహించి వేయుచు ద్వారకను ప్రవేశించగా, కృత్యాం = ఆ కృత్యను, విలోక్య = చూసి, చకితైః = భయపడిన(చకితః భ్రాంతః భీతఃభ్రాంతి నొందినవాడు భయపడినవాడు), పౌరైః= ద్వారకాపురవాసులు, కథితః అపి = దానిరాకను నీకు విజ్ఞప్తి చేయగా, త్వం ద్యూత ఉత్సవే= నీవు ద్యూతక్రీడా కౌతుకములో ఉండి (దీవ్యంతి క్రీడంతి ఏనమ్ దీనిని ఆడుదురు. ద్యూతము, జూదము), కిమ్ అపి=

కొంచెము కూడా, న చలితః = కదలక, పార్శ్వస్థమ్= నీ పక్కనే ఉన్న (స్పృశ్యతే తాకబడునది. శరీరపు ప్రక్క భాగము), కాల చక్రమ్= కాలచక్రమును (కాలరూపచక్రమ్ చక్రాకారమున తిరుగు కాలము), ఆశు = వెంటనే(ఆశు శీఘ్రమ్ శీఘ్రము, తొందరగా), విససర్జిథ = కృత్యపైకి పంపితివి.

**తాత్పర్యము:** తాటి చెట్టు ప్రమాణం ఉన్న కాళ్లు కలిగిన ఆ కృత్య సమస్తమును దహించి వేయుచుండెను..ద్వారకాపురవాసులు భయపడి దానిరాకను నీకు విజ్ఞప్తి చేయగా, అపుడు నీవు ద్యూతక్రీడలో ఉండి కొంచెము కూడా కదలక నీ పక్కనే ఉన్న కాలచక్రమును కృత్యపైకి పంపితివి.

**83–8 శ్లో.**

**అభ్యాపతత్యమితధామ్ని భవన్మహాస్త్రే**
**హాహేతి విద్రుతవతీ ఖలు ఘోరకృత్యా ।**
**రోషాత్ సుదక్షిణమదక్షిణచేష్టితం తం**
**పుప్లోష చక్రమపి కాశిపురీమధాక్షీత్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** అమితమ్ = అమితమైన (న మితః పరిమితః–పరిమితి లేనిది అనంతమైన), ధామ్ని = తేజస్సు కలిగిన (ధీయతే ద్రవ్యజాతమస్మిన్ వస్తువులు పెట్టు చోటు. ఇల్లు ఆశ్రయము జ్యోతి), భవత్ మహా అస్త్రే = నీ సుదర్శన చక్రము, అభి ఆపతతి = తన మీదకు రాగా, ఘోరకృత్యా = ఆ భయంకరమైన కృత్య, హాహా ఇతి = చాలా భయపడి హాహా కారములు చేస్తూ, విద్రుతవతీ ఖలు= వెనక్కి పరిగెత్త సాగెను కదా!, అదక్షిణ చేష్టితం = అకృత్యమునకు పాల్పడిన (న దక్షిణా యత్ర– దక్షిణ లేని యజ్ఞము సరళము కానిది), తం సుదక్షిణమ్= ఆ సుదక్షిణుని, రోషాత్= రోషముతో, చక్రమ్ = సుదర్శన చక్రము (చకతి హంతి పరబలమ్ శత్రు సేనను సంహరించునది), పుప్లోష = కాల్చి వేసినది, కాశి పురీమ్ అపి = కాశీ నగరము ను కూడా, అధాక్షీత్ = కాల్చి వేసినది.

**తాత్పర్యము:** అమితమైన తేజస్సు గల నీ సుదర్శన చక్రము తన మీదకు రాగా కృత్య

చాలా భయపడి హాహా కారములు చేస్తూ వెనక్కి పరిగెత్త సాగెను. రోషముతో తనను ప్రయోగించిన సుదక్షిణుని ఆ కృత్య కాల్చి వేసినది. అటు పిమ్మట సుదర్శన చక్రము కృత్యతో పాటు కాశీ నగరము ను కూడా కాల్చి వేసినది.

**విశేషాలు**

**సుదక్షిణుడు:** పౌండ్రక వాసుదేవుని కొడుకు. ఇతఁడు తన తండ్రి కృష్ణునిచే చంపబడెను అను మాత్సర్యముచే శివునిగూర్చి ఘోరతపము సలిపి అతడు నుడివిన రీతిని అభిచారహోమము ఒనరింప అందుండి ఒక భయంకరము అయిన కృత్య వెడలి ద్వారకాపురము మీదికి రాగా కృష్ణుడు దాని నిలిపి, వీని చంపి కాశీ పురమును భస్మము కావించెను.

**83-9 శ్లో.**
**స ఖలు వివిదో రక్షోఘాతే కృతోపకృతిః పురా**
**తవ తు కలయా మృత్యుం ప్రాప్తుం తదా ఖలతాం గతః ।**
**నరకసచివో దేశక్లేశం సృజన్నగరాంతికే**
**ఝటితి హలినా యుధ్యన్నద్ధా పపాత తలాహతః ॥**

(హరిణి **న , స , మ , ర , స , వ(లగ)**)

**ప్రతిపదార్థము:** పురా = పూర్వము, రక్షోఘాతే= రావణసంహారకాలములో (రక్షత్యస్మాత్ ఇతని నుండి రక్షించుకొందురు. రాక్షసుడు), కృత ఉపకృతిః= శ్రీ రామ పక్షీయుడై ఉపకారము చేసి, స వివిదః = ఆ వివిదుడను వానరుడు, తవ తు కలయా = నీ నీ అంశ వలననే, మృత్యుం= మృతిని (మ్రియతే ప్రాణైః వియుజ్యతే ప్రాణములు వదలుట. మృత్యువు), ప్రాప్తుం = పొందవలెనని కోరుకొన్నాడు, తదా =అప్పుడు, ఖలతాం= దుష్టత్వాన్ని పొంది, నరక సచివః గతః= నరకాసురుని కి మంత్రి యై (సచి సమవాయః తథా సన్ వాతి వెంట వుండువాడు. మిత్రుడు మంత్రి), దేశక్లేశం= అన్ని దేశాలను (అందరిని), సృజన్ = బాధ పెట్టే వాడు, నగర అంతికే = ద్వారకా ప్రాంత వాసులను అతడు బాధపెట్టుచుండగా (అంతః సామీప్యం అస్తి అస్య-దగ్గర ఉండువాడు సమీపం, దగ్గర), ఝటితి = వెంటనే, హలినా= బలరామునితో, యుధ్యన్ = యుద్ధము చేయగా, తల=

బలరాముడు తన అరచేతితో (తలతి ప్రతిష్ఠితో భవతి ఉండునది. స్వరూపము అరచెయ్యి), అద్ధా = సులభముగా (అత్యతే అత్ తాం సంతతగమనం జ్ఞానం వా జ్ఞానం దధాతి సత్యము ముందర స్వచ్ఛము నిశ్చయము అధికము), ఆహతః = వివిదుని సాచికొట్టగా (ఆహతః తాడితః-కొట్టబడ్డవాడు దెబ్బలు తిన్నవాడు), పపాత ఖలు= అతడు మరణించెను కదా !

**తాత్పర్యము:** రావణసంహారకాలములో శ్రీరామచంద్రుని అవతార ములో ఉన్న నీకు వివిదుడను వానరుడు సాయపడినాడు. నీ అంశ వలననే తనకు మృత్యువు కలగ వలెనని కోరుకున్నాడు. నరకాసురునికి మంత్రియై అందరిని బాధ పెట్టే వాడు. ద్వారకా ప్రాంత వాసులను వివిదుడు బాధపెట్టుచుండగా సహించని బలరాముడు అరచేతితో అతనిని సాచికొట్టగా అతడు మరణించెను.

**విశేషాలు:** పోతన గారి భాగవతంలో వివిదుని పేరు ద్వివిదుడు (10-02-540పద్యం)

**83-10 శ్లో.**

**సాంబం కౌరవ్యపుత్రీహరణనియమితం సాంత్వనార్థీ కురూణాం**
**యాతస్తద్వాక్యరోషోద్ధృతకరినగరో మోచయామాస రామః ।**
**తే ఘాత్యాః పాండవేయైరితి యదుపృతనాం నాముచస్త్వం తదానీం**
**తం త్వాం దుర్బోధలీలం పవనపురపతే! తాపశాంత్యై నిషేవే ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** పవనపురపతే= ఓ గురువాయూరు కృష్ణ దేవ!, కౌరవ్య పుత్రీం= సుయోధనునికూతురయిన లక్షణను (కురోః అపత్యమ్ కురు సంతానము), హరణ = స్వయంవరమందు హరించిన (హరతి తస్య భావః కర్మ వా తీసుకపోవుట మోయుట మరొక ప్రదేశమునకు తీసుకొని వెళ్లుట దొంగిలించుట), సాంబం = సాంబుని (కృష్ణుని కొడుకు. తల్లి జాంబవతి), నియమితం= కౌరవులు కట్టివైచిరి(నియమితః కృత నియమః-నియమించబడినది. కట్టబడినది), సాంత్వనా అర్థీ = అది విని విరోధము మంచిది కాదని అనునయించుటకు

(సాంత్వయతి అసౌ ఓదార్చునది ఓదార్పు), కురూణాం = కౌరవుల దగ్గరకు, రామః = బలరాముడు, యాతః = వెళ్లి, తత్ వాక్య రోష = వారి అధిక్షేప వాక్యములకు కోపగించి, ఉద్ధృత కరినగరః = హస్తినగరమును పైకి ఎత్తి యమునలో ముంచబోగా భయపడిన కౌరవులు, మోచయామాస = సాంబుని విడిచిపెట్టిరి, తదానీం = అప్పుడు, తే= ఆ కౌరవులు, పాండవేయైః = భవిష్యత్తు లో పాండవుల చేత (పాండో రపత్యమ్), ఘాత్యాః = మరణింపవలసిన వారు, ఇతి= అని నీకు తెలుసుకనుక, తం యదు పృతనాం =ఆ యాదవ సైన్యమును (ప్రియతే వ్యాప్తా భవతి వ్యాపించి యుండునది. సేన), త్వం = నువ్వు , న అముచః = కౌరవుల మీదికి పంపలేదు, త్వాం = నువ్వు, దుర్బోధలీలం= అర్థము చేసుకొనుటకు వీలులేని లీలలు కలవాడివయిన నిన్ను ( దుర్బోధా లీలా యస్య), తాప శాంత్యై = తాప శాంతి కొరకు(తపతి అసౌ తపించునది. సంతాపము వేడి), నిషేవే = సేవింతును.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవ!సుయోధనునికూతురయిన లక్షణను సాంబుడు స్వయంవరమందు హరించెను.అప్పుడతనిని కౌరవులు కట్టివైచిరి. అది విని కౌరవులతో విరోధము మంచిది కాదని కౌరవులను అనునయించుటకు బలరాముడు వెళ్లాడు. వారు అతనిని తూలనాడిరి. అందువలన రోషముతో హస్తినగరమును ఎత్తి యమునలో ముంచబోగా భయపడిన కౌరవులు సాంబుని విడిచిపెట్టిరి. నీవు యాదవ సైన్యమును మరలించుకొని ద్వారకకు వచ్చితివి. ఆ కౌరవులు భవిష్యత్తు లో పాండవుల చేత మరణింపవలసి ఉన్నది. అందుకే కౌరవుల మీదికి నువ్వు సైన్యమును ప్రయోగించలేదు. నీ లీలలు అర్థము చేసుకొనుటకు చాలా కష్టము. తాపశాంతి సేసి నన్ను రక్షింపుము.

***దశమ స్కంధము***

**83వ దశకము సమాప్తము**

# దశకమ్ 84 – సమన్తపఞ్చకతీర్థయాత్ర – బన్ధుమిత్రాది సమాగమము

**84-1 శ్లో.**

**క్వచిదథ తపనోపరాగకాలే**
**పురి నిదధత్కృతవర్మకామసూనూ ।**
**యదుకులమహిళావృతస్సుతీర్థం**
**సముపగతోఽసి సమంతపంచకాఖ్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, క్వచిత్= ఒకనాటి, తపన ఉపరాగకాలే= సూర్య గ్రహణ సమయములో(తపతి అసౌ తపించువాడు. సూర్యుడు) (ఉపరంజనం సూర్యచంద్రయోః – సూర్యచంద్రగ్రహణము), పురి = ద్వారకాపురికి రక్షణగా, కృతవర్మ= కృతవర్మను, కామసూనూ =ప్రద్యుమ్ముని కుమారుడైన అనిరుద్ధులను, నిదధత్ = నియోగించి, యదుకులమహిళాఆవృతః = నీ పత్నులు మరియు ఇతర యాదవులతోను కలిసి(మహ్యతే పూజ్యతే పూజింపబడినది. స్త్రీ), సుతీర్థం = ఉత్తమ తీర్థమయిన కురుక్షేత్రమున ఉన్న, సమంతపంచక ఆఖ్యమ్= సమంతక పంచకమునకు (సమంతాత్ పంచకం నదపంచకం యత్ర–నలువైపులు ఐదు నదులు కల ప్రదేశము. కురుక్షేత్ర ప్రాంతము), సముపగతః అసి = గ్రహణస్నానాదులకై వెళ్ళితివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఒకనాడు సూర్య గ్రహణ సమయములో ద్వారకాపురికి రక్షణగా కృతవర్మను ప్రద్యుమ్ముని కుమారుడైన అనిరుద్ధులను నియోగించి నీ పత్నులు మరియు ఇతర యాదవులతోను కలిసి ఉత్తమ తీర్థమయిన కురుక్షేత్రమున ఉన్న సమంతక పంచకమునకు గ్రహణస్నానాదులకై వెళ్ళితివి.

**84-2 శ్లో.**

**బహుతరజనతాహితాయ తత్ర త్వమపి పునన్ వినిమజ్జ్య తీర్థతోయమ్ ।**
**ద్విజగణపరిముక్తవిత్తరాశిః సమమిలథాః కురుపాండవాదిమిత్రైః ॥**

**ప్రతిపదార్థము:** త్వమ్ అపి= నువ్వు కూడా (సహజంగానే నువ్వు పవిత్రుడవు కాని), బహుతరజనతాహితాయ= జనహితమును కోరి (జనులందరకు మార్గ దర్శకముగా ఉండుటకు), తత్ర= ఆ సమంతక పంచకములో, వినిమజ్య = స్నానాదులాచరించి(శుద్ధౌ నిమజ్జతి–స్నానము చేయుట శుద్ధి చేయుట), తీర్థతోయమ్= ఆ తీర్థ జలమును(తరతి పాపాదికం యస్మాత్ దీనితో పాపాదులను తరింతురు. తీర్థము పుణ్యక్షేత్రాలు), పునన్ =మరింత పవిత్రము చేసావు, ద్విజగణ= బ్రాహ్మణులకు, పరిముక్తవిత్తరాశిః= ధనరాశులను దానములు చేసి (త్యక్తః, ప్రాప్తమోక్షణ – వదలబడినది)(విత్తః ఖ్యాతః – ప్రసిద్ధి నొందినది), కురుపాండవ ఆదిమిత్రైః = కురుపాండవ బంధుమిత్రులను, సమమిలథాః = కలిసి కొంటివి.

**తాత్పర్యము:** నువ్వు జనహితమును కోరి, ఆ సమంతక పంచకములో స్నానాదులాచరించి ఆ తీర్థమును మరింత పవిత్రము చేసావు. బ్రాహ్మణులకు దానములు చేసి కురుపాండవ బంధుమిత్రులను కలిసి కొంటివి.

**84–3 శ్లో.**

**తవ ఖలు దయితాజనైస్సమేతా ద్రుపదసుతా త్వయి గాఢభక్తిభారా ।**
**తదుదితభవదాహృతిప్రకారైరతిముముదే సమమన్యభామినీభిః ॥**

**ప్రతిపదార్థము:** త్వయి = నీయందు, గాఢభక్తిభారా=ప్రగాఢమగు భక్తి కల (భజ్యతేసేవ భజనము, ఆరాధన విభాగము శ్రద్ధ), ద్రుపదసుతా= ద్రౌపది, తవ దయితాజనైః = నీ ప్రియపత్నులగు రుక్మిణి సత్యభామలను, సమేతా = కలిసి మాటలాడుచూ, తత్ ఉదిత= వారు చెప్పిన, భవత్ ఆహృతిప్రకారైః= నీవు తమను హరించి వరించిన ఆనాటి పెండ్లి ముచ్చటలు, అన్యభామినీభిః సమమ్ = సుభద్ర మొదలయిన వారితో కలిసి విని, అతిముముదే ఖలు= ఎంతో సంతోషించినది కదా!

**తాత్పర్యము:** నీయందు ప్రగాఢమగు భక్తి కల ద్రౌపది నీ ప్రియపత్నులగు రుక్మిణి సత్యభామలను కలిసి మాటలాడుచూ వారు చెప్పిన "నీవు(కృష్ణుడు) తమను హరించి వరించిన ఆనాటి పెండ్లి ముచ్చటలు "సుభద్ర మొదలయిన వారితో కలిసి విని ఎంతో సంతోషించినది కదా !

**84-4 శ్లో.**

**తదను చ భగవన్! నిరీక్ష్య గోపానతికుతుకాదుపగమ్య మానయిత్వా ।**
**చిరతరవిరహాతురాంగరేఖాః పశుపవధూస్సరసం త్వమన్వయాసీః ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ భగవంతుడా ! కృష్ణా ! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య- ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), తదను చ = ఆతరువాత, త్వం= నువ్వు, గోపాన్ = గ్రహణస్నానము కొరకు వచ్చిన గోపకులను, నిరీక్ష్య = చూసి, అతికుతుకాత్= అతికుతూహలముతో (ప్రేమతో), ఉపగమ్య = వారిదగ్గరకు వెళ్ళి, మానయిత్వా = గౌరవించి, చిరతర= ఎంతోకాలముగా, విరహ ఆతుర= నిన్ను చూడక నీ విరహముతో(విశేషేణ రహతి త్యజతి తస్య భావః-విరహము, విచ్ఛేదము), అంగరేఖాః =కృశించిన, పశుపవధూః = గోపికలను, సరసం = నీ సరసమైన మాటలతో(సహ రసేన జలేన ఆస్వాదేన చ-రసంతో కూడినది నీటితో, రుచితో కూడినది), అన్వయాసీః =సంతోష పెట్టి అనుసరించితివి.

**తాత్పర్యము:** ఓ భగవంతుడా ! కృష్ణా ! ఆతరువాత నువ్వు గ్రహణస్నానము కొరకు వచ్చిన గోపకులను చూసి అతికుతూహలముతో వారిదగ్గరకు వెళ్ళి గౌరవించి ,ఎంతోకాలముగా నిన్ను చూడక నీ విరహముతో కృశించిన గోపికలను నీ సరసమైన మాటలతో సంతోష పెట్టి అనుసరించితివి.

**84-5 శ్లో.**

**సపది చ భవదీక్షణోత్సవేన ప్రముషితమానహృదాం నితంబినీనామ్ ।**
**అతిరసపరిముక్త కంచులీకే పరిచయహృద్యతరే కుచే న్యలైషీః ॥**

**ప్రతిపదార్థము:** భవత్ ఈక్షణ ఉత్సవేన= నిన్ను చూసిన ఆనందంలో (ఈక్షణం దర్శనమ్ దర్శనము, చూచుట), సపది చ = వెంటనే(సహ పద్యతే వెంబడి వుండునది. తత్క్షణము), ప్రముషితమానహృదాం= నీ ఎడబాటువలన కలిగిన కష్టమంతయూపోగా (అపహృతః – దొంగిలించబడినది), నితంబినీనామ్ = ఆ గోపికలు(అతిశయితో నితంబో అస్తి అస్యాః-మంచి పిరుదులు గలది), అతిరస= అతిశయితమైన అన్యోన్యానురాగముచే, పరిముక్తః కంచులీకే= రవికల ముడులు

విడిపోగా (ఒళ్ళు తెలియని ఆనంద మైకంలో), పరిచయ హృద్యతరే= ఇదివరలో నీకు పరిచయమయి హృద్యతరమయిన(పరి విశేషేణ చీయతే జ్ఞాయతే అస్మాత్ ఇతరుల గురించి తెలుసుకొనుట పరిచయము)(హృదయస్య ప్రియః – హృదయమునకు ప్రియమైనది), కుచే= వారి కుచ వేదికలపై, న్యలైషీః= నువ్వు వాలితివి(గోపికలను కృష్ణుడు ఆలింగనము చేసుకొన్నాడని భావం).

**తాత్పర్యము:** నిన్ను చూసిన ఆనందంలో వెంటనే నీ ఎడబాటువలన కలిగిన కష్టమంతయూపోగా ఆ గోపికలు అతిశయితమైన అన్యోన్యానురాగముచే రవికల ముడులు విడిపోగా (ఒళ్ళు తెలియని ఆనంద మైకంలో) ఇదివరలో నీకు పరిచయమయి హృద్యతరమయిన వారి కుచ వేదికలపై నువ్వు వాలితివి. (గోపికలను కృష్ణుడు ఆలింగనము చేసుకొన్నాడని భావం)

**విశేషము:** భక్త హృదయము భగవంతుని హృదయము. కనుక కృష్ణుడు తన హృదయముతో అభేదమైన భక్త సంభరితలయిన గోపికల ఎదలపై వాలాడని కవి హృదయం. ఇది సజాతీయ సమ్మేళనము. క్షీర నీరాఖ్య పరిరంభణ సుఖమని ఇక్కడ సంస్కృత వ్యాఖ్యానము. క్షీరనీరన్యాయముతో యీ విలీనస్థితికి(బ్రహ్మానందస్థితికి) పోలిక.

**84-6 శ్లో.**

**రిపుజనకలహైః పునః పునర్మే సముపగతైరియతీ విలంబనాఽభూత్ ।**
**ఇతి కృతపరిరంభణే త్వయి ద్రాగతివివశా ఖలు రాధికా నిలిల్యే ॥**

**ప్రతిపదార్థము:** మే= నాకు, పునః పునః = మాటిమాటికి (వారం వారమ్ మళ్లీ మళ్లీ), రిపుజనకలహైః= శత్రువులతో ఏర్పడు కలహములు (రపతి వదతి అనిష్టమ్ అనిష్టమును చెప్పువాడు. శత్రువు), సముపగతైః = సంభవించుటచే, ఇయతీ = (నీ దగ్గరకు రాలేక) ఈ అధికమయిన(ఇదం పరిమాణం అస్య–ఇంత పరిమాణము కలది), విలంబనా = ఆలస్యము(విశేషేణ లంబతే తస్య భావః కర్మ వా వ్రేలాడుట ఆలస్యం చేయుట), అభూత్= జరిగినది, ఇతి= అని, త్వయి= నువ్వు, కృతపరిరంభణే= గాఢమయిన కౌగిలిలో చేర్చగా (పరిరంభః ఆలింగనమ్ కౌగిలింత), రాధికా =రాధాదేవి, ద్రాక్ = వెంటనే అతివివశురాలయి (ద్రాతి

శీఘ్రమ్ త్వరగా), నిలిల్యే ఖలు= నీలో ఐక్యమయ్యెను.

**తాత్పర్యము:** 'నాకు మాటిమాటికి శత్రువులతో ఏర్పడు కలహములు సంభవించుటచే నీ దగ్గరకు రాలేక ఈ అధికమయిన ఆలస్యము జరిగినది' అని నువ్వు గాఢమయిన కౌగిలిలో చేర్చగా రాధాదేవి వెంటనే అతివివశురాలయి నీలో ఐక్యమయ్యెను.

**84-7 శ్లో.**
**అపగతవిరహవ్యథాస్తదా తా రహసి విధాయ దదాథ తత్త్వబోధమ్ ।**
**పరమసుఖచిదాత్మకోఽహమాత్మేత్యుదయతు వఃస్ఫుటమేవ చేతసీతి ॥**

**ప్రతిపదార్థము:** తదా=అప్పుడు, రహసి= రహస్యముగా (రమంతే అస్మిన్ దీని యందు సంతోషింతురు. ఏకాంతము), తాః =ఆలింగనాదులతో, అపగతవిరహవ్యథాః విధాయ = గోపికల విరహవ్యధను హరించునట్లు చేసి , (అప దూరం గతఃపారిపోయినవాడు మరణించినవాడు), అహమ్ = నేను, పరమసుఖచిత్ ఆత్మకః = పరమానంద బోధ స్వరూపుడను, ఆత్మా = అందరి ఆత్మనుఅంతర్యామిని (అతతి సర్వత్ర వ్యాప్నోతి సర్వత్ర వ్యాపించి యున్నవాడు), ఇతి= ఈ విషయము, వః = మీ అందరి యొక్క, చేతసి = మనస్సులలో, స్ఫుటమ్ ఏవ = స్ఫుటముగా, ఉదయతు = ఉదయించుగాక (నిశ్చయజ్ఞానమైన బుద్ధి నా అనుగ్రహముచే మీకు ప్రకాశించుగాక), ఇతి = అను, తత్త్వబోధమ్ = తత్వ బోధను (తతో భావః తస్య భావో వా దాని స్వరూపము సత్యము), దదాథ= గోపికలకు అనుగ్రహించితివి.

**తాత్పర్యము:** అప్పుడు రహస్యముగా ఆలింగనాదులతో గోపికల విరహవ్యధను హరించునట్లు చేసి , వారితో కృష్ణుడు ఇలా అన్నాడు. "నేను పరమానంద బోధ స్వరూపుడను అందరి ఆత్మను. అంతర్యామిని. ఈ విషయము మీ అందరి యొక్క మనస్సులలో స్ఫుటముగా ఉదయించుగాక (నిశ్చయజ్ఞానమైన బుద్ధి నా అనుగ్రహముచే మీకు ప్రకాశించుగాక )" ఈ విధముగా తత్వ బోధను గోపికలకు కృష్ణుడు అనుగ్రహించాడు.

**విశేషాలు**

**ఆత్మా :** నేను అనే భావం. స్ఫురణ అదే స్వరూపమీ అనాత్మ ప్రపంచానికంతటికీ. కనుక ఆత్మ అంటే స్వరూపం.

సత్తు ఉండటం. చిత్తు ఉన్నట్టు స్ఫురించటం. ఇవి రెండే దీని లక్షణాలు. ఇవి ఆత్మకే కాక దానికి గోచరించే అనాత్మకు కూడా కన్పిస్తున్నాయి. కాబట్టి ఆత్మానాత్మలుగా భాసించే రెండూ నిజానికి ఆత్మే అని అద్వైత సిద్ధాంతం. దీనికే ఏకాత్మ, సర్వాత్మ అని పేరు. 'ఆ సమంతాత్ తనోతీతి ఆత్మా.' సర్వవ్యాపకమని నిర్వచనం. 'యదాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయనిహ యచ్చాస్య సంతతోభావః తదాత్మేతి ప్రకీర్త్యతే.' ఏది వ్యాపిస్తుందో, వ్యాపించి ఏది గ్రహిస్తుందో, గ్రహించి ఏది కబళించి తనలో కలుపుకుంటుందో, కలుపుకొని ఏది అవిచ్ఛిన్నంగా నిలిచిపోతుందో అది ఆత్మ అని ఆత్మశబ్దానికి పెద్దలు మరొక నిర్వచనం చెప్పారు. అది నేనని జ్ఞానమే. నావరకే అయితే అది స్వరూపం. సర్వత్రా వ్యాపిస్తే విభూతి.

**84-8 శ్లో.**

**సుఖరసపరిమిశ్రితో వియోగః కిమపి పురాభవదుద్ధవోపదేశైః ।**
**సమభవదముతః పరం తు తాసాం పరమసుఖైక్యమయీ భవద్విచింతా ॥**

**ప్రతిపదార్థము:** పురా = పూర్వము గోపికలు (పూర్వే భవః పూర్వపు దిశ ముందున్నది ముందు జరిగినది), ఉద్ధవ ఉపదేశైః = ఉద్ధవునిచే నువ్వు పంపిన ఉపదేశముచే (ఉపదిశ్యతే అనేన మంత్రాది శిక్షణమ్ ఉపదేశము. శాస్త్రోపదేశము మంత్రోపదేశము), సుఖరసపరిమిశ్రితః = ఆనందము మిశ్రితమయి, వియోగః తు = వియోగ దుఃఖము (విగతః యోగః మేలనం అసౌ వియోగము, ఎడబాటు), కిమపి అభవత్ = కొంచెమైనది, అముతః పరం = . ఇపుడు సాక్షాత్తుగా నువ్వు చేసిన ఉపదేశముచే(అముతః= అముష్మాదిత్యర్థే వీనివలన), తాసాం = వారియొక్క, భవత్ విచింతా = నిన్నుగూర్చిన చింతన ( ధ్యాస)( చింతా చింతనమ్ ఆలోచనము. చింత), పరమసుఖ ఐక్యమయీ = పరమానందానుభూతిలో, సమభవత్ = వారిని లీనము చేసినది.

**తాత్పర్యము:** పూర్వము గోపికలు ఉద్ధవునిచే నువ్వు పంపిన ఉపదేశముచే ఆనందము మిశ్రితమయి వియోగ దుఃఖము కొంచెమైనది . ఇపుడు సాక్షాత్తుగా నువ్వు చేసిన ఉపదేశముచే నిన్ను గూర్చిన చింతన (ధ్యాస) పరమానందానుభూతిలో వారిని లీనము చేసినది.

**84-9 శ్లో.**

**మునివర నివహైస్తవాథ పిత్రా దురితశమాయ శుభాని పృచ్ఛ్యమానైః ।**
**త్వయి సతి కిమిదం శుభాంతరైరిత్యురుహసితైరపి యాజితస్తదాసౌ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, తవ పిత్రా = నీ తండ్రి వసుదేవుడు, దురితశమాయ =దుష్కర్మ నివృత్తి కొరకు ఆచరించవలసిన (పాపనివారణకొరకు) (దుష్టం ఇతం గమనం నరకాది ప్రాప్తిః అనేన-దీనితో నరకమును పొందుదురు. పాపము దురాచారము), శుభాని = పుణ్య కర్మలు ఏమని, పృచ్ఛ్యమానైః =అడుగగా, మునివరవివహైః = ఆమునిశ్రేష్ఠులు, త్వయి సతి = సకలశుభాస్పదుడయిన పుత్రుడు ఉండగా, శుభాంతరైః కిమ్ ఇదం = ఇతర పుణ్య కర్మలు ఎందుకు?, ఇతి =అని, ఉరుహసితైః = నవ్వుచూ పలికిరి, అపి =అయినను, తదా=అప్పుడు, అసౌ = ఆ వసుదేవుడు, యాజితః = యజ్ఞము చేసాడు.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీ తండ్రి వసుదేవుడు పాపనివారణకొరకు ఆచరించవలసిన పుణ్య కర్మలు ఏమని అడుగగా ఆమునిశ్రేష్ఠులు సకల శుభాస్పదుడయిన పుత్రుడు ఉండగా ఇతర పుణ్య కర్మలు ఎందుకు? అని నవ్వుచూ పలికిరి. అయినను అప్పుడు ఆ వసుదేవుడు యజ్ఞము చేసాడు.

**84-10 శ్లో.**

**సుమహతి యజనే వితాయమానే ప్రముదితమిత్రజనే సహైవ గోపాః ।**
**యదుజనమహితాస్త్రిమాసమాత్రం భవదనుషంగరసం పురేవ భేజుః ॥**

**ప్రతిపదార్థము:** ప్రముదితమిత్రజనే= మిత్రులందరు సంతోషించుచుండగా (ప్రముదితః ఆహ్లాదితః సంతోషించినవాడు), సుమహతి యజనే = ఆ మహా యజ్ఞము (ప్రాయశ్చిత్తమనునది అవసరములేని సత్రయాగము) (ఇజ్యతే

యాగము, యజ్ఞము), వితాయమానే= జరుగుచుండగా, గోపాః సహ ఏవ= గోపాలకులు,గోపికలను,యదుజనమహితాః=యాదవులు తమతో సమానముగా గౌరవించగా, త్రిమాసమాత్రం = మూడు నెలలవరకు, పురా ఇవ = మునుపటివలెనె అందరు, భవత్= నీయొక్క, అనుషంగరసం= సమాగమ సంతోషములను (అను సంగః సంబంధః సాహచర్యో వా ఆసక్తి, సంబంధము కలిసి యుండుట), భేజుః= అనుభవించారు.

**తాత్పర్యము:** మిత్రులందరు సంతోషించుచుండగా వసుదేవుని యొక్క మహా యజ్ఞము (ప్రాయశ్చిత్త మనునది అవసరములేని) జరుగుచుండగా గోపాలకులు, గోపికలను యాదవులు తమతో సమానముగా గౌరవించగా మూడు నెలలవరకు మునుపటివలెనె అందరు నీయొక్క సమాగమ సంతోషములను అనుభవించారు.

**84-11 శ్లో.**

**వ్యపగమసమయే సమేత్య రాధాం దృఢముపగూహ్య నిరీక్ష్య వీతఖేదామ్ ।**
**ప్రముదితహృదయః పురం ప్రయాతః పవనపురేశ్వర! పాహి మాం గదేభ్యః ॥**

**ప్రతిపదార్థము:** పవనపుర ఈశ్వర= ఓ గురువాయూరు కృష్ణదేవా!, వ్యపగమసమయే= వియోగ కాలమునందు (వసుదేవు ని యాగము పూర్తయిన తరువాత నీవు బయలుదేరు సమయమున)(విశేషేణ అపగచ్ఛతి విసృజతి తస్య భావః కర్మ వావిసర్జనము), రాధాం సమేత్య = రాధ దగ్గరికి వెళ్ళి (రాధ్నోతి సాధయతి కార్యాణి కార్యములను సాధించునది. రాధ), దృఢమ్ ఉపగూహ్య= గాఢముగా కౌగిలించుకొని (ఉపగూహితుం యోగ్యః-ఆలింగనము చేయుటకు తగినవాడు), వీతఖేదామ్ = విరహబాధ తొలగిన(గతః-వెళ్లిపోయిన), నిరీక్ష్య= ఆమెను చూసి, ప్రముదితహృదయః= సంతోషించిన హృదయము కలవాడయి, పురం= నీ ద్వారకా నగరమునకు, ప్రయాతః = బయలుదేరితివి, మాం = నన్ను, గదేభ్యః= రోగముల నుండి (గద్యతే పీడ్యతే అనేన-దీనితో పీడింపబడును. గద (రోగము), పాహి= రక్షింపుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా ! వసుదేవు ని యాగము పూర్తయిన తరువాత నీవు బయలుదేరు సమయమున రాధ దగ్గరికి వెళ్ళి గాఢముగా కౌగిలించుకొని విరహబాధ తొలగిన ఆమెను చూసి సంతోషించిన హృదయము కలవాడయి నీ ద్వారకా నగరమునకు బయలుదేరితివి. నన్ను రోగముల నుండి రక్షింపుము.

**దశమ స్కంధము**

**84వ దశకము సమాప్తము**



## దశకమ్ 85 – జరాసన్ధవధం – శిశుపాలవధ

**85–1 శ్లో.**

**తతో మగధభూ భృతాచిరనిరోధసంక్లేశితం**
**శతాష్టకయుతాయుతద్వితయమీశ భూమీభృతామ్ ।**
**అనాథశరణాయతే కమపి పూరుషం ప్రాహిణోత్**
**అయాచత స మాగధక్షపణమేవ కిం భూయసా ॥**

**ప్రతిపదార్థము:** ఈశ =ఓ ఈశా! (ఈశ = ఐశ్వర్యే), తతః = తరువాత, మగధభూభృతా= మగధరాజగు జరాసంధునిచేత (భువం బిభర్తి పాలయతి భూమిని పాలించువాడు. రాజు), చిరనిరోధ =చిరకాలముగా గిరిగుహాలో నిరోధించబడి (నితరాం రోధః అవరోధః–ఆపుట కట్టివేయుట), సంక్లేశితం= బాధింపబడిన, శత అష్టకయుత అయుతద్వితయమ్ = ఇరువదివేల యెనిమిదివందల మంది (అష్ట శతోత్తర అయుత ద్వయం), భూమీభృతామ్ = రాజులు, అనాథశరణాయ = అనాథనాథుడవు(నాస్తి నాథః యస్య నాథుడు లేనివాడు. అనాథ), తే= నీవని విని, కిం భూయసా= విజ్ఞప్తితో, సః మాగధక్షపణమ్ ఏవ = ఆ జరాసంధుని చంపుమని, అయాచత = వేడుకొనుచూ, కమపి = ఒక, పూరుషం = పురుషుని (దూతను) (పురి శేతే, పురతి అగ్రగచ్ఛతి పురుషుడు), ప్రాహిణోత్= నీదగ్గరకు రాయబారిగా పంపిరి.

**తాత్పర్యము:** ఓ ఈశా! తరువాత మగధరాజగు జరాసంధునిచేత చిరకాలముగా గిరిగుహాలో నిరోధించబడి బాధింపబడిన ఇరువదివేల యెనిమిదివందల మంది రాజులు –అనాథనాథుడవు నీవని విని ఆ జరాసంధుని చంపుమని వేడుకొనుచూ ఒక దూతను నీదగ్గరకు రాయబారిగా పంపిరి.

**85–2 శ్లో.**

**యియాసురభిమాగధం తదను నారదోదీరితాత్**
**యుధిష్ఠిరమఖోద్యమాదుభయకార్యపర్యాకులః ।**

**విరుద్ధ జయినోధ్వరా దుభయ సిద్ధిరిత్యుద్ధవే**
**శశంసుషి నిజైః సమం పురమియేథ యౌధిష్ఠిరీమ్ ॥**

**ప్రతిపదార్థము:** అభిమాగధం=దూత చెప్పిన మాటలు విని జరాసంధుని జయించుటకు, యియాసుః = నువ్వు బయలుదేరావు, తదను = ఆసమయముననే వచ్చిన, నారద= నారదుడు చెప్పిన, ఉదీరితాత్= మాటల వలన, యుధిష్ఠిరమఖ= ధర్మరాజు యజ్ఞ (యుధి యుద్ధే స్థిరః, యుధి తిష్ఠతి యుద్ధంలో వుండువాడు. ధర్మరాజు)( మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము), ఉద్యమాత్= ఉద్యమము వలన (రాజసూయము చేయించుచున్నాడని తెలిసెను) (ఉద్యమ్యతే ఆయాస్యతే శరీరాదికం యస్మిన్ ఉద్యోగము పరిశ్రమ కాయకష్టము), ఉభయకార్యపర్యాకులః= ఉభయ కార్యములలో ఎక్కడికి ముందుకు పోవలెనని ఆలోచించుచుండగా, అధ్వరాత్ =రాజసూయ యాగమున(అధ్వానం సత్పథం రాతి సన్మార్గమును చూపునది. యజ్ఞము), విరుద్ధ జయినః = శత్రువులను జయించుట తప్పక కావాలి, ఉభయకార్య సిద్ధిః= కనుక ఆ రాజసూయ యాగమునకు పోయినందువలన ఉభయ కార్య సిద్ధి అగునని, ఉద్ధవే = ఉద్ధవుడు, శశంసుషి = సలహా ఇవ్వగా, నిజైః సమం = నీ ఆత్మీయులతో (బంధువులతో) కలిసి, యౌధిష్ఠిరీమ్ పురమ్= యుధిష్ఠిరుని పురమగు ఇంద్రప్రస్థమునకు, ఇయేథ = వెళ్ళితివి.

**తాత్పర్యము:** దూత చెప్పిన మాటలు విని జరాసంధుని జయించుటకు నువ్వు బయలుదేరావు. ఆసమయముననే వచ్చిన నారదుడు చెప్పిన మాటల వలన ధర్మరాజు రాజసూయము చేయించుచున్నాడని తెలిసెను .ఉభయ కార్యములలో ఎక్కడికి ముందుకు పోవలెనని నువ్వు ఆలోచించుచుండగా రాజసూయ యాగమున శత్రువులను జయించుట తప్పక కావాలి. కనుక ఆ రాజసూయ యాగమునకు పోయినందువలన ఉభయ కార్య సిద్ధి అగునని ఉద్ధవుడు సలహా ఇవ్వగా నీ ఆత్మీయులతో (బంధువులతో) కలిసి యుధిష్ఠిరుని పురమగు ఇంద్రప్రస్థమునకు వెళ్ళితివి.

**85-3 శ్లో.**

**అశేషదయితాయుతే త్వయి సమాగతే ధర్మజో**
**విజిత్య సహజైర్మహీం భవదపాంగసంవర్ధితైః ।**
**శ్రియం నిరుపమాం వహన్నహహ భక్తదాసాయితం**
**భవంతమయి! మాగధే ప్రహితవాన్ సభీమార్జునమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి= కృష్ణా!, అశేషదయితాయుతే = రుక్మిణి మొదలుగాగల 16000మంది భార్యలతో, త్వయి= నువ్వు, సమాగతే= రాగా, భవత్ అపాంగ=నీకటాక్ష వీక్షణములతో (అప అంగతి = వక్రం గచ్ఛతి చక్షుః యత్ర- కన్ను కొనభాగము), సంవర్ధితైః=వర్ధిల్లిన శక్తి కలిగిన, సహజైః = తన తమ్ముల ద్వారా (సహ జాయతే తోడబుట్టినవాడు పుట్టుకతో వచ్చునది), మహీం= సమస్త భూమండలమును (మహ్యతే పూజ్యతే పూజింపబడునది. భూమి), విజిత్య = జయించి, నిరుపమాం = నిరుపమానమయిన (పోల్చలేని), శ్రియం = దిగ్విజయములో లబ్ధమయిన సంపదను, వహన్ = వహించిన, ధర్మజః చ= ధర్మరాజు, భక్తదాస ఆయితం= భక్తులకు దాసుడవయిన, భవంతమ్= నిన్ను, సభీమార్జునమ్=తమ్ములగు భీమార్జునులతో, మాగధే =మగధపై యుద్ధము చేయుటకు, ప్రహితవాన్ = పంపెను, అహహ= ఇది ఆశ్చర్యము.

**తాత్పర్యము:** కృష్ణా! రుక్మిణి మొదలుగాగల 16000మంది భార్యలతో నువ్వు రాగా నీకటాక్ష వీక్షణములతో వర్ధిల్లిన శక్తి కలిగిన తన తమ్ముల ద్వారా సమస్త భూమండలమును జయించి నిరుపమానమయిన దిగ్విజయములో లబ్ధమయిన సంపదను పొందిన ఆ ధర్మరాజు -భక్తులకు దాసుడవయిన నిన్ను తమ్ములగు భీమార్జునులతో మగధపై యుద్ధము చేయుటకు పంపెను .ఇది ఆశ్చర్యము.

**85-4 శ్లో.**

**గిరివ్రజపురం గతాస్తదను దేవ! యూయం త్రయో**
**యయాచ సమరోత్సవం ద్విజమిషేణ తమ్మాగధమ్ ।**
**అపూర్ణసుకృతం త్వముం పవనజేన సంగ్రామయన్**
**నిరీక్ష్య సహ జిష్ణునా త్వమపి రాజయుద్ధ్వా స్థితః ॥**

**ప్రతిపదార్థము:** దేవ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తదను=అప్పుడు, యూయం త్రయః = మీరు ముగ్గురూ, ద్విజమిషేణ= బ్రాహ్మణుల వేషములను ధరించి (ద్విః జాయతే రెండుసార్లు పుట్టువాడు), గిరివ్రజపురం = మగధరాజధానియగు గిరివ్రజమును, గతాః= చేరిరి, తం మాగధమ్= జరాసంధుని (మగధ జనపదస్య అధిపః క్షత్రియః–మగధ దేశపు రాజు, మగధ దేశపు క్షత్రియ (అక్షత్రియుడు కాని) రాజు, సమర ఉత్సవం =ఆ యుద్ధ ఉత్సవము(మల్లయుద్ధమును), యయాచ =అడిగిరి, అపూర్ణసుకృతం =ఇంకా పూర్తి కాని సుకృతము కలిగిన (నీచేత చనిపోవుటకు తగిన పుణ్యము పూర్తికాని) (సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము), అముం = ఆ జరాసంధుని, పవనజేన = భీమునితో(పవనస్య తనయః వాయుపుత్రుడు. భీముడు), సంగ్రామయన్= యుద్ధము చేయుటకు పంపి, త్వమ్ అపి తు = నువ్వు కూడా, జిష్ణునా సహ= అర్జునునితో కలిసి(జయతి జయశీలః జయము కలవాడు. అర్జునుడు), రాజయుద్ధ్వా= వారి యుద్ధమును (రాజ్ఞా సహయోధితవాన్ (రాజపక్షే యోధితవాన్ – రాజుతో కలిసి యుద్ధము చేసినవాడు రాజు పక్షమున యుద్ధమును చేసినవాడు), నిరీక్ష్య = చూసి స్థితః= నిలుచుంటిరి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! అప్పుడు మీరు ముగ్గురూ బ్రాహ్మణుల వేషములను ధరించి మగధరాజధానియగు గిరివ్రజమును చేరిరి. మీరు జరాసంధునితో మల్లయుద్ధమును యాచించారు. నీచేత చనిపోవుటకు తగిన పుణ్యము పూర్తికాని ఆ జరాసంధుని భీమునితో యుద్ధము చేయుటకు పంపి నువ్వుఅర్జునునితో కలిసి వారి యుద్ధమును చూసి నిలుచుంటిరి. (అర్జునునితో మిగిలిన రాజులు పోరాడుచుండగా మధ్యస్థునివలె నీవు చూచుచుంటివని ఇంకొక సమన్వయం.)

**విశేషము**

**గిరివ్రజము:** ఒక పట్టణము. మగధదేశముయొక్క రాజధాని. దీని చుట్టును కోటకట్టినట్టు కొండలు ఉండుటచే దీనికి ఈపేరు కలిగెను. ఈనామమున మఱియొక పట్టణము కలదు. అది కేకయదేశమునకు రాజధాని. ఇందు మొదటిది కుశికుని నాల్గవ కొడుకు ఐన వసువు కట్టినది. అది ధర్మారణ్యమునకు సమీపమున మగధదేశమున ఉండును.

**85-5 శ్లో.**

**అశాంతసమరోద్ధతం విటపపాటనాసంజ్ఞయా**
**నిపాత్య జరసస్సుతం పవనజేన నిష్పాటితమ్ ।**
**విముచ్య నృపతీన్ ముదా సమనుగృహ్య భక్తిం పరాం**
**దిదేశిథ గతస్పృహానపి చ ధర్మగుప్త్యై భువః ॥**

**ప్రతిపదార్థము:** అశాంత= జయాపజయములు ఎంతకు నిర్ణయము కాని, సమర= ఆయుద్ధములో, ఉద్ధతం = బలవంతుడై (అహంకృతుడై) కనిపించుచున్న(ఉద్ధతః జాతాఽహంకారః అవినీతః ఉచ్చైః కృతో వా అహంకారం కలవాడు), జరసః సుతం = జరాసంధుని చూసి, విటపపాటనాసంజ్ఞయా= సమీపములోని ఒక చెట్టును పెల్లగించుట మూలముగా సంజ్ఞచేయగా, పవనజేన = అది గ్రహించిన భీముడు, నిష్పాటితమ్= జరాసంధుని విదారిత శరీరునిగా చేసి, నిపాత్య = సంహరించెను, నృపతీన్ = గిరి గుహలో చెరలో ఉన్న రాజులను, విముచ్య= విడిపించి, ముదా = వారితో సంతోషముతో పాటు, పరాం భక్తిం= ప్రేమ లక్షణ పూర్వకమయిన సంపూర్ణ భక్తిని, సమనుగృహ్య= అనుగ్రహించి, గతస్పృహాన్ అపి= నిజరాజ్య భోగము నందు కోరికలేని వారికి, భువః = భూమిలో, ధర్మగుప్త్యై చ= ధర్మరక్షణకొఱకు, దిదేశిథ= తిరిగి రాజులగుటకు ప్రేరేపించితివి (తిరిగి రాజులుగా చేసెనని భావం).

**తాత్పర్యము:** జయాపజయములు ఎంతకు నిర్ణయము కాని ఆయుద్ధములో బలవంతుడై కనిపించుచున్న జరా సంధుని చూసి సమీపములోని ఒక చెట్టును పెల్లగించుట మూలముగా నువ్వు సంజ్ఞచేయగా, అది గ్రహించిన భీముడు జరాసంధుని విదారిత శరీరునిగా చేసి సంహరించెను. గిరి గుహలో చెరలో ఉన్న రాజులను విడిపించి వారితో సంతోషముతో పాటు ప్రేమ లక్షణ పూర్వకమయిన సంపూర్ణ భక్తిని అనుగ్రహించి నిజరాజ్య భోగము నందు కోరికలేని వారికి భూమిలో ధర్మరక్షణకొఱకు తిరిగి రాజులుగా చేసెనని భావం. (గుహలో బంధింపబడి గతస్పృహాన్ అపి= తమ ప్రాణములందు ఆశ వదులుకొన్న రాజులను కృష్ణుడు తిరిగి రాజులుగా చేసెనని ఇంకొక సమన్వయం)

**విశేషాలు**

**జరాసంధుడు:** మగధదేశపు రాజు. ఉపరిచరవసువు కొడుకు ఐన బృహద్రథుని పుత్రుడు. వీని కొడుకు సహదేవుడు. పట్టణము గిరివ్రజము. బృహద్రథుడు చిరకాలము తనకు పుత్రులు కలుగక ఉండఁగా తపస్సు చేసి పుత్రులను పడయగోరి రాజ్యమును మంత్రి అధీనముచేసి ఒక అడవికి పోయి అచట తపస్సు చేయుచు ఉండిన చండకౌశికుడు అను మునిని ఆశ్రయించి సేవచేయుచు ఉండెను. కొంతకాలమునకు ఆముని ఇతనియందు అనుగ్రహము కలవాఁడై నీవు ఏమికోరి వచ్చి నాకు పరిచర్య చేయుచు ఉన్నావు అని అడిగి ఇతని అభిప్రాయము తెలిసికొని ఒక మామిడిపండును అభిమంత్రించి యిచ్చి దీనిని నీభార్యకు ఋతుకాలమున భుజింప ఇచ్చితివేని నీకు మహాబలపరాక్రమసంపన్నుడు అగు కొడుకు కలుగును పొమ్ము అని చెప్పి పంపెను. అందులకు బృహద్రథుడు సంతోషించి ఆపండు తెచ్చి తన పెద్దభార్యకు ఇచ్చెను. ఆమె పెనిమిటివలన దాని మహిమ తెలిసికొని తనకు మాత్రము కాక తన సవతికిని సంతానము కలుగవలయును అను తలపున సగముపండు తాను భుజించి సగముపండు తన సవతికి ఇచ్చెను. అంతట ఇరువురును గర్భము ధరించి సగము దేహము ఒకరును తక్కిన సగము దేహము మఱియొకరును ప్రసవించిరి. అప్పుడు దాదులు ఆరెండు ఖండములను ఊరిముందటి చదుకమున వైచి వచ్చిరి. అంతట ఆప్రదేశమును ఆశ్రయించి ఉండిన జర అను రాక్షసి ఆహారార్థిని అయి ఆరెండు ఖండాలను ఒకటిగా చేర్చి యెత్తుకొనిపోగా అవి ఒకటిగా అతుకుకొని బాలుడై ఎత్తరానిభారమున ఏడువసాగెను. అందులకు అది ఆశ్చర్యపడి బృహద్రథునకు ఆసమాచారమును తెలుపగా అతఁడు వానిని ఎత్తుకొనిపోయి జరచే సంధింపబడినవాడు కావున జరాసంధుడు అనిపేరుపెట్టి పెంచుకొనెను. అట్టి జరాసంధుడు తన అల్లుడు అయిన కంసుని కృష్ణుడు చంపెను అని అతనియెడ విరోధించి పదునెనిమిదిమాఱులు మధురాపురముమీద దండెత్తి జయము చేకొనియెను. పిమ్మట ధర్మరాజు రాజసూయయాగము చేయ యత్నించినప్పుడు కృష్ణుడు భీమసేనునిచే వీనిని చంపించెను. వీడు విప్రచిత్తియంశమున జనించినవాడు.

**85-6 శ్లో.**

**ప్రచక్రుషి యుధిష్ఠిరే తదను రాజసూయాధ్వరం**
**ప్రసన్నభృతకీ భవత్ సకలరాజకవ్యాకులమ్ ।**
**త్వమప్యయి జగత్పతే! ద్విజపదావనేజాదికం**
**చకర్థ కిము కథ్యతే నృపవరస్య భాగ్యోన్నతిః ॥**

**ప్రతిపదార్థము:** తదను = అటు పైన, యుధిష్ఠిరే= ధర్మరాజు, రాజసూయ అధ్వరం = రాజసూయయాగము చేయుటకు(రాజ్ఞా సూయతే, రాజ్ఞా సోతవ్యః క్రతుః–రాజుచే చేయబడు యజ్ఞము. రాజసూయ యాగము. రాజులనందఱిని గెలిచి చేసెడి యాగము), ప్రచక్రుషి= దీక్షితుడయ్యెను(ప్రారంభించెను), సకలరాజకవ్యాకులమ్ = ఆ రాజసూయయాగము చూచుటకు వచ్చిన రాజులు(రాజ్ఞాం సమూహః–రాజుల సమూహము) (విశేషేణ ఆకులః భీతః భ్రాంతః–భయపడినవాడు బెదిరినవాడు), ప్రసన్నభృతకీ భవత్ =అతనికి సేవకుల వలె స్వచ్ఛముగా పని చేయుచుండిరి. (ప్రసన్నః స్వచ్ఛః పవిత్రః సంతుష్టో వా స్వచ్ఛము పవిత్రము సంతోషము.)(భృతేన వేతనేన ఉపజీవతి జీతముతో బ్రతుకువాడు. కూలి), అయి జగత్పతే = ఓ జగత్పతీ !!, త్వం అపి = నువ్వు కూడా, అవనేజ ద్విజపద ఆదికం = బ్రాహ్మణోత్తముల పాదములను శుభ్రముగా (అవనేనేక్తి తస్య భావః–శుభ్రపరచునది), చకర్థ = కడుగుచుంటివి, నృపవరస్య= ఆ ధర్మరాజు యొక్క, భాగ్య ఉన్నతిః= భాగ్యముయొక్క గొప్పతనము (భజ్యతే ప్రాక్తన శుభకర్మ–శుభకర్మను అనుభవించుట), కిము కథ్యతే= ఏమని చెప్పగలము( ఏమని పొగడగలము).

**తాత్పర్యము:** అటు పైన ధర్మరాజు రాజసూయయాగము చేయుటకు ప్రారంభించెను. ఆ రాజసూయయాగము చూచుటకు వచ్చిన రాజులు అతనికి సేవకుల వలె పని చేయుచుండిరి. ఓ జగత్పతీ !! నువ్వు కూడా బ్రాహ్మణోత్తముల పాదములను కడుగుచుంటివి. ఆ ధర్మరాజు యొక్క భాగ్యముయొక్క గొప్పతనము ఏమని చెప్పగలము( ఏమని పొగడగలము!?)

**85–7 శ్లో.**

**తతస్సవనకర్మణి ప్రవరమగ్ర్యపూజావిధిం**
**విచార్య సహదేవవాగనుగతస్స ధర్మాత్మజః।**
**వ్యధత్త భవతే ముదా సదసి విశ్వభూతాత్మనే**
**తదా ససురమానుషం భువనమేవ తృప్తిం దధౌ॥**

**ప్రతిపదార్థము:** తతః =అటుపిమ్మట, సవనకర్మణి= ఆ యాగసదస్సులో (సూయతే పీయతే సోమః అత్ర ఇక్కడ సోమరసము త్రాగబడును. యజ్ఞము), ప్రవరమ్ =ఉత్తమ పురుషునికి (ప్రః అధికః వరః శ్రేష్ఠః), అగ్ర్యపూజావిధిం= అగ్రపూజా చేయవలెనను విధానమును(అగ్రే భవమ్ ప్రధానము, ముఖ్యము.)(పూజయతి తస్య భావః కర్మ వా పూజ, అర్చన), విచార్య= అనుసరించి, సహదేవ = సహదేవునికి(సహ దీవ్యతి కలిసి ఆడువాడు. పాండు కుమారుడు, సహదేవుడు), వాక్ అనుగతః= మాట ప్రకారము( శ్రీ కృష్ణుడు అగ్రపూజకు అర్హుడు), సః ధర్మాత్మజః =ఆ ధర్మరాజు, విశ్వభూతాత్మనే= సర్వాత్మకుడవైన, భవతే = నిన్ను, ముదా= సంతోషముతో, సదసి= నిండు సభలో, వ్యధత్త= పూజించెను, తదా= అప్పుడు, ససురమానుషం= దేవతలు, మానవులతో కూడిన చరాచరాత్మకమయిన, భువనమ్ ఏవ = భువనములు (భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము ఆకాశము భూమి), తృప్తిం= తృప్తిని (తృప్నోతి ఆకాంక్షారహితో భవతి తస్య భావః–కోరిక లేకపోవడం. తృప్తి సంతృప్తి), దధౌ= పొందినవి.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆ యాగసదస్సులో ఉత్తమ పురుషునికి అగ్రపూజా చేయవలెనను విధానమును అనుసరించి సహదేవుని మాట ప్రకారముఆ ధర్మరాజు సర్వాత్మకుడవైన నిన్ను సంతోషముతో నిండు సభలో నిన్ను పూజించెను. అప్పుడు దేవతలు, మానవులతో కూడిన చరాచరాత్మకమయిన భువనములు తృప్తిని పొందినవి.

**85–8 శ్లో.**

**తతస్సపది చేదిపో మునినృపేషు తిష్ఠత్స్వహో**
**సభాజయతి కో జడః పశుపదుర్ధురూఢం వటుమ్।**

**ఇతి త్వయి స దుర్వచోవితతిముద్వమన్నాసనాత్**
**ఉదాపతదుదాయుధః సమపతన్నముం పాండవాః ॥**

**ప్రతిపదార్థము:** తతః =అటుపిమ్మట, సపది = హఠాత్తుగా (సహ పద్యతేవెంబడి వుండునది. తత్క్షణము), సః చేదిపః = ఆ శిశుపాలుడు లేచి (చేది జనపదస్య చేదీనాం వా పతిః పాలకః-చేది దేశపు పాలకుడు రాజు. శిశుపాలుడు), మునినృపేషు= ఇందఱు మునులు ఇంతమంది రాజులు (మనుతే జానాతి తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు), తిష్ఠత్సు = ఉండగా, పశుపదుర్ధురూఢం= పశువులను మేపు యాదవుడయిన(దుర్ధురూటః= యుక్తిం వినా గురువాక్య మమన్యమానః), వటుమ్ = వయస్సునందు చిన్నవానిని(వటతి అల్పం వస్త్రమ్ చిన్న వస్త్రమును ధరించువాడు. చిన్న పిల్లవాడు, బ్రహ్మచారి), కః = ఏ, జడః= మూర్ఖుడు (జలతి ఘనీభవతి గడ్డ కట్టునది బుద్ధిహీనుడు, మూర్ఖుడు), సభాజయతి= పూజించును?, అహో =అశ్చర్యము, ఇతి= అని, త్వయి = నీ విషయములో, దుర్వచోవితతిమ్= ఇంకా చాలా దుర్భాషలు, ఉద్వమన్ = పలుకుచు, ఉదాయుధః= ఉద్ధృతమైన ఆయుధము కలవాడయి (ఆయుధము చేపట్టి), ఆసనాత్ =సింహాసనము నుండి (ఆసీదంతి అస్మిన్ కూర్చొనుట ఆసనము), ఉదాపతత్ = లేచాడు, పాండవాః = పాండవులు, అముం= ఈ శిశుపాలుని, సమపతన్= ఎదుర్కొనిరి.

**తాత్పర్యము:** అటుపిమ్మట హఠాత్తుగా ఆ శిశుపాలుడు లేచి ఇందఱు మునులు ఇంతమంది రాజులు ఉండగా పశువులను మేపు యాదవుడయిన ,వయస్సునందు చిన్నవాడయిన కృష్ణుని ఏ మూర్ఖుడు పూజించును? అశ్చర్యము! అని నీ విషయములో ఇంకా చాలా దుర్భాషలు పలుకుచు ఆయుధము చేపట్టి సింహాసనము నుండి లేచాడు. పాండవులు ఈ శిశుపాలుని ఎదుర్కొనిరి.

**85-9 శ్లో.**
**నివార్య నిజపక్షగానభిముఖస్య విద్వేషిణః**
**త్వమేవ జహ్రిషే శిరో దనుజదారిణా స్వారిణా ।**

**జనుస్త్రితయలబ్ధయా సతతచింతయా శుద్ధధీః**
**త్వయా స పరమేకతామధృత యోగినాం దుర్లభమ్ ॥**

**ప్రతిపదార్థము:** నిజపక్షగాన్ = నీ పక్షమునకు చెందిన పాండవులను, నివార్య= నివారించి, త్వమ్ ఏవ= నువ్వే, దనుజదారిణా= సర్వరాక్షస సంహార కారకమైన(దనోః జాయతే దనువుకి పుట్టినవాడు. దానవుడు), స్వ అరిణా = సుదర్శనము అనుపేరుగల నీ చక్రముచే, అభిముఖస్య=ఎదురుగా ఉన్న (అభిగతో ముఖం యస్య–ముందు వచ్చినవాడు), విద్వేషిణః = శిశుపాలుని యొక్క (ద్వేష్టి తస్య భావః–ద్వేషము వైరము విరోధము), శిరః = శిరస్సును, జహ్రిషే = ఖండించితివి, జనుః త్రితయ= హిరణ్యకశిపు రావణ శిశుపాలరూపమున మూడు జన్మములు (జాయతే తస్య భావః కర్మ వా పుట్టుక), లబ్ధయా=పొంది, సతతచింతయా= ద్వేష భావముచే నిన్ను ఎల్లప్పుడు చింతించుట వలన, శుద్ధధీః= పవిత్ర ఆత్ముడై, సః =ఆశిశుపాలుడు, యోగినాం దుర్లభమ్= యోగులకు కూడా లభింపని (యోజయతి సమానం పశ్యతి సుఖం చ దుఃఖం చ–సుఖదుఃఖములను సమానంగా చూచువాడు. యోగి), త్వయా పరమ్ ఏకతామ్= నీతో ఐక్యము చెందుటను(పరమ ముక్తిని), అధృత= పొందెను.

**తాత్పర్యము:** నీ పక్షమునకు చెందిన పాండవులను నివారించి – సర్వరాక్షస సంహార కారకమైన సుదర్శనము అనుపేరుగల నీ చక్రముచే ఎదురుగా ఉన్న శిశుపాలుని యొక్క శిరస్సును ఖండించితివి. హిరణ్యకశిపు రావణ శిశుపాలరూపమున మూడు జన్మములు పొంది ద్వేష భావముచే నిన్ను ఎల్లప్పుడు చింతించుట వలన పవిత్ర ఆత్ముడై ఆశిశుపాలుడు యోగులకు కూడా లభింపని పరమ ముక్తిని పొందెను.

**85–10 శ్లో.**
**తతస్సుమహితే త్వయా క్రతువరే నిరూఢే జనో**
**యయౌ జయతి ధర్మజో జయతి కృష్ణ ఇత్యాలపన్ ।**
**ఖలః స తు సుయోధనో ధుతమనాస్సపత్నశ్రియా**
**మయార్పితసభాముఖే స్థలజలభ్రమాదభ్రమీత్ ॥**

**ప్రతిపదార్థము:** తతః = శిశుపాల వధ తరువాత, సుమహితే = సుమహితముగా (గొప్పగా), క్రతువరే= రాజసూయమును, త్వయా నిరూఢే= నువ్వు నిర్వహించినందువలన (నితరాం రూఢః ప్రసిద్ధికెక్కిన), జనః = జనులందరు, ధర్మజః జయతి= ధర్మరాజుకు జయము, కృష్ణః జయతి= శ్రీకృష్ణునకు జయము, ఇతి = అని, ఆలపన్ = జయ జయ ధ్వానములు చేయుచు, యయౌ= వెడలిరి, ఖలః= కలి అంశమైన దుర్మార్గుడైన(స్ఖలతి ధర్మాత్ ధర్మమును వదిలినవాడు. అధముడు మూర్ఖుడు), సః సుయోధనః తు = అదుర్యోధనుడు మాత్రము (సుఖేన యుధ్యతే అనాయాసంగా యుద్ధం చేయువాడు. దుర్యోధనుడు)(దుఃఖేన యుధ్యతే అసౌ వీనితో పోట్లాడుట కష్టము. కౌరవులలో జ్యేష్ఠుడు), సపత్న=దాయాదియయిన (సహ ఏకార్థే పతతి ఒకేదాని గురించి వచ్చువాడు. శత్రువు), శ్రియా = ధర్మరాజు యొక్క సంపదకు, ధుతమనాః=అసూయ కలిగినవాడై, మయా అర్పితసభా ముఖే = మయుడు నిర్మించిన సభాభవనములో (మయేన నిర్మితా సభా మయునితో నిర్మింపబడిన సభ), స్థలజలభ్రమాత్ = జలమును స్థలముగా, స్థలమును జలముగా (స్థలంతి తిష్ఠంతి అస్మిన్ ఇక్కడ కూర్చొందురు. నీరు లేని ప్రదేశము, స్థలము.)(జలతి శీతలం భవతిశీతల గుణము గలది), అభ్రమీత్= భ్రమించెను.

**తాత్పర్యము:** శిశుపాల వధ తరువాత సుమహితముగా రాజసూయమును నువ్వు నిర్వహించినందువలన జనులందరు 'ధర్మరాజుకు జయము ' 'శ్రీకృష్ణునకు జయము' ఇతి అని జయ జయ ధ్వానములు చేయుచు వెడలిరి. కలి అంశమైన దుర్మార్గుడైన అదుర్యోధనుడు మాత్రము దాయాదియయిన ధర్మరాజు యొక్క సంపదకు అసూయ కలిగినవాడై మయుడు నిర్మించిన సభాభవనములో జలమును స్థలముగా, స్థలమును జలముగా భ్రమించెను.

**విశేషము**

**మయుడు:** దితిపుత్రుడు. దానవ విశ్వకర్మ. కొడుకులు మాయావి, దుందుభి. కూతురు రావణుని భార్య అగు మండోదరి.

**85–11 శ్లో.**

**తదా హసితముత్థితం ద్రుపద నందనా భీమయోః**
**అపాంగ కలయా విభో! కిమపి తావదుజ్జృంభయన్ ।**
**ధరాభర నిరాకృతౌ సపది నామ బీజం వపన్**
**జనార్దన! మరుత్పురీ నిలయ! పాహి మామామయాత్ ॥**

**ప్రతిపదార్థము:** జనార్దన = జనార్దనుడా!(జనైః అర్ద్యతే యాచ్యతే అభీష్టం అసౌ జనులు తమ అభీష్టమునకు ఇతనిని అర్ధింతురు. విష్ణువు), విభో= ప్రభూ ! (విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), తదా = అప్పుడు (దుర్యోధనుడు భ్రమపడి భంగపడుటను చూసిన), ద్రుపద నందనా= ద్రౌపది, భీమయోః = భీమసేనులకు, హసితమ్ =నవ్వు (హసితః వికసితః కృత హాసః వికసించినది. నవ్వినవాడు), ఉత్థితం= పుట్టినది, తావత్ = ఆ సంఘటనను, అపాంగ కలయా= నీ క్రీగంటి చూపుతో (అప అంగతి = వక్రం గచ్ఛతి చక్షుః యత్ర కన్ను కొనభాగము), కిమపి= మరింతగా, ఉజ్జృంభయన్ = పెంపొందిస్తూ, ధరాభర = భూభారమును, నిరాకృతౌ = తగ్గించుటకై (నిరాకృతః తిరస్కృతః ప్రత్యాఖ్యాతః–తిరస్కరింపబడినది ఖండించబడినది), సపది నామ = వెంటనే, బీజం వపన్= బీజమును నాటితివి, మరుత్పురీ నిలయ= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మామ్ = నన్ను, ఆమయాత్ = రోగమునుండి, పాహి = రక్షించు.

**తాత్పర్యము:** జనార్దనుడా ! ప్రభూ ! అప్పుడు దుర్యోధనుడు భ్రమపడి భంగపడుటను చూసిన ద్రౌపది భీమసేనులకు నవ్వు పుట్టినది. ఆ సంఘటనను నీ క్రీగంటి చూపుతో మరింతగా పెంపొందిస్తూ భూభారమును తగ్గించుటకై వెంటనే బీజమును నాటితివి. ఓ గురువాయూరు కృష్ణ దేవా! నన్ను రోగమునుండి రక్షించు.

***దశమ స్కంధము***

**85వ దశకము సమాప్తము**

# దశకమ్ 86 – సాల్వవధ – మహాభారతయుద్ధము

**86–1 శ్లో.**

**సాల్వోభైష్మీవివాహే యదుబలవిజితశ్చంద్రచూడాద్విమానం**
**విందన్ సౌభం స మాయీ త్వయి వసతి కురూంస్త్వత్పురీమభ్యభాంక్షీత్ ।**
**ప్రద్యుమ్నస్తం నిరుంధన్ నిఖిలయదుభటైర్న్యగ్రహీదుగ్రవీర్యం**
**తస్యామాత్యం ద్యుమంతం వ్యజని చ సమరస్సప్తవింశత్యహాంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** భైష్మీవివాహే = విదర్భదేశపు రాజు అయిన భీష్మకుని కుమార్తె రుక్మిణీ వివాహములో, యదుబల విజితః = యాదవుల చేతిలో ఓడిపోయిన, సాల్వః = సాల్వుడు(సాల్వదేశస్య అభిజనః–సాల్వ దేశము సాల్వ దేశపు వాడు), చంద్రచూడాత్ = తపస్సుచేసి శివునిమెప్పించి(చూడా= చోలయతి మస్తకోపరి ఉన్నతా భవతి తలపై ఎత్తుగా వుండునది), సౌభం విమానం = సౌభమను పేరుగల విమానమును (సౌభం =సుష్ఠు సర్వత్ర లోకే భాతి లోకములో ప్రకాశించునది), విందన్ = పొంది, త్వయి= నువ్వు, కురూన్ వసతి= కురుదేశములో ఉన్నట్లు విని, సః మాయీ= ఆ మాయావి సాల్వుడు (మాయా అస్తి అస్య–మాయ కలవాడు. కపటి), త్వత్ పురీమ్= మీ ద్వారకానగరమును, అభ్యభాంక్షీత్= ముట్టడించెను, నిఖిలయదుభటైః = సమస్త యదుసైన్యముతో, ప్రద్యుమ్నః= ప్రద్యుమ్నుడు (ప్రకృష్టం ద్యుమ్నం బలం యస్య–బాగా బలం కలవాడు. ప్రద్యుమ్నుడు, కృష్ణుని కొడుకు), తం = ఆ సాల్వుని, నిరుంధన్= ఎదుర్కొని, తస్య అమాత్యం= ఆ సాల్వుని మంత్రి యైన, ఉగ్రవీర్యం = మహా బలవంతుడైన, ద్యుమంతం= ద్యుమంతుని, న్యగ్రహీత్ = సంహరించెను, సమరః చ= ఆ యుద్ధము, సప్తవింశతి అహాంతమ్ = ఇరువది ఏడు రోజులు (జహాతి త్యజతి పృథక్కరోతి అంధకారమ్ అంధకారమును పారద్రోలునది. సూర్యుడు దినము), వ్యజని= జరిగెను.

**తాత్పర్యము:** రుక్మిణీ వివాహములో యాదవుల చేతిలో ఓడిపోయిన సాల్వుడు తపస్సుచేసి శివునిమెప్పించి సౌభమను పేరుగల విమానమును పొంది నువ్వు కురుదేశములో ఉన్నట్లు విని ఆ మాయావి సాల్వుడు మీ ద్వారకానగరమును ముట్టడించెను. సమస్త యదుసైన్యముతో ప్రద్యుమ్నుడు ఆ సాల్వుని ఎదుర్కొని

అతని మంత్రి యైన మహా బలవంతుడైన ద్యుమంతుని సంహరించెను. ఆ యుద్ధము ఇరువది ఏడు రోజులు జరిగెను.

**86-2 శ్లో.**

**తావత్త్వం రామశాలీ త్వరితముపగతః ఖండితప్రాయసైన్యం**
**సౌభేశం తం న్యరుంధాః స చ కిల గదయా శార్ జ్గమభ్రంశయత్ తే ।**
**మాయాతాతం వ్యహింసీదపి తవ పురతస్త్త్వయాపి క్షణార్ధం**
**నాజ్ఞాయీత్యాహురేకే తదిదమవమతం వ్యాస ఏవ న్యషేధీత్ ॥**

**ప్రతిపదార్థము:** తావత్ = సాల్వరాజు సైన్యములో చాలభాగము నశించిఉన్న సందర్భంలో, త్వం = నువ్వు, రామశాలీ= బలరామునితో కలిసి (శాలతే శోభతే), త్వరితమ్= త్వరగా, ఉపగతః= వచ్చి, ఖండితప్రాయసైన్యం = సాల్వుని సైన్యమును చీల్చి చెండాడి, తం సౌభేశం= అ సాల్వుని, న్యరుంధాః = ఎదుర్కొన్నావు, స చ= అతడును, గదయా = తన గదతో, తే శార్ జ్గమ్= నీ ధనుస్సును (శార్జ్గ =శృంగస్య వికారః–కొమ్ముతో చేయబడినది. విష్ణుధనుస్సు, ధనుస్సు), అభ్రంశయత్ కిల = కింద పడవేసెను కదా!, తే= నీ ముందు, మాయా= మాయతో (మీయతే అపరోక్షవత్ ప్రదర్శ్యతే అనయా దీనితో లేనిది చూపబడును. మాయ), తవ తాతం= నీ తండ్రి వసుదేవుని కల్పించి(తనోతి విస్తారయతి గోత్రాదికమ్ వంశమును విస్తరించువాడు. తండ్రి), వ్యహింసీత్ అపి= చంపివేసెను, తత్ = ఆ మాయను, త్వయా అపి =మాయాతీతుడవైన నువ్వు కూడా, క్షణార్ధం= ఒక్క క్షణకాలము, న అజ్ఞాయి= గుర్తింపలేదు, ఇతి= అని, ఏకే= ఒకరు, ఆహుః = చెప్పారు, తత్ ఇదం = ఈ వృత్తాంతము( సాల్వుని మాయలో కృష్ణుడు పడుట), అవమతం= సరి కాదని (అవమతః తిరస్కృతః–తిరస్కరించబడినది), వ్యాసః ఏవ= వ్యాస భగవానుడే(వ్యాసః విశేషేణ అస్యతి విస్తారయతి వేదార్థమ్ వేదార్థమును విస్తరించి ఉపదేశించినవాడు. వేద వ్యాసుడు), న్యషేధీత్ = నిషేధించెను.

**తాత్పర్యము:** సాల్వరాజు సైన్యములో చాలభాగము నశించిఉన్న సందర్భంలో నువ్వు బలరామునితో కలిసి వచ్చి సాల్వుని సైన్యమును చీల్చి చెండాడి అ సాల్వుని ఎదుర్కొన్నావు. అతడు తన గదతో నీ ధనుస్సును కింద పడవేసాడు. నీ ముందు తన

మాయతో సాల్వుడు వసుదేవుని కల్పించి చంపివేసెను. ఆ మాయను మాయాతీతుడవైన నువ్వు కూడా ఒక్క క్షణకాలము గుర్తింపలేదు అని ఒకరు చెప్పారు. ఈ వృత్తాంతము( సాల్వుని మాయలో కృష్ణుడు పడుట) సరికాదని వ్యాస భగవానుడే ఖండించెను.

**విశేషాలు:** "క్వ శోక మోహౌ స్నేహో వా" ( సంస్కృత భాగ. దశమా. 77 వ అధ్యాయం 32 వశ్లోకం) అను శ్లోకంలో వ్యాస మహర్షి వాస్తవము కాదని ఖండించాడు. భట్టాత్రి ఈ విషయాన్ని పేర్కొన్నాడు.

**86-3 శ్లో.**
**క్షిప్త్వా సౌభం గదాచూర్ణితముదకనిధౌ మంక్షు సాల్వేఽపి చక్రే-**
**ణోత్కృత్తే దంతవక్త్రః ప్రసభమభిపతన్నభ్యముంచద్గదాంతే ।**
**కౌమోదక్యాహతోఽసావపి సుకృతనిధిశ్చైద్యవత్ ప్రాపదైక్యం**
**సర్వేషామేష పూర్వం త్వయి ధృతమనసాం మోక్షణార్థోఽవతారః ॥**

**ప్రతిపదార్థము:** సౌభం = సాల్వుని సౌభక విమానమును(సుష్ఠు సర్వత్ర లోకే భాతి లోకములో ప్రకాశించునది), గదాచూర్ణితమ్= నీ గదచే పిండి పిండి చేసి (గద్యతే పీడ్యతే అనేన-దీనితో పీడింపబడును), ఉదకనిధౌ= సముద్రములో, క్షిప్త్వా= పడవేసి (క్షిప్తః ప్రక్షిప్తః ప్రేషితః-పారవేయబడినది పంపబడినది), మంక్షు = వెంటనే, చక్రేణ = నీ చక్రముతో (చకతి హంతి పరబలమ్ శత్రు సేనను సంహరించునది), సాల్వే అపి= సాల్వుని కూడా(సాల్వదేశస్య అభిజనః సాల్వ దేశపు వాడు), ఉత్కృత్తే =సంహరించితివి, దంతవక్త్రః= దంతవక్త్రుడు (దంత ప్రధానం వక్త్రం యస్య-పెద్ద పండ్లు గలవాడు. ఒక రాక్షసుడు), ప్రసభమ్= హింసా పద్ధతిలో బలముగా (ప్రగతా సభా సభాధికారః యస్మాత్ బలాత్కారము), అభిపతన్= గదతో నిన్ను ఎదుర్కొనగా, తే = నీయొక్క, గదాం= గదతో, అభ్యముంచత్ = ఎదుర్కొన్నావు, సుకృతనిధిః అసౌ అపి= దంతవక్త్రుడు కూడా శిశుపాలుని వలె పుణ్య నిధియై, కౌమోదక్యా= నీ గదయైన కౌమోదకి దెబ్బల వలన (కోః పృథివ్యాః మోదకః విష్ణుః తస్య ఇయమ్ విష్ణువు యొక్క ఆయుధము. కౌమోదకి, గద), హతః = మరణించి, చైద్యవత్= శిశుపాలునివలె (చేదీనాం

జనపదానాం అయమ్ చేది దేశమునకు సంబంధించినది ఆ దేశపు రాజు. శిశుపాలుడు), ఐక్యం ప్రాపత్ = నీయందు ఐక్యమయ్యెను, త్వయి పూర్వం ధృతమనసాం = ఎల్లప్పుడు నిన్ను తలచుకొను, సర్వేషామ్ = అందరికి, మోక్షణార్థః = మోక్షమును ప్రసాదించుటయే (మోక్షయతి తస్య భావః వదిలి పెట్టుట విప్పుట), ఏషః అవతారః = నీ కృష్ణావతార లక్ష్యము(అవతరతి తస్య భావః దేవతలు మానుషరూపములో భూమిపై నవతరించుట).

**తాత్పర్యము:** సాల్వుని సౌభక విమానమును నీ గదచే పిండి పిండి చేసి సముద్రములో పడవేసి వెంటనే నీ చక్రముతో సాల్వుని కూడా సంహరించితివి . దంతవక్త్రుడు హింసా పద్ధతిలో గదతో నిన్ను ఎదుర్కొనగా నీయొక్క గదతో వానిని ఎదుర్కొన్నావు. దంతవక్త్రుడు కూడా శిశుపాలుని వలె పుణ్య నిధియై నీ గదయైన కౌమోదకి దెబ్బల వలన మరణించి శిశుపాలునివలె నీయందు ఐక్యమయ్యెను. ఎల్లప్పుడు నిన్ను తలచుకొను అందరికి మోక్షమును ప్రసాదించుటయే నీ అవతార లక్ష్యము.

**విశేషాలు**

**దంతవక్త్రుడు:** వృద్ధశర్మునికి వసుదేవుని చెలియలు ఐన శ్రుతదేవియందు పుట్టిన కొడుకు. వీడును శిశుపాలుడును సనకసనందనుల శాపముచే అసురకృత్యములు కలవారుగా పుట్టిన జయవిజయులు. వీడు కృష్ణునిచేత చంపబడెను.

**86-4 శ్లో.**

**త్వయ్యాయాతేఽథ జాతే కిల కురుసదసి ద్యూతకే సంయతాయాః**
**క్రందంత్యా యాజ్ఞసేన్యాస్స కరుణమకృథాశ్చేలమాలామనంతామ్ ।**
**అన్నాంతప్రాప్తశర్వాంశజమునిచకితద్రౌపదీచింతితోఽథ**
**ప్రాప్తశ్శాకాన్నమశ్నన్ మునిగణమకృథాస్తృప్తిమంతం వనాంతే ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= నువ్వు, ఆయాతే = ఇంద్రప్రస్థము నుండి ద్వారకకు తిరిగిరాగా, అథ=అటుపిమ్మట, కురుసదసి= కౌరవ సభలో(సీదంతి అస్యామ్ ఇందులో వుందురు. సభ), జాతే ద్యూతకే = జరిగిన మాయా

ద్యూతములో(దీవ్యంతి క్రీడంతి ఏనమ్ దీనిని ఆడుదురు. ద్యూతము, జూదము కపటము), సంయతాయాః కిల =దుశ్శాసనుని చే గ్రహించబడి(అవరుద్ధః వశీకృతః నిబద్ధః ఉద్యతః–ఆపబడినది వశపరచుకొనబడినది బంధింపబడినది), క్రందంత్యా= ఆక్రందిస్తున్న (క్రందతి తస్య భావః కర్మ వా ఏడ్చుట), యాజ్ఞసేన్యాః = ద్రౌపదికి(యజ్ఞసేనస్య ద్రుపదరాజస్య అపత్యం స్త్రీ ద్రుపదుని కుమార్తె. యాజ్ఞసేని), చేలమాలామ్= వస్త్రపరంపరను (చేల్యతే విస్తార్యతే తంతుభిః– దారములతో చేయబడినది. వస్త్రము), సకరుణమ్ = కరుణతో (కరోతి మనః ఆనుకూల్యాయ–మనసును అనుకూలపరచును. కరుణ, ఒక రసము), అనంతామ్ = అనంతముగా (నాస్తి అంతః = సీమా యస్య–సీమ లేనిది), అకృథాః = ప్రసాదించి మాన సంరక్షణ చేసావు, అథ =అటుపిమ్మట, వనాంతే= పాండవుల యొక్క వనవాసములో, అన్నాంత = పాండవులందరు భోజనము చేసిన తరువాత(అనితి జీవతి అనేన–దీనితో జీవింతురు. అన్నము), శర్వాంశజ మునిః = శంకర అంశజుడగు దూర్వాసమహాముని (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), ప్రాప్తః = శిష్యులతో అతిథిగా రాగా(ప్రాప్తః లబ్ధః గతః– పొందబడినది లభించినది వెళ్లినది), చకిత= భయపడిన (అన్నపాత్ర అప్పటికే ఖాళీఅయి ఉండుట వలన మునిశాప శంకితురాలయిన)(చకితః భ్రాంతః భీతః– భ్రాంతి నొందినవాడు భయపడినవాడు), ద్రౌపదీ=ద్రౌపది (ద్రుపదస్య అపత్యం స్త్రీ ద్రుపదుని కుమార్తె. ద్రౌపది), చింతితః=నిన్ను గురించి ధ్యానించగా, ప్రాప్తః = నువ్వు అచ్చటికి వచ్చి, శాకాన్నమ్= ఆ పాత్రలో కొంచెము మిగిలి ఉన్న ఆకుకూరను(శక్యతే భోక్తుమ్ తినదగినది. కూర), అశ్నన్= భుజించి, మునిగణమ్ = శిష్యవర్గ సమేతుడయిన దుర్వాసుని (మనుతే జానాతి తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు పవిత్ర పురుషుడు భక్తుడు స్థిరచిత్తుడు ఋషి), తృప్తిమంతం = ఆకలి బాధ తీరిన తృప్తి కలవారిగా (తృప్నోతి ఆకాంక్షారహితో భవతి తస్య భావః – కోరిక లేకపోవడం. తృప్తి సంతృప్తి), అకృథాః = చేసితివి.

**తాత్పర్యము:** నువ్వు ఇంద్రప్రస్థము నుండి ద్వారకకు తిరిగిరాగా అటుపిమ్మట కౌరవ సభలో జరిగిన మాయా ద్యూతములో ద్రౌపదిని పణముగా ధర్మరాజు ఓడిపోగా, దుశ్శాసనుని వస్త్రాపహరణమునకు ఆక్రందిస్తున్న ద్రౌపదికి,

వస్త్రపరంపరను కరుణతో అనంతముగా ప్రసాదించి మాన సంరక్షణ చేసావు. అటుపిమ్మట పాండవుల యొక్క వనవాసములో పాండవులందరు భోజనము చేసిన తరువాత, శంకర అంశజుడగు దూర్వాసమహాముని శిష్యులతో అతిథిగా రాగా, అన్నపాత్ర అప్పటికే ఖాళీఅయి ఉండుట వలన, మునిశాప శంకితురాలయిన ద్రౌపది నిన్ను గురించి ధ్యానించగా నువ్వు అచ్చటికి వచ్చి ఆ పాత్రలో కొంచెము మిగిలి ఉన్న ఆకుకూరను భుజించి శిష్యవర్గ సమేతుడయిన దుర్వాసుని తృప్తి కలవానిగా చేసితివి.

**86-5 శ్లో.**

**యుద్ధోద్యోగేఽథ మంత్రే మిలతి సతి వృతః ఫల్గునేన త్వమేకః**
**కౌరవ్యే దత్తసైన్యః కరిపురమగమో దౌత్యకృత్ పాండవార్థమ్ ।**
**భీష్మద్రోణాదిమాన్యే తవ ఖలు వచనే ధిక్కృతే కౌరవేణ**
**వ్యావృణ్వన్ విశ్వరూపం మునిసదసి పురీం క్షోభయిత్వాగతోఽభూః ॥**

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, యుద్ధ ఉద్యోగే = కురుక్షేత్రయుద్ధమునకు సన్నాహములలో భాగంగా(యుద్ధ్యతే యుద్ధము)(ఉద్యోజయతి యతతే తస్య భావః ప్రయత్నము), మంత్రే మిలతి సతి= రహస్య ప్రయత్నములు జరుగుచుండగా (మంత్రతి మంత్రయతే రహస్యంగా మాట్లాడుట), ఫల్గునేన= అర్జునుడు (ఫలతి కార్యాదికం అస్మాత్, ఫల్గుణ్యాం ఫల్గుణీ నక్షత్రే జాతః-ఇతని నుండి కార్యములు ఫలించును. అర్జునుడు ఫల్గుణీ నక్షత్రములో పుట్టినవాడు), త్వమ్ ఏకః = నిన్ను మాత్రమే, వృతః = కోరుకొనెను.( ప్రార్థితః సంభక్తః-వరించబడినది), కౌరవ్యే =దుర్యోధనునకు(కురోః అపత్యమ్ కురు సంతానము), దత్తసైన్యః= నీ యదు సైన్యమును ఇచ్చితివి, పాండవార్థమ్ = పాండవుల అర్థ రాజ్య లబ్ధి కొరకు, దౌత్యకృత్ = పాండవుల దూతగా (దూతస్య భావః కర్మ వా దూతకర్మ, దౌత్యము), కరిపురమ్ = హస్తినాపురమునకు, అగమః = వెళ్ళితివి, భీష్మద్రోణాదిమాన్యే= కౌరవసభలో భీష్మ ద్రోణాదులు గౌరవించినను(బిభేత్యస్మాత్, భీషయతే వా దీనితో భయపడుదురు. ఇది భయపెట్టును. శివుడు రాక్షసుడు భీష్ముడు.)(ద్రోణః కలశః ఉత్పత్తిస్థానం అస్య-కలశము ఉత్పత్తిస్థానంగా కలవాడు. ద్రోణాచార్యుడు.)

(మాన్యతే పూజ్యతే అసౌ పూజ్యుడు, మాన్యుడు), తవ ఖలు వచనే= నీ మాటను, కౌరవేణ = దుర్యోధనుడు, ధిక్కృతే= ధిక్కరించగా, మునిసదసి=కొందరు జ్ఞానులు, మునులు ఉన్న ఆ సభలో, విశ్వరూపం= విశ్వాత్మకమయిన నీ రూపమును (విశ్వం రూపయతి ప్రకాశయతి, విశ్వం రూపం యస్య–విశ్వమును ప్రకాశింప చేయువాడు విశ్వమే రూపంగా కలవాడు. పరమాత్ముడు), వ్యావృణ్వన్ = ప్రకాశింపచేసి, పురీం = హస్తినా పురమును, క్షోభయిత్వా= హడల గొట్టి, ఆగతః అభూః= తిరిగి వచ్చావు.

**తాత్పర్యము:** అటుపిమ్మట కురుక్షేత్రయుద్ధమునకు సన్నాహములలో భాగంగా ప్రయత్నములు జరుగుచుండగా, అర్జునుడు నిన్ను మాత్రమే తన పక్షమున ఉండవలసినదిగా కోరుకొనెను. దుర్యోధనునకు నీ యదు సైన్యమును ఇచ్చితివి. పాండవుల అర్థ రాజ్య లబ్ధి కొరకు ,పాండవుల దూతగా , హస్తినాపురమునకు వెళ్ళితివి . కౌరవసభలో భీష్మ ద్రోణాదులు గౌరవించినను నీ మాటను దుర్యోధనుడు ధిక్కరించగా కొందరు జ్ఞానులు, మునులు ఉన్న ఆ సభలో నీ విశ్వరూపమును ప్రకాశింపచేసి హస్తినా పురమును హడలగొట్టి తిరిగి వచ్చావు.

**86–6 శ్లో.**

**జిష్ణోస్త్వం కృష్ణసూతః ఖలు సమరముఖే బంధుఘాతే దయాలుం**
**ఖిన్నం తం వీక్ష్య వీరం కిమిదమయి సఖే।నిత్యఏకోఽయమాత్మా ।**
**కో వధ్యః కోఽత్ర హంతా తదిహ వధభియం ప్రోజ్ఝ్య మయ్యర్పితాత్మా**
**ధర్మ్యం యుద్ధం చరేతి ప్రకృతిమనయథా దర్శయన్ విశ్వరూపమ్ ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ = ఓ గురువాయూరు కృష్ణ దేవా! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), త్వం ఖలు= నువ్వు, జిష్ణోః = అర్జునుని యొక్క( జయతి జయశీలః– జయము కలవాడు. అర్జునుడు), సూతః= సారథిగా ఉన్నావు. (సువతి ప్రేరయతి అశ్వాన్ అశ్వములను రెచ్చకొట్టువాడు. సూతుడు), సమరముఖే= రణరంగమున (సమ్యక్ ఋచ్ఛంతి గచ్ఛంతి యోద్ధుం యోద్ధారః అత్ర –యోద్ధలు యుద్ధము చేయుటకు ఇక్కడికి వెళ్లుదురు. యుద్ధము), బంధుఘాతే = బంధు మిత్రులను చూచి వారిని చంపుటకు(బధ్నాతి మనః స్నేహాదినా స్నేహాదులచే మనస్సును

బంధించువాడు. బంధువు), దయాలుం= కరుణ కలిగినవాడై మనస్సు ద్రవించి, ఖిన్నం= దుఃఖపడి యుద్ధ విముఖుడయిన (ఖిన్నః జాతభేదః-దుఃఖపడువాడు), వీరం = వీరుడయిన (వీరయతి కంపయతి అమిత్రాన్ శత్రువును వణికించువాడు. వీరుడు), తం = ఆఅర్జునుని, వీక్ష్య = చూసి, అయి సఖే = ఓ మిత్రమా ? !, ఇదం కిమ్= ఈ పని ఏమిటి?, అయం ఆత్మా = ఈ ఆత్మ (అతతి సర్వత్ర వ్యాప్నోతి సర్వత్ర వ్యాపించి యున్నది),నిత్యః=నిత్యమైనది(నియతం ధ్రువం నిరంతరము ఎల్లప్పుడు త్రికాలములో వుండునది), ఏకః = అద్వితీయమైనది. (ఏతి గచ్ఛతి ఒకటి ముఖ్యమైనది నిజమైనది), అత్ర = ఇచ్చట, వధ్యః కః = చంపదగినవాడు ఎవరు? (వధం అర్హతి చంపదగినవాడు), హంతా కః= చంపువాడు ఎవరు? (హంతి ప్రహరతి అసౌ చంపువాడు కొట్టువాడు), తత్ = అందువలన, ఇహ= ఇక్కడ, వధభియం= భీష్మద్రోణాదుల వధ చేయుట వలన పాపము కలుగునను భయము, ప్రోజ్ఝ్య= వదిలి, మయి= నాయందు, అర్పిత= అర్పించబడిన, ఆత్మా =మనస్సు కలవాడివై, ధర్మ్యం యుద్ధం= క్షత్రియులకు ధర్మమైన యుద్ధమును, చర = చేయుము, ఇతి = అని గీతోపదేశము చేసి, విశ్వరూపమ్= విశ్వ రూపమును, దర్శయన్ = అర్జునునికి చూపి, ప్రకృతిమ్= అతడు మోహము లేనివాడయి యథార్థ స్థితిని, అనయథాః= పొందునట్లుగా చేసితివి.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నువ్వు అర్జునుని యొక్క సారథిగా ఉన్నావు. రణరంగమున బంధు మిత్రులను చూచి వారిని చంపుటకు కరుణ కలిగినవాడై మనస్సు ద్రవించి బాధతో యుద్ధ విముఖుడయిన వీరుడయిన ఆ అర్జునుని చూసి "ఓ మిత్రమా ? ! ఈ పని ఏమిటి? ఈ ఆత్మ నిత్యమైనది అద్వితీయమైనది.(ఆత్మ నిత్యమైనందువలన అవధ్యత్వము, ఏకత్వ భావన వలన చంపువాడు, చంపబడువాడు అను భేదము లేదని భావం) ఇచ్చట చంపదగినవాడు ఎవరు? చంపువాడు ఎవరు? అందువలన ఇక్కడ భీష్మద్రోణాదుల వధ చేయుట వలన పాపము కలుగునను భయము వదిలి నాయందు అర్పించబడిన మనస్సు కలవాడివై క్షత్రియులకు ధర్మమైన యుద్ధమును చేయుము' అని గీతోపదేశము చేసి విశ్వ రూపమును అర్జునునికి చూపి అతడు మోహము లేనివాడయి యథార్థ స్థితిని పొందునట్లుగా చేసితివి.

**86-7 శ్లో.**

**భక్తోత్తంసేఽథ భీష్మే తవ ధరణిభరక్షేపకృత్యైకసక్తే**
**నిత్యం నిత్యం విభిందత్యవనిభృదయుతం ప్రాప్తసాదే చ పార్థే ।**
**నిశ్శస్త్రత్వప్రతిజ్ఞాం విజహదరివరం ధారయన్ క్రోధశాలీ**
**వాధావన్ ప్రాంజలిం తం నతశిరసమథో వీక్ష్య మోదాదపాగాః ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, భక్త ఉత్తంసే = నీ పరమ భక్తుడైన (ఉత్ సమ్యక్ తంస్యతే అలంక్రియతే అనేన-అలంకారము భూషణము), భీష్మే= భీష్ముడు, ధరణిభర = భూభారమును, క్షేప= తగ్గించవలెనను (క్షేపణస్య భావః- పారవేయుట కదలుట అంగ సంచాలనము), తవ = నీయొక్క, కృత్యైకసక్తే = అవతార లక్ష్యమందు ఆ సక్తి కలిగినవాడై, నిత్యం నిత్యం= ప్రతిరోజు, అవనిభృత్ అయుతం చ= పదివేల మంది రాజులను(అవతి ప్రజాః అవతి రక్షణాదికం కరోతి అవ్యతే భూపైః ప్రాణులను రక్షించునది. భూమి, రాజుల ద్వారా రక్షింపబడునది), విభిందంతి =చంపసాగెను, పార్థే చ =అర్జునుడు భీష్ముని బాణములతో (పృథాయాః కుంత్యాః అపత్యం పుమాన్ కుంతీ పుత్రుడు. అర్జునుడు), ప్రాప్తసాదే= సంజాత క్లేశుడై (అలిసిపోగా) (సీదతి అవసీదతి తస్య భావః కర్మ వా అలసట), త్వం = నువ్వు, నిశ్శస్త్రత్వప్రతిజ్ఞాం= యుద్ధమున శస్త్రముధరించనని చెప్పిన ప్రతిజ్ఞను (శస్యతే హింస్యతే అనేన దీనితో హింసింపబడును. శస్త్రము.)(ప్రతిజ్ఞాయతే అసౌ ప్రతిజ్ఞ మాట యిచ్చుట), విజహత్ = వదలి, క్రోధశాలీ ఇవ= కోపము వచ్చిన వాని వలె, అరివరం= సుదర్శనమును, ధారయన్= చేతబట్టి, అధావన్ = భీష్ముని వైపు పరుగెత్తితివి, ప్రాంజలిం=దోసిలి ఘటించి (ప్రసూతౌ అంజలి యేన-అంజలి ఘటించినవాడు. చేతులు మోడ్చినవాడు), నతశిరసం = తల వంచిన (నమస్కరించిన), తం = ఆ భీష్ముని, వీక్ష్య= చూసి, అథః = అటుపిమ్మట, మోదాత్ = సంతోషముతో (మోదతే తస్య భావః-హర్షము, సంతోషము), అపాగాః= ఆ ప్రయత్నమును విరమించుకొంటివి.

**తాత్పర్యము:** అటుపిమ్మట నీ పరమ భక్తుడైన భీష్ముడు భూభారమును తగ్గించవలెనను నీయొక్క అవతార లక్ష్యమందు ఆ సక్తి కలిగినవాడై , ప్రతిరోజు

పదివేల మంది రాజులను చంపసాగెను . అర్జునుడు భీష్ముని బాణములతో అలిసిపోగా నువ్వు యుద్ధమున శస్త్రముధరించనని చెప్పిన ప్రతిజ్ఞను వదలి ,కోపము వచ్చిన వాని వలె సుదర్శనమును చేతబట్టి భీష్ముని వైపు పరుగెత్తితివి. దోసిలి ఘటించి నమస్కరించిన ఆ భీష్ముని చూసి అటుపిమ్మట సంతోషముతో ఆ ప్రయత్నమును విరమించుకొంటివి.

**విశేషాలు:** అయుత సమధికం విభిందంతి అని పాఠాంతరము. ( పదివేలకు పైగా )

**86-8 శ్లో.**

**యుద్ధే ద్రోణస్య హస్తిస్థిరరణభగదత్తేరితం వైష్ణవాస్త్రం**
**వక్షస్యాధత్తచక్రస్థగితరవిమహాః ప్రార్దయత్ సింధురాజమ్ ।**
**నాగాస్త్రే కర్ణముక్తే క్షితిమవనమయన్ కేవలం కృత్తమౌళిం**
**తత్రే తత్రాఽపి పార్థం కిమివ న హి భవాన్ పాండవానామకార్షీత్ ॥**

**ప్రతిపదార్థము:** ద్రోణస్య యుద్ధే= ద్రోణుడు సైన్యాధిపతిగా చేయుచున్న యుద్ధములో, హస్తిస్థిర= తన గజవాహనముపై స్థిరముగా కూర్చొని (హస్తః శుండా దండః అస్తి అస్య తొండము కలది. ఏనుగు), రణ=యుద్ధమునకు వచ్చిన (రణ్యతే శబ్ద్యతే అత్ర-ఇక్కడ శబ్దము చేయుదురు. రణము, యుద్ధము), భగదత్త= నరకాసురుని పుత్రుడగు భగదత్తునిచే (భగం ఐశ్వర్యం దత్తం అస్మై ఐశ్వర్యమును ఈయబడ్డవాడు మహాభారతంలో ఒక యోద్ధ), ఈరితం = ప్రయోగించిన(ఈరితః ప్రేషితః ప్రేరితో వాపంపబడ్డవాడు ప్రేరేపింపబడ్డవాడు), వైష్ణవాస్త్రం = వైష్ణవాస్త్రమును(విష్ణోః అయం ఇదం వా విష్ణువుకు సంబంధించినది), వక్షసి= నీ వక్షస్థలమున(ఉచ్యతే అనేన-దీనితో మాట్లాడుదురు. హృదయము), ఆధత్త =నిరోధించితివి, చక్ర =నీ చక్రముచే, స్థగిత రవిమహాః =సూర్యుని కప్పిపెట్టి (స్థగితః ఆవృతఃకప్పబడినది దాచబడినది), సింధురాజమ్= జయద్రథుని(సింధూనాం రాజా సింధువులకు రాజు వంటివాడు), ప్రార్దయత్ = చంపించితివి, కర్ణముక్తే = కర్ణుని చేత విడువబడిన, నాగాస్త్రే= నాగాస్త్రమును, క్షితిమ్= భూమియందు (క్షియంతి నివసంతి అస్యామ్ దీని పైన నివసింతురు. భూమి నివాసము), అవనమయన్= క్రుంగునట్లు చేసితివి, తత్ర అపి =అచ్చట కూడా (ఫలితంగా),

కేవలం పార్థం కృత్తమౌళిం= కేవలము అర్జునుని కిరీటము మాత్రము ఖండించబడి కింద పడిపోవునట్లుగా చేసి. (ఖండిత సకేశ కిరీటమ్) (కృత్తం ఛిన్నమ్ ఛేదించబడినది), తత్రే = రక్షించావు, భవాన్ = నువ్వు, పాండవానామ్ హి= పాండవుల కొరకు, కిమ్ ఇవ = ఏమి, న అకార్షీత్= చేయలేదు?

**తాత్పర్యము:** ద్రోణుడు సైన్యాధిపతిగా చేయుచున్న యుద్ధములో తన గజవాహనముపై స్థిరముగా కూర్చొని యుద్ధమునకు వచ్చిన నరకాసురుని పుత్రుడగు భగదత్తునిచే ప్రయోగించిన వైష్ణవాస్త్రమును నీ వక్షస్థలమున నిరోధించితివి. నీ చక్రముచే సూర్యుని కప్పిపెట్టి జయద్రథుని చంపించితివి. కర్ణుడు నాగాస్త్రము విడువగా అర్జునుని రథమును భూమియందు కుంగునట్లు చేసితివి. ఫలితంగా కేవలము అర్జునుని కిరీటము మాత్రము ఖండించబడి కింద పడిపోవునట్లుగా చేసి రక్షించావు. నువ్వు పాండవుల కొరకు ఏమి చేయలేదు? (ఎన్నోసార్లు కృష్ణుడు భీష్ముని కాపాడాడని భావం)

**86-9 శ్లో.**
**యుద్ధాదౌ తీర్థగామీ స ఖలు హలధరో నైమిశక్షేత్రమృచ్ఛన్**
**అప్రత్యుత్థాయి సూతక్షయకృదథ సుతం తత్పదే కల్పయిత్వా ।**
**యజ్ఞఘ్నం బల్వలం పర్వణి పరిదలయన్ స్నాతతీర్థో రణాంతే**
**సంప్రాప్తో భీమదుర్యోధనరణమశమం వీక్ష్య యాతః పురీం తే ॥**

**ప్రతిపదార్థము:** యుద్ధ ఆదౌ = యుద్ధము ప్రారంభమయిన సమయమున (యుధ్యతే యుద్ధము), సః హలధరః = ఆ బలరాముడు (హలం ధరతి ఆయుధత్వేన–హలమును ఆయుధంగా ధరించువాడు. బలరాముడు), తీర్థగామీ ఖలు = తీర్థయాత్రలు చేయుచు (తరతి పాపాదికం యస్మాత్ దీనితో పాపాదులను తరింతురు. తీర్థము), నైమిశక్షేత్రమ్ = నైమిశారణ్యమునకు, ఋచ్ఛన్ = వెళ్ళి (గతి–ఇంద్రియ–మూర్తి–ప్రళయభావేషు ఋచ్ఛతి వెళ్లుట), అప్రత్యుత్థాయి= తనను చూచి నిలబడి గౌరవం ఇవ్వలేదను కోపముతో (ప్రత్యుత్థానము= ప్రతి ఉత్తిష్ఠతి తస్య భావః కర్మ వా వచ్చిన వాడిని సన్మానించుటకు నిలబడుట. దీనికి వ్యతిరేకము అప్రత్యుత్థానము), సూతక్షయకృత్= సూతుని (రోమహర్షణుని)

సంహరించి(సువతి ప్రేరయతి జ్ఞానమ్ జ్ఞానమును ప్రేరేపించువాడు. సూతమహర్షి, రోమహర్షణుడు), అథ =అటుపిమ్మట సుతం= అతని కుమారునికి (సూతుని కుమారుని), తత్పదే =సూతుని స్థానమయిన గురుస్థానమును, కల్పయిత్వా = కల్పించి, పర్వణి= ప్రతి పర్వ దినములో (ప్రీణంతి దేవాన్ అస్మిన్ దీనియందు దేవతలను ప్రసన్నము చేయుదురు. అష్టమీ, అమావాస్య, పూర్ణిమా మొదలగు పర్వములు), యజ్ఞఘ్నం= యజ్ఞములను నాశనము చేయుచున్న (ఇజ్యంతే పూజ్యంతే దేవతాః అత్ర–దేవతలు ఇక్కడ పూజింపబడుదురు. యజ్ఞము), బల్వలం= బల్వలుడను రాక్షసుని (ఇల్వలుని కొడుకు. పల్వలుడని మరొక పేరు), పరిదలయన్= చంపి, స్నాతతీర్థః = అనేక తీర్థములలో స్నానము చేసి (కృత స్నానః–స్నానం చేసినవాడు అభిషేకము చేసినవాడు), రణాంతే= కౌరవ పాండవ యుద్ధము ముగియు సమయములో, సంప్రాప్తః= కురుక్షేత్రమునకు వచ్చి, అశమం=నిర్విరామముగా జరుగుచున్న (శామ్యతి తస్య భావః–శాంతి అది లేనిది అశమము), భీమదుర్యోధనరణమ్= భీమ దుర్యోధనుల గదాయుద్ధమును, వీక్ష్య= చూసి, తే పురీం = నీ ద్వారకా పురమునకు, యాతః= వచ్చెను.

**తాత్పర్యము:** యుద్ధము ప్రారంభమయిన సమయమున ఆ బలరాముడు తీర్థయాత్రలు చేయుచు నైమిశారణ్యమునకు వెళ్ళి తనను చూచి నిలబడి గౌరవం ఇవ్వలేదను కోపముతో సూతుని సంహరించి ,అటుపిమ్మట సూతుని కుమారునికి గురుస్థానమును కల్పించి , ప్రతి పర్వ దినములో యజ్ఞములను నాశనము చేయుచున్న బల్వలుడను రాక్షసుని చంపి, అనేక తీర్థములలో స్నానము చేసి కౌరవ పాండవ యుద్ధము ముగియు సమయములో కురుక్షేత్రమునకు వచ్చి, నిర్విరామముగా జరుగుచున్న భీమ దుర్యోధనుల గదాయుద్ధమును చూసి ఆపుటకు ప్రయత్నించి వారు తన మాట విననందువలన ద్వారకా పురమునకు తిరిగి వచ్చెను.

**విశేషాలు**

**నైమిశము:** ఒక అడవి. తొల్లి మరీచి, అత్రి, భృగు, వసిష్ఠుడు, క్రతువు, అంగిరసుడు – వీరి వంశజులు అగు ఆఱు తెగలవారు తాము తపము ఆచరింప తావుచూపుము అని బ్రహ్మను వేడగా అతఁడు మనోమయ చక్రమును ఒకటిని సృజియించి దానిని

దొర్లించి వారల కాంచి 'మీరు ఈ చక్రము వెన్నంటి చనుడు, అది ఎచట నిలుచునో అదియె మీకు తపస్సుచేయుటకు తగినచోటు అగును' అని ఆనతిచ్చెను. అది పోవుచు పోవుచు ఒకచోట నేమి (అనఁగా చక్రపు ఇనుపకట్టు) వదలి తట్టుపడెను. ఆస్థలము నైమిశము అన పరగెను. ఈనైమిశము పురాణ ప్రసిద్ధమైన అరణ్యము. పెక్కండ్రు ఋషులు అనేక సంవత్సరములు ఇచట తపము ఆచరించుటవలన దీనిని మహాపుణ్యక్షేత్రము అని కొనియాడుదురు.

**86-10 శ్లో.**
**సంసుప్తద్రౌపదేయక్షపణహతధియం ద్రౌణిమేత్య త్వదుక్త్యా**
**తన్ముక్తం బ్రాహ్మమస్త్రం సమహృతవిజయో మౌళిరత్నం చ జగ్రే ।**
**ఉచ్ఛిత్త్యై పాండవానాం పునరపి చ విశత్యుత్తరాగర్భమస్త్రే**
**రక్షన్నంగుష్ఠమాత్రః కిల జఠరమగాశ్చక్రపాణిర్విభో! త్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** సంసుప్త= నిద్రపోవు (సుప్తః నిద్రితః శయితః – పడుకొన్నవాడు), ద్రౌపదేయ= ద్రౌపది కుమారులను (ఉపపాండవులను)(ద్రౌపద్యాః అపత్యం పుమాన్ ద్రౌపది కుమారుడు), క్షపణ =సంహరించిన, హతధియం = అవిదిత కర్తవ్య బుద్ధి కలిగిన, ద్రౌణిమ్ = అశ్వత్థామను(ద్రోణస్య అపత్యమ్ ద్రోణుని కుమారుడు. అశ్వత్థామ), ఏత్య= సమీపించి, తత్ ముక్తం= ఆ అశ్వత్థామ చే విడువబడిన(త్యక్తః, ప్రాప్తమోక్షణ–వదలబడినది), బ్రాహ్మం అస్త్రం = బ్రహ్మాస్త్రమును (బ్రహ్మస్వరూపం అస్త్రమ్ బ్రహ్మాస్త్రము), త్వత్ ఉక్త్యా = నీ సూచనచే, సమహృత= ఉపసంహరించి (తిప్పికొట్టి) (అపహృతః, నీతః, ఊఢః– అపహరింపబడినది), మౌళిరత్నం చ = అతనిశిరో రత్నమును, విజయః = అర్జునుడు, జగ్రహే= లాగికొనెను, పాండవానాం = పాండవుల యొక్క, ఉచ్ఛిత్త్యై = మూలచ్ఛేదము కొరకు (ఉచ్ఛిత్తిః ఉచ్ఛేదః వినాశః ఉచ్ఛేదము. పీకి పారవేయుట వినాశము), పునః అపి చ = మరలా, అస్త్రే = బ్రహ్మాస్త్రమును అతడు ప్రయోగింపగా (అస్యతే క్షిప్యతే అసౌ విసరబడునది. బాణము మొదలగునవి), ఉత్తరాగర్భమ్= అది ఉత్తరాగర్భమును, విశతి = ప్రవేశించెను, విభో= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అంగుష్ఠమాత్రః = అంగుష్ఠమాత్ర దేహుడవై (అంగుష్ఠః పరిమాణమ్ బొటన

వ్రేలు పరిమాణము), చక్రపాణిః = చక్రమును అడ్డు పెట్టి(చక్రం సుదర్శన చక్రం పాణౌ యస్య సుదర్శన చక్రము చేతియందు గలవాడు. విష్ణువు), త్వమ్ = నువ్వు, రక్షన్ =అస్త్రము నుండి శిశువును రక్షించుటకు, జఠరమ్= ఉత్తరా గర్భములో (జాయతే ప్రాణి అస్మిన్ ఇందులో ప్రాణి వుండును. కడుపు), అగాః కిల =ప్రవేశించావు కదా!

**తాత్పర్యము:** నిద్రపోవు ఉపపాండవులను సంహరించిన అశ్వత్థామను ఎదిరించి అతడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమును నీ సూచనచే తిప్పికొట్టి అతనిశిరో రత్నమును అర్జునుడు లాగికొనెను. పాండవుల యొక్క నాశనము కొరకు మరలా బ్రహ్మాస్త్రమును అతడు ప్రయోగింపగా అది ఉత్తరాగర్భమును ప్రవేశించెను. ఓ గురువాయూరు కృష్ణ దేవా ! అప్పుడు అంగుష్ఠమాత్ర దేహుడవై చక్రమును అడ్డు పెట్టి నువ్వు ఆ అస్త్రము నుండి శిశువును రక్షించుటకు ఉత్తరా గర్భములో ప్రవేశించావు కదా !

**86-11 శ్లో.**
**ధర్మౌఘం ధర్మ సూనోరభిదధదఖిలం ఛందమృత్యుస్స భీష్మః**
**త్వాం పశ్యన్ భక్తిభూమ్నైవ హి సపది యయౌ నిష్కలబ్రహ్మభూయమ్ ।**
**సంయాజ్యాథాశ్వమేధైస్త్రిభిరతిమహితైర్ధర్మజం పూర్ణకామం**
**సంప్రాప్తో ద్వారకాం త్వం పవనపురపతే! పాహి మాం సర్వరోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** ఛందమృత్యుః = స్వచ్ఛందమరణముపొందు వరముకలిగిన (ఛంద్యతేఽసౌ కోరబడునది. కోరిక), సః భీష్మః = ఆ భీష్ముడు (బిభేత్యస్మాత్, భీషయతే వా దీనితో భయపడుదురు. ఇది భయపెట్టును. భీష్ముడు), ధర్మసూనోః = ధర్మజుడు కోరగా(ధర్మస్య సుతః-ధర్మరాజు), అఖిలం = సమస్త, ధర్మౌఘం= ధర్మసూక్ష్మములను, అభిదధత్= ఎరింగించెను, సపది = వెంటనే (సహ పద్యతే వెంబడి వుండునది. తత్క్షణము), త్వాం = నిన్ను, పశ్యన్ = చూస్తూ, భక్తిభూమ్నా ఏవ= ఎడబాయని భక్తితో, నిష్కలబ్రహ్మభూయమ్= నిష్కల బ్రహ్మత్వమును(మోక్షమును), యయౌ హి = పొందెను, పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అథ = అటుపిమ్మట, పూర్ణకామం =పూర్తిగా నెరవేరిన కోరికలు కలిగిన, ధర్మజం= ధర్మరాజు చే, అతిమహితైః = మహిమాన్వితములైన,

త్రిభిః = మూడు, అశ్వమేధైః = అశ్వమేధ యాగములు (అశ్వః మేధ్యతే సంగమ్యతే స్పృశ్యతే అనంతరముత్సృజ్యతే ఇక్కడ గుఱ్ఱము స్పృశింపబడును. అశ్వమేధ యాగము), సంయాజ్య = చేయించి, ద్వారకాం = ద్వారకా నగరమునకు (ప్రశస్తద్వారేన కాయతి ప్రకాశతే మంచి ద్వారములు కలది. ద్వారకా నగరము. కృష్ణుడు నివసించిన యొక పట్టణము), సంప్రాప్తః = తిరిగి వచ్చితివి, త్వం = నువ్వు, మాం = నన్ను, సర్వరోగాత్ = సర్వ రోగముల నుండి (రుజతి రుజ్యతే వా అనేన– పీడించునది, దీనితో పీడింపబడుదురు. వ్యాధి), పాహి = రక్షించు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! స్వచ్ఛందమరణముపొందు వరముకలిగిన ఆ భీష్ముడు – ధర్మజుడు కోరగా సమస్త ధర్మసూక్ష్మములను తెలిపెను. వెంటనే నిన్ను చూస్తూ ఎడబాయని భక్తితో భీష్ముడు మోక్షమును పొందెను. అటుపిమ్మట ధర్మరాజు చే మహిమాన్వితములైన మూడు అశ్వమేధ యాగములు చేయించి ద్వారకా నగరమునకు తిరిగి వచ్చితివి. నువ్వు నన్ను సర్వ రోగముల నుండి రక్షించు.

**విశేషాలు**

**నిష్కలం:** కలా అంటే ఒక శకలం. ఒక భాగం. ఒక ముక్క. ప్రాణం మొదలు నామంవరకూ పదహారు ఇవి. మొత్తం అనాత్మ. ప్రపంచమంతా ఈ పదహారే. షోడశ కళలని పేరు వీటికి. వీటితో కలిపి పట్టుకుంటే ఆత్మసకలం. వాటిని లయం చేసి పట్టుకుంటే నిష్కలం లేదా అకలం. కళాప్రళయ మార్గమేదో గురూపదేశంవల్ల గ్రహించాలని ప్రశ్నోపనిషత్తులో భాష్యకారుల ఉపదేశం.

**అశ్వమేధం:** ఒక యజ్ఞం. 'కల్ప సూత్రం' ప్రకారం ఇది మూడు రోజులు జరిగే యజ్ఞం. మొదటి రోజు చతుష్టోమం. రెండవ రోజు ఉక్థ్యమనే యజ్ఞం. మూడవ రోజు అతి రాత్రం. ఒకప్పుడు అశ్వ మేధ యజ్ఞంలో అరణ్య మృగాలను, గ్రామ్య మృగాలను బలి ఇచ్చే ఆచారం ఉండేది. శుక్ల యజుర్వేదానికి సంబంధించిన శతపథ బ్రాహ్మణంలోని 'అగ్నిర్వా అశ్వః అజ్యం మేధః' అనే వాక్యం ప్రకారం అగ్నిలో నేయిని పోసి వ్రేల్చడం మాత్రమే అశ్వమేధమని స్వామి దయానంద తమ సత్యార్థ ప్రకాశంలో స్పష్టం చేశారు.. పూర్వ ప్రభువులు కొందరు ఇందుకు భిన్నంగా

దిగ్విజయ యాత్రల కోసం అశ్వాన్ని దాని ఇష్టం వచ్చినట్లు పోనివ్వడం, శత్రు రాజులను జయించడానికి అదొక సాకు కావడం, జుగుప్సాకరమైన మరికొన్ని ఆచారాలను పాటించడం జరుగుతుండేది. వాటికి ఆనాడు సైతం వ్యతిరేకత ఉన్నట్టు పౌరాణిక ఆధారాలు ఉన్నాయి. ఇప్పుడు వాటికి సామాజిక ఆమోదం గానీ, శాస్త్ర సమర్థన గానీ లేదు. వామాచార ప్రభావం వల్ల యజ్ఞ కాండలో వేద విహితం కాని జుగుప్సాకర ఆచారాలు ప్రవేశించాయని వేదాన్ని విశ్వసించి గౌరవించే పలువురి విశ్లేషణ..

**దశమ స్కంధము**

**86వ దశకము సమాప్తము.**



# దశకమ్ 87 – కుచేలోపాఖ్యానము

**87–1 శ్లో.**

**కుచేలనామా భవతస్సతీర్థ్యతాం గత స్స సాందీపనిమందిరే ద్విజః ।**
**త్వదేకరాగేణ ధనాదినిఃస్పృహో దినాని నిన్యే ప్రశమీ గృహాశ్రమీ ॥**

**ప్రతిపదార్థము:** సాందీపనిమందిరే =సాందీపని ముని ఆశ్రమములో (సందీపనస్య అపత్యమ్ సందీపనుని సంతానము. సాందీపని), కుచేలనామా= కుచేలుడు అనుపేరు గల బ్రాహ్మణుడు, భవతః= నీకు, స తీర్థ్యతాం గతః= సబ్రహ్మచారిగా ఉండేవాడు.(సహాధ్యాయిగా ఉండేవాడు)(సమాన తీర్థే వసతి, తీర్థః గురురుచ్యతే ఒకే దగ్గర వుండువాడు. సహాధ్యాయి), స ద్విజః = ఆ బ్రాహ్మణుడు(ద్విః జాయతే రెండుసార్లు పుట్టువాడు), ప్రశమీ =అతడు శాంతుడై(జితేంద్రియుడై) (అతిశయేన శామ్యతి శాంతో భవతి తస్య భావః ప్రశాంతి ప్రశమనము ఉపశమనము), గృహాశ్రమీ = గృహస్థాశ్రమము గడుపుచూ (గృహ్ణాతి ధాన్యాదికం మనుష్యాంశ్చ–ధనాదులను, మనుష్యులను గ్రహించునది. గృహము, ఇల్లు), త్వత్ ఏకరాగేణ = నీయందు ప్రేమ లక్షణము గల భక్తితో, ధన–ఆదినిఃస్పృహః= సిరిసంపదలలో ఆసక్తి లేనివాడై, దినాని= రోజులను, నిన్యే =గడుపుచుండెను.

**తాత్పర్యము:** సాందీపని ముని ఆశ్రమములో కుచేలుడు అను పేరు గల బ్రాహ్మణుడు నీకు సహాధ్యాయిగా ఉండేవాడు. ఆ బ్రాహ్మణుడు శాంతుడై , గృహస్థాశ్రమము గడుపుచూ నీయందు ప్రేమ లక్షణము గల భక్తితో సిరిసంపదలలో ఆసక్తి లేనివాడై రోజులను గడుపుచుండెను.

**87–2 శ్లో.**

**సమానశీలాఽపి తదీయ వల్లభా తథైవ నో చిత్తజయం సమేయుషీ ।**
**కదాచిదూచే బత వృత్తిలబ్ధయే రమాపతిః కిం న సఖా నిషేవ్యతే ॥**

**ప్రతిపదార్థము:** తదీయ వల్లభా = ఆయన భార్య(వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపునది. ప్రియురాలు), సమానశీలా అపి=అన్ని విషయములలో అతనితో సమానమయిన శీలము కలిగినది అయినప్పటికి

(అనుకూలవతి అయినప్పటికి), తథా ఏవ = కుచేలుని వలె, చిత్తజయం = ధనాదుల విషయంలో మనస్సును కోరికలేకపోవుటను(చిత్యతే జ్ఞాయతే అనేన–దీనితో తెలుసుకుందురు), నో సమేయుషీ= పొందలేదు, బత= అయ్యో!, వృత్తి= జీవనోపాయము(వర్తతే జీవతి అనయా దీనితో జీవింతురు. వృత్తి), లబ్ధయే= పొందుటకొరకు, రమాపతిః= లక్ష్మీపతి అయిన శ్రీకృష్ణుని (రమయతి ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి), కిం న నిషేవ్యతే = ఎందుకు ఆశ్రయించరాదు? (ఎందుకు కలువకూడదు?), కదాచిత్ = (అని ) ఒకసారి, ఊచే = భర్తతో ఆమె పలికెను.

**తాత్పర్యము:** ఆయన భార్య అన్ని విషయములలో అతనితో సమానమయిన శీలము కలిగినది అయినప్పటికి కుచేలుని వలె ధనాదుల విషయంలో మనస్సును అమె జయించలేదు. సుఖ జీవనము పొందుటకొరకు లక్ష్మీపతి అయిన శ్రీకృష్ణుని ఎందుకు కలువకూడదు?అని ఒకసారి భర్తతో ఆమె పలికెను.

**87–3 శ్లో.**

**ఇతీరితోయం ప్రియయా క్షుధార్తయా జుగుప్సమానోఽపి ధనే మదావహే ।**
**తదా త్వదాలోకనకౌతుకాద్యయౌ వహన్ పటాంతే పృథుకానుపాయనమ్ ॥**

**ప్రతిపదార్థము:** క్షుధా ఆర్తయా = ఆకలి బాధతో (క్షుధ ఏవ క్షుధా భోజనేచ్ఛా ఆకలి. భోజనేచ్ఛ)(ఆర్తః పీడితః దుఃఖితః–పీడింపబడ్డ), ప్రియయా= సంతానవతి అయిన తన ప్రియసతి(ప్రీణాతి అసౌ ప్రియమైనది ప్రియము చేయునది), ఇతి = ఈ విధముగా, ఈరితః = ప్రేరేపింపబడి(ఈరితః ప్రేషితః ప్రేరితో వా పంపబడ్డవాడు ప్రేరేపింపబడ్డవాడు), అయం = ఈ కుచేలుడు, మద –ఆవహే ధనే = సంపద మనిషికి మదము కలిగించునన్న భావనతో ధనముపై (మాదయతి మాద్యతి అనేన–దీనితో ఆనందింతురు, మత్తును పొందుదురు. అహంకారము)(ఆవహతి ఉత్పాదయతి మార్గం దర్శయతి అసౌ పుట్టించునది), జుగుప్సమానః అపి= దానిపై ఏవగింపు కలిగినప్పటికి (జుగుప్సా నిందా నింద), తదా = అప్పుడు, త్వత్ ఆలోకనకౌతుకాత్ = నిన్ను చూడవచ్చునన్న కోరికతో(ఆలోక్యంతే ప్రకాశ్యంతే అనేన దృష్టి, చూపు చూచుట), పట అంతే = వస్త్రపు చివర (ఉత్తరీయపు కొంగున) (పట్యతే వేష్ట్యతే నేయబడునది. వస్త్రము), ఉపాయనమ్= నీకు కానుకగా

సమర్పించుటకు (ఉప ఈయతే గమ్యతే దీయతే వా దగ్గరకు వెళ్లుట కానుక), పృథుకాన్= అటుకులను (పృథుత్వాత్, పృథు కాయతీతి చ కై శబ్దే ఉబికినది), వహన్= మూటకట్టుకొని, యయౌ= నీ వద్దకు ప్రయాణమయ్యెను.

**తాత్పర్యము:** ఆకలి బాధతో సంతానవతి అయిన తన ప్రియసతి ఈ విధముగా ప్రేరేపించగా ఈ కుచేలుడు సంపద మనిషికి మదము కలిగించునన్న భావనతో ధనముపై ఏవగింపు కలిగినప్పటికి నిన్ను చూడవచ్చునన్న కోరికతో ఉత్తరీయపు కొంగున నీకు కానుకగా సమర్పించుటకు అటుకులను మూటకట్టుకొని నీ వద్దకు ప్రయాణమయ్యెను.

**87-4 శ్లో**

**గతోయమాశ్చర్యమయీం భవత్పురీం గృహేషు శైబ్యాభవనం సమేయివాన్ ।**
**ప్రవిశ్య వైకుంఠ మివాప నిర్వృతిం తవాతిసంభావనయా తు కిం పునః ॥**

**ప్రతిపదార్థము:** అయం= ఈ కుచేలుడు, ఆశ్చర్యమయీం = అనల్పశిల్పము కలిగిన (వైభవము కలిగిన)('ఆః' ఇతి విస్మయస్య చర్యా ప్రకటనం అద్భుతమ్ విస్మయము ఆశ్చర్యము అసాధారణము), భవత్ పురీం= నీ ద్వారకాపురమును, గతః = చేరి, గృహేషు = అచ్చట ఉన్న భవనములలో, శైబ్యాభవనం = శైబ్య (మిత్రవింద) అను నీ పట్టపురాణి ఇంటిలో నువ్వు ఉండగా, సమేయివాన్ = ప్రవేశించి, వైకుంఠం ప్రవిశ్య ఇవ = వైకుంఠంలో ప్రవేశించినట్లుగా (వికుంఠస్య విష్ణోః ఇంద్రస్య వా ఇదం వా విష్ణువు, ఉండు చోటు. స్వర్గము), నిర్వృతిం = ఆనందమును(నితరాం వృతిః వర్తనస్థితిః-మంచి స్థితి. సుస్థితి సుఖము), అవాప= పొందెను, తవ = నువ్వు అతనికి చేసిన, అతిసంభావనయా తు= అత్యధిక సన్మానమువలన కలిగిన ఆనందమును గురించి ( సమ్యక్ భావనం ఆలోచనం ఉద్భావనమ్, ఆదరః-ఆలోచించుట భావించుట ఆదరించుట), కిం పునః= మరలా చెప్పుటకు ఏమున్నది?

**తాత్పర్యము:** ఈ కుచేలుడు వైభవము కలిగిన నీ ద్వారకాపురమును చేరి, అచ్చట ఉన్న భవనములలో శైబ్య అను నీ పట్టపురాణి ఇంటిలో నువ్వు ఉండగా ప్రవేశించి - వైకుంఠంలో ప్రవేశించినట్లుగా ఆనందమును పొందెను. నువ్వు అతనికి చేసిన

అత్యధిక సన్మానమువలన కలిగిన ఆనందమును గురించి మరలా చెప్పుటకు ఏమున్నది? (నీ సన్మానముతో అతడు అమితానందమును పొందెనని భావం)

**విశేషాలు:** ప్రకటమై విలసిల్లు నొక వధూమణి మందిరమున (10.2-978) అని పోతనగారు, వివేశైకతమం (80 వ అధ్యాయము 17 వశ్లోకం) అని సంస్కృత భాగవతము ఒక పట్టమహిషి అని చెప్పి ఊరుకొన్నారు. శ్రీ ధరుడు కూడా వ్యాఖ్యానములో "ఏకతమం గృహం వివేశ" (ఒక ఇంటిలో ప్రవేశించెను) అని చెప్పాడు. భట్టాత్రి మాత్రం శైబ్య భవనము అని చెప్పాడు.

**87-5 శ్లో.**

**ప్రపూజితం తం ప్రియయా చ వీజితం కరే గృహీత్వాఽకథయః పురాకృతమ్ ।**
**యదింధనార్థం గురుదారచోదితైరపర్తువర్షం తదమర్షి కాననే ॥**

**ప్రతిపదార్థము:** ప్రపూజితం = నువ్వు కుచేలుని చక్కగా పూజించగా(పూజితః అర్చితః-పూజింపబడినది. అర్చింపబడినది), ప్రియయా= నీ భార్య (ప్రీణాతి అసౌ సంతోషపెట్టువాడు ప్రియమైనది ప్రియము చేయునది), వీజితం చ = వింజామరతో వీచగా, తం చ = ఆ వింజామరను, కరే = నీ చేతిలోకి( కరోతి అనేన కార్యాణి దీనితో పనులు చేయుదురు. చెయ్యి), గృహీత్వా = తీసుకొని(అనగా కృష్ణుడే కుచేలునికి వింజామర వీచెనని భావం), ఇంధనార్థం =కట్టెల కొరకు (ఇధ్యతే ప్రజ్వాల్యతే అగ్నిః అనేన-దీనితో అగ్ని ప్రజ్వలింపజేయబడును. ఇంధనము), గురుదారచోదితైః = సాందీపని మహర్షి భార్య చే పంపబడి (దారయంతి ఉద్వేజయంతి పతీనితి దారాః- పతులను భయపెట్టువారు), కాననే= అడవిలో (కానయతి దీపయతి అసౌ ప్రకాశించునది. వనము), అపర్తుం = వర్షాకాలము కాని కాలములో కూడా, వర్షం అమర్షి = జడివాన కురిసిన (వృష్యతే సిచ్యతే ప్రియతే ప్రార్థ్యతే తడుపబడునది. వర్షము), యత్ = ఏ వృత్తాంతము కలదో, తత్ = ఆ, పురాకృతమ్= పూర్వము జరిగిన కథను( పురా పూర్వస్మిన్ కాలే కృతమ్ ముందు కాలంలో చేయబడినది పూర్వకాలంలో చేయబడినది), అకథయః= చెప్పితివి.

**తాత్పర్యము:** నువ్వు కుచేలుని చక్కగా పూజించగా నీ భార్య వింజామరతో వీచగా,

ఆ వింజామరను నీ చేతిలోకి తీసుకొని అతనికి వీచుచూ –కట్టెలకొరకు సాందీపని మహర్షి భార్య చే పంపబడి అడవికి వెళ్ళగా వర్షాకాలము కాని కాలములో కూడా జడివాన కురిసిన పూర్వము జరిగిన కథను – నువ్వు గుర్తు చేసుకొంటూ చెప్పితివి.

**87–6 శ్లో.**

**త్రపాజుషోఽస్మాత్ పృథుకం బలాదథ ప్రగృహ్య ముష్టౌ సకృదాశితే త్వయా।**
**కృతం కృతం నన్వియతేతి సంభ్రమాద్రమా కిలోపేత్య కరం రురోధ తే॥**

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, త్రపాజుషః = నీకు కానుకగా తెచ్చిన అటుకులు నీకు ఇచ్చుటకు సిగ్గుపడుచున్న(త్రపతే లజ్జతే తస్య భావః–సిగ్గు), అస్మాత్ = మిత్రుని దగ్గర నుండి, త్వయా= నువ్వు, బలాత్ = బలవంతముగా, పృథుకం= అటుకులను, ప్రగృహ్య= స్వీకరించి, ముష్టౌ= పిడికెడు అటుకులు(ముషతి బధ్నాతి బంధింపబడునది. పిడికిలి), సకృత్= ఒక్కసారి(ఏకవారమ్ ఒకసారి), ఆశితే = తిని (ఇంకొక పిడికెడు తినబోవుచుండగా), రమా= లక్ష్మి దేవి అవతారమయిన రుక్మిణి (రమయతి ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి), సంభ్రమాత్ = సంభ్రమముగా ఒక్క ఉదుటున (సం అధికం భ్రమతి బిభేతి, చపలో భవతి తస్య భావః కర్మ వా చాపల్యము భయం తత్తరపాటు తొందర), ఉపేత్య= ముందునకు వచ్చి, ఇయతా కృతం కృతం నను =చాలు చాలు. ఇప్పటికి తిన్నది చాలు, ఇతి = అని, తే కరం= నీ చేతిని, రురోధ కిల = పట్టుకొన్నది కదా!

**తాత్పర్యము:** అటుపిమ్మట నీకు కానుకగా తెచ్చిన అటుకులు నీకు ఇచ్చుటకు సిగ్గుపడుచున్న మిత్రుని దగ్గర నుండి నువ్వు బలవంతముగా అటుకులను స్వీకరించి పిడికెడు అటుకులు ఒక్కసారి తిని ఇంకొక పిడికెడు తినబోవుచుండగా– లక్ష్మిదేవి అవతారమయిన రుక్మిణి సంభ్రమముగా ఒక్క ఉదుటున ముందునకు వచ్చి "చాలు చాలు. ఇప్పటికి తిన్నది చాలు" అని నీ చేతిని పట్టుకొన్నది కదా !

**87–7 శ్లో.**

**భక్తేషు భక్తేన స మానితస్త్వయా పురీం వసన్నేకనిశాం మహాసుఖమ్ ।**
**బతాపరేద్యుర్ద్రవిణం వినా యయౌ విచిత్రరూపస్తవ ఖల్వనుగ్రహః ॥**

**ప్రతిపదార్థము:** భక్తేషు= భక్తులకు, భక్తేన = భక్తుడవయిన(భజతే అసౌ భజించువాడు. భక్తుడు), త్వయా = నీ చేత, మానితః = పూజితుడైన(మానః అస్య సంజాతః పూజితః–అభిమానము కలవాడు, పూజింపబడినవాడు), సః= ఆ కుచేలుడు, ఏకనిశాం = ఒక రాత్రి అంతయు (నితరాం శ్యతి తనూకరోతి జీవానాం వ్యాపారాన్ జీవుల పనులను తగ్గింప చేయునది. రాత్రి), మహాసుఖమ్ = మహా సుఖముగా (సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), పురీం = నీ నగరమున (పూర్యతే ప్రాణిభిః–ప్రాణులచే నింపబడునది. పురము), వసన్ = నివసించి, అపరేద్యుః= మరునాడు (అపరస్మిన్ అహని మరొకదినము), ద్రవిణం వినా= ధనము ఏమి లేకయే(ద్రవతి గచ్ఛతి ద్రూయతే ప్రాప్యతే వా పోవునది పొందబడునది. ధనము), యయౌ = ఇంటికి బయలుదేరెను, బత= అయ్యో!, తవ అనుగ్రహః = నీ అనుగ్రహము(అనుగ్రహః దుఃఖదూరకరణేచ్ఛా దయ చూపుట అనుగ్రహించుట), విచిత్రరూపః ఖలు = చాలా విచిత్రముగా ఉండును కదా! (సమక్షానుగ్రహము, అసమక్షానుగ్రహము మొదలగు అనేక విధములు) (విచిత్రాణి రూపాణి యస్య–అనేక రూపములు, ప్రకారములు కలది).

**తాత్పర్యము:** భక్తులకు భక్తుడవయిన నీ చేత పూజితుడైన ఆ కుచేలుడు ఒక రాత్రి అంతయు మహా సుఖముగా నీ నగరమున నివసించి , మరునాడు ధనము ఏమి లేకయే ఇంటికి బయలుదేరెను. నీ అనుగ్రహము చాలా విచిత్రముగా ఉండును కదా!

**87–8 శ్లో.**

**యది హ్యయాచిష్యమదాస్యదచ్యుతో వదామి భార్యాం కిమతి వ్రజన్నసౌ ।**
**త్వదుక్తిలీలాస్మితమగ్నధీః పునః క్రమాదపశ్యన్ మణిదీప్రమాలయమ్ ॥**

**ప్రతిపదార్థము:** యది హి = ఒకవేళ నేను (పక్షాంతరం సంభావనామరొక పక్షము, ఒక వేళ), అయాచిష్యం = అర్థించినచో, అచ్యుతః = శ్రీ కృష్ణుడు (స్వరూప సామర్థ్యాత్ న చ్యుతః చ్యవతే వా స్వరూప సామర్థ్యం వలన చ్యుతుడు కానివాడు. విష్ణుడు), అదాస్యాత్ = అడిగిన సంపదలు ఇచ్చేవాడు, భార్యాం= ఇంటికి వెళ్ళి నా

భార్యతో ( భర్తుం యోగ్యా పోషింపదగినది. భార్య), కిం వదామి= ఇప్పుడు ఏమి చెబుతాను?, ఇతి=అని, అసౌ= ఆ కుచేలుడు, త్వత్ = నీయొక్క, ఉక్తిః = నువ్వు పలికినపలుకులు(వక్తి తస్య భావః–మాట, వచనము), లీలా= లీలా విలాసములు(లియం ఆమోదం లాతి క్రీడ, ఆమోదము), స్మిత= నీనవ్వులందు (ఈషద్ధసతి తస్య భావః కర్మ వా చిరునవ్వు, మందస్మితము), మగ్నధీః= నిమగ్నమయిన బుద్ధితో (అనగా తలచుకొనుచు) (మగ్నః నిమగ్నః, స్నాతః నిమగ్నుడైనవాడు మునిగినవాడు), పునః వ్రజన్= మరలా నడుచుచూ, క్రమాత్ = క్రమముగా, మణిదీప్రమ్ = మణుల కాంతులచే ప్రకాశించు(దీప్తుం శీలం అస్య–మందు (ప్రకాశించు) స్వభావం కలవి. కట్టెలు), ఆలయమ్ = తన ఇంటిని (ఒక రత్న భవనమును )(ఆలీయతే అస్మిన్ఇల్లు), అపశ్యత్ = చూసెను.

**తాత్పర్యము:** ఒకవేళ నేను అర్థించినచో శ్రీ కృష్ణుడు అడిగిన సంపదలు ఇచ్చేవాడు. ఇంటికి వెళ్ళి నా భార్యతో ఇప్పుడు ఏమి చెబుతాను? అని ఆ కుచేలుడు – నీయొక్క నువ్వు పలికినపలుకులు లీలా విలాసములు నీనవ్వులందు నిమగ్నమయిన బుద్ధితో (అనగా నిన్నే తలచుకొనుచు) మరలా నడుచుచూ క్రమముగా మణుల కాంతులచే ప్రకాశించు తన ఇంటిని (ఒక రత్న భవనమును ) చూసెను.

**87–9 శ్లో.**

**కిం మార్గవిభ్రంశ ఇతి భ్రమన్ క్షణం గృహం ప్రవిష్టస్స దదర్శ వల్లభామ్।**
**సఖీపరీతాం మణి హేమభూషితాం బుబోధ చ త్వత్కరుణాం మహాద్భుతామ్॥**

**ప్రతిపదార్థము:** మార్గవిభ్రంశః కిం = నేను దారి తప్పివచ్చితినా! ఏమి?(మార్గయతి అన్విషంతి లక్ష్యం అనేన–దీనితో లక్ష్యమును వెదుకుదురు. మార్గము, బాట.) (విశిష్టః భ్రంశః అధఃపాతః, క్షయః –క్రింద పడుట క్షీణించుట), ఇతి=అని, క్షణం = క్షణకాలముపాటు(క్షణోతి నాశయతి సర్వం యథాకాలమ్ అన్నింటిని నశింపచేయునది. క్షణకాలము), భ్రమన్ = భ్రమకు లోనయి (భ్రమతి, భ్రామ్యతి వా, తస్య కర్మ భావో వా భ్రమించుట, మిథ్యాజ్ఞానము, భ్రాంతి, తిరుగుట), గృహం= తన ఇంట్లోకి (గృహ్ణాతి ధాన్యాదికం మనుష్యాంశ్చ–ధనాదులను, మనుష్యులను గ్రహించునది. గృహము, ఇల్లు), ప్రవిష్టః = ప్రవేశించి, సః = ఆకుచేలుడు,

సఖీపరీతాం= తన చుట్టు పెక్కుమంది సఖులు చేరగా (సహ సమానః ఖ్యాయతే సమానంగా చెప్పబడునది. స్నేహితురాలు.)(పరి ఇతః గతః, సమాప్తః పర్యాప్తః అధికృతో వా చుట్టుకొనబడినది), మణిహేమభూషితాం= బంగారు ఆభరణములను ధరించిన (అవ్యక్తం శబ్దం కరోతి అవ్యక్త శబ్దము చేయునది. మణి, రత్నము.)(హినోతి వర్ధతే స్ఫుటతి వా వృద్ధినొందునది ప్రకాశించునది. బంగారము), వల్లభామ్= తన భార్యను(వల్లయతి సంచాలయతి అనురాగమ్ అనురాగమును చూపునది. ప్రియురాలు), దదర్శ= చూసెను, మహాద్భుతామ్ = మహాద్భుతమైన(అభూతం ఇవ–ఇదివరకు జరగనిది), త్వత్ కరుణాం= నీ కరుణను, బుబోధ చ = కుచేలుడు తెలుసుకొనెను.

**తాత్పర్యము:** నేను దారి తప్పివచ్చితినా! ఏమి? అని క్షణకాలముపాటు భ్రమకు లోనయి తన ఇంట్లోకి ప్రవేశించి, ఆకుచేలుడు తన చుట్టు పెక్కుమంది సఖులు చేరగా బంగారు ఆభరణములను ధరించిన తన భార్యను చూసెను. మహాద్భుతమైన నీ కరుణను కుచేలుడు తెలుసుకొనెను.

**87–10 శ్లో.**

**స రత్నశాలాసు వసన్నపి స్వయం సమున్నమద్భక్తిభరోఽమృతం యయౌ ।**
**త్వమేవమాపూరితభక్తవాంఛితో మరుత్పురాధీశ! హరస్వ మే గదాన్ ॥**

**ప్రతిపదార్థము:** సః = అతడు(ఆ కుచేలుడు), స్వయం = స్వయముగా, రత్నశాలాసు = కామోద్దీపన విభవములైన రత్న మందిరములలో (రమయతి హర్షయతి, ఆనందయతి హర్షింప చేయునది, ఆనందింప చేయునది. రత్నము), వసన్ అపి= నివసించుచున్నప్పటికి, సమున్నమత్ = ఆర్ద్రమైన, భక్తిభరః = భక్తి భరుడై (భక్తి యోగమున), అమృతం = మోక్షమును(నాస్తి మరణం యస్మాత్ అమృతము), యయౌ = పొందెను, మరుత్పురాధీశ = ఓ గురువాయూరు కృష్ణదేవా!, ఏవమ్ =ఈ విధముగా, ఆపూరిత = తీర్చబడిన, భక్తవాంఛితః = భక్తుల కోర్కెలు కలిగిన(భక్తుల కోర్కెలు తీర్చువాడని భావం), త్వమ్= నువ్వు, మే= నాయొక్క, గదాన్ = రోగములను, హరస్వ = హరింపుము.

**తాత్పర్యము:** ఆ కుచేలుడు రత్న మందిరములలో నివసించుచున్నప్పటికి నీయందు భక్తి భరుడై మోక్షమును పొందెను. ఓ గురువాయూరు కృష్ణదేవా ! ఈ విధముగా భక్తుల కోర్కెలు తీర్చు నువ్వు నాయొక్క రోగములను హరింపుము.

**దశమ స్కంధము**

**87వ దశకము సమాప్తము**



# దశకమ్ 88 – సన్తానగోపాలము

**88–1 శ్లో.**

**ప్రాగేవాచార్యపుత్రాహృతినిశమనయా స్వీయషట్సూనువీక్షాం**
**కాంక్షంత్యా మాతురుక్త్యా సుతలభువి బలిం ప్రాప్య తేనార్చితస్త్వమ్ ।**
**ధాతుశ్శాపాద్ధిరణ్యాన్వితకశిపుభవాన్ శౌరిజాన్ కంసభగ్నాన్**
**ఆనీయైనాన్ ప్రదర్శ్య స్వపదమనయథాః పూర్వపుత్రాన్మరీచేః ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** ప్రాక్ ఏవ = పూర్వము(పురా అగ్రే పూర్వము (కాలవాచి), ఆచార్యపుత్ర = యమలోకమునుండి చనిపోయిన నీ గురు పుత్రుని(ఆచారం గ్రాహయతి శిష్యాన్ ఆచారే స్థాపయతి శిష్యులకు సదాచారము (బోధించువాడు) గ్రహింపచేయువాడు), ఆహృతి = నువ్వు తిరిగి తీసుకొని వచ్చితివనుమాట, నిశమనయా = విని, స్వీయషట్ సూనువీక్షాం = కంసుని చేతిలో మరణించిన తన ఆరుగురు పుత్రులను చూడగోరు, కాంక్షంత్యాః = కాంక్ష కలిగిన(కాంక్షతే తస్య భావః–కోరిక అభిప్రాయము), మాతుః = తల్లి యైన దేవకీదేవి యొక్క, ఉక్త్యా= మాటచే, త్వం = నువ్వు, సుతలభువి= సుతలభూమికి వెళ్ళి, బలిం ప్రాప్య=బలిని కలుసుకొని, తేన = అతనిచే, అర్చితః = పూజింపబడి (అర్చితః పూజితః – పూజింపబడువాడు), ధాతుః = బ్రహ్మ (దధాతి జగత్ ప్రపంచమును ధరించువాడు), శాపాత్ =శాపము వలన రాక్షసులై మొదట (శపతి అస్య భావః కర్మ వా శాపము), హిరణ్యాన్వితకశిపుభవాన్= హిరణ్యకశిపునికి జన్మించి (హిరణ్య+కశిపుతన్నామ దైత్యః–ఒక రాక్షసుడు. హిరణ్యకశిపుడు), శౌరిజాన్ =తరువాత వసుదేవునికి జన్మించి(శూరస్య గోత్రాపత్యమ్ శూరుని గోత్రములో పుట్టినవాడు), కంసభగ్నాన్ = కంసునిచే సంహరించబడిన (కనతి కామయతే పరపదార్థాన్ ఇతర పదార్థములను కోరువాడు, బలాత్కారంగా తీసుకొనువాడు. ఉగ్రసేనుని కుమారుడు, కంసుడు), మరీచైః = మరీచి మహర్షి యొక్క, పూర్వపుత్రాన్ ఏనాన్= ఆ పూర్వ పుత్రులనందరిని(మ్రియతే పాపరాశిః యస్మిన్ ఇతని యందు పాపరాశి నశించును. బ్రహ్మమానస జ్యేష్ఠపుత్రుడు), ఆనీయ = తిరిగి తీసుకొని

వచ్చి, ప్రదర్శ్య = వారినందరిని దేవకికి చూపించి, స్వపదమ్= స్వర్గము (విష్ణులోకము), అనయథాః = ప్రాప్తించునట్లు చేసితివి.

**తాత్పర్యము:** పూర్వము యమలోకమునుండి చనిపోయిన నీ గురు పుత్రుని నువ్వు తిరిగి తీసుకొని వచ్చితివనుమాట విని కంసుని చేతిలో మరణించిన తన ఆరుగురు పుత్రులను చూడగోరు కాంక్ష కలిగిన తల్లి యైన దేవకీదేవి యొక్క మాటచే నువ్వు సుతలభూమికి వెళ్ళి బలిని కలుసుకొని అతనిచే పూజింపబడి బ్రహ్మ శాపము వలన రాక్షసులై మొదట హిరణ్యకశిపునికి జన్మించి తరువాత వసుదేవునికి జన్మించి ఆ పిమ్మట కంసునిచే సంహరించబడిన మరీచి మహర్షి యొక్క పూర్వ పుత్రులనందరిని తిరిగి తీసుకొని వచ్చి వారినందరిని దేవకికి చూపించి విష్ణులోకము ప్రాప్తించునట్లు చేసితివి.

**విశేషాలు:** కంసుని చేతిలో మరణించిన ఆరుగురు పుత్రులు మొదటగా మరీచి పుత్రులు. తరువాత బ్రహ్మ తన కుమార్తెయగు వాగ్దేవిని సంగమించెనని పరిహసించి–ఆయన శాపముతో హిరణ్యకశిపునికి జన్మించిరి. వారే దేవకీ వసుదేవులకు మరలా జన్మించి కంసుని చేతిలో వధించబడి సుతలలోకమునకు చేరారు. వారికి కృష్ణుడు మోక్షము అనుగ్రహించి విష్ణులోకమునకు పంపెను.

**88–2 శ్లో.**
**శ్రుతదేవ ఇతి శ్రుతం ద్విజేంద్రం**
**బహులాశ్వం నృపతిం చ భక్తిపూర్ణమ్ ।**
**యుగపత్ త్వమనుగ్రహీతుకామో**
**మిథిలాం ప్రాపిథ తాపసైస్సమేతః ॥**

**ప్రతిపదార్థము:** శ్రుతదేవః = శ్రుతదేవుడు, ఇతి= అని, శ్రుతం = ప్రసిద్ధి పొందిన(శ్రూయతే వినబడునది. ప్రసిద్ధము), ద్విజ ఇంద్రం = ఒక బ్రాహ్మణోత్తముడు, బహులాశ్వం నృపతిం చ = బహుళాశ్వుడు అను మహారాజుకూడా, భక్తిపూర్ణమ్ = నీకు భక్తి పూర్ణులు, యుగపత్ = వారిరువురినీ ఒకేసారి(యుగం ఇవ పద్యతే, ఏకకాలీనం, సమకాలీనమ్ ఒకే కాలము),

అనుగ్రహీతు కామః = అనుగ్రహించదలచి, త్వం= నువ్వు, తాపసైః సమేతః = మునీశ్వరులతో కలిసి (తపస్సుచేయువాడు, తపసి), మిథిలాం= మిథిలా నగరమునకు (మథ్యంతే శత్రవః అస్యామ్, జనకరాజ నగరీ శత్రువులు ఇందు హింసింపబడుదురు. మిథిలా నగరము), ప్రాపిథ = వెళ్ళితివి.

**తాత్పర్యము:** శ్రుతదేవుడు అని ప్రసిద్ధి పొందిన ఒక బ్రాహ్మణోత్తముడు, బహుళాశ్వుడు అను మహారాజుకూడా నీకు భక్తి పూర్ణులు. (అనగా నీయందు పూర్ణమగు భక్తి కలవారు) వారిరువురినీ ఒకేసారి అనుగ్రహించదలచి నువ్వు మునీశ్వరులతో కలిసి మిథిలానగరమునకు వెళ్ళితివి.

**విశేషాలు**

**బహుళాశ్వుడు:** ఇతడు శ్రీకృష్ణునికాలమున మిథిలానగరము పాలించుచుండెను. ఇతని కాలముననే ఆపట్టణమున శ్రుతదేవుడు అను విష్ణుభక్తుడు అగు ఒక బ్రాహ్మణుడు ఉండెను. శ్రీకృష్ణుడు వీరి ఇరువురి భక్తికిని మెచ్చి మిథిలకుపోయి అందు కొన్ని దినములు ఉండి ఋషిసమేతుడు అయి ఆయిరువురి యిండ్లలోను ఏకకాలమున కనబడి వారిని కృతార్థులను చేసెను.

**88-3 శ్లో.**
**గచ్ఛన్ ద్విమూర్తిరుభయోర్యుగపన్నికేతం**
**ఏ కేన భూరివిభవైర్విహితోపచారః ।**
**అన్యేన తద్దినభృతైశ్చ ఫలౌదనాద్యైః**
**తుల్యం ప్రసేదిథ దదాథ చ ముక్తిమాభ్యామ్ ॥**

(వసంతతిలకము తభజజగా)

**ప్రతిపదార్థము:** ద్విమూర్తిః=రెండు రూపములు ధరించి (ద్వౌ ఏవ ద్వి రెండు. రెండవ సంఖ్య), ఉభయోః నికేతం = ఇద్దరి గృహములకు (నికేతంతి నివసంతి అత్ర-ఇక్కడ నివసింతురు. ఇల్లు), యుగపత్ గచ్ఛన్ = ఒకేసారి వెళ్ళి (యుగం ఇవ పద్యతే, ఏకకాలీనం, సమకాలీనమ్ ఒకే కాలము), ఏకేన = బహూళాశ్వునిచేత, భూరివిభవైః =పెక్కు సంపదలచే సత్కరింపబడి (విభవతి కార్యసిద్ధౌ సమర్థో భవతి

దీనితో కార్యము సిద్ధించును. ధనము), అన్యేన = శ్రుతదేవుని చేత, తత్ దిన భృత్తైః = తన ఆకలి దీరుటకు అనాడు యాచించి కూర్చుకొన్న(భృత= పుష్టః భరణీయో ఆరోగ్యవంతుడు సేవకుడు వేతనము), ఫల ఓదన ఆద్యైః చ= పండ్లు, అన్న ఆహారమును సమర్పించి (ఫలతి ఫలించునది. పండు ) (ఉనత్తి ఆర్ద్రీభవతి అన్నము వండిన బియ్యము), విహిత ఉపచారః= నీకు సేవ చేయగా(ఉపచరతి సేవతే తస్య భావః ఉపచారము, సేవ పూజ), తుల్యం= వారిద్దరి సేవలను సమానముగా (తులయా సమ్మితం సదృశం సమానమ్ సమానము), ప్రసేదిథ =స్వీకరించి, ఆభ్యాం= వారికి, ముక్తిం చ= నీవు మోక్షమును(శరీరేంద్రియాభ్యాం ఆత్మనః ముక్తత్వమ్ శరీరేంద్రియముల నుండి ఆత్మ ముక్తి నొందుట. ముక్తి, మోక్షము), దదాథ = అనుగ్రహించితివి.

**తాత్పర్యము:** రెండు రూపములు ధరించి ఇద్దరి గృహములకు ఒకేసారి వెళ్ళి బహూళాశ్వునిచేత పెక్కు సంపదలచే సత్కరింపబడితివి. శ్రుతదేవుని చేత తన ఆకలి దీరుటకు అనాడు అతడు యాచించి కూర్చుకొన్న పండ్లు, అన్న ఆహారమును ఇవ్వగా స్వీకరించితివి. వారిద్దరి సేవలను సమానముగా స్వీకరించితివి. వారికి నీవు మోక్షమును అనుగ్రహించితివి.

**88-4 శ్లో.**

**భూయోఽథ ద్వారవత్యాం ద్విజతనయమృతిం తత్ప్రలాపానపి త్వం**
**కో వా దైవం నిరుంధ్యాదితి కిల కథయన్ విశ్వవోఢాఽప్యసోఢాః ।**
**జిష్ణోర్గర్వం వినేతుం త్వయి మనుజధియా కుంఠితాం చాస్య బుద్ధిం**
**తత్త్వారూఢాం విధాతుం పరమతమపదప్రేక్షణేనేతి మన్యే ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట, ద్వారవత్యాం = ద్వారకలో నివసించెడి, ద్విజతనయమృతిం= బ్రాహ్మణ పుత్రుల మృతి, భూయః = మరల మరల జరుగుచుండుట చూసి, దైవం = స్వ కర్మ ఫలమును (దేవస్య ఇదమ్ దేవతలకు సంబంధించినది. భాగ్యము పూర్వజన్మ కర్మ), కః వా నిరుంధ్యాత్ = ఎవడు మరల్చ గలడు?, ఇతి = అని, కథయన్ = చెప్పుచూ, తత్ప్రలాపాన్ అపి= ఆ బ్రాహ్మణుని

రోదనలను, విశ్వవోఢా అపి= జగదీశ్వరుడవైనప్పటికి(వహతి భారము మోయువాడు. వాహకుడు), త్వం= నువ్వు, అసోఢాః కిల= సాయమేమియు చేయలేదు.( పోగొట్టలేదు)( సోఢః శాంతః కృతసహనః–సహింపబడినది.దీనికి వ్యతిరేకము అసోఢః), పరమతమపద= వైకుంఠ పదము యొక్క (పరమం చ అసౌ పదం చ(శ్రేష్ఠస్థానము), ప్రేక్షణేన = దర్శనము కలిగించుట (ప్రకర్షేణ ఈక్షణమ్ చూచుట), జిష్ణోః = అర్జునుని (జయతి జయశీలః – జయము కలవాడు. అర్జునుడు), గర్వం= సర్వ సమర్థుడను అను గర్వమును (గర్వతి అహంకరోతి తస్య భావః–అహంకారము అభిమానము), వినేతుం= తగ్గించుటకు (మరియు), మనుజధియా= మనుష్య మాత్రునిగా తలచి (మనోః జాతః మనువుకు పుట్టినవాడు. మానవుడు), త్వయి= నీ యందు, కుంఠితాం = నిశ్చయ రహితమైన (సంకుచితమైన), అస్య బుద్ధిం = ఆతని బుద్ధికి (బుధ్యతే జ్ఞాయతే అనయా దీనితో తెలుసుకొనబడును. జ్ఞానము, బుద్ధి), తత్త్వారూఢాం విధాతుం చ= యథార్థ జ్ఞానము కలిగించుట కొరకు (తతో భావః తస్య భావో వా దాని స్వరూపము సత్యము), ఇ తి మన్యే = అని నేను భావింతును.

**తాత్పర్యము:** ద్వారకలో నివసించుచున్న ఒక బ్రాహ్మణునిపుత్రులు వెంటవెంటనే మరణించుచుండిరి. ఆ బ్రాహ్మణుని బాధ నీకు తెలిసినప్పటికి "దైవ నిర్ణయమును ఎవరు ఆపగలరు?" అని చెప్పి , జగదీశ్వరుడివయిన నీవు బ్రాహ్మణ శోకమునకు స్పందించ లేదు. అర్జునుడు నిన్ను మానవ మాత్రునిగా పరిగణించుటవలన అతనికి గర్వభంగము చేసి నీ వైకుంఠమును చూపుటకు – ఆ బ్రాహ్మణుని శోకమును నీవు అపగలిగియూ ఆపలేదని నేను భావించెదను.

**88–5 శ్లో.**

**నష్టా అష్టాస్య పుత్రాః పునరపి తవ తూపేక్షయా కష్టవాదః**
**స్పష్టో జాతో జనానామథ తదవసరే ద్వారకామాప పార్థః ।**
**మైత్ర్యా తత్రోషితోఽసౌ నవమసుతమృతౌ విప్రవర్యప్రరోదం**
**శ్రుత్వా చక్రే ప్రతిజ్ఞామనుపహృతసుతస్సన్నివేక్ష్యే కృశానుమ్ ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** అస్య= ఆ బ్రాహ్మణుని యొక్క, అష్ట పుత్రాః= ఎనిమిదిమంది పుత్రులు, నష్టాః = పుట్టగానే చనిపోయినప్పుడు, పునః అపి= మరలా తిరిగి సంతానము కలుగునప్పుడును, తవ ఉపేక్షయా తు= వాళ్ళను రక్షించుటలో నీ(కృష్ణుని) ఔదాసీన్యము వలన, జనానాం కష్టవాదః= లోకాపవాదము (కష్ట= కష్యతే హింస్యతే అనేన–పీడించునది. పీడ వ్యథ.)(ఉచ్యతే వాదము), స్పష్టః జాతః = స్పష్టముగా కలిగినది, అథ=అటుపిమ్మట, తత్ అవసరే = ఆ సమయములో(అవసరతి గచ్ఛతి అవకాశము కాలము ఉపయుక్త కాలము), పార్థః = అర్జునుడు (పృథాయాః కుంత్యాః అపత్యం పుమాన్ కుంతీ పుత్రుడు. అర్జునుడు), ద్వారకామ్= ద్వారకకు, ఆప = వచ్చి, మైత్ర్యా = నీయెడల సఖ్యముతో(మిత్రస్య భావః కర్మ వా మైత్రి, మిత్రత్వము, స్నేహము), తత్ర = ఆ ద్వారకలో, ఉషితః = కొన్ని దినములుండెను, అసౌ= ఆ బ్రాహ్మణునియొక్క, నవమసుతః = తొమ్మిదవ కుమారుడు కూడా, మృతౌ= చనిపోగా, విప్రవర్యప్రరోదం= ఆ బ్రాహ్మణుని యొక్క రోదనమును (వపతి ధర్మమ్ ధర్మమును నాటువాడు. బ్రాహ్మణుడు), శ్రుత్వా= విని, అనుపహృతసుతః(చేత్) = పుట్టబోవు బ్రాహ్మణ కుమారుని బ్రతికింపనిచో (అహం), కృశానుమ్ = అగ్నిలో (కృశ్యతి తనూకరోతి తృణకాష్ఠాది వస్తుజాతమ్ తృణకాష్ఠాదులను తక్కువ చేయువాడు. అగ్ని), సన్నివేక్ష్యే = ప్రవేశించెదను అని, ప్రతిజ్ఞాం = ప్రతిజ్ఞను, చక్రే= చేసెను.

**తాత్పర్యము:** ఆ బ్రాహ్మణుని యొక్క ఎనిమిదిమంది పుత్రులు పుట్టగానే చనిపోయినప్పుడు మరలా తిరిగి సంతానము కలుగునప్పుడును వాళ్ళను రక్షించుటలో నీ ఔదాసీన్యము వలన లోకాపవాదము కలిగినది. ఆ సమయములో అర్జునుడు ద్వారకకు వచ్చి నీయెడల సఖ్యముతో ఆ ద్వారకలో కొన్ని దినములుండెను. ఆ బ్రాహ్మణునియొక్క తొమ్మిదవ కుమారుడు కూడా చనిపోగా ఆ బ్రాహ్మణుని యొక్క రోదనమును విని పుట్టబోవు బ్రాహ్మణ కుమారుని బ్రతికింపనిచో నేను అగ్నిలో ప్రవేశించెదను అని ప్రతిజ్ఞను చేసెను .

**88–6 శ్లో.**

**మానీ స త్వామపృష్ట్వా ద్విజనిలయగతో బాణజాలైర్మహాస్త్రైః**
**రుంధానః సూతిగేహం పునరపి సహసా దృష్టనష్టే కుమారే ।**

**యామ్యామైంద్రీం తథాన్యాస్సురవరనగరీర్విద్యయాఽఽసాద్య సద్యో**
**మోఘోద్యోగః పతిష్యన్ హుతభుజి భవతా సస్మితం వారితోఽభూత్ ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** మానీ= అభిమాన ధనుడై ,శరణు అన్న వారిని రక్షించువాడను అను గర్వము కలిగిన, సః = ఆ అర్జునుడు, త్వామ్= పరమబంధువైన నీకు, అపృష్ట్వా= చెప్పకుండా, ద్విజనిలయగతః= బ్రాహ్మణ కుమారుని రక్షించుటకై అతని ఇంటికి వెళ్ళెను.(నిలీయతే అత్ర–ఇక్కడ వుందురు. ఇల్లు), బాణజాలైః= బాణములతో(బణనం శబ్దః, తదస్తి అస్య–శబ్దము చేయునది. బాణము), మహా అస్త్రైః= అగ్నేయాస్త్రము మొదలైన మహాస్త్రములచే(అస్యతే క్షిప్యతే అసౌ విసరబడునది. బాణము మొదలగునవి),సూతిగేహం =సూతికా గృహమును (పురిటిల్లును) (సూతికా=సూతే అసౌ నవ ప్రసూతా స్త్రీఅపుడే ప్రసవించిన స్త్రీ), రుంధానః = కప్పివేసెను, పునః అపి= ఐనను మరలా, కుమారే = ఆ పుట్టిన శిశువు సశరీరముతో(కుమారయతి క్రీడతి ఆడుకొనువాడు. పిల్లవాడు), సహసా = వెంటనే,దృష్టనష్టే=కనిపించకుండా పోయెను.(దృష్టః అవలోకితః – చూడబడినది కనబడునది), సద్యః = వెంటనే, యామ్యామ్ = యమనగరికి (దక్షిణ దిక్కుకు) (యామీ దక్షిణాదిక్ నివాసః అస్య–దక్షిణ దిక్కు నివాసంగా కలవాడు), ఐంద్రీం = ఇంద్రుఁడు దేవతగా కలిగిన తూర్పు దిక్కుకు(స్వర్గమునకు), తథా = అట్లే, అన్యాః = మిగిలిన, సురవరనగరీః= వరుణకుబేరాది దిక్పాలుర నగరులకు, విద్యయా= తన యోగ విద్యా ప్రభావము వలన (వేద్యంతే జ్ఞాయంతే పారలౌకికవిషయాః అనయా దీనితో పరలోక విషయములు తెలుసుకొనబడును. పరావిద్య),ఆసాద్య = అర్జునుడుపొంది(వెళ్లి),మోఘఉద్యోగః =తనప్రయత్నమువిఫలమయినందువలన (మోఘ =ముహ్యతే అస్మిన్ నిరర్థకము), హుతభుజి = అగ్నిలో(హుతం మంత్రేణ దత్తం హవిం భుంక్తే మంత్రముతో ఇచ్చిన హవిస్సును తినువాడు. అగ్ని),పతిష్యన్= ప్రవేశించుటకు సిద్ధము కాగా, భవతా = నువ్వు, సస్మితం = నవ్వుతూ(ఈషద్ధసతి తస్య భావః కర్మ వా–చిరునవ్వు, మందస్మితము), వారితః అభూత్ = అతనిని వారించావు.

**తాత్పర్యము:** అభిమాన ధనుడై ,శరణు అన్న వారిని రక్షించువాడను అను గర్వము కలిగిన ఆ అర్జునుడు పరమబంధువైన నీకు చెప్పకుండా బ్రాహ్మణ కుమారుని రక్షించుటకై అతని ఇంటికి వెళ్ళెను. బాణములతో అగ్నేయాస్త్రము మొదలైన మహాస్త్రములచే సూతికా గృహమును (పురిటిల్లును) కప్పివేసెను. (దివ్యాస్త్ర పంజరముగా చేసెను) ఐనను మరలా ఆ పుట్టిన శిశువు సశరీరముతో వెంటనే కనిపించకుండా పోయెను. వెంటనే యమనగరికి స్వర్గమునకు వరుణకుబేరాది దిక్పాలుర నగరులకు తన యోగ విద్యా ప్రభావము వలన బ్రాహ్మణ కుమారుని వెతుకుటకు అర్జునుడు వెళ్లి తన ప్రయత్నము విఫలమయినందువలన అగ్నిలో ప్రవేశించుటకు సిద్ధము కాగా నువ్వు నవ్వుతూ అతనిని వారించావు.

**88-7 శ్లో.**

**సార్ధం తేన ప్రతీచీం దిశమతిజవినా స్యందనేనాభియాతో**
**లోకాలోకం వ్యతీతస్తిమిరభయమథో చక్రధామ్నా నిరుంధన్ ।**
**చక్రాంశుక్లిష్టదృష్టిం స్థితమథ విజయం పశ్య పశ్యేతి వారాం**
**పారే త్వం ప్రాదదర్శః కిమపి హి తమసాం దూరదూరం పదం తే ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** తేన సార్ధం = నీవు అర్జునునితో కలిసి, అతిజవినా= అతివేగముగాపోవు (జవః వేగః అస్తి అస్య), స్యందనేన= రథము పై (స్యందతే వేగేన గచ్ఛతి అసౌ వేగంగా వెళ్లునది. రథము), ప్రతీచీం దిశమ్= పశ్చిమ దిక్కునకు(ప్రతి ప్రతిదినాంతే అంచతి గచ్ఛతి సూర్యః అస్యామ్ ప్రతి దినాంతములో సూర్యుడు ఇటువైపు పయనించును. పశ్చిమ దిశ), అభియాతః= బయలుదేరితివి, లోకాలోకం = లోకాలోక పర్వతములను (లోక్యతే అసౌ లోకః, న లోక్యతే అసౌ అలోకః, లోకశ్చ అలోకశ్చ-కనబడునది, కనబడనిది. లోకాలోక పర్వతము), వ్యతీతః= దాటి(వ్యతీతః అతీతః గతః దాటిపోయినది వెళ్లిపోయినది గడచిపోయినది), అథః = అటుపిమ్మట, తిమిరభయమ్ = కటిక చీకటి భయమును (తిమ్యతి క్లిద్యతే తేమతి ఆర్ద్రీభవత్యస్మిన్ దీనితో బాధ పడుదురు. చీకటి), చక్రధామ్నా= నీ చక్ర కాంతిచే, నిరుంధన్ = తొలగింపచేసి, అథ = అటుపిమ్మట,

చక్ర అంశుక్లిష్టదృష్టిం స్థితమ్ = మిరిమిట్లుగొలుపు ఆ చక్రకాంతిలో చక్కగా చూడలేని, విజయం = అర్జునుని తో (విశిష్టః జయ అస్య-విశిష్టంగా జయం కలవాడు. అర్జునుడు), పశ్య పశ్య ఇతి= చూడుము.....చూడుము అని, వారాంపారే =సముద్రములకు ఆవల, తమసాం దూరదూరం= అజ్ఞానాంధకారమునకు అతీతముగానున్న (రజస్తమోగుణములకు అతీతముగా దేదీప్యమానముగా ఉన్న), కిమపి= ఏరకంగానూ వర్ణించలేని, తే పదం = నీ పరమపదమును(వైకుంఠ ధామం), త్వం = నువ్వు, ప్రాదదర్శః హి = అతనికి చూపితివి.

**తాత్పర్యము:** నీవు అర్జునునితో కలిసి అతివేగముగాపోవు రథము పై పశ్చిమ దిక్కునకు బయలుదేరితివి. లోకాలోక పర్వతములను దాటి కటిక చీకటి భయమును నీ చక్ర కాంతిచే తొలగింపచేసితివి. మిరిమిట్లుగొలుపు ఆ చక్రకాంతిలో చక్కగా చూడలేని అర్జునుని తో చూడుము.....చూడుము అని సముద్రములకు ఆవల రజస్తమోగుణములకు అతీతముగా దేదీప్యమానముగా ఉన్న ఏరకంగానూ వర్ణించలేని నీ పరమపదమును నువ్వు అతనికి చూపితివి.

**88-8 శ్లో.**

**తత్రాసీనం భుజంగాధిపశయనతలే దివ్యభూషాయుధాద్యైః**
**ఆవీతం పీతచేలం ప్రతినవజలదశ్యామలం శ్రీమదంగమ్ ।**
**మూర్తీనామీశితారం పరమిహ తిసృణామేకమర్థం శ్రుతీనాం**
**త్వామేవ త్వం పరాత్మన్ ప్రియసఖసహితో నేమిథ క్షేమరూపమ్ ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** పరాత్మన్ = ఓ పరమాత్మా ! (అండ పిండాదులన్నిటికీ సాక్షియైన చైతన్యం. అన్ని ఉపాధులనూ వ్యాపించి అన్నిటినీ తనలో కలుపుకొన్న సామాన్య చైతన్యం. నిర్మలమైన తత్త్వం. బ్రహ్మం), తత్ర = ఆ వైకుంఠములో, భుజంగ అధిపశయనతలే = శేష తల్పముపై (భుజస్సన్ గచ్ఛతి, వక్రం గచ్ఛతి వంకరగా వెళ్లునది.)(అధి అధికం పాతి రక్షతి రక్షించువాడు. రాజు ప్రభువు), దివ్యభూష = దివ్యాభరణములను, ఆయుధ ఆద్యైః= ఆయుధములు మొదలైన వాటితో (ఆయుధ్యతే అనేన ఆయుధము, అస్త్రము), ఆవీతం= ధరించి (ఆ సమ్యక్ వీతం

ధృతం (వస్త్రం ఉపవీతం వా) ధరించుట, ఆసీనం = కూర్చొని యున్న వానిని, (ఉపవిష్టః), పీతచేలం= పీతాంబరమును ధరించి, ప్రతినవజలద= తొలకరి మేఘము వలె (ప్రతి నవ= నూతనమ్) (జలం దదాతి జలము నిచ్చునది. మేఘము), శ్యామలం = శ్యామ వర్ణ శోభితుడై ఉన్నవానిని (శ్యామవర్ణః అస్తి అస్య–నలుపు వర్ణము కలది), శ్రీమత్ అంగమ్= లక్ష్మీదేవిని వక్ష స్థలమున ధరించినవానిని( శ్రీ మత్= శ్రీః అస్తి అస్య–ధనము, శోభ కలవాడు), ఇహ = ఈ సకల ప్రపంచములోను, తిసృణాం మూర్తీనామ్= త్రిమూర్తులకు, ఈశితారం= అధిపతిగా ఉన్నవానిని (ఈశినో భావః–ప్రభుత్వము స్వామిత్వము), పరమ్= జగత్కారణుని (ఉత్కృష్టః – ఉత్కృష్టము), శ్రుతీనాం ఏకం అర్థం = వేదములయొక్క ప్రధాన ప్రతిపాద్యుని(శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్థం తెలియును. వేదము), క్షేమరూపమ్= పురుషార్థ భూతముగా క్షేమ కారకునిగా ఉన్న(క్షేమం మంగళం అస్మిన్ అస్తి క్షేమం గలది. మంగళము, శుభము)(ప్రాప్తస్య రక్షణమ్ లభించిన దానిని రక్షించుట. కుశలము ముక్తి), త్వామ్ ఏవ = ని న్నే, త్వం = నువ్వు, ప్రియసఖసహితః= ప్రియమైన మిత్రునితో కలిసి, నేమిథ = నమస్కరించితివి.

**తాత్పర్యము:** ఓ పరమాత్మా! ఆ వైకుంఠములో శేష తల్పముపై దివ్యాభరణములను ఆయుధ ఆయుధములు మొదలైన వాటిని ధరించి కూర్చొని యున్న వానిని, పీతాంబరమును ధరించి తొలకరి మేఘము వలె శ్యామ వర్ణ శోభితుడై ఉన్నవానిని .లక్ష్మీదేవిని వక్ష స్థలమున ధరించినవానిని, ఈ సకల ప్రపంచమునకు మరియు త్రిమూర్తులకు అధిపతిగా ఉన్నవానిని , జగత్కారణుని , వేదములయొక్క ప్రధాన ప్రతిపాద్యుని, పురుషార్థ భూతముగా క్షేమ కారకునిగా ఉన్న ని న్నే నువ్వు మిత్రునితో కలిసి నమస్కరించితివి. (తన రూపములో ఉన్న విష్ణునికి కృష్ణుడు మిత్రునితో కలిసి నమస్కరించెనని భావం)

**88–9 శ్లో.**

**యువాం మామేవ ద్వావధికవివృతాంతర్హితతయా**
**విభిన్నౌ సంద్రష్టుం స్వయమహమహార్షం ద్విజసుతాన్ ।**

**నయేతం ద్రాగేతానితి ఖలు వితీర్ణాన్ పునరమూన్**
**ద్విజాయాదాయాదాః ప్రణుతమహిమా పాండుజనుషా ॥**

(శిఖరిణి యమనసభవ)

**ప్రతిపదార్థము:** యువాం= మీరు ఇద్దరు, మామ్ ఏవ= నా అంశావతారులే!, అధికవివృత= ఒకరు శుద్ధ సత్వ ఉపాధితో ప్రకటిత నిజైశ్వర్యముతో (అనగా దివ్యత్వము స్పష్టముగా కనబడు రూపము కృష్ణుడు)(వివృతః, విశదీకృతః, విస్తృతః–విశదీకరింపబడ్డది విస్తరింపబడ్డది), అంతర్హితతయా= మరొకరు ఉపాధితో అంతర్హితమైన నిజైశ్వర్యముతో (అనగా దివ్యత్వము నిక్షిప్తమైన జీవరూపమున ఉన్న రూపము. అర్జునుడు)(అంతః హితః నిహితః దాచబడినది. గుప్తము), విభిన్నౌ= జీవేశ్వరుల రూపములో విభిన్నముగా కనిపించు వారు(విశేషేణ భిద్యతే భిన్నమైనది. వేరైనది), పునః= మరల, ద్వౌ = మీ ఇద్దరిని, సంద్రష్టుం = చూడవలెనని, అహం= నేను, స్వయం= స్వయముగా, ద్విజసుతాన్ = బ్రాహ్మణ కుమారులను, అహార్షం = తెప్పించితిని (అపహరించితిని), ఏతాన్= వీరిని (ఈ శిశువులను), ద్రాక్= వెంటనే (ద్రాతి శీఘ్రమ్ త్వరగా), నయేతం = తీసుకొని పొండి, ఇతి= అని నారాయణుడు చెప్పగా, వితీర్ణాన్ = ఇవ్వబడిన (వితీర్ణః దత్తః ఊఢః విస్తృతః ఇవ్వబడ్డది), అమూన్ = బ్రాహ్మణ బాలురను, ఆదాయ = తీసుకొని వచ్చి, పాండుజనుషా= పార్థునిచే, ప్రణుత= కొనియాడబడిన (అత్యంతం నుతః స్తుతః–స్తుతింపబడినవాడు), మహిమా= మహత్తు కలిగినవాడివై, ద్విజాయ = బ్రాహ్మణునికి, అదాః ఖలు = అతని కుమారులను అప్పగించావు.

**తాత్పర్యము:** ప్రభూ! కృష్ణా! మీరు ఇద్దరు ఆ పరమాత్మకు నమస్కరించగా, ఆ నారాయణుడు మీతో ఇట్లనెను.

మీరు ఇద్దరు నా అంశావతారులే! ఒకరు దివ్యత్వము స్పష్టముగా కనబడు రూపము (కృష్ణుడు) మరొకరు జీవరూపమున ఉన్న రూపము. (అర్జునుడు) జీవేశ్వరుల రూపములో విభిన్నముగా కనిపించు మీ ఇద్దరిని చూడవలెనని నేను స్వయముగా బ్రాహ్మణ కుమారులను తెప్పించితిని .ఈ శిశువులను వెంటనే తీసుకొని పొండి అని నారాయణుడు చెప్పగా బ్రాహ్మణ బాలురను తీసుకొని వచ్చి

ద్వారకలో బ్రాహ్మణునికి అతని కుమారులను అప్పగించావు. పార్థుడు నీమహిమను కొనియాడాడు.

**88–10 శ్లో.**

**ఏవం నానావిహారైర్జగదభిరమయన్ వృష్ణివంశం ప్రపుష్ణన్**
**ఈజానో యజ్ఞభేదైరతులవిహృతిభిః ప్రీణయన్నేణనేత్రాః ।**
**భూభారక్షేపదంభాత్ పదకమలజుషాం మోక్షణాయావతీర్ణః**
**పూర్ణం బ్రహ్మైవ సాక్షాద్యదుషు మనుజతారూషితస్త్వం వ్యలాసీః ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** ఏవం = ఈ విధముగా, నానావిహారైః = అనేకరకముల విహారములతో (వివిధలీలలచే)(విశేషేణ హరతి గచ్ఛతి క్రీడార్థమ్ విహరించుట), జగత్ = జగత్తునంతయు (గచ్ఛతి నడచునది. ప్రపంచము), అభిరమయన్ = సంతోషింపజేయుచు (అభిరమతే ఆనందించుట సంతోషించుట), వృష్ణివంశం = యాదవ వంశమును, ప్రపుష్ణన్= వృద్ధిచేయుచు, యజ్ఞభేదైః= యజ్ఞయాగాదులు (ఇజ్యంతే పూజ్యంతే దేవతాః అత్ర–దేవతలు ఇక్కడ పూజింపబడుదురు. యజ్ఞము), ఈజానః = చేయుచు, అతులవిహృతిభిః= సాటిలేని నానా విహారములతో, ఏణనేత్రాః= లేడికన్నులుగలనీ పత్నులను ( ఏతి ద్రుతం గచ్ఛతి త్వరగా వెళ్లునది. పెద్దకన్నులు గల నల్లని జింక), ప్రీణయన్ = సంతోషపెట్టుచు, భూభారక్షేప దంభాత్= భూభారము తగ్గించునెపముతో (క్షేపణస్య భావః–పారవేయుట కదలుట అంగ సంచాలనము.) (దభ్నోతి వంచయతి అనేన–దీనితో మోసగించెదరు. కపటము ఛలము), పదకమలజుషాం = నీ పాదపద్మములను ఆశ్రయించిన భక్తులకు, మోక్షణాయ= మోక్షము ఇచ్చుచు, యదుషు= యదువంశములో, అవతీర్ణః = శ్రీకృష్ణావతారము ధరించి (అవతీర్ణః స్నాతః పారంగతః, దిగినవాడు), పూర్ణం సాక్షాత్ బ్రహ్మ ఏవ = పూర్ణ బ్రహ్మానంద మూర్తి వైన, త్వం = నీవు, మనుజతారూషితః = మానవుని వలె నటించి (మనోః జాతః– మనువుకు పుట్టినవాడు. మానవుడు.)(రూషితః ధూళ్యాదినా మలినీకృతః–దుమ్ము మొదలగువాటిచే మలినం చేయబడినది), వ్యలాసీః =నువ్వు ప్రకాశించావు.

**తాత్పర్యము:** ఈ విధముగా వివిధలీలలచే జగత్తునంతయు సంతోషింపజేయుచు , యాదవ వంశమును వృద్ధిచేయుచు, యజ్ఞయాగాదులు చేయుచు, సాటిలేని నానా విహారములతో లేడికన్నులుగలనీ పత్నులను సంతోషపెట్టుచు, భూభారము తగ్గించునెపముతో నీ పాదపద్మములను ఆశ్రయించిన భక్తులకు మోక్షము ఇచ్చుచు, యదువంశములో శ్రీకృష్ణావతారము ధరించి పూర్ణ బ్రహ్మానంద మూర్తి వైన నీవు మానవుని వలె నటించి ప్రకాశించావు.

**విశేషాలు**

**వృష్ణి:** విదర్భుని రెండవ కొడుకు వృష్ణి. సాత్వతుని నాలవ కుమారుడు. ఇతని వంశస్థులు వృష్ణులు అనబడుదురు. కొడుకులు సుమిత్రుడు, యుధాజిత్తు అని ఇరువురు.వీరి వంశములోని వాడు కనుక వృష్ణి అనగా కృష్ణుడని ఇంకొక ఆర్థమున్నది.

**88-11 శ్లో.**

**ప్రాయేణ ద్వారవత్యామవృతదయి తదా నారదస్త్వద్రసార్ద్రః**
**తస్మాల్లేభే కదాచిత్ ఖలు సుకృతనిధిస్త్వత్పితా తత్త్వబోధమ్ ।**
**భక్తానామగ్రయాయి స చ ఖలు మతిమానుద్ధవస్త్వత్త ఏవ**
**ప్రాప్తో విజ్ఞానసారం స కిల జనహితాయాధునాఽఽస్తే బదర్యామ్ ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** అయి = ఓ నారద గానలోలా! కృష్ణా!, నారదః = నారదుడు (నారం పరమాత్మ విషయకం జ్ఞానం దదాతి పరమాత్మ జ్ఞానవిషయము ఇచ్చువాడు. నారదుడు), త్వత్ రస ఆర్ద్రః= నీ సాహచర్యములో ఆనందమును అనుభవించుచు(మిక్కిలి భక్తితో)(రస్యతే ఆస్వాద్యతే ఆస్వాదింపబడునది. రసము), ప్రాయేణ= తరచుగా, ద్వారవత్యామ్= ద్వారకకు, అవృతత్= రాకపోకలు చేసేవాడు, తదా= అప్పుడు, కదాచిత్ = ఒకనాడు, సుకృతనిధిః = పుణ్య పురుషుడయిన(సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము శుభకర్మ), త్వత్ పితా= నీ తండ్రి, తస్మాత్ = ఆ నారదుని వలన, తత్త్వబోధమ్=

తత్వజ్ఞానమును (బుద్ధివిశేషః– తత్తు బ్రహ్మజ్ఞానమ్), లేభే ఖలు = పొందెను కదా!, భక్తానామ్ = నీ భక్తులందు, అగ్రయాయి=అగ్ర గణ్యుడు, మతిమాన్= బుద్ధిశాలి అయిన, సః ఉద్ధవః చ = ఆ ఉద్ధవుడు కూడా (ఉద్ హూయతే అస్మిన్ ఇందులో ఆహుతి నిచ్చుదురు. యజ్ఞాగ్ని ఉద్ధవుడు)(శ్రీ కృష్ణునకు పరమాప్తుఁడగు యాదవుడు. వసుదేవుని తమ్ముడైన దేవభాగుని కొడుకు), త్వత్తః ఏవ = నీ నుండి, విజ్ఞానసారం = తత్వజ్ఞానమును, ప్రాప్తః ఖలు = పొందెను కదా!, సః = ఆ ఉద్ధవుడు, జనహితాయ= లోకుల మేలు కొరకు, బదర్యామ్ = బదరికాశ్రమమునందు, అధునా= ఇప్పటికిని, ఆస్తే కిల = ఉన్నాడు కదా!

**తాత్పర్యము:** ఓ నారద గానలోలా! కృష్ణా! నారదుడు నీ సాహచర్యములో ఆనందమును అనుభవించుచు తరచుగా ద్వారకకు రాకపోకలు చేసేవాడు. అప్పుడు ఒకనాడు పుణ్య పురుషుడయిన నీ తండ్రి ఆ నారదుని వలన తత్వజ్ఞానమును పొందెను . నీ భక్తులందు అగ్ర గణ్యుడు, బుద్ధిశాలి అయిన ఆ ఉద్ధవుడు కూడా నీ నుండి తత్వజ్ఞానమును పొందెను. ఆ ఉద్ధవుడు లోకుల మేలు కొరకు (భక్తులకు జ్ఞానము ఉపదేశించుటకు) బదరికాశ్రమమునందు ఇప్పటికిని ఉన్నాడు కదా !

**విశేషాలు**

**తత్త్వజ్ఞానం:** మనం చూస్తూ ఉన్న ఈ ప్రపంచ స్వభావం ఏమిటో లోతుకు దిగి విచారణ చేస్తూ పోతే దాని ఫలితంగా ఏర్పడే యధార్థమైన జ్ఞానమేదో అది తత్త్వజ్ఞానం.

ప్రపంచం ప్రస్తుతం మనకు నామరూపాత్మకంగా భాసిస్తున్నది. ఇది ఆపాతతః భాసించటమే గాని లోతుకుదిగి చూస్తే ఇది నామరూపాత్మకం కాదు. సచ్చిదాత్మకమైన పరమాత్మేనని, అదే మన అజ్ఞాన వశాత్తూ ఇలా రూపాంతరంలో భాసిస్తున్నదని తేలిపోతుంది. ఇలా తేల్చుకొనే జ్ఞానమే తత్త్వజ్ఞానం. ఇదే జీవిత పరమార్థానికి దారితీసే జ్ఞానం. దీనికి భిన్నమైనదంతా తత్త్వజ్ఞానం కాదు. మిథ్యా జ్ఞానమే వి జ్ఞానం విశేష జ్ఞానం. ఇదే జీవభావం. బంధానికి హేతువు. అలా కాక జ్ఞానంలో విశేషమూ విజ్ఞానమే. జ్ఞానం పరోక్షమైతే విజ్ఞానం అపరోక్షం అంటే

అనుభవం. 'జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా' అని గీత చాటుతున్నది. విజ్ఞానమంటే స్వానుభవ కరణమని అర్థం చెప్పారు భాష్యకారులు

జ్ఞానమంటే ఇక్కడ లౌకిక జ్ఞానం కాదు. శాస్త్రజ్ఞానం కాదు. కళాజ్ఞానం కాదు. ధర్మ జ్ఞానమూ కాదు. ఇవన్నీ విశేష జ్ఞానాలే. ఆయా నామరూపాలకు చెందిన జ్ఞానాలని అర్థం. పోతే వీటన్నింటిని వ్యాపించి తన స్వరూపంగా భావించే జ్ఞానమొకటి ఉన్నది. ఇవి విశేష జ్ఞానమైతే అది సామాన్య జ్ఞానం. ఇవి అనాత్మ జ్ఞానమైతే అది ఆత్మజ్ఞానం. ఇవి బంధానికి దారితీస్తే అది మోక్షాన్ని చేర్చే సాధనం. కనుక అలాంటి జ్ఞానమే ఇక్కడ జ్ఞానమని అర్థం చేసుకోవలసి ఉంది. దీనికి భిన్నమైన మన జ్ఞానాలన్నీ వాస్తవంలో జ్ఞానం కాదు. అజ్ఞానం క్రిందికే వస్తాయని ఉపనిషత్ సిద్ధాంతం.

**88-12 శ్లో.**

**సోఽయం కృష్ణావతారో జయతి తవ విభో యత్ర సౌహార్దభీతి-**
**స్నేహద్వేషానురాగప్రభృతిభిరతులైరశ్రమైర్యోగభేదైః ।**
**ఆర్తిం తీర్త్వా సమస్తామమృతపదమగుస్సర్వతః సర్వలోకాః**
**స త్వం విశ్వార్తిశాంత్యై పవనపురపతే భక్తిపూర్త్యై చ భూయాః ॥**

(స్రగ్ధర మరభన యయయ)

**ప్రతిపదార్థము:** పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, విభో= ప్రభూ!, యత్ర = శ్రీ కృష్ణుని అవతారములో, సౌహార్ద= నీయందు సుహృద్భావము కలవారు(పాండవాదులు) (సుహృదః భావః-సౌహార్ద భావము. మైత్రి స్నేహము), భీతి = నీకు భయపడినవారు. (కంసుడు)( బిభేతి తస్య భావః-భయము), స్నేహ =నీతో చెలిమి చేసినవారు(యాదవులు)(స్నిహ్యతి తస్య భావః కర్మ వా స్నేహము నూనె), ద్వేష = నీయందు ద్వేషము కలవారు(శిశుపాలాదులు) (ద్వేష్టి తస్య భావః ద్వేషము వైరము విరోధము), అనురాగ= నీయందు అనురాగము కలవారు (గోపికలు)(అనురూపో రాగః-అనురాగము ప్రేమ), ప్రభృతిభిః = మొదలయినవారు ( నీ అనుగ్రహానికి నోచుకొని ముక్తిని పొందారు), అతులైః = కొందరు సాటిలేని, అశ్రమైః= శ్రమలేకయే, యోగభేదైః = యోగ సాధనల ద్వారా

(నిన్ను సేవించి మోక్షాన్ని పొందారు) (యుజ్యతే మనః ఆత్మనా యోగః చిత్తవృత్తినిరోధః–ఆత్మయందు మనసు కలిగి యుండుట. ధ్యానము, చిత్తవృత్తులను నిరోధించుట), సర్వతః =అన్ని చోట్ల, సర్వలోకాః = సర్వలోకములలోని, సమస్తాం = సమస్త జనులు (నిన్ను సేవించి), ఆర్తిం = ఆర్తిని(ఆర్తస్య భావః–దుఃఖము పీడ), తీర్త్వా= దాటి (పోగొట్టుకొని), అమృతపదమ్ = మోక్షాన్ని, అగుః= పొందారు, తవ సః అయం =నీ యొక్క ఆ ఈ, కృష్ణావతారః= కృష్ణావతారము, జయతి = జయించుచున్నది, సః త్వం = అటువంటి నువ్వు, విశ్వ ఆర్తిశాంత్యై= విశ్వమునందలి ఆర్తిని పోగొట్టి, భక్తిపూర్త్యై చ= భక్తి పరిపూర్ణతను, భూయాః = వృద్ధి పొందించుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ప్రభూ ! శ్రీ కృష్ణుని అవతారములో నీయందు సుహృద్భావము కలవారు(పాండవాదులు) నీకు భయపడినవారు. (కంసుడు) నీతో చెలిమి చేసినవారు(యాదవులు) నీయందు ద్వేషము కలవారు (శిశుపాలాదులు) నీయందు అనురాగము కలవారు( గోపికలు) ఇలా ఎందరో నీ అనుగ్రహానికి నోచుకొని ముక్తిని పొందారు. కొందరు యోగ సాధనల ద్వారా నిన్ను సేవించి మోక్షాన్ని పొందారు. సర్వలోకములలోని సమస్త జనులు ఆర్తిని పోగొట్టుకొని మోక్షాన్ని పొందారు. నీ కృష్ణావతారము జయించుచున్నది. నువ్వు ఎప్పుడు విశ్వమునందలి ఆర్తిని పోగొట్టి భక్తి పరిపూర్ణతను వృద్ధి పొందించుము (మా విశ్వ జనుల ఆర్తి శాంతించుటకు మా భక్తి పరిపూర్ణతకు మాకు దిక్కగుము)

***దశమ స్కంధము***

**88వ దశకము సమాప్తము**

# దశకమ్ 89 – వృకాసురవధ – భృగుపరీక్షణము

**89-1 శ్లో.**

**రమాజానే! జానే యదిహ తవ భక్తేషు విభవో**
**న సద్యః సంపద్యస్తదిహ మదకృత్వా దశమినామ్ ।**
**ప్రశాంతిం కృత్వైవ ప్రదిశసి తతః కామమఖిలం**
**ప్రశాంతేషు క్షిప్రం న ఖలు భవదీయే చ్యుతికథా ॥**

**(శిఖరిణి – యమనసభవ)**

**ప్రతిపదార్థము:** రమాజానే= లక్ష్మీపతీ! (వృత్తియందు జాయా శబ్దమునకు ఆదేశముగా వచ్చు రూపము జాని), ఇహ = ఇక్కడ(ఈ లోకంలో), తవ భక్తేషు= నీ భక్తులకు, విభవః =సంపదలను (పుణ్య ఫలాను భోగము) (విభవతి కార్యసిద్ధౌ సమర్థో భవతి దీనితో కార్యము సిద్ధించును. ధనము), సద్యః= వెంటనే (సమానే అహని అదే రోజు వెంటనే), న = అనుగ్రహింపవు, సంపద్యః = పరిణతులు, యత్ ఇహ= కాని వారికి, తత్ = ఆ సంపద, మదకృత్వాత్= మద జన కారిత్వము అగునని (మాదయతి మాద్యతి అనేన దీనితో ఆనందింతురు, మత్తును పొందుదురు. అహంకారము), జానే = నేను ఎరుగుదును, అశమినామ్= అశాంతులను (అహంకార పూరితులను), ప్రశాంతిం కృత్వా= ప్రశాంత చిత్తులు చేసి ( అనగా మనోనిగ్రహం కలిగిన వారిగా చేసి), తతః ఏవ= అటుపిమ్మట, ప్రశాంతేషు = ప్రశాంత చిత్తమున సేవించువారికి మాత్రమే, క్షిప్రం = వెంటనే, అఖిలం కామం = కోరుకొన్న ప్రతి కోరికను, ప్రదిశసి = అనుగ్రహించెదవు, భవదీయే= అందువలన నీ భక్తులకు, చ్యుతికథా = పతన కథ(చ్యోతతి క్షరతి కారుట జారుట), న ఖలు= ఎప్పుడు ఉండదు.

**తాత్పర్యము:** లక్ష్మీపతీ! ఈ లోకంలో నీ భక్తులకు సంపదలను వెంటనే అనుగ్రహింపవు. పరిణతులు కాని వారికి ఆ సంపద మదము కలిగించునని నేను ఎరుగుదును. అశాంతులను ప్రశాంత చిత్తులు చేసి అటుపిమ్మట ప్రశాంత చిత్తమున సేవించువారికి మాత్రమే వెంటనే కోరుకొన్న ప్రతి కోరికను అనుగ్రహించెదవు. అందువలన నీ భక్తులకు పతన కథ ఎప్పుడు ఉండదు.

**89-2 శ్లో.**

**సద్యః ప్రసాదరుషితాన్ విధిశంకరాదీన్**
**కేచిద్విభో! నిజగుణానుగుణం భజంతః ।**
**భ్రష్టా భవంతి బత కష్టమదీర్ఘదృష్ట్యా**
**స్పష్టం వృకాసుర ఉదాహరణం కిలాస్మిన్ ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** విభో = ప్రభూ!, విధిశంకర ఆదీన్= బ్రహ్మ, శంకరుడు మొదలయిన దేవతలు (విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ)(శం సుఖం కల్యాణం కరోతి కల్యాణము కూర్చువాడు. శివుడు), సద్యః =త్వరగా, ప్రసాద = సంతోషింతురు (ప్రసీదతి ప్రసన్నో భవతి తస్య భావః కర్మ వా ప్రసన్నత నిర్మలత్వము కావ్యగుణము కృప అనుగ్రహము), రుషితాన్= అట్లే త్వరగా కోపగింతురు, కేచిత్= కొందరు నిజగుణ అనుగుణం స్వస్వ వాసనల అనుసారముగా(తమ స్వభావములకు తగినట్లు), భజంతః = ఆ బ్రహ్మ, శంకరుడు మొదలయిన దేవతలను సేవించుచూ, అదీర్ఘదృదృష్ట్యా= దూరదృష్టి లేక, భ్రష్టాః భవంతి= భ్రష్టులై పోవుచున్నారు, బత కష్టమ్= అయ్యో! ఎంత కష్టము, అస్మిన్ = దీనికి, వృకాసురః = వృకాసురుని వృత్తాంతమే, స్పష్టం = స్పష్టముగా, ఉదాహరణం కిల = ఉదాహరణము కదా !

**తాత్పర్యము:** ప్రభూ! బ్రహ్మ, శంకరుడు మొదలయిన దేవతలు త్వరగా సంతోషింతురు. అట్లే త్వరగా కోపగింతురు. కొందరు తమ స్వభావములకు తగినట్లు ఆ బ్రహ్మ, శంకరుడు మొదలయిన దేవతలను సేవించుచూ దూరదృష్టి లేక భ్రష్టులై పోవుచున్నారు. అయ్యో! ఎంత కష్టము. దీనికి వృకాసురుని వృత్తాంతమే స్పష్టముగా ఉదాహరణము కదా!

**విశేషాలు:** రాగీ స పురుషోవశ్యం ఫాలం ప్రేప్స్యతి శంకరాత్ / తతః ఫలం స లభతే తతస్తం విస్మరిష్యతి (రాగ వశుడైన వాడు శంకరుని పూజించి ఫలము పొందాలనుకొంటాడు. శంకరుని వలన ఫలితము పొంది అవతల ఆయనను మర్చిపోతాడు)

**89-3 శ్లో.**

**శకునిజస్స తు నారదమేకదా**
**త్వరితతోషమపృచ్ఛదధీశ్వరమ్ ।**
**స చ దిదేశ గిరీశముపాసితుం**
**న తు భవంతమబంధుమసాధుషు ॥** (ద్రుత విలంబితము – నభ భర)

**ప్రతిపదార్థము:** సః తు= ఆ వృకాసురుడు, శకునిజః= శకుని అను ఒక రాక్షసుని కుమారుడు, ఏకదా= ఒకనాడు, నారదమ్ = నారదుని దగ్గరకు వచ్చి, త్వరితతోషమ్= త్వరగా సంతోషించు, అధీశ్వరమ్= ప్రభువు ఎవ్వరని (ఆశుతోషుడు) ( అధికః ఈశ్వరః–చక్రవర్తి), అపృచ్ఛత్ = అతడు అడిగెను, సః చ= అప్పుడు ఆ నారదుడు, గిరీశమ్= శంకరుని(గిరౌః కైలాసస్య ఈశః– కైలాసమునకు అధిపతి. శివుడు), ఉపాసితుం = ఉపాసింపుమని, దిదేశ = కోరెను, అసాధుషు = దుర్జనులకు, అబంధుం=విరోధి అయిన (నాస్తి బంధుః యస్య– బలము లేనివాడు, ఏకాకి), భవంతం = నీపేరును మాత్రం, న తు= చెప్పలేదు.

**తాత్పర్యము:** ఆ వృకాసురుడు శకుని అను ఒక రాక్షసుని కుమారుడు. ఒకనాడు అతడు నారదుని దగ్గరకు వచ్చి త్వరగా సంతోషించు ప్రభువు ఎవ్వరని అతడు అడిగెను.

అప్పుడు ఆ నారదుడు శంకరుని ఉపాసింపుమని కోరెను. దుర్జనులకు విరోధి అయిన నీపేరును మాత్రం చెప్పలేదు.

**89-4 శ్లో.**

**తపస్తప్త్వా ఘోరం స ఖలు కుపితస్సప్తమదినే**
**శిరశ్ఛిత్త్వా సద్యః పురహరముపస్థాప్య పురతః ।**
**అతిక్షుద్రం రౌద్రం శిరసి కరదానేన నిధనం**
**జగన్నాథాద్వవ్రే భవతి విముఖానాం క్వ శుభధీః॥** (శిఖరిణి–యమనసభవ)

**ప్రతిపదార్థము:** సః = ఆ వృకాసురుడు, ఘోరం = ఘోరమైన (ఘోరయతి భయానక రస నిమిత్తే భవతి ఘోరమైనది), తపః = తపస్సు (తాపయతి అసౌ తపింప

చేయునది), తప్త్వా= ఆచరించి, సప్తమదినే= ఏడవరోజున, కుపితః= కుపితుడై, శిరః = తన శిరస్సును, ఛిత్త్వా = ఖండించుకొనుటకు సిద్ధము కాగా, సద్యః= వెంటనే, పురహరమ్=పరమశివుడు, పురతః ఉపస్థాప్య =అతని ఎదుట ప్రత్యక్షమయ్యెను, జగన్నాథాత్ = ఆ జగదీశ్వరునుండి, శిరసి = తాను ఎవని శిరస్సుపై, కరదానేన= తాను తనహస్తమును ఉంచునో, నిధనం = ఆ వ్యక్తి మరణించునట్లుగా ( భస్మము కావలెనను) (నితరాం దధాతి ప్రాణినః-ప్రాణులను ధరించునది. మృత్యువు), అతిక్షుద్రం= అతిక్షుద్రమైన (అసారమైన)(క్షుణత్తి సంపినష్టి అసౌ హింసించువాడు. క్రూరుడు అధముడు నీచుడు తక్కువవాడు), రౌద్రం = క్రూరమైన(రుద్రస్య ఇదమ్ భయంకరమైనది), వవ్రే = వరము కోరుకొనెను, భవతి విముఖానాం= నీపట్ల విముఖులైన వారికి(విరుద్ధం అనుకూలం ముఖం యస్య-విరుద్ధంగా ముఖం గలవాడు ముఖము తిప్పినవాడు. శత్రువు విరతుడు), శుభధీః= మంచి బుద్ధి, క్వ ఖలు= ఎక్కడ ఉండును?

**తాత్పర్యము:** ఆ వృకాసురుడు ఆరురోజులు ఘోరమైన తపస్సు ఆచరించెను. శివుడు ప్రత్యక్షము కాలేదు. అందువలన ఏడవరోజున కుపితుడై తన శిరస్సును ఖండించుకొనుటకు సిద్ధము కాగా వెంటనే పరమశివుడు అతని ఎదుట ప్రత్యక్షమయ్యెను. ఆ జగదీశ్వరునుండి తాను ఎవని శిరస్సుపై తాను తనహస్తమును ఉంచునో ఆ వ్యక్తి మరణించునట్లుగా (భస్మము కావలెనను) అతిక్షుద్రమైన క్రూరమైన వరమును వృకాసురుడు కోరుకొనెను . నీపట్ల విముఖులైన వారికి మంచి బుద్ధి ఎక్కడ ఉండును?

**89-5 శ్లో.**

**మోక్తారం బంధముక్తో హరిణపతిరివ ప్రాద్రవత్ సోఽథ రుద్రం**
**దైత్యాద్భీత్యా స్మ దేవో దిశిదిశి వలతే పృష్ఠతో దత్తదృష్టిః ।**
**తూష్ణీకే సర్వలోకే తవ పదమధిరోక్ష్యంతముద్వీక్ష్య శర్వం**
**దూరాదేవాగ్రతస్త్వం పటువటువపుషా తస్థిషే దానవాయ ॥**

(స్రగ్ధర **మ , ర , భ , న , య , య , య**)

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, సః = ఆ రాక్షసుడు వృకాసురుడు, బంధముక్తః

= బంధమునుండి విడిపించబడిన (బధ్యతే అనేన–దీనితో ఆపుదురు. సంయమము సంకెళ్లు.)(ప్రాప్తమోక్షణ–వదలబడినది), హరిణపతిః = సింహము (హరతి మనః–మనస్సు దోచుకొనునది. జింక. ఈ హరిణి కి రాజు కనుక సింహము హరిణ పతి), మోక్తారం= విడిపించినవాని పైకి, ఇవ=దూకిన విధముగా, రుద్రం = తనకు వరము ఇచ్చిన రుద్రుని శిరస్సుపై చేయి పెట్టుటకు సిద్ధపడి (రోదయతి అసౌ ఏడిపించువాడు), ప్రాద్రవత్=అతని వైపు వచ్చెను, దేవః = శివుడు (దీవ్యతి ప్రకాశించువాడు. దేవత), దైత్యాత్ = వృకాసురుని (దితేః అపత్యమ్ దితి సంతానము. రాక్షసులు), భీత్యా= భయముతో(బిభేతి తస్య భావః – భయము), పృష్ఠతః= వెనుకకు (పశ్చాద్భాగః – వెనుక నుండి వెనుక భాగము), దత్తదృష్టిః= చూచుకొనుచు (దత్తః ప్రదత్తః విసృష్టః – ఇవ్వబడినది)( దృష్టిః దర్శనం జ్ఞానమ్ చూచుట), దిశిదిశి= అన్ని దిక్కులకును, వలతే స్మ= పరుగెత్తసాగెను, సర్వలోకే = శంకరునికి తోడ్పడలేక అన్ని లోకముల వారు, తూష్ణీకే= ఏమి చేయలేక ఊరుకోగా (తూష్ణీం మౌనం శీలం అస్య–మౌనము కలవాడు), తవ పదమ్= వైకుంఠమునకు, అధిరోక్ష్యంతమ్=అధిరోహించుచున్న (వచ్చుచున్న), శర్వం = శివుని (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), దూరాత్ ఏవ= దూరము నుండి(దుఃఖేన హీయతే ప్రాప్యతే కష్టంగా పొందబడునది. దూరము), ఉత్ వీక్ష్య = చూసి (ఉత్ ఊర్ధ్వం ఈక్షతే పైకి చూచుట ఆలోచించుట గుర్తించుట),త్వం =నువ్వు,పటువటువపుషా =బ్రహ్మచారిరూపముతో(పాటయతి చతురో భవతి చాతుర్యం కలవాడు. చతురుడు.)(వటతి అల్పం వస్త్రమ్ చిన్న వస్త్రమును ధరించువాడు. చిన్న పిల్లవాడు, బ్రహ్మచారి), దానవాయ అగ్రతః = శివుని వెన్నంటి వచ్చుచున్న వృకాసురుని ముందు(దనోః అపత్యమ్ దనువు సంతానము. దానవులు రాక్షసులు), తస్థిషే = నిలబడ్డావు.

**తాత్పర్యము:** అటుపిమ్మట ఆ రాక్షసుడు వృకాసురుడు బంధమునుండి విడిపించబడిన సింహము తనను విడిపించినవాని పైకి దూకిన విధముగా తనకు వరము ఇచ్చిన రుద్రుని శిరస్సుపై చేయి పెట్టుటకు సిద్ధపడి అతని వైపు వచ్చెను. శివుడు వృకాసురుని భయముతో వెనుకకు చూచుకొనుచు అన్ని దిక్కులకును పరుగెత్తసాగెను. శంకరునికి తోడ్పడలేక అన్ని లోకముల వారు ఏమి చేయలేక

ఊరుకోగా నీ వైకుంఠమునకు వచ్చుచున్న శివుని దూరము నుండి చూసి – నువ్వు బ్రహ్మచారిరూపముతో శివుని వెన్నంటి వచ్చుచున్న వృకాసురుని ముందు నిలబడ్డావు.

**89–6 శ్లో.**

**భద్రం తే శాకునేయ! భ్రమసి కిమధునా త్వం పిశాచస్య వాచా**
**సందేహశ్చేన్మదుక్తౌ తవ కిము న కరోష్యంగులీమంగ! మౌళౌ।**
**ఇత్థం త్వద్వాక్యమూఢశ్శిరసి కృతకరస్సోఽపతచ్ఛిన్నపాతం**
**భ్రంశో హ్యేవం పరోపాసితురపి చ గతిః శూలినోఽపి త్వమేవ ॥**

(స్రగ్ధర **మ , ర , భ , న , య , య , య**)

**ప్రతిపదార్థము:** శాకునేయ= శకుని పుత్రుడా! (వృకాసురుడా!) (శకునేః అపత్యమ్ శకుని కొడుకు గుడ్లగూబ), తే = నీకు, భద్రం= శుభమగుగాక, త్వం= నువ్వు, అధునా= ఇప్పుడు(ఇదం ధునా, అస్మిన్ కాలే ఈ కాలంలో ఇప్పుడు), పిశాచస్య= పిశాచము అయిన శివుని (పిశితం మాంసం అశ్నాతి మాంసమును తినునది(వాడు). రాక్షసుడు), వాచా= మాటలు విని నిజమని నమ్మి, కిమ్ భ్రమసి= ఎందుకు అనవసరముగా తిరుగుచున్నావు?, సందేహః చేత్= నా మాటలపై నీకు సందేహం కలిగినచో, తవ మౌళౌ= నీ తలపైనే (మల్యత ఇతి మౌళిః – ధరింపబడునది), అంగులీమ్ = నీ చేతిని, కిము న కరోషి= ఎందుకు పెట్టుకోవు?, ఇత్థం= ఈ విధముగా పలికిన, త్వత్ వాక్యమూఢః= నీ వాక్యములకు మోహితుడై (ముహ్యతి అసౌ మోహించువాడు. మూఢుడు), సః = ఆ వృకాసురుడు, శిరసి= తన నెత్తిపై, కృతకరః = చేతిని పెట్టుకొని, ఛిన్నపాతం = వేళ్లతో సహా భూమిపైకి ఒరిగిన చెట్టువలె(ఛిన్నః కృతచ్ఛిన్నః భిన్నః–ఛిన్నాభిన్నము చేయబడినది), అపతత్= కింద పడి భస్మమయ్యెను, పర ఉపాసితుః = ఇతరదేవతలను ఉపాసించువారు, ఏవం హి = ఈ విధముగానే, భ్రంశః అపి చ= తప్పక భ్రష్టులగుదురు. (భ్రంశతే తస్య భావః కర్మ వా క్రింద పడుట పారిపోవుట), శూలినః అపి =శంకరునికి కూడా (శూలం అస్తి అస్య–బాధ కలవాడు త్రిశూలం కలవాడు. ఈశ్వరుడు), త్వమ్ ఏవ= నువ్వే, గతిః= ఆశ్రయము.

**తాత్పర్యము:** శకుని పుత్రుడా! వృకాసురుడా! నీకు శుభమగుగాక ! నువ్వు ఇప్పుడు పిశాచము అయిన శివుని మాటలు విని నిజమని నమ్మి ఎందుకు అనవసరముగా తిరుగుచున్నావు? నా మాటలపై నీకు సందేహం కలిగినచో నీ తలపైనే నీ చేతిని ఎందుకు పెట్టుకోవు ? ఈ విధముగా పలికిన నీ వాక్యములకు మోహితుడై ఆ వృకాసురుడు తన నెత్తిపై చేతిని పెట్టుకొని వేళ్లతో సహా భూమిపైకి ఒరిగిన చెట్టువలె కింద పడి భస్మమయ్యెను. ఇతరదేవతలను ఉపాసించువారు ఈ విధముగానే తప్పక భ్రష్టులగుదురు. శంకరునికి కూడా నువ్వే ఆశ్రయము.

**విశేషాలు**

**పిశాచము:** శంకరుని పిశాచమని చెప్పుట, వృకాసురునికి మేలు కలుగవలెనని చెప్పుట కేవలము తన మాటలపై నమ్మకం కలిగించుట కొరకు విష్ణువు చెప్పాడని వ్యాఖ్యానం.

**భద్రం:** క్షేమం. కుశలం. శుభం. శ్రేయస్సు. మోక్షం. అన్నింటికీ వాచకమే. చివరకు బ్రహ్మతత్త్వమే అన్నిటికన్నా భద్రమైనది. కనుకనే 'భద్రం కర్ణేభిః శృణుయామ' అని మహర్షులు చాటిచెప్పారు. భద్రం పరమాత్మ అయితే క్షుద్రమీ ప్రపంచం. కనుకనే అసతోమా సద్గమయ అని వాపోవటం.

కృష్ణుడి అష్ట భార్యలలో ఒకరు భద్ర. గోలోక రాధ చెలికత్తలలో ఒకరి పేరు కూడా భద్ర. కుబేరుడి భార్యలలో ఒకరి పేరున్నూ ఇదే. భద్రం అంటే శుభమనీ, శ్రేష్ఠమనీ అర్థాలు ఉన్నాయి. భద్రమస్తు అంటే శుభం కలుగుగాక అని అర్థం. భద్రకాళి శక్తి రూపిణి. కృష్ణుడు పుట్టినప్పుడు అతడి స్థానంలో ఉంచిన ఆడ శిశువు ఈమే. కంసుడి చేతిలో మరణించకుండా తప్పించుకొన్నది. పార్వతి అవతారం.

**అంగుళి:** అంగుష్ఠతర్జనీమధ్యమానామికాకనిష్ఠికలు అని వ్రేళ్లు ఐదు. సాధారణంగా అంగుళి అంటే అంగౌ హస్తౌ లీయతే చేతిలో నుండునది. వ్రేలు అని అర్థం. కాని అంగులీ శబ్దమునకు హస్తపాదావయవవిశేషః అను విశేషార్థం. సర్వశబ్దసంబోధిని అను సంస్కృతనిఘంటువులో (పరవస్తు శ్రీనివాసాచార్య) ఇవ్వబడినది.

"...ఆత్మ పాణితలంబుం దన నెత్తి మోపికొని తా నేలన్ వెసం గూలె విశ్రుతదంభోళిహతిన్ వడింబడు మహా క్షోణీధరంబో యనన్."( 10.2-1258) అని తెలుగు భాగవతము.

**89-7 శ్లో.**

**భృగుం కిల సరస్వతీనికటవాసినస్తాపసాః**
**త్రిమూర్తిషు సమాదిశన్నధికసత్త్వతాం వేదితుమ్ ।**
**అయం పునరనాదరాదుదితరుద్ధరోషే విధౌ**
**హరేఽపి చ జిహింసిషౌ గిరిజయా ధృతే త్వామగాత్ ॥**

(పృథ్వి **జ, స, జ, స, య, వ**(లగ))

**ప్రతిపదార్థము:** సరస్వతీనికటవాసినః=సరస్వతీ నదీతీరములో నివసించుచున్న (సర ఇతి ఉదక నామ తద్వతీ నీరు కలది. సరస్వతి నది.)(ని సమీపే కటతి వర్తతే దగ్గర వుండునది. దగ్గర), తాపసాః = తపస్వులకు, త్రిమూర్తిషు = త్రిమూర్తులలో (తిస్రః మూర్తయః యస్యమూడు ఆకారములు కలవాడు. బ్రహ్మ, విష్ణువు, శివుడు మూర్తులుగా కల పరబ్రహ్మ), అధికసత్త్వతాం= సత్వగుణసంపన్నుడు ఎవరని (మిక్కిలి సాత్వికుడు) (సత్త్వస్య భావః -సతో భావః సత్త్వగుణము), వేదితుమ్ = తెలుసుకొనుటకు, భృగుం = భృగుమహర్షిని (భృజ్యతే తపసా శరీరమ్ తపస్సుచే శరీరమును తపింప చేసినవాడు. భృగువు, ఒక మహర్షి), సమాదిశన్ కిల = నియోగించిరి కదా!, అయం = భృగుమహర్షి, విధౌ = బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లి (విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ), అనాదరాత్ = అతని యెడల అనాదరము చూపెను. (నమస్కరించలేదు) (న ఆదరః గౌరవహేతునా సమ్మాననా అనాదరము పరాభవము తిరస్కారము), ఉదితః = అందువలన కోపము కలిగినను బ్రహ్మ ఓర్చుకొనెను. (ఉత్ ఉచ్చైః ఇతః గతః ఉదయించినది మొలచినది వృద్ధి చెందినది), పునః = మరలా, హరే అపి చ= భృగు మహర్షి తన వద్దకు వచ్చి చులకన భావముతో ప్రవర్తించగా పరమ శివునకు(భ్రాతృస్నేహముతో కౌగిలించుకొనబోగా భృగు మహర్షి నిరాకరించెను) (హరతి పాపాన్ పాపములను హరించువాడు. రుద్రుడు), రుద్ధరోషే= కోపము

కలిగి(రుద్ధః అవరుద్ధః, ఆవృతః –ఆపబద్దది, కప్పబద్దది), జిహింసిషౌ = భృగువును చంపబోయెను, గిరిజయా= కాని పార్వతీదేవి(గిరౌ జాయతే పర్వతములో పుట్టునది. పర్వతరాజు కుమార్తె. పార్వతి), ధృతే = శివుని నివారించెను, త్వామ్= చివరకు భృగు మహర్షి నీదగ్గరకు, అగాత్= వచ్చెను.

**తాత్పర్యము:**సరస్వతీ నదీతీరములో నివసించుచున్న తపస్వులకు త్రిమూర్తులలో మిక్కిలి సాత్వికుడు ఎవరని తెలుసుకొనుటకు భృగుమహర్షిని నియోగించిరి. భృగుమహర్షి బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లి అతని యెడల అనాదరము చూపెను. (నమస్కరించలేదు) అందువలన కోపము కలిగినను బ్రహ్మ ఓర్చుకొనెను. మరలా భృగు మహర్షి తన వద్దకు వచ్చి చులకన భావముతో ప్రవర్తించగా పరమ శివుడు భ్రాతృస్నేహముతో కౌగిలించుకొనబోగా భృగు మహర్షి నిరాకరించెను. కోపము కలిగి భృగువును చంపబోయెను. కాని పార్వతీదేవి శివుని నివారించెను చివరకు భృగు మహర్షి నీదగ్గరకు వచ్చెను.

**విశేషాలు**

**భృగువు :**

1. బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. కొందఱు వరుణుని యజ్ఞమందలి అగ్నినుండి ఇతడు పుట్టినట్లు చెప్పుదురు. ఇతని పుత్రుడు కవి. పౌత్రుడు అసురులకు గురువు అయిన శుక్రాచార్యులు. ఇదికాక ఇతనికి ఖ్యాతివలన ధాత, విధాత అని ఇరువురు కొడుకులు కలిగిరి. అందు ధాతకు మృకండుడు, విధాతకు ప్రాణుడును జన్మించిరి. ప్రాణుని కొడుకు వేదశిరుడు. వేదశిరుని కొడుకు ఉశేనస్సు. మృకండుని కొడుకు మార్కండేయుడు. ఇతని మీసములను దక్షయాగమున వీరభద్రుడు పెఱికివేసినట్లు పురాణముల వలన తెలియవచ్చుచున్నది.

2. ఒక మహర్షి. ఇతఁడు భాగీరథీ దక్షిణతీరమున మహాపద్మము అనియెడు పురమునందు ఉండెను. ఇతఁడు ఒకప్పుడు అగ్నిహోత్రము చేయుటకు తన భార్య పులోమను అగ్నులను ఏర్పఱపుము అని ఆజ్ఞాపించి తాను స్నానము చేయుటకై నదికిపోయెను. అప్పుడు పులోముడు అను దానవుడు ఒకడు అచ్చటికి వచ్చి అగ్నిదేవునివలన ఆమె ఇతని భార్య అని ఎఱిగి ఆమెను ఎత్తుకొనిపోవ యత్నింపగా

వెఱపుచేత పూర్ణ గర్భిణి అయిన అమె తత్తఱపడునపుడు గర్భము భేదిల్లి గర్భస్రావము అయ్యెను. ఆస్రావమైన పిండము చ్యవనుడు అనబరగిన ఋషి అయి తన కోపపు చూపు చేతనే ఆరక్కసుని భస్మము చేసెను. ఇది అంతయు భృగుమహర్షి ఎఱిగి అగ్నిమీద అలిగి అతనిని సర్వభక్షకుడవు కమ్ము అని శపియించెను. అట్లైనను బ్రహ్మ అగ్ని యొక్క శుచిత్వమునకు లోపము కాకుండునట్లు అనుగ్రహించెను.

**89–8 శ్లో.**

**సుప్తం రమాంకభువి పంకజలోచనం త్వాం**
**విప్రే వినిఘ్నతి పదేన ముదోత్థితస్త్వమ్ ।**
**సర్వం క్షమస్వ మునివర్య! భవేత్ సదా మే**
**త్వత్పాదచిహ్నమిహ భూషణమిత్యవాదీః ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** రమా = లక్ష్మీదేవి యొక్క(రమయతి ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి.), అంకభువి= ఒడిలో, సుప్తం= నిద్రించుచున్న (సుప్తః నిద్రితః శయితః– పడుకొన్నవాడు), పంకజలోచనం= పద్మముల వంటి కన్నులు కలిగిన(పంకే జాయతే బురదలో పుట్టునది. కమలము)(లోచ్యతే అనేన దీనితో చూచుదురు. కనుపాప), త్వాం=నిన్ను, విప్రే= ఆ భృగుమహర్షి (తననుచూచి లేవలేదని) (వపతి ధర్మమ్ ధర్మమును నాటువాడు. బ్రాహ్మణుడు), పదేన = తనపాదముతో (పద్యతే వెళ్లునది. పాదము), వినిఘ్నతి = తన్నెను, త్వం = నువ్వు, ముదా = సంతోషముతో (మోదంతే తస్య భావః–హర్షము సంతోషము), ఉత్థితః= లేచి ( ఉత్థితః జాగృతః ఉద్గతో వా ఆసనమునుండి లేచినవాడు), మునివర్య = మునివర్యా!, సర్వం క్షమస్వ= నా తప్పులన్నింటిని క్షమింపుము, త్వత్ పాద చిహ్నం= నీ పాద చిహ్నము ( చిహ్యతే అనేన–దీనితో గుర్తు పెట్టుదురు. గుర్తు, గురుతు), మే = నాకు, ఇహ= ఇక్కడ(నావక్షస్థలమున),సదా=ఎల్లప్పుడు,భూషణం=అలంకారముగా(భూష్యతే మండ్యతే అనేన–దీనితో అలంకరించుకొందురు. భూషణము, అలంకారము), భవేత్ = అగుగాక (నిలచిపోవుగాక!), ఇతి = అని, అవాదీత్ = పలికితివి.

**తాత్పర్యము:** లక్ష్మీదేవి యొక్క ఒడిలో నిద్రించుచున్న పద్మముల వంటి కన్నులు

కలిగిన నిన్ను ఆ భృగుమహర్షి తననుచూచి లేవలేదని తనపాదముతో తన్నెను. నువ్వు సంతోషముతో లేచి "మునివర్యా! నా తప్పులన్నింటిని క్షమింపుము. నీ పాద చిహ్నము నాకు ఎల్లప్పుడు అలంకారముగా అగుగాక!" అని పలికితివి.

**89–9 శ్లో.**

**నిశ్చిత్య తే చ సుదృఢం త్వయి బద్ధభావాః**
**సారస్వతా మునివరా దధిరే విమోక్షమ్ ।**
**త్వా మేవమచ్యుత! పునశ్చ్యుతి దోషహీనం**
**సత్త్వోచ్చయైకతనుమేవ వయం భజామః ॥**

(వసంత తిలకము **త , భ , జ , జ , గా**(గగ))

**ప్రతిపదార్థము:** సారస్వతాః = సరస్వతీ నదీ తీరమున ఉన్న, తే మునివరాః చ = ఆ మహర్షులు కూడా (మనుతే జానాతి తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు. ఋషి), నిశ్చిత్య= నువ్వే సత్వ గుణము కలవాడివని నిశ్చయించుకొని, త్వయి చ= నీయందు, సుదృఢం=దృఢమైన (దృంహతి కఠినో భవతి వర్ధతే గట్టిగా నుండునది. దృఢమైనది చిక్కగా నుండునది), బద్ధభావాః= భక్తి కలిగి ఉండుటచే (బద్ధః నిబద్ధః కృతబంధనః–బంధింపబడ్డవాడు రచింపబడినది), విమోక్షమ్= మోక్షమును (విమోక్షః ముక్తిః విశేషేణ మోక్షయతి తస్య భావః కర్మ వా ముక్తి విడిచిపెట్టుట), దధిరే = పొందిరి, అచ్యుత= ఓ అచ్యుతా ! (స్వరూప సామర్థ్యాత్ న చ్యుతః చ్యవతే వా స్వరూప సామర్థ్యం వలన చ్యుతుడు కానివాడు. విష్ణుడు), ఏవం= ఈ విధముగ, పునః= మరలా, చ్యుతి దోషహీనం= చ్యుతిదోషము లేనివాడివి, సత్త్వ ఉచ్చయ ఏకతనుమ్= సత్వ స్వరూపము కలిగిన (సతో భావః–సత్త్వము సత్త్వగుణము) (ఉచ్చయనం సంగ్రహః సంచయః ఏకత్రీకరణమ్ సంగ్రహించుట కుప్ప చేయుట సమృద్ధి), త్వాం ఏవ = నిన్నే, వయం = మేము, భజామః = సేవింతుము.

**తాత్పర్యము:** సరస్వతీ నదీ తీరమున ఉన్న ఆ మహర్షులు కూడా నువ్వే సత్వ గుణము కలవాడివని నిశ్చయించుకొని నీయందు దృఢమైన భక్తి కలిగి ఉండుటచే మోక్షమును పొందిరి. ఓ అచ్యుతా! ఈ విధముగ మరలా చ్యుతిదోషము లేనివాడివి, సత్వ స్వరూపము కలిగిన నిన్నే మేము సేవింతుము.

**విశేషము**

**చ్యుత :** చ్యుత అనగా జారిపడినది. స్వరూప స్థితి నుంచి తొలగినది. ఇదే జీవభావం. తొలగలేదని గ్రహిస్తే అచ్యుత . ఇదే ఈశ్వర భావం.

**ఉచ్ఛ్రయ:** పోగుకావటం. పోగు. సమూహం. రాశి అధికమవటం అని కూడా అర్థమే. సముచ్చయమనే మాటలో తెలుస్తుంది ఈ విషయం. జ్ఞాన కర్మ సముచ్ఛయ. జ్ఞానమూ కర్మ రెండూ కలిపి పట్టుకోవటమని భావం. అభ్యుచ్ఛ్రయమని కూడా ఒక మాట ఉంది. బాగా కలుపుకుంటూ రావటం అని భావం.

**89–10 శ్లో.**

**జగత్సృష్ట్యాదౌ త్వాం నిగమనివహైర్వందిభిరివ**
**స్తుతం విష్ణో! సచ్చిత్పరమరసనిర్ద్వైతవపుషమ్ ।**
**పరాత్మానం భూమన్! పశుపవనితాభాగ్యనివహం**
**పరీతాపప్రశాంత్యై పవనపురవాసిన్! పరిభజే ॥**

(శిఖరిణి – యమనసభవ)

**ప్రతిపదార్థము:** విష్ణో= ఓ విష్ణుమూర్తీ!, భూమన్= మహత్త్వం. సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా! (బహోర్భావః–ఎక్కువ), పవనపురవాసిన్ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, జగత్ సృష్టి ఆదౌ = సృష్టి ప్రారంభ సమయంలో (గచ్ఛతి నడచునది. ప్రపంచము)(సృష్టి= సృజ్యతే రచ్యతే రచించబడునది), వన్దిభిః ఇవ = వందిమాగధుల వలె (వందతే స్తౌతి నృపాదికమ్ నృపాదులను స్తోత్రము చేయువాడు. వంది, వందిమాగధుడు), నిగమనివహైః = వేదముల చేత(గమయంతి జ్ఞాపయంతి వేదార్థమ్ వేదార్థమును తెలియచేయు శాస్త్రములు), స్తుతం= స్తుతింపబడిన( కృత స్తవః ప్రశంసితః–స్తోత్రించబడినది ప్రశంసింప బడినది ),సచ్చిత్ పరమరసనిర్ద్వైత వపుషమ్=సచ్చిదానంద రస స్వరూపుడవయిన, పరఆత్మానం=ఉపాధులనుదాటిపోయినతత్త్వమునుపశుపవనితాభాగ్యనివహం= గోపవనితల అదృష్టమున బృందావనములో అవతరించిన (వారికి భాగ్యము కలిగించిన ) త్వాం= నిన్ను పరీతాపప్రశాంత్యై = పరితాపమును శాంతింపచేయమని (అత్యంతం తాపః తాపము దుఃఖము వేడి.) పరిభజే= నిన్ను సేవింతును.

**తాత్పర్యము:** ఓ విష్ణుమూర్తీ! మహత్త్వం, సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా ! ఓ గురువాయూరు కృష్ణ దేవా ! సృష్టి ప్రారంభ వందిమాగధుల వలె వేదముల చేత స్తుతింపబడిన సచ్చిదానంద రస స్వరూపుడవై , ఉపాధులను దాటిపోయిన తత్త్వమై, గోపవనితల అదృష్టమున బృందావనములో అవతరించిన నిన్ను పరితాపమును శాంతింపచేయమని నిన్ను సేవింతును.

**విశేషాలు**

**భూమన్:** అన్నిటికన్నా ఉత్కృష్టమైన పదార్థం. చాలా పెద్దదని అర్థం. అద్వితీయమైన తత్త్వం. పరిపూర్ణమైన చైతన్యమని అర్థం.

**పరాత్మ:** పరమమమైన ఆత్మ. అంటే నిర్గుణమైన ఈశ్వర తత్వం. జీవుడు శరీరం మేరకే ఉన్నవాడు గనుక జీవాత్మ. శరీర బంధం లేనివాడు గనుక ఈశ్వరుడు పరమాత్మ. పరమమంటే ఇక్కడ ఉపాధులను దాటిపోయిన తత్త్వమని భావం.

**సత్:** సత్ అన్నా సత్యమన్నా ఉన్నది అని అర్థం. కలిగిన ఆత్మజ్ఞానాన్ని అలాగే నిలుపుకొంటూ పోవడం. సత్తా అంటే ఉనికని అర్థం. ఎప్పటికీ మారకుండా నిలిచి ఉన్నదేదో అది సత్ లేదా సత్యం. అది సాకారం కాదు కేవల జ్ఞానరూపం. కనుకనే సత్తా అన్నా అదే. అంటే అస్తిత్వమన్నమాట.

విష్ణునామాలలో సత్తా అని ఒక నామం ఉంది. అంటే విష్ణువు సాకారంగా ఎక్కడో ఉన్నాడని కాదు. నిరాకారమైన భావమే లేదా అస్తిత్వమే విష్ణువు అనే మాటకు అర్థం. అంటే పరమాత్మ స్వరూపం. 'సదేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్' అని ఉపనిషత్తు. ఈ ప్రపంచమంతా సృష్టికి పూర్వం సద్రూపంగానే ఉందట. అప్పటికి ఆత్మా, అనాత్మా అనే తేడా లేక అంతా సద్రూపమే. అయితే అది స్వతఃప్రమాణం కనుక చిద్రూపం కూడా అదే. సచ్చిత్తులే పరమాత్మ అంటే.

**చిత్:** స్ఫురణ. నేనున్నాననే భావం. ఇదే ఆత్మ. చైతన్యమే దాని స్వరూపం. ఆత్మచైతన్యమని పేర్కొనటం కొయ్యబొమ్మ అనటం లాంటిది. రెండూ ఒకటే వాస్తవంలో. అయినా వ్యావహారికంగా వచ్చిందీ మాట.

**రస:** ఎక్కువ అభిలాష. ఆస్వాదించటం. వృత్తి వాసనగా మారటం. రసవర్జం. 'రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.' ఇక్కడ రసమంటే వాసన అనే అర్థం. ఆనంద స్వరూపమైన పరమాత్మకు కూడా రసమనే పేరు. 'రసోవైసః' ఆయన ఆడే జగన్నాటకమంతా రాసక్రీడ క్రిందికి వస్తుంది.

***దశమ స్కంధము***

**89వ దశకము సమాప్తము**



# దశకమ్ 90 – విష్ణుమహత్త్వస్థాపనము

**90–1 శ్లో.**

**వృకభృగుమునిమోహిన్యంబరీషాదివృత్తే–**
**ష్వయి తవ హి మహత్త్వం సర్వశర్వాదిజైత్రమ్ ।**
**స్థితమిహ పరమాత్మన్! నిష్కలార్వాగభిన్నం**
**కిమపి యదవభాతం తద్ధి రూపం తవైవ ॥**

(మాలిని – ననమయయ)

**ప్రతిపదార్థము:** అయి పరమాత్మన్ = ఓ పరమాత్మా!, వృకభృగుమునిమోహిని అంబరీష ఆదివృత్తేషు= వృకాసురుడు, భృగుమహర్షి, మోహిని, అంబరీషాదుల వృత్తాంతముల వలన, సర్వశర్వ ఆదిజైత్రమ్= శంకరుడు మొదలైన దేవతలను జయించిన (జేతా ఏవ జైత్ర–జయించువాడు. జయశీలుడు), తవ హి మహత్త్వం= నీయొక్క మాహాత్మ్యము (మహతో భావః–గొప్ప దనము), ఇహ = ఇక్కడ, స్థితమ్ = ఉన్నదని ధ్రువీకరింపబడినది, నిష్కల= నిష్కలుడైన పరమాత్మయందు, అర్వాక్ =సగుణులైన బ్రహ్మ విష్ణు శివులందరిలో(అవరే కాలే దేశే వా అంచతి తరువాత కాలపుది దగ్గరిది వెనుకది ముందు), కిమపి అభిన్నం రూపం=ఏకరూపముగా, యత్= ఏది, అవభాతం= కనబడుచున్నదో (భాతి ప్రకాశతే అసౌ, ప్రకాశితః – ప్రకాశించునది), తత్ = ఆ అభిన్నమైన ఏక రూపము, తవ ఏవ హి= నీ రూపమే కదా.

**తాత్పర్యము:** ఓ పరమాత్మా! వృకాసురుడు, భృగుమహర్షి, మోహిని, అంబరీషాదుల వృత్తాంతముల వలన , శంకరుడు మొదలైన దేవతల కంటె నీయొక్క మాహాత్మ్యము గొప్పగా ఉన్నదని ధ్రువీకరింపబడినది. (అనగా శంకరాది దేవతలను విష్ణుదేవుడు మించాడని, త్రిమూర్తులందరిలోను విష్ణుదేవునిలోనే ఎక్కువగా ప్రభావ విశేషమున్నదని భావం.) నిష్కలుడైన పరమాత్మయందు సగుణులైన బ్రహ్మ విష్ణు శివులందరిలో ఏకరూపముగా ఏది కనబడుచున్నదో ఆ అభిన్నమైన ఏక రూపము నీ రూపమే కదా! (బ్రహ్మ రుద్ర ,ఇంద్రాదులు విష్ణుదేవుని అంశలని, ఈ సమస్త విశ్వము విష్ణుదేవుని సగుణ రూపమని భావం)

**విశేషము**

**కలా:** ఒక శకలం. ఒక భాగం. ఒక ముక్క. ప్రాణం మొదలు నామంవరకూ పదహారు ఇవి. మొత్తం అనాత్మ. ప్రపంచమంతా ఈ పదహారే. షోడశ కళలని పేరు వీటికి. వీటితో కలిపి పట్టుకుంటే ఆత్మసకలం. వాటిని లయం చేసి పట్టుకుంటే నిష్కలం లేదా అకలం.

కళాప్రళయ మార్గమేదో గురూపదేశంవల్ల గ్రహించాలని ప్రశ్నోపనిషత్తులో భాష్యకారుల ఉపదేశం.

**90–2 శ్లో.**
**మూర్తిత్రయేశ్వరసదాశివపంచకం యత్**
**ప్రాహుః పరాత్మవపురేవ సదాశివోఽస్మిన్ ।**
**తత్రేశ్వరస్తు స వికుంఠపదస్త్వమేవ**
**త్రిత్వం పునర్భజసి సత్యపదే త్రిభాగే ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** మూర్తిత్రయ= బ్రహ్మ, విష్ణు, రుద్రులు, ఈశ్వరసదాశివ = ఈశ్వరుడు మరియు సదాశివుడు పంచకం = అను అయిదు మూర్తులలో, యత్= ఏశివుడున్నాడని ప్రాహుః =ఏ శైవులు చెప్పుచున్నారో, అస్మిన్ పరాత్మవపుః= ఆ పరతత్వ రూపమైన సదాశివః= సదాశివ రూపము, త్వం ఏవ=నువ్వే. సః ఈశ్వరః తు = అట్లే ఆ పరమేశ్వర రూపముతో, తత్ర వికుంఠపదః = ఆ వైకుంఠములో త్వమ్ ఏవ= నువ్వే, త్రిభాగే = బ్రహ్మవిష్ణు శివలోకము అని మూడు లోకములుగా, సత్యపదే = సత్యలోకములో ప్రకాశించు త్రిత్వం = త్రి మూర్తి స్వరూపునిగా, పునః = మరలా భజసి= నువ్వు వహించుచున్నావు.

**తాత్పర్యము:** బ్రహ్మ, విష్ణు, రుద్రులు, ఈశ్వరుడు మరియు సదాశివుడు పంచకం = అను అయిదు మూర్తులలో శివుడున్నాడని శైవులు చెప్పుచుందురు. ఆ పరతత్వ రూపమైన సదాశివ రూపము నువ్వే. ఆ పరమేశ్వర రూపముతో ఆ వైకుంఠములో నువ్వే ప్రకాశించుచున్నావు. బ్రహ్మ, విష్ణు శివలోకము అని మూడు లోకములుగా ఉన్న సత్యలోకములో త్రి మూర్తి స్వరూపునిగా నువ్వు ప్రకాశిస్తున్నావు.

**విశేషాలు:** బ్రహ్మ విష్ణు శివ ఈశ్వర సదాశివమూర్తి భేదముచే అయిదురూపులుగా ఉన్నవాడు సదాశివుడే అని శైవులు చెబుతారు.. వైష్ణవుల పక్షములో అయిదురూపులుగా ఉన్నవాడు విష్ణువు. (విష్ణుం పంచాత్మకం వందే )

"యోహం సత్వం జగచ్చేదం/స దేవాసురమానుషం ("శంకరా, నేను దేవాసుర మనుషాది సహితమైన ఈ జగత్తు నీ స్వరూపమే ) అని విష్ణువు విష్ణు పురాణంలో చెప్పాడు. అహం త్వం సర్వగోదేవ ఆవయోరంతరం నాస్తి శబ్దైరర్థైర్జగత్రయే త్వమేవాహం జనార్దన( నేను సర్వగతుడవైన నీవే. నీవే నేను. శబ్దాలచే గాని, అర్థాలచే గాని మన ఉభయులకు భేదం లేదు") అని హరివంశంలో శంకరుడు విష్ణువుతో పలికిన మాటలు.

"సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,/శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః.

యధాశివమయో విష్ణు రేవం విష్ణుమయశ్శివః/యధాంతరం న పశ్యామి తధామే స్వస్తిరాయుషి."

("శివుడు విష్ణువు యొక్క రూపము. విష్ణువు శివుని యొక్క రూపము. శివుని హృదయం విష్ణువు. విష్ణువు యొక్క హృదయం శివుడు. శివుడు విష్ణుమయము. విష్ణువు శివమయము. వీరిమధ్య భేదము చూడని నా ఆయుస్సునకు భద్రముండుగాక. భేదమును చూచానో నా ఆయుస్సునకు ముప్పే")

ఇవన్నీ లోకంలో ప్రసిద్ధమైన మాటలు

అయితే పంచాయతన పూజలో ఒకరికి అగ్రపూజ తప్పదు.

అలాగే తాను నమ్మిన దేవుని అధికాధికునిగా చెప్పుట కవి లోకంలో ఆచారం. అదే పద్ధతిలో నారాయణ భట్టాత్రి తాను ఆరాధించే విష్ణువును శివునికంటె అధికాధికునిగా ప్రతిపాదిస్తున్నాడు.

**90-3 శ్లో.**

**తత్రాపి సాత్త్వికతనుం తవ విష్ణుమాహుః**
**ధాతా తు సత్త్వవిరళో రజసైవ పూర్ణః ।**
**సత్త్వోత్కటత్వమపి చాస్తి తమోవికార-**
**చేష్టాదికం చ తవ శంకరనామ్ని మూర్తౌ ॥** (మదనము తభజజగ)

**ప్రతిపదార్థము:** తత్ర అపి= ఆ త్రిమూర్తులలో, తవ = నీయొక్క, సాత్త్వికతనుం= శుద్ధ సత్వమయమైన తనువుకలవానిని(సత్త్వగుణ సంపన్నః-సత్త్వగుణం కలవాడు), విష్ణుమ్ = విష్ణువని(వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), ఆహుః = అందురు, ధాతా తు= బ్రహ్మలో(దధాతి జగత్ ప్రపంచమును ధరించువాడు), సత్త్వవిరళః= సత్వ గుణము తక్కువగా (విగతం రాణం వస్తూనామాధిక్యం తస్య భావః-చాలా తక్కువ), రజసా ఏవ= రజో గుణము (రంజయతి రజోగుణము), పూర్ణః = అధికముగా కనిపించును. (పూర్ణః పూరితః సకలః-నిండుగా వున్నది. సంపూర్ణము), తవ = నీయొక్క, శంకరనామ్ని= శంకరుడను పేరు కలిగిన(శం సుఖం కల్యాణం కరోతి కల్యాణము కూర్చువాడు. శివుడు), మూర్తౌ= మూర్తిలో ( మూర్తః రూపం అస్తి అస్య-స్వరూపము), సత్వ ఉత్కటత్వమ్ అపి చ = సత్వ గుణము ఎక్కువగా ఉన్నప్పటికి (ఉత్ శీఘ్రం కటతి గచ్ఛతి ఎక్కువ త్వరగా పోవునది. సమృద్ధుడు విషయము), తమోవికార చేష్టాదికం చ= తమోగుణ వికారమైన చేష్టల సమూహము (చేష్టతే తస్య కర్మ కాయిక వ్యాపారః- ప్రయత్నము శరీర వ్యాపారము. (తామ్యతి, సంతాపం జనయతి సంతాపమును కల్గించునది. అంధకారము శోకము పాపము తమో గుణము.) (వివిధః విరుద్ధో వా కారః - మారుట, వికృతి, మార్పు, చిత్తవిక్షేపము), అస్తి= ఉన్నది.

**తాత్పర్యము:** ఆ త్రిమూర్తులలో నీయొక్క శుద్ధ సత్వమయమైన తనువును విష్ణువని అందురు. బ్రహ్మలో సత్వ గుణము తక్కువగా రజో గుణము అధికముగా కనిపించును. నీయొక్క శంకరుడను పేరు కలిగిన మూర్తిలో సత్వ గుణము ఎక్కువగా ఉన్నప్పటికి తమోగుణ వికారమైన చేష్టల సమూహము ఉన్నది.

**విశేషాలు:** మంచి గ్రంథాలను చదవడం, మంచివారితో స్నేహం చేయడం, సాత్విక ఆహారాన్ని తీసుకోవడం వల్ల సత్త్వగుణం పెరుగుతుంది. దీని వల్ల వ్యక్తులకు, సమాజానికి కూడా శ్రేయస్సు కలుగుతుంది. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానం" అని శాస్త్రం చెప్తున్నది

రజస్సు వల్ల సృష్టి, సత్త్వం వల్ల స్థితి, తమస్సు వల్ల లయం. సంసారమంతా దీనితోనే నిండిపోయింది.

సత్త్వం తెల్లరంగు, రజస్సు పసుపు ఎఱుపుల కలపోత. తమస్సు నలుపు,

**90-4 శ్లో.**

**తం చ త్రిమూర్త్యతిగతం పరపూరుషం త్వాం**
**శర్వాత్మనాపి ఖలు సర్వమయత్వహేతోః ।**
**శంసంత్యుపాసనవిధౌ తదపి స్వతస్తు**
**త్వద్రూపమిత్యతిదృఢం బహు నః ప్రమాణమ్ ॥** (మదనము తభజజగ)

**ప్రతిపదార్థము:** త్రిమూర్తి అతిగతం = త్రిమూర్తుల కంటె అతీతమైన(తిస్రః మూర్తయః యస్య-మూడు ఆకారములు కలవాడు. బ్రహ్మ, విష్ణువు, శివుడు మూర్తులుగా కల పరబ్రహ్మ), తం చ = ఆ ఈశ్వర రూపము, పరపూరుషం= పరమాత్మ రూపమున ఉన్న, త్వాం = నువ్వు, సర్వమయత్వహేతోః = సమస్త దేవతా స్వరూపుడవు.(సర్వాత్మకః సర్వమస్తి అస్తి అంతయు కలవాడు. సర్వాత్మకుడు పరమేశ్వరుడు), ఉపాసనవిధౌ= ఉపాసన చేయు సమయములో, శర్వ ఆత్మనా అపి = నిన్ను శివుడని (శృణాతి హినస్తి దుఃఖాని దుఃఖములను పోగొట్టువాడు. శివుడు), శంసంతి= చెబుతారు, తత్ అపి= అయినప్పటికి, స్వతః తు= పరమార్థముగా(స్వభావతః, తనకుతానే), త్వత్ రూపమ్= ఆ శివ స్వరూపము కూడా నీదే(రూపయతి తస్య భావః కర్మ వా రూపము), ఇతి= అనుటకు, నః = మాకు, అతిదృఢం= అతిదృఢముగా (దృంహతి కఠినో భవతి వర్ధతే గట్టిగా నుండునది. దృఢమైనది చిక్కగా నుండునది), బహు ప్రమాణమ్= అనేక ఆధారములు కనిపించుచున్నవి. (ప్రమీయతే యథార్థజ్ఞానం లభ్యతే అనేన-దీనితో యథార్థజ్ఞానము పొందబడును).

**తాత్పర్యము:** త్రిమూర్తుల కంటె అతీతమైన ఆ ఈశ్వర రూపములోను , పరమాత్మ రూపమున ఉన్ననువ్వు సమస్త దేవతా స్వరూపుడవు. ఉపాసన చేయు సమయములో నిన్ను శివుడని చెబుతారు. అయినప్పటికి ఆ శివ స్వరూపము కూడా నీదే అనుటకు మాకు అతిదృఢముగా అనేక ఆధారములు కనిపించుచున్నవి.

**విశేషాలు**

**ఉపాసన:** పూజించడం, చింతన మొదలైన అర్థాలు ఉన్నాయి. ఇది సగుణోపాసన, నిర్గుణోపాసన అని రెండు విధాలు. సగుణోపాసన అంటే ప్రతీక ఆధారంగానో, దైవానికి వర్తించే కొన్ని గుణాలను దేనిలోనో ఆరోపించుకుని ఉపాసించటం. విగ్రహాన్ని పూజించడం సామాన్యమైన విషయమే. వాయువు, అగ్ని మొదలైన వాటిలో పరమాత్మను చూడటం, వేదంలోనో, పురాణాది గ్రంథాలలోనో ప్రస్తావనకు వచ్చే కొందరు దేవతలను వారి వారి గుణాలను, లక్షణాలను మనస్సులో ఉంచుకుని ఆరాధించడం కూడా సగుణో పాసన. విగ్రహాన్ని/ప్రతీకను ఆరాధించడం అధ్యాసోపాసన. దైవగుణాలను ఆరోపించుకుని చేసే ఉపాసన సంపదు పాసన. గుణాలకు అతీతుడైన బ్రహ్మను/ పరమాత్మను ఉపాసించడం నిర్గుణోపాసన. ఉపాసన చేసేవారు ఉపాసకులు. ఏయే లక్షణాలను, గుణాలను ఆరోపించుకుని దేవతలను ఉపాసిస్తారో అవే లక్షణాలతో, గుణాలతో దైవం సాక్షాత్కరించడం, అవే లక్షణాలు, గుణాలు ఉపాసకులలో వ్యక్తం కావడం సాధకులకు అనుభవం. నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు రచించిన ఉపనిష ద్దర్శనం (మూడవ భాగం)లో ఓంకారో పాసన, సామోపాసన, అన్నోపాసన, ప్రాణో పాసన, వ్యాహృత్యుపాసన, గాయత్ర్యుపాసన మొదలైనవి ఉన్నాయని ప్రస్తావించారు. బొమ్మినేని నారాయణస్వామి నాయుడు రచించిన 'ఆంధ్ర వేదాంత పరిభాష'లో అహంగ్రహోపాసన, తటస్థోపాసన, అంగావ బద్ధోపాసన అనే ఉపాసనా భేదాలు ఉన్నట్టు తెలియజేశారు. ఉపాసనలలో, కోర్కెలతో చేసినవీ కోర్కెలు లేకుండా చేసేవీ ఉండవచ్చు.

**90–5 శ్లో.**

**శ్రీ శంకరోఽపి భగవాన్ సకలేషు తావత్**
**త్వామేవ మానయతి యో న హి పక్షపాతీ ।**
**త్వన్నిష్ఠమేవ స హి నామసహస్రకాది–**
**వ్యాఖ్యాద్భవత్ స్తుతిపరశ్చ గతిం గతోంతే ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** భగవాన్ శ్రీ శంకరః అపి= శ్రీ శంకర భగవత్పాదులు కూడా (భగవాన్= పూజ్యః), తావత్ = అప్పుడు, సకలేషు= అన్నిదేవతా రూపములందు, త్వామ్ ఏవ = నిన్నే, మానయతి = గొప్పగా భావించిరి. (మీయతే అనేన–దీనితో కొలుతురు, తూచుదురు), యః = ఎవనికి (ఆచార్యుల వారికి), న హి పక్షపాతీ= ఏదేవత యందును ప్రత్యేకమైన అభిమానము లేదు. (పక్షపాతః అస్తి అస్య–పక్షపాతము కలవాడు పక్షపాతము చూపువాడు), సః =ఆచార్యుల వారు, సహస్రనామకఅది = విష్ణు సహస్ర నామాది గ్రంథాలకు (సమానం హసతి సమానంగా నవ్వునది. వేయి సంఖ్య), త్వత్ నిష్ఠమ్ ఏవ = నీ పరముగానే(నితరాం తిష్ఠతి గురుసేవాయాం తస్య భావః కర్మ వా అన్ని వ్రతనియమములు పాలించుట ధర్మమందు గట్టి నమ్మకము సమాప్తి), వ్యాఖ్యాత్ హి =వ్యాఖ్యానించెనుకదా.(విశేషేణ వ్యాఖ్యాయతే కావ్యశాస్త్రాదికం అనయా దీనితో కావ్యశాస్త్రాదులు విశేషంగా వ్యాఖ్యానింపబడును. వ్యాఖ్యానం, టీక, భాష్యము), అంతే= చివరకు అనేక విధములుగా, భవత్ స్తుతిపరః = నిన్నే స్తుతిస్తూ(స్తౌతి తస్య భావః కర్మ వా స్తుతి, స్తోత్రము), గతిం చ = ముక్తిని కూడా, గతః = పొందిరి.

**తాత్పర్యము:** శ్రీ శంకర భగవత్పాదులు కూడా అన్నిదేవతా రూపములందు నిన్నే గొప్పగా భావించిరి. ఆచార్యుల వారికి ఏదేవత యందును ప్రత్యేకమైన అభిమానము లేదు. ఆచార్యుల వారు విష్ణు సహస్ర నామము మొదలయిన గ్రంథాలకు (గీత మొదలయిన గ్రంథములు) నీ పరముగానే–వ్యాఖ్యానించెను కదా ! చివరకు అనేక విధములుగా నిన్నే స్తుతిస్తూ (శ్రీ మత్పాదాది కేశస్తుతిని చేస్తూ) ముక్తిని కూడా పొందిరి.

**90–6 శ్లో.**

**మూర్తిత్రయాతిగమువాచ చ మంత్రశాస్త్ర–**
**స్యాదౌ కలాయసుషమం సకలేశ్వరం త్వామ్ ।**
**ధ్యానం చ నిష్కళమసౌ ప్రణవే ఖలూక్త్వా**
**త్వామేవ తత్ర సకలం నిజగాద నాఽన్యమ్ ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** మంత్రశాస్త్ర స్య ఆదౌ = 'ప్రపంచసారము' అను మంత్రశాస్త్రగ్రంథ ప్రారంభంలో, త్వామ్= నిన్ను, కలాయసుషమం= నీలోత్పల శ్యామునిగా అందమైనవానిగా (నల్ల కలువ వలె నల్లనివానిగా) (సుషమ= సుందర సమః– బాగా అందం కలది సమాప్తం కలది), సకల –ఈశ్వరం= సమస్త దేవతలకు స్వామిగా, మూర్తిత్రయ = త్రిమూర్తుల కంటె, అతిగమ్= సర్వోత్కృష్టునిగా (అతిశయేన గచ్ఛతి అతిక్రమించి వెళ్లువాడు), ఉవాచ చ= శ్రీ శంకరాచార్యులు చెప్పెను(వర్ణించారు), ప్రణవే చ = ఓంకారాన్ని ఆశ్రయించి (ప్రకర్షేణ నూయతే స్తూయతే ఆత్మ, పరమాత్మా స్వ ఇష్టదేవతా వా అనేన – దీనితో ఆత్మ, పరమాత్మ, ఇష్టదేవతాదులు స్తుతింపబడును.)(ప్రణవః అవతి రక్షణాదికం కరోతి), అసౌ నిష్కళమ్ = నిన్ను నిరాకార రూపునిగా, ధ్యానం= ధ్యానము చేయుమని, ఉక్త్వా= చెప్పి, త్వామ్ ఏవ = నువ్వే, తత్ర= ఆ ప్రణవ ధ్యానమున, సకలం = సకలమునందు వ్యాపించి ఉన్నవానిగా, నిజగాద =నిన్నే చెప్పెను, న అన్యమ్ ఖలు = అన్యదేవతలను ధ్యానింపమని చెప్పలేదు కదా!

**తాత్పర్యము:** ప్రపంచసారము అను మంత్రశాస్త్రగ్రంథ ప్రారంభంలో నిన్ను నీలోత్పల శ్యామునిగా, సమస్త దేవతలకు స్వామిగా, త్రిమూర్తుల కంటె సర్వోత్కృష్టునిగా శ్రీ శంకరాచార్యులు వర్ణించారు. ఓంకారాన్ని ఆశ్రయించి నిన్ను నిరాకార రూపునిగా ధ్యానము చేయుమని చెప్పి, నువ్వే ఆ ప్రణవ ధ్యానమున సకలమునందు వ్యాపించి ఉన్నవానిగా నిన్నే చెప్పెను. అన్యదేవతలను ధ్యానింపమని చెప్పలేదు కదా!

**90–7 శ్లో.**

**సమస్తసారే చ పురాణసంగ్రహే**
**విసంశయం త్వన్మహిమైవ వర్ణ్యతే ।**
**త్రిమూర్తియుక్ సత్యపదత్రిభాగతః**
**పరం పదం తే కథితం న శూలినః ॥** (వంశస్థము జతజర)

**ప్రతిపదార్థము:** సమస్తసారే = సమస్త పురాణసారముగా లోకములో ప్రసిద్ధి పొందిన, పురాణసంగ్రహే చ= మాధవాచార్యుల వారు రచించిన సమస్త పురాణ సంగ్రహము అను గ్రంథములో( పురా అపి నవం భవతి పాతదైనప్పటికి కొత్త విషయములను చెప్పునది. పురాణము), విసంశయం= సందేహము లేకుండా(సం శేయతే సందిహ్యతే తస్య భావః కర్మ వా సంశయము, సందేహము.దీనికి వ్యతిరేకము విసంశయము), త్వత్ మహిమా ఏవ= నీ మాహాత్మ్యము (మహతః భావః–గొప్ప దనము. మహత్త్వము), వర్ణ్యతే= వర్ణింపబడినది, త్రిమూర్తియుక్ = త్రి మూర్తులు నివసించు, సత్య పదత్రిభాగతః = సత్యలోకములోని మూడు భాగముల కంటె, పరం= పై భాగమున ఉన్న, తే పదం= నీ వైకుంఠమును గురించి మాత్రమే అందులో, కథితం= చెప్పబడినది, శూలినః న= శివలోకము గురించి కాదు.

**తాత్పర్యము:** సమస్త పురాణసారముగా లోకములో ప్రసిద్ధి పొందిన మాధవాచార్యుల వారు రచించిన సమస్త పురాణ సంగ్రహము అను గ్రంథములో సందేహము లేకుండా నీ మాహాత్మ్యము వర్ణింపబడినది. త్రి మూర్తులు నివసించు సత్యలోకములోని మూడు భాగముల కంటె పై భాగమున ఉన్న నీ వైకుంఠమును గురించి మాత్రమే అందులో చెప్పబడినది. శివలోకము గురించి కాదు.

**90–8 శ్లో.**

**యద్బ్రాహ్మకల్ప ఇహ భాగవతద్వితీయ–**
**స్కంధోదితం వపురనావృతమీశ ధాత్రే ।**
**తస్యైవ నామ హరిశర్వముఖం జగాద**
**శ్రీమాధవశ్శివపరోఽపి పురాణసారే ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** ఈశ = ప్రభూ!, ఇహ యత్ బ్రాహ్మకల్పే=ఇక్కడ బ్రహ్మ కల్పమునందు, ధాత్రే= బ్రహ్మకు ప్రత్యక్షమయిన నీరూపము, అనావృతం = కప్పబడనిదై , నిరావరణమై (న ఆవృతః–ఆవరణశూన్యము. కప్పబడనిది), భాగవతద్వితీయ–స్కంధ = శ్రీ మహా భాగవతములోని ద్వితీయ స్కంధమున, ఉదితం = వర్ణింపబడినది, యత్ వపుః = ఏరూపము వర్ణింపబడినదో, తస్య ఏవ = అ పరతత్వ రూపము, హరిశర్వముఖం నామ= హరిహరాది రూపములతో, శ్రీమాధవః=శ్రీమాధవచార్యస్వామియు,శివపరః అపి =శివోపాసకుడయినప్పటికి, పురాణసారే = పురాణ సారము అను గ్రంథమున, జగాద = పేర్కొనిరి.

**తాత్పర్యము:** ప్రభూ! ఇక్కడ బ్రహ్మ కల్పమునందు బ్రహ్మకు ప్రత్యక్షమయిన నీరూపము శ్రీ మహా భాగవతములోని ద్వితీయ స్కంధమున వర్ణింపబడినది. అ పరతత్వ రూపము హరిహరాది రూపములతో శ్రీ మాధవచార్య స్వామియు శివోపాసకుడయినప్పటికి పురాణ సారము అను గ్రంథమున పేర్కొనిరి.

**విశేషము**

**బ్రహ్మ కల్పము:** కృత త్రేత ద్వాపర కలి నామకములు అగు నాలుగు యుగములు. వీని పరిమాణము సంధి సంధ్యంశ కాలములతో కూడ 12000 దివ్య సంవత్సరములు. మఱియు ఒక దివ్య సంవత్సరమునకు 360 మానుష వత్సరములు కనుక నాలుగు యుగములకు 4320000 మానుష వత్సరములు అగును. ఈనాలుగు యుగములు చేరి ఒక మహాయుగము అనబడును. అందు కృతయుగమునకు 1728000 సంవత్సరములు. త్రేతాయుగమునకు 1296000 సంవత్సరములు. ద్వాపర యుగమునకు 864000 సంవత్సరములు. కలియుగము నకు 430000 సంవత్సరములు. మహాయుగ పరిమాణము 4320000 మానుష సంవత్సరములు. ఇట్టి మహాయుగములు 1000 కాగా చతుర్ముఖ బ్రహ్మకు ఒక పగలు, మఱియు వేయి ఒక రేయి అగును. అట్టి దినములు 360 అతనికి ఒక సంవత్సరము అగును. అట్టి 100 సంవత్సరముల కాలము అతని ఆయుష్కాలము. అందు ముందటి 50 సంవత్సరములు పాద్మకల్పము అనియు వెనుకటి 50 సంవత్సరములు వారాహ కల్పము అనియు చెప్పబడును. ఇప్పుడు నడుచునది వారాహకల్పము.

**90-9 శ్లో.**

**యే స్వప్రకృత్యనుగుణా గిరిశం భజంతే**
**తేషాం ఫలం హి దృఢయైవ తదీయభక్త్యా ।**
**వ్యాసో హి తేన కృతవానధికారిహేతోః**
**స్కాందాదికేషు తవ హానివచోఽర్థవాదైః ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** యే = ఎవరు, స్వప్రకృతి = తమ తమ స్వభావములకు (ప్రక్రియతే కార్యాదికమనయా, ప్రకరోతి స్థావరజంగమాని దీనితో తమ తమ పనులు చేయుదురు సాంఖ్యశాస్త్రములో మూల ప్రకృతి), అనుగుణాః = అనుగుణముగా (పూర్వ జన్మల వాసనలను అనుసరించి) (అనుకూలో గుణో యస్య-అనుకూలుడు ఆజ్ఞను పాటించువాడు), గిరిశం = శివుని (గిరౌ శేతే పర్వతమున వుండువాడు. శివుడు), భజంతే= పూజించుచున్నారు, తేషాం = వారియొక్క, తదీయ దృఢయా భక్త్యా ఏవ హి = ఆశంకరునిపైన దృఢమయిన భక్తి ప్రభావము వలన (దృంహతి కఠినో భవతి వర్ధతే గట్టిగా నుండునది. దృఢమైనది), ఫలం హి= తగిన సత్ఫలములను పొందుచున్నారు. (ఫలతి ఫలించునది. లాభము ప్రయోజనము), తేన హి = ఈ కారణము చేతనే, వ్యాసః= వ్యాసుడు (వ్యాసః విశేషేణ అస్యతి విస్తారయతి వేదార్థమ్ వేదార్థమును విస్తరించి ఉపదేశించినవాడు. వేద వ్యాసుడు), అధికారిహేతోః =అధికార భేదమునుబట్టి పరమశివునియందు ధృఢభక్తి కలిగి లబ్ధిపొందవచ్చని, స్కాంద ఆదికేషు= స్కాందము మొదలగు పురాణములలో, అర్థవాదైః=శంకరుని ఔన్నత్యము ప్రకటించుచు, శంకరుని సేవలో రుచి పుట్టించుటకు (అర్థస్య స్తుత్యర్థస్య నిందార్థస్య వా (లక్షణయా) వాదః-అర్థవాదము. స్తుతి నిందా స్తుతిని తెలుపు నిందాపరక శబ్దములు నిందను తెలుపు స్తుతిపరక శబ్దములు. స్తుతిపరమో నిందాపరమో అయిన లౌకిక వాక్యము - యథార్థముకానిదానిని అర్థ వాదము అంటారు),తవ హానివచః = నిన్ను తక్కువ చేయు వచనములను, కృతవాన్= వ్రాసాడు.

**తాత్పర్యము:** తమ తమ స్వభావములకు అనుగుణముగా (పూర్వ జన్మల వాసనలను అనుసరించి) శివుని పూజించుచున్నారు. ఆశంకరునిపైన దృఢమయిన

భక్తి ప్రభావము వలన తగిన సత్ఫలములను పొందుచున్నారు. ఈ కారణము చేతనే వ్యాసుడు పరమశివునియందు ధృఢభక్తి కలిగి లబ్ధిపొందవచ్చని స్కాందము మొదలగు పురాణములలో శంకరుని ఔన్నత్యము ప్రకటించుచు, శంకరుని సేవలో రుచి పుట్టించుటకు నిన్ను తక్కువ చేయు వచనములను వ్రాసాడు.

**విశేషము**

**స్కాందము:**

1. ఒక పురాణము. ఇది శివమాహాత్మ్య ధర్మాదిబోధకమును తత్పురుష కల్పసంబంధమును స్కందప్రోక్తమును అయి ఉండును. దీని గ్రంథసంఖ్య లక్ష.

2. ఉపపురాణములలో ఒకటి.

**90-10 శ్లో.**
**భూతార్థకీర్తిరనువాదవిరుద్ధవాదౌ**
**త్రేధార్థవాదగతయః ఖలు రోచనార్థాః ।**
**స్కాందాదికేషు బహవోఽత్ర విరుద్ధవాదా**
**స్త్వత్తామసత్వపరిభూత్యుపశిక్షణాద్యాః ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** భూత అర్థకీర్తిః = జరిగిన దానిని కీర్తించుట, అనువాద= లేకున్నను ఉన్నట్లు ఊహించుకొని కీర్తించుట (అను పశ్చాత్ కథనమ్ అనువదించుట ఒకరు చెప్పినదాని మరలఁ జెప్పుట), విరుద్ధవాదౌ =ప్రమాణ బద్ధతకు విరుద్ధముగా పలుకుట(విరుద్ధః బాధితః, విపరీతః, ప్రతికూలః – విరోధింపబడ్డది విపరీతము, అనుచితము), త్రేధా = అని ఈ విధముగా మూడు రకములైన, అర్థవాదగతయః= అర్థవాద మార్గములు ఉన్నవి.(అర్థస్య స్తుత్యర్థస్య నిందార్థస్య వా (లక్షణయా) వాదః అర్థవాదము), రోచనార్థాః ఖలు = ఈ మూడు పద్ధతులను వర్ణించు విషయములో ఇతివృత్తమునందు అభిరుచిని కలిగించుటయే కనిపించును కదా!( రోచయతి ప్రకాశయతి అసౌ ప్రకాశింప చేయునది, అందమైనది. వెలుతురు), అత్ర స్కాందఆదికేషు = ఈ స్కాంద పురాణము మొదలైన వాటియందు, త్వత్ తామసత్వ = వ్యాసమహర్షి నిన్ను తామసుడు అనుటయూ(తమసా తమోగుణేన నిర్వృత్తః

తమోగుణంతో వచ్చు అహంకారాదికము), పరిభూతి = నువ్వు ఓడిపోవుట(తక్కువ చేసి వర్ణించుట) (అనాదరః తిరస్కారః అనాదరము తిరస్కారము అగౌరవము), ఉపశిక్షణ ఆద్యాః= వారికి సంబంధించిన ఉపదేశములును మొదలయిన, బహవః = అనేక, విరుద్ధవాదాః= విరుద్ధ వాదములున్నవి.

**తాత్పర్యము:** జరిగిన దానిని కీర్తించుట ,లేకున్నను ఉన్నట్లు ఊహించుకొని కీర్తించుట ,ప్రమాణ బద్ధతకు విరుద్ధముగా పలుకుట అని ఈ విధముగా మూడు రకములైన అర్థవాద మార్గములు ఉన్నవి. ఈ మూడు పద్ధతులను వర్ణించు విషయములో ఇతివృత్తమునందు అభిరుచిని కలిగించుటయే కనిపించును కదా! ఈ స్కాంద పురాణము మొదలైన వాటియందు వ్యాసమహర్షి నిన్ను తామసుడు అనుటయూ, నువ్వు ఓడిపోవుట(తక్కువ చేసి వర్ణించుట) వారికి సంబంధించిన ఉపదేశములును – ఈ విధముగా అనేక విరుద్ధ వాద రూపములైన వాదములు ఉన్నవి.

**90–11 శ్లో.**

**యత్ కించిదప్యవిదుషాఽపి విభో మయోక్తం**
**తన్మంత్రశాస్త్రవచనాద్యభిదృష్టమేవ ।**
**వ్యాసోక్తిసారమయ భాగవతోపగీత!**
**క్లేశాన్ విధూయ కురు భక్తిభరం పరాత్మన్ ॥** (వసంతతిలకము తభజజగ)

**ప్రతిపదార్థము:** విభో= ప్రభూ!, అవిదుషా అపి= అజ్ఞానినైన, మయా = నేను (నాచేత), యత్ కించిత్ ఉక్తం= నేను చెప్పిన ఏ కొన్ని విషయములు ఉన్నవో, తత్ మంత్రశాస్త్ర వచనాది=అవి ఆమంత్రశాస్త్రములో (మననేన త్రాయతే మననము చేస్తే రక్షించునది. వేదమంత్రము మొ॥ మంత్రములు)(శిష్యతే అనేన దీనితో శాసింపబడుదురు. శాస్త్రము), అభి దృష్టమ్ ఏవ = కనిపించుచునే ఉన్నవి. (సర్వత్ర దృష్టః అవలోకితః–అంతటా చూడబడినది కనబడునది), వ్యాస ఉక్తి= వ్యాసుడు చెప్పిన పురాణములలో, సారమయం= సారభూతముగా చెప్పు, భాగవత= భాగవతములో, ఉపగీత = చక్కగా కీర్తింపబడిన, పరాత్మన్ = ఓ పరమాత్మా!, క్లేశాన్ = నా బాధలను (క్లిష్ణాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము), విధూయ =

తొలగించి, భక్తిభరం= నీయందు దృఢమయిన భక్తి కలుగునట్లు, కురు = చేయుము.

**తాత్పర్యము:** ప్రభూ! నేను పండితుడను కానప్పటికి, నేను చెప్పిన విషయాలు మంత్రశాస్త్ర ప్రమాణాలు. వ్యాసుడు చెప్పిన పురాణములలో సారభూతముగా చెప్పు భాగవతములో చక్కగా కీర్తింపబడిన ఓ పరమాత్మా! నా బాధలను తొలగించి నీయందు దృఢమయిన భక్తి కలుగునట్లు చేయుము.

**విశేషాలు**

**అభి :**

సం.అవ్య.

సమాసమున పూర్వ పదముగా నుండి ఈ క్రింది అర్థములను తెలుపును.

1. ఎదురు (అభిముఖము).2. దగ్గఱ (అభ్యాగతము).3. అంతటను (అభిచరించు).4. మిక్కిలి (అభిరుచి).

అర్థవిశేషము లేకుండఁగనే కొన్నియెడల ప్రయుక్తమగును.అభ్యనుజ్ఞ మొ॥

***దశమ స్కంధము పూర్తి.***

**90వ దశకము సమాప్తము**

# దశకమ్ 91 – భక్తిమహత్త్వము

**91–1 శ్లో.**

**శ్రీకృష్ణ! త్వత్పదోపాసనమభయతమం బద్ధమిథ్యార్థదృష్టేః**
**మర్త్యస్యార్తస్య మన్యే వ్యపసరతి భయం యేన సర్వాత్మనైవ ।**
**యత్తావత్ త్వత్ప్రణీతానిహ భజనవిధీనాస్థితో మోహమార్గే**
**ధావన్నప్యావృతాక్షః స్ఖలతి న కుహచిద్దేవదేవాఖిలాత్మన్ ॥**

**ప్రతిపదార్థము:** దేవదేవ = దేవ దేవా! (దేవానాం దేవః శ్రేష్ఠత్వాత్ దేవతలకు దేవుడు)(దేవేషు దీవ్యతి ప్రకాశతే దేవతల యందు ప్రకాశించువాడు), అఖిల ఆత్మన్= సర్వాంతర్యామీ!, శ్రీకృష్ణ = ఓ గురువాయూరు కృష్ణదేవ, బద్ధ= రూఢపదముగా(బద్ధః నిబద్ధః కృతబంధనః బంధింపబడ్డవాడు), మిథ్యా అర్థే = శరీరాదులందు (మేథతి జానాతి అన్యథా తస్య భావః అసత్యము, మిథ్యా), దృష్టేః = నేను నాదిఅను అభిమానము ఉన్న(దృష్టిః దర్శనం జ్ఞానమ్ చూచుట తెలుసుకొనుట బుద్ధి), మర్త్యస్య = జనన మరణ ధర్మముకలిగిన మానవునికి(మర్త ఏవ మర్త్యః మానవుడు), ఆర్తస్య =ఆధ్యాత్మికాది దుఃఖ పీడితునికి (జ్ఞాన సంబంధమైన, భక్తి సంబంధమైన సాధన క్రమంలో కలిగే తాపం), త్వత్ పద ఉపాసనమ్= నీ పాద పద్మములను సేవించుట, అభయతమం= అభయప్రదము అని (సంసార భయము తొలగించునది అని) (న భయం భయస్య అభావః భయం లేకపోవుట), మన్యే = నేను తలుస్తాను, యేన= దేనిచేత (నీ పద ఉపాసన చేత), భయం= భయము (బిభేతి అస్మాత్ దీని వలన భయపడుదురు. భయము), సర్వాత్మనా ఏవ= నిరవశేషముగా ( ఏమాత్రం మిగలకుండా), వి అపసరతి = తొలగిపోతుంది. (అపసరణం స్థానాత్ స్థానాంతరగమనమ్ కదలుట మరొక చోటికి పోవుట), యత్ ఇహ= భగవద్భజన మార్గములందు, త్వత్ ప్రణీతాన్ = భగవంతుడవైన నీవు (భగవద్గీతలో) చెప్పిన, భజనవిధీన్= భాగవత ధర్మములను (భజనం సేవనం భాగో వా భజ తస్య భావః కర్మ వా సేవించుట, సేవనము విభాగము), తావత్= సత్సంగ ద్వారమున క్రమముగా, ఆస్థితః = అనుసరించినవాడు (ఆస్థితః ఆతిష్ఠతి అసౌ ఒకచోట వుండువాడు), మోహమార్గే = మోహ మార్గమును

(అజ్ఞానద్వారములైన రహదారులు బజారులు వేశ్యాగృహములు లౌకిక సభారంగములు)(ముహ్యతి తస్య భావః మోహము. మూర్ఛ, అజ్ఞానము, భ్రాంతి), ధావన్ అపి = కొంచెము కొంచెముగా దాటి(ధావతి తస్య భావం కర్మ వా పరుగెత్తుట శుభ్రపరచుట), ఆవృత అక్షః = బాహ్య దృష్టిగాక ఆత్మవంక చూపు వెనుదిరిగినవాడై (ఆవృతః ఆచ్ఛాదితః కప్పబడ్డది.)(అక్ష్ణోతి, అక్షతి, అక్ష్యతే వా అనేన చూచునది, వ్యాపించునది. దేనితో విషయం గ్రహింపబడునో అది. ఇంద్రియము), కుహచిత్= ఎక్కడను, న స్ఖలతి = తడబడదు.(అనుష్ఠాన వైకల్యము ఉండదని భావం)(స్ఖలతి తస్య భావః కర్మ వా కారుట పడుట).

**తాత్పర్యము:** దేవ దేవా! సర్వాంతర్యామీ! ఓ గురువాయూరు కృష్ణదేవ! శరీరాదులందు నేను నాదిఅను అభిమానము ఉన్న జనన మరణ ధర్మముకలిగిన మానవుడు నీ పాద పద్మములను సేవించుట అభయప్రదము అని నేను తలుస్తాను. అందువల్ల భయము ఏమాత్రం మిగలకుండా తొలగిపోతుంది. నీవు భగవద్గీత మొదలైన వాటిలో చెప్పినభాగవత ధర్మములను అనుసరించినవాడు మోహ మార్గమును కొంచెము కొంచెముగా దాటి బాహ్య దృష్టిగాక ఆత్మవంక చూపు వెనుదిరిగినవాడై ఎక్కడను తడబడడు.(అనుష్ఠాన వైకల్యము ఉండదని భావం)

**విశేషాలు:**

90 వ దశకము వరకు ప్రధానంగా ప్రవృత్తిలక్షణమైన భగవల్లీలా విశేషము వర్ణించాడు. . ఇపుడు కవి స్వామి యొక్క నివృత్తి లక్షణము వర్ణించుచున్నాడు.

ప్రవృత్తి : నివృత్తి

ప్రవృత్తి అనగా ముందుకు పోవటం. ప్రాపంచికమైన మార్గం. కర్మ మార్గం. ధర్మ పురుషార్థం. దీనికి వ్యతిరిక్తమైనది నివృత్తి. మోక్షమార్గం. ఒకటి కర్మాచరణ ద్వారా సంసారానికి దారిచూపితే మరొకటి జ్ఞానాభ్యాసం ద్వారా సాయుజ్యానికి మార్గం చూపుతుంది. వేద వాఙ్మయం రెండు శాఖలే. మొదటిది ప్రవృత్తి ధర్మం బోధిస్తుంది. దీనికే ధర్మమని కూడా మరొకపేరు. రెండవది నివృత్తి ధర్మం బోధిస్తుంది. దీనికే మోక్షమని పేరు. మొదటిది వర్గమైతే రెండవది, అపవర్గమని పేర్కొంటారు.

**అవృతాక్షుడు:** బాహ్య దృష్టిగాక ఆత్మవంక చూపు కలిగినవాడు. శ్రుతిస్మృతీ ఉభే నేత్రే ..... "శ్రుతిస్మృతులు రెండు రెండు కండ్లు, అందొకటి లేనివాడు ఏకాక్షి, రెండును లేనివాడు అంధుడు" అని చెప్పినట్లుగా స్వామిని సేవించిన వాడు వేదశాస్త్ర రూపనేత్ర ద్వయము పొందాలి.

**91-2 శ్లో.**

**భూమన్! కాయేన వాచా ముహురపి మనసా త్వద్బల ప్రేరితాత్మా**
**యద్యత్కుర్వే సమస్తం తదిహ పరతరే త్వయ్యసావర్పయామి ।**
**జాత్యాపీహా శ్వపాకస్త్వయి నిహితమనః కర్మవాగింద్రియార్థ**
**ప్రాణో విశ్వం పునీతే న తు విముఖమనాస్త్వత్పదాద్విప్రవర్యః ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా! (పూర్ణస్వరూపా!), త్వత్ = అంతర్యామివైన, బల ప్రేరిత= నీ బల ప్రేరితమై (వాసనారూపమైనదానిచే ప్రేరితమైన), ఆత్మా = ఆత్మ కలిగినవాడనై, అసౌ కాయేన వాచా మనసా అపి= ఈ శరీరముద్వారా, వాక్కుల చేత , మనస్సు లను త్రికరణములచే చేయు పనులన్నింటిని, ఇహ = ఇక్కడ (ఈ ప్రపంచములో), ముహుః = మాటిమాటికి, యత్ యత్ కుర్వే= ఏది ఏది చేయుచున్నను(కేవల విహితకర్మమేకాదు స్వభావాను సారియైన లౌకికకర్మముకూడా), తత్ సమస్తం= ఆసర్వస్వమును, పరతరే = పరమాత్మ వైన కృష్ణునకు, త్వయి = నీకు, అర్పయామి= సమర్పించు చున్నాను, ఇహ = ఈ లోకములో, త్వయి నిహితమనః = నీయందు సంకల్ప వికల్పాత్మకమయిన మనస్సును ఉంచిన(నిహితః స్థాపితః గూఢః పెట్టబడ్డది), జాత్యా= జాతిచే, శ్వపాకః అపి= శ్వపచుండైనను (శ్వానం పచతి కుక్కను వండువాడు. కుక్కమాంసము తినువాడుచండాలుడు), కర్మ వాక్ ఇంద్రియార్థ ప్రాణః=తాను చేయు పనులు, పలికెడి మాటలు, ఇంద్రియ విషయములు , ప్రాణములు అన్నింటిని నీకే సమర్పించుచో, విశ్వం= అశేష విశ్వమును(విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), పునీతే= పావనము చేయును. తననుతానుకూడా పవిత్రుని చేసికొనును, త్వత్ పదాత్ = నీ పాద

పద్మములందు, ముఖమనాః= విముఖుండైన(స్మరణాది రహితుడయిన), విప్రవర్యః= బ్రాహ్మణోత్తముడయినప్పటికి వాడు ఇతరులను, నపునీతే= తనను కూడా పరిశుద్ధునిగా చేయజాలడు.

**తాత్పర్యము:** సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా! ఈ శరీరముద్వారా, వాక్కులచేత, మనస్సులను త్రికరణములచే చేయు పనులన్నింటిని నీ ప్రేరణచే చేయుచున్నాను. ఆ కర్మల సర్వస్వమును పరమాత్మ వైన కృష్ణుడవయిన నీకు సమర్పించు చున్నాను. ఈ లోకములో నీయందు మనస్సును ఉంచిన చండాలుడైనను తాను చేయు పనులు, పలికెడి మాటలు, ఇంద్రియ విషయములు, ప్రాణములు అన్నింటిని నీకే సమర్పిస్తే – అశేష విశ్వమును పావనము చేయును. తననుతానుకూడా పవిత్రుని చేసికొనును. నీ పాద పద్మములందు విముఖుడైన బ్రాహ్మణోత్తముడు ఇతరులను తనను కూడా పరిశుద్ధునిగా చేయజాలడు.

**91–3 శ్లో.**

**భీతిర్నామ ద్వితీయాత్ భవతి నను మనఃకల్పితం చ ద్వితీయం**
**తేనైక్యాభ్యాసశీలో హృదయమిహ యథాశక్తి బుద్ధ్యా నిరుంధ్యామ్ ।**
**మాయావిద్ధే తు తస్మిన్ పునరపి న తథా భాతి మాయాధినాథం**
**తం త్వాం భక్త్యా మహత్యా సతతమనుభజన్నీశ భీతిం విజహ్యామ్ ॥**

**ప్రతిపదార్ధము:** ద్వితీయాత్= నేను నాదియని రెండవ వస్తు భావనచే(ద్వయోః పూరణః రెండింటిని పూరించునది. రెండవది), భీతిః భవతి నను= భయము తప్పదు (బిభేతి తస్య భావః భయము), నామ = ప్రసిద్ధిలో (నామయతి నామ్యతే అనేన వా ప్రసిద్ధి), ద్వితీయం చ = రెండవ వస్తువు, మనఃకల్పితం = మనఃకల్పితము. అనగా ఆరోపితము, తేన= అందువలన, యథా శక్తి = యథా శక్తిగా (యావత్ బుద్ధి బలముతో), ఐక్య అభ్యాసశీలః =ఏకత్వ భావనను అభ్యసించు, బుద్ధ్యా= నిశ్చయాత్మికమైన అంతఃకరణ వృత్తి చేత (బుద్ధి చేత), హృదయమ్= హృదయమును, ఇహ = ధ్యానలక్ష్యమందు, నిరుంధ్యామ్ = నిలుపవలెను, తస్మిన్ = హృదయము, మాయా విద్ధే తు = మాయా కార్యక్రమములయిన క్రోధము మొదలయినవాటిచే, పునః అపి= మరలా మరలా, తథా = ఆ విధమైన ఐక్య

భావనతో, నభాతి= నిలువబడదు, తత్ = అందువలన, ఈశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, మాయా అధినాథం= మాయకు ప్రభువయిన (మీయంతే పరిచ్ఛిద్యంతే వస్తూనాం సత్యస్వరూపం అనయా దీనితో వస్తువుల నిజస్వరూపము కప్పబడును, మాయ,) (అధికః నాథః అధినాథుడు పరమేశ్వరుడు), త్వాం= నిన్ను, మహత్యా భక్త్యా= అనపాయినియైన భక్తి చే, సతతమ్ =ఎప్పుడు, అనుభజన్= సేవించి, భీతిం= సంసార భయమును, విజహ్యామ్= విశేషముగా సర్వవిధములుగా పోగొట్టుకొనెదను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నేను నాదియని రెండవ వస్తు భావన చే( ద్వైత భావనచే) భయము తప్పదు. నిజానికి రెండవ వస్తువు లేదు. అది మనఃకల్పితము. అందువలన ఏకత్వ భావనను అభ్యసించు బుద్ధి చేత హృదయమును ధ్యానలక్ష్యమందు నిలుపవలెను . హృదయము మాయా కార్యక్రమములయిన క్రోధము మొదలయినవాటి ప్రభావము వలన మరలా మరలా ఆ విధమైన ఐక్య భావనతో నిలువబడదు. అందువలన మాయకు ప్రభువయిన నిన్ను విడువని భక్తి చే ఎప్పుడు సేవించి సంసార భయమును సర్వవిధములుగా పోగొట్టుకొనెదను.

**విశేషాలు**

**బుద్ధి:** నిశ్చయాత్మకమైన అంతఃకరణం బుద్ధి. అది చేసే ఆలోచన జ్ఞానం కూడా బుద్ధే. అలాటి జ్ఞానం కలవాడు బుధుడు. అజ్ఞాన నిద్ర వదలి మెళకువ తెచ్చుకున్నవాడు కనుక అతడే బుద్ధుడు. బుద్ధి ఒక్కటే ఆత్మతత్త్వాన్నిగ్రహించటానికి ఏకైక సాధనం. బుద్ధిగుహలోనే పరమాత్మ చైతన్యం వచ్చి ప్రవేశించిందని శాస్త్రం చెబుతున్నది. అంటే అర్థం బుద్ధిలో కలిగే పరమాత్మ తాలూకు ఆలోచనే దాన్నిచేర్చే సాధనమని, దాన్ని ఆలంబనం చేసుకోమని, అదే గమ్యాన్ని చేరుస్తుందని తాత్పర్యం. 'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా' అని కఠోపనిషత్తు స్పష్టం చేస్తున్నది ఈ విషయం.

**హృత్/హృదయ:** రెండింటికీ హృదయమనే అర్థం. శరీరంలో ఎడమవైపు పుండరీక ఆకారంగా ఉన్న భాగం. కానీ హృదయానికీ బుద్ధికీ తేడా లేకుండా రెండింటినీ ఏకంచేసి పేర్కొంటారు వేదాంతులు. దానికి కారణం రెండింటినీ

కలుపుతూ ఒకే ఒక సిర కపాలం వరకూ ప్రసరిస్తూ ఉండటమే. తద్వారా రక్తం పైకి వెళ్ళిపోయి దాని బలంతో బుద్ధి పనిచేస్తుంది. కనుక రెండింటికి ఉన్న ఈ అవినాభావాన్ని దృష్టిలో ఉంచుకుని ఏకంగా వర్ణించటం జరిగింది. హృది అయం అని చమత్కారంగా మరొక అర్థాన్ని చెప్పాయి ఉపనిషత్తులు. హృది అంటే హృదయంలో అయం అంటే ఆ పరమాత్మ జీవరూపంగా వచ్చి కూచున్నాడు. అందుకే హృదయం అనే పేరు సార్థకమయిందని చెబుతారు ఉపనిషదృషులు.

**91-4 శ్లో.**

**భక్తేరుత్పత్తివృద్ధీ తవ చరణజుషాం సంగమేనైవ పుంసాం**
**ఆసాద్యే పుణ్యభాజాం శ్రియ ఇవ జగతి శ్రీమతాం సంగమేన ।**
**తత్సంగో దేవ భూయాన్మమ ఖలు సతతం తన్ముఖాదున్మిషద్భిః**
**త్వన్మాహాత్మ్యప్రకారైర్భవతి చ సు దృఢా భక్తిరుద్ధూతపాపా ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, జగతి = ఈ లోకములో (గచ్ఛతి నడచునది. ప్రపంచము), శ్రియః = ధనధాన్యాదుల ఉత్పత్తి వృద్ధి (ఐశ్వర్యము)(శ్రియతే ఆశ్రియతే జనైః జీవికార్థమ్ జనులు జీవిక కొరకు ఆశ్రయింతురు. లక్ష్మి), శ్రీమతాం సంగమేన ఇవ= కలిమిగలవారి చెలిమిచే లభించినట్లుగా (శ్రీః అస్తి అస్య ధనము, శోభ కలవాడు)(సం సహ గమనమ్ కలయిక), తవ = నీయొక్క, చరణ జుషాం= దివ్య చరణ సేవలయందు ఆసక్తి కలిగిన, పుంసాం = మహాత్ముల, సంగమేన ఏవ= చెలిమిచే, భక్తేః ఉత్పత్తి = భక్తి ప్రపత్తులు ఏర్పడి, వృద్ధీ ఆసాద్యే ఖలు = అభివృద్ధి చెందును కదా!, మమ = నాకు, సతతం = ఎల్లప్పుడు (సమ్యక్ తనుతే బాగా విస్తరించునది నిరంతరము), తత్ సంగః భూయాత్ = వారి సాంగత్యము కలుగుగాక !(సజతి మిలతి తస్య భావః కర్మ వా కలియునది కూడుట), తత్ పుణ్య భాజాం ముఖాత్= ఆ పుణ్యాత్ముల ముఖమున చేకూరిన( వారు చెప్పిన బోధలలోని) (పుణ్యం భజతిపుణ్యమును సేవించువాడు. ధార్మికుడు), ఉన్మిషద్భిః= నీ మధుర కథాప్రసంగములచే (ఉన్మిషితః ఉన్మీలితః వికసితః వికసించినది కళ్లుతెరచినది),త్వత్ మాహాత్మ్యప్రకారైః =శ్రవణకీర్తనస్మరణ మనన నిదిధ్యాసరూపమైన భక్తి మార్గములచే(మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి

పూజింపబడువాడు. జ్యేష్ఠుడు గొప్పది), భవతి = శ్రీకృష్ణుడగు నీయందు, సుదృఢా భక్తిః = విడువని భక్తి కలిగి, ఉద్ధూతపాపా = నా పాపములు తొలగుగాక !

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఈ లోకములో కలిమిగలవారి చెలిమిచే ఐశ్వర్యము లభించినట్లుగా నీయొక్క దివ్య చరణ సేవలయందు ఆసక్తి కలిగిన మహాత్ముల చెలిమిచే నాకు భక్తి ప్రపత్తులు ఏర్పడి అవి అభివృద్ధి చెందుగాక! నాకు ఎల్లప్పుడు ఆ భక్తుల సాంగత్యము కలుగుగాక ! ఆ పుణ్యాత్ములయిన భక్తులు చెప్పు నీ మధుర కథాప్రసంగములచే మరియు శ్రవణకీర్తనస్మరణ మనన నిదిధ్యాసరూపమైన భక్తి మార్గములచే శ్రీకృష్ణుడవగు నీయందు విడువని భక్తి కలిగి నా పాపములు తొలగుగాక !

**91-5 శ్లో.**

**శ్రేయోమార్గేషు భక్తావధికబహుమతిర్జన్మకర్మాణి భూయో**
**గాయన్ క్షేమాణి నామాన్యపి తదుభయతః ప్రద్రుతం ప్రద్రుతాత్మా ।**
**ఉద్యద్ధాసః కదాచిత్ కుహచిదపి రుదన్ క్వాపి గర్జన్ ప్రగాయన్**
**ఉన్మాదీవ ప్రనృత్యన్నయి కురు కరుణాం లోకబాహ్యశ్చరేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ గురువాయూరు కృష్ణదేవా!, శ్రేయః మార్గేషు= మోక్షప్రాప్తి సాధనములలో (కర్మ జ్ఞాన తపోదాన వ్రతములలో) (అనయోః అతిశయేన ప్రశస్త్యఃమోక్షము), భక్తౌ = భక్తి మార్గము, అధిక బహుమతిః= గొప్పది (బహుమతః అతిశయేన ఆదృతః, సత్కృతః), క్షేమాణి = క్షేమము కలిగించు(క్షేమం మంగళం అస్మిన్ అస్తి క్షేమం గలది. మంగళము, శుభము), జన్మకర్మాణి= నీ అవతార చరితములు (పుణ్య కథలను), నామాని అపి= నీ నామములను, భూయః = మరలా మరలా, గాయన్ = గానము చేస్తాను, తత్ ఉభయతః = ఇలా నీ పుణ్య కథలను, నామములను గానము చేయుచుండుటవలన, ప్రద్రుతం= అతిశీఘ్రముగా, ప్రద్రుతాత్మా= నా మనస్సు అర్ద్రమై, ఉన్మాదీ ఇవ= ఉన్మాది వలె (ఉన్మాదయతి చిత్తవిభ్రమం కరోతి అసౌ చిత్తవిభ్రమమును కల్గించునది. పిచ్చి), కదాచిత్= ఒకప్పుడు, ఉద్యత్ హాసః = సహస్త తాడనములతో నాలో నేను నవ్వుకొందును, కుహచిత్= ఒకప్పుడు, రుదన్ అపి =ఇప్పటివరకు దయ

చూపలేదని ఏడుస్తాను.(లేదా భగవంతునిపై చిత్త ఏకాగ్రత కుదరలేదని ఏడుస్తాను), క్వాపి= ఒక్కొక్కసారి, గర్జన్= అత్యౌత్సుక్యము వలన పెద్దగా శబ్దము చేస్తాను, ప్రగాయన్= గొంతెత్తి పాడతాను, ప్రనృత్యన్= నృత్యము చేస్తాను, లోక బాహ్యః = అలౌకికుడనై (లోకాత్ బాహ్యః బహిష్కృతః ఆచారవర్జితః లోకము నుండి (సమాజము నుండి) బహిష్కరింపబడ్డవాడు), చరేయమ్= తిరిగెదను, కరుణాం కురు =ఆ అలౌకిక స్థితిని నాయందు దయతో కల్పింపుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! మోక్షప్రాప్తి సాధనములలో భక్తి మార్గము గొప్పది . క్షేమము కలిగించు నీ పుణ్య కథలను , నీ నామములను మరలా మరలా గానము చేస్తాను . ఇలా నీ పుణ్య కథలను, నామములను గానము చేయుచుండుటవలన అతిశీఘ్రముగా నా మనస్సు అర్ద్రమై ఉన్మాది వలె ఒకప్పుడు సహాస్త తాడనములతో నాలో నేను నవ్వుకొందును. ఒకప్పుడు ఇప్పటివరకు దయ చూపలేదని ఏడుస్తాను.(నీ పై చిత్త ఏకాగ్రత కుదరలేదని నేను ఏడుస్తాను) ఒక్కొక్కసారి అత్యౌత్సుక్యము వలన పెద్దగా శబ్దము చేస్తాను. గొంతెత్తి పాడతాను. నృత్యము చేస్తాను. అలౌకికుడనై తిరిగెదను. ఆ అలౌకిక స్థితిని నాయందు దయతో కల్పింపుము.

**91-6 శ్లో.**

**భూతాన్యేతాని భూతాత్మకమపి సకలం పక్షిమత్స్యాన్ మృగాదీన్**
**మర్త్యాన్ మిత్రాణి శత్రూనపి యమితమతిస్త్వన్మయాన్యానమాని ।**
**త్వత్సేవాయాం హి సిధ్యేన్మమ తవ కృపయా భక్తిదార్ఢ్యం విరాగః**
**త్వత్తత్త్వస్యావబోధోఽపి చ భువనపతే! యత్నభేదం వినైవ ॥**

**ప్రతిపదార్థము:** ఏతానిభూతాని =ఈ పంచభూతములు(1.పృథివి, 2.జలము, 3. తేజస్సు, 4.వాయువు, 5.ఆకాశము)(భవంతి భూమ్యామ్ భూమి యందుండునది. పంచమహాభూతాలు), భూతాత్మకమ్= భూతవికారమయిన ఈ కనబడే ప్రపంచము, సకలం అపి= సకల చరాచరాత్మకమయిన (సహ కలయా సంపూర్ణము), పక్షి= పక్షులు (పక్షౌ అస్య స్తః రెక్కలు గలది. పక్షి), మత్స్యాన్= మత్స్యములు(మాద్యతి జలం ప్రాప్య జలమును పొంది ఆనందించునది.చేప),

మృగ–ఆదీన్ = జలస్థలాశ్రితములైన జంతువులు (మార్ష్టి గచ్ఛతి విచరణశీలః తిరుగు స్వభావం కలది. జింక పశువు మృగము), మర్త్యాన్= మానవులు(మర్త ఏవ మర్త్యః మానవుడు), మిత్రాణి= మిత్రులు (మిద్యతి స్నిహ్యతి స్నేహం చేయువాడు. మిత్రుడు), శత్రూన్ అపి= శత్రువులు కూడా(శాదయతీతి పీడించువాడు నాశనము చేయువాడు. శత్రువు), త్వత్ మయాని = నీరూపములే అని, యమిత మతిః = మనోనిగ్రహముచే భావిస్తూ (ఇవన్నీ శ్రీ హరి రూపాలన్ని భావిస్తూ), ఆనమాని = అన్నిటికి నమస్కరింతును, భువనపతే = ఓ భువన పతీ!, త్వత్ సేవాయాం హి= నీ సేవలో, తవ కృపయా= నీదయచే, భక్తిదార్ఢ్యం = దృఢభక్తి(ఈశ్వర ప్రేమయందు స్థైర్యము), విరాగః =విషయ విరక్తి(విగతః రాగః యస్య అనురాగము లేనివాడు. సన్న్యాసి, అనాసక్తుడు అరుచి), త్వత్= నీయొక్క, తత్త్వస్య అవబోధః అపి చ = ఈశ్వరానుభవము(తత్వజ్ఞానము) కూడా, యత్నభేదం వినా –ఏవ = మఱియొక ప్రయత్నము అవసరము లేకుండ, మమ సిధ్యేత్ = నాకు కలుగుగాక!

**తాత్పర్యము:** ఈ పంచభూతములు భూతవికారమయిన ఈ సకల చరాచరాత్మక మయిన కనబడే ప్రపంచము, పక్షులు, మత్స్యములు, జలస్థలాశ్రితములైన జంతువులు మానవులు ,మిత్రులు ,శత్రువులు కూడా నీరూపములే అని భావిస్తూ అన్నిటికి నమస్కరింతును . ఓ భువన పతీ ! నీ సేవలో నీదయచే దృఢభక్తి విషయ విరక్తి , నీయొక్క తత్వజ్ఞానము కూడా మఱియొక ప్రయత్నము అవసరము లేకుండ నాకు కలుగుగాక !

**91–7 శ్లో.**

**నో ముహ్యన్ క్షుత్తృడాద్యైర్ భవసరణిభవైస్త్వన్నిలీనాశయత్వా**
**చ్చింతాసాతత్యశాలీ నిమిషలవమపి త్వత్పదాదప్రకంపః ।**
**ఇష్టానిష్టేషు తుష్టివ్యసనవిరహితో మాయికత్వావబోధా**
**జ్జ్యోత్స్నాభిస్త్వన్నఖేందోరధికశిశిరితేనాత్మనా సంచరేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వత్= ఈశ్వరుడవైన నీయందు(తనోతి అన్యో భవతి ఇతరమైనది. నీది), నిలీన అనాశయత్వాత్= మనస్సు లీనమైనందువలన ఆశ లేనివాడినై

(నిశ్శేషేణ లీనం సంవృతం వా లీనమైనది కప్పబడినది)(నాస్తి ఆశా యస్య ఆశ లేనివాడు), భవ సరణి భవైః = అనాది సంసార సంభవములైన (భవతి జాయతే తస్య భావ పుట్టుక సంసారము), క్షుత్ తృడా ఆద్యైః= ఆకలి దప్పులకు (క్షుద్యతి క్షుదితో భవతి అనయా దీనితో ఆకలి గొనును. ఆకలి), నో ముహ్యాన్ =పరవశత్వము పొందక(మూర్ఛపొందక), చింతాసాతత్యశాలీ= ఎప్పుడు నిన్ను ఉపాసన చేయుటవలన(చింతా చింతనమ్ ఆలోచనము. చింత)(సతతస్య నిరంతరస్య భావః నిరంతరము, ఎల్లపుడు), నిమిషలవమ్ అపి= నిమిషమాత్రము కూడా(నిమేషతి నితరాం మేషతి తస్య కర్మ కనురెప్ప కొట్టుకొనుట. నిమేషము, నిమిషము), త్వత్ పదాత్= నీ ధ్యానము నుండి(నీ పదారవింద భజనము నుండి), అప్రకంపః = చెదరక (ప్రకర్షేణ కంపః కంపించుట వణుకుట. దీనికి వ్యతిరేకము అప్రకంపము), మాయికత్వ అవబోధాత్ = ఈ ప్రపంచము సర్వము మాయాకల్పితమని తెలుసుకొంటూ, ఇష్ట అనిష్టేషు= ఇష్టా యిష్టములలో తుష్టి వ్యసన విరహితః= సుఖదుఃఖములు లేనివాడనయి(ఇష్యతే అసౌ అభిలషితము, ఇష్టమైనది)(ఇష్టస్య సుఖాదేః విరోధిః ప్రతికూలవేదనీయం దుఃఖమ్ ఇష్టము కానిది సుఖవిరోధి. దుఃఖము), త్వత్ నఖ ఇందోః = నీ కాలి గోళ్ల చంద్రుల యొక్క (నహ్యతి బధ్నాతి రుధిరాదికమ్ రక్తాదులను బంధించునది. గోరు.)(ఉనత్తి చంద్రికయా భువం క్లిన్నాం కరోతి వెన్నెలతో భూమిని తడుపువాడు. చంద్రుడు), జ్యోత్స్నాభిః = వెన్నెలలతో (జ్యోతిః అస్తి అస్యామ్ ప్రకాశం కలిగి వున్నది. వెన్నెల చంద్రకిరణములు), అధిక శిశిరితేన= చల్లదనము పొందిన(సంతాప రాహిత్యము యొక్క అతిశయమువలన కలిగిన ఆనందముతో), ఆత్మనా సంచరేయమ్= మనస్సుతో సంతోషముతో తిరిగెదను.

**తాత్పర్యము:** ఈశ్వరుడవైన నీయందు నా మనస్సు లీనమైనందువలన ఆశ లేనివాడినై, అనాది సంసార సంభవములైన ఆకలి దప్పులకు మూర్ఛపొందక, ఎప్పుడు నిన్ను ఉపాసన చేయుటవలన నిమిషమాత్రము కూడా నీ ధ్యానము నుండి చెదరక, ఈ ప్రపంచము సర్వము మాయాకల్పితమని తెలుసుకొంటూ ఇష్టా యిష్టములలో సుఖదుఃఖములు లేనివాడనయి, ( ఉదా. పుత్రుడు జన్మించుట ఇష్టము. దానిలో సంతోషము లేదు. పుత్రుడు మరణించాడు. దుఃఖము లేదు) నీ

కాలి గోళ్ల చంద్రుల యొక్క వెన్నెలలతో చల్లదనము పొందిన మనస్సుతో సంతోషముతో తిరిగెదను.

**91–8 శ్లో.**

**భూతేష్వేషు త్వదైక్యస్మృతిసమధిగతౌ నాధికారోఽధునా చేత్**
**త్వత్ప్రేమత్వత్కమైత్రీజడమతిషు కృపా ద్విట్సు భూయాదుపేక్షా ।**
**అర్చాయాం వా సమర్చాకుతుకమురుతరశ్రద్ధయా వర్ధతాం మే**
**త్వత్సంసేవీ తథాపి ద్రుతముపలభతే భక్తలోకోత్తమత్వమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఏషు భూతేషు =పిపీలికాది బ్రహ్మపర్యంతమైన ఈ భూతజాలములో, త్వత్ ఐక్య స్మృతి సమధిగతౌ = నీరూపములే అను జ్ఞానము పొందుటకు, అధునా= ఈ జన్మలో(ధునా, అస్మిన్ కాలే ఈ కాలంలో ఇప్పుడు), అధికారః =అధికారము(అధిస్వామిత్వేన కారః కర్మ అధికః కారః స్వామిత్వం, అధికారము. శాస్త్రంచే నిర్దేశించబడిన అధికారము), న చేత్= లేనిచో ( యోగ్యుడను కానిచో) (యది న భవతి నిషేధము కానట్లైతే), త్వత్ ప్రేమ= నీయందు ప్రేమ, త్వత్క= నీ భక్తులయందు, మైత్రీ = స్నేహము (మిత్రస్య భావః కర్మ వా మైత్రి, మిత్రత్వము, స్నేహము), జడమతిషు= మూఢ జనులయందు, కృపా= దయ (కల్పతే సమర్థో భవతి అనయా అనుగ్రహాయ దీనులపై దయ చూపుట), ద్విట్సు= శత్రువులను (ద్వేష్టి అసౌ ద్వేషించువాడు. శత్రువు), ఉపేక్షా= ఉపేక్షించుట అనునవియయినను, భూయాత్ వా= నాకు కలుగునట్లుగా చేయుము, అర్చాయాం = నీఅర్చనమందు (ప్రతిమాది పూజయందు)(అర్చ్యతే దేవతా విగ్రహము), సమర్చాకుతుకమ్= పూజా కౌతుకము (సమ్యక్ అర్చనం పూజనమ్ చక్కగా పూజించుట.) (అననుభూతద్రవ్యాభిలాషః–కుతుకమ్), ఉరుతరశ్రద్ధయా = ఈశ్వర గురు శాస్త్ర విషయమైన శ్రద్ధ, మే= నాకు, వర్ధతాం = పెంపొందునట్లు చేయుము,తథాఅపి=ఈవిధముగా,త్వత్సంసేవీ=నిన్నుసేవించుచున్నందువలన, భక్త లోక ఉత్తమత్వమ్= నీ భక్తులలో శ్రేష్ఠుడనగునట్లు, ద్రుతమ్= వెంటనే (ఈ జన్మలోనే), ఉపలభతే= అనుగ్రహింపుము.

**తాత్పర్యము:** పిపీలికాది బ్రహ్మపర్యంతమైన భూతజాలములో నీరూపములే అను

జ్ఞానము పొందుటకు ఈ జన్మలో నాకు అధికారము లేనిచో- నీయందు నీ భక్తులయందు స్నేహము మూఢ జనులయందు దయ, శత్రువులను ఉపేక్షించుట అనునవియయినను నాకు కలుగునట్లుగా చేయుము. నీఅర్చనమందు పూజా కౌతుకము , ఈశ్వర గురు శాస్త్ర విషయమైన శ్రద్ధ- నాకు పెంపొందునట్లు చేయుము. ఈ విధముగా నిన్ను సేవించుచున్నందువలన నీ భక్తులలో శ్రేష్ఠుడనగునట్లు ఈ జన్మలోనే అనుగ్రహింపుము.

**91-9 శ్లో.**

**ఆవృత్య త్వత్స్వరూపం క్షితిజలమరుదాద్యాత్మనా విక్షిపంతీ**
**జీవాన్ భూయిష్ఠకర్మావళివివశగతీన్ దుఃఖజాలే క్షిపంతీ ।**
**త్వన్మాయా మాఽభిభూన్మామయి భువనపతే! కల్పతే తత్ప్రశాంత్యై**
**త్వత్పాదే భక్తిరేవేత్యవదదయి విభో! సిద్ధయోగీ ప్రబుద్ధః ॥**

**ప్రతిపదార్థము:** అయి భువనపతే= ఓ భువన పతీ! (భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము), త్వత్ స్వరూపం= నీ అధీనములోని మాయా స్వరూపము (స్వస్య రూపమ్ తన రూపము), ఆవృత్య= ఆవరించి, క్షితి జల మరుత్ ఆది —ఆత్మనా = భూమి మొదలైన భూతపంచక వస్తువుల రూపములో (క్షియంతి నివసంతి అస్యామ్ దీని పైన నివసింతురు. భూమి)(జలతి జడో భవతి, న ప్రవహతి కదలిక లేనిది. ప్రవహించనిది. నీరు)(మ్రియతే ప్రాణినః అస్య అభావాత్ ఇది లేకపోయినచో ప్రాణులు మరణించును. వాయువు, గాలి దేవత), విక్షిపంతీ= విక్షేపము కల్పించి నీ బ్రహ్మస్వరూపమును కప్పివేయును. (మోహ పరవశులను చేయుచున్నదని భావం)(వివిధం క్షేపణం త్యాగో వా వెదజల్లుట వ్యాకులత్వము), భూయిష్ఠ = కామ్య నిషిద్ధాది అధికమైన, కర్మావళి = కర్మ భేదములతో, వివశ గతీన్ = అస్వతంత్రములయిన గతులను పొందిన, జీవాన్ = జీవులను, దుఃఖజాలే= నికృష్టశ్రేష్ఠజన్మములలోనికి ఈడ్చి దుఃఖ జాలములయిన సంసార సముద్రములలో, క్షిపంతీ = పడవేయును, త్వత్ మాయా= నీ అధీనములోని మాయ, మామ్= నీ సేవకుడనయిన నా, మా అభిభూత్= బుద్ధిని ఆక్రమించి నీ స్మరణను తొలగింపకుండుగాక!, అయి విభో= ఓ ప్రభూ!, తత్ ప్రశాంత్యై= కేవల రూపమైన

శాంతికి (అతిశయేన శాంతః మిక్కిలి శాంతి కలిగినది. శాంతమైనది), త్వత్ పాదే = నీపాదములందు (పద్యతే గమ్యతే అనేన దీనితో వెళ్లుదురు. పాదము, కాలు), భక్తిః ఏవ= భక్తి ఒక్కటే, కల్పతే ఇతి = సాధనముగా కల్పించబడినదని, ప్రబుద్ధః సిద్ధ యోగీ = సిద్ధయోగులలో ఒకప్రబుద్ధుడు(అతిశయేన బుద్ధః జాగృతో వా బాగా తెలిసినవాడు. పండితుడు, విద్వాంసుడు మేల్కొనినవాడు), అవదత్ = పలికెను.

**తాత్పర్యము:** ఓ భువన పతీ ! నీ అధీనములోని మాయా స్వరూపము ఆవరించి భూమి మొదలైన భూతపంచక వస్తువుల రూపములో విక్షేపము కల్పించి నీ బ్రహ్మస్వరూపమును కప్పివేయును. (మోహ పరవశులను చేయుచున్నదని భావం) కామ్య నిషిద్ధాది బహు కర్మ భేదములు అస్వతంత్రములయిన గతులను పొందిన జీవులను నికృష్టశ్రేష్ఠజన్మములలోనికి ఈడ్చి దుఃఖ జాలములయిన సంసార సముద్రములలో పడవేయును. నీ అధీనములోని మాయ నీ సేవకుడనయిన నా బుద్ధిని ఆక్రమించి నీ స్మరణను తొలగింపకుండుగాక! ఓ ప్రభూ ! కేవల రూపమైన శాంతికి నీపాదములందు భక్తి ఒక్కటే సాధనముగా కల్పించబడినదని సిద్ధయోగులలో ఒకప్రబుద్ధుడు అవదత్ = సంస్కృత భాగవతములో పలికెను

**విశేషాలు:** "తన్మాయయాతో బుధ ఆభజేత్తం / భక్త్యైకయేశమ్ గురుదేవతాత్మా" అని (శ్రీ మద్భాగవతము స్కం. 11 అధ్యా. 2 శ్లో.37) అని నిమితో ఒక సిద్ధయోగి సంస్కృత భాగవతంలో చెప్పాడు.బుద్ధిమంతుడు గురువును దేవతా స్వరూపముగా భావించి , ఏకాంత భక్తి చేత ఆ పరమేశ్వరుని భజింపవలెను.

**విక్షేప :** సంక్షేపానికి వ్యతిరిక్తం. చెదరిపోవటం

మాయాశక్తికి రెండు ముఖాలు. ఒకటి ఆవరణం. అది చైతన్యాన్ని కప్పి సంకుచితం చేసి చూపుతుంది. ఇదే జీవభావం. రెండవది విక్షేపం. ఇది రెచ్చగొట్టి ప్రపంచాన్ని బయట పెడుతుంది. ఇదే జగద్భావం

**కేవల /కైవల్య :** మరొకటి ఏదీ లేకుండా తనపాటికి తానే ఉన్నది. ఆత్మ. సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమైన తత్త్వం. దాని భావం కైవల్యం. కేవలత్వం. ఏకత్వం అద్వైతం మోక్షం శివః కేవలోహం

**91-10 శ్లో.**

**దుఃఖాన్యాలోక్య జంతుష్వలముదితవివేకోఽహమాచార్యవర్యాత్**
**లబ్ధ్వా త్వద్రూపతత్త్వం గుణచరితకథాద్యుద్భవద్భక్తిభూమా ।**
**మాయామేనాం తరిత్వా పరమసుఖమయే త్వత్పదే మోదితాహే**
**తస్యాయం పూర్వరంగః పవనపురపతే! నాశయాశేషరోగాన్ ॥**

**ప్రతిపదార్థము:** పవనపురపతే= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, అహమ్ = నేను, జంతుషు = ప్రాణులన్నియు(జన్యతే శరీరాది ధారణేన ప్రాదుర్భవతి శరీరాదులు ధరించి పుట్టునది. జీవుడు ప్రాణి), దుఃఖాని = దుఃఖములను అనుభవించుట (దుష్టం ఖనతి కష్టపెట్టునది), ఆలోక్య= చూసి, అలమ్ = అతిశయముగా, ఉదిత వివేకః= ఈ లోకమంతయు శోకమయమే అను వివేకము కలిగినది. (ఉత్ ఉచ్చైః ఇతః గతః ఉదయించినది మొలచినది వృద్ధి చెందినది)(విశేషేణ వినక్తి విచారయతి తస్య భావః కర్మ వా విచారణ, ఆలోచన, వివేచించుట, వివేచన), ఆచార్యవర్యాత్= ఉత్తమ గురువులవలన (జ్ఞాన విజ్ఞాన సంపన్నులు) (ఆచినోతి బుద్ధిం శిష్యాణామ్ శిష్యులకు జ్ఞానము పెంపొందింపచేయువాడు), త్వత్ = నీ రూప, తత్త్వం= స్వరూప తత్వమును(నిజ జ్ఞానమును)(తతో భావః తస్య భావో వా దాని స్వరూపము సత్యము.)(కథ్యతే ఇతి కథా చెప్పబడునది చెప్పుట కథాసాహిత్యము), లబ్ధ్వా= పొంది, గుణ చరిత కథా ఆది = నీ గుణమయములైన కథలు మొదలయినవి వినుటవలన (గుణ్యంతే ప్రశస్యంతే ఇతి గుణాః పొగడబడునది. సద్గుణము), ఉద్భవత్ భక్తి భూమా= ఉద్భవించిన భక్తి బాహుళ్యము వలన, ఏనాం మాయామ్= ఈ మాయను, తరిత్వా= దాటి, పరమ సుఖమయే = పరమ సుఖమయములైన, త్వత్ పదే = నీ పాదములను ఆశ్రయించి, మోదితాహే= ఆనందిస్తాను, తస్య = ఆ సాధనల కొరకు, అయం= ఈ నా ప్రయత్న పరంపర, పూర్వః అంగః= పూర్వ రంగము, అశేష రోగాన్= నా సమస్త రోగములను, నాశయ = తొలగింపుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! నేను ప్రాణులన్నియు దుఃఖములను అనుభవించుట చూసి ఈ లోకమంతయు శోకమయమే అను వివేకము కలిగినది. ఉత్తమ గురువులవలన నీ నిజ జ్ఞానమును పొంది, నీ గుణమయములైన కథలు

మొదలయినవి వినుటవలన ఉద్భవించిన భక్తి బాహుళ్యము వలన– ఈ మాయను దాటి పరమ సుఖమయములైన నీ పాదములను ఆశ్రయించి ఆనందిస్తాను. ఆ సాధనల కొరకు ఈ నా ప్రయత్న పరంపర ఈ పూర్వ రంగము .( మాయాజయము ) నా సమస్త రోగములను తొలగింపుము.

## ఏకాదశ స్కంధము

## 91వ దశకము సమాప్తము



# ఏకాదశ స్కంధము

## దశకమ్ 92 – కర్మమిశ్రభక్తి

**92-1 శ్లో.**

**వేదైస్సర్వాణి కర్మాణ్యఫలపరతయా వర్ణితానీతి బుద్ధ్వా**
**తాని త్వయ్యర్పితాన్యేవ హి సమనుచరన్యాని నైష్కర్మ్యమీశ! ।**
**మా భూద్వేదైర్నిషిద్ధే కుహచిదపి మనఃకర్మవాచాం ప్రవృత్తిః**
**దుర్వర్జం చేదవాప్తం తదపి ఖలు భవత్యర్పయే చిత్ప్రకాశే ॥**

**ప్రతిపదార్థము:** ఈశ= ఓ గురువాయూరు కృష్ణదేవా!, వేదైః = విధివాక్యములచే(విదంతి జానంతి బుధాః సర్వం అనేన మంత్రబ్రాహ్మణాత్మకః శ్రుతికదంబః విజ్ఞులు దీనితో అంతయు తెలుసుకొందురు. మంత్ర బ్రాహ్మణములతో కూడుకున్న వేద సమూహము), సర్వాణి కర్మాణి= జ్యోతిష్టోమాది(గ్రహ నక్షత్రాదులు స్తోమంగా గల యజ్ఞము. 16 ఋత్విక్కులు వుండు యజ్ఞము) సర్వ కర్మములను, అఫలపరతయా= అ ఫల సాధనములుగా, వర్ణితాని ఇతి= వర్ణించబడినవని (కేవలము కర్మలను ఫలములను ఆశింపకుండా చేయవలెనని చెప్పాయి), బుద్ధ్వా= తెలుసుకొని, తాని = ఆ కర్మ ఫలములను, త్వయి = నీకు, అర్పితాని ఏవ హి = అర్పించుకొనియే, సమనుచరన్= కర్మలను చేయుచు, నైష్కర్మ్యమ్= నైష్కర్మ్యమును(నిష్కర్మణో భావః కర్మ చేయకపోవుట నిష్కామ కర్మలు చేయుట), యాని= పొందితిని, వేదైః నిషిద్ధే = వేద నిషిద్ధములైన కర్మలను, కుహచిత్ అపి = ఎక్కడ కూడా, మనఃకర్మవాచాం = మనసా వాచా కర్మణా, ప్రవృత్తిః= ఆచరించు ప్రవృత్తి నాకు (ప్రకృష్టా వృత్తిః ప్రగతిః ఉదయః ఆచరణమ్ ఆచరణము), మా భూత్ = కలుగకుండుగాక ! ( అలా నువ్వు అనుగ్రహింపుమని ప్రార్థన), దుర్వర్జం = విధిలేక నిషిద్ధ కర్మలు, అవాప్తం చేత్ = చేయవలసి వచ్చినప్పుడు, తత్ అపి ఖలు= ఆ కర్మ ఫలములను కూడా, చిత్ప్రకాశే= చిదానంద స్వరూపుడవయిన (చైతన్యం / జ్ఞాన రూపమగు ఆత్మ), భవతి= నీకు, అర్పయే = మంత్రపురస్సరముగా సమర్పించుకొందును.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! వేదములలోని విధివాక్యములు–జ్యోతిష్టోమాది సర్వ కర్మములు ఫలములను ఆశింపకుండా చేయవలెనని చెప్పాయి . ఇది గ్రహించి ఆ కర్మ ఫలములను నీకు అర్పించుకొని కర్మలను చేయుచు నైష్కర్మ్యమును పొందితిని. వేద నిషిద్ధములైన కర్మలను చేసే ప్రవృత్తి నాకు కలుగకుండుగాక ! విధిలేక నిషిద్ధ కర్మలు చేయవలసి వచ్చినప్పుడు ఆ కర్మ ఫలములను కూడా చిదానంద స్వరూపుడవయిన నీకు మంత్రపురస్సరముగా సమర్పించుకొందును.

**విశేషాలు**

**కర్మలు:** ప్రతి జీవీ చేసే పని. ఇలా చేసే పనులు సంచితమనీ, ప్రారబ్ధమనీ, ఆగామి అనీ మూడు విధాలు అని వైదిక ధర్మాన్ని అనుసరించే పలువురి విశ్వాసం. సంచితం అంటే కూడబెట్టుకొన్నది. ప్రారబ్ధం అంటే కూడబెట్టుకొన్న దానిని అనుభవంలోకి తెచ్చుకోవడం. ఆగామి అంటే ఈ జన్మలో చేసే పనులతో కూడబెట్టుకొనబోయేది (అంటే, సంపాదించుకొంటున్నది). ఆగామికే మరో పదం క్రియమాణం. కర్మలు లౌకికం అనీ, అలౌకికం (వేదోక్తం) అనీ రెండు విధాలు. జీవిక కోసం చేసే పనులు లౌకికం. ఈశ్వరారాధన మొదలైనవి అలౌకిక కర్మలు. నిత్య, నైమిత్తిక, కామ్య, నిషేధ కర్మలనే మరో వర్గీకరణ కూడా ఉంది. నిత్యకర్మలు అంటే రోజూ చేసేవి. అమావాస్యనాడు ఫలానా యాగం చేయాలి. పౌర్ణమినాడు ఫలానా పనిచేయాలని చెప్పినందున చేసేవి నైమిత్తిక కర్మలు. ఫలానా కర్మ చేస్తే ఫలానా ఫలితం వస్తుందని చేసేది కామ్యకర్మ. ఉదాహరణ జ్యోశిష్టోమం చేస్తే స్వర్గం ప్రాప్తిస్తుందనీ పుత్రకామేష్టి చేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందని చేసేవి, చేయించేవి. అసత్యం పలకవద్దని, పరస్త్రీని ఆశించవద్దనీ చెప్పేది నిషేధకర్మలు.

**92–2 శ్లో.**

**యస్త్వన్యః కర్మయోగస్తవ భజనమయస్తత్ర చాభీష్టమూర్తిం**
**హృద్యాం సత్వైకరూపాం దృషది హృది మృది క్వాపి వా భావయిత్వా ।**
**పుష్పైర్గంధైర్నివేద్యైరపి చ విరచితైశ్శక్తితో భక్తిపూతైః**
**నిత్యం వర్యాం సపర్యాం విదధదయి విభో! త్వత్ప్రసాదం భజేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి విభో =ఓ ప్రభూ! (విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), అన్యః = యజ్ఞాది కర్మల కంటె (వైదికమునకు అన్యమైన తాంత్రికముల కంటె) విలక్షణమైన, తవ = నీ యొక్క, భజనమయః=భక్తి మిశ్రితమైన (భజనం సేవనం భాగో వా భజ తస్య భావః కర్మ వా సేవించుట, సేవనము), యః తు= ఏ కర్మయోగము ఉన్నదో, తత్ర చ= అచ్చట, హృద్యాం= మనోహరమైన (హృదయస్య ప్రియః హృదయమునకు ప్రియమైనది), సత్వ ఏకరూపాం= నీ నారాయణవాసుదేవాది శుద్ధ సాత్వికమూర్తులలో, అభీష్ట మూర్తిం= నాకు ఇష్టమయిన ఒక రూపాన్ని(అభి ఇష్టః వాంఛితః), దృషది= శిలామయమైన (దీర్యతే అనయా), మృది వా = మట్టి యందు కాని, క్వాపి= లేక ఇతర స్థలములందు(కాంస్య రజత సువర్ణమూర్తులో దేనినైనా కాని), హృది= హృదయమున, భావయిత్వా = నిలుపుకొని(సంకల్పించుకొని), శక్తితః= నా యథా శక్తి మేరకు(పత్రం పుష్పం ఫలం తోయం), విరచితైః= సంప్రాప్తమైన (విశేషేణ రచితః నిర్మితః రచింపబడినది నిర్మింపబడినది), భక్తిపూతైః= భక్తి పూతములైన, పుష్పైః= పూవులతో (పుష్పతి వికసతి వికసించునది. పుష్పము), గంధైః= గంధాదులతో అర్చిస్తూ (గంధతి సుగంధం కరోతి సుగంధమును వెదజల్లునది. సంబంధము చందనాది ద్రవ్యము), నివేద్యైః అపి చ= నైవేద్యములను సమర్పిస్తూ, వర్యాం సపర్యాం= చక్కని పూజతో, నిత్యం= ప్రతిదినము, విదధత్ = నిన్ను సేవింతును, త్వత్ ప్రసాదం= ఈ విధముగా, భజేయమ్= నీ అనుగ్రహాన్ని పొందుతాను.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! యజ్ఞాది కర్మల కంటె నీ యొక్క భక్తి మిశ్రితమైన కర్మయోగము విలక్షణమైనది. ఆ కర్మ యోగములో భాగంగా మనోహరమైన నీ నారాయణవాసుదేవాది శుద్ధ సాత్వికమూర్తులలో నాకు ఇష్టమయిన ఒక రూపాన్ని శిలారూపములో – మట్టి ప్రతిమ రూపములో – లేక కాంస్య రజత సువర్ణమూర్తులలో దేనినైనా కాని నా హృదయమున నిలుపుకొని –నా యథా శక్తి మేరకుపూవులతో గంధాదులతో అర్చిస్తూ నైవేద్యములను సమర్పిస్తూ చక్కని పూజతో ప్రతిదినము నిన్ను సేవింతును. ఈ విధముగా నీ అనుగ్రహాన్ని పొందుతాను.

**92-3 శ్లో.**

**స్త్రీశూద్రాస్త్వత్కథాదిశ్రవణవిరహితా ఆసతాం తే దయార్హాః**
**త్వత్పాదాసన్నయాతాన్ ద్విజకులజనుషో హంత శోచామ్యశాంతాన్ ।**
**వృత్త్యర్థం తే యజంతో బహుకథితమపి త్వామనాకర్ణయంతో**
**దృప్తా విద్యాభిజాత్యైః కిము న విదధతే తాదృశం మా కృథామామ్ ॥**

**ప్రతిపదార్థము:** స్త్రీశూద్రాః = విద్యా సంస్కారము లేని కారణముగా స్త్రీ శూద్రాదులు (స్తృణాతి దుర్వినీతా సతి ఆత్మనః పరస్య చ గుణగుణం ప్రచ్ఛాదయతి తన గుణములను కప్పిపుచ్చునది. స్త్రీ), త్వత్ కథా ఆదిశ్రవణ విరహితాః = నీ నామసంకీర్తన స్మరణ కథాశ్రవణాదులు చేయుట కూడా తెలియనివారు, తే దయార్హాః ఆసతాం = వారు నీదయకు పాత్రులు. (అనగా నువ్వు దయ చూపించాలని భావం), హంత= అయ్యో!, త్వత్ పాద ఆసన్న యాతాన్ = వేదశాస్త్రాదులు చదువుట ద్వారా నీ పదములకు దగ్గరయైనప్పటికి (విద్యా సంస్కారము కలిగినప్పటికి ), అశాంతాన్= అశాంతులైన (విషయలోలులైన), ద్విజకులజనుషః= బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల గురించి, శోచామి = నేను విచారించుచున్నాను, తే = వారు, వృత్త్యర్థం= వృత్తి కొరకు మాత్రమే (ఉదర భరణార్థం), యజంతః = నిన్ను పూజిస్తూ, బహు కథితమ్ అపి = వేదాదులలో సగుణ నిర్గుణ రూపముగా చెప్పబడిన(కథితః వర్ణితః పరమేశ్వరః వర్ణింపబడ్డది(వాడు). పరమేశ్వరుడు), త్వామ్= నిన్ను, అనాకర్ణయంతః = వినక విముఖులై, విద్యా అభిజాత్యైః= విద్యా, ధన, అభిజాత్యములను(కులీనత, పాండిత్యము) మూడింటిచే (వేద్యంతే జ్ఞాయంతే విషయాః అనయా దీనితో విషయములు తెలుసుకొనబడును. విద్య), దృప్తాః = మదించి (దృప్తః గర్వితగర్వించినది(వాడు), కిము న విదధతే= ఏమి చేయక నీ పూజలలో అశ్రద్ధ చేయుదురు, మామ్ = నన్ను, తాదృశం= అటువంటివారి గుంపులో, మా కృథాః= చేర్చకుము.

**తాత్పర్యము:** విద్యాసంస్కారము లేని కారణముగా స్త్రీ శూద్రాదులు నీ నామసంకీర్తన స్మరణ కథాశ్రవణాదులు చేయుట కూడా తెలియనివారు. వారు నీదయకు

పాత్రులు. కాని వేదశాస్త్రాదులు చదువుట ద్వారా నీ పదములకు దగ్గరయైనప్పటికి విషయలోలులైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల గురించి నేను విచారించుచున్నాను. వారు వృత్తి కొరకు మాత్రమే నిన్ను పూజిస్తూ వేదాదులలో సగుణ నిర్గుణ రూపముగా చెప్పబడిన నిన్ను వినక (నీ గొప్పతనమును వినక) విముఖులై విద్యా , ధన, అభిజాత్యములను మూడింటిచే మదించి ఏమి చేయక నీ పూజలలో అశ్రద్ధ చేయుదురు. నన్ను అటువంటివారి గుంపులో చేర్చకుము.

**92–4 శ్లో.**

**పాపోఽయం కృష్ణ రామేత్యభిలపతి నిజం గూహితుం దుశ్చరిత్రం**
**నిర్లజ్జస్యాస్య వాచా బహుతరకథనీయాని మే విఘ్నితాని ।**
**భ్రాతా మే వంధ్యశీలో భజతి కిలసదా విష్ణుమిత్థం బుధాంస్తే**
**నిందంత్యుచ్చైర్హసంతి త్వయి నిహితమతీంస్తాదృశం మా కృథా మామ్ ॥**

**ప్రతిపదార్థము:** అయం = వీడు, పాపః = పరమపాపి (పాపం తద్యోగాత్ పాపః పాపము వున్నవాడు), నిజం = తన చేత ఆచరింపబడిన (నిశ్చయేన జాయతే తనది, స్వకీయము), దుశ్చరిత్రం= పాపములను (చెడునడతలు), గూహితుం = కప్పుకొనుటకే, కృష్ణ రామ ఇతి = కృష్ణ రామ అని (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు.)(రమయతి ప్రజాః ప్రజలను ఆనందింపజేయువాడు. రాముడు), అభిలపతి= ఉచ్చరించును, అస్య నిర్లజ్జస్య= ఈసిగ్గులేని వానియొక్క, వాచా= మాటలలో (గోలలో), మే= నా యొక్క, బహుతర కథనీయాని= అనేక కార్యక్రమములు, విఘ్నితాని = చెడిపోవుచున్నవి, మే = నాయొక్క, భ్రాతా = ఈ సోదరుడు (భరతి హరతి భాగమ్ ప్రకాశించువాడు సహోదరుడు, భాగమును భరించువాడు), వంధ్యశీలః= నిష్ఫల శీలుడు. (బధ్నాతి స్వగతదోషేణ గర్భమ్ తనయందుండు దోషము చేత గర్భమును ప్రతిబంధించునది. గొడ్రాలు), సదా = ఎప్పుడు, విష్ణుమ్ = విష్ణువును (వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), భజతి కిల= పూజ చేస్తాడు, ఇత్థం= అని ఇట్లు,తే= ఆ అశాంతులు, త్వయి నిహిత మతీన్= నీయందు మనస్సు పెట్టిన (నిహితః స్థాపితః గూఢః పెట్టబడ్డది

దాచబడినది), బుధాన్= భక్తులను (పండితులను) (బుధ్యతే బోధయతి వా తెలుసుకొనువాడు. పండితుడు తెలుపువాడు. గురువు), నిందంతి= నిందించెదరు, ఉచ్చైః = ఆ భక్తులను చూసి అవహేళనగా పెద్దగా (ఉచ్ఛీయతే వర్ధతే అసౌ ఉన్నతమైనది గొప్పది), హసంతి = నవ్వుదురు, మామ్ = నన్ను, తాదృశం= అటువంటివానిగా, మా కృథాః= చేయకుము,

**తాత్పర్యము:** "వీడు పరమపాపి. తన చేత ఆచరింపబడిన పాపములను కప్పుకొనుటకే కృష్ణ రామ అని ఉచ్చరించును. ఈసిగ్గులేని వానియొక్క మాటలగోలలో నా యొక్క అనేక కార్యక్రమములు చెడిపోవుచున్నవి. నాయొక్క ఈ సోదరుడు నిష్ఫల శీలుడు. ఎప్పుడు విష్ణువును పూజ చేస్తాడు." అని ఆ అశాంతులు నీయందు మనస్సు పెట్టిన భక్తులను నిందించెదరు. ఆ భక్తులను చూసి అవహేళనగా పెద్దగా నవ్వుదురు. నన్ను అటువంటివానిగా చేయకుము.(ఇట్టి మూర్ఖుల పరిహాసములకు భక్తుడనైన నన్ను గురిచేయకుమని భావం)

**92-5 శ్లో.**

**శ్వేతచ్ఛాయం కృతే త్వాం మునివరవపుషం ప్రీణయంతే తపోభిః**
**త్రేతాయాం స్రుక్స్రువాద్యంకితమరుణతనుం యజ్ఞరూపం యజంతే ।**
**సేవంతే తంత్రమార్గైర్విలసదరిగదం ద్వాపరే శ్యామలాంగం**
**నీలం సంకీర్తనాద్యైరిహ కలిసమయే మానుషాస్త్వాం భజంతే ॥**

**ప్రతిపదార్థము:** కృతే = కృతయుగములో(కృతః సంపాదతః ఒక యుగము.) (యుగములు నాలుగింటిలో మొదటిది. దీని పరిమితి 1728000 సంవత్సరములు), శ్వేత ఛాయం= నువ్వు తెల్లని శరీర ఛాయతో (శ్వేతతే శుక్లో భవతి తెల్లదనము శుక్ల వర్ణము ) (ఛయతి ఛయతే వా ప్రతిరూపమ్ స్వరూపమును తెలుపునది), మునివరవపుషం= మహర్షిలా ఉన్న, త్వాం= నిన్ను, మానుషాః= మానవులు, తపోభిః= తపస్సుల ద్వారా, ప్రీణయంతే = ఆరాధింతురు, త్రేతాయాం = త్రేతాయుగములో (త్రీన్ భేదాన్ ఏతి ప్రాప్నోతి మూడు భేదములు కలది. కలియుగం నుండి మూడవ యుగం.) (దీని పరిమితి 1296000 సంవత్సరములు), స్రుక్ స్రువ ఆది అంకితమ్ = 'స్రుక్', 'స్రువము' మొదలగు

యజ్ఞోపకరణములను ధరించిన (స్రుక్కు స్రువం =యజ్ఞంలో హవిస్సులు వేయడానికి ఉపయోగించే గరిట వంటి చిన్న పరికరాలు), అరుణ తనుం =ఎర్రని కాంతి కలిగిన దేహము కలిగిన (ఋచ్ఛతి ప్రాప్నోతి వర్ణమ్ ఎరుపు), యజ్ఞరూపం= యజ్ఞపురుషుని రూపములో(ఇజ్యతే హవిః దీయతే అత్ర ఇక్కడ హవిని ఈయబడును. యజ్ఞము), యజంతే = పూజిస్తారు, ద్వాపరే = ద్వాపర యుగములో(ద్వాభ్యాం కృత త్రేతాభ్యాం పరః కృత-త్రేతాయుగముల కంటే పరమైనది. ద్వాపర యుగము.)(దీని పరిమితి 864000 సంవత్సముల కాలము), విలసత్ = ప్రకాశించు, అరి గదం= చక్ర గదాదులు ధరించి (అరములు కలది అరి = చక్రము).( గద్యతే పీడ్యతే అనేన దీనితో పీడింపబడుదురు), శ్యామల అంగం = శ్యామలమూర్తి వైయున్న ఉన్న నిన్ను (శ్యాయతే గచ్ఛతి మనః యస్మాత్ మనసుకు ఇష్టం కానిది. శ్యామ వర్ణము నల్లనిది), తంత్రమార్గైః = తంత్రమార్గములచే (ఆగమోక్త విధానమున)(తన్యతే సిద్ధాంత విశేషః సిద్ధాంతము), సేవంతే = సేవించుచుందురు, ఇహ కలిసమయే= ఈ కలియుగమున (కల్యతే పాపేషు నిక్షిప్యతే అనేన పాపములో పడవేయునది. దీని పరిమితి 432000 సంవత్సరకాలము. ఇది కృష్ణనిర్యాణము మొదలు గణింతురు), నీలం = నీల వర్ణునిగా(కృష్ణమూర్తిగ),త్వాం=నిన్ను,సంకీర్తనఆద్యైః=సంకీర్తనాదులచే(సమ్యక్ కీర్తనం స్తుతిః ప్రశంసా చ కీర్తనం చేయుట ప్రశంసించుట), భజంతే= సేవింతురు.

**తాత్పర్యము:** కృతయుగములో నువ్వు తెల్లని శరీర ఛాయతో మహర్షిలా ఉన్న నిన్ను మానవులు తపస్సుల ద్వారా ఆరాధింతురు. త్రేతాయుగములో స్రుక్, స్రువము మొదలగు యజ్ఞోపకరణములను ధరించిన ఎర్రని కాంతి కలిగిన దేహము కలిగిన యజ్ఞపురుషుని రూపములో నిన్ను పూజిస్తారు. ద్వాపర యుగములో చక్ర గదాదులు ధరించి శ్యామలమూర్తి వైయున్న ఉన్న నిన్ను తంత్రమార్గములచే సేవించుచుందురు. ఈ కలియుగమున నీల వర్ణునిగా నిన్ను సంకీర్తనాదులచే సేవింతురు.

**92-6 శ్లో.**

**సోఽయం కాలేయకాలో జయతి మురరిపో! యత్ర సంకీర్తనాద్యైః**
**నిర్యత్నైరేవమార్గైరఖిలద! న చిరాత్ త్వత్ప్రసాదం భజంతే ।**

**జాతాస్త్రేతాకృతాదావపి హి కిల కలౌ సంభవం కామయంతే**
**దైవాత్ తత్రైవజాతాన్ విషయవిషరసైర్మా విభో! వంచయాస్మాన్ ॥**

**ప్రతిపదార్థము:** మురరిపో= ఓ మురారీ! కృష్ణదేవా! (మురస్య అరిః మురాసురుని శత్రువు. శ్రీకృష్ణుడు), అఖిలద= కోరిన కోరికలు అన్నింటిని అనుగ్రహించువాడా ! (న ఖిల్యతే న కణశః ఆదీయతే ముక్కలుగా గ్రహించబడనిది. సంపూర్ణము సమగ్రము), విభో= ఓ ప్రభూ ! (విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), సః= పూర్వ శ్లోకములో చెప్పిన, అయం =ఈ, కాలేయ కాలః= కలియుగకాలము (కలేః అపత్యమ్ కలి సంతానము. ఒక దైత్యుడు), జయతి= యుగములన్నిటికంటె గొప్పదయి జయించుచున్నది, యత్ర= ఎచ్చట (ఈ కలియుగములో), నిర్యత్నైః ఏవ = ప్రయత్నము ఏమి లేకయే (అప్రయత్నముగానే)(యతతే తస్య భావః కర్మ వా ప్రయత్నము.అది కానిది నిర్యత్నము), సంకీర్తన ఆద్యైః మార్గైః= సంకీర్తనలు మొదలయిన మార్గముల ద్వారా (సమ్యక్ కీర్తనం స్తుతిః ప్రశంసా చ కీర్తనం చేయుట ప్రశంసించుట), న చిరాత్ = శీఘ్రముగా, త్వత్ ప్రసాదం= నీ అనుగ్రహము(ప్రసీదతి ప్రసన్నో భవతి తస్య భావః కర్మ వా ప్రసన్నత నిర్మలత్వము కృప అనుగ్రహము), భజంతే హి =పొందుచున్నారు. (ఇది పురాణ ప్రసిద్ధి అని నొక్కి చెప్పటానికి హి శబ్దము ప్రయోగింపబడినది), త్రేతా కృత్ ఆదౌ= కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగములలో, జాతాః అపి = జన్మించినవారుకూడా, కలౌ = ఈ కలియుగమున, సంభవం= తిరిగి జన్మించవలెనని (సమ్యక్ భవతి జాయతే తస్య భావః కర్మ వా పుట్టుక సంభవము అగునది), కామయంతే కిల = కోరుకొందురు కదా!, దైవాత్= దైవవశమున (అదృష్టవశాత్తు) (దైవే అతతి పరమేశ్వరుని కోరికతో జరుగునది), తత్ర ఏవ= అచ్చట(ఈ కలికాలములో), జాతాన్ = జన్మము లభించిన, అస్మాన్= మావంటివారికి, విషయ విష రసైః= విషతుల్యములైన లౌకిక విషయములపట్ల ఆసక్తి కలిగించి(విషిణ్వంతి విషయినం సంబధ్నంతి స్వాత్మకతయా స్వేనరూపేణ నిరూపణీయం, కుర్వంతి సుఖదుఃఖాదయః తన స్వరూపంతో ఇంద్రియాలను, పదార్థములను బంధించునది. ఇంద్రియ విషయములు), మా వంచయ = మోసము చేయకుము.

**తాత్పర్యము:** ఓ మురారీ! కృష్ణదేవా! కోరిన కోరికలు అన్నింటిని అనుగ్రహించువాడా! ఓ ప్రభూ ! పూర్వ శ్లోకములో చెప్పిన ఈ కలియుగకాలము యుగము లన్నిటికంటె గొప్పదయి జయించుచున్నది.ఈ కలియుగములో అప్రయత్నముగానే సంకీర్తనలు మొదలయిన మార్గముల ద్వారా శీఘ్రముగా నీ అనుగ్రహము పొందుచున్నారు.కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము లలో జన్మించినవారుకూడా ఈ కలియుగమున తిరిగి జన్మించవలెనని కోరుకొందురు కదా! అదృష్టవశాత్తు ఈ కలికాలములో జన్మము లభించిన మావంటివారికి విషతుల్యములైన లౌకిక విషయములపట్ల ఆసక్తి కలిగించి మోసము చేయకుము. (కనికరించుమని ప్రార్థన)

**92-7 శ్లో.**

**భక్తాస్తావత్ కలౌ స్యుర్ద్రమిళభువి తతో భూరిశస్తత్ర చోచ్చైః**
**కావేరీం తామ్రపర్ణీమను కిల కృతమాలాం చ పుణ్యాం ప్రతీచీమ్ ।**
**హా మామప్యేతదంతర్భవమపి చ విభో కించిదంచద్రసం త్వ-**
**య్యాశాపాశై ర్నిబధ్య భ్రమయ న భగవన్! పూరయ త్వన్నిషేవామ్ ॥**

**ప్రతిపదార్థము:** తావత్ కలౌ= ఈ కలియుగములో (తత్ పరిమాణం అస్య ఆ పరిమాణం కలది నిశ్చయము), భక్తాః=నీకు భక్తులైన మహానుభావులెందరో (భజతే అసౌ భజించువాడు. భక్తుడు), స్యుః = ఉన్నారు, తతః= వారిలో (తస్మాత్ తస్యాః వా, తస్మాత్ దేశాత్, స్థానాత్, తదనంతరమ్ అచ్చట నుండి దాని నుండి అతని నుండి ఆమె నుండి ఆ తరువాత), ద్రమిళభువి= ద్రమిళ (ద్రవిడ) దేశములో(ద్రవిడభాష మాట్లాడువాడు ద్రమిళుడు), భూరిశః= జన్మించినవారే ఎక్కువగా ఉన్నారు.(భూరిభూరీతి వీప్సా), తత్ర చ= ఆ ద్రమిళ (ద్రవిడ) దేశములోకూడా, పుణ్యాం= పుణ్యప్రదమైన (పునాతి పవిత్రీ భవతి అనేన వాదీనితో పవిత్రమగును. పుణ్యము), కావేరీం= కావేరి( కస్య జలస్య వేరం శరీరం అస్యాః జలమే శరీరముగా కలది. కావేరీనది), తామ్రపర్ణీమ్= తామ్రపర్ణి (దీని యందు ముత్యపుచిప్పలు ఉండునని ప్రసిద్ధి), కృతమాలాం చ = కృతమాల (మలయపర్వతమున ఉత్పత్తి అగు ఒక నది), ప్రతీచీమ్ = పశ్చిమదిక్కునకు

ప్రవహించుచున్న "నిల'' అను నదుల(ప్రతి ప్రతిదినాంతే అంచతి గచ్ఛతి సూర్యః అస్యామ్ ప్రతి దినాంతములో సూర్యుడు ఇటువైపు పయనించును. పశ్చిమ దిశ), అను= సమీపములందు(తీరములందు) నివసించువారు (అను అను ఉపసర్గకు తో, వెనుక, తక్కువ, సమానము, సమీపము మొదలగునవి అర్థాలు), ఉచ్చైః కిల = పరమోత్తములు(నిలా నది కేరళలో ఉన్నది), విభో= ప్రభూ!, ఏతత్ అంతర్భవమ్ అపి చ = ఈ వరుసలో చేరి(అనగా ఈ నదీ తీరముల మధ్య జన్మించిన వాడినని భావం) (అంతః భవతి మధ్యలో వుండునది), త్వయి =నీ యందు, కించిత్ అంచత్ రసం = ఈషదారబ్ధ భక్తి కలిగిన (స్వల్పమైన భక్తికల), మామ్ అపి = నన్ను కూడా, ఆశాపాశైః= ఆశాపాశములచే, నిబధ్య = బంధించి, న భ్రమయ= సంసార భ్రమలు కలుగ జేయకుము, భగవన్= ఓ భగవంతుడా!, హా= అయ్యో!, త్వత్= నీయొక్క, నిషేవామ్ = సేవాభాగ్యమును (నితరాం సేవతే తస్య భావః సేవించుట పూజించుట), పూరయ =పూరింపుము (ప్రసాదించుము).

**తాత్పర్యము:** ఈ కలియుగములో నీకు భక్తులైన మహానుభావులెందరో ఉన్నారు. వారిలో ద్రవిడ దేశములో జన్మించినవారే ఎక్కువగా ఉన్నారు.ఆ ద్రవిడ దేశములోకూడా పుణ్యప్రదమైన కావేరి, తామ్రపర్ణి , కృతమాల, పశ్చిమదిక్కునకు ప్రవహించుచున్న "నిల " అను నదుల తీరములందు నివసించువారు పరమోత్తములు.( నిలా నది కేరళలో ఉన్నది) ప్రభూ ! ఈ నదీ తీరముల మధ్య జన్మించి నీ యందు స్వల్పమైన భక్తికల నన్ను కూడా ఆశాపాశములచే బంధించి సంసార భ్రమలు కలుగ జేయకుము. ఓ భగవంతుడా ! నీయొక్క సేవాభాగ్యమును ప్రసాదించుము.

**విశేషాలు**

**కావేరి:** దక్షిణదిక్కున ఉండెడు ఒక పుణ్యనది. అగస్త్యుడు స్వర్గమునకు పోయి తన కమండలమున దేవగంగ ఎత్తికొని వచ్చి సహ్య పర్వతమునందు ఉంచి స్నానము చేయ పోయిన సమయమునందు విఘ్నేశ్వరుడు కాకి అయివచ్చి ఆకమండల జలమును దొర్లించెను. అది నదీరూపమున ప్రవహించి కావేరి అన పరగెను. అట్లు చేసినందులకు విఘ్నేశ్వరుని మీద అగస్త్యులు కోపించి తలమీద మొట్టెను.

అందువల్ల నాటినుండి విఘ్నేశ్వరుని నిమిత్తము తల రెండు ప్రక్కలను చేతులలో ఎవరు మొట్టుకొొందురో అట్టివారికి విఘ్నేశ్వరుని అనుగ్రహము కలుగును అని అతడు ప్రసాదించెను.

**92–8 శ్లో.**

**దృష్ట్వాధర్మద్రుహం తం కలిమపకరుణం ప్రాఙ్మహీక్షిత్ పరీక్షిత్**
**హంతుంవ్యాకృష్టఖడ్గోఽపి న వినిహతవాన్ సారవేదీ గుణాంశాత్ ।**
**త్వత్సేవాద్యాశు సిద్ధ్యేదసదిహ న తథా త్వత్పరే చైషభీరుః**
**యత్తు ప్రాగేవ రోగాదిభిరపహరతే తత్ర హా శిక్షయైనమ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రాక్= పూర్వము, పరీక్షిత్ = పరీక్షిత్తు అను పేరుగల (పరితః ఈక్షతే ప్రజానాం సుఖదుఃఖాదికం పశ్యతి ప్రజల సుఖదుఃఖములను తెలుసుకొనువాడు. పరీక్షిన్మహారాజు), మహీక్షిత్ =ఒకరాజు(మహీం క్షియం ఈష్టే పృథివిని పాలించువాడు. రాజు), అపకరుణం= దయారహితుడు, ధర్మద్రుహం= ధర్మద్రోహియు అగు (ధ్రియతే పుణ్యాత్మభిః దీనిని పుణ్యాత్ములు ధరింతురు. శుభకర్మ ధర్మము)(జిఘాంసా అనిష్టచింతనే చ ద్రుహ్యతి చంపుట చెడును ఆలోచించుట ద్రోహము చేయుట), తం కలిమ్ = ఆ కలిని (కలయతి పాపేన కలుషితం కరోతి పాపంతో కలుషితం చేయునది. కలి), దృష్ట్వా= చూసి, హంతుం= చంపుటకు, వ్యాకృష్ట ఖడ్గః అపి= కత్తి దూసియు, సారవేదీ = సారజ్ఞుడు కావున, గుణ అంశాత్ = వానిలో నీ గుణము కనిపెట్టి, న వినిహతవాన్ = సంహరింపలేదు, త్వత్ సేవా ఆది = నీ సేవలో భాగమయిన అర్చన కీర్తనాదులు చేసినచో, ఇహ= ఇక్కడ (ఈ జన్మలో), ఆశు=శీఘ్రముగా, సిద్ధ్యేత్= ఫలించును, అసత్ = పాపము (న సత్ సత్తు కానిది. శ్రద్ధ లేకుండా చేయు అగ్నిహోత్రాదులు), న తథా= ఈ కలికాలములో అట్లు ఫలమును ఇవ్వదు, త్వత్ పరే చ = నీ భక్తుడన్నచో, ఏషభీరుః= ఈ కలికి భయము ఎక్కువ. (బిభేతుం శీలం అస్య భయపడు స్వభావం కలవాడు. పిరికివాడు, భయపెట్టువాడు), యత్ తు= అందువలననే, ప్రాక్ ఏవ = నీ సేవకు పూనుకొనుటకు ముందే, రోగ ఆదిభిః=నీ భక్తులకు రోగాదులు కల్పించి (రుజతి రుజ్యతే వా అనేన పీడించునది, దీనితో పీడింపబడుదురు. వ్యాధి), అపహరతే=

భక్తుని నీ భజననుండి పక్కకు తొలగించును, తత్ర = ఆ అనారోగ్యావస్థలో, హా= అయ్యో!, ఏనమ్= ఈ దుష్టుని(కలిని), శిక్షయ= దండించుము.

**తాత్పర్యము:** పూర్వము పరీక్షిత్తు అను పేరుగల ఒకరాజు – దయారహితుడు ధర్మద్రోహియు అగు ఆ కలిని చూసి చంపుటకు కత్తి దూసియు సారజ్ఞుడు కావున (ఆ 'కలి' వలన కొంతమేలుకూడా జరుగునని ఎరిగినవాడగుటచేత) వానిలో నీ గుణము కనిపెట్టి సంహరింపలేదు. నీ సేవలో భాగమయిన అర్చన కీర్తనాదులు చేసినచో ఇక్కడ (ఈ కలియుగములో)శీఘ్రముగా ఫలించును . కాని పాపము ఈ కలికాలములో అట్లు ఫలమును ఇవ్వదు. నీ భక్తుడన్నచో ఈ కలికి భయము ఎక్కువ. అందువలననే నీ సేవకు పూనుకొనుటకు ముందే నీ భక్తులకు రోగాదులు కల్పించి భక్తుని నీ భజననుండి పక్కకు తొలగించును.( విఘ్నములు కలిగించును) ఆ అనారోగ్యావస్థలో ఈ దుష్టుని(కలిని) దండించుము.( ఈ దుష్టుని దండించి నీ సేవాభాగ్యము నాకు అనుగ్రహిస్తే కలి తనంతటతానే దూరముగ తొలగిపోవునని కవి భావం)

**విశేషాలు**

**పరీక్షిత్తు:** అభిమన్యుని కొడుకు. తల్లి ఉత్తర. కొడుకు జనమేజయుడు. ఇతడు ఒకనాడు వేటాడ పోయి ఒక వనము నందు తన యేటు తప్పించుకొని పాఱిపోయిన మృగమును వెదకుచు, మౌనవ్రతమును ధరించి తపస్సుచేయుచు ఉండిన శమీకుడు అను ఋషిని కని, మృగము ఎటుపోయెను అని అడిగి అతఁడు ఉత్తరము చెప్పకపోగా, తన్ను అతడు లక్ష్యముచేసి మాటలాడకపోయెను అని ఎంచి ఒకమృతసర్పకళేబరమును అతనికంఠమునందు మాలగా వైచి తన పురమునకు వచ్చి చేరెను.

అంతట అతని కొడుకు అగు శృంగి తన తండ్రిమెడను రాజు చచ్చినపామును వైచిపోయెను అను మాట విని అది మొదలు ఏడు దినములలోపల ఇతడు తక్షక నాగముచే కఱవబడి చచ్చుఁగాక అని శపించెను. ఆవృత్తాంతము ఇతడు విని విరక్తుఁడై శుకమహర్షివలన భాగవతమును విని ఆయేడవనాడు తక్షకుడు వచ్చి కఱవఁగా మృతుడై ముక్తిని పొందెను. పిదప ఇతని కొడుకు అగు జనమేజయుడు

రాజ్యముచేయుకాలమున ఉదంకుడు అను ఋషి (తాను గురుకార్యార్థము పోవునపుడు తనకు అపరాధముచేసిన రక్షకునియందలి విరోధముచేత) జనమేజయుని వద్దకు పోయి మీ తండ్రి అగు పరీక్షిత్తును తక్షకుడు కఱచి చంపెను కనుక అట్టిదుష్టుని సపరివారముగ నాశనముచేయుట ఉత్తమము లని చెప్పి అతనికి సర్పయాగము చేయ బుద్ధిని పుట్టించెను.

అట్లు ఉదంకునిచే ప్రేరేపింపబడి జనమేజయునిచే చేయబడిన సర్పయాగము వాసుకి చెలియలు అగు జరత్కారు కొడుకు అస్తీకునిచే నివారింపబడెను. అనంతరము జనమేజయుడు వ్యాసుని అనుమతిని భారతకథను వైశంపాయనునిచే వినెను.

**92-9 శ్లో.**

**గంగా గీతా చ గాయత్ర్యపి చ తులసికా గోపికాచందనం తత్**
**సాలగ్రామాభిపూజా పరపురుష! తథైకాదశీ నామవర్ణాః ।**
**ఏతాన్యష్టాప్యయత్నాన్యయి కలిసమయే త్వత్ప్రసాదప్రవృద్ధ్యా**
**క్షిప్రం ముక్తిప్రదానీత్యభిదధుర్ఋషయస్తేషు మాం సజ్జయేథాః ॥**

**ప్రతిపదార్థము:** పరపురుష=ఓ గురువాయూరు కృష్ణదేవా! (పరః శ్రేష్ఠః పురుషః శ్రేష్ఠమైన పురుషుడు. విష్ణువు), గంగా= గంగాస్నానము(గమయతి ప్రాపయతి ఉత్తమాం గతిం ఉత్తమాం లోకాన్ వా ఉత్తమగతిని, ఉత్తమ లోకమును చేర్చునది), గీతా చ= భగవద్గీత పారాయణము, (గీయతే అసౌ పాడబడునది.)(గీయతే ఆత్మవిద్యోపదేశాత్మికా బ్రహ్మతత్త్వోపదేశమయీ కథా యత్ర ఆత్మవిద్యను, బ్రహ్మవిద్యను ఉపదేశించు గ్రంథము. భగవద్గీతాదులు), గాయత్రీ అపి= గాయత్రీమంత్ర జపము(గాయంతం త్రాయతే పాడువానిని రక్షించునది జపించువానిని రక్షించునది), తులసికా చ = తులసీపూజ (తులాం స్వసమానత్వం అస్యతి తన సమానత్వము అంగీకరించనిది. బహుగుణములు కల తులసి చెట్టు.) (విష్ణువు ఇష్టపడే పవిత్రమైన పత్రి. ఇందులో ఉండే అనేక ఓషధీ లక్షణాలు వెనుకటి తరాలు తులసి మొక్కను ప్రతి పెరటిలోనూ పెంచేలా చేశాయి), తత్ గోపికాచందనం=ఆ గోపీచందన ధారణ (తిలకానికి ఉపయోగించే ఒక సుద్ద

మన్ను), సాలగ్రామ అభిపూజా= సాలగ్రామార్చనము (విష్ణుమూర్తిచిహ్నిత శిల), తథా= అట్లే, ఏకాదశీ = ఏకాదశి ఉపవాసము(ఏకాదశానాం పూరణీ పదకొండవ తిథి. శుక్ల–కృష్ణ పక్ష ఏకాదశి), నామవర్ణాః = నీ నామ సంకీర్తనము, ఏతాని అష్ట అపి = ఈ ఎనిమిది సాధనములు, అయత్నాని = అతిసులభంగా, కలి సమయే= ఈ కలియుగమున, త్వత్ ప్రసాద = నీ అనుగ్రహపు, ప్రవృద్ధ్యా= ప్రవృద్ధి కలిగించి, క్షిప్రం = వెంటనే (క్షిప్రం శీఘ్రమ్ తొందర వేగము త్వరితగతి), ముక్తి ప్రదానీ = మోక్షమును ప్రసాదించగలవు(శరీరేంద్రియాభ్యాం ఆత్మనః ముక్తత్వమ్ శరీరేంద్రియముల నుండి ఆత్మ ముక్తి నొందుట. ముక్తి), ఇతి = అని, ఋషయః = ఋషులు(ఋషతి గచ్ఛతి ప్రాప్నోతి మంత్రాన్ ఋషిర్వేద =వేదము మంత్రములను దర్శించినవాడు. ఋషి (అగ్ని–వాయువు–ఆదిత్య–అంగిరసులు), అభిదధుః= చెప్పారు, అయి= ఓ దేవా!, తేషు = ఈ ఎనిమిది అంశములలో (గంగాస్నానము మొదలయినవి), మాం= నాకు, సజ్జయేథాః= ఆసక్తి కలుగునట్లు చేయుము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! గంగాస్నానము ,భగవద్గీత పారాయణము, గాయత్రీమంత్ర జపము , తులసీపూజ గోపీచందన ధారణ ,సాలగ్రామార్చనము ఏకాదశి ఉపవాసము, నీ నామ సంకీర్తనము ఈ ఎనిమిది సాధనములు అచరిస్తే ఈ కలియుగమున నీ అనుగ్రహము వెంటనే కలిగి మోక్షమును ప్రసాదించగలవు అని ఋషులు చెప్పారు. ఓ దేవా ! ఈ ఎనిమిది అంశములలో నాకు ఆసక్తి కలుగునట్లు చేయుము.

**విశేషాలు**

**సాల గ్రామము:** సాక్షాత్తు విష్ణుమూర్తిగా కొందరు ఆరాధించే శిల. గండకీ నదిలో ఈ శిలలు లభిస్తాయి. (బీహార్ ఉత్తర భాగం నుంచి గాని, నేపాల్‌లో గాని సాలగ్రామాలు లభిస్తాయి.) చక్రం, శంఖం, బాణం మొదలైన గుర్తులు ఈ శిలలపై ముద్రితమై ఉంటాయి. కొన్ని శిలలకు రంధ్రాలు ఉంటాయి. సాధారణంగా నల్లగా ఉండే సాలగ్రామ శిలలు పూజార్హమైనవని బ్రహ్మవైవర్తపురాణం తెలియ జేస్తున్నది. శిలలకు ఉండే గుర్తులని బట్టి, సాలగ్రామాలను కొందరు వర్గీకరిస్తారు. పూజింపతగిన విష్ణుమూర్తి రూపకశిల. ఇది వేణుగోపాలమూర్తి, ఉగ్ర

నారసింహమూర్తి, లక్ష్మీనృసింహమూర్తి, రామమూర్తి, త్రివిక్రమమూర్తి, సుదర్శనమూర్తి అని బహురూపములుగ ఉండును. ఈసాలగ్రామములు స్థలజన్యములు, జలజన్యములు అని ద్వివిధములు. వీనికి ముఖ్యములగు ఉత్పత్తి స్థానములు హిమవత్పర్వత సమీపమున ద్వాదశయోజనాంతర్గత భూమియు, సాలగ్రామాదితీర్థములును అగును.

**ముక్తులు:** జనన మరణ బంధ విమోచనం ముక్తి. అవిద్య నశించడం ముక్తి. ఇలాంటి ముక్తులు నాలుగు విధాలని కొందరు, ఐదు విధాలని కొందరు అంటారు. ఐదు విధాల ముక్తులివి : 1. సార్ష్టి (అంటే సృష్టించే శక్తి, సమానాధికారం కలది అనే అర్థాలు ఉన్నాయి), 2. సాలోక్యం, 3. సామీప్యం, 4. సారూప్యం, 5. సాయుజ్యం. నాలుగు విధాలనే వారు 'సార్ష్టి'ని ఇందులో చేర్చరు. సార్ష్టి, సాయుజ్యం ఒకటే అని శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటువివరణ.

**92-10 శ్లో.**

**దేవర్షీణాం పితౄణామపి న పునరృణీ కింకరో వాసభూమన్।**
**యోఽసౌ సర్వాత్మనా త్వాం శరణముపగతస్సర్వకృత్యాని హిత్వా ।**
**తస్యోత్పన్నం వికర్మాఽప్యఖిలమపనుదస్యేవ చిత్తస్థితస్త్వం**
**తన్మే పాపోత్థతాపాన్ పవనపురపతే! రుంధి భక్తిం ప్రణీయాః ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= ప్రభూ! సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా! (పూర్ణస్వరూపా!), యః = ఏ పురుషుడు, సర్వాత్మనా= అన్ని విధములుగా, త్వాం = నిన్నే, శరణమ్= శరణు, ఉపగతః = పొందిన వాడు (ఉప సమీపం గతః సమ్యక్ గతః జ్ఞాత దగ్గరకు వెళ్ళినది చక్కగా తెలుసుకున్నది స్వీకారము), అసౌ సర్వ కృత్యాని= అన్ని సాంసారిక విషయములందు ఆసక్తిని, హిత్వా = విడిచి పెట్టును, సః =అతడు, దేవర్షీణాం = యజ్ఞములు చేసి దేవఋణమును, పితౄణామ్ అపి= పుత్రుని పొంది పి తౄణమును తీర్చి, పునః= మరలా ఎప్పుడూ, ఋణీ వా= ఋణిగా (ఋణగ్రస్తునిగా), కింకరః న = సేవకునిగా కాదు. (ఆదిష్టమేవ కరోతి నాధికమ్ చెప్పిన పని మాత్రం చేయువాడు), త్వం= నువ్వు, చిత్త స్థితః= వాని హృదయములో ఎల్లప్పుడు నివసించి, తస్య = పూర్వ జన్మ

సంస్కారముల ప్రభావమున ఎప్పుడైనా అతని వలన, ఉత్పన్నం = నెల కొన్న(ఉత్పన్నః జాతోత్పత్తిః ఉద్భూతః పుట్టిన), అఖిలమ్= సమస్త, వికర్మ అపి= వికర్మలను (నిషిద్ధ కర్మలను లేదా విపరీత కర్మలను) (విరుద్ధం కర్మ యస్య విరుద్ధంగా ఆచరించువాడు), అపనుదసి ఏవ= రూపుమాపెదవు, పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణదేవా!, తత్ = కావున, మే= నా యొక్క, పాప= పాపముల వలన(పాతి రక్షతి ఆత్మానం అస్మాత్ దీనినుండి రక్షించుకొందురు. పాపము), ఉత్థ =ఏర్పడిన, తాపాన్ = బాధలను, రుంధి= తొలగించి, భక్తిం= నీయందు భక్తిని, ప్రణీయాః= పెంపొందించుము.

**తాత్పర్యము:** ప్రభూ! ఏ పురుషుడు అన్ని విధములుగా నిన్నే శరణు పొందిన వాడు అన్ని సాంసారిక విషయములందు ఆసక్తిని విడిచి పెట్టును. అతడు యజ్ఞములు చేసి దేవఋణమును , పుత్రుని పొంది పి తౄణమును తీర్చి మరలా ఎప్పుడూ ఋణిగా సేవకునిగా కాడు. నువ్వు అటువంటివాని భక్తుని హృదయములో ఎల్లప్పుడు నివసించి , పూర్వ జన్మ సంస్కారముల ప్రభావముచే – ఎప్పుడైనా అతని వలన నెల కన్న సమస్త నిషిద్ధకర్మలను రూపుమాపెదవు. ఓ గురువాయూరు కృష్ణదేవా ! కావున నా యొక్క పాపముల వలన ఏర్పడిన బాధలను తొలగించి నీయందు భక్తిని పెంపొందించుము.

***ఏకాదశ స్కంధము***

**92వ దశకము సమాప్తము**

## దశకమ్ 93 – పఞ్చవింశతి గురువులు

**93-1 శ్లో.**

**బంధుస్నేహం విజహ్యాం తవ హి కరుణయా త్వయ్యుపావేశితాత్మా**
**సర్వం త్యక్త్వా చరేయం సకలమపి జగద్వీక్ష్య మాయావిలాసమ్ ।**
**నానాత్వాత్ భ్రాంతిజన్యాత్ సతి ఖలు గుణదోషావబోధే విధిర్వా**
**వ్యాసేధో వా కథం తౌ త్వయి నిహితమతేర్వీతవైషమ్యబుద్ధేః ॥**

**ప్రతిపదార్థం:** తవ = నీయొక్క, కరుణయా హి = కరుణతో(కరోతి మనః ఆనుకూల్యాయ–మనసును అనుకూలపరచును), ఆత్మా= నా బుద్ధి, త్వయి = నీయందు, ఉపావేశిత= విలీనమయి ఉన్నది, సకలమ్ అపి జగత్= అందువలన ఈ జగత్తు, మాయా విలాసమ్= నీ మాయా కల్పితమని, వీక్ష్య= తెలుసుకొని, బంధు= పుత్ర, మిత్ర, కళత్రాదుల యందు(బధ్నాతి మనః స్నేహాదినా స్నేహాదులచే మనస్సును బంధించువాడు), స్నేహం = ప్రీతిని (స్నిహ్యతి తస్య భావః కర్మ వా స్నేహము నూనె), విజహ్యాం= విడిచెదను, సర్వం =విధినిషేధాత్మకమైన సర్వ కర్మలను, త్యక్త్వా= విడిచి, చరేయం= స్వేచ్ఛగా చరించెదను, నానాత్వాత్= వర్ణాశ్రమాది భేదములు, అవబోధే గుణదోష సతి = అవబోధమగు గుణదోషధోరణులు (అవబుధ్యతే తస్య భావః – మేలుకొనుట), విధిః వా వ్యాసేధః వా= విధి నిషేధములు కాని(విదధాతి విశ్వమ్ నియమము), భ్రాంతిజన్యాత్ ఖలు = నేను మనుష్యుడను అను దేహాభిమానముచే పుట్టును, త్వయి నిహితమతేః = నీయందు బుద్ధి నిలిపిన వానికి, వీతవైషమ్యబుద్ధేః=వైషమ్యబుద్ధి లేనివానికి ( గతః– వెళ్లిపోయిన వానికి), తౌ= భ్రాంతి జన్యములైన భేద భావములు, కథం = ఎలా వర్తిస్తాయి?

**తాత్పర్యము:** నీయొక్క కరుణతో నా బుద్ధి నీయందు విలీనమయి ఉన్నది. అందువలన ఈ జగత్తు నీ మాయా కల్పితమని తెలుసుకొని పుత్ర, మిత్ర, కళత్రాదుల యందు ప్రీతిని విడిచెదను. విధినిషేధాత్మకమైన సర్వ కర్మలను విడిచి స్వేచ్ఛగా చరించెదను. వర్ణాశ్రమాది భేదములు, గుణదోషధోరణులు, విధి నిషేధములు నేను మనుష్యుడను అను దేహాభిమానముచే పుట్టును. నీయందు బుద్ధి నిలిపిన వానికి

వైషమ్యబుద్ధి భ్రాంతి జన్యములైన భేద భావములు ఎలా వర్తిస్తాయి? (భేద భావములు వర్తించవని,విధినిషేధములకు అతీతుడైనవాడు జ్ఞానముతో కలిసిన భక్తికి అధికారి అని తాత్పర్యము)

**93-2 శ్లో.**

**క్షుత్తృష్ణాలోపమాత్రే సతతకృతధియో జంతవస్సంత్యనంతాః**
**తేభ్యో విజ్ఞానవత్త్వాత్ పురుష ఇహ వరస్తజ్జనిర్దుర్లభైవ ।**
**తత్రాప్యాత్మాత్మనః స్యాత్ సుహృదపి చ రిపుర్య స్త్వయి న్యస్తచేతాః**
**తాపోచ్ఛిత్తేరుపాయం స్మరతి స హి సుహృత్ స్వాత్మవైరీ తతోఽన్యః ॥**

**ప్రతిపదార్థము:** క్షుత్ తృష్ణాలోపమాత్రే = ఆకలి దప్పికలను తీర్చుకొనుటకు (క్షుద్యతి క్షుదితో భవతి అనయా దీనితో ఆకలి గొనును. ఆకలి.)(తృష్యతి ఆకాంక్షతి తస్య భావః-కోరిక దప్పిక ఒక రోగము), సతతం కృతధియః =ఎప్పటికప్పుడు నిశ్చయ బుద్ధులై గడ్డి , నీరు మొదలగువానిచే పోగొట్టుకొను, జంతవః= జంతువులు (జన్యతే శరీరాది ధారణేన ప్రాదుర్భవతి శరీరాదులు ధరించి పుట్టునది. జీవుడు ప్రాణి), అనంతాః సంతి= ఎన్నోకలవు, తేభ్యః = వాటిలో(ఆ జంతువులలో), విజ్ఞానవత్త్వాత్ = విజ్ఞానసంపద అనగా ఆత్మదర్శన సామర్థ్యం కలవాడగుటచే (విశిష్టం జ్ఞానమ్ విశిష్ట జ్ఞానము), ఇహ = ఇక్కడ(భూమిలో), పురుషః=విజ్ఞాన వంతుడైన మనుష్యుడు, వరః= ఉత్తముడగును, తత్ జనిః = అట్టి మనుష్య జన్మ (జాయతే తస్య భావః కర్మ వా ఉత్పత్తి. పుట్టుక), దుర్లభా ఏవ= దుర్లభము, తత్ర అపి =ఈ మానవ జన్మయందు, ఆత్మా= ఆత్మయే(తనకుతానే), ఆత్మనః = ఆత్మకు, సుహృత్ అపి= మిత్రుడు, రిపుః చ స్యాత్ = శత్రువు కూడా అగును, యః = ఎవడు, త్వయి న్యస్తచేతాః = . నీయందు మనసు పెట్టి, తాప ఉచ్ఛిత్తేః= తాపశాంతికి(అనగా మోక్షమునకు)(ఉచ్ఛిత్తిః ఉచ్ఛేదః వినాశఃఉచ్ఛేదము. పీకి పారవేయుట వినాశము), ఉపాయం = ఉపాయమును(ఉప ఈయతే గమ్యతే ప్రాప్యతే అనేన వాంఛితమ్), స్మరతి = స్మరించునో, సః హి = అతడు, సుహృత్ = అట్టివాడు తనకుతానే(ఆత్మకు) బంధువగును (సుష్ఠు హృదయం యస్యః - మంచి హృదయం గలవాడు. స్నేహితుడు), తతః అన్యః = కానివాడు, స్వ ఆత్మవైరీ = తనకుతానే శత్రువు.

**తాత్పర్యము:** ఆకలి దప్పికలను తీర్చుకొనుటకు ఎప్పటికప్పుడు నిశ్చయ బుద్ధులై గడ్డి, నీరు మొదలగువానిచే పోగొట్టుకొను జంతువులు ఎన్నోకలవు. వాటిలో(ఆ జంతువులలో) విజ్ఞానసంపద అనగా ఆత్మదర్శన సామర్థ్యం కలవాడగుటచే భూమిలో =విజ్ఞాన వంతుడైన మనుష్యుడు ఉత్తముడగును. అట్టి మనుష్య జన్మ దుర్లభము. ఈ మానవ జన్మయందు ఆత్మయే(తనకుతానే) ఆత్మకు మిత్రుడు, శత్రువు కూడా అగును. ఎవడు నీయందు మనసు పెట్టి తాపశాంతికి(అనగా మోక్షమునకుఉపాయమును స్మరించునో అతడు అట్టివాడు తనకుతానే(ఆత్మకు) బంధువగును కానివాడు తనకుతానే శత్రువు.

**93-3 శ్లో.**

**త్వత్కారుణ్యే ప్రవృత్తే క ఇవ న హి గురుర్లోకవృత్తేఽపి భూమన్!**
**సర్వాక్రాంతాపి భూమిర్న హి చలతి తతః సత్ క్షమాం శిక్షయేయమ్ ।**
**గృహ్ణీయామీశ! తత్తద్విషయపరిచయేఽప్యప్రసక్తిం సమీరాత్**
**వ్యాప్తత్వం చాత్మనో మే గగనగురువశాద్భాతు నిర్లేపతా చ ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఈశా!, భూమన్= సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా! ( పూర్ణస్వరూపా!), త్వత్ కారుణ్యే ప్రవృత్తే= నీ కరుణ లభించిన యెడల, లోకవృత్తే అపి = ఈ లోకవ్యవహారములో (లోకస్య వృత్తం వ్యవహారః- లోక వ్యవహారము), కః ఇవ న హి గురుః = గురువులు కాని వారు ఎవరు? (కేవలము ఆత్మయే కాక అందరూ గురువులే అని భావం), సర్వ ఆక్రాంతా అపి = సర్వభూతముల బరువును పొంది కూడా (దుష్టులచే ఆక్రమింపబడినప్పటికి) (ఆక్రాంతః శత్రుణా అభిగతః శత్రువుచేత దాడి చేయబడినవాడు), న చలతి హి = ఏ మాత్రము చలింపని, భూమిః = భూమి నాకు గురువు. (భవంతి అస్మిన్ భూతాని దీనియందు ప్రాణులు వుందురు. భూమి), తతః = అట్టి భూమినుండి, సత్ క్షమాం= స్వమార్గము నుండి చలింపని క్షమా గుణములను (క్షమతే సహతే అన్యేషాం అపరాధమ్ ఇతరుల అపరాధమును క్షమించునది. ఓర్పు), శిక్షయేయమ్= కర్తవ్యముగా నేర్చుకొందును, తత్ తత్ విషయపరిచయే అపి= ఇతర విషయముల పరిచయము ఉన్నప్పటికి (అనగా గుణదోషముల పరిచయము

ఉన్నప్పటికి), అప్రసక్తిం = అనాసక్తిగా ఉండుటను, సమీరాత్= వాయువునుండి (సమ్యక్ ఈర్తే ప్రవహతి బాగుగా ప్రవహించునది. వాయువు), గృహ్ణీయామ్= గ్రహిస్తాను, ఆత్మనః తు= ఆత్మ శరీర పరిచ్ఛిన్నమయ్యు (హద్దు చేయబడినది అయినప్పటికి), వ్యాప్తత్వం చ= సర్వ శరీర బహిరంతర్వ్యాప్తము, శరీరస్థమయ్యు(విశేషేణ ఆప్నోతి సర్వత్ర-సర్వత్ర వ్యాపించునది), నిర్లేపతా చ= గుణదోషములు అంటకుండుటను (నిర్గతః లేపః లేపనం ఆసక్తిర్వా యస్మాత్ పూత పోయినది ఆసక్తి లేనివాడు), గగనగురువశాత్= ఆకాశపు గురువు వలన, మే భాతు = నేను నేర్చుకొందును.

**తాత్పర్యము:** ఈశా! సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా !( పూర్ణస్వరూపా! ) నీ కరుణ లభించిన యెడల ఈ లోక వ్యవహారములోఅందరూ గురువులే . దుష్టులచే ఆక్రమింపబడినప్పటికి ఏ మాత్రము చలింపని భూమి నాకు గురువు. భూమినుండి స్వమార్గము నుండి చలింపని క్షమా గుణములను కర్తవ్యముగా నేర్చుకొందును. గుణదోష ముల పరిచయము ఉన్నప్పటికి అనాసక్తిగా ఉండుటను వాయువునుండి గ్రహిస్తాను. అంతటా వ్యాపించిన ఆకాశము సూక్ష్మమయినది. దానికి ఇతర భూతముల గుణ దోషములు అంటవు. అలాగే ప్రాణుల దేహములలో ఉన్నప్పటికి ఆ త్మ నిర్గుణము కనుక వాటి గుణదోషాలు అంటవు.కనుక ఆత్మ రూపంలో ఆకాశమునుంచి సర్వ వ్యాపకత్వాన్ని , నిర్లిప్తతను నేర్చుకొంటాను.

**విశేషాలు:** ఆత్మయే ఆత్మకు బంధువు గురువు అని క్రితం శ్లోకంలో చెప్పబడినది. అజ్ఞాననాశమునకు గురువు అవసరమని శాస్త్రములు చెబుతున్నాయి. అలాంటప్పుడు తనకు తానే గురువు బంధువు అని ఎలా కుదురుతుంది? అను ప్రశ్నకు జవాబు ఈ శ్లోకము.

**93-4 శ్లో.**

**స్వచ్ఛః స్యాం పావనోఽహం మధుర ఉదకవత్ వహ్నివన్మా స్మ గృహ్ణం**
**సర్వాన్నీనోఽపి దోషం తరుషు తమివ మాం సర్వభూతేష్వవేయామ్ ।**

**పుష్టిర్నష్టిః కలానాం శశిన ఇవ తనోర్నాత్మనోఽస్తీతి విద్యాం**
**తోయాదివ్యస్త మార్తాండవదపి చ తనుష్వేకతాం త్వత్ప్రసాదాత్ ॥**

**ప్రతిపదార్థము:** అహం = నేను, ఉదకవత్= ఉదకమట్లు, స్వచ్ఛః = నిర్మలుడను (సుష్ఠు అచ్ఛం శుభ్రమ్ చాలా మంచిది స్వచ్ఛమైనది నిర్మలమైనది), పావనః = పవిత్రుడను (పావయతి పవిత్రీకరోతి పవిత్రము చేయునది పవిత్రము అగ్ని గోమయము), మధురః స్యాం= మధురుడను (మధురభాషిగా) ఉందును.( మధు మాధుర్యం రాతి దదాతి మాధుర్యము నిచ్చునది. చెరుకు మొదలగునవి), సర్వాన్నీనః అపి= సర్వభక్షకుడయినప్పటికి (సర్వేషాం అన్నం సర్వప్రకారకం అన్నం భుంక్తే అందరి అన్నమును తినువాడు అన్ని రకముల అన్నము తినువాడు), వహ్నివత్ = అగ్ని వలె నేను(వహతి ప్రాపయతి హవ్యం దేవేభ్యః–దేవతలకు హవిస్సును అందింపచేయునది. అగ్ని), దోషం మా స్మ గృహ్ణాం = దోషమును లేనివాడ నయ్యేదను (దూష్యతే దూషించునది. దోషము తప్పు), తరుషు= చెట్లు వేరుగా ఉన్ననూ(తరంతి ఛాయాపుష్పఫలార్థినః అనేన–దీని నీడ, పుష్ప, ఫలాదులు కోరినవారు తరింతురు. వృక్షము), తమ్ ఇవ= అన్నిటియందు ఆ ఒకే అగ్ని ఉన్నట్లు, మాం= నేను కూడా ఆత్మ రూపములో, సర్వభూతేషు= అన్ని ప్రాణులలో(సుర నరతిర్యగాదులలో), అవేయామ్ = ఉన్నట్లుగా భావింతును, శశినః = చంద్రుని యొక్క (శశః అస్తి అస్య–కుందేలు కలవాడు. చంద్రుడు), కలానాం = కళలకు (కలతే శోభతే అసౌ ప్రకాశించునది. చంద్రకళ), పుష్టిః నష్టిః ఇవ= వృద్ధి నాశములు(పెరుగుట, తరుగుట) (పుష్యతి తస్య భావః కర్మ వా పోషణము వృద్ధి), తనోః = ఈ శరీరమునకే కాని, ఆత్మనః = ఆత్మకు, న అస్తి ఇతి= కాదని తెలుసుకొన్నాను, తోయాదివ్యస్త= నీటి అలలలో అనేకముగా(తవతే వర్ధయతే వృద్ధిం గచ్ఛతి వా దీనిని నింపుదురు. నీరు)(వివిధం అస్తః ఇటు అటు పారవేయబడినది విభజింపబడ్డది ఒకటి సమాసము లేని పదము అనేక విధములైనవి), మార్తాండవత్ అపి= కనిపించు సూర్యుని వలె (మృతమివ (అంధకారేణ) అండం బ్రహ్మాండం జీవయతి అంధకారము వలన నిద్రపోయిన బ్రహ్మాండాన్ని చైతన్యవంతం చేయువాడు. సూర్యుడు), తనుషు= సర్వశరీరములందు (తనోతి తన్యతే వా విస్తరించునది పెరుగునది. శరీరము),

ఏకతాం చ = ఆత్మ ఒకటే అని, త్వత్ ప్రసాదాత్= నీ అనుగ్రహమువలన(ప్రసీదతి ప్రసన్నో భవతి తస్య భావః కర్మ వా ప్రసన్నత నిర్మలత్వము కావ్యగుణము కృప అనుగ్రహము), విద్యాం = తెలిసికొందును.

**తాత్పర్యము:** నేను ఉదకమట్లు నిర్మలుడను పవిత్రుడను మధురభాషిగా ఉందును. సర్వభక్షకుడయినప్పటికి అగ్ని వలె నేను దోషమును లేనివాడ నయ్యెదను (దేహ పోషణకు తినుచున్న అన్ని ఆహార పదార్థములలో గుణ దోషములను పట్టించుకొనక తినెదనని భావం) చెట్లు వేరుగా ఉన్ననూ అన్నిటియందు ఆ ఒకే అగ్ని ఉన్నట్లు నేను కూడా ఆత్మ రూపములో అన్ని ప్రాణులలో ఉన్నట్లుగా భావింతును. చంద్రుని యొక్క కళలకు వృద్ధి నాశములవలె పెరుగుట, తరుగుట ఈ శరీరమునకే కాని ఆత్మకు కాదని తెలుసుకొన్నాను. నీటి అలలలో అనేకముగా కనిపించు సూర్యుని వలె సర్వశరీరములందు ఆత్మ ఒకటే అని నీ అనుగ్రహమువలన తెలిసికొందును.

**విశేషాలు**

**అహమ్/అహంకార:** అహమంటే నేను అని శబ్దార్థం. అలా భావించటమే అహంకారం. నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించగలిగితే ఇది ఆత్మస్వరూపమే. అలాకాక సోపాధికమైతే ఇదే అనాత్మలాగా మారిపోతుంది. కర్తృరూపమైనది అహంకారమైతే సాక్షిరూపమైన చైతన్యమాత్మ. అహంకారానికే కర్తాత్మ అని పేరుపెట్టారు వేదాంతులు. ఇది చిదాభాసుడే గాని కేవల చిద్రూపం కాదు. అంటే జీవుడని అర్థం. ఇలాంటి జీవుడే అసలైన ఆత్మ అని భ్రమించారు పూర్వమీమాంసకులు.

**అహంబ్రహ్మాస్మి:** ఇది నాలుగు మహావాక్యాలలో చివరిది. తత్త్వమసి ఉపదేశ వాక్యమైతే ఇది అనుభవ వాక్యం. ఈ జీవుడే బ్రహ్మమని దీని అర్థం. జీవుడు బ్రహ్మమైతే బ్రహ్మానికున్న పరిపూర్ణత వీడి కేర్పడుతుంది. అలాగే మరలా బ్రహ్మ అహమస్మి అని అర్థం చెప్పుకోవలసి ఉంది. దీనికి వ్యతిహారమని పేరు. అలా చెప్పుకుంటే జీవునికున్న అపరోక్షత్వం బ్రహ్మానికి సంక్రమిస్తుంది. అప్పుడు పరిపూర్ణ అపరోక్ష బ్రహ్మాత్మానుభవం ఏర్పడుతుంది సాధకుడికి.

**93-5 శ్లో.**

**స్నేహాద్వ్యాధా స్త పుత్రప్రణయమృతకపోతాయితో మా స్మ భూవం**
**ప్రాప్తం ప్రాశ్నన్ సహేయ క్షుధమపి శయువత్ సింధువత్ స్యామగాధః ।**
**మా పప్తం యోషిదాదౌ శిఖిని శలభవద్భృంగవత్ సారభాగీ**
**భూయాసం కిం తు తద్వద్ధనచయన వశాన్మాహమీశ! ప్రణేశమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ఓ ప్రభూ!, స్నేహాత్= స్నేహము వలన, వ్యాధ= బోయవాని వలలో (విధ్యతి మృగాదీన్ మృగములను చంపువాడు. వ్యాధుడు, బోయవాడు), ఆస్త = చిక్కుకొన్న, పుత్ర ప్రణయ= పుత్ర కళత్ర వ్యామోహమునకు వశమై, మృత= చనిపోయిన, కపోత ఆయితః= పావురము వలె, మా స్మ భూవం= నేను భంగపాటు చెందను, శయు వత్= ఆకలిగొన్న కొండచిలువవలె (శేతే అసౌ పడుకొనువాడు. పెనుబాము), ప్రాప్తం= దొరికినదానిని మాత్రమే, ప్రాశ్నన్ = తినుచు, క్షుధమ్ సహేయ= ఆకలిని నిగ్రహింతునుగాక(తృప్తి చెందుదును)( క్షుధ ఏవ క్షుధా భోజనేచ్ఛా ఆకలి. భోజనేచ్ఛ), అపి= మరియు, సింధు వత్= సముద్రము వలె, అగాధః స్యామ్= అగాధముగా ఉందును(గంభీరుడనై తొణకకుండెదనుగాక !) (నాస్తి గాధః స్థితిః అత్ర–తలము లేనిది. అగాధమైనది. మిక్కిలి లోతు గలది), శిఖిని = అగ్నికాంతులకు(శిఖా అస్తి అస్య–శిఖ కలవాడు(ది). నెమలి అగ్ని), శలభవత్= ఆకర్షితమయిన మిడుత వలె (శలతి ఇతస్తతో గచ్ఛతి ఇటునటు వెళ్లునది. మిడత), యోషిత్ ఆదౌ= స్త్రీ మొదలైన భోగ్య వస్తువులపై(యోషతి పుమాంసం యుష్యతే పుంభిః–సంతోషపెట్టునది, పురుషులచే ప్రేమింపబడునది. స్త్రీ), మా పప్తం = మోహమున చిక్కుకొనను, సార భాగీ = అనేక పూలలో సారము తాగు(సరతి గచ్ఛతి వెళ్లునది సారము ఉత్కర్షము బలము), భృంగ వత్ = తుమ్మెదవలె (బిభర్తి పుష్పానురాగమ్ పుష్పములయందు అనురాగము కలది. తుమ్మెద), భూయాసం = సర్వశాస్త్రములలోని సారమైన శ్రీమన్నారాయణ చరణ పద్మ స్మరణరూప మాధుర్యము పొందెదను గాక!, కింతు = కాని, తత్ వత్= దానివలె, అహమ్= నేను, ధనచయన వశాత్ = ధనార్జనాసక్తితో, మా ప్రణేశమ్= నేను నాశనము కాను.

**తాత్పర్యము:** ఓ ప్రభూ ! స్నేహము వలన బోయవాని వలలో చిక్కుకొని పుత్ర కళత్ర

వ్యామోహమునకు వశమై చనిపోయిన పావురము వలె నేను భంగపాటు చెందను. (పూర్వము ఒక బోయవానివలలో ఒక చిన్న పావురము చిక్కుకొన్నది. ఆ చిన్నపావురము కొరకు పెద్ద పావురము కూడా ఆ వల చుట్టూ తిరుగుతూ చనిపోయినది.అలా కానని కవి భావం) ఆకలిగొన్న కొండచిలువవలె దొరికినదానిని మాత్రమే తినుచు ఆకలిని నిగ్రహింతునుగాక !సముద్రము వలె గంభీరుడనై తొణకకుండెదనుగాక !అగ్నికాంతులకుఆకర్షితమయిన మిడుత వలె స్త్రీ మొదలైన భోగ్య వస్తువులపై మోహమున చిక్కుకొనను. అనేక పూలలో సారము తాగు తుమ్మెదవలె సర్వశాస్త్రములలోని సారమైన శ్రీమన్నారాయణ చరణ పద్మ స్మరణరూప మాధుర్యము పొందెదను గాక ! కాని దానివలె నేను ధనార్జనాసక్తితో నేను నాశనము కాను (ప్రాణముల మీదికి తెచ్చుకోను)(ఆ తుమ్మెద తేనె పై వలపుచే ఒకే పద్మమునందు వ్రాలి అక్కడే ఉండిపోయింది. ఇంతలో సూర్యాస్తమయము కాగా ముడిచికొనిన ఆ పద్మమందు ఆ తుమ్మెద బంధము పొందినట్లుగా ధనార్జనాదులలో ఆసక్తితో ఒక్కచోట చిక్కుకొని నాశనము పొందను)

**93-6 శ్లో.**

**మా బద్ధ్యాసం తరుణ్యా గజ ఇవ వశయా నార్జయేయం ధనౌఘం**
**హర్తా న్యస్తం హి మాధ్వీహర ఇవ మృగవన్మా ముహం గ్రామ్యగీతైః ।**
**నాత్యాసజ్జేయ భోజ్యే ఝష ఇవ బడిశే పింగళావన్నిరాశః**
**సుప్యాం భర్తవ్యయోగాత్ కురర ఇవ విభో సామిషోఽన్యైర్నహన్యై ॥**

**ప్రతిపదార్థము:** గజ ఇవ వశయా= ఆడ ఏనుగుద్వారా మగ ఏనుగు బంధింపబడినట్లు(గజతి మత్తో భవతి మదించునది. ఏనుగు), తరుణ్యా= స్త్రీల వ్యామోహములో (తరతి కౌమారమ్ కౌమారమును దాటిన స్త్రీ. యువతి), మా బద్ధ్యాసం = చిక్కుపడను.(గోతిలో పడను), ధన ఔఘం= త్యాగభోగములు లేని ధన సమూహమును( ధనతి రౌతి శబ్దము చేయునది. ధనము), న ఆర్జయేయం= సంపాదించను, హి= ఎందుకనగా నిశ్చయముగా (నిశ్చయే కారణే సందేహనివారణే పాదపూరణే చ-నిశ్చయము కారణము సందేహ నివారణము పాద పూరణము), మాధ్వీహరః ఇవ = తేనె పట్టు ఒడిచికొను వానివలె (మధుగుణ

రసయుక్తా మధురగుణ రసము కలవి మకరందము), అన్యః = ఇతరుడు, తం= దానిని, హర్తా= అపహరించును, గ్రామ్య గీతైః = గ్రామ్యగీతములచే అనగా ఏలపాటలచే (గ్రామే భవః–గ్రామములో వుండునది గ్రామములో జరుగునది), మృగవత్= వలలోపడు జంతువువలె (మార్ష్టి గచ్ఛతి విచరణశీలః–తిరుగు స్వభావం కలది. జింక పశువు మృగము), మా ముహం= తుచ్ఛ సంగీత మోహమున పడను, బడిశే= ఎఱపై ఆశతో గాలమునకు చిక్కిన (బడిశీ= మత్స్యబంధనమ్ చేపలను బట్టెడు గాలము), ఝషః ఇవ = చేపవలె(ఝష్యతే బధ్యతే భక్షణాయ–తినుటకు చంపబడునది. చేప), భోజ్యే= రుచికరమైన భోజనమునకు, న అతి ఆసజ్జేయ=ఉబలాటపడను, పింగళా వత్=తుచ్ఛ సుఖములకు అసహ్య పడి పరమాత్మ సేవకు మరలిన పింగళ అను వేశ్యాకాంత వలె, నిరాశః= ఐహిక సుఖముల పట్ల నిరాశను పొంది, సుప్యాం = సుఖమును పొందెదను(శాశ్వతానందమును పొందెదను), విభో= ప్రభూ!, స ఆమిషః కురర ఇవ = మాంసపు ముక్కను పట్టుకొన్న కురరి అను పక్షి వలె (ఆ మిషః =అమంతి రోగినో భవంతి అస్య భక్షణేన–ఇది తింటే రోగులౌతారు)(కురర= కవతే శబ్దము చేయునది. ఒక పక్షి పెన్నడపులుఁగు గోరువంక లకుముకిపిట్ట.) శబ్దము, భర్తవ్యయోగాత్ = ధనాది రక్షణ కొరకై (భర్తుం యోగ్యం అర్థం, భరణీయమ్ పోషింపదగినది), అన్యైః= ఇతరుల చేత న హన్యై= నశింపను.

**తాత్పర్యము:** ఆడ ఏనుగుద్వారా మగ ఏనుగు బంధింపబడినట్లు స్త్రీల వ్యామోహములో నేను చిక్కుపడను. (గోతిలో పడను) త్యాగభోగములు లేని ధన సమూహమును సంపాదించను. ఎందుకనగా నిశ్చయముగా తేనె పట్టు ఒడిచికొను వానివలె ఇతరుడు దానిని అపహరించును. గ్రామ్యగీతములచే అనగా ఏలపాటలచే వలలోపడు జంతువువలె తుచ్ఛ సంగీత మోహమున పడను. ఎఱపై ఆశతో గాలమునకు చిక్కిన చేపవలె రుచికరమైన భోజనమునకు ఉబలాటపడను. తుచ్ఛ సుఖములకు అసహ్య పడి పరమాత్మ సేవకు మరలిన పింగళ అను వేశ్యాకాంత వలె ఐహికసుఖములపట్లనిరాశనుపొందిసుఖమునుపొందెదను(శాశ్వతానందమును పొందెదను) ప్రభూ ! మాంసపు ముక్కను పట్టుకొన్న కురరి అను పక్షి వలె ధనాది రక్షణ కొరకై ఇతరుల చేత నేనునశింపను.

**విశేషాలు:** పింగళ అను వేశ్య డబ్బు కొఱకు ఆశించి తక్కువ ఇచ్చు జారులను తొలుత వద్దన్నది. ఎక్కువ డబ్బు ఇచ్చువాని కొఱకు దురాశచే రాత్రంతా ఎదురు చూసి, ఎవరు రాక పోయేసరికి తుదకు విసిగిపోయి “ఛీ! ఈ తుచ్ఛధనము ఎందుకు? “ అని విరక్తి చెంది సుఖముగా నిద్రపోయింది. దానివలె నిరాశచెంది విషయముల పట్ల నిరాశ చెంది సుఖపడతానని కవి భావం. ఇది పింగళ కథకు సంబంధించిన మరొక కోణం..

కురరి అను పక్షి పిల్లలకు పెట్టాలని తాను తినక మాంసమును ముక్కున గరచికొని ఎగిరింది. ఇతర పక్షులు దానిని పొడిచి చంపి మాంసమును దొంగిలించాయి.. అలా కురరి వలె ధనాదులను పుత్రుల కొఱకు దాచి పెట్టి బలవంతుల చేతిలో చనిపోకూడదని కవి బోధ,!

**93–7 శ్లో.**

**వర్తేయ త్యక్తమానః సుఖమతిశిశువన్నిస్సహాయశ్చరేయం**
**కన్యాయా ఏకశేషో వలయ ఇవ విభో! వర్జితాన్యోన్యఘోషః ।**
**త్వచ్చిత్తో నావబుధ్యే పరమిషుకృదివ క్ష్మాభృదాయానఘోషం**
**గేహేష్వన్యప్రణీతేష్వహిరివ నివసాన్యుందురోర్మందిరేషు ॥**

**ప్రతిపదార్థము:** విభో=ఓ ప్రభూ! (విశేషేణ భవతి సర్వగతః–విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు), అతిశిశువత్= చిన్నపిల్లల నుండి, త్యక్తమానః = మానావమానములను విడిచినచో (త్యక్తః పరిత్యక్తః దత్తః–విడిచిపెట్టబడినది దానము చేయబడ్డది), సుఖమ్ వర్తేయ= సుఖముగా ఉండవచ్చునని గ్రహింతును.(సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః–ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), కన్యాయాః = కన్య(కన్యతే దీప్యతే కామ్యతే రూపము వలన ప్రకాశించునది. కన్య), ఏకశేషః వలయ ఇవ = తన ముంజేతికి ఒకటే కంకణము ధరించినట్లు (వలతి వల్యతే ఆవృణోతి హస్తాదికమ్ ధరింపబడునది, హస్తాదులను కప్పునది. కంకణము), నిస్సహాయః = ఏకాంతముగా, వర్జితాని అన్యోన్యఘోషః= శాస్త్ర వాదవివాదముల రొదలు లేక, చరేయం = చరింతును.(ఏకాంతముగా ఉన్నప్పుడు ఆటంకములు తొలగి కార్య

సిద్ధి కలుగును అను సత్యమును ఒంటి గాజుతో ఉన్న కన్యనుండి నేర్చుకొంటాను), ఇషు కృత్ = లక్ష్యంపై చూపు నిలిపి బాణములను తయారు చేయు కార్మికుడు (ఇష్యతే హింస్యతే అనేన–దీనితో హింసింపబడుదురు. బాణము), క్ష్మాభృత్= రాజుయొక్క (క్ష్మాం భూమిం బిభర్తి పాలయతి భూమిని పాలించువాడు. రాజు పర్వతము), ఆయాన ఘోషం ఇవ= ఊరేగింపు భేరీశబ్దములను విననట్లు, త్వత్ చిత్తః = నీయందు మనస్సు నిలిపి, పరమ్ = మరియొకటి, న అవబుధ్యై = తెలియనట్లు దృఢసమాధిలో ఉందునుగాక!, ఉందురోః మందిరేషు=ఎలుక కన్నములందు (ఉదయతి ముఖ స్పృష్టం వస్త్విత్యుందురుః – తన ముఖము చేత ముట్టబడిన వస్తువును ద్రవింపచేయునది), అహిః ఇవ = పామువలె(ఆహంతి హినస్తి హింసించునది కుట్టునది. సర్పము), అన్య ప్రణీతేషు= ఒరులు నిర్మించుకొన్న, గేహేషు= ఇండ్లలో, నివసాని = మమకార భావనను వదలి నివసింతును గాక!, శిశువువలె మానవమానాది ద్వంద్వత్యాగమొనరించి సుఖముండెదగాక.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! చిన్నపిల్లల నుండి మానావమానములను విడిచినచో సుఖముగా ఉండవచ్చునని గ్రహింతును. కన్య తన ముంజేతికి ఒకటే కంకణము ధరించినట్లు ఏకాంతముగా శాస్త్ర వాదవివాదముల రొదలు లేక చరింతును. (ఏకాంతముగా ఉన్నప్పుడు ఆటంకములు తొలగి కార్య సిద్ధి కలుగును అను సత్యమును ఒంటి గాజుతో ఉన్న కన్యనుండి నేర్చుకొంటాను) లక్ష్యంపై చూపు నిలిపి బాణములను తయారు చేయు కార్మికుడు రాజుయొక్క ఊరేగింపు భేరీశబ్దములను విననట్లు నీయందు మనస్సు నిలిపి మరియొకటి తెలియనట్లు దృఢసమాధిలో ఉందునుగాక! ఎలుక కన్నములందు పామువలె పరులు నిర్మించుకొన్న ఇండ్లలో మమకార భావనను వదలి నివసింతును గాక !

**93–8 శ్లో.**

**త్వయ్యేవ త్వత్కృతం త్వం క్షమయసి జగదిత్యూర్ణనాభాత్ ప్రతీయాం**
**త్వచ్చింతా త్వత్స్వరూపం కురుత ఇతి దృఢం శిక్షయే పేశకారాత్ ।**
**విడ్భస్మాత్మా చ దేహో భవతి గురువరో యో వివేకం విరక్తిం**
**ధత్తే సంచింత్యమానో మమ తు బహురుజాపీడితోఽయం విశేషాత్ ॥**

**ప్రతిపదార్థము:** త్వం= ఓ భగవాన్!, త్వత్ కృతం= నువ్వు సృష్టించిన, జగత్ = జగత్తును, త్వయి ఏవ= నీయందే, క్షమయసి ఇతి = లయింపజేయుదువని, ఊర్ణనాభాత్ = సాలీడు నుండి (ఊర్ణా ఇవ తంతుః నాభౌ అస్య–నాభియందు తంతువులు కలది. సాలెపురుగు), ప్రతీయాం= నేర్చుకొన్నాను. (నిమిత్త ఉపాదాన కారణములు నీవే యని గుర్తించెదను),త్వత్ చింతా=నిన్నుసదా ధ్యానించుటవలన, త్వత్ స్వరూపం= నీ స్వారూప్యమును, కురుత= పొందెదను, ఇతి = అని, పేశకారాత్=తుమ్మెద నుండి, దృఢం = దృఢముగా, శిక్షయే= నేర్చుకొందును, విడ్= బతికి ఉన్నప్పుడు మల రూపమున ఉండి, భస్మ ఆత్మా = చనిపోయిన తరువాత భస్మరూపములో ఉన్న, దేహః చ = ఈ శరీరము, గురువరః = గొప్ప గురువు, భవతి = అగుచున్నాడు, బహురుజాపీడితః= అనేక రోగములచే బాధపడుచున్న, యః అయం = ఏ ఈ శరీరము, విశేషాత్= విశేషముగా, సంచింత్యమానః= ఆలోచించగా, మమ = నాకు, వివేకం విరక్తిం = జ్ఞాన వైరాగ్యములను, ధత్తే = కలిగించుచున్నది.

**తాత్పర్యము:** ఓ భగవాన్! నువ్వు నువ్వు సృష్టించిన జగత్తును నీయందే లయింపజేయుదు వని సాలీడు నుండి నేర్చుకొన్నాను. (నిమిత్త ఉపాదాన కారణములు నీవే యని గుర్తించెదను.) నిన్ను సదా ధ్యానించుటవలన నీ స్వారూప్యమును పొందెదను అని తుమ్మెద నుండి దృఢముగా నేర్చుకొందును. (తుమ్మెద ఒకానొకకీటకమును తెచ్చిగూడుకట్టి అందుంచగా ఆ పురుగు భయముచే నా తుమ్మెదను ధ్యానించి దానితో సారూప్యమును పొందుతుంది.. ఆవిధముగానే నీ నిరంతర ధ్యానసమాధిచే నీ సారూప్యము పొందుతాను) బతికి ఉన్నప్పుడు మల రూపమున ఉండి, చనిపోయిన తరువాత భస్మరూపములో ఉన్న ఈ శరీరము గొప్ప గురువు అగుచున్నాడు. అనేక రోగములచే బాధపడుచున్న ఈ శరీరము విశేషముగా ఆలోచించగా నాకు జ్ఞాన వైరాగ్యములను కలిగించుచున్నది.

**93–9 శ్లో.**

**హీ హీ మే దేహ మోహం త్యజ పవనపురాధీశ యత్ ప్రేమ హేతోః**
**గేహే విత్తే కళత్రాదిషు చ వివశితాస్త్వత్పదం విస్మరంతి ।**

**సోఽయం వహ్నేశ్శునో వా పరమిహ పరతస్సాంప్రతం చాక్షికర్ణ–**
**త్వగ్జిహ్వాద్యా వికర్షంత్యవశమత ఇతః కోఽపి న త్వత్పదాబ్జే ॥**

**ప్రతిపదార్ధము:** పవనపురాధీశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, హీ హీ= అయ్యో ! (విస్మయే, విషాదే చ–ఆశ్చర్యము విషాదము), మే = నాయొక్క, దేహ = దేహమునందు(దేగ్ధి వృద్ధిం గచ్ఛతి నిరంతరము వృద్ధి పొందునది. శరీరము), మోహం = మోహము(ముహ్యతి తస్య భావః మోహము. మూర్ఛ, అజ్ఞానము, భ్రాంతి), త్యజ= తొలగింపుము, యత్ ప్రేమహేతోః = ఈ దేహమందలి ప్రేమ వలననే, గేహే= గృహము(గో గణేశః గంధర్వః తేన ఈహః ఈప్సితః యత్ర– గణేశుడు లేదా గంధర్వుడు ఇక్కడ వుండవలెనని కోరబడునది. ఇల్లు), విత్తే= సంపద (విందంతి ప్రాప్నువంతి ఏనమ్ దీనిని పొందుదురు. ధనము), కళత్ర ఆదిషు చ = భార్య మొదలయిన వాటిపట్ల, వివశితాః= వివశులై, త్వత్ పదం విస్మరంతి= నీ పాదపద్మములను మరచిపోవుచున్నారు, సః అయం = ఈ శరీరము, ఇహ = సకల జంతువులలోను, పరతః = మరణానంతరము, పరమ్= కేవలము, వహ్నేః = అగ్ని, వా = లేక, శునః = కుక్కల వశమగుచున్నది. (శునతి సదా ఇతస్తతో గచ్ఛతి వెళ్లునది. వాయువు కుక్క), సాంప్రతం చ= ప్రస్తుత జీవన సమయములోను, అవశమ్ = స్వాధీనములో లేని, అక్షి కర్ణ– త్వక్ జిహ్వా ఆద్యాః= కన్ను చెవి చర్మము నాలుక మొదలగునవి (కర్ణః కృత్త ఇవ భవతి భేదింపబడినదానివలె శిరస్సులో వుండునది. చెవి, కర్ణేంద్రియము)(త్వచతి సంవృణోతి మేదశోణితాదికమ్ మేదశోణితములను కప్పునది. చర్మము)(హూయతే ఖాద్యతే అనయా దీనితో తిందురు. నాలుక), అతః ఇతః = ఇటునటు, వికర్షంతి= లాగుచున్నవి, కః అపి= ఎవరూ కూడా, త్వత్ పదాబ్జే= నీ పాదార విందముల వైపు, న= చేర్చుటలేదు.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! నాయొక్క దేహమునందు మోహము తొలగింపుము. ఈ దేహమందలి ప్రేమ వలననే గృహము, సంపద, భార్య మొదలయిన వాటిపట్ల వివశులై నీ పాదపద్మములను మరచిపోవుచున్నారు. ఈ శరీరము సకల జంతువులలోను మరణానంతరము కేవలము అగ్ని లేక కుక్కల వశమగుచున్నది. ప్రస్తుత జీవన సమయములోను స్వాధీనములో లేని కన్ను చెవి

చర్మము నాలుక మొదలగునవి ఇటునటు లాగుచున్నవి. ఎవరూ కూడా నీ పాదార విందముల వైపు చేర్చుటలేదు. ( నీ పాదార విందముల వైపు చేర్చు ఆచార్యుడు లేక భక్తుడు ఎవరూ నాకు కనిపించుట లేదని భావం.)

**93–10 శ్లో.**

**దుర్వారో దేహమోహో యది పునరధునా తర్హి నిశ్శేషరోగాన్**
**హృత్వా భక్తిం ద్రఢిష్ఠాం కురు తవ పద పంకేరుహే పంకజాక్ష! ।**
**నూనం నానాభవాంతే సమధిగతమిమం ముక్తిదం విప్రదేహం**
**క్షుద్రే హా హంత మా మా క్షిప విషయరసే పాహిమాం మారుతేశ! ॥**

**ప్రతిపదార్థము:** పంకజ అక్ష= కమలముల వంటి కన్నులు కలవాడా! (పంకే జాయతే బురదలో పుట్టునది. కమలము), మారుత ఈశ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, యది =( పక్షాంతరం సంభావనా– మరొక పక్షము, ఒక వేళ), పునః= మరలా, దేహమోహః = ఈ దేహ మోహము, దుర్వారః తర్హి= ఇప్పటిలో వారింపరానిది అయినచో, అధునా = ఇప్పుడు ఈ జన్మలో, నిశ్శేషరోగాన్ = నా యొక్క అశేష రోగములను అనగా వాతాది బాహ్య వ్యాధులను, రాగద్వేషాది అంతర్ వ్యాధులను( నిర్గతః శేషాత్ శేషము లేనిది. సంపూర్ణము), హృత్వా =హరించి, తవ పద పంకేరుహే= నీ పదకమలమందు, ద్రఢిష్ఠాం = మిగుల దృఢమైన, భక్తిం= భక్తిని, కురు = కలిగింపుము, నూనం = నిశ్చయముగా (వితర్క–నిశ్చయ–స్మరణ–వాక్యపూరణ–ఉత్ప్రేక్షాసు–వితర్కము, నిశ్చయము, స్మరణము, వాక్యపూరణము, ఉత్ప్రేక్షలయందు ప్రయోగింతురు), నానా భవ అంతే =పెక్కు జన్మల తరువాత( భవతి జాయతే తస్య భావ–పుట్టుక), సమధిగతమ్= పొందిన (అధి అధికం గతం జ్ఞాతం ప్రాప్తం వా తెలుసుకొనబడ్డది పొందబడ్డది స్వీకరించబడ్డది), ముక్తిదం = ముక్తి ప్రదమైన (శరీరేంద్రియాభ్యాం ఆత్మనః ముక్తత్వమ్ శరీరేంద్రియముల నుండి ఆత్మ ముక్తి నొందుట. ముక్తి, మోక్షము), ఇమం విప్రదేహం=బ్రాహ్మణ శరీరమును( విప్ వాక్ సా అస్తి అస్య మంచి వాక్కులు కలవాడు. బ్రాహ్మణుడు), హా హంత= అయ్యో!, క్షుద్రే విషయరసే= క్షుద్రమైన విషయానందములలో (క్షుణత్తి సంపినష్టి అసౌ హింసించువాడు. క్రూరుడు

అధముడు నీచుడు తక్కువవాడు), హే మామా క్షిప= విసరకు( నా మనస్సును విషయానందముల వైపు పోనీయకు), మాం = నన్ను, పాహి = రక్షించు.

**తాత్పర్యము:** కమలముల వంటి కన్నులు కలవాడా! ఓ గురువాయూరు కృష్ణ దేవా! ఒక వేళ నా ఈ దేహ మోహము ఇప్పటిలో నివారింపరానిది అయినచో, ఈ జన్మలో నా యొక్క అశేష రోగములను హరించి నీ పదకమలమందు మిగుల దృఢమైన భక్తిని కలిగింపుము. పెక్కు జన్మల తరువాత పొందిన ముక్తి ప్రదమైన బ్రాహ్మణ శరీరమును క్షుద్రమైన విషయానందములవైపు పోనీయకు. నన్ను రక్షించుము.

**ఏకాదశ స్కంధము**

**93వ దశకము సమాప్తము**



# దశకమ్ 94 – తత్త్వజ్ఞానోత్పత్తి

**94–1 శ్లో.**

**శుద్ధానిష్కామధర్మైః ప్రవరగురుగిరా తత్స్వరూపం పరంతే**
**శుద్ధం దేహేంద్రియాదివ్యపగతమఖిల వ్యాప్తమావేదయంతే ।**
**నానాత్వస్థౌల్యకార్శ్యాది తు గుణజవపుస్సంగతోఽధ్యాసితంతే**
**వహ్నేర్దారుప్రభేదేష్వివ మహదణుతా దీప్తతా శాంతతాది ॥**

**ప్రతిపదార్థము:** నిష్కామ ధర్మైః= నిష్కామముగా స్వధర్మమును ఆచరించినవారు (నిర్గతః కామః ఇచ్ఛా యస్య కోరిక లేనివాడు), శుద్ధాః= రాగ ద్వేషముల దోషములను విడిచి, ప్రవర = వేద వేదార్థ సంపన్నుడు , శ్రేష్ఠుడయిన, గురు = గురువు యొక్క(గృణాతి ఉపదిశతి వేదవిద్యాం ఆచారం చ–వేదవిద్యను ఆచారమును ఉపదేశించువాడు), గిరా =ఉపదేశముల ఫలితముగా (గీర్యతే అసౌ పలుకబడునది. వాక్యము వచనము వాణి), తే =ఈశ్వరుడవయిన నీ యొక్క, తత్ స్వరూపం= పరబ్రహ్మ స్వరూపము, దేహ ఇంద్రియ ఆది= దేహేంద్రియముల కంటె, వ్యపగతమ్ = భిన్నమని (విశేషేణ అపగతః విసర్జితః అంతర్హితః–తొలగించబడినది దాచబడినది), శుద్ధం= శుద్ధము అని (శుద్ధః పవిత్రీకృతః శుభ్రః–పవిత్రము చేయబడినది తెల్లనిది), పరం=శ్రేష్ఠమని, అఖిల వ్యాప్తమ్= సర్వవ్యాపకము అని ( న ఖిల్యతే న కణశః ఆదీయతే ముక్కలుగా గ్రహించబడనిది. సంపూర్ణము సమగ్రము), ఆవేదయంతే= తెలుసుకొందురు, తే = పరమాత్మవైన నీయందు, నానాత్వ = నానాత్వము(అనేకమ్ చాలా రకములు. అనేకము పలు రకములు పలు విధములు), స్థౌల్య = స్థూలత్వము (స్థూలస్య భావః–లావు), కార్శ్య= కార్శ్యము (కృశస్య భావః–దౌర్బల్యము, దుర్బలత్వం బక్కచిక్కుట), ఆది తు = మొదలయిన దేహేంద్రియ ధర్మాదులు, దారు ప్రభేదేషు= కట్టెల భేదమును బట్టి(దీర్యతే అసౌ చీల్చబడునది. కట్టె), వహ్నేః= ఒకటే అయిన అగ్నికి, మహత్= పెద్ద జ్వాల, అణుతా= చిన్న జ్వాల, దీప్తతా = మండుట, శాంతతా= చల్లారుట, ఆది ఇవ= మొదలగునవి వలె, గుణజ వపుః= త్రిగుణాత్మకమైన శరీర సంబంధమును, సంగతః= అనుసరించి (సంగతః మిలితః ఏకత్రితః–కలుపబడినది ఒక చోట

కూర్చబడినది), అధ్యాసితం = నానాత్వము, స్థూలత్వము మొదలగు ధర్మములు ఆరోపింపబడుచున్నవి. (అధి ఉపరి ఆసితః స్థితః–పైన కూర్చున్నది. ఆశ్రితము స్థాపనము).

**తాత్పర్యము:** నిష్కామముగా స్వధర్మమును ఆచరించినవారు రాగ ద్వేషముల దోషములను విడిచి, వేద వేదార్థ సంపన్నుడు, శ్రేష్ఠుడయిన గురువు యొక్క ఉపదేశముల ఫలితముగా ఈశ్వరుడవయిన నీ యొక్క పరబ్రహ్మ స్వరూపము దేహేంద్రియముల కంటె భిన్నమని, శుద్ధము అని. శ్రేష్ఠమని, సర్వవ్యాపకము అని తెలుసుకొందురు. పరమాత్మవైన నీయందు నానాత్వము, స్థూలత్వము, కార్శ్యము మొదలయిన దేహేంద్రియ ధర్మాదులు– కట్టెల భేదమును బట్టి ఒకటే అయిన అగ్నికి పెద్ద జ్వాల ,చిన్న జ్వాల. మండుట , చల్లారుట మొదలగునవి వలె – త్రిగుణాత్మకమైన శరీర సంబంధమును అనుసరించి నానాత్వము , స్థూలత్వము మొదలగు ధర్మములు ఆరోపింపబడుచున్నవి.(కట్టె , అగ్ని వేరు వేరు. కట్టె జీవుడు. అగ్ని పరమాత్మ. కట్టె యొక్క ధర్మమును అగ్ని యందు ఆరోపిస్తాము. అలాగే తెలియక జరమరణాదుల ధర్మములను నిరుపాధి అయిన ఆత్మ యందు ఆరోపిస్తామని భావం)

**94–2 శ్లో.**

**ఆచార్యాఖ్యాధరస్థారణి సమనుమిలచ్ఛిష్యరూపోత్తరార–**
**ణ్యావేధోద్భాసితేన స్ఫుటతరపరిబోధాగ్నినా దహ్యమానే ।**
**కర్మాలీవాసనాతత్కృతతనుభువనభ్రాంతికాంతారపూరే**
**దాహ్యాభావేన విద్యాశిఖిని చ విరతే త్వన్మయీ ఖల్వవస్థా ॥**

**ప్రతిపదార్థము:** ఆచార్య = ఆచార్యుడు (ఆచినోతి బుద్ధిం శిష్యాణామ్ శిష్యులకు జ్ఞానము పెంపొందింపచేయువాడు), ఆఖ్య= అను పేరు గల (ఆఖ్యాయతే అనయా దీనితో పిలువబడును. పేరు ప్రసిద్ధి), అధరస్థ అరణి= అధరారణిని (న ధ్రియతే ధరింపబడనిది భూమితో తగిలియుండనిది. క్రింద తలము.) (ఋచ్ఛతి ప్రాప్నోతి ప్రాపయతి వా అగ్నిమ్ అగ్నిని పుట్టించు (కాష్ఠము) కట్టె. అరణి), సమనుమిలత్ = ఉపనయన సంస్కారరూపమున సమావేశమయిన, శిష్య రూప=

శిష్యుడు అను పేరుగల (శాస్యతే గురుణా, శిక్షణీయః–గురువుచే శాసింపదగినవాడు. శిష్యుడు అధ్యయనార్హుడు), ఉత్తర అరణి= ఉత్తరారణి కలిసి (ఉత్తరః ఉచ్చతరః–ఉన్నతమైనది), ఆవేధః= మథనరూప పరస్పర చర్చ వలన, ఉద్భాసితేన = ప్రకాశించు, స్ఫుటతర పరిబోధ అగ్నినా= జ్ఞానరూపమైన అగ్నిచే (అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), కర్మాలీ వాసనా=సజాతీయ కర్మోత్పాదక సంస్కారములు (కర్మవాసన) (వాసయతి కర్మణా యోజయతి, జీవానాం మనాంసి జీవులయొక్క మనస్సును పూర్వకర్మలతో కలుపునది. వాసనా సుగంధము చేయుట మిథ్యాజ్ఞానము పూర్వజన్మ సంస్కారము), తత్ కృత= దానివలన కలిగిన, తను భువన భ్రాంతి= దేహగేహ భ్రాంతి రూపమయిన(శరీరాది ప్రపంచ విషయ రూపమైన అజ్ఞానము) (భ్రమతి తస్య భావః కర్మ వా భ్రమణము భ్రాంతి మిథ్యాజ్ఞానము), కాంతారపూరే = అడవుల సమూహములు (కస్య జలస్య సుఖస్య అంతః కాంతః తం ఋచ్ఛతి సుఖము నిచ్చునది. శాంతినిచ్చునది. అడవి), దహ్యమానే = దహింపబడి, దాహ్య అభావేన= దహింపవలసిన పదార్థము లేనందున, విద్యా = బ్రహ్మజ్ఞానము, అను శిఖిని చ = అగ్ని కూడా, విరతే = ఉపశమించి, అవస్థా = కేవల శాంతి తో, త్వత్ మయీ ఖలు= త్వన్మయత్వము కలుగును కదా !

**తాత్పర్యము:** ఓ గురువాయూరు దేవా! ఆరణియనగా అగ్నిని మధించుట కేర్పరుపబడిన జమ్మికర్ర. ఆచార్యుడు అధరారణి వంటివాడు(గుంటలాంటి దిగువభాగం) శిష్యుడు ఉత్తరారణి (కవ్వంలాంటి పై భాగం) గురు శిష్యుల మథనరూప పరస్పర చర్చ వలన జ్ఞానరూపమైన అగ్ని పుడుతుంది. ఆ జ్ఞానాగ్ని వలన కర్మవాసనలు, దేహ సంసారముల భ్రాంతి అను అడవి దహింపబడుతుంది. అజ్ఞానము పూర్తిగా నశించి కేవల శాంతితో తన్మయమయిన స్థితి(సచ్చిదానంద స్థితి) కలుగుతుంది.

**94–3 శ్లో.**

**ఏవం త్వత్ప్రాప్తితోఽన్యో న హి ఖలు నిఖిలక్లేశహానేరుపాయో**

**నైకాంతాత్యంతికాస్తే కృషివదగదషాడ్గుణ్యషట్కర్మయోగాః ।**

**దుర్వైకల్యైరకల్యా అపి నిగమపథాస్తత్ఫలాన్యప్యవాప్తా**
**మత్తాస్త్వాం విస్మరంతః ప్రసజతి పతనే యాంత్యనంతాన్ విషాదాన్ ॥**

**ప్రతిపదార్థము:** ఏవం=ఇట్లు, నిఖిల క్లేశ హానేః = సమస్త దుఃఖములు తొలగుటకు(క్లిష్నాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము యోగ శాస్త్రంలో చెప్పబడిన అవిద్యాది పంచక్లేశములు), త్వత్ ప్రాప్తితః = నిన్ను పొందుట కంటె, అన్యః = వేరొక, ఉపాయః = ఉపాయము, న హి ఖలు =లేదు కదా!, అగద= ఔషధములు ఆయుర్వేదము చెప్పిన ఆరోగ్యోపాయములు, షాడ్గుణ్య = సంధి విగ్రహము మొదలైన గుణములు, షట్కర్మ యోగాః = అధ్యయనాది షట్కర్మలు (అధ్యాపనము, 2. అధ్యయనము, 3. యజనము, 4. యాజనము, 5. దానము, 6. ప్రతిగ్రహము), ఐకాంతః న = నిఖిలదుఃఖనివృత్తి చేయజాలవు(ఐకాంతిక= ఏకాంతం నిశ్చయేన భవః–తప్పకుండా జరుగునది), ఆత్యంతికాః న= దుఃఖ పునరావృత్తి నివర్తకములు కావు (అత్యంతస్య భావః–చాలా ఎక్కువ న్యాయమతములో ఒక విధమైన అభావము), తే = అవి సంపూర్ణ ఫలితము లభింపక, కృషివత్ = వ్యవసాయమువలె మాటిమాటికి చేయ వలసి వచ్చును(కృష్యతే భూమిః తత్ భూమిని దున్నుట. వ్యవసాయము), నిగమ పథాః అపి= వేదమార్గములు కూడా (గమయంతి జ్ఞాపయంతి వేదార్థమ్ వేదార్థమును తెలియచేయు శాస్త్రములు), దుర్వైకల్యైః= ద్రవ్య కర్మ కాలసర్ప దోషరూపములైన వైగుణ్యములచేత (వికలస్య భావః– వ్యాకులత్వము), అకల్యాః = అనుష్ఠాన శక్యములు కావు, తత్ ఫలాని అవాప్తాః అపి = వానిని ఎలాగో ఆచరించి వానివలన ఫలములను పొందినవారుకూడ, మత్తాః= మత్తులైనందువలన, త్వాం = నిన్ను, విస్మరంతః = మర్చిపోయి, పతనే ప్రసజతి = పతితులగుచున్నారు, అనంతాన్ విషాదాన్= అనంతమైన బాధలను, యాంతి= పొందుచున్నారు.

**తాత్పర్యము:** ఇట్లు సమస్త దుఃఖములు తొలగుటకు నిన్ను పొందుట కంటె వేరొక ఉపాయము లేదు కదా ! ఔషధములు ఆయుర్వేదము చెప్పిన ఆరోగ్యోపాయములు, సంధి విగ్రహము మొదలైన షట్ గుణములు, అధ్యయనాది షట్కర్మలు నిఖిలదుఃఖాన్ని పోగొట్టవు, దుఃఖ పునరావృత్తిని పోగొట్టవు. అవి సంపూర్ణ ఫలితమును ఇవ్వక వ్యవసాయమువలె మాటి మాటికి చేయ వలసి వచ్చును.

వేదమార్గములు కూడా – ద్రవ్య కర్మ కాలసర్ప దోషరూపములైన వైగుణ్యములచేత ఆచరించుటకు శక్యములు కావు. వానిని ఎలాగో ఆచరించి వానివలన ఫలములను పొందినవారుకూడ మత్తులైనందువలన నిన్ను మర్చిపోయి పతితులగుచున్నారు. అనంతమైన బాధలను పొందుచున్నారు. (కనుక నిన్ను ఆశ్రయించుటయే అన్నింటి కంటె మేలయినది అని భావం).

**విశేషాలు**

**షట్–గుణములు:** 1. సంధి (ఒకటియగుట), 2. విగ్రహము (శత్రుమండలమందు ఆహవోపాధిరూపమైన యపకారము), 3. యానము (స్వశక్త్యాధిక్యముచే కాని, పరునికి వ్యసనము కలిగినప్పుడు కాని పరుని గెలువవలయునను నిచ్ఛచే శత్రువుపై కదలిపోవుట), 4. ఆసనము (దేశకాలాద్యపేక్షచే దుర్గాదులను భరించుకొని ప్రయాణ పరాఙ్ముఖుడై యుండుట), 5. ద్వైధము (తనమీదికి ఇద్దరు శత్రువులు దండెత్తి వచ్చినపుడు ఒకనితో సంధి చేసి మరియొకనితో విరోధపడుట), 6. ఆశ్రయము (అశక్తిచే బలవంతుని ఆశ్రయించుట).

"సంధివిగ్రహాసనయాన సంశ్రయద్వైధీభావా షాడ్గుణ్యమ్" కౌ.అ.శా. 7–1–2

**94–4 శ్లో.**

**త్వ ల్లోకాదన్యలోకః క్వ ను భయరహితో యత్ పరార్ధద్వయాంతే**
**త్వద్భీతస్సత్యలోకేఽపి న సుఖవసతిః పద్మభూః పద్మనాభ! ।**
**ఏవం భావే త్వధర్మార్జితబహుతమసాం కా కథా నారకాణాం**
**తన్మే త్వం ఛింధి బంధం వరద! కృపణబంధో! కృపాపూరసింధో! ॥**

**ప్రతిపదార్థము:** పద్మనాభ = ఓ పద్మనాభుడా! (పద్మం నాభౌ యస్య–పద్మము నాభియందు కలవాడు. విష్ణువు), త్వత్ లోకాత్ = నీవైకుంఠలోకముకంటె, భయరహితః=వినాశ భయరహితమైన (బిభేతి అస్మాత్ దీని వలన భయపడుదురు. భయము), అన్యలోకః= ఏ ఇతర లోకము( సత్యలోకాదులు), క్వ ను = ఎక్కడ ఉన్నది?(ఎక్కడా లేదని భావం), యత్ = కారణము ఏమనగా, పద్మభూః = బ్రహ్మ(పద్మం విష్ణోః నాభిపద్మం భూః ఉత్పత్తిస్థానం యస్య–విష్ణువు నాభి స్థానము

ఉత్పత్తిగా కలవాడు. బ్రహ్మ), పరార్థ ద్వయ = రెండు పరార్ధముల ప్రమాణము కలిగిన (పరం చ అసౌ అర్ధం చ, బ్రహ్మణః ఆయోః ద్వితీయార్ధమ్ బ్రహ్మ ఆయువు యొక్క రెండవ సగము. ఒక సంఖ్య. 100000000000000000), అంతే = తన ఆయువు ముగియు కాలమున, త్వత్ భీతః = కాలస్వరూపివి ఈశ్వరుడగు నీకు భయపడుచూ, సత్యలోకే అపి = సత్యలోకమున కూడా, న సుఖ వసతిః = సుఖముగా ఉండలేదు, ఏవం భావే= ఇట్లుండగా(విద్యచేత కర్మచేత ఐశ్వర్యము గడించిన బ్రహ్మకే దుఃఖము యొక్క నివృత్తి లేనపుడు), అధర్మ ఆర్జిత = అనేక దుష్కర్మలు ఆచరించి, బహు తమసాం నారకాణాం = అనేక నరక బాధలకు లోనయిన మానవుల, కథా తు కా= క్లేశనాశనము ఎక్కడిమాట? ( క్లేశము పోదని భావం), వరద+ ఓ వరదుడా !, కృపణబంధో = ఆపద్బాంధవుడవు, కృపాపూరసింధో= దయా సముద్రుడా !, తత్ = అందువలన, త్వం= నువ్వు, మే= నాయొక్క, బంధం = శరీరాదులపై నాకు ఉన్న అహమ్మాభిమానమును, ఛింధి= తొలగించి మోక్షమును కలిగించుము.

**తాత్పర్యము:** ఓ పద్మనాభుడా ! నీవైకుంఠలోకముకంటె వినాశ భయరహితమైన ఏ ఇతర లోకము ఎక్కడా లేదు. బ్రహ్మ రెండు పరార్ధముల ప్రమాణము కలిగిన తన ఆయువు ముగియు కాలమున కాలస్వరూపివి ఈశ్వరుడగు నీకు భయపడుచూ సత్యలోకమున కూడా సుఖముగా ఉండలేదు. ఇట్లుండగా అనేక దుష్కర్మలు ఆచరించి అనేక నరక బాధలకు లోనయిన మానవులకు క్లేశము పోదు. వరదుడా ! ఆపద్బాంధవా ! దయా సముద్రుడా ! అందువలన నువ్వు నాయొక్క శరీరాదులపై నాకు ఉన్న అహమ్మాభిమానమును తొలగించి మోక్షమును కలిగించుము.

**94-5 శ్లో.**

**యాథార్థ్యాత్ త్వన్మయస్యైవ హి మమ న విభో! వస్తుతో బంధమోక్షౌ**
**మాయావిద్యాతనుభ్యాం తవ తు విరచితౌ స్వప్నబోధోపమౌ తౌ ।**
**బద్ధే జీవద్విముక్తిం గతవతి చ భిదా తావతీ తావదేకో**
**భుంక్తే దేహద్రుమస్థో విషయఫలరసాన్నాపరో నిర్వ్యథాత్మా ॥**

**ప్రతిపదార్థము:** విభో= ప్రభూ ! ( విశేషేణ భవతి సర్వగతః విశేషంగా వుండువాడు

అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), యాథార్థ్యాత్=యథార్థముగా (పరమార్థముచే) (అర్థ మనతిక్రమ్య-అర్థముననుసరించి. సత్యము), త్వత్ మయస్య ఏవ హి= నేను నీవై ఉన్నాను. నీలో ఉన్నాను కదా!, మమ= (కనుక) నాకు, వస్తుతః = వాస్తవముగా, బంధమోక్షౌ= బంధమోక్షములు, న తు= లేనేలేవు, తౌ= (అయినప్పటికి) ఆ బంధమోక్షములు, తవ మాయా విద్యా తనుభ్యాం = నీ యొక్క విద్యా విద్య రూప శక్తి ద్వయము చేత, విరచితౌ= ఏర్పడును. (అవిద్యచేత బంధము, విద్యచేత మోక్షము), స్వప్నబోధ= (ఆ బంధమోక్షములు) నిద్ర మెలకువ (స్వపితి తస్య భావః కర్మ-నిద్ర పోవుట కల గనుట.)(బోధః అస్తి అస్య-తెలివి కలవాడు తెలుసుకొనువాడు), ఉపమౌ= వంటివి, బద్ధే = బద్ధ జీవికి, జీవత్ విముక్తిం గతవతి చ= జీవన్ముక్తునకు, భిదా= భేదము, తావత్ తావతీ= ఈ చెప్పబోవు విధముగా ఉన్నది, ఏకః = బద్ధ జీవి, దేహద్రుమ స్థః = దేహమనెడి చెట్టులో జీవుడను పేర నివసించి, విషయ ఫల రసాత్ = విషయానుభవ రూపమయిన కర్మ ఫలమును(సుఖ దుఃఖములనెడి ఫలములను), భుంక్తే = అనుభవించుచుండును, అపరః= జీవన్ముక్తుడు, న= విషయానుభవ రూపమయిన కర్మ ఫలమును అనుభవింపడు, నిర్వ్యథ ఆత్మా = జ్ఞాన శక్తి వలన ఏ బాధలు అనుభవింపడు.

**తాత్పర్యము:** ప్రభూ! యథార్థముగా నేను నీవై ఉన్నాను. నీలో ఉన్నాను కదా! కనుక నాకు వాస్తవముగా బంధమోక్షములు లేనేలేవు. అయినప్పటికి ఆ బంధమోక్షములు నీ యొక్క విద్యా విద్య రూప శక్తి ద్వయము చేత ఏర్పడును. అవిద్యచేత బంధము, విద్యచేత మోక్షము ఆ బంధమోక్షములు నిద్ర మెలకువ వంటివి. బద్ధ జీవికి, జీవన్ముక్తునకు భేదము భేదము ఉన్నది. బద్ధ జీవి దేహమనెడి చెట్టులో జీవుడను పేర నివసించి సుఖ దుఃఖములనెడి ఫలములను అనుభవించుచుండును. జీవన్ముక్తుడు విషయానుభవ రూపమయిన కర్మ ఫలమును అనుభవింపడు. జ్ఞాన శక్తి వలన ఏ బాధలు అనుభవింపడు.

**94-6 శ్లో.**

**జీవన్ముక్తత్వమేవంవిధమితి వచసా కిం ఫలం దూరదూరే**

**తన్నామాశుద్ధబుద్ధేర్న చ లఘు మనసశ్శోధనం భక్తితోఽన్యత్ ।**

**తన్మే విష్ణో! కృషీష్ఠాస్త్వయి కృతసకలప్రార్పణం భక్తిభారం**
**యేన స్యాం మంక్షు కించిద్గురువచనమిలత్త్వత్ప్రబోధస్త్వదాత్మా ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో = ఓ విష్ణుదేవా!, జీవన్ ముక్తత్వమ్= జీవన్ముక్త స్థితి (ముక్తుడై కూడా జీవించేవాడు)(జీవన్ ఏవ ముక్తః త్యక్తసంసారః–బ్రతికి యుండియే సంసారమును వదిలినవాడు. జీవన్ముక్తుడు ఆత్మజ్ఞానము కలిగినవాడు), ఏవం విధమ్ ఇతి = ఇలా ఉంటుందని చెప్పు, వచసా = మాటల వలన, కిం ఫలం= ఫలితమేమున్నది? (ఆ ప్రాప్తి కలుగదని భావం), అశుద్ధ బుద్ధేః=. చిత్త శుద్ధిలేనివానికి(న శుద్ధః–శుద్ధుడు కానివాడు అపవిత్రుడు అశుద్ధమైనవాడు తప్పుడు ప్రవర్తన కలవాడు), తత్= ఆ స్థితి, దూర దూరే నామ= చాలా దూరముగా ఉండును, భక్తితః = కావున భక్తి కంటె, మనసః లఘు శోధనం = శీఘ్రముగా ఫలించు చిత్త శోధనోపాయము, అన్యత్ న చ= ఇంకొకటి లేదు, తత్ = అందువలన, మే= నాకు, త్వయి= నీయందు, కృత = నాచే అనుష్ఠించబడిన, సకల= శరీర తత్సంబంధమయిన సర్వ క్రియాకలాపమును, ప్రార్పణం = మంత్ర పురస్సర సమర్పణముగా చేయు, భక్తిభారం = విడువని భక్తి భారమును, కృషీష్ఠాః =నాకు కలిగింపుము, యేన = దేని చేత (దానిచేత), మంక్షు= శీఘ్రముగా, కించిత్= ఇంచుక, గురువచన మిలత్= గురువచనము తోడగుట వలన, త్వత్ ప్రబోధః = నీ ప్రబోధము (అనగా బ్రహ్మజ్ఞానమును) పొంది, త్వత్ ఆత్మా స్యాం= నీవే నేనవుతాను.

**తాత్పర్యము:** ఓ విష్ణుదేవా ! జీవన్ముక్త స్థితి ఇలా ఉంటుందని చెప్పు మాటల వలన ఫలితమేమున్నది? చిత్త శుద్ధిలేనివానికి ఆ స్థితి చాలా దూరముగా ఉండును. కావున భక్తి కంటె శీఘ్రముగా ఫలించు చిత్త శోధనోపాయము ఇంకొకటి లేదు (తీర్థస్నానము మొదలయిన ఉపాయములచే అతి శీఘ్రముగ అప్రయత్నముగా భక్తి కలుగును అని భావం) అందువలన నీయందు నాచే అనుష్ఠించబడిన శరీర తత్సంబంధమయిన సర్వ క్రియాకలాపమును మంత్ర పురస్సర సమర్పణముగా చేయు విడువని భక్తి భారమును నాకు కలిగింపుము. (నువ్వు అనుగ్రహిస్తే నేను చేసే సమస్త కర్మఫలములు నిన్నే చేరునని భావం) ఆ భక్తికి గురువచనము తోడుచేసికొని

శీఘ్రముగ బ్రహ్మజ్ఞానము పొంది నీవే నేనవుతాను( అనగా సారూప్య ముక్తిని పొందుతాను అని భావం)

**విశేషాలు**

**జీవన్ముక్తుడు:** శరీరమనే ఉపాధి ప్రారబ్ధం తీరేవరకు ఉండి తీరుతుంది. ఆ లోపుగా జ్ఞానోదయమైనవాడు జీవన్ముక్తుడు. అయినా ప్రారబ్ధం కొద్దీ శరీరమింకా వాడికి ఉంటుంది కనుక అది తీరేవరకూ వాడు జీవించవలసిందే. ఇలాగ ముక్తుడై కూడా జీవించేవాడికి జీవన్ముక్తుడని పేరు. అయినా శరీరాన్ని తనదిగా భావించడతడు. పాము కుబుసంలాగ తనకు దూరంగా ఉన్నట్టే చూస్తుంటాడు. కనుక దేహమున్నా ముక్తుడే. ప్రారబ్ధం తీరితే ఈ జీవన్ముక్తుడే శరీర బంధం తొలగిపోయి విదేహ ముక్తుడౌతాడు.

**94–7 శ్లో.**
**శబ్దబ్రహ్మణ్యపీహ ప్రయతితమనసస్త్వాం న జానంతి కేచిత్**
**కష్టం వంధ్యశ్రమాస్తే చిరతరమిహ గాం బిభ్రతే నిష్ప్రసూతిమ్ ।**
**యస్యాం విశ్వాభిరామాః సకలమలహరా దివ్యలీలావతారాః**
**సచ్చిత్సాంద్రం చ రూపం తవ న నిగదితం తాం న వాచం భ్రియాసమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఇహ= ఈ లోకంలో (అస్మిన్ కాలే, అస్యాం దిశి వా ఇక్కడ ఈ సమయంలో ఈ దిశలో ఈ లోకంలో), కేచిత్ = కొందరు, శబ్దబ్రహ్మణి= శబ్దబ్రహ్మమందు (శబ్దాత్మకం బ్రహ్మన్ శబ్దేషు నిహితం ఆత్మ–పరమాత్మ సంబంధి జ్ఞానమ్ శబ్ద బ్రహ్మ. శబ్దములో వున్న ఆత్మ–పరమాత్మ సంబంధ జ్ఞానము), ప్రయతిత= అతి నిపుణత కలిగిన, మనసః అపి = మనస్సు కలిగినవారయినప్పటికి (మీమాంసాది ఉపాంగములచే చక్కగా పెరిగిన సాంగవేదమందు పరిశ్రమించి వేదాధ్యయనము చేయువారుగూడ), త్వాం= నిన్ను పరబ్రహ్మముగా, న జానంతి= ఎరుగరు, కష్టం =అయ్యో!, వంధ్య శ్రమాః = వృథా శ్రమకు లోనై, తే = వారు, ఇహ= ఇక్కడ, నిష్ప్రసూతిమ్= భక్తి జ్ఞాన ఫలము కలిగింపని, గాం= వాక్కును, జల్ప(ఊరక మాటలాడెడి ఉపయుక్తముకాని మాట) వితండ (స్వపక్షపాతముగ వాదించెడుమాట). రూపమయిన వాక్కును, చిరతరమ్= చాలాకాలము, బిభ్రతే=

పోషిస్తారు. (నిష్ప్రసూతిమ్= వట్టి పోయిన గొడ్డుమోతు అయిన, గాం=గోవును పోషించినట్లుగా వారి శ్రమ అంతయు వ్యర్థమని రెండవ అర్థం), విశ్వ = సకల లోక (విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), అభిరామాః = మనోభిరామములు (అభిరమ్యతే అస్మిన్ సుందరమైనది మనోహరమైనది), సకల మల హరాః = సకల పాపములను హరించునవి (సకల రాగములను హరించునవి) (మలతే ధారయతి వ్యాధ్యాదికమ్ వ్యాధులను ధరించునది. మలము), దివ్య లీలా అవతారాః = శుద్ధసత్త్వమయములయిన శ్రీరామాది అవతారములు గాని, సత్ చిత్ సాంద్రం= సచ్చిదానంద సాంద్రమైన పరబ్రహ్మమయిన, తవ రూపం చ= నీ రూపము, యస్యాం= ఎవరి మాటలందు, న నిగదితం= ప్రతిపాదింపబడలేదో, తాం వాచం = సగుణ నిర్గుణేశ్వర ప్రతిపాదనములు లేని అటువంటి వారి మాటలను, న భ్రియాసమ్= పలుకను గాక పలుకను.

**తాత్పర్యము:** ఈ లోకంలో కొందరు శబ్దబ్రహ్మమందు అతి నిపుణత కలిగిన మనస్సు కలిగినవారయినప్పటికి నిన్ను పరబ్రహ్మముగా ఎరుగరు. అయ్యో! వృథా శ్రమకు లోనై వారు ఇక్కడ భక్తి జ్ఞాన ఫలము కలిగింపని వాక్కును, చాలాకాలము పోషిస్తారు. వట్టి పోయిన గొడ్డుమోతు అయిన, గోవును పోషించినట్లుగా వారి శ్రమ అంతయు వ్యర్థము. విశ్వమనోభిరామములు, సకల పాపములను హరించునవి శుద్ధసత్త్వమయములయిన శ్రీరామాది అవతారములు గాని, సచ్చిదానంద సాంద్రమైన పరబ్రహ్మమయిన నీ రూపము గాని ఎవరి మాటలందు ప్రతిపాదింపబడలేదో సగుణ నిర్గుణేశ్వర ప్రతిపాదనములు లేని అటువంటి వారి మాటలను పలుకను గాక పలుకను.(స్వామి వారి యొక్క రూపమును వర్ణింపని మాటలను పలుకనని భావం)

**94-8 శ్లో.**

**యో యావాన్ యాదృశో వా త్వమితి కిమపి నైవావగచ్ఛామి భూమన్**
**ఏవం చానన్యభావస్త్వదను భజనమేవాద్రియే చైద్యవైరిన్! ।**
**త్వల్లింగానాం త్వదంఘ్రిప్రియజనసదసాం దర్శనస్పర్శనాదిః**
**భూయాన్మే త్వత్ప్రపూజానతినుతిగుణకర్మానుకీర్త్యాదరోఽపి ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా ! (పూర్ణస్వరూపా!), యః = నీ వెవరో, యావాన్ =నీ మహిమ ఏమిటో, యాదృశః వా = నీ పోలిక ఏమిటో, త్వమ్ ఇతి = నువ్వు ఇలా ఉంటావని, కిమ్ అపి= ఏవిధంగాను కొంచెం కూడా, న ఏవ అవగచ్ఛామి= నాకు తెలియదు, చైద్యవైరిన్= ఓ శిశుపాలవైరీ! (చేదీనాం జనపదానాం అయమ్–చేది దేశమునకు సంబంధించినది ఆ దేశపు రాజు. శిశుపాలుడు.)( వైరం అస్తి అస్య–వైరము కలవాడు. శత్రువు), ఏవం చ = ఇలా అయినప్పటికి, అనన్య భావః = నిన్ను సేవించుటలోనే ఏకాగ్రమైన చిత్తము కలవాడినై (న అన్యం అన్యాం వా భజతే ఎవరితో స్నేహం చేయనివాడు ఎవరిని సేవించనివాడు), త్వత్ అనుభజనమ్ ఏవ= నీ సేవ చేయవలెనని, ఆద్రియే= ఉబలాటపడుచున్నాను, త్వత్ లింగానాం= నీ ప్రతిమలకు (లింగ్యతే అనేన–దీనితో వస్తువు తెలుసుకొనబడును. చిహ్నము, గుర్తు), త్వత్ అంఘ్రి ప్రియ జన సదసాం = నీ పాద సేవను చేయు నీ భక్తులను, దర్శన = దర్శించెడి భాగ్యమును, స్పర్శన ఆదిః(భూయాత్ )= వారినిస్పృశించెడి అదృష్టమును నాకు కలిగించు, త్వత్ ప్రపూజా = సకలోపచారములతో నిన్ను పూజించుట, నతి = నమస్కరించుట, (నమతి తస్య భావః, నమనమ్ వంగుట నమస్కారము), నుతి= పొగుడుట (నౌతి తస్య భావః కర్మ వా స్తోత్రము, స్తుతి), గుణ కర్మ = సత్త్వాది గుణములచే నీవు చేసిన సృష్ట్యాది కర్మలను, అనుకీర్తిః= కీర్తించుట, ఆదరః అపి= వాటియందు ఆదరము (ఆద్రియతే తస్య భావః–ఆదరణ), మే భూయాత్= నాకు కలుగుగాక.

**తాత్పర్యము:** సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా! నీ వెవరో, నీ మహిమ ఏమిటో, నీ పోలిక ఏమిటో నువ్వు ఇలా ఉంటావని ఏవిధంగాను కొంచెం కూడా నాకు తెలియదు. ఓ శిశుపాలవైరీ! ఇలా అయినప్పటికి నిన్ను సేవించుటలోనే ఏకాగ్రమైన చిత్తము కలవాడినై, నీ సేవ చేయవలెనని ఉబలాటపడుచున్నాను. నీ ప్రతిమలకు నీ పాద సేవను చేయు నీ భక్తులను దర్శించెడి భాగ్యమును వారినిస్పృశించెడి అదృష్టమును నాకు కలిగించు. సకలోపచారములతో నిన్ను పూజించుట, నమస్కరించుట, పొగుడుట, సత్త్వాది గుణములచే నీవు చేసిన సృష్ట్యాది కర్మలను కీర్తించుట, వాటియందు ఆదరము నాకు కలుగుగాక!

**94-9 శ్లో.**

**యద్యల్లభ్యేత తత్తత్తవ సముపహృతం దేవ దాసోఽస్మి తేఽహం**
**త్వద్గేహోన్మార్జనాద్యం భవతు మమ ముహుః కర్మ నిర్మాయమేవ ।**
**సూర్యాగ్నిబ్రాహ్మణాత్మాదిషు లసితచతుర్బాహుమారాధయే త్వాం**
**త్వత్ప్రేమార్ద్రత్వరూపో మమ సతతమభిష్యందతాం భక్తియోగః ॥**

**ప్రతిపదార్థము:** దేవ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, యత్ యత్ = నాకు ఏది ఏది, లభ్యేత= లభిస్తే, తత్ తత్= అదంతా, తవ = నీకు, సముపహృతం= సమర్పించుకొందును, అహం = నేను, తే = నీ యొక్క, దాసః అస్మి= దాసుడను అయి ఉన్నాను, త్వత్ గేహ = నీ ఆలయ(గో గణేశః గంధర్వః తేన ఈహః ఈప్సితః యత్ర-గణేశుడు లేదా గంధర్వుడు ఇక్కడ వుండవలెనని కోరబడునది), ఉన్మార్జన= సమ్మార్జన( శుభ్రము చేయుట) (ఉన్మార్జనం స్వచ్ఛం కరణం ఉన్మార్జయంతి అనేన-దీనితో శుభ్రం చేయుదురు), ఆద్యం = సేచనము, పుష్పహార సమర్పణము మొదలయిన, కర్మ = క్రియా కలాపము, ముహుః = మాటి మాటికి, నిర్మాయమ్ ఏవ = కపట రహితముగా, భవతు = నాయందు ఏర్పడుగాక!, సూర్యః = సూర్యుడు, (సరతి గచ్ఛతి అంతరిక్షే ఆకాశంలో వెళ్లువాడు. సూర్యుడు), అగ్నిః = అగ్ని (అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని, నిప్పు), బ్రాహ్మణః = బ్రాహ్మణుడు (బ్రహ్మ వేదం శుద్ధ పరచైతన్యం వా అధీతే వేత్తి వేదము గాని, పరచైతన్యము గాని అధ్యయనము చేసినవాడు, తెలిసినవాడు), ఆత్మా ఆదిషు= ఆత్మ మొదలయిన వాటియందు, లసిత= ప్రకాశించు, చతుర్బాహుమ్= చతుర్భుజ స్వరూపుడవైన (చత్వారః బాహవః యస్య-నాల్గు భుజములు కలవాడు. విష్ణువు), త్వాం = నిన్ను, ఆరాధయే= ఆరాధించెదను, త్వత్ ప్రేమ = నిన్ను ప్రేమించే హృదయం, ఆర్ద్రత్వ రూపః= ద్రవించే రూపమైన, భక్తియోగః= భక్తి యోగముగా, మమ= నాలో, సతతమ్ = ఎప్పుడు, అభిష్యందతాం = ప్రవహించుగాక!

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నాకు ఏది ఏది లభిస్తే – అదంతా నీకు సమర్పించుకొందును. నేను నీ యొక్క దాసుడను అయి ఉన్నాను. నీ ఆలయ సమ్మార్జన( శుభ్రము చేయుట) సేచనము, పుష్పహార సమర్పణము మొదలయిన

క్రియా కలాపము మాటి మాటికి కపట రహితముగా నాయందు ఏర్పడుగాక! సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు ఆత్మ మొదలయిన వాటియందు ప్రకాశించు చతుర్భుజ స్వరూపుడవైన నిన్ను ఆరాధించెదను. నిన్ను ప్రేమించే హృదయం ద్రవించే రూపమైన భక్తి యోగముగా నాలో ఎప్పుడు ప్రవహించుగాక! (నా హృదయంలో నీ ప్రేమ రూపమైన భక్తి ఎప్పుడు ఉండుగాక అని భావము).

**విశేషాలు**

**సేచనము:** నైష్ఠిక కర్మలను అనుసరించడంలో మంత్రోదకాన్ని చిలకరించడం, చల్లడం, తడపటం లాంటి క్రియలు ఉంటాయి ఈ క్రియలకు సేచన అని పేరు. ఇందులో ప్రోక్షణం, అవోక్షణం, అభ్యుక్షణం అనే అంగాలు ఉన్నాయి. ప్రోక్షణం అంటే అర చేతిని వెల్లకిల ఉంచి శిరస్సు మీద నీళ్లు చల్లుకోవడం అనే క్రియ. అవోక్షణం అంటే అరచేతిని నేల వైపు తిప్పి శుద్ధి కోసం మంత్రోదకాన్ని చిలకరించడం. అభ్యుక్షణం (అభి + ఉక్షణం) అంటే యాగాలు చేయడం వంటి కార్యాలలో అరచేతిని సంపుటీకరించి జలాన్ని అడ్డంగా చల్లడమనే క్రియ. ఇలా మూడు అంగాలు ఉన్నాయి.

**94-10 శ్లో.**

**ఐక్యం తే దానహోమవ్రతనియమతపస్సాంఖ్యయోగైర్దురాపం**
**త్వత్సంగేనైవ గోప్యః కిల సుకృతితమాః ప్రాపురానందసాంద్రమ్ ।**
**భక్తేష్వన్యేషు భూయస్స్వపి బహుమనుషే భక్తిమేవ త్వమాసాం**
**తన్మే త్వద్భక్తిమేవ ద్రఢయ హర గదాన్ కృష్ణ! వాతాలయేశ! ॥**

**ప్రతిపదార్థము:** ఈశ = ప్రభూ!, కృష్ణ = ఓ కృష్ణా ! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః-భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), దాన= దానములు(దదాతి తస్య భావః కర్మ వా దానము త్యాగము), హోమ = హోమములు(హూయతే దీయతే హవిః దేవేభ్యః అత్ర-ఇక్కడ దేవతలకు హవిస్సు ఇవ్వబడును. యజ్ఞము), వ్రత నియమ= వ్రత నియమములు (వారయతి పాపాచరణాత్ పాపాచరణము నుండి వారించునది. వ్రతము.)(నియచ్ఛంతి రుందంతి అనాచారాదికమ్ దీనితో అనాచారము

ఆపబడును. నియమము కట్టుబాటు), తపః = తపస్సులు (ఐశ్వర్యే తప్యతే ఐశ్వర్యము కలుగుట), సాంఖ్యయోగైః= సాంఖ్య యోగ సాధనలు మొదలగువానివలన కూడా (సంఖ్యాయతే అత్ర సంఖ్యా సమ్యక్ జ్ఞానం సా అత్ర అస్తి సమ్యక్ జ్ఞానం కల్గించునది. సాంఖ్య దర్శనము), దురాపం= లభింపని (దుఃఖేన ఆప్తుం శక్యః–కష్ట సాధ్యమైనది), ఆనందసాంద్రమ్= ఆనందైక రస రూపమయిన (సచ్చిదానంద ఘన రూపమయిన), తే ఐక్యం= నీతో ఐక్యమును (నీ సారూప్య మోక్షము) (ఏకస్య భావః–ఒక్కటి అగుట. ఐక్యత ఐక్యము), సుకృతితమాః= పరమపుణ్యవతులయిన (సుకృతం అనేన సుకృతం అస్తి అస్య– ఇతనిచే మంచి చేయబడినది మంచి కలవాడు పుణ్యవంతుడు శుభయుక్తుడు), గోప్యః= గోపికలు, త్వత్ సంగేన ఏవ= నీతో కలసి మెలసి తిరిగి, ప్రాపుః కిల = పొందిరి, అన్యేషు = నీ భక్తులలో, భూయః = అనేకులైన, సు భక్తేషు అపి = పరమ భక్తులైన ఉద్ధవాదులు ఉన్నప్పటికి వారి కంటె, త్వమ్=నువ్వు, ఆసాం భక్తిమ్ ఏవ= గోపికల భక్తినే, బహు మనుషే = నువ్వు ఆదరింతువు, తత్ =అందువలన, మే= నాకు, త్వత్ భక్తిమ్ ఏవ = నీ ఆ భక్తిని, ద్రఢయ = నాయందు దృఢము సేయుము, వాతాలయ ఈశ = ఓ గురువాయూరు కృష్ణదేవా!, గదాన్= నారోగములను, హర= హరింపుము.

**తాత్పర్యము:** ప్రభూ ! ఓ కృష్ణా ! దానములు, హోమములు, వ్రత నియమములు తపస్సులు, సాంఖ్య యోగ సాధనలు మొదలగువానివలన కూడా లభింపని సచ్చిదానందరూపమయిన నీ సారూప్య మోక్షమును పరమపుణ్యవతులయిన గోపికలు నీతో కలసి మెలసి తిరిగి పొందిరి. నీ భక్తులలో అనేకులైన పరమ భక్తులైన ఉద్ధవాదులు ఉన్నప్పటికి వారి కంటె నువ్వు గోపికల భక్తినే నువ్వు ఆదరింతువు. అందువలన నాకు నీ ఆ భక్తిని నాయందు దృఢము సేయుము. ఓ గురువాయూరు కృష్ణదేవా ! నారోగములను హరింపుము.

**విశేషాలు**

**సాంఖ్యము:** లెక్కించటం. లెక్క. ఇన్ని అని లెక్కపెట్టి చెప్పటం.

ఇరవై నాలుగు తత్త్వాలని పరిగణించి చెప్పింది గనుక కపిలుడి దర్శనానికి

సాంఖ్యమని పేరు వచ్చింది. సంఖ్యానమంటే ధ్యానించటమని కూడా అర్థమే.

సాంఖ్యమంటే జ్ఞానమని కూడా ఒక అర్థముంది. భగవద్గీతలో సాంఖ్య యోగమనే మాటకు జ్ఞానయోగమనే అర్థం. యోగమని, సాంఖ్యమని రెండు మాటలు వస్తాయి గీతలో. యోగమంటే సమాధికాదు, సాంఖ్యమంటే కపిలుని సాంఖ్యమూ కాదు. యోగానికి అర్థం కర్మ. సాంఖ్యానికి అర్థం ఆత్మజ్ఞానం అని వాటి తత్త్వాన్ని బయటపెట్టారు భాష్యకారులు.

**సచ్చిదానందం:** సత్ + చిత్ + ఆనందం. సత్యం, జ్ఞానం, ఆనందం కలసి పరమాత్మ స్వరూపం. భూత, భవిష్యత్, వర్తమానాల వల్ల మార్పు చెందనిదీ, ఎప్పుడూ ఒకే విధంగా ఉండేదీ సత్/ సత్తు. సచ్చిదానందంలో రెండవదైన చిత్/ చిత్తు అంటే ఎరుక. నిరుపాధికం, నిరతిశయం, నిరుపమానం అయి ఎప్పటికీ ఉండే సుఖానుభూతి ఆనందం. దీపానికి ఎరుపు తెలుపుల మిశ్రమ వర్ణం, వేడి, కాంతి ఎలా స్వాభావికంగా కలసి ఉంటాయో అలా సత్తు, చిత్తు, ఆనందం మిళితమై ఉంటాయి. అవి అభిన్నం.

***ఏకాదశ స్కంధము***

**94వ దశకము సమాప్తము**

# దశకమ్ 95 – ధ్యానయోగము, మోక్షప్రాప్తిమార్గము

**95–1 శ్లో.**

**ఆదౌ హైరణ్యగర్భీం తనుమవికలజీవాత్మికామాస్థితస్త్వం**
**జీవత్వం ప్రాప్య మాయాగుణగణఖచితో వర్తసే విశ్వయోనే! ।**
**తత్రోద్వృద్ధేన సత్త్వేన తు గుణయుగళం భక్తిభావం గతేన**
**ఛిత్త్వా సత్త్వం చ హిత్వా పునరనుపహితో వర్తితాహే త్వమేవ ॥**

**ప్రతిపదార్థము:** విశ్వయోనే= విశ్వోత్పత్తికి కారణమైన దేవా ! (విరాట్ఛరీరస్య యోనిః కారణమ్), ఆదౌ = బ్రహ్మ ప్రళయం చివర( సృష్టి యొక్క ప్రారంభమున), త్వం = నువ్వు సృష్టి చేయాలనుకొని, అవికల జీవ ఆత్మికామ్= సమస్త జీవుల యొక్క సూక్ష్మమరియు సమష్టి శరీర రూపమైన( జీవ శబ్దము ఇక్కడ సూక్ష్మ శరీర ప్రతీక) (న వికలః న క్షతః న ఖండితో వా ఖండించబడనిది సంపూర్ణము సువ్యవస్థితమైనది), హైరణ్యగర్భీం తనుమ్= హిరణ్య గర్భ శరీరములో (హిరణ్యగర్భస్యైవం హైరణ్యగర్భీం) (హిరణ్య స్వర్ణాండం గర్భః ఉత్పత్తిస్థానం యస్య–బంగారు అండము నుండి పుట్టినవాడు), ఆస్థితః = ఉండి(ఆస్థితః ఆతిష్ఠతి అసౌ ఒకచోట వుండువాడు), జీవత్వం= తరువాత జీవత్వమును, ప్రాప్య= పొందితివి, మాయా గుణ= మాయ గుణముల యొక్క, గణ= తత్కార్యములైన మహదహంకార భూతేంద్రియ ప్రాణపంచక స్వరూపములైన తత్త్వముల యొక్క, ఖచితః = స్వరూపముగాగల శరీరము చేత సంబద్ధుడవై (ఖచితః బద్ధ–పొదగబడినది బంధింపబడినది), వర్తసే = శరీరాభిమానివి (సంసారివి) అగుచుందువు, తత్ర = ఆ మాయాగుణములలో, ఉద్వృద్ధేన = సత్త్వగుణము యొక్క అభివృద్ధి పెంపొందినపుడు, భక్తిభావం గతేన = భక్తి భావ పరిణత్వము కలుగును, సత్త్వేన తు = సత్వ గుణము చేత, గుణయుగళం= రజస్సు మరియు తమో కార్యభూతమైన (మాయామయమైన) శరీరాదికమును, ఛిత్త్వా = ఛేదించి, పునః=మరలా, సత్త్వం చ= సత్వ రూప గుణమును కూడా, హిత్వా= విడిచి కార్యకారణములకు అభేద మేర్పడుటవలన, అనుపహితః = ఉపాధి రహితుడవై నిరావరణమైన పరిపూర్ణ

బ్రహ్మము గా ఉన్న, త్వమ్ ఏవ= ఒక్కడిగా మిగిలిన నీతో ఐక్యము పొంది నీవే నేనై, వర్తితా హే= వర్తించెదను.

**తాత్పర్యము:** విశ్వోత్పత్తికి కారణమైన దేవా ! సృష్టి యొక్క ప్రారంభమున నువ్వు సృష్టి చేయాలనుకొని సమస్త జీవుల యొక్క సూక్ష్మమరియు సమష్టి శరీర రూపమైన హిరణ్య గర్భ శరీరములో ఉండి తరువాత జీవత్వమును పొందితివి. మాయ గుణముల యొక్క తత్కార్యములైన మహదహంకార భూతేంద్రియ ప్రాణపంచక స్వరూపములైన తత్త్వముల యొక్క స్వరూపముగాగల శరీరము చేత సంబద్ధుడవై శరీరాభిమానివి (సంసారివి) అగుచుందువు. ఆ మాయాగుణములలో సత్త్వగుణము యొక్క అభివృద్ధి పెంపొందినపుడు భక్తి భావ పరిణత్వము కలుగును. సత్వ గుణము చేత రజస్సు మరియు తమో కార్యభూతమైన (మాయామయమైన) శరీరాదికమును ఛేదించి మరలా సత్వ రూప గుణమును కూడా విడిచి కార్యకారణములకు అభేద మేర్పడుటవలన ఉపాధి రహితుడవై నిరావరణమైన పరిపూర్ణ బ్రహ్మము గా ఉన్న ఒక్కడిగా మిగిలిన నీతో ఐక్యము పొంది నీవే నేనై వర్తించెదను.

**విశేషాలు**

**హిరణ్యగర్భ:** హిరణ్యమంటే బంగారమని వాచ్యార్థం. బంగారమంటే ఇక్కడ భౌతికమైన లోహమని కాదు. లాక్షణికంగా చెబితే బంగారం జ్ఞానప్రకాశమే. అది గర్భంలో గుప్తం చేసుకున్న వ్యక్తి ఎవడో అతడు హిరణ్యగర్భుడు. కార్యబ్రహ్మమని అర్థం. అంటే పరమాత్మే సగుణ రూపంగా హిరణ్యగర్భుడయ్యాడు. గుణాలు ఆవరించినా అందులో హిరణ్యం అంటే బంగారులాగా ప్రకాశించే చైతన్యం తొంగి చూస్తూనే ఉంది. కనుకనే హిరణ్యగర్భుడనే పేరు వచ్చింది.

**మహత్ :** సాంఖ్యుల పంచవింశతి తత్వాలలో ఒకటి. అవ్యక్తమైన ప్రధానం నుంచి వచ్చిన రెండవ భూమిక.

అద్వైతుల భాషలో ఇది అవ్యాకృత సూక్ష్మప్రపంచం. దానికి అధిపతి అయిన జీవుడు హిరణ్యగర్భుడు. అంటే సమష్టి బుద్ధి.

**అహమ్/అహంకార:** అహమంటే నేను అని శబ్దార్థం. అలా భావించటమే అహంకారం. నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించగలిగితే ఇది ఆత్మస్వరూపమే. అలాకాక సోపాధికమైతే ఇదే అనాత్మలాగా మారిపోతుంది. కర్తృరూపమైనది అహంకారమైతే సాక్షిరూపమైన చైతన్యమాత్మ. అహంకారానికే కర్త్రాత్మ అని పేరుపెట్టారు వేదాంతులు. ఇది చిదాభాసుడే గాని కేవల చిద్రూపం కాదు. అంటే జీవుడని అర్థం. ఇలాంటి జీవుడే అసలైన ఆత్మ అని భ్రమించారు పూర్వమీమాంసకులు.

**95-2 శ్లో.**

**సత్త్వోన్మేషాత్ కదాచిత్ ఖలు విషయరసే దోషబోధేఽపి భూమన్!**
**భూయోఽప్యేష ప్రవృత్తి స్సతమసి రజసి ప్రోద్ధతే దుర్నివారా ।**
**చిత్తం తావద్గుణాశ్చగ్రథితమిహ మిథస్తాని సర్వాణి రోద్ధుం**
**తుర్యే త్వయ్యేక భక్తిశ్శరణమితి భవాన్ హంసరూపీ న్యగాదీత్ ॥**

**ప్రతిపదార్థము:** భూమన్= సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్థమా ! (పూర్ణస్వరూపా!), సత్వ = సత్వ గుణము, ఉన్మేషాత్=అభివృద్ధి చెందినప్పుడు (ఉన్మేషః వికాసః నేత్రోన్మీలనమ్ వికాసము), కదాచిత్ ఖలు= అప్పుడప్పుడు, విషయ రసే = విషయరసమందు(విషయాస్వాదనములో) (విషిణ్వంతి విషయినం సంబధ్నంతి స్వాత్మకతయా స్వేనరూపేణ నిరూపణీయం, కుర్వంతి సుఖ దుఃఖాదయః-తన స్వరూపంతో ఇంద్రియాలను, పదార్థములను బంధించునది), దోష బోధే అపి= దోష దృష్టి ఏర్పడినను (విషయ వాంఛలు తుచ్ఛములని బోధ కలిగినప్పటికి), స తమసి రజసి ప్రోద్ధతే= తమోగుణముతో కూడిన రజోగుణము ప్రబలమైనప్పుడు, ఏషః= ఈ ఇంద్రియ సుఖములందు, భూయః అపి = మరలా చెలరేగు, ప్రవృత్తిః =ఆసక్తిని, దుర్నివారా= నివారించుట కష్టమగును, తావత్ = అప్పుడు, చిత్తం = చిత్తము (చిత్యతే జ్ఞాయతే అనేన-దీనితో తెలుసుకుందురు. మనస్సు బుద్ధి అంతఃకరణము), గుణాః చ= సత్వాది గుణములు, మిథః గ్రథితమ్= ఒకదానితో ఒకటి కలిసిపోవును.(మేథతి కలియుట )(గ్రథితః గుంఫిత రచితో వా రచింపబడినది అల్లబడినది), ఇహ = ఇక్కడ, తాని సర్వాణి = త్రిగుణములు,

విషయ ప్రవృత్తి మొదలగు వానితో కలిసిన మనస్సును, రోద్ధుం= నిరోధించుటకు, తుర్యే = అవస్థాత్రయాతీతుడవైన (తురీయావస్థలో ఉన్న), త్వయి= నీయందు, భక్తిః ఏకః= భక్తి అను ఒక్కటియే, శరణమ్ ఇతి = శరణము అని, భవాన్ = నువ్వు, హంసరూపీ= హంసావతారములో, న్యగాదీత్= బ్రహ్మ సమక్షములో సనకాది ఋషులకు ఉపదేశించితివి.

**తాత్పర్యము:** సామ్యం లేని అనుభవ రూపమైన బ్రహ్మ పదార్ధమా!(పూర్ణస్వరూపా!) జీవునిలో సత్వ గుణము అభివృద్ధి చెందినప్పుడు అప్పుడప్పుడు విషయాస్వాదనములో దోష దృష్టి ఏర్పడినను –తమోగుణముతో కూడిన రజోగుణము ప్రబలమైనప్పుడు ఈ ఇంద్రియ సుఖములందు మరలా చెలరేగు ఆసక్తిని నివారించుట కష్టమగును. అప్పుడు చిత్తము సత్వాది గుణములు ఒకదానితో ఒకటి కలిసిపోవును. త్రిగుణములు, విషయ ప్రవృత్తి మొదలగు వానితో కలిసిన మనస్సును నిరోధించుటకు నీయందు భక్తి అను ఒక్కటియే శరణము అని హంసావతారములో నీవు బ్రహ్మ సమక్షములో సనకాది ఋషులకు ఉపదేశించితివి. (పాలను నీటిని విభజించునది హంస. అట్లు ఆత్మను అనాత్మను విభజించు స్వామికి హంస పద ప్రయోగము ఇక్కడ సముచితమైనది)

**విశేషము**

**విషయ / విషయి:** జ్ఞానానికి గోచరించేది విషయం. జ్ఞానమే అయితే అది విషయి. విషయి అంటే నేననే భావం. ఆత్మచైతన్యరూపమైనది అది. పోతే దానికి గోచరించే సమస్తమూ విషయి కాదు. అది విషయం. ఆత్మా నాత్మలని ఈ రెండింటికీ మారుపేరు. ఒకటి గమనించేది, మరొకటి గమనించబడేది. ప్రమాత ప్రమేయం. జ్ఞాతా జ్ఞేయం అని కూడా వీటికే నామాంతరం. ప్రపంచమంతా ఈ రెండు విధాలుగానే విభక్తమై ఉన్నది. ఇందులో రెండూ వాస్తవమే నంటారు మతాచార్యులందరూ. ఒక అద్వైతి మాత్రమే రెండూ లేవు, రెండవదైన విషయం కేవలం విషయి రూపమే. అదే మరో రూపంలో భాసిస్తున్నదని సిద్ధాంతం చేస్తారు.

**చిత్త:** అంతఃకరణ చతుష్టయంలో మూడవది. సంవేదనాత్మకం చిత్తం. ప్రత్యేకించి చెప్పకపోతే సామాన్యంగా మనస్సనే అర్థం.

**తుర్య/తురీయ:** చతుర్య చతురీయ అనే మాటలలో మొదటి వర్ణమైన చ కారం లోపించి ఈ రెండు మాటలు ఏర్పడ్డాయంటారు భాషాకోవిదులు. నాలుగవదని అర్థం. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడూ దాటిపోయిన తర్వాత కలిగేది గనుక ఇది నాలుగవది. ఏదోకాదు సమాధి దశ.

ఇదంతా దృష్టితో కాక అహంతా దృష్టితో చూస్తే అవస్థాత్రయం కూడా వాస్తవంలో తురీయమే. ఆ మాటకు వస్తే తురీయమే అసలున్నదశ. అదే అజ్ఞానవశాత్తూ మనకు అవస్థాత్రయంగా భాసిస్తున్న దంటారు అద్వైతులు. జ్ఞానోదయమైతే అవస్థాత్రయమే మరలా తురీయంగా మన అనుభవానికి రాగలదు.

**95-3 శ్లో.**

**సంతి శ్రేయాంసి భూయాంస్యపి రుచిభిదయా కర్మిణాం నిర్మితాని**
**క్షుద్రానందాశ్చ సాంతా బహువిధగతయః కృష్ణ తేభ్యో భవేయుః ।**
**త్వం చాచఖ్యాథ సఖ్యే నను మహితతమాం శ్రేయసాం భక్తిమేకాం**
**త్వద్భక్త్యానందతుల్యః ఖలు విషయజుషాం సమ్మదః కేన వా స్యాత్ ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ =ఓ గురువాయూరు కృష్ణ దేవా! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), కర్మిణాం= కర్మలను ఆచరించుచున్న మానవులకు, రుచి భిదయా= వారి వారి అభిరుచిని అనుసరించి(రాగాది గుణాలను బట్టి) (రోచతే శోభతే ప్రకాశము, కాంతి, కోరిక, అభిలాష), భూయాంసి శ్రేయాంసి అపి= అనేక శ్రేయో మార్గములను, నిర్మితాని సంతి=బృహస్పతి వ్యాస పతంజలి మొదలయిన మన పూర్వాచార్యులు చెప్పారు, తేభ్యః = వారు సూచించిన శ్రేయో మార్గములలో, బహువిధగతయః = అనేక మార్గములు, భవేయుః= ఉన్నవి, క్షుద్ర ఆనందాః చ = దుఃఖమిశ్రితములయిన స్వల్ప సుఖములు (స్వర్గ లాభాది ఫల దాయకములైనవి) (క్షుణత్తి సంపినష్టి అసౌ అధమ)(ఆనందయతి నితరాం తోషయతి అసౌ ఆనందింపచేయునది. సంతోషము), సాంతాః చ = అనిత్యములు, త్వం చ= నువ్వు, శ్రేయసాం = శ్రేయోమార్గముల మధ్యలో( అనయోః అతిశయేన ప్రశస్త్యః-ఇద్దరిలో

ప్రశంసనీయుడు. ధర్మము మోక్షము), భక్తిమ్ ఏకాం= భక్తి మాత్రమే, మహితతమాం = ఉత్తమోత్తమైనదని, సఖ్యే = నీ మిత్రుడగు ఉద్ధవునికి, ఆచఖ్యాథ నను = చెప్పావు, విషయజుషాం ఖలు= విషయలోలురైనవారికి (లౌకిక జీవనము గడపు సామాన్య మానవులకు), త్వత్ భక్తి= నీయొక్క భక్తి చేత కలుగు, ఆనంద తుల్యః = ఆనందముతో సమానమైన, సమ్మదః = సుఖము (సం అత్యంతం మాద్యతి హృష్టో భవతి తస్య భావః కర్మ వా హర్షము సంతోషము), కేన వా స్యాత్= ఎక్కడా ప్రాప్తించును? (ఎక్కడా ప్రాప్తించదని భావం)

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా !కర్మలను ఆచరించుచున్న మానవులకు వారి వారి అభిరుచిని అనుసరించి అనేక శ్రేయో మార్గములను బృహస్పతి, వ్యాస, పతంజలి మొదలయిన మన పూర్వాచార్యులు చెప్పారు . వారు సూచించిన శ్రేయో మార్గములలో అనేక మార్గములు ఉన్నవి.వానివలన కలుగు దుఃఖమిశ్రితములయిన స్వల్ప సుఖములు అనిత్యములు. నువ్వు శ్రేయోమార్గముల మధ్యలో భక్తి మాత్రమే ఉత్తమోత్తమైనదని నీ మిత్రుడగు ఉద్ధవునికి చెప్పావు .విషయలోలురైనవారికి నీయొక్క భక్తి చేత కలుగు ఆనందముతో సమానమైన సుఖము ఎక్కడా ప్రాప్తించదు.

**95-4 శ్లో.**
**త్వద్భక్త్యా తుష్టబుద్ధేస్సుఖమిహ చరతో విచ్యుతాశస్య చాశాః**
**సర్వాః స్యుః సౌఖ్యమయ్యః సలిల కుహరగస్యేవ తోయైకమయ్యః ।**
**సోఽయం ఖల్వింద్రలోకం కమలజభవనం యోగసిద్ధీశ్చ హృద్యాః**
**నాకాంక్షత్యేతదాస్తాం స్వయమనుపతితే మోక్షసౌఖ్యేఽప్యనీహః ॥**

**ప్రతిపదార్థము:** సలిల కుహరగస్య= ఒక పెద్ద మడుగులో చొచ్చినవానికి(సలతి గచ్ఛతి ప్రవహతి ప్రవహించునది. జలము)(కుం భూమిం హరతి భూమిని హరించునది. గుంట), తోయ ఏకమయ్యః ఇవ= అంతయును నీటిమయముగా తోచుచున్నట్లు(తవతే వర్ధయతే వృద్ధిం గచ్ఛతి వా దీనిని నింపుదురు. నీరు), త్వత్ భక్త్యా = నీయందు అనన్య భక్తిగల, తుష్టబుద్ధేః = ఆనంద పరునికి అంతటా, ఏతత్ = ఆనందము, ఆస్తాం = కలుగును.(గాక), ఇహ = ఆ భక్తుడు ఈలోకములో అంతటా, విచ్యుత ఆశస్య = ఎట్టి ఆశలు పొందక (అధికం చ్యుతః, అధఃపతితః-

క్రిందబడినది, జారిపోయినది, దిగజారినది), సుఖమ్ చరతః చ = సుఖముగా చరిస్తాడు, సర్వాఃఆశాః = సర్వాశలు (సర్వదిక్కులు)(ఆసమంతాత్ అశ్నుతే అన్నిటివైపు పోవునది. కోరిక ఆశ), సౌఖ్యమయ్యః స్యుః= సుఖమయములగును, సః అయం ఖలు = ఆభక్తుడు, ఇంద్రలోకం = స్వర్గ లోకమునుకాని, కమలజ భవనం = బ్రహ్మలోకమును కాని, హృద్యాః = మనోహరమై(పరహృదయం బధ్యతే అనేన వశీకరణ మంత్రః-దీనితో పరుల హృదయము బంధించబడును), న యోగసిద్ధీః= అణిమా మహిమాది యోగసిద్ధులను కాని (యుజ్యతే మనః ఆత్మనా యోగః చిత్తవృత్తినిరోధః-ఆత్మయందు మనసు కలిగి యుండుట. ధ్యానము, చిత్తవృత్తులను నిరోధించుట)(సిద్ధ్యత్యనేన-దీనితో సిద్ధించును. సిద్ధి), న ఆకాంక్షతి= కోరుకొనడు, అసౌ= నీ భక్తుడు, స్వయమ్= స్వయముగా (అప్రయత్నముగా), మోక్ష సౌఖ్యే అపి = మోక్షానందము, అనుపతితే చ = లభించినను, అనీహః=ఆసక్తి చూపడు.

**తాత్పర్యము:** ఒక పెద్ద మడుగులో చొచ్చినవానికి అంతయును నీటిమయముగా తోచుచున్నట్లు నీయందు అనన్య భక్తిగల ఆనంద పరునికి అంతటా ఆనందము కలుగును. ఆ భక్తుడు ఈలోకములో అంతటా ఎట్టి ఆశలు పొందక సుఖముగా చరిస్తాడు. సర్వాశలు (సర్వదిక్కులు) సుఖమయములగును.(ఆ భక్తుడు అనుభవించు విషయములన్ని సుఖాత్మకములగునని భావము) ఆభక్తుడు స్వర్గ లోకమునుకాని బ్రహ్మలోకమును కాని మనోహరమైన అణిమా మహిమాది యోగసిద్ధులను కాని కోరుకొనడు. నీ భక్తుడు అప్రయత్నముగా మోక్షానందము లభించినను ఆసక్తి చూపడు.

**95-5 శ్లో.**
**త్వద్భక్తో బాధ్యమానోఽపి చ విషయరసైరింద్రియాశాంతి హేతోః**
**భక్త్యైవాక్రమ్యమాణైః పునరపి ఖలు తైర్దుర్బలైర్నాభిజయ్యః ।**
**సప్తార్చిర్దీపితార్చిర్దహతి కిల యథా భూరిదారు ప్రపంచం**
**త్వద్భక్త్యోఘే తథైవ ప్రదహతి దురితం దుర్మదః క్వేంద్రియాణామ్ ॥**

**ప్రతిపదార్థము:** అశాంతిహేతోః = అశాంతికి హేతువులైన (శామ్యతి తస్య భావః

కర్మ వా శాంతి చిత్తోపశమనము ఇంద్రియ నిగ్రహము.దీనికి వ్యతిరేకము అశాంతి), ఇంద్రియ విషయ రసైః = ఇంద్రియార్థములచే (విషయానందములచే) (ఇంద్రస్య ఆత్మనః అనుమాపకం లింగమ్ ఆత్మను ఊహింపజేసే (శరీరంలో గల) చిహ్నము. జ్ఞానసాధనములైన ఇంద్రియములు), త్వత్ భక్తః= నీ యొక్క భక్తుడు, బాధ్యమానః అపి= బాధింపబడినప్పటికి, తైః = వాటి చేత, న అభిజయ్యః ఖలు= వశీకరింపబడడు. (లొంగడు) (అభిజయ =పూర్ణవిజయః–జయము, విజయము), పునః అపి చ = మరలా కారణము ఏమనగా, భక్త్యా ఏవ = భక్తియే బలమైనది, ఆక్రమ్యమాణైః దుర్బలైః= ఆక్రమించిన ఇంద్రియ శక్తులు బలహీనములు, యథా= ఎట్లు, దీపితార్చిః సప్తార్చిః= చెలరేగిన దావాగ్ని (దీపితః ప్రకాశితః అగ్నౌ దగ్ధో వా ప్రకాశింపబడినది అగ్నియందు కాల్చబడినది.) (అర్చి=అర్చతి దేవాదికం అనయా అగ్నిజ్వాల)(సప్త అర్చయః యస్యఏడు జ్వాలలు గలవాడు. అగ్ని), భూరి దారు ప్రపంచం= గొప్పవైన వన వృక్షములను(దీర్యతే అసౌ చీల్చబడునది. చెట్టు కట్టె), దహతి కిల = దహించి వేసినట్లు, తథా ఏవ = అట్లే, త్వత్ భక్తి ఓఘే = నీ భక్తి తేజః ప్రభావము, దురితం = పాపములను(దుష్టం ఇతం గమనం నరకాది ప్రాప్తిః అనేన–దీనితో నరమును పొందుదురు. పాపము దురాచారము),ప్రదహతి = కాల్చివేయును, ఇంద్రియాణామ్ = ఇక ఇంద్రియముల, దుర్మదః = పొగరు, క్వ = ఎక్కడ?

**తాత్పర్యము:** అశాంతికి హేతువులైన విషయానందములచే నీ యొక్క భక్తుడు బాధింపబడినప్పటికి వాటికి లొంగడు. మరలా కారణము ఏమనగా భక్తి బలమైనది. ఆక్రమించిన ఇంద్రియ శక్తులు బలహీనములు ( భక్తి ప్రభావమున అతనిలోని భోగాసక్తులు నశించునని భావం) చెలరేగిన దావాగ్ని గొప్పవైన వన వృక్షములను ఎట్లు దహించి వేయునో అట్లే నీ భక్తి తేజః ప్రభావము పాపములను కాల్చివేయును. ఇక ఇంద్రియముల పొగరు ఎక్కడ? (భక్తిని ఎదుర్కొను శక్తి ఇంద్రియములకు లేదు. అందువలన భక్తి చే పాపములు నశించునని భావం)

**విశేషాలు**

**సప్తార్చిః:** కాలీ కరాలీ చ మనోజవా చ/సులోహితా యా చ సుధూమ్రవర్ణా/

స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ/లేలాయమానా ఇతి సప్తజిహ్వాః ( ముండకోపనిషత్ ప్రథమ ముండకము . ద్వితీయ ఖండము 04 వ మంత్రము)

కాలీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వరుచీదేవీ అనునవి కదులుతున్న అగ్ని యొక్క ఏడు నాలుకలు

**ముమోచ చ శిలాశ్శైలో** విశాలాసమనశ్శిలాః । మధ్యమేనార్చిషా జుష్టో ధూమరాజీః ఇవానలః అని వాల్మీకి సుందరకాండ.(1-16) సప్తార్చులలో మధ్యమార్చి అనునది సులోహిత.దాని జ్వాలలనుండి పొగలు వెలువడుచున్నట్లుగా ఆంజనేయునిచే అదుమబడిన ఆ మహేంద్ర గిరి నుండి పెద్ద పెద్ద ఎర్రని శిలలు ముక్కలు ముక్కలుగా బయట పడ్డాయి.

**95-6 శ్లో.**

**చిత్తార్ద్రీభావముచ్చైర్వపుషి చ పులకం హర్షభాష్పం చ హిత్వా**
**చిత్తం శుద్ధ్యేత్ కథం వా కిము బహుతపసా విద్యయా వీతభక్తేః ।**
**త్వద్గాథాస్వాదసిద్ధాంజనసతతమరీమృజ్యమానోఽయమాత్మా**
**చక్షుర్వత్ తత్త్వసూక్ష్మం భజతి న తు తథాభ్యస్తయా తర్కకోట్యా ॥**

**ప్రతిపదార్థము:** చిత్త ఆర్ద్రీభావమ్ = భక్తి తత్పరతలో చిత్తము ద్రవింపకుండా(అర్దతి సించతి తస్య భావః-తడిసినది), వపుషి = శరీరమునందు(వుప్యంతే దేహాంతర భోగసాధన బీజీభూతాని కర్మాణి అత్ర-దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది. శరీరము), ఉచ్చైః పులకం చ= ఉన్నతమైన పులకలు (పోలయంతి రోమాణి అత్ర-వెంట్రుకలు నిక్కపొడుచును. రోమాంచము), హర్షబాష్పం చ= కన్నులలో ఆనంద బాష్పములు(హృష్యతి తస్య భావః-సుఖము సంతోషము రోమాంచము.)(బాధతే నేత్రే నేత్రములను బాధించునది. కన్నీరు, ఆవిరి), హిత్వా= లేక, చిత్తం= మనస్సు, కథం వా= ఎట్లు, శుద్ధ్యేత్ = పరిశుద్ధమగును?, వీత భక్తేః = భక్తి లేని(గతః-వెళ్లిపోయిన), బహు తపసా= ఉగ్ర తపస్సులు, విద్యయా = సమగ్ర విద్య (శాస్త్ర జ్ఞానము) (వేద్యంతే జ్ఞాయంతే విషయాః అనయా దీనితో విషయములు తెలుసుకొనబడును. విద్య), కిము= ఎందుకు?, సిద్ధ

అంజన= సిద్ధాంజనముచే(అజ్యతే శుభ్రం క్రియతే అనేన శుభ్రము చేయునది. కాటుక), సతత= మరలా మరలా, మరీమృజ్యమానః = శోధింపబడి నిర్మలమైన(మార్జనీయమ్–తుడువదగినది), చక్షుః వత్= కన్ను వలె (చష్టే పశ్యతి అనేన–దీనితో చూచుదురు. కన్ను), అయమ్ ఆత్మా = ఈ మనస్సు, త్వత్ గాథా = నీకథాగానములను(గీయతే అసౌ పాడబడునది ఆర్యాఛందస్సు దేశభాషలలో చేయబడిన రచన), ఆస్వాద= ఆస్వాదించుచూ, తత్త్వసూక్ష్మం= పరతత్త్వమును (తతో భావః తస్య భావో వా–దాని స్వరూపము సత్యము), భజతి = దర్శించును, తథా= అట్లుగాక, తర్కకోట్యా = తర్కము మొదలగు ఎన్ని శాస్త్రములు, అభ్యస్తయా= అభ్యసించినప్పటికి, న తు= పరతత్త్వము బోధపడదు.

**తాత్పర్యము:** భక్తి తత్పరతలో చిత్తము ద్రవింపకుండా– శరీరమునందు పులకలు, కన్నులలో ఆనంద బాష్పములు లేక మనస్సు ఎట్లు పరిశుద్ధమగును? ( పరిశుద్ధము కాదని భావం) భక్తి లేని తపస్సులు , శాస్త్ర జ్ఞానము ఎందుకు? (భక్తి ముఖ్యమని భావం) సిద్ధాంజనముచే మరలా మరలా శోధింపబడి నిర్మలమైన కన్ను వలె ఈ మనస్సు నీకథాగానములను ఆస్వాదించుచూ పరతత్త్వమును దర్శించును. అట్లుగాక తర్కము మొదలగు ఎన్ని శాస్త్రములు అభ్యసించినప్పటికి పరతత్త్వము బోధపడదు.

**95–7 శ్లో.**

**ధ్యానం తే శీలయేయం సమతనుసుఖబద్ధాసనో నాసికాగ్ర–**
**న్యస్తాక్షః పూరకాద్యైర్జితపవనపథశ్చిత్తపద్మం త్వవాంచమ్ ।**
**ఊర్ధ్వాగ్రం భావయిత్వా రవివిధుశిఖినస్సంవిచింత్యోపరిష్టాత్**
**తత్రస్థం భావయే త్వాం సజలజలధరశ్యామలం కోమలాంగమ్ ॥**

**ప్రతిపదార్థము:** తే =నీ యొక్క, ధ్యానం= ధ్యానమును (ధ్యాయతి తస్య భావః–ధ్యానము చేయుట ఆలోచించుట మననం చేయుట), శీలయేయం=ఇలా అభ్యసింపవలెను, సమ తను = శరీరము తల మెడ సమరేఖలో ఉంచి(తనోతి తన్యతే వా విస్తరించునది పెరుగునది. శరీరము),సుఖ బద్ధ ఆసనః =సుఖాసనమున కూర్చుండవలెను, నాసికా అగ్ర = ముక్కు చివర (నాసతే శబ్దాయతే శబ్దము

చేయునది. ముక్కు), న్యస్త అక్షః = చూపు నిలుపవలెను, పూరక ఆద్యైః= పూరక రేచక కుంభక రూపముల ద్వారా ( పూర్యతే అనేన–దీనితో పూరింపబడును ఊపిరి పూరించుట), జిత పవన పథః= ప్రాణాయామము(ప్రాణవాయువును నిరోధించుట) ద్వారా వాయుపథమును కఫాదిదోష రహితముగ చేసుకొనవలెను, అవాంచమ్= అధోముఖముగా ఉండు, చిత్తపద్మం తు= చిత్త కమలమును, ఊర్ధ్వ అగ్రం భావయిత్వా = ఊర్ధ్వముఖముగా నిటారుగా ఉన్నట్లు భావించుకొని, ఉపరిష్టాత్= దాని మీది వైపు, రవి విధు శిఖినః = సూర్య చంద్ర అగ్నులను (రూయతే స్తూయతే అసౌ స్తుతింపబడువాడు. సూర్యుడు.)(విధ్యతి విరహిణమ్, విధ్యతే గ్రస్యతే రాహునా విరహిణులను వేధించువాడు రాహువుచే మ్రింగబడువాడు. చంద్రుడు)(అంగతి ఊర్ధ్వం గచ్ఛతి పైకి వెళ్లునది. అగ్ని), సంవిచింత్య = ధ్యానించి, తత్రస్థం= ఆ అగ్ని మధ్యమున, సజల జలధర శ్యామలం= నీల మేఘ శ్యాముడవు, కోమలాంగమ్= సుకుమార శరీరము కలిగిన, త్వాం= నిన్ను, భావయే= ధ్యానింపవలెను.

**తాత్పర్యము:** నీ యొక్క ధ్యానమును ఇలా అభ్యసింపవలెను. "శరీరము ,తల, మెడ సమరేఖలో ఉంచి సుఖాసనమున కూర్చుండవలెను. ముక్కు చివర చూపు నిలుపవలెను. ( కన్నుల నిమీలనము వలన మనో లయము. కన్నుల ఉన్మీలనము వలన మనో విక్షేపము. అందువలన ఈరెండూ లేకుండా ఉండుట కొరకు ముక్కు చివర చూపు) పూరక రేచక కుంభక రూపముల ద్వారా ప్రాణాయామము ద్వారా వాయుపథమును (వాయు సంచలనమార్గమైన నాడీవివరమును) కఫాదిదోష రహితముగ చేసుకొనవలెను . అధోముఖముగా ఉండు చిత్త కమలమును ఊర్ధ్వముఖముగా నిటారుగా ఉన్నట్లు భావించుకొని దాని మీది వైపు ( ఆ పద్మపు దుద్దు నందు క్రమముగా ఒకదాని మీద ఒకటి ఉన్నట్లు) సూర్య చంద్ర అగ్నులను ధ్యానించి , ఆ అగ్ని మధ్యమున నీల మేఘ శ్యాముడవు సుకుమార శరీరము కలిగిన నిన్ను ధ్యానింపవలెను."

**95-8 శ్లో.**

**ఆనీలశ్లక్ష్ణ కేశం జ్వలితమకరసత్కుండలం మందహాస**
**స్యందార్ద్రం కౌస్తుభశ్రీ పరిగతవనమాలోరుహారాభిరామమ్ ।**

**శ్రీవత్సాంకం సుబాహుం మృదులసదుదరం కాంచనచ్ఛాయచేలం**
**చారుస్నిగ్ధోరుమంభోరుహలలితపదం భావయేఽహం భవంతమ్ ॥**

**ప్రతిపదార్థము:** ఆనీల= నల్లదనముతో నిగనిగలాడు(ఈషత్ నీలః కొంచెము నలుపు), శ్లక్ష్ణ = అంటుకొన్న (శ్లిష్యతి– అంటుకొనునది), కేశం = కేశములు (క్లిష్నాతి అసౌ కష్టపెట్టునది. దుఃఖము), జ్వలిత=తళతళలాడు (జ్వలితః దగ్ధః దీప్తః ప్రకాశితః–ప్రకాశింపబడినది), మకర సత్కుండలం= మకరకుండలముల కాంతులు(మకరాకృతి కుండలం కర్ణభూషణమ్ మకరాకృతి గల చెవులకు ధరించు అలంకారము, మొసలిముఖాకృతి గల పురుషుని కర్ణభూషణము), మందహాస= చిరు నవ్వులతో, స్యంద = ద్రవించు, ఆర్ద్రం= మనోజ్ఞత, కౌస్తుభ శ్రీ = కౌస్తుభ మణి శోభలతో (కౌస్తుభ =విష్ణువక్షఃస్థలమందలి మణి), పరిగత= వ్యాప్తమైన (పరితః సర్వతః గతః జ్ఞాతః చేష్టితః వేష్టితః గతో వా సంపూర్ణంగా తెలుసుకొనబడినది చేయబడినది విస్తరింపబడినది), వనమాల = వనమాల(మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ.) (వనపుష్పరచితా మాలా), ఉరుహార=మేలైన హారములతో(హరతి మనః–మనస్సును హరించునది. మాల), అభిరామమ్= మనోహరముగా ( అభిరమతే మనో అత్ర–సుందరమైనది మనోహరమైనది ప్రియమైనది), శ్రీవత్స అంకం = శ్రీ వత్స చిహ్నముతో ఉన్న అందమైన వక్షస్థలము (శ్రీ వత్స= శ్రీ యుక్తం వత్సం వక్షః యస్య–లక్ష్మి వక్షస్సునందు కలవాడు. విష్ణువు.) (విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చ), సుబాహుం=దీర్ఘమైన బాహువులు(ఆజాను బాహుత్వము), మృదు లసత్= మృదువుగా ప్రకాశించు, ఉదరం = ఉదరము(ఉద్ దృణాతి అన్నం అనేన–దీనితో అన్నమును గ్రహింతురు. ఉదరము, పొట్ట), కాంచన ఛాయ= బంగారము వలె తళుకులీను(కాంచతే దీప్యతే ప్రకాశించునది. స్వర్ణము), చేలం = పట్టు పీతాంబరము (చిల్యతే ఆచ్ఛాద్యతే అనేన–దీనితో కప్పుదురు. వస్త్రము), చారు=అందమయిన, స్నిగ్ధ = మృదువైన(స్నిహ్యతి స్నేహకరోతి అసౌ స్నేహము చేయువాడు కలిసి వుండునది దట్టమైన), ఊరుమ్ = ఊరువులు(ఊర్ణూయతే ఆచ్ఛాద్యతే కప్పబడినది. తొడ), అంభోరుహ = కమలములవలె (అంభసి రోహతి

నీటిలో మొలచునది. పద్మము), లలిత = సుతి మెత్తని (లలతే ఈషతే అందమైనది), పదం = పాదములు కలిగిన(పద్యతే వెళ్లునది. పాదము), భవంతమ్= నిన్ను ( నీ సుందరరూపమును), అహం=నేను, భావయే = ధ్యానింతును.

**తాత్పర్యము:** నల్లదనముతో నిగనిగలాడు కేశములు, తళతళలాడు మకరకుండలముల కాంతులు మెరిసే చిరు నవ్వులు, కౌస్తుభ మణి శోభలతో ,వనమాల , మేలైన హారములతో శ్రీ వత్స చిహ్నముతో ఉన్న అందమైన వక్షస్థలము, దీర్ఘమైన బాహువులు, మృదువుగా ప్రకాశించు ఉదరము, బంగారము వలె తళుకులీను పట్టు పీతాంబరము ,అందమయిన మృదువైన ఊరువులు, కమలములవలె సుతిమెత్తని పాదములు కలిగిన నీ సుందరరూపమును నేను ధ్యానింతును.

**95-9 శ్లో.**

**సర్వాంగేష్వంగ రంగత్కుతుకమితి ముహుర్ధారయన్నీశ! చిత్తం**
**తత్రాప్యేకత్ర యుంజే వదనసరసిజే సుందరే మందహాసే ।**
**తత్రాలీనం తు చేతః పరమసుఖచిదద్వైతరూపే వితన్వన్**
**అన్యన్నో చింతయేయం ముహురితి సముపారూఢయోగో భవేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** అంగ =ఓ ఓ ప్రియమైన వాడా!, ఈశ= ఈశా!, చిత్తం= నా మనస్సును, ముహుః= ఆనందముతో మరలా మరలా, సర్వ అంగేషు=నీ సకల దివ్యాంగములలో ప్రతి అవయవము మీద, ఏకత్ర యుంజే= ఏకాగ్రము చేసి, రంగత్ కుతుకమ్= ప్రాప్త కుతూహలముతో, తత్ర అపి = ఆ తరువాత నీ అవయవముల మధ్య, మందహాసే = దరహాస శోభితముగా, సుందరే = పరమ సుందరముగా ఉన్న, తత్ర వదన సరసిజే = నీ ముఖ కమలమున (సరసి జాయతే సరస్సులో పుట్టినది. కమలము), అతి ధారయన్= ధ్యానించెదను (నిమగ్నం చేస్తాను), అలీనం = సుస్థిరముగా ఉన్న(పూర్తిగా లయించిన), చేతః తు =నా మనస్సును, పరమ సుఖ చిత్ అద్వైత రూపే = సచ్చిదానంద రూపమైన , అద్వితీయమైన పరబ్రహ్మమునందు, వితన్వన్= లీనమొనర్చి, అన్యత్= ధ్యాతృధ్యేయ విభావాదులయిన మిగతా విషయాలను, నో చింతయేయం =

చింతింపను, ఇతి = ఈ విధముగా, ముహుః = మరలా మరలా ప్రయత్నిస్తూ, సముపారూఢ యోగో భవేయమ్=యోగారూఢ స్థితికి చేరుకొంటాను. (ధృఢమయిన యోగముకొరకు మరల మరల సాధనచేయుదును).

**తాత్పర్యము:** ఓ ప్రియమైన వాడా! ఈశా! నా మనస్సును ఆనందముతో మరలా మరలా నీ సకల దివ్యాంగములలో ప్రతి అవయవము మీద ఏకాగ్రము చేసి నీ అవయవముల మధ్య దరహాస శోభితముగా పరమ సుందరముగా ఉన్న నీ ముఖ కమలమును ధ్యానిస్తాను . నా మనస్సును సచ్చిదానంద రూపమైన , అద్వితీయమైన పరబ్రహ్మమునందు లీనమొనర్చి మిగతా విషయాలను చింతింపను. ఈ విధముగా మరలా మరలా ప్రయత్నిస్తూ యోగారూఢ స్థితికి చేరుకొంటాను. (ధృఢమయిన యోగముకొరకు మరల మరల సాధనచేయుదును.)

**95-10 శ్లో.**

**ఇత్థం త్వద్ధ్యానయోగే సతి పునరణిమాద్యష్టసంసిద్ధయస్తాః**
**దూరశ్రుత్యాదయోఽపి హ్యహమహమికయా సంపతేయుర్మురారే! ।**
**త్వత్సంప్రాప్తౌ విలంబావహమఖిలమిదం నాద్రియే కామయేఽహం**
**త్వామేవానందపూర్ణం పవనపురపతే! పాహి మాం సర్వతాపాత్ ॥**

**ప్రతిపదార్థము:** మురారే= ఓ మురారీ ! (మురస్య అరిః మురాసురుని శత్రువు. శ్రీకృష్ణుడు), ఇత్థం = ఇట్లు (పూర్వశ్లోకములో చెప్పినట్లు), త్వత్ ధ్యానయోగే సతి= ధ్యానయోగ సిద్ధి పొందినవెంటనే(ధ్యానస్య యోగః ధ్యానయోగము సమాధి), పునః = మరలా, తాః అణిమా ఆది అష్ట సంసిద్ధయః= ఆ అణిమాది సిద్ధులు (1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశత్వము, 8. వశిత్వము), దూర శ్రుతి = దూరశ్రవణము, ఆదయః అపి = మొదలయినవి కూడా (దూరదర్శన త్రికాల జ్ఞానాది క్షుద్ర శక్తులు), అహమ్ అహమికయా హి = నేను నేనంటూ తమంతటతామే, సంపతేయుః= వచ్చి చేరును, ఇదం అఖిలమ్ = ఇవన్నియు, త్వత్ సంప్రాప్తౌ = నీ సాక్షాత్కార ప్రాప్తికి, విలంబ ఆవహమ్= ఆటంకములు కల్పించును కనుక(విశేషేణ లంబతే తస్య భావః కర్మ వా పొడిగించుట ఆలస్యం చేయుట), న ఆద్రియే = వానిని ఆదరింపను,

ఆనందపూర్ణం= పరిపూర్ణానంద స్వరూపుడవైన, త్వామ్ ఏవ = నిన్నే (నీ సాక్షాత్కారమునే), అహం= నేను, కామయే = కోరుకొందును, పవనపురపతే= ఓ గురువాయూరు కృష్ణదేవా!, సర్వతాపాత్= అన్ని తాపముల నుండి, మాం = నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** ఓ మురారీ ! ధ్యానయోగ సిద్ధి పొందినవెంటనే ఆ అణిమాది సిద్ధులు , దూరశ్రవణము మొదలయినవి కూడా నేను నేనంటూ తమంతటతామే వచ్చి చేరును. ఇవన్నియు నీ సాక్షాత్కార ప్రాప్తికి ఆటంకములు కల్పించును కనుక వానిని ఆదరింపను. పరిపూర్ణానంద స్వరూపుడవైన నీ సాక్షాత్కారమునే నేను కోరుకొందును. ఓ గురువాయూరు కృష్ణదేవా ! అన్ని తాపముల నుండి నన్ను రక్షించు.

**విశేషాలు**

**అణిమ:** శరీరమును అతి చిన్నదిగా చేయుట

**మహిమ:** శరీరమును అతి పెద్దదిగా చేయుట

**గరిమ:** శరీరము బరువు విపరీతముగా పెంచుట

**లఘిమ:** శరీరమును అతి తేలికగా చేయుట

**ప్రాప్తి:** కావలసిన వస్తువులు పొందుట

**ప్రాకామ్యం:** కావలసిన భోగము అనుభవించుట

**ఈశత్వం :** ఎవరిపైనైనా, దేనిపైనైనా అధికారము పొందుట

**వశీత్వం:** అన్ని భూతములను లోబరచుకొనుట.

***ఏకాదశ స్కంధము***

**95వ దశకము సమాప్తము**

# దశకమ్ 96 – భగవద్విభూతులు, జ్ఞానకర్మభక్తియోగములు

**96–1 శ్లో.**

**త్వంహి బ్రహ్మైవ సాక్షాత్ పరమురుమహిమన్నక్షరాణామకారః**
**తారో మంత్రేషు రాజ్ఞాం మనురసి మునిషు త్వం భృగుర్నారదోఽపి ।**
**ప్రహ్లాదో దానవానాం పశుషు చ సురభిః పక్షిణాం వైనతేయో**
**నాగానామస్యనంతః సురసరిదపి చ స్రోతసాం విశ్వమూర్తే! ॥**

**ప్రతిపదార్థము:** ఉరు మహిమన్ విశ్వమూర్తే = గొప్ప మహిమ కలిగిన విశ్వ మూర్తీ! (మహతః భావః–గొప్ప దనము. మహత్త్వము), త్వంహి = నువ్వు, సాక్షాత్= సాక్షాత్తూ (సహ అక్షతి కనబడునది కండ్లముందున్నది), పరమ్ బ్రహ్మ ఏవ= పరబ్రహ్మస్వరూపుడవు.(పరబ్రహ్మ శ్రేష్ఠమైన బ్రహ్మ పరబ్రహ్మ), త్వం అక్షరాణామ్ = నువ్వు అక్షరములలో (న క్షరతి నశించనిది. అకారము మొదలగు అక్షరములు), అకారః = అకారమువు, మంత్రేషు= మంత్రములలో(మననేన త్రాయతే మననము చేస్తే రక్షించునది. వేదమంత్రము మొ॥ మంత్రములు), తారః =ఓంకార స్వరూపుడవు(తార్యతే ఉత్తార్యతే భవసాగరాత్ అనేన భవసాగరము నుండి దాటించునది. ప్రణవము, ఓంకారము), రాజ్ఞాం= రాజులలో, మనుః= మనువువు. (మన్యతే తలచుకొన్నవాడు. స్వాయంభువాది మనువులు), మునిషు = మునులలో, భృగుః= భృగు మహర్షివి. (భృజ్యతే తపసా శరీరమ్ తపస్సుచే శరీరమును తపింప చేసినవాడు. భృగువు, ఒక మహర్షి), నారదః అపి అసి = నారదమునివియూ నీవే. (నారం పరమాత్మ విషయకం జ్ఞానం దదాతి పరమాత్మ జ్ఞానవిషయము ఇచ్చువాడు. నారదుడు), దానవానాం= దానవులలో(దనోః అపత్యమ్ దనువు సంతానము. దానవులు రాక్షసులు), ప్రహ్లాదః = ప్రహ్లాదుడు (అతిశయేన హ్లాదతే, విష్ణుభక్తత్వాత్ విష్ణుభక్తితో, సంతోషముతో వుండువాడు. ప్రహ్లాదుడు), పశుషు= పశువులలో(పశయతి యథేష్టం భ్రమతి స్వేచ్ఛగా తిరుగునది. వన్య పశువు), సురభిః చ= కామధేనువు (సుష్ఠు రభతే అనేన–దీనితో ఆనందింతురు), పక్షిణాం = పక్షులలో (పక్షౌ అస్య స్తః–రెక్కలు గలది. పక్షి బాణము), వైనతేయః = గరుత్మంతుడు, (వినతాయాః అపత్యం వినత యొక్క కుమారుడు. గరుత్మంతుడు),

నాగానామ్=సర్పములలో(న గచ్ఛతి అగః, న అగః-స్థిరంగా వుండనిది, పోవునది. సర్పము), అనంతః అసి = అనంతుడివి (న+అంత, నాస్తి అంతః ఆదిశేషుడు బలరాముడు, అపి చ = మరియు, స్రోతసాం = నదులలో (స్రవతి ప్రవహతి ప్రవహించునది. ప్రవాహము), సురసరిత్ = గంగానదిరూపముతో ఉన్నది నీవే!( సురాణాం సరిత్ దేవతల నది. గంగ).

**తాత్పర్యము:** గొప్ప మహిమ కలిగిన విశ్వ మూర్తీ! నువ్వు సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపుడవు. నువ్వు అక్షరములలో అకారమువు. మంత్రములలో ఓంకార స్వరూపుడవు రాజులలో మనువువు. మునులలో భృగు మహర్షివి. నారదముని నీవే. దానవులలో ప్రహ్లాదుడు, పశువులలో కామధేనువు, పక్షులలో గరుత్మంతుడు, సర్పములలో ఆనంతుడివి మరియు నదులలో గంగానది రూపముతో ఉన్నది నీవే!

**96-2 శ్లో.**

**బ్రహ్మణ్యానాం బలిస్త్వం క్రతుషు చ జపయజ్ఞోఽసి వీరేషు పార్థో**
**భక్తానాముద్ధవస్త్వం బలమసి బలినాం ధామ తేజస్వినాం త్వమ్ ।**
**నాస్త్యంతస్త్వద్విభూతేర్వికసదతిశయం వస్తు సర్వం త్వమేవ**
**త్వం జీవస్త్వం ప్రధానం యదిహ భవదృతే తన్న కించిత్ ప్రపంచే ॥**

**ప్రతిపదార్థము:** బ్రహ్మణ్యానాం= బ్రహ్మజ్ఞానులలో (బ్రాహ్మణులను భక్తితో కొలిచే వారిలో) (బ్రహ్మణే వేదాయ ప్రభవతి వేదమును చదివినవాడు. బ్రహ్మణే బ్రాహ్మణాయ హితమ్ బ్రాహ్మణునికి హితమైనది), త్వం=నువ్వు, బలిః = బలిచక్రవర్తివి. (బల్యతే దీయతే రాజ్యే రాజగ్రాహ్యే భాగః రాజ్యమునందు ఇవ్వబడునది. రాజు తీసుకొను పన్ను బలి చక్రవర్తి), త్వం = నువ్వు, క్రతుషు= యజ్ఞములయందు(యః క్రియతే యయా కరోతి చేయబడునది. యజ్ఞము), జపయజ్ఞః చ=జపయజ్ఞము నీవే.(జపమనే యజ్ఞం.2. జన్మ విచ్ఛేదకమూ, పాపనాశకమూ అయిన యజ్ఞం), వీరేషు = వీరులలో (వీరయతి కంపయతి అమిత్రాన్ శత్రువును వణికించువాడు. వీరుడు, పరాక్రమశాలి), పార్థః అసి= అర్జునుడివి. (పృథాయాః కుంత్యాః అపత్యం పుమాన్ కుంతీ పుత్రుడు. అర్జునుడు),

భక్తానామ్= భక్తులలో(భజతే అసౌ భజించువాడు. భక్తుదు), ఉద్ధవః= ఉద్ధవుడు(ఉద్ హూయతే అస్మిన్ ఇందులో ఆహుతి నిచ్చుదురు. యజ్ఞాగ్ని ఉద్ధవుడు), త్వం= నువ్వు, బలినాం= బలవంతులలో (బలం అస్తి అస్య–బలం కలవాడు. శక్తిశాలి), బలమ్= బలము అయి ఉన్నావు. (బలతి బలయుక్తో భవతి అనేన–దీనితో యుక్తుడగును. బలము సామర్థ్యము), త్వమ్= నువ్వు, తేజస్వినాం= తేజస్సంపన్నులలో,ధామః అసి =తేజస్సు అయి ఉన్నావు.(ధీయతే ద్రవ్యజాతమస్మిన్ ఆశ్రయము జ్యోతి), త్వత్ = నీయొక్క, విభూతేః = విభూతులు (విశిష్టా భూతిః ఐశ్వర్యమ్ ఐశ్వర్యము, భస్మము, అణిమాద్యష్ట ఐశ్వర్యములు), అన్తః న అస్తి = అనంతములు, వికసత్ అతిశయం=ఈ ప్రపంచమున వికసించి, అతిశయించిన, వస్తు సర్వం = గొప్ప వస్తువులన్నియు, త్వమ్ ఏవ = నీరూపములే, జీవః త్వం= జీవుడవు(పురుషుడవు) నువ్వే, ప్రధానం త్వం= ప్రకృతి కూడా నువ్వే. (ప్రధీయంతే మహదాద్యాః ప్రకృతయః జ్ఞానేంద్రియాది వికృతయశ్చ అస్మిన్ మహదాది ప్రకృతి వికృతులు (7), జ్ఞానేంద్రియాది వికృతులు దీని యందుండును), ఇహ ప్రపంచే= ఈ ప్రకృతి పురుషాత్మకమయిన ప్రపంచములో, తత్= తాదృశమైనది, కించిత్= కొంచెము కూడా, న = లేదు, యత్=ఏది, భవత్ ఋతే = నువ్వు లేకుండా లేదు.

**తాత్పర్యము:** బ్రహ్మజ్ఞానులలో నువ్వు బలిచక్రవర్తివి. నువ్వు యజ్ఞములయందు జపయజ్ఞము నీవే. వీరులలో అర్జునుడివి. భక్తులలో ఉద్ధవుడివి నువ్వు. బలవంతులలో బలము నువ్వు. తేజస్సంపన్నులలో తేజస్సు అయి ఉన్నావు. నీయొక్క విభూతులు అనంతములు. ఈ ప్రపంచమున వికసించి, అతిశయించిన గొప్ప వస్తువులన్నియు నీరూపములే. జీవుడవు(పురుషుడవు) నువ్వే. ప్రకృతి కూడా నువ్వే. ఈ ప్రకృతి పురుషాత్మకమయిన ప్రపంచములో తాదృశమైనది కొంచెము కూడా లేదు. ఏది నువ్వు లేకుండా లేదు. (ఈ ప్రపంచమున నువ్వు లేని వస్తువు ఏదియూ లేదు. నువ్వే సర్వ ప్రపంచము అని అర్థం)

**96–3 శ్లో.**

**ధర్మం వర్ణాశ్రమాణాం శ్రుతిపథవిహితం త్వత్పరత్వేన భక్త్యా**
**కుర్వన్తోఽన్తర్విరాగే వికసతి శనకైస్సంత్యజంతో లభంతే ।**

**సత్తాస్ఫూర్తిప్రియత్వాత్మకమఖిలపదార్థేషు భిన్నేష్వభిన్నం**
**నిర్మూలం విశ్వమూలం పరమమహమితి త్వద్విబోధం విశుద్ధమ్ ॥**

**ప్రతిపదార్థము:** శ్రుతి పథ విహితం = వేద విహితములైన(శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ – దీనితో అర్థం తెలియును. వేదము), వర్ణ ఆశ్రమాణాం ధర్మం= వర్ణాశ్రమ ధర్మములలోను, త్వత్ పరత్వేన భక్త్యా= నీయందు పరమభక్తితో, కుర్వంతః= నీకు సమర్పించుకొన్నవారికి (తాము చేయు కర్మఫలములను నీకు సమర్పించుకొన్నవారికి), అంతః= చివరగా, విరాగే వికసతి= వైరాగ్యము ఉదయించును, శనకైః = శనైః శనైః–మెల్లగా, సంత్యజంతః= వైరాగ్యము పూర్తిగా ఏర్పడినప్పుడు వారు కర్మాచరణములను వదిలివేస్తారు, సత్తా స్ఫూర్తి ప్రియత్వ అత్మకమ్= ఉనికి జ్ఞానము ఆనందము లక్షణముగా గలది (అస్తి భాతి ప్రియం), భిన్నేషు అఖిలపదార్థేషు= భిన్న భిన్న వస్తువులయందు, అభిన్నం = అభిన్నముగా ఉన్నది, నిర్మూలం= తనకు మఱియొక కారణము లేనికతన నిత్యమై ఉన్నది, విశ్వమూలం= సమస్త సృష్టికి కారణభూతమైనది, పరమమ్ = శ్రేష్ఠమైన, అహమ్ ఇతి విశుద్ధమ్ త్వత్ విబోధం = నేను అను విశుద్ధమైన అద్వైత భావము, లభంతే = వారికి ఏర్పడును.

**తాత్పర్యము:** వేద విహితములైన వర్ణాశ్రమ ధర్మములు పాటిస్తూ నీయందు పరమభక్తితో తాము చేయు కర్మఫలములను నీకు సమర్పించుకొన్నవారికి చివరగా వైరాగ్యము ఉదయించును. వైరాగ్యము పూర్తిగా ఏర్పడినప్పుడు వారు కర్మాచరణములను వదిలివేస్తారు. క్రమముగా ఆ సాధకులకు ఉనికి జ్ఞానము ఆనందము లక్షణముగా గలది, భిన్న భిన్న వస్తువులయందు అభిన్నముగా ఉన్నది, తనకు మఱియొక కారణము లేక నిత్యమై ఉన్నది. సమస్త సృష్టికి కారణభూతమైనది అగు నేను అను విశుద్ధమైన అద్వైత భావము ఏర్పడును

**విశేషాలు**

**సత్ /సత్య /సత్తా :** సత్ అన్నా సత్యమన్నా ఉన్నది అని అర్థం.

కలిగిన ఆత్మజ్ఞానాన్ని అలాగే నిలుపుకొంటూ పోవడం. సత్తా అంటే ఉనికని

అర్థం. ఎప్పటికీ మారకుండా నిలిచి ఉన్నదేదో అది సత్ లేదా సత్యం. అది సాకారం కాదు కేవల జ్ఞానరూపం. కనుకనే సత్తా అన్నా అదే. అంటే అస్తిత్వమన్నమాట.

విష్ణునామాలలో సత్తా అని ఒక నామం ఉంది. అంటే విష్ణువు సాకారంగా ఎక్కడో ఉన్నాడని కాదు. నిరాకారమైన భావమే లేదా అస్తిత్వమే విష్ణువు అనే మాటకు అర్థం. అంటే పరమాత్మ స్వరూపం. 'సదేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్' అని ఉపనిషత్తు. ఈ ప్రపంచమంతా సృష్టికి పూర్వం సద్రూపంగానే ఉందట. అప్పటికి ఆత్మా, అనాత్మా అనే తేడా లేక అంతా సద్రూపమే. అయితే అది స్వతఃప్రమాణం కనుక చిద్రూపం కూడా అదే. సచ్చిత్తులే పరమాత్మ అంటే.

**96-4 శ్లో.**

**జ్ఞానం కర్మాపి భక్తిస్త్రితయమిహ భవత్ప్రాపకం తత్ర తావత్**
**నిర్విణ్ణానామశేషే విషయ ఇహ భవేత్ జ్ఞానయోగేఽధికారః ।**
**సక్తానాం కర్మయోగస్త్వయి హి వినిహితో యే తు నాత్యంతసక్తాః**
**నాప్యత్యంతం విరక్తాస్త్వయి చ ధృతరసా భక్తియోగో హ్యమీషామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఇహ =ఇక్కడ, జ్ఞానం కర్మ భక్తిః = జ్ఞానము కర్మ భక్తి (జానాతి తస్య భావః-తెలుసుకొనుట. జ్ఞానము), త్రితయమ్ అపి= అను మూడును, భవత్ ప్రాపకం= నిన్ను పొందుటకు (మోక్ష సాధనకు) సాధనములు, తత్ర తావత్ = ఆ మూడింటి మధ్యలో, ఇహ= ఇక్కడ(ఈ లోకంలో), అశేషే విషయ= సమస్త విషయములలోను, నిర్విణ్ణానామ్= వైరాగ్యము కలవారు (నితరాం వింతే విచారయతి జాత నిర్వేదః-దుఃఖితుడు), జ్ఞానయోగే = జ్ఞాన యోగమందు, అధికారః = అధికారము, భవేత్ = పొందుదురు, సక్తానాం హి= విషయాసక్తి కలిగినవారు, త్వయి వినిహితః = కర్మఫలమును నీకు సమర్పిస్తూ, కర్మయోగః తు = కర్మయోగమును అనుష్ఠించెదరు, యే అత్యంతసక్తాః న = ఎవరు అత్యంత రాగము లేనివారు, అత్యంతం విరక్తాః అపి న= అత్యంత విరాగులు కానివారు ఉన్నారో వారు, త్వయి= నీయందు, ధృతరసాః చ= నీ కథాశ్రవణాదులందు వేడుక కలవారు, అమీషామ్ హి= వీరికొరకు, భక్తియోగః = భక్తియోగము(ఉన్నది).

**తాత్పర్యము:** ఇక్కడ –ఈ లోకంలో జ్ఞానము కర్మ భక్తి అను మూడును నిన్ను పొందుటకు (మోక్ష సాధనకు) సాధనములు. ఆ మూడింటి మధ్యలో సమస్త విషయములలోను వైరాగ్యము కలవారు జ్ఞాన యోగమందు అధికారము పొందుదురు. విషయాసక్తి కలిగినవారు కర్మఫలమును నీకు సమర్పిస్తూ కర్మయోగమును అనుష్ఠించెదరు. ఎవరు అత్యంత రాగము లేనివారు అత్యంత విరాగులు కానివారు ఉన్నారో వారు నీ కథాశ్రవణాదులందు వేడుక కలవారు. వీరికొరకు భక్తియోగము. (ఇటువంటి భక్తులు భక్తిమార్గమున స్వామిని చేరుదురని భావం)

**విశేషాలు**

(ఇహ+అముత్ర+ఫల+భోగ+విరాగ, ఇహ = అస్మిన్ లోకే స్రక్చందనాది జనితః, అముత్ర = అముష్మిన్ లోకే అమృతాది విషయోత్పన్నః యః అనిత్యః అనిత్యః ఫలభోగః తస్మాత్ విరాగః నితరాం విరతి) ఐహిక–ఆముష్మిక విషయ భోగముల నుండి విరక్తి చెందుట. వైరాగ్యభావము.

**యోగము:** యోగక్షేమాలలో యోగానికి అర్థం 'అలబ్ధస్య లాభః' అని చెప్పారు భాష్యకారులు. మధ్యలో కొత్తగా వచ్చి చేరినదేదో అది యోగం. ఉపాయమని మరియొక అర్థం. సాధనమని ఇంకొక అర్థం.

కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం అనేవన్నీ ఇలాంటివే. అవి సాధకుడు ఆశించిన ఆయా ఫలితాలను అతనికి అందజేసే సాధనాలే.

పతంజలి యోగశబ్దానికి మరొక అర్థం సెలవిచ్చారు. 'యోగః చిత్తవృత్తి నిరోధః' యోగమంటే మనసులో కలిగే ఆలోచనల నన్నింటినీ నిరోధించడం. అనగా త్రోసిపుచ్చడం. పోతే వేదాంతులు చెప్పే అర్థం వేరు. ఈశ్వర సాయుజ్యమే యోగమని పేర్కొంటారు వారు. అది కూడా సాధించవలసిందంటారు ద్వైతులు. సిద్ధమైన దాన్నే గుర్తించటమంటారు అద్వైతులు. 'జ్ఞానయోగ వ్యవస్థితిః' అని గీతలో ఒక వాక్యమున్నది. అక్కడ యోగమంటే అపరోక్షానుభవమని అర్థం చెప్పారు భగవత్పాదులు. జ్ఞానం పరోక్షమైతే యోగమపరోక్షం. అంటే

శాస్త్రజన్యమైన జ్ఞానాన్ని స్వానుభవానికి తెచ్చుకోవటమే యోగమనే మాటకు అర్థం. ఇది చాలా విశిష్టమైన అర్థంగా కనిపిస్తుంది.

**96-5 శ్లో.**

**జ్ఞానం త్వద్భక్తతాం వా లఘు సుకృతవశాన్మర్త్యలోకే లభంతే**
**తస్మాత్ తత్రైవ జన్మ స్పృహయతి భగవన్! నాకగో నారకో వా ।**
**ఆవిష్టం మాం తు దైవాద్భవజలనిధిపోతాయితే మర్త్యదేహే**
**త్వం కృత్వా కర్ణధారం గురుమనుగుణవాతాయితస్తారయేథాః ॥**

**ప్రతిపదార్థము:** భగవన్ = ఓ గురువాయూరు కృష్ణ దేవా ! (భగః ఐశ్వర్యాది అస్తి అస్య ఐశ్వర్యాదులు కలవాడు. పరమేశ్వరుడు), జ్ఞానం = జ్ఞానము, త్వత్ భక్తతాం వా=నీయందు భక్తియు, మర్త్య లోకే = భూలోకమందు (మర్త్యానాం మానవానాం లోకః-మానవులుండు లోకము), సుకృత వశాత్ = పుణ్యఫలముగా(సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము శుభకర్మ), లఘు= అనాయాసముగా (లంఘతే అనేన లంఘతి గంతుం శక్నోతి దీనితో లంఘింతురు, తొందరగా పోవుదురు), లభంతే= లభించును, తస్మాత్= అందుచేత, నాకగః = స్వర్గవాసులయిన దేవతలు (న కం అకం దుఃఖ తన్నాస్తి యత్ర-దుఃఖము లేని చోటు. స్వర్గము), నారకః వా= నరకవాసులు కూడ(నరకే భవః-నరకంలో వుండునది నరకమునకు సంబంధించినది), తత్ర ఏవ= భూలోకమందే, జన్మ= జన్మింపవలెనని, స్పృహయతి = కోరుచుందురు, దైవాత్ = దైవికముగా, భవ జలనిధి పోతాయితే= సంసార సాగరమును తరింపచేయు (పోత= పూయతే కాలక్రమేణేతి పోతః-కాలక్రమంలో విరిగిపోవునది. జలములో నడుచు పుట్టి), మర్త్య దేహే= మానవ జన్మ (మ్రియతే అత్ర-ఇక్కడ నశించును. మర్త్యలోకము), ఆవిష్టం = పొందిన (ఆవిష్టః ప్రవిష్టః సంపన్నః వశీకృతః-ప్రవేశించినవాడు), మాం తు= నన్ను, గురుమ్ = గురువును (గిరతి అజ్ఞానమ్ అజ్ఞానమును తొలగించువాడు), కర్ణధారం కృత్వా = చుక్కాని కాచువానినిగా(నావికునిగా) చేసి (కర్ణం నౌకాచాలన దండం ధారయతి తెడ్డును ధరించినవాడు పడవ నడుపువాడు), త్వం = నువ్వు, అనుగుణ వాతాయితః = అనుకూల వాయువువై వీచి, తారయేథాః= ఉద్ధరింపుము( ఒడ్డునకు అనగా మోక్షమునకు చేర్చుము).

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా! జ్ఞానము, నీయందు భక్తియు భూలోకమందు పుణ్యఫలముగా అనాయాసముగా లభించును. అందుచేత స్వర్గవాసులు, నరకవాసులు కూడ భూలోకమందే జన్మింపవలెనని కోరుచుందురు. దైవికముగా సంసార సాగరమును తరింపచేయు మానవ జన్మ పొందిన నన్ను గురువును చుక్కాని కాచువానినిగా(నావికునిగా) చేసి నువ్వు అనుకూల వాయువువై వీచి ఉద్ధరింపుము(ఒడ్డునకు అనగా మోక్షమునకు చేర్చుము).

**96-6 శ్లో.**

**అవ్యక్తం మార్గయంతః శ్రుతిభిరపి నయైః కేవలజ్ఞానలుబ్ధాః**
**క్లిశ్యంతేఽతీవ సిద్ధిం బహుతరజనుషామంత ఏవాప్నువంతి ।**
**దూరస్థః కర్మయోగోఽపి చ పరమఫలే నన్వయం భక్తియోగః**
**త్వామూలాదేవ హృద్యస్త్వరితమయి భవత్ప్రాపకో వర్ధతాం మే ॥**

**ప్రతిపదార్థము:** కేవల జ్ఞాన లుబ్ధాః= కేవల జ్ఞానబోధలు (లుభ్యతి అసౌ లోభము కలవాడు ఆశ కలవాడు), శ్రుతిభిః = ఉపనిషత్తులు, నయైః అపి=మీమాంసాది శాస్త్రయుక్తులచే(నీయతే అనేన-దీనితో సన్మార్గమున ఉంచబడుదురు), అవ్యక్తం= అవ్యక్త పరబ్రహ్మవైన నిన్ను, మార్గయంతః = వెతుకుచూ, అతీవ = బాగా, క్లిశ్యంతే= శ్రమపడెదరు, బహుతర జనుషామ్= అనేక జన్మముల, అంత ఏవ = చివరకు, సిద్ధిం= సిద్ధిని, ఆప్నువంతి= పొందెదరు, కర్మయోగః అపి చ= కర్మ యోగము, పరమఫలే = పరమఫల ప్రాప్తికి (బ్రహ్మానంద ప్రాప్తికి), దూరస్థః= చాలా దూరమునందున్నది, అయి= ఓ కృష్ణా !, నను= నిశ్చయముగా(ననుదతి ప్రేరయతి ప్రేరేపించునది ప్రశ్నించుట నిశ్చయము), ఆమూలాత్ ఏవ= ఆమూలముగా (వేఱు మొదలుకొని, సమూలముగా), హృద్యః = మదురమైనది (శ్రవణ కీర్తనాదుల వలన మదురమైనది), త్వరితమ్= త్వరగా సులభముగా, భవత్ ప్రాపకః =బ్రహ్మానంద ప్రాప్తి కలిగించునది అయిన, అయం భక్తియోగః తు= ఈ మధుర భక్తి, మే = నాలో, వర్ధతాం= అభివృద్ధి పొందుగాక!

**తాత్పర్యము:** కేవల జ్ఞానబోధలు ,ఉపనిషత్తులు ,మీమాంసాది శాస్త్రయుక్తులచే అవ్యక్త పరబ్రహ్మవైన నిన్ను వెతుకుచూ కొందరు బాగా శ్రమపడెదరు. అనేక

జన్మముల చివరకు సిద్ధిని పొందెదరు. కర్మ యోగము బ్రహ్మానంద ప్రాప్తికి చాలా దూరమునందున్నది. ( అనగా కర్మ యోగము ఫల ప్రాప్తిని వెంటనేఇవ్వదు. కాలాంతరమందు ఫలించునని భావం) ఓ కృష్ణా ! నిశ్చయముగా ఆమూలముగా మదురమైనది (శ్రవణ కీర్తనాదుల వలన మదురమైనది) త్వరగా సులభముగా బ్రహ్మానంద ప్రాప్తి కలిగించునది అయిన ఈ మధుర భక్తి నాలో అభివృద్ధి పొందుగాక !

**96-7 శ్లో.**

**జ్ఞానాయైవాతియత్నం మునిరపవదతే బ్రహ్మతత్త్వం తు శృణ్వన్**
**గాఢం త్వత్పాదభక్తిం శరణమయతి యస్తస్య ముక్తిః కరాగ్రే ।**
**త్వద్ధ్యానేఽపీహ తుల్యా పునరసుకరతా చిత్తచాంచల్యహేతోః**
**అభ్యాసాదాశు శక్యం తదపి వశయితుం త్వత్కృపాచారుతాభ్యామ్ ॥**

**ప్రతిపదార్థము:** మునిః = వ్యాసమహర్షి(మనుతే జానాతి-తెలుసుకొన్నవాడు. మౌన వ్రతము కలవాడు పవిత్ర పురుషుడు), జ్ఞానాయ ఏవ = జ్ఞానము కొరకై, అతి యత్నం= బాగా ప్రయత్నించుట(బహుగ్రంథములు చదువుట) తగదని, అపవదతే తు = పురాణములలో అక్కడక్కడ నివారించారు, యః=ఎవరు, బ్రహ్మతత్త్వం = బ్రహ్మతత్త్వసిద్ధాంతసారమును మాత్రమును, శృణ్వన్ = విని( అనగా గురువుద్వారా ఉపదేశము పొంది), గాఢం భక్తిం = గాఢమైన భక్తితో, త్వత్ పాద శరణమ్ అయతి = నీ పాదములను శరణు కోరిన, తస్య = వానికి, ముక్తిః= ముక్తి, కరాగ్రే = కరతలామలకము. (అరచేతిలోని ఉసిరికాయ, సులువుగ అధీనమగునది), పునః = మరల, ఇహ= ఇక్కడ, త్వత్ ధ్యానే అపి= నీ ధ్యానము కూడా, చిత్త చాంచల్య హేతోః= చిత్త చాంచల్య ముచే (చంచలస్య భావః-చంచల స్వభావము), అసుకరతా = దురనుష్ఠేయమునకు, తుల్యా అపి = తుల్యమైనప్పటికి (అంత సులభము కానప్పటికి), త్వత్ కృపా= నీ అనుగ్రహముచే, చారుతాభ్యామ్ = నీ దివ్యసుందరమూర్తిని మనస్సులో నిలుపు, అభ్యాసాత్= అభ్యాసమువలన, తత్ = ఆ ధ్యానము, ఆశు వశయితుం= తొందరగా వశీకరించుకొనుటకు (ఆశు శీఘ్రమ్ శీఘ్రము, తొందరగా), శక్యం= సాధ్యమైనది.

**తాత్పర్యము:** వ్యాసమహర్షి కేవల శాస్త్ర జ్ఞానము ద్వారా భగవంతుని తెలుసుకొను పద్ధతిలో బహుగ్రంథములు చదువుట తగదని పురాణములలో అక్కడక్కడ నివారించారు. ఎవరు బ్రహ్మతత్త్వ సిద్ధాంతసారమును మాత్రమును గురువుద్వారా ఉపదేశము పొంది గాఢమైన భక్తితో నీ పాదములను శరణు కోరిన వానికి ముక్తి కరతలామలకము. నీ ధ్యానము కూడా చిత్త చాంచల్య కారణముచే అంత సులభము కానప్పటికి నీ అనుగ్రహముచే నీ దివ్యసుందరమూర్తిని మనస్సులో నిలుపు అభ్యాసమువలన ఆ ధ్యానము తొందరగా వశీకరించుకొనుటకు సాధ్యమైనది.

**96-8 శ్లో.**

**నిర్విణ్ణః కర్మమార్గే ఖలు విషమతమే త్వత్కథాదౌ చ గాఢం**
**జాతశ్రద్ధోఽపి కామానయి భువనపతే! నైవ శక్నోమి హాతుమ్ ।**
**తద్భూయో నిశ్చయేన త్వయి నిహితమనా దోషబుద్ధ్యా భజంస్తాన్**
**పుష్ణీయాం భక్తిమేవ త్వయి హృదయగతే మంక్షునంక్ష్యంతి సంగాః ॥**

**ప్రతిపదార్థము:** అయి భువనపతే = ఓ అన్ని భువనములకు అధిపతియైన శ్రీ కృష్ణా! (సప్త అధోలోకములు -అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము), సప్త భువనములు (1. భూలోకము, 2. భువర్లోకము, 3. స్వర్లోకము, 4. మహర్లోకము, 5. జనలోకము, 6. తపోలోకము, 7. సత్యలోకము), విషమతమే= దుఃఖ భూయిష్ఠమయిన (బహువిషమమయిన ) (విగతః విరుద్ధో వా సమః-సమంగా లేనిది. విషమమైనది కఠినమైనది), కర్మమార్గే =కర్మ మార్గమును అనుసరించుట, నిర్విణ్ణః ఖలు= అతి కష్టతరమైనది. (నితరాం వింతే విచారయతి జాత నిర్వేదః-దుఃఖితుడు), త్వత్ కథా ఆదౌ చ= నీ కథలు మొదలైన వాటియందు, గాఢం= గాఢముగా (గాఢ దృఢః సేవితః-సేవింపబడ్డది దృఢమైనది), జాతశ్రద్ధః అపి= శ్రద్ధ కలిగి ఉన్నప్పటికి, కామాన్= పుత్రమిత్ర ధనాదులపై కోరికలను, హాతుమ్ = విడుచుట, న శక్నోమి ఏవ = చేయలేక పోతున్నాను, తత్ = కావున, భూయః = మరలా, నిశ్చయేన = నిశ్చయముగా, త్వయి= నీయందు, నిహితమనా = మనస్సును గట్టిగా చేర్చి (నిహితః స్థాపితః గూఢః-పెట్టబడ్డది దాచబడినది), దోషబుద్ధ్యా= దోషబుద్ధితోనే, తాన్ = ఆ లౌకిక

విషయములను, భజన్= సేవించుచు (అనుభవించుచు), భక్తిమ్ ఏవ= నాలో నీ భక్తిని, పుష్ణీయాం= పెంపొందించుకొనెదను, త్వయి హృదయగతే = నీవు హృదయమందున్నచో, సంగాః = లౌకిక విషయ శ్రద్ధలు(విషయ వాసనలు) (సజతి మిలతి తస్య భావః కర్మ వా కలియునది కూడుట మనస్సు యొక్క ఆసక్తి), మంక్షు= వెంటనే, నంక్ష్యంతి = నశించును.

**తాత్పర్యము:** ఓ అన్ని భువనములకు అధిపతియైన శ్రీ కృష్ణా ! దుఃఖ భూయిష్ఠమయిన కర్మ మార్గమును అనుసరించుట అతి కష్టతరమైనది. నీ కథలయందు మిక్కిలి శ్రద్ధ కలిగి ఉన్నప్పటికి పుత్రమిత్ర ధనాదులపై కోరికలను విడువలేక పోతున్నాను. కావున నీయందు మనస్సును గట్టిగా చేర్చి దోషబుద్ధితోనే ఆ లౌకిక విషయములను అనుభవించుచు నాలో నీ భక్తిని పెంపొందించుకొనెదను. నీవు హృదయమందున్నచో లౌకిక విషయ శ్రద్ధలు వెంటనే నశించును.

**96-9 శ్లో.**

**కశ్చిత్ క్లేశార్జితార్థక్షయవిమలమతిర్నుద్యమానో జనౌఘైః**
**ప్రాగేవం ప్రాహ విప్రో న ఖలు మమ జనః కాలకర్మ గ్రహో వా ।**
**చేతో మే దుఃఖహేతుస్తదిహ గుణగణం భావయత్ సర్వకారీ–**
**త్యుక్త్వా శాంతో గతస్త్వాం మమ చ కురు విభో! తాదృశీం చిత్తశాంతిమ్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రాక్ = పూర్వము (పురా అగ్రే పూర్వము –కాలవాచి), కశ్చిత్ విప్రః= ఒక బ్రాహ్మణుడు(వపతి ధర్మమ్ ధర్మమును నాటువాడు. బ్రాహ్మణుడు), క్లేశ = నానాశ్రమలు పడి, ఆర్జిత = సంపాదించిన, అర్థ క్షయ= సంపదను దొంగలు మొదలయిన వారు దోచుకొనుటవలన నశింపగా బాధపడినప్పటికి, విమల మతిః = వివేకము కలిగి, జనౌఘైః = జన సమూహములచే, నుద్యమానః = పీడింపబడుచుండగా( అనగా జనులు అతనిని "ఎలా సంపదను కోల్పోయావు? " మొదలయిన ప్రశ్నలతో పీడించుచుండగా), ఏవం ప్రాహ= వారితో ఇలా అన్నాడు, మమ ఖలు= నాయొక్క, దుఃఖహేతుః= దుఃఖమునకు కారణము, జనః = ఈ జనము (జన్మ) కాదు (జాయతే పుట్టువాడు. లోకులు), కాలః = కాలము కాదు. (కలయతి ఆయుః కలయతి సర్వాణి భూతాని ఆయువును లెక్కించునది), కర్మ

గ్రహాః వా న= కర్మకాని, దుష్టగ్రహములు కాని ఎవ్వరును కారణము కాదు. (గృహ్ణాతి సూర్యాం చంద్రమసౌ గ్రాస ఇవ–సూర్యచంద్రులను మ్రింగునది. రాహువు కేతువు దుష్టగ్రహములు), మే = నాయొక్క, చేతః = చిత్తమే దుఃఖ హేతువు. (ఆత్మగా అభిమానించే చిత్తమే దుఃఖ హేతువు), తత్ = ఆ చిత్తము, ఇహ= ఆత్మలో, గుణగణం= కర్తృత్వ భోక్తృత్వాదులను, భావయత్ = ఆరోపిస్తూ, సర్వకారీ = అన్నిటికి కారణమగుచున్నది, ఇతి= అని, ఉక్త్వా = చెప్పి, శాంతః = శాంతుడై, త్వాం= నిన్ను, గతః = పొందెను, విభో= ఓ ప్రభూ!, మమ చ= నాకు కూడా, తాదృశీం= అట్టి(స ఇవ దృశ్యతే, తస్య ఇవ దర్శనం యస్య–దానివలె కనబడునది. అటువంటిది), చిత్తశాంతిమ్= చిత్త శాంతిని, కురు = అనుగ్రహించుము.

**తాత్పర్యము:** పూర్వము ఒక బ్రాహ్మణుడు నానాశ్రమలు పడి సంపాదించిన సంపదను దొంగలు మొదలయిన వారు దోచుకొనుటవలన నశింపగా బాధపడినప్పటికి వివేకము కలిగి జనులు అతనిని "ఎలా సంపదను కోల్పోయావు?" మొదలయిన ప్రశ్నలతో పీడించుచుండగా వారితో ఇలా అన్నాడు. "నాయొక్క దుఃఖమునకు కారణము ఈ జన్మ కాదు. కాలము కాదు. కర్మకాని, దుష్టగ్రహములు కాని ఎవ్వరును కారణము కాదు. నాయొక్క చిత్తమే దుఃఖ హేతువు. ఆ చిత్తము ఆత్మలో కర్తృత్వ భోక్తృత్వాదులను ఆరోపిస్తూ అన్నిటికి కారణమగుచున్నది "అని చెప్పి శాంతుడై నిన్ను పొందెను.(మోక్షము పొందెనని భావం) ఓ ప్రభూ ! నాకు కూడా అట్టి చిత్త శాంతిని అనుగ్రహించుము.

**96–10 శ్లో.**

**ఐలః ప్రాగుర్వశీం ప్రత్యతివివశమనాః సేవమానశ్చిరం తాం**
**గాఢం నిర్విద్య భూయో యువతిసుఖమిదం క్షుద్రమేవేతి గాయన్ ।**
**త్వద్భక్తిం ప్రాప్య పూర్ణస్సుఖతరమచరత్ తద్వదుద్ధూయసంగం**
**భక్తోత్తంసం క్రియా మాం పవనపురపతే! హంత మే రుంధి రోగాన్ ॥**

**ప్రతిపదార్థము:** ప్రాక్= పూర్వము, ఐలః= ఐలుడు (పురూరవుడు)(ఇలాయాః అపత్యమ్ ఇలాదేవి (బుధుని) కొడుకు. ఐలుడు. బుధునివలన ఇల యనుదానియందు పుట్టిన రాజు), ఊర్వశీం ప్రతి= ఊర్వశికి (ఊరుం అశ్నుతే–

నారాయణుని తొడయందు పుట్టినది), అతి వివశమనాః = వివశుడై(ఆకర్షితుడై), చిరం = చాలా కాలము, తాం= ఆమెతో, సేవమానః= సుఖముగా గడిపి, భూయః= మరలా, గాఢం= గాఢముగా, నిర్విద్య = ఆమెతో వియోగమును పొంది, ఇదం యువతి సుఖమ్= ఈ స్త్రీ సుఖము (ప్రాప్త యౌవనా స్త్రీ యౌవనము వచ్చిన స్త్రీ), క్షుద్రమ్ ఏవ= చాలా నీచము(క్షుణత్తి సంపినష్టి అసౌ), ఇతి గాయన్= అని పలుకుచూ, త్వత్ భక్తిం= నీ భక్తిని, ప్రాప్య = పొంది, పూర్ణః = పూర్ణుడై( నిస్సంగుడై) ( పూర్ణః పూరితః సకలః–నిండుగా వున్నది. సంపూర్ణము), సుఖతరమ్= పరిపూర్ణ ఆనందము (సు సుఖకారకం ఖేభ్యః ఇంద్రియేభ్యః–ఇంద్రియములకు ఆనందమును కల్గించునది. సుఖము), అచరత్= అనుభవించెను, పవనపురపతే = ఓ గురువాయూరు కృష్ణదేవా!, తత్ వత్ = ఆవిధముగానే, సంగం = బంధములను (సజతి మిలతి తస్య భావః కర్మ వా కలియునది కూడుట మనస్సు యొక్క ఆసక్తి), ఉద్ధూయ= దూరము చేసి(ఉద్ధూతః ఉత్క్షిప్తః కంపితః ఉన్నతః–పైకి విసరబడినది పైకి లేపబడినది ఊపబడినది), మాం= నన్ను, భక్త ఉత్తంసం= ఉత్తమభక్తునిగా (ఉత్ సమ్యక్ తంస్యతే అలంక్రియతే అనేన–అలంకారము భూషణము), క్రియాః = చేయుము, హంత= అయ్యో!, మే= నాయొక్క, రోగాన్= రోగములను (రుజతి రుజ్యతే వా అనేన–పీడించునది, దీనితో పీడింపబడుదురు. వ్యాధి), రుంధి = దూరము చేయుము.

**తాత్పర్యము:** పూర్వము పురూరవుడు ఊర్వశికి ఆకర్షితుడై చాలా కాలము ఆమెతో సుఖముగా గడిపి ఆమెతో వియోగమును పొంది ' ఈ స్త్రీ సుఖము చాలా నీచము 'అని పలుకుచూ నీ భక్తిని పొంది నిస్సంగుడై పరిపూర్ణ ఆనందము అనుభవించెను. ఓ గురువాయూరు కృష్ణదేవా ! ఆవిధముగానే బంధములను దూరము చేసి నన్ను ఉత్తమభక్తునిగా చేయుము. నాయొక్క రోగములను దూరము చేయుము

**విశేషము**

**పురూరవుడు:** వైవస్వతమనువు కొమార్తె అగు ఇలకును చంద్రుడు కొడుకు అగు బుధునికిని పుట్టిన రాజు. ఇతడు రాజ్యమదముచేత విప్రులకు అవమానముచేసి వారిచే ఉన్మత్తుడు అగునట్లు శపియింపబడెను. ఈ పురూరవునకు ఊర్వశి వలన

ఆయువు, ధీమంతుడు, అమవసువు లేక విజయుడు, చిరాయువు లేక శతాయువు, శ్రుతాయువు లేక వసుమంతుడు అను పుత్రులు ఉదయించిరి. ఈతని రాజధాని ప్రతిష్ఠానపురము. ఊర్వశి స్వర్గలోకమును వదలి పురూరవునితో భూలోకమున బహుకాలము ఉండినందున స్వర్గలోకము మిక్కిలి చిన్నబోయెను అని దేవేంద్రుఁడు ఆమెను పిలువబంచెను. ఆమె అట్లు తన్ను వదలిపోఁగా పురూరవుడు విరహవేదనను సహింపలేక గంధర్వులను ప్రార్థనచేసెను. అప్పుడు వారు అతనికి ఒక స్థాలి ఇచ్చిరి. దానిని అతడు కొంతకాలము ఊర్వశిగా భావించి ఉండి ఆవలదానిని వనమునందు విడిచిపెట్టెను. దానివలన అశ్వత్థవృక్షము పుట్టెను. ఆయశ్వత్థముచేత అరణులు రెండుకావించి ఒక అరణి తాను అనియు ఒక అరణి ఊర్వశి అనియు ఆరెండినడుమను ఉన్న కాష్ఠము పుత్రుడు అనియు మంత్రము చెప్పుచు తరువగా జాతవేదుడు అను అగ్ని సంభవించెను. ఆ అగ్ని ఆహవనీయాదిరూపములో పురూరవుని పుణ్యలోకమునకు పంపెను.

***ఏకాదశ స్కంధము పరిపూర్ణం***

**96వ దశకము సమాప్తము**

# దశకమ్ 97 – ఉత్తమభక్తిప్రార్థన, మార్కణ్డేయ కథ

**97-1 శ్లో.**

**త్రైగుణ్యాద్భిన్నరూపం భవతి హి భువనే హీనమధ్యోత్తమం యత్**
**జ్ఞానం శ్రద్ధా చ కర్తా వసతిరపి సుఖం కర్మ చా హార భేదాః ।**
**త్వత్ క్షేత్రత్వన్నిషేవాది తు యదిహ పునస్త్వత్పరం తత్తుసర్వం**
**ప్రాహుర్నైర్గుణ్యనిష్ఠం తదను భజనతో మంక్షు సిద్ధో భవేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** భువనే = ఈ ప్రపంచములో, జ్ఞానం = సర్వ భూతములందు ఆత్మయొక్క ఏకత్వము, ఆత్మ యొక్క భిన్నము, బాలోన్మత్తత అను మూడు విధములుగా జ్ఞానము, శ్రద్ధా చ= అధ్యాత్మిక ధర్మాధర్మ విషయములుగా మూడు విధములుగా శ్రద్ధ, కర్తా = వైరాగ్య , రాగ జ్ఞాన భేదములను మూడు విధములుగా కర్త, వసతిః అపి = వనగ్రామ ద్యూత సదన భేదముచే మూడు విధములుగా వసతి, సుఖం= ఆత్మానందము విషయసుఖము నిద్రాది సుఖము అను మూడు రీతులుగా సుఖము, కర్మ చ = ఈశ్వరార్పితము, కామ్యము, నిషిద్ధము అను మూడు విధములుగా కర్మ, ఆహార భేదాః చ = శుద్ధము. ఇంద్రియ ప్రియత్వము, అశుచి అను మూడు విధములుగా ఆహారము, యత్ త్రైగుణ్యాత్= సత్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములచే, భిన్న రూపం = భిన్న రూపములు పొంది, హీనమధ్య ఉత్తమం భవతి= హీన, మధ్యమ, ఉత్తమములుగా మూడు విధములుగా ఉండును, పునః= మరలా, ఇహ= ఇక్కడ, త్వత్ క్షేత్ర= నీ ఆలయాలు, త్వత్ నిషేవా ఆది = నీ సేవలు మొదలయినవి, యత్ తు= ఏవైతే ఉన్నాయో, తత్ సర్వం= అవిఅన్నియు, త్వత్ పరం తు= నీ కొరకు మాత్రమే చేస్తే, నైర్గుణ్య నిష్ఠం= నిర్గుణ నిష్ఠమని(నిర్గుణస్య భావః కర్మ వా నైర్గుణ్యము. గుణములు లేనిది)(నితరాం తిష్ఠతి గురుసేవాయాం తస్య భావః కర్మ వా– అన్ని వ్రతనియమములు పాలించుట ధర్మమందు గట్టి నమ్మకము), ప్రాహుః= పెద్దలు చెప్పుదురు, తత్ అను భజనతః= ఆవిధమైన భగవత్సేవచే, మంక్షు = వెంటనే, సిద్ధః= సిద్ధుడను (ముక్తుడను), భవేయమ్= అయ్యెదను.

**తాత్పర్యము:** ఈ ప్రపంచములో సర్వ భూతములందు ఆత్మయొక్క ఏకత్వము,

ఆత్మ యొక్క భిన్నము, బాలోన్మత్తత అను మూడు విధములుగా జ్ఞానము –అధ్యాత్మిక ధర్మాధర్మ విషయములుగా మూడు విధములుగా శ్రద్ధ – వైరాగ్య , రాగ జ్ఞాన భేదములను మూడు విధములుగా కర్త వనగ్రామ ద్యూత సదన భేదముచే మూడు విధములుగా వసతి , ఆత్మానందము విషయసుఖము నిద్రాది సుఖము అను మూడు రీతులుగా సుఖము – ఈశ్వరార్పితము, కామ్యము, నిషిద్ధము అను మూడు విధములుగా కర్మ – శుద్ధము. ఇంద్రియ ప్రియత్వము, అశుచి అను మూడు విధములుగా ఆహారము – సత్వము, రజస్సు , తమస్సు అను మూడు గుణములచే భిన్న రూపములు పొంది హీన, మధ్యమ, ఉత్తమములుగా మూడు విధములుగా ఉండును. నీ ఆలయాలు, నీ సేవలు మొదలయినవి ఏవైతే ఉన్నాయో అవిఅన్నియు నీ కొరకు మాత్రమే చేస్తే నిర్గుణ నిష్ఠమగునని పెద్దలు చెప్పుదురు. ఆవిధమైన భగవత్సేవచే వెంటనే సిద్ధుడను (ముక్తుడను) అయ్యెదను.

**విశేషాలు**

**నిర్గుణ:** గుణములు లేనిది. గుణమంటే ప్రకృతి గుణాలు. సత్వ రజ స్తమస్సులు. నామరూప క్రియలు కూడా గుణాలే. ఉపాధులని అర్ధం. చైతన్యాన్ని ఇవి కప్పిపుచ్చి పరిమితం చేసి చూపుతుంటాయి. వీటివల్లనే ఈశ్వర చైతన్యం జీవచైతన్యంగా మారి సగుణమైంది. ఇది కేవలం ఆభాసే. వస్తుతః చైతన్యం నిరాకారం గనుక ఆత్మ స్వరూపం గనుక సర్వవ్యాపకం. అది నిర్గుణమే.

పరమాత్మ మాయాశక్తిని వశీకరించుకుని సగుణంగా కూడా అవతరించగలడు. అప్పుడు జీవుడిలాగ సోపాధికుడు కాదు. నిరుపాధికుడే.

**97–2 శ్లో.**

**త్వయ్యేవ న్యస్తచిత్తస్సుఖమయి విచరన్ సర్వచేష్టాస్త్వదర్థం**
**త్వద్భక్తైః సేవ్యమానానపి చరితచరానాశ్రయన్ పుణ్యదేశాన్ ।**
**దస్యౌ విప్రే మృగాదిష్వపి చ సమమతిర్ముచ్యమానావమాన–**
**స్పర్ధాసూయాదిదోషస్సతతమఖిల భూతేషు సంపూజయే త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, త్వయి ఏవ = నీయందే,

న్యస్త చిత్తః= చిత్తమును ఉంచి, సుఖమ్ విచరన్ = నిశ్చింతగా ఉందును, సర్వచేష్టాః = సమస్త కర్మలు(కర్మఫలములు)(చేష్టాయాం చేష్టతే ప్రవర్తించుట ప్రయత్నించుట), త్వత్ అర్థం = నీకొరకే అర్పింతును, త్వత్ భక్తైః= నీ భక్తులు, సేవ్యమానాన్= సేవించిన దేశములను, చరిత చరాన్ అపి= పుణ్యకర్మలను, పుణ్యదేశాన్= పుణ్య క్షేత్రములను, ఆశ్రయన్ = అశ్రయిస్తాను, దస్యౌ= నీచులందు (దస్యతి నాశయతి పరపదార్థాన్ ఇతరుల వస్తువును నశింప చేయువాడు. దస్యువు), విప్రే చ = బ్రాహ్మణులయందు, మృగాదిషు అపి = మృగాదులయందు, సమమతిః = సమత్వబుద్ధిని కలిగి ఉంటాను, అవమాన-స్పర్ధ అసూయా ఆదిదోషః=అవమాన, స్పర్ధ, అసూయ మొదలయిన దోషములను(అవమన్యతే తిరస్కరోతి తస్య భావః-తిరస్కారము అనాదరము) (అసూయతి నిందతి తస్య భావః గుణములయందు దోషము నారోపించుట. అసూయ నిందించుట), ముచ్యమాన= విడిచి, అఖిల భూతేషు= అన్ని ప్రాణుల యందు, సతతమ్ = ఎప్పుడు, త్వామ్= నిన్ను, సంపూజయే = పూజిస్తాను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా ! నీయందే చిత్తమును ఉంచి నిశ్చింతగా ఉందును. సమస్త కర్మఫలములు నీకొరకే అర్పింతును. నీ భక్తులు సేవించిన దేశములను, పుణ్యకర్మలను, పుణ్య క్షేత్రములను అశ్రయిస్తాను. నీచులందు, బ్రాహ్మణులయందు, మృగాదులయందు సమత్వబుద్ధిని కలిగి ఉంటాను. మానావమాన, స్పర్ధ, అసూయ మొదలయిన దోషములను విడిచి అన్ని ప్రాణుల యందు ఎప్పుడు నిన్ను పూజిస్తాను.

**97-3 శ్లో.**

**త్వద్భావో యావదేషు స్ఫురతి న విశదం తావదేవం హ్యుపాస్తిం**
**కుర్వన్నైకాత్మ్యబోధే ఝుటితి వికసతి త్వన్మయోఽహం చరేయమ్ ।**
**త్వద్ధర్మస్యాస్య తావత్ కిమపి న భగవన్! ప్రస్తుతస్య ప్రణాశః**
**తస్మాత్ సర్వాత్మనైవ ప్రదిశ మమ విభో! భక్తిమార్గం మనోజ్ఞమ్ ॥**

**ప్రతిపదార్థము:** విభో =ప్రభూ !( విశేషేణ భవతి సర్వగతః -విశేషంగా వుండువాడు అంతట వుండు సర్వవ్యాపకుడు. భగవంతుడు), ఏషు = సకలప్రాణులలోను, త్వత్

భావః= నీ భావమే కలదని (అంతర్యామిగా ఉన్నవని), యావత్ విశదం= ఎంతకాలము వరకు (విశేషేణ శీయతే విస్తృతో భవతి స్వచ్ఛో భవతి స్వచ్ఛమైనది స్పష్టమైనది), న స్ఫురతి=నాకు స్పష్టముగా స్ఫురించదో, తావత్ =అంతకాలము వరకు, ఏవం హి = ఇట్లే, ఉపాస్తిం కుర్వన్= నిన్ను సేవించెదను. (ఉపాసనమ్ ఉపాసనము సేవ), ఐకాత్మ్య బోధే= అంతటా నువ్వే ఉన్నావను భావము (జ్ఞానము)(ఏక ఆత్మా స్వరూపం యస్య తస్య భావః–ఏకస్వరూపమగుట), వికసతి= అనుభవ రూపములోకి రాగానే, ఝటితి= వెంటనే, అహం = నేను, త్వత్ మయః= త్వన్మయుడనై (నీవే నేనను భావముతో), చరేయమ్= చరింతును, భగవన్ = ఓ భగవానుడా!, అస్య త్వత్ ధర్మస్య = భగవద్విషయమైన — భాగవతమైన– ఈ ధర్మమును పొంది, ప్రస్తుతస్య= ఆ ధర్మమును ఆరంభించిన వానికి (ప్రయత్నము చేయబడినది సిద్ధము చేయబడినది), తావత్ = అంతవరకు(మొదటి నుండి చివరదాక), కిమ్ అపి= ఎన్నటికి, ప్రణాశః = వినాశము (వైకల్యము) (అత్యంతం నశ్యతి తస్య భావః కర్మ వా ప్రనాశనము), న= ఉండదు, తస్మాత్ = అందువలన, మనోజ్ఞమ్= మనసుతో గ్రహించు (మనసా జానాతి గృహ్ణాతి అందమైనది), భక్తిమార్గం = నీపై ప్రేమరూపమైన భక్తి యోగము, సర్వ ఆత్మనా ఏవ= సర్వాత్మనా(సర్వప్రకారేణ, అన్నివిధాల), మమ= నాకు, ప్రదిశ = అనుగ్రహింపుము.

**తాత్పర్యము:** ప్రభూ! సకలప్రాణులలోను నువ్వు అంతర్యామిగా ఉన్నవని ఎంతకాలము వరకు నాకు స్పష్టముగా స్ఫురించదో, అంతకాలము వరకు నిన్ను సేవించెదను. అంతటా నువ్వే ఉన్నావను భావము అనుభవ రూపములోకి రాగానే వెంటనే నేను నీవే అను భావముతో చరింతును. ఓ భగవానుడా ! భగవద్విషయమైన —భాగవతమైన – ఈ ధర్మమును పొంది ఆ ధర్మమును ఆరంభించిన వానికి మొదటి నుండి చివరదాక ఎన్నటికి వినాశము ఉండదు. అందువలన నీపై ప్రేమరూపమైన భక్తి యోగము అన్నివిధాలుగా నాకు అనుగ్రహింపుము.

**97-4 శ్లో.**

**తం చైనం భక్తియోగం ద్రఢయితుమయి మే సాధ్యమారోగ్యమాయుః**
**దిష్ట్యాతత్రాపి సేవ్యం తవ చరణమహో భేషజాయేవ దుగ్ధమ్ ।**

**మార్కండేయో హి పూర్వం గణకనిగదితద్వాదశాబ్దాయురుచ్చైః**
**సేవిత్వా వత్సరం త్వాం తవ భటనివహైర్ద్రావయామాస మృత్యుమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి= ఓ గురువాయూరు కృష్ణదేవా!, తం = పూర్వోక్తమైన, ఏనం=ఈ, భక్తి యోగం = భక్తి యోగము, ద్రఢయితుమ్ చ= దృఢపడుటకు (ఆరంభించినది స్థిరపడుటకు)( దృఢస్య భావః), మే = నాకు, ఆరోగ్యమ్= బాహ్యాంతర రోగ రాహిత్యము(అరోగస్య భావః–రోగము లేకుండుట, ఆరోగ్యము), ఆయుః = ఆయుర్దాయము (ఏతి ప్రాప్నోతి ఆయువు, జీవిత కాలము), సాధ్యమ్ = చక్కగా ఉండవలెను, తత్ర అపి=ఆ ఆయురారోగ్య నిమిత్తములోను (ఆ భక్తియోగ మందు), భేషజాయ=సన్నిపాతజ్వరము(విషమ జ్వరము) మొదలైన వాటికి(భేషం రోగం జియతి రోగమును జయించునది. మందు, ఔషధము), దుగ్ధమ్ ఇవ= పాలు తాగుటవలె (దుహ్యతే అసౌ పితుకబడునవి. పాలు), తవ చరణమ్=నీ పాదారవింద (చరతి అనేన–దీనిచే నడుచుదురు. కాలు), సేవ్యం= సేవ తప్పక కావలెను(సేవితుం యోగ్యమ్ సేవించదగినది), అహో దిష్ట్యా హి = అహో ! సంతోషము. (దిష్ట్యా =దిశతి ఆనందం దదాతి తస్య భావః–ఆనందమునిచ్చునది. మంగళము సంతోషము భాగ్యము), పూర్వం = పూర్వము, మార్కండేయః= మార్కండేయుడు (మృకండు మహర్షి కొడుకు), గణక= జాతక కోవిదులచే (జ్యోతిష్కులు)(గణయతి అసౌ లెక్కలు చేయువాడు జ్యోతిషుడు), ద్వాదశ అబ్ద ఆయుః = పండ్రెండేండ్ల ఆయుర్దాయమని, నిగదితమ్=చెప్పబడినప్పటికి, త్వాం = నిన్ను, వత్సరం= ఒక సంవత్సరము, ఉచ్చైః = తీవ్రముగా సమాధి యోగముతో (దృఢముగా), సేవిత్వా= సేవించి, తవ భటనివహైః = నీ భటుల సహాయమున, మృత్యుమ్=మృత్యువును (మ్రియతే ప్రాణైః వియుజ్యతే ప్రాణములు వదలుట. మృత్యువు), ద్రావయామాస = పారద్రోలెను.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! పూర్వోక్తమైన ఆ భక్తి యోగము దృఢపడుటకు నాకు బాహ్యాంతర రోగ రాహిత్యము, ఆయుర్దాయము చక్కగా ఉండవలెను. ఆ భక్తియోగమందు – సన్నిపాతజ్వరము మొదలైన వాటికి ఔషధముగా పాలు తాగుటవలె – నీ పాదారవింద సేవ నాకు తప్పక కావలెను. అహో! సంతోషము. (ఆకలిని తీరుస్తూ, బలాన్ని కలిగిస్తూ ఔషధంగా వ్యాధి

నివారణగా కూడా – పాలు ఉపయోగపడతాయి.అలాగే విష్ణుపాద సేవ అని కవి భావం) పూర్వము మార్కండేయుడు జ్యోతిష్కులు పండ్రెండేండ్ల ఆయుర్దాయమని చెప్పబడినప్పటికి నిన్ను ఒక సంవత్సరము తీవ్రముగా సమాధి యోగముతో సేవించి నీ భటుల సహాయమున మృత్యువును పారద్రోలెను.

**97–5 శ్లో.**

**మార్కండేయశ్చిరాయుస్స ఖలు పునరపి త్వత్పరః పుష్పభద్రా–**
**తీరే నిన్యే తపస్యన్నతులసుఖరతిష్షట్ తు మన్వంతరాణి ।**
**దేవేంద్రస్సప్తమస్తం సురయువతిమరున్మన్మథైర్మోహయిష్యన్**
**యోగోష్మప్లుష్యమాణైర్నతు పునరశకత్త్వజ్జనం నిర్జయేత్ కః ॥**

**ప్రతిపదార్థము:** చిర ఆయుః = దీర్ఘాయుష్మంతుడయిన(చిరం ఆయుః యస్య–దీర్ఘాయువు కలవాడు), సః మార్కండేయః ఖలు= ఆ మార్కండేయుడు, పునః అపి=మరలా, త్వత్ పరః= భగవద్భజన పరుడై, అతులసుఖరతిః = నిరతిశయ సుఖ రూపుడవయిన నీ యందు భక్తి కలవాడయి (పూర్ణ పరమానంద మగ్నుడై), పుష్పభద్రా తీరే = హిమాలయము ఉత్తరదిశలో ఉన్న పుష్పభద్రానదీతీరములో, తపస్యన్ తు = తపస్సు చేయుచుండగా, షట్ మన్వంతరాణి= ఆరు మన్వంతరములు(ఆరుగురు మనువుల కాలము పూర్తయినది. అనగా ఆరు డెబ్బది యొక్క మహాయుగములు గడచెనని అర్థం) (మనూనాం అంతరం అవకాశః తదుపలక్షిత కాలః–స్వాయంభువాది మన్వంతరములు. 71 చతుర్యుగాల కాలము), నిన్యే= గడచెను, సప్తమః = ఏడవ మన్వంతర కాలములో, దేవేంద్రః= దేవేంద్రుడు, తం = ఆ మార్కండేయుని, మోహయిష్యన్ = మోహింపచేసి తపస్సు భంగపరుచుటకు, సురయువతి= అప్సరసలను, మరుత్ = మలయ వాయువును(మ్రియతే ప్రాణినః అస్య అభావాత్ ఇది లేకపోయినచో ప్రాణులు మరణించును. వాయువు, గాలి దేవత), మన్మథైః= మన్మథునితో కలిపి (పంపెను) (మనః మథతి మనస్సును మథించువాడు), పునః = మరలా, యోగ= ఆ తపోనిరతుడైన మార్కండేయుని యోగము యొక్క, ఊష్మ= అగ్నికి, ప్లుష్యమాణైః = దహింపబడి, నతు అశకత్= అతనిని మోహింపచేయుటకు అశక్తులైరి, త్వత్ జనం

= నీ భక్తులను, కః = ఎవడు, నిర్జయేత్ = ఓడింపగలడు? (ఎవ్వరూ జయించలేరని భావం).

**తాత్పర్యము:** దీర్ఘాయుష్మంతుడయిన ఆ మార్కండేయుడు మరలా భగవద్భజన పరుడై నిరతిశయ సుఖ రూపుడవయిన నీ యందు భక్తి కలవాడయి (పూర్ణ పరమానందమగ్నుడై) హిమాలయము ఉత్తరదిశలో ఉన్న పుష్పభద్రానదీతీరములో తపస్సు చేయుచుండగా ఆరు మన్వంతరములు గడిచాయి. ఏడవ మన్వంతర కాలములో దేవేంద్రుడు ఆ మార్కండేయుని మోహింపచేసి తపస్సు భంగపరుచుటకు అప్సరసలను మలయ వాయువును మన్మథుని పంపెను. ఆ తపోనిరతుడైన మార్కండేయుని యోగాగ్నికి దహింపబడి అతనిని మోహింపచేయుటకు అశక్తులైరి. నీ భక్తులను ఎవడు ఓడింపగలడు? ( ఎవ్వరూ జయించలేరని భావం)

**విశేషాలు**

1. కృత యుగం (1728,000 సంవత్సరాలు)

2. త్రేతా యుగం (1296,000 సంవత్సరాలు)

3. ద్వాపర యుగం (864,000 సంవత్సరాలు)

4. కలి యుగం (432,000 సంవత్సరాలు)

ఈ నాలుగు యుగాలను కలిపి ఒక మహాయుగం అంటారు. 71 చతుర్యుగాల కాలము ఒక మన్వంతరము.

**97-6 శ్లో.**
**ప్రీత్యా నారాయణాఖ్యస్త్వమథ నరసఖః ప్రాప్తవానస్య పార్శ్వం**
**తుష్ట్యా తోష్టూయమానస్స తు వివిధవరైర్లోభితో నానుమేనే ।**
**ద్రష్టుం మాయాం త్వదీయం కిల పునరవృణోద్భక్తితృప్తాంతరాత్మా**
**మాయాదుఃఖానభిజ్ఞస్తదపి మృగయతే నూనమాశ్చర్యహేతోః ॥**

**ప్రతిపదార్థము:** అథ=అటుపిమ్మట మార్కండేయుని తపస్సుకు, ప్రీత్యా = ప్రీతిపొంది, నరసఖః = నరుని సఖుడవైన(నృణాతి ప్రాప్నోతి జన్మాదికమ్ జన్మాదులను పొందువాడు. మనుష్యుడు.అర్జునుడు), నారాయణ ఆఖ్యః= నారాయణుడను పేరుగల(నారా జలం అయనం స్థానం యస్య-జలము నివాస స్థానంగా కలవాడు. విష్ణువు), త్వమ్= నువ్వు, అస్య పార్శ్వం= ఆ మార్కండేయుడు ఉన్నచోటికి (స్పృశ్యతే శరీరపు ప్రక్క భాగము), ప్రాప్తవాన్ = వచ్చితివి, తుష్ట్యా = ఆ మార్కండేయుడు సంతోషముతో, తోష్టూయమానః= మరలా మరలా నిన్ను స్తుతింపగా, సః తు = అతనికి, వివిధవరైః= వివిధ వరములు ఇచ్చెదనని, లోభితః = ప్రలోభపెట్టితివి, భక్తి =నీ భక్తితో, తృప్త= సంపూర్ణమైన తృప్తి కలిగిన, అంతరాత్మా=మనస్సు కలిగిన ఆ మార్కండేయుడు, న అనుమేనే = నిన్ను వరములు అడుగలేదు, పునః = మరలా (కాని), త్వదీయం మాయాం= నీ దివ్య మాయను, ద్రష్టుం= చూపించుమని, అవృణోత్ కిల= కోరుకొనెను, మాయా దుఃఖ అనభిజ్ఞః= నీ మాయ వలన కలుగు దుఃఖములు తెలియని వాడు కనుక(న అభిజ్ఞ-తెలియనివాడు), ఆశ్చర్యహేతోః = ఆశ్చర్యము కలిగించు ('ఆః' ఇతి విస్మయస్య చర్యా ప్రకటనం అద్భుతమ్ విస్మయము ఆశ్చర్యము అసాధారణము), తత్ అపి= ఆమాయాదుఃఖము, మృగయతే =అనుభవించాలను కొన్నాడు కాబోలు, నూనమ్= అని సందేహింతును. (వితర్క-నిశ్చయ-స్మరణ-వాక్యపూరణ-ఉత్ప్రేక్షాసు వితర్కము, నిశ్చయము, స్మరణము, వాక్యపూరణము, ఉత్ప్రేక్షలయందు ప్రయోగింతురు).

**తాత్పర్యము:** అటుపిమ్మట మార్కండేయుని తపస్సుకు ప్రీతిపొంది నరుని సఖుడవైన నారాయణుడను పేరుగల నువ్వు ఆ మార్కండేయుడు ఉన్నచోటికి వచ్చితివి. ఆ మార్కండేయుడు సంతోషముతో మరలా మరలా నిన్ను స్తుతింపగా అతనికి వివిధ వరములు ఇచ్చెదనని ప్రలోభపెట్టితివి. నీ భక్తితో సంపూర్ణమైన తృప్తి కలిగిన మనస్సు కలిగిన ఆ మార్కండేయుడు నిన్ను వరములు అడుగలేదు. కాని నీ దివ్య మాయను చూపించుమని అతడు కోరుకొనెను. నీ మాయ వలన కలుగు దుఃఖములు తెలియని వాడు కనుక ఆశ్చర్యము కలిగించు ఆమాయాదుఃఖము అనుభవించాలను కొన్నాడు కాబోలు. అని సందేహింతును. (మాయచే కలుగు

దుఃఖమురుచిచూడనివాడగుటచేఅదికూడఎలాఉండాలోచూడవలెననుకొన్నాడని అనుకొంటున్నాను)

**97-7 శ్లో.**

**యాతే త్వయ్యాశు వాతాకులజలదగలత్తోయపూర్ణాతిఘూర్ణత్**
**సప్తార్ణోరాశిమగ్నే జగతి స తు జలే సంభ్రమన్ వర్షకోటీః ।**
**దీనః ప్రైక్షిష్ట దూరే వటదలశయనం కంచిదాశ్చర్యబాలం**
**త్వామేవ శ్యామలాంగం వదనసరసిజన్యస్తపాదాంగులీకమ్ ॥**

**ప్రతిపదార్థము:** త్వయి= నారాయణుడను పేరుగల నువ్వు, యాతే = (అదృశ్యమయి) బదరికాశ్రమమునకు వెళ్లగా, జగతి = జగత్తులో, ఆశు = వెంటనే, వాత= గాలితో (వాతి స్పృశతి గచ్ఛతి వెళ్లునది, స్పృశించునది. వాయువు), ఆకుల = అటు ఇటు చలితములగు, జలద= మబ్బులనుండి (జలం దదాతి జలము నిచ్చునది. మేఘము), గలత్= కురియుచున్న, తోయపూర్ణ = వర్ష ధారలచే, అతిఘూర్ణత్= అల్లకల్లోలమయిన(అతి భ్రమణే ఘూర్ణతే, ఘూర్ణతి చక్రాకారంగా తిరుగుట బాగా భ్రమించుట), సప్త అర్ణో రాశి జలే = సప్తసముద్ర జలరాశిలో, సః = జగత్తు మొత్తము, మగ్నేతు = మునిగిపోగా, వర్షకోటీః = అనేక కోట్ల సంవత్సరములు, దీనః = మార్కండేయుడు దీనముగా, సంభ్రమన్= అటూ ఇటూ తిరుగుచుండగా, వటదల శయనం =ఒక మర్రి ఆకుపైన పడుకొని, శ్యామల అంగం= నల్లని శరీరముతో, వదన సరసిజ= తన ముఖ పద్మములో, న్యస్త = ఉంచిన (న్యస్తః నితరాం అస్తః), పాద అంగులీకమ్ = కాలిబొటన వేలు కలిగిన, కంచిత్= ఒక, ఆశ్చర్య బాలం = ఒక అద్భుత బాలుడవైన, త్వామ్ ఏవ = నిన్ను, దూరే = దూరములో, ప్రైక్షిష్ట= చూసెను.

**తాత్పర్యము:** నారాయణుడను పేరుగల నువ్వు బదరికాశ్రమమునకు వెళ్లగా –జగత్తులో వెంటనే గాలితో అటు ఇటు చలితములగు మబ్బులనుండి కురియుచున్న వర్ష ధారలచే అల్లకల్లోలమయిన సప్తసముద్ర జలరాశిలో జగత్తు మొత్తము మునిగిపోగా అనేక కోట్ల సంవత్సరములు మార్కండేయుడు దీనముగా అటూ ఇటూ తిరుగుచూ– ఒక మర్రి ఆకుపైన పడుకొని నల్లని శరీరముతో తన ముఖ

పద్మములో ఉంచిన కాలిబొటన వేలు కలిగిన ఒక ఒక అద్భుత బాలుడవైన నిన్ను దూరములో చూసెను.

**97-8 శ్లో.**

**దృష్ట్వాత్వాం హృష్ట రోమా త్వరితముపగతః స్ప్రష్టుకామో మునీంద్రః**
**శ్వాసేనాంతర్నివిష్టః పునరిహ సకలం దృష్టవాన్ విష్టపౌఘమ్ ।**
**భూయోఽపి శ్వాసవాతైర్బహిరనుపతితో వీక్షితస్త్వత్కటాక్షైః**
**మోదాదాశ్లేష్టుకామస్త్వయి పిహితతనౌ స్వాశ్రమే ప్రాగ్వదాసీత్ ॥**

**ప్రతిపదార్థము:** త్వాం= మఱ్ఱి ఆకుపై పడుకొనియున్న నిన్ను, దృష్ట్వా = చూసి, హృష్ట రోమాః= మేను పులకరింపగా (ప్రీతః జాతహర్షః–ప్రీతినొందినవాడు సంతోషించినవాడు), స్ప్రష్టుకామః = నిన్ను స్పృశించుటకొరకు, మునీంద్రః = ఆ మార్కండేయ మహర్షి, త్వరితమ్ = తొందరగా, ఉపగతః = నీదగ్గరకు వచ్చి (ఉప సమీపం గతః సమ్యక్ గతః జ్ఞాత–దగ్గరకు వెళ్ళినది చక్కగా తెలుసుకున్నది స్వీకారము), శ్వాసేన అంతః = బాలుని రూపములో ఉన్న నీ యొక్క ఉచ్ఛ్వాసముతో పాటు(శ్వసితి అనేన–దీనిని పీల్చుకొందురు. వాయువు), నివిష్టః = నీ లోపలకు ప్రవేశించి (నివిష్టః కృతః ప్రవేశః స్థితః బద్ధః–ప్రవేశించినవాడు బంధింపబడినవాడు వున్నవాడు), పునః= మరలా, ఇహ = నీ లోపల, సకలం =అన్ని, విష్టప ఔఘమ్ = లోకములను(విశంతి అత్ర సుకృతినః–అదృష్టవంతులు ఇక్కడ ప్రవేశింతురు. లోకము భువనము), దృష్టవాన్ = దర్శించెను, భూయః అపి= తిరిగి, శ్వాస వాతైః = నీ నిశ్వాసములో, బహిః అనుపతితః = బయటకు వచ్చి, త్వత్ కటాక్షైః వీక్షితః = నీ కటాక్షములను పొంది (కటం గండం అక్షతి వ్యాప్నోతి క్రీగంటి చూపు), మోదాత్ = సంతోషముతో, ఆశ్లేష్టుకామః= నిన్ను కౌగిలించుకొనబోగా (ఆ ఈషత్, ఏకదేశేన వా శ్లేష సంబంధః–కొద్దిగా సంబంధము కలిగివున్నది కౌగిలించుకొనుట), త్వయి = నువ్వు, పిహితతనౌ = అంతర్ధానము కాగా (మాయా రూపమును ఉపసంహరించగా) (తిరోహితః ఆచ్ఛాదితః–మూయబడినది కప్పబడినది దాచబడినది), ప్రాక్ వత్ =అప్పుడు ఆ మార్కండేయుడు పూర్వము వలె, ఆశ్రమే = పుష్పభద్రా తీరములో ఉన్న ఆశ్రమములో, ఆసీత్= ఉండెను.

**తాత్పర్యము:** మర్రి ఆకుపై పడుకొనియున్న నిన్ను చూసి తన మేను పులకరింపగా, నిన్ను స్పృశించుటకొరకు తొందరగా ఆ మార్కండేయ మహర్షి నీదగ్గరకు వచ్చి బాలుని రూపములో ఉన్న నీ యొక్క ఉచ్ఛ్వాసముతో పాటు నీ లోపలకు ప్రవేశించి– నీ లోపల సమస్త లోకములను దర్శించెను. తిరిగి నీ నిశ్వాసములో బయటకు వచ్చి నీ కటాక్షములను పొంది సంతోషముతో నిన్ను కౌగిలించుకొనబోగా నువ్వు అంతర్ధానము కాగా అప్పుడు ఆ మార్కండేయుడు పూర్వము వలె పుష్పభద్రా తీరములో ఉన్న తన ఆశ్రమములో ఉండెను.

**97–9 శ్లో.**

**గౌర్యా సార్ధం తదగ్రే పురభిదథ గతస్త్వత్ప్రియప్రేక్షణార్థీ**
**సిద్ధానేవాస్య దత్త్వా స్వయమయమజరామృత్యుతాదీన్ గతోఽభూత్ ।**
**ఏవం త్వత్సేవయైవ స్మరరిపురపి స ప్రీయతే యేన తస్మాత్**
**మూర్తిత్రయ్యాత్మకస్త్వం నను సకలనియంతేతి సువ్యక్తమాసీత్ ॥**

**ప్రతిపదార్థము:** అథ =అటుపిమ్మట, పురభిత్=శివుడు (మయునిచే నిర్మింపఁబడిన మూడు పురములు. కమలాక్షుడికీ, తారకాక్షుడికీ, విద్యున్మాలికీ బ్రహ్మ మెచ్చి ఇచ్చిన మూడు నగరాలు కలసి త్రిపురం.)(భిత్=భేదకర్తా), త్వత్ ప్రియ = నీ భక్తుడగు మార్కండేయుని, ప్రేక్షణ అర్థీ= దర్శించు నిమిత్తముగా (ప్రకర్షేణ ఈక్షణమ్ చూచుట), గౌర్యా= గౌరితో, సార్ధం = కలిసి, తత్ అగ్రే గతః = ఆ మార్కండేయుని ఎదుట ప్రత్యక్షమయ్యెను, స్వయమ్ ఏవ = తన తపస్సు యొక్క ప్రభావముచే స్వయముగా మార్కండేయునికి(ఆత్మశబ్ద తృతీయార్థః–తనచేత), సిద్ధాన్= ఇదివరలోనే ప్రాప్తించిన (సిద్ధః నిశ్చితః సంపన్నః ప్రాప్తః న్యాయ్యం నిర్ణీతః–సిద్ధించినది), అజరా మృత్యుతా ఆదీన్ = జరామృత్యువులు లేని వరములను(నాస్తి జరా యస్యాః–ముసలితనము లేనిది)(మ్రియతే ప్రాణైః వియుజ్యతే ప్రాణములు వదలుట. మృత్యువు), అస్య = ఆ మార్కండేయునికి, దత్త్వా= ఇచ్చి, అయమ్= శివుడు, గతః అభూత్= అదృశ్యమయ్యాడు, సః స్మరరిపుః అపి = ఆశివుడు కూడా, త్వత్ సేవయా ఏవ= నిను సేవించుటచే, ఏవం ప్రీయతే = ఇట్లు సంతుష్టుడగునని తెలియుచున్నది, యేన=ఏ నీ సేవ వలన శివునికి సంతుష్టి

ఉండుట చేత, తస్మాత్=దానివలన, త్వం = విష్ణువువైన నువ్వు, మూర్తి త్రయి ఆత్మకః= బ్రహ్మ విష్ణు శివ స్వరూపుడవని, సకలనియంతా ఇతి= సర్వ నియంతవు అని, సువ్యక్తమ్ ఆసీత్ నను= చక్కగా తేట తెల్లమగుచున్నది.

**తాత్పర్యము:** అటుపిమ్మట శివుడు నీ భక్తుడగు మార్కండేయుని దర్శించు నిమిత్తముగా గౌరితో కలిసి ఆ మార్కండేయుని ఎదుట ప్రత్యక్షమయ్యెను. తన తపస్సు యొక్క ప్రభావముచే స్వయముగా మార్కండేయునికి ఇదివరలోనే ప్రాప్తించిన జరామృత్యువులు లేని వరములను ఆ మార్కండేయునికి ఇచ్చి శివుడు అదృశ్యమయ్యాడు. ఆశివుడు కూడా నిను సేవించుటచే సంతుష్టుడగునని తెలియుచున్నది. విష్ణువువైన నువ్వు బ్రహ్మ విష్ణు శివ స్వరూపుడవని సర్వ నియంతవు అని చక్కగా తేట తెల్లమగుచున్నది.

**విశేషాలు**

**త్రిపుర / త్రిపురసుందరి:** మూడు పురాలు అవి త్రిగుణాలు కావచ్చు. అవస్థాత్రయం కావచ్చు. స్థూల సూక్ష్మ కారణాలనే మూడు శరీరాలు కావచ్చు. పృథివ్యాదులైన మూడు లోకాలు కావచ్చు. మొత్తానికి అన్నీ త్రిపురాలే. చిచ్ఛక్తితో పూర్తిగా నిండిపోయినవే. ఈ మూడింటిలో ఎదురులేకుండా విహరించే చిచ్ఛక్తి స్వరూపిణి అయిన దేవి త్రిపుర సుందరి.

**97-10 శ్లో.**

**త్ర్యంశేఽస్మిన్ సత్యలోకే విధిహరిపురభిన్మందిరాణ్యూర్ధ్వమూర్ధ్వం**
**తేభ్యోఽప్యూర్ధ్వం తు మాయావికృతివిరహితో భాతి వైకుంఠలోకః ।**
**తత్ర త్వం కారణాంభస్యపి పశుపకులే శుద్ధసత్త్వైకరూపీ**
**సచ్చిద్బ్రహ్మాద్వయాత్మా పవనపురపతే! పాహిమాం సర్వరోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** త్రి = బ్రహ్మ విష్ణు శివలోక రూపములైన మూడు(తీర్ణతమా సంఖ్యా రెండింటిని మించిన సంఖ్య. మూడు), అంశే = లోకములు, అస్మిన్ సత్యలోకే = సత్య లోకములో(సప్తలోకాంతర్గత లోకవిశేషః), విధి =బ్రహ్మ (విదధాతి విశ్వమ్ ప్రపంచమును రూపొందించువాడు. బ్రహ్మ), హరి=

విష్ణు(హరతి పాపాన్ పాపములను నశింపచేయువాడు. విష్ణువు), పురభిత్= శివుని, మందిరాణి = నివాస స్థానములు(మంద్యతే సుప్యతే అత్ర ఇక్కడ పడుకొందురు. మందిరము, ఇల్లు), ఊర్ధ్వమ్ ఊర్ధ్వం = ఒకదానిపై ఒకటి ఉన్నవి (ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్ పైకి తరువాత), తేభ్యః అపి ఊర్ధ్వం = ఈ అన్నింటికి మీద, మాయా వికృతి విరహితః = మాయావికృతులు, మహదహంకారాదులు, షోడశవికారములు లేని శుద్ధ సత్త్వమయమైన, వైకుంఠలోకః తు=వైకుంఠలోకము, భాతి = ప్రకాశించుచున్నది, తత్ర = ఆ వైకుంఠలోకములో, కారణ అంభసి= కారణ జలములయందును పశుపకులే అపి= నంద గోకులములోను, త్వం = నువ్వు, శుద్ధ సత్త్వైక రూపీ = శుద్ధ సత్వమాత్రమూర్తిగా, సత్ చిత్ బ్రహ్మ అద్వయ ఆత్మా= ఆవరణ లేనందున కేవల సచ్చిదానంద బ్రహ్మమై సచ్చిదానందమయ శరీరంతో ఉన్నావు, పవనపురపతే= ఓ గురువాయూరు కృష్ణదేవా!, సర్వరోగాత్ = అన్నిరోగములను పోగొట్టి, మాం = నన్ను, పాహి= రక్షించు.

**తాత్పర్యము:** బ్రహ్మ విష్ణు శివలోక రూపములైన లోకములు మూడును సత్య లోకములో బ్రహ్మ , విష్ణు శివుని నివాస స్థానములు ఒకదానిపై ఒకటి ఉన్నవి. (బ్రహ్మ లోకములో బ్రహ్మ మందిరము, దానిపయిన ఉన్న విష్ణులోకములో విష్ణుమందిరము, దానిపయిన ఉన్న శివలోకములో శివమందిరములు ఉన్నవి) ఈ అన్నింటికి మీద మాయావికృతులు ,మహదహంకారాదులు, షోడశవికారములు (పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు మనస్సు, పంచ ఇంద్రియార్థములు )లేని శుద్ధ సత్త్వమయమైన వైకుంఠలోకము ప్రకాశించుచున్నది. ఆ వైకుంఠలోకములో కారణ జలములయందును నంద గోకులములోను నువ్వు శుద్ధ సత్వమాత్రమూర్తిగా ఆవరణ లేనందున కేవల సచ్చిదానంద బ్రహ్మమై సచ్చిదానందమయ శరీరంతో ఉన్నావు. ఓ గురువాయూరు కృష్ణదేవా ! అన్నిరోగములను పోగొట్టి నన్ను రక్షించు.

**విశేషాలు**

**మాయా:** మీయతే అనయా ఇతి మాయా.' దేనిచేత కొలవబడుతుందో అది మాయ.

పరమాత్మ శక్తి. దేశకాల వస్తువులన్నింటినీ కొలిచి ఇవి ఇంతేనని చూపుతుంది. కనుక అది మాయ అయితే ఇవి మేయమవుతున్నాయి. ఇది అలా కొలవలేనిది ఒక్కటే. అది పరమాత్మ తత్త్వం. కనుక అమేయు డయ్యాడు ఆయన.

**వికృత:** మారిపోయినది. రూపాంతరం చెందినది. ప్రపంచమంతా చైతన్యవికారమే. దాని వికృతమైన రూపమే.

**వికల్ప/వికార:** ఒక వస్తువు అనేక విధాలుగా భాసిస్తే అవి దాని వికల్పాలు లేదా వికారాలు.

**షడ్భావ వికార:** లోకంలో ఏ పదార్థానికైనా ఏర్పడే మార్పులు ఆరే ఆరు. వికారమంటే మార్పనే అర్థం. 'జాయతే అస్తి వర్ధతే విపరిణమతే అపక్షీయతే వినశ్యతి.' పుడుతుంది, ఉంటుంది, పెరుగుతుంది, మారుతుంది. కృశిస్తుంది. నశిస్తుంది. మొదట జన్మ, చివర మరణం, మధ్యలో నాలుగు స్థితి. ఒకవిధంగా సృష్టి స్థితి లయాలే. అందులోనే ఆరూ చేరిపోతాయి. ఈ వికారాలు లేని పదార్థమే లేదు సృష్టిలో. నిర్వికారమైన పదార్థం ఒక్కటే అది ఆత్మస్వరూపం.

**మహత్:** సాంఖ్యుల పంచవింశతి తత్వాలలో ఒకటి. అవ్యక్తమైన ప్రధానం నుంచి వచ్చిన రెండవ భూమిక. అద్వైతుల భాషలో ఇది అవ్యాకృత సూక్ష్మప్రపంచం. దానికి అధిపతి అయిన జీవుడు హిరణ్యగర్భుడు. అంటే సమష్టి బుద్ధి.

**అహంకార:** అహమంటే నేను అని శబ్దార్థం. అలా భావించటమే అహంకారం. నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించగలిగితే ఇది ఆత్మస్వరూపమే. అలాకాక సోపాధికమైతే ఇదే అనాత్మలాగా మారిపోతుంది. కర్తృరూపమైనది అహంకారమైతే సాక్షిరూపమైన చైతన్యమాత్మ. అహంకారానికే కర్తాత్మ అని పేరుపెట్టారు వేదాంతులు. ఇది చిదాభాసుడే గాని కేవల చిద్రూపం కాదు. అంటే జీవుడని అర్థం. ఇలాంటి జీవుడే అసలైన ఆత్మ అని భ్రమించారు పూర్వమీమాంసకులు.

**కారణ:** ఒక కార్యమేర్పడటానికి ముందున్న పదార్థం.

ఉపాదానమని, నిమిత్తమని, సహకారి అని మూడు విధాలు ఇది. మట్టిలాగా అచేతనమైన దుపాదానం.

కుమ్మరిలాగా చేతనమైనది నిమిత్తం. సారెలాగా తోడ్పడేది సహకారి. మూడూ కలిస్తేగాని కార్యమనేది ఏర్పడదు. ఇవి మూడూ ద్వైతులకు వేరువేరు. మూడూ కలిసి ఒక్కటే అద్వైతులకు. పరమాత్మే ప్రపంచమనే కార్యానికి ఉపాదానం. ఆయనే నిమిత్తం. ఆయనే సహకారి. జ్ఞానంద్వారా నిమిత్తం శక్తిద్వారా ఉపాదానం. సంకల్పంద్వారా సహకారి. అవిద్యా రూపమైన కారణ శరీరమని కూడా అర్థమే.

**ద్వాదశ స్కంధము**

**97వ దశకము సమాప్తము**

# దశకమ్ 98 – నిష్కలబ్రహ్మోపాసనము

**98-1 శ్లో.**

**యస్మిన్నేతద్విభాతం యత ఇదమభవద్యేన చేదం య ఏతద్**
**యోస్మాదుత్తీర్ణరూపః ఖలు సకలమిదం భాసితం యస్య భాసా ।**
**యో వాచాం దూరదూరే పునరపి మనసాం యస్యదేవా మునీంద్రాః**
**నో విద్యుస్తత్త్వరూపం కిము పునరపరే కృష్ణ! తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ = ఓ గురువాయూరు కృష్ణదేవా! (కర్షతి ఆత్మసాత్కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః–భక్తులను ఆనందములో ముంచువాడు. శ్రీకృష్ణుడు), యస్మిన్ = ఏ వస్తువు యొక్క (చిచ్చక్తి యొక్క) వెలుగుచే, ఏతద్ విభాతం = ఈ సకలజగత్తు ప్రకాశించుచున్నదో(విభాత విశిష్టః భాతః ప్రాతఃకాలః–విశిష్ట ప్రకాశం కలది), యతః= దేనినుండి, ఇదమ్= ఈ జగత్తు(ఇదం ప్రత్యక్షం దృశ్యమానం, ప్రత్యక్షవిషయ బోధకః సర్వనామ సంజ్ఞకః అనుభూయమానమ్ ఇది కనబడునది, అనుభవింపబడినది ప్రత్యక్షంగా ఉన్నదానిని బోధించు సర్వనామం), అభవత్= ఆవిర్భవించుచున్నదో, యేన = దేనితో, ఇదం= ఈ జగత్తు, చ= ఐక్యమగుచున్నదో (చకారాత్ ఐక్యం యాతి లీయత ఇత్యర్థః అని సంస్కృత వ్యాఖ్యానము), ఏతద్ = ఈ (ఏతి ప్రాప్నోతి ప్రాప్యతే వా పురోవర్తి ముందున్నది),యః =ఏస్వరూపము,అస్మాత్ =మాకు(అవిద్యాకల్పితమైన ఈ జగత్తు కంటె), ఉత్తీర్ణ రూపః = విలక్షణమైనదో (ఉత్తీర్ణః పారం గతః–ఉత్తీర్ణుడైనవాడు దాటినవాడు),యస్య భాసా= ఎవరి వలన, ఇదం = ఈప్రపంచము, సకలమ్ ఖలు =సకలము (సహ కలయా సంపూర్ణము), భాసితం= ప్రకాశించుచున్నదో, యః =ఏ భగవత్ తత్వము, వాచాం అపి= వాక్కులకు, మనసాం= మనస్సుకు, పునః దూర దూరే = మాటిమాటికి దూరమో (ఎవరు వాక్కులకు, మనస్సుకు దూరమో), యస్య= ఎవరి యొక్క, తత్వరూపం= తత్వ రూపమును (పరమాత్మస్వరూపము), దేవాః = దేవతలు, మునీంద్రాః = మునీంద్రులు, నః విద్యుః = తెలుసుకోలేరన్నచో, అపరే = సామన్య మానవుల

సంగతి, పునః = మరలా, కిము= చెప్పుట ఎందుకు?, తస్మై= అట్టి పరమాత్మ వగు, తే = నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా! ఏ వస్తువు యొక్క వెలుగుచే ఈ సకలజగత్తు ప్రకాశించుచున్నదో, దేనినుండి ఈ జగత్తు ఆవిర్భవించుచున్నదో, దేనితో ఈ జగత్తు ఐక్యమగుచున్నదో, ఈ సకల జగత్తు ఏ నీ ఈశ్వర స్వరూపమో, ఏ స్వరూపము మాకు విలక్షణమైనదో, ఎవరి వలన ఈప్రపంచము సకలము ప్రకాశించుచున్నదో , ఏ భగవత్ తత్వము వాక్కులకు, మనస్సుకు దూరమో, ఎవరి యొక్క తత్వ రూపమును దేవతలు మునీంద్రులు తెలుసుకోలేరో (సామాన్య మానవుల సంగతి మరలా చెప్పుట ఎందుకు?) అట్టి పరమాత్మ వగు నీకు నమస్కారము.

**98-2 శ్లో.**

**జన్మాథో కర్మ నామ స్ఫుటమిహ గుణదోషాదికం వా న యస్మిన్**
**లోకానామూతయే యః స్వయమనుభజతే తాని మాయానుసారీ ।**
**బిభ్రచ్ఛక్తీరరూపోఽపి చ బహుతరరూపోఽవభాత్యద్భుతాత్మా**
**తస్మై కైవల్యధామ్నే పరరసపరిపూర్ణాయ విష్ణో! నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో= ఓ గురువాయూరు కృష్ణదేవా ! విష్ణుమూర్తీ ! (వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), ఇహ = ఈ భగవత్తత్వమందు, జన్మ = జన్మ (అనగా కృష్ణాద్యవతారములు), అథః = అనంతరము, కర్మ = కర్మ (కంససంహారాదులు), నామ = నామము (జన్మ కర్మ నిమిత్తములయిన) (నామయతి నామ్యతే అనేన వా స్వీకారము విస్మయము స్మరణము చెప్పుట వికల్పము), గుణదోష ఆదికం= గుణదోషములు ( నిగ్రహ, అనుగ్రహములు) మొదలయినవి (గుణ్యంతే ప్రశస్యంతే ఇతి గుణాః–పొగడబడునది. సద్గుణము) (దూష్యతే దూషించునది. దోషము), వా = పుత్రమిత్రాది భావములు (ఆదిశబ్దేన పుత్ర మిత్రాదయః అని సంస్కృత వ్యాఖ్యానము), యస్మిన్= దేనియందు, స్ఫుటమ్ = పారమార్థికముగా (స్ఫుటతి వికసతి ప్రకాశతే వా వికసించినది), న = నీకు లేవు, (తథాపి= అయినప్పటికి), లోకానామ్ ఊతయే= లోకానుగ్రహముకొఱకు(లోకతే

ప్రకాశతే ప్రకాశించునది. లోకము), మాయా అనుసారీ= మాయానుసారివై, తాని = ఆ జన్మ కర్మాదులను, స్వయమ్= స్వయముగా, అనుభజతే = అంగీకరించుచున్నావు, శక్తీః = విద్య అవిద్య జ్ఞానము ఐశ్వర్యము మొదలగు మహిమలను(శక్నోతి సమర్థో భవతి తస్య భావః కర్మ వా శక్తి, సామర్థ్యము), బిభ్రత్ = వెదజల్లుతూ, అరూపః అపి = నిర్గుణుడవైనప్పటికి (నిరాకారమైన ఆత్మత్త్వము), బహుతరరూపః = స్థావరజంగమ, సుర నర పశుపక్ష్యాది రూపములను, అవభాతి చ = ధరించుచు ప్రకాశిస్తున్నావు, ఉద్భూత ఆత్మా = ఆశ్చర్య స్వరూపుడై (ఉద్భూతః జాతః ప్రకటితః–ఉత్పన్నమైనది ప్రకటితమైనది), కైవల్య ధామ్నే= మోక్ష నిధానమై, పర రసపరిపూర్ణాయ= ఆనందరసపరిపూర్ణుడై, యః= ఎవరయితే ఉన్నారో, తస్మై= అతనికొరకు, తే= నీకొరకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణదేవా ! విష్ణుమూర్తీ ! కృష్ణాద్యవతారములు ,కంససంహారాదులు, జన్మ కర్మ నిమిత్తములయిన గుణదోషములు, పుత్రమిత్రాది భావములు పారమార్థికముగా నీకు లేవు. అయినప్పటికి లోకానుగ్రహముకొఱకు మాయానుసారివై ఆ జన్మ కర్మాదులను స్వయముగా అంగీకరించుచున్నావు. విద్య, అవిద్య ,జ్ఞానము ,ఐశ్వర్యము మొదలగు మహిమలను వెదజల్లుతూ నిర్గుణుడవైనప్పటికి స్థావరజంగమ, సుర నర పశుపక్ష్యాది రూపములను ధరించుచూ ప్రకాశిస్తున్నావు. ఆశ్చర్య స్వరూపుడవయిన , మోక్ష నిధానమయిన , ఆనందరసపరిపూర్ణుడైన నీకు నమస్కారము.

**98–3 శ్లో.**

**నో తిర్యంచం న మర్త్యం న చ సురమసురం న స్త్రియం నో పుమాంసం**
**న ద్రవ్యం కర్మజాతిం గుణమపి సదసద్వాపి తే రూపమాహుః ।**
**శిష్టం యత్స్యాన్నిషేధే సతి నిగమశతైర్లక్షణావృత్తితస్తత్**
**కృచ్ఛ్రేణావేద్యమానం పరమసుఖమయం భాతితస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** తే = నీ యొక్క, రూపమ్ = పరబ్రహ్మ రూపము (రూపయతి తస్య భావః కర్మ వా రూపము, స్వభావము), తిర్యంచం న= పశుపక్ష్యాదికము కాదు.

(తిరః వక్రం అంచతి గచ్ఛతి వక్రః నిరుద్ధః పశుః), న మర్త్యం= మానవము కాదు (మ్రియతే అత్ర–ఇక్కడ నశించును. మర్త్యలోకము), న సురమ్=దైవము కాదు (సుష్ఠు రాతి దదాతి అభీష్టమ్ కోరికను నెరవేర్చువాడు. దేవత), అసురం చ న = రాక్షసము కాదు. (న సుష్ఠు రతోః న స్థితః – స్థిరంగా ఒకచోట నుండనివాడు చంచలచిత్తుడు రాక్షసుడు), స్త్రియం న= స్త్రీ కాదు, పుమాంసం న= పురుషుడు కాదు(స్త్రీ పుం నపుంసకము కాదు), ద్రవ్యం అపి = ద్రవ్యము (విషయము) (ద్రవతి గచ్ఛతి ప్రాప్యతే వా పోవునది పొందునది ద్రవ్యము పదార్థము న్యాయమతంలో 9 ద్రవ్యములు 1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము, 6. కాలము, 7. దిక్కు, 8. ఆత్మ, 9. మనస్సు), కర్మ = కర్మ (కర్మేంద్రియములు వాక్కు, హస్తములు, పాదములు, పాయువు, ఉపస్థ అను ఐదు ఇంద్రియములు), జాతిం = జాతి (బ్రాహ్మణత్వాదికము), గుణమ్ అపి= జ్ఞానేంద్రియములు (1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వ, 5. నాసిక), సత్ = అంతః కరణము (లోపలి యింద్రియము. అంతఃకరణచతుష్టయము = మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము), అసత్ వా= అవ్యక్తము, న ఆహుః = నీ స్వరూపములు కావని చెప్పుచున్నారు, నిషేధే సతి= వేదము "ఇది కాదు ఇది కాదు" అని నిషేధింపగా, యత్ శిష్టం స్యాత్ = ఏది మిగిలి ఉన్నదో అది నువ్వు(శిష్ట అవశిష్టః–మిగిలినది), తత్ నిగమశతైః= ఆ ఉపనిషత్తుల చేత (గమయంతి జ్ఞాపయంతి వేదార్థమ్ వేదార్థమును తెలియచేయు శాస్త్రములు), కృచ్ఛ్రేణ = వాచ్యవాచకసంబంధములేని(కృంతతి సుఖమ్ సుఖమును పోగొట్టునది. దుఃఖము కష్టము పాపము కృచ్ఛ్ర చాంద్రాయణాదులు మూత్రకృచ్ఛ్రరోగము), లక్షణావృత్తితః= లక్షణావృత్తి చే(లక్షతే అభిదార్థభిన్నోఽర్థ అనయా అభిధార్థభిన్నమైన అర్థమును తెలుపునది. లక్షణా అను ఒక శబ్దశక్తి), ఆవేద్యమానం=ప్రతిపాదించు,పరమ సుఖమయం =పరమానందస్వరూపముగా, భాతి = ప్రకాశించుచున్నావు, తస్మై తే= అట్టి నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:** నీ యొక్క పరబ్రహ్మ రూపము పశుపక్ష్యాదికము కాదు. మానవము కాదు .దైవము కాదు. రాక్షసము కాదు. స్త్రీ పుం నపుంసకము కాదు. ద్రవ్యము (విషయము), కర్మ (కర్మేంద్రియములు), జాతి (బ్రాహ్మణత్వాదికము),

జ్ఞానేంద్రియములు, అంతః కరణము, అవ్యక్తము నీ స్వరూపములు కావని చెప్పుచున్నారు. వేదము "ఇది కాదు ఇది కాదు" అని నిషేధింపగా ఏది మిగిలి ఉన్నదో అది నువ్వు. ఆ ఉపనిషత్తుల చేత వాచ్యవాచకసంబంధములేని లక్షణావృత్తి చే ప్రతిపాదించు పరమానంద స్వరూపముగా ప్రకాశించుచున్నావు. అట్టి నీకు నమస్కారము.

**విశేషాలు**

**ద్రవ్యము :** తార్కికులు పేర్కొనే సప్త పదార్థాలలో మొదటిది. ఏడు పదార్థాలు లేవు. ద్రవ్యమొక్కటే పదార్థం. దానికి సంబంధించినవే. గుణకర్మ సామాన్య విశేష సమవాయ అభావాలనే మిగతా ఆరూ అని సిద్ధాంతం చేశారద్వైతులు. ఆ ద్రవ్యం కూడా భౌతికమే. చైతన్యానికి విషయమే. అజ్ఞానంవల్ల దానికి వేరుగా భాసిస్తున్నది. దాని జ్ఞానమేర్పడితే అందులోనే ఇది కరిగిపోతుంది. అప్పుడంతా ఆత్మస్వరూపమే. అనాత్మ లేనేలేదు. అలా కరిగే స్వభావమున్నందు వల్లనే 'ద్రవతీతి ద్రవ్యం' అని పేరు వచ్చింది అంటారు వారు.

**అవ్యక్తము:** వ్యక్తం కానిది. బయటపడి కనపడనిది. వ్యాకృతం కానిది. విస్తరించబడనిది. ప్రపంచానికీ పరమాత్మకూ నడుమనున్న ప్రకృతి లేదా మాయాశక్తి. ఇది పరమాత్మ శక్తే గనుక నిరాకారం. స్వతహాగా వ్యక్తం కాదు. అవ్యక్తం. వ్యాకృతం కాదు. అవ్యాకృతం. అదే పరమాత్మ ఇచ్ఛను బట్టి నామరూపాత్మకంగా పరిణమిస్తే ఈ ప్రపంచం. పరమాత్మను ప్రపంచంగా చూపేది ఈ అవ్యక్తమైన మూలప్రకృతే. సాంఖ్యులు దీనికి ప్రధానమని పేరు పెట్టారు. వారు ఇదే స్వతంత్రమైన పదార్థమంటారు. కానీ అద్వైతులిది అంగీకరించరు. ఇది స్వతంత్రం కాదు. ఈశ్వర ప్రకృతే. ఆయన నాశ్రయించిన శక్తేనని సిద్ధాంతం చేశారు.

**లక్షణా /లాక్షణిక:** వాక్యార్థం కుదరకపోతే ఆశ్రయించే రెండవ మార్గం. దీనివల్ల చెప్పబడేది లాక్షణిక లేదా లక్ష్యార్థం. సింహోదేవదత్తః అనే చోట సింహశబ్దం ఇక్కడ దానికి పరాక్రమవంతుడని రెండవ అర్థం చెప్పాలి. అలాగే తత్త్వమసి వాక్యంలో త్వం పదానికి శరీరాదులు కాక ప్రత్యక్చేతనమని చెప్పాలి అర్థం. తత్ పదానికి

బ్రహ్మచైతన్యమని చెప్పాలి. అప్పుడే జీవబ్రహ్మ ఐక్యం చెల్లుతుంది.

**98-4 శ్లో.**

**మాయాయాం బింబితస్త్వం సృజసి మహదహంకారతన్మాత్రభేదైః**
**భూతగ్రామేంద్రియాద్యైరపి సకలజగత్స్వప్నసంకల్పకల్పమ్ ।**
**భూయస్సంహృత్య సర్వం కమఠ ఇవ పదాన్యాత్మనా కాలశక్త్యా**
**గంభీరే జాయమానే తమసి వితిమిరో భాసి తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** మాయాయాం = నీకంటే భిన్నమయిన మాయలో (మీయంతే పరిచ్ఛిద్యంతే వస్తూనాం సత్యస్వరూపం అనయా దీనితో వస్తువుల నిజస్వరూపము కప్పబడును, మాయ, మాయావాదము), బింబితః= చిచ్ఛక్తి చేత ప్రతి బింబించి (బింబం అస్య సంజాతమ్ బింబము కలిగినది. ప్రతిబింబము), త్వం= నువ్వు, మహత్= మహత్త్వము (మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి పూజింపబడువాడు. జ్యేష్ఠుడు గొప్పది విస్తృతమైనది సాంఖ్యములో మహత్తత్త్వము), అహంకార = రాజస తామస సాత్త్వికాహంకారములు (అహం ఇతి కారః కరణం తస్య భావః- అహంకారము), తన్మాత్ర భేదైః = శబ్దస్పర్శరూపరసగంధములను తన్మాత్రలచే(సా ఏవ మాత్రా యస్య-ఆ మాత్రము తదాత్మకము అంతే శబ్దాది పంచతన్మాత్రలు), భూత గ్రామ= ప్రాణుల సమూహము (భూతానాం గ్రామః సమూహః-ప్రాణుల సమూహము), ఇంద్రియ ఆద్యైః అపి = ఏకాదశ ఇంద్రియ సమూహములచే (ఇంద్రస్య ఆత్మనః అనుమాపకం లింగమ్ ఆత్మను ఊహింపజేసే (శరీరంలో గల) చిహ్నము. జ్ఞానసాధనములైన ఇంద్రియములు), స్వప్న సంకల్ప కల్పమ్= స్వప్న సంకల్పము వంటి (స్వపితి తస్య భావః కర్మ-నిద్ర పోవుట కల గనుట), సకలజగత్ = ఈ సమస్త ప్రపంచమును, సృజసి= సృష్టించుచున్నావు, భూయః = మరలా, కమఠః పదాని ఇవ= తాబేలు తన అవయవములను ముడుచుకొనినట్లుగా (కే జలే మఠతి వసతి జలములో నివసించునది. తాబేలు), కాలశక్త్యా = కాలశక్తి రూపమైన నీ స్వరూపముచే (కలయతి ఆయుః కలయతి సర్వాణి భూతాని ఆయువును లెక్కించునది. ప్రాణులన్నిటికిని కారణమైనది), సర్వం = సమస్తమును, సంహృత్య= ఉపసంహరించుకొని, గంభీరే తమసి= గాఢమైన చీకటి అనగా సుషుప్తి (సుషుప్తి

=సుష్ఠు స్వపితి తస్య భావః కర్మ వా నిద్రావస్థ), జాయమానే= ఏర్పడగా(అనగా ప్రళయ కాలములో) (సుషుప్తి =సు అత్యంతం స్వపంతి లోకాః అస్యామ్ ప్రళయావస్థ), వితిమిరః = చీకటికి అతీతుడవై, ఆత్మనా భాసి= స్వయంజ్యోతిస్వరూపునిగా ప్రకాశించు, తస్మై తే = అట్టి నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:** నీకంటే భిన్నమయిన మాయలో చిచ్ఛక్తి చేత ప్రతి బింబించి నువ్వు మహత్తత్వము, రాజస తామస సాత్త్వికాహంకారములు, శబ్దస్పర్శరూపరస గంధములను తన్మాత్రలచే ప్రాణుల సమూహము ఏకాదశ ఇంద్రియ సమూహములచే స్వప్న సంకల్పము వంటి ఈ సమస్త ప్రపంచమును సృష్టించుచున్నావు. మరలా తాబేలు తన అవయవములను ముడుచుకొనినట్లుగా కాలశక్తి రూపమైన నీ స్వరూపముచే సమస్తమును ఉపసంహరించుకొని– ప్రళయ కాలములో చీకటికి అతీతుడవై స్వయంజ్యోతిస్వరూపునిగా ప్రకాశించునట్టి నీకు నమస్కారము.

**విశేషములు**

**మహత్:** సాంఖ్యుల పంచవింశతి తత్వాలలో ఒకటి. అవ్యక్తమైన ప్రధానం నుంచి వచ్చిన రెండవ భూమిక. అద్వైతుల భాషలో ఇది అవ్యాకృత సూక్ష్మప్రపంచం. దానికి అధిపతి అయిన జీవుడు హిరణ్యగర్భుడు. అంటే సమష్టి బుద్ధి.

**అహంకార:** అహమంటే నేను అని శబ్దార్థం. అలా భావించటమే అహంకారం. నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించగలిగితే ఇది ఆత్మస్వరూపమే. అలాకాక సోపాధికమైతే ఇదే అనాత్మలాగా మారిపోతుంది. కర్తృరూపమైనది అహంకారమైతే సాక్షిరూపమైన చైతన్యమాత్మ. అహంకారానికే కర్తాత్మ అని పేరుపెట్టారు వేదాంతులు. ఇది చిదాభాసుడే గాని కేవల చిద్రూపం కాదు. అంటే జీవుడని అర్థం. ఇలాంటి జీవుడే అసలైన ఆత్మ అని భ్రమించారు పూర్వమీమాంసకులు.

**తన్మాత్ర:** తత్ + మాత్ర. తత్ అంటే పరబ్రహ్మం. మాత్రం అంటే కొలమానం.

బ్రహ్మాన్ని తెలుసుకొనడానికి ఉపయోగపడే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలలో ఒకటి. ఐదూ కలసి పంచ తన్మాత్రలు. ఇవి చెవి, చర్మం, కన్ను, నోరు, ముక్కు అనే జ్ఞానేంద్రియాలతో తెలుసుకొనేవి.

**ఏకదశేంద్రియములు**

1. జ్ఞానేంద్రియములు : త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము. (5)

2. కర్మేంద్రియములు : వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. (5)

3. మనస్సు తో కలిసి ఏకాదశేంద్రియములు (11)

స్వప్నములు (07)

1. దృష్టము, 2. శ్రుతము, 3. అనుభూతము, 4. ప్రార్థితము, 5. కల్పితము, 6. భావికము, 7. దోషజము. ( చరక సంహిత)

**వి.వి:** ఇక్కడ సుషుప్తి అనగా సర్వసంహారము. అప్పుడు సకల జగత్కారణమైన అజ్ఞానము (తమస్సు లయింపదు అట్లది లయించునేని జగత్తు యొక్క పునరావిర్భావ మసంభవమగును మఱియు "నేను సుఖముగా నిద్రపోయితిని. ఏమియు నెఱుగను" అను స్ఫురణ మెలకువలో కలుగుట కవకాశముండదు. అట్టి స్థితిలో నిత్యుడు అనుష్క మిత ప్రకాశం అజ్ఞానసాక్షియునై ఆత్మవస్తువు భాసించును. దృశ్యములేనందున దృశ్యసాపేక్షముగ నేర్పడిన దుష్టత్వము కూడా ఆత్మయందు భాసింపదని భావము.

**98-5 శ్లో.**

**శబ్దబ్రహ్మేతి కర్మేత్యణురితి భగవన్।కాల ఇత్యాలపంతి**
**త్వామేకం విశ్వహేతుం సకలమయతయా సర్వథా కల్ప్యమానమ్ ।**
**వేదాంతైర్యత్తు గీతం పురుషపరచిదాత్మాభిధం తత్తు తత్త్వం**
**ప్రేక్షామాత్రేణ మూలప్రకృతివికృతికృత్ కృష్ణ! తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, భగవన్= ఓ భగవానుడా!,

ఏకం= అన్ని పేరులకు ఒకే ఒక అర్థమయిన, విశ్వ హేతుం = జగత్కారణమయిన నిన్ను(విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), శబ్దబ్రహ్మ ఇతి= కొందరు నిన్ను శబ్ద బ్రహ్మ అని (శబ్దాత్మకం బ్రహ్మన్ శబ్దేషు నిహితం ఆత్మ-పరమాత్మ సంబంధి జ్ఞానమ్ శబ్ద బ్రహ్మ. శబ్దములో వున్న ఆత్మ-పరమాత్మ సంబంధ జ్ఞానము శబ్దగుణము స్ఫోటవాదము వేదము), కర్మ ఇతి = కొందరు కర్మ అని( జీవుల అదృష్టము) (క్రియతే ఇతి కర్మ-చేయునది), అణుః ఇతి= కొందరు పరమాణువుగ పిలుతురు. (అణతి సూక్ష్మత్వం గచ్ఛతి సూక్ష్మమైనది. చాలా చిన్నది), కాల ఇతి = మరికొందరు కాలమని(కలయతి ఆయుః కలయతి సర్వాణి భూతాని ఆయువును లెక్కించునది. ప్రాణులన్నిటికిని కారణమైనది), ఆలపంతి = పిలుతురు, త్వామ్ =నువ్వు, సకలమయతయా= సర్వ మయుడవగుటచే, సర్వథా= వారి వారి దర్శనానుసారముగా అన్ని విధములుగా (సర్వ ప్రకారేణ-అన్ని విధములుగా), కల్ప్యమానమ్ = నిన్ను నీవే కల్పించుకొనుచున్నావు, వేదాంతైః = వేదాంతములు(వేదస్య అంతః-వేదము యొక్క అంతము. వేదాంతము, ఉపనిషత్తు వేదాంత మతము), యత్తు = ఎవరిని, పురుష= పరమ పురుషుడని (పురి బ్రహ్మాండ శేతే బ్రహ్మాండంలో పరుండువాడు. పరమాత్మ. పూరయతి అంతః సర్వమ్ సర్వమును వ్యాపించినవాడు), పర చిత్= చిదానంద స్వరూపుడని, ఆత్మా = ఆత్మ అని(అతతి సర్వత్ర వ్యాప్నోతి సర్వత్ర వ్యాపించి యున్నవాడు), అభిధం= భిన్న భిన్న నామములతో (పేరు, శబ్దశక్తి, సంకేతితములగు పదపదార్థముల సంబంధమును దెలుపు శబ్దవృత్తి), తత్త్వం= ఏ నీ తత్త్వమును, గీతం= కీర్తించుచున్నారో, తత్తు = అట్టి నువ్వు, ప్రేక్షా మాత్రేణ= ప్రేక్షామాత్రముచే అనగా మాయాప్రేరణ మాత్రముచే( కటాక్ష మాత్రము చేత) (ప్రకర్షేణ ప్రమాణాదినా ఈక్షా దర్శనమ్ ప్రమాణాదులచే వస్తువును పరీక్షించుట), మూల ప్రకృతి = మూల ప్రకృతి యందు (అనగా మాయ యందు) (మూలా ఆద్యా ప్రకృతిః-మూల ప్రకృతి), వికృతి కృత్= కార్యమైన జగత్తును చేయుచున్నావు. (విరుద్ధాకృతిః, వికారః, రోగః-మార్పు చెందినది వికారము చెందినది చిత్త విక్షేపము), తస్మై తే = అట్టి తత్వమైన నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! ఓ భగవానుడా ! అన్ని పేరులకు ఒకే ఒక అర్థమయిన జగత్కారణమయిన నిన్ను కొందరు శబ్ద బ్రహ్మ అని కొందరు కర్మ అని(జీవుల అదృష్టము) కొందరు పరమాణువుగా పిలుతురు. మరికొందరు కాలమని పిలుతురు. నువ్వు సర్వ మయుడవగుటచే వారి వారి దర్శనానుసారముగా అన్నిచోట్ల నిన్ను నీవే కల్పించుకొనుచున్నావు. వేదాంతములు ఎవరిని పరమ పురుషుడని చిదానంద స్వరూపుడని ఆత్మ అని భిన్న భిన్న నామములతో ఏ నీ తత్త్వమును కీర్తించుచున్నారో అట్టి నువ్వు ప్రేక్షామాత్రముచే అనగా మాయాప్రేరణ మాత్రముచే(కటాక్ష మాత్రము చేత) మూల ప్రకృతి యందు (అనగా మాయ యందు) కార్యమైన జగత్తును చేయుచున్నావు. అట్టి తత్వమైన నీకు నమస్కారము.

**98-6 శ్లో.**
**సత్త్వేనాసత్తయా వా న చ ఖలు సదసత్త్వేన నిర్వాచ్యరూపా**
**ధత్తే యాసావవిద్యా గుణఫణిమతివద్విశ్వదృశ్యావభాసమ్ ।**
**విద్యాత్వం సైవ యాతా శ్రుతివచనలవైర్యత్కృపాస్యందలాభే**
**సంసారారణ్యసద్యస్త్రుటనపరశుతామేతి తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** సత్వేన = అవిద్య ఉన్నది అని, అసత్తయా= లేనిదని, సత్ అసత్వేన వా= లేక ఉండిలేనిదని, న చ ఖలు= చెప్పలేము కదా!, నిర్వాచ్యరూపా= అది నిర్వచింపరానిది, యా= ఈ మాయ, అవిద్యా = అవిద్యా రూపములో(విద్యాయాః పరాయాః బ్రహ్మవిద్యాయాః అన్యాః లౌకికజ్ఞానం కర్మాదికమ్ పరబ్రహ్మజ్ఞానము కాని విద్య లౌకికజ్ఞానము (కఠోపనిషత్).( న విద్యా విద్యాయాః అభావో వా విద్య కానిది జ్ఞానాభావము వేదాంతంలో భ్రమ, మాయ.)(చీకటి, చీకటితో నిండిన నరకం, మోహం, మహామోహం– వీటిని అవిద్యా వృత్తులు అంటారు), అసౌ గుణ ఫణి మతివత్= రజ్జువునందు సర్ప భ్రాంతివలె(రజ్జువు అంటే తాడు. తాడును చూసి పాము అని భ్రమపడటం రజ్జుసర్ప భ్రాంతి. వేదాంత సంభాషణలలో తరచు వచ్చే ప్రస్తావన ఇది), విశ్వ దృశ్య = దృశ్యాత్మకమైన జగత్తు వలె, అవభాసమ్= సంసారదుఃఖ నిలయమైన శరీరాది అహంకార అభిమానాదికమును (అవ అయథాతథం భాసతే అసౌ మిథ్యాజ్ఞానము), ధత్తే= చేయుచున్నది, సా ఏవ= ఆ

అవిద్య, యత్ కృపా స్యంద లాభే= ఈశ్వర దయా ప్రవాహలాభముచేత, శ్రుతి వచన లవైః = వేదాంతవాక్యలేశములచేత (అనగా వాటిని విన్నమాత్రముచేత), విద్యాత్వం యాతా= విద్యాస్వరూపమును పొంది, సంసార అరణ్య = సంసార రూపమైన అరణ్యమును (సంసరంతి జీవాః అస్మాత్ దీని నుండి జనులు దాటుదురు. సంసారము), సద్యః= వెంటనే, త్రుటన= సమూలముగా ఖండించునట్టి, పరశుతామ్= గండ్రగొడ్డలి రూపమును(పరం శత్రుం శునాతి హినస్తి శత్రువును చంపునది. గొడ్డలి), ఏతి= పొందును, తస్మై = అట్టి దయా మూర్తివయిన, తే= నీకు, నమః = నమస్కారం.

**తాత్పర్యము:** మూల ప్రకృతివైన నీ నుండి పుట్టుట వలన ఆ అవిద్య ఉన్నది అని , లేనిదని, లేక ఉండిలేనిదని చెప్పలేము . ఆ అవిద్య నిర్వచింపరానిది . ఈ మాయకు అవిద్య , విద్య అని రెండు రూపాలు. ఆ మాయ అవిద్యా రూపములో రజ్జువునందు సర్ప భ్రాంతివలె –దృశ్యాత్మకమైన జగత్తు వలె –సంసారదుఃఖ నిలయమైన శరీరాది అహంకార అభిమానాదికమును చేయుచున్నది. ఆ అవిద్య ఈశ్వర దయా ప్రవాహలాభముచేత, వేదాంతవాక్యములను విన్నమాత్రముచేత విద్యా స్వరూపమును పొంది సంసార రూపమైన అరణ్యమును వెంటనే సమూలముగా ఖండించునట్టి గండ్రగొడ్డలి రూపమును పొందును. అట్టి దయా మూర్తివయిన నీకు నమస్కారం.

**విశేషాలు**

**అవిద్యా:** విద్య కానిది. విద్య అంటే జ్ఞానం. ముఖ్యంగా బ్రహ్మజ్ఞానం. లేదా ఆత్మజ్ఞానం. అది కాదంటే అర్థం అజ్ఞానమని. మనకున్న జ్ఞానమంతా విశేష జ్ఞానమే. ఇది సమస్యకు పరిష్కారం కాదు. కనుక దీనికి విద్య అని, జ్ఞానమని పేరు పెట్టలేదు వేదాంతులు. వారు దీనిని అవిద్య అనే పేర్కొన్నారు. వేదవాఙ్మయం మొదలు ఇప్పటి భౌతిక విద్యలవరకు అంతా అవిద్యే.

'విద్యతే అస్తి.' ఏది ఉందో అది 'న విద్యతే నాస్తి' ఏది లేదో అది. అప్పటికి అవిద్య అంటే అభావం.

దేని అభావం ఉన్నట్టు ఏది కనిపిస్తున్నదో దాని అభావం. అదే ఈ ప్రపంచం. ఇది ప్రతీతి సిద్ధమేగానీ వస్తు సిద్ధం కాదంటారు అద్వైతులు. ఆత్మజ్ఞానం ఎప్పుడూ ఉంది. అయినా మనకది లేనట్టు తోస్తున్నది. ఇదే అవిద్య. పరమాత్మ కిది విద్య. జీవాత్మకు అవిద్య.

అవిద్య అంటే ఆత్మజ్ఞానం లేకపోవటం. దానివల్ల అనాత్మ ప్రపంచమొకటి కనిపిస్తూ ఉండటంచేత మానవుడికి ఈ ప్రపంచంమీద కామమేర్పడుతుంది. కామ్యమైన వస్తువును పొందడానికి కర్మ చేయవలసి వస్తుంది. కర్మ ఫలాన్ని అందిస్తుంది. ఇదే సంసార బంధం. కనుక బంధానికి కారణభూతమైన అనర్థాలివి మూడు. వీటికే వేదాంతులు పాపాలని, పాతకాలని పేరు పెట్టారు. 'సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అని గీతావచనం. పాపమంటే పడగొట్టేదని అర్థం. ఇందులో అవిద్యే కారణ శరీరం. కామం సూక్ష్మశరీరం. కర్మ స్థూల శరీరం. శరీర త్రయం కూడా వీటివల్లనే సంక్రమించింది. ఇవి మూడూ తొలగిపోతే కాని మోక్షప్రాప్తి లేదు మానవుడికి.

**98–7 శ్లో.**

**భూషాసు స్వర్ణవద్వా జగతి ఘటశరావాదికే మృత్తికావ–**
**త్తత్త్వే సంచింత్యమానే స్ఫురతి తదధునాప్యద్వితీయం వపుస్తే ।**
**స్వప్నద్రష్టుః ప్రబోధే తిమిరలయవిధౌ జీర్ణరజ్జోశ్చ యద్వత్**
**విద్యాలాభే తథైవ స్ఫుటమపి వికసేత్ కృష్ణ! తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ = ఓ గురువాయూరు కృష్ణ దేవా!, తత్త్వే సంచింత్యమానే = సమ్యక్ దృష్టితో (తత్వ దృష్టితో) చూసినప్పుడు, భూషాసు= భూషణములలో (భూషయతి తస్య కర్మ–అలంకరించుట), స్వర్ణ వత్= బంగారము వలె (సుష్ఠు ప్రశస్తః అర్ణః వర్ణః యస్య–మంచి రంగు కలది. బంగారము), వా= లేక, ఘట శరావా ఆదికే= కుండలు , మట్టి పాత్రలు మొదలయిన వాటి యందు (ఘటతే మృదాది సంఘాతైః–మట్టితో చేయబడునది. కుండ) (శరం దధ్యాది సారం అత్ర– ఇందు దధ్యాదుల సారము ఉంచబడును. ఒక విధమైన మట్టిపాత్ర), మృత్తికావత్= మట్టివలె(మృత్ ఏవ మృత్తికా మట్టి), తే = నీ యొక్క, తత్ = జగత్ కారణమైన,

అద్వితీయం వపుః = అద్వితీయ పరబ్రహ్మ స్వరూపము, అధునా అపి = ఇప్పుడు కూడా (స్థితి కాలములో), జగతి = జగద్రూప విషయములో, స్ఫురతి= స్ఫురించుచున్నది, స్వప్నద్రష్టుః = కలలో కనబడిన వస్తువులు, ప్రబోధే= మేల్కొనిన పిమ్మట వాటి యథార్థ స్థితి తెలిసినట్లుగా, తిమిర లయ విధౌ=దీపమును తీసుకొని వచ్చినప్పుడు చీకట్లు తొలగి, జీర్ణ రజ్జోః చ = రజ్జు సర్ప భ్రాంతి(సృజ్యతే రచ్యతే పశ్వాది బంధనార్థమ్ పశువులను బంధించుటకు నేయు పగ్గము), యత్ వత్ = ఏ విధముగా తొలగునో, తథా ఏవ= అట్లే, విద్యాలాభే= విద్యా లాభము కలుగగానే, (తత్)అపి= అద్వితీయమైన నీ తత్త్వము (పరమార్థ స్వరూపము), స్ఫుటమ్= స్పష్టముగా, వికసేత్= కనబడును, తస్మై తే = అట్టి నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! తత్వ దృష్టితో చూసినప్పుడు భూషణములలో బంగారము వలె కుండలు మొదలయిన వాటి యందు మట్టివలె నీ యొక్క జగత్ కారణమైన అద్వితీయ పరబ్రహ్మ స్వరూపము ఇప్పుడు కూడా ( స్థితి కాలములో) జగద్రూప విషయములో స్ఫురించుచున్నది. కలలో కనబడిన వస్తువులు మేల్కొనిన పిమ్మట వాటి యథార్థ స్థితి తెలిసినట్లుగా, దీపమును తీసుకొని వచ్చినప్పుడు చీకట్లు తొలగి రజ్జు సర్ప భ్రాంతి ఏ విధముగా తొలగునో ,అట్లే విద్యా లాభము కలుగగానే అద్వితీయమైన నీ పరమార్థ స్వరూపము స్పష్టముగా కనబడును. అట్టి నీకు నమస్కారము.

**98-8 శ్లో.**

**యద్భీత్యోదేతి సూర్యో దహతి చ దహనో వాతి వాయుస్తథాఽన్యే**
**యద్భీతాః పద్మజాద్యాః పునరుచితబలీనాహరంతేఽను కాలమ్ ।**
**యేనైవారోపితాః ప్రాఙ్నిజపదమపి తే చ్యావితారశ్చ పశ్చాత్**
**తస్మై విశ్వం నియంత్రే వయమపి భవతే కృష్ణ! కుర్మః ప్రణామమ్ ॥**

**ప్రతిపదార్థము:** కృష్ణ = ఓ గురువాయూరు కృష్ణ దేవా !, యత్ భీత్యా = ఎవనికి భయపడి (బిభేతి తస్య భావః-భయము), సూర్యః = సూర్యుడు (సువతి ప్రేరయతి ప్రాణినః స్వస్వ కర్మసు-ప్రాణులను తమ తమ కర్మలయందు ప్రేరేపించువాడు. సూర్యుడు), ఉదేతి= ఉదయించునో, దహనః = అగ్ని (దహతి అసౌ కాల్చునది.

అగ్ని), దహతి చ= దహించుచున్నదో, వాయుః = వాయువు(వాతి గచ్ఛతి జానాతి స్పృశతి వా వెళ్లునది. గాలి), వాతి= వీచుచున్నదో, తథా=అట్లే, పద్మజా ఆద్యాః = బ్రహ్మాది దేవతలు, అన్యే = మిగతావారు, పునః = మరలా, యత్ భీతాః = ఎవరికి భయపడి, అను కాలమ్ = సకాలములో (సమయము తప్పకుండ) (కాలస్య యోగ్యః–కాలమునకు తగినది. సకాలము), ఉచిత బలీన్= ఎవనికి పూజలను(బల్యతే దీయతే దేవతాదిభ్యః–దేవతలకు ఇచ్చునది. బలి), ఆహరంతే = అర్పించుచున్నారో, తే = ఆ బ్రహ్మాది దేవతలు, ప్రాక్ = మొదట, నిజ పదమ్= తమ తమ పదవుల యందు(తమ తమ సత్యలోకాదుల యందు), యేన ఏవ= ఎవనిచేత, ఆరోపితాః= నియమించబడి, అపి= మరియు, పశ్చాత్ = తరువాత, చ్యావితారః చ= చ్యుతిని(తొలగింపబడుచుందురో), తస్మై విశ్వం నియంత్రే = అట్టి విశ్వనియామకుడవయిన, భవతే= నీకు, వయమ్ అపి= మేము కూడా, ప్రణామమ్ = నమస్కారము (ప్రకృష్టం నమతి తస్య భావః కర్మ వా నమస్కారము), కుర్మః = చేయుచున్నాము.

**తాత్పర్యము:** ఓ గురువాయూరు కృష్ణ దేవా ! ఎవనికి భయపడి సూర్యుడు ఉదయించునో, అగ్ని దహించుచున్నదో, వాయువు వీచుచున్నదో, అట్లే బ్రహ్మాది దేవతలు ఎవరికి భయపడి సమయము తప్పకుండ పూజలను అర్పించుచున్నారో, ఆ బ్రహ్మాది దేవతలు మొదట తమ తమ పదవుల యందు ఎవనిచేత నియమించబడి తరువాత తొలగింపబడుచుందురో అట్టి విశ్వనియామకుడవయిన నీకు మేము కూడా నమస్కారము చేయుచున్నాము.

**98–9 శ్లో.**

**త్రైలోక్యం భావయంతం త్రిగుణమయమిదం త్ర్యక్షర స్యైకవాచ్యం**
**త్రీశానామైక్యరూపం త్రిభిరపి నిగమైర్గీయమానస్వరూపమ్ ।**
**తిస్రోఽవస్థా విదంతం త్రియుగజనిజుషం త్రిక్రమాక్రాంత విశ్వం**
**త్రైకాల్యే భేదహీనం త్రిభిరహమనిశం యోగభేదైర్భజే త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** త్రిగుణమయమ్ = సత్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములతో కూడిన (త్రయాణాం గుణానాం సమాహారః–మూడు గుణముల

కలయిక.సత్త్వ-రజ-తమములు),ఇదం త్రైలోక్యం =మూడు లోకములను(త్రిలోకే ఏవ త్రైలోక్యమ్ త్రిలోకమే త్రైలోకము.త్రిలోకముల సమాహారము),భావయంతం= నియమముతో సృజించువానిని, త్ర్యక్షరస్య= త్ర్యక్షరమైన ఓంకారమునకు (అ+ఉ+మ), ఏకవాచ్యం= ప్రధాన వాచ్యుడవైనవానిని, త్రి ఈశానామ్ = త్రి మూర్తుల యొక్క, ఐక్యరూపం= స్వరూపుని (ఏకస్య భావః-ఒక్కటి అగుట. ఐక్యత ఐక్యము), త్రిభిః నిగమైః అపి = 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదములతో,గీయమాన=కీర్తింపబడుచున్న(పాడబడుచున్న),స్వరూపమ్= స్వరూపము కలవానిని (స్వస్య రూపమ్ తన రూపము), తిస్రః అవస్థా = జాగ్రత్-స్వప్న-సుషుప్తి ఆవస్థల యందు (అవస్థానాం త్రయం (తిస్రో అవస్థాః)] జాగ్రత్-స్వప్న-సుషుప్తి), విదంతం= సాక్షియైన వానిని, త్రియుగ జని జుషం = త్రేత, ద్వాపర , కలియుగములలో అవతరించిన (కృత యుగములో ప్రజల యొక్క కృత కృత్యత వలన స్వామివారి అవతారము లేదు. అందువలన త్రియుగములలో కృత యుగము లేదు), త్రి క్రమ = పాద త్రయముచే (క్రమ్యతే ప్రాప్యతే కాలు పెట్టుట), ఆక్రాంత = ఆక్రమించిన, విశ్వం= విశ్వస్వరూపము కలవానిని, త్రైకాల్యే= భూత భవిష్యత్ వర్తమాన కాలములకు, భేదహీనం= అద్వితీయుని (పుట్టుక, పెరుగుదల, బలపడటం, రూపంలో మార్పు రావడం, క్షీణ దశ, నాశం అను ఆరువికారములు లేనివానిని)(భిద్యతే అనేన-భేదించుట, చీల్చుట ఉపాయాలలో ఒకటి), త్వామ్= అటువంటి నిన్ను, అహమ్= నేను, త్రిభిః యోగభేదైః= కర్మజ్ఞాన భక్తి అనుయోగత్రయము చే(యుజ్యతే మనః ఆత్మనా యోగః చిత్తవృత్తినిరోధః -ఆత్మయందు మనసు కలిగి యుండుట. ధ్యానము, చిత్తవృత్తులను నిరోధించుట), అనిశం= ఎల్లప్పుడు (న నిశారాత్రిః చేష్టారాహిత్యమ్ ఎల్లప్పుడు పని చేయువాడు ఎల్లప్పుడు జరుగునది), భజే = సేవింతును.

**తాత్పర్యము:** సత్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములతో కూడిన మూడు లోకములను నియమముతో సృజించువానిని, త్ర్యక్షరమైన ఓంకారమునకు (అ+ఉ+మ. ) ప్రధాన వాచ్యుడవైనవానిని, త్రి మూర్తుల యొక్క ఏక స్వరూపుని, 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదములతో కీర్తింపబడుచున్న స్వరూపము కలవానిని, జాగ్రత్-స్వప్న-సుషుప్తి ఆవస్థలకు సాక్షియైన వానిని,

త్రేత, ద్వాపర, కలియుగములలో అవతరించినవానిని, పాదత్రయముచే విశ్వమును ఆక్రమించిన స్వరూపము కలవానిని, భూత భవిష్యత్ వర్తమాన కాలములకు అద్వితీయుని – అటువంటి నిన్ను నేను కర్మజ్ఞాన భక్తి అనుయోగత్రయము చే నేను ఎల్లప్పుడు సేవింతును.

**విశేషాలు**

**ఓంకారము:** సోహం అనే మాటలో సకార హకారాలు లోపిస్తే అవి ఓం అయిందంటారు. సః అహం సోహం. వాడే నేను అంటే ఆ ఈశ్వరుడే నేను. నాకూ వాడికీ తేడా లేదని భావం. ఇది అనుభవానికి తెచ్చుకోవటానికి దీన్ని మూడు వర్ణాలుగా విభజించారు. అ+ఉ+మ. అ అనేది జాగ్రదవస్థకూ అందులో ఉన్న విశ్వుడనే జీవుడికీ సంకేతం. ఉ అనేది స్వప్నానికీ తైజసుడికీ సంకేతం. మ అనేది సుషుప్తికీ అందులోని ప్రాజ్ఞుడికీ సంకేతం. సంకేతాన్ని ఉచ్చరించేటపుడీ అవస్థాత్రయాన్ని అందులో బందీ అయిన జీవుణ్ణి భావనచేసి కడపట మకారమనే నాదమెక్కడ ఆగిపోతుందో దాన్ని తురీయావస్థగా గుర్తించగలిగితే అప్పుడీ జీవభావమంతా ఎగిరిపోయి జీవుడీశ్వరుడే అనే ఏకాత్మ భావం అనుభవానికి రాగలదు. కనుకనే 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మా మనుస్మరన్' అని గీత బోధించింది. ఓం అనేది దానికి కేవలమొక ఆలంబనం లేదా ప్రతీక.

**త్రయీ:** ఋగ్వేదం యజుర్వేదం సామవేదం ఈ మూడింటికీ త్రయీ అని పేరు. అధర్వ వేదమిక్కడ కంఠోక్తిగా చెప్పలేదు. కారణం ఈ మూడు వేదాలలోని విషయమే క్రోడీకరించి మరోరూపంలో బయట పెడుతుంది ఆ వేదం. అందువల్ల దానికి ప్రత్యేకమైన స్థితి లేదు.

**సత్త్వ/సాత్త్వత:** త్రిగుణాలలో ఇది రెండవది. రజస్సువల్ల సృష్టి అయితే తమస్సు వల్ల లయమైతే సత్త్వం వల్లనే స్థితి అనేది సాగిపోతున్నది. సత్త్వమంటే ఆవరణ విక్షేప మాలిన్యం ఏ మాత్రమూ లేని సిమితమైన మనస్తత్త్వం. సత్త్వం అంటే అంతఃకరణమని కూడా అర్థమే. సాత్త్వత అంటే సత్త్వగుణం పుష్కలంగా ఉన్న మానవుడు.

భగవత్ భక్తుడని అర్థం. భాగవతంలో సాత్త్వతులంటే అలాంటి భక్తులే.

సాత్త్వత పురాణమని కూడా భాగవతానికి మరొక పేరు.

**జాగ్రత్/జాగర/జాగరిత:** జాగ్రదవస్థ. మెలకువ. అవస్థా త్రయంలో ఇది మొదటి దశ.

**స్వప్న/స్వాప:** స్వాపమంటే నిద్ర. అందులో వచ్చే మరొక దశ స్వప్నం. జాగ్రత్తు సుషుప్తుల మధ్య ఏర్పడే దశ ఇది. దీనికే సంధ్య స్థానమని కూడా పేరు.

**సుషుప్తి:** సుప్తి అంటే నిద్ర. దానికి ముందు సు చేరితే మంచి నిద్ర అని అర్థం. అంటే గాఢ నిద్ర. స్వప్నం అనే వాసన కూడా లేని ఒక జడస్థితి. ఇది అవస్థాత్రయంలో మూడవది. ఇందులో జీవుడికి తాను ఈశ్వరుడని జ్ఞానం లేకున్నా బ్రహ్మసాయుజ్యం అప్రయత్నంగానే కలుగుతుందంటారు వేదాంతులు. దానికి తార్కాణం అతనికి ఆ దశలో కలిగే బ్రహ్మానందమే.

**98-10 శ్లో.**
**సత్యం శుద్ధం విబుద్ధం జయతి తవ వపుర్నిత్యముక్తం నిరీహం**
**నిర్ద్వంద్వం నిర్వికారం నిఖిలగుణగణ వ్యంజనాధార భూతమ్ ।**
**నిర్మూలం నిర్మలం త న్నిరవధి మహిమోల్లాసి నిర్లీన మంత**
**ర్నిస్సంగానాం మునీనాం నిరుపమ పరమానంద సాంద్రప్రకాశమ్ ॥**

**ప్రతిపదార్థము:** సత్యం=నీవు సత్య స్వరూపుడవు.(లేనిదానికి ఉనికి కల్పించినది), శుద్ధం = పరిశుద్ధుడవు, విబుద్ధం = విజ్ఞాన మయుడవు(స్వప్రకాశసిద్ధము) (ఉత్థాపితః, జాగరూకః, కుశలః-లేపబడినవాడు, జాగరూకుడు, కుశలుడు, బుద్ధిమంతుడు, చతురుడు), నిత్యముక్తం = నిత్య ముక్తుడవు, నిరీహం= ఎట్టి కోరికలు లేనివాడివి(కర్తృత్వ భోక్తృత్వాది రహితము)( నిర్గతా ఈహా ఇచ్ఛా చేష్టా వా యస్మాత్ కోరిక లేనివాడు. భగవంతుడు), నిర్ద్వంద్వం= అద్వితీయుడవు, నిర్వికారం= పరిణామాది వికార రహితుడవు (నిర్గతః వికారః వికృతిః యస్మాత్ జన్మ-మరణాది వికారము లేనివాడు. పరమాత్మ), నిఖిల గుణగణ = క్షమ సత్యము దయ ఐశ్వర్యము మొదలైన గుణముల యొక్క, వ్యంజన= ఉత్పత్తి మరియు (విశేషేణ అంజతే ప్రకటీక్రియతే స్పష్టము చేయుట ప్రకటించుట), ఆధార

భూతమ్= ఆధార భూతుడవు, నిర్కూలం= నిష్కారణుడవు, నిర్మలం= రాగాదిదోషరహితుడవు, నిరవధి మహిమ ఉల్లాసి= అనంతమైన మహిమలు కలవాడివి(కాల దేశ అపరిచ్ఛిన్నవైభవ యుక్తుడవు),నిస్సంగానాం=నిస్సంగులైన, మునీనాం = మునుల యొక్క, అంతః = అంతరంగసమాధియందు, నిర్లీనమ్= సుప్రతిష్ఠుడవు, నిరుపమ = సాటిలేనివాడివి, పరమ ఆనంద= పరమానంద, సాంద్ర ప్రకాశమ్= సాంద్ర చైతన్య ప్రకాశుడవయిన, తవ= నీ యొక్క, తత్ వపుః= ఆ రూపము, జయతి= సర్వోన్నతమై జయించుచున్నది(నీ రూపమునకు జయము).

**తాత్పర్యము:** నీవు సత్య స్వరూపుడవు. పరిశుద్ధుడవు . విజ్ఞాన మయుడవు. నిత్య ముక్తుడవు. ఎట్టి కోరికలు లేనివాడివి. అద్వితీయుడవు. పరిణామాది వికార రహితుడవు. క్షమ సత్యము దయ ఐశ్వర్యము మొదలైన గుణముల యొక్క ఉత్పత్తి మరియు ఆధార భూతుడవు. నిష్కారణుడవు. రాగాదిదోషరహితుడవు. అనంతమైన మహిమలు కలవాడివి. నిస్సంగులైన మునుల యొక్క అంతరంగసమాధియందు సుప్రతిష్ఠుడవు . సాటిలేనివాడివి. పరమానంద సాంద్ర చైతన్య ప్రకాశుడవయిన నీ యొక్క రూపము సర్వోన్నతమై జయించుచున్నది.

**విశేషాలు**

**సత్ /సత్య /సత్తా:** సత్ అన్నా సత్యమన్నా ఉన్నది అని అర్థం.

కలిగిన ఆత్మజ్ఞానాన్ని అలాగే నిలుపుకొంటూ పోవడం. సత్తా అంటే ఉనికని అర్థం. ఎప్పటికీ మారకుండా నిలిచి ఉన్నదేదో అది సత్ లేదా సత్యం. అది సాకారం కాదు కేవల జ్ఞానరూపం. కనుకనే సత్తా అన్నా అదే. అంటే అస్తిత్వమన్నమాట.

విష్ణునామాలలో సత్తా అని ఒక నామం ఉంది. అంటే విష్ణువు సాకారంగా ఎక్కడో ఉన్నాడని కాదు. నిరాకారమైన భావమే లేదా అస్తిత్వమే విష్ణువు అనే మాటకు అర్థం. అంటే పరమాత్మ స్వరూపం. 'సదేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్' అని ఉపనిషత్తు. ఈ ప్రపంచమంతా సృష్టికి పూర్వం సద్రూపంగానే ఉందట. అప్పటికి ఆత్మా, అనాత్మా అనే తేడా లేక అంతా సద్రూపమే. అయితే అది స్వతఃప్రమాణం కనుక చిద్రూపం కూడా అదే. సచ్చిత్తులే పరమాత్మ అంటే.

**శుద్ధ:** శుచి, శుద్ధ అంటే నిర్మలం. నిష్కల్మషం. చిత్తానికి పట్టిన వాసనలు క్షాళితమై పోవటం.

**ద్వంద్వ:** రెండు. జత. జంట. సప్రతిపక్షాలివి. సుఖదుఃఖాలు, జనన మరణాలు ఇలాంటివి. ఇవే సంసారమంతా. వీటిని దాటిపోతే నిర్ద్వంద్వం లేదా అద్వంద్వం. అదే సాయుజ్యం. కైవల్యం. అనాత్మ అంతా ద్వయమైతే ఆత్మ అద్వయం. అద్వయమైన ఆత్మే ద్వయమయి కనిపిస్తున్నదని వేదాంతుల మాట. అదే ఈ సంసారం.

**98-11 శ్లో.**

**దుర్వారం ద్వాదశారం త్రిశతపరిమిళత్ షష్టిపర్వాభివీతం**
**సంభ్రామ్యత్ క్రూరవేగం క్షణమను జగదాచ్ఛిద్య సంధావమానమ్ ।**
**చక్రం తే కాలరూపం వ్యథయతు న తు మాం త్వత్పదైకావలంబం**
**విష్ణో! కారుణ్యసింధో! పవనపురపతే! పాహి సర్వామయౌఘాత్ ॥**

**ప్రతిపదార్థము:** విష్ణో = ఓ విష్ణుమూర్తీ! (వేవేష్టి సర్వం జగత్ జగత్తంతా వ్యాపించినవాడు. విష్ణువు), దుర్వారం= కాలరూపమైన నీచక్రము వారింపరానిది, ద్వాదశ అరం= పన్నెండు అరలు కలది (12 మాసముల ఆకులు గలది) (ఇయర్తి గచ్ఛతి అనేన చక్రస్య నాభినేమ్యోః మధ్యస్థాని కాష్ఠాని వీటివల్లనే చక్రము తిరుగును. బండిచక్రపు ఆకులు, బండి చక్రపు ఆరెలు), త్రిశత పరిమిళత్ షష్టి పర్వ = మూడు వందల పర్వదినములతో, అభివీతం= అభివ్యాప్తమైనది.(విశేషేణ ఇతం జ్ఞాతం అన్వయవ్యాప్తిహేతుకమ్ అన్వయవ్యాప్తితో తెలుసుకొనే విషయము), క్రూర వేగం= క్రూర వేగముతో (మిక్కిలి వేగముతో), సంభ్రామ్యత్= తిరుగుచుండును, అను క్షణమ్= ప్రతిక్షణము(క్షణే-క్షణే), జగత్= లోకమును (గచ్ఛతి నడచునది. ప్రపంచము వాయువు), ఆచ్ఛిద్య = ఆక్రమించుకొను, సంధావమానమ్ = తిరుగుచున్న, తే కాలరూపం చక్రం = నీ యొక్క కాల రూపమైన చక్రము (క్రియతే అనేన-దీనితో చేయబడును. రథచక్రము), త్వత్ పదైక అవలంబం = నీ పాద భక్తుడనగు, మాం తు= నన్ను, న వ్యథయతు = బాధపెట్టకుండ చూడుము, కారుణ్యసింధో = దయాసాగరా!, పవనపురపతే= ఓ గురువాయూరు కృష్ణదేవా!,

సర్వ ఆమయ ఔఘాత్= సమస్త రోగముల నుండి (ఆమం రోగం యాతి అనేన– దీనితో రోగులగుదురు. రోగము మనోవ్యాధి), పాహి = నన్ను కాపాడుము.

**తాత్పర్యము:** ఓ విష్ణుమూర్తీ ! కాలరూపమైన నీచక్రము వారింపరానిది. పన్నెండు అరలు కలది (12 మాసముల ఆకులు గలది) మూడు వందల పర్వదినములతో అభివ్యాప్తమైనది. మిక్కిలి వేగముతో తిరుగుచుండును. ప్రతిక్షణము లోకమును ఆక్రమించుకొని తిరుగుచున్న నీ యొక్క కాల రూపమైన చక్రము నీ పాద భక్తుడనగు నన్ను బాధపెట్టకుండ చూడుము. దయాసాగరా! ఓ గురువాయూరు కృష్ణదేవా ! సమస్త రోగముల నుండి నన్ను కాపాడుము.

**ద్వాదశ స్కంధము**

**98వ దశకము సమాప్తము**

# దశకమ్ 99 – వేదమన్త్రమూలాత్మకమైన విష్ణుస్తుతి

**99–1 శ్లో.**

**విష్ణోర్వీర్యాణి కో వా కథయతు ధరణేః కశ్చ రేణూన్మిమీతే**
**యస్యైవాంఘ్రిత్రయేణ త్రిజగదభిమితం మోదతే పూర్ణసంపత్ ।**
**యోఽసౌ విశ్వాని ధత్తే ప్రియమిహ పరమం ధామ తస్యాభియాయాం**
**త్వద్భక్తా యత్ర మాద్యంత్యమృతరసమరందస్య యత్ర ప్రవాహః ॥**

**ప్రతిపదార్థము:** యస్య= ఎవనియొక్క, అంఘ్రి త్రయేణ ఏవ= మూడు అడుగులచే, త్రి జగత్= ముల్లోకములు, అభిమితం= కొలువబడినవో, పూర్ణ సంపత్ = సమస్త సంపదలచే, మోదతే = సకల జనులను ఎవడు సంతోష పెట్టుచున్నాడో, యః అసౌ= ఏ విష్ణువు, విశ్వాని= అఖిల లోకములను తన యోగైశ్వర్యముచేత, ధత్తే =ధరించుచున్నాడో, విష్ణోః= ఆ విష్ణువు యొక్క, వీర్యాణి= మహిమలను, కః వా కథయతు = ఎవడు గణింపగలడు?, ధరణేః రేణూన్= భూమియొక్క ఇసుక రేణువులను(ధరతి జీవాదీన్ జీవాదులను ధరించునది. పృథివి), కః చ= ఎవడు, మిమీతే =లెక్కపెట్టగలడు? (దుర్లభమని భావం), యత్ర = ఏ వైకుంఠమందు, త్వత్ భక్తాః = నీ భక్తులు, మాద్యంతి = మైమఱపు చెందెదరో, యత్ర = ఏ వైకుంఠమందు, అమృత రస మరందస్య ప్రవాహః=అమృతరస మకరందప్రవాహము ఉన్నదో (అమృత రసమనగా మోక్షసుఖము), తస్య ప్రియమ్ = అట్టి విష్ణుప్రియమైన, పరమం ధామ = వైకుంఠమును, ఇహ= ఇక్కడ ఈ లోకములో నివసిస్తున్న నేను, అభియాయాం = చేరుకొనునట్లు అనుగ్రహింపుము.

**తాత్పర్యము:** ఎవని యొక్క మూడు అడుగులచే ముల్లోకములు కొలువబడినవో, సమస్త సంపదలచే సకల జనులను ఎవడు సంతోష పెట్టుచున్నాడో, ఏ విష్ణువు అఖిల లోకములను తన యోగైశ్వర్యముచేత ధరించుచున్నాడో, ఆ విష్ణువు యొక్క మహిమలను ఎవడు గణింపగలడు? భూమియొక్క ఇసుక రేణువులను ఎవడు లెక్కపెట్టగలడు? (దుర్లభమని భావం) ఏ వైకుంఠమందు నీ భక్తులు మైమఱపు చెందెదరో, ఏ వైకుంఠమందు అమృతరస మకరందప్రవాహము ఉన్నదో, అట్టి

విష్ణుప్రియమైన వైకుంఠమును ఇక్కడ ఈ లోకములో నివసిస్తున్న నేను చేరుకొనునట్లు అనుగ్రహింపుము.

**99-2 శ్లో.**

**ఆద్యాయాశేషకర్త్రే ప్రతినిమిషనవీనాయ భర్త్రే విభూతేః**
**భక్తాత్మా విష్ణవే యః ప్రదిశతి హవిరాదీని యజ్ఞార్చనాదౌ ।**
**కృష్ణాద్యం జన్మ యో వా మహదిహ మహతో వర్ణయేత్ సోఽయమేవ**
**ప్రీతః పూర్ణో యశోభిస్త్వరితమభిసరేత్ ప్రాప్యమంతే పదం తే ॥**

**ప్రతిపదార్థము:** యః= ఎవడు (ఏ భక్తుడు), ఆద్యాయ= ఆద్యుడు(ఆదౌ భవః- మొదట జరుగునది మొదట నుండునది), అశేష కర్త్రే= సర్వకారణమయిన వాడు, (నాస్తి శేషః యస్య-మిగలనిది, సంపూర్ణము), ప్రతి నిమిష నవీనాయ= ప్రతినిమిషము కొత్తగా తోచువాడు (నిమేషతి నితరాం మేషతి తస్య కర్మ-కనురెప్ప కొట్టుకొనుట. నిమేషము, నిమిషము), విభూతేః = సర్వవిభూతులకు (ఐశ్వర్యములకు) (విశిష్టా భూతిః ఐశ్వర్యమ్ ఐశ్వర్యము, భస్మము, అణిమాద్యష్ట ఐశ్వర్యములు), భర్త్రే = ఈశ్వరుడైనవాడు, భక్తాత్మా = భక్తులకు ఆత్మస్వరూపుడైన, విష్ణవే= ఏ విష్ణువుకు, యజ్ఞ అర్చనాదౌ= యజ్ఞము లందు అర్చనము మొదలయిన యందు, హవిః ఆదీని= హవిస్సు మొదలగువానిని, ప్రదిశతి వా= ఇచ్చునో, యః = ఎవడు, మహతః = మహానుభావుడైన విష్ణువు యొక్క, మహత్ = పూజ్యములైన (మహ్యతే పూజ్యతే విస్తృతో భవతి పూజింపబడువాడు. జ్యేష్ఠుడు గొప్పది), కృష్ణ ఆద్యం= కృష్ణుడు మొదలయిన, జన్మ= జన్మలలో నువ్వు చేసిన లీలలను, వర్ణయేత్ =వర్ణించునో (కీర్తించునో), సః అయమ్ ఏవ =అట్టి భక్తుడు, ఇహ = ఈలోకమందు, ప్రీతః = కోరిన సుఖములు అనుభవించి, యశోభిః పూర్ణః = పరిపూర్ణ కీర్తిశాలియై, అంతే = మరణము తదుపరి, త్వరితమ్= వెంటనే (జన్మాంతర ఆలస్యము లేకుండ), ప్రాప్యమ్= చేరుకొనదగిన, తే పదం = ఆ పరమాత్మ స్థానమయిన వైకుంఠమును, అభిసరేత్= చేరుకొనును.

**తాత్పర్యము:** ఎవడు – (ఏ భక్తుడు) ఆద్యుడు, సర్వకారణమయిన వాడు, ప్రతినిమిషము కొత్తగా తోచువాడు, సర్వ ఐశ్వర్యములకు ఈశ్వరుడైనవాడు

భక్తులకు ఆత్మస్వరూపుడైన ఏ విష్ణువుకు యజ్ఞము లందు అర్చనము మొదలయిన యందు హవిస్సు మొదలగువానిని ఇచ్చునో – ఎవడు మహానుభావుడైన విష్ణువు యొక్క పూజ్యములైన కృష్ణుడు మొదలయిన జన్మలలో నువ్వు చేసిన లీలలను కీర్తించునో అట్టి భక్తుడు ఈలోకమందు కోరిన సుఖములు అనుభవించి పరిపూర్ణ కీర్తిశాలియై మరణము తదుపరి వెంటనే – జన్మాంతర ఆలస్యము లేకుండ ఆ పరమాత్మ స్థానమయిన వైకుంఠమును చేరుకొనును.

**99–3 శ్లో.**

**హే స్తోతారః! కవీంద్రాస్తమిహ ఖలు యథా చేతయధ్వే తథైవ**
**వ్యక్తం వేదస్య సారం ప్రణువత జననోపాత్తలీలాకథాభిః ।**
**జానంతశ్చాస్య నామాన్యఖిలసుఖకరాణీతి సంకీర్తయధ్వం**
**హే విష్ణో! కీర్తనాద్యైస్తవ ఖలు మహతస్తత్త్వబోధం భజేయమ్ ॥**

**ప్రతిపదార్థము:** హే స్తోతారః = ఓ స్తుతి చేయువారా! (రాజులను వర్ణన చేయువారా!) (స్తౌతి అసౌ స్తుతించువాడు), కవీంద్రాః = కవులారా! (కావ్యకుశలులారా!) (కవతే జానాతి కవయతి వా జ్ఞానము కలవాడు. మేధావి కవిత్వము వ్రాయువాడు), యథా ఖలు = ఎట్లు, చేతయధ్వే= మీరు అర్థము చేసుకొంటారో, తథా ఏవ= అట్లు, వ్యక్తం= ప్రమాణ సిద్ధముగా(విశేషేణ అంచతి వ్యాప్నోతి వ్యాపించునది స్పష్టమైనది), వేదస్య = వేదము స్పష్టపరిచెడి, సారం= ప్రధాన ప్రతి పాద్యమయిన(పరమసారభూతమైన), తమ్ = ఆ విష్ణువును, ఇహ = ఇక్కడ, జనన= అవతారములతో, ఉపాత్త = అంగీకరించబడిన(ఉప ఆదత్తః గృహీతః–పొందబడినది తీసుకొనబడినది), లీలా కథాభిః =లీలా కథలతో (విలాసకథలను), ప్రణువత = స్తుతింపుడు, జానంతః = ఓ పరమార్థము తెలిసిన ఘనులారా!, అస్య = విష్ణువు యొక్క, నామాని చ ==నామములు, అఖిల సుఖ కరాణి ఇతి = సకల సుఖకారణములని (మోక్ష ప్రదాయకములని), సంకీర్తయధ్వం = కీర్తింపుడు, హే విష్ణో = ఓ విష్ణుమూర్తీ!, మహతః తవ = గొప్పదైన నీ యొక్క, కీర్తనా అద్యైః ఖలు = సంకీర్తనము చేత, తత్త్వ బోధం = తత్త్వజ్ఞానము, భజేయమ్ = సేవింతును.

**తాత్పర్యము:** ఓ స్తుతి చేయువారా ! కవులారా ! వేదము స్పష్టపరిచెడి పరమసారభూతమైన ఆ విష్ణువు యొక్క అవతారములను లీలా కథలతో స్తుతింపుడు. ఓ పరమార్థము తెలిసిన ఘనులారా ! విష్ణువు యొక్క నామములు సకల సుఖకారణములని కీర్తింపుడు. ఓ విష్ణుమూర్తీ ! గొప్పదైన నీ యొక్క సంకీర్తనము చేత తత్త్వజ్ఞానము సేవింతును.

**99-4 శ్లో.**

**విష్ణోః కర్మాణి సంపశ్యత మనసి సదా యైస్స ధర్మానబధ్నాద్**
**యానీంద్రస్యైష భృత్యః ప్రియసఖ ఇవ చ వ్యాతనోత్ క్షేమకారీ ।**
**వీక్షంతే యోగసిద్ధాః పరపదమనిశం యస్య సమ్యక్ప్రకాశం**
**విప్రేంద్రా జాగరూకాః కృతబహునుతయో యచ్చ నిర్భాసయంతే ॥**

**ప్రతిపదార్థము:** విష్ణోః= విష్ణువు యొక్క, కర్మాణి = చరిత్రములు, సదా = ఎప్పుడు, మనసి = మనస్సునందు, సంపశ్యత= చింతింపుడు, సః = ఆవిష్ణువు, యైః ధర్మాన్ = దుష్ట నిగ్రహ విద్యా స్థాపన లోక సంగ్రహణ రూపములయిన ఏ ధర్మములు ఉన్నాయో ఆ శ్రేయసార్థములను, అబధ్నాత్= అ యా అధికారములతో సమకూర్చెను (ఆ కర్మలను పరిశీలించండి), ఏషః = ఈ విష్ణువు, ఇంద్రస్య= ఇంద్రునికి, భృత్యః = మేలుచేయు సేవకుని వలె(భ్రియతే భర్తుం యోగ్యో వా, భర్తవ్యః-భరించదగినవాడు, జీతము పొందువాడు. సేవకుడు), ప్రియసఖః ఇవ చ= ప్రియస్నేహితునివలె ఉండి త్రిలోకరక్షణమును చేసి, క్షేమకారీ = జగద్రక్షణ శీలుడగుచు, యాని = ఆ కర్మలను, వ్యాతనోత్= విస్తరింపచేయుచున్నాడు, యోగసిద్ధాః = యోగసిద్ధులు, యస్య = దేనియొక్క, సమ్యక్ ప్రకాశం= ప్రకాశస్వరూపమయిన(సం సమానతయా సమ్యక్ వా అంచతి బాగుగా వుండునది మంచిది సంగము మనోజ్ఞము), పరపదమ్ = మాయా సంబంధ రహితమైన ప్రాప్తి స్థానమును, అనిశం = ఎప్పుడు(న నిశారాత్రిః చేష్టారాహిత్యమ్ ఎల్లప్పుడు పని చేయువాడు ఎల్లప్పుడు జరుగునది), వీక్షంతే = దర్శించుచున్నారు, యత్ = ఏ పరమపదము ఉన్నదో దానిని (మాయాసంబంధము లేనిదానిని), విప్ర ఇంద్రాః= ఉత్తమ బ్రాహ్మణులు, జాగరూకాః = జాగరూకులై (చాలా శ్రద్ధ కలిగి), కృతబహు

నుతయః = సగుణ నిర్గుణ భేదముల చేత తమ తమ స్తుతుల ద్వారా, నిర్భాసయంతే చ = ప్రకాశింప చేయుచున్నారు(కీర్తింతురు).

**తాత్పర్యము:** విష్ణువు యొక్క చరిత్రములు ఎప్పుడు మనస్సునందు చింతింపుడు. ఆవిష్ణువు దుష్టనిగ్రహ విద్యా స్థాపన లోక సంగ్రహణ రూపములయిన ఏ ధర్మములు ఉన్నాయో ఆ శ్రేయసార్థములను అ యా అధికారములతో లోకములో సమకూర్చెను .ఈ విష్ణువు ఇంద్రునికి మేలుచేయు సేవకుని వలె, ప్రియస్నేహితునివలె ఉండి త్రిలోకరక్షణమును చేసి జగద్రక్షణ శీలుడగుచున్నాడు. యోగసిద్ధులు ప్రకాశ స్వరూపమయిన మాయా సంబంధ రహితమైన అతని ప్రాప్తి స్థానమును ఎప్పుడు దర్శించుచున్నారు . ఆ పరమపదమును ఉత్తమ బ్రాహ్మణులు చాలా శ్రద్ధ కలిగి సగుణ నిర్గుణ భేదముల చేత తమ తమ స్తుతుల ద్వారా కీర్తింతురు.

**99-5 శ్లో.**

**నో జాతో జాయమానోఽపి చ సమధిగతస్త్వన్మహిమ్నోఽవసానం**
**దేవ! శ్రేయాంసి విద్వాన్ ప్రతిముహురపి తే నామ శంసామి విష్ణో ।**
**తం త్వాం సంస్తౌమి నానావిధనుతివచనైరస్య లోకత్రయస్యా-**
**ప్యూర్ధ్వం విభ్రాజమానే విరచితవసతిం తత్ర వైకుంఠలోకే ॥**

**ప్రతిపదార్థము:** దేవ = దేవా!, జాతః = పుట్టినవాడు, జాయమానః అపి చ= పుట్టగలవాడు, త్వత్ మహిమ్నః = నీ మహిమయొక్క, అవసానం = చివరను, సమధిగతః = సంపూర్ణముగా తెలిసినవాడు, న= ఇంతవరకు లేడు, శ్రేయాంసి విద్వాన్= శ్రేయో మార్గమని తెలిసి, ప్రతిముహుః అపి=ఎప్పుడూ, తే నామ = నీ పేరును, శంసామి= కీర్తించెదను, విష్ణో = ఓ విష్ణు మూర్తీ!, అస్య లోకత్రయస్య అపి = ఈ త్రిభువనములకు (బ్రహ్మాండమునకు), ఊర్ధ్వం= మీద (ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్ పైకి తరువాత), విభ్రాజమానే = ప్రకాశించుచున్న, తత్ర వైకుంఠలోకే = ఆవైకుంఠ లోకమందు, విరచిత వసతిం= నివసించు, తం =అతనిని, త్వాం = నిన్ను, నానావిధ నుతివచనైః= అనేక విధములుగా స్తుతి వచనములతో, సంస్తౌమి = స్తుతించెదను.

**తాత్పర్యము:** దేవా! పుట్టినవాడు ,పుట్టగలవాడు నీ మహిమయొక్క చివరను సంపూర్ణముగా తెలిసినవాడు ఇంతవరకు లేడు. శ్రేయో మార్గమని తెలిసి ఎప్పుడూ నీ పేరును కీర్తించెదను .ఓ విష్ణు మూర్తీ ! ఈ త్రిభువనములకు మీద ప్రకాశించుచున్న ఆవైకుంఠ లోకమందు నివసించు నిన్ను అనేక విధములుగా స్తుతి వచనములతో కొనియాడెదను.

**99-6 శ్లో.**

**ఆపః సృష్ట్యాదిజన్యాః ప్రథమమయి విభో! గర్భదేశే దధుస్త్వాం**
**యత్ర త్వయ్యేవ జీవా జలశయన! హరే! సంగతా ఐక్యమాపన్ ।**
**తస్యాజస్య ప్రభో! తే వినిహితమభవత్ పద్మమేకం హి నాభౌ**
**దిక్పత్రం యత్కిలాహుః కనకధరణిభృత్కర్ణికం లోకరూపమ్ ॥**

**ప్రతిపదార్థము:** అయి విభో= ఓ ప్రభూ !, హరే= ఓ గురువాయూరు కృష్ణ దేవా!, సృష్టి -ఆది= సృష్టికి మొదట (సృజ్యతే రచ్యతే రచించబడునది), ఆపః = జలములు (ప్రళయ పయోధి జలములు)(ఆప్నోతి సర్వం జగత్ అంతట వుండునది అంతట వ్యాపించునది జలము, నీరు), జన్యాః =పుట్టినవి, ప్రథమమ్= మొదట (ప్ర తమః ప్రకృష్ట తమః శ్రేష్ఠః ఆదిమః-శ్రేష్ఠమైనది గొప్పనైనది మొదటిది), త్వాం = నిన్ను, గర్భ దేశే= ఆ జలములు తమ గర్భమందు(గీర్యతే జఠరే స్థాప్యతే పురుష శుక్రయోగేన-పురుష వీర్యంతో జఠరంలో స్థాపింపబడునది. గర్భము సంతానము కడుపు), దధుః = ధరించినవి, జలశయన= నీటి మధ్యలో శేష తల్పమున శయనించిన వాడా!, యత్ర= ఏ నీటి మధ్యలో ఉన్న, త్వయి ఏవ= నీలో, జీవాః = సమస్త జీవులు, సంగతాః = ప్రాప్తులై, ఐక్యమ్ ఆపన్ = లీనమై ఉన్నారు.(బ్రహ్మాది సకల జీవులు విష్ణువులో నిదురించినవని భావం)(ఏకస్య భావః-ఒక్కటి అగుట. ఐక్యత ఐక్యము), ప్రభో= ప్రభూ!, తస్య= ఆరకంగా ఉన్న, అజస్య = జన్మలేని(న జాయతే పుట్టనివాడు), తే = నీయొక్క, నాభౌ = నాభినుండి (నహ్యంతే ధమన్యః అత్ర-ధమనులు ఇక్కడ కూడి యుండును. బొడ్డు), వినిహితమ్= అధిష్ఠితమై(నిహితః స్థాపితః గూఢః-పెట్టబడ్డది దాచబడినది), ఏకం పద్మమ్ = ఒక పద్మము (పద్యతే అత్ర లక్ష్మీః-ఇక్కడ లక్ష్మి వుండును. పద్మము), అభవత్ హి =

పుట్టినది, యత్ కిల పత్రం= ఆ పద్మము యొక్క రేకులు(పతతి వృక్షాత్ వృక్షము నుండి పడునది. ఆకు), దిక్= దిక్కులు. (దిశతి అవకాశం దదాతి నిర్దేశించునది అవకాశము నిచ్చునది. దిశ), కనకధరణిభృత్= మహామేరు పర్వతము, కర్ణికం= ఆ పద్మము యొక్క దుద్దు, లోక రూపమ్= ఆ పద్మమునే లోక రూపముగా (లోకతే ప్రకాశతే ప్రకాశించునది. లోకము. పృథివ్యాది లోకములు భూ-భువః-స్వర్ లోకాదులు, చతుర్దశ భువనాలు), ఆహుః = పేర్కొందురు. (శ్రీమహావిష్ణువే పద్మ భవుడై నాభి పద్మము చేత భువనము పుట్టించెనని భావం).

**తాత్పర్యము:** ఓ ప్రభూ ! ఓ గురువాయూరు కృష్ణ దేవా ! నీటి మధ్యలో శేష తల్పమున శయ నించిన వాడా ! సృష్టిలో మొదట జలములు పుట్టినవి. (ఆప ఏవ ససర్జాదౌ) మొదట నిన్ను ఆ జలములు తమ గర్భమందు ధరించినవి. నీలో సమస్త జీవులు లీనమై ఉన్నారు. జన్మలేని నీయొక్క నాభినుండి ఒక పద్మము పుట్టినది. ఆ పద్మము యొక్క రేకులు దిక్కులు. మహామేరు పర్వతము ఆ పద్మము యొక్క దుద్దు . ఆ పద్మమునే లోక రూపముగా పేర్కొందురు. (శ్రీమహావిష్ణువే పద్మ భవుడై నాభి పద్మము చేత భువనము పుట్టించెనని భావం).

**విశేషాలు**

**సృష్టి:** విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రకారం చేతన, అచేతన, ఈశ్వర అనే మూడు ప్రధాన తత్త్వాలు ఉన్నాయి. అచేతన తత్త్వంలో ప్రకృతి, కాలం, శుద్ధసత్త్వం అనే మూడు భాగాలు ఉన్నాయి. భోగ, భోగోపకరణ, భోగ స్థానాలు శుద్ధసత్త్వ పరిధిలోనివి. పరమాత్మ సృష్టి, స్థితి, లయ విన్యాసాలు చేసేటప్పుడు కాలాన్ని ఉపకరణంగా వాడుకొంటాడు. సృష్టి జరిగేటప్పుడు సత్త్వ రజస్తమో గుణాలు కలిగి, మూల ద్రవ్యమైన ప్రకృతి ఇరువది మూడు తత్త్వాలుగా పరిణామం చెందుతుంది. ప్రకృతి, మహత్తు, అహంకారం, మనస్సు, శ్రవణ, దృశ్య, ఘ్రాణ, రస, స్పర్శలనే ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్కు, పాదం, పాణి, పాయువు, ఉపస్థ అనే ఐదు కర్మేంద్రియాలు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే పంచతన్మాత్రలు, పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలు అన్నీ కలసి 24 తత్త్వాలతో పరమాత్మ సర్వ వస్తుజాలాన్ని సృష్టించాడు. ఆత్మ ఇరువది ఐదవ తత్త్వం అన్నారు. ఆత్మకే జీవ,

పురుష నామాలు కూడా ఉన్నాయి. ఇదే చేతన తత్త్వం. పరమాత్మను ఇరువది ఆరవ తత్త్వం అని వ్యవహరిస్తారు. ఆత్మ తత్త్వం వేరు, పరమాత్మ తత్త్వం వేరు. ఆత్మ వేరొకరి ప్రయోజనానికి లోబడి ఉంటుంది. పరమాత్మ ఎవరిపైన ఆధారపడదు. ఆత్మ ప్రకృతికంటె కూడా భిన్నం. ప్రకృతిని ఎవరో ఒకరు నియంత్రించ వలసినదే. ఆత్మ చేసే కొన్ని చర్యలను పరమాత్మ నియంత్రిస్తే, కొన్నింటిని ఆత్మ స్వయంగా నియంత్రించు కొంటుంది. శరీరం అచేతనం. పరమాత్మ శరీరి. ఆత్మ ఈశ్వరుడికి శరీరం. భౌతిక శరీరానికి ఆత్మ శరీరి. ఆత్మ తనను తాను తెలుసుకొనే శక్తి కలిగినది. శ్రీమన్నారాయణుడు బ్రహ్మను సృష్టిస్తే బ్రహ్మ రుద్రుడినీ, ఇంద్రుడినీ, సనకస నందాదులనూ, నారదాది దేవర్షులను, దక్షుడు మొదలైన ప్రజాపతులనూ, సిద్ధ, గంధర్వ, కిన్నర, కింపురుష, విద్యా ధరాదులను, నాలుగు వర్ణాల మానవులనూ, పశు పక్ష్యాది జంతుజీవజాలాన్ని, చెట్లు, పొదలు, లతలు మొదలైన స్థావరాలను సృష్టించాడు. జీవులు నాలుగు విధాలు. ఉద్భిజాలు. అంటే విత్తనం నుంచి మొలకెత్తేవి. చెమట నుంచి పుట్టే సూక్ష్మ క్రిములు, చెదలు మొదలైన స్వేదజాలు. పక్షులు, పాములు మొదలైనవి అండజాలు. తల్లి గర్భంలో పిండంగా మొదలై, శిశువులుగా జన్మించేవి జరాయుజాలు. వీరుగాక, సీత మొదలైన అయోనిజలు కూడా ఉన్నారు.

**99-7 శ్లో.**

**హే లోకా విష్ణురేతద్భువనమజనయత్తన్న జానీథ యూయం**
**యుష్మాకం హ్యంతరస్థం కిమపి తదపరం విద్యతే విష్ణురూపమ్ ।**
**నీహారప్రఖ్యమాయాపరివృతమనసో మోహితా నామరూపైః**
**ప్రాణప్రీత్యేకతృప్తాశ్చరథ మఖపరా హంత నేచ్ఛా ముకుందే ॥**

**ప్రతిపదార్థము:** హే లోకాః = ఓ జనులారా!, ఏతత్ భువనమ్= ఈ కనిపించు జగత్తును(భవంతి అస్మిన్ భూతాని ఇందులో ప్రాణులుండును. లోకము), విష్ణుః= విష్ణుమూర్తి, అజనయత్=సృష్టించెనని, యూయం= మీరు, న జానీథ = ఎరుగరు కాబోలు!, తత్ కిమపి= మరియు, అపరం = మరియొక (నాస్తి పరః యస్మాత్ దానికంటే తరువాత లేనిది), విష్ణురూపమ్ = విష్ణురూపము, యుష్మాకం

= మీ హృదయాలలో, అంతరస్థం= అంతర్యామిగా, విద్యతే= ఉన్నాడు, తత్ హి= అది కూడా (యూయం= మీరు న జానీథ = ఎరుగరు కాబోలు), నీహార ప్రఖ్య మాయా= మంచు వలె ఉన్న మాయ(నితరాం హ్రియతే ఘనీభవతి ఘనముగా వుండునది. మంచు), పరివృత మనసః = కప్పివేసిన మనస్సులు కలవారై, నామరూపైః = నామరూపములచే, మోహితాః = మోహితులై (నామ రూపాత్మకమైన భౌతిక విషయములు అనగా శరీరాదులందు అభిమానము కలవారై), ప్రాణ= ప్రాణభూతములైన ఇంద్రియముల సుఖములందు (ప్రాణితి జీవతి అనేన–దీనితో జీవింతురు. ప్రాణవాయువు), ప్రీతిః = ప్రీతి(ప్రీణాతి తస్య భావః–సంతోషము ప్రసన్నత తృప్తి), ఏక తృప్తాః = ప్రధానముగ తృప్తులై, మఖపరాః= స్వర్గము మొదలయిన సుఖములందు కోరికలచే యజ్ఞరూపములైన కామ్యకర్మపరులై(మఖంతి గచ్ఛంతి దేవాః అత్ర–దేవతలు ఇక్కడికి వత్తురు. యజ్ఞము, యాగము), చరథ= చరించుచున్నారు, హంత = అయ్యో!, ముకుందే= మోక్షదాతయైన విష్ణువుయందు (ముకుం మోక్షం దదాతి మోక్షము నిచ్చువాడు. విష్ణువు), న ఇచ్ఛా = కోరిక మీకు లేదు.

**తాత్పర్యము:** ఓ జనులారా! ఈ కనిపించు జగత్తును విష్ణుమూర్తి సృష్టించెనని మీరు ఎరుగరు కాబోలు ! మరియు మరియొక విష్ణురూపము మీ హృదయాలలో అంతర్యామిగా ఉన్నాడు. అది కూడా మీరు ఎరుగరు కాబోలు . మంచు వలె ఉన్న మాయ కప్పివేసిన మనస్సులు కలవారై నామరూపములచే మోహితులై (నామ రూపాత్మకమైన భౌతిక విషయములు అనగా శరీరాదులందు అభిమానము కలవారై) ఇంద్రియముల సుఖములందు తృప్తులై స్వర్గము మొదలయిన సుఖములందు కోరికలచే యజ్ఞరూపములైన కామ్యకర్మపరులై చరించుచున్నారు. అయ్యో ! మోక్షదాతయైన విష్ణువుయందు కోరిక మీకు లేదు.

**99–8 శ్లో.**

**మూర్ధ్నామక్ష్ణాం పదానాం వహసి ఖలు సహస్రాణి సంపూర్య విశ్వం**
**తత్ప్రోత్క్రమ్యాపి తిష్ఠన్ పరిమితవివరే భాసి చిత్తాంతరేఽపి ।**
**భూతం భవ్యం చ సర్వం పరపురుష భవాన్ కించ దేహేంద్రియాది–**
**ష్వావిష్టోహ్యుద్గతత్వాదమృతసుఖరసంచానుభుంక్షే త్వమేవ ॥**

**ప్రతిపదార్థము:** పర పురుష = ఓ పరమపురుషా! నువ్వు విరాట్ శరీరమునందు అభిమానివై (పూరయతి అంతః సర్వమ్ సర్వమును వ్యాపించినవాడు), సహస్రాణి మూర్ధ్నామ్ = వేల కొలదిగా శిరస్సులు (సమానం హసతి సమానంగా నవ్వునది. వేయి సంఖ్య.)(ముహ్యతి అస్మిన్ ఆహతే ఇతి మూర్ధా దీనిని కొట్టినచో సొమ్మసిల్లును. మూర్ధము, శిరస్సు), అక్ష్ణాం= కన్నులు (అక్షతి వ్యాప్నోతి దూరముగా వ్యాపించునది. కన్ను), పదానాం = పాదములు, వహసి ఖలు = వహించియున్నావు, విశ్వం= బ్రహ్మాండమంతటా(విశతి ప్రవిశతి స్వకారణం మూలప్రకృతిమ్ కారణమైన మూలప్రకృతిని ప్రవేశించునది. జగత్తు, ప్రపంచము), సంపూర్య= నిండి, తత్ ప్రోత్క్రమ్య= దానికి అతీతుడవై, తిష్ఠన్ అపి= ఉన్నప్పటికి, పరిమిత వివరే= అతిసంకుచితమైన సూక్ష్మమైన(వివర= విగతః వరః ఆవరణం యస్య– విశేషంగా అడ్డము లేనిది. రంధ్రము, కన్నము), చిత్త అంతరే అపి = జీవుని హృదయాకాశములో కూడా, భాసి= ప్రకాశించుచున్నావు, భూతం= భూతము (భూతః గతః–జరిగినది), భవ్యం= భవిష్యత్తు, వర్తమానము (భవతి భూయతే కాదగినది. శుభము భగవంతుడు), సర్వం చ = సర్వమూ, భవాన్ = నువ్వే, కించ = మరియు, త్వమ్ ఏవ= నువ్వే, దేహ ఇంద్రియ ఆదిషు= జీవుని దేహేంద్రియాదులందు, ఆవిష్టః హి= ప్రవేశించి, ఉద్గతత్వాత్ = అతీతుడవై (ఉద్గత ఉచ్చైః గతః ప్రాప్తోదయఃభేదించుకొని వెలి కురికినది), అమృత సుఖరసం చ = అమృత సుఖరసమును(పరమానందరసమును), అనుభుంక్షే = అనుభవించు చున్నావు.

**తాత్పర్యము:** ఓ పరమపురుషా! నువ్వు విరాట్ శరీరమునందు అభిమానివై వేల కొలదిగా శిరస్సులు ,కన్నులు, పాదములు వహించియున్నావు. బ్రహ్మాండమంతటా నిండి దానికి అతీతుడవై ఉన్నప్పటికి అతిసంకుచితమైన సూక్ష్మమైన జీవుని హృదయాకాశములో కూడా ప్రకాశించుచున్నావు . భూతము భవిష్యత్తు, వర్తమానము సర్వమూ నువ్వే. మరియు నువ్వే జీవుని దేహేంద్రియాదులందు ప్రవేశించి అతీతుడవై పరమానందరసమును అనుభవించుచున్నావు.

**విశేషాలు:** భూతం భవ్యాయోపదిశ్యతే ఇయ్యది మీమాంసకప్రతిపాదితన్యాయము. ప్రారంభింపఁబడిన యాగాదిక్రియా కలాపము భావిఫలప్రధానమై యుండును. అనఁగా నిపుడాచరింపఁబడిన యజ్ఞయాగాదికర్మజాలము భావికాలమున ఫలించును.

**99-9 శ్లో.**

**యత్తు త్రైలోక్యరూపం దధదపి చ తతో నిర్గతానంతశుద్ధ-**
**జ్ఞానాత్మా వర్తసే త్వం తవ ఖలు మహిమా సోఽపి తావన్ కిమన్యత్ ।**
**స్తోకస్తే భాగ ఏవాఖిలభువనతయా దృశ్యతే త్ర్యంశకల్పం**
**భూయిష్ఠం సాంద్రమోదాత్మకముపరి తతో భాతి తస్మై నమస్తే ॥**

**ప్రతిపదార్థము:** అనంత = ఓ అనంతుడా ! (నాస్తి అంతః = పరిచ్ఛేదః దేశతః కాలతః వస్తుతశ్చ యస్య-దేశ, కాల, వస్తు పరిమాణం లేనివాడు. పరబ్రహ్మ సీమలేనిది), యత్ తు = నువ్వు కారణమయినప్పటికి (బుద్ధిస్థత్వోపలక్షిత ధర్మావచ్ఛిన్నమ్- సర్వనామవిశేషః -2. హేతుః), త్రైలోక్య రూపం= త్రిభువన స్వరూపమును(త్రిలోకే ఏవ త్రైలోక్యమ్ త్రిలోకమే త్రైలోకము), దధత్ అపి చ = నువ్వు ధరించినప్పటికి, తతః = దానినుండి, నిర్గత= బయటికి వచ్చి (అతీతుడవై) (నిశ్శేషేణ గతః-వెళ్లిపోయినది జరిగిపోయినది), శుద్ధ జ్ఞాన ఆత్మా= శుద్ధ జ్ఞాన స్వరూపుడవుగా కూడా(శుద్ధః పవిత్రీకృతః శుభ్రః-పవిత్రము చేయబడినది), వర్తసే = ఉన్నావు, త్వం = నువ్వు, సః అపి= అది(శుద్ధజ్ఞానస్వరూపుడవయినప్పటికి), తావన్= ఆ జగన్నిర్మాణ పరిమాణం కలిగిన(తత్ పరిమాణం అస్య-ఆ పరిమాణం కలది నిశ్చయము అవధి కొలత ప్రశంస), తవ ఖలు మహిమా= నీయొక్క మహిమ ఎంతో గొప్పది. (మహతః భావః-గొప్ప దనము. మహత్త్వము), కిమ్ అన్యత్ =ఇక వేరే ఏమి చెప్పగలము?, తే స్తోకః భాగః ఏవ= నీ యొక్క అతిచిన్నదయిన ఒక అంశ భాగము (స్తోచతే అల్పో భవతి చిన్నదగునది చిన్నది), అఖిల భువనతయా = అఖిలభువనములుగా, దృశ్యతే= కనబడుచున్నది, త్ర్యంశ కల్పం = మిగిలిన మూడు భాగములుగా ఉన్న, భూయిష్ఠం= అధికతరమయిన నీరూపము, సాంద్ర మోద ఆత్మకమ్ = సాంద్రానంద స్వరూపమై, తతః ఉపరి= ఈ భువనములకు పైన,

భాతి= ప్రకాశించుచున్నది, తస్మై = అట్లు అపరిచ్ఛిన్న మూర్తి వగు, తే = నీకు, నమః= నమస్కారము.

**తాత్పర్యము:** ఓ అనంతుడా! త్రిభువన స్వరూపమును నువ్వు ధరించినప్పటికి దానికి అతీతుడవై, శుద్ధ జ్ఞాన స్వరూపుడవుగా కూడా ఉన్నావు. నీయొక్క మహిమ ఎంతో గొప్పది. (నీ మహిమ ఇంతటిది అని చెప్పజాలమని భావం) నీ యొక్క అతిచిన్నదయిన ఒక అంశ భాగము అఖిలభువనములుగా కనబడుచున్నది. మిగిలిన మూడు భాగములుగా ఉన్న నీరూపము సాంద్రానంద స్వరూపమై ఈ భువనములకు పైన ప్రకాశించుచున్నది. అట్లు సీమలేని మూర్తి వగు నీకు నమస్కారము.

**99-10 శ్లో.**

**అవ్యక్తం తే స్వరూపం దురధిగమతమం తత్తు శుద్ధైకసత్త్వం**
**వ్యక్తం చాప్యేతదేవ స్ఫుటమమృతరసాంభోధి కల్లోలతుల్యమ్ ।**
**సర్వోత్కృష్టామభీష్టాం తదిహ గుణరసేనైవ చిత్తం హరంతీం**
**మూర్తిం తే సంశ్రయేఽహం పవనపురపతే పాహి మాం కృష్ణ! రోగాత్ ॥**

**ప్రతిపదార్థము:** తే= నీ యొక్క, అవ్యక్తం స్వరూపం = అవ్యక్తమైన బ్రహ్మస్వరూపము (న వ్యక్తః ఇంద్రియ గోచరః-వ్యక్తము గానిది, ఇంద్రియములకు గోచరము గానిది. పరమాత్మ), దురధిగమతమం= అందరికి అందునది కాదు. కష్టముచేత పొందదగినది (చాలా కఠినముగా ఉండును), తత్ తు శుద్ధ ఏక సత్త్వం =ఆ శుద్ధ సత్వాత్మకమయిన స్వరూపము, వ్యక్తం అపి చ = వ్యక్తమై (తెలుసుకొనుటకు సాధ్యమై) (విశేషేణ అంచతి వ్యాప్నోతి వ్యాపించునది స్పష్టమైనది సాంఖ్యమతములో స్థూల ప్రకృతి), స్ఫుటమ్= స్ఫుటముగా చాలా స్పష్టముగా ఉన్నది. (స్ఫుటతి వికసతి ప్రకాశతే వా వికసించినది భేదించబడినది), ఏతత్ ఏవ = ఈ కృష్ణుడు మొదలయిన నీ వ్యక్త స్వరూపము, అమృత= బ్రహ్మానందమను, రస అంభోధి= రస సాగరమునందలి (అంభాంసి ధీయంతే అత్ర-నీటిని ధరించునది. సముద్రము), కల్లోల తుల్యమ్ = కెరటముతో తుల్యమయినది. (కం జలం లోలా చపలం యస్మాత్ జలమును కల్లోలము చేయునది. మహాతరంగము), తత్=

అందువలన, సర్వ ఉత్కృష్టమ్ = అన్నింటికంటె గొప్పదయిన (ఉత్కృష్టః కర్షితః శ్రేష్ఠః, ప్రముఖః ఉత్తమః–పైకి లేపబడినది పెరికివేయబడినది ఉత్తమమైనది), అభీష్టాం= నాకు ఇష్టమైనది, గుణ రసేన ఏవ= భక్త వాత్సల్యాది గుణరసముల యొక్క ఆస్వాదముచే, చిత్తం = నా మనస్సును, హరంతీం = హరించునదియు అగు, తే మూర్తిం= నీ మూర్తిని, ఇహ = ఇక్కడ ధ్యానాదుల కొరకు, అహం = నేను, సంశ్రయే= ఆశ్రయించుచున్నాను, పవనపురపతే= ఓ గురువాయూరు దేవా!, కృష్ణ= శ్రీ కృష్ణా, రోగాత్ = ఈ రోగమునుండి (సంసారరూపమైన వ్యాధి నుండి), మాం= నన్ను, పాహి = రక్షించు.

**తాత్పర్యము:** నీ యొక్క అవ్యక్తమైన బ్రహ్మస్వరూపము చాలా కఠినముగా ఉండును. ఆ శుద్ధ సత్వాత్మకమయిన స్వరూపము వ్యక్తమై స్ఫుటముగా చాలా స్పష్టముగా ఉన్నది. ఈ కృష్ణుడు మొదలయిన నీ వ్యక్త స్వరూపము బ్రహ్మానందమను రస సాగరమునందలి కెరటముతో తుల్యమయినది. అందువలన అన్నింటికంటె గొప్పదయిన నాకు ఇష్టమైనదయిన భక్త వాత్సల్యాది గుణరసముల యొక్క ఆస్వాదముచే నా మనస్సును హరించునదియు అగు నీ మూర్తిని ఇక్కడ ధ్యానాదుల కొరకు నేను ఆశ్రయించుచున్నాను. ఓ గురువాయూరు దేవా! శ్రీ కృష్ణా! ఈ రోగమునుండి (సంసారరూపమైన వ్యాధి నుండి ) నన్ను రక్షించు.

**ద్వాదశ స్కంధము**

**99వ దశకము సమాప్తము**

# దశకమ్ 100 – భగవంతుని కేశాదిపాదవర్ణన

**100–1 శ్లో.**

**అగ్రే పశ్యామి తేజోనిబిడతరకలాయావలీలోభనీయం**
**పీయూషాప్లావితోఽహం తదను తదుదరే దివ్యకైశోరవేషమ్ ।**
**తారుణ్యారంభరమ్యం పరమసుఖరసాస్వాదరోమాంచితాంగైః**
**ఆవీతం నారదాద్యైర్విలసదుపనిషత్సుందరీమండలైశ్చ ॥**

**ప్రతిపదార్థము:** అహం=నేను (అస్మదర్థకము. నా శబ్దమునకు ప్రథమైకవచనము, నేను), నిబిడతర= దట్టమైన(నితరాం విడతి ఘనీభవతి ఘనమైనది. గట్టిది దట్టమైనది), కలాయ ఆవలీ= కలయ పుష్పాల రంగును మించిన, లోభనీయం= లోభనీయమైన (లుభ్యతి తస్య భావః–లోభము, ఆశ), తేజః = తేజస్సును(ప్రభామండలమును) (తేజయతి తేజ్యతే అనేన వా దీనితో పదును పెట్టుదురు. గీటురాయి ప్రకాశించునది. ప్రకాశము పరాక్రమము జ్యోతి సూర్యుడు కాంతి బలము చైతన్య స్వరూప బ్రహ్మ), అగ్రే= ఎదుట, పశ్యామి= చూచుచున్నాను, తత్ అను=ఆ దర్శనము తదుపరి, పీయూష=అమృత రస (పీయతే దేవైః–దేవతలచే త్రాగబడునది. అమృతము), ఆప్లావితః= ఆప్లావితుడనై (స్నానము చేయింపబడిన, జలాదిప్రవాహముచేత ముంపబడిన), తత్ ఉదరే = ఆ వెలుగులోలోన(ఉద్ దృణాతి అన్నం అనేన–దీనితో అన్నమును గ్రహింతురు. ఉదరము, పొట్ట), దివ్య= పరమసాత్త్వికమైన(ప్రకాశోజ్జ్వలమైన)(దీవ్యతే అనేన–దీనితో ప్రకాశించునది. అందమైనది), కైశోర వేషమ్= పదునారేండ్ల వయస్సు గల దివ్య కైశోరవేషమును (కిశోరస్య భావః–కిశోరావస్థ), తారుణ్య ఆరంభ రమ్యం= అపుడపుడే అంకురించుచున్న అందమయిన యౌవనముగలదానిని (తరుణస్య భావః–తరుణావస్థ. యౌవనము), పరమ సుఖ రస = బ్రహ్మానంద రస, ఆస్వాద =ఆస్వాదముచే (ఆస్వాదస్య భావ–ఆస్వాదించుట. రుచి చూచుట), రోమాంచిత అంగైః =తమ శరీరములు పులకరింపగా(రోమాంచః జాతః అస్య–గగుర్పాటు కల్గిన), నారద ఆద్యైః = నారద సనక సనందనాది మునిమండలముచేతను(నారం అజ్ఞానం ద్యతి నాశయతి అజ్ఞానమును నాశనము చేయువాడు. నారదుడు),

విలసత్= ప్రకాశించు, ఉపనిషత్ సుందరీమండలైః చ= ఉ పనిషత్ సుందర బృందం చేతను (ఉపనిషీదతి ప్రాప్నోతి బ్రహ్మాత్మభావః అనయా పరావిద్యా దీనితో బ్రహ్మాత్మభావమును పొందుదురు. బ్రహ్మప్రతిపాదక విద్య, వేదాంతవిద్య ఉపనిషత్తు), ఆవీతం= పరివేష్టించి ఉన్న (ఆ సమ్యక్ వీతం ధృతం (వస్త్రం ఉపవీతం వా) ధరించుట), (తేజః = తేజస్సునుఅగ్రే= ఎదుట పశ్యామి= చూచుచున్నాను).

**తాత్పర్యము:** నా ముందు దట్టంగా వరుసక్రమంలో ఉన్న కలయ పుష్పాల రంగును మించిన నీలి రంగు తేజాన్ని నేను చూస్తున్నాను. ఆ దర్శనంతో అమృతంలో స్నానం చేసినంత పరమానందం నాలో పెల్లుబికింది. తరువాత ఆ తేజోరాశి మధ్యంలో యౌవనం వికసించడంతో ముగ్ధమనోహరమైన ఒక దివ్యబాలుడు నాకు కనిపించాడు. పరమానందంచే పులకరించిపోతున్న నారదాది మునులచే, మూర్తీభవించిన ఉపనిషత్తులు అను సుందరీ బృందంచే పరివేష్టితమై ఉన్నాడు ఆ బాలుడు.

**విశేషాంశములు**

**కలయ పుష్పం:** దీనిని కొంతమందిఇరుగుడు పుష్పము (నల్ల దిరిసెన పుష్పము లేదా శింశుపాపుష్పము) అని అనువాదం చేసారు. మరికొంతమంది నల్ల కలువ పూవు అన్నారు.

శ్రీకృష్ణుడు పరబ్రహ్మము. గోపికలు ఉపనిషత్తులు. నారదుడు మొదలయిన వారు ఉపదేశకులు.

**100-2 శ్లో.**

**నీలాభాం కుంచితాగ్రం ఘనమమలతరం సంయతం చారుభంగ్యా**
**రత్నోత్తంసాభిరామం వలయితముదయచ్చంద్రకైః పింఛజాలైః ।**
**మందారస్రజ్నివీతం తవ పృథుకబరీభారమాలోకయేఽహం**
**స్నిగ్ధశ్వేతోర్ధ్వపుండ్రామపి చ సులలితాం ఫాలబాలేందువీథీమ్ ॥**

**ప్రతిపదార్థము:** నీలఆభాం = నిగనిగలాడు నలుపు కలిగి (నీలతి ఆచ్ఛాదయతి అన్యవర్ణాన్ ఇతర రంగులను కప్పునది. కృష్ణ వర్ణము)(ఆభాసతే ప్రకాశతే దీప్యతే

అనయా ప్రకాశించునది కాంతింపచేయునది. కాంతి దీప్తి, శోభ), కుంచిత = నొక్కులు( వంకీలు) తిరిగిన (వక్రీభూతః సంకుచితో వా సంకోచించినది), అగ్రం= పై భాగము కలిగినవయి, ఘనమ్ = దట్టమై (ఘనతి దీప్యతే ప్రకాశించునది. మేఘము దట్టమైనది), అమలతరం= స్వచ్ఛమై (మలస్య అభావః–నిర్మలమైనది), చారుభంగ్యా సంయతం = చక్కగ సరిదిద్దబడి (అనగా చక్కగా నడినెత్తిన ముడివేయబడి), రత్న ఉత్తంస అభిరామం= మనోహరమైన రత్నాభరణములతో (ఉత్ సమ్యక్ తంస్యతే అలంక్రియతే అనేన–అలంకారము భూషణము), ఉదయత్ చంద్రకైః= ప్రకాశమానమయిన చిత్రవర్ణములు కలిగిన(వన్నెలు చిల్కు)(చంద్ర ఇవ కాయతి చంద్రుని వలె ప్రకాశించునది. మయూరపింఛము), పింఛజాలైః = నెమలిపించములతో, వలయితమ్ = ఆవృతమయి, మందార స్రక్= మందార పూలదండతో (మంద్యతే స్తూయతే ప్రశస్యతే స్తుతించబడునది, పొగడబడినది. మందార వృక్షము), నివీతం= కూడుకొని యున్న (నితరాం వీతః ఆచ్ఛాదితః ధృతః–కప్పుకొన్నవాడు కప్పుకున్న వస్త్రము. ఉపవీతము), తవ= నీయొక్క, పృథు కబరీ భారమ్= నీజుట్టుముడిని (ప్రథతే విఖ్యాతో భవతి చాలా పెద్దది గొప్పది), అహం = నేను, ఆలోకయే= దర్శించుచున్నాను, స్నిగ్ధ= మెరయుచున్న(స్నిహ్యతి స్నేహకరోతి అసౌ స్నేహము చేయువాడు కలిసి వుండునది దట్టమైన), శ్వేత= తెల్లని(శ్వేతతే శుక్లో భవతి తెల్లదనము), ఊర్ధ్వ పుండ్రామ్= ఊర్ధ్వ పుండ్రముచే (ఉత్ ఉచ్చైః హీయతే అత్ర ఊర్ధ్వః ఉచ్ఛ్రితః ఉపరిష్టాత్ పశ్చాత్ పైకి తరువాత) (పుండ్రము= నుదుటి నామము), సులలితాం = అందము గులుకు(పవిత్రతతను వెదజల్లు), ఫాల బాల ఇందు వీథీమ్ అపి చ = బాలచంద్రునియట్లు మెఱయు నీఫాలవీధిని కూడా (ఫలాయ సస్యాయ హితమ్ పంటకు హితమైనది), (అహం = నేను ఆలోకయే= దర్శించుచున్నాను).

**తాత్పర్యము:** శ్రీ కృష్ణా ! నిగనిగలాడు నలుపు కలిగి వంకీలు తిరిగి చక్కగా నడినెత్తిన ముడివేయబడి, మనోహరమైన రత్నాభరణములతో, వన్నెలు చిల్కు నెమలి పించములతో, మందారమాలతో కూడుకొని యున్న నీయొక్క నీజుట్టుముడిని నేను దర్శించుచున్నాను. మెరయుచున్న తెల్లని ఊర్ధ్వ పుండ్రముచే పవిత్రతతను వెదజల్లు బాలచంద్రునియట్లు మెఱయు నీఫాలవీధిని కూడా నేను దర్శించుచున్నాను.

**విశేషాలు**

**ఊర్ధ్వ పుండ్ర ధారణ విధానం:** సాధారణంగా వైష్ణవులు నిలువు బొట్టు పెట్టుకొంటారు. ఐతే, స్మార్తులు సైతం నిలువుబొట్టు పెట్టుకోవచ్చు, పెట్టుకొంటారు. ''శ్రుతి స్మృత్యుక్త మార్గేణ మృదోధారణ ముచ్యతే/ శృణు వత్స! విధానేన మృత్స్నాధారణముత్తమమ్'' అని ''స్మృతి రత్నమహోదధి'' తెలియజేస్తున్నది. ఇలా శ్రుతి స్మృతులు తెలియజేస్తున్నాయంటూ స్మార్తులు ధరించే ఊర్ధ్వపుండ్రధారణ విధానాన్ని ఈ గ్రంథం వివరించింది. స్మార్తులు మృత్తిక చేత ఊర్ధ్వ పుండ్రాన్నీ, భస్మం చేత త్రిపుండ్రాన్నీ ధరించవలసి ఉంటుంది. ఊర్ధ్వ పుండ్రాన్ని ఎర్రమన్నుతో గాని, తెల్ల మన్నుతో గాని, నల్లమన్నుతో గాని, గోపీచందనం (పచ్చ మన్ను)తో గాని దిద్దుకోవచ్చు. వైష్ణవులు పెట్టుకొనే నిలువుబొట్టు ఏయే పదార్థాలతో తయారు చేయాలో ఎలా పెట్టుకోవాలో నిర్దేశించే సూత్రాలు ఉన్నాయి. వాసుదేవోప నిషత్తు అలాంటి కొన్ని నియమాలను తెలియజేస్తుంది. (ఉదా: పరమహంస లలాటే ప్రణవేనైక మూర్ధ్వపుండ్రం ధారయేత్). సాధారణంగా నుదుటి మీద నిలువుబొట్టు ధరించడమే ఆచారంగా కనిపిస్తుంది. కాని, శాస్త్ర ప్రకారం లలాటం, హృదయ స్థానం, ఉదరం, కంఠం, బాహువులు మొదలైన పన్నెండు స్థానాలలో పుండ్రం ధరించడం పద్ధతి. వైష్ణవ సంప్రదాయంలో కేశవ నామాలతో గానీ, విష్ణు గాయత్రీ మంత్రంతో గానీ పుండ్రధారణ జరుగుతుంది. నల్లమన్ను శాంతికరమనీ, ఎర్రమన్ను వశ్యకరమనీ, పచ్చమన్ను లక్ష్మీకరమనీ, తెల్లమన్ను మోక్షకరమనీ ''స్మృతిరత్న మహోదధి'' తెలియజేస్తున్నది. వైష్ణవులు ధరించే నామాల పదార్థాలలో శ్రీచందనమూ, కుంకుమపువ్వు కూడా ఉంటాయి. నామాలకు వాడే రంగుమన్ను కొండల మీద నుంచి, నదుల నుంచీ సేకరిస్తారు. ఇళ్ళల్లో ఉండే తులసి కోట మట్టి కూడా తిలకానికి ఉపయోగ పడుతుంది. స్మార్తులు ధరించే విభూతి అడ్డబొట్టు మూడు పట్టెలలోనూ పైన పట్టెను, కింది పట్టెను (రేఖలను) కుడిచేతి అనామిక, మధ్య వేళ్ళతో ఎడమ వైపు నుంచి కుడి వైపునకు దిద్దాలి. మధ్య పట్టె (రేఖను) అంగుష్ఠముతో (బొటన వ్రేలు) మధ్య పట్టెను (రేఖ) కుడివైపు నుంచి ఎడమ వైపునకు దిద్దాలి. ఇలా త్రిపుండ్ర ధారణ చేసేటప్పుడు స్మార్తులు ''శ్రీకరంచ పవిత్రంచ శోకరోగ నివారణమ్ / లోకే వశీకరం పుంసాం భస్మ త్రైలోక్య పావకమ్''

అనే శ్లోకాన్ని చదవడం మంచిది. కొందరు 'ఓమ్‌నమః శివాయ' అనే పంచాక్షరీ మంత్రం చదువుతారు.

**100-3 శ్లో.**

**హృద్యం పూర్ణానుకంపార్ణవమృదులహరీ చంచలద్భ్రూవిలాసైః**
**ఆనీలస్నిగ్ధపక్ష్మావళి పరిలసితం నేత్రయుగ్మం విభో! తే ।**
**సాంద్రచ్ఛాయం విశాలారుణకమలదళాకారమాముగ్ధతారం**
**కారుణ్యాలోకలీలాశిశిరితభువనం క్షిప్యతాం మయ్యనాథే ॥**

**ప్రతిపదార్థము:** విభో= ఓ ప్రభూ !, పూర్ణ అనుకంపా = సంపూర్ణ దయ అను, అర్ణవ = సాగరమందులేచిన (అర్ణాంసి పయాంసి సంతి అస్మిన్ ఇందులో జలములుండును. సముద్రము), మృదు లహరీ = చిరుకెరటమువలె(లేన ఇంద్రేణ వాయునా హ్రియతే ఊర్ధ్వగమనాయ-వాయువు ద్వారా పైకి లేపబడునది. తరంగము), చంచలత్= మనోహరంగా చలిస్తున్న, భ్రూ విలాసైః= నీ కనుబొమల తీరుచే(భ్రామ్యతి నేత్రోపరి నేత్రములపై తిరుగునది. కనుబొమ్మ), హృద్యం= హృద్యమై, ఆనీల = అంతటా అలముకొన్న, స్నిగ్ధ= నిగనిగలాడు, పక్ష్మ ఆవళి పరిలసితం= ప్రకాశించు నీకను రెప్పలను (పక్షతే పరిగృహ్యతే ఆతపాదికం అనేన-ఆతపాదులను నివారించునది. కనురెప్ప), సాంద్ర ఛాయం= దట్టమయిన కాంతులతో, విశాల= విశాలమయిన, అరుణ కమల దళ ఆకారమ్= ఎర్ర తామరరేకుల వలె ఉన్న, ఆముగ్ధ తారం= చక్కని కనుపాపలతో (తార్యతే విస్తార్యతే అనేన-విస్తరింపబడునది), కారుణ్య ఆలోక లీలా= కరుణావలోకన లీలా విలాసములచే (కరుణస్య భావః, కరుణ ఏవ కారుణ్యమ్ కారుణ్యము, దయాభావము), శిశిరిత భువనం= లోకములను చల్లబరచెడి, తే = నీయొక్క, నేత్రయుగ్మం= కంటి చూపులను (నయతి నీయతే వా అనేన-పదార్థములవైపు వెళ్లునది పదార్థముల స్వరూపమును తెలుపునది. అల్లిన త్రాడు దారము నేత్రము, కన్ను), అనాథే= ఏ దిక్కులేని (నాస్తి నాథః యస్య-నాథుడు లేనివాడు. అనాథ), మయి= నాపయి, క్షిప్యతాం= ప్రసరింపచేయుము.

**తాత్పర్యము:** ఓ ప్రభూ! సంపూర్ణదయఅనుసాగరమందులేచినచిరుకెరటములవలె

నీ కనుబొమలు మనోహరములు. నీ కనురెప్పల రోమరాజి నిగనిగలాడు దట్టమయిన కాంతులు కలవి. నీ చక్కని కన్నుల జంట ఎఱ్ఱ తామరరేకులవలె ప్రకాశిస్తున్నాయి. నీ కంటిపాపలు మనోహరాలు. లోకములను చల్లబరచెడి నీ కటాక్ష వీక్షణములను ఏ దిక్కులేని నాపై ప్రసరింపచేయుము.

**100–4 శ్లో.**

**ఉత్తుంగోల్లాసినాసం హరిమణిముకురప్రోల్లసద్గండపాళీ–**
**వ్యాలోలత్కర్ణపాశాంచితమకరమణీకుండలద్వంద్వదీప్రమ్ ।**
**ఉన్మీలద్దంతపంక్తిస్ఫురదరుణతరచ్ఛాయబింబాధరాంతః**
**ప్రీతిప్రస్యందిమందస్మితమధురతరం వక్త్రముద్భాసతాం మే ॥**

**ప్రతిపదార్థము:**ఉత్తుంగ= ఎత్తుగ (ఉత్కృష్టం తుంగమ్ ఎత్తైన ఉన్నతమైన), ఉల్లాసి= ప్రకాశించు (ఉల్లసించునది), నాసం = ముక్కుతీరు గలిగి(నాసతే శబ్దాయతే శబ్దమును చేయునది. ముక్కు), హరిమణిముకుర= ఇంద్రనీలమణి దర్పణములట్లు (మంకుం శోభాం రాతి దదాతి శోభను ఇచ్చునది. అద్దము, ముకురము), ప్ర ఉల్లసత్=మెరయు, గండపాళీ= చెక్కిళ్ళ పై, వ్యాలోలత్ = బింబ ప్రతిబింబరూపములో అటునిటు ఊగు, కర్ణ పాశ అంచిత= చెవికొలకులందు (కర్ణపాశము= అందమైన చెవి), మకర మణీ కుండల ద్వంద్వ = మణిమయ మకరకుండలయుగముచే(మకరకుండల=మొసలిముఖము గల కర్ణభూషణము), దీప్రమ్= ప్రకాశించు (దీప్తం శీలం అస్య ప్రకాశించు స్వభావం కలది), ఉన్మీలత్ =తళుకులీనుచున్న(ఉన్మీలనం ఉన్మేషః వికాసో వా కండ్లు తెరచుట వికాసము వికసించుట), దంతపంక్తి = దంతపంక్తులతో (దామ్యతే అనేన–దీనితో నములుదురు. పన్ను), స్ఫురత్= ప్రకాశించే, తళతళమని మెరిసే, అరుణతర ఛాయ బింబ = అరుణ శోభలను వెదజల్లుచున్న(ఋచ్ఛతి ప్రాప్నోతి వర్ణమ్ ఎరుపు), అధరాంతః= నీ బింబాధరములతో (న ధరా క్రింద వుండునది), ప్రీతి= ప్రీతిని(ప్రీణాతి తస్య భావః–సంతోషము ప్రసన్నత తృప్తి), ప్రస్యంది = చిందు, మంద స్మిత = మందస్మితముతో, మధుర తరం = మనోహరముగా ప్రకాశిస్తున్న, వక్త్రమ్= నీ మోము(వక్తి అనేన–దీనితో మాట్లాడుదురు. ముఖము ఒక ఛందస్సు),

మే= నాకు, ఉద్భాసతాం = ఆనందదాయకమగునుగాక !

**తాత్పర్యము:** ప్రభూ! నువ్వు ఎత్తుగ విలసించు ముక్కుతీరుతో, ఇంద్రనీలమణిదర్పణములట్లు మెరయు చెక్కిళ్ళపై ప్రకాశించు అటునిటు ఊగు చెవికొలకులందు ఉన్న మణిమయ మకరకుండలయుగములతో, ప్రకాశించు దంతపంక్తులతో, అరుణ శోభలను వెదజల్లుచున్న నీ బింబాధరములతో, ప్రీతిని చిందు మందస్మితముతో, మనోహారముగా ప్రకాశిస్తున్న నీ మోము నాకు ఆనందదాయకమగునుగాక !

**100–5 శ్లో.**

**బాహుద్వంద్వేన రత్నోజ్జ్వలవలయభృతా శోణపాణిప్రవాళే–**
**నోపాత్తం వేణునాళీం ప్రసృతనఖమయూఖాంగుళీసంగశారామ్ ।**
**కృత్వా వక్త్రారవిందే సుమధురవికసద్రాగముద్భావ్యమానైః**
**శబ్దబ్రహ్మామృతైస్త్వం శిశిరితభువనైస్సించ మే కర్ణవీథీమ్ ॥**

**ప్రతిపదార్థము:** బాహు ద్వంద్వేన = రెండు చేతులందు (బాహు=బాధతే శత్రూన్ శత్రువులను బాధించునది), రత్న ఉజ్జ్వల వలయ భృతా= రత్నాల దండ కడియములు ధరించి(వలతి వల్యతే ఆవృణోతి హస్తాదికమ్ ధరింపబడునది, హస్తాదులను కప్పునది. కంకణము, కడియము), శోణ పాణి ప్రవాళేన = ప్రవాళ వర్ణ శోభితములైన చేతులందు(శోణతి రక్తో భవతి గచ్ఛతి వా ఎరుపు వర్ణము) ( పణంతే వ్యవహరంతి అనేన–దీనితో వ్యవహరింతురు. చెయ్యి), నఖ మయూఖ = నఖ కాంతులు (నఖం ఛిద్రం అత్ర–సందు కలది. గోరు), ప్రసృత= చిమ్ము (అతిశయేన సృతః అగ్రే గతః విస్తృతో వా ముందు వెళ్లినవాడు విస్తరించినది), అంగుళీ= వేళ్లతో, సంగ = కూడిన, శారామ్= చిత్ర (నానా)వర్ణములు కలిగిన, వేణునాళీం = వేణువును(వేణతి వాదయతి వాయింపబడునది. వేణువు, పిల్లన గ్రోవి), ఉపాత్తం = పొంది, వక్త్ర అరవిందే కృత్వా= ముఖ పద్మమునందు ఉంచి, సుమధురవికసత్= మధురాతిమధురముగ మ్రోయు, రాగమ్ = రాగ విశేషముల, ఉద్భావ్యమానైః= ఉత్పత్తి ప్రవాహములచే, శిశిరిత భువనైః= సర్వ భువనములను చల్లబరచు, శబ్దబ్రహ్మ అమృతైః = శబ్ద బ్రహ్మ అను అమృత పూరములచే, మే కర్ణ

వీథీమ్= నా కర్ణ వీథులను, త్వం= నువ్వు, సించ = తడుపుము.

**తాత్పర్యము:** ప్రభూ ! నీ రెండు చేతులందు రత్నాల దండ కడియములు ధరించావు. నీ ప్రవాళ(పగడపు) వర్ణ శోభితములైన చేతులందు నఖ కాంతులు చిమ్ము వేళ్లతో కూడిన శాబల వర్ణము కలిగిన వేణువును ధరించావు. దానిని నీ ముఖ పద్మమునందు ఉంచి మధురాతిమధురముగ మ్రోయు దాని రాగ ప్రవాహములచే సర్వ భువనములను చల్లబరచుచున్నావు. ఆ వేణు శబ్దబ్రహ్మమను అమృత పూరములచే నా కర్ణ వీథులను నువ్వు తడుపుము

(అనగా నీ వేణు గానామృతమును ఆస్వాదించు అదృష్టమును కలిగింపుమని భావం)

**100-6 శ్లో.**

**ఉత్సర్పత్కౌస్తుభశ్రీతతిభిరరుణితం కోమలం కంఠదేశం**
**వక్షః శ్రీవత్సరమ్యం తరళతరసముద్దీప్రహారప్రతానమ్ ।**
**నానావర్ణప్రసూనావళికిసలయినీం వన్యమాలాం విలోల-**
**ల్లోలంబాం లంబమానామురసి తవ తథా భావయే రత్నమాలామ్ ॥**

**ప్రతిపదార్థము:** ఉత్సర్పత్= మీదికి ఎగజిమ్ము, కౌస్తుభ శ్రీ తతిభిః = కౌస్తుభ మణి కాంతులచే (విష్ణువక్షఃస్థలమందలి మణి.) (కుం భూమిం స్తుభ్నాతి కుస్తుభః సముద్రః తత్ర భవః-సముద్రము నుండి పుట్టినది. కౌస్తుభమణి), అరుణితం = అరుణ కాంతులను విరజిమ్ము, కోమలం = నీ మృదులమైన( కామ్యతే కమనీయో భవతి కోమలమైనది మృదువైనది సుందరమైనది), కంఠదేశం= కంఠమును, (కణతి శబ్దం కరోతి శబ్దము చేయునది. కంఠము), శ్రీవత్స రమ్యం= శ్రీవత్సపు గుర్తుతో అందమైనదై (విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చ), తరళతర=ధగధగా, సముద్దీప్ర = ప్రకాశించు (దీప్తుం శీలం అస్య-ప్రకాశించుస్వభావం కల), హార ప్రతానమ్ = ముత్యాల మణి హారాలు కలిగిన(హార=నూటయెనిమిది పేటల ముత్యాలపేరు)(ప్రకృష్టం తనుతే విస్తృతో భవతి చాలా విస్తరించునది), వక్షః = నీ వక్షః స్థలమును (ఉచ్యతే అనేన-దీనితో మాట్లాడుదురు. హృదయము), నానా వర్ణ

= రంగురంగుల, ప్రసూన ఆవళి= పూవులపంక్తులతో(ప్రసూయతే వికసతి అసౌ వికసించునది. పుష్పము), కిసలయినీం = చిగురుటాకులతో(కించిత్ సలతి కొద్దిగా కదలునది. ఆకు. చిగురు), విలోలత్ లోలంబాం= ముసురుకొను తుమ్మెదలు కలిగిన, వన్యమాలాం= నీ వనమాలను(మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ) (పంచతన్మాత్రలకు రూపమైన దండ.)(చివురుటాకులు, పూలు కూర్చిన దండ), తథా= అట్లే, తవ ఉరసి= నీ వక్షస్థలములో, లంబమానామ్= వేలాడు, రత్నమాలామ్= రత్నహారముల మాలలను, భావయే = భావించెదను.

**తాత్పర్యము:** మీదికి ఎగజిమ్ము కౌస్తుభ మణి కాంతులచే అరుణ కాంతులను విరజిమ్ము నీ మృదులమైన కంఠమును, శ్రీవత్సపు గుర్తుతో అందమైనదై, ధగధగా ప్రకాశించు ముత్యాల మణి హారాలు కలిగిన నీ వక్షః స్థలమును, రంగురంగుల పూవులపంక్తులతో చిగురుటాకులతో ముసురుకొను తుమ్మెదలు కలిగిన నీ వనమాలను, అట్లే నీ వక్షస్థలములో వేలాడు రత్నహారముల మాలలను భావించెదను.

**100–7 శ్లో.**

**అంగే పంచాంగరాగైరతిశయవికసత్సౌరభాకృష్ట! లోకం**
**లీనానేకత్రిలోకీవితతిమపి కృశాం బిభ్రతం మధ్యవల్లీమ్ ।**
**శక్రాశ్మన్యస్తతప్తోజ్జ్వలకనకనిభం పీతచేలం దధానం**
**ధ్యాయామో దీప్తరశ్మి స్ఫుటమణిరశనాకింకిణీమండితం త్వామ్ ॥**

**ప్రతిపదార్థము:** అంగే= నీ శరీరములో ప్రకాశిస్తున్న, పంచ అంగరాగైః = కుంకుమ పూవు, అగరు, కస్తూరి, గోరోచనము, హరిచందనము అను అయిదు అంగరాగములతో (అంగం రజ్యతే అనేన–అంగమును అలంకరించునది. కేసర చందనాదులు, మైపూతలు), అతిశయ =అతిశయముగా, వికసత్ =వికసించు (అద్భుత), సౌరభ= పరిమళములకు (సురభిః సుగంధః అస్తి అస్య–మంచి వాసన కలది), ఆకృష్ట= ఆకర్షితములై, లోకం= లోకములన్నియును పరవశించును, లీన = అంతర్గతముగా, అనేక= అనేక, త్రిలోకీ= మూడు లోకముల(త్రయాణాం

లోకానాం సమాహారః-మూడు లోకముల సమాహారము), వితతిమ్ అపి= సమూహములు ఉన్నప్పటికి, కృశాం = సూక్ష్మమైన సుందరమైన(కృష్టః తనూభూతః అల్పో వా చిన్నది అల్పమైనది, సూక్ష్మమైనది), మధ్యవల్లీమ్ బిభ్రతం=తీగెలాగా సన్నగా ఉన్న నడుముతో(మానయతే స్థిరో భవతి స్థిరంగా వుండునది. మధ్యభాగము నడుము), శక్ర అశ్మ= ఇంద్రనీల మణులు (శక్నోతి దైత్యాన్ నాశయితుమ్ రాక్షసులను నశింపజేయు సామర్థ్యము కలవాడు. ఇంద్రుడు)( అశ్నుతే వ్యాప్నోతి వ్యాపించునది. రాయి), న్యస్త = పొదిగిన (న్యస్తః నితరాం అస్తః క్షిప్తః ఉంచబడినది), తప్త ఉజ్జ్వల కనక = పుటము పెట్టిన మేలిమి బంగారు వన్నెలతో(కనతి దీవ్యతే అసౌ ప్రకాశించునది. బంగారము), నిభం= సమానమైన (నియతం భాతి ప్రకాశించునది. సమానమైనది), పీత చేలం= పట్టు పీతాంబరమును, దధానం= ధరించి, దీప్తరశ్మి= తళుకులు ఎగచిమ్ముచున్న, స్ఫుట కింకిణీమండితం=ప్రకాశించు బంగారు చిరు గజ్జెల సింగారములను ఒలికించు (కించిత్ కిణం శబ్దం కరోతి కొంచెము శబ్దము చేయునది. చిన్న గంట), మణి రశనా = బంగారు మొల నూలు కలిగిన , (కటి ఆభరణము కలిగిన) (అశ్నుతే వ్యాప్నోతి జనానాం కటిభాగమ్ జనుల కటిభాగమున ధరించబడునది. వడ్డాణము), త్వామ్ = నిన్ను, ధ్యాయామః= ధ్యానించెదము.

**తాత్పర్యము:** కృష్ణా ! నీ శరీరములో ప్రకాశిస్తున్న కుంకుమ పూవు, అగరు, కస్తూరి, గోరోచనము, హరిచందనము అను అయిదు అంగరాగములతో వికసించు పరిమళములకు ఆకర్షితములై లోకములన్నియును పరవశించును. అంతర్గతముగా త్రిలోక సమూహములు ఉన్నప్పటికి- సూక్ష్మమైన తీగెలాగా సన్నగా ఉన్న నడుముతో, ఇంద్రనీల మణులు పొదిగిన పుటము పెట్టిన మేలిమి బంగారు వన్నెలతో సమానమైన పట్టు పీతాంబరమును ధరించి, తళుకులు ఎగజిమ్ముచున్న చిరు గజ్జెల సింగారములను ఒలికించు బంగారు మొల నూలు కలిగిన నిన్ను ధ్యానించెదను

**100-8 శ్లో.**

**ఊరూ చారూ తవోరూ ఘనమసృణరుచౌ చిత్తచోరౌ రమాయాః**

**విశ్వక్షోభం విశంక్య ధ్రువమనిశముభౌ పీతచేలావృతాంగౌ ।**

**ఆనమ్రాణాం పురస్తాన్న్యసనధృత సమస్తార్థపాళీసముద్గ-**
**చ్ఛాయం జానుద్వయం చ క్రమపృథుల మనోజ్ఞే చ జంఘే నిషేవే ॥**

**ప్రతిపదార్థము:** ఊరూ= పుష్టిగా, చారూ= అందంగా ఉన్న (చరతి చిత్తే మనోజ్ఞతయా మనసుకు సంతోషము కల్గించునది), తవ ఊరూ = నీతొడలు (ఊర్ణూయతే ఆచ్ఛాద్యతే కప్పబడినది. తొడ), ఘన మసృణ రుచౌ= బాగా నునుపై నిగనిగలాడుచు (మసృణోతి దీప్యతే ప్రకాశించునది మృదువైనది స్నిగ్ధమైనది), రమాయాః = లక్ష్మీదేవి (రమయతి ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి), చిత్త చోరౌ = మనస్సును దోచుకొన్నవి, (నిషేవే= వాటినిసేవించెదను), విశ్వ క్షోభం =విశ్వమునకు క్షోభమును అనగా పారవశ్యమును కలిగించునని (లోకుల యొక్క మనస్సులు చలించునని), విశంక్య ధ్రువమ్ = సందేహించి కాబోలు, అనిశమ్= ఎప్పుడు, ఉభౌ = ఆ రెండు ఊరువులను, పీతచేల ఆవృత అంగౌ= నీ పట్టు పీతాంబరములచే కప్పి వేయుచుందువు, (నిషేవే= వాటినిసేవించెదను), ఆనమ్రాణాం= నీకు నమస్కరించువారికి, ధృత =ధరించిన (అభీష్టములైన), సమస్త అర్థపాళీ = అక్షయ నిధులను ఇవ్వటానికి, పురస్తాత్ = ఎదుట (పూర్వస్మిన్, పూర్వస్యాం, పూర్వస్మాత్ (దిగ్వాచీ) ముందు, న్యసన= పెట్టిన, సముద్గత్ ఛాయం= మూతగల బుట్టల(బరణుల) పోలికగా, జానుద్వయం చ= నీ మోకాళ్లు ఉన్నవి, (నిషేవే= వాటినిసేవించెదను), క్రమ= క్రిందనుండి పైకి క్రమముగ, పృథుల = బలిష్ఠముగా (పృథుం పృథుత్వం అస్తి), మనోజ్ఞే చ= చూడ ముచ్చటగా ఉన్న (మనసా జానాతి గృహ్ణాతి మనసుతో గ్రహించునది. అందమైనది), జంఘే= నీ పిక్కలను (మోకాలి కింది భాగము), నిషేవే= సేవించెదను.

**తాత్పర్యము:** పుష్టిగా ,అందంగా ఉన్న నీతొడలు బాగా నునుపై నిగనిగలాడుచు లక్ష్మీదేవి మనస్సును దోచుకొన్నవి .వాటినిసేవించెదను. లోకుల యొక్క మనస్సులు చలించునని సందేహించి కాబోలు ఎప్పుడు ఆ రెండు ఊరువులను నీ పట్టు పీతాంబరములచే కప్పి వేయుచుందువు. వాటినిసేవించెదను. నీకు నమస్కరించు వారికి కోరుకొన్న అక్షయ నిధులను ఇవ్వటానికి ఎదుట పెట్టిన మూతగల బుట్టల పోలికగా నీ మోకాళ్లు ఉన్నవి. వాటినిసేవించెదను. క్రిందనుండి పైకి క్రమముగ బలిష్ఠముగా చూడ ముచ్చటగా ఉన్న నీ పిక్కలను సేవించెదను.

**100-9 శ్లో.**

**మంజీరం మంజునాదైరివ పదభజనం శ్రేయ ఇత్యాలపంతం**
**పాదాగ్రం భ్రాంతిమజ్జత్ ప్రణతజనమనోమందరోద్ధారకూర్మమ్ ।**
**ఉత్తుంగాతామ్రరాజన్నఖరహిమకరజ్యోత్స్నయా చాఽఽశ్రితానాం**
**సంతాపధ్వాంతహంత్రీం తతిమనుకలయే మంగళామంగులీనామ్ ॥**

**ప్రతిపదార్థము:** పద= నీ చరణములను(పద్యతే వెళ్లునది. పాదము), భజనం = సేవించుట(భజనం సేవనం భాగో వా భజ తస్య భావః కర్మ వా సేవించుట, సేవనము), శ్రేయః ఇతి= శ్రేయస్కరమని (అనయోః అతిశయేన ప్రశస్త్యః), ఆలపంతం ఇవ = తెలుపుచున్నట్లుగా, మంజీరం =నీ మంజీరములు (అందెలు) (మంజతి మధురం శబ్దం కరోతి మధుర శబ్దమును చేయునది. నూపురము), మంజు నాదైః=మనోహర నాదములతో పలుకుచున్నవి(మంజతి మనోహరం ధ్వనిం కరోతి మనోహరమైనది.)(నదతి తస్య భావః కర్మ వా శబ్దము. ప్రాణవాయువు), పాద అగ్రం= నీ పాదాగ్రము, భ్రాంతి మజ్జత్= భ్రాంతిలో మునిగిన, ప్రణత జన= నీకు నతులయిన భక్త జనుల, మనః మందర = మనస్సనెడి మందరపర్వతమును(మందతే ప్రకాశతే, మంద్యతే స్తూయతే అసౌ ప్రకాశించునది స్తుతింపబడునది. మందర పర్వతము), ఉద్ధార = ఉద్ధరించెడి (ఉత్ హ్రియతే అసౌ పైకి లేపబడినది), కూర్మమ్= తాబేలును తలపించుచున్నది.(కౌ పృథివ్యాం వా అల్పవేగః యస్య-తక్కువ వేగము గలది. తాబేలు), ఉత్తుంగ= ఎత్తు కలిగి (ఉత్కృష్టం తుంగమ్ ఎత్తైన ఉన్నతమైన), ఆతామ్ర= అంతటా ఎఱుపు నింపి, రాజత్ = ప్రకాశించు, నఖర = గోళ్ళనెడి (నఖం రాతి రంధ్రము చేయునది. గీరునది. గోరు), హిమకర జ్యోత్స్నయా చ= వెన్నెలచే(హిమః శీతలః కరః కిరణం యస్య-చల్లని కిరణములు గలవాడు. చంద్రుడు)(జ్యోతిః అస్తి అస్యామ్ ప్రకాశం కలిగి వున్నది. వెన్నెల చంద్రకిరణములు), ఆశ్రితానాం = ఆశ్రయించినవారి, సంతాప = సంతాపమను(అజ్ఞానమను), ధ్వాంత = చీకటిని (కృత శబ్దః సాధు శబ్దశ్రవణం అత్ర-దీనియందు శబ్దము బాగుగా వినబడును. అంధకారము), హంత్రీం = పోగొట్టు, మంగళామ్ అంగులీనామ్ తతిమ్ = మంగళకరమైన నీ కాలివ్రేళ్ల సమూహమును(పాదములను), అనుకలయే= మనసులో ధ్యానించుచున్నాను.

**తాత్పర్యము:** నీ చరణములను సేవించుట శ్రేయస్కరమని తెలుపుచున్నట్లుగా నీ అందెలు మనోహర నాదములతో పలుకుచున్నవి. నీ పాదాగ్రభాగము భ్రాంతిలో మునిగిన నీకు నతులయిన భక్త జనుల మనస్సనెడి మందరపర్వతమును ఉద్ధరించెడి తాబేలును తలపించుచున్నది. ఎత్తు కలిగి అంతటా ఎఱుపు నింపి ప్రకాశించు గోళ్ళనెడి వెన్నెలచే ఆశ్రయించినవారి సంతాపమను(అజ్ఞానమను) చీకటిని పోగొట్టు మంగళకరమైన నీ కాలివ్రేళ్ల సమూహమును(పాదములను) మనసులో ధ్యానించుచున్నాను

**100-10 శ్లో.**

**యోగీంద్రాణాం త్వదంగేష్వధికసుమధురం ముక్తభాజాం నివాసో**
**భక్తానాం కామవర్షద్యుతరుకిసలయం నాథ! తే పాదమూలమ్ ।**
**నిత్యం చిత్తస్థితం మే పవనపురపతే! కృష్ణ! కారుణ్యసింధో!**
**హృత్వా నిశ్శేషతాపాన్ ప్రదిశతు పరమానందసందోహలక్ష్మీమ్ ॥**

**ప్రతిపదార్థము:** నాథ = ప్రభూ! (నాథతే ఐశ్వర్యవాన్ భవతి ఐశ్వర్యవంతుడు. రాజు శివుడు), పవనపురపతే= ఓ గురువాయూరు దేవ !, కారుణ్యసింధో= దయా సముద్రుడా !, కృష్ణ = ఓ శ్రీ కృష్ణా !, యోగీంద్రాణాం = యోగులకు, త్వత్ అంగేషు = నీ అవయవములలో, అధిక సుమధురం = అధిక మధురమై, ముక్తభాజాం= ముక్తులకు, నివాసః = నివాసమై(అశ్రయమై), భక్తానాం = భక్తుల, కామ =కోరిన కోర్కెలు, వర్ష=వర్షించు, ద్యు తరు= కల్ప వృక్షము యొక్క, కిసలయం= పల్లవములయిన (కించిత్ సలతి కొద్దిగా కదలునది. ఆకు), తే = నీయొక్క, పాదమూలమ్ = పాద పద్మములను, నిత్యం = నిత్యము, మే = నా యొక్క, చిత్త స్థితం= మనస్సునందు నిలుపుకొంటిని, నిశ్శేష తాపాన్ హృత్వా = అశేష తాపములను హరించి, పరమ ఆనంద సందోహలక్ష్మీమ్= పరమానంద సంపదను ( మోక్షమును ), ప్రదిశతు = అనుగ్రహించుము.

**తాత్పర్యము:** ప్రభూ ! ఓ గురువాయూరు దేవ ! దయా సముద్రుడా ! ఓ శ్రీ కృష్ణా ! యోగులకు నీ అవయవములలో అధిక మధురమై ముక్తులకు వాసమై(అశ్రయమై) భక్తుల కోరిన కోర్కెలు వర్షించు కల్ప వృక్షము యొక్క పల్లవములయిన

(చిగురుటాకులయిన) నీయొక్క పాద పద్మములను నిత్యము నా యొక్క మనస్సునందు నిలుపుకొంటిని. అశేష తాపములను హరించి పరమానంద సంపదను ( మోక్షమును ) అనుగ్రహించుము.

**విశేషాలు:** అడుగుతున్నది సంపద. అందుకని సంపదను ఇచ్చువాడు అను అర్థము నాథ పదమును మొదట కవి ప్రయోగించుట మనోహరము.

**100-11 శ్లో.**

**అజ్ఞాత్వా తే మహత్వం యదిహ నిగదితం విశ్వనాథ! క్షమేథాః**
**స్తోత్రం చైతత్ సహస్రోత్తరమధికతరం త్వత్ప్రసాదాయ భూయాత్ ।**
**ద్వేధా నారాయణీయం శ్రుతిషు చ జనుషా స్తుత్యతావర్ణనేన**
**స్ఫీతం లీలావతారైరిదమిహ కురుతామాయురారోగ్యసౌఖ్యమ్ ॥**

**ప్రతిపదార్థము:** విశ్వనాథ= ఓ విశ్వనాథా! (విశ్వస్య నాథః-విశ్వమునకు నాథుడు. పరమాత్మ), తే మహత్వం = నీ మహిమ (మహతోభావః), అజ్ఞాత్వా = తెలియక, ఇహ = ఇక్కడ(ఈ గ్రంథమందు), యత్ నిగదితం = ఏమేని చెప్పితినో దానిని (నితరాం గదితం ఉక్తమ్ మంచి ఉపన్యాసము), క్షమేథాః= క్షమింపుము, సహస్ర ఉత్తరమ్= వేయి శ్లోకములకు మించిన, ఏతత్ స్తోత్రంచ = ఈ శ్రీ మన్నారాయణీయమను స్తోత్రము (స్తూయతే అనేనేతి స్తవః, స్తోత్రం చ, స్తుతిశ్చ అని అమరం. స్తుతి చేయడం. స్తుతించే రచన), అధికతరం = అధికతరముగా, త్వత్ ప్రసాదాయ= నీ అనుగ్రహమునకు, భూయాత్= పాత్రమగుగాక!, శ్రుతిషు= వేదములందు, స్తుత్యతా జనుషా= ప్రభవించిన అనేక స్తోత్రార్థములయిన, లీలా అవతారైః =నీ నారాయణలీలావతారముల, వర్ణనేన చ = వర్ణనముల చేత, స్ఫీతం= నారాయణీయమని (నారాయణ పరమైనది) దీనికి పేరు.( స్ఫీతః వర్ధితః స్థూలః విస్తృతః-వృద్ధి నొందినది విస్తృతమైనది లావైనది), ద్వేధా= నారాయణకవి రచించుట చేత రెండవ విధముగా (ద్విప్రకారమ్ రెండు విధాలుగా), నారాయణీయం =ఇది నారాయణీయము. (నారాయణస్య ఇయమ్ నారాయణునికి సంబంధించినది. నారాయణుని శక్తి), ఇదమ్ = ఇలా రెండు అర్థములతో ఉన్న ఈ గ్రంథము, ఇహ = ఈ లోకమందు చదువువారికి, వినువారికి, పారాయణ

చేయువారికి,ఆయుః ఆరోగ్యసౌఖ్యమ్ =ఆయురారోగ్యసౌఖ్యములను(సౌఖ్యమనగా ఇక్కడ ఆత్మానందము మోక్షము), కురుతామ్ = ఇచ్చుగాక!

**తాత్పర్యము:** ఓ విశ్వనాథా! నీ మహిమ తెలియక ఈ గ్రంథమందు ఏమేని చెప్పితినో దానిని క్షమింపుము. వేయి శ్లోకములకు మించిన ఈ శ్రీ మన్నారాయణీయమను స్తోత్రము అధికముగా నీ అనుగ్రహమునకు పాత్రమగుగాక! వేదములందు వర్ణించిన అనేక స్తోత్రార్థములయిన నీ నారాయణలీలావతారముల వర్ణనముల చేత నారాయణీయమని (నారాయణ పరమైనది) దీనికి పేరు. నారాయణకవినైన నేను రచించుట చేత రెండవ విధముగా ఇది నారాయణీయము. ఇలా రెండు అర్థములతో ఉన్న ఈ నారాయణీయ గ్రంథము ఈ లోకమందు చదువువారికి, వినువారికి , పారాయణ చేయువారికి ఆయురారోగ్య సౌఖ్యములను (మోక్షమును) ఇచ్చుగాక !

**యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్**
**తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోస్తుతే**

**ఇతి శ్రీ శ్రీ శ్రీ నారాయణీయం సంపూర్ణం**
**ద్వాదశ స్కంధము సంపూర్ణం**
**100వ దశకము సమాప్తము**

ఓం ఓం ఓం
ఓం శాంతిః శాంతిః శాంతిః
సర్వే జనాః సుఖినో భవంతు
శ్రీ కృష్ణార్పణమస్తు

| | | | |
|---|---|---|---|
| 44 | అపగతత్రపా | 68--4 | |
| 45 | అపగతవిరహా | 84--7 | |
| 46 | అపి మృల్లవ | 46--6 | |
| 47 | అభాజి శాఖిద్వితయం | 48--7 | |
| 48 | అభిషేక జలానుపాతి | 28--5 | |
| 49 | అభిష్టుతస్త్ర | 20--2 | |
| 50 | అభ్యాగతాభిరభితో | 65--9 | |
| 51 | అభ్యాపతత్య | 83--8 | |
| 52 | అభ్యుద్ధరన్నథ | 12--10 | |
| 53 | అముం చ సంపాశ్య | 22--5 | |
| 54 | అమునైవ సర్వదుర్గం | 44--9 | |
| 55 | అముష్య హి సరోరుహః | 9--3 | |
| 56 | అయి కుమారికా | 68--8 | |
| 57 | అయి జీవ చిరం | 60--7 | |
| 58 | అయి దేవపురా | 46--1 | |
| 59 | అయి నిశమ్యతాం | 68--9 | |
| 60 | అయి పురైవ | 58--2 | |
| 61 | అయి సబలమురారే | 45--1 | |
| 62 | అయి। తే ప్రళయావధౌ | 46--3 | |
| 63 | అయి। తే | 46--5 | |
| 64 | అయి। దుర్వినయాత్మకా | 46--4 | |
| 65 | అయిసఖే। | 40--2 | |

| | | | |
|---|---|---|---|
| 66 | అయే సుతందేహి | 42--9 | |
| 67 | అరాళమార్గా | 49--7 | |
| 68 | అరే! క్వాఽసౌ | 24--10 | |
| 69 | అర్చిరాదిగతి | 4--15 | |
| 70 | అర్ధపీతకుచకుడ్మలే | 47--2 | |
| 71 | అలమలమతిభీత్యా | 58--5 | |
| 72 | అవసరే ఖలు | 40--4 | |
| 73 | అవాప్య కాంతాం తనయాం | 19--8 | |
| 74 | అవాప్య దక్షం చ సుతం | 19--10 | |
| 75 | అవిలోక్య భవంతమ | 55--7 | |
| 76 | అవోచశ్చైవం తాన్ | 62--6 | |
| 77 | అవ్యక్తం తే స్వరూపం | 99--10 | |
| 78 | అవ్యక్తం మార్గయన్తః | 96--6 | |
| 79 | అశరణాం యది | 78--8 | |
| 80 | అశాంతసమరోద్ధతం | 85--5 | |
| 81 | అశేషదయితా | 85--3 | |
| 82 | అష్టాదశేఽస్య | 77--9 | |
| 83 | అసుభిరేవ సమం | 40--8 | |
| 84 | అస్ఫుటే వపుషి | 4--4 | |
| 85 | అస్మాదృశాం | 8--3 | |
| 86 | అస్మాస్వియం | 29--5 | |
| 87 | అస్మిన్ ప రాత్మన్ | 8--13 | |

| | | | |
|---|---|---|---|
| 88 | అహహ బహుళహింసా | 15--6 | |
| 89 | అహోహో | 63--7 | |
| 90 | అహో! అరణ్యోదయం | 13--3 | |
| 91 | అహో। కుమారో | 41--8 | |
| 92 | అహో। ఖలు యశోదయా | 39--9 | |
| 93 | ఆకర్ణ్య తే | 66-3 | |
| 94 | ఆకర్ణ్య సో ఽపి | 17-4 | |
| 95 | ఆకృష్టనౌకో | 32-8 | |
| 96 | ఆఖేటోపగతో | 36-5 | |
| 97 | ఆచార్యాఖ్యాధర | 94-2 | |
| 98 | ఆతామ్రే చరణే | 7-10 | |
| 99 | ఆత్మానం యజతి | 18-7 | |
| 100 | ఆదాయ భోజ్యా | 61-9 | |
| 101 | ఆదౌ హైరణ్యగర్భం | 95-1 | |
| 102 | ఆద్యాయాశేషకర్త్రే | 99-2 | |
| 103 | ఆధాయ ద్రుతమథ | 27-5 | |
| 104 | ఆనందరూప | 38-1 | |
| 105 | ఆనీతమాశు | 30-9 | |
| 106 | ఆనీలశ్లక్ష్ణకేశం | 95-8 | |
| 107 | ఆపః సృష్ట్యాదిజన్యాః | 99-6 | |
| 108 | ఆపిబేయమధరా | 59-8 | |
| 109 | ఆరామసీమని చ | 29-9 | |

| | | | |
|---|---|---|---|
| 110 | ఆరుంధానే రుషాంధే | 34–4 | |
| 111 | ఆర్తివ్యక్తప్రాక్త | 26–7 | |
| 112 | ఆలంబో భువనానాం | 57–11 | |
| 113 | ఆలంభమాత్రేణ | 71–6 | |
| 114 | ఆలోక్య | 64–1 | |
| 115 | ఆవిష్టో నగరీం | 74–8 | |
| 116 | ఆవృత్య | 91–9 | |
| 117 | ఆశాసు | 38–2 | |
| 118 | ఆస్థితోథ మహరాలయే | 4–12 | |
| 119 | ఇంద్రద్యుమ్నః | 26–1 | |
| 120 | ఇంద్రస్త్వదుత్కర్ష | 20–5 | |
| 121 | ఇతి గిరాధికం | 68–10 | |
| 122 | ఇతి నన్వనుగృహ్యా | 60–11 | |
| 123 | ఇతి మాసముపాహిత | 60–3 | |
| 124 | ఇతి ముదాకులై | 68–6 | |
| 125 | ఇతి శ్రుత్వావాచం | 62–3 | |
| 126 | ఇతి సువిదితవేద్యాం | 15–9 | |
| 127 | ఇతిత్వయి | 70–1 | |
| 128 | ఇతీరితైర్యామ్య | 22–10 | |
| 129 | ఇతీరితోయం | 87–3 | |
| 130 | ఇత్థం త్వద్ధ్యానయోగే | 95–10 | |
| 131 | ఇత్థమభ్యసన | 4–8 | |

| | | | |
|---|---|---|---|
| 132 | ఇత్యూచుషి | 17–9 | |
| 133 | ఇదం తావత్ సత్యం | 62–4 | |
| 134 | ఇహ చ సంత్యనిమిత్తశతాని | 40–3 | |
| 135 | ఇహ తావదుపేత్య | 60–6 | |
| 136 | ఇహాన్యభక్తోఽపి | 48–8 | |
| 137 | ఈదృగ్జగన్మయ | 6–10 | |
| 138 | ఉక్త్వా సుతేభ్యోఽథ | 20–8 | |
| 139 | ఉచ్చుతయా ద్వైత్యత | 57–9 | |
| 140 | ఉచ్చలద్ధ్వనిత | 47–4 | |
| 141 | ఉత్తానపాదనృపతే | 17–1 | |
| 142 | ఉత్తాలతాలీనివహే | 53–4 | |
| 143 | ఉత్తుంగోల్లాసినాసం | 100–4 | |
| 144 | ఉత్సర్పత్కౌస్తుభ | 100–6 | |
| 145 | ఉత్సర్పద్వలి | 25–4 | |
| 146 | ఉద్గచ్ఛతస్తవ | 29–1 | |
| 147 | ఉద్దామపాంసు | 43–3 | |
| 148 | ఉద్దామభ్రమ | 27–9 | |
| 149 | ఉద్భ్రామ్యద్భహుతి | 27–11 | |
| 150 | ఉద్వాహావసితౌ తదీయ | 37–7 | |
| 151 | ఉన్మగ్నే ఝటితి | 27–8 | |
| 152 | ఉపకర్ణ్య భవన్ముఖచ్యుతం | 60–10 | |
| 153 | ఉపక్రమస్యానుగుణైవ | 53–2 | |

| | | | |
|---|---|---|---|
| 154 | ఉపగతే త్వయి | 77-2 | |
| 155 | ఉపయాతానాం సుదృశాం | 66-1 | |
| 156 | ఉరసాతరసా | 28-8 | |
| 157 | ఊచేచాంబుజ | 37-3 | |
| 158 | ఊర్ధ్వప్రసారిపరి | 12-7 | |
| 159 | ఊరూ చారూ | 100-8 | |
| 160 | ఏకదా | 47-1 | |
| 161 | ఏకాదశాహ్వాయతయా | 10-5 | |
| 162 | ఏకైకమాశు | 43-8 | |
| 163 | ఏతద్వృత్తం | 26-10 | |
| 164 | ఏతే భూతగణా | 5-9 | |
| 165 | ఏవం చ ద్విపరార్ధ | 5-3 | |
| 166 | ఏవం చతుర్దశజగన్మయతాం | 6-1 | |
| 167 | ఏవం తావత్ | 8-1 | |
| 168 | ఏవం త్వత్ప్రాప్తితోఽన్యో | 94-3 | |
| 169 | ఏవం దేవ! | 7-1 | |
| 170 | ఏవం నానావిహారై | 88-10 | |
| 171 | ఏవం ప్రతిక్షణ | 52-6 | |
| 172 | ఏవం ప్రాయై | 76-7 | |
| 173 | ఏవం బహుషు | 57-7 | |
| 174 | ఏవం భక్తాన్ | 54-10 | |
| 175 | ఏవం భక్తిస్సకలభువనే | 76-11 | |

